శ్రీః

# బ్రహ్మసూత్రశాఙ్కరభాష్యమ్

బాలానన్దిన్యాఖ్యయా ఆన్ధ్రభాషావ్యాఖ్యయా

సమన్వితమ్

ద్వితీయభాగః


వ్యాఖ్యాయా రచయితా

మహామహోపాధ్యాయః

ఆచార్యః డా. పుల్లెల శ్రీరామచన్ద్రః



**ఆర్షవిజ్ఞాన ట్రస్ట్**

జూబిలీహిల్సు, హైదరాబాదు

2000

# బ్రహ్మసూత్రభాష్యద్వితీయభాగస్థాధికరణసూచి

తృతీయాధ్యాయే చతుర్థః పాదః



చతుర్థాధ్యాయే ప్రథమః పాదః

శ్రీః

## అనుబంధం-1

# బ్రహ్మసూత్రాల అకారాదివర్ణక్రమసూచి



1. పెద్దఅక్షరాలలో ఉన్నవి అధికరణప్రారంభసూత్రాలు

ఛ



మ



య



ర



ల

253 శారీరశ్చోభయేఽపి హి భేదేనైనమధీయతే. 1.2.20

198 శాస్త్రదృష్ట్యాతూపదేశో వామదేవవత్. 1.1.30

46 శాస్త్రయోనిత్వాత్. 1.1.3

1296 శిష్టేశ్చ. 3.3.62

400 శుగస్యతదనాదరశ్రవణాత్తదాద్రవణాత్ సూచ్యతే హి. 1.3.34

1303 శేషత్వాత్ పురుషార్థవాదో యథాన్యేష్వితి జైమినిః. 3.4.2

408 శ్రవణాధ్యయనార్థప్రతిషేధాత్ స్మృతేశ్చ. 1.3.38

126 శ్రుతత్వాచ్చ. 1.1.11

1105 శ్రుతత్వాచ్చ. 3.2.39

1370 శ్రుతేశ్చ. 3.4.46

599 శ్రుతేస్తు శబ్దమూలత్వాత్తు. 2.1.27

244 శ్రుతోపనిషత్కగత్యభిధానాచ్చ. 1.2.16

1262 శ్రుత్యాదిబలీయస్త్వాచ్చ న బాధః. 3.3.49

922 శ్రేష్ఠశ్చ. 2.4.8

స

1531 సంకల్పాదేవ తు తచ్ఛ్రుతేః. 4.4.8

1131 సంజ్ఞాతశ్చేత్తదుక్తమస్తి తు తదపి. 3.3.8

944 సంజ్ఞామూర్తిక్లృప్తిస్తు త్రివృత్కుర్వత ఉపదేశాత్. 2.4.20

1011 సంధ్యే సృష్టిరాహ హి. 3.2.1

283 సంపత్తేరితి జైమినిస్తథా హి దర్శయతి. 1.2.31

1521 సంపద్యావిర్భావః స్వేన శబ్దాత్. 4.4.1

1170 సంబన్ధాదేవమన్యత్రాపి. 3.3.20

764 సంబన్ధానుపపత్తేశ్చ. 2.2.38

1175 సంభృతిద్యువ్యాప్త్యపి చాతః. 3.3.23

221 సంభోగప్రాప్తిరితి చేన్న వైశేష్యాత్. 1.2.8

991 సంయమనే త్వనుభూయేతరేషామారోహావరోహౌ తద్గతిదర్శనాత్. 3.1.13

406 సంస్కారపరామర్శాత్తదభావాభిలాపాచ్చ. 1.3.36

1037 స ఏవ తు కర్మానుస్మృతిశబ్దవిధిభ్యః. 3.2.9

572 సత్త్వాచ్చావరస్య. 2.1.16

912 సప్తగతేర్విశేషితత్వాచ్చ. 2.4.5

1306 సమన్వారమ్భణాత్. 3.4.5

669 సమవాయాభ్యుపగమాచ్చ సామ్యాదనవస్థితేః. 2.2.13

473 సమాకర్షాత్. 1.4.15

864 సమాధ్యభావాచ్చ. 2.3.39

1166 సమాన ఏవం చాభేదాత్. 3.3.19

380 సమాననామరూపత్వాచ్చావృత్తావప్యవిరోధో దర్శనాత్ స్మృతేశ్చ. 1.3.30

1458 సమానా చాసృత్యుపక్రమాదమృతత్వం చానుపోష్య. 4.2.7

1296 సమాహారాత్. 3.3.63

692 సముదాయ ఉభయహేతుకేఽపి తదప్రాప్తిః. 2.2.18

208 సర్వత్రప్రసిద్ధోపదేశాత్. 1.2.1

747 సర్వథానుపపత్తేశ్చ. 2.2.32

1355 సర్వథాపి త ఏవోభయలిఙ్గాత్. 3.4.34

618 సర్వధర్మోపపత్తేశ్చ. 2.1.37

1108 సర్వవేదాన్తప్రత్యయం చోదనాద్యవిశేషాత్. 3.3.1

1344 సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయే తద్దర్శనాత్. 3.4.28

1339 సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతేరశ్వవత్. 3.4.26

1138 సర్వాభేదాదన్యత్రేమే. 3.3.10

606 సర్వోపేతా చ తద్దర్శనాత్. 2.1.30

1352 సహకారిత్వేన చ 3.4.33

## ఆ యా అధ్యాయాలలోను పా ోను ఉన్న సూత్రాల సంఖ్య

| అధ్యాయం | 1. పాదం | 2. పాదం | 3 ం | 4. పాదం | అధ్యాయంలో మొత్తం |
|---|---|---|---|---|---|
| 1. | 31 | 32 | | 28 | 134 |
| 2. | 37 | 45 | | 22 | 157 |
| 3. | 27 | 41 | | 52 | 186 |
| 4. | 19 | 21 | | 22 | 78 |
| | | | | | 555 |

## ఆ యా అధ్యాయాః ఃధికరణాల సంఖ్య

| అధ్యాయం | 1.పాదం | 2.పాదం | 3 ు | 4.పాదం | అధ్యాయంలో మొత్తం |
|---|---|---|---|---|---|
| 1. | 11 | 7 | | 8 | 39 |
| 2. | 13 | 8 | | 8 | 47 |
| 3. | 6 | 8 | | 17 | 67 |
| 4. | 14 | 11 | | 7 | 38 |
| | | | | | 191 |

నాలుగు అధ్యాయాలలోను అధికరణప్రధాః ణాలు - 191

నాలుగు అధ్యాయాలలోను ఇతర సూత్రాః - 364

శ్రీః

# అథ ద్వితీయాధ్యాయే తృతీయః పాదః

## (అత్ర పాదే పఞ్చమహాభూతజీవాదిశ్రుతీనాం విరోధపరిహారః)

### 1. వియదధికరణమ్. సూ 1-7

### సూ. న వియదశ్రుతేః. 2.3.1

వేదాన్తేషు తత్ర తత్ర భిన్నప్రస్థానా ఉత్పత్తిశ్రుతయ ఉపలభ్యన్తే. కేచి దాకాశస్యోత్పత్తిమామనన్తి, కేచిన్న. తథా కేచిద్వాయోరుత్పత్తిమామనన్తి, కేచిన్న. ఏవం జీవస్య ప్రాణానాం చ. ఏవమేవ క్రమాదిద్వారకోఽపి విప్రతిషేధః శ్రుత్యన్త రేషూపలక్ష్యతే. విప్రతిషేధాచ్చ పరపక్షాణామనపేక్షితత్వం స్థాపితమ్; తద్వ త్స్వపక్షస్యాపి విప్రతిషేధాదేవానపేక్షితత్వమాశఙ్క్యేతే త్యతః సర్వవేదాన్తగత సృష్టిశ్రుతినిర్మలత్వాయ పరః ప్రపఞ్చః అరభ్యతే. తదర్థనిర్మలత్వే చ ఫలం యథోక్తశఙ్కానివృత్తి రేవ. తత్ర ప్రథమం తావదాకాశమాశ్రిత్య చిన్త్యతే, కిమా కాశస్యోత్పత్తిరస్తి ఉత నాస్తీతి. తత్ర తావత్ ప్రతిపద్యతే "న వియదశ్రుతేః" ఇతి. నఖల్వాకాశముత్పద్యతే. కస్మాత్? అశ్రుతేః. న హ్యస్యోత్పత్తిప్రకరణే శ్రవణ మస్తి. ఛాన్దోగ్యే హి "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్" (ఛా.ఉ. 6-2-1) ఇతి సచ్ఛబ్దవాచ్యం బ్రహ్మ ప్రకృత్య "తదైక్షత తత్తేజోఽసృజత" (ఛా.ఉ.6.2-3) ఇతి చ పఞ్చానాం మహాభూతానాం మధ్యమం తేజ అది కృత్వా త్రయాణాం తేజోబన్నానాముత్పత్తిః శ్రావ్యతే. శ్రుతిశ్చ నః ప్రమాణమతీన్ద్రియార్థ విజ్ఞానోత్పత్తౌ. న చ శ్రుతిరస్త్యాకాశస్యోత్పత్తిప్రతిపాదినీ. తస్మాన్నాస్యోత్పత్తిరితి. 1

బాలానందిని

నేతి:- "వియత్=ఆకాశం, న=పుట్టదు; అశ్రుతేః=దాని పుట్టుక శ్రుతిలో వినబడకపోవడంవల్ల" అని సూత్రార్థం.

వేదాన్తేష్వితి :- వేదాంతాలలో అక్కడక్కడ వేరు వేరు మార్గాలలో ఉన్న ఉత్పత్తి శ్రుతులు (భూతాల సృష్టిని పుట్టుకను చెప్పే శ్రుతులు) లభిస్తున్నాయి. కొన్ని ఆకాశానికి ఉత్పత్తిని చెపుతున్నాయి. కొన్ని చెప్పడంలేదు. కొన్ని వాయువు పుట్టినట్లు చెపుతున్నాయి. కొన్ని చెప్పడం లేదు జీవుని ఉత్పత్తి విషయంలోను, ప్రాణాల ఉత్పత్తి విషయంలోను కూడ ఇలాగే ఉంది. అదే విధంగా కొన్ని శ్రుతులలో క్రమాదుల్ని (పుట్టిన భూతాల క్రమాదుల్ని పట్టి కూడ విరోధం కనిపిస్తున్నది. పరపక్షాలలో పరస్పరస్పరవిరోధం ఉండడంచేత అవి అనపేక్షితములు (ఉపేక్షింపదగినవి) అని స్థాపించబడింది. అదే విధంగా పరస్పర విరోధం ఉండడంవల్లనే స్వపక్షం కూడ అనపేక్షితమని ఆశంకింపబడ వచ్చును. అందువల్ల సమస్తవేదాంతాలలోను ఉన్న సృష్టి నిర్దుష్టంగా ఉండడంకోసం (సృష్టిక్రమాదులలో దోషం లేదని ప్రతిపాదించడం కోసం) తరవాత వచ్చు ప్రపంచం, (రెండుపాదాలలో విస్తృతప్రతిపాదనం) ఆరంభించబడుచున్నది. ఆ అర్థం నిర్దుష్టం అవడానికి ఫలం పైన చెప్పిన ఆశంక నివర్తించడమే. అందులో ముందుగా ఆకాశాన్ని గూర్చి, దీనికి ఉత్పత్తి ఉందా లేదా అని విచారణ చేయబడుచున్నది. ఈ విషయంలో (ఏకదేశి) ఇలా అంటున్నాడు - "న వియదశ్రుతేః". అకాశం పుట్టదు ఎందువల్ల? అశ్రుతివల్ల. ఉత్పత్తి ప్రకరణంలో ఆకాశం పుట్టినట్లు శ్రవణం లేదు (వినబడడంలేదు) కదా? ఛాందోగ్యంలో "సదేవ...అద్వితీయమ్" అని సచ్ఛబ్దంచేత చెప్పబడే బ్రహ్మను ప్రస్తావించి అది చూచింది, అది తేజస్సును సృష్టించింది అని పంచమహాభూతాలలో మధ్యదైన తేజస్సుతో ప్రారంభించి తేజోబన్నాల మూడింటియొక్క ఉత్పత్తి వినిపింపబడుచున్నది (చెప్పబడుచున్నది). ఇంద్రియాలకు అందని విషయాలను తెలుసుకొనడానికి మనకు ప్రమాణం శ్రుతియే. ఇక్కడ ఆకాశం పుట్టింది అని చెప్పే శ్రుతి లేదు. అందుచేత దీనికి ఉత్పత్తి లేదు.

వా. ఈ పాదంతో భూతాలను, భోక్తలను గూర్చిన శ్రుతులకు పరస్పరం విరోధం ఉందనే శంక తొలగించబడుతుంది. చతుర్థపాదంలో లింగశరీరశ్రుతులకు విరోధం ఉందనే శంక తొలగించబడుతుంది. పరస్పరవిరోధంవల్ల పూర్వాపరవిరోధంవల్లా ఇతరుల పక్షాలు ఏ విధంగా ఉపేక్షణీయాలో అదే విధంగా శ్రుతులలో కూడ ఇలాంటి విరోధాలు ఉండడంచేత అవి కూడ ఉపేక్షణీయాలే అనే శంక కలగగా ఈ రెండు

పాదాలు ప్రారంభించబడ్డాయి. అందుచేత వీటికి పూర్వపాదంతో దృష్టాంతసంగతి. ఆకాశానికి వాయువుకు ఉత్పత్తి జరిగినట్లు తైత్తిరీయోపనిషత్తులో చెప్పబడింది. ఛాంగ్యోపనిషత్తులో చెప్పలేదు. జీవుడు, ప్రాణాలు ఆత్మనుండి అవిర్భవించి నట్లు బృహదారణ్యకోపనిషత్తులో చెప్పబడింది. కొన్ని చోట్ల సృష్టి ఆకాశంతో ప్రారంభించి నట్లు చెప్పబడింది. కొన్ని చోట్ల అగ్నితో ప్రారంభించినట్లు చెప్పబడింది. కొన్నిచోట్ల ప్రాణాలు ఏడనీ, కొన్ని చోట్ల ఎనిమిదనీ చెప్పబడింది. ఇలాంటి విరోధాలకు పరిహారం ఈ రెండు పాదాలలోను చేయబడింది. అందుచేత శ్రుతి-శాస్త్ర-అధ్యాయసంగతులు సిద్ధించాయి. ఆకాశానికి ఉత్పత్తి ఉన్నదనీ లేదనీ చెప్పే శ్రుతులకు విరోధం ఉందా లేదా అని సంశయం. రెండు వాక్యాలూ వేరు వేరని గ్రహించాలి అన్నట్లయితే విరోధం రెండు వాక్యాలకు సమన్వయం చేయ్యాలి అంటె విరోధం ఉండదు. అయితే వాక్యభేదంచేత విరోధమే అని పూర్వపక్షం చేయనున్నాడు. అంతకు ముందు ఏకదేశి అనుత్పత్తిపక్షాన్నే గ్రహించాలని అన్నట్లు ఈ సూత్రంలో చెప్పబడింది. 1.

సూ. అస్తి తు 2.3.2.

తు శబ్దః పక్షాన్తరపరిగ్రహే. మా నామాకాశస్య ఛాన్దోగ్యే భూదుత్పత్తిః. శ్రుత్యన్తరే త్వస్తి. తైత్తిరీయకా హి సమామనన్తి-"సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" ఇతి ప్రకృత్య "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" (తై ఉ. 2-1) ఇతి. తతశ్చ శ్రుత్యోర్విప్రతిషేధః, క్వచిత్తేజఃప్రముఖాసృష్టిః క్వచిదాకాశప్రముఖేతి. నన్వేకవాక్యతానయోః శ్రుత్యోర్యుక్తా? సత్యం. సా యుక్తా, న తు సావగన్తుం శక్యతే కుతః? తత్తేజోఽసృజత (ఛా. ఉ. 6.2.3) ఇతి సకృచ్ఛ్రుతస్య స్రష్టుః స్రష్టవ్యద్వయేన సంబన్ధానుపపత్తేః తత్తేజోఽసృజత, తదకాశమసృజత ఇతి. నను సకృచ్ఛ్రుతస్యాపి కర్తుః కర్తవ్యద్వయేన సంబన్ధో దృశ్యతే - యథా సూపం పక్త్వా ఓదనం పచతీతి, ఏవం తదాకాశం సృష్ట్వా తత్తేజోఽసృజత ఇతి యోజయిష్యామి. నేదం యుజ్యతే. ప్రథమజత్వం హి ఛాన్దోగ్యే తేజసో ఽవగమ్యతే, తైత్తిరీయకే చాకాశస్య. న చోభయోః ప్రథమజత్వం సంభవతి. ఏతేనేతరశ్రుత్య

న్తరవిరోధోఽపి వ్యాఖ్యాతః. "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" (తై.ఉ.2.1) ఇత్యత్రాపి "తస్మాదాకాశః సంభూతః, తస్మాత్తేజః సంభూతమ్" ఇతి సకృచ్ఛ్రుతస్య అపాదానస్య సంభవస్య చ వియత్తేజోభ్యాం యుగపత్సంబన్ధానుపపత్తేః. 'వాయోరగ్నిః' (తై.ఉ.2.1) ఇతి చ ప్రథగామ్నానాత్. 2.

బాలానందిని

**అస్తీతి** :- "తు=అయితే,అస్తి=ఆకాశానికి ఉత్పత్తి ఉంది" అని సూత్రార్థం.

**తు శబ్ద ఇతి** :- తుశబ్దం మరొక పక్షం గ్రహింపబడుతుం దని సూచిస్తుంది. ఛాందోగ్యంలో ఆకాశానికి ఉత్పత్తి లేకపోతే లేకపోవుగాక. మరొక శ్రుతిలో నైతే ఉంది తైత్తిరీయులు "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" అని ఉపక్రమించి "తస్మాద్వా ఏతస్మాదాత్మన **ఆకాశః సంభూతః**" అని పఠిస్తున్నారు. అందువల్ల కొన్ని చోట్ల సృష్టి తేజస్సుతో ప్రారంభమైనట్లు చెప్పబడింది. కొన్నిచోట్ల ఆకాశంతో ప్రారంభం అయినట్లు చెప్పబడింది గాన ఈ రెండు శ్రుతులకు విరోధం. ఈ రెండు శ్రుతులకు ఏకవాక్యత్వం (పరస్పరసమన్వయం చేసి విరోధంలేకుండా అర్థం చెప్పడం ద్వారా ఒకే వాక్యంగా చేయడం)యుక్తం కదా? నిజమే; ఏకవాక్యత యుక్తమే. అయితే అది తెలుసుకొనడానికి (ఎలా ఏకవాక్యత కల్పించాలో)శక్యం కాదు. ఎందువల్ల? "తత్తేజోఽసృజత" అని ఒకేసారి వినబడుచున్న సృష్టికర్తకు సృజింపదగిన రెండు కర్మలతో (తేజఆకాశాలతో)-అది తేజస్సును సృష్టించింది. అది ఆకాశాన్ని సృష్టించింది అని సంబంధం చెప్పడం కుదరదు కదా? (ఆశంక)పప్పు వండి అన్నం వండుతున్నాడు ఇత్యాదులలో కర్త ఒకేమాటు వినబడినా కూడ దానికి రెండు కర్తవ్యాలతో (కర్మలతో)అన్వయం కనబడుతున్నది కదా? అట్లే అది ఆకాశాన్ని సృజించి తేజస్సును సృజించింది అని కల్పిస్తాను. (సమాధానం)-ఇది కుదరదు. తేజస్సు ముందుగా పుట్టినట్లు ఛాందోగ్యంలో కనబడుతున్నది; తైత్తిరీయంలో ఆకాశం ముందుగా పుట్టినట్లు కనబడుతున్నది. రెండింటికీ ప్రథమజత్వం (ముందుగా పుట్టడం) కుదరదు కదా? దీని చేత ఇతరమైన శ్రుత్యన్తరవిరోధం కూడ (మరొక శ్రుతిలో ఉన్న)ఇతరవిరోధం కూడ వ్యాఖ్యానింపబడినది (వివరింపబడినట్లే). (అనగా ఛాందోగ్యంలో ఎలా రెండింటిని సమన్వయించడం కుదరదో తైత్తిరీయంలో కూడ అట్లే కుదరదు అని అర్థం. ఛాందోగ్యంలో

ఒక కర్త రెండు కర్మలతో అన్వయించదు, తైత్తిరీయంలో అపాదాన-సంభవాలు రెండు వియత్తేజస్సులతో అన్వయించవు). **తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః** అనే చోట కూడ దానినుండి ఆకాశం పుట్టింది, దానినుండి తేజస్సు పుట్టింది అని ఒకే మాటు వినబడుతున్న అపాదానాన్ని (తస్మాత్ అనే పంచమ్యంతాన్ని) సంభవనాన్ని (సభూతః అని చెప్పిన పుట్టుకను) ఒకేసారిగా కలిసి వియత్తేజస్సులతో సంబంధింపచేయడం కుదరదు కదా? అంతే కాకుండా తెత్తిరీయంలో **వాయోరగ్నిః** (వాయువునుండి అగ్ని పుట్టింది) అని వేరుగా చెప్పబడింది. 2

## భాష్యమ్

**అస్మిన్ విప్రతిషేధే కశ్చిదాహ-**

## సూ. గౌణ్యసంభవాత్. 2.3.3

నాస్తి వియత ఉత్పత్తిరశ్రుతేరేవ. యాత్వితరా వియదుత్పత్తివాదినీ శ్రుతిరుదాహృతా సా గౌణీ భవితుమర్హతి. కస్మాత్? అసంభవాత్. న హ్యాకశస్యోత్పత్తిః సంభావయితుం శక్యా శ్రీమత్కణభుగభిప్రాయానుసారిషు జీవత్సు. తే హి కారణసామగ్ర్యసంభవాత్ ఆకాశస్యోత్పత్తిం వారయన్తి. సమవాయ్యసమవాయినిమిత్త కారణేభ్యో హి కిల సర్వముత్పద్యమానం సముత్పద్యతే. ద్రవ్యస్య చైకజాతీయకమనేకం చ ద్రవ్యం సమవాయికారణం భవతి. న చాకాశస్య ఏకజాతీయకమనేం చ ద్రవ్యమారమ్భకమస్తి, యస్మిన్ సమవాయికారణే సతి, అసమవాయికారణే చ తత్సంయోగే ఆకాశ ఉత్పద్యేత. తదభావాత్తు తదనుగ్రహప్రవృత్తం నిమిత్తకారణం దూరాపేతమేవాకాశస్య భవతి. ఉత్పత్తిమతాం చ తేజఃప్రభృతీనాం పూర్వో త్తరకాలయోర్విశేషః సంభావ్యతే, ప్రాగుత్పత్తేః ప్రకాశాదికార్యం న బభూవ పశ్చాచ్చ భవతీతి. అకాశస్య పునర్న పూర్వోత్తరకాలయోర్విశేషః సంభావయితుం శక్యతే. కిం హి ప్రాగుత్పత్తే రనవకాశమ్, అసుషిరమ్, అచ్ఛిద్రం బభూవేతి శక్యతేఽధ్యవసాతుమ్. పృథివ్యాది

వైధర్మ్యాచ్చ విభుత్వాదిలక్షణాత్ ఆకాశస్యాజత్వసిద్ధిః. తస్మాద్యథా లోక ఆకాశం కురు, ఆకాశో జాత ఇత్యేవంజాతీయో గౌణః ప్రయోగో భవతి, యథా చ ఘటాకాశః కరకాకాశో, గృహాకాశ ఇత్యేకస్యాప్యాకాశస్యైవంజాతీయకో భేదవ్యపదేశో గౌణో భవతి, వేదేఽపి ఆరణ్యానాకాశేష్వాలభేరన్ ఇతి, ఏవముత్పత్తి శ్రుతిరపి గౌణీ ద్రష్టవ్యా. 3

బాలానందిని

**అస్మిన్నితి**:- ఈ శ్రుతివిరోధం కలగగా ఒకడు (ఆకాశానికి ఉత్పత్తి లేదనే)వాడు ఇలా అంటున్నాడు-

**గౌణీతి** :- "(ఆకాశోత్పత్తిశ్రుతి) అసంభవాత్=ఆకాశానికి పుట్టుక అసంభవం గాన, గౌణీ=లాక్షణికమైనది" అని సూత్రార్థం.

**నాస్తీతి**:- ఆకాశానికి ఉత్పత్తి లేదు. కారణం - శ్రుతిలో వినబడకపోవడమే. ఆకాశానికి ఉత్పత్తిని చెప్పే మరొక శ్రుతి ఏది ఉదాహరించబడిందో అది గౌణి (లాక్షణికం) అవడమే యుక్తం. ఎందువల్ల? అసంభవంవల్ల. శ్రీమత్కణాదుని మతాన్ని అనుసరించేవాళ్లు జీవించి ఉండగా ఆకాశానికి ఉత్పత్తి ఊహించడానికి కూడ శక్యం కాదు కదా! ఆకాశానికి కారణసామగ్రి లేదు గాన దానికి ఉత్పత్తిని వాళ్లు నివారిస్తున్నారు. పుట్టే ప్రతీ వస్తువూ కూడ సమవాయి - అసమవాయి - నిమిత్తకారణాల వల్లనే కదా పుడుతుంది? ద్రవ్యానికి ఒకే జాతికి చెందినది, అనేకమూ అయిన ద్రవ్యం (పటానికి తంతువు వలె) సమవాయి కారణం అవుతుంది. ఆకాశాన్ని పుట్టించడానికి ఏకజాతీయకము అనేకము అయిన ద్రవ్యం ఏదీ లేదు కదా! అలాంటి సమవాయికారణం ఏదైనా ఉంటే, (తంతువులు కలిసినట్లు) అనేక ద్రవ్యాలు కలిసి అసమవాయికారణంగా అయితే ఆకాశం పుట్టడానికి వీలు ఉండేది. ఆ రెండూ లేనప్పుడు వాటి అనుగ్రహంచేతనే (అవి ఉన్నప్పుడు మాత్రమే) ప్రవర్తించే నిమిత్తకారణం ఆకాశానికి దూరాపేతం (అసలే కుదరదు). మరొక విషయం ఏమనగా ఉత్పత్తి గల తేజస్సు మొదలైనవాటి పూర్వోత్తర కాలాలలో, అవి పుట్టడానికి పూర్వం ప్రకాశాదికార్యం లేదనీ తరువాత ఉందనీ, ఒక విశేషం ఊహించడానికి వీలుంది ఆకాశం విషయంలో అయితే దాని పూర్వోత్తరకాలాలలో విశేషం ఊహించడానికి శక్యం

కాదు. అకాశం పుట్టడానికి పూర్వం అవకాశం లేనిదీ, సుషిరం లేనిదీ. చిద్రం లేనిదీ ఏది ఉండేదని ఊహించడానికి శక్య మవుతుంది? (గృహాదులలో ఉండేది అవకాశం, సూక్ష్మమైన వాటిలో ఉన్నది ఛిద్రం; ఇంకా సూక్ష్మమైన వాటిలో ఉన్నది సుషిరం, లేదా దీర్ఘమైన ఛిద్రం సుషిరం). మరియు విభుత్వం మొదలైన లక్షణం గల, పృథివ్యాదివైధర్మ్యంవల్ల కూడా, అనగా పృథివ్యాదులవలె కాక అకాశానికి విభుత్వం (అంతటా వ్యాపించి ఉండడం) మొదలైన లక్షణాలున్నాయి గాన, దానికి అజత్వం (పుట్టుక లేకపోవడం) సిద్ధిస్తుంది. అందువల్ల లోకంలో అకాశం చెయ్యి, అకాశం ఏర్పడింది (అవకాశం అనే అర్థంలో, అవకాశమే అకాశం) అని ఏ విధంగా గౌణ ప్రయోగా లుంటున్నాయో అట్లే ఘటాకాశం, కరకాకాశం, గృహాకాశం ఈ మొదలైన భేదాన్ని తెలిపే గౌణ ప్రయోగాలు అకాశం ఒక్కటే అయినా కూడ ఎలా కనాబడుచున్నాయో, వేదంలో కూడ అరణ్యమృగాలను అకాశాలలో అలభించాలి అని (అకాశేషు అని బహువచన నిర్దేశం) ఏవిధంగా కనబడుతున్నదో అదే విధంగా ఉత్పత్తిశ్రుతి కూడ గౌణి అని గ్రహించాలి.3

## సూ. శబ్దాచ్చ 23.4

శబ్దః ఖల్వాకాశస్యాజత్వం ఖ్యాపయతి యత అహ - "వాయుశ్చాన్తరిక్షం చైతదమృతమ్" (బృ.ఉ.2.3.3) ఇతి. న హ్యామృతస్యోత్పత్తిరుపపద్యతే. "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః" ఇతి చాకాశేన బ్రహ్మ సర్వగతత్వనిత్యత్వాభ్యాం ధర్మాభ్యాముపమిమాన ఆకాశస్యాపి తౌ ధర్మౌ సూచయతి. న చ తాదృశస్యోత్పత్తి రుపపద్యతే. "స యథానన్తోఽయమాకాశ ఏవమనన్త ఆత్మా వేదితవ్యః" ఇతి చోదాహరణమ్. "ఆకాశశరీరం బ్రహ్మ" (తై. 1.6.2) "ఆకాశ ఆత్మా" (తై.ఉ.1.7.1) ఇతి చ. న హ్యాకాశస్యోత్పత్తిమత్త్వే బ్రహ్మణస్తేన విశేషణం సంభవతి నీలేనేవోత్పలస్య. తస్మాన్నిత్యమేవాకాశేన సాధారణం బ్రహ్మేతి గమ్యతే.

### బాలానందిని

శబ్దేతి:- "శబ్దాచ్చ=శ్రుతివాక్యంవల్ల కూడ, అకాశం నిత్యం" అని సూత్రార్థం.

శబ్ద ఇతి:- శ్రుతి "వాయుశ్చాన్తరిక్షం చైతదమృతమ్" (వాయువు అంతరిక్షము ఈ

రెండూ అమృతములు) అని ఆకాశం పుట్టుక లేని దని చెపుతూన్నది. అమృతమైనదానికి ఉత్పత్తి ఉండదు కదా? ''ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః'' అని సర్వగతత్వము, నిత్యత్వము అనే ధర్మాలచేత బ్రహ్మను ఆకాశంతో పోలుస్తూ, శబ్దం, ఆకాశానికి కూడ ఆ ధర్మాలున్నా యని సూచిస్తూన్నది. అలాంటి దానికి ఉత్పత్తి ఉపపన్నం కాదు కదా? ''స....వేదితవ్య'': (ఆకాశం ఏ విధంగా అనంతమో అదే విధంగా ఈ ఆత్మ కూడ అనంత మని గ్రహించదగినది) అనే వాక్యం ''ఆకాశశరీరం బ్రహ్మ'' (బ్రహ్మ ఆకాశ స్వరూపము. బ్ర వి.ఆ.) ''ఆకాశ ఆత్మా'' (ఆకాశం బ్రహ్మయొక్క స్వరూపం. బ్ర.వి.ఆ) అని ఈ శ్రుతులు కూడ ఉదాహరించాలి. ఆకాశానికి ఉత్పత్తి ఉన్నట్లయితే ఉత్పలాన్ని నీలంచేత విశేషించి నట్లు బ్రహ్మను ఆకాశంచేత విశేషించడం కుదరదు కదా. అందుచేత నిత్యమైన బ్రహ్మయే ఆకాశంతో సాధారణం అని తెలుస్తూన్నది. అనగా బ్రహ్మతో ఉన్న నిత్యత్వగుణాన్నే పురస్కరించుకొని ఆకాశంతో దానిని పోల్చడం జరిగింది గాన ఆకాశం కూడ బ్రహ్మ వలె నిత్యమే అని భావం. 4.

### సూ. స్యాచ్చైకస్య బ్రహ్మశబ్దవత్. 2.3.5

ఇదం పదోత్తరం సూత్రమ్. స్యాదేత్-కథం పునరేకస్య సంభూతశబ్దస్య "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" (తై. ఉ. 2.1) ఇత్యస్మిన్నధికారే పరేషు తేజః ప్రభృతిష్వనువర్తమానస్య ముఖ్యత్వం సంభవతి, ఆకాశే చ గౌణ త్వమితి. అత ఉత్తరముచ్యతే స్యాచ్చైకస్యాపి సంభూతశబ్దస్య విషయవిశేషవ శాద్గౌణో ముఖ్యశ్చ ప్రయోగో బ్రహ్మశబ్దవత్. యథైకస్యాపి బ్రహ్మశబ్దస్య "తపసా బ్రహ్మ విజ్ఞాసస్వ తపో బ్రహ్మ" (తై.ఉ.3.2) ఇత్యస్మిన్నధికారే ఽన్నాదిషు గౌణః ప్రయోగః అనన్దే చ ముఖ్యః, యథా తపసి బ్రహ్మవిజ్ఞానసాధనే బ్రహ్మశబ్దో భక్త్యా ప్రయుజ్యతే ఽఞ్జసా తు విజ్ఞేయే బ్రహ్మణి తద్వత్. కథం పునరనుత్పత్తౌ నభసః "ఏకమేవాద్వితీయమ్" (ఛా.ఉ. 6.24) ఇతీయం ప్రతిజ్ఞా సమర్థ్యతే? నను నభసా ద్వితీయేన సద్వితీయం బ్రహ్మ ప్రాప్నోతి; కథం చ బ్రహ్మణి విదితే సర్వం విదితం స్యాదితి తదుచ్యతే - ఏకమేవేతి తావత్కార్యాపేక్షయోపద్యతే

యథా లోకే కశ్చిత్కుమ్భకారకులే పూర్వేద్యుర్మృద్దణ్డచక్రాదీన్యుపలభ్య అపరేద్యుశ్చ నానావిధాన్యమత్రాణి ప్రసారితాన్యుపలభ్య బ్రూయాన్మృదేవైకాకినీ పూర్వేద్యురాసీదితి; న చ తయావధారణయా మృత్కార్యజాతమేవ పూర్వేద్యుర్నాసీదిత్యభిప్రేయాన్న దణ్డచక్రాది తద్వత్.

బాలానందిని

స్యాదితి :-"బ్రహ్మశబ్దవత్=బ్రహ్మశబ్దానికి వలె, ఏకస్య=ఒకే సంభూతశబ్దానికి, స్యాత్ చ=ముఖ్యత్వమూ గౌణత్వమూ కూడ ఉండవచ్చును" అని సూత్రార్థం.

ఇదమితి:- ఇది పదాలకు (ఆశంకాపదాలకు, ఆశంకకు) సమాధానంగా చెప్పబడిన సూత్రం. (ఆ ఆశంక ఇది? - ఇది సరే! "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" అనే అధికారంలో (ప్రకరణంలో) పరములైన (తరవాత చెప్పబడనున్న) తేజస్సు మొదలైన వాటిలోనికి కూడ అనువర్తిస్తూన్న (సంబంధిస్తూన్న) ఒక్క సంభూతశబ్దానికి తేజస్సు మొదలైనవాటి విషయంలో ముఖ్యత్వమూ, ఆకాశం విషయంలో గౌణత్వమూ ఎలా కుదురుతుంది?

ఏ:-"తేజః సంభూతమ్" ఇత్యాదులలో సంభూతశబ్దానికి పుట్టినది అని ముఖ్యార్థమే చెప్పాలి. అదే సంభూతశబ్దానికి ఆకాశః సంభూతః అన్నప్పుడు గౌణార్థం చెప్పి అది నిజంగా పుట్టకపోయినా పుట్టినట్లున్నది అనే భావం గ్రహించాలి అని అనడం అయుక్తం కదా? ఒకే శబ్దం ఒక చోట ముఖ్యార్థాన్నీ మరొకదానితో సంబంధించి గౌణార్థాన్నీ ఎలా బోధిస్తుంది అని భావం.

అత ఇతి:- అందువల్ల సమాధానం చెప్పబడుచున్నది. సంభూతశబ్దం ఇక్కడ ఒక్కటే అయినా, బ్రహ్మశబ్దం వలె విషయంలో ఉండే భేదాన్ని పట్టి దానిని గౌణంగాను ముఖ్యంగాను ప్రయోగించవచ్చును. "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ" "తపో బ్రహ్మ" (తపస్సు చేత బ్రహ్మను తెలుసుకొనడానికి ఇచ్ఛ (ప్రయత్నం) చెయ్యి; తపస్సే బ్రహ్మ) అనే అధికారంలో (ప్రకరణంలో) ఒకే బ్రహ్మశబ్దం అన్నం మొదలైన అర్థంలో గౌణంగా ప్రయోగించబడింది. ఆనందం అనే అర్థంలో మాత్రం దాని ప్రయోగం ముఖ్యం. బ్రహ్మను తెలుసుకొనడానికి సాధనమైన తపస్సు విషయంలో ఈ బ్రహ్మశబ్దం భక్తి చేత

(లక్షణచేత, గౌణంగా) ("తపో బ్రహ్మ") అని ప్రయోగించబడింది. విజ్ఞేయమైన బ్రహ్మ విషయంలో మాత్రం ముఖ్యంగా ప్రయోగించబడింది. అదే విధంగా ఇక్కడ కూడ. (ప్రశ్న) ఆకాశానికి ఉత్పత్తి లేకపోతే "ఏకమేవాద్వితీయమ్" అనే ఈ ప్రతిజ్ఞ (బ్రహ్మ తప్ప మరేమీ లేదు అనే ప్రతిజ్ఞ) ఎలా సమర్థించబడుతుంది? ఎందుచేత ననగా రెండవదైన ఆకాశం కూడా ఉండడంచేత బ్రహ్మ (అద్వితీయం కాకుండా) సద్వితీయం (దేనితో పాటు రెండో వస్తువు కూడ ఉన్నదో అట్టిది) అవుతుంది. అట్లే (ఆకాశం కార్యం కాని పక్షంలో) బ్రహ్మ తెలియబడితే సర్వము తెలియబడుతుంది అని చెప్పినది ఎలా కుదురుతుంది? (సమాధానం) బ్రహ్మ తన కార్యాల అపేక్షచేత (కార్యాల దృష్ట్యా) ఏకమే అని చెప్పడం కుదురుతుంది. ఏ విధంగా లోకంలో ఒకడు వెనుకటి రోజున కుమ్మరి ఇంట్లో మట్టి, కఱ్ఱ, చక్రం మొదలైన వాటిని చూసి, మరునాడు అక్కడ ప్రసరింపబడిన అనేక విధాలైన పాత్రలను చూచి నిన్న కేవలం మట్టి మాత్రమే ఉండింది అని అంటాడో, ఆ అవధారణచేత (మట్టి మాత్రమే అనే నిర్ధారణచేత) వెనుకటి రోజున మృత్కార్యాలైన పాత్రలు లేవని మాత్రమే అభిప్రాయం ఉన్నవాడవుతాడు గాని దండచక్రాదులు కూడ లేవు అనే అభిప్రాయం కలవాడు ఏవిధంగా కాడో అట్లే ఇక్కడ కూడ. అనగా ఏకము అద్వితీయమూ అయినా బ్రహ్మ అన్నప్పుడు పూర్వావస్థలో ఒక్కటిగానే ఉంది అనగా తన కార్యాలేవీ లేక బ్రహ్మ ఒక్కటే ఉంది అని అర్థం కాని తాను తప్ప మరేదీ లేదని అని అర్థం కాదు. అందుచేత బ్రహ్మతో పాటు ఆకాశం ఉన్నా దాని ఏకత్వానికి భంగం లేదని భావం.

## భాష్యమ్

అద్వితీయశ్రుతిరధిష్ఠాత్రన్తరం వారయతి యథా మృదోఽమత్రప్రకృతేః మృత్కారోఽధిష్ఠాతా దృశ్యతే నైవం బ్రహ్మణో జగత్ప్రకృతేరన్యోఽధిష్ఠాతాఽస్తీతి న చ నభసాపి ద్వితీయేన సద్వితీయం బ్రహ్మ ప్రసజ్యతే. లక్షణాన్యత్వనిమిత్తం హి నానాత్వమ్, న చ ప్రాగుత్పత్తేర్బ్రహ్మనభసోర్లక్షణాన్యత్వమస్తి; క్షీరోదకయోరివ సంసృష్టయోః వ్యాపిత్వామూర్తత్వాదిధర్మసామాన్యాత్. సర్గకాలే తు బ్రహ్మ జగదుత్పాదయితుం యతతే, స్తిమితమితరత్తిష్ఠతి; తేనాన్యత్వ మవసీయతే. తథా చ "ఆకాశ శరీరం బ్రహ్మ" (తై.ఉ. 1.6.62) ఇత్యాది శ్రుతిభ్యోఽపి

బ్రహ్మాకాశయోరభేదోపచారసిద్ధిః. అత ఏవ బ్రహ్మవిజ్ఞానేన సర్వవిజ్ఞానసిద్ధిః. అపి చ సర్వం కార్యముత్పద్యమానమాకాశావ్యతిరిక్తదేశకాలమేవోత్పద్యతే, బ్రహ్మణా చావ్యతిరిక్తదేశకాలమేవాకాశం భవతీత్యతో బ్రహ్మణా తత్కార్యేణ చ విజ్ఞాతేన సహ విజ్ఞాతమేవాకాశం భవతి. యథా క్షీరపూర్ణే ఘటే కతి చిదబ్బిన్దవః ప్రక్షిప్తాః సన్తః క్షీరగ్రహణేనైవ గృహీతా భవన్తి, న హి క్షీరగ్రహణా దబ్బిన్దుగ్రహణం పరిశిష్యతే, ఏవం బ్రహ్మణా తత్కార్యైశ్చావ్యతిరిక్తదేశకాలత్వాద్గృ హీతమేవ బ్రహ్మగ్రహణేన నభో భవతి. తస్మాద్భాక్తం నభసః సంభవశ్రవణమితి. 5

బాలానందిని

**అద్వితీయేతి:-** పాత్రలకు ప్రకృతియైన మట్టికి కుంభకారుడు అధిష్ఠాతగా ఉన్నట్లు జగత్ప్రకృతియైన బ్రహ్మకు అధిష్ఠాత ఎవరూ లేరు అని అద్వితీయశ్రుతి మరొక అధిష్ఠాతను (బ్రహ్మకంటె భిన్నుడైన ద్వితీయుడైన అధిష్ఠాతను) నిషేధిస్తూన్నది. ఆకాశం రెండవదిగా ఉండడంచేత బ్రహ్మకు సద్వితీయత్వం కూడ ప్రాప్తించదు. భేదం అనేది లక్షణాల భేదాన్ని పట్టి ఏర్పడుతుంది కదా? ఉత్పత్తికి (సృష్టికి) పూర్వం, వ్యాప్తత్వము అమూర్తత్వమూ (రూపాదులు లేకపోవుట) మొదలైన ధర్మాల సామ్యంచేత పాలు-నీళ్లు వలె కలిసిపోయిన బ్రహ్మకాశాలకు వేరు వేరు లక్షణాల లేవు కదా? సృష్టిసమయంలో నైతే బ్రహ్మ జగత్తును పుట్టించడానికి ప్రయత్నిస్తూంటే రెండవది (ఆకాశం) ఊరికే కదలకుండా ఉంటుంది. దానిచేత ఇది బ్రహ్మకంటె వేరైనది అని నిశ్చయింపబడుతుంది. అందుచేతనే "ఆకాశ శరీరం బ్రహ్మ" ఇత్యాది శ్రుతులచేత బ్రహ్మకాశాలకు అభేదారోపం సిద్ధిస్తుంది. బ్రహ్మ విజ్ఞానంచేత సర్వవిజ్ఞానసిద్ధి కూడ అందుచేతనే. మరొక విషయ మేమనగా పుట్టుచున్న సమస్తకార్యమూ కూడ ఆకాశం కంటె (ఆకాశంయొక్క దేశ కాలాలకంటె) భిన్నం కాని దేశ కాలాలు కలదవుతూనే పుడుతుంది. అనగా పుట్టిన ప్రతి వస్తువూ కూడ ఆకాశం ఏ దేశంలో ఏ కాలంలో ఉంటుందో ఆ దేశకాలాలలోనే పుడుతుంది. బ్రహ్మకంటె వ్యతిరిక్తం కాని, అనగా బ్రహ్మ యొక్క దేశకాలాలకంటె భిన్నం కాని, దేశ కాలాలలోనే ఆకాశం ఉంటుంది. (అనగా బ్రహ్మకు సంబంధించిన దేశకాలాలకంటె వేరుగా ఆకాశానికి దేశకాలాలు లేవు. అందుచేత బ్రహ్మ దాని కార్యమూ తెలిస్తే ఆకాశం కూడ తెలియబడినదే

అవుతుంది. క్షీరంతో నిండి ఉన్న ఘటంలో కొన్ని నీటి చుక్కలు చిమ్మబడినప్పుడు అవికూడ క్షీరగ్రహణంచేతనే ఏ విధంగా గ్రహింపబడతాయో, క్షీరగ్రహణంకంటె జలబిందుగ్రహణం ఏ విధంగా వేరు కాదో అట్లే బ్రహ్మతోను, దాని కార్యాలతోను వ్యతిరిక్తం కాని దేశకాలాలు కలదవడంచేత ఆకాశం కూడ బ్రహ్మ గ్రహణం చేతనే గ్రహించబడుతుంది. అందువల్ల ఆకాశం పుట్టిన దని చెప్పడం గౌణం.

వి. ఈ అధికరణంలోని మొదటి సూత్రంలో చెప్పిన ఆకాశానికి ఉత్పత్తి లేదు అనే మతం ఏకదేశిమతం. ఉత్పత్తిశ్రుతి ముఖ్యమైనది కాదు అనే గూఢాభిసంధితో (గూఢాభిప్రాయంతో) రెండవ సూత్రంలో పూర్వపక్షం చేయబడింది. రెండు శ్రుతులకు విరోధం ఏర్పడడంవల్ల వాటికి ప్రామాణ్యం లేదని ప్రాప్తించగా ఆకాశానికి ఉత్పత్తి లేదనే మతం గల వాది ఉత్పత్తి గౌణం అని చెపుతూ తన మతం ప్రకారం శ్రుతివిరోధం లేదని (మూడు నాలుగు ఐదు సూత్రాలలో) ప్రతిపాదిస్తున్నాడు. ఇదే విధంగా ఈ పాదంలో అన్ని అధికరణాలలోను కూడ ముందుగా విరోధం ఉండడంవల్ల శ్రుతులకు ప్రామాణ్యం లేదని పూర్వపక్షఫలం, తరువాత ఏకదేశిసిద్ధాంతం, దాని తరువాత ముఖ్యసిద్ధాంతంలో శ్రుతులకు విరోధం లేదని నిరూపణం. ఇది రత్న ప్రభాకారుని విషయవివేచన. బ్రహ్మ విద్యాభరణంలో ఈ విధంగా విషయవివేచనం చేయబడింది. తృతీయపాదంలో భూత విషయకశ్రుతుల విరోధం పరిహరించబడుతుంది. ఆ ప్రసంగంలో పరమేశ్వరునికి జీవునికి ఉత్పత్త్యాదులను చెప్పే వాక్యాల విరోధం పరిహరించబడుతుంది. నాల్గవ పాదంలో ప్రాణవిషయశ్రుతి విరోధం పరిహరించబడుతుంది. ప్రసంగవశంచేత మరి కొన్ని విషయాలు కూడ చర్చించబడతాయి. ఈ పాదద్వయంలో ముందు శ్రుతులకు విరోధం ఉంది గాన అవి అప్రమాణాలు అని పూర్వపక్షం, తరువాత ఏకదేశిమతంచేత విరోధపరిహారం, చివర సిద్ధాంతప్రతిపాదనం అని క్రమం పాటించబడింది. ఈ అధికరణంలోని మొదటి రెండు సూత్రాలు విరుద్ధార్థాలైన శ్రుతులను ఉదాహరించడం ద్వారా శ్రుతులకు ప్రామాణ్యం లేదు అనే పూర్వపక్షాన్ని లేవదీస్తాయి. తరవాత వచ్చిన మూడు సూత్రాలు అ విరోధాన్ని చెప్పడం ద్వారా సిద్ధాంత్యేకదేశిమతాన్ని ప్రతిపాదిస్తాయి.5

భాష్యమ్

ఏవం ప్రాప్తే ఇదమాహ

## సూ. ప్రతిజ్ఞాఽహానిరవ్యతిరేకాచ్ఛబ్దేభ్యః. 2.3.6

"యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతమ్" (ఛా.ఉ 6.1.1) ఇతి "ఆత్మని ఖల్వరే దృష్టే శ్రుతే మతే విజ్ఞాతే ఇదం సర్వం విదితమ్" (బృ.ఉ.4.5.6)ఇతి,"కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" (ము.ఉ. 1.1.3) ఇతి, "న కాచన మద్బహిర్ధా విద్యాస్తి" ఇతి చైవం రూపా ప్రతివేదాన్తం ప్రతిజ్ఞా విజ్ఞాయతే. తస్యాః ప్రతిజ్ఞాయా ఏవమహానిరనుపరోధః స్యాత్, యద్యవ్యతిరేకః కృత్స్నస్య వస్తుజాతస్య విజ్ఞేయాద్బ్రహ్మణః స్యాత్. వ్యతిరేకే హి సత్యేకవిజ్ఞానేన సర్వం విజ్ఞాయత ఇత్యేవం ప్రతిజ్ఞా హీయేత. స చావ్యతిరేక ఏవముపపద్యతే యది కృత్స్నం వస్తుజాతమేకస్మాద్బ్రహ్మణ ఉత్పద్యేత. శబ్దేభ్యశ్చ ప్రకృతివికారావ్యతిరేకన్యాయేనైవ ప్రతిజ్ఞాసిద్ధిరవగమ్యతే. తథాహి-" యేనాశ్రుతం శ్రుతం భవతి" ఇతి ప్రతిజ్ఞాయ మృదాదిదృష్టాన్తైః కార్యకారణాభేదప్రతిపాదనపరైః ప్రతిజ్ఞైషా సమర్థ్యతే; తత్సాధనాయైవ చోత్తరే శబ్దాః "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్-ఏకమేవాద్వితీయమ్" (ఛా.ఉ. 6.2.1) "తదైక్షత తత్తేజోఽసృజత" (ఛా. 6.2.3) ఇత్యేవం కార్యజాతం బ్రహ్మణః ప్రదర్శ్య అవ్యతిరేకం ప్రదర్శయన్తి "ఐతదాత్మ్యమిదం సర్వమ్" (ఛా.ఉ. 6.8.7) ఇత్యారభ్యాప్రపాఠకసమాప్తేః. తద్యద్యాకాశం న బ్రహ్మకార్యంస్యాత్ న బ్రహ్మణి విజ్ఞాతే ఆకాశం విజ్ఞాయేత. తతశ్చ ప్రతిజ్ఞా హానిః స్యాత్. న చ ప్రతిజ్ఞాహాన్యా వేదస్యాప్రామాణ్యం యుక్తం కర్తుమ్.

### బాలానందిని

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా ఇది చెప్పుచున్నాడు

ప్రతిజ్ఞేతి :- శబ్దేభ్యః = శ్రుతివాక్యాలవల్ల, అవ్యతిరేకాత్=కార్యకారణాలకు భేదం లేకపోవడంవల్లనే, ప్రతిజ్ఞాఽహానిః ఏకవిజ్ఞానే సర్వవిజ్ఞానప్రతిజ్ఞకు అహాని లభిస్తుంది" అని సూత్రార్థం.

యేనేతి:- "యేనాశ్రుతం... విజ్ఞాతమ్" అని, "ఆత్మని...విదితమ్" అని "కస్మిన్ను. . . భవతి" అని, "న కాచన... అస్తి" (నాకంటె భిన్నమైన జ్ఞేయ మైన దేదీ లేదు) అని ఈవిధంగా ప్రతి వేదాంతంలోను ప్రతిజ్ఞ చూడబడుచున్నది. సమస్తమైన వస్తుసముదాయమూ కూడ జ్ఞేయమైన బ్రహ్మకంటె వ్యతిరిక్తంగా లేకుండా ఉంటేనే ఆ ప్రతిజ్ఞకు హాని లేకపోవడం ఉంటుంది. బ్రహ్మకంటె వ్యతిరేకం ఉంటే ఏకవిజ్ఞానేన సర్వం విజ్ఞాయతే అన్న ప్రతిజ్ఞ బాధిత మవుతుంది. సమస్తమైన వస్తు సముదాయమూ కూడ ఒక్క బ్రహ్మనుండి పుడితేనే అవ్యతిరేకం ఉపపన్నమవుతుంది. ప్రకృతికి కార్యాలకు వ్యతిరేకం లేదు అనే న్యాయం చేతనే ప్రతిజ్ఞ సిద్ధిస్తుందని శబ్దాలవల్ల (శ్రుతివల్ల) తెలుస్తూన్నది. అదెట్లనగా "యేనాశ్రుతం శ్రుతం భవతి" అని ప్రతిజ్ఞ చేసి, కార్యకారణాలకి అభేదాన్ని ప్రతిపాదించే మృదాది దృష్టాంతాలచేత ఈ ప్రతిజ్ఞ సమర్థించబడుతున్నది. తరవాత వచ్చిన శబ్దాలు కూడ ఆ ప్రతిజ్ఞను సాధించడంకొరకే "సదేవ సోమ్యేదమగ్ర ఆసేత్ ఏకమేవాద్వితీయమ్, తదైక్షత తత్తేజోఽ సృజత" ఇత్యాదివిధంగా బ్రహ్మనుండి పుట్టిన కార్యసముదాయాన్ని ప్రదర్శించి - "ఐతదాత్మ్యమిదం సర్వమ్" అని ప్రారంభించి ప్రపాఠకం చివరి వరకు బ్రహ్మకంటె కార్యాల అవ్యతిరేకాన్ని ప్రదర్శిస్తున్నాయి. అలాంటప్పుడు ఆకాశం బ్రహ్మకార్యం కాకపోతే బ్రహ్మ తెలిసినా ఆకాశం తెలియబడదు. అప్పుడు ప్రతిజ్ఞాహాని కలగుతుంది. ప్రతిజ్ఞా హాని ద్వారా వేదానికి అప్రామాణ్యాన్ని కల్పించడం యుక్తం కాదు.

## భాష్యమ్

తథాహి:- ప్రతి వెదాన్తం తే తే శబ్దాః తేన తేన దృష్టాన్తేన తామేన ప్రతిజ్ఞాం స్థాపయన్తి, "ఇదం సర్వం యదయమాత్మా" (బృ.ఉ. 2.4.6) "బ్రహ్మైవేదమమృతం పురస్తాత్" (ము.ఉ. 2.2.11) ఇత్యేవమాదయః. తస్మాజ్జ్వలనాదివదేవ గగనముత్పద్యతే. యదుక్తమ్ అశ్రుతేర్న వియదుత్పద్యత ఇతి, తదయుక్తమ్. వియదుత్పత్తివిషయశ్రుత్యన్తరస్య దర్శితత్వాత్ "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" (తై.ఉ. 2.1) ఇతి. సత్యం దర్శితమ్, విరుద్ధం త "తత్తేజోఽసృజత" ఇత్యనేన శ్రుత్యన్తరేణ. న. ఏకవాక్యత్వాత్సర్వశ్రుతీనామ్. భవత్యేకవాక్యత్వమవిరుద్ధానామ్, ఇహ తు విరోధ ఉక్తః, సకృచ్ఛ్రుతస్య స్రష్టుః స్రష్టవ్యద్వయసంబన్ధా

సంభవాత్. ద్వయోశ్చ ప్రథమజత్వాసంభవాద్వికల్పాసంభవాచ్చేతి. నైష దోషః. తేజఃసర్గస్య తైత్తిరీయకే తృతీయత్వశ్రవణాత్ - "తస్మాద్వా ఏవస్మాదాత్మన ఆకాశః సంభూతః ఆకాశాద్వాయుర్వాయోరగ్నిః" (తై. ఉ. 2.1.) ఇతి. అశక్యాహీయం శ్రుతిరన్యథా పరిణేతుమ్, శక్యా తు పరిణేతుం ఛాన్దోగ్యశ్రుతిః- తదాకాశం వాయుం చ సృష్ట్వా తత్తేజోఽసృజత ఇతి. న హీయం శ్రుతిస్తేజోజనిప్రధానా సతీ శ్రుత్యన్తరప్రసిద్ధామాకాశస్యోత్పత్తిం వార యితుం శక్నోతి. ఏకస్య వాక్యస్య వ్యాపారద్వయాసంభవాత్.

బాలానందిని

**తథాహీతి**:- అది ఎట్లనగా ప్రతీ వేదాంతంలోను "ఇదం సర్వం యదయమాత్మా బ్రహ్మైవేదం పురస్తాత్" మొదలైన ఆయా శబ్దాలు ఆ యా దృష్టాంతాలచేత ఆ ప్రతిజ్ఞనే స్థాపిస్తున్నాయి. అందువల్ల అగ్న్యాదుల వలె ఆకాశం కూడ పుడుతుంది. శ్రుతి లేకపోవడం చేత అకాశం పుట్టదు అని ఏది చెప్పబడిందో అది అయుక్తం. వియదుత్పత్తిని చెప్పే "తస్మాద్వా...సంభూతః" అను శ్రుతి చూపబడింది కదా. నిజమే, చూపబడింది; అయితే అది తత్తేజోఽసృజత అనే మరొక శ్రుతికి విరుద్ధంగా ఉంది. అది యుక్తం కాదు. సకల శ్రుతులకు ఏకవాక్యత్వం చెప్పుకోవాలి కదా? విరోధం లేనివాటికి ఏకవాక్యత్వం ఉంటే ఉండవచ్చును. ఇక్కడైతే ఒక మారు వినబడిన (చెప్పబడిన) స్రష్టకు రెండు స్రష్టవ్యాలతో సంబంధం కుదరదు. రెండూ కూడ ప్రథమజములే అని చెప్పడం కుదరదు. వికల్పం (ఆకాశం గాని తేజస్సు కాని పుట్టింది అని వికల్పం) కూడ కుదరదు అని విరోధం చెప్పబడింది. ఈ దోషం లేదు "తస్మాద్వా... అగ్నిః" అని తైత్తిరీయంలో తేజ సృష్టి మూడవదిగా చెప్పబడుచున్నది. ఈ శ్రుతిని మార్చడానికి శక్యం కాదు. ఛాందోగ్యశ్రుతి నైతే "అది అకాశాన్నీ వాయువునూ సృష్టించి తేజస్సును సృష్టించింది" అని మార్చవచ్చు. ఎందువల్ల ననగా ప్రధానంగా తేజస్సుయొక్క ఉత్పత్తిని చెప్పే ఈ శ్రుతి ఇతరశ్రుతిలో ప్రసిద్ధమైన అకాశోత్పత్తిని నివారింపజాలదు. ఒక వాక్యం రెండు పనులు చేయజాలదు కదా?

## భాష్యమ్

స్రష్టా త్వేకోఽపి క్రమేణానేకం స్రష్టవ్యం సృజేత్ ఇత్యేకవాక్యత్వ కల్పనాయాం సంభవన్త్యాం న విరుద్ధార్థత్వేన శ్రుతిః హాతవ్యా. న చాస్మాభిః సకృచ్ఛ్రుతస్య స్రష్టుః స్రష్టవ్యద్వయసంబన్ధోఽభిప్రేయతే. శ్రుత్యన్తరవశేన స్రష్టవ్యాన్తరోపసంగ్రహాత్. యథా చ "సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలాన్" (ఛా.ఉ. 3.14.1) ఇత్యత్ర సాక్షాదేవ సర్వస్య వస్తుజాతస్య బ్రహ్మజత్వం శ్రూయమాణం న ప్రదేశాన్తరవిహితతేజఃప్రముఖముత్పత్తి క్రమం వారయతి ఏవం తేజసోఽపి బ్రహ్మజత్వం శ్రూయమాణం న శ్రుత్యన్తరవిహితం నభఃప్రముఖ ముత్పత్తిక్రమం వారయితుమర్హతి. నను శమవిధానార్థమేతద్వాక్యమ్ - "తజ్జలానితి శాన్త ఉపాసీత" ఇతి శ్రుతేః; నైతత్సృష్టివాక్యమ్, తస్మాదేతన్న ప్రదేశాన్తరప్రసిద్ధం క్రమముపరోద్ధుమర్హతి. "తత్తేజోఽ సృజత" ఇత్యేత త్సృష్టివాక్యమ్; తస్మాదత్ర యథాశ్రుతి క్రమో ద్రష్టవ్య ఇతి- నేత్యుచ్యతే. న హి తేజః ప్రాథమ్యానురోధేన శ్రుత్యన్తరప్రసిద్ధో వియత్పదార్థః పరిత్యక్తవ్యో భవతి. పదార్థధర్మత్వాత్ క్రమస్య. అపి చ "తత్తేజోఽ సృజత" ఇతి నాత్ర క్రమస్య వాచకః కశ్చిచ్ఛబ్దోఽస్తి. అర్థాత్తు క్రమోఽవగమ్యతే. స చ "వాయోరగ్నిః" ఇత్యనేన శ్రుత్రన్తరప్రసిద్ధేన క్రమేణ నివార్యతే. వికల్పసముచ్చయౌ తు వియత్తే జసోః ప్రథమజత్వవిషయౌ అసంభావనానభ్యుపగమాభ్యాం నివారితౌ. తస్మాన్నాస్తి శ్రుత్యోర్విప్రతిషేధః.

### బాలానందిని

స్రష్టేతి :- సృజించేవాడు ఒక్కడే అయినా సృజించదగినదానిని అనేకమును క్రమంగా సృజించవచ్చును. అందుచేత రెండు శ్రుతులకు ఏకవాక్యత్వం కల్పించడానికి అవకాశం ఉన్నప్పుడు విరుద్ధార్థమని చెప్పి శ్రుతిని పరిత్యజించకూడదు. మేం మరొక శ్రుతిని పట్టి మరొక స్రష్టవ్యాన్ని ఉపసంహరిస్తున్నామే (ఇక్కడికి తీసికొనివస్తున్నామే) కాని ఒక మాటు వినబడిన స్రష్టకు స్రష్టవ్యద్వయంతో సంబంధం కూర్చాలని అభిలషించడం

లేదు. "సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలాన్" అనే శ్రుతివాక్యంలో ప్రత్యక్షంగా సమస్తవస్తు సముదాయము కూడ బ్రహ్మనుండి పుట్టినదని వినబడుచున్నా (క్రమంగా సృష్టించబడిందని చెప్పకపోయినా) శ్రుత్యంతరంలో చెప్పబడిన తేజస్సుతో ప్రారంభమయే ఉత్పత్తిక్రమాన్ని ఏ విధంగా నివారించదో అదే విధంగా తేజస్సుకు వినబడే బ్రహ్మ జత్వం (బ్రహ్మనుండి పుట్టడం అనేది) కూడ శ్రుత్యంతరంలో ఉన్న అకాశంతో ప్రారంభ మయే ఉత్పత్తిక్రమాన్ని నివారించతగదు. (ప్రశ్న) - "తజ్జలానితి శాన్త ఉపాసీత" అనే శ్రుతివల్ల ఈ వాక్యం శమాన్ని విధించేదే కాని సృష్టివాక్యం కాదు. అందుచేత ఇది మరొక చోట ఉన్న "తత్తేజోఽసృజత" అనే సృష్టివాక్యాన్ని అడ్డుకొనజాలదు. అందుచేత ఇక్కడ శ్రుత్యను సారంగానే క్రమం గ్రహించాలి. (సమాధానం). అది కాదంటాం. తేజస్సుకు ఉన్న ప్రాథమ్యాన్ని అనుసరించి శ్రుత్యంతరంలో ప్రసిద్ధమైన వియత్పదార్థాన్నే పరిత్యజించడం యుక్తం కాదు. ఎందువల్ల ననగా క్రమం పదార్థంయొక్క ధర్మం. (అనగా ధర్మంకంటె ధర్మియైన పదార్థం ప్రధానమైనది. అందుచేత వియత్పదార్థాన్ని పరిత్యజించడంకంటె క్రమరూపమైన ధర్మాన్నే పరిత్యజించడం న్యాయ్యం అని భావం). మరొక విషయ మేమనగా - "తత్తే జోఽసృజత" అనే చోట క్రమాన్ని బోధించే శబ్ద మేదీ లేదు. కేవలం అర్థాన్ని పట్టి క్రమం నిర్ణయించబడుతున్నది. అది "వాయోరగ్నిః" అని శ్రుత్యంతరంలో ప్రసిద్ధమైన క్రమంచేత నివారించబడుతుంది. అకాశ తేజస్సులలో ఏది ముందు పుట్టింది అనే విషయానికి సంబంధించిన వికల్ప - సముచ్చయాలైతే అసంభవానభ్యుపగమాల చేత నివారింపబడ్డాయి. (అకాశం ముందు పుట్టిందని ఒక మాటు, అగ్ని ముందు పుట్టిందని మరొక మాటు ఇలా గాని అలా గాని అంగీకరించవచ్చును అనే వికల్పం అసంభవం. అందుచేత అది కుదరదు. రెండూ ముందుగానే పుట్టాయనేదానిని మేం అంగీకరించ లేదు. అందుచేత ఆ దోషాల ఉద్భావనకు అవకాశం లేదని భావం) అందువల్ల శ్రుతులకు విరోధం లేదు.

## భాష్యమ్

అపి చ ఛాన్దోగ్యే "యేనాశ్రుతం శ్రుతం భవతి" ఇత్యేతాం ప్రతిజ్ఞాం వాక్యోపక్రమే శ్రుతాం సమర్థయితుమసమామ్నాతమపి వియదుత్పత్తావుపసం ఖ్యాతవ్యమ్, కిమఙ్గ పునస్తైత్తిరీయకే సమామ్నాతం నభో న సంగృహ్యతే.

యచ్చోక్తమ్ - అకాశస్య సర్వేణానన్యదేశకాలత్వాద్ బ్రహ్మణా తత్కార్యైశ్చ సహ విదితమేవ తద్భవత్యతతో న ప్రతిజ్ఞా హీయతే; న చ "ఏకమేవాద్వితీయమ్" ఇతి శ్రుతికోపో భవతి, క్షీరోదవద్ బ్రహ్మనభసోరవ్యతిరేకోపపత్తేః - ఇతి; అత్రోచ్యతే- న క్షీరోదకన్యాయేనేదమేకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం నేతవ్యమ్. మృదాది దృష్టాన్తప్రణయనాద్ధి ప్రకృతివికారన్యాయేనైవేదం సర్వవిజ్ఞానం నేతవ్యమితి గమ్యతే. క్షీరోదకన్యాయేన చ సర్వవిజ్ఞానం కల్ప్యమానం న సమ్యగ్విజ్ఞానం స్యాత్. న హి క్షీరజ్ఞానగృహీతస్య ఉదకస్య సమ్యగ్విజ్ఞానగృహీతత్వమస్తి. న చ వేదస్య పురుషాణామివ మాయాలీకవఞ్చనాదిభిః అర్థావధారణముపపద్యతే. సావధారణా చేయమ్ "ఏకమేవాద్వితీయమ్" ఇతి శ్రుతిః క్షీరోదకన్యాయేన నీయమానా పీడ్యేత. న చ స్వకార్యాపేక్షయేదం వస్త్వేకదేశవిషయం సర్వ విజ్ఞానమ్, ఏకమేవా(ఏకా) ద్వితీయతావధారణం చేతి న్యాయ్యమ్; మృదాదిష్వపి హి తత్సంభవాత్ న తదపూర్వవదుపన్యసితవ్యం భవతి - "శ్వేతకేతో యన్ను సోమ్యేదం మహామనా అనూచానమానీ స్తబ్ధోఽస్యుత తమాదేశమప్రాక్ష్యః యేనాశ్రుతం శ్రుతం భవతి" (ఛా.1.1) ఇత్యాదినా. తస్మాదశేషవస్తువిషయమేవేదం సర్వవిజ్ఞానం సర్వస్య బ్రహ్మకార్యతాపేక్షయోపన్యస్యత ఇతి ద్రష్టవ్యమ్. 6.

బాలానందిని

**అపి చేతి:-** మరొక విషయ మేమనగా ఛాందోగ్యంలో వాక్యోపక్రమంలో వినబడుతున్న "యేనాశ్రుతం శ్రుతం భవతి" అనే ప్రతిజ్ఞను సమర్థించడానికి ఏ శ్రుతిలోనూ చెప్పబడక పోయినా కూడ ఆకాశాన్ని ఉత్పత్తిలో చేర్చవలసి ఉంటుంది. అలాంటప్పుడు తైత్తిరీయకంలో పఠించబడిన ఆకాశం గ్రహించబడకపోవడం ఏమిటి? ఆకాశం అన్ని వస్తువులతోనూ సమానదేశకాలాలు కలదవడంచేత బ్రహ్మ, దాని కార్యాలతో పాటు అది తెలియబడుతుంది. అందుచేత ప్రతిజ్ఞకు ఏమీ భంగం ఉండదు; అట్లే బ్రహ్మాకాశాలు క్షీరనీరాల వలె కలిసి పోవడంవల్ల "ఏకమేవాద్వితీయమ్" అనే శ్రుతికి కోపం (బాధ) కూడ కలగదు అని ఏది చెప్పబడిందో దాని విషయంలో చెప్పబడుచున్నది.

ఈ ఏకవిజ్ఞానంచేత సర్వవిజ్ఞానం అనేది క్షీరోదకన్యాయంచేత సమన్వయించవలసినది కాదు. ఎందువల్ల ననగా మృదాదిదృష్టాంతాలను చూపడంచేత ఈ సర్వవిజ్ఞానాన్ని ప్రకృతి వికారన్యాయంచేత (ఉపాదానకారణం తెలుస్తే దాని కార్యాలన్నీ తెలుస్తాయి అనే న్యాయంచేత) సమన్వయించుకోవాలని తెలుస్తూన్నది. క్షీరోదకన్యాయంచేత కల్పించబడే సర్వవిజ్ఞానం సమ్యగ్ విజ్ఞానం (మంచి జ్ఞానం) కాజాలదు. క్షీరజ్ఞానంలో గ్రహించబడిన ఉదకజ్ఞానం (నీళ్లను పాలగా గ్రహించడం) సమ్యగ్ జ్ఞానం కాదు కదా? పురుషుల మాటల అర్థాలను నిర్ణయించినట్లు వేదార్థాన్ని మాయ, అసత్యం, వంచన మొదలైన వాటితో గ్రహించడం యుక్తం కాదు కదా? అవధారణతో కూడిన (నిశ్చితంగా నొక్కి చెప్పుచున్న) ఈ "ఏకమేవాద్వితీయమ్" అనే శ్రుతికి క్షీరోదకన్యాయంతో అర్థం చెపితే దానిని పీడించిన ట్లవుతుంది. ఈ సర్వవిజ్ఞానం, ఏకత్వనిశ్చయమూ కూడ కేవలం దాని కార్యాల అపేక్షచేతనే (దృష్టిచేతనే) చెప్పబడింది, కొన్ని వస్తువులకు మాత్రమే సంబంధించినది అని చెప్పడం కూడ న్యాయం కాదు. (బ్రహ్మ ఏకము, అద్వితీయము. అందుచేత దానిని తెలుసుకుంటే సకలవస్తువులూ తెలుస్తాయి అని చెప్పడం కోసం కాకుండా కేవలం కారణాన్ని తెలుసుకుంటే దాని కార్యాలన్నింటినీ కూడ తెలుసుకొనవచ్చు అని బోధించడం మాత్రమే ఉద్దిష్టం అయితే) ఆ విషయం లోకంలో మృదాదులలో కూడ ప్రత్యక్షంగా తెలుస్తూన్నది గాన "శ్వేతకేతో.. భవతి" అని ప్రయత్నపూర్వకంగా ఏదో ఒక అపూర్వ విషయం చెపుతున్నట్లు చెప్పవలసిన పని లేదు. అందువల్ల సర్వమూ బ్రహ్మయొక్క కార్యమే అని అంగీకరించడంమీదనే ఆధారపడి ఉన్న ఈ సర్వవిజ్ఞానం సమస్తవస్తు విషయకమే (సమస్తవస్తువులకు సంబంధించినదే) అని తెలుసుకోవాలి.6

## భాష్యమ్

యత్పునరేతదుక్తమ్ అసంభవాద్గౌణీ గగనస్యోత్పత్తిశ్రుతిరితి, తత్ర బ్రూమః-

### సూ. యావద్వికారం తు విభాగో లోకవత్. 2.3.7.

తుశబ్దోఽసంభవాశఙ్కావ్యావృత్త్యర్థః. న ఖల్వాకాశోత్పత్తౌ అసంభవాశఙ్కా కర్తవ్యా, యతో యావత్కిఞ్చిద్వికారజాతం దృశ్యతే ఘటఘటికోదఞ్చనాది వా

కటకకేయూరకుణ్డలాది వా, సూచీనారాచనిస్త్రింశాది వా తావానేవ విభాగో లోకే లక్ష్యతే, న త్వవికృతం కిఞ్చిత్కుతశ్చిద్విభక్తముపలభ్యతే. విభాగశ్చాకాశస్య పృథివ్యాదిభ్యోఽవగమ్యతే, తస్మాత్సోఽపి వికారో భవితుమర్హతి. ఏతేన దిక్కాలమనఃపరమాణ్వాదీనాం కార్యత్వం వ్యాఖ్యాతమ్. నన్వాత్మాపి ఆకాశాదిభ్యో విభక్త ఇతి తస్యాపి కార్యత్వం ఘటాదివత్ప్రాప్నోతి? న. "ఆత్మన ఆకాశః సంభూతః"(తై.ఉ. 2-1) ఇతి శ్రుతేః. యది హ్యాత్మాపి వికారః స్యాత్ తస్మాత్పరమన్యన్న శ్రుతమిత్యాకాశాది సర్వం నిరాత్మకమాత్మనః కార్యత్వే స్యాత్. తథా చ శూన్యవాదః ప్రసజ్యేత. ఆత్మత్వాచ్చాత్మనో నిరాకరణశఙ్కాను పపత్తేః. న హ్యాత్మాఽఽ గన్తుకః కస్యచిత్, స్వయంసిద్ధత్వాత్. నహ్యాత్మాత్మనః ప్రమాణమపేక్ష్య సిధ్యతి. తస్య హి ప్రత్యక్షాదీని ప్రమాణాన్యప్రసిద్ధప్రమేయ సిద్ధయ ఉపాదీయన్తే. న హ్యాకాశాదయః పదార్థాః ప్రమాణనిరపేక్షాః స్వయం సిద్ధాః కేన చిదభ్యుపగమ్యన్తే. ఆత్మా తు ప్రమాణాదివ్యవహారాశ్రయత్వాత్ ప్రాగేవ ప్రమాణాదివ్యవహారాత్సిధ్యతి. న చేదృశస్య నిరాకరణం సంభవతి. ఆగన్తుకం హి వస్తు నిరాక్రియతే న స్వరూపమ్. య ఏవ హి నిరాకర్తా తదేవ తస్య స్వరూపమ్. న హ్యగ్నేరౌష్ణ్యమగ్నినా నిరాక్రియతే. తథాహమేవేదానీం జానామి వర్తమానం వస్తు, అహమేవాతీతమతీతతరం చాజ్ఞాసిషమ్, అహమేవా నాగతమనాగతతరం చ జ్ఞాస్యామీత్యతీతానాగతవర్తమానభావేన అన్యథా భవత్యపి జ్ఞాతవ్యే న జ్ఞాతురన్యథా భావోఽస్తి సర్వదా వర్తమానస్వభావత్వాత్. తథా భస్మీభవత్యపి దేహే నాత్మన ఉచ్ఛేదః, వర్తమానస్వభావాదన్యస్వభావత్వం వా న సంభావయితుం శక్యమ్. ఏవమప్రత్యాఖ్యేయస్వభావత్వాదేవాకార్యత్వ మాత్మనః. కార్యత్వం చాకాశస్య.

బాలానందిని

యదితి : - ఆకాశానికి ఉత్పత్తి అసంభవం గాన ఆకాశోత్పత్తి శ్రుతి గౌణి అని ఏది చెప్పబడిందో ఆ విషయంలో చెపుతున్నాం-

యావదితి :- ''లోకవత్=లోకమునందు వలె, విభాగః తు=విభాగ మైతే, యావద్వికారమ్ = ఎంతవరకు వికార మున్న దో అంతవరకు'' అని సూత్రార్థం.

తుశబ్ద ఇతి :- తుశబ్దం ఆకాశానికి ఉత్పత్తి అసంభవం అనే ఆశంకను నివర్తింపచేయడంకొరకు. ఆకాశం పుట్టడం విషయంలో అది అసంభవం (కుదరదు) అనే ఆశంక చేయగూడదు. ఎందువల్లననగా లోకంలో ఘటం, చిన్న ఘటం, చేద మొదలైన లేదా కటకం, కేయూరం కుండలం మొదలైన లేదా సూది, నారాచబాణం, ఖడ్గం మొదలైన కార్యసముదాయం ఏదేది కనబడుచున్నదో (కనబడే కార్యసముదాయం అంతా) అంతవరకే విభాగం కనబడుచున్నది. అనగా కార్యాలన్నీ వేరు వేరు పదార్థాలుగా కనబడుతున్నాయి. అందుచేత వేరు వేరుగా కనబడే వన్నీ కార్యాలే అని అర్థం. అంతే కాని వికారం కానిది ఏదీ కూడ విభక్తంగా కనబడడంలేదు. ఆకాశానికి పృథివ్యాదులకంటె విభాగం కనబడుచున్నది; (అనగా ఆకాశం పృథివ్యాదులకంటె వేరుగా కనబడుతున్నది). అందువల్ల అది కూడా వికారం (కార్యం) కావడానికి తగి ఉంది. దీనిచేతదిక్-కాల। మనస్-పరమాణ్వాదుల కార్యత్వం కూడ వ్యాఖ్యానింపబడినట్లే. అనగా అవి కూడ వేరు వేరుగా కనడుతున్నాయి గాన అవి కూడ కార్యాలే అని అర్థం. (ప్రశ్న) ఆత్మకూడ ఆకాశాదులకంటె వేరైనదే గాన అది కూడ ఘటాదుల వలె కార్యమే అని చెప్పవలసివస్తుంది కదా? (సమాధానం)-కాదు. "ఆత్మన ఆకాశః సంభూతః" అని శ్రుతి చెప్పుచున్నది కదా? ఆత్మ కూడ వికారమే. అయితే దానికంటె పరంగా (దానికి కూడ కారణంగా) మరొక టేదీ చెప్పబడలేదు గాన, ఆకాశాదికమైన కార్యజాతమంతా, ఆత్మ కూడ కార్యమైనట్లయితే, అనగా కార్యం అవడంవల్ల నశించేదే అయితే, నిరాత్మకం (స్వరూపశూన్యం) అయిపోతుంది. అప్పుడు శూన్యవాదం ఏర్పడుతుంది.

వి. ఆత్మనుండి ఆకాశం పుట్టింది. ఆకాశం నుండి వాయువు పుట్టింది. ఈ విధంగా ఆకాశాదులు పుట్టినట్లు శ్రుతి చెపుతూన్నది. అయితే ఆత్మకూడ ఫలానాదానివల్ల పుట్టింది అని ఏదీ చెప్పలేదు. అందుచేత ఆత్మ కార్యం కాదు. ఇది పరమకారణం. అందుచేత ఇది ఆకాశాదికార్యాలన్నింటికీ ఆత్మ, అనగా ఆధారమైన స్వరూపం. విభక్తమవడంచేత ఆత్మకూడ కార్యమే అన్నట్లయితే అది కూడ నశిస్తుందని చెప్పాలి. అప్పుడు ఆకాశాదులు నిరాత్మకాలు, నిఃస్వరూపాలు అవుతాయి. ఏమీ మిగలక,

శూన్యవాదాన్ని అంగీకరించిన ట్లవుతుంది. అందుచేత కేవలం విభక్తత్వం కార్యత్వ హేతువు కాదు. పరమకారణం కాకుండా ఏది విభక్తమో అది కార్యం అని చెప్పాలి. అప్పుడు ఆకాశాదులకు కార్యత్వం సిద్ధిస్తుంది. పరమకారణమైన ఆత్మకు కార్యత్వం ఉండదు అని భావం. వాస్తవంలో పరమార్థమైన ఆత్మకు విభాగం కూడ కల్పితమే గాన అది విభక్తం కూడ కాదు.

ఆత్మత్వాదితి:- ఆత్మ అవడంచేతనే ఆత్మను నిరాకరించడం కుదరదు.

వి. ఆత్మ కూడ నశిస్తుంది అని శూన్యవాదాన్నే అంగీకరించవచ్చును కదా అనడానికి వీలులేదు. ఎందువల్ల ననగా ఆత్మ ఆత్మ అవడంచేత, స్వయంప్రకాశమవడంచేత, పుట్టుక కలది (కార్యం) కాదు; అలా కాని ఘటాదులు మాత్రమే కార్యాలు. "ఆత్మా నోత్పద్యతే, ఆత్మత్వాత్, స్వప్రకాశత్వాచ్చ, వ్యతిరేకే ఘటవత్" అనే అనుమానప్రయోగంచేత ఆత్మకు పుట్టుక వినాశము లేవని భావం.

నేతి :- ఆత్మ స్వయంసిద్ధం అనగా సత్త విషయంలో గాని, స్ఫూర్తి (ప్రకాశించడం) విషయంలో గాని ఇతరాధీనం కాదు. అందుచేత ఇది మరొకదానికి దేనికీ ఆగంతుకం (పుట్టిన కార్యం) కాదు. ఆత్మ తన ప్రమాణాలను వేటి నైనా అపేక్షించి సిద్ధించేది కాదు. అనగా ఆత్మను తెలుసుకొనడానికి ప్రత్యక్షాదిప్రమాణాల ఆవశ్యకత లేదు. అది స్వయంగానే ప్రకాశిస్తుంది. దాని ప్రత్యక్షాదిప్రమాణాలు తెలియని ప్రమేయాల (తెలియదగిన వస్తువుల) సిద్ధికోసం, వాటి ఉనికిని తెలుసుకొనడం కోసం, గ్రహించబడతాయి (ఉపకరిస్తాయి). ఆకాశాదిపదార్థాలు ప్రమాణాల అపేక్ష లేకుండా స్వయంసిద్ధాలే అని ఎవ్వరూ అంగీకరించరు కదా? ఆత్మ యెతే ప్రమాణాల వ్యవహారానికి ఆశ్రయమైనది. అనగా ఆత్మప్రకాశంచేతనే ప్రమాణాలు తమ తమ పనులు చేస్తున్నాయి. ఇతర వస్తువులను ప్రకాశింపచేస్తున్నాయి. అందుచేత ప్రమాణాల వ్యవహారానికి ముందే ఆత్మ సిద్ధిస్తుంది. (స్వయంప్రకాశంగా, ప్రమాణాదిప్రకాశకంగా ఉంది). ఇలాంటి (స్వయంప్రకాశమైన) దానిని నిరాకరించడం (లేదనడం) కుదరదు. ఆగంతుకమైన (కొత్తగా వచ్చిన, కార్యమైన) వస్తువు నిరాకరించబడుతుంది కాని స్వస్వరూపమే నిరాకరించబడదు కదా? ఎవడైతే నిరాకరిస్తున్నాడో అతడే దాని (ఆత్మయొక్క) స్వరూపం (ఆత్మ లేదు అనేవాడే ఆత్మ గాన ఆత్మను నిరాకరించే ప్రసక్తి లేదు). అగ్నియొక్క

ఉష్ణత్వం అగ్నిచేతనే నిరాకరింపబడదు కదా?

**అవ.** అయితే ఈ ఆత్మ క్షణికం అని చెప్పడానికి కూడ వీలు లేదు. ప్రత్యభిజ్ఞానం వల్ల ఇది నిత్యమని తెలుస్తూన్నది అని చెపుతున్నారు- **తథాహమితి :-** నేనే ఇప్పుడు ఉన్న ఈ వస్తువును తెలునుకొనుచున్నాను, గడిచినదానిని, అంతకు ముందు గడచినదానిని నేనే తెలునుకున్నాను, రాబోయేదానిని, దాని తరవాత రాబోయేదానినీ కూడ నేనే తెలునుకోబోతున్నాను అని జ్ఞాతవ్యమైన వస్తువులు భూతభవిష్యద్వర్తమానాలకు సంబంధించినవిగా మారుతున్నాకూడ జ్ఞాతకు మాత్రం మార్పులేదు. ఎందువల్ల ననగా ఈ జ్ఞాత మాత్రం ఎల్లప్పుడూ వర్తమానుడుగానే ఉన్నాడు. దేహం భస్మం అయిపోయినా కూడ అత్మకు వినాశం లేదు. ప్రస్తుతం ఉన్న స్వభావంకంటె వేరు స్వభావం కూడ ఊహించడానికి శక్యం కాదు. ఈ విధంగా ఆత్మ ప్రత్యాఖ్యానం చేయ శక్యం గాని (లేదని చెప్పడానికి శక్యం కాని) స్వభావం గలది గాన అది కార్యం కాదు. ఆకాశం మాత్రం కార్యమే.

## భాష్యమ్

యత్తూక్తం సమానజాతీయమనేకం కారణద్రవ్యం వ్యోమ్నో నాస్తీతి తత్ప్రత్యుచ్యతే. న తావత్సమానజాతీయమేవారభతే న భిన్నజాతీయమితి నియమోఽస్తి. న హి తన్తూనాం తత్సంయోగానాం చ సమానజాతీయత్వమస్తి; ద్రవ్యగుణత్వాభ్యుపగమాత్. న చ నిమిత్తకారణానామపి తురీవేమాదీనాం సమానజాతీయత్వనియమోఽస్తి. స్యాదేతత్-సమవాయికారణవిషయ ఏవ సమానజాతీయత్వాభ్యుపగమో న కారణాన్తరవిషయ ఇతి. తద ప్యనైకాన్తికమ్. సూత్రగోవాలైర్హ్యనేకజాతీయైరేకా రజ్జుః సృజ్యమానా దృశ్యతే. తథా సూత్రైరూర్ణాదిభిశ్చ విచిత్రాన్ కమ్బలాన్వితన్వతే. సత్త్వద్రవ్యత్వాద్యపేక్షయా వా సమానజాతీయత్వే కల్ప్యమానే నియమానర్థక్యం, సర్వస్య సర్వేణ సమానజాతీయకత్వాత్. నాప్యనేకమేవారభతే నైకమితి నియమోఽస్తి. అణుమనసోరాద్యకర్మాభ్యుపగమాత్. ఏకైకో హి పరమాణుః మనశ్చాద్యం

స్వకర్మారభతే న ద్రవ్యాన్తరైః సంహత్యేత్యభ్యుపగమ్యతే. ద్రవ్యాదమ్భఏవ అనేకారమ్భకత్వనియమ ఇతి చేత్; న పరిణామాభ్యుపగమాత్. భవేదేష నియమో యది సంయోగసచివరం ద్రవ్యం ద్రవ్యాన్తరస్యారమ్భకమభ్యుపగమ్యతే. తదేవ తు ద్రవ్యం విశేషవదవస్థాన్తరమాపద్యమానం కార్యం నామాభ్యుపగమ్యతే. తచ్చ క్వచిదనేకం పరిణమతే, మృద్బీజాద్యఙ్కురభావేన. క్వచిదేకం పరిణమతే క్షీరాది దధ్యాదిభావేన. నేశ్వరశాసనమస్తి అనేకమేవ కారణం కార్యం జనయతీతి. అతః శ్రుతి ప్రామాణ్యాదేక స్మాద్ బ్రహ్మణః ఆకాశాదిమహాభూతోత్పత్తి క్రమేణ జగజ్జాతమితి నిశ్చీయతే. తథా చోక్తమ్ - "ఉపసంహారదర్శనాన్నేతి చేన్న క్షీరవద్ధి" (బ్ర.సూ. 2.1.24) ఇతి.

బాలనందిని

యత్త్వితి:- ఆకాశానికి సమాన జాతీయకమైన అనేకమైన కారణద్రవ్యం లేదు అని ఏది చెప్పబడిందో అది నిరాకరించబడుచున్నది. సమానజాతీయక మైన కారణమే కార్యాన్ని పుట్టిస్తుంది అనే నియమం లేదు. తంతువులు వాటి సంయోగము సమాన జాతీయకాలు కావు కదా? ఆ రెడింటిలో ఒకటి ద్రవ్యం అనీ రెండవది (సంయోగం) గుణమనీ అంగీకరించంబడింది కదా? నిమిత్తకారణాలైన తురీవేమాదులు కూడ సమాన జాతీయాలుగానే ఉండాలనే నియమం లేదు. అది సరే-సమానజాతీయాలుగా ఉండాలనే ఈ నియమం సమవాయికారణం విషయంలో మాత్రమే కాని ఇతరకారణాల విషయంలో లేదు. అది కూడ ఏకాన్తికం (వ్యభిచారదోషం లేనిది) కాదు. అనేక జాతులకు చెందిన సూత్రాలచేత ఎద్దు తోకల(వెంద్రుకల)చేత ఒక త్రాడు తయారు చేయబడడం చూస్తున్నాం కదా? అట్లే సూత్రాలతోను, ఉన్ని మొదలైనవాటితోను విచిత్రమైన (వేరు వేరు రంగులు గల) కంబళ్లు నేస్తున్నారు. సత్త్వం (ఉండడం అనే ధర్మం) ద్రవ్యత్వం మొదలైనవాటిని పట్టి సమానజాతీయత్వాన్ని కల్పిస్తే అప్పుడు ఈ నియమం అనావశ్యకం. (సత్త్వ ద్రవ్యత్వాదులను పట్టి చూస్తే) ప్రతీదీ ప్రతీదానికీ సజాతీయమే అవుతుంది. అదే విధంగా అనేకవస్తువులే కార్యాన్ని పుట్టిస్తాయి కాని ఒక వస్తువు పుట్టించదు అనే నియమం కూడ లేదు. అణువులోను మనస్సులోను మొదటి కర్మ ఉంటుందని అంగీకరించబడింది కదా.

ఎందుచేత ననగా ఒక్కొక్క పరమాణువు, మనస్సు మొట్టమొదటి స్వకర్మను, ఇతర ద్రవ్యాలతో కలిసి కాకుండా తమంతట తామే ప్రారంభిస్తాయి అని (మీచేత) అంగీకరించబడుచున్నది. ఏదైన ద్రవ్యాన్ని పుట్టించడం విషయంలోనేఅనే కారంభకత్వనియమం అన్నట్లయితే, అది యుక్తం కాదు. ఎందువల్ల ననగా పరిణామం అంగీకరించబడుతుంది. సంయోగం సహాయంతో ఒక ద్రవ్యం మరొక ద్రవ్యాన్ని పుట్టిస్తుంది అని అంగీకరిస్తే ఈ నియమం ఉండవచ్చును. అదే ద్రవ్యం విశేషం గల మరియొక అవస్థను పొందినట్లయితే అది కార్యం అని చెప్పబడుతుంది. కొన్ని చోట్ల మృత్తు బీజం మొదలైనవి అంకురాదిరూపంలో పరిణామం చెందినట్లు అనే కద్రవ్యాలు (ఒక కార్యంగా) పరిణామం చెందుతాయి. కొన్ని చోట్ల ఒకే క్షీరాదికం పెరుగు మొదలైన రూపాలలో పరిణమించినట్లు ఒకే వస్తువు పరిణామం చెందుతుంది. అనేకమైన కారణమే కార్యాన్ని పుట్టిస్తుంది అని ఈశ్వరాజ్ఞ లేదు. అందువల్ల శ్రుతిప్రామాణ్యాన్ని అనుసరించి, ఒకే బ్రహ్మనుండి ఆకాశాదిమహాభూతాల ఉత్పత్తిక్రమంలో, జగత్తు పుట్టినదని నిశ్చయించ బడుచున్నది. ఈ విషయమే - "ఉపసంహారదర్శనాన్నేతి చేన్న క్షీరవద్ధి" అనే సూత్రంచేత చెప్పబడింది.

## భాష్యమ్

యచ్చోక్తమ్ - ఆకాశస్యోత్పత్తౌ న పూర్వోత్తరకాలయోర్విశేషః సంభావయితుం శక్యతే ఇతి; తదయుక్తమ్. యేనైవ హి విశేషేణ పృథివ్యాదిభ్యో వ్యతిరిచ్యమానం నభః స్వరూపవదిదానీమధ్యవసీయతే స ఏవ విశేషః ప్రాగుత్పత్తేర్నాసీదితి గమ్యతే. యథా చ బ్రహ్మ న స్థూలాదిభిః పృథివ్యాది స్వభావైః స్వభావవత్ "అస్థూలమనణు" (బృ.ఉ. 3.8.8.) ఇత్యాదిశ్రుతిభ్యః ఏవమాకాశస్వభావేనాపి న స్వభావవదనాకాశమితి శ్రుతేరవగమ్యతే. తస్మాత్ప్రాగుత్పత్తేరనాకాశమితి స్థితమ్. యదప్యుక్తం - పృథివ్యాదివైధర్మ్యా దాకాశస్యాజత్వమితి, తదప్యసత్. శ్రుతివిరోధే సత్యుత్పత్త్యభావానుమాన స్యాభాసతోపపత్తేః. ఉత్పత్త్యనుమానస్య చ దర్శితత్వాత్, అనిత్యమాకాశమ్, అనిత్యగుణాశ్రయత్వాత్, ఘటాదివదిత్యాదిప్రయోగసంభవాచ్చ. ఆత్మన్యనై కాన్తికమితి చేత్; న.

తస్యోపనిషదం ప్రత్యనిత్యగుణాశ్రయతాసిద్ధేః. విభుత్వాదీనాం. చాకాశస్యోత్పత్తి వాదినం ప్రత్యసిద్ధత్వాత్. యచ్చోక్తమేతత్ - "శబ్దాచ్చ" ఇతి, తత్రామృతత్వ శ్రుతిస్తావద్వియతి "అమృతా దివౌకసః" ఇతివద్ద్రష్టవ్యా. ఉత్పత్తిప్రలయ యోరుపపాదితత్వాత్. "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః" ఇత్యపి ప్రసిద్ధ మహత్త్వేనాకా శేనోపమానం క్రియతే నిరతిశయమహత్త్వాయ, నాకాశ సమత్వాయ; యథేషురివ సవితా ధావతీతి క్షిప్రగతిత్వాయోచ్యతే నేషుతుల్యగతిత్వాయ తద్వత్. ఏతేనానన్తత్వోపమాన శ్రుతిర్వ్యాఖ్యాతా. "జ్యాయానాకాశాత్" ఇత్యాదిశ్రుతిభ్యశ్చ బ్రహ్మణ ఆకాశస్యోనపరిమాణత్వసిద్ధిః "న తస్య ప్రతిమాస్తి" (శ్వే. ఉ. 4.19) ఇతి చ బ్రహణోఽనుపమానత్వం దర్శమతి. "అతోఽన్యదార్తమ్" (బృ. ఉ. 3.4.2) ఇతి చ బ్రహ్మణోఽన్యే షామాకాశాదీనామార్తత్వం దర్శయతి. తపసి బ్రహ్మ శబ్దవదాకాశస్య జన్మశ్రు తేర్గౌణత్వమిత్యేతదాకాశసంభవశ్రుత్యను మానాభ్యాం పరిహృతమ్. తస్మాద్ బ్రహ్మకార్యం వియదితి సిద్ధమ్. 7.

బాలానందిని

యచ్చేతి:- ఆకాశానికి ఉత్పత్తి అంగీకరిస్తే అది పుట్టడానికి పూర్వం తరవాత ఉండే విశేషాన్ని ఊహింప శక్యం కాదు అని చెప్పినది కూడ యుక్తం కాదు. ఆకాశం ఏ విశేషంచేత పృథివ్యాదులకంటె భిన్నమైన స్వరూపం కలదిగా కనబడుతున్న దని ఇప్పుడు నిశ్చయించబడుతున్నదో ఆ విశేషమే దాని ఉత్పత్తికి పూర్వం ఉండేది కాదని తెలుస్తూన్నది. (ఆకాశాని కున్న విశేషం శబ్దాశ్రయత్వం. ఆ శబ్దాశ్రయమైన ఆకాశం ప్రలయకాలంలో లేదని అర్థం). "అస్థూలమనణు" అని శ్రుతిలో చెప్పడంచేత బ్రహ్మకు ఏ విధంగా పృథవ్యాదుల స్వభావాలైన స్థూలత్వాదులతో సంబంధం లేదో (ఆ స్థూలత్వాదులు ఏ విధంగా బ్రహ్మయొక్క స్వభావం కావో) అదే విధంగా "అనాకాశమ్" అను శ్రుతిచేత ఆకాశస్వభావం కూడ బ్రహ్మయొక్క స్వభావం కాజాలదని తెలుస్తూన్నది. అందువల్ల సృష్టికి పూర్వం బ్రహ్మ ఆకాశంలేనిది (సృష్టికి పూర్వం ఆకాశం లేదు) అని నిర్ణయం. పృథివ్యాదులకీ ఆకాశానికీ సామ్యం లేదు గాన ఆకాశానికి పుట్టుక లేదు అని చెప్పడం

కూడ యుక్తం కాదు. శ్రుతితో విరోధం వచ్చినప్పుడు అనుత్పత్త్యనుమానం అనుమానాభాసమే కాని ప్రామాణికం కాదు. ఉత్పత్త్యనుమానం కూడ చూపబడింది. "అనిత్యమైన గుణానికి ఆశ్రయం అవడంచేత ఆకాశం ఘటాదికం వలె అనిత్యం" అని అనుమాన ప్రయోగం కుదురుతుంది కదా? (ఆత్మ కూడ అనిత్యగుణాలకి ఆశ్రయమే గాన) "అనిత్యగుణాశ్రయత్వాత్" అనే హేతువుకు ఆత్మయందు వ్యభిచారం (అందుచేత ఆత్మకూడ అనిత్యమని చెప్పవలసి వస్తుంది) అన్నట్లయితే అది యుక్తం కాదు. ఔపనిషదుల (వేదాంతుల) మతం ప్రకారం ఆత్మలో అనిత్యగుణాలు ఉండవు కదా? (ఆకాశం విభువు సర్వవ్యాప్తం, అందుచేత నిత్యము అనడానికి కూడ వీలు లేదు) ఆకాశానికి ఉత్పత్తిని అంగీకరించే ఔపనిషదుల ప్రకారం దానికి విభుత్వాదులు కూడ లేవు కదా? "శబ్దాచ్చ" అని శ్రుత్యనుసారంగా కూడ ఆకాశానికి ఉత్పత్తి లేదని చెప్పడం కూడ యుక్తం కాదు. వాటిలో అమృతత్వశ్రుతి (ఆకాశం అమృత అని చెప్పే శ్రుతి) దేవతలు అమృతులు - మరణం లేని వారు - అని చెప్పడం వంటిది. (దేవతలకు మరణం లేకపోలేదు. చాలా కాలం ఉంటారు కాబట్టి. వాళ్లు అమృతులని చెప్పబడ్డారు. అట్లే ఆకాశం కూడ ప్రలయం వరకు ఉంటుంది. గాన అమృతం అని చెప్పబడింది). ఆకాశానికి కూడ ఉత్పత్తి, వినాశమూ ఉంటాయని నిరూపించాం కదా? "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః" అని మహత్త్వం గలదిగా ప్రసిద్ధమైన ఆకాశంతో పోల్చడం ఆత్మకు నిరతిశయమైన (అంతకంటె అతిశయం లేని) మహత్త్వం ఉందని చెప్పడం కోసమే కాని ఆత్మ ఆకాశంతో సమానమైనది అని చెప్పడం కోసం కాదు. సూర్యుడు బాణం వలె పరుగెత్తుతున్నాడు అన్నప్పుడు శీఘ్రంగా వెడుతున్నాడు అనడం కోసమే అలా చెప్పబడుతుంది కాని సూర్యుని నడక బాణం నడక వలె ఉందని చెప్పడం కోసం కాదు.అట్లే ఇదీని. దీనిచేత ఆకాశం ఏ విధంగా అనంతమో ఆత్మకూడ అట్లే అనంతం అని చెప్పే శ్రుతి కూడ వ్యాఖ్యానింపబడి నట్లే. అనగా అపేక్షికంగా ఆకాశం అనంతం గాన దానిని పట్టి ఈ విధంగా పోల్చబడింది అని అర్థం. "జ్యాయానాకాశాత్" ఇత్యాదుల ననుసరించి బ్రహ్మకంటె ఆకాశం అల్పపరిమాణం గలది అని సిద్ధిస్తుంది. "న తస్య ప్రతిమాస్తి" అను శ్రుతి బ్రహ్మకు ఉపమానం, లేదని చెపుతున్నది. "అతోఽన్యదార్తమ్" అనే శ్రుతి బ్రహ్మకంటె ఇతరమైన ఆకాశాదు లన్నీ ఆర్తము లని (నశ్వరము లని) చూపుతున్నది.

బ్రహ్మశబ్దాన్ని తపస్సు అనే అర్థంలో గౌణంగా ప్రయోగించినట్లు ఆకాశం పుడుతుంది అని చెప్పే శ్రుతి గౌణం అనేది, ఆకాశానికి పుట్టుక ఉంది అని చెప్పే శ్రుతిచేత, అనుమానంచేత పరిహరించబడింది. అందువల్ల ఆకాశం బ్రహ్మయొక్క కార్యం అని సిద్ధించినది. 7.

వియదధికరణం సమాప్తం

### 2-మాతరిశ్వాధికరణమ్. సూ. 8

### సూ. ఏతేన మాతరిశ్వా వ్యాఖ్యాతః 2-3.8

అతిదేశోఽయమ్ ఏతేన వియద్వ్యాఖ్యానేన మాతరిశ్వాపి వియదాశ్రయో వాయుర్వ్యాఖ్యాతః. తత్రాప్యేతే యథాయోగం పక్షా రచయితవ్యాః. న వాయురుత్పద్యతే, ఛాన్దోగానాముత్పత్తి ప్రకరణేఽ నామ్నానాదిత్యేకః పక్షః. అస్తి తు తైత్తిరీయాణాముత్పత్తిప్రకరణే ఆమ్నానమ్ "ఆకాశాద్వాయుః" (తై.ఉ.2-1) ఇతి ప్రక్షాన్తరమ్. తతశ్చ శ్రుత్యోర్విప్రతిషేధే సతి గౌణీ వాయోరుత్పత్తిశ్రుతిరసంభవాదిత్యపరోఽభిప్రాయః. అసంభవశ్చ "సైషాఽనస్తమితా దేవతాయద్వాయుః" (బృ.ఉ.1-5-22) ఇత్యస్తమయ ప్రతిషేధాత్, అమృతత్వాదిశ్రవణాచ్చ. ప్రతిజ్ఞానుపరోధాత్, యావద్వికారం చ విభాగాభ్యుపగమాత్ ఉత్పద్యతే వాయురితి సిద్ధాన్తః. అస్తమయప్రతిషేధోఽప రవిద్యావిషయ ఆపేక్షికః, అగ్న్యాదీనామివ వాయోరస్తమయాభావాత్. కృతప్రతివిధానం చామృతత్వాదిశ్రవణమ్. నను వాయోరాకాశస్య చ తుల్యయో రుత్పత్తి ప్రకరణే శ్రవణాశ్రవణయోః ఏకమేవాధికరణముభయవిషయమస్తు, కిమతిదేశేనాసతి విశేష ఇతి; ఉచ్యతే -సత్యమేవమేతత్. తథాపి మన్దధియాం శబ్దమాత్రకృతాశఙ్కానివృత్త్యర్థోఽయమతిదేశః క్రియతే. సంవర్గవిద్యాదిషు హ్యుపాస్యతయా వాయోర్మహాభాగత్వశ్రవణాత్, అస్తమయప్రతిషేధాదిభిశ్చ భవతి నిత్యత్వాశఙ్కా కస్య చిదితి. 8

బాలానందిని

ఏతేనేతి :- (అతిదేశమే కాన మళ్లీ దీనికి నేరుగా సంగత్యాదులు చెప్పపని లేదు) "ఏతేన=దీనిచేత (ఆకాశం విషయంలో చెప్పినదానిచేత), మాతరిశ్వా=వాయువు. వాఖ్యాతః=వ్యాఖ్యానింపబడినట్లే" అని సూత్రార్థం.

అతిదేశ ఇతి :- ఇది అతిదేశం (ఒకచోట చెప్పిన విషయమే మరొక చోట కూడ యథాతథంగా వర్తిస్తుందని చెప్పడం అతిదేశం). ఏతేన=ఈ అకాశవ్యాఖ్యానంచేత, మాతరిశ్వాపి=ఆకాశం ఆశ్రయంగా గల వాయువు కూడ, వ్యాఖ్యానింపబడినది. ఆ వాయువు విషయంలో కూడ యథాసంభవంగా ఈ పక్షాలను రచించాలి. ఛందోగుల ఉత్పత్తిప్రకరణంలో చెప్పకపోవడంవల్ల వాయువుకు ఉత్పత్తి లేదు అని ఒక పక్షం. తైత్తిరీయుల ఉత్పత్తిప్రకరణంలో "ఆకాశాద్వాయుః" అని ఉత్పత్తిపఠనం ఉంది అని మరొక పక్షం. పిమ్మట రెండు శ్రుతులకు విరోధం ఏర్పడినపుడు వాయువుకు ఉత్పత్తి అసంభవం గాన, వాయువుకు ఉత్పత్తిని చెప్పే శ్రుతి గౌణి అని మరొక అభిప్రాయం. వాయువుకు ఉత్పత్తి అసంభవం అనడానికి కారణ మేమనగా "సైషానస్తమితా దేవతా యద్వాయుః"(వాయువు అనేది అస్తమయం (వినాశం) లేని దేవత) అని అస్తమయనిషేధం, అమృతత్వాదులు వినబడడం కూడ. ప్రజ్ఞకు ఉపరోధం కలుగ గూడదు గాన, వికారాలన్నిటికీ విభాగం ఉంటుంది (విభాగం ఉన్న వన్నీ వికారాలు) అని అంగీకరించడంవల్ల వాయువు పుడుతుంది అని సిద్ధాంతం. అస్తమయనిషేధం అపరవిద్యకు (ఉపాసనావిధాయకమైన విద్యకు)సంబంధించినది ; ఇది కేవలం ఆపేక్షికం, (అనగా మిగిలిన పదార్థాల దృష్ట్యా వాయువు వినాశం లేకుండా చాలా కాలం ఉంటుందని మాత్రమే అర్థం) ఎందువల్లననగా అగ్న్యాదులకు వలె (అగ్ని కొంత సేపు మండి శాంతించినట్లు) వాయువుకు అస్తమయం లేదు. "అమృతం" ఇత్యాదులు చెప్పడానికి సమాధానం ఆకాశం విషయంలో చర్చించినపుడే చెప్పబడింది; అదే దీనికి కూడ సమాధానం అని అర్థం. (ప్రశ్న) ఉత్పత్తిప్రకరణంలో వాయువుయొక్క శ్రవణాశ్రవణాలు (ఉత్పత్తిని చెప్పడం చెప్పకపోవడం అనేవి) ముఖ్యమే అయినప్పుడు వాయ్వాకాశాలు రెండింటికీ సంబంధించి ఒకే అధికరణం చాలు గదా, విశేషం ఏదీ లేనప్పుడు అతిదేశం ఎందుకు? (సమాధానం) చెప్పబడుచున్నది. సత్యమే; ఇది అంతే. అయినా కూడ

మందబుద్ధులకు శ్రుతులలో వాయువును గూర్చి ఉన్న కొన్ని మాటలు వినగానే ఆశంక కలుగుతుం దని ఆ ఆశంకను తొలగించడం కోసం ఈ అతిదేశం చేయబడింది. వాయువు ఉపాసింపదగినవా డని సంవర్గవిద్యాదులలో వాయువుకు మహాభాగత్వం వినబడడంవల్ల, వాయువుకు అస్తమయం మొదలైనవి లేవని చెప్పడంవల్ల ఎవనికైనా వాయువు నిత్యము అనే ఆశంక కలగవచ్చును (అది నివారించడానికి ఈ అతిదేశం).

వి :- "సైషాఽనస్తమితా దేవతా యద్వాయుః" అనేది ముఖ్యమైన ఉత్పత్తి వాయువుకు లేదని చెప్పడానికి లింగం. అదే లింగం "వాయుశ్చాన్తరిక్షం చైతదమృతమ్" అని మళ్లీ చెప్పబడింది. "వాయురేవ వ్యష్టిః" "సమష్టిశ్చ" అని వాయువే సర్వాత్మ అని బృహదారణ్యకమే చెపుతున్నది. అట్లే సంవర్గ విద్యలో "వాయుర్వావైతాన్ సర్వాన గ్న్యాదీన్ సంహరతి" అని వాయువే అగ్న్యాదులను తనలో లీనం చేసుకొంటుంది అని చెప్పబడింది. ఈ శబ్దాలన్నీ విన్న మందబుద్ధులకు వాయువుకు ఉత్పత్తి లేదు అనే అభిప్రాయం కలగవచ్చును. తన్నివృత్తికై ఈ అతిదేశం అని భావం. 8

మాతరిశ్వాధికరణం సమాప్తం

### 3. అసంభవాధికరణమ్. సూ.9.

### సూ. అసంభవస్తు సతోఽనుపపత్తేః. 2.3.9

వియత్పవనయోరసంభావ్యమానజన్మనోరప్యుత్పత్తిముపశ్రుత్య బ్రహ్మణోఽపి భవేత్కుతశ్చిదుత్పత్తిరితి స్యాత్కస్య చిన్మతిః. తథా వికారేభ్య ఏవాకాశాదిభ్య ఉత్తరేషాం వికారాణాముత్పత్తిముపశ్రుత్యాకాశస్యాపి వికారాదేవ బ్రహ్మణః ఉత్పత్తిరితి కశ్చిన్మన్యేత. తామాశఙ్కామపనేతుమిదం సూత్రమ్ 'అసంభవస్తు' ఇతి. న ఖలు బ్రహ్మణః సదాత్మకస్య కుతశ్చిదన్యతః సంభవ ఉత్పత్తిరాశఙ్కితవ్యా. కస్మాత్? అనుపపత్తేః. సన్మాత్రం హి బ్రహ్మ, న తస్య సన్మాత్రాదేవోత్పత్తిః సంభవతి, అసత్యతిశయే ప్రకృతివికారభావానుపపత్తేః. నాపి సద్విశేషాత్; దృష్టవిపర్యయాత్. సామాన్యాద్ధి విశేషా ఉత్పద్యమానా దృశ్యన్తే మృదాదేర్ఘటాదయః. న తు విశేషేభ్యః సామాన్యమ్. నాప్యసతః, నిరాత్మకత్వాత్.

"కథమసతః సజ్జాయేత" (ఛా.. ఉ. 8.7.1) ఇతి ధాక్షేపశ్రవణాత్. "స కారణం కరణాధిపాధిపో న చాస్య కశ్చిజ్జనితా న చాధిపః" (శ్వే. ఉ. 6.9) ఇతి చ బ్రహ్మణో జనయితారం వారయతి. వియత్పవనయోః పునరుత్పత్తిః ప్రదర్శితా, న తు బ్రహ్మణః సాస్తీతి వైషమ్యమ్. న చ వికారేభ్యో వికారాన్తరోత్పత్తిదర్శనాత్ బ్రహ్మణోఽపి వికారత్వం భవితుమర్హతీతి, మూలప్రకృత్యనభ్యుప గమేఽనవస్థాప్రసంగాత్. యా మూలప్రకృతిరభ్యుపగమ్యతే తదేవ చ నో బ్రహ్మేత్యవిరోధః.9

బాలానందిని

అసంభవ ఇతి :- "అనుపపత్తేః= ఉపపత్తి లేకపోవడంవల్ల, సతః తు=సత్తైన బ్రహ్మకైతే, అసంభవః=ఉత్పత్తి లేదు" అని సూత్రార్థం.

అవ. "అనాద్యనన్తం మహతః పరం ధ్రువమ్" (క.ఉ.3.15), "న చాస్య కశ్చిజ్జనితా" (శ్వే. ఉ. 6.9) ఇత్యాదిశ్రుతులు బ్రహ్మ అనాది అని చెపుతున్నాయి. "త్వం జాతో భవసి విశ్వతోముఖః" ఇత్యాది శ్రుతులలో బ్రహ్మకు ఉత్పత్తి వర్ణించబడుచున్నది. వీటికి విరోధం ఉందా లేదా అని సందేహం. ఉంది అని పూర్వపక్షం. వాయ్వాదులకు ఉత్పత్తిశ్రుతిబలంచేత అమృతత్వం ఆపేక్షికం మాత్రమే అని చెప్పినట్లు బ్రహ్మయొక్క అనాదిత్వం కూడ ఆపేక్షికమే అని దృష్టాంతసంగతిచేత ఏకదేశిపక్షం చూపబడుతున్నది.

వియదితి:- ఊహించడానికి శక్యం కాని ఉత్పత్తి గల ఆకాశవాయువులకు కూడ ఉత్పత్తి ఉన్నట్లు విని బ్రహ్మకు కూడ ఏదో ఒక కారణంనుండి ఉత్పత్తి ఉండవచ్చునని ఎవనికైన అభిప్రాయం కలగవచ్చును. అట్లే వికారా లైన (బ్రహ్మాదికార్యాలైన) ఆకాశాదులనుండి తరువాతి వికారాల ఉత్పత్తి జరిగిన దని విని ఆకాశానికి కూడ, వికారమైన (దేనికో ఒకదానికి కార్యమైన), బ్రహ్మనుండి ఉత్పత్తి జరిగి ఉంటుందని ఎవడైన అనుకొనవచ్చును. ఆ ఆశంకను తొలగించుటకై "అసంభవస్తు" అనే సూత్రం చెప్పబడింది సద్రూపమైన బ్రహ్మకు కూడ మరొకదానినుండి దేనినుండో ఉత్పత్తి జరిగిన దని ఆశంకించకూడదు. ఎందువల్ల? అనుపపత్తివల్ల. బ్రహ్మ కేవలం సద్రూపం - ఉనికియే స్వభావం గలది. దానికి సన్మాత్రంనుండియే ఉత్పత్తి సంభవం కాదు. ఏదో కొంత అతిశయం (విశేషం) లేకపోతే ప్రకృతివికారభావం (ఒకటి మూలకారణ మనీ

రెండవది కార్యమనీ) కుదరదు కదా? (అందుచేత సన్మాత్రమైన బ్రహ్మ మరొక సన్మాత్రంనుండి పుట్ట దని అర్థం). బ్రహ్మ ఏదో ఒక సద్విశేషంనుండి పుట్టింది అనడం కూడ కుదరదు. అది కనబడుతున్నదానికి విరుద్ధం అవుతుంది. ఎందువల్ల ననగా - సామాన్యమైన మృత్తు మొదలైనవాటినుండి ఘటాదులైన విశేషాలు పుడుతున్నాయి గాని విశేషంనుండి సామాన్యం పుట్టడం లేదు. అసత్తునుండి కూడ బ్రహ్మ పుట్టదు. ఎందువల్ల ననగా -అసత్ స్వరూపరహిత మైనది. "కథమసతః సజ్జాయేత" (అసత్తునుండి సత్తు ఎలా పుడుతుంది) అని శ్రుతిలో ఆక్షేపం కూడ విన బడుతున్నది. "స...న చాధిపః" అను శ్రుతి బ్రహ్మను పుట్టించిన కారణం ఏదీ లేదని చెపుతున్నది. ఆకాశపవనాల కైతే ఉత్పత్తి ఉన్నట్లు (శ్రుతివాక్యం) చూపబడింది. బ్రహ్మ విషయంలో అలాంటి దేదీ లేదు. అందుచేత ఆ రెండింటికీ, దీనికీ వైషమ్యం ఉంది. కార్యాలైనవాటినుండి మాత్రమే కార్యాలు పుడుతున్నాయి గాన బ్రహ్మ కూడ కార్యమే అయి ఉండడం తగదు. ఏదో ఒకదానిని మూలకారణంగా అంగీకరించకపోతే అనవస్థ ఏర్పడుతుంది. (ఆకాశాదుల కారణం బ్రహ్మ, దానికి మరొకటి కారణం, దానికి మరొకటి, ఈ విధంగా అవస్థ లేకుండా పోతుంది). మీరు ఏది మూలప్రకృతి (మరొక కారణం లేని మూలకారణం) అని అంగీకరిస్తారో అదే మాకు బ్రహ్మ గాన విరోధం లేదు . 9.

అసంభవాధికరణం సమాప్తం

## 4. తేజోధికరణమ్. సూ .10

### సూ. తేజోऽతస్తథాహ్యాహ. 2.3.10.

ఛాన్దోగ్యే సన్మూలత్వం తేజసః శ్రావితమ్; తైత్తిరీయకే తు వాయుమూలత్వమ్. తత్ర తేజోయోనిం ప్రతి శ్రుతివిప్రతిపత్తౌ సత్యాం ప్రాప్తం తావద బ్రహ్మయోనికం తేజ ఇతి. కుతః? సదేవ ఇత్యుపక్రమ్య "తత్తేజోऽసృజత" ఇత్యుపదేశాత్. సర్వవిజ్ఞానప్రతిజ్ఞాయాశ్చ బ్రహ్మప్రభవత్వే సర్వస్య సంభవాత్. "తజ్జలాన్". (ఛా ఉ. 3.14.1) ఇతి చావిశేషశ్రుతేః. "ఏతస్మాజ్జాయతే ప్రాణః" (ము. ఉ. 2.1.3) ఇతి చోపక్రమ్య శ్రుత్యన్తరే సర్వస్యావిశేషేణ బ్రహ్మజత్వోపదేశాత్.

త్రైత్తిరీయకే చ "స తపస్తప్త్వా, ఇదం సర్వమసృజత, యదిదం కిం చ" (త్తై. ఉ. 3.6.1) ఇత్యవిశేషశ్రవణాత్. తస్మాత్ "వాయోరగ్నిః " ఇతి క్రమోపదేశో ద్రష్టవ్యో వాయోరనన్తరమగ్నిః సంభూతః ఇతి.

బాలానందిని

అవ. "తత్తేజోఽసృజత" (బ్రహ్మ తెజస్సును సృష్టించినది), "వాయోరగ్నిః" (వాయువునుండి అగ్ని పుట్టినది) అనే శ్రుతులకు విరోధం ఉందా లేదా అని సంశయం. సామాన్యంనుండి సామాన్యం పుట్టకపోయినా సామాన్యాలైన బ్రహ్మవాయువులనుండి తేజోరూపమైన విశేషం పుట్టవచ్చును గాన తుల్యబలాలైన ఈ రెండు శ్రుతులకు విరోధం అని పూర్వపక్షం. తేజస్సుకు బ్రహ్మయే ఉపాధానం. అందుచేత "వాయోరగ్నిః" అనేదానికి "వాయువు తరవాత బ్రహ్మనుండి అగ్ని పుట్టినది" అని అర్థం చెప్పాలి అని ఏకదేశిమతం. తరవాత సిద్ధాంతం.

తేజ ఇతి :- "తేజః=తేజస్సు, అతః=ఈ వాయువునుండి పుట్టినది. తథా=అట్లు, ఆహ హి=శ్రుతి చెప్పుచున్నది కదా?" అని సూత్రార్థం.

ఛాన్దోగ్య ఇతి:- తేజస్సు సత్ నుండియే పుట్టిన దని చాందోగ్యంలో చెప్పబడినది. త్తైత్తిరీయకంలో నైతే అది వాయుమూలకం అని చెప్పబడినది. ఈ విధంగా తేజస్సు యొక్క కారణాన్ని గూర్చి విప్రతిపత్తి కలగగా తేజస్సు బ్రహ్మనుండియే పుట్టినది అని ప్రాప్తించినది. ఎందువల్ల? " సదేవ" అని ఉపక్రమించి "తత్తేజోఽసృజత" అని ఉపదేశించడంవల్ల. సర్వమూ బ్రహ్మనుండియే పుట్టిన దని అంగీకరిస్తేనే సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ కుదురుతుంది. "తజ్జలాన్" అని అన్నీ బ్రహ్మనుండి పుట్టినట్లు చెప్పే శ్రుతి కూడ కనబడుచున్నది. " ఏతస్మాజ్జాయతే ప్రాణః" అని ఉపక్రమించి, మరొక శ్రుతిలో, సర్వమూ, ఏ విధమైన భేదమూ లేకుండా, బ్రహ్మ నుండియే పుట్టినట్లు వినబడుచున్నది. త్తైత్తిరీయకంలో కూడ "స తపస్తప్త్వా...కించ" అని ఆత్మయే అన్నింటినీ సృష్టించినట్లు వినబడుచున్నది. అందువల్ల "వాయోరగ్నిః" అనేది వాయువు తరవాత అగ్ని పుట్టినది అని క్రమాన్ని చెప్పేదిగానే గ్రహించాలి.

భాష్యమ్.

ఏవం ప్రాప్తే ఉచ్యతే - తేజోఽతో మాతరిశ్వనో జాయతే ఇతి. కస్మాత్? తథాహ్యాహ - "వాయోరగ్నిః" ఇతి. అవ్యవహితే హి తేజసో బ్రహ్మజత్వే సతి, అసతి వాయుజత్వే "వాయోరగ్నిః" ఇతీయం శ్రుతిః కదర్థితా స్యాత్. నను క్రమార్థైషా భవిష్య తీత్యుక్తమ్? నేతి బ్రూమః "తస్మాద్వా ఏతస్మా దాత్మనః ఆకాశః సంభూతః" (తై.ఉ.2.1.1.)ఇతి పురస్తాత్ సంభవత్యపాదానస్యాత్మనః పఞ్చమీనిర్దేశాత్. తస్యైవ చ సంభవతేరిహాధికారాత్. పరస్తా దపి చ తదధికారే "పృథి వ్యా ఓషధయః"(తై ఉ. 2.1.1)ఇత్యపాదానపఞ్చమీదర్శనాద్వాయోరగ్నిరిత్య పాదాన పఞ్చమ్యైవైషేతి గమ్యతే. అపి చ వాయోరూర్ధ్వమగ్నిః సంభూత ఇతి కల్ప్యః ఉపపదార్థయోగః; కౢప్తస్తు కారకార్థయోగః "వాయోరగ్నిః సంభూతః" ఇతి. తస్మాదేషా శ్రుతిః వాయుయోనిత్వం తేజసోఽవగమయతి.

బాలానందిని

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా చెప్పబడుచున్నది. తేజస్సు అతః=ఈ మాతరిశ్వనుండి, పుట్టుచున్నది. ఎందువల్ల? వాయోరగ్నిః అని (శ్రుతి) అట్లు చెప్పుచున్నది కదా? తేజస్సు బ్రహ్మనుండియే అవ్యవహితంగా, అనగా ప్రత్యక్షంగా, పుట్టినది అని అంగీకరిస్తే, అది వాయువునుండి పుట్టినదని చెప్పకపోతే, "వాయోరగ్నిః" అనే ఈ శ్రుతియొక్క అర్థం బాధిత మైపోతుంది. ఇది క్రమాన్ని చెపుతుంది అని చెప్పాం కదా? అది కుదర దంటాం "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" అని వెనుక పుట్టుకకు అపాదానమైన ఆత్మ పంచమీవిభక్తిలో నిర్దేశించబడింది. (దేనినుండి మరొకటి పుట్టిన దని చెప్పబడుతుందో అది అపాదానం ఇది వైయాకరుణు లిచ్చిన సంజ్ఞ. బ్రహ్మనుండి ఆకాశం పుట్టింది అన్నప్పుడు పుట్టడానికి బ్రహ్మ అపాదానం). ఆ సంపూర్వకభూధాతువే (సంభూతః అనే పదమే) ఇక్కడ కూడ (వాయోరగ్నిః అనే చోటకూడ) అధికారంచేత లభిస్తుంది. (ఒక పదం వెనుకనుండి ముందువాటిలోనికి కూడ వెళ్లడం అధికారం). ఈ వాక్యం తరవాత కూడ దాని (సంభూతశబ్దంయొక్క) అధికారంలోనే "పృథివ్యాః ఓషధయః" (పృథ్వినుండి

ఓషధులు పుట్టాయి.) అని అపాదానపంచమి (అపాదానం అనే సంజ్ఞ గల పదం పంచమీ విభక్తితో ఉపయోగించా లని వ్యాకరణనియమం) కనబడుతున్నది గాన వాయోరగ్నిః అన్న చోట కూడ ఇది అపాదానపంచమియే అని తెలుస్తూన్నది. మరొక విషయ మేమనగా - "వాయోరూర్ధ్వమగ్నిః" (వాయువు తరవాత అగ్ని పుట్టినది) అని ఊర్ధ్వమ్ అనే ఉపపదంయొక్క అర్థంతో సంబంధాన్ని, లేనిదానిని, కల్పించాలి. (ఒక పదానికి దగ్గర ఉండే పదం ఉపపదం). "వాయోః అగ్నిః సంభూతః అని కారకార్థంతో సంబంధ మైతే క్లప్తమై (సిద్ధమై) ఉంది. (వాయువునుండి అగ్ని పుట్టింది అన్నప్పుడు పుట్టడానికి వాయువు అపాదానం. అపాదానానికి పంచమీవిభక్తి చేర్పబడుతుంది. అపాదానం కారకాలలో ఒకటి. కర్త, కర్మ అపాదానం మొదలైనవాటికి కారకాలు అని వైయాకరణుల సంజ్ఞ. కారకం అక్కడ సిద్ధంగా ఉంది గాన దాని అర్థం కల్పించ నవసరం లేదు. వాయోః అనేదానిని షష్ఠీవిభక్తిగా గ్రహిస్తే ఊర్ధ్వమ్ అనే పదాన్ని, దాని అర్థాన్ని, లేనిదానిని, కల్పించుకోవాలి). అందువల్ల ఈ శ్రుతి తేజస్సుకు వాయువు కారణం అని తెలుపుతున్నది.

## భాష్యమ్

నన్వితరాపి శ్రుతిరబ్రహ్మయోనిత్వం తేజసోఽవగమయతి - "తత్తేజోఽసృజత" ఇతి. న. తస్యాః పారమ్పర్యార్థకత్వేఽవిరోధాత్. యదాఽపి హ్యాకాశం వాయుం చ సృష్ట్వా వాయుభావాపన్నం బ్రహ్మ తేజోఽసృజత ఇతి కల్ప్యతే, తదాపి బ్రహ్మజత్వం తేజసో న విరుధ్యతే. యథా- "తస్యాః శృతం తస్యా దధి, తస్యా ఆమిక్షా" ఇత్యాది. దర్శయతి చ బ్రహ్మణో వికారాత్మనాఽవ స్థానం "తదాత్మానం స్వయమకురుత"(తై.ఉ. 2.7.1) ఇతి. తథా చేశ్వరస్మరణం భవతి - "బుద్ధిర్జ్ఞానమసంమోహః" ఇత్యాద్యనుక్రమ్య" భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః" (భ.గీ. 10.5) ఇతి. యద్యపి బుద్ధ్యాదయః స్వకరణేభ్యః ప్రత్యక్షం భవన్తో దృశ్యన్తే తథాపి సర్వస్యాపి భావజాతస్య సాక్షాత్ ప్రణాడ్యా వా ఈశ్వరవంశ్యత్వాత్. ఏతేనాక్రమవత్సృష్టివాదిన్యః శ్రుతయో వ్యాఖ్యాతాః. తాసాం సర్వథోపపత్తేః. క్రమవత్సృష్టివాదినీనాం త్వన్యథానుపపత్తేః. ప్రతిజ్ఞాపి సద్వంశ్యత్వమాత్రమపేక్షతే నావ్యవహితజన్యత్వమిత్యవిరోధః. 10.

బాలానందిని

నన్వితి:- "తత్తేజోఽసృజత" అనే మరొక శ్రుతి తేజస్సుకు బ్రహ్మయే కారణమని చెపుతూన్నది కదా? కాదు. దానికి పారంపర్యార్థం చెప్పుకొన్నా విరోధం లేదు. ఆకాశాన్ని వాయువును సృష్టించి వాయుస్వరూపాన్ని పొంది ఉన్న బ్రహ్మ తేజస్సును సృష్టించింది అని చెప్పినా కూడ తేజస్సు బ్రహ్మనుండి పుట్టిన దని చెప్పడంలో విరోధం లేదు కదా ? "తస్యా...ఆమిక్షా" ఆవుయొక్క కాచిన పాలు, ఆవుయొక్క, పెరుగు, ఆవుయొక్క ఆమిక్ష) అని ఎట్లో ఇది కూడ అట్లే

వి. ఆమిక్ష అనగా పాలు పెరుగు కలిపి తోడుపెట్టి నప్పుడు ఆ పాలు విరిగి కొంత భాగం గట్టిగాను కొంత భాగం నీళ్లుగాను ఏర్పడుతుంది. గట్టిగా ఏర్పడినది ఆమిక్ష. ఆవునుండి ప్రత్యక్షంగా లభించినవి పాలు మాత్రమే. పాలనుండి పెరుగు, పెరుగునుండి ఆమిక్ష తయారయ్యాయి. అయినా కూడ ఆ పెరుగు ఆమిక్షా ఆవునుండే పుట్టినట్లు పారంపర్యేణ ఎలా చెప్పబడుతుందో అట్లే ఇక్కడ కూడ అని భావం.

దర్శయతీతి :-"తదాత్మానం స్వయమకురుత" (ఆ బ్రహ్మయే తనను వేరు రూపాలలో నిర్మించెను) అను శ్రుతి బ్రహ్మయే తన కార్యాల రూపంలో ఉన్నట్లు చూపు చున్నది. భగవద్గీతలో కూడ "బుద్ధిర్జ్ఞానమసంమోహః" అని ప్రారంభించి "భవన్తి. .పృథగ్విధాః" (భూతాలకు నా నుండియే వేరు వేరు భావాలు కలుగుతున్నాయి) అని చెప్పబడింది. బుద్ధి మొదలైనవి తమ తమ కారణాలనుండి పుడుతున్నట్లు ప్రత్యక్షంగా కనబడుతున్నా కూడ సమస్తవస్తువులూ కూడ సాక్షాత్తుగా గాని, పరంపరయాగాని ఈశ్వరుని వంశానికి సంబంధించినవే కదా? (అందుచేత అన్నీ తననుండే పుట్టుచున్నాయని శ్రీకృష్ణుడు చెప్పాడని భావం). దీనిచేత క్రమం చెప్పని సృష్టివాక్యాలు (అన్నీ బ్రహ్మనుండి పుట్టాయి అని చెప్పే వాక్యాలు) వ్యాఖ్యానింపబడినట్లే. ఆ వాక్యాలు అన్ని విధాలా కుదు రుతాయి. క్రమాన్ని చెప్పే సృష్టివాక్యాలైతే ఆ క్రమాన్ని అంగీకరించకపోతే కుదరవు. సర్వవిజ్ఞానప్రతిజ్ఞ కూడ జగత్తులోని వస్తువులన్నీ సత్పదార్థంయొక్క వంశానికి చెందిన వని చెప్పడంచేతనే కుదురుతుంది. అందుకొరకై అవన్నీ బ్రహ్మనుండియే ప్రత్యక్షంగా పుట్టాయని చెప్పవలసిన అవసరం లేదు. అందుచేత శ్రుతివాక్యాలకు పరస్పరవిరోధం లేదు. 10.

తేజోధికరణం సమాప్తం

## 5. అబధికరణమ్. సూ. 11

## సూ. ఆపః. 2.3.11

"అతస్తథాహ్యాహ" ఇత్యనువర్తతే. ఆపస్తతస్తేజసో జాయన్తే. కస్మాత్? తథాహ్యాహ-"తదపోఽసృజత" ఇతి "అగ్నేరాపః" ఇతి చ. సతి వచనే నాస్తి సంశయః. తేజసస్తు సృష్టిం వాఖ్యాయ పృథివ్యా వ్యాఖ్యాస్యన్నపోఽన్తర్ణ యామీత్యాప ఇతి సూత్రయామ్బభూవ. 11

### బాలానందిని

ఆప ఇతి:- "ఆపః= ఉదకం తేజస్సువల్ల పుట్టినది" అని సూత్రార్థం.

అత ఇతి:- "అతస్తథాహ్యాహ" అనే పదాలు పూర్వసూత్రంనుండి ఈ సూత్రంలోనికి అనువర్తిస్తాయి. ఉదకం, అతః=ఈ తేజస్సునుండి పుట్టుచున్నది. ఎందువల్ల? "తదపోఽసృజత" అను శ్రుత్తి "అగ్నేరాపః" అను శ్రుతి అలా చెప్పుచున్నాయి కదా? శ్రుతివాక్యం ఉన్నప్పుడు సంశయానికి తావు లేదు. తేజస్సుకు సృష్టి ఉందని ప్రతిపాదించి, పృథ్వియొక్క సృష్టిని ప్రతిపాదించనున్నవాడై మధ్యలో ఉదకాన్ని గూర్చి చెపుదా మనే అభిప్రాయంతో సూత్రకారుడు అపః అని సూత్రించాడు.

వి:- ఇది అతిదేశసూత్రం - బ్రహ్మ ఉదకాన్ని సృష్టించిన దని చెప్పే శ్రుతికి, అగ్ని నుండి ఉదకం ఉద్భవించిన దని చెప్పే శ్రుతికీ విరోధం ఉందని పూర్వపక్షం. ఉదకం అగ్నిచేత దహించబడి పోతుంది గాన అది అగ్నినుండి పుట్టడం అసంభావ్యం అని అధికమైన శంక. సమాధానం స్పష్టం.

అబధికరణం సమాప్తం

### 6. పృథివ్యధికారాధికరణమ్. సూ. 12

### సూ.పృథివ్యధికారరూపశబ్దాన్తరేభ్యః. 2.3.12

"తా ఆప ఐక్షన్త బహ్వ్యః స్యామ ప్రజాయేమహీతి తే అన్నమసృజన్త" (ఛా. ఉ. 6.2.4) ఇతి శ్రూయతే. తత్ర సంశయః - కిమనేనాన్న శబ్దేన వ్రీహియవాద్య భ్యవహార్యం వా ఓదనాద్యుచ్యతే కిం వా పృథివీతి. తత్ర ప్రాప్తం తావ ద్వ్రీహియవాద్యోదనాది వా పరిగ్రహీతవ్యమితి, తత్ర హ్యన్నశబ్దః ప్రసిద్ధో లోకే. వాక్యశేషోఽప్యేతమర్థముపోద్బలయతి "తస్మాద్యత్ర క్వ చ వర్షతి తదేవ భూయిష్ఠమన్నం భవతి" (ఛా. ఉ. 6.2.4) ఇతి.

ఏవం ప్రాప్తే బ్రూమః- పృథివ్యేవేయమన్నశబ్దేనాద్భ్యో జాయమానా వివక్ష్య త ఇతి. కస్మాత్? అధికారాత్, రూపాత్, శబ్దాన్తరాచ్చ. అధికారస్తావత్ - "తత్తేజోఽసృజత" "తదపోఽసృజత" ఇతి మహాభూతవిషయో వర్తతే - తత్ర క్రమప్రాప్తాం పృథివీం మహాభూతం విలఙ్ఘ్య నాకస్మాద్వ్రీహ్యాదిపరిగ్రహో న్యాయ్యః. తథా రూపమపి వాక్యశేషే పృథివ్యనుగుణం దృశ్యతే - "యత్కృష్ణం తదన్నస్య" ఇతి. నహ్యోదనాదేరభ్యవహార్యస్య కృష్ణత్వనియమోఽస్తి. నాపి వ్రీహ్యాదీనామ్. నను పృథివ్యా అపి నైవ కృష్ణత్వనియమోఽస్తి, పయఃపాణ్డురస్యాఙ్గారరోహితస్య చ క్షేత్రస్య దర్శనాత్. నాయం దోషః. బాహులాపేక్షత్వాత్. భూయిష్ఠం హి పృథివ్యాః కృష్ణం రూపం న తథా శ్వేతరోహితే - పౌరాణికా అపి పృథివీఛాయాం శర్వరీముపదిశన్తి. సా చ కృష్ణాభాసేత్యతః కృష్ణం రూపం పృథివ్యా ఇతి శ్లిష్యతే. శ్రుత్యన్తరమపి సమానాధికారమ్ "అద్భ్యః పృథివీ" ఇతి భవతి "తద్యదపాం శర ఆసీత్తత్సమహన్యత సా పృథివ్యభవత్" (బృ. ఉ. 1.2.2) ఇతి చ. పృథివ్యాస్తు వ్రీహ్యాదేరుత్పత్తిం దర్శయతి -" పృథివ్యా ఓషధయః ఓషధీభ్యోఽన్నమ్" ఇతి చ. ఏవ మధికారాదిషు పృథివ్యాః ప్రతిపాదకేషు సత్సు కుతో వ్రీహ్యాదిప్రతిపత్తిః? ప్రసిద్ధిరప్యధికారాదిభి రేవ బాధ్యతే. వాక్యశేషోఽపి పార్థివత్వాదన్నాద్యస్య

తద్ద్వారేణ పృథివ్యా ఏవాద్భ్యః ప్రభవత్వం సూచయతీతి ద్రష్టవ్యమ్. తస్మాత్పృథివీయమన్నశబ్దేతి. 12.

బాలానందిని

పృథివీతి :- "అధికారరూపశబ్దాన్తరేభ్యః=ప్రకరణంవల్ల రూపంవల్ల ఇతర శ్రుతుల వల్ల, పృథివీ=భూమి పుట్టుచున్నది" అని సూత్రార్థం.

తా ఇతి :- "తా...అసృజన్త" (అనేకములు అవుదాం, (అనేకరూపాలు) సృష్టిద్దాం అని ఆ నీళ్లు తలచాయి. అలా తలచి అవి అన్నం సృజించాయి) అని శ్రుతి వినబడుచున్నది. (ఇది విషయవాక్యం) అక్కడ ఈ అన్నశబ్దంచేత వరిధాన్యం యవలు మొదలైనవి చెప్పబడుచున్నాయా, తినదగిన ఓదనం (వరి అన్నం) మొదలైనవి చెప్పబడుచున్నాయా లేక పృథివి చెప్పబడుచున్నదా అని సంశయం. అన్నశబ్దానికి వ్రీహియవాదులు లేదా ఓదనం అనే అర్థాలు ప్రసిద్ధంగా ఉన్నాయి. అందుచేత ఆ అర్థమే గ్రహించా లని ప్రాప్తిస్తున్నది. "తస్మాద్యత్ర... భవతి" (అందువల్ల ఎక్కడైతే వర్షం పడుతుందో అక్కడ అన్నం అధికంగా ఉంటుంది) అనే వాక్యశేషం (చివర నున్న వాక్యం) కూడ ఈ అర్థాన్ని సమర్థిస్తూన్నది. వర్షం పడితే వ్రీహియవాదులే అధిక మౌతాయి కాని భూమి కాదు కదా?

వి. ఈ విధంగా అన్నశబ్దానికి వ్రీహియవాదికం అనే అర్థం చెపితే "అద్భ్యః పృథివీ" అని వాక్యంతో విరోధం అని పూర్వపక్షం. వెనుక చెప్పిన ఉదకానికీ ఈ అధికరణంలో చెప్పిన పృథివికీ కార్యకారణభావం ఉంది గాన అదే అధికరణసంగతి.

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా చెపుతున్నాం. ఉదకంనుండి పుడుతున్న ఇది పృథివియే. అదే అన్నశబ్దంచేత చెప్పడానికి ఉద్దిష్టమైనది. ఎందువల్ల? అధికారంవల్ల, రూపంవల్ల, శబ్దంవల్ల. "తత్తేజోऽసృజత", "తదపోऽసృజత" అని మహాభూతాల అధికారం (వాటిని గూర్చిన ప్రకరణం). అందుచేత క్రమాన్ని పట్టి వచ్చిన మహాభూత మైన పృథివిని కాదని అకస్మాత్తుగా వ్రీహ్యాదులను గ్రహించడం న్యాయ్యం కాదు. వాక్యశేషంలో "యత్కృష్ణం తదన్నస్య" (కృష్ణరూపం ఏదైతే ఉందో అది అన్నానిది) అని పృథివికి అనుగుణమైన రూపమే కనబడుతున్నది. తినదగిన ఓదనాదులకు గాని

వ్రీహ్యాదులకు గాని కృష్ణరూపమే ఉంటుందనే నియమం లేదు కదా? (ప్రశ్న) పాలవలె తెల్లనైన, కణ కణ లాడే బొగ్గు నిప్పు వలె ఎఱ్ఱనైన పొలాలు కనబడడంచేత భూమి రూపం కూడ నల్లగా ఉంటుందనే నియమం లేదు కదా? (సమాధానం) ఇది దోషం కాదు. బాహుల్యాన్ని పట్టి ఇలా చెప్పబడింది. భూమి రంగు చాల వరకు నల్లగానే ఉంటుంది కాని శ్వేతరోహితవర్ణాలు అంత అధికంగా ఉండవు కదా? పౌరాణికులు కూడ రాత్రి భూమియొక్క ఛాయ (కాంతి) అని అంటారు. రాత్రి కాంతి నల్లగానే ఉంటుంది. అందుచేత పృథివియొక్క రూపం నల్లనిది అని చెప్పడమే యుక్తంగా ఉంటుంది.

వి:-ఛాయా శబ్దానికి నీడ అని అర్థం చెపితే వస్తువు ఏరంగులో ఉన్నా దాని నీడ నల్లగానే ఉంటుంది గాన ఇక్కడ కాంతి అనే అర్థం చెప్పబడింది. వ్యాఖ్యానాలలో దీనికి అర్థం వ్రాయలేదు.

శ్రుత్యన్తరమితి :-సమానమైన ప్రకరణంలో ఉన్న మరొక శ్రుతి కూడ "అద్భ్యః పృథివీ" అని ఉన్నది. "తద్యదపాం....అభవత్" (నీళ్లలోని మడ్డివంటి పదార్థం భూమి అయింది) అని కూడ (బృహదారణ్యకోపనిషత్తులో) ఉన్నది. "పృథివ్యా....అన్నమ్" అనే వాక్యం పృథివినుండి వ్రీహ్యాదుల పుడుతున్నట్లు చెపుతున్నది. ఈ విధంగా పృథివిని ప్రతిపాదించే అధికారాదులు (ప్రకరణాదులు) ఉంటూండగా వ్రీహ్యాదులను గ్రహించడం ఎట్లు? (అన్నశబ్దానికి ఓదనాదులయం దున్న) ప్రసిద్ధి కూడ అధికారాదులచేతనే బాధించబడుతుంది. ("తస్మాద్యత్ర క్వ చ వర్షతి "ఇత్యాది) వాక్యశేషం కూడ అన్నాదికం పార్థివం గాన (పృథివీజన్యం గాన) వాటిని చెప్పడం ద్వారా పృథివి ఉదకంనుంచి పుట్టింది అనే విషయాన్నే సూచిస్తూన్నదని గ్రహించాలి. అందుచేత అన్నశబ్దంచేత చెప్పబడేది ఈ పృథివియే. 12.

పృథివ్యధికారాధికరణం సమాప్తం

## 7. తదభిధ్యానాధికరణమ్. సూ. 13.

### సూ.తదభిధ్యానాదేవ తు తల్లిఙ్గాత్సః. 2.3.13.

కిమిమాని వియదీదీని భూతాని స్వయమేవ స్వవికారాన్ సృజన్తి ఆహో స్విత్పరమేశ్వర ఏవ తేన తేనాత్మనావతిష్ఠమానోఽభిధ్యాయంస్తం తం వికారం సృజతీతి సందేహే సతి ప్రాప్తం తావత్స్వయమేవ సృజన్తీతి. కుతః? "ఆకాశాద్వాయుః వాయోరగ్నిః" ఇత్యాదిస్వాతన్త్ర్యశ్రవణాత్. నన్వచేతనానాం స్వతన్త్రాణాం ప్రవృత్తిః ప్రతిషిద్ధా? నైష దోషః. "తత్తేజ ఐక్షత" "తా అప ఐక్షన్త" (ఛా ఉ. 6.2.4) ఇతి చ భూతానామపి చేతనత్వశ్రవణాదితి.

ఏవం ప్రాప్తేఽభిధీయతే. స ఏవ పరమేశ్వరః తేన తేన ఆత్మనా అవతిష్ఠమానః అభిధ్యాయంస్తం తం వికారం సృజతీతి. కుతః? తల్లిఙ్గాత్. తథాహి శాస్త్రమ్ "యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరో యం పృథివీ న వేద యస్య పృథివీ శరీరం యః పృథివీమన్తరో యమయతి" (బృ.ఉ.3.7.3) ఇత్యేవంజాతీయకం సాధ్యక్షాణామేవ భూతానాం ప్రవృత్తిం దర్శయతి. తథా "సోఽకామయత బహు స్యాం ప్రజాయేయ" ఇతి ప్రస్తుత్య "సచ్చ త్యచ్చాభవత్, తదాత్మానం స్వయమకురుత" (తె.ఉ.2.6.1) ఇతి చ తస్యైవ చ సర్వాత్మభావం దర్శయతి. యత్త్వీక్షణమప్తేజసోస్తత్పరమేశ్వరావేశవశాదేవ ద్రష్టవ్యమ్- "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" (బృ.ఉ.3.7.23) ఇతీక్షిత్రన్తర ప్రతిషేధాత్. ప్రకృతత్వాచ్చ సతః ఈక్షితుః "తదైక్షత బహు స్యాం ప్రజాయేయ" ఇత్యత్ర. 13.

#### బాలానందిని

తదితి:-"సః=పరమాత్మ, తదభిధ్యానాదేవ తు=ఆ యా కార్యములకు సంబంధించిన ఈక్షణం (ఆలోచన) వల్ల, వాయ్వాదులను సృజిస్తున్నాడు. తల్లిఙ్గాత్=ఆ పరమేశ్వరునికి సంబంధించిన లింగం శ్రుతులలో ఉంది గదా" అని సూత్రార్థం.

కిమితి :- ఈ వియదాదిభూతాలు స్వయంగానే తమ తమ కార్యాలను సృజిస్తాయా

లేక పరమేశ్వరుడే ఆ యా రూపాలలో ఉంటూ, ఆలోచిస్తూ, ఆ యా వికారాన్ని సృజిస్తాడా అని సందేహం కలగగా భూతాలే స్వయంగా సృజిస్తాయని ప్రాప్తించింది. ఎందువల్ల? "ఆకాశాద్వాయుర్వాయోరగ్నిః" ఇత్యాదివిధంగా వాటికే స్వాతంత్ర్యం వినబడుతున్నందువల్ల అచేతనాలు స్వతంత్రంగా ప్రవర్తించడం అసంభావ్యం కదా? ఈ దోషం లేదు. "తత్తేజ ఐక్షత తా అప ఐక్షన్త" అని భూతాలు కూడ చేతనా లని శ్రుతిలో వినబడుతున్నది.

వి:- పైన చెప్పిన భూతాలను గూర్చి విచారణ చేయబడుతున్నది గాన ఆశ్రయాశ్రయిభావసంగతి. "ఆకాశాద్వాయుః" ఇత్యాది శ్రుతులు ఆకాశాదులు నిరపేక్షంగా తమ కార్యాలను సృజిస్తున్నాయి అని చెపుతున్నాయి. "తదాత్మానం స్వయమకురుత" ఇత్యాదిశ్రుతులు నిరపేక్షమైన బ్రహ్మ వీటి నన్నింటినీ సృష్టిస్తున్నట్లు చెపుతున్నాయి అందుచేత శ్రుతులకు విరోధం అని పూర్వపక్షం.

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా చెప్పబడుచున్నది. ఆ పరమేశ్వరుడే ఆ యా స్వరూపంతో ఉంటూ, ఆలోచిస్తూ ఆ యా వికారాన్ని సృజిస్తున్నాడు. ఎందువల్ల? అట్టి లింగం ఉండడంవల్ల. అదెట్లనగా. "యః...యమయతి" ఇత్యాదివిధమైన శాస్త్రం అధ్యక్షులతో (అధిష్ఠాన దేవతలతో) కూడిన భూతాలే ప్రవర్తిస్తున్నాయని చూపుచున్నది. అట్లే "సోఽకామయత బహు స్యాం ప్రజాయేయ" అని ప్రారంభించి "సచ్చ త్యచ్చాభవత్," "తదాత్మానం స్వయమకురుత" అని ఆ బ్రహ్మయే సర్వాత్మ అయిన దని చూపుచున్నది. ఉదకము తేజస్సు ఈక్షణం చేసినట్లు ఏది వినబడుచున్నదో అది పరమేశ్వరుని వశంచేతనే అని తెలుసుకోవాలి. "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" అని చూచేవాడు మరొక డెవడూ లేడని చెప్పబడింది కదా. "తదైక్షత బహు స్యాం ప్రజాయేయ" అని శ్రుతిలో సత్తే (సత్ అయిన బ్రహ్మయే) ఈక్షితగా ప్రకృతమైనది కదా? (అందుచేత అప్-తేజస్సులు ఈక్షించినవి అని చెప్పినప్పుడు కూడ ఆ ఈక్షిత అప్-తేజోరూపంలో ఉన్న బ్రహ్మయే అని అర్థం.13.

తదభిధ్యానాధికరణం సమాప్తం

## 8. విపర్యయాధికరణమ్. సూ.14

### సూ. విపర్యయేణ తు క్రమోఽత ఉపపత్తేః. 2.3.14.

భూతానాముత్పత్తిక్రమశ్చిన్తితః. అథేదానీమప్యయక్రమశ్చిన్త్యతే- కిమనియతేన క్రమేణాప్యయ ఉతోత్పత్తిక్రమేణాథవా తద్విపరీతేనేతి. త్రయోఽపి చోత్పత్తిస్థితిప్రలయా భూతానాం బ్రహ్మాయత్తాః శ్రూయన్తే- "యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ప్రయన్త్యభిసంవిశన్తి" (తై.ఉ.3-1-1)ఇతి. తత్రానియమోఽవిశేషాదితి ప్రాప్తమ్.. అథవా-ఉత్పత్తేః క్రమస్య శ్రుతత్వాత్ ప్రలయస్యాపి క్రమాకాఙ్క్షిణః స ఏవ క్రమః స్యాదితి.

ఏవం ప్రాప్తే బ్రూమః- విపర్యయేణ తు ప్రలయక్రమః అత ఉత్పత్తిక్రమాద్భవితుమర్హతి. తథా హి లోకే దృశ్యతే యేన క్రమేణ సోపానమారూఢస్తతో విపరీతేన క్రమేణావరోహతీతి. అపి చ దృశ్యతే మృదో జాతం ఘటశరావాద్యప్యయకాలే మృద్భావమపే త్యద్భ్యశ్చ జాతం హిమకరకాది అబ్భావమప్యేతీతి. అతశ్చోపపద్యత ఏతత్ పృథివ్యద్భ్యో జాతా సతీ స్థితికాలవ్యతిక్రాన్తావపోఽపీయాదాపశ్చ తేజసో జాతాః సత్యస్తేజోఽపీయుః. ఏవం క్రమేణ సూక్ష్మం సూక్ష్మతరం చ అనన్తరమనన్తరం కారణమపీత్య సర్వం కార్యజాతం పరమకారణం పరమసూక్ష్మం చ బ్రహ్మాప్యేతీతి వేదితవ్యమ్. న హి స్వకారణవ్యతిక్రమేణ కారణకారణే కార్యాప్యయో న్యాయ్యః. స్మృతావప్యుత్పత్తి క్రమవ్యతిరేకేణైవ అప్యయ క్రమస్తత్ర తత్ర దర్శితః-

"జగత్ప్రతిష్ఠా దేవర్షే పృథివ్యప్సు ప్రలీయతే,

జ్యోతిష్యాపః ప్రలీయన్తే జ్యోతిర్వాయౌ ప్రలీయతే" (శాంతి పర్వ. 339.29)

ఇత్యేదమాదౌ. ఉత్పత్తి క్రమస్తూత్పత్తావేవ శ్రుతత్వాన్నాప్యయే భవితుమర్హతి. న చాసావయోగ్యత్వాదప్యయేనాకాఙ్క్ష్యతే. న హి కార్యే ధ్రియమాణే కారణ

స్యాప్యయో యుక్తః. కారణాప్యయే కార్యావస్థాన స్యానుపపత్తేః. కార్యాప్యయే తు కారణస్యావస్థానం యుక్తమ్, మృదాదిష్వేవం దృష్టత్వాత్. 14.

బాలానందిని

విపర్యయేణేతి :- "క్రమః తు-ప్రలయక్రమ మైతే. విపర్యయేణ=సృష్టిక్రమానికి విపర్యయంగా జరుగుతుంది. ఉపపద్యతే చ=ఇది యుక్తం కూడ" అని సూత్రార్థం.

ఉత్పత్తి క్రమాన్ని గూర్చి చర్చించి నప్పుడు ప్రలయక్రమం బుద్ధిస్థం అవుతుది గాన ప్రసంగసంగతిచేత ఈ అధికరణంలో ప్రలయాన్ని గూర్చి చెప్పబడుచున్నది. భూతానామితి:- భూతాల ఉత్పత్తిక్రమం చింతించబడింది. ఇప్పుడు వాటి ప్రలయక్రమం చింతించబడుచున్నది. భూతాల విలయం నియతమైన క్రమం ఏదీ లేకుండా జరుగుతుందా, ఉత్పత్తి క్రమంచేతనే జరుగుతుందా, లేదా దానికి విపరీత మైన క్రమంచేత జరుగుతుందా? "యతో...సంవిశన్తి" అని భూతాల ఉత్పత్తిస్థితిప్రలయాలు మూడూ కూడ బ్రహ్మమీద ఆధారపడి ఉన్నాయని వినబడుచున్నది. విశేషం ఏదీ లేదు గాన క్రమంలో నియమం ఏదీ ఉండదు అని ప్రాప్తించినది. లేదా ఉత్పత్తికి ఒక క్రమం వినబడుతున్నది గాన ప్రలయానికి ఏ క్రమం అని ఆకాంక్ష కలిగినప్పుడు ఆ క్రమమే చెప్పవచ్చును.

ఇలా ప్రాప్తించగా--చెప్పుచున్నాము. ప్రలయక్రమం ఉత్పత్తిక్రమానికి విపరీతంగా జరగడం యుక్తం. ఎందువల్ల ననగా లోకంలో ఏ క్రమంలో మెట్లు ఎక్కుతాడో దానికి విపరీతమైన క్రమంచేతనే దిగుతాడు అనేది చూడబడుచున్నది. అంతే కాకుండా- మట్టినుంచి పుట్టిన ఘటశరావాదికం వినాశకాలంలో మట్టిగా అవుతున్నది. జలంనుంచి పుట్టిన మంచు, వడగళ్లు మొదలైనవి నీరుగా అయిపోతున్నాయి. అందువల్ల ఉదకం నుండి పుట్టిన పృథివి లయకాలంలో ఉదంకలో లీనమవడం, తేజస్సునుండి పుట్టిన ఉదకం తేజస్సులో లీనమవడం యుక్తం. ఈ విధంగా సూక్ష్మం సూక్ష్మతరం అయిన సమస్తమైన కార్యసముదాయమూ కూడ క్రమంగా తన తరువాతిది, దాని తరువాతిది అయిన కారణంలో ప్రవేశించి చివరికి పరమకారణము, పరమసూక్ష్మమూ అయిన బ్రహ్మను చేరుతుంది. బ్రహ్మలో విలీనం అవుతుంది అని తెలుసుకోవాలి. కార్యం తన

దగ్గరి కారణాన్ని అతిక్రమించి తన కారణానికి కారణమైనదానిలో లీనం అవడం న్యాయ్యం కాదు కదా. (ఏ కార్యమైనా ముందుగా తన కారణంలో లీనం కావాలి. ఆ కారణం తన కారణంలో నిలీనం కావాలి. అంతే కాని కార్యం తన ప్రత్యక్షకారణాన్ని విడిచి దాని కారణంలో విలీనం అవడం ఉండదు). స్మృతిలో కూడ అక్కడక్కడ ఉత్పత్తి క్రమానికి విపరీతంగానే లయక్రమం "జగత్ప్రతిష్ఠా...ప్రలీయతే" (దేవర్షీ! జగత్తుకు ఆధారమైన పృథివి జలంలో విలీనం అవుతుంది. జలం జ్యోతిస్సులో విలీనం అవుతుంది. జ్యోతిస్సు వాయువులో విలీనం అవుతుంది) ఇత్యాదివాక్యాలలో చూపబడింది. ఉత్పత్తివిషయంలో మాత్రమే చెప్పబడిన ఉత్పత్తిక్రమం ప్రలయంలో ఉండడం కుదరదు. ఈ క్రమం అయోగ్యం అవడంచేత, ప్రలయంచేత అకాంక్షించబడదు. కార్యం నిలిచి ఉండగా కారణం నశించడం యుక్తం కాదు కదా? కారణం నశించిన తరవాత కార్యం ఉండజాలదు కదా? కార్యం నశిస్తే మాత్రం కారణం ఉండడం యుక్తమే. మృదాదుల విషయంలో ఇలా కనబడుతున్నది కదా? 14.

విపర్యయాధికరణం సమాప్తం.

### 9. అన్తరావిజ్ఞానాధికరణమ్. సూ. 15

**సూ. అన్తరా విజ్ఞానమనసీ క్రమేణ తల్లిఙ్గాదితి చేన్నావిశేషాత్. 2.3.15**

భూతానాముత్పత్తిప్రలయౌ అనులోమప్రతిలోమాభ్యాం భవత ఇత్యుక్తమ్. ఆత్మాదిరుత్పత్తిః ప్రలయశ్చాత్మాన్త ఇత్యప్యుక్తమ్. సేన్ద్రియస్య తు మనసో బుద్ధేశ్చ సద్భావః ప్రసిద్ధః శ్రుతిస్మృత్యోః, "బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ. ఇన్ద్రియాణి హయానాహుః" (క.ఉ.3.3) ఇత్యాదిలిఙ్గేభ్యః. తయోరపి కస్మింశ్చిదన్తరాలే క్రమేణోత్పత్తిప్రలయౌ ఉపసంగ్రాహ్యౌ, సర్వస్య వస్తుజాతస్య బ్రహ్మజత్వాభ్యుపగమాత్. అపి చాథర్వణే ఉత్పత్తిప్రకరణే భూతానామాత్మనశ్చాన్తరాలే కరణాన్యనుక్రమ్యన్తే-

ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేన్ద్రియాణి చ,
ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ (ము. ఉ. 2.1.3)

ఇతి. తస్మాత్పూర్వోక్తోత్పత్తిప్రలయక్రమభఙ్గప్రసఙ్గో భూతానామితి చేత్ న. అవిశేషాత్. యది తావద్భౌతికాని కరణాని తతో భూతోత్పత్తి ప్రలయాభ్యామేవైషాముత్పత్తిప్రలయౌ భవత ఇతి నైతయోః క్రమాన్తరం మృగ్యమ్. భవతి చ భౌతికత్వే లిఙ్గం కరణానామ్ - "అన్నమయం హి సోమ్య మన అపోమయః ప్రాణస్తేజోమయీ వాక్" (ఛా.ఉ.6.5.4) ఇత్యేవంజాతీయకమ్. వ్యపదేశోఽపి క్వచిద్భూతానాం కరణానాం చ బ్రాహ్మణపరివ్రాజకన్యాయేన నేతవ్యః. అథ త్వభౌతికాని కరణాని తథాపి భూతోత్పత్తి క్రమో న కరణైర్విశిష్యతే. ప్రథమం కరణాన్యుత్పద్యన్తే చరమం భూతాని, ప్రథమం వా భూతాన్యుత్పద్యన్తే చరమం వా కరణానీతి. ఆథర్వణే తు సమామ్నాయక్రమమాత్రం కరణానాం భూతానాం చ, న తత్రోత్పత్తిక్రమ ఉచ్యతే. తథాన్యత్రాపి పృథగేవ భూతక్రమాత్కరణక్రమ ఆమ్నాయతే "ప్రజాపతిర్వా ఇదమగ్ర ఆసీత్స ఆత్మానమైక్షత స మనోఽసృజత తన్మన ఏవాసీత్తదాత్మానమైక్షత తద్వాచమసృజత" (ఛా. ఉ. 6.5.4) ఇత్యాదినా. తస్మాన్నాస్తి భూతోత్పత్తిక్రమస్య భఙ్గః 15.

బాలానందిని

అన్తరేతి:- తల్లిఙ్గాత్= వాటిని సూచించే శ్రుతివాక్యంవల్ల, విజ్ఞానమనసీ=ఇంద్రియ సహితబుద్ధి, మనస్సూ కూడ, అన్తరా=ఆత్మకు భూతాలకు మధ్య, క్రమేణ=క్రమంచేత చెప్పబడినవి; ఇతి చేత్=అన్నట్లయితే, న=కాదు, అశేషాత్=విశేషం ఏదీ లేదు కదా" అని సూత్రార్థం.

వి:- పైన చెప్పిన భూతాల ఉత్పత్తిప్రలయక్రమం మధ్యయందు చెప్పబడిన ఇంద్రియాదుల ఉత్పత్తిని పట్టి విరుద్ధం అవుతుంది కదా అని సందేహం. అవుతుందని పూర్వపక్షం. కాదని సిద్ధాంతం. పూర్వోత్తరాధికరణాలకి ఆక్షేపసంగతి.

భూతానామితి :- భూతాల ఉత్పత్తిప్రలయాలు అనులోమప్రతిలోమక్రమాలలో అవుతాయి అని చెప్పబడింది. ఆత్మనుండి ఆకాశం, ఆకాశంనుండి వాయువు. వాయువు నుండి అగ్ని, అగ్నినుండి ఉదకం, ఉదకంనుండి పృథివి అనే ఉత్పత్తిక్రమానికి విలోమంగా

పృథివి ఉదకంలోను, ఉదకం అగ్నిలోను, అగ్నివాయువులోను వాయువు అకాశంలోను ఆకాశం ఆత్మలోనులీనం అవుతాయని చెప్పబడింది). ఉత్పత్తి ఆత్మతో ప్రారంభిస్తుంది. ప్రలయం ఆత్మతో అంతమవుతుంది అని చెప్పబడింది. ఇంద్రియాలతో కూడిన మనస్సు, బుద్ధి కూడ ఉన్నట్లు శ్రుతిస్మృతులలో ప్రసిద్ధంగా ఉంది. "బుద్ధిం తు..అహః" ఇత్యాదివాక్యాలే వాటికి లింగాలు. ఈ మనోబుద్ధులు కూడ ఎక్కడో ఒక చోట మధ్యలో పుట్టాయని, ప్రలయం పొందుతాయనీ అంగీకరించాలి. ఎందువల్ల ననగా సకల వస్తువులూ బ్రహ్మనుండి పుట్టాయని అగీకరించాలి. మరొక విషయమేమనగా అథర్వణంలోని ఉత్పత్తి ప్రకణంలో భూతాలకీ ఆత్మకీ మధ్య కరణాలు "ఏతస్మాత్...ధారిణీ" అనే వాక్యంలో చెప్పద్డాయి. అందుచేత (ఆత్మనుండి భూతాలకంటె ముందుగా ప్రాణ మనస్-ఇంద్రియాలు పుట్టినట్లు ఈ వాక్యంలో చెప్పడంచేత) భూతాలకు వెనుక చెప్పిన ఉత్పత్తిప్రలయక్రమానికి భంగం ప్రసక్తం అవుతున్నది కదా అని అంటే అది కాదు. విశేషం ఏదీ లేదు కదా? కరణాలు భౌతికాలే (భూతాలనుండి జన్మించినవే) అయితే భూతాల ఉత్పత్తిప్రలయక్రమమే వీటికి వర్తిస్తుంది గాన వీటికి క్రొత్తగా మరొక క్రమాన్ని అన్వేషించవలసిన పనిలేదు. "అన్నమయం హి సోమ్య మనస్తేజోమయీ వాక్" ఇత్యాది వాక్యాలు కరణాలు భౌతికాలని చెప్పడానికి లింగంగా ఉన్నాయి. (కరణాలు భౌతికాలు గాన భూతాలను చెపితేనే కరణాలను కూడ చెప్పినట్లు అవుతుంది). అయినా కూడ కొన్ని చోట్ల భూతాలను కరణాలను కూడ చెప్పడం బ్రాహ్మణపరివ్రాజకన్యాయంచేత. (పరివ్రాజకులు కూడ బ్రాహ్మణులే అయినా బ్రాహ్మణులూ పరివ్రాజకులూ వస్తున్నారు అని చెప్పినట్లు స్పష్టత్వంకోసం). కరణాలు భౌతికాలు కాదు అని అనుకొన్నా కూడ - ముందు కరణాలు పుట్టి తరవాత భూతాలు పుట్టాయా ముందు భూతాలు పుట్టి తరవాత కరణాలు పుట్టాయా అని భూతోత్పత్తిక్రమానికి కరణాలచేత ఏ విధంగాను విశేషం కలగదు. పైన ఉదాహరించిన ముండకోపనిష్వక్యంలో కరణాలను భూతాలను కలిపి చెప్పడంమాత్రమే జరిగింది గాని అక్కడ వాటి ఉత్పత్తిక్రమం ఏదీ చెప్పబడలేదు. అందుచేతనే మరొక శ్రుతిలో భూతక్రమంకంటె వేరుగానే "ప్రజాపతిర్వా...అసృజత" అని చెప్పబడింది. అదుచేత భూతోత్పత్తిక్రమానికి భంగం లేదు.

అన్తరావిజ్ఞానాధికరణం సమాప్తం.

### 10. చరాచరవ్యపాశ్రయాధికరణమ్. సూ. 16.

సూ. చరాచరవ్యపాశ్రయస్తు స్యాత్తద్వ్యపదేశో భాక్తస్తద్భావభావిత్వాత్. 2.3.16.

స్తో జీవస్యాప్యుత్పత్తిప్రలయౌ. జాతో దేవదత్తః మృతో దేవదత్తః ఇత్యేవంజాతీయకాల్లౌకికవ్యపదేశాత్, జాతకర్మాదిసంస్కారవిధానాచ్చేతి స్యాత్కస్య చిద్భ్రాన్తిః. తామపనుదామః. న జీవస్యోత్పత్తిప్రలయౌ స్తః శాస్త్రఫలసంబన్ధోపపతేః. శరీరానువినాశిని హి జీవే శరీరాన్తరగతేష్టానిష్ట ప్రాప్తిపరిహారార్థౌ విధిప్రతిషేధావనర్థకౌ స్యాతామ్. శ్రూయతే చ- "జీవాపేతం వా వ కిలేదం మ్రియతే న జీవో మ్రియతే"(ఛా. ఉ. 6.11.3) ఇతి. నను లౌకికో జన్మమరణవ్యపదేశో జీవస్య దర్శితః. సత్యం దర్శితః. భాక్తస్త్వేష జీవస్య. జన్మమరణవ్యపదేశః. కిమాశ్రయః పునరయం ముఖ్యో యదపేక్షయా భాక్త ఇతి. ఉచ్యతే. చరాచరవ్యపాశ్రయః. స్థావరజఙ్గమశరీరవిషయౌ జన్మమరణశబ్దౌ. స్థావరజఙ్గమాని హి భూతాని జాయన్తే చ మ్రియన్తే చ. అతస్తద్విషయౌ జన్మమరణశబ్దౌ ముఖ్యౌ సన్తౌ తత్స్థే జీవాత్మన్యుపచర్యేతే-తద్భావభావిత్వాత్. శరీరభావతిరోభావయోర్హి సతోర్జన్మమరణశబ్దౌ భవతో నాసతోః. న హి శరీరసంబన్ధాదన్యత్ర జీవో జాతో మృతో వా కేన చిల్లక్ష్యతే." స వా అయం పురుషో జాయమానః శరీరమభి సంపద్యమానః ఉత్క్రామన్ మ్రియమాణః" (బృ.ఉ.4.3.8) ఇతి చ శరీరసంయోగవియోగనిమిత్తావేవ జన్మమరణశబ్దౌ దర్శయతి. జాతకర్మవిధానమపి శరీరప్రాదుర్భావాపేక్షమేవ ద్రష్టవ్యమ్; అభావాజ్జీవపాదుర్భావస్య. జీవస్య పరస్మాదుత్పత్తిర్వియదాదీనామివాస్తి నాస్తి వేత్యేతదుత్తరేణ సూత్రేణ వక్ష్యతి. దేహాశ్రయౌ తావజ్జీవస్య స్థూలావుత్పత్తిప్రలయౌ న స్త ఇత్యేతదనేన సూత్రేణావోచత్. 16.

**చరాచరేతి** :-తద్వ్యపదేశః (జీవుని) జన్మమరణనిర్దేశం, చరాచరవ్యపదేశః-జంగమస్థావరశరీరాలను ఆశ్రయించినది. భాక్తః=గౌణము. తద్భావభావిత్వాత్=జీవుడు శరీరం ఉన్నప్పుడే ఉంటాడు అది లేనప్పుడు ఉండడు గాన" అని సూత్రార్థం.

**అవ**:- ఇంతవరకు తత్పదవాచ్యమైన కారణాన్ని నిర్ణయించడం కోసం భూతశ్రుతులకు విరోధం లేదని చెప్పబడింది. ఇప్పుడు పాదాంతం వరకు త్వంపదార్థశుద్ధి కొరకు (జీవుని స్వరూపాన్ని స్పష్టీకరించడంకొరకు) జీవశ్రుతుల విరోధం పరిహరింపబడుచున్నది. "న జాయతే మ్రియతే" మొదలైన జీవులకు ఉత్పత్తివినాశాలు లేవనే శ్రుతికి జాతేష్టి, శ్రాద్ధం మొదలైనవి విధించే శాస్త్రంతో విరోధం ఉన్నదా లేదా అని సంశయం. ఉన్న దని పూర్వపక్షం. అందుచేత కరణోత్పత్తిక్రమంచేత విరోధం లేకపోయినా జీవోత్పత్తిక్రమంచేత భూతోత్పత్తిక్రమానికి బాధ కలుగుతుందని ప్రత్యుదాహరణసంగతి. పూర్వపక్షం చూపుతున్నారు.- స్తః ఇతి. జీవునికి కూడ ఉత్పత్తి వినాశాలున్నాయి. ఎందువల్ల ననగా దేవదత్తుడు పుట్టాడు, దేవదత్తుడు మరణించాడు ఇత్యాదివ్యపదేశా లున్నాయి. అంతేకాక జాతకర్మ మొదలైన సంస్కారాలు కూడ (వేదంచేత) విధింపబడి ఉన్నాయి అని ఎవని కైనా భ్రాంతి కలగవచ్చును. దానిని తొలగిస్తున్నాం. జీవునకు ఉత్పత్తి ప్రలయాలు లేవు. శాస్త్రఫలంతో సంబంధం కుదరాలి కదా? జీవుడు శరీరంతో పాటు నశిస్తే మరొక శరీరానికి సంబంధించిన ఇష్టాన్ని పొందడానికీ అనిష్టాన్ని పరిహరించడానికి చెప్పబడిన విధిప్రతిషేధాలు వ్యర్థం అవుతాయి. "జీవాపేతం.... మ్రియతే" (ఈ శరీరం జీవుణ్ణి మినహాయించి మరణిస్తుంది. జీవుడు మరణించడు అని వినబడుచున్నది. లోకంలో జీవున కున్న జన్మమరణవ్యపదేశాన్ని చూపించాం కదా? నిజమే, చూపించావు. జీవుని విషయంలో చేయబడిన ఈ జన్మ మరణవ్యపదేశం భాక్తం (లాక్షణికం). అయితే ఈ వ్యపదేశం జీవుని విషయంలో భాక్తమని చెప్పడానికి, దేని విషయంలో ముఖ్యమైనది? చెప్పబడుచున్నది. చరాచరవ్యపాశ్రయం. ఈ జన్మ మరణ శబ్దాలు స్థావరజంగమశరీరాలకు సంబంధించినవి. స్థావరజంగమాలైన భూతాలు పుడుతూంటాయి నశిస్తూంటాయి. అందుచేత ఈ జన్మమరణశబ్దాలు వాటి విషయంలో ముఖ్యమైనవి; ఆ శరీరాలలో ఉన్న జీవునియందు ఆరోపించబడుతున్నాయి. అందుకు కారణం తద్భావభావిత్వం - శరీర ప్రాదుర్భావ

వినాశాలు జరిగినప్పుడే ఈ జన్మమరణశబ్దాలు ప్రయోగించబడుతున్నాయి కాని అవి లేనప్పుడు ప్రయోగించబడడం లేదు కదా? శరీరసంబంధం లేకపోతే జీవుడు పుట్టాడని కాని మరణించా డని గాని ఎవనిచేతా గుర్తింపబడడంలేదు కదా? ''స వా...మ్రియమాణః''(ఆ ఈ పురుషుడు, జీవుడు, శరీరాన్ని పొందినప్పుడు పుడుతున్నాడు, శరీరాన్ని విడిచి వెళ్లిపోయి నప్పుడు మరణిస్తున్నాడు) అను శ్రుతి జన్మమరణశబ్దాలకు నిమిత్తం శరీరసంయోగవియోగాలే అని చూపుతున్నది. జాతకర్మాదుల విధి కూడ శరీరం పుట్టడాన్ని పట్టి చేయబడినదే అని గ్రహించాలి, ఎందువల్ల ననగా జీవునకు పుట్టుక లేదు. ఆకాశాదులకు వలె జీవునకు పరమాత్మనుండి ఉత్పత్తి ఉన్నదా లేదా అని రాబోయే సూత్రంచేత చెప్పబడుతుంది. జీవునకు దేహాన్ని పట్టి ఏర్పడే స్థూలములైన ఉత్పత్తి ప్రలయాలు లేవని మాత్రమే ఈ సూత్రం చేత సూత్రకారుడు చెప్పాడు. 16.

చరాచరవ్యపాశ్రయాధికరణం సమాప్తం.

11. ఆత్మాధికరణమ్. సూ. 17.

సూ. నాత్మాశ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః. 2.3.17.

అస్త్యాత్మా జీవాఖ్యః శరీరేన్ద్రియపఞ్జరాధ్యక్షః కర్మఫలసంబన్ధీ. స కిం వ్యోమాదివదుత్పద్యతే బ్రహ్మణ ఆహో స్విద్ బ్రహ్మవదేవ నోత్పద్యత ఇతి శ్రుతివిప్రతిపత్తేర్విశయః. కాసు చిచ్ఛ్రుతిషు అగ్నివిస్ఫులిఙ్గనిదర్శనైర్జీవాత్మనః పరస్మాద్బ్రహ్మణః ఉత్పత్తిరామ్నాయతే. కాసు చిత్త్వవికృతస్యైవ పరస్య బ్రహ్మణః కార్యప్రవేశేన జీవభావో విజ్ఞాయతే, న చోత్పత్తి రామ్నాయత ఇతి. తత్ర ప్రాప్తం తావదుత్పద్యతే జీవ ఇది. కుతః? ప్రతిజ్ఞానురోధాదేవ. ''ఏకస్మిన్విదితే సర్వమిదం విదితమ్'' ఇతీయం ప్రతిజ్ఞా సర్వస్య వస్తుజాతస్య బ్రహ్మప్రభవత్వే సతి నోపరుధ్యేత. తత్త్వాన్తరత్వే తు జీవస్య ప్రతిజ్ఞేయముపరుధ్యేత. న చావికృతః పరమాత్మైవ జీవ ఇతి శక్యతే విజ్ఞాతుమ్, లక్షణభేదాత్. అపహతపాప్మత్వాదిధర్మకో హి పరమాత్మా తద్విపరీతో హి జీవః. విభాగాచ్చాస్య వికారత్వసిద్ధిః. యావాన్ హ్యాకాశాదిః ప్రవిభక్తః స సర్వో వికారః, తస్య

చాకాశాదేరుత్పత్తిః సమధిగతా. జీవత్మాపి పుణ్యాపుణ్యకర్మా సుఖదుఃఖయుక్ ప్రతిశరీరం ప్రవిభక్త ఇతి తస్యాపి ప్రపఞ్చోత్పత్త్యవసర ఉత్పత్తిర్భవితుమర్హతి. అపి చ "యథాగ్నేః క్షుద్రా విస్ఫులిఙ్గా వ్యుచ్చరన్త్యేవ మేవాస్మాదాత్మనఃసర్వే ప్రాణాః" (బృ.ఉ.2.1.20) ఇతి ప్రాణాదేర్భోగ్యజాతస్య సృష్టిం శిష్ట్వా "సర్వ ఏవ ఆత్మానో వ్యుచ్చరన్తి" ఇతి భోక్తౄణామాత్మనాం పృథక్సృష్టిం శాస్తి .

"యథా సుదీప్తాత్పావకాద్విస్ఫులిఙ్గాః సహస్రశః ప్రభవన్తే సరూపాః,

తథాక్షరాద్వివిధాః సోమ్య భావాః ప్రజాయన్తే తత్ర చైవాపియన్తి"(ము.ఉ.2.1.1)

ఇతి చ జీవాత్మనాముత్పత్తిప్రలయావుచ్యేతే. సరూపవచనాత్. జీవాత్మానో హి పరమాత్మనా సరూపా భవన్తి, చైతన్యయోగాత్. న చ క్వచిదశ్రవణమన్యత్ర శ్రుతం వారయితుమర్హతి. శ్రుత్యన్తరగతస్యాప్యవిరుద్ధస్య అధికస్యార్థస్య సర్వత్రోపసంహార్యత్వాత్. ప్రదేశశ్రుతిరప్యేవంసతి వికారభావాపత్త్యైవ వ్యాఖ్యాతవ్యా - "తదాత్మానం స్వయమకురుత" ఇత్యాదివత్. తస్మాత్ ఉత్పద్యతే జీవ ఇతి.

బాలానందిని

నేతి :- "ఆత్మా=జీవాత్మ న=పుట్టదు. అశ్రుతేః=ఉత్పత్తిని చెప్పే శ్రుతి లేకపోవడం వల్ల. తాభ్యః=ఆ శ్రుతులవల్లనే. నిత్యత్వాచ్చ=నిత్యం కూడ అవడం వల్ల" అని సూత్రార్థం.

అస్తీతి :- శరీరేంద్రియపంజరానికి అధ్యక్షుడు కర్మఫలసంబంధి అయిన జీవుడనే ఆత్మ ఉన్నది. ఆ జీవాత్మ ఆకాశాదుల వలె బ్రహ్మనుండి పుడుతుందా లేక బ్రహ్మకు వలెనే జీవాత్మకు కూడ ఉత్పత్తి లేదా అని శ్రుతులలో విప్రతిపత్తి (విరోధం) ఉండడంవల్ల సంశయం. అగ్నినుండి నెరసులు బయలుదేరినట్లు జీవాత్మ బ్రహ్మనుండి పుట్టినదని కొన్ని శ్రుతులలో చెప్పడుచున్నది. వికారం చెందని పరబ్రహ్మయే కార్యంలో ప్రవేశించడం చేత జీవుడుగా చెప్పబడుచున్నాడు అని కొన్ని శ్రుతులలో తెలియడుచున్నది. వాటిలో జీవుని ఉత్పత్తి చెప్పబడడంలేదు. ఇలా ఉండగా జీవుడు పుడతాడు అని ప్రాప్తిస్తున్నది. ఎందువల్ల? ప్రతిజ్ఞానుపరోధంవల్లనే. సమస్తవస్తుసముదాయము బ్రహ్మనుండి పుడితేనే

"ఒక వస్తువును (కారణాన్ని) తెలుసుకొంటే ఇదంతా తెలుస్తుంది" అనే ప్రతిజ్ఞకు భంగం ఉండదు. జీవుడు మరొక తత్త్వం అయితే ఈ ప్రతిజ్ఞకు భంగం కలుగుతుంది. ఏ వికారాలూ చెందని పరమాత్మయే జీవుడు అని తెలుసుకొనడం శక్యం కాదు, ఎందువల్లననగా ఆ రెండింటి లక్షణాలూ వేరు వేరైనవి. పరమాత్మ అపహత పాప్మత్వాదిధర్మాలు కలవాడు. జీవుడు అందుకు విపరీతుడు. విభాగాన్ని పట్టి కూడ వీనికి (జీవునకు) వికారత్వం సిద్ధిస్తుంది. విభక్తంగా కనబడే ఆకాశాదులు ఎన్నైతే ఉన్నాయో అవన్నీ వికారాలే. అలాంటి ఆకాశాదులకు ఉత్పత్తి ఉన్నదని తెలియబడింది. పుణ్యాపుణ్యకర్మలు గల జీవాత్మ కూడ సుఖదుఃఖాలతో కూడి ఉంటాడు. ప్రతిశరీరం లోను వేరు వేరుగా విభక్తుడై ఉన్నాడు. అందుచేత ఆ జీవాత్మ కూడ ప్రపంచోత్పత్తి సమయంలో పుట్టి ఉండాలి. మరొక విషయ మేమనగా "యథా...ప్రాణాః" (అగ్ని నుండి చిన్న చిన్న నెరసులు బయలు దేరి నట్లు ఈ ఆత్మ నుండి సమస్తమైన ప్రాణాలు బయలుదేరుతున్నాయి) అని ప్రాణాదులైన భోగ్యవస్తువుల సృష్టిని బోధించి "సర్వ ఏవ ఆత్మానో వ్యుచ్చరన్తి" (అన్ని ఆత్మలూ కూడ బయలుదేరుతున్నాయి) అని శ్రుతి భోక్తలైన జీవాత్మల వేరుగా సృష్టిని చెప్పుచున్నది. "యథా...అపియన్తి" (ఓ. సౌమ్యుడా! బాగా మండుతున్న అగ్నినుండి దానికి సమానమైన రూపం గల నెరసులు వేలకొలది ఏ విధంగా పుడుతున్నాయో అట్లే అక్షరంనుండి (బ్రహ్మనుండి) పదార్థాలు పుడుతున్నాయి. దానిలోనే లీనం అవుతున్నాయి) అని జీవాత్మల ఉత్పత్తిప్రలయాలు చెప్పబడుతున్నాయి. సరూపాః=సమానరూపం గలవి అని చెప్పబడింది కదా? చైతన్యం ఉండడంచేత జీవాత్మలు పరమాత్మకు సరూపా లవుతాయి కదా? ఒకచోట (ఉత్పత్తి) వినబడకపోవడం మరొక చోట వినబడుచున్నదానిని నివారింపజాలదు. మరొక శ్రుతిలో ఉన్న విరుద్ధం కాని అర్థాన్ని అన్ని శ్రుతులలోను ఉపసంహరించుకోవాలి (అన్వయించుకోవాలి) కదా? దీనిని పట్టి ప్రవేశశ్రుతి కూడ (బ్రహ్మ వికారాలలో ప్రవేశించింది అని చెప్పే శ్రుతి కూడ) బ్రహ్మనుండి జీవుడు పుట్టాడు అని మాత్రమే "తదాత్మానం స్వయమకురుత" ( ఆ బ్రహ్మ తననే అనేకవిధాలు చేసి కొన్నది అన్నట్లు వ్యాఖ్యానించుకోవాలి.

సి. జీవోత్పత్తిప్రతిపాదకశ్రుతులకు, ఉత్పత్తి లేదని చెప్పే శ్రుతులకు విరోధం ఉండడంవల్ల సంశయం. పై అధికరణంలో చెప్పినట్లు దేహం జనించినా నశించినా

జీవునకు జన్మనాశాలు లేకపోయినా కల్పప్రారంభంలో ఆకాశం వలె జీవుడు కూడ పుడతాడని చెప్పవచ్చును కదా అని ప్రత్యుదాహరణసంగతిచేత పూర్వపక్షం.

భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః :- నాత్మా జీవ ఉత్పద్యత ఇతి. కస్మాత్? అశ్రుతేః. నహ్యస్యోత్పత్తిప్రకరణే శ్రవణమస్తి భూయస్సు ప్రదేశేషు. నను క్వచిదశ్రవణ మన్యత్ర శ్రుతం న వారయ తీత్యుక్తమ్. సత్యముక్తమ్. ఉత్పత్తిరేవ త్వస్య న సంభవతీతి వదామః. కస్మాత్? నిత్యత్వాచ్చ తాభ్యః. చశ్దాదజ త్వాదిభ్యశ్చ-నిత్యత్వం హ్యస్య శ్రుతిభ్యోఽవగమ్యతే. తథాఽజత్వమ వికారిత్వమవికృతస్యైవ బ్రహ్మణో జీవాత్మనావస్థానం బ్రహ్మాత్మనా చేతి. న చైవంరూపస్యోత్పత్తిరుపపద్యతే. తాః కాః శ్రుతయః? "న జీవో మ్రియతే"(ఛా. ఉ. 6.11.3), "స వా ఏష మహానజ ఆత్మాఽ జరోఽమరోఽమృతోఽభయో బ్రహ్మ" (బృ.ఉ. 4-4-22). "న జాయతే మ్రియతే వా విపశ్చిత్ " (క.ఉ.2-18), "అజో నిత్యః శాశ్వతోఽయం పురాణః" (క.ఉ.2-18), "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" (తై. ఉ. 2-1-1) "అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" (ఛా.ఉ.6.3.2), "స ఏష ఇహ ప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః" (బృ.ఉ.1.4.7) "తత్త్వమసి"(ఛా.ఉ. 6.8.7) "అహం బ్రహ్మాస్మి" (బృ.ఉ.1.4.10), "అయమాత్మా బ్రహ్మ సర్వానుభూః" (బృ.ఉ.2.4.19) ఇత్యేవమాద్యా నిత్యత్వవాదిన్యః సత్యో జీవస్యోత్పత్తిం ప్రతిబధ్నన్తి.

బాలానందిని

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాము. జీవాత్మ పుట్టదు. ఎందువలన? శ్రుతి లేకపోవడం వలన. చాల ప్రదేశాలలో, ఉత్పత్తి ప్రకరణంలో ఇది వినబడడంలేదు కదా? కొన్నిచోట్ల వినబడకపోవడం మరొక చోట వినబడినదానిని నివారించజాలదని చెప్పాం కదా? నిజమే, చెప్పావు. జీవాత్మకు ఉత్పత్తియే కుదర దని అంటాం. ఎందువల్ల? వాటిని పట్టియే నిత్యత్వంవల్ల. చ శబ్దంచేత అజత్వం (పుట్టుక లేక పోవడం) మొదలైన వాటివల్ల కూడ. ఇది నిత్య మని శ్రుతులవల్ల తెలుస్తూన్నది. అట్లే పుట్టుక లేని

దని, వికారాలు లేని దని, ఎట్టి వికారమూ చెందని బ్రహ్మయే జీవరూపంలోను, బ్రహ్మరూపంలోను ఉన్నదనీ చెప్పబడింది. ఇలాంటిదానికి ఉత్పత్తి కుదరదు కదా? ఆ శ్రుతులేవి? "న జీవో మ్రియతే"(జీవుడు మరణించడు), "సవా...బ్రహ్మ" "న జాయతే...విపశ్చిత్", "అజో...పురాణః," "తత్సృష్ట్వా..అనుప్రావిశత్", అనేన...వ్యాకరవాణి", "స ఏష.....నఖాగ్రేభ్య" "తత్త్వమసి", "అహం బ్రహ్మాస్మి" "అయమాత్మా బ్రహ్మ సర్వానుభూః" ఈ మొదలైన శ్రుతులు నిత్యత్వాన్ని చెపుతున్నవై జీవుని ఉత్పత్తిని ప్రతిబంధిస్తున్నాయి (నిరాకరిస్తున్నాయి).

## భాష్యమ్.

నను ప్రవిభక్తత్వాద్వికారః, వికారత్వాచ్చోత్పద్యత ఇత్యుక్తమ్? అత్రోచ్యతే. నాస్య ప్రవిభాగః స్వతోఽస్తి; "ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా" (శ్వే.ఉ.6.11) ఇతి శ్రుతేః. బుద్ధ్యాద్యుపాధినిమిత్తం త్వస్య ప్రవిభాగప్రతిభానమాకాశస్యేవ ఘటాదిసంబన్ధనిమిత్తమ్. తథా చ శాస్త్రమ్ - "స వా అయమాత్మా బ్రహ్మ విజ్ఞానమయో మనోమయః ప్రాణమయశ్చక్షుర్మయః శ్రోత్రమయః" (బృ.ఉ.4.4.5) ఇత్యేవమాది బ్రహ్మణ ఏవావికృతస్య సతః అస్యైకస్యానేకబుద్ధ్యాదిమయత్వం దర్శయతి. తన్మయత్వం చాస్య తద్వివిక్తస్వరూపానభివ్యక్త్యా తదుపరక్తస్వరూపత్వం స్త్రీమయో జాల్మ ఇత్యాదివద్ద్రష్టవ్యమ్. యదపి క్వచిదస్యోత్పత్తిప్రలయశ్రవణం తదప్యత ఏవోపాధిసంబన్ధాన్నేతవ్యమ్; ఉపాధ్యుత్పత్త్యాస్యోత్పత్తిస్తత్ప్రలయేన చ ప్రలయ ఇతి తథా చ దర్శయతి- "ప్రజ్ఞానఘన ఏవైతేభ్యో భూతేభ్యః సముత్థాయ తాన్యేవానువినశ్యతి న ప్రేత్య సంజ్ఞాస్తి" (బృ.ఉ.4.5.13) ఇతి. తథా ఉపాధిప్రలయ ఏవాయం నాత్మవిలయ ఇత్యేతదప్యత్రైవ "మా భగవాన్మోహాన్తమపీ పదన్న వా అహమిమం విజానామి న ప్రేత్య సంజ్ఞాస్తి" ఇతి ప్రశ్నపూర్వకం ప్రతిపాదయతి "న వా అరేఽహం మోహం బ్రవీమి అవినాశీ వా అరేఽయమాత్మాఽనుచ్ఛిత్తి ధర్మా మాత్రాఽసంసర్గ స్త్వస్య భవతి" (బృ.ఉ.4.5.14) ఇతి. ప్రతిజ్ఞాను

పరోధోఽప్యవికృతస్యైవ బ్రహ్మణో జీవభావాభ్యుపగమాత్.లక్షణభేదో ఽప్యనయోరుపాధిభేదనిమిత్త ఏవ. "అత ఊర్ధ్వం విమోక్షాయైవ బ్రూహి" (బృ.ఉ.4.3.15) ఇతి చ ప్రకృతస్యైవ విజ్ఞానమయస్యాత్మనః సర్వసంసారధర్మ ప్రత్యాఖ్యానేన పరమాత్మభావప్రతిపాదనాత్. తస్మాన్నైవాత్మోత్పద్యతే ప్రవిలీయతే చేతి. 17.

బాలానందిని

నన్వితి:- ఈ జీవాత్మ విభక్తంగా ఉంది కాబట్టి వికారం (కార్యం) అనీ, వికారం కాబట్టి పుడుతుందనీ చెప్పాం కదా? ఈ విషయంలో (సమాధానం) చెప్పబడుతున్నది. "ఏకో...అన్తరాత్మా" అను శ్రుతి ననుసరించి ఈ ఆత్మకు సహజంగా ప్రవిభాగం లేదు. ఘటాదులతో సంబంధాన్ని నిమిత్తంగా చేసుకొని ఆకాశానికి వలె దీనికి ప్రవిభాగం ఉన్నట్లు కనబడడం బుద్ధ్యాద్యుపాధులను పట్టి ఏర్పడినది. అట్లే - "స వా....శ్రోత్రమయః" ఇత్యాదిశాస్త్రం బ్రహ్మ ఏ వికారమూ చెందకుండానే అనేకబుద్ధ్యాదిమయంగా కనబడుతున్నది అని చెపుతూన్నది. (విజ్ఞానమయము అనగా బుద్ధిమయము. మనోమయము, ప్రాణమయము, చక్షుర్మయము, శ్రోత్రమయము అయిన ఈ ఆత్మయే బ్రహ్మ అని ఈ శ్రుతివాక్యానికి అర్థం). ఇక్కడ విజ్ఞానాదిమయంగా ఉండడం అనగా "ఆ జాల్మ్యుడు (నీచుడు) స్త్రీమయుడు అన్నట్లు" ఆ బుద్ధ్యాదులకంటె భిన్నంగా తన స్వరూపం కనబడకుండా వాటితో కలిసిపోయిన స్వరూపం కలిగి ఉండడం అని అర్థం. కొన్ని చోట్ల వినబడుతున్న జీవుని ఉత్పత్తి కూడ ఈ ఉపాధులతో సంబంధంవల్ల ఏర్పడినదీ అని అర్థం చెప్పుకోవాలి. ఉపాధియొక్క ఉత్పత్తిచేత దీనికి ఉత్పత్తి ఉపాధియొక్క ప్రలయంచేత దీనికి ప్రలయం. ఈ విషయమే "ప్రజ్ఞానఘన.... అస్తి" (ప్రజ్ఞానఘన మైన, జ్ఞానపు ముద్దయైన, ఈ ఆత్మయే దేహరూపంలో పరిణామం చెందిన ఈ భూతాలనుండ లేచి వాటినే అనుసరించి నశిస్తున్నది. మరణానంతరం సంజ్ఞ లేదు అని చెప్పబడుచున్నది. అయితే ఇది ఉపాధియొక్క ప్రలయమే కాని ఆత్మకు విలయం లేదు అనే విషయం కూడ ఇక్కడనే "మా భగవాన్...అస్తి" (పూజ్యుడ వైన నీవు ప్రజ్ఞానఘనునకు సంజ్ఞ లేదు అని చెప్పి నన్ను మోహమధ్యం పొందించినావు

(మోహమధ్యంలో పడవేసినావు). మరణించిన తరవాత సంజ్ఞ లేదు అనే విషయాన్ని నేను అర్థం చేసుకొనలేకున్నాను) అని ప్రశ్న పూర్వకంగా "న వా...అస్య భవతి" (ఓయీ! నేను మోహం కలిగించే మాట ఏమీ చెప్పడం లేదు. ఈ ఆత్మ వినాశరహితమైనది. ఉచ్ఛేదం లేనిది. (మరణించినప్పుడు) ఈ ఆత్మకు విషయాలతో సంబంధం లేకపోవడం మాత్రమే జరుగుతుంది) అని ప్రతిపాదిస్తున్నాడు. ఏ వికారమూ లేని బ్రహ్మయే జీవుడని అంగీకరించడంచేత ఏక విజ్ఞానేన సర్వవిజ్ఞానప్రతిజ్ఞకు హాని కూడ కలగదు. జీవబ్రహ్మల లక్షణభేదం కూడ ఉపాధిని పట్టి ఏర్పడినదే; ఎందువల్ల ననగా "అత ఊర్ధ్వం విమోక్షాయైవ బ్రూహి" అని ప్రకృతమైన విజ్ఞానమయాత్మకే సమస్తసంసారధర్మాలను నిరాకరించడం ద్వారా పరమాత్మ స్వరూపత్వం ప్రతిపాదింపబడుచున్నది. అందువల్ల **ఆత్మ పుట్టదు,** ప్రలయం పొందదు. 17.

ఆత్మాధికరణం సమాప్తం

2. జ్ఞాధికరణమ్. సూ.18

**సూ. జ్ఞోఽత ఏవ. 2.3.18**

స కిం కాణభుజానామివ ఆగన్తుకచైతన్యః స్వతోఽచేతన ఆహోస్విత్సాం**ఖ్యా**నామివ నిత్యచైతన్యరూప ఏవేతి వాదివిప్రతిపత్తేః సంశయః. కిం తావత్ ప్రాప్తమ్? ఆగన్తుకమాత్మనశ్చైతన్యమాత్మమనఃసంయోగజ మగ్నిసంయోగజ రోహితాదిగుణవదితి ప్రాప్తమ్. నిత్యచైతన్యత్వే హి సుప్తమూర్ఛితగ్రహావిష్టానామపి చైతన్యం స్యాత్. తే పృష్టాః సన్తో న కించిద్వయమచేతయామహీతి జల్పన్తి, స్వస్థాశ్చ చేతయమానా దృశ్యన్తే. అతః కాదాచిత్కచైతన్యత్వాదాగన్తుకచైతన్య **ఆత్మేతి.**

ఏవం ప్రాప్తేఽభిధీయతే. జ్ఞో నిత్యచైతన్యోఽయమాత్మాఽత ఏవ, **యస్మాదేవ** నోత్పద్యతే; పరమేవ బ్రహ్మావికృతముపాధిసంపర్కాజ్జీవభా**వేనావతిష్ఠతే.** పరస్య హి బ్రహ్మణశ్చైతన్యస్వరూపత్వమామ్నాతమ్- "విజ్ఞానమానన్దం బ్రహ్మ" (బృ.ఉ.3.9.28), "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ"

(త్తై.ఉ.2.1.1), "అనన్తరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ" (బృ.ఉ.4.5.13) ఇత్యాదిషు శ్రుతిషు. తదేవ చేత్పరం బ్రహ్మ జీవః తస్మాజ్జీవస్యాపి నిత్యచైతన్య స్వరూపత్వమగ్నేరౌష్ణ్యప్రకాశవదితి గమ్యతే.

బాలానందిని

జ్ఞ ఇతి :- "అత ఏవ=పుట్టకపోవడంవల్లనే, జ్ఞః జీవుడు, జ్ఞానస్వరూపుడు" అని సూత్రార్థం.

స ఇతి:- ఆ జీవుడు కాణాదులకు వలె స్వతః అచేతనుడై అప్పుడప్పుడు వచ్చే చైతన్యం కలవాడా, లేక సాంఖ్యులకు వలె, నిత్యచైతన్యస్వరూపుడేనా అని వాదులలో అభిప్రాయభేదాన్ని పట్టి సంశయం. అగ్నికి ఘటానికి సంయోగంవల్ల ఎఱ్ఱని రంగు మొదలైన గుణాలు వచ్చినట్లు ఆత్మకు చైతన్యం ఆత్మమనస్సంయోగంవల్ల కలుగుతుంది అని ప్రాప్తించినది. ఆత్మ నిత్యచైతన్యస్వరూప మైతే నిద్రపోతూన్నవాళ్లకి మూర్ఛ చెందినవాళ్లకి, గ్రహావిష్టులకూ కూడ చైతన్యం ఉండాలి. వాళ్లని అడిగితే మేం ఏమీ గుర్తించ లేదు (మా కేమీ తెలియలేదు) అని అంటారు. స్వస్థులుగా ఉన్నప్పుడు చైతన్యవంతులుగా (అన్నీ తెలుసుకొంటూ) ఉంటారు. అందుచేత ఆత్మలో చైతన్యం అప్పుడప్పుడు ఉంటుంది గాన, ఆత్మ ఆగంతుకమైన (వచ్చీ పోయే) చైతన్యం కలది.

వి. ఆత్మ స్వప్రకాశం అని చెప్పే "ఆత్మై వాస్య జ్యోతిః" ఇత్యాదిశ్రుతులకు ఆత్మలో జ్ఞానం అనిత్యం అని చెప్పే "పశ్యంశ్చక్షుః శృణ్వన్ శ్రోత్రమ్" ఇత్యాదిశ్రుతులతో విరోధం ఉన్నదా లేదా అని సంశయం. పైన చెప్పినట్లు ఉత్పత్తి లేకపోవడంచేత జీవుడు స్వప్రకాశస్వరూపుడని ఈ రెండు అధికరణాలకీ సాధ్యసాధకభావ సంగతి.

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా చెప్పబడుచున్నది. "ఈ ఆత్మ అత ఏవ=ఏ కారణం వల్ల పుట్టడం లేదో ఆ కారణంవల్లనే, దవికృతమైన బ్రహ్మయే ఉపాధిసంపర్కంచేత జీవత్వంతో ఉంటున్నది గాన, జ్ఞః=నిత్యచైతన్యస్వరూపము. "విజ్ఞానమానన్దం బ్రహ్మ", "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ", "అనన్తరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానంఘన ఏవ" ఇత్యాదిశ్రుతులచేత పరబ్రహ్మ చైతన్యరూపమైన దని చెప్పబడింది. ఆ పరబ్రహ్మయే జీవుడైనపుడు, అగ్నికి ఉష్ణత్వం వలె, జీవునకు కూడ నిత్యచైతన్యస్వభావత్వం ఉటుందని తెలుస్తూన్నది.

భాష్యమ్

విజ్ఞానమయప్రక్రియాయాం చ శ్రుతయో భవన్తి - "అసుప్తః సుప్తానభిచాకశీతి" (బృ.ఉ.4.3.11), "అత్రాయం పురుషః స్వయంజ్యోతిర్భవతి" (బృ.ఉ.4.3.9), "న హి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతే" (బృ.ఉ.4.3.30) ఇత్యేవంరూపాః. "అథ యో వేదేదం జిఘ్రాణీతి స ఆత్మా" (ఛా.ఉ. 8.12.4) ఇతి చ సర్వైః కరణద్వారైః ఇదం వేదేదం వేదేతి విజ్ఞానే నానుసంధానాత్త ద్రూపత్వసిద్ధిః. నిత్యస్వరూపచైతన్యత్వే ఘ్రాణాద్యానర్థక్యమితి చేన్న. గన్ధాదివిషయవిశేషపరిచ్ఛేదార్థత్వాత్. తథాహి దర్శయతి "గన్ధాయ ఘ్రాణమ్" ఇత్యాది. యత్తు సుప్తాదయో న చేతయన్త ఇతి, తస్య శ్రుత్యైవ పరిహారోఽభిహితః. సుషుప్తం ప్రకృత్య "యద్వైతన్న పశ్యతి పశ్యన్వై తన్న పశ్యతి న హి ద్రష్టుర్దృష్టేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాన్న తు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్వి భక్తం యన్న పశ్యేత్" (బృ.ఉ. 4.3.23) ఇత్యాదినా. ఏతదుక్తం భవతి- విషయాభావాదియమచేతయమానతా, న చైతన్యాభావాదితి. యథా వియదాశ్రయస్య ప్రకాశస్య ప్రకాశ్యాభావాదనభివ్యక్తిర్న స్వరూపాభావాత్తద్వత్. వైశేషికాదితర్కశ్చ శ్రుతివిరోధే ఆభాసీభవతి. తస్మాన్నిత్యచైతన్యస్వరూప ఏవాత్మేతి నిశ్చినుమః. 18

బాలానందిని

**విజ్ఞానేతి** :-విజ్ఞానమయప్రక్రియలో ("యోఽయం విజ్ఞానమయః" అనే ప్రకరణంలో)- "అసుప్తః సుప్తానభిచాకశీతి" (తను నిద్రించకుండా నిద్రిస్తున్న ఇంద్రియాదులను చూస్తున్నాడు). "అత్రాయం...భవతి" (నిద్రలో ఈ పురుషుడు స్వయంప్రకాశుడుగా ఉంటాడు) "న హి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరితోపో విద్యతే" ఇత్యాదిశ్రుతులు ఉన్నవి. "అథ యో వేద... ఆత్మా" అని చెప్పినట్లు సమస్తమైన ఇంద్రియా లనే ద్వారాలచేత దీనిని తెలుసుకుంటున్నాను, దీనిని తెలుసుకుంటున్నాను

అని విజ్ఞానంచేత అనుసంధానం చేయడంవల్ల గూడ ఆత్మ జ్ఞానరూపం అని సిద్ధిస్తుంది. ఆత్మ నిత్యచైతన్యస్వరూప మైతే ఘ్రాణాదాలు వ్యర్థం కదా అన్నట్లయితే అది యుక్తం కాదు. గంధం మొదలైన విషయాలను విడి విడిగా చూపడం కోసం ఘ్రాణాదుల అవసరం ఉంటుంది. అందుచేతనే "గన్ధాయ ఘ్రాణమ్" ఇత్యాదిశ్రుతి ఈ విషయాన్ని చూపుచున్నది. నిద్రపోతున్నవాళ్లు చైతన్యరహితులుగా ఉన్నారు కదా అని చెప్పినదానికి పరిహారం "యద్వై...పశ్యేత్" (సుషుప్త్యవస్థలో చూడడంలే దనగా వాస్తవంలో చూస్తూనే చూడడం లేదు. ద్రష్ట వినాశరహితుడు; అందుచేత ద్రష్టయొక్క దృష్టికి లోపం లేదు. ఆ సమయం లో చూడడానికి రెండవ వస్తువేదీ కూడ వేరుగా లేదు) ఇత్యాదిశ్రుతిచేత పరిహారం చెప్పబడింది. ఇది చెప్పినట్లవుతుంది. ఈ అచేతయమానత (దేనినీ తెలుసుకొనకపోవడం) విషయాలు లేకపోవడంచేతనే గాని చైతన్యం లేకపోవడంచేత కాదు. ఆకాశంలో ఉన్న ప్రకాశము ప్రకాశింపచేయతగినది ఏదీ లేకపోవడంచేత ఏ విధంగా అభివ్యక్తం కాదో, అంతేనే కాని అసలే ప్రకాశ లేకపోవడం అనేది లేదో అట్లే ఇది కూడ. వైశేషికాదుల తర్కం శ్రుతితో విరోధం ఏర్పడి నప్పుడు ఆభాసం అవుతుంది. అందుచేత ఆత్మ నిత్యచైతన్యస్వరూపుడే అని నిశ్చయిస్తున్నాం.18.

జ్ఞాధికరణం సమాప్తం

## 13. ఉత్క్రాన్తిగత్యధికరణమ్. సూ. 19-32

## సూ. ఉత్క్రాన్తిగత్యాగతీనామ్. 2.3.19

ఇదానీం తు కింపరిమాణో జీవ ఇతి చిన్త్యతే-కిమణుపరిమాణః, ఉత మధ్యమపరిమాణః, ఆహోస్విన్మహాపరిమాణ ఇతి. నను నాత్మోత్పద్యతే, నిత్యచైతన్యశ్చాయమిత్యుక్తమ్. అతశ్చ పర ఏవాత్మా జీవ ఇత్యాపతతి. పరస్య చాత్మనోఽనన్తత్వమామ్నాతమ్. తత్ర కుతో జీవస్య పరిమాణచిన్తావసర ఇతి. ఉచ్యతే. సత్యమేతత్. ఉత్క్రాన్తిగత్యాగతిశ్రవణాని తు జీవస్య పరిచ్ఛేదం ప్రాపయన్తి. స్వశబ్దేన చాస్య క్వచిదణుపరిమాణత్వమామ్నాయతే. తస్య సర్వస్యానాకులత్వోపపాదనాయాయమారమ్భః. తత్ర ప్రాప్తం

తావదుత్క్రాన్తిగత్యాగతీనాం శ్రవణాత్ పరిచ్ఛిన్నోఽణుపరిమాణో జీవ ఇతి. ఉత్క్రాన్తి స్తావత్ "స యదాస్మా చ్ఛరీరాదుత్క్రామతి న హైవైతైః సర్వైరుత్క్రామతి"(కౌషీతకి, 3.3) ఇతి. గతిరపి-యే వై చాస్మాల్లోకాత్ప్రయన్తి చన్ద్రమసమేవ తే సర్వే గచ్ఛన్తి. (కౌషీ.1.2) ఇతి. ఆగతిరపి- "తస్మాల్లోకాత్పునరేత్యస్మై లోకాయ కర్మణే" (బృ.ఉ.4.4.6) ఇతి. అసాముత్క్రాన్తిగత్యాగతీనాం శ్రవణాత్పరిచ్ఛిన్నస్తావజ్జీవ ఇతి ప్రాప్నోతి. న హి విభోశ్చలనమవకల్పత ఇతి. సతి చ పరిచ్ఛేదే శరీరపరిమాణత్వ స్యార్హతపరీక్షాయాం నిరస్తత్వాత్ అణురాత్మేతి గమ్యతే. 19.

బాలానందిని

ఉత్క్రాన్తీతి:- "ఉత్క్రాన్తిగత్యాతగీనామ్=శరీరంనుండి బైటకు వెడలుట, గమనం, ఆగమనం వీటి శ్రవణంవల్ల జీవుడు అణుపరిమాణం కలవాడు" అని ఈ పూర్వపక్షసూత్రానికి అర్థం.

వి. జీవుడు స్వప్రకాశస్వరూపుడు అని పై అధికరణంలో చెప్పబడినది. ఆ జీవునకే సంబంధించిన పరిమాణాన్ని గూర్చి అశ్రితాశ్రయభావసంగతిచేత విచారణ చేయబడుచున్నది.

ఇదానీమితి:- ఇప్పుడైతే జీవుడు అనుపరిమాణం కలవాడా, మధ్యమపరిమాణం కలవాడా, మహాపరిమాణం కలవాడా; ఏ పరిమాణం కలవాడు అని విచారణ చేయబడుచున్నది. (ప్రశ్న)- ఆత్మకు ఉత్పత్తి లేదు. నిత్యచైతన్యస్వరూపుడు అని చెప్పబడింది. దీనిని పట్టి పరమాత్మయే జీవుడు అని లభిస్తుంది. పరమాత్మ అనంత మని చెప్పబడింది. అలాంటప్పుడు జీవుని పరిమాణాన్ని గూర్చి విచారించడానికి అవసరం ఏముంది?(సమాధానం) - చెప్పబడుచున్నది. ఇది నిజమే. అయితే ఉత్క్రాంతి గత్యాగతిశ్రుతులను పట్టి జీవునకు పరిచ్ఛేదం (నియమితమైన అల్పపరిమాణం) ఉన్నట్లు తెలుస్తున్నది. కొన్ని చోట్ల స్వశబ్దంచేతనే (అణుశబ్దాన్ని ప్రయోగించి) జీవుని పరిమాణం అణుపరిమాణ మని చెప్పబడుచున్నది. అదంతా ఆకులం కాకుండా(నిశ్చితంగానే)

ఉందని ప్రతిపాదించడం కోసం ఈ ప్రారంభం అంతా. ఉత్క్రాంతిగత్యాగతులు వినబడడంవల్ల జీవుడు పరిచ్ఛినుడు, అణుపరిమాణం గలవాడు అని ప్రాప్తిస్తూన్నది. "స...ఉత్క్రామతి" (జీవుడు ఈ శరీరంనుండి ఎప్పుడు పైకి లేచిపోతాడో అప్పుడు వీటి అన్నింటితోనూ (ఇంద్రియాదులతో) కలిసి లేచిపోతాడు) అని ఉత్క్రాంతి (శరీరం విడచి బైటకు వెళ్లిపోవడం) చెప్పబడుచున్నది."యేవై... గచ్ఛన్తి" (ఈ లోకం నుంచి వెళ్లినవాళ్లందరూ చంద్రలోకానికే వెడతారు) అని గతి కూడ చెప్పబడుచున్నది. "తస్మాత్... కర్మణే" (ఆలోకంనుండి కర్మచేయడం కోసం మళ్లీ ఈ లోకానికి వస్తాడు)అని అగతి చెప్పబడుచున్నది. ఈ విధంగా ఉత్క్రాంతిగత్యాగతులు వినబడడంచేత జీవుడు పరిచ్ఛిన్నపరిమాణం కలవాడు అనైతే తెలుస్తూన్నది. సర్వవ్యాపి యైనవానికి చలనం కుదరదు కదా? పరిమాణం ఉంది అని చెప్పిన తరవాత, శరీరపరిమాణం కుదర దని జైనమతపరీక్షా సందర్భంలో చెప్పబడింది గాన ఆత్మ అణుపరిమాణం గలది అని తెలుస్తూన్నది. 19.

## సూ. స్వాత్మనా చోత్తరయోః. 2.3.20.

ఉత్క్రాన్తిః కదాచిదచలతోఽపి గ్రామ్యస్వామ్యనివృత్తివద్దేహస్వామ్యనివృత్త్యా కర్మక్షయేణావకల్పతే. ఉత్తరే తు గతత్యాగతీ నాచలతః సంభవతః. స్వాత్మనా హి తయోః సంబన్ధో భవతి; గమేః కర్తృస్థక్రియాత్వాత్. అమధ్యమపరిమాణస్య చ గత్యాగతీ అణుత్వ ఏవ సంభవతః. సత్యోశ్చ గత్యాగత్యోః ఉత్క్రాన్తిరపి అపసృప్తిరేవ దేహాదితి ప్రతీయతే; న హ్యనపసృప్తస్య దేహాద్గత్యాగతీ స్యాతామ్. దేహప్రదేశానాం చ ఉత్క్రాన్తావపాదానత్వవచనాత్- "చక్షుషో మూర్ధ్నోఽవాన్యేభ్యో వా శరీరదేశేభ్యః" (బృ. ఉ. 4.4.2) ఇతి. "స ఏతాస్తేజోమాత్రాః సమభ్యాదదానో హృదయమేవాన్వవక్రామతి" (బృ.ఉ.4.4.1) "శుక్రమాదాయ పునరైతి స్థానమ్" (బృ.ఉ.4.3.11) ఇతి చాన్తరేఽపి శరీరే శారీరస్య గత్యాగతీ భవతః. తస్మాదప్యస్యాణుత్వసిద్ధిః. 20.

బాలానందిని

స్వాత్మనేతి:- "ఉత్తరయోః=తరువాతి రెండింటికీ, అనగా గత్యాగతులకు, స్వాత్మనా=కర్తతో సంబంధం ఉండడంవల్ల కూడ జీవునకు అణుపరిమాణత్వం" అని సూత్రార్థం.

ఉత్క్రాన్తిరితి :- మనిషి కదలకపోయినా వాని కున్న గ్రామాధిపత్యం తొలగిపోయి నట్లు కర్మక్షయంచేత దేహంమీద ఉన్న స్వామ్యం తొలగిపోవడం ద్వారా ఒకప్పుడు కదలకుండా ఉన్నవానికి కూడ ఉత్క్రాంతి సంభవింపవచ్చు. తరవాత చెప్పిన గత్యాగతులైతే కదలకుండ ఉన్నవానికి సంభవించవు. గమనం అనేది కర్తలో ఉన్న క్రియ గాన వాటికి స్వాత్మతో (కర్తతో) సంబంధం ఉంటుంది కదా? మధ్యమపరిమాణం లేదని చెప్పిన తరవాత ఇంక గత్యాగతులు అణుపరిమాణం ఉంటేనే కుదురుతాయి. గత్యాగతులు ఉంటాయన్న తరవాత ఉత్క్రాంతి కూడ దేహం విడిచి వెళ్లిపోవడమే అని తెలుస్తూన్నది. దేహం విడచివెళ్లనివానికి గత్యాగతులు కుదరవు కదా? అంతే కాకుండా - "చక్షుషో.... దేశేభ్యః"( నేత్రం నుండి గాని శిరస్సునుండి గాని, ఇతర శరీరప్రదేశాలనుండి గాని జీవుడు బైటకు వెళ్లిపోతాడు) అని దేహంలోని ప్రదేశాలు అపాదానాలు (దేని నుడి ఒక వస్తువు విడివడుతుందో అది అపాదానం) గా చెప్పబడ్డాయి. "స ఏతాన్...అవక్రామతి" (ఆ జీవుడు తేజోమాత్రలను (ఇంద్రియాలను) తనతో గ్రహించి స్వాపసమయంలో హృదయంలో చేరుతాడు), "శుక్ర....స్థానమ్" (ఇంద్రియాలను తనతో తీసికొని మళ్లీ జాగ్రదవస్థకు వస్తాడు) అని చెప్పినట్లు శరీరమధ్యంలోనే శారీరునికి ఒకచోటనుండి మరొకచోటికి గమనాగమనాలు జరుగుతాయి. అందువల్ల కూడ జీవునకు అణుత్వం సిద్ధిస్తుంది. 2.

## సూ. నాణురతచ్ఛ్రుతేరితి చేన్నేతరాధికారాత్. 2.3.21

అథాపి స్యాన్నాయమణురాత్మా. కస్మాత్-అతచ్ఛ్రుతేః. అణుత్వవిప రీతపరిమాణ శ్రవణాదిత్యర్థః. "స వా ఏష మహానజ ఆత్మా యోఽయం విజ్ఞాన మయః ప్రాణేషు" (బృ.ఉ.4.4.12) "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః. " సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ"(తై.ఉ.2.1.1) ఇత్యేవంజాతీయకా హి శ్రుతిరాత్మనోఽణుత్వే విప్రతిషిధ్యేతేతి చేత్; నైష దోషః. కస్మాత్? ఇతరాధికారాత్. పరస్య హ్యాత్మనః

ప్రక్రియాయామేషా పరిమాణాన్తరశ్రుతిః. పరస్యైవాత్మనః ప్రాధాన్యేన వేదాన్తేషు వేదితవ్యత్వేన ప్రకృతత్వాత్. "విరజః పర ఆకాశాత్" (బృ.ఉ.4.4.20) ఇత్యేవం విధాచ్చ పరస్యైవాత్మనః తత్ర తత్ర విశేషాధికారాత్. నను "యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు" (బృ.ఉ.4.4.22) ఇతి శారీర ఏవ మహత్త్వసంబన్ధిత్వేన ప్రతినిర్దిశ్యతే? శాస్త్రదృష్ట్యా త్వేష నిర్దేశో వామదేవవద్ద్రష్టవ్యః. తస్మాత్ప్రాజ్ఞవిషయత్వాత్పరిమాణాన్తరశ్రవణస్య న జీవస్యాణుత్వం విరుధ్యతే. 21.

బాలానందిని

నేతి :- "అతచ్ఛ్రుతేః = అణుత్వంకంటె భిన్నమైన మహాపరిమాణం వినబడడంవల్ల, అణుః న=జీవుడు అణుపరిమాణం కలవాడు కాడు, ఇతి చేత్=అన్నట్లయితే, న=కాదు; ఇతరాధికారాత్=అక్కడ పరమేశ్వరుని అధికారం (ప్రస్తావన) ఉండడం వల్ల" అని సూత్రార్థం.

అథాపీతి:- అయినా కూడ ఆత్మ అణువు కాజాలదు; ఎందువలన? అతచ్ఛ్రుతి వలన. అణుత్వానికి విపరీతమైన పరిమాణం వినబడుటవలన అని అర్థం. "స వా....ప్రాణేషు" "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః", "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" ఈ విధమైన శ్రుతి ఆత్మ అణుప్రమాణం కలదైతే విరుద్ధం అవుతుంది; అన్నట్లయితే-ఈ దోషం లేదు. ఎందువల్ల ఇతరమైన ఆత్మయొక్క అధికారంవల్ల. ఈ మరొక పరిమాణాన్ని గూర్చిన శ్రుతి పరమాత్మయొక్క ప్రక్రియలో వినడుచున్నది. తెలియతగినదిగా పరమాత్మయే వేదాంతాలలో ప్రధానంగా ప్రకృతం కదా? "విరజః పర ఆకాశాత్" (దోషాలు లేనివాడు, ఆకాశంకంటె పరుడు) అని అక్కడక్కడ పరమాత్మయొక్క ప్రసంగమే ఉన్నది కదా? (ప్రశ్న) "యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు" అనే వాక్యంలో విజ్ఞానమయుడే అనగా శారీరుడైన జీవుడే, మహాపరిమాణంతో సంబంధం ఉన్నట్లు చెప్పబడుచున్నాడు కదా? (సమాధానం) ఇది వామదేవుని విషయంలో శాస్త్రదృష్ట్యా (శాస్త్రానుసారం జీవుడు పరమాత్మాభిన్ను డనే దృష్టిచేత) చెప్పబడి నట్లు చూచుకోవాలి. అందువల్ల మరొక పరిమాణం ప్రాజ్ఞునకు (బ్రహ్మకు) సంబంధించినది గాన జీవుని అణుత్వానికి విరోధం లేదు. 2.

సూ. స్వశబ్దోన్మానాభ్యాం చ. 2.3.22.

ఇతశ్చాణురాత్మా యతః సాక్షాదేవాస్య అణుత్వవాచీ శబ్దః శ్రూయత్రే - "ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యో యస్మిన్ ప్రాణః పఞ్చధా సంవివేశ" (ము. ఉ.3.1.9) ఇతి. ప్రాణసంబన్ధాచ్చ జీవ ఏవాణురభిహిత ఇతి గమ్యతే. తథోన్మానమపి జీవస్యాణిమానం గమయతి-"వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ. భాగో జీవః స విజ్ఞేయః (శ్వే. ఉ. 8.8) ఇతి. "ఆరాగ్రమాత్రో ఽప్యవరోఽపి దృష్టః (శ్వే. ఉ. 5.8) ఇతి చోన్మానాన్తరమ్. 23.

బాలానందిని

స్వశబ్దేతి :- "స్వశబ్దోన్మానాభ్యాం చ అణుశబ్దప్రయోగంచేత, కొలతచేత కూడ జీవుడు అణుపరిమాణం కలవాడు" అని సూత్రార్థం.

ఇతశ్చేతి :- ఈ కారణంచేత కూడ జీవాత్మ అణుపరిమాణం కలవాడు, ఎందువల్ల ననగా జీవుని అణుత్వాన్ని సాక్షాత్తూ (స్పష్టంగా) చెప్పే శబ్దం - "ఏషోఽణు....సంవివేశ" (ము.ఉ.3.1.9) (ఏ ఆత్మయందు ప్రాణం ఐదు విధాలుగా చేరి ఉన్నదో అట్టి ఈ అణుపరిమాణం గల ఆత్మ చేతస్సుచేత తెలియదగినవాడు) అను శ్రుతిలో వినబడుచున్నది. ప్రాణసంబంధాన్ని పట్టి ఇక్కడ చెప్పిన అణుప్రమాణం కలది జీవాత్మయే అని తెలుస్తూన్నది. అట్లే ఉన్మానం కూడ(పైకి తీసి కొలవడం కూడ) "వాలాగ్ర...విజ్ఞేయః" (తోక చివరి నూరవ భాగాన్ని మళ్లీ నూరుభాగాలుగా చేస్తే ఎంత భాగం ఏర్పడుతుందో అది జీవుడుగా (జీవుని పరిమాణంగా) గ్రహించదగినది) అని జీవుని అణుత్వాన్ని తెలుపుచున్నది. "ఆరాగ్రమాత్రో హ్యవరోఽపి దృష్టః" (జీవుడు కొరడా చివర నాటి ఉన్న చిన్న ఇనుప ముల్లంత ఉంటాడు; ఇంకా చిన్నగా కూడ ఉంటాడు) అని మరొక కొలత. 22

భాష్యమ్

నన్వణుత్వే సత్యేకదేశస్థస్య సకలదేహగతోపలబ్ధిర్విరుధ్యతే; దృశ్యతే హి జాహ్నవీహ్రదనిమగ్నానాం సర్వాఙ్గశైత్యోపలబ్ధిః, నిదాఘసమయే చ సకలశరీరపరితాపోపలబ్ధిః ఇతి. అత ఉత్తరం పఠతి.

## సూ. అవిరోధశ్చన్దనవత్. 2.3.23.

యథా హి హరిచన్దనబిన్దుః శరీరైకదేశసంబద్ధోఽపి సన్ సకలదేహవ్యాపినమాహ్లాదం కరోత్యేవమాత్మాపి దేహైకదేశస్థః సకలదేహవ్యాపినీముపలబ్ధిం కరిష్యతి. త్వక్సంబన్ధాచ్చాస్య సకలశరీరగతా వేదనా న విరుధ్యతే, త్వగాత్మనోర్హి సంబన్ధః కృత్స్నాయాం త్వచి వర్తతే; త్వక్చ కృత్స్నశరీరవ్యాపినీతి. 23.

బాలానందిని

నన్వితి:- జీవుడు అణుపరిమాణం కలవాడైతే సకలదేహంలోనూ ఉన్న జ్ఞానం విరుద్ధం అవుతుంది. గంగాజలంలో మునిగినవాళ్లకి సమస్తదేహమునందూ కూడ శైత్యజ్ఞానం కనబడుతున్నది కదా? గ్రీష్మంలో సమస్తమైన శరీరంలోను తాపం కనబడుతున్నది కదా? ఇందుకు సమాధానం చెపుతున్నాడు-

అవిరోధ ఇతి:-"చన్దనవత్= చందనం విషయంలో వలె, అవిరోధః=విరోధం లేదు" అని సూత్రార్థం.

యథాహీతి :- మంచిగంధపు చుక్క శరీరంలోని ఒక ప్రదేశంమీద ఉన్నా కూడ ఏ విధంగా సకలదేహాన్ని వ్యాపించే ఆహ్లాదాన్ని కలిగిస్తుందో అదే విధంగా దేహంలో ఒక ప్రదేశంలో ఉన్నా కూడ ఆత్మ దేహం అంతటా వ్యాపించే జ్ఞానాన్ని కలిగిస్తాడు. దీనికి త్వగింద్రియంతో సంబంధం ఉంటుంది గాన వేదన శరీరాన్నంతనీ వ్యాపించడంలో విరోధం లేదు. త్వగింద్రియాత్మల సంబంధం సమస్తమైన త్వక్కు మీద ఉన్నది. ఆ త్వక్కు మొత్తం శరీరాన్నంతనీ వ్యాపించి ఉంది. అనగా త్వగాత్మల సంబంధంవల్ల సుఖాదికం కలుగుతుంది; ఆ త్వగింద్రియమైతే శరీరం అంతటా వ్యాపించి ఉంది. అందుచేత మొత్తం శరీరంమీద తాపాదికం కలగవచ్చును అని భావం. 23.

## సూ. అవస్థితివైశేష్యాదితి చేన్నాభ్యుపగమాద్ధృది హి. 2.3.24.

అత్రాహ - యదుక్తమవిరోధశ్చన్దనవత్ ఇతి, తదయుక్తం, దృష్టాన్తదార్ష్టాన్తికయోః అతుల్యత్వాత్, సిద్ధే హ్యాత్మనో దేహైకదేశస్థత్వే చన్దనదృష్టాన్తో భవతి, ప్రత్యక్షం తు చన్దనస్యావస్థితివైశేష్యమేకదేశస్థత్వం

సకలదేహహ్లాదనం చ. ఆత్మనః పునః సకల దేహోపలబ్ధిమాత్రం ప్రత్యక్షం నైకదేశవర్తిత్వమ్. అనుమేయం తు తదితి యదప్యుచ్యేత; న చాత్రానుమానం సంభవతి. కిమాత్మనః సకలశరీరగతా వేదనా త్వగిన్ద్రియస్యేవ సకలదేహవ్యాపినః సతః కిం వా విభోర్నభస ఇవ, ఆహోస్విచ్చన్దనబిన్దోరివ అణోరేకదేశస్థస్యేతి సంశయానివృత్తేరితి.

అత్రోచ్యతే-నాయం దోషః. కస్మాత్? అభ్యుపగమాత్. అభ్యుపగమ్యతే హ్యాత్మనోఽపి చన్దనస్యేవ దేహైకదేశవృత్తిత్వమవస్థితివైశేష్యమ్. కథమిత్యుచ్యతే. హృది హ్యేష ఆత్మా పఠ్యతే వేదాన్తేషు-"హృది హ్యేష ఆత్మా" (ప్రశ్న ఉ. 3.6) "స వా ఏష ఆత్మా హృది" (ఛా.ఉ.8.3.3), "కతమ ఆత్మేతి, యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యన్తర్జ్యోతిః పురుషః" (బృ ఉ. 4.3.7) ఇత్యాద్యుపదేశేభ్యః. తస్మాద్దృష్టాన్తదార్ష్టాన్తికయోరవైషమ్యాదుక్త మేవైతదవిరోధశ్చన్దనవదితి. 24.

బాలానందిని

అవస్థితివైశేష్యాదితి :- "అవస్థితివైశేష్యాత్=చందనబిందువుయొక్క స్థితిలో విశేషంవల్ల (అక్కడ కుదురుతుంది గాని అత్మ విషయంలో కుదరదు), ఇతి చేత్=అన్నట్లయితే, న=కాదు. అభ్యుపగమాత్=శ్రుతిలో అంగీకరించడంవల్ల. హృది హి= ఆత్మ హృదయంలో ఉన్నది కదా" అని సూత్రార్థం.

అత్రేతి :- ఈ విషయంలో ప్రతివాది ఇలా అంటున్నాడు. "అవిరోధశ్చన్దనవత్" అని చెప్పినది యుక్తం కాదు. దృష్టాంతదార్ష్టాంతికాలలో భేదం ఉన్నది. ఆత్మ దేహం యొక్క ఒక ప్రదేశంలో ఉన్న దనే విషయం సిద్ధమైతే చందనదృష్టాంతం కుదురుతుంది చందనానికి అవస్థితివైశేష్యం, అనగా ఒక ప్రదేశంలో ఉండడం, సకలదేహానికి ఆహ్లాదం కలిగించడం స్పష్టంగా కనబడుతున్నది. ఆత్మ విషయంలో నైతే (శీతస్పర్శ-తాపాదులు) దేహం అంతటా కనబడడం ప్రత్యక్షమే కాని(ఆత్మ) ఏకదేశంలో ఉండడం మాత్రం ప్రత్యక్షం కాదు. ఆ విషయం అనుమానంచేత గ్రహించాలి అని చెప్పడానికి అ

విషయంలో అనుమానం సంభవించదు; ఎందువల్లననగా ఆత్మ త్వగింద్రియం వలె సకలదేహాన్ని వ్యాపించి ఉండడంచేత సకలశరీరానికి సంబంధించిన వేదన తెలుస్తూన్నదా; ఆకాశం వలె విభువు (సర్వవ్యాపి) అవడంచేతనా, లేక చందనబిందువు వలె అణువై ఒక దేశంలో ఉండగానే తెలుస్తూన్నదా అనే సంశయం తొలగడం లేదు కదా?(ఈ విధంగా సరియైన వ్యాప్తిజ్ఞానం లేకపోవడంచేత అనుమానం కుదరదు అని భావం).

ఈ విషయంలో చెప్పబడుచున్నది. ఈ దోషం లేదు. ఎందువల్ల? అంగీకరించడంవల్ల. ఆత్మకు కూడ చందనానికి వలె అవస్థితివైశేష్యం అనగా దేహం యొక్క ఒక భాగంలో ఉండడం అంగీకరించబడుచున్నది. ఎట్లనగా చెప్పడుచున్నది - "హృదిహ్యేష ఆత్మా" "స వా ఏష ఆత్మా హృది", "కతమ ఆత్మేతి యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యన్తర్జ్యోతిః పురుష": ఈ మొదలైన ఉపదేశాలవల్ల ఈ ఆత్మ హృదయంలో ఉన్నట్లు వేందాలలో పఠింపబడుచున్నాడు కదా? అందువల్ల దృష్టాంత దార్ష్టాంతికాలకి వైషమ్యం లేదు గాన అవిరోధశ్చన్దనవత్ అని చెప్పడం యుక్తమ్. 24.

సూ.గుణాద్వా లోకవత్. 2.3.25.

చైతన్యగుణవ్యాప్తేర్వాఽణోరపి సతో జీవస్య సకలదేహవ్యాపి కార్యం న విరుధ్యతే. యథా లోకే మణిప్రదీపప్రభృతీనామపవరకైకదేశవర్తినామపి ప్రభాఽపవరకవ్యాపినీ సతీ కృత్స్నేఽపవరకే కార్యం కరోతి తద్వత్. స్యాత్కదాచిచ్చన్దనస్య సావయవత్వాత్సూక్ష్మావయవవిసర్పణేనాపి సకలదేహే అహ్లాదయితృత్వం, న త్వణోర్జీవస్యావయవాః సన్తి యైరయం సకలదేహం విసర్పేదిత్యాశఙ్క్య "గుణాద్వా లోకవత్" ఇత్యుక్తమ్. 23.

బాలానందిని

గుణాదితి :- "లోకవత్=లోకమునందు వలె, గుణాద్వా=చైతన్యగుణంవల్ల గాని సకలదేహాన్ని వ్యాపించడం కుదురుతుంది" అని సూత్రార్థం.

చైతన్యేతి :- జీవుడు అణువే అయినా కూడ చైతన్యం అనే గుణం వ్యాపించడంచేత సకలదేహాన్ని వ్యాపించే కార్యం జరగడంలో విరోధం లేదు. లోకంలో గదిలోని ఒక

మూల ఉన్నా కూడ మణులు దీపం మొదలైనవాటి కాంతి మొత్తం గది నంతా వ్యాపిస్తూ ఆ గదిలో కార్యం ఎలా చేస్తుందో ఇది కూడ అట్లే. చందనం సావయవంగాన దాని సూక్ష్మమైన అవయవాలు వ్యాపించడంచేత కూడ ఒక వేళ, సకలదేహానికీ ఆనందం కలిగించడం సంభవించవచ్చు. కాని అణువైన జీవునికి అవయవాలు లేవు గాన వీటితో సకలదేహాన్ని వ్యాపింపజాలడు అని ఆశంకించుకొని "గుణాద్వా లోకవత్" అని చెప్పడింది.25.

## భాష్యమ్

కథం పునర్గుణో గుణివ్యతిరేకేణాన్యత్ర వర్తేత? న హి పటస్య శుక్లో గుణః పటవ్యతిరేకేణాన్యత్ర వర్తమానో దృశ్యతే. ప్రదీపప్రభావద్భవేదితి చేత్, న. తస్యా అపి ద్రవ్యత్వాభ్యుపగమాత్. నిబిడావయవం హి తేజోద్రవ్యం ప్రదీపః, ప్రవిరలావయవం తు తేజోద్రవ్యమేవ ప్రభేతి. అత ఉత్తరం పఠతి :-

## సూ. వ్యతిరేకో గన్ధవత్. 2.3.26

యథా గుణస్యాపి సతో గన్ధస్య గన్ధవద్ద్రవ్యవ్యతిరేకేణ వృత్తిర్భవతి; అప్రాప్తేష్వపి కుసుమాదిషు గన్ధవత్సు కుసుమగన్ధోపలబ్ధేః; ఏవమణోరపి సతో జీవస్య చైతన్యగుణవ్యతిరేకో భవిష్యతి. అతశ్చానైకాన్తికమేతద్గుణత్వాద్రూపాదివదాశ్రయవిశ్లేషానుపపత్తిరితి; గుణస్యైవ సతో గన్ధస్యాశ్రయవిశ్లేషదర్శనాత్. గన్ధస్యాపి సహైవాశ్రయేణ విశ్లేష ఇతి చేత్; న. యస్మాన్మూలద్రవ్యాత్తస్య విశ్లేషస్తస్య క్షయప్రసంగాత్. అక్షీయమాణమపి తత్పూర్వావస్థాతో గమ్యతే. అన్యథా తత్పూర్వావస్థైర్గురుత్వాదిభిర్హీయేత. స్యాదేతత్- గన్ధాశ్రయాణాం విశ్లిష్టానామవయవానామల్పత్వాత్సన్నపి విశేషో నోపలక్ష్యతే; సూక్ష్మా హి గన్ధపరమాణవః సర్వతో విప్రసృతాః గన్ధబుద్ధిముత్పాదయన్తి నాసికాపుటమనుప్రవిశన్త ఇతి చేత్; న. అతీన్ద్రియత్వాత్పరమాణూనామ్; గన్ధస్ఫుటోపలబ్ధేశ్చ నాగకేసరాదిషు. న చ లోకే ప్రతీతిర్గన్ధవద్ద్రవ్యమాఘ్రాతమితి; గన్ధ ఏవాఘ్రాత ఇతి తు లౌకికాః ప్రతియన్తి.

రూపాదిష్వాశ్రయవ్యతిరేకానుపలబ్ధేర్గన్ధస్యాప్యయుక్త ఆశ్రయవ్యతిరేక ఇతి చేత్; న. ప్రత్యక్షత్వాదనుమానాప్రవృత్తేః. తస్మాద్యథా లోకే దృష్టం తత్తథైవానుమాతవ్యం నిరూపకైర్నాన్యథా. న హి రసో గుణో జిహ్వయోపలభ్యత ఇత్యతో రూపాదయోఽపి గుణా జిహ్వయైవోపలభ్యేరన్నితి నియన్తుం శక్యతే. 26.

బాలానందిని

కథమితి :- గుణం గుణిని విడిచి మరొక చోట ఎలా ఉంటుంది? పటంయొక్క శుక్లగుణం పటాన్ని విడిచి మరొక చోట ఉంటూన్నట్లు కనబడడం లేదు కదా? దీపకాంతి వలె ఉంటుంది అన్నట్లయితే- అది యుక్తం కాదు. దీపకాంతి కూడ ద్రవ్యమే అని అంగీకరించబడింది. దట్టంగా ఉన్న తేజోవయవాలు ఉన్న తేజోద్రవ్యమైతే అది దీపం అవుతుంది, ఆ తేజోద్రవ్యమే అవయాలు పల్చగా (తక్కువగా) ఉంటే కాంతి అవుతుంది. అందుకు సమాధానం పలికిస్తున్నాడు-"వ్యతిరేకో గన్ధవత్."

వ్యతిరేక ఇతి:-"గన్ధవత్=గంధానికి వలె, వ్యతిరేకః=ఆశ్రయంనుంచి వేరువడడం కుదురుతుంది" అని సూత్రార్థం.

యథేతి :- సువాసనగల పుష్పాదుల దగ్గరికి వెళ్లకపోయినా ఆ పుష్పాల గంధం తెలుస్తుంది. అందుచేత గుణమే అయినా కూడ గంధం గంధాశ్రయమైన ద్రవ్యానికి దూరంగా ఉండడం జరుగుతుంది. ఇదే విధంగా జీవుడు అణువే అయినా కూడ చైతన్యగుణం వానికి దూరంగా ఉంటుంది. అందుచేత, "గుణం అవడంచేత రూపాదుల వలె, ఆశ్రయాన్ని విడిచి ఉండకూడదు" అనే ఈ అనుమానం అనైకాంతికం. (వ్యభిచారదోషం గలది). గంధం కూడ ఆశ్రయంతో సహితంగానే (పుష్పాదులనుండి) వెలివడుతుంది అన్నట్లయితే అది యుక్తం కాదు. అది ఏ మూలద్రవ్యంనుండి వెలివడుతుందో అది క్షీణించవలసి వస్తుంది. అది (కుసుమాదికం) పూర్వావస్థకంటె ఏ మాత్రమూ క్షీణించకుండా ఉన్నట్లు కనబడుతున్నది. అలా కాకపోతే పూర్వావస్థలో ఉన్న దాని గురుత్వాదులు తగ్గిపోవాలి. సరే అది అలా ఉండనీయండి- గంధానికి ఆశ్రయమైన (పుష్పాదులనుండి) విడిపోయిన అవయవాలు అల్పమైనవి గాన కొంచెం విశేషం ఉన్నా కూడ గుర్తింపబడడంలేదు. సూక్ష్మమైన గంధపరమాణువులు (గంధంతో

కూడిన పరమాణువులు) నలు వైపులా వ్యాపించి నాసికాపుటంలో ప్రవేశించి గంధజ్ఞానం కలిగిస్తాయి అని అంటే అది యుక్తం కాదు. పరమాణువులు అతీంద్రియాలు కదా? నాగకేసరాదిపుష్పాలనుండి స్పష్టంగా గంధం తెలుస్తున్నది. లోకంలో గంధం వాసనచూడబడింది అనే ప్రతీతి మాత్రమే ఉంది గాని గంధం ఉన్న ద్రవ్యం వాసన చూడబడింది అనే ప్రతీతి లేదు కదా? రూపాదులు తమ ఆశ్రయాన్ని విడచి (వాటికి దూరంగా) ఉండి కనబడడంలేదు గాన గంధం కూడ ఆశ్రయానికి దూరంగా ఉండడం యుక్తం కాదు అన్నట్లైతే-అది యుక్తం కాదు. ఇది ప్రత్యక్షం గాన అనుమానానికి ప్రవృత్తి లేదు. అందుచేత, పరిశీలన చేసే బుద్ధిమంతులు లోకంలో ఏది ఎలా కనబడుతుందో దాన్ని ఆ విధంగానే అంగీకరించాలి. రసం అనే గుణం జిహ్వచేత గ్రహింపబడుతుంది కదా అని రూపాది గుణాలు కూడ (గుణా లవడంచేత) జిహ్వచేతనే గ్రహించబడాలి అని నియమం ఏర్పరచడం శక్యం కాదు కదా? 26.

### సూ. తథా చ దర్శయతి. 2.3.27

హృదయాయతనత్వమణుపరిమాణత్వం చాత్మనోఽభిధాయ తస్యైవ "ఆ లోమభ్య ఆ నఖాగ్రేభ్యః" (ఛా. ఉ. 8.8.1) ఇతి చైతన్యేన గుణేన సమస్తశరీరవ్యాపిత్వం దర్శయతి. 27.

### బాలానందిని

తథేతి :- "తథా= ఆ విధంగానే, దర్శయతి చ=శ్రుతి చూపుతున్నది కూడ" అని సూత్రార్థం.

హృదయేతి :- ఆత్మ హృదయంలో ఉంటుంది. అణుపరిమాణం గలది అని చెప్పి ఆ ఆత్మయే చైతన్యగుణంచేత సమస్తశరీరాన్ని వ్యాపించి ఉన్నట్లు- "ఆ లోమభ్య ఆ నఖాగ్రేభ్యః" అనే శ్రుతి తెలుపుతూన్నది. 27.

### సూ. పృథగుపదేశాత్. 2.3.28

"ప్రజ్ఞయా ఇదం శరీరం సమారుహ్య" (కౌషీ 3.6) ఇతి చ ఆత్మప్రజ్ఞయోః కర్తృకరణభావేన పృథగుపదేశాచ్చైతన్యగుణేనైవాస్య శరీరవ్యాపితా గమ్యతే.

"తదేషాం ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞానమాదాయ" (బృ.ఉ.2.1.17) ఇతి చ కర్తుః శారీరాత్ పృథగ్విజ్ఞానస్యోపదేశ ఏతదేవాభిప్రాయముపోద్బలయతి. తస్మాదణురాత్మేతి. 28

బాలానందిని

పృథగితి:- "పృథక్=(ఆత్మను చైతన్యాన్నీ వేరు వేరుగా, ఉపదేశాత్ =ఉపదేశించడంవల్ల కూడ" అని సూత్రార్థం.

ప్రజ్ఞయేతి :- "ప్రజ్ఞయా శరీరం సమారుహ్య" (ప్రజ్ఞచేత, జ్ఞానంచేత) శరీరాన్ని అధిష్ఠించి) అని ఆత్మను ప్రజ్ఞనూ కర్తృకరణభావంచేత (ఆత్మ శరీరాన్ని అధిష్ఠించడంలో కర్త అని ఆ క్రియలోనే ప్రజ్ఞ కరణం, సాధనం, అనీ)వేరు వేరుగా చెప్పడంచేత ఆత్మ చైతన్యగుణంచేతనే శరీరాన్ని వ్యాపించినట్లు తెలుస్తూన్నది. "తదేషా.......ఆదాయ" (ఈ ఇంద్రియాల జ్ఞానశక్తిని చైతన్యశక్తిచేత గ్రహించి) అని (గ్రహణ) కర్తయైన శారీరునికంటె వేరుగా విజ్ఞానాన్ని చెప్పడం ఈ అభిప్రాయాన్నే బలపరుస్తున్నది. అందువల్ల ఆత్మ అణుప్రమాణం గలది. 28.

భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః-

సూ. తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్. 2.3.29

తుశబ్దః పక్షం వ్యావర్తయతి. నైతదస్త్యణురాత్మేతి. ఉత్పత్త్యశ్రవణాద్ధి పరస్యైవ తు బహ్మణః ప్రవేశశ్రవణాత్ తాదాత్మ్యోపదేశాచ్చ పరమేవ బ్రహ్మ జీవ ఇత్యుక్తమ్. పరమేవ బ్రహ్మ చేజ్జీవస్తస్మాద్యావత్పరం బ్రహ్మ తావానేవ జీవో భవితుమర్హతి. పరస్య చ బ్రహ్మణో విభుత్వమామ్నాతమ్, తస్మాద్విభుర్జీవః. తథా చ "స వా ఏషమహానజ ఆత్మా యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు" (బృ.ఉ.4.4.22) ఇత్యేవంజాతీయకా జీవవిషయా విభుత్వవాదాః శ్రౌతాః స్మార్తాశ్చ సమర్థితా భవన్తి. న చాణోర్జీవస్య సకలశరీరగతా వేదనోపపద్యతే. త్వక్సంబన్ధాత్

స్యాదితి చేత్; న. త్వక్కణ్టకతోదనేఽపి సకలశరీరగతైవ వేదనా ప్రసజ్యేత; త్వక్కణ్టకయోర్హి సంయోగః కృత్స్నాయాం త్వచి వర్తతే, త్వక్చ కృత్స్న శరీరవ్యాపినీతి. పాదతల ఏవ తు కణ్టకతున్నా వేదనాం ప్రతిలభన్తే. న చాణోర్గుణవ్యాప్తి రుపపద్యతే, గుణస్య గుణిదేశత్వాత్. గుణత్వమేవ హి గుణినమనాశ్రిత్య గుణస్య హీయేత. ప్రదీపప్రభాయాశ్చ ద్రవ్యాన్తరత్వం వ్యాఖ్యాతమ్. గన్ధోఽపి గుణత్వాభ్యుపగమాత్సాశ్రయ ఏవ సంచరితుమర్హతి. అన్యథా గుణత్వహానిప్రసంగాత్. తథాచోక్తం ద్వైపాయనేన.

''ఉపలభ్యాప్సు చేద్గన్ధం కేచిద్బ్రూయురనైపుణాః,

పృథివ్యామేవ తం విద్యాదపో వాయుం చ సంశ్రితమ్. (శాంతి. 232.9)

ఇతి. యది చైతన్యం జీవస్య సమస్తం శరీరం వ్యాప్నుయాన్నాణుర్జీవః స్యాత్. చైతన్యమేవ హ్యస్య స్వరూపమగ్నేరివౌష్ణ్యప్రకాశౌ, నాత్ర గుణగుణివిభాగో విద్యత ఇతి. శరీరపరిమాణత్వం చ ప్రత్యాఖ్యాతమ్. పరిశేషాద్విభుర్జీవః.

బాలానందిని

ఏవమితి:- ఈ విధంగా పూర్వపక్షం ప్రాప్తించగా చెపుతున్నాము:-

తద్గుణసారత్వాదితి:- తద్గుణసారత్వాత్=జీవుడు ఆ బుద్ధ్యాదుల గుణాలే సారంగా కలవాడవడంవలన, ప్రాజ్ఞవత్= పరమాత్మకు ఉపాధిసంబంధంచేత ఆ యా రూపాదులు చెప్పినట్లు,తద్వ్యపదేశః= అణుత్వాదుల వ్యపదేశం" అని సూత్రార్థం.

తుశబ్ద ఇతి :- తుశబ్దం పూర్వపక్షాన్ని నిరాకరిస్తుంది. ఆత్మ అణువు అనే మాట లేదు. జీవునకు ఉత్పత్తి వినబడకపోవడంవల్ల, బ్రహ్మయే ప్రవేశించి నట్లు వినబడడంవల్లా (జీవపరమాత్మలకు) అభేదాన్ని ఉపదేశించడంవల్ల కూడ పరబ్రహ్మయే జీవుడు అని చెప్పబడింది. జీవుడు పరబ్రహ్మయే అయితే బ్రహ్మ ఎంత పరిమాణంగలదో జీవుడు కూడ అంత పరిమాణమే కలవాడవడం యుక్తం. పరబ్రహ్మ విభువు (సర్వవ్యాపి) అని చెప్పబడింది. అందువల్ల జీవుడు విభువు. అలా చెపితేనే "స వా....ప్రాణేషు" మొదలైన జీవునికి సంబంధించిన శ్రౌతములూ స్మార్తములూ అయిన విభుత్వప్రతిపాదనలు

సమర్థించబడినట్లవుతాయి. అణువైతే జీవునికి సకలశరీరానికి సంబంధించిన వేదన కుదరదు. జీవునికి త్వగింద్రియంతో సంబంధం ఉంది గాన కుదురుతుంది అన్నట్లయితే అది యుక్తం కాదు. చర్మకు ముల్లు గ్రుచ్చుకొన్నప్పుడు కూడ వేదన సమస్తశరీరానికీ కలిగే ప్రసక్తి ఏర్పడుతుంది. ఎందువల్ల ననగా (మీరు చెప్పినట్లు) త్వక్కుకు, ముల్లుకు కలిగిన సంయోగం మొత్తం త్వక్కునందు ఉంది కదా? కాని ముల్లు గ్రుచ్చుకొన్న వాళ్లకి అరికాలిలోనే బాధ కలుగుతున్నది. మరొక విషయ మేమనగా అణువైతే దాని గుణం అంతటా వ్యాపించడం ఉపపన్నం కాదు. గుణం గుణి ఎక్కడుంటుందో అక్కడనే ఉంటుంది కదా? గుణిని విడిచి పెడితే అది గుణమే కాకుండా పోతుంది. దీపకాంతి మరొక ద్రవ్యమే అని వివరించబడింది. గంధం కూడ గుణం అని అంగీకరించడంచేత అది సంచరించాలంటే దాని ఆశ్రయంతో పాటే సంచరించకలుగుతుంది. అలా కాకపోతే దాని గుణత్వానికే హాని కలుగుతుంది. ఈ విషయమే వ్యాసుడు "ఉపలభ్య....సంశ్రితమ్" (నీళ్లల్లో గంధం చూచి అది నీళ్లల్లో ఉండేదే అని తెలివితక్కువాళ్లు మాత్రమే అంటారు. అది నిజానికి పృథ్విలో మాత్రమే ఉంటుంది. నీళ్లను, వాయువును కూడ చేరుతూంటుంది) అని చెప్పిఉన్నాడు. జీవుని చైతన్యం సమస్తశరీరాన్ని వ్యాపిస్తే జీవుడు అణుప్రమాణం కలవాడు కాజాలడు. అగ్నికి ఉష్ణత్వం, ప్రకాశ స్వరూపం అన్నట్లు చైతన్యమే జీవుని స్వరూపం కదా? ఇక్కడ గుణ-గుణివిభాగం (చైతన్యం గుణ మనీ, జీవుడు గుణి అనీ విభాగం) లేదు జీవుడు శరీరపరిమాణం గలవా డనే వాదం వెనుకనే నిరాకరించబడింది. అందుచేత పరిశేషన్యాయంచేత జీవుడు విభువు.

## భాష్యమ్

కథం తర్హ్యణుత్వాదివ్యపదేశ ఇత్యత ఆహ - "తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః" ఇతి. తస్యా బుద్ధేర్గుణాస్తద్గుణాః, ఇచ్ఛా, ద్వేషః, సుఖమ్, దుఃఖమిత్యేవమాదయ స్తద్గుణాః సారః ప్రధానం యస్మాత్మనః సంసారిత్వే సంభవతి స తద్గుణసారః; తస్య భావః తద్గుణసారత్వమ్. న హి బుద్ధేర్గుణైర్వినా కేవలస్యాత్మనః సంసారిత్వమస్తి; బుద్ధ్యుపాధిధర్మాధ్యాసనిమిత్తం హి కర్తృభోక్తృత్వాదిలక్షణం సంసారిత్వమకర్తురభోక్తుశ్చ అసంసారిణో నిత్యముక్తస్య

సత ఆత్మనః. తస్మాత్తద్గుణసారత్వాద్బుద్ధిపరిమాణేనాస్య పరిమాణవ్యపదేశః. తదుత్క్రాన్త్యాదిభిశాస్యోత్క్రాన్తివ్యపదేశో న స్వతః.

"వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ,

భాగో జీవః స విజ్ఞేయః స చానన్త్యాయ కల్పతే" (శ్వే.ఉ.5.9)

ఇత్యణుత్వం జీవస్యోక్త్వా తస్యైవ పునరానన్త్యమాహ. తచ్చైవమేవ సమఞ్జసం స్యాద్యద్యౌపచారికమణుత్వం జీవస్య భవేత్ పారమార్థికం చానన్త్యమ్. న హ్యుభయం ముఖ్యమవకల్పేత. న చానన్త్యమౌపచారికమితి శక్యం విజ్ఞాతుమ్. సర్వోపనిషత్సు బ్రహ్మాత్మ భావస్య ప్రతిపిపాదయిషితత్వాత్. తథా ఇతరస్మిన్నప్యున్మానే - "బుద్ధేర్గుణేనాత్మగుణేన చైవ ఆరాగ్రమాత్రోహ్య వరోఽపి దృష్టః" (శ్వే. ఉ. 68) ఇతి చ బుద్ధిగుణసంబన్ధేనైవారాగ్రమాత్రతాం శాస్తి న స్వేనైవాత్మనా. "ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః"(ము.ఉ. 3.1.9) ఇత్యత్రాపి న జీవస్యాణుపరిమాణత్వం శిష్యతే, పరస్యైవాత్మనశ్చక్షురాద్యనవగ్రాహ్యత్వేన, జ్ఞానప్రసాదగమ్యత్వేన చ ప్రకృతత్వాత్. తస్మాద్దుర్జ్ఞానత్వాభిప్రాయమి దమణుత్వవచనముపాధ్యభిప్రాయం వా ద్రష్టవ్యమ్.

బాలానందిని

కథమితి :- అయితే అణుత్వాదివ్యపదేశం ఎట్లు అని ఆశంకకు సమాధానం "తద్గుణ సారత్వాత్తు తద్వ్యపదేశః" అని చెపుతున్నాడు. తస్యాః బుద్ధేః గుణాః తద్గుణాః= ఆ బుద్ధియొక్క గుణాలు. ఇచ్ఛ, ద్వేషం, సుఖం, దుఃఖం ఇత్యాదులు దాని గుణాలు. అవి ఏ ఆత్మకు సంసారిత్వం కల్పించడంలో సారమో, అనగా ప్రధాన మైనవో అది తద్గుణసారం. తద్గుణసారంయొక్క ధర్మం తద్గుణసారత్వం. బుద్ధియొక్క గుణాలు లేకుండా కేవలమైన ఆత్మకు సంసారిత్వం లేదు కదా? కర్తృత్వం కాని భోక్తృత్వం కాని లేనివాడు, సంసారరహితుడు, నిత్యముక్తుడు అయిన ఆత్మకు కర్తృత్వభోక్తృత్వాది రూపమైన సంసారిత్వం బుద్ధి మొదలైన ఉపాధుల ధర్మాలను అధ్యసించడంవల్లనే ఏర్పడుచున్నది కదా? అందువల్ల, తద్గుణసారత్వంవల్ల ఈ ఆత్మకు బుద్ధిపరిమాణాన్ని

పట్టి పరిమాణం చెప్పబడుచున్నది. దాని (బుద్ధియొక్క) ఉత్క్రాంత్యాదులచేత ఉత్క్రాంత్యాదులు చెప్పబడుతున్నాయి. అంతే కాని స్వతః దానికి ఇవేవీ లేదు. అట్లే- "వాలాగ్ర...కల్పతే" అని జీవునకు అణుత్వాన్ని చెప్పి తిరిగి ఆ ఆత్మకే అనంతత్వాన్ని కూడ చెప్తున్నది. (అనగా ముందుగా వాలాగ్రశతతమభాగంలో శతతమభాగం ఎంతో జీవుడు కూడ అంతే అని చెప్పి అదే మంత్రంలో "స చానన్త్యాయ కల్పతే" ఆ జీవుడే అనంతు డని చెప్పబడింది). జీవుని అణుత్వం కల్పితమై అనంత్యం పారమార్థికం అన్నప్పుడే ఇలా చెప్పడం సమంజసంగా ఉంటుంది. రెండింటికీ (అణుత్వానికీ అనంత్యానికీ) ముఖ్యత్వం కుదరదు కదా? సమస్తమైన ఉపనిషత్తులలోను కూడ జీవునకు బ్రహ్మత్వం ప్రతిపాదించడానికి ఉద్దిష్టమైనది గాన అనంత్యమే ఔపచారికం (అణుత్వం ముఖ్యం) అని గ్రహించడానికి శక్యం కాదు. "బుద్ధే...దృష్టః" అనే రెండవ ఉన్మానంలో కూడ బుద్ధి యొక్క గుణాలతో సంబంధాన్ని పట్టి మాత్రమే ఆరాగ్రమాత్రత్వాన్ని (శ్రుతి) శాసిస్తున్నది గాని సహజంగా కాదు. "ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః" అనే వాక్యంలో కూడ జీవునకు అణుపరిమాణత్వం బోధించబడడం లేదు. ఎందువల్ల ననగా పరమాత్మ చక్షురాదులచేత గ్రహింప శక్యం కానివాడనీ, జ్ఞానప్రసాదంచేత (నిర్మలమైన జ్ఞానం చేత) గమ్య మనీ (ఈ ఘట్టంలో) ప్రకృత మైనది. జీవునకు ముఖ్యమైన అణు పరిమాణత్వం కుదరదు కదా? అందుచేత ఆత్మ అణువని చెప్పే వాక్యాలకు అభిప్రాయం ఆత్మ తెలియడానికి చాల కష్టమైనది, లేదా ఉపాధులను పట్టి అణుప్రమాణం కలది అని మాత్రమే.

భాష్యమ్.

తథా "ప్రజ్ఞయా శరీరం సమారుహ్య" (కౌషీ. 7.6) ఇత్యేవంజాతీయకేష్వపి భేదోపదేశేషు బుద్ధ్యైవోపాధిభూతయా జీవః శరీరం సమారుహ్య ఇత్యేవం యోజయితవ్యమ్. వ్యపదేశమాత్రం వా శిలాపుత్రకస్య శరీరమిత్యాదివత్. న హ్యత్ర గుణగుణిభావో విద్యత ఇత్యుక్తమ్. హృదయాయతనత్వవచనమపి బుద్ధేరేవ, తదాయతనత్వాత్. తథోత్క్రాన్త్యాదీనామపి ఉపాధ్యాయత్తతాం దర్శయతి-"కస్మిన్నహముత్క్రాన్త ఉత్క్రాన్తో భవిష్యామి కస్మిన్వా ప్రతిష్ఠితే

ప్రతిష్ఠాస్యామీతి" (ప్ర.ఉ.6.3),"స ప్రాణమసృజత" (ప్ర.ఉ.6.4) ఇతి. ఉత్క్రాన్త్యభావే హి గత్యాగత్యోరప్యభావో విజ్ఞాయతే; న హ్యనపసృప్తస్య దేహాద్గత్యాగతీ స్యాతామ్. ఏవముపాధిగుణసారత్వాజ్జీవస్య అణుత్వాదివ్యపదేశః ప్రాజ్ఞవత్. యథా ప్రాజ్ఞస్య పరమాత్మనః సగుణేషూపాసనేషూపాధి గుణసారత్వాదణీయస్త్వాదివ్యపదేశః-"అణీయాన్వ్రీహేర్వా యవాద్వా" (ఛా.ఉ.3.14. 2). "మనోమయః ప్రాణశరీరః సర్వగన్ధః సర్వరసః సత్యకామః సత్యసంకల్పః" (ఛా.ఉ.3.14.2) ఇత్యేవంప్రకారస్తద్వత్. 19.

బాలానందిని

తథేతి :- అట్లే "ప్రజ్ఞయా శరీరం సమారుహ్య" ఇత్యాదికములైన భేదాన్ని ఉపదేశించే వాక్యాలలో కూడ (ప్రజ్ఞయా అనే శబ్దానికి బుద్ధిచేత అని అర్థం చెప్పి) ఉపాధియైన బుద్ధిచేత జీవుడు శరీరాన్ని అధిష్ఠించి అని అర్థం చెప్పుకోవాలి. ( ప్రజ్ఞయా అనేదానికి చైతన్య మని అర్థం చెప్పినట్లయితే) శిలాప్రతిమయొక్క శరీరం ఇత్యాదుల వలె ఇది కేవలం చెప్పడం మాత్రమే. (శిలాప్రతిమ వేరు దాని శరీరం వేరు కాదు. అయినా అవి వేరైనట్లు భేదాన్ని ఆరోపించి శిలాప్రతిమయొక్క శరీరం అన్నట్లు జీవుడు వేరు చైతన్యం వేరు కాకపోయినా భిన్నమైనట్లు నిర్దేశం చేయబడింది అని భావం). ఎందువల్ల ననగా ఇక్కడ (జీవచైతన్యాల మధ్య) గుణగుణిభావం లేదని చెప్పి ఉన్నాం. బుద్ధి హృదయంలో ఉంటుంది కాబట్టి దానిని పట్టియే ఆత్మకు హృదయాయతనత్వం చెప్పబడింది. అట్లే-"కస్మిన్....ప్రతిష్ఠాస్యామి" (ఏది లేచిపోయినప్పుడు నేను కూడ లేచిపోతాను. ఏది ప్రతిష్ఠిత మైనప్పుడు నేను ప్రతిష్ఠిత మవుతాను అని (ఆలోచించి) "స ప్రాణమసృజత" (అతడు ప్రాణాన్ని సృష్టించాడు) అని ఉత్క్రాంతి మొదలైనవి ఉపాధిమీద ఆధారపడి ఉన్నా యని సూచిస్తున్నాడు. ఉత్క్రాంతి లేకపోతే గత్యాగతులు కూడ లేవని తెలుస్తూన్నది. దేహంనుంచి బైటకు పోనివానికి గత్యాగతులు ఉండవు కదా? ఈ విధంగా జీవుడు ఉపాధిసారు డవడంచేత ప్రాజ్ఞునకు (పరమాత్మకు) వలెనేఅణుత్వాదివ్యపదేశం చేయబడింది. ప్రాజ్ఞునకు, అనగా పరమాత్మకు. సగుణోపాసనలలో, ఉపాధిగుణసారత్వంచేత "అణీయాన్ వ్రీహేర్వా యవాద్వా మనోమయః

ప్రాణశరీరః సర్వగన్ధః, సర్వరసః, సత్యకామః, సత్యసంకల్పః" ఇత్యాదివిధమైన అణుత్వాదికం ఏ విధంగా చెప్పబడుచున్నదో అట్లే ఇక్కడ (జీవుని విషయంలో)కూడ-29.

### భాష్యమ్

స్యాదేతత్-యది తద్గుణసారత్వాదాత్మనః సంసారిత్వం కల్ప్యేత, తతో బుద్ధ్యాత్మనోర్భిన్నయోః సంయోగావసానమవశ్యంభావీత్యతో బుద్ధివియోగే సత్యాత్మనో విభక్తస్యానాలక్ష్యత్వాత్ అసత్త్వమ్ అసంసారిత్వం వా ప్రసజ్యేతేతి, అత ఉత్తరం పఠతి-

**సూ. యావదాత్మభావిత్వాచ్చ న దోషస్తద్దర్శనాత్. 2.3.30.**

నేయమనన్తరనిర్దిష్టదోషప్రాప్తిరాశఙ్కనీయా. కస్మాత్? యావదాత్మభావిత్వాద్బుద్ధిసంయోగస్య. యావదయమాత్మా సంసారీ భవతి, యావదస్య సమ్యగ్దర్శనేన సంసారిత్వం న నివర్తతే తావదస్య బుద్ధ్యా సంయోగో న శామ్యతి. యావదేవ చాయం బుద్ధ్యుపాధిసంబన్ధః తావజ్జీవస్య జీవత్వం సంసారిత్వం చ. పరమార్థతస్తు న జీవో నామ బుద్ధ్యుపాధిపరికల్పిత స్వరూపవ్యతిరేకేణాస్తి. న హి నిత్యముక్తస్వరూపాత్ సర్వజ్ఞాదీశ్వరాత్ అన్యశ్చేతనో ధాతుర్ద్వితీయో వేదాన్తార్థనిరూపణాయాముపలభ్యతే- "నాన్యోఽతోఽస్తి ద్రష్టా శ్రోతా మన్తా విజ్ఞాతా" (బృఉ.3.7.23), "నాన్యదతోఽస్తి ద్రష్టృ శ్రోతృ మన్తృ విజ్ఞాతృ" (ఛా. ఉ.6.8.7), "తత్త్వమసి" (ఛా. ఉ. 6.1.6) "అహం బ్రహ్మాస్మి" (బృ.ఉ. 1.4.7) ఇత్యాదిశ్రుతిశతేభ్యః.

### బాలానందిని

**స్యాదేతదితి :-** ఈ విషయం ఇలా ఉండనీ. ఆత్మ బుద్ధిగుణసారం కలదవడంచేత సంసారి అని కల్పించినట్లయితే, అప్పుడు, వేరు వేరైన బుద్ధ్యాత్మల సంయోగం ఏ నాటికైనా తప్పక తొలగిపోతుంది గాన, ఆత్మకు బుద్ధితో వియోగం కలగగానే విడిపోయిన ఆ ఆత్మ చూడబడదు. అప్పుడు ఆత్మకు అసత్త్వం (పూర్తిగా లేకుండా పోవడం గాని)

అసంసారిత్వంగాని ప్రసక్తం అవుతుంది కదా? దానికి సమాధానంగా సూత్రం పఠిస్తున్నాడు.

యావదితి :- "యావదాత్మభావిత్వాచ్చ=ఆత్మ సంసారిగా ఉన్నంతవరకు బుద్ధి సంయోగం ఉంటుంది గాన, దోషః=పై దోషం, న=లేదు. తద్దర్శనాత్= ఆ విషయం శ్రుతిలో కనబడుచున్నది కదా" అని సూత్రార్థం.

నేయమితి :- పైన చెప్పిన దోషంయొక్క ప్రాప్తి ఆశంకించదగినది కాదు. ఎందువల్ల? బుద్ధిసంయోగం యావదాత్మభావి కాబట్టి. ఈ ఆత్మ ఎంత వరకు సంసారిగా ఉంటుందో, సమ్యగ్దర్శనంచేత దీని సంసారిత్వం ఎంతవరకు నివర్తించదో అంతవరకు దీనికి బుద్ధితో సంయోగం తొలగిపోదు. జీవుని జీవత్వము, సంసారిత్వమూ కూడ ఈ బుద్ధ్యుపాధిసంబంధం ఉన్నంతవరకే. వాస్తవంలో బుద్ధ్యుపాధిసంబంధంచేత కల్పించబడిన స్వరూపంకంటె భిన్నంగా జీవుడనే వాడు ఎవడూ లేడు. "నాన్యోఽతోఽస్తి...విజ్ఞాతా" "నాన్యదతోఽస్తి...విజ్ఞాతృ", "తత్త్వమసి" "అహం బ్రహ్మాస్మి" ఈ మొదలైన వందల కొలది శ్రుతుల ననుసరించి నిత్యముక్తస్వరూపుడు సర్వజ్ఞుడు అయిన ఈశ్వరునికంటె వేరుగా చేతనమైన మరొక ధాతువు (పదార్థం) ఏదీ వేదాంతార్థాన్ని జాగర్తగా పరిశీలిస్తే కనబడదు.

భాష్యమ్

కథం పునరవగమ్యతే-యావదాత్మభావీ సంయోగ ఇతి? తద్దర్శనా దిత్యాహ.తథాహి శాస్త్రం దర్శయతి- "యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యన్తర్జ్యోతిః పురుషః స సమానః సన్నుభౌ లోకావనుసంచరతి ధ్యాయతీవ లేలాయతీవ" (బృ.ఉ.4.3.4)ఇత్యాది. తత్ర విజ్ఞానమయ ఇతి బుద్ధిమయ ఇత్యేతదుక్తం భవతి. ప్రదేశాన్తరే-"విజ్ఞానమయో మనోమయః ప్రాణమయశ్చక్షుర్మయః శ్రోత్రమయః" ఇతి విజ్ఞానమయస్య మనఆదిభిః సహ పాఠాత్. బుద్ధిమయత్వం చ తద్గుణసారత్వమేవాభిప్రేయతే, యథా స్త్రీమయో దేవదత్త ఇతి స్త్రీరాగాదిప్రధానోఽభిధీయతే తద్వత్. "స సమానః సన్నుభౌ లోకావనుసంచరతి"ఇతి చ లోకాన్తరగమనేఽప్యవియోగం బుద్ధ్యా దర్శయతి; కేన సమానః తయైవ బుద్ధ్యేతి గమ్యతే; సంనిధానాత్. తచ్చ దర్శయతి-

"ధ్యాయతీవ లేలాయతీవ" (బృ.ఉ.4.3.7) ఇతి. ఏతదుక్తం భవతి-నాయం స్వతో ధ్యా యతి. నాపి చలతి. ధ్యాయన్త్యాం బుద్ధౌ ధ్యాయతీవ, చలన్త్యాం బుద్ధౌ చలతీవేతి. అపి చ మిథ్యాజ్ఞానపురఃసరోఽయమాత్మనో బుద్ధ్యుపాధి సంబన్ధః. న చ మిథ్యాజ్ఞానస్య సమ్యగ్జ్ఞానాదన్యత్ర నివృత్తిరస్తీత్యతో యావద్బ్రహ్మాత్మతానవబోధస్తావదయం బుద్ధ్యుపాధిసంబన్ధో న శామ్యతి. దర్శయతి చ-

'వేదాహమేతం పురుషం మహాన్తమాదిత్యవర్ణం తమసః పరస్తాత్.

తమేవ విదిత్వాఽమృతత్వమేతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ "(శ్వేతా. 3.8) ఇతి. 30

బాలానందిని

కథమితి :- బుద్ధిసంయోగం యావదాత్మభావి అని ఎట్లు తెలుస్తూన్నది? అది శ్రుతులలో చూపబడింది గాన అని చెపుతున్నాడు. "యోఽయం...లేలాయతీవ" ఇత్యాది శాస్త్రం ఆ విధంగా చూపుచున్నది కదా? అక్కడ విజ్ఞానమయః అన్నప్పుడు బుద్ధిమయుడు అని చెప్పినట్లవుతుంది. ఎందువల్ల ననగా-మరొక ప్రదేశంలో "విజ్ఞానమయః...శ్రోత్రమయః" (విజ్ఞానమయుడు, మనోమయుడు, ప్రాణమయుడు, చక్షుర్మయుడు,శ్రోత్రమయుడు) అని విజ్ఞానమయుణ్ణి మనోమయాదులతో కలిపి పఠించడంవల్ల (ఇక్కడ కూడ "విజ్ఞానమయః" అనగా బుద్ధిమయుడని అర్థం). బుద్ధిమయుడు అనగా దాని (బుద్ధియొక్క) గుణాలు సారంగా కలిగి ఉన్నవాడు అని అర్థం. లోకంలో స్త్రీమయో దేవదత్తః అన్నప్పుడు స్త్రీ రాగాదులు ప్రధానంగా కలవాడు అని ఎట్లు అర్థమో అట్లే ఇక్కడ కూడ. " స సమానః సన్నుభౌ లోకావనుసంచరతి" (ఆ ఆత్మ సమానమై రెండు లోకాలలోను సంచరిస్తుంది) అని లోకాంతరానికి వెళ్ళినప్పుడు కూడ బుద్ధితో కలిసి ఉన్నట్లు చూపుచున్నది. కేన సమానః- దేనితో సమానుడు అని ఆకాంక్ష కలిగి నప్పుడు బుద్ధితో సమానుడు అని అర్థం లభిస్తుంది. ఎందువల్ల ననగా ప్రక్కనే బుద్ధిశబ్దం ఉంది. ఈ విషయాన్నే "ధ్యాయతీవ లేలాయతీవ" అనే వాక్యం చూపుతున్నది. దీని అర్థం ఏమనగా -ఆత్మ స్వయంగా ధ్యానం చేయదు, చలించదు. బుద్ధి ధ్యానిస్తూంటే

ధ్యానిస్తున్నట్లుంటుంది., బుద్ధి చలిస్తుంటే చలిస్తున్నట్లు కనబడుతుంది. మరొక విషయ మేమనగా ఆత్మకు బుద్ధ్యాద్యుపాధులతో ఏర్పడిన ఈ సంబంధానికి కారణం మిథ్యాజ్ఞానం (అవిద్య). సమ్యగ్ జ్ఞానం కలుగుతేనే కాని మిథ్యాజ్ఞానం నివర్తించదు. అందువల్ల బ్రహ్మాత్మతాజ్ఞానం కలిగేవరకు ఈ బుద్ధ్యాద్యుపాధులతో సంబంధం శాంతించదు. ఈ విషయాన్నే "వేదాహమేతం...అయనాయ" అను శ్రుతి చూపుచున్నది. (సూర్యునివంటి ప్రకాశ గల, అజ్ఞానానికి దూరమైన ఈ మహాపురుషుణ్ణి నేను ఎదుగుదును. లేదా ఈ పరమాత్మ ఈ విధమైన దని నాకు తెలుసు. ఆ పరమాత్మను తెలిసికొన్న తరవాతనే మృత్యువును దాటుతాడు. మోక్షానికి మరొక మార్గంలేదు అని ఈ వాక్యానికి అర్థం). 30

భాష్యమ్

నను సుషుప్తప్రలయయోర్న శక్యతే బుద్ధిసంబన్ధ (అత్మనోఽభ్యుపగన్తుమ్- "సతా సోమ్య తదా సంపన్నో భవతి స్వమపీతో భవతి" (ఛా.ఉ.6.8.1) ఇతి వచనాత్. కృత్స్నవికారప్రలయాభ్యుపగమాచ్చ. తత్కథం యావదాత్మభావిత్వం బుద్ధిసంబన్ధస్యేత్యత్రోచ్యతే-

సూ. పుంస్త్వాదివత్త్వస్య సతోఽభివ్యక్తియోగాత్. 2.3.31

యథా లోకే పుంస్త్వాదీని బీజాత్మనా విద్యమానాన్యేవ బాల్యాదిష్వను పలభ్యమానాని అవిద్యమానవదభిప్రేయమాణాని యౌవనాదిష్వావిర్భవన్తి, నావిద్యమానాన్యుత్పద్యన్తే, షణ్ఢాదీనామపి తదుత్పత్తిప్రసంగాత్, ఏవమయమపి బుద్ధిసంబన్ధః శక్త్యాత్మనా విద్యమాన ఏవ సుషుప్తప్రలయయోః పునః ప్రబోధప్రసవయోరావిర్భవతి; ఏవం హ్యేతద్యుజ్యతే. న హ్యాకస్మికీ కస్యచిదుత్పత్తిః సంభవతి, అతిప్రసంగాత్. దర్శయతి చ సుషుప్తాదుత్థానమవిద్యాత్మకబీజ సద్భావకారితమ్-"సతి సంపద్య న విదుః సతి సంపద్యామహ ఇతి, త ఇహ వ్యాఘ్రో వా సింహో వా" (ఛా.ఉ.6.9.3) ఇత్యాదినా. తస్మాత్సిద్ధమేతద్యావదాత్మభావీ బుద్ధ్యాద్యుపాధిసంబన్ధ ఇతి. 31

బాలానందిని

నన్వితి :- సుషుప్తిలోను, ప్రలయంలోను ఆత్మకు బుద్ధితో సంబంధం ఉంటుందని అంగీకరించడానికి శక్యం కాదు. "సతా...భవతి" అని చెప్పబడింది కదా? ప్రలయంలో కార్యాలన్నీ నశిస్తాయని చెప్పబడింది. అందుచేత బుద్ధిసంబంధం యావదాత్మభావి ఎట్లవుతుంది? దీనికి సమాధానం చెప్పుడుతున్నది-

పుంస్త్వాదివదితి :-"పుంస్త్వాదివత్=పుంస్త్వాదులవలె, సతః (నిగూఢంగా) ఉన్న, తస్య=ఆ బుద్ధిసంబంధానికి, అభివ్యక్తియోగాత్=అభివ్యక్తి కుదురుతుంది గాన (దోషం లేదు)" అని సూత్రార్థం.

యథేతి :- బాల్యాదులలో పైకి కనబడనివి, లేనట్లే భావించబడుచున్నవి, కాని బీజరూపంలో ఉన్నవి అయిన పుంస్త్వం మొదలైనవి లోకంలో ఏ విధంగా యౌవనాదులలో కనబడతాయో, అంతేనే కాని అసలే లేనివి పుట్టడం లేదో- అలాగైతే నపుంసకులు మొదలైనవాళ్లలో కూడ అవి కనబడవలసి వస్తుంది- అదే విధంగా ఈ బుద్ధిసంబంధం కూడ సుషుప్తిప్రలయాలలో శక్తిరూపంలో ఉన్నదే మేలొక్కన్నప్పుడు, మళ్లీ సృష్టి జరిగినప్పుడు ఆవిర్భవిస్తుంది. ఇలా చెపితేనే ఇది కుదురుతుంది. ఎందువల్ల ననగా ఏదీ కూడ హటాత్తుగా పుట్టదు. అలా జరుగుతే అతిప్రసంగం ఏర్పడుతుంది. అనగా అన్నీ అన్ని వేళలా పుట్టవలసి వస్తుంది. సుషుప్తినుండి లేవడం అవిద్యారూపమైన బీజం ఉండడంవల్ల జరుగుతుంది అని "సతి...సింహో వా" ఇత్యాదివాక్యంలో చూపుతున్నది. అందువల్ల బుద్ధ్యాద్యుపాధులతో సంబంధం ఆత్మ ఉన్నంత వరకు ఉంటుందని నిశ్చితమైనది. 31

**సూ. నిత్యోపలబ్ధ్యనుపలబ్ధిప్రసఙ్గోఽన్యతరనియమో వాఽన్యథా. 2.3.32**

తచ్చాత్మన ఉపాధిభూతమన్తఃకరణం మనోబుద్ధిర్విజ్ఞానం, చిత్తమితి చానేకధా తత్ర తత్ర కథ్యతే. క్వచిచ్చ వృత్తివిభాగేన-సంశయాదివృత్తికం మన ఇత్యుచ్యతే నిశ్చయాదివృత్తికం బుద్ధిరితి. తచ్చైవంభూతమన్తః కరణమవశ్యమ స్తీత్యభ్యుపగన్తవ్యమ్. అన్యథా హ్యనభ్యుపగమ్యమానే తస్మిన్నిత్యోపలబ్ధ్యను పలబ్ధిప్రసంగః స్యాత్. ఆత్మేన్ద్రియవిషయాణా ముపలబ్ధిసాధనానాం సంనిధానే సతి నిత్యమేవోపలబ్ధిః ప్రసజ్యేత. అథ సత్యపి హేతుసమవధానే ఫలాభావస్తతో

నిత్యమేవానుపలబ్ధిః ప్రసజ్యేత. న చైవం దృశ్యతే. అథవాన్యతరస్యాత్మన ఇన్ద్రియస్య వా శక్తిప్రతిబన్ధోఽభ్యుప గన్తవ్యః. న చాత్మనః శక్తిప్రతిబన్ధః సంభవతి; అక్రియత్వాత్. నాపీన్ద్రియస్య. న హి తస్య పూర్వోత్తరయోఃక్షణయో రప్రతిబద్ధశక్తికస్య సతః అకస్మాచ్ఛక్తిః ప్రతిబధ్యేత. తస్మాద్యస్యావధానా నవధానానభ్యాముపలబ్ధ్యనుపలబ్ధీ భవతస్తన్మనః. తథా చ శ్రుతిః- "అన్యత్రమనా అభూవం నాదర్శమ్, అన్యత్రమనా అభూవం నాశ్రౌషమ్" (బృ.ఉ. 1.5.3) ఇతి. "మనసా హ్యేవ పశ్యతి. మనసా శృణోతి" (బృ.ఉ.1.5.3) ఇతి. కామాదయశ్చాస్య వృత్తయః ఇతి దర్శయతి-"కామః సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతిరధృతిర్హీర్ధీర్భీరిత్యేతత్సర్వం మన ఏవ"(బృ.ఉ.1.4.3) ఇతి. తస్మాద్యుక్తమేతత్- "తద్గుణసారత్వాత్తద్వ్యపదేశః" ఇతి 32

బాలానందిని

నిత్యేతి:- "అన్యథా=అంతఃకరణను అంగీకరించకపోతే నిత్యోపలబ్ధ్యనుపలబ్ధి ప్రసంగః= నిత్యమూ విషయజ్ఞానం కలగడం గాని, కలగకపోవడం గాని జరిగే ప్రసక్తి ఏర్పడుతుంది. అన్యతరనియమో వా=ఆత్మశక్తి కాని ఇంద్రియశక్తి కాని నిలచిపోయే ప్రసక్తి ఏర్పడుతుంది" అని సూత్రార్థం.

తచ్చేతి :- ఆత్మకు ఉపాధియైన ఆ అంతఃకరణం మనస్సు, బుద్ధి, విజ్ఞానం, చిత్తం అని అనేక విధాలుగా అక్కడక్కడ చెప్పబడుచున్నది. (అంతఃకరణలో కలిగే) వృత్తుల విభాగాన్ని పట్టి సంశయాదివృత్తులు కలది మనస్సనీ నిశ్చయాదివృత్తులు కలది బుద్ధి అనీ కొన్ని చోట్ల చెప్పబడుచున్నది.

వి:- "మనోబుద్ధిరహంకారశ్చిత్తం కరణమాన్తరమ్
సంశయో నిశ్చయో గర్వః స్మృతిశ్చ విషయా ఇమే"

అనే ప్రసిద్ధశ్లోకం సంశయం, నిశ్చయం, గర్వం స్మరణం అనే వేరు వేరు వృత్తులను బట్టి అంతఃకరణమే మనస్సు, బుద్ధి అహంకారం, చిత్తం అనే పేర్లు పొందుతున్నది అని చెప్పుచున్నది.

**తచ్చేతి** :- ఈ విధమైన అ అంతఃకరణం అనేది ఒకటి ఉన్న దని తప్పక అంగీకరించాలి. అలా కాకపోతే, దానిని అంగీకరించకపోతే, నిత్యోపలబ్ధ్యనుపలబ్ధిప్రసంగం ఏర్పడుతుంది. ఉపలబ్ధికి (జ్ఞానానికి) సాధనాలైన ఆత్మేంద్రియవిషయాలు దగ్గరగా చేరినప్పుడు ఎల్లప్పుడూ జ్ఞానం కలగవలసివస్తుంది. (అన్ని ఇంద్రియాలకీ విషయ సంబంధం ఉండడంవల్ల ఒకే పర్యాయం అన్ని ఇంద్రియాల జ్ఞానాలూ కలగ వలసివస్తుంది). అలా కాక జ్ఞానహేతువు లన్నీ (ఆత్మేంద్రియవిషయాలు) దగ్గరగా చేరినా కూడ ఫలం (జ్ఞానం) కలగకపోతే ఎన్నటికీ జ్ఞానం కలిగే అవకాశం ఉండదు. కాని (లోకంలో) ఈ విధంగా కనబడడం లేదు. లేదా, ఆత్మ ఇందియాలు వీటిలో ఒకదాని శక్తి ప్రతిబద్ధం అవుతుం దని చెప్పవలసి వస్తుంది. ఆత్మకు శక్తిప్రతిబంధం సంభవించదు. దానికి వికారాలు లేవు కదా? ఇంద్రియానికీ కుదరదు. ఎందువల్ల ననగా - పూర్వోత్తరక్షణాలలో శక్తికి అడ్డు లేనిదిగా ఉన్న ఇంద్రియానికి అకస్మాత్తుగా శక్తిప్రతిబంధం కలగదు కదా? అందువల్ల దేని అవధానానవధానాలచేత ఉపలబ్ధ్యనుపలబ్ధులు కలుగుతాయో, అనగా ఏది సావధానంగా ఉంటే జ్ఞానం కలుగుతుందో, ఏది సావధానంగా లేకపోతే జ్ఞానం కలగదో, అట్టిది మనస్సు. "అన్యత్ర...నాశ్రౌషమ్" (నా మనస్సు మరొక చోట ఉంది అందుచేత చూడలేదు. నా మనస్సు మరొకచోట ఉంది అందుచేత వినలేదు అని) "మనసా...శృణోతి" (మనస్సుచేతనే చూస్తాడు మనస్సుచేతనే వింటాడు) అని శ్రుతి ఈ విషయమే చెపుతూన్నది. "కామః...ఏవ" (కోరిక, సంకల్పం, సందేహం, శ్రద్ధ, అశ్రద్ధ, ధైర్యం, ధైర్యాభావం, సిగ్గు, నిశ్చయం, భయం ఇదంతా మనస్సే అని శ్రుతి కామాదులు దీని వృత్తులే అని చూపుతున్నది. అందువల్ల తద్గుణసారత్వాత్తద్వ్యపదేశః అని చెప్పడం యుక్తమే. 32.

ఉత్క్రాంతిగత్యధికరణం సమాప్తం

## 14. కర్త్రధికరణమ్. సూ. 33-40

### సూ. కర్తా శాస్త్రార్థవత్త్వాత్. 2.3.33

తద్గుణసారత్వాధికారేణైవ అపరోఽపి జీవధర్మః ప్రపఞ్చ్యతే. కర్తా చాయం జీవః స్యాత్. కస్మాత్? శాస్త్రార్థవత్త్వాత్. ఏవం చ యజేత జుహుయాత్ దద్యాత్ ఇత్యేవంవిధం శాస్త్రమర్థవద్ భవతి. అన్యథా తదనర్థకం స్యాత్. తద్ధి కర్తుః సతః కర్తవ్యవిశేషముపదిశతి. న చాసతి కర్తృత్వే తదుపపద్యతే. తథా ఇదమపి శాస్త్రమర్థవద్ భవతి-"ఏష హి ద్రష్టా శ్రోతా మన్తా బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుషః" (ప్ర. ఉ. 5.9) ఇతి. 33.

బాలానందిని

కర్తేతి :- "శాస్త్రార్థవత్త్వాత్=శాస్త్రం ప్రయోజనం కలది గాన, కర్తా=జీవుడు కర్త" అని సూత్రార్థం.

వి. కొన్ని శ్రుతులు ఆత్మ అసంగం అని చెప్పుతున్నాయి. కొన్ని శ్రుతులు ఆ యా కర్మలను విధిస్తునాయి. అందుచేత ఆత్మకు కర్తృత్వం ఉందా లేదా అని పైన చెప్పిన శ్రుతులకు విరోధం ఉండడంవల్ల, సంశయం. లేదని పూర్వపక్షం. తద్గుణసారత్వంచేత ఆరోపితమైన కర్తృత్వం కూడ ఉన్నదని సిద్ధాంతం.

తద్గుణేతి :- తద్గుణసారత్వప్రసంగచేత మరొక జీవధర్మం కూడ వివరించబడుచున్నది. ఈ జీవుడు కర్త కూడ అవుతాడు. ఎందువల్ల? శాస్త్రార్థవత్త్వంవల్ల. కర్తృత్వం అంగీకరిస్తేనే "యజ్ఞం చెయ్యాలి" "హోమం చెయ్యాలి" "దానం చెయ్యాలి" ఈ రకమైన విధిశాస్త్రం సార్థకం అవుతుంది. అలా కాకపోతే అది వ్యర్థం అవుతుంది. అది (శాస్త్రం) కర్త అనేవాడు ఒక డుంటే వానికి ఆయా కర్తవ్యాన్ని ఉపదేశిస్తున్నది. కర్తృత్వం లేకపోతే అది కుదరదు కదా? అప్పుడే "ఏష...పురుషః" (ఈ విజ్ఞానాత్మయైన పురుషుడు (జీవుడు) చూచేవాడు, వినేవాడు ఆలోచించేవాడు తెలుసుకొనేవాడు, కర్తా కూడ) అనే శ్రుతి కూడ సార్థకం అవుతుంది. 33

### సూ. విహారోపదేశాత్. 2.3.34

ఇతశ్చ జీవస్య కర్తృత్వమ్, యజ్జీవప్రక్రియాయాం సంధ్యే స్థానే విహారము పదిశతి-"స ఈయతేఽమృతో యత్ర కామమ్" (బృ.ఉ. 4.3.12) ఇతి. "స్వే శరీరే యథాకామం పరివర్తతే" (బృ.ఉ.2.1.19) ఇతి చ. 34

బాలానందిని

విహారేతి :- "జీవుడు విహరిస్తాడు అని చెప్పడంవల్ల కూడ జీవునికి కర్తృత్వం ఉన్నది" అని సూత్రార్థం.

ఇతశ్చేతి :- ఈ కారణంవల్ల కూడ జీవునకు కర్తృత్వం ఉంటుంది. ఎందువల్లననగా జీవప్రక్రియలో (జీవుణ్ణి గూర్చి మాట్లాడే సందర్భంలో) సంధ్యస్థానంలో (స్వప్నంలో) "స ఈయతేఽమృతో యత్ర కామమ్" (వినాశరహితుడైన ఆ జీవుడు ఏ స్వప్నంలో స్వేచ్ఛగా సంచరిస్తాడో)అని జీవునకు విహారాన్ని ఉపదేశిస్తున్నది. "స్వే...పరివర్తతే"(తన శరీరంలో సంచరిస్తాడు) అని కూడ చెప్పుచున్నది. 34

### సూ. ఉపాదానాత్. 2.3.35

ఇతశ్చాస్య కర్తృత్వమ్, యజ్జీవప్రక్రియాయామేవ కరణానాముపాదానం సంకీర్తయతి- "తదేషాం ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞానమాదాయ" (బృ.ఉ.2.1.17) ఇతి "ప్రాణాన్ గృహీత్వా" (బృ.ఉ.2.1.18) ఇతి చ. 35.

బాలానందిని

**ఉపాదానాదితి** :-"ఉపాదానాత్=ఇంద్రియాదిసాధనాలను గ్రహించడంవల్ల కూడ జీవునకు కర్తృత్వం ఉంది" అని సూత్రార్థం.

ఇతశ్చేతి :- దీనివల్ల కూడ వీనికి కర్తృత్వం ఉంది; ఎందువల్ల ననగా జీవప్రక్రియలోనే "తదేషాం...ఆదాయ" (ప్రాణాలతోజ్ఞానంచేత,అనగా, బుద్ధిచేత, ఇంద్రియసముదాయాన్ని గ్రహించి)అని, "ప్రాణాన్ గృహిత్వా" అని జీవుడు కరణాలను (ఇంద్రియాదులను)గ్రహించి నట్లు చెప్పుచున్నది. 35

సూ. వ్యపదేశాచ్చ క్రియాయాం న చేన్నిర్దేశవిపర్యయః. 2.3.36

ఇతశ్చ జీవస్య కర్తృత్వం యదస్య లౌకికీషు వైదికీషు చ క్రియాసు కర్తృత్వం వ్యపదిశతి శాస్త్రమ్-"విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి తనుతేఽపి చ" (తై ఉ. 2.5.1) ఇతి. నను విజ్ఞానశబ్దో బుద్ధౌ సమధిగతః కథమనేన జీవస్య కర్తృత్వం సూచ్యత ఇతి. నేత్యుచ్యతే. జీవస్యైవ నిర్దేశో న బుద్ధేః. న చేజ్జీవస్య స్యాన్నిర్దేశవిపర్యయః స్యాత్. విజ్ఞానేనేత్యేవం నిరదేక్ష్యత్. తథా హ్యన్యత్ర బుద్ధివివక్షాయాం విజ్ఞానశబ్దస్య కరణవిభక్తినిర్దేశో దృశ్యతే-"తదేషాం ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞానమాదాయ" (బృ.ఉ.2.1.17) ఇతి. ఇహ తు "విజ్ఞానం యజ్ఞం తనుతే" (తై. ఉ. 2.5.1) ఇతి కర్తృసామానాధికరణ్యనిర్దేశాద్బుద్ధివ్యతిరిక్తస్యైవాత్మనః కర్తృత్వం సూచ్యత ఇత్యదోషః. 36.

బాలానందిని

వ్యపదేశాదితి :- "క్రియాయామ్=లౌకికవైదికక్రియలయందు, వ్యపదేశాచ్చ=జీవుణ్ణి గూర్చి చెప్పడంవల్ల కూడ జీవునకు కర్తృత్వం ఉంది. న చేత్=జీవుడు అనే అర్థం కాకపోతే, నిర్దేశవిపర్యయః=నిర్దేశంలో మార్పు ఉండేది." అని సూత్రార్థం.

ఇతశ్చేతి :- ఈ కారణంవల్ల కూడ జీవునకు కర్తృత్వం ఉంది. ఎందువలన అనగా లౌకిక క్రియలయందు, వైదికక్రియలయందు కూడ వీనికి కర్తృత్వం ఉన్నట్లు "విజ్ఞానం...తనుతేఽపి చ" అనే శాస్త్రం చెప్పుచున్నది. (జీవుడే యజ్ఞం చేస్తున్నాడు, ఇతరకర్మలు కూడ చేస్తున్నాడు అని ఈ వాక్యానికి అర్థం) (ప్రశ్న) - విజ్ఞానశబ్దానికి బుద్ధి అని అర్థమని గ్రహించబడింది కదా? దీనిచేత జీవునికి కర్తృత్వం ఉన్నట్లు ఎలా తెలుస్తున్నది? (సమాధానం) లేదు అని అంటాం. ఇది జీవుని నిర్దేశమే కాని బుద్ధి యొక్క నిర్దేశం కాదు. ఇది జీవుని నిర్దేశం కాకపోతే నిర్దేశంలో మార్పు ఉండేది. "విజ్ఞానేన" అని నిర్దేశించి ఉండేది. అందుచేతనే మరొక చోట బుద్ధి అనే అర్థం చెప్పదలచి నప్పుడు విజ్ఞానశబ్దానికి కరణవిభక్తిచేత (తృతీయావిభక్తిచేత) "తదేషాం...ఆదాయ" అని నిర్దేశం కనబడుచున్నది. ఇక్కడైతే "విజ్ఞానం యజ్ఞం తనుతే"

అని కర్తతో సమానాధికరణంగా (కర్తృవాచకంతో అన్వయించేటట్లుగా) చెప్పడంవల్ల బుద్ధికంటె భిన్నుడైన ఆత్మకే కర్తృత్వం చెప్పబడుచున్న దని సూచింపబడుచున్నది గాన దోషం లేదు. 36.

## భాష్యమ్

అత్రాహ :- యది బుద్ధివ్యతిరిక్తో జీవః కర్తా స్యాత్ స స్వతన్త్రః సన్ ప్రియం హితం చైవాత్మనః నియమేన సంపాదయేన్న విపరీతమ్. విపరీతమపి తు సంపాదయన్నుపలభ్యతే. న చ స్వతన్త్రస్యాత్మన ఈదృశీ ప్రవృత్తిరనియమే నోపపద్యత ఇతి. **అత ఉత్తరం** పఠతి-

## సూ. ఉపలబ్ధివదనియమః. 2.3.37

యథాయమాత్మోపలబ్ధిం ప్రతి స్వతన్త్రోఽప్యనియమేనేష్టమనిష్టం చ ఉపలభతే ఏవమనియమేనేష్టమనిష్టం చ సంపాదయిష్యతి.ఉపలబ్ధావ ప్యస్వాతన్త్ర్యముపలబ్ధిహేతూపాదానోపలమ్భాదితి చేత్, న. విషయప్రకల్పనా మాత్రప్రయోజనత్వాదుపలబ్ధిహేతూనామ్. ఉపలబ్ధౌ త్వనన్యాపేక్షత్వమాత్మన శ్చైతన్యయోగాత్. అపి చార్థక్రియాయామపి నాత్యన్తమాత్మనః స్వాతన్త్ర్యమస్తి; దేశకాలనిమిత్తవిశేషాపేక్షత్వాత్. న చ సహాయాపేక్షస్య కర్తుః కర్తృత్వం నివర్తతే. భవతి హ్యేధోదకాద్యపేక్షస్యాపి పక్తుః పక్తృత్వమ్. సహకారివై చిత్ర్యాచ్చేష్టానిష్టార్థక్రియాయామనియమేన ప్రవృత్తిరాత్మనో న విరుధ్యతే. 37.

## బాలానందిని

**అత్రేతి**:- ఇక్కడ (పూర్వపక్షి) ఇలా అంటున్నాడు. బుద్ధికంటె భిన్నుడైన జీవుడు కర్త అయినట్లయితే అతడు స్వతంత్రుడై ఉండి, తనకు ఏది ప్రియమో, ఏది హితమో, దానినే సంపాదించాలి, అంతేకాని అందుకు విపరీతమైనదానిని సంపాదించగూడదు. అయితే విపరీతమైనదానిని కూడ సంపాదిస్తున్నట్లు కనబడుచున్నాడు. స్వతంత్రుడైన ఆత్మ నియమం లేకుండా ఈ విధంగా ప్రవర్తించడం యుక్తం కాదు. దీనికి సమాధానం పఠిస్తున్నాడు.

ఉపలబ్ధీతి:- ఉపలబ్ధివత్= తెలుసుకొవడంలో వలె, అనియమః= నియమం లేదు" అని సూత్రార్థం.

యథేతి :- ఈ ఆత్మ ఉపలబ్ధిని గూర్చి (ఏదైన ఒక విషయాన్ని తెలుసుకొనడాన్ని గూర్చి) స్వతంత్రుడే అయినా, నియమం లేకుండా ఇష్టమైనదానిని అనిష్టమైనదానినీ కూడ ఏ విధంగా తెలుసుకొంటూ ఉంటాడో అట్లే నియమం లేకుండా ఇష్టమైనదానిని అనిష్టమైనదానిని కూడ సంపాదిస్తాడు. (జీవునకు) ఉపలబ్ధియందు స్వాతంత్ర్యం లేదు. ఎందువల్ల ననగా ఉపలబ్ధికి హేతువులైనవాటిని అతడు సేకరిస్తున్నట్లు కనబడుతున్నాడు అన్నట్లయితే (అనగా ఏదైన ఒక విషయం తెలుసుకోవాలంటే కేవలం మనిషి ఉంటే సరిపోదు; తెలుసుకొనడానికి కావలసిన సాధనాలను కూడా సేకరించవలసి ఉంటుంది. అందుచేత ఉపలబ్ధివిషయంలో జీవునకు స్వాతంత్ర్యం లేదు అని ఈ ప్రశ్నకు అభిప్రాయం) అది యుక్తం కాదు. ఉపలబ్ధిహేతువుల ప్రయోజనం తెలుసుకొనదగిన వస్తువును ఏర్పాటుచేయడం వరకే. ఉపలబ్ధివిషయంలో అయితే, ఆత్మ చైతన్యం కలది గాన, దానికి మరొకదాని అపేక్ష ఏదీ లేదు. (అందుచేత విషయజ్ఞానం విషయంలో జీవునకు స్వాతంత్ర్యం ఉన్నదని అభిప్రాయం).

అవ:- ఉపలబ్ధిసాధనాలను సేకరించుకొనవలసి ఉన్నంతమాత్రంచేత స్వాతంత్ర్యం లేదన్నట్లయితే అసలు ఏ పని చేయడానికీ కూడ స్వాతంత్ర్యం లేదని చెప్పవలసి వస్తుందని సమాధానం చెపుతున్నారు-

అపి చేతి:- మరొక విషయమేమనగా - ఆత్మకు ఏ పని చేయడంలోను కూడ స్వాతంత్ర్యం లేదు. ఎందువల్ల ననగా ఏ పని చెయ్యాలన్నా దేశం, కాలం, నిమిత్తం మొదలైన విశేషాల అపేక్ష ఉంటుంది కదా? సహాయాన్ని అపేక్షించినంత మాత్రాన కర్తయొక్క కర్తృత్వం పోదు. వంటవాడు కట్టెలు, నీళ్లు మొదలైనవాటిని అపేక్షించినా కూడ వాని పాకక్రియాకర్తృత్వానికి భంగం ఏదీ లేదు కదా? సహకారుల వైచిత్ర్యాన్ని పట్టి ఆత్మ, నియమం లేకుండా ఇష్టార్థమైన పనులలోను, అనిష్టార్థమైన పనులలోను ప్రవర్తించడం విరుద్ధం కాదు. 37.

## సూ. శక్తివిపర్యయాత్. 2.3.38

ఇతశ్చ విజ్ఞానవ్యతిరిక్తో జీవః కర్తా భవితుమర్హతి. యది పునర్విజ్ఞాన శబ్దవాచ్యా బుద్ధిరేవ కర్త్రీ స్యాత్తతః శక్తివిపర్యయః స్యాత్. కరణశక్తి ర్బుద్ధేర్హీయేత కర్తృశక్తిశ్చాపద్యేత. సత్యాం చ బుద్ధేః కర్తృశక్తౌ తస్యా ఏవాహం ప్రత్యయవిషయత్వమభ్యుపగన్తవ్యమ్. అహంకారపూర్వికాయా ఏవ ప్రవృత్తేః సర్వత్ర దర్శనాత్, అహం గచ్ఛామ్యహమాగచ్ఛామ్యహం భుఞ్జేఽహం పిబామీతి చ. తస్యాశ్చ కర్తృశక్తియుక్తాయాః సర్వార్థకారి కరణమన్యత్కల్పయితవ్యమ్, శక్తోఽపి హి సన్ కర్తా కరణముపాదాయ క్రియాసు ప్రవర్తమానో దృశ్యత ఇతి. తతశ్చ సంజ్ఞామాత్రే వివాదః, న వస్తుభేదః కశ్చిత్, కరణవ్యతిరిక్తస్య కర్తృత్వాభ్యుపమాత్. 38.

బాలానందిని

శక్తీతి :- "శక్తి విపర్యయాత్= కర్తృకరణశక్తులు తారుమా రౌతాయి కాబట్టి ఆత్మకు కర్తృత్వం అంగీకరించాలి" అని సూత్రార్థం.

ఇతశ్చేతి :- ఈ కారణంచేత కూడ విజ్ఞానంకంటె భిన్నుడైన జీవుడు కర్తగా అవడం యుక్తం. విజ్ఞానశబ్దంచేత వాచ్యమైన (విజ్ఞానం అని చెప్పబడే) బుద్ధియే కర్త అయినట్లయితే అప్పుడు శక్తికి విపర్యయం కలుగుతుంది. బుద్ధికి కరణశక్తి (కరణత్వం) తొలగిపోతుంది. కర్తృశక్తి (కర్తృత్వం) వస్తుంది.

వి. ప్రపంచంలోని సర్వవ్య వహారాలూ శక్తిమీదనే ఆధారపడి నడుస్తుంటాయి. ఆ శక్తి అనేక రూపాలలో పనిచేస్తూంటుంది. ఒకప్పుడు కర్తగా, ఒకప్పుడు కర్మగా, ఒకప్పుడు కరణంగా ఈ విధంగా పని చేస్తూంటుంది. అందుచేత వైయాకరణులు కారకాలకు అన్నింటికీ శక్తి అనే ఒక సాధారణనామధేయం (వాక్యపదీయాదులలో వివరించి నట్లు) వాడుతూంటారు.

సత్యామితి:- బుద్ధికి కర్తృశక్తి ఉన్నట్లయితే అహం అనే ప్రత్యయానికి విషయమై నది అదే అని చెప్పవలసి వస్తుంది. ఎందువల్లననగా అంతటా కూడ ప్రవృత్తి

(వ్యవహారం) నేను వెడుతున్నాను, నేను వస్తున్నాను, నేను తింటున్నాను, నేను త్రాగుతున్నాను ఇత్యాదివిధంగా అహంకారపూర్వకంగానే కనబడుతున్నది. ఈ విధంగా బుద్ధియే కర్తృశక్తిగలది అన్నట్లయితే దానికి అన్ని పనులలోను తోడ్పడే మరొక కరణాన్ని (సాధనాన్ని) కల్పించవలసి వస్తుంది. సమర్థుడైనా కూడ కర్త కరణాన్ని స్వీకరించియే క్రియలలో ప్రవర్తిస్తున్నట్లు చూడబడుతున్నాడు కదా? ఈ విధంగా కరణంకంటె భిన్నమైనదానినే కర్త అంటున్నాం కాబట్టి పేరు విషయంలోనే వివాదం కాని వస్తువులో భేదం ఏదీ లేదు. అనగా మేం ఆత్మ కర్త, బుద్ధి కరణం అంటున్నాం. నువ్వు బుద్ధియే కర్త అంటే కరణాన్ని ఒకదానిని చూప వలసి వస్తుంది. నువ్వు ఇది కర్త అని దేనిని చూపుతావో అదే మా ఆత్మ అని భావం. 38

## సూ. సమాధ్యభావాచ్చ 2.3.39

యోఽప్యయమౌపనిషదాత్మప్రతిపత్తిప్రయోజనః సమాధిరుపదిష్టో వేదాన్తేషు - "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః" (బృ.ఉ. 2.4.5) "ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానమ్" (ము. ఉ. 2.2.6) ఇత్యేవంలక్షణః సోఽప్యసత్యాత్మనః కర్తృత్వే నోపపద్యేత. తస్మాదప్యస్య కర్తృత్వసిద్ధిః 39.

బాలానందిని

సమాధీతి :- "సమాధ్యభావాచ్చ=సమాధి కుదరదు గాన అందుచేత కూడ ఆత్మకు కర్తృత్వం చెప్పాలి". అని సూత్రార్థం.

యోఽపీతి:- ఔపనిష ద మైన ఆత్మను సాక్షాత్కరించుకొనడమే ప్రయోజనంగా గల, "ఆత్మా...విజిజ్ఞాసితవ్యః," "ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానమ్" ఇత్యాదిరూపమైన ఏ సమాధి వేదాంతాలలో ఉపదేశించబడిందో అది కూడ ఆత్మకు కర్తృత్వం లేకపోతే ఉపపన్నం కాదు. అందువల్లకూడ ఆత్మకు కర్తృత్వం సిద్ధిస్తుంది. 39

కర్త్రధికరణం సమాప్తమ్.

## 15. తక్షాధికరణమ్. సూ. 40

### సూ. యథా చ తక్షోభయథా. 2.3.40

ఏవం తావచ్ఛాస్త్రార్థవత్త్వాదిభి ర్హేతుభిః కర్తృత్వం శారీరస్య ప్రదర్శితమ్. తత్పునః స్వాభావికం వా స్యాదుపాధినిమిత్తం వేతి చిన్త్యతే. తత్రైతైరేవ శాస్త్రార్థవత్త్వాదిభిర్హేతుభిః స్వాభావికం కర్తృత్వమ్. అపవాదహేత్వభావాదిత్యేవం ప్రాప్తే బ్రూమః. న స్వాభావికం కర్తృత్వమాత్మనః సంభవతి, అనిర్మోక్షప్రసంగాత్. కర్తృత్వస్వభావత్వే హ్యాత్మనో న కర్తృత్వాన్నిర్మోక్షః సంభవతి; అగ్నేరివౌష్ణ్యాత్. న చ కర్తృత్వాదనిర్ముక్తస్యాస్తి పురుషార్థసిద్ధిః, కర్తృత్వస్య దుఃఖరూపత్వాత్. నను స్థితాయామపి కర్తృత్వశక్తౌ కర్తృత్వకార్యపరిహారాత్ పురుషార్థః సేత్స్యతి, తత్పరిహారశ్చ నిమిత్తపరిహారాత్, యథాగ్నేర్దహనశక్తియుక్తస్యాపి కాష్ఠవియోగాద్దహనకార్యాభావస్తద్వత్. న. నిమిత్తానామపి శక్తిలక్షణేన సంబన్ధేన సంబద్ధానామత్యన్త పరిహారాసంభవాత్. నను మోక్షసాధనవిజ్ఞానాన్మోక్షః సేత్స్యతి. న. సాధనాయత్తస్యానిత్యత్వాత్. అపి చ నిత్యశుద్ధ బుద్ధముక్తాత్మప్రతిపాదనా న్మోక్షసిద్ధిరభిమతా. తాదృగాత్మప్రతిపాదనం చ న స్వాభావికే కర్తృత్వేఽవకల్పేత. తస్మాదుపాధిధర్మాధ్యాసేనైవ ఆత్మనః కర్తృత్వం; న స్వాభావికమ్. తథా చ శ్రుతిః- "ధ్యాయతీవ లేలాయతీవ" (బృ.ఉ.4.3.7) ఇతి. "ఆత్మేన్ద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః" (క.ఉ.3.4) ఇతి చోపాధిసంపృక్తస్యైవ ఆత్మనః భోక్తృత్వాదివిశేషలాభం దర్శయతి. న హి వివేకినాం పరస్మాదన్యో జీవో నామ కర్తా భోక్తా వా విద్యతే. "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" (బృ.ఉ.4.3.23) ఇత్యాదిశ్రవణాత్. పర ఏవ తర్హి సంసారీ కర్తా భోక్తా చ ప్రసజ్యేత పరస్మాదన్యశ్చేచ్చితిమాన్ జీవః కర్తా బుద్ధ్యాదిసంఘాతవ్యతిరిక్తో న స్యాత్? న. అవిద్యాప్రత్యుపస్థాపితత్వాత్ కర్తృత్వభోక్తృత్వయోః.

బాలానందిని

యథేతి :- "తక్షా=వడ్రంగి, యథా=ఎట్లో. అట్లే, ఉభయథా ఆత్మకర్త, అకర్త రెండువిధాలుగా కూడ" అని అర్థం.

ఏవమితి :- శాస్త్రం సార్థకం కావడం మొదలైన హేతువులచేత ఈ విధంగా శారీరునకు కర్తృత్వం ఉన్నదని చూపబడింది. ఆ కర్తృత్వం స్వాభావికమా లేక ఉపాధుల చేత ఏర్పడినదా అని విచారించబడుచున్నది. కర్తృత్వం లేదని చెప్పడానికి తగిన హేతువు లేవీ లేకపోవడంచేత శాస్త్రార్థవత్త్వం మొదలైన ఈ హేతువులచేతనే ఆత్మకు కర్తృత్వం స్వాభావికమే అని ప్రాప్తించగా చెప్పుచున్నాము. ఆత్మకు కర్తృత్వం స్వాభావికం అయితే మోక్షం రావడానికి అవకాశం ఉండదు గాన అది స్వాభావికం కాదు. ఆత్మ కర్తృత్వం స్వాభావికంగా ఉన్నవాడైతే అప్పుడు ఆ కర్తృత్వంనుండి, అగ్నికి ఉష్ణత్వం లేకుండా ఉండడం కుదరనట్లు, మోక్షం కుదరదు. కర్తృత్వం అనేది దుఃఖరూపం గాన కర్తృత్వం నుండి విడుదల లేనివానికి పురుషార్థసిద్ధి కలగదు. (ప్రశ్న) - కర్తృత్వశక్తి ఉన్నా కూడ కర్తృత్వంచేత సాధించవలసిన కార్యం లేకపోవడంచేత పురుషార్థం (మోక్షం)సిద్ధిస్తుంది. కార్యం కలగడానికి తగిన నిమిత్తాన్ని పరిహరించడంచేత కార్యం లేకుండా ఉండడం కుదురుతుంది. అగ్నికి దహనశక్తి ఉన్నా కూడ కఱ్ఱలు లేకపోవడంచేత దహనకార్యం ఏ విధంగా ఉండదో అట్లే ఇక్కడ కూడ. (సమాధానం)- అది యుక్తం కాదు. శక్తిరూపమైన సంబంధంచేత నిమిత్తాలు కూడ కార్యశక్తితో సంబంధించి ఉంటాయి గాన వాటిని పూర్తిగా పరిహరించడం కుదరదు.

ఏ. కర్తృత్వశక్తి ఉంటుందని ఎప్పుడు చెప్పామో అప్పుడు కార్యంయొక్క నిమిత్తాలు కూడ శక్తిరూపంలో ఉంటాయని చెప్పాలి. అనగా కర్తృత్వము, నిమిత్తాలూ కూడ శక్తిరూపంలో ఉంటాయి. అందుచేత ఎప్పటి కైనా అవి పైకి రావడంతో మోక్షానికి భంగం ఏర్పడుతుంది. మోక్షం అనేది ఒక ప్రలయం వంటిది మాత్రమే అవుతుంది.

(ప్రశ్న) మోక్షానికి సాధనాలను విధించడంవల్ల మోక్షం సిద్ధిస్తుంది. అనగా కొన్ని కర్మలు చేయడంచేత మానవుడు దేవత్వాన్ని పొందుతాడని శాస్త్రం చెపుతున్నది. అట్లే మోక్షానికి కొన్ని సాధనాలు విధించి వీటిని ఆచరిస్తే మోక్షం కలుగుతుందని శాస్త్రం చెప్పుచున్నది గాన ఆ శాస్త్రంచేతనే చివరికి కర్తృత్వం తొలగి మోక్షం రావచ్చుకదా అని

పృచ్ఛకుని అభిప్రాయం. (సమాధానం) అది యుక్తం కాదు. ఎందువల్ల ననగా సాధనాలతో సంపాదించినది అనిత్యం అవుతుంది. మరొక విషయ మేమనగా-నిత్యము, శుద్ధము, జ్ఞానస్వరూపము ముక్తము అయిన ఆత్మను ప్రతిపాదించడంవల్ల, అనగా ఆత్మ ఇలాంటిదని చెప్పడంవల్ల, మోక్షసిద్ధి అంగీకరించబడింది. కర్తృత్వం స్వాభావికం అయిన పక్షంలో అలాంటి ఆత్మయొక్క ప్రతిపాదనం కుదరదు. అందువల్ల ఆత్మకు కర్తృత్వం ఉపాధి ధర్మాల అధ్యాసచేతనే కాని స్వాభావికం కాదు. "ధ్యాయతీవ లేలాయతీవ" అనే శ్రుతి ఈ విషయమే చెపుతూన్నది. "ఆత్మేంద్రియ....మనీషిణః" అనే శ్రుతి ఆత్మకు భోక్తృత్వాదులు ఉపాధులతో సంబంధం ఏర్పడినప్పుడే కలుగుతా యని చెప్పుచున్నది వివేకవంతులకు పరమాత్మకంటె వేరుగా కర్త భోక్త అయిన జీవు డనేవాడు లేడు కదా? "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" ఇత్యాదిశ్రుతులు వినబడుతున్నాయి కదా? (ఆక్షేపం) పరమాత్మకంటె అన్యుడైన, కర్త, బుద్ధ్యాదిసముదాయంకంటె భిన్నుడు, చైతన్యవంతుడు అయిన జీవుడు లేకపోతే అప్పుడు పరమాత్మయే సంసారి అని కర్త అని భోక్త అని చెప్పవలసి వస్తుంది. (సమాధానం) అది కాదు. కర్తృత్వభోక్తృత్వాలు అవిద్యచేత ఏర్పడుచున్నవి కదా?

భాష్యమ్

తథా చ శాస్త్రమ్ - "యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి" (బృ.ఉ.2.4.14) ఇత్యవిద్యావస్థాయాం కర్తృత్వభోక్తృత్వే దర్శయిత్వా విద్యావస్థాయాం తే ఏవ కర్తృత్వ భోక్తృత్వే నివారయతి - "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్" (బృ.ఉ.2.4.14) ఇతి. తథా స్వప్నజాగరిత యోరాత్మన ఉపాధిసంపర్కకృతం శ్రమం శ్యేనస్యేవాకాశే విపరిపతతః శ్రావయిత్వా తదభావం సుషుప్తౌ ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తస్య శ్రావయతి- "తద్వా అస్యైతదాప్తకామమాత్మకామమకామం రూపం శోకాన్తరమ్" (బృ.ఉ.4.3.21) ఇత్యారభ్య "ఏషాస్య పరమా గతిరేషాస్య పరమా సంపదేషోఽస్య పరమో లోక ఏషోఽస్య పరమ ఆనన్దః (బృ.ఉ.4.3.32) ఇత్యుపసంహారాత్. తదేతదాహాచార్యః -"యథా చ తక్షోభయథా" ఇతి. యథా తు తక్షా లోకే వాస్యాదికరణహస్తః కర్తా దుఃఖీ భవతి స ఏవ స్వగృహం ప్రాప్తో వియుక్త

వాస్యాదికరణః స్వస్థో నిర్వృతో నిర్వ్యాపారః సుఖీ భవతి ఏవమవిద్యా ప్రత్యుపస్థాపితద్వైతసంపృక్త ఆత్మా స్వప్నజాగరితయోఃకర్తా దుఃఖీ భవతి. స తచ్ఛ్రమాపనుత్తయే స్వమాత్మానం పరం బ్రహ్మ ప్రవిశ్య విముక్తకార్యకరణ సంఘాతోఽకర్తా సుఖీ భవతి సంప్రసాదావస్థాయామ్. తథా ముక్త్య వస్థాయామప్యవిద్యాధ్వాన్తం విద్యాప్రదీపేన విధూయ ఆత్మైవ కేవలో నిర్వృతః సుఖీ భవతి. - తక్షదృష్టాన్తశ్చైతావతాంశేన ద్రష్టవ్యః. తక్షా హి ఇష్టేషు తక్షణాదివ్యాపారేషు అపేక్ష్యైవ ప్రతినియతాని కరణాని వాస్యాదాని కర్తా భవతి స్వశరీరేణ త్వకర్తైవ, ఏవమయమాత్మా సర్వవ్యాపారేష్వపేక్ష్యైవ మనఆదీని కరణాని కర్తా భవతి. స్వాత్మనాత్వకర్తైవేతి, న త్వాత్మనస్తక్ష ఇవావయవాః సన్తి యైర్హస్తాదిభిరివ వాస్యాదీని తక్షా, మనఆదీని కరణాన్యాత్మోపాదదీత, న్యసేద్వా.

బాలానందిని

తథా చేతి :- అందుచేతనే శాస్త్రం "యత్ర...పశ్యతి" అని కర్తృత్వభోక్తృత్వాలు అవిద్యావస్థలోనే ఉంటాయని చెప్పి. "యత్ర ...పశ్యేత్" అని ఆ కర్తృత్వభోక్తృత్వాలనే విద్యావస్థలో నిషేధిస్తూన్నది. అట్లే ఆకాశంలో ఎగురుతూన్న డేగకు వలె ఆత్మకు స్వప్న జాగరితావస్థలలో ఉపాధిసంపర్కంచేత శ్రమ కలుగుతుందని చెప్పి సుషుప్తిలో పరమాత్మతో కలిసిన ఆ ఆత్మకే శ్రమ లేనట్లు చెపుతున్నది. "తద్వా...శోకాన్తరమ్" (బృ.ఉ.4.3.21) (ఇదియే వీని ఆనందరూపం అవడంచేత ఆత్మనే కోరేది, పొందబడిన సమస్తకామాలు కలది, తనకంటె భిన్నమైన కార్యమైనది ఏదీ లేకపోవడంచేత అకామమూ, శోకంనుండి దూరమైనదీ అయిన నిజస్వరూపం) అని ప్రారంభించి "ఏషా...ఆనన్దః" (ఇది, సుషుప్తాత్మ రూపమే, వీని పరమగతి (పొందవలసిన స్థానం). ఇదే వీని పరమసంపద, ఇదే వీని లోకం (భోగ్యమైన సుఖం) ఇదే వీని పరమానందం) అని ఉపసంహారం చేయబడింది. ఈ విషయాన్నే ఆచార్యుడు "యథా చ తక్షోభయథా" అని చెపుతున్నాడు. ఇక్క 'చ' శబ్దం 'తు' అనే అర్థంలో పఠింపబడినది. అగ్నికి ఔష్ణ్యం వలె ఆత్మకు కర్తృత్వం స్వాభావిక మని అనుకొన గూడదు. లోకంలో ఒక వడ్రంగి బాడిత మొదలైనవి చేత ధరించి ఏ విధంగా ఆ పనులూ ఈ పనులూ చేస్తూ దుఃఖవంతు డౌతాడో, అతడే స్వగృహానికి వెళ్లి బాడిత

మొదలైన సాధనాలు దూరంగా విడచి స్వస్థుడై, విశ్రాంతుడై వ్యాపారరహితుడై సుఖంగా ఉంటాడో అట్లే అవిద్యచేత ఏర్పరుపబడిన ద్వైతప్రపంచంతో కూడిన ఆత్మ స్వప్న జాగరితావస్థలలో కర్తయై దుఃఖవంతుడుగా ఉంటాడు; అతడే ఆ శ్రమ తొలగడంకొరకు కార్యకరణసము దాయాన్నంతనీ (దేహేంద్రియాదులను) దూరంగా ఉంచి, సుషుప్తావస్థలో తన ఆత్మయైన పరబ్రహ్మను ప్రవేశించి సుఖంగా ఉంటాడు. అట్లే ముక్త్యవస్థలో కూడ విద్యాదీపంచేత అవిద్యాంధకారాన్ని తొలగించుకొని కేవలాత్మస్వరూపుడై, విశ్రాంతుడై సుఖంగా ఉంటాడు. తక్షదృష్టాంతాన్ని ఈ అంశంలో మాత్రమే గ్రహించాలి. విశిష్టమైన ఆ యా తక్షణాది వ్యాపారాలు చేయవలసి నప్పుడు తక్ష ఆ యా పనులకు అవసరమైన బాడిత మొదలైన సాధనాల్ను తీసికొని కర్త అవుతున్నాడు. (ఆ సాధనాలు లేనప్పుడు తన శరీరంచేతనైతే అకర్తయే; అదే విధంగా ఈ ఆత్మ అన్ని పనులలోను మనస్సు మొదలైన సాధనాలను అపేక్షించియే (వాటిని పట్టియే) కర్త అవుతాడు; స్వస్వరూపంచేతనైతే అకర్తయే. (అంతేకాని తక్ష తన హస్తాద్యవయవాలతో ఆ యా సాధనాలను ఉపయోగించినట్లు ఆత్మ కూడ మనస్సు మొదలైనవాటిని తన అవయవాలచేత గ్రహించడం అనేది లేదు. అందుచేత తక్షకు వాస్యాదిసంబంధం ఉన్నట్లు ఆత్మకు మనస్సు మొదలైనవాటితో సంబంధం ఉంది అని చెప్పడం వరకే దృష్టాంతదార్ష్టాంతిక భావం అని అర్థం). తక్ష హస్తాద్యవయవాలతో వాస్యాదికరణాలను గ్రహించినట్లు ఆత్మ యైతే మనస్సు మొదలైన కరణాలను గ్రహించడు లేదా దూరంగా ఉంచడు. ఎందువల్లననగా తక్ష కున్నట్లు ఆత్మకు అవయవాలు లేవు.

## భాష్యమ్.

యత్తూక్తమ్ - శాస్త్రార్థవత్త్వాదిభిర్హేతుభిః స్వాభావికమాత్మనః కర్తృత్వమితి; తన్న. విధి శాస్త్రం తావత్ యథాప్రాప్తం కర్తృత్వముపాదాయ కర్తవ్యవిశేషము పదిశతి, న కర్తృత్వమాత్మనః ప్రతిపాదయతి. న చ స్వాభావికమస్య కర్తృత్వమస్తి; బ్రహ్మాత్మత్వోపదేశాదిత్యవోచామ. తస్మాదవిద్యాకృతం కర్తృత్వముపాదాయ విధిశాస్త్రం ప్రవర్తిష్యతే. "కర్తా విజ్ఞానాత్మా పురుషః" ఇత్యేవంజాతీయకమపి శాస్త్రమనువాదరూపత్వాద్యథాప్రాప్తమేవావిద్యాకృతం కర్తృత్వమనువదిష్యతి.

ఏతేన విహారోపాదానే పరిహృతే, తయోరప్యను వాదరూపత్వాత్. నను సంధ్యే స్థానే ప్రసుప్తేషు కరణేషు స్వే శరీరే యథాకామం పరివర్తతే ఇతి విహార ఉపదిశ్యమానః కేవలస్యాత్మనః కర్తృత్వమావహతి. తథోపాదానేఽపి "తదేషాం ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞానమాదాయ" ఇతి కరణేషు కర్మకరణవిభక్తీ శ్రూయమాణే కేవలస్యాత్మనః కర్తృత్వం గమయత ఇతి; అత్రోచ్యతే-న తావత్సంధ్యే స్థానేఽత్యన్తమాత్మనః కరణవిరమణమస్తి "సధీః స్వప్నో భూత్వా ఇమం లోకమతిక్రామతి" (బృ.ఉ.4.3.7) ఇతి తత్రాపి ధీసంబన్ధ శ్రవణాత్. తథా చ స్మరన్తి -

"ఇన్ద్రియాణాముపరమే మనోఽనుపరతం యది,
సేవతే విషయానేవతద్విద్యాత్స్వప్నదర్శనమ్" (మ భా శాం 275. 24)

Page. 5/36.

ఇతి. కామాదయశ్చ మనసో వృత్తయః ఇతి శ్రుతిః. తాశ్చ స్వప్నే దృశ్యన్తే; తస్మాత్సమనా ఏవ స్వప్నే విహరతి. విహారోఽపి చ తత్రత్యో వాసనామయ ఏవ న తు పారమార్థికోఽస్తి. తథా చ శ్రుతిరివకారానుబద్ధమేవ స్వప్నవ్యాపారం వర్ణయతి "ఉతేవ స్త్రీభిః మోదమానో జక్షదుతేవాపి భయాని పశ్యన్" (బృ.ఉ.4.3.13) ఇతి. లౌకికా అపి తథైవ స్వప్నం కథయన్తి "అరుక్షమివ గిరిశృఙ్గమ్, అద్రాక్షమివ వనరాజిమ్" ఇతి.

బాలానందిని

యుక్త్యేతి :- శాస్త్రం సార్థకం అవడం మొదలైన హేతువులచేత ఆత్మకు కర్తృత్వం స్వాభావికమే అని చెప్పినది యుక్తం కాదు. ఏలాంటి కర్తృత్వం ఉంటుందో దానిని ఆధారంగా తీసికొని విధిశాస్త్రం ఆ యా కర్తవ్యాలను బోధిస్తుంది కాని ఆత్మకు కర్తృత్వం ఉంది అని అది ప్రతిపాదించదు. జీవుడు బ్రహ్మస్వరూపుడు అని ఉపదేశించడంవల్ల వీనికి స్వాభావికంగా కర్తృత్వం లేదు అని చెప్పి ఉన్నాం. అందుచేత అవిద్యచేత ప్రాప్తించిన కర్తృత్వాన్నే దృష్టిలో ఉంచుకొని విధిశాస్త్రం ప్రవర్తిస్తుంది. "కర్తా విజ్ఞానాత్మా పురుషః" ఇత్యాదిశాస్త్రం కూడ అనువాదరూపమే గాన అది అవిద్యచేత ఏ విధమైన

కర్తృత్వం ఆత్మకు ఉంటుందో దానిని మాత్రమే అనువదిస్తుంది.

ఏ. అనువాదం అనగా అంతకు పూర్వమే ప్రమాణాంతరాలచేత తెలిసిన విషయాన్ని ఏదో సందర్భంలో చెప్పడం. "కర్తా విజ్ఞానాత్మా పురుషః" ఇత్యాదివాక్యాలు ఆత్మకు కర్తృత్వం ఉంది అని చెప్పడం కోసం బయలుదేరలేదు. లోకంలో ఆత్మకు ఎలాంటి కర్తృత్వం ఉన్న దను ప్రసిద్ధి ఉందో దానినే నిర్దేశిస్తున్నాయి. ఇది వరకు తెలియని కొత్త విషయాన్ని చెపితేనే అది 'విధి' (కొత్త విషయం చెప్పడం ) అవుతుంది. తెలిసినదానినే మళ్లీ చెపితే అనువాదమే. ఆ కర్తృత్వం ఎలాంటిది అంటే అది అవిద్యాకల్పిత మైనది అని ఇతరప్రమాణాలచేత తెలుస్తూన్నది గాన దానిని గ్రహించవలసి ఉంటుంది.

ఏతేనేతి:- దీనిచేత, విహారోపాదానాలు కూడ అవిద్యారూపాలే గాన వాటిని కూడ పరిహరించినట్లే. (ప్రశ్న) స్వప్నావస్థలో అన్ని ఇంద్రియాలు నిద్రిస్తూన్నప్పుడు ఆత్మ తన శరీరంలో స్వేచ్ఛగా సంచరిస్తూంటాడు అని చెప్పబడిన విహారం, కేవలమైన ఆత్మకు కర్తృత్వం ఉన్నదని సూచిస్తూన్నది కదా? అట్లే - "తదేషాం...ఆదాయ" అని చెప్పిన ఉపాదానం కూడ కరణాల విషయంలో (ఇంద్రియాదుల విషయంలో) వినబడుచున్న కర్మ-కరణ విభక్తులు (విజ్ఞానమ్ అని ద్వితీయావిభక్తి, విజ్ఞానేన అని తృతీయావిభక్తి) ఆత్మ ఒక్కటి మాత్రమే కర్త (కరణాదులను కర్మగాను కరణంగాను ఉపయోగిస్తున్నా డనీ) తెలుపుతున్నాయి కదా? (సమాధానం) - ఈ విషయంలో చెప్పబడుచున్నది. సంధ్యస్థానంలో ఆత్మకు పూర్తిగా కరణాల విరమణం (పని చేయకపోవడం) లేదు. "సధీః...అతిక్రామతి" (మనస్సుతో?) కూడినవాడై స్వప్నంగా అయి ఈ లోకాన్ని (జాగ్రదవస్థను) దాటతాడు) అని అక్కడ కూడ ధీసంబంధం ఉన్నదని చెప్పుచున్నది. అట్లే-"ఇన్ద్రియాణామ్..దర్శనమ్" (ఇంద్రియాలు విరమించగా, మనస్సు మాత్రం విరమించకుండా ఉన్నప్పుడు విషయాలనే సేవించినట్లయితే అది స్వప్నదర్శనం అని తెలుసుకోవాలి) అని స్మృతి కూడ చెప్పుచున్నది. "కామాదయశ్చ మనసో వృత్తయః" (కామం మొదలైనవి మనస్సుయొక్క వృత్తులు) అని శ్రుతి చెప్పుచున్నది. ఆ మనోవృత్తులు స్వప్నంలో కూడా ఉంటాయి. అందుచేత ఆత్మ స్వప్నంలో మనస్సుతో కలిసియే విహరిస్తాడు. అక్కడ జరిగే విహారం కూడ వాసనామయమైనదే కాని పారమార్థికం కాదు. అందుచేతనే శ్రుతి "ఉతేవ...పశ్యన్" (స్త్రీలతో కలిసి సంతోషిస్తున్నవాడు వలె, తింటున్నవాడు వలె, భయాలను చూస్తున్న

వాడువలె) అని స్వప్నంలో జరిగే పనులను వర్ణించేటప్పుడు 'ఇవ' (వలె) శబ్దాన్ని ప్రయోగిస్తున్నది. లౌకికులు కూడ స్వప్నాన్ని గూర్చి చెప్పేటప్పుడు శిఖరం ఎక్కినట్లనిపించింది, వనపంక్తిని చూచినట్లనిపించింది అంటూ 'ఇవ' శబ్దం ప్రయోగించి చెపుతూంటారు.

## భాష్యమ్

తథోపాదానేఽపి. యద్యపి కరణేషు కర్మకరణవిభక్తినిర్దేశః తథాపి తత్సంపృక్తస్యైవాత్మనః కర్తృత్వం ద్రష్టవ్యమ్; కేవలే కర్తృత్వాసంభవస్య దర్శితత్వాత్. భవతి చ లోకేఽనేకప్రకారా వివక్షా- "యోధా యుధ్యన్తే" - "యోధై రాజా యుధ్యతే" ఇతి. అపి చాస్మిన్ ఉపాదానే కరణవ్యాపారోపరమమాత్రం వివక్ష్యతే, న స్వాతన్త్ర్యం కస్యచిత్, అబుద్ధిపూర్వకస్యాపి స్వాపే కరణ వ్యాపారోపరమస్య దృష్టత్వాత్. యస్త్వయం వ్యపదేశో దర్శితః "విజ్ఞానం యజ్ఞం తనుతే" ఇతి, స బుద్ధేరేవ కర్తృత్వం ప్రాపయతి; విజ్ఞానశబ్దస్య తత్ర ప్రసిద్ధత్వాత్, మనోఽనన్తరం పాఠాచ్చ. "తస్య శ్రద్ధైవ శిరః" (తై.ఉ.2.4) ఇతి చ విజ్ఞానమయస్యాత్మనః శ్రద్ధాద్యవయవత్వసంకీర్తనాత్. శ్రద్ధాదీనాం చ బుద్ధి ధర్మత్వప్రసిద్ధేః, "విజ్ఞానం దేవాః సర్వే బ్రహ్మ జ్యేష్ఠముపాసతే" (తై.ఉ.2.5.1) ఇతి చ వాక్యశేషాత్. జ్యేష్ఠత్వస్య చ ప్రథమజత్వస్య బుద్ధౌ ప్రసిద్ధత్వాత్ "స ఏష వాచశ్చిత్తస్యోత్తరోత్తరక్రమో యద్యజ్ఞః" ఇతి చ శ్రుత్యన్తరే యజ్ఞస్య వాగ్బుద్ధిసాధ్యత్వావధారణాత్. నచ బుద్ధేః శక్తివిపర్యయః కరణానాం కర్తృత్వాభ్యుపగమే భవతి. సర్వకారకాణామేవ స్వస్వవ్యాపారేషు కర్తృత్వస్యావశ్యం భావిత్వాత్. ఉపలబ్ధ్యపేక్షం త్వేషాం కరణానాం కరణత్వమ్, సా చాత్మనః. న చ తస్యామప్యస్య కర్తృత్వమస్తి, నిత్యోపలబ్ధిస్వరూపత్వాత్. అహంకారపూర్వ కమపి కర్తృత్వం నోపలబ్ధుర్భవితుమర్హతి, అహంకారస్యాప్యుపలభ్యమానత్వాత్. న చైవం సతి కరణాన్తరకల్పనాప్రసంగః; బుద్ధేః కరణత్వాభ్యుపగమాత్.

నమాధ్యభావస్తు శాస్త్రార్థవత్త్వేనైవ పరిహృతః యథాప్రాప్తమేవ కర్తృత్వముపాదాయ సమాధివిధానాత్. తస్మాత్కర్తృత్వ మస్యాత్మనః ఉపాధినిమిత్త మేవేతి స్థితమ్.40.

బాలానందిని

తథేతి:- ఉపాదానం విషయంలో కూడా అట్లే. కరణాలను (ఇంద్రియాదులను) కర్మలనుగాను, కరణాలుగాను (ద్వితీయాతృతీయావిభక్తులతో) నిర్దేశం చేసినా కూడ వాటితో కూడిన ఆత్మకే కర్తృత్వం అని గ్రహించాలి. కేవలమైన ఆత్మకు కర్తృత్వం కుదరదని చూపబడింది కదా? లోకంలో కూడ యోధులు యుద్ధం చేస్తున్నారు; యోధులతో (యోధులను ఉపయోగించుకొని) రాజు యుద్ధం చేస్తున్నాడు అని అనేక విధాలైన వివక్ష కనబడుతున్నది. మరొక విషయ మేమనగా ఉపాదానంలో (ఉపాదాయ అని చెప్పడంలో) కరణాల వ్యాపారముయొక్క ఉపరమం మాత్రమే (కరణాలు తమ తమ పనులు చేయకుండా ఉంటాయి అని మాత్రమే) చెప్పడానికి ఉద్దేశింపబడినది కాని (వాటిని గ్రహించడంలో) ఎవనికో స్వాతంత్ర్యం ఉందని చెప్పడం ఉద్దిష్టం కాదు. ఎందువల్ల ననగా నిద్రలో బుద్ధి పూర్వకంగా కాకుండానే (నా కరణాలను ఉపసంహరించుకొంటాను అని అనుకొనడం లేకుండానే) కరణాల వ్యాపారం విరమించడం కనబడుతున్నది. ఇంక "విజ్ఞానం యజ్ఞం తనుతే" అను ఏ నిర్దేశం చూపబడిందో అది బుద్ధికే కర్తృత్వాన్ని చెప్పుచున్నది. విజ్ఞానశబ్దం బుద్ధి అనే అర్థంలో ప్రసిద్ధం కదా? మనోమయకోశం తరవాత పఠింపబడి ఉండడంచేత కూడ విజ్ఞాన మనగా బుద్ధి అని తెలుస్తూన్నది. విజ్ఞానమయాత్మకు శ్రద్ధాదులు అవయవాలని "తస్య శ్రద్ధైవ శిరః" ఇత్యాదివాక్యాలు చెపుతున్నాయి. శ్రద్ధాదులు బుద్ధి ధర్మాలని ప్రసిద్ధమైన విషయం. వాక్య శేషంలో కూడ "విజ్ఞానం దేవాః సర్వే బ్రహ్మ జ్యేష్ఠముపాసతే" అని చెప్పబడింది. ముందుగా జన్మించడం అనే ప్రథమజత్యం బుద్ధి విషయంలో ప్రసిద్ధంగా ఉంది.

వి. మహద్యక్షం ప్రథమజమ్ (అన్నింటికంటె ముందు పుట్టిన, పూజ్యమైన మహత్) ఇత్యాది శ్రుతులలో హిరణ్యగర్భరూపమైన బుద్ధి సర్వప్రథమజం అని చెప్పబడింది. జ్యేష్ఠ బ్రహ్మమైన, ప్రథమజహిరణ్యగర్భబ్రహ్మమైన ఆ విజ్ఞానాన్ని (బుద్ధిని) సమస్త దేవతలు (ఇంద్రియాలు) ఉపాసిస్తున్నాయి అని విజ్ఞానం ఇత్యాదిశ్రుతివాక్యానికి అర్థం.

స ఏష ఇతి :- "స ఏష... యజ్ఞః" అను మరొక శ్రుతిలో యజ్ఞం వాక్కుచేత బుద్ధిచేత సాధింప బడుతుంది అని నిశ్చయింపబడింది. (యజ్ఞ మనగా వాక్కుయొక్క చిత్తంయొక్క ఉత్తరోత్తరక్రమమే అని శ్రుతివాక్యానికి అర్థం. చిత్తంచేత ధ్యానం చేసి, వాక్కుచేత మంత్రం పఠించడంచేత యజ్ఞం జరుగుతుంది అని భావం).

కరణాలకు కర్తృత్వాన్ని అంగీకరించినా కూడ బుద్ధికి శక్తివిపర్యయం కలగదు అనగా "ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞానమాదాయ" అనే వాక్యంలో విజ్ఞానాన్ని (బుద్ధిని) కర్తగా గ్రహించిన పక్షంలో విజ్ఞానేన అని తృతీయావిభక్తికి బదులు ప్రథమావిభక్తి ప్రయోగించవలసి ఉంటుందనే ఆశంకకు అవకాశం లేదు. అన్ని కారకాలకు కూడ తాము చేయవలసిన పనుల విషయంలో కర్తృత్వం తప్పక ఉంటుంది గాన వాటి కర్తృత్వ శక్తిని పట్టి దానికి తగిన విభక్తి కూడ ఉపయోగించవచ్చును. కరణత్వాదులను పట్టి వాటికి తగిన విభక్తి ఉపయోగించవచ్చును. వివక్షానుసారంగా రెండు విభక్తులు ఉపయోగించవచ్చును అని భావం.

ఈ కరణాల కరణత్వం ఉపలబ్ధిని పట్టి ఏర్పడినది. అనగా ఇవి జ్ఞానానికి సాధనాలు కాబట్టి కరణాలని చెప్పబడుతున్నాయి. ఆ ఉపలబ్ధి మాత్రం ఆత్మకు సంబంధించినది. అయితే ఆ ఉపలబ్ధి విషయంలో కూడ ఆత్మకు కర్తృత్వం లేదు. ఎందుచేత ననగా ఆత్మ నిత్యోపలబ్ధిస్వరూపం (నిత్యజ్ఞానస్వరూపం).

అవ. బుద్ధికి కర్తృత్వం అంగీకరించిన పక్షంలో అహంకారానికి గోచరుడైన జీవుడు ఆ బుద్ధియే అవుతుంది. అప్పుడు ఆ జీవునికి మరొక కారణం కల్పించవలసి ఉంటుంది. అందుచేత వివాదం కేవలం పేరు విషయంలోనే అని చెప్పిన దానికి సమాధానం చెపుతూ కేవలమైన ఆత్మకు కర్తృత్వం చెప్పబడిందనే భ్రాంతిని తొలగిస్తున్నారు -

అహంకారేతి:- జ్ఞాతకు అహంకార పూర్వకమైన కర్తృత్వం కూడ ఉండడానికి అవకాశం లేదు. అనగా నేను తెలుసుకొనుచున్నాను అనే భావంతో తెలుసుకొనే అవకాశం లేదు. ఎందువల్ల ననగా అహంకారం కూడ తెలియబడుతున్నది. (నేను అనడంలో అహంకారం కూడ తెలుస్తూన్నదిగాన అది జ్ఞేయం అయిపోయింది. జ్ఞేయం జ్ఞాత కాజాలదు). అయితే మరొక కరణాన్ని కల్పించవలసిన ప్రసక్తి ఏర్పడదు. బుద్ధి కరణం అని అంగీకరింపబడింది కదా.

వి. అహమ్ అనే జ్ఞానంలో విషయమైనది శుద్ధమైన ఆత్మ కాదు; బుద్ధివిశిష్టమైన ఆత్మయే దానిలో విషయం అవుతున్నది. కర్తృత్వం కూడ ఈ బుద్ధి విశిష్టమైన ఆత్మకే. ఈ విధంగా విశిష్టాత్మ కర్త అయినప్పుడు దానిలో విశేషమైన జడబుద్ధియే కరణం గాన మరొక కరణాన్ని కల్పించవలసిన పని లేదు అని భావం.

సమాధీతి:- సమాధ్య భావమైతే శాస్త్రార్థవత్త్వంచేతనే నిరాకరించబడింది. ఎందువల్ల ననగా యథాప్రాప్తమైన కర్తృత్వాన్నే అంగీకరించి అనగా ఏ విధమైన కర్తృత్వానికి అవకాశమున్నదో దానిని దృష్టిలో ఉంచుకొని, సమాధి విధింపబడింది. అందువల్ల ఆత్మకు అంగీకరించిన కర్తృత్వం కూడా ఉపాధిని పట్టి ఏర్పడినదే అని నిశ్చితమైనది.40

తక్షాధికరణం సమాప్తం

## 16. పరాయత్తాధికరణమ్. సూ.41

## సూ. పరాత్తు తచ్ఛ్రుతేః. 2.3.41

యదిదమవిద్యావస్థాయాముపాధినిబన్ధనం కర్తృత్వం జీవస్యాభిహితం, తత్కిమనపేక్ష్యేశ్వరం భవతి ఆహోస్విదీశ్వరాపేక్షమితి భవతి విచారణా. తత్ర ప్రాప్తం తావన్నేశ్వరమపేక్షతే జీవః కర్తృత్వ ఇతి. కస్మాత్? అపేక్షాప్రయోజనాభావాత్. అయం హి జీవః స్వయమేవ రాగద్వేషాదిదోషప్రయుక్తః కారకాన్తరసామగ్రీసంపన్నః కర్తృత్వమనుభవితుం శక్నోతి. తస్య కిమీశ్వరః కరిష్యతి? న చ లోకే ప్రసిద్ధిరస్తి కృష్యాదికాసు క్రియాస్వనడుహాదివదీశ్వరోఽపేక్షితవ్య ఇతి. క్లేశాత్మకేన చ కర్తృత్వేన జన్తూన్ సంసృజత ఈశ్వరస్య నైర్ఘృణ్యం ప్రసజ్యేత. విషమఫలం చైషాం కర్తృత్వం విదధతో వైషమ్యమ్. నను 'వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్' (బ్ర.సూ.1.4.17) ఇత్యుక్తమ్? సత్యముక్తమ్; సతి త్వీశ్వరస్య సాపేక్షత్వసంభవే. సాపేక్షత్వం చేశ్వరస్య సంభవతి సతోర్జన్తూనాం ధర్మాధర్మయోః. తయోశ్చ సద్భావః సతి జీవస్య కర్తృత్వే. తదేవచేత్కర్తృత్వమీశ్వరాపేక్షం స్యాత్ కింవిషయమీశ్వరస్య సాపేక్షత్వముచ్యేత? అకృతాభ్యాగశ్చైవం జీవస్య ప్రసజ్యేత. తస్మాత్స్వత

ఏవాస్య కర్తృత్వమితి. ఏతాం ప్రాప్తిం శబ్దేన వ్యావర్త్య ప్రతిజానీతే - పరాత్ ఇతి.

బాలానందిని

పరాదితి :- పరాత్తు జీవునికి కర్తృత్వం పరమేశ్వరుని వల్లనే; తచ్ఛ్రుతేః=పరమేశ్వరుడే ప్రేరకుడు అని శ్రుతిలో చెప్పబడడంవల్ల" అని సూత్రార్థం.

యదితి:- అవిద్యావస్థలో జీవునికి ఉపాధిసంబంధంచేత ఏర్పడుతుందని చెప్పిన కర్తృత్వం ఈశ్వరుణ్ణి అపేక్షించి ఏర్పడుతుందా లేక ఈశ్వరాపేక్ష లేకుండానే ఏర్పడుతుందా అని విచారణ చేయబడుచున్నది. కర్తృత్వం విషయంలో జీవుడు ఈశ్వరుణ్ణి అపేక్షించడు అని ప్రాప్తిస్తున్నది. ఎందువల్ల? అపేక్షించడంలో ప్రయోజనం ఏదీ లేకపోవడంవల్ల. ఈ జీవుడు రాగ ద్వేషాదిదోషాలచేత ప్రేరేపింపబడినవాడై, ఇతరమైన కారకాలు సాధనసామగ్రి చేకూర్చుకొని స్వయంగానే కర్తృత్వాన్ని అనుభవించడానికి (పొందడానికి) సమర్థుడౌతాడు కదా? వానికి ఈశ్వరుడేం చేస్తాడు? కృషి మొదలైన పనులలో ఎద్దులు మొదలైనవాటి అపేక్ష వలె ఈశ్వరుని అపేక్షకూడ ఉంటుందని లోకంలో ప్రసిద్ధి లేదు కదా? మరొక విషయమేమనగా ఈశ్వరుడు క్లేశరూపమైన కర్తృత్వం ప్రాణులకు కలగజేసినట్లయితే వానికి నైర్ఘృణ్యం (జాలి లేకపోవడం అనే దోషం) ప్రసక్తమవుతుంది. జీవులకు విషమఫలాలను ఇచ్చే (హెచ్చు తగ్గులున్న మంచివి చెడ్డవీ అయిన ఫలాలను ఇచ్చే) కర్తృత్వాన్ని కల్పించే ఈశ్వరునికి వైషమ్యం (పక్ష పాతం అనే దోషం) కూడా ఏర్పడుతుంది. (ప్రశ్న) దీనికి (వెనుక) "వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్" అని సమాధానం చెప్పబడింది కదా? (సమాధానం) నిజమే చెప్పబడింది. అయితే ఈశ్వరునికి సాపేక్షత్వం అనేది కుదరాలి కదా? జంతువులకు (ప్రాణులకు) ధర్మాధర్మాలనేవి ఉంటే అప్పుడు ఈశ్వరునికి సాపేక్షత్వం కుదురుతుంది. జీవునికి కర్తృత్వం ఉంటే ధర్మాధర్మాలు ఉంటాయి. ఆ కర్తృత్వం ఈశ్వరాపేక్షం అయితే ఈశ్వరుడు దేన్ని అపేక్షిస్తాడని చెప్పాలి? (అనగా జీవునికి కర్తృత్వం అంటూ ఉంటే ధర్మాధర్మాలు సిద్ధిస్తాయి. జీవునికి ధర్మా ధర్మాలు ఉంటే వాటిని ఆధారంగా తీసికొని ఈశ్వరుడు వాళ్లచేత కర్మలు చేయించడం అనేది సిద్ధిస్తుంది. ఈశ్వరుడు చేయిస్తేనే జీవునికి కర్తృత్వం సిద్ధిస్తుంది అని చక్రక దోషం ఏర్పడుతుంది అని భావం). కర్మాపేక్ష లేకుండానే ఈశ్వరుడు జీవుణ్ణి ప్రవర్తింప చేస్తాడు అని అంగీకరిస్తే జీవునికి అకృతా భ్యాగమం (తాను చేయని కర్మ ఫలితాన్ని అనుభవించవలసి రావడం)

కలుగుతుంది. అందుచేత జీవునికి కర్తృత్వం స్వయంగానే ఉంది అని చెప్పాలి. ఈ ప్రాప్తిని (పూర్వపక్షాన్ని) తుశబ్దంచేత నివారించి పరాత్ అని ప్రతిజ్ఞ చేస్తున్నాడు.

వి. స్ఫటికంలో ఎరుపును అధ్యసించడానికి దాని ప్రక్కన ఉంచిన ఎఱ్ఱని వస్తువు కారణం అయినట్లు కామాదిరూపంలో పరిణమించే బుద్ధి ఆత్మయందు కర్తృత్వాధ్యాసానికి కారణం అని వెనుక చెప్పబడింది. బుద్ధ్యాదిసంబంధంచేత జీవునకు కలిగిన కర్తృత్వాన్ని పురస్కరించుకొని విధినిషేధశాస్త్రం ప్రవర్తిస్తున్నది. కాని ఈశ్వరుడే జీవునిచేత కర్మలు చేయిస్తున్నాడు అని "ఏష హ్యేవ" (కౌషీ 3.8) ఇత్యాదిశ్రుతులు కనబడుతున్నాయి. విధినిషేధశ్రుతులకు, కారయితృత్వబోధకశ్రుతులకు విరోధాన్ని పరిహరించడంచేత పాదసంగతి.

## భాష్యమ్

**అవిద్యావస్థాయాం (కార్యకరణసంఘాతావివేకదర్శినో జీవస్యావిద్యా తిమిరాన్ధస్య సతః పరస్మాదాత్మనః కర్మాధ్యక్షాత్సర్వభూతాధివాసాత్ సాక్షిణః చేతయితురీశ్వరాత్తదనుజ్ఞయా కర్తృత్వభోక్తృత్వలక్షణస్య సంసారస్య సిద్ధిః, తదనుగ్రహహేతుకేనైవ చ విజ్ఞానేన మోక్షసిద్ధిర్భవితుమర్హతి. కుతః? తచ్ఛ్రుతేః. యద్యపి రాగాదిదోషప్రయుక్తః సామగ్రీసంపన్నశ్చ జీవః; యద్యపి చ లోకే కృష్యాదిషు కర్మసు నేశ్వరకారణత్వం ప్రసిద్ధం, తథాపి సర్వాస్వేవ ప్రవృత్తిష్వీశ్వరో హేతుకర్తేతి శ్రుతేరవసీయతే. తథాహి శ్రుతిర్భవతి - "ఏష హ్యేవ సాధు కర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతే, ఏష హ్యేవాసాధు కర్మ కారయతి తం యమధో నినీషతే" (కౌషీ. 3.8) ఇతి. "య ఆత్మని తిష్ఠన్నాత్మానమన్తరో యమయతి" ఇతి చైవంజాతీయకా. 41.**

## బాలానందిని

**అవిద్యేతి :-** అవిద్యావస్థలో శరీరేంద్రియసముదాయంకంటె తాను వేరైనవాడు అని తెలుసుకొనక అవిద్య అనే తిమిరంచేత (చీకటిచేత లేదా రేచీకటిచేత) అంధుడై ఉన్న జీవునకు కర్మాధ్యక్షుడు, సకలభూతాలలో నివసించేవాడు, సాక్షి, చైతన్యస్వరూపుడు

అయిన ఈశ్వరునివల్ల ఆతని అనుజ్ఞచేత కర్తృత్వమూ, భోక్తృత్వమూ లక్షణాలుగా గల సంసారం సిద్ధిస్తుంది (కలుగుతుంది). ఈశ్వరుని అనుగ్రహంచేతనే కలిగిన విజ్ఞానంచేత మోక్షసిద్ధి కూడ కలుగుతుంది. ఎందువల్ల? ఆ విధంగా (శ్రుతిలో) వినబడడంవల్ల. జీవుడు రాగాదిదోషాలచేత ప్రేరేపింపబడినా, సామగ్రి సమకూర్చుకొన్నా, కృషి మొదలైన కర్మలలో ఈశ్వరుడు కారణం అని లోకంలో ప్రసిద్ధి లేకపోయినా కూడ అన్ని వ్యవహారాలలోను ఈశ్వరుడే ప్రేరకకర్త అని శ్రుతివల్ల నిశ్చయింపబడుచున్నది. ఆ విధంగానే "ఏష..నినీషతే" (ఎవనిని ఈ లోకాలనుండి పైకి తీసికొని వెళ్లాలని అనుకుంటాడో వానిచేత ఈశ్వరుడే మంచి కర్మ చేయిస్తాడు. ఎవనిని క్రిందికి తీసికొని పోవాలని అనుకుంటాడో వాడిచేత చెడ్డపని చేయిస్తాడు) అని, "య....యమయతి" ఈ మొదలైన శ్రుతులు చెపుతున్నాయి. 41

## భాష్యమ్

నన్వేవమీశ్వరస్య కారయితృత్వే సతి వైషమ్యనైర్ఘృణ్యే స్యాతామకృతాభ్యాగమశ్చ జీవస్యేతి, నేత్యుచ్యతే-

**సూ. కృతప్రయత్నాపేక్షస్తు విహితప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః. 2.3.42**

తుశబ్దశ్చోదితదోషవ్యావర్తనార్థః. కృతో యః ప్రయత్నః జీవస్య ధర్మాధర్మలక్షణ స్తదపేక్ష ఏవైనమీశ్వరః కారయతి. తతశ్చైతే చోదితా దోషా న ప్రసజ్యన్తే. జీవకృతధర్మాధర్మవైషమ్యాపేక్ష ఏవ తత్తత్ఫలాని విషమం విభజతే, పర్జన్యవదీశ్వరో నిమిత్తత్వమాత్రేణ. యథా లోకే నానావిధానాం గుచ్ఛగుల్మాదీనాం వ్రీహియవాదీనాం చాసాధారణేభ్యః స్వస్వబీజేభ్యః జాయమానానాం సాధారణం నిమిత్తం భవతి పర్జన్యః న హ్యసతి పర్జన్యే రసపుష్పపలాశాదివైషమ్యం తేషాం జాయతే, నాప్యసత్సు స్వస్వబీజేషు, ఏవం జీవకృతప్రయత్నాపేక్ష ఈశ్వరస్తేషాం శుభాశుభం విదధ్యాదితి శ్లిష్యతే. నను కృతప్రయత్నాపేక్షత్వమేవ జీవస్య పరాయత్తే కర్తృత్వే నోపపద్యతే. నైష దోషః. అపరాయత్తేఽపి హి కర్తృత్వే కరోత్యేవ హి జీవః. కుర్వన్తం హి తమీశ్వరః కారయతి. అపి చ పూర్వ

ప్రయత్నమపేక్ష్యేదానీం కారయతి, పూర్వతరం చ ప్రయత్నమపేక్ష్య పూర్వమకారయదిత్యనాదిత్వాత్సంసారస్యేత్యనవద్యమ్. కథం పునరవగమ్యతే కృతప్రయత్నాపేక్ష ఈశ్వర ఇతి? "విహిత ప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః" ఇత్యాహ. ఏవం హి "స్వర్గకామో యజేత", "బ్రాహ్మణో న హన్తవ్యః" ఇత్యేవంజాతీయకస్య విహితస్య ప్రతిషిద్ధస్య చావైయర్థ్యం భవతి. అన్యథా తదనర్థకం స్యాత్. ఈశ్వర ఏవ విధిప్రతిషేధయోర్నియుజ్యేత, అత్యన్తపరతన్త్రత్వాజ్జీవస్య. తథా విహితకారిణమప్యనర్థేన సంసృజేత్. ప్రతిషిద్ధ కారిణమప్యర్థేన, తతశ్చ ప్రామాణ్యం వేదస్యాస్తమియాత్. ఈశ్వరస్య చాత్యన్తానపేక్షత్వే లౌకికస్యాపి పురుషకారస్య వైయర్థ్యం, తథా దేశకాలనిమిత్తానాం పూర్వోక్తదోషప్రసంగశ్చే త్యేవంజాతీయకం దోషజాతమాదిగ్రహణేన దర్శయతి. 42.

బాలానందిని

నన్వితి :- ఈశ్వరుడే జీవునిచేత ఆ యా కార్యాలు చేయిస్తే ఈశ్వరునికి వైషమ్యనైర్ఘృణ్యాలు ప్రసక్తమౌతాయి. జీవునకు అకృతాభ్యాగమం కలుగుతుంది కదా? అట్లు కాదు అని చెప్పబడుచున్నది-

కృతేతి :- కృతప్రయత్నాపేక్షస్తు = ఈశ్వరుడు జీవునిచేత చేయబడిన ప్రయత్నాన్ని అపేక్షిస్తూన్నవా డవుతూనే వానిచేత కర్మ చేయిస్తాడు. విహితప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః= విహితకర్మలు, నిషిద్ధకర్మలు వ్యర్థం కాకుండా ఉండడం మొదలైన హేతువులవల్ల" అని సూత్రార్థం.

తుశబ్ద ఇతి :- తుశబ్దానికి పైన చెప్పబడిన దోషాన్ని నివర్తింపచేయడం అర్థం. జీవుడు చేసిన ధర్మాధర్మరూపమైన ప్రయత్నాన్ని అపేక్షించి మాత్రమే ఈశ్వరుడు వానిచేత కార్యాలు చేయిస్తాడు. అందుచేత ఉద్భావన చేసిన దోషాలు ప్రసక్తములు కావు. ఈశ్వరుడు మేఘం వలె కేవలం నిమిత్తమాత్రంగా ఉండి జీవుడు చేసిన ధర్మాధర్మాల వైషమ్యాన్ని ఆధారంగా చేసుకొని ఆయా ఫలాలను విషమంగా విభజిస్తాడు. లోకంలో అసాధారణములైన తమ తమ బీజాలనుండి పుట్టే నానావిధాలైన గుచ్ఛాలు, పొదలు

మొదలైనవాటికి, వ్రీహులు, యవలు మొదలైనవాటికీ కూడ మేఘం ఏ విధంగా సాధారణమైన (అన్నింటికీ సమమైన) నిమిత్తంగా ఉంటుందో అదే విధంగా ఈశ్వరుడు జీవులు చేసిన ప్రయత్నాన్ని అపేక్షించి వాళ్లకు శుభాశుభాలు సమకూరుస్తాడు అని చెప్పడం సమంజసంగా ఉంటుంది. గుచ్ఛగుల్మాదులకు సంబంధించిన ఆ యా విశిష్టమైన బీజాలు లేకపోయినా, మేఘం లేకపోయినా వాటి రసం, పుష్పాలు, ఆకులు మొదలైనవాటిలో వైషమ్యం ఉండదు కదా? (ప్రశ్న) - జీవుని కర్తృత్వం ఈశ్వరుని మీద ఆధారపడి ఉంటే జీవుడు చేసిన ప్రయత్నాన్ని అపేక్షించడం అనేది కుదరదు కదా? (సమాధానం) ఈ దోషం లేదు. కర్తృత్వం ఇతరుని మీద ఆధారపడి ఉన్నా కూడ జీవుడు చేస్తూనే ఉన్నాడు కదా? (చేస్తూన్నది జీవుడే కదా?) చేస్తూన్న ఆ జీవునిచేత ఈశ్వరుడు చేయిస్తున్నాడు. జీవుడు పూర్వం చేసిన ప్రయత్నాన్ని అపేక్షించి ఇప్పుడు చేయిస్తున్నాడు. అంతకు ముందు చేసిన ప్రయత్నాన్ని అపేక్షించి పూర్వం చేయించాడు. ఈ విధంగా సంసారం అనాది అవడంచేత దోషం ఏమీ లేదు. ఈశ్వరుడు కృతప్రయత్నాపేక్షుడని ఎలా తెలుస్తూన్నది? విహితప్రతిషిద్ధావైయర్థ్యాదులవల్ల అని (సమాధానం ) చెపుతున్నాడు. ఇలా చెపితేనే - "స్వర్గ కామో యజేత" ఇత్యాది విహితకర్మలు, "బ్రాహ్మణో న హన్తవ్యః" ఇత్యాదిప్రతిషిద్ధకర్మలూ వ్యర్థం కాకుండా ఉంటాయి. అలా కాకపోతే అవి వ్యర్థము లవుతాయి. జీవుడు పూర్తిగా పరతంత్రుడే కాబట్టి ఈ విధినిషేధాలు ఈశ్వరునికే వర్తింపచేయబడి ఉండేవి. అట్లే ఈశ్వరుడు తన ఇష్టం ప్రకారం, విహితకర్మలు చేసినవానికి అనర్థం కలిగించి ఉండేవాడు, నిషిద్ధకర్మలు చేసేవానికి మంచి చేసి ఉండేవాడు. అప్పుడు వేదంయొక్క ప్రామాణ్యమే నశించిపోతుంది. ఈశ్వరుడు దేని అపేక్షా లేకుండా స్వేచ్ఛగా సుఖదుఃఖాదులను కల్పిస్తాడని అంటే లౌకికమైన పురుషప్రయత్నం, దేశం, కాలం, ఇతరనిమిత్తాలు వ్యర్థం కావలసి వస్తుంది. పైన చెప్పిన దోషాలు ప్రసక్తం అవుతాయి- ఈ మొదలైన దోషసముదాయాన్ని ఆదిశబ్దాన్ని ప్రయోగించడంచేత చూపుచున్నాడు. 42.

పరాయత్తాధికరణం సమాప్తం

## 17. అంశాధికరణమ్. సూ. 43.53

**సూ. అంశో నానావ్యపదేశాదన్యథా చాపి దాశకితవాదిత్వమధీయత ఏకే. 2.3.43**

జీవేశ్వరయోరుపకార్యోపకారకభావ ఉక్తః. స చ సంబద్ధయోరేవ లోకే దృష్టో యథా స్వామిభృత్యయోర్యథా వాగ్నివిస్ఫులిఙ్గయోః. తతశ్చ జీవేశ్వర యోరప్యుపకార్యోపకారకభావాభ్యుపగమాత్కిం స్వామిభృత్యవత్సంబన్ధః. ఆహో స్విదగ్నివిస్ఫులిఙ్గవదిత్యస్యాం విచికిత్సాయామనియమో వా ప్రాప్నోతి, అథవా స్వామిభృత్యప్రకారేష్వీశిత్రీశితవ్యభావస్య ప్రసిద్ధత్వాత్తద్విధ ఏవ సంబన్ధ ఇతి ప్రాప్నోతి. అతో బ్రవీత్యంశ ఇతి. జీవ ఈశ్వరస్యాంశో భవితుమర్హతి. యథాగ్నే ర్విస్ఫులిఙ్గః. అంశ ఇవాంశో, న హి నిరవయవస్య ముఖ్యోంఽశః సంభవతి. కస్మాత్పునర్నిరవయవత్వాత్స ఏవ న భవతి? నానావ్యపదేశాత్. "సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః" (ఛా.ఉ.8.8.1) "ఏతమేవ విదిత్వా మునిర్భవతి","య ఆత్మని తిష్ఠన్నాత్మానమన్తరో యమయతి" ఇతిచైవం జాతీయకో భేదనిర్దేశో నాఽసతి భేదే యుజ్యతే. నను చాయం నానావ్యపదేశః సుతరాం స్వామిభృత్యసారూప్యే యుజ్యత ఇత్యత ఆహ-అన్యథా చాపీతి. న చ నానావ్యపదేశాదేవ కేవలాదంశత్వప్రతిపత్తిః. కింతర్హి? అన్యథాచాపి వ్యపదేశో భవత్యనానాత్వస్య ప్రతిపాదకః. తథా హి ఏకే శాఖినో దాశకితవాదిభావం బ్రహ్మణః ఆథర్వణికా బ్రహ్మసూక్తే- "బ్రహ్మదాశా బ్రహ్మదాసా బ్రహ్మైవేమే కితవాః" ఇత్యాదినా. దాశా య ఏతే కైవర్తాః ప్రసిద్ధాః, యే చామీ దాసాః స్వామి ష్వాత్మానముపక్షిపన్తి, యేచాన్యే ద్యూతకృతస్తే సర్వే బ్రహ్మైవేతి హీనజన్తూ దాహరణేన సర్వేషామేవ నామరూపకృతకార్యకరణసంఘాత ప్రవిష్టానాం జీవానాం బ్రహ్మత్వమాహ. తథాఽన్యత్రాపి బ్రహ్మప్రక్రియాయామేవాయమర్థః ప్రపఞ్చ్యతే.

త్వం స్త్రీ పుమానసి త్వం కుమార ఉత వా కుమారీ
త్వం జీర్ణో దణ్డేన వఞ్చసి త్వం జాతో భవసి విశ్వతోముఖః (శ్వే. ఉ. 4.3)

ఇతి. "సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని కృత్వాభివదన్యదాస్తే" ఇతి చ. "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" (బృ.ఉ.3.7.23) ఇత్యాదిశ్రుతిభ్యశ్చ అస్యార్థస్య సిద్ధిః. చైతన్యం చావిశిష్టం జీవేశ్వరయోర్యథాగ్నివిస్ఫులిఙ్గయోరౌష్ణ్యమ్. అతో భేదాభేదావగమాదంశత్వావగమః. 43

బాలానందిని

అంశ ఇతి :- నానావ్యపదేశాత్= భేదం చెప్పడంవల్ల, అంశః=జీవుడు పరమేశ్వరుని అంశము. ఏకే=కొన్ని శాఖలవాళ్లు, అన్యథా చాపి=నానాత్వం లేకుండా, దాశకితవాదిత్వమ్=దాశత్వం కితవత్వం మొదలైనదానిని, అధీయతే=అధ్యయనం చేస్తున్నారు" అని సూత్రార్థం.

వి. జీవుడు ఒక్కడు, నిత్యుడు, స్వప్రకాశస్వరూపుడు. అణువు కాదు, కర్త కాదు అని ఇంతవరకు త్వం పదార్థం శోధించబడింది. అట్టి త్వంపదార్థానికి బ్రహ్మతో ఐక్యం ఉన్నది అని సాధించడం ద్వారా భేదాభేదశ్రుతులకు విరోధం లేదని సాధించబడుచున్నది గాన పాదసంగతి.

జీవేతి :- జీవేశ్వరుల మధ్య ఉపకార్యోపకారకభావం (జీవుడు ఉపకార్యుడు, ఈశ్వరుడు ఉపకారం చేసేవాడు) అని చెప్పబడింది. లోకంలో స్వామిభృత్యులు, అగ్ని విస్ఫులింగాలు మొదలైనవి వలె కలిసి ఉన్నవాటికే ఉపకార్యోపకారకభావం కనబడుతున్నది. అందుచేత జీవేశ్వరులకు కూడ ఉపకార్యోపకారకభావం అంగీకరించడం వల్ల వాళ్ల సంబంధం స్వామిభృత్యుల సంబంధం వంటిదా, లేదా అగ్నివిస్ఫులింగాల సంబంధం వంటిదా అని ఆలోచించగా అనియమమేనా ప్రాప్తిస్తుంది (ఏదైనా చెప్పవచ్చును అని ప్రాప్తిస్తుంది) లేదా ఈశితృశితవ్యభావం (అధికారం చేసేవాడు, అధికారానికి లొంగి ఉన్నవాడు అనే సంబంధం) స్వామిభృత్యాదులవంటివాళ్లలోనే ప్రసిద్ధంగా కనబడుతుంది గాన ఈ సంబంధం అలాంటిదే కావాలి అని ప్రాప్తిస్తున్నది. అందువల్ల అంశః అని అంటున్నాడు. విస్ఫులింగం (నెరసు) అగ్నియొక్క అంశమైనట్లు జీవుడు ఈశ్వరుని అంశగా ఉండడమే తగి ఉంటుంది. ఇక్కడ అంశం అనగా అంశం వంటిది అంశం అని అర్థం. ఎందువల్ల ననగా అవయవరహితుడైన ఈశ్వరునికి అంశం అంటూ ఉండదు

కదా? (ఈశ్వరుడు) అవయవరహితు డవడంచేత జీవుడు (ఈశ్వరుని అంశంవంటివాడు అనడానికి బదులు) ఆ ఈశ్వరుడే ఎందుకు కాకూడదు? నానావ్యపదేశంవల్ల. అనగా భేదం చెప్పడంవల్ల. "సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః" "ఏతమేవ విదిత్వా మునిర్భవతి" "య ఆత్మని తిష్ఠన్ ఆత్మానమన్తరో యమయతి" ఇత్యాదివిధమైన భేదనిర్దేశం భేదం లేకపోతే కుదరదు. (ప్రశ్న) ఈ నానావ్యవదేశం (అంశాంశిభావంలోకంటె) స్వామిభృత్యసాదృశ్యంలో బాగా కుదురుతుంది కదా? ఇందుకు సమాధానంగా చెపుతున్నాడు - అన్యథా చాపీతి. కేవలం నానావ్యపదేశాన్ని మాత్రమే కారణంగా తీసికొని అంశత్వం తెలియబడడంలేదు. మరేమనగా అనానాత్వాన్ని (అభేదాన్ని) ప్రతిపాదిస్తూ మరొక విధంగా కూడ వ్యపదేశం ఉంది. అదెట్లనగా ఆథర్వణికులైన ఒక శాఖవారు "బ్రహ్మ...కితవాః"(బ్రహ్మదాశులు,బ్రహ్మదాసులు ఈ కితవులు వీళ్లందరూ బ్రహ్మయే)అని, బ్రహ్మసూక్తంలో బ్రహ్మకు దాశకితవాదిత్వాన్ని చెపుతున్నారు. కైవర్తులు (చేపలు పట్టేవాళ్లు) అని ప్రసిద్ధులైన ఏ దాశులున్నారో, స్వాములకు తమను సమర్పించుకొనే ఏ దాసులన్నారో, ఇతరులైన ఏ కితవులు, జూదరులు ఉన్నారో వీళ్లందరూ కూడ బ్రహ్మయే అని హీనులైన జంతువులను (ప్రాణులను) ఉదాహరించడం ద్వారా నామరూపాలతో ఏర్పడిన శరీరేంద్రియ సముదాయంలో ప్రవేశించిన జీవు లందరూ కూడ బ్రహ్మయే అని చెప్పుచున్నది. అట్లే మరొక చోట గూడ. బ్రహ్మప్రక్రియతోనే (బ్రహ్మను గూర్చి చెప్పే సందర్భంలోనే) "త్వం స్త్రీ...విశ్వతోముఖః" (నీవే స్త్రీవి. నీవే పురుషుడవు, నీవే చిన్న పిల్లవాడవు, నీవే చిన్న పిల్లవు, నీవే ముసలివాడవై కఱ్ఱపట్టుకొని నడుస్తూంటావు. నీవే అంతటా వ్యాపించి ఉన్నావు, లేదా నీవే వివిధ ముఖాలతో ఉన్నావు) అని, "సర్వాణి...అస్తే" (బ్రహ్మయే సమస్తరూపాలను విస్తరించి, పేర్లను కల్పించి వ్యవహరిస్తున్నది ఆ బ్రహ్మను తెలుసుకొన్న విద్వాంసుడు అమృతు డవుతాడు) అనీ చెప్పబడింది. ఈ విషయం "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" ఇత్యాది శ్రుతులవల్ల కూడ సిద్ధిస్తుంది. అగ్నివిస్ఫులింగాలలో తేడా ఏమీ లేకుండా వేడి ఉన్నట్లు జీవేశ్వరులలో చైతన్యం కూడ భేదం లేకుండా ఉన్నది. అందుచేత భేదమూ అభేదమూ కూడ తెలియబడుతున్నాయి గాన జీవుడు ఈశ్వరుని అంశ అని తెలుస్తూన్నది. 43.

## భాష్యమ్

కుతశ్చాంశత్వావగమః -

సూ. మన్త్రవర్ణాచ్చ. 2.3.44.

మన్త్రవర్ణశ్చైతమర్థమవగమయతి -

"తావానస్య మహిమా తతో జ్యాయాంశ్చ పురుషః,

పాదోఽస్య సర్వా భూతాని త్రిపాదస్యామృతం దివి" (ఛా.ఉ.3.12.6) ఇతి. అత్ర భూతశబ్దేన జీవప్రధానాని స్థావరజఙ్గమాని నిర్దిశతి - "అహింసన్ సర్వభూతాన్యన్యత్ర తీర్థేభ్యః" ఇతి ప్రయోగాత్. అంశః పాదో భాగ ఇత్యనర్థాన్తరమ్. తస్మాదప్యంశత్వావగమః. 44

బాలానందిని

కుత ఇతి :- జీవుడు ఈశ్వరుని అంశ మని మరి దేనివలన కూడ తెలుస్తూన్నది?

మన్త్రేతి :- "మంత్రవర్ణాచ్చ=మంత్రంవర్ణంవల్ల కూడ అంశత్వం తెలుస్తూన్నది" అని సూత్రార్థం.

మన్త్రేతి:- "తావానస్య...దివి" అనే మంత్రం కూడ ఈ విషయాన్నే చెప్పుచున్నది. ఇక్కడ 'భూత' శబ్దంచేత జీవుడు ప్రధానంగా గల (జీవుడున్న)స్థావరజంగమాలను నిర్దేశిస్తున్నది. (పంచభూతాలు కాదని అర్థం) "అహింసన్ సర్వభూతాన్యన్యత్ర తీర్థేభ్యః (తీర్థములలో శాస్త్రోక్తకర్మలలో) తప్ప సమస్తభూతాలను హింసించనివాడై) ఇత్యాది ప్రయోగాలను పట్టి (భూతశబ్దానికి జీవులున్న స్థావరజంగమాలు అని అర్థం). 'అంశః' 'పాదః' 'భాగః' ఈ పదాలన్నీ పర్యాయపదాలు. అందువల్ల కూడ జీవుడు అంశమే అని తెలుస్తూన్నది.

భాష్యమ్

కుతశ్చాంశత్వావగమః

సూ. అపి చ స్మర్యతే. 2.3.45

ఈశ్వరగీతాస్వపి చేశ్వరాంశత్వం జీవస్య స్మర్యతే- "మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః" (భ.గీ.157)ఇతి. తస్మాదప్యంశత్వావగమః. యత్తూక్తం

స్వామిభృత్యాదిష్వేవేశిత్రీశితవ్యభావో లోకే ప్రసిద్ధ ఇతి, యద్యప్యేషా లోకే ప్రసిద్ధిః తథాపి శాస్త్రాత్త్వత్రాంశాంశిత్వమ్, ఈశిత్రీశితవ్యభావశ్చ నిశ్చీయతే. నిరతిశయోపాధిసంపన్నశ్చేశ్వరో నిహీనోపాధిసంపన్నాన్ జీవాన్ ప్రశాస్తీతి న కించిద్విప్రతిషిధ్యతే. 45

బాలానందిని

అపీతి: - "అపిచ=మరియు స్మర్యతే=స్మృతిలోకూడ చెప్పబడుచున్నది" అని సూత్రార్థం.

ఈశ్వరేతి :- భగవద్గీతలో కూడ "మమైవ...సనాతనః" (సనాతనమైన నా అంశమే జీవలోకంలో జీవుడుగా అయినది) అని జీవుడు ఈశ్వరాంశ అనే విషయం చెప్పబడింది. ఈశిత్రీశితవ్యభావం స్వామిభృత్యాదులలోనే ప్రసిద్ధంగా ఉంది అని ఏది చెప్పబడిందో- లోకంలో ఈ ప్రసిద్ధి ఉన్నా కూడ ఇక్కడ శాస్త్రాన్ని పట్టి అంశాంశిత్వము, ఈశిత్రీశిత వ్యభావమూ కూడ ఉన్నట్లు నిశ్చయింపబడుచున్నది. (అంశాంశిభావం ఉన్నా కూడ) (మాయ అనే) ఉపాధితో కూడిన ఈశ్వరుడు హీనమైన శరీరాద్యుపాధులున్న జీవులను శాసిస్తున్నాడని చెప్పడంలో విరోధం ఏదీ లేదు. 45.

భాష్యమ్

అత్రాహ-నను జీవస్యేశ్వరాంశత్వాభ్యుపగమే తదీయేన సంసారదుఃఖోపభోగేనాంశిన ఈశ్వరస్యాపి దుఃఖిత్వం స్యాత్; యథా లోకే హస్తపాదాద్యన్యతమాఙ్గగతేన దుఃఖేనాఙ్గినో దేవదత్తస్య దుఃఖిత్వం తద్వత్. తతశ్చ తత్ప్రాప్తానాం మహత్తరం దుఃఖం ప్రాప్నుయాత్. అతో వరం పూర్వావస్థః సంసార ఏవాస్త్వితి సమ్యగ్దర్శనానర్థక్యప్రసంగః స్యాదితి. అత్రోచ్యతే.

సూ. ప్రకాశాదివన్నైవం పరః. 2.3.46

యథా జీవః సంసారదుఃఖమనుభవతి నైవం పర ఈశ్వరోఽనుభవతీతి ప్రతిజానీమహే. జీవో హ్యవిద్యావేశవశాద్దేహాద్యాత్మభావమివ గత్వా తత్కృతేన దుఃఖేన దుఃఖ్యహమిత్యవిద్యయా కృతం దుఃఖోపభోగమభిమన్యతే; నైవం

పరమేశ్వరస్య దేహాద్యాత్మభావో దుఃఖాభిమానో వాస్తి. జీవస్యాప్యవిద్యాకృత నామరూపనిర్వృత్తదేహేన్ద్రియాద్యుపాధ్యవివేకభ్రమనిమిత్త ఏవ దుఃఖాభిమానో న తు పారమార్థికోఽస్తి. యథా చ స్వదేహగతదాహచ్ఛేదాదినిమిత్తం దుఃఖం తదభిమానభ్రాన్త్యైవానుభవతి. తథా పుత్రమిత్రాగోచరమపి దుఃఖం తదభిమానభ్రాన్త్యైవానుభవత్యహమేవ పుత్రోఽహమేవ మిత్రమిత్యేవం స్నేహవశేన పుత్రమిత్రాదిష్వభినివిశమానః. తతశ్చ నిశ్చితమేతదవగమ్యతే- మిథ్యాభిమాన భ్రాన్తినిమిత్త ఏవ దుఃఖానుభవ ఇతి.

బాలానందిని

అత్రాహేతి:- ఇక్కడ ఇలా అంటున్నాడు (ఆక్షేపిస్తున్నాడు)- జీవుడు ఈశ్వరుని అంశమని అంగీకరిస్తే లోకంలో చేతులు, కాళ్లు మొదలైన ఏదైన అవయవానికి దుఃఖం కలిగినపుడు అంగియైన (ఆ అవయవాలు గల) దేవదత్తునికి ఏ విధంగా దుఃఖం కలుగుతుందో అట్లే జీవునకు సంబంధించిన సంసారదుఃఖానుభవంచేత అంశియైన ఈశ్వరునికి కూడ దుఃఖం కలగాలి. అందుచేత ఆ ఈశ్వరుణ్ణి చేరినవాళ్లకి చాల అధికమైన దుఃఖం కలుగుతుంది. అందుచేత వెనుకటి అవస్థలో (ఈశ్వరుణ్ణి చేరక మునుపు) ఉన్న సంసారంలో ఉండడమే మంచిదని సమ్యగ్దర్శనం వ్యర్థం అయిపోయే ప్రసక్తి ఏర్పడుతుంది. ఈ విషయంలో (సమాధానంగా) చెప్పబడుతున్నది.

ప్రకాశేతి :- " ప్రకాశాదివత్=ప్రకాశాదులవలె, పరః=ఈశ్వరుడు. ఏవం న=ఈ విధంగా దుఃఖం చెందదు" అని సూత్రార్థం.

యథేతి :- జీవుడు ఏ విధంగా సంసారదుఃఖాన్ని అనుభవిస్తాడో ఆ విధంగా ఈశ్వరుడనుభవించడని ప్రతిజ్ఞ చేస్తున్నాం. జీవుడు అవిద్యావేశంచేత దేహాదులే ఆత్మ అనే భావాన్ని పొందినట్లు పొంది వాటికి కలిగిన దుఃఖం తనకే కలిగిందనుకొంటూ అవిద్యాకృతమైన దుఃఖానుభవాన్ని తనమీద పెట్టుకుంటాడు. పరమేశ్వరునికి ఈ విధమైన దేహాద్యాత్మభావం గాని దుఃఖాభిమానం కాని లేదు. జీవున కున్న ఈ దుఃఖాభిమానం కూడ అవిద్యచేత చేయబడిన నామరూపాలచేత ఏర్పడిన దేహేంద్రియాద్యుపాధులు వేరు నేను వేరు అని తెలియకపోవడం అనే భ్రమచేతనే

కలుగుతున్నది గాని పారమార్థికం కాదు. తన దేహంమీద ఉన్న అభిమానం అనే భ్రాంతి చేతనే ఆ దేహానికి సంబంధించిన కాలడం, ఛేదించడం మొదలైనవాటివల్ల కలిగే దుఃఖాన్ని ఎలా అనుభవిస్తున్నాడో పుత్రమిత్రాదులకు కలిగిన దుఃఖాన్ని కూడ వాళ్లయందు అభిమాన మనే భ్రాంతిచేతనే, నేనే పుత్రుణ్ణి. నేనే మిత్రుణ్ణి అని స్నేహవశంచేత పుత్రమిత్రాదులపైన అభిమానం పెంచుకొని అనుభవిస్తున్నాడు. అందువల్ల దుఃఖానుభవం మిథ్యాభిమానభ్రమచేతనే ఏర్పడిన దని నిశ్చితంగా తెలుస్తూన్నది.

భాష్యమ్.

వ్యతిరేకదర్శనా చ్చైవమవగమ్యతే. తథాహి-పుత్రమిత్రాదిమత్సు బహుషూపవిష్టేషు తత్సమ్బన్ధాభిమానిష్వితరేషు చ పుత్రో మృతో మిత్రం మృతమిత్యేవమాద్యుద్ఘోషితే యేషామేవ పుత్రమిత్రాదిమత్త్వాభిమానస్తేషామేవ తన్నిమిత్తం దుఃఖముత్పద్యతే, నాభిమానహీనానాం పరివ్రాజకాదీనామ్. అతశ్చ లౌకికస్యాపి పుంసః సమ్యగ్దర్శనవత్త్వం దృష్టం. కిముత విషయశూన్యా దాత్మనోఽన్యద్వస్త్వన్తరమపశ్యతో నిత్యచైతన్యమాత్రస్వరూపస్యేతి. తస్మాన్నాస్తి సమ్యగ్దర్శనానర్థక్యప్రసంగః. ప్రకాశాదివదితి నిదర్శనోపన్యాసః. యథా ప్రకాశః సౌరశ్చాన్ద్రమసో వా వియద్వ్యాప్యావతిష్ఠమానోఽఙ్గుల్యాద్యుపాధిసంబన్ధాత్తేష్వృజువక్రాదిభావం ప్రతిపద్యమానేషు తత్తద్భావమివ ప్రతిపద్యమానోఽపి న పరమార్థతస్తద్భావం ప్రతిపద్యతే, యథా చాకాశో ఘటాదిషు గచ్ఛత్సు గచ్ఛన్నివ విభావ్యమానోఽపి న పరమార్థతో గచ్ఛతి, యథా చోదశరావాదికమ్పనాత్ తద్గతే సూర్యప్రతిబిమ్బే కమ్పమానేఽపి న తద్వాన్ సూర్యః కమ్పతే, ఏవమవిద్యాప్రత్యుపస్థాపితే బుద్ధ్యాద్యుపహితే జీవాఖ్యేంఽశే దుఃఖాయమానేఽపి న తద్వానీశ్వరో దుఃఖాయతే. జీవస్యాపి తు దుఃఖప్రాప్తిరవిద్యానిమిత్తైవేత్యుక్తమ్. తథా చావిద్యానిమిత్తజీవభావవ్యుదాసేన బ్రహ్మభావమేవ జీవస్య ప్రతిపాదయన్తి వేదాన్తాః "తత్త్వమసి" ఇత్యేవమాదయః. తస్మాన్నాస్తి జైవేన దుఃఖేన పరమాత్మనో దుఃఖిత్వప్రసంగః. 46

బాలానందిని

వ్యతిరేకేతి:- వ్యతిరేకం కనబడడంవల్ల కూడ (అనగా అభిమానం లేనప్పుడు దుఃఖం కలగక పోవడంవల్ల కూడ) ఇది ఇట్లే అని తెలుస్తూన్నది. అదెట్లనగా-పుత్ర మిత్రాదులతో సంబంధం ఉన్నదనే అభిమానం గల పుత్రమిత్రాదిమంతులు, ఇతరులూ చాలా మంది ఒక చోట కూర్చొని ఉండగా పుత్రుడు మరణించాడు, మిత్రుడు మరణించాడు అని (ఎవరో వచ్చి)చాటగా పుత్రామిత్రాదిమత్త్వాభిమానం ఎవరి కున్నదో వాళ్లకే ఆ మాట వినడంవల్ల దుఃఖం కలుగుతూన్నది. అలాంటి అభిమానం లేని పరివ్రాజకులు మొదలైనవాళ్లకు కలగడం లేదు. అందుచేత లౌకికుడైన పురుషునికి కూడ సమ్యగ్దర్శనం ఉండడం కనబడుతున్నది. అలాంటప్పుడు ఏ విషయాలతోను సంబంధం లేని, స్వస్వరూపం కంటె భిన్నమైన మరొక వస్తువును దేనినీ చూడని, నిత్య చైతన్యమాత్రస్వరూపుడైన పరమేశ్వరుని మాట చెప్పాలా!అందువల్ల సమగ్దర్శనం వ్యర్థం అయ్యే ప్రసక్తి లేదు. "ప్రకాశాదివత్" అని నిదర్శనం చూపబడుచున్నది. ఆకాశంలో వ్యాపించి ఉన్న సూర్యకాంతిగాని, చంద్రకాంతిగాని వ్రేళ్లు మొదలైన ఉపాధుల సంబంధంచేత అవి ఋజుత్వాన్నీ వక్రత్వాన్నీ పొందినపుడు ఋజుత్వవక్రత్వాదులను పొందుతున్నట్లు కనబడినా వాస్తవంలో ఏ విధంగా వాటిని పొందదో, ఘటాదులు వెడుతున్నప్పుడు ఆకాశం కూడ వెడుతున్నట్లు కనబడినా వాస్తవంలో ఏ విధంగా వెళ్లదో, నీళ్లు నింపిన మూకుళ్లు మొదలైనవి కదలడంవల్ల వాటిలో ఉన్న సూర్యప్రతిబింబం కదలినా ఆ ప్రతిబింబం గల (అప్రతిబంబానికి బింబమైన) సూర్యుడు ఏ విధంగా కదలడో అదే విధంగా అవిద్యచేత ఏర్పడిన, బుద్ధ్యాద్యుపహితుడైన (బుద్ధ్యాద్యుపాధులతో కూడిన) జీవు డనే అంశం దుఃఖిస్తూన్నా, ఆ అంశం గల ఈశ్వరుడు దుఃఖించడు. జీవుని దుఃఖప్రాప్తి కూడ అవిద్యచేత ఏర్పడినదే అని చెప్పి ఉన్నాం. అందుచేత "తత్త్వమసి" మొదలైన వేదాంతాలు జీవునకు అవిద్యచేత ఏర్పడిన జీవత్వాన్ని తొలగించి బ్రహ్మత్వాన్నే ప్రతిపాదిస్తున్నాయి. అందువల్ల జీవునికి సంబంధించిన దుఃఖంచేత పరమాత్మకు దుఃఖం కలిగే ప్రసక్తి లేదు. 46.

## సూ.స్మరన్తి చ. 2.3.47

స్మరన్తి చ వ్యాసాదయో యథా జైవేన దుఃఖేన న పరమాత్మా దుఃఖాయత ఇతి.

తత్ర యః పరమాత్మా హి స నిత్యో నిర్గుణః స్మృతః,

న లిప్యతే ఫలైశ్చాపి పద్మపత్రమివామ్భసా.

కర్మాత్మా త్వపరో యోఽసౌ మోక్షబన్ధైః స యుజ్యతే,

స సప్తదశకేనాపి రాశినా యుజ్యతే పునః. (మ. భా. శాం. 351.14.19)

ఇతి. చశబ్దాత్సమామనన్తి చేతి వాక్యశేషః "తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యోఽభిచాకశీతి" (శ్వే. ఉ. 4.6) ఇతి. "ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః" (క. ఉ. 5.11) ఇతి చ. 47

బాలానందిని

స్మరన్తీతి :- "స్మరన్తి చ=స్మృతులలో కూడ చెప్పుచున్నారు" అని సూత్రార్థం.

స్మరన్తీతి :- జీవునకు సంబంధించిన దుఖంచేత పరమాత్మ దుఃఖిచడు అని "తత్ర....పునః" అని వ్యాసాదులు స్మరిస్తున్నారు కూడ. ఆ ఇద్దరిలో పరమాత్మ నిత్యుడు, నిర్గుణుడు, ఉదకంచేత తామరాకు వలె ఫలములచేత కూడ లిప్తుడు కాడు. రెండవవాడు మాత్రం కర్మప్రధానుడు. మోక్షంతోను, బంధాలతోను సంబంధించి ఉంటాడు. పది ఇంద్రియాలు. ఐదు ప్రాణాలు మనస్సు, బుద్ధి అనే పదిహేడింటితో కూడి ఉంటాడు" అని ఈ శ్లోకాల తాత్పర్యం (సూత్రంలోని) 'చ' శబ్దంచేత శ్రుతిలో కూడ చెప్పుచున్నారు అని వాక్యశేషం చేర్చుకోవాలి. "తయో..అభిచాకశీతి" అని ".ఏకః..బాహ్యః" ప్రకాశింపచేయబడుచున్న పదార్థాల దోషాలచేత సూర్యు డే విధంగా లిప్తుడు కాడో అట్లే సర్వభూతాంతరాత్మయైన పరమేశ్వరుడు, బాహ్యుడై, అనగా సంగరహితుడై, లోకంయొక్క దుఃఖంచేత లిప్తుడు కాడు) అని శ్రుతివాక్యాలు. 47.

భాష్యమ్

అత్రాహ-యది తర్హ్యేక ఏవ సర్వేషాం భూతానామన్తరాత్మా స్యాత్ కథమనుజ్ఞాపరిహారౌ స్యాతాం లౌకికౌ వైదికౌ చేతి. నను చాంశో జీవ ఈశ్వరస్యేత్యుక్తమ్, తద్భేదాచ్చానుజ్ఞాపరిహారౌ తదాశ్రయావవ్యతికీర్ణావుపపద్యేతే. కిమత్ర చోద్యత ఇతి. ఉచ్యతే; నైతదేవమ్. అనంశత్వమపి జీవస్యాభేదవాదిన్యః

శ్రుతయః ప్రతిపాదయన్తి "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" (తై.ఉ. 2.6.1), నాన్యోఽతోఽస్తి ద్రష్టా" (బృ. ఉ. 3.7.23), "మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి "(బృ.ఉ. 4.4.19), "తత్త్వమసి" (ఛా.ఉ. 6.8.7) "అహం బ్రహ్మాస్మి" (బృ.ఉ.1.4.16) ఇత్యేవంజాతీయకాః. నను భేదాభేదావగమాభ్యా మంశత్వం సిధ్యతీత్యుక్తమ్? స్యాదేతదేవం యద్యుభావపి భేదాభేదౌ ప్రతిపిపాద యిషితౌ స్యాతామ్. అభేద ఏవ త్వత్ర ప్రతిపిపాదయిషితో బ్రహ్మాత్మత్వ ప్రతిపత్తౌ పురుషార్థసిద్ధేః. స్వభావప్రాప్తస్తు భేదోఽనూద్యతే. న చ నిరవయవస్య బ్రహ్మణో ముఖ్యోంఽశో జీవః సంభవతీత్యుక్తమ్. తస్మాత్పర ఏవైకః సర్వేషాం భూతానామన్తరాత్మా జీవభావేనావస్థిత ఇత్యతో వక్తవ్యాఽనుజ్ఞాపరిహారోపపత్తిః. తాం బ్రూమః-

సూ. అనుజ్ఞాపరిహారౌ దేహసంబన్ధాజ్జ్యోతిరాదివత్. 2.3.48

"ఋతౌ భార్యాముపేయాత్" ఇత్యనుజ్ఞా, "గుర్వఙ్గనాం నోపగచ్ఛేత్" ఇతి చ పరిహారః. తథా "అగ్నీషోమీయం పశుం సంజ్ఞపయేత్ " ఇత్యనుజ్ఞా, "మా హింస్యాత్సర్వాభూతాని" ఇతి పరిహారః. ఏవం ప్రకారావనుజ్ఞా పరిహారావే కత్వేఽప్యాత్మనో దేహసంబంన్ధాత్ స్యాతామ్. దేహైః సంబన్ధో దేహసంబన్ధః. కః పునర్దేహసంబన్ధః? దేహాదిరయం సంఘాతోఽహమే వేత్యాత్మని విపరీతప్రత్య యోత్పత్తిః. దృష్టా చ సా సర్వప్రాణినామహం గచ్ఛామ్యహమాగచ్ఛామ్యహమ న్ధోఽహమనన్ధోఽహం మూఢోఽహమమూఢః. ఇత్యేవమాత్మికా. న హ్యస్యాః సమ్యగ్దర్శనాదన్యన్నివారకమస్తి. ప్రాక్తు సమ్యగ్దర్శనాత్ ప్రతతైషా భ్రాన్తిః సర్వజన్తుషు. తదేవమవిద్యానిమిత్తదేహాద్యుపాధి సంబన్ధకృతాద్విశేషా దైకాత్మ్యాభ్యుపగమేఽప్యనుజ్ఞాపరిహారావవకల్పేతే.

బాలానందిని

అత్రేతి:- ఇక్కడ (పూర్వపక్షి) ఇలా అంటున్నాడు-సమస్తభూతాలకీ ఒకే అంతరాత్మ

అయినట్లయితే లౌకికాలూ, వైదికాలూ అయిన అనుజ్ఞాపరిహారాలు ఎలా కుదురుతాయి? (ప్రశ్న) జీవుడు ఈశ్వరుని అంశ అని చెప్పాం కదా? ఆ భేదాన్ని పట్టి ఆ జీవునకు సంబంధించిన అనుజ్ఞాపరిహారాలు ఏ విధమైన వ్యామిశ్రణం (కలిసిపోవడం) లేకుండా కుదురుతాయి. ఈ విషయంలో ఆక్షేపానికి అవకాశం ఏ ముంది? (సమాధానం) చెప్పబడుచున్నది. ఇది ఇలా కాదు. "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" "మృత్యోః...పశ్యతి", "తత్త్వమసి" "అహం బ్రహ్మాస్మి" ఇత్యాదివిధాలైన జీవునకు (పరమేశ్వరునితో)అభేదాన్ని చెప్పే శ్రుతులు అనంశత్వాన్ని (అంశం కాదని) కూడ చెపుతున్నాయి కదా? (ప్రశ్న) భేదాభేదాలు రెండూ తెలియడంచేత అంశత్వం సిద్ధిస్తుంది అని చెప్పాం కదా? (సమాధానం) భేదాభేదాలు రెండూ ప్రతిపాదించడానికి ఉద్దిష్టములైతే నువ్వు చెప్పినట్లు కావచ్చును; ఇక్కడ ప్రతిపాదించడానికి ఉద్దిష్టమైనది అభేదం మాత్రమే. బ్రహ్మాత్మత్వజ్ఞానం కలిగితేనే పురుషార్థం లభిస్తుంది కదా? స్వభావంచేత (లోకప్రసిద్ధిచేత) ప్రాప్తమైన భేదం కేవలం అనువదించబడుతున్నది. జీవుడు అవయవరహితమైన బ్రహ్మకు ముఖ్యమైన అంశం కాజాలడు అని చెప్పబడింది కదా? అందుచేత ఒక్క పరమాత్మయే సకలప్రాణుల అంతరాత్మగా, జీవుడుగా ఉన్నాడు గాన అనుజ్ఞాపరిహారాలకు ఉపపత్తి చూపాలి. దానిని చెపుతున్నాం-

అనుజ్ఞేతి :- "జ్యోతిరాదివత్=జ్యోతిస్సు మొదలైనవి వలె, దేహసంబంధాత్= దేహాధ్యాసంవల్ల, అనుజ్ఞపరిహారౌ=అనుజ్ఞాపరిహారాలు కుదురుతాయి" అని సూత్రార్థం.

ఋతావితి :- "ఋతుకాలంలో భార్యను పొందవచ్చును" అని అనుజ్ఞ, "గురుభార్యను పొందగూడదు" అని పరిహారం. "అగ్నీషోమయాగానికి సంబంధించిన లేదా అగ్ని సోమదేవతలకొరకు ఉద్దేశించబడిన పశువును చంపవచ్చును" అని అనుజ్ఞ; "ఏ ప్రాణినీ హింసించకూడదు" అని పరిహారం. ఇట్లే లోకంలో కూడ "మిత్రుణ్ణి చేరవచ్చును" అని అనుజ్ఞ. "శత్రువునకు దూరంగా ఉండాలి" అని పరిహారం. ఆత్మ ఏకమే అయినా కూడ ఈ విధమైన అనుజ్ఞాపరిహారాలు ఆత్మకు దేహసంబంధం ఉండడంవల్ల కుదురుతాయి. దేహాలతో సంబంధం దేహసంబంధం. దేహసంబంధం అంటే ఏమిటి? ఈ దేహాదిసంఘాతమే నేను అని ఆత్మవిషయంలో విపరీతజ్ఞానమే దేహసంబంధం. "నేను వెడుతున్నాను; నేను వస్తున్నాను; నేను అంధుడను; నేను అంధుడను కాను; నేను

మూఢుడను; నేను మూఢుడను కాను" ఇత్యాది రూపమైన ఆ జ్ఞానం ప్రాణులందరిలోనూ కనబడుతున్నది. దీనిని నివారింప చేయగలిగినది సమ్యగ్దర్శనం తప్ప మరేదీ లేదు. సమ్యగ్దర్శనాకి ముందైతే ఈ భ్రాంతి సకలజంతువులలోను కనబడుతూన్నది. ఈ విధంగా అవిద్యానిమిత్తకమైన దేహాద్యుపాధులతో సంబంధంచేత ఏర్పడిన విశేషం ఉండడంవల్ల ఏకాత్మత్వాన్ని అంగీకరించినా కూడ, అనుజ్ఞాపరిహారాలు కుదురుతాయి.

భాష్యమ్

సమ్యగ్దర్శినస్తర్హ్యనుజ్ఞాపరిహారానర్థక్యం ప్రాప్తమ్? న. తస్య కృతార్థత్వాన్ని యోజ్యత్వానుపపత్తేః. హేయోపాదేయయోర్హి నియోజ్యో నియోక్తవ్యః స్యాత్, ఆత్మనస్త్వతిరిక్తం హేయముపాదేయం వా వస్త్వపశ్యన్ కథం నియుజ్యేత? న చాత్మాత్మన్యేవ నియోజ్యః స్యాత్. శరీరవ్యతిరేకదర్శిన ఏవ నియోజ్యత్వమితి చేత్; న. తత్సంహతత్వాభిమానాత్. సత్యం వ్యతిరేకదర్శినో నియోజ్యత్వమ్; తథాపి వ్యోమాదివద్దేహాద్యసంహతత్వమపశ్యత ఏవాత్మనో నియోజ్యత్వాభిమానః. న హి దేహాద్యసంహతత్వదర్శినః కస్య చిదపి నియోగో దృష్టః. కిముతైకాత్మ్యదర్శినః. న చ నియోగాభావాత్సమ్యగ్దర్శినో యథేష్టచేష్టాప్రసంగః. సర్వత్రాభిమానస్యైవ ప్రవర్తకత్వాత్. అభిమానాభావాచ్చ సమ్యగ్దర్శినః. తస్మాద్దేహసంబన్ధాదేవానుజ్ఞాపరిహారౌ. జ్యోతిరాదివత్. యథా జ్యోతిష ఏకత్వేఽప్యగ్నిః క్రవ్యాత్పరిహ్రియతే నేతరః, యథా ప్రకాశ ఏకస్యాపి సవితురమేధ్య దేశసంబద్ధః పరిహ్రియతే, నేతరః శుచిభూమిష్ఠః, యథా భౌమాః ప్రదేశాః వజ్రవైడూర్యాదయ ఉపాదీయన్తే, భౌమా అపి సన్తో నరకలేవరాదయః పరిహ్రియన్తే, యథా మూత్రపురీషం గవాం పవిత్రతయా గృహ్యతే తదేవ జాత్యన్తరే పరిహ్రియతే తద్వత్. 48.

బాలానందిని

సమ్యగితి :- అయితే సమగ్దర్శనం ఉన్నవానికి అనుజ్ఞాపరిహాలు లేవన్నమాట? అది కాదు. అతడు కృతార్థు డైపోయినాడు గాన నియోజ్యత్వం (నియమించబడడం)

కుదరదు. హేయోపాదేయాల విషయంలో ఎవనిని నియోగించడానికి అవకాశం ఉంటుందో అతనినే నియమించాలి. ఆత్మకంటె భిన్నమైన హేయమైన వస్తువును గాని, ఉపాదేయమైన వస్తువును గాని చూడనివానిని నియోగించడం ఎట్లు? వానిని ఆత్మ విషయంలోనే నియోగించాలి అని చెప్పడం కుదరదు కదా? (ప్రశ్న) శరీరవ్యతిరేక దర్శియే (శరీరం కంటె ఆత్మ భిన్నమైనది అని తెలిసినవాడే) నియోజ్యుడు కదా (ఆ యా కర్మలు చేయాలని చెప్పదగినవాడు కదా)అన్నట్లయితే అది యుక్తం కాదు. (ఆత్మ-దేహాలు భిన్నమని తెలిసినా కూడ కర్మాధికారికి) దేహాదులతో కలిసి ఉన్నట్లు అభిమానం ఉంటుంది కదా? వ్యతిరేకదర్శికే నియోజ్యత్వం (ఆత్మ దేహాదులకంటె భిన్నము అని తెలిసినవానికే కర్మలలో నియోజ్యత్వం) అనే మాట నిజమే. అయినా, ఆత్మ ఆకాశాదుల వలె దేహాదులతో సంబంధించినది కాదు అనే విషయాన్ని ఎవడు తెలుసుకొనడో ఆతనికే నేను నియోజ్యుడను అనే అభిమానం ఉంటుంది. ఆత్మ దేహాదులతో సంబంధించదు అని తెలుసుకొన్నవానికి ఎవనికీ కూడ నియోగం చూడబడదు కదా (ఉండదు కదా)? అలాంటప్పుడు ఆత్మైక్యాన్ని, లేదా సర్వమూ ఆత్మస్వరూపమే అని చూచేవాని విషయం చెప్పాలా?

వి.దేహాదులకంటె భిన్నమైన ఆత్మ ఉంది అనే జ్ఞానం కలవాళ్లకే స్వర్గనరకాది హేతువైన ఆ యా కర్మల విషయంలో విధినిషేధాలుంటాయి. అందుచేత సమ్యగ్దర్శికి నియోజ్యత్వం ఉండదని చెప్పడం అయుక్తం కదా అని పృచ్ఛకుని అభిప్రాయం. శాస్త్రీయ కర్మలలో నియుక్తుడవడానికి దేహాదిభిన్నమైన ఆత్మ ఉన్నదనే పరోక్షజ్ఞానం ఉంటే చాలు. అపరోక్షజ్ఞానం ఉంటే మాత్రం వానికి నియోజ్యత్వం ఉండదు అని సమాధాత అభిప్రాయం.

న చేతి :- సమ్యగ్దర్శనం ఉన్న వానికి నియోగం లేదు గాన అతడు ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించే ప్రసక్తి లేదు. అన్ని ప్రవృత్తులకు మూలకారణం దేహాభిమానం. అది సమ్యగ్దర్శికి లేదు గాన అతనికి యథేష్టాచరణప్రసక్తి లేదు. అందువల్ల, జ్యోతిరాదుల విషయంలో వలె, జీవునకు దేహసంబంధంవల్లనే అనుజ్ఞాపరిహారాలు ఏర్పడతాయి. జ్యోతిస్సు ఒక్కటే అయినా మాంసం తినే అగ్ని (శ్మశానాగ్ని) ఏ విధంగా పరిహరించబడుతుందో, ఇతరమైన అగ్ని పరిహరింపబడదో, ఒకే సూర్యుని ప్రకాశ

అమేధ్యప్రదేశాలలో ప్రసరించినది ఏవిధంగా పరిహరించబడుతుందో పరిశుద్ధమైన ప్రదేశంలో ఉన్నది పరిహరింపబడదో, భూమియొక్క ప్రదేశాలే (భూమికి సంబంధించినవే) అయిన వజ్రవైడూర్యాదులు ఏ విధంగా గ్రహించబడతాయో, భూమికి సంబంధించినవే అయినా కూడ నరకళేబరాదులు పరిహరింపబడతాయో, గోవుల మూత్రపురీషం ఏ విధంగా పవిత్రమని గ్రహింపబడుతుందో, ఇతరజాతికి సంబంధించినది పరిహరించబడుతుందో అట్లే ఇది కూడ. 48.

## సూ. అసన్తతేశ్చావ్యతికరః. 2.3.49

స్యాతాం నామానుజ్ఞాపరిహారౌ ఏకస్యాప్యాత్మనః దేహవిశేషయోగాత్. యస్త్వయం కర్మఫలసంబన్ధః స చైకాత్మ్యాభ్యుపగమే వ్యతికీర్యేత స్వామ్యై కత్వాదితి చేత్; నైతదేవమ్. అసన్తతేః. న హి కర్తుర్భోక్తుశ్చాత్మనః సన్తతః సర్వైః శరీరైః సంబన్ధోఽస్తి. ఉపాధితన్త్రో హి జీవ ఇత్యుక్తమ్. ఉపాధ్యసన్తానాచ్చ నాస్తి జీవసన్తానః. తతశ్చ కర్మవ్యతికరః ఫలవ్యతికరో వా న భవిష్యతి. 49

### బాలానందిని

**అసన్తతేరితి** :- "అసంతతేః=ఒక జీవునకు అనేకదేహాలతో సంబంధం లేకపోవడంచేత, అవ్యతికరః=వ్యతికరం, కర్మఫలసాంకర్యం, లేదు" అని సూత్రార్థం.

**స్యాతామితి** :- ఆత్మ ఒక్కటే అయినా వేరు వేరు దేహాలతో సంబంధం ఉండడం వల్ల అనుజ్ఞాపరిహారాలు కుదిరితే కుదరవచ్చును. కాని ఏకాత్మత్వాన్ని అంగీకరించిన పక్షంలో, కర్మస్వామి ఒక్కడే గాన, (వేరు వేరు దేహాలతో చేయబడిన) కర్మల ఫలంతో సంబంధం సంకీర్ణం అయిపోతుంది (అనగా ఈ కర్మఫలం ఈ జీవునిది; ఇది వీనిది అనే వ్యవస్థ లేకుండా పోతుంది అని అర్థం) అని అన్నట్లయితే- అది యుక్తం కాదు. అసంతతేః-కర్తా భోక్తా అయిన ఆత్మకు సంతతి, అనగా సకలశరీరాలతోను సంబంధం లేకపోవడంచేత జీవులకు సంబంధం కూడ లేదు. అందుచేత కర్మవ్యతికరంగాని ఫలవ్యతికరంగాని ఉండదు.

వి. వేరు వేరు స్థూలదేహా లనే ఉపాధులను బట్టి జీవులు వేరవడంచేత అనుజ్ఞా పరిహారాలు కుదిరినా ఆ స్థూలదేహాలు నశించిన తరవాత అనుభవించవలసిన

పుణ్యపాపఫలాల విషయంలో సాంకర్యం కలుగుతుంది కదా? ఒక జీవుని కర్మఫలం మరొకనికి, లేదా మొత్తం అన్ని ఫలాలూ ఒక్కటే అని చెప్పబడే ఆత్మకు చెందవలసి వస్తాయి కదా అని పృచ్ఛకుని ఆశయం. స్థూలదేహాలు నశించినా బుద్ధిరూప మైన ఉపాధి మోక్షం కలిగే వరకు వెన్నంటుతూనే ఉంటుంది గాన జీవభేదం కొనసాగుతూనే ఉంటుంది అందుచేత సాంకర్యం లేదని సమాధాత భావం. 49.

సూ. ఆభాస ఏవ చ. 2.3.50 (3-2-18.)

ఆభాస ఏవ చైష జీవః పరమాత్మనో జలసూర్యకాదివత్ప్రతిపత్తవ్యః. న స ఏవ సాక్షాత్. నా పి వస్త్వన్తరమ్. అతశ్చ యథా నైకస్మిన్ జలసూర్యకే కమ్పమానే జలసూర్యకాన్తరం కమ్పతే, ఏవం నైకస్మిన్ జీవే కర్మఫలసంబన్ధిని జీవాన్తరస్య తత్సంబన్ధః. ఏవమప్యవ్యతికర ఏవ కర్మఫలయోః ఆభాసస్యచా విద్యాకృతత్వాత్. తదాశ్రయస్య సంసారస్య అవిద్యాకృతత్వోపపత్తిరితి, తద్వ్యా దాసేన చ పారమార్థికస్య బ్రహ్మాత్మభావస్య ఉపదేశోపపత్తిః. యేషాం తు బహవ ఆత్మానస్తే చ సర్వే సర్వగతాః తేషామేవైష వ్యతికరః ప్రాప్నోతి. కథమ్? బహవో విభవ శ్చాత్మానః చైతన్యమాత్రస్వరూపా నిర్గుణాః నిరతిశయాశ్చ తదర్థం సాధారణం ప్రధానం, తన్నిమిత్తైషాం భోగాపవర్గసిద్ధిరితి సాంఖ్యాః. సతి బహుత్వే విభుత్వే చ ఘట్యకుడ్యాదిసమానా ద్రవ్యమాత్రస్వరూపాః స్వతోఽచేతనాః ఆత్మానస్తదుపకరణాని చాణూని మనాంస్యచేతనాని. తత్రాత్మద్రవ్యాణాం మనోద్రవ్యాణాం చ సంయోగాత్ నవేచ్ఛాదయో వైశేషికా ఆత్మగుణా ఉత్పద్యన్తే. తే చావ్యతిక రేణ ప్రత్యేకమాత్మసు సమవయన్తి. స సంసారః, తేషాం నవానామాత్మగుణానామత్యన్తానుత్పాదో మోక్ష ఇతి కాణాదాః. తత్ర సాంఖ్యానాం తావ చ్చైతన్యరూపత్వాత్సర్వాత్మనాం సంనిధానాద్యవిశేషాచ్చ ఏకస్య సుఖదుఃఖసంబన్ధే సర్వేషాం సుఖదుఃఖసంబన్ధః ప్రాప్నోతి. స్యాదేతత్-ప్రధానప్రవృత్తేః పురుషకైవల్యార్థత్వాద్వ్యవస్థా భవిష్యతి. అన్యథా హి స్వవిభూతి ఖ్యాపనార్థా ప్రధానప్రవృత్తిః స్యాత్. తథా చానిర్మోక్షః ప్రసజ్యేతేతి. నైతత్సారమ్.

నహ్యభిలషితసిద్ధినిబన్ధనా వ్యవస్థా శక్యా విజ్ఞాతుమ్; ఉపపత్త్యా తు కయా చిద్వ్యవస్థోచ్యేత. అసత్యాం పునరుపపత్తౌ కామం మా భూదభిలషితం పురుషకైవల్యమ్, ప్రాప్నోతి తు వ్యవస్థాహేత్వభావాద్వ్యతికరః. కాణాదానామపి యదైకేనాత్మనా మనః సంయుజ్యతే తదాత్మాన్తరైరపి నాన్తరీయకః సంయోగః స్యాత్, సంనిధానాద్యవిశేషాత్. తతశ్చ హేత్వవిశేషాత్ఫలావిశేష ఇతి ఏకస్యాత్మనః సుఖదుఃఖయోగే సర్వాత్మనామపి సమానం సుఖదుఃఖిత్వం ప్రసజ్యేత. 50.

బాలానందిని

అభాస ఇతి :- "అభాసః ఏవ చ=జీవుడు పరమాత్మయొక్క అభాసమాత్రమే కూడ" అని సూత్రార్థం. (వాస్తవంగా అది కాకపోయినా అదిగా కనబడేది అభాస)

అభాస ఇతి :- జలంలో ప్రతిబింబించిన సూర్యుడు మొదలైనది వలె ఈ జీవుడు పరమాత్మయొక్క అభాసమాత్రమే అని గ్రహించాలి, అంతే కాని సాక్షాత్తు ఆ పరమేశ్వరుడే కాదు; పరమేశ్వరునికంటె భిన్నమైన మరొకవస్తువు కాదు. అందుచేత ఒక జలసూర్యుడు కదులుచున్నా కూడ మరొక జలసూర్యుడు ఏ విధంగా కదలడో అట్లే ఒక జీవునకు కర్మఫలంతో సంబంధం ఉన్నా కూడ మరొక జీవునికి దానితో సంబంధం ఉండదు. ఈ విధంగా (ఆ యా జీవుల) కర్మలకూ, వాటి ఫలాలకూ వ్యతికరం (సాంకర్యం) ఉండదు. అభాస అవిద్యాకల్పితమే గాన ఆ అభాస ఆశ్రయంగా గల, లేదా అభాసకు ఆశ్రయమైన, సంసారం కూడ అవిద్యాకృతమే అని చెప్పడం ఉపపన్నంగా ఉంటుంది. ఆ అభాస రూపాన్ని నిరాకరించి పారమార్థికమైన బ్రహ్మభావాన్ని ఉపదేశించడం కూడ ఉపపన్నం అవుతుంది. అయితే ఎవరి మతం ప్రకారం ఆత్మలు అనేకములో, ఆ అన్నీ కూడ సర్వగతములో (అంతటా వ్యాపించి ఉన్నాయో) వాళ్లమతంలోనే ఈ వ్యతికరం ప్రాప్తిస్తుంది. ఎట్లు? ఆత్మలు అసంఖ్యాంకములు; విభువులు (సర్వవ్యాప్తములు); చైతన్యమాత్రస్వరూపమైనవి; నిర్గుణములు, నిరతిశయములు (ఏ విధమైన విశేషాలు లేనివి). ఆ ఆత్మలన్నింటికీ సాధారణ మైనది (సమంగా ఉపకరించేది) ప్రధానం. ఆ ప్రధానాన్ని నిమిత్తంగా చేసుకొని (ఆత్మలకు) భోగం మోక్షం సిద్ధిస్తాయి అని సాంఖ్యులంటారు. బహుత్వము, విభుత్వమూ కూడ ఉంటూండగా ఆత్మలు

ఘటకుడ్యాదులతో సమానమైనవి, కేవలం ద్రవ్యస్వరూపాలు, స్వతః వాటికి చైతన్యం లేదు. అణుప్రమాణం గల అచేతనాలైన మనస్సులు ఆ ఆత్మలకు ఉపకారకాలుగా (సాధనాలుగా) ఉంటాయి. ఈ ఆత్మద్రవ్యాలూ మనోద్రవ్యాలూ కలవడంచేత ఇచ్ఛ మొదలైన తొమ్మిది విశేషగుణాలు ఆత్మలో పుడతాయి. ఆ గుణాలు వ్యతికరం లేకుండా ఏ ఆత్మకు సంబంధించినవి ఆ ఆత్మతో సమవాయసంబంధంచేత కలిసి ఉంటాయి. అదే సంసారం. ఆ తొమ్మిది ఆత్మగుణాలూ పూర్తిగా పుట్టకుండా ఉండడమే మోక్షం అని కాణాదులంటారు. సాంఖ్యుల మతంలో అన్ని ఆత్మలూ చైతన్యరూపాలే గాన, సంనిధానాదులలో కూడ విశేషం లేదు (అనగా ఒకే దేహంలో అన్ని ఆత్మలూ సంనిహితాలై ఉంటాయి) గాన, ఒక ఆత్మకు సుఖదుఃఖసంబంధం కలిగినప్పుడు అన్నింటికీ సుఖదుఃఖసంబంధం కలుగ వలసి ఉంటుంది. (ఆక్షేపం) అది అలా ఉండనీ; ప్రధానం పురుషుని కైవల్యంకోసమే ప్రవర్తిస్తుంది కాబట్టి వ్యవస్థ ఏర్పడుతుంది. అలా కాకపోతే (పురుషుని కైవల్యం కోసం ప్రవర్తించకపోతే) ప్రధానం తన గొప్పతనాన్ని ప్రకటించుకొనడం కోసం ప్రవర్తిస్తూన్నదని చెప్పవలసివస్తుంది. అప్పుడు మోక్షమే కలగకుండా పోతుంది. (సమాధానం) ఇలా చెప్పడంలో సారం లేదు. వ్యవస్థ మనం కావాలనుకొన్న విధంగా సిద్ధించడానికి అనుగుణంగా ఉండాలి అనుకోవడం యుక్తం కాదు. ఏ వ్యవ్యస్థనైనా చెయ్యాలంటే దానికి తగిన ఉపపత్తి చూపించాలి. ఉపపత్తి లేకపోతే కావాలనుకొన్న పురుషకైవల్యం రాకపోతే రాకపోనీ. వ్యవస్థకు తగిన హేతువు లేకపోతే వ్యతికరం కలిగి తీరుతుంది. అట్లే కాణాదుల మతం ప్రకారం కూడ మనస్సు ఒక ఆత్మతో సంయుక్తం అయినప్పుడు, మిగిలిన ఆత్మలు కూడ అక్కడనే ఉన్నాయి గాన వీటితో కూడ తప్పకుండా సంయోగం కలుగుతుంది. అప్పుడు హేతువు సమంగా ఉన్నప్పుడు ఫలం కూడ సమంగానే ఉంటుంది గాన ఒక ఆత్మకు సుఖదుఃఖసంబంధం కలుగుతే అన్ని ఆత్మలకీ కూడ సమంగానే సుఖదుఃఖాలు కలగవలసి వస్తుంది. 50.

## భాష్యమ్

స్యాదేతత్; అదృష్టనిమిత్తో నియమో భవిష్యతి. నేత్యాహ-

## సూ. అదృష్టానియమాత్. 2.3.51

బహుష్వాత్మస్వాకాశవత్సర్వగతేషు ప్రతిశరీరం బాహ్యాభ్యన్తరావిశేషేణ సంనిహితేషు మనోవాక్కాయైర్ధర్మాధర్మలక్షణమదృష్టముపజాయతే. సాంఖ్యానాం తావత్తదనాత్మసమవాయి ప్రధానవర్తి, ప్రధానసాధారణ్యాన్న ప్రత్యాత్మం సుఖదుఃఖోపభోగస్య నియామకముపపద్యతే. కాణాదానామపి పూర్వవత్సాధారణేనాత్మమనఃసంయోగేన నిర్వర్తితస్యాదృష్టస్య అస్యైవాత్మన ఇదమదృష్టమితి నియమే హేత్వభావాదేష ఏవ దోషః. 5.

### బాలానందిని

స్యాదితి:- (ఆశంక) అదృష్టాన్ని పట్టి నియమం ఏర్పడుతుంది అని చెప్పవచ్చు కదా? అది కుదరదంటున్నాడు-

అదృష్టేతి:- "అదృష్టా నియమాత్=అదృష్టం విషయంలో కూడ నియమం లేదు కదా?" అని సూత్రార్థం.

బహుష్వితి :- ఆకాశం వలె సర్వత్రా వ్యాపించి ఉన్న అనేకమైన ఆత్మలు ప్రతీ శరీరంలోను బైటా లోపలా అనే విశేషం లేకుండా సంనిహితాలై ఉండగా మనోవాక్కాయాలచేత ధర్మాధర్మలక్షణమైన అదృష్టం సంపాదించబడుతుంది. సాంఖ్యులకైతే అది ఆత్మలో సమవాయసంబంధంతో ఉండదు. ప్రధానంలో ఉంటుంది. ప్రధానం అన్ని ఆత్మలకీ సాధారణమే. గాన అది ఒక్కొక్క ఆత్మకి సుఖదుఃఖోపభోగాన్ని నియమింపజాలదు (ఇది ఈ ఆత్మకు, ఇది ఈ ఆత్మకు అని నియమింపజాలదు). కాణాదులకు కూడ వెనుక చెప్పినట్లు, సాధారణమైన ఆత్మమనఃసంయోగంచేత పుట్టిన అదృష్టం కూడ, ఇది ఈ ఆత్మది అని చెప్పడానికి తగిన నియమం లేకపోవడంవల్ల ఇదే దోషం. 51.

### భాష్యమ్

స్యాదేతత్-అహమిదం ఫలం ప్రాప్నవాని, ఇదం పరిహరాణి, ఇత్థం ప్రయతే, ఇత్థం కరవాణి ఇత్యేవంవిధా అభిసంధ్యాదయః ప్రత్యాత్మం ప్రవర్తమానా

అదృష్టస్యాత్మనాం చ స్వస్వామిభావం నియంస్యంస్తీతి, నేత్యాహ-

సూ. అభిసంధ్యాదిష్వపి చైవమ్. 2.3.52

అభిసంధ్యాదీనామపి సాధారణేనైవ ఆత్మమనఃసంయోగేన సర్వాత్మ సంనిధౌ క్రియమాణానాం నియమహేతుత్వానుపపత్తేరుక్తదోషానుషంగ ఏవ. 52.

బాలానందిని

స్యాదేతదితి :- (ఆశంక) నేను ఈ ఫలం పొందుదును గాక, నేను దీనిని పరిహరించెదను గాక. ఈ విధంగా ప్రయత్నిస్తాను. ఇట్లు చేస్తాను. ఈ విధమైన అభిసంధి (మానసికాభిప్రాయం) మొదలైనవి ప్రతీ ఆత్మలోను ఉంటాయి. అవి అదృష్టానికి ఆత్మలకూ మధ్యనున్న స్వస్వామిభావాన్ని (ఈ అదృష్టం ఈ ఆత్మది ఇది ఆ ఆత్మది అనే భేదాన్ని) నియమిస్తాయి అని చెప్పవచ్చును కదా? అన్నట్లయితే కాదంటున్నాడు-

అభిసంధీతి :-"అభిసంధ్యాదిష్వపి=అభిసంధి మొదలైనవాటిలో కూడ ఏవమ్=ఇదే దోషం" అని సూత్రార్థం

అభిసంధ్యాదీనామితి :-సర్వాత్మసాధారణమైన ఆత్మ మనఃసంయోగంచేత సమస్తాత్మల సంనిధిలో చేయడుచున్న అభిసంధి మొదలైనవి కూడ నియమహేతువులు అవడం కుదరదు గాన పైన చెప్పిన దోషం ప్రసక్తం అవనే అవుతుంది. 52

సూ. ప్రదేశాదితి చేన్నాన్తర్భావాత్ 2.3.53

అథోచ్యేత - విభుత్వేఽప్యాత్మనః శరీరప్రతిష్ఠేన మనసా సంయోగః శరీరావచ్ఛిన్న ఏవ ఆత్మదేశే భవిష్యతి, అతః ప్రదేశకృతా వ్యవస్థాఽభిసంధ్యాదీనామదృష్టస్య సుఖదుఃఖయోశ్చ భవిష్యతీతి. తదపి నోపపద్యతే. కస్మాత్? అన్తర్భావాత్. విభుత్వావిశేషాద్ధి సర్వ ఏవాత్మానః సర్వశరీరేష్వన్తర్భవన్తి. తత్ర న వైశేషికైః శరీరావచ్ఛిన్నోఽప్యాత్మనః ప్రదేశః కల్పయితుం శక్యః. కల్ప్యమానోఽప్యయం నిష్ప్రదేశస్యాత్మనః ప్రదేశః కాల్పనికత్వాదేవ న పారమార్థికం కార్యం నియన్తుం శక్నోతి. శరీరమపి సర్వాత్మసంనిధావుత్పద్యమానమస్యైవాత్మనో నేతరేషామితి న నియన్తుం శక్యమ్. ప్రదేశవిశేషాభ్యుపగమేఽపి న

ద్వయోరాత్మనోః సమానసుఖదుఃఖభాజోః కదాచిదేకే నైవ తావచ్ఛరీరేణోపభోగసిద్ధిః స్యాత్. సమానప్రదేశస్యాపి ద్వయోరాత్మనోరదృష్టస్య సంభవాత్. తథాహి- దేవదత్తో యస్మిన్ ప్రదేశే సుఖదుఃఖమన్వభూత్తస్మాత్ప్ర దేశాదపక్రాన్తే తచ్ఛరీరే, యజ్ఞదత్తశరీరే చ తం ప్రదేశమనుప్రాప్తే తస్యాపీతరేణ సమానః సుఖదుఃఖానుభవో దృశ్యతే. స న స్యాద్యది దేవదత్తయజ్ఞదత్తయోః సమాన ప్రదేశమదృష్టం న స్యాత్. స్వర్గాద్యనుపభోగప్రసంగశ్చ ప్రదేశవాదినః స్యాత్. బ్రాహ్మణాదిశరీరప్రదేశేష్వదృష్టనిష్పత్తేః ప్రదేశాన్తరవర్తిత్వాచ్చ స్వర్గాద్యు పభోగస్య. సర్వగతత్వానుపపత్తిశ్చ బహూనామాత్మనాం; దృష్టాన్తాభావాత్. వద తావత్త్వం కే బహవః సమానప్రదేశాశ్చేతి. రూపాదయ ఇతి చేత్; న. తేషామపి ధర్మ్యంశేనాభేదాల్లక్షణభేదాచ్చ. న తు బహూనామాత్మనాం లక్షణభేదోఽస్తి. అన్త్య విశేషవశాద్భేదోపపత్తిరితి చేత్; న.భేదకల్పనాయా అన్త్యవిశేషకల్పనాయా శ్చేత రేతరాశ్రయత్వాత్. ఆకాశాదీనామపి విభుత్వం బ్రహ్మవాదినోఽసిద్ధమ్, కార్య త్వాభ్యుపగమాత్ . తస్మాదాత్మైకత్వపక్ష ఏవ సర్వదోషాభావ ఇతి సిద్ధమ్. 53

**ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యశ్రీగోవిన్దభగవత్పూజ్యపాదశిష్య శ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌ శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యే ద్వితీయాధ్యాయస్య తృతీయః పాదః.**

బాలానందిని

ప్రదేశాతి:- "ప్రదేశాదితి చేత్=శరీరప్రదేశంలో ఆత్మమనఃసంయోగం కలగడం వల్ల దోషం లేదు అన్నట్లయితే, న=కాదు, అన్తర్భావాత్=అన్ని ఆత్మలూ కూడ ఒక్క శరీరంలో ఉంటాయి కదా?" అని సూత్రార్థం.

అథేతి:- ఆత్మ విభువే అయినా కూడ శరీరంలో ఉన్న మనస్సుతో సంయోగం శరీరావచ్ఛిన్నమైన ఆత్మప్రదేశంలోనే (శరీరంలో ఉన్న, ఇమిడి ఉన్న ఆత్మయొక్క ప్రదేశంలోనే) జరుగుతుంది, అందుచేత ప్రదేశాన్ని పట్టి అభిసంధ్యాదులకు, అదృష్టానికి

సుఖదుఃఖాలకు వ్యవస్థ కుదరవచ్చును అని అన్నట్లయితే అది కూడ కుదరదు. ఎందువల్ల? అంతర్భావంవల్ల. విభుత్వం విషయంలో విశేషం లేదు గాన (అన్ని ఆత్మలూ విభువులే గాన) అన్ని ఆత్మలూ అన్ని శరీరాలలోనూ ఉంటాయి. అందుచేత వైశేషికులు ఆత్మకు శరీరావచ్ఛిన్నమైన ప్రదేశాన్ని కూడ కల్పింపజాలరు. వాస్తవంలో ప్రదేశం లేని ఆత్మకు ప్రదేశం ఉన్నట్లు కల్పించినా కూడ అది కాల్పనికమే గాన పారమార్థికమైన కార్యాన్ని నియమించజాలదు. అన్ని ఆత్మల సంనిధిలో పుడుతూన్న శరీరం కూడ ఇది ఈ ఆత్మకే సంబంధించినది ఇతరాత్మలకు సంబంధించినది కాదు అని నియమించడానికి శక్యం కాదు. ప్రదేశవిశేషాన్ని అంగీకరించినా కూడ సమానమైన సుఖదుఃఖాలను అనుభవించవలసి ఉన్నరెండు ఆత్మలు ఒకే శరీరంచేత సుఖదుఃఖాలను అనుభవించడం కూడ జరగవచ్చు. ఎందువల్ల ననగా రెండు ఆత్మల అదృష్టం ఒకే ప్రదేశానికి సంబంధించి కూడ ఉండవచ్చును కదా? అదెట్లనగా - దేవదత్తుడు ఏ ప్రదేశంలో సుఖదుఃఖాలను అనుభవించాడో ఆ ప్రదేశంనుండి వాని శరీరం తొలగిపోగానే, ఆ ప్రదేశానికి యజ్ఞదత్తుని శరీరం చేరినప్పుడు వానికి కూడ దేవదత్తునికి ఏవిధమైన సుఖదుఃఖానుభవం కలిగిందో అలాంటి అనుభవం కలగడం చూస్తున్నాం. దేవదత్తయజ్ఞదత్తులకు ఒకే ప్రదేశంలో సుఖదుఃఖాలను కలిగించే అదృష్టం లేకపోతే అలాంటి సుఖదుఃఖానుభవం కలిగి ఉండేది కాదు. మరొక విషయ మేమనగా-ప్రదేశభేదాన్ని అంగీకరించేవానికి స్వర్గాద్యుపభోగం కుదరకపోవడం అనే దోషం ప్రసక్తం అవుతుంది; ఎందువల్ల ననగా (స్వర్గాదులను ఇచ్చే) అదృష్టం బ్రాహ్మణాదిశరీరాలలో పుడుతుంది; స్వర్గాదిభోగం ఇతరప్రదేశాలలో (ఇతర శరీరాలలో) ఉంటుంది. అసలు అనేకమైన ఆత్మలు సర్వగతాలు అని చెప్పడమే యుక్తం కాదు. అందుకు తగిన దృష్టాంతం ఏదీ లేదు. ఒకే ప్రదేశంలో అనేకమైన వస్తువులు ఏవి ఉన్నాయో నువ్వే చెప్పు. రూపాదులు దృష్టాంతం అన్నట్లయితే అది యుక్తం కాదు. ఎందువల్ల ననగా ధర్మిని పట్టి వాటికి భేదం లేదు. వాటి లక్షణాలు వేరు వేరుగా ఉంటాయి.

వి. అనేకపదార్థాలు ఒకే చోట ఉండడానికి దృష్టాంతంగా రూపాదులను చూపవచ్చు; ఒకే ఘటంలో రూపరసగంధాదులున్నాయి కదా అని వైశేషికుడు చెప్పవచ్చును. అది యుక్తం కాదు. రూపం తేజస్సు అనే ధర్మికి చెందినది; రసం జలానికి చెందినది. గంధం

పృథివికి చెందినది. తేజోరసగంధాదులకంటె భిన్నంగా ఘటం అనేది లేదు. అందుచేత రూపాదులకు ధర్మియైన ఘటానికి భేదం లేదు. అదే విధంగా రూపలక్షణం వేరు. గంధలక్షణం వేరు. అందుచేత ఇవన్నీ ఒక ఘటంలో కలిసి ఉన్నట్లు కనబడడానికి అవకాశం ఉంది అని భావం.

న త్వితి :- ఆత్మలకు లక్షణభేదం లేదు. (అందుచేత వేరు వేరు ఆత్మలని చెప్పడం కుదరదు అని భావం.) లక్షణభేదం లేకపోయినా అంత్యవిశేషంయొక్క భేదాన్ని పట్టి, ఆత్మకు ఆత్మకూ భేదం చెప్పవచ్చును కదా అన్నట్లయితే అది యుక్తం కాదు.

వి. వైశేషికులు నిత్యద్రవ్యా లన్నింటిలోను విశేషాలను అంగీకరిస్తారు. ఒక పృథివీపరమాణువు మరొక పృథివీపరమాణువుకంటె భిన్న మైనది. ఎందుచేత? దీనిలో ఒక విశేషం ఉంది దానిలో ఒక విశేషం ఉంది. ఆకాశం దిక్కుకంటె భిన్నమైనది. ఎందువల్ల? ఆ రెండింటిలోను రెండు విశేషా లున్నాయి. ఈ విశేషాలు కూడ పరస్పరభిన్నాలే కదా? అందుకు కారణం ఏమిటి? విశేషాలయి ఉండడమే కారణం. విశేషాలకి మళ్లీ విశేషాలను కల్పించవలసిన పనిలేదు. అందుచేతనే వీటికి అంత్యవిశేషాలని పేరు. ఆత్మకీ ఆత్మకీ మధ్య లక్షణభేదం ఏదీ లేకపోయినా అంత్య విశేషాలను పట్టి భేదం అంగీకరించవచ్చును అని వాళ్ల అభిప్రాయం.

భేదేతి :- భేదకల్పనకీ అంత్యవిశేషకల్పనకీ అన్యోన్యాశ్రయత్వం ఏర్పడుతుంది. అనగా భేదం ఉందని ముందుగా నిశ్చయం చేసికొని ఎందుకు ఉంది అని సమర్థించడానికి విశేషాలు కల్పిస్తున్నారు, విశేషాలన్నాయి కాబట్టి భేదం ఉందంటున్నారు. ఈ విధంగా అన్యోన్యాశ్రయదోషం ఏర్పడుతుంది అని భావం. మరొక విషయం ఏమనగా ఆకాశాదులు విభువులు అనేది బ్రహ్మవాదికి అసిద్ధం; ఎందువల్ల ననగా బ్రహ్మవాది ఆకాశాదులు కూడ కార్యాలే అని అంగీకరిస్తాడు. అందువల్ల ఆత్మైకత్వపక్షంలోనే ఏ దోషాలూ ఉండవనే మాట నిశ్చితం. 53

బాలానందిని అను శ్రీశారీరకమీమాంసాభాష్యాంధ్రవ్యాఖ్యానంలో

ద్వితీయాధ్యాయంలోని తృతీయపాదం

సమాప్తం.

# ద్వితీయాధ్యాయే చతుర్థః పాదః

## అత్ర పాదే లిఙ్గశరీరశ్రుతీనాం విరోధపరిహారః

## 1. ప్రాణోత్పత్త్యధికరణమ్. సూ. 1-4

### సూ. తథా ప్రాణాః. 2.4.1.

వియదాదివిషయః శ్రుతివిప్రతిషేధః తృతీయేన పాదేన పరిహృతః. చతుర్థేనేదానీం ప్రాణవిషయః పరిహ్రియతే. తత్ర తావత్- "తత్తేజోఽసృజత" (ఛా. ఉ. 6.2.3) ఇతి "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" (తై.ఉ.2.1.1) ఇతిచైవమాదిషూత్పత్తిప్రకరణేషు ప్రాణానాముత్పత్తిర్నామ్నాయతే. క్వచిచ్చానుత్పత్తిరేవైషామామ్నాయతే- "అసద్వా ఇదమగ్ర అసీత్; తదాహుః కింతదసదాసీదిత్యృషయో వావ తేఽగ్రేఽసదాసీత్, తదాహుః కే తే ఋషయ ఇతి. ప్రాణా వావ ఋషయః" (శత. బ్రా. 6.1.1.1) ఇత్యత్ర ప్రాగుత్పత్తేః ప్రాణానాం సద్భావశ్రవణాత్. అన్యత్ర తు ప్రాణానామప్యుత్పత్తిః పఠ్యతే- "యథాగ్నేర్జ్వలతః క్షుద్రా విస్ఫులిఙ్గా వ్యుచ్చరన్త్యేవమేవైతస్మాదాత్మనః సర్వే ప్రాణాః" ఇతి, "ఏతస్మాజ్జాయతే ప్రాణః మనః సర్వేన్ద్రియాణి చ" (ము. ఉ. 2.1.3) ఇతి. "సప్త ప్రాణాః ప్రభవన్తి తస్మాత్" (ము.ఉ.2.1.8) ఇతి. "స ప్రాణమసృజత ప్రాణాచ్ఛ్రద్ధాం ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీన్ద్రియం మనోఽన్నమ్. (ప్ర. ఉ. 6.4) ఇతి చైవమాదిప్రదేశేషు. (తత్ర) తత్ర శ్రుతివిప్రతిషేధాదన్యతరనిర్ధారణకారణానిరూపణాచ్చ విప్రతిపత్తిః ప్రాప్నోతి. అథవా ప్రాగుత్పత్తేః సద్భావశ్రవణాత్ గౌణీ ప్రాణానా ముత్పత్తిశ్రుతిరితి ప్రాప్నోతి.

### బాలానందిని

తథేతి :- "ప్రాణాః=ప్రాణాలు, తథా=భూతాలు ఎలా పరమాత్మనుండి పుట్టాయో అలాగే పరమాత్మనుండి పుట్టాయి" అని సూత్రార్థం.

విషయదితి :- ఆకాశాదులకు సంబంధించిన శ్రుతుల విరోధం మూడవ పాదంచేత పరిహరించబడింది. ఇప్పుడు నాల్గవ పాదంచేత ప్రాణాలను గూర్చిన శ్రుతివిరోధం పరిహరించబడుచున్నది. "తత్తేజోఽసృజత", "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" మొదలైన ఉత్పత్తిప్రకరణాలలో ప్రాణాల ఉత్పత్తి చెప్పబడలేదు. కొన్ని చోట్ల ఇవి ఉత్పన్నములు కానట్లే చెప్పబడుచున్నది. ఎందువల్ల ననగా "అసద్వా...ఋషయః" అనేచోట సృష్టికి పూర్వం ప్రాణాలు ఉన్నట్లు వినబడుచున్నది. (సృష్టికి పూర్వం ఇదంతా అసత్తుగా ఉండేది. ఆ అసత్తుగా ఉన్నది ఏది అన్నారు.సృష్టికి పూర్వం ఋషులు అసత్‌గా ఉన్నారు. ఆ ఋషు లెవరు అన్నారు. ప్రాణాలే ఋషులు; అని ఈ వాక్యానికి అర్థం). మరొక చోటనైతే ప్రాణాలకు కూడ ఉత్పత్తి "యథా..ప్రాణాః" అని "ఏతస్మాత్...సర్వేన్ద్రియాణిచ" అనీ, " సప్త...తస్మాత్" అనీ, "సప్రాణమ్...అన్నమ్" అనీ, ఈ మొదలైన ప్రదేశాలలో వినబడుచున్నది. ఈ విధంగా శ్రుతుల మధ్య విరోధం ఉండడంవల్ల, ఎలా నిర్ధారణ చెయ్యాలో కారణం నిరూపితం కాకపోవడం వల్ల సందేహం కలుగుతుంది. లేదా ఉత్పత్తికి (సృష్టికి) పూర్వమే ప్రాణాలున్నట్లు వినబడుచున్నది గాన ప్రాణాలు పుట్టాయి అని చెప్పే శ్రుతి గౌణ మని చెప్పవచ్చునని ప్రాప్తిస్తుంది.

## భాష్యమ్

అత ఉత్తరమిదం పఠతి - "తథా ప్రాణాః" ఇతి. కథం పునరత్ర తథేతి అక్షరానులోమ్యమ్? ప్రకృతోపమానాభావాత్. సర్వగతాత్మబహుత్వవాది దూషణమతీతానన్తరపాదాన్తే ప్రకృతం; తత్తావన్నోపమానం సంభవతి. సాదృశ్యాభావాత్. సాదృశ్యే హి సత్యుపమానం స్యాత్; యథా సింహస్తథా బలవర్మేతి. అదృష్టసామ్యప్రతిపాదనార్థమితి యద్యుచ్యేత, యథా అదృష్టస్య సర్వాత్మసంనిధావుత్పద్యమానస్యానియతత్వమేవం ప్రాణానామపి సర్వాత్మనః ప్రత్యనియతత్వమితి, తదపి దేహానియమేనైవోక్తత్వాత్ పునరుక్తం భవేత్. న చ జీవేన ప్రాణాః ఉపమీయేరన్, సిద్ధాన్తవిరోధాత్. జీవస్య హ్యనుత్పత్తిరాఖ్యాతా, ప్రాణానాం తు ఉత్పత్తి ర్వ్యాచిఖ్యాసితా. తస్మాత్తథేత్యసంబద్ధమివ ప్రతిభాతి.

న. ఉదాహరణోపాత్తేనాప్యుపమానేన సంబన్ధోపపత్తేః. అత్ర ప్రాణోత్పత్తి వాదివాక్యజాతముదాహరణమ్- "ఏతస్మాదాత్మనః సర్వే ప్రాణాః సర్వే లోకాః సర్వే దేవాః సర్వాణి భూతాని వ్యుచ్చరన్తి" (బృ.ఉ.2.1.20) ఇత్యేవం జాతీయకమ్. తత్ర యథా లోకాదయః పరస్మాద్బ్రహ్మణః ఉత్పద్యన్తే తథా ప్రాణా అపీత్యర్థః. తథా-

"ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేన్ద్రియాణి చ,

ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ (ము. 2.1.3)

ఇత్యేవమాదిష్వపి ఖాదివత్ ప్రాణానాముత్పత్తిరితి ద్రష్టవ్యమ్. అథవా "పానవ్యాపచ్చ తద్వత్" (జై.సూ.3.4.15) ఇత్యేవమాదిషు వ్యవహితోపమానసంబన్ధ స్యాప్యాశ్రితత్వాత్, యథాఽతీతానన్తరపాదాద్యుక్తా వియదాదయః పరస్య బ్రహ్మణో వికారాః సమధిగతాస్తథా ప్రాణా అపి పరస్య బ్రహ్మణో వికారా ఇతి యోజయితవ్యమ్. కః పునః ప్రాణానాం వికారత్వే హేతుః? శ్రుతత్వమేవ. నను కేషు చిత్ప్రదేశేషు న ప్రాణానాముత్పత్తిః శ్రూయత ఇత్యుక్తమ్. తదయుక్తమ్. ప్రదేశాన్తరేషు శ్రవణాత్. న హి క్వచిదశ్రవణమన్యత్ర శ్రుతం నివారయితు ముత్సహతే. తస్మాచ్ఛ్రుతత్వావిశేషాదాకాశాదివత్ప్రాణా అప్యుత్పద్యన్త ఇతి సూక్తమ్. 1

బాలానందిని

అత ఇతి :- అందువలన "తథా ప్రాణాః" అని సమాధానంగా సూత్రం పఠిస్తున్నాడు. ఇక్కడ "తథా" అనే పదం ఎలా అనుకూలంగా ఉంటుంది? ప్రకృతమైన ఉపమానం ఏదీ లేదు కదా? ఈ పాదానికి వెనుకనే ఉన్న, పాదం చివర ఉన్న, ఆత్మలు సర్వగతాలు, అవి అనేకాలు అనేవారి మతముయొక్క దూషణం ఉపమానం అవడానికి వీలులేదు; (ప్రకృతవిషయానికి) ఆ విషయంతో సాదృశ్యం లేదు కదా? సింహం ఎలాంటిదో బలవర్మ అలాంటివాడు అన్నట్లు సాదృశ్యం ఉంటేనే కదా ఉపమానం

ఉంటుంది? అన్ని ఆత్మల సమీపంలో పుడుతూన్న అదృష్టం ఏ విధంగా అనియతమో అదే విధంగా ప్రాణాలు కూడ అన్ని ఆత్మల విషయంలోను అనియతాలు (ఇవి ఈ ఆత్మవే అని చెప్పడానికి శక్యంకానివి) అని 'తథా' శబ్దం అదృష్టసామ్యాన్ని ప్రతిపాదిస్తుంది అని అంటే - దేహాలు అనియతములు అని వెనుక చెప్పినదానిచేతనే ప్రాణాల విషయం కూడ చెప్పినట్లయిపోయింది గాన పునరుక్తం అవుతుంది. ప్రాణాలను జీవునితో పోల్చడం కూడ కుదరదు. అది సిద్ధాంతానికి విరుద్ధం అవుతుంది. ఎందువల్ల ననగా జీవునకు ఉత్పత్తి లేదని చెప్పబడింది? ప్రాణాలకు ఉత్పత్తి ఉందని ఇప్పుడు చెప్పబడనున్నది. అది కాదు ఉదాహరణవాక్యంలో (ఈ అధికారణానికి ఏ వాక్యం ఉదాహరణంగా చూపబడుతుందో దానిలో) చెప్పిన ఉపమానంతో కూడ సంబంధం కుదురుతుంది. ఈ అధికరణంలో "ఏతస్మాదాత్మనః...వ్యుచ్చరన్తి" ఇత్యాదివిధమైన ప్రాణోత్పత్తిని చెప్పే వాక్యసముదాయం ఉదాహరణం. అందుచేత, లోకాదులు ఏ విధంగా పరమాత్మనుండి పుడుతున్నాయో అట్లే ప్రాణాలు కూడ అని (సూత్రానికి) అర్థం. ఇట్లే- "ఏతస్మాత్...ధారిణీ" ఇత్యాదిశ్రుతులలో కూడ ఆకాశాదులకు వలె ప్రాణాలకు కూడ ఉత్పత్తి ఉన్నది అని తెలుసుకోవాలి. లేదా "పానవ్యాపచ్చ తద్వత్" ఇత్యాదులలో వ్యవహితంతో ఉపమానసంబంధం చెప్పినట్లు (ఇక్కడ కూడ) గడచిన పాదం ప్రారంభంలో చెప్పిన వియదాదులు బ్రహ్మయొక్క వికారాలే అని ఏ విధంగా తెలియబడిందో అదే విధంగా ప్రాణాలు కూడ పరబ్రహ్మ యొక్క వికారాలే అని అన్వయించుకోవాలి.

వి. 'పానవ్యాపచ్చ తద్వత్' అనేది జైమినిసూత్రం. ఒక విషయం చర్చిస్తూ వెనుక ఎక్కడనో దూరంగా ఉన్న సూత్రంలో చెప్పిన దానిని తద్వత్ అని పరామర్శించి దానిని ఉపమానంగా చెప్పడం జరిగింది. ప్రస్తుతం మనకు కావలసినది అంతమాత్రమే. అక్కడ (జైమిని సూత్రంలో) చర్చించిన విషయాదులు మనకు అప్రస్తుతాలు. కావలసిన వారు రత్నప్రభా, కల్పతరు-బ్రహ్మవిద్యాభరణాదులలో చూచుకొనవచ్చును.

క ఇతి :- ప్రాణాలు వికారం అని చెప్పడానికి హేతువేది? వినబడడమే (శ్రుతి చెప్పడమే). కొన్ని ప్రదేశాలలో ప్రాణాలకు ఉత్పత్తి చెప్పబడలేదని చెప్పాం కదా? అది యుక్తం కాదు. ఇతర ప్రదేశాలలో వినబడుతున్నది కదా? ఒక చోట వినబడకపోవడం మరొక వినబడడాన్ని నివారించజాలదు కదా? అందుచేత శ్రుతత్వంలో (శ్రుతిచేత

చోట

చెప్పబడడంలో) విశేషం లేదు గాన ఆకాశాదుల వలె ప్రాణాలు కూడ పుడతాయి అని సరిగానే చెప్పబడింది. 1

## సూ.గౌణ్యసంభవాత్. 2.4.2.

యత్పునరుక్తమ్ - ప్రాగుత్పత్తేః సద్భావశ్రవణాద్గౌణీ ప్రాణానాముత్పత్తిశ్రుతిః ఇతి; తత్ప్రత్యాహ - "గౌణ్యసంభవాత్" ఇతి. గౌణ్యా అసంభవో గౌణ్యసంభవః. న హి ప్రాణానాముత్పత్తిర్గౌణీ సంభవతి, ప్రతిజ్ఞాహాని ప్రసంగాత్. "కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" (ము.ఉ.1.3.3) ఇతి హ్యేకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం ప్రతిజ్ఞాయ తత్సాధనాయేదమామ్నాయతే- "ఏతస్మాజ్జాయతే ప్రాణః" (ము.ఉ.2.1.3) ఇత్యాది. సా చ ప్రతిజ్ఞా ప్రాణాదేః సమస్తస్య జగతో బ్రహ్మవికారత్వే సతి ప్రకృతివ్యతిరేకేణ వికారాభావాత్సిధ్యతి. గౌణ్యాం తు ప్రాణానాముత్పత్తిశ్రుతౌ ప్రతిజ్ఞేయం హీయేత. తథా చ ప్రతిజ్ఞాతార్థముపసంహరతి- "పురుష ఏవేదం విశ్వం కర్మ తపో బ్రహ్మ పరామృతమ్" (ము.ఉ.2.1.10) ఇతి. "బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్" (ము.ఉ.2.2.11) ఇతి చ. "తథా ఆత్మనో వా అరే దర్శనేన శ్రవణేన మత్యా విజ్ఞానేనేదం సర్వం విదితమ్" (బృ.ఉ.2.4.5) ఇత్యేవంజాతీయకాసు శ్రుతిష్వేషైవ ప్రతిజ్ఞా యోజయితవ్యా. కథం పునః ప్రాగుత్ప త్తేః ప్రాణానాం సద్భావశ్రవణమ్? నైతన్మూలప్రకృతివిషయమ్. "అప్రాణో హ్యమనాః శుభ్రో హ్యక్షరాత్పరతః పరః" (ము.ఉ.2.1.2) ఇతి మూలప్రకృతేః ప్రాణాదిసమస్తవిశేషరహితత్వావధారణాత్. అవాన్తరప్రకృతివిషయం త్వేదత్స్వవికారాపేక్షం ప్రాగుత్పత్తేః ప్రాణానాం సద్భావావధారణమితి ద్రష్టవ్యమ్. వ్యాకృతవిషయాణామపి భూయసీనామవస్థానాం శ్రుతిస్మృత్యోః ప్రకృతివికారభావప్రసిద్ధేః. వియదధికరణే హి "గౌణ్యసంభవాత్" ఇతి పూర్వపక్షసూత్రత్వాక్ గౌణీ జన్మశ్రుతిరసంభవాత్ ఇతి వ్యాఖ్యాతమ్. ప్రతిజ్ఞాహాన్యా చ తత్ర సిద్ధాన్తోఽభిహితః. ఇహ తు సిద్ధాన్త

సూత్రత్వాత్ గౌణ్యా జన్మశ్రుతేరసంభవాత్ ఇతి వ్యాఖ్యాతమ్. తదనురోధేన త్విహాపి గౌణీ జన్మశ్రుతిరసంభవాదితి వ్యాచక్షాణైః ప్రతిజ్ఞాహానిరుపేక్షితా స్యాత్.2.

బాలానందిని

గౌణీతి :- "గౌణ్యసంభవాత్=గౌణశ్రుతి కుదరదుగాన ప్రాణాలకు ఉత్పత్తి అంగీకరించాలి" అని సూత్రార్థం.

యదితి :- సృష్టికి పూర్వం ప్రాణా లున్న వన్నట్లు వినబడడంచేత ప్రాణాల ఉత్పత్తిని చెప్పే శ్రుతి గౌణి అని చెప్పినదానిని గూర్చి చెపుతున్నాడు-"గౌణ్యసంభవాత్". గౌణియొక్క అసంభవం "గౌణ్యసంభవం". ప్రాణాల ఉత్పత్తిశ్రుతి గౌణి అనడం కుదరదు. అలా చెపితే ప్రతిజ్ఞాహాని కలుగుతుంది. "కస్మిన్ను...భవతి" అని ఒకదానిని తెలుసుకొనడంచేత సర్వమూ తెలియబడుతుందని ప్రతిజ్ఞ చేసి దానిని సాధించడానికై- "ఏతస్మాత్...ప్రాణః" ఇత్యాదికం చెప్పబడింది. ప్రాణాదికమైన సమస్త జగత్తు బ్రహ్మవికారం అయితేనే ప్రకృతికంటె వేరుగా వికారం ఉండదు గాన ఆ ప్రతిజ్ఞ సిద్ధిస్తుంది. ప్రాణాల ఉత్పత్తిశ్రుతి గౌణి అయిన పక్షంలో ఈ ప్రతిజ్ఞకు భంగం వాటిల్లుతుంది. అట్లే "పురుష....పరామృతమ్" అని, "బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్" అనీ ప్రతిజ్ఞ చేసిన అర్థాన్నే ఉపసంహరిస్తున్నాడు. అట్లే-"ఆత్మనో...విదితమ్" ఈ విధమైన శ్రుతులలో కూడ ఈ ప్రతిజ్ఞను అన్వయించుకోవాలి. అయితే, సృష్టికి పూర్వం ప్రాణాల్నుట్లు వినబడుతున్నది కదా, అదెట్లు? ఇది మూలప్రకృతిని (మూలకారణమైన బ్రహ్మను) గూర్చి చెప్పినది కాదు. "అప్రాణో...పరః" అని మూలప్రకృతిలో (బ్రహ్మలో) ప్రాణాదివిశేషాలేవీ లేవని నిర్ణయింపబడింది కదా? అందుచేత సృష్టికి పూర్వం ప్రాణాలున్నట్లు చెప్పడం తన వికారాల అపేక్షచేత (వాటి దృష్ట్యా) అవాంతర ప్రకృతిని గూర్చి చెప్పినది అని గ్రహించాలి. వ్యాకృతములైనవాటికి సంబంధించిన అనేక అవస్థలను కూడ శ్రుతులలోను, స్మృతులలోను ప్రకృతివికారభావంతో చెప్పడం ఉంది కదా?

వి. మూలకారణం బ్రహ్మ. దానినుండి ఒకదాని తరవాత ఒకటిగా అనేక వస్తువులు సృజింపబడ్డాయి. మూడవదానికి రెండవది ప్రకృతి (కారణం), నాల్గవదానికి మూడవది ప్రకృతి. ఈ విధంగా ఒక వస్తువును దాని కార్యాన్ని దృష్టిలో ఉంచుకొని ప్రకృతి

అని చెప్పడం శ్రుతిస్మృతులలో ఉంది. అందుచేత ఉత్పత్తికి పూర్వం ప్రాణాలున్నా యనగా ప్రాణాల కార్యాల ఉత్పత్తికి ముందు ప్రాణాలున్నాయని అర్థమే కాని ప్రాణాలు మూలకారణంగా ఉన్నాయి అని అర్థం కాదు. అవ్యాకృతావస్థ (సూక్ష్మావస్థ) నుండి వాకృతావస్థలోనికి వచ్చిన పదార్థాలలో కూడ ప్రకృతివికృతిభావం చెప్పడం ఉంది.

వియదితి :- వియదధికరణంలో కూడ "గౌణ్యసంభవాత్" అను సూత్రం ఉంది. కాని అక్కడ అది పూర్వపక్షసూత్రం. అందుచేత "ఆకాశానికి జన్మశ్రుతి గౌణ మైనది, ఆకాశానికి జన్మ అసంభావ్యం కదా" అని ఆ సూత్రానికి అర్థం చెప్పబడింది. ప్రతిజ్ఞాహాని కలుగుతుంది గాన ఆకాశానికి జన్మ చెప్పవలసిందే అని అక్కడ సిద్ధాంతం చెప్పబడింది. ఇక్కడైతే ఈ సూత్రం సిద్ధాంతసూత్రం. అందుచేత "గౌణీయైన జన్మశ్రుతి కుదరదుగాన" అని వ్యాఖ్యానం చేయబడింది. అక్కడున్న సూత్రాన్ని పట్టి ఈ సూత్రాన్ని కూడ "గౌణీ జన్మశ్రుతిః; అసంభవాత్" అని వ్యాఖ్యానించినవాళ్లు ప్రతిజ్ఞాహానిదోషాన్ని ఉపేక్షించిన వాళ్లవుతారు. (అందుచేత అలా వ్యాఖ్యానించకూడదు అని అర్థం).2.

సూ.తత్ప్రాక్ శ్రుతేశ్చ. 2.4.3.

ఇతశ్చాకాశాదీనామివ ప్రాణానామపి ముఖ్యైవ జన్మశ్రుతిః, యజ్జాయత ఇత్యేకం జన్మవాచిపదం ప్రాణేషు ప్రాక్ శ్రుతం సదుత్తరేష్వాకాశాదిష్వనువర్తతే, "ఏతస్మాజ్జాయతే ప్రాణః" (ము.ఉ.2.1.3) ఇత్యత్ర. ఆకాశాదిషు ముఖ్యం జన్మేతి ప్రతిష్ఠాపితమ్; తత్సామాన్యాత్ప్రాణేష్వపి ముఖ్యమేవ జన్మ భవితుమర్హతి. న హ్యేకస్మిన్ ప్రకరణ ఏకస్మింశ్చ వాక్య ఏకః శబ్దః సకృదుచ్చరితో బహుభిః సంబధ్యమానః క్వచిన్ముఖ్యః క్వచిద్గౌణ ఇత్యవసాతుం శక్యమ్, వైరూప్యప్రసంగాత్. తథా "స ప్రాణమసృజత ప్రాణాచ్ఛ్రద్ధామ్" (ప్ర.ఉ.6.4) ఇత్యత్రాపి ప్రాణేషు శ్రుతః సృజతిః పరేష్వప్యుత్పత్తిమత్సు శ్రద్ధాదిష్వనుషజ్యతే. యత్రాపి పశ్చాచ్ఛ్రుత ఉత్పత్తివచనః శబ్దః పూర్వైః సంబధ్యతే తత్రాప్యేష ఏవ న్యాయః. యథా "సర్వాణి భూతాని వ్యుచ్చరన్తి" ఇత్యయమన్తే పఠితో వ్యుచ్చరన్తి శబ్దః పూర్వైరపి ప్రాణాదిభిః సంబధ్యతే. 3

బాలానందిని

**తదితి** :- "తత్ప్రాక్ శ్రుతేశ్చ = జన్మవాచకశబ్దం ప్రాణాల విషయంలో ముందు వినబడి ఉండడంవల్ల కూడ ప్రాణాలు పుడతాయి'' అని సూత్రార్థం.

**ఇతశ్చేతి** :- ఈ కారణంవల్ల కూడ ఆకాశాదులకు వలె ప్రాణాదులకు కూడ జన్మశ్రవణం ముఖ్యమే; ఎందువలన అనగా "ఏతస్మాజ్జాయతే ప్రాణః" అనే చోట జన్మను బోధించే జాయతే అను పదం ప్రాణాల విషయంలో ముందు వినబడినదై తరవాత వచ్చిన ఆకాశాదులలోనికి అనువర్తిస్తుంది. ఆకాశాదుల విషయంలో జన్మ ముఖ్యమే అని స్థాపించబడింది. ఆకాశాదుల విషయంలో వలెనే ప్రాణాల విషయంలో కూడ జన్మ ముఖ్యమే అవడం యుక్తం.. ఒకే ప్రకరణంలో ఒకే వాక్యంలో ఒక్క సారి ప్రయోగించబడి అనేకమైనవాటితో అన్వయించే శబ్దం ఒక చోట ముఖ్యార్థం బోధిస్తుందని మరొక చోట గౌణార్థాన్ని బోధిస్తుందని నిర్ణయించడానికి శక్యం కాదు కదా? అలా చెపితే వైరూప్యం వస్తుంది (ఒకే శబ్దానికి రెండు విధాల అర్థం చెపితే దాని స్వరూపాన్ని తారుమారు చేసినట్లవుతుంది). అట్లే "స ప్రాణమసృజత, ప్రాణాచ్ఛ్రద్ధామ్'' (ప్ర.ఉ.6.4) అనే చోట కూడ ప్రాణాల విషయంలో వినబడిన సృజధాతువు ఉత్పత్తి గల తరవాత వచ్చే శ్రద్ధాదులతో కూడ అన్వయిస్తున్నది. తరవాత వినబడే ఉత్పత్తివాచకమైన శబ్దం ఏ పూర్వపదాలతో సంబంధిస్తుందో అక్కడ కూడ ఇదే పద్ధతి. ఎట్లనగా - "సర్వాణి భూతాని వ్యుచ్చరన్తి'' అని చివర వినబడుతూన్న 'వ్యుచ్చరన్తి' అనే శబ్దం వెనుక నున్న ప్రాణాదులతో కూడ సంబంధిస్తుంది. 3.

## సూ. తత్పూర్వకత్వాద్వాచః. 2.4.4.

యద్యపి "తత్తేజోఽసృజత''' (ఛా.ఉ.6.2.3)ఇత్యేతస్మిన్ ప్రకరణే ప్రాణానాముత్పత్తిర్న పఠ్యతే. తేజోబన్నానామేవ చ త్రయాణాముత్పత్తిశ్రవణాత్, తథాపి బ్రహ్మప్రకృతికతేజోబన్నపూర్వకత్వాభిధానాద్వాక్ప్రాణమనసాం, తత్సామాన్యాచ్చ సర్వేషామేవ ప్రాణానాం బ్రహ్మప్రభవత్వం సిద్ధం భవతి. తథాహి-అస్మిన్నేవ ప్రకరణే తేజోబన్నపూర్వకత్వం వాంక్ప్రాణమనసామామ్నాయతే "అన్నమయం హి సోమ్య మన ఆపోమయః ప్రాణస్తేజోమయీ వాక్'' (ఛా ఉ.

6.5.4)ఇతి. తత్ర యది తావన్ముఖ్యమేవైతేషామన్నాదిమయత్వం తతో వర్తత ఏవ బ్రహ్మప్రభవత్వమ్. అథ భాక్తం తథాపి బ్రహ్మకర్తృకాయాం నామరూపవ్యాక్రియాయాం శ్రవణాత్ "యేనాశ్రుతం శ్రుతం భవతి" (ఛా. ఉ.6.1..3) ఇతి చోపక్రమాత్ "ఐతదాత్మ్యమిదం సర్వమ్" (ఛా. ఉ.6.8.7) ఇతి చోపసంహారాత్, శ్రుత్యన్తరప్రసిద్ధేశ్చ బ్రహ్మకార్యత్వప్రపఞ్చనార్థమేవ మన ఆదీనామన్నాది మయత్వవచనమితి గమ్యతే. తస్మాదపి ప్రాణానాం బ్రహ్మవికారత్వసిద్ధిః. 4.

బాలానందిని

తదితి :- "వాచః=వాక్ప్రాణమనస్సులు, తత్పూర్వకత్వాత్=తేజోబన్నాలు పూర్వమునందు కలవి అవడంచేత కూడ ప్రాణాలకు ఉత్పత్తి ఉన్నది" అని సూత్రార్థం.

యద్యపీతి :- "తత్తేజోఽసృజత" అనే ప్రకరణంలో తేజస్సు, జలం, పృథివి అనే మూడు భూతాల ఉత్పత్తిమాత్రమే వినబడడంవల్ల ప్రాణాల ఉత్పత్తి పఠింపబడకపోయినా, వాక్ప్రాణమనస్సులు బ్రహ్మప్రకృతిగా గల (బ్రహ్మనుండి పుట్టిన) తేజోబన్నాలు పూర్వమునందు కలవిగా చెప్పడంవల్ల వాటి వలె, సమస్తమైన ప్రాణాలు కూడ బ్రహ్మనుండి పుట్టినట్లు సిద్ధిస్తుంది. అదెట్లనగా-ఈ ప్రకరణంలో -" అన్నమయం హి సోమ్య మనః అపోమయః ప్రాణస్తేజోమయీ వాక్" అని వాక్ప్రాణమనస్సులు తేజోబన్నపూర్వకములని చెప్పబడుచున్నది. అలా ఉండగా-వీటి అన్నమయాదిత్వం ముఖ్యమే అని గ్రహించిన పక్షంలో (అనగా నిజంగా ఇవి అన్నాదులనుండి పుట్టాయి అన్నట్లయితే)అప్పుడు అవన్నీ బ్రహ్మనుండి (తేజఆదులద్వారా) పుట్టాయనే మాట ఉండనే ఉంది. అలా కాక వీటి అన్నాదిమయత్వం భాక్తం (గౌణం) అని అంగీకరించినా కూడ (అనగా మనఆదులు ప్రత్యక్షంగా) పృథివ్యాదులనుండి పుట్టలేదు అన్నా కూడ) బ్రహ్మచేసిన నామరూపవ్యాక్రియలో ఇది చెప్పబడడంవల్ల, "యేనాశ్రుతం శ్రుతం భవతి" అని ఉపక్రమించడంవల్ల, "ఐతదాత్మ్యమిదం సర్వమ్" అని ఉపసంహారం చేయడం వల్లా, ఇతరశ్రుతుల ప్రసిద్ధివల్ల (అనగా ఇవి జన్మించినట్లు ఇతర శ్రుతులు చెప్పడం వల్ల) ఇక్కడ మన ఆదులు అన్నాదిమయాలని చెప్పడం ఇవి కూడ బ్రహ్మయొక్క కార్యాలే అని వివరించడానికే అని తెలుస్తూన్నది. అందువల్ల కూడ ప్రాణాలు బ్రహ్మయొక్క కార్యములే అని సిద్ధిస్తుంది. 4.

ప్రాణోత్పత్త్యధికరణం సమాప్తం.

## 2. సప్తగత్యధికరణమ్. సూ. 5-6

## సూ. సప్త గతేర్విశేషితత్వాచ్చ. 2.4.5

ఉత్పత్తి విషయః శ్రుతివిప్రతిషేధః ప్రాణానాం పరిహృతః. సంఖ్యావిషయ ఇదానీం పరిహ్రియతే. తత్ర ముఖ్యం ప్రాణముపరిష్టాద్వక్ష్యతి. సంప్రతి తు కతరే ప్రాణా ఇతి సంప్రధారయతి. శ్రుతివిప్రతిపత్తేశ్చాత్ర విశయః. క్వచిత్సప్త ప్రాణాః సంకీర్త్యన్తే-"సప్త ప్రాణాః ప్రభవన్తి తస్మాత్" (ము.ఉ.2.1.8) ఇతి. క్వచిదష్టౌ ప్రాణా గ్రహత్వేన గుణేన సంకీర్త్యన్తే-"అష్టౌ గ్రహా అష్టావతిగ్రహాః" (బృ.ఉ.3.2.1) ఇతి. క్వచిన్నవ-"సప్త వై శీర్షణ్యాః ద్వావవాఞ్చౌ" (తై.సం. 5.1.7.1) ఇతి. క్వచిద్దశ "నవ వై పురుషే ప్రాణా నాభిర్దశమీ" (తై.సం. 5.3.2.3) ఇతి. క్వచిదేకాదశ- "దశేమే పురుషే ప్రాణా ఆత్మైకాదశః" (బృ.ఉ.3.9.4) ఇతి. క్వచిద్ద్వాదశ "సర్వేషాం స్పర్శానాం త్వగేకాయతనమ్" (బృ.ఉ.2.4.11) ఇత్యత్ర. క్వచిచ్చ త్రయోదశ "చక్షుశ్చ ద్రష్టవ్యం చ" (ప్ర.ఉ.4.8) ఇత్యత్ర. ఏవం హి విప్రతిపన్నాః ప్రాణేయత్తాం ప్రతి శ్రుతయః.

### బాలానందిని

సప్తేతి :-గతేః=ఏడు ప్రాణాలే శ్రుతిలో తెలియబడడంవల్ల, విశేషితత్వాచ్చ=అన్నే అని విశేషంగా చెప్పడంవల్ల, సప్త=ప్రాణాలు ఏడు" అని సూత్రార్థం.

ఉత్పత్తీతి :- ఉత్పత్తికి సంబంధించిన శ్రుతివిరోధం పరిహరించబడింది. ఇప్పుడు సంఖ్యకు సంబంధించిన విరోధం పరిహరించబడుచున్నది. ముఖ్యప్రాణాన్ని గూర్చి తరవాత చెప్పనున్నారు. ఇప్పుడైతే ఇతరప్రాణాలు ఎన్ని అని నిర్ధారణ చేస్తున్నారు. శ్రుతులలో విప్రతిపత్తి (అభిప్రాయభేదం) ఉండడంవల్ల సంశయం. "సప్త ప్రాణాః ప్రభవన్తి తస్మాత్" అని ఒక చోట ఏడు ప్రాణాలు చెప్పబడుచున్నాయి. (ఐదు జ్ఞానేంద్రియాలు, వాక్కు,మనస్సు అని ఏడు). ప్రాణాలకు గ్రహత్వం (గ్రహించడం) అనే గుణాన్ని చెపుతూ ఒక చోట "అష్టౌ గ్రహాః అష్టావతిగ్రహాః" (గ్రహించేవి ఇంద్రియాలు, విషయాలు అతిగ్రహాలు) అని ఎనిమిది చెప్పబడుతున్నాయి. (పై ఏడింటికి హస్తాలు

కలపగా ఎనిమిది). " సప్త...అవాఙ్" అని ఒకచోట తొమ్మిది చెప్పబడుతున్నాయి. (రెండు చెవులు, రెండు కళ్లు, రెండు ముక్కులు వాక్కుఅని శిరస్సులో ఉండేవి ఏడు, పాయూపస్థలు-మొత్తం తొమ్మిది). " నవ వై.... దశమీ" అని పది చెప్పబడుతున్నాయి. (పై తొమిదింటికి నాభిని కలపగా పది). " దశేమే పురుషే ప్రాణాః ఆత్మైకాదశః" అని ఒకచోట పదకొండు చెప్పబడుతున్నాయి. (జ్ఞానేంద్రియాలు ఐదు, కర్మేంద్రియాలు ఐదు అత్మ (మనస్సు) మొత్తం పదకొండు. ఇది సిద్ధాంత్యభిమతమైన సంఖ్య). "సర్వేషాం అయనమ్" అనే చోట పన్నెండు చెప్పబడుతున్నాయి. (పై పదకొండు, హృదయం అనే బుద్ధి మొత్తం పన్నెండు) "చక్షుశ్చ ద్రష్టవ్యం చ" అనేచోట పదమూడు చెప్పబడుతున్నాయి. (పై పన్నెండు, అహంకారం మొత్తం పదమూడు). ఈ విధంగా ప్రాణాల సంఖ్య విషయంలో శ్రుతులు విప్రతిపన్నాలై (అభిప్రాయభేదం కలవై) ఉన్నాయి.

## భాష్యమ్

కిం తావత్ప్రాప్తమ్? సప్తైవ ప్రాణా ఇతి. కుతః? గతేః. యతస్తావ న్తోఽవగమ్యన్తే- "సప్త ప్రాణాః ప్రభవన్తి తస్మాత్" (ము. ఉ.2.1.8) ఇత్యేవంవిధాసు శ్రుతిషు. విశేషితాశ్చైతే "సప్త వై శీర్షణ్యాః ప్రాణాః" ఇత్యత్ర. నను " ప్రాణా గుహాశయా నిహితాః సప్త సప్త" (ము.ఉ.2.1.8) ఇతి వీప్సా శ్రూయతే. సా సప్తభ్యోఽతిరిక్తాన్ ప్రాణాన్ గమయతీతి. నైష దోషః. పురుషభేదాభిప్రాయేయం వీప్సా ప్రతిపురుషం సప్త సప్త ప్రాణా ఇతి, న తత్త్వభేదాభిప్రాయా సప్త సప్తాన్యేఽన్యే ప్రాణా ఇతి. నన్వష్టత్వాదికాపి సంఖ్యా ప్రాణేషూదాహృతా కథం సప్తైవ స్యుః? సత్యముదాహృతా. విరోధాత్త్వన్యతమా సంఖ్యాధ్యవసాతవ్యా. తత్ర స్తోకకల్పనానురోధాత్సప్త సంఖ్యాధ్యవసానం, వృత్తిభేదాపేక్షం చ సంఖ్యాన్తరశ్రవణమితి మన్యన్తే. 5.

## బాలానందిని

కిమితి:- ఏమి ప్రాప్తించింది? ప్రాణాలు ఏడే అని. ఎందువల్ల? గతివల్ల. ఎందువల్ల ననగా "సప్త ప్రాణాః ప్రభవన్తి తస్మాత్" ఇత్యాదిశ్రుతులలో అన్ని ప్రాణాలే తెలియబడుతున్నాయి. "సప్త వై శీర్షణ్యాః ప్రాణాః" అని ఈ ప్రాణాలే (శిరస్సులో

ఉన్నవిగా) విశేషించి చెప్పబడుతున్నాయి. (ప్రశ్న:-) "ప్రాణా గుహాశయాః సప్త సప్త" అనే చోట ("సప్త సప్త" ఏడు ఏడు అని) ద్విరుక్తి కనబడుతున్నదికదా? అది ఏడుకంటె అధికమైన ప్రాణాలున్నట్లు చెప్పుచున్నది. (సమాధానం) ఈ దోషం లేదు ప్రతిపురుషునిలోను ఏడేసి ఏడేసి ప్రాణాలున్నాయని పురుషభేదాభిప్రాయంతో ఈ వీప్స (ఆవృత్తి) చేయబడింది) గాని, ఏడు ప్రాణాలు, అవి కాక ఇంకా ఏడు ప్రాణాలున్నాయి అని తత్త్వభేదాభిప్రాయంచేత చేసినది కాదు. (ప్రశ్న) ప్రాణాల విషయంలో అష్టత్వాదిసంఖ్య కూడ చూపబడింది కదా ఏడు మాత్రమే ఎలా ఉంటాయి? (సమాధానం) నిజమే చూపబడింది. కాని విరోధం ఉండడంవల్ల ఏదో ఒక సంఖ్యను నిర్ధారణ చేసుకోవాలి. అందుచేత చిన్న సంఖ్యను తీసుకోవడం యుక్తం గాన సప్తసంఖ్యను గ్రహించాలి, ఇతర సంఖ్యలు ఆ ఏడు ప్రాణాల వృత్తిభేదాన్ని పట్టి చెప్పబడినవని వాళ్లు అభిప్రాయపడుతున్నారు.

## భాష్యమ్

అత్రోచ్యతే -

సూ.హస్తాదయస్తు స్థితేఽతో నైవమ్. 2.4.6.

హస్తాదయస్త్వపరే సప్తభ్యోఽతిరిక్తాః ప్రాణాః శ్రూయన్తే- "హస్తౌ వై గ్రహః స కర్మణాతిగ్రాహేణ గృహీతో హస్తాభ్యాం హి కర్మ కరోతి" (బృ.ఉ.3.2.8) ఇత్యేవమాద్యాసు శ్రుతిషు. స్థితే చ సప్తతాతిరేకే సప్తత్వమన్తర్భావాచ్ఛక్యతే సంభావయితుమ్. హీనాధికసంఖ్యావిప్రతిపత్తౌ హ్యధికా సంఖ్యా సంగ్రాహ్యా భవతి, తస్యాం హీనాన్తర్భవతి, న తు హీనాయామధికా. అతశ్చ నైవం మన్తవ్యం-స్తోకకల్పనానురోధాత్ సప్తైవ ప్రాణాః స్యురితి. ఉత్తర సంఖ్యానురోధాత్తు ఏకాదశైవ తే ప్రాణాః స్యుః. తథా చోదాహృతా శ్రుతిః - "దశేమే పురుషే ప్రాణా ఆత్మైకాదశః" (బృ.ఉ.3.9.4) ఇతి. ఆత్మశబ్దేన చాన్తః కరణం పరిగృహ్యతే, కరణాధికారాత్. నన్వేకాదశత్వాదప్యధికే ద్వాదశత్రయోదశత్వే ఉదాహృతే? సత్యముదాహృతే. న త్వేకాదశభ్యః కార్యజాతేభ్యః అధికం కార్యజాతమస్తి యదర్థమధికం కరణం కల్ప్యేత. శబ్దస్పర్శరూపరసగన్ధవిషయాః

పఞ్చ బుద్ధిభేదాః, తదర్థాని పఞ్చ బుద్ధీన్ద్రియాణి. వచనాదానవిహరణోత్సర్గానన్దాః పఞ్చ కర్మభేదాః, తదర్థాని చ పఞ్చ కర్మేన్ద్రియాణి. సర్వార్థవిషయం త్రైకాల్యవృత్తి మనస్త్వేకమనేకవృత్తికమ్. తదేవ వృత్తిభేదాత్ క్వచిద్భిన్నవద్వ్యపదిశ్యతే - "మనో బుద్ధిరహంకారశ్చిత్తం చ" ఇతి. తథా చ శ్రుతిః కామాద్యా నానావిధా వృత్తీరనుక్రమ్యాహ- "ఏతత్సర్వం మన ఏవ" (బృ.ఉ.1.5.3) ఇతి. అపి చ సప్తైవ శీర్షణ్యాన్ ప్రాణానభిమన్యమానస్య చత్వార ఏవ ప్రాణా అభిమతాః స్యుః;స్థానభేదాద్ధ్యేతే చత్వారః సన్తః సప్త గణ్యన్తే- ద్వే శ్రోత్రే ద్వే నాసికే ఏకా వాక్ ఇతి. న చ తావతామేవ వృత్తిభేదా ఇతరే ప్రాణా ఇతి శక్యతే వక్తుమ్; హస్తాదివృత్తీనామత్యన్తవిజాతీయత్వాత్. తథా "నవ వై పురుషే ప్రాణా నాభిర్దశమీ" ఇత్యత్రాపి దేహచ్ఛిద్రభేదాభిప్రాయేణైవ దశ ప్రాణా ఉచ్యన్తే న ప్రాణతత్త్వభేదాభిప్రాయేణ. "నాభిర్దశమీ" ఇతి వచనాత్. న హి నాభిర్నామ కశ్చిత్ప్రాణః ప్రసిద్ధోఽస్తి. ముఖ్యస్య తు ప్రాణస్య భవతి నాభిరప్యేకం విశేషాయతనమిత్యతో నాభిర్దశమీత్యుచ్యతే. క్వచిదుపాసనార్థం కతి చిత్ప్రాణా గణ్యన్తే కతి చిత్ప్రదర్శనార్థమ్. తదేవం విచిత్రే ప్రాణేయత్తామ్నానే సతి క్వ కింపరమామ్నానమితి వివేక్తవ్యమ్. కార్యజాతవశాత్త్వేకాదశత్వామ్నానం ప్రాణ విషయం ప్రమాణమితి స్థితమ్.

## బాలానందిని

అత్రేతి:- ఈ విషయంలో చెప్పబడుచున్నది-

హస్తేతి :- "హస్తాదయస్తు=హస్తాదులు కూడ చెప్పబడుచున్నవి. స్థితే=ప్రాణాల అధికసంఖ్య ఉండగా, అతః=అధికసంఖ్య ఉండడం వల్ల, ఏవమ్=ఇట్లు సప్తసంఖ్యాత్వం, న=లేదు" అని సూత్రార్థం.

హస్తాదయ ఇతి :- "హస్తా...కరోతి" (హస్తం గ్రహం; ఇది అతిగ్రహ మైన కర్మతో, అనగా గ్రహించడం అనే కర్మతో, సంబంధించి ఉంటుంది. కర్మ హస్తాలతో చేస్తాడు కదా) ఇత్యాదిశ్రుతులలో ఏడుకంటె అధికంగా హస్తాది ప్రాణాలు చెప్పబడుచున్నాయి. ఏడుకంటె

ఆధిక్యం ఉన్నప్పుడు సప్తత్వాన్ని అంతర్భావం చేయడంవల్ల సరిపెట్టవచ్చును. తక్కువ సంఖ్యయా ఎక్కువ సంఖ్యయా అనే విప్రతిపత్తి కలిగినప్పుడు అధికసంఖ్యనే గ్రహించాలి. ఎందువల్ల ననగా దానిలో అల్పసంఖ్య ఇమిడిపోతుంది; అంతేనే కాని పెద్దసంఖ్య అల్పసంఖ్యలో ఇమడదు. అందుచేత చిన్న సంఖ్యను కల్పించడం ద్వారా ప్రాణాలు ఏడే అని చెప్పడం యుక్తం కాదు. తరువాత చెప్పిన పెద్ద సంఖ్యను అనుసరించి ప్రాణాలు పదకొండే ఉంటాయి. ఇందుకు "దశేమే...ఏకాదశః" అను శ్రుతి ఉదాహరించబడింది. ఇది ఇంద్రియాలను గూర్చిన ప్రకరణం అవడంచేత ఇక్కడ 'ఆత్మ' శబ్దంచేత అంతఃకరణాన్ని గ్రహించాలి. పదకొండుకు మించిన పన్నెండు పదమూడు సంఖ్యలను కూడ ఉదహరించాం కదా? నిజమే; ఉదహరించారు. పదకొండు పనులకంటె అధికంగా ఇతరమైన పనులేవీ లేవు. అవి ఏవైనా ఉంటే అధికంగా కరణాలను కల్పించడానికి అవసరం ఉండేది. శబ్దస్పర్శరూపరసగంధాలు విషయాలుగా గల ఐదు బుద్ధిభేదాలున్నాయి; వాటి కోసం ఐదు బుద్ధీంద్రియాలు. వచన-ఆదాన-విహరణ-ఉత్సర్గ-ఆనందా లనే ఐదు రకాల కర్మలున్నాయి; వాటి కోసం ఐదు కర్మేంద్రియాలు. అన్నింటినీ గ్రహించేది, మూడు కాలాలలోను ఉండేది అయిన మనస్సు ఒక్కటే; దీనికే అనేకమైన వృత్తులుంటాయి. వృత్తుల భేదాన్ని పట్టి ఆ మనస్సే కొన్నిచోట్ల వేరుగా ఉన్నట్లు మనస్సు, బుద్ధి, అహంకారం, చిత్తం అని నిర్దేశింపబడుతుంది. అట్లే శ్రుతి కామాదులైన అనేకవిధాలైన వృత్తులను ప్రస్తావించి "ఏతత్సర్వం మన ఏవ" (ఇదం తా మనస్సే)అంటుంది. మరొక విషయ మేమనగా శిరస్సులో ఉన్న ఏడే ప్రాణాలు అని అంగీకరించినవాడు కేవలం నాలుగు ప్రాణాలనే అంగీకరించిన ట్లవుతుంది. ఎందువల్ల ననగా నాలుగు ప్రాణాలే స్థానభేదాన్ని(రెండు చెవులు మొదలైనవాటిని పట్టి) "ద్వే....వాక్" అని ఏడుగా లెక్కింపబడుతున్నాయి. ఇతరప్రాణా లన్నీ ఈ నాల్గింటి వృత్తిభేదాలు మాత్రమే అనడానికి శక్యం కాదు. ఎందువల్ల ననగా హస్తాదివృత్తులు (అవి చేసే పనులు) చాల విలక్షణ మైనవి. అట్లే "నవ.....దశమీ"అన్నప్పుడు కూడ దేహంలో ఉన్న ఛిద్రాల భేదాన్ని మాత్రమే దృష్టిలో ఉంచుకొని పది ప్రాణాలు అని చెప్పబడింది కాని అవి ప్రాణతత్త్వంయొక్క భేదా లనే అభిప్రాయంచేత కాదు. ఎందువల్ల ననగా "నాభిర్దశమీ"అని చెప్పబడింది. నాభి అనే ఒక ప్రాణం ప్రసిద్ధంగా లేదు కదా? అయితే నాభి కూడ

ముఖ్యప్రాణానికి ఒక స్థానం కాబట్టి నాభి పదవది అని చెప్పబడింది. కొన్నిచోట్ల కొన్ని ప్రాణాలు ఉపాసన కొసం చెప్పబడతాయి. కొన్ని చోట్ల కొన్ని ప్రాణాలు ప్రదర్శనం కొరకు చెప్పబడుతుంటాయి. ఈ విధంగా ప్రాణాల సంఖ్యను గూర్చి చెప్పడం విచిత్రంగా ఉన్నప్పుడు ఆమ్నానం (సంఖ్యను శ్రుతిలో చెప్పడం) ఎక్కడ దేనిని ప్రధానంగా దృష్టిలో ఉంచుకొని చేయబడింది అని పరిశీలించాలి. అయితే-కార్యాలను పట్టి ప్రాణాలు పదకొండు అని చేసిన ఆమ్నానమే ప్రమాణం అని నిశ్చితమైనంది.

## భాష్యమ్

ఇయమపరా సూత్రయోజనా-సప్తైవ ప్రాణాః స్యుర్యతః సప్తానామేవ గతిః శ్రూయతే-"తముత్క్రామన్తం ప్రాణోఽనూత్క్రామతి ప్రాణమనూత్క్రామన్తం సర్వే ప్రాణా అనూత్క్రామన్తి"(బృ.ఉ.4.4.2) ఇత్యత్ర. నను సర్వశబ్దోఽప్యత్ర పఠ్యతే, తత్కథం సప్తానామేవ గతిః ప్రతిజ్ఞాయత ఇతి. విశేషితత్వాదిత్యాహ. సప్తైవ హి ప్రాణాశ్చక్షురాదయస్త్వక్పర్యన్తా విశేషితా ఇహ ప్రకృతాః- "స యత్రైష చాక్షుషః పురుషః పరాఙ్ పర్యావర్తతేఽథారూపజ్ఞో భవతి"(బృ.ఉ.4.4.1), "ఏకీభవతి న పశ్యతీత్యాహుః" (బృ.ఉ.4.4.2) ఇత్యేవమాదినానుక్రమణేన. ప్రకృతగామీ చ సర్వశబ్దో భవతి యథా సర్వే బ్రాహ్మణా భోజయితవ్యా ఇతి యే నిమన్త్రితాః ప్రకృతా బ్రాహ్మణాః త ఏవ సర్వశబ్దే నోచ్యన్తే నాన్యే. ఏవమిహాపి యే ప్రకృతాః సప్త ప్రాణాః త ఏవ సర్వశబ్దేనోచ్యన్తే నాన్య ఇతి. నన్వత్ర విజ్ఞానమష్ట మమనుక్రాన్తం, కథం సప్తానామేవానుక్రమణమ్? నైష దోషః మనోవిజ్ఞాన యోస్తత్త్వాభేదాత్ వృత్తిభేదేఽపి సప్తత్వోపపత్తేః. తస్మాత్సప్తైవ ప్రాణా ఇతి.

## బాలానందిని

ఇయమితి:- పై రెండు సూత్రాలకు ఇది మరొక అన్వయం. (సప్త గతేర్విశేషి తత్వాచ్చ)-ప్రాణాలు ఏడు మాత్రమే; ఎందువల్ల ననగా "తముత్క్రామన్తం....అనూత్క్రామన్తి" (జీవుడు ఉత్క్రమిస్తుండగా వానిని అనుసరించి ప్రాణం ఉత్క్రమిస్తుంది; ఉత్క్రమిస్తూన్న ప్రాణాన్ని అనుసరించి అన్ని ప్రాణాలు ఉత్క్రమిస్తాయి) అని ఏడు ప్రాణాలకే గతి

చెప్పబడుచున్నది. (ప్రశ్న)-ఇక్కడ సర్వశబ్దం పఠించబడుచున్నది కదా? అనగా అన్నీ అని చెప్పబడింది కదా? అలాంటప్పుడు ఏడింటికే గతి అని ఎందుకు చెప్పబడుచున్నది? వాటి విశేషం చెప్పబడింది గాన అని (సమాధానం) చెపుతున్నాడు. "స యత్రైష...భవతి", "ఏకీభవతి....ఆహుః" ఇత్యాదిరీతిలో ఉపక్రమించి చక్షుస్సు మొదలు త్వక్కువరకు ఉన్న ఏడు ప్రాణాలు మాత్రమే ఇక్కడ విశేషితములై (ప్రత్యేకంగా వర్ణింపబడి) ఉన్నాయి (మానవుడు మరణోన్ముఖు డైనప్పుడు ఆతని చక్షురింద్రియంలో అంతవరకు ఉన్న సూర్యాంశభూతుడైన పురుషుడు దానిని విడచి తన అంశియైన సూర్యునిలోనికి వెళ్లిపోతాడు. అప్పుడు అతడు రూపం గుర్తించజాలడు. ఆ పురుషుడు సూర్యునిలో ప్రవేశించగానే చక్షురింద్రియం హృదయంలో మనస్సుతో ఐక్యం చెందుతుంది. అప్పుడు ఇతడు చూడడం లేదని ప్రక్క నున్నవాళ్లు అంటారు. అట్లే ఇతరేంద్రియాలు కూడ. అపుడు ఇతడు వాసనచూడడం లేదు. మాట్లాడడం లేదు, రుచిచూడడం లేదు, వినడం లేదు, ఆలోచించడం లేదు, తెలుసుకొనడం లేదు అని ప్రక్కనున్న వాళ్లంటారు అని ఆ సందర్భంలో చెప్పిన వాక్యాల భావం). ఇక్కడ సర్వశబ్దం ఉన్నా కూడ అది ప్రకృతమైన అన్నీ అనే అర్థం మాత్రమే చెపుతుంది. బ్రాహ్మణులందరికీ భోజనం పెట్టాలి అన్నప్పుడు పిలిచిన వాళ్ల కందరికీ అని మాత్రమే అర్థం వస్తుంది కాని ఇతరు లందరికీ అని అర్థం రాదు. అట్లే ఇక్కడ కూడ ప్రకృతములైన ఏ సప్తప్రాణా లున్నాయో అవే సర్వశబ్దంచేత చెప్పబడతాయి కాని ఇతరమైన వేవీ చెప్పబడవు. (ప్రశ్న) ఇక్కడ ఎనిమిదవదైన విజ్ఞానం కూడ చెప్పబడింది కదా? ఇది దోషం కాదు. వృత్తి భేదం ఉన్నా కూడ మనోవిజ్ఞానాల తత్త్వం (స్వరూపం)లో భేదం లేదు గాన సప్తసంఖ్య కుదురుతుంది. అందుచేత ప్రాణాలు ఏడు మాత్రమే.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః- హస్తాదయస్త్వపరే సప్తభ్యోఽతిరిక్తాః ప్రాణాః ప్రతీయన్తే- "హస్తో వై గ్రహః" (బృ.ఉ.3.2.8) ఇత్యాదిశ్రుతిషు. గ్రహత్వం చ బన్ధనభావః, గృహ్యతే బధ్యతే క్షేత్రజ్ఞోఽనేన గ్రహసంజ్ఞకేన బన్ధనేనేతి. న చ క్షేత్రజ్ఞో నైకస్మిన్నేవ శరీరే బధ్యతే; శరీరాన్తరేష్వపి తుల్యత్వాద్బన్ధనస్య

తస్మాచ్ఛరీరాన్తరసంచారీదం గ్రహసంజ్ఞకం బన్ధనమిత్యర్థాదుక్తం భవతి. తథా చ స్మృతి :-

"పుర్యష్టకేన లిఙ్గేన ప్రాణాద్యేన స యుజ్యతే

తేన బద్ధస్య వై బన్ధో మోక్షో ముక్తస్య తేన చ."(బ్ర.పు)

ఇతి ప్రాఙ్మోక్షాద్గ్రహసంజ్ఞకేనానేన బన్ధనేనావియోగం దర్శయతి. అథర్వణే చ విషయేన్ద్రియానుక్రమణే "చక్షుశ్చ ద్రష్టవ్యం చ" ఇత్యత్ర తుల్యవద్ధస్తాదీనీన్ద్రియాణి సవిషయాణ్యనుక్రామతి - "హస్తౌ చాదాతవ్యం చోపస్థశ్చానన్దయితవ్యం చ, పాయుశ్చ విసర్జయితవ్యం చ పాదౌ చ గన్తవ్యం చ (ప్ర.ఉ.4.8) ఇతి. తథా "దశేమే పురుషే ప్రాణా ఆత్మై కాదశః, తే యదాస్మాచ్ఛరీరాన్మర్త్యాదుత్క్రామన్త్యథ రోదయన్తి"(బృ.ఉ.3.9.4) ఇత్యేకాదశానాం ప్రాణానాముత్క్రాన్తిం దర్శయతి. సర్వశబ్దోఽపి చ ప్రాణశబ్దేన సంబధ్యమానోఽశేషాన్ప్రాణానభిదధానో న ప్రకరణవశేన సప్తస్వేవావస్థాపయితుం శక్యతే, ప్రకరణాచ్ఛబ్దస్య బలీయస్త్వాత్. సర్వే బ్రాహ్మణా భోజయితవ్యా ఇత్యత్రాపి సర్వేషామేవావనివర్తినాం బ్రాహ్మణానాం గ్రహణం న్యాయ్యమ్, సర్వశబ్దసామర్థ్యాత్. సర్వభోజనాసంభవాత్తు తత్ర నిమన్త్రితమాత్రవిషయా సర్వశబ్దస్య వృత్తిరాశ్రితా. ఇహ తు న కించిత్సర్వశబ్దార్థసంకోచనే కారణమస్తి. తస్మాత్సర్వశబ్దేనాత్రాశేషాణాం ప్రాణానాం పరిగ్రహః. ప్రదర్శనార్థం చ సప్తానామనుక్రమణమిత్యనవద్యమ్. తస్మాదేకాదశైవ ప్రాణాః శబ్దతః కార్యతశ్చేతి సిద్ధమ్. 6.

బాలానందిని

ఏవమితి:-ఇట్లు ప్రాప్తించగా చెపుతున్నాము. (హస్తాదయస్తు స్థితేఽతో నైవమ్) "హస్తో వై గ్రహః" ఇత్యాదిశ్రుతులలో ఏడుకంటె అధికమైన హస్తాలు మొదలైన ఇతరప్రాణాలు కూడ తెలుస్తున్నాయి. గ్రహం అనగా బంధించేది అని అర్థం. గ్రహం అనే ఈ బంధనంచేత క్షేత్రజ్ఞుడు (జీవుడు) బంధింపబడుతాడు గాన (ఆ పేరు). ఆ

క్షేత్రజ్ఞుడు బంధింపబడేది ఒక్క శరీరంలోనే కాదు; ఇతరశరీరాలలో కూడ బంధనం తుల్యమ్. అందుచేత గ్రహం అనే పేరు గల ఈ బంధనం ఇతరశరీరాలలో కూడ సంచరిస్తూనే ఉంటుం దని అర్థం ద్వారా చెప్పినట్లయింది. అందుచేతనే "పుర్యష్టకేన...లేన చ" అను స్మృతి మోక్షానికి పూర్వం గ్రహం అనే ఈ బంధనంనుండి జీవునకు దూరంగా ఉండడం ఉండ దని చెపుతున్నది. ("జీవుడు తన ఉనికికి లింగమైన (గుర్తు అయిన) ప్రాణం మొదలైన పుర్యష్టకంతో యుక్తుడై ఉంటాడు. దానిచేత బద్ధుడైనవానికి బంధం ఉంటుంది; దానిచేత విడవబడినవానికి మోక్షం కలుగుతుంది"అని ఈ శ్లోకానికి అర్థం) (ప్రాణాదులు ఐదు, ఐదు భూతసూక్ష్మాలు, ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలు, నాలుగు విధాలైన అంతఃకరణం, అవిద్య, కామం, కర్మ ఈ ఎనిమిదింటికీ పుర్యష్టకం అని పేరు). అథర్వణోపనిషత్తులో కూడ విషయాలను ఇంద్రియాలను గూర్చి ప్రస్తావించినప్పుడు "చక్షుశ్చ ద్రష్టవ్యం చ" (చక్షురింద్రియం దాని విషయం చూడదగిన వస్తువు) అనే చోట, వాటితో సమంగా "హస్తౌ.....గన్తవ్యం చ"(హస్తాలు గ్రహింపదగినది. ఉపస్థ ఆనందించదగినది, పాయువు విసర్జింపదగినది. పాదాలు వెళ్లదగినది) అని హస్తాదీంద్రియాలు కూడ వాటి వాటి విషయాలతో పాటు ఉపక్రమించి చెప్పబడ్డాయి. అట్లే "దశ....రోదయన్తి"(రోదయన్తి అనగా అవి పైకి లేచిపోయినపుడు బంధువులను ఏడిపిస్తాయి అని అర్థం) అని పదకొండు ప్రాణాలు శరీరం విడచి లేచిపోవడాన్ని చెపుతున్నది. ప్రాణశబ్దంతో సంబంధించిన సర్వశబ్దం కూడ సమస్తప్రాణాలను నిర్దేశిస్తున్నది గాన ప్రకరణాన్ని పట్టి ఏడింటినే నిర్దేశిస్తుం దని నియమించడానికి శక్యం కాదు. ప్రకరణంకంటె శబ్దం ఎక్కువ బలం కలది కదా? "సర్వే బ్రాహ్మణా భోజయితవ్యాః" అన్నప్పుడు కూడ సర్వశబ్దసామర్థ్యంచేత భూతలంమీద ఉన్న అందరు బ్రాహ్మణులను గ్రహించడమే యుక్తం. అయితే వాళ్లందరికీ భోజనాలు పెట్టడం అసంభవం అవడంచేత అక్కడ సర్వశబ్దానికి పిలవబడినవాళ్లను మాత్రమే అని అర్థం చెప్పబడింది. ఇక్కడైతే అలా అర్థాన్ని సంకుచితం చేయడానికి కారణం ఏదీ లేదు. అందుచేత ఇక్కడ సర్వశబ్దం చేత అన్ని ప్రాణాలనూ గ్రహించాలి. వాటి స్వరూపాన్ని ప్రదర్శించడం కోసమే ఏడింటిని చెప్పకొని రావడం జరిగింది అని గ్రహించినట్లయితే దోషం లేదు. అందుచేత శబ్దాన్ని పట్టి (శ్రుతివాక్యాన్ని పట్టి) చూచినా, అవి చేయవలసిన పనులను పట్టి చూచినా మొత్తం ప్రాణాలు పదకొండే అని సిద్ధించినది. 6.

సప్తగత్యధికరణం సమాప్తం

## 3. ప్రాణాణుత్వాధికరణమ్. సూ. 7

## సూ. అణవశ్చ. 2.4.7

అధునా ప్రాణానామేవ స్వభావాన్తరమభ్యుచ్చినోతి. అణవశ్చైతే ప్రకృతాః ప్రాణాః ప్రతిపత్తవ్యాః. అణుత్వం చైషాం సౌక్ష్మ్యపరిచ్ఛేదౌ న పరమాణుతుల్యత్వమ్; కృత్స్నదేహవ్యాపికార్యానుపపత్తిప్రసంగాత్. సూక్ష్మా ఏతే ప్రాణాః, స్థూలాశ్చేత్స్యుః మరణకాలే శరీరాన్నిర్గచ్ఛన్తః బిలాదహిరివోపలభ్యేరన్మ్రియమాణస్య పార్శ్వస్థైః. పరిచ్ఛిన్నాశ్చైతే ప్రాణాః; సర్వగతాశ్చేత్స్యుః ఉత్క్రాన్తిగత్యాగతిశ్రుతివ్యాకోపః స్యాత్. తద్గుణసారత్వం చ జీవస్య న సిధ్యేత్. సర్వగతానామపి వృత్తిలాభః శరీరదేశే స్యాదితి చేత్; న. వృత్తి మాత్రస్య కరణత్వోపపత్తేః. యదేవ హ్యుపలబ్ధి సాధనం వృత్తిరన్యద్వా తస్యైవ నః కరణత్వం; సంజ్ఞామాత్రే వివాద ఇతి కరణానాం వ్యాపిత్వకల్పనా నిరర్థికా. తస్మాత్సూక్ష్మాః పరిచ్ఛిన్నాశ్చ ప్రాణా ఇత్యధ్యవస్యామః. 7.

బాలానందిని

**అణవ ఇతి**:-"అణవశ్చ=ప్రాణాలు అణువులు కూడ" అని సూత్రార్థం.

**అధునేతి** :- ఇప్పుడు ప్రాణాలకే సంబంధించిన మరొక స్వభావాన్ని కూడ చెపుతున్నాడు. ప్రకృతములైన ఈ ప్రాణాలు అణువు లని కూడ గ్రహించాలి. వీటి అణుత్వం అనగా సూక్ష్మత్వము (బాహ్యేంద్రియాలకు కనబడకపోవడం) పరిచ్ఛేదమూ (సర్వవ్యాపులుగా కాక అల్పప్రమాణంలో ఉండడము) మాత్రమే కాని పరమాణువుల వలె ఉండడం కాదు. అవి పరమాణుతుల్యా లైతే సమస్త దేహంలో వ్యాపించే కార్యం అనుపపన్నం అవుతుంది. ఈ ప్రాణాలు సూక్ష్మమైనవి. స్థూలము లైతే మరణకాలంలో శరీరంనుండి అవి బైటకు వెళ్లిపోతూన్నప్పుడు, బిలంనుండి పైకి వస్తూన్న సర్పాలను వలె వాటిని, మరణిస్తూన్న వాని ప్రక్కన ఉన్న వాళ్లు చూడకలిగి ఉండేవారు. ఇవి పరిచ్ఛిన్న మైన ప్రమాణం కలవి కూడ. అవి సర్వగతాలైతే "ప్రాణాలు శరీరంనుండి పైకి

లేచిపోతాయి. మరొక చోటికి వెడతాయి, తిరిగి వస్తాయి" అని చెప్పే శ్రుతులకు వ్యాకోపం (విరుద్ధార్థత్వం) కలుగుతుంది. జీవునకు తద్గుణసారత్వం (ఆత్మ బుద్ధ్యాద్యుపాధాలను పట్టి అల్పపరిమాణాదికం కలది వలె అవడం మొదలైనది) కూడ సిద్ధించదు. (ప్రశ్న) ప్రాణాలు సర్వగతాలని చెప్పినా కూడ వాటి (వృత్తి) పని మాత్రం శరీరప్రదేశంలోనే కలుగుతుం దని చెప్పవచ్చును కదా అన్నట్లయితే అది యుక్తం కాదు. వృత్తిమాత్రమే కరణం అని చెప్పవచ్చును కదా? ప్రాణాదుల వృత్తి అన్నా, మరొకటి అన్నా ఏది ఉపలబ్ధికి (ఆయా విషయాల జ్ఞానానికి పనులు కనబడడానికి) సాధనమో అదే మాకు కరణం. కేవలం పేరులో మాత్రమే వివాదం. అందుచేత కరణాలు (ప్రాణాదులు) సర్వవ్యాపకములు అని కల్పించడం వ్యర్థం. అందువల్ల ప్రాణాలు సూక్ష్మములు. పరిచ్ఛిన్నములు అని నిశ్చయిస్తున్నాము. 7

ప్రాణాణుత్వాధికరణం సమాప్తం

### 4. ప్రాణశ్రైష్ఠ్యాధికరణమ్. సూ. 8

### సూ. శ్రేష్ఠశ్చ. 2.4.8.

ముఖ్యశ్చ ప్రాణః ఇతరప్రాణవద్బ్రహ్మవికార ఇత్యతిదిశతి. తచ్చావిశేషేణైవ సర్వప్రాణానాం బ్రహ్మవికారత్వమాఖ్యాతమ్. "ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేన్ద్రియాణి చ" (ము.ఉ.2.1.3) ఇతి సేన్ద్రియమనోవ్యతిరేకేణ ప్రాణస్యోత్పత్తి శ్రవణాత్. "స ప్రాణమసృజత" (ప్ర.ఉ. 6.4) ఇత్యాదిశ్రవణేభ్యశ్చ. కిమర్థః పునరతిదేశః? అధికాశఙ్కాపాకరణార్థః. నాసదాసీయే హి బ్రహ్మప్రధానే సూక్తే మన్త్రవర్ణో భవతి "న మృత్యురాసీదమృతం నో తర్హి న రాత్ర్యా అహ్న ఆసీత్ప్రకేతః. ఆనీదవాతం స్వధయా తదేకం తస్మాద్ధాన్యన్న పరః కించనాస" (ఋ.సం. 8.7.17) ఇతి. ఆనీదితి ప్రాణకర్మోపాదానాత్ ప్రాగుత్పత్తేః సన్తమివ ప్రాణం సూచయతి. తస్మాదజః ప్రాణ ఇతి జాయతే కస్య చిన్మతిః. తామతిదేశేనాప నుదతి. ఆనీచ్ఛబ్దోఽపి న ప్రాగుత్పత్తేః ప్రాణసద్భావం సూచయతి. అవాతమితి విశేషణాత్. "అప్రాణో హ్యమనాః శుభ్రః" ఇతి చ మూలప్రకృతేః

ప్రాణాదిసమస్తవిశేషరహితత్వస్య దర్శితత్వాత్. తస్మాత్కారణసద్భావప్రదర్శనార్థ ఏవ అయమానీచ్ఛబ్ద ఇతి. శ్రేష్ఠ ఇతి చ ముఖ్యం ప్రాణమభిదధాతి- "ప్రాణో వావ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ" (ఛా.ఉ.5.1.1) ఇతి శ్రుతినిర్దేశాత్. జ్యేష్ఠశ్చ ప్రాణః శుక్రనిషేకకాలాదారభ్య తస్య వృత్తిలాభాత్. న చేత్తస్య తదానీం వృత్తిలాభః స్యాద్యోనౌ నిషిక్తం శుక్రం పూయేత న సంభవేద్వా. శ్రోత్రాదీనాం తు కర్ణశష్కుల్యాదిస్థానవిభాగనిష్పత్తౌ వృత్తిలాభాన్న జ్యేష్ఠత్వమ్. శ్రేష్ఠశ్చ ప్రాణో గుణాధిక్యాత్; "న వై శక్ష్యామస్త్వదృతే జీవితుమ్" (బృ.ఉ.6.1.13) ఇతి శ్రుతేః. 8

బాలానందిని

శ్రేష్ఠ ఇతి :- "శ్రేష్ఠశ్చ=శ్రేష్ఠమైన ప్రాణం కూడ పుడుతుంది" అని సూత్రార్థం.

ముఖ్య ఇతి:- ముఖ్యప్రాణం కూడ ఇతరప్రాణాల వలెనే బ్రహ్మవికారం అని అతిదేశిస్తున్నాడు. (ప్రశ్న). "ఏతస్మాజ్జాయతే....ఇన్ద్రియాణి చ" అని, "స ప్రాణమసృజత" ఇత్యాదివాక్యాలచేత కూడ ఇంద్రియాలతో కూడిన మనస్సుకే కాకుండా ప్రాణానికి కూడ ఉత్పత్తి వినబడుతున్నది గాన భేదం ఏదీ లేకుండా సర్వప్రాణాలు బ్రహ్మవికారాలే అని చెప్పబడింది. ఇంక ఈ అతిదేశం ఎందుకు?(సమాధానం)-అధికమైన శంకను తొలగించడం కోసం. ప్రధానంగా బ్రహ్మను గూర్చి చెప్పే నాసదాసీయసూక్తంలో "న మృత్యుః...ఆస" అని ఒక మంత్రం ఉంది. (ఆ ప్రలయకాలంలో మృత్యువు అనగా మృత్యువు గల కార్యం లేదు. అమృతం లేదు. రాత్రికి చిహ్నమైన చంద్రుడు, పగటికి చిహ్న మైన సూర్యుడు లేడు. వాయువు కూడ లేకుండా స్వధతో (మాయతో) కూడ ఆ బ్రహ్మమాత్రమే ఉంది. అది తప్ప మరేమీ లేదు అని ఆ మంత్రానికి అర్థం). ఇక్కడ 'ఆనీత్' అని ప్రాణకర్మను అనగా చేష్టను నిర్దేశించడంచేత (ఆనీత్ అనగా చేష్ట చేసినది అని కూడ అర్థం) ఉత్పత్తికి (సృష్టికి)పూర్వం ప్రాణం ఉన్నదా అన్నట్లు సూచిస్తున్నది. అందువల్ల ప్రాణం అజం (పుట్టుకలేనిది) అని ఎవనికైన అభిప్రాయం కలగవచ్చును. దానిని అతిదేశంచేత తొలగిస్తున్నాడు. 'ఆనీత్' అనే శబ్దం కూడ ఉత్పత్తికి పూర్వం ప్రాణం ఉన్నట్లు సూచించడం లేదు. ఎందువల్ల ననగా 'అవాతమ్' (వాయువు లేని) అని విశేషణం ప్రయోగించబడింది. "అప్రాణో హ్యమనాః శుభ్రః" అని మూలప్రకృతిలో బ్రహ్మలో

ప్రాణాదివిశేషా లేవీ లేవని చూపబడింది. అందువల్ల 'అసీత్' అనే శబ్దం కారణమైన బ్రహ్మమాత్రం ఉంది అనే అర్థాన్ని మాత్రమే బోధిస్తుంది. శ్రేష్ఠః అని ముఖ్యమైన ప్రాణాన్ని నిర్దేశిస్తున్నాడు. "ప్రాణో వావ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ" అని శ్రుతిలో ప్రాణం శ్రేష్ఠ మని (జ్యేష్ఠ మనీ)నిర్దేశించబడింది. శుక్రనిషేకం జరిగిన సమయంనుండీ కూడ ప్రాణవృత్తి ఉండడంవల్ల ప్రాణం జ్యేష్ఠం కూడ. అప్పుడు ప్రాణవృత్తి లేకపోతే యోనిలో నిషిక్తమైన శుక్రం కుళ్లి పోవాలి లేదా పుట్టకుండా పోవాలి. శ్రోత్రాదిప్రాణాల వృత్తి యైతే కర్ణశష్కులి మొదలైన స్థానవిభాగం ఏర్పడిన తరవాతనే కలుగుతుంది. గాన అవి జ్యేష్ఠములు కావు. "న వై....జీవితుమ్"(నీవు లేకుండా మేం(ఇతరప్రాణాలు)జీవించజాలం) అని శ్రుతి ననుసరించి ఎక్కువ గుణా లుండడంవల్ల ప్రాణం శ్రేష్ఠం కూడ. 8.

ప్రాణశ్రైష్ఠ్యాధికరణం సమాప్తం

## 5. వాయుక్రియాధికరణమ్. సూ. 9-12.

### సూ. న వాయుక్రియే పృథగుపదేశాత్. 2.4.9.

స పునర్ముఖ్యః ప్రాణః కింరూప ఇతీదానీం జిజ్ఞాస్యతే. తత్ర ప్రాప్తం తావచ్ఛ్రుతేః వాయుః ప్రాణ ఇతి. ఏవం హి శ్రూయతే-"యః ప్రాణః స వాయుః స ఏష వాయుః పఞ్చవిధః ప్రాణోఽపానో వ్యాన ఉదానః సమానః" (ఐ. అర. 2.3.3) ఇతి. అథవా తన్త్రాన్తరీయాభిప్రాయాత్సమస్తకరణవృత్తిః ప్రాణ ఇతి ప్రాప్తమ్. ఏవం హి తన్త్రాన్తరీయా ఆచక్షతే-"సామాన్యాకరణవృత్తిః ప్రాణాద్యా వాయవః పఞ్చ" (సాం. కా. 29) ఇతి. అత్రోచ్యతే-న వాయుః ప్రాణో నాపి కరణవ్యాపారః. కుతః? పృథగుపదేశాత్. వాయోస్తావత్ప్రాణస్య పృథగుపదేశో భవతి-"ప్రాణ ఏవ బ్రహ్మణశ్చతుర్థః పాదః స వాయునా జ్యోతిషా భాతి చ తపతి చ" (ఛా.ఉ.3.1.8.4) ఇతి. న హి వాయురేవ సన్ వాయోః పృథగుపదిశ్యతే. తథా కరణవృత్తేరపి పృథగుపదేశో భవతి. వాగాదీని కరణాన్యుపక్రమ్య తత్ర తత్ర ప్రాణస్యానుక్రమణాత్. వృత్తివృత్తిమతోశ్చాభేదాత్. న హి కరణ వ్యాపార ఏవ సన్ కరణేభ్యః పృథగుపదిశ్యతే. తథా "ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః

సర్వేన్ద్రియాణి చ. ఖం వాయుః" (ము.ఉ.2-1.3) ఇత్యేవమాదయోఽపి వాయోః కరణేభ్యశ్చ ప్రాణస్య పృథగుపదేశా అనుసర్తవ్యాః. న చ సమస్తానాం కరణానామేకా వృత్తిః సంభవతి, ప్రత్యేకమేకైకవృత్తిత్వాత్. సముదాయస్య చాకారకత్వాత్.

బాలానందిని

నేతి:-"పృథక్=వేరువేరుగా, ఉపదేశాత్=ఉపదేశించడంవల్ల, వాయుక్రియే =వాయువు కాని క్రియ గాని ముఖ్యప్రాణం కాదు"" అని సూత్రార్థం.

స పునరితి :- ఆ ముఖ్యప్రాణం ఏ విధమైన స్వరూపం గలది అనే విషయం ఇప్పుడు తెలిసికొన కోరబడుచున్నది. "యః ప్రాణ....సమానః" (ప్రాణమనేది వాయువే. ఆ వాయువు ప్రాణం అపానం, వ్యానం, ఉదానం, సమానం అని ఐదు విధాలు) అని శ్రుతిలో వినబడుచున్నది గాన ప్రాణం వాయువు అని ప్రాప్తించినది. లేదా శాస్త్రాంతరం యొక్క అభిప్రాయాన్ని అనుసరించి సమస్తమైన ఇంద్రియాల వృత్తియే ప్రాణం అని ప్రాప్తించింది. సాంఖ్యమతానికి సంబంధించినవారు "సామాన్య....వఞ్చ"(కరణాల (మనోబుద్ధ్యహంకారాల) సామాన్యమైన వృత్తియైన ప్రాణాదివాయువులు ఐదు)అని చెప్పుచున్నారు. ఈ విషయంలో చెప్పబడుచున్నది- ప్రాణం వాయువూ కాదు, కరణాల వ్యాపారమూ కాదు. ఎందువలన? వేరుగా ఉపదేశించడంవలన. వాయువుకంటె భిన్నంగా-"ప్రాణ....తపతి చ" అని ప్రాణం చెప్పబడుచున్నది.

వి. మనోరూపబ్రహ్మకు వాక్కు, ప్రాణం, చక్షుస్సు, శ్రోత్రములు అనేవి నాలుగు పాదా లని వాటిలో ప్రాణం ఆధిదైవికమైన వాయువుచేత అభివ్యంజింపచేయబడి ప్రకాశిస్తుందని శ్రుతిలో చెప్పబడింది.

న హీతి :- వాయువే అయి ఉన్నది వాయువుకంటె వేరుగా చెప్పబడదు కదా?అట్లే కరణాల వృత్తికంటె కూడ వేరుగా (ప్రాణం) చెప్పబడింది. వాగాదికరణాలను గూర్చి చెప్పడం ప్రారంభించి అక్కడక్కడ వేరుగా ప్రాణం కూడ చెప్పబడింది. వృత్తికీ, వృత్తిమత్తుకూ భేదం ఉండదు గాన కరణాల వ్యాపారమే కరణాలకంటె వేరుగా చెప్పబడదు కదా? అట్లే "ఏతస్మాత్...వాయుః." ఈ మొదలైనవి కూడ వాయువుకంటె

కరణాలకంటె వేరుగా ప్రాణాన్ని చెప్పిన వాక్యాలుగా గ్రహించాలి. మరొక విషయ మేమనగా అన్ని కరణాలకీ ఒకే వృత్తి ఉండదు, ఎందువల్ల ననగా ఒక్కొక్క కరణానికి ఒక్కొక్క వృత్తి ఉంటుంది; కరణాల సముదాయం కారకం(కరణం)కాదు.

భాష్యమ్

నను పఞ్జరచాలనన్యాయేనైతద్భవిష్యతి. యథైకపఞ్జకవర్తిన ఏకాదశ పక్షిణః ప్రత్యేకం ప్రతినియతవ్యాపారాః సన్తః సంభూయైకం పఞ్జరం చాలయన్తి, ఏవమేకశరీరవర్తిన ఏకాదశ ప్రాణాః ప్రత్యేకం ప్రతినియతవృత్తయః సన్తః సంభూయైకాం ప్రాణాఖ్యాం వృత్తిం ప్రతిలప్స్యన్త ఇతి. నేత్యుచ్యతే. యుక్తం తత్ర పత్యేకవృత్తిభిరవాన్తరవ్యాపారైః పఞ్జరచాలనరూపైరేవోపేతాః పక్షిణః సంభూయైకం పఞ్జరం చాలయేయురితి; తథా దృష్టత్వాత్. ఇహ తు శ్రవణాద్య వాన్తరవ్యాపారోపేతాః ప్రాణా న సంభూయ ప్రాణ్యురితి యుక్తమ్, ప్రమాణా భావాత్. అత్యన్తవిజాతీయత్వాచ్చ శ్రవణాదిభ్యః ప్రాణనస్య. తథా ప్రాణస్య శ్రేష్ఠత్వాద్యుద్ఘోషణం గుణభావోపగమశ్చ తం ప్రతి వాగాదీనాం, న కరణవృత్తి మాత్రే ప్రాణేఽవ కల్పతే. తస్మాదన్యో వాయుక్రియాభ్యాం ప్రాణః. కథం తర్హీయం శ్రుతిః-"యః ప్రాణః స వాయుః" ఇతి. ఉచ్యతే-వాయురేవాయ మధ్యాత్మమాపన్నః పఞ్చవ్యూహవిశేషాత్మనావతిష్ఠమానః ప్రాణో నామ భణ్యతే, న తత్త్వాన్తరం నాపి వాయుమాత్రమ్. అతశ్చోభే అపి భేదాభేదశ్రుతీ న విరుధ్యేతే. 9

బాలానందిని

నన్వితి:- (ప్రశ్న) ఇది పంజరచాలనన్యాయంచేత జరుగుతుంది. ఒక పంజరంలో ఉన్న పదకొండు పక్షులు, ప్రతి ఒక్కటీ తన పని చేస్తూ, కలిసి ఏ విధంగా పంజరాన్ని కదుపుతాయో ఇట్లే ఒక శరీరంలో ఉన్న పదకొండు ప్రాణాలు, ప్రతిఒక్కటీ తన తన పని చేస్తూ, కలిసి ప్రాణం అనే ఒక వృత్తిని పొందుతాయి. (సమాధానం) అట్లు కాదని అంటాం. అక్కడ పంజరం కదపడానికి అనుకూలమైన, ఒక్కొక్క పక్షిలో ఉన్న అవాంతర వ్యాపారాలతో

కూడిన పక్షులు కలిసి ఒక పంజరాన్ని కదుపుతున్నాయంటే అది ప్రత్యక్షంగా కనబడుతూన్నది గాన యుక్తమే. ఇక్కడైతే శ్రవణం మొదలైన అవాంతరవ్యాపారా లున్న ప్రాణా లన్నీ కలిసి ప్రాణిస్తాయి(చేష్టచేస్తాయి) అని చెప్పడానికి తగిన ప్రమాణం లేదు గాన అలా చెప్పడం యుక్తం కాదు. ప్రాణనం అనేది శ్రవణాదులకంటె చాల విలక్షణమైనది కూడ. మరొక విషయ మేమనగా-ప్రాణం కరణాల వృత్తి మాత్రమే అయితే ప్రాణం అన్నింటికంటె శ్రేష్ఠం అని ఉద్ఘోషించడం, దానికి వాగాదులు గుణభావాన్ని (అప్రధానత్వాన్ని చెందడం) కుదరవు. అందువల్ల ప్రాణం వాయుక్రియలకంటె భిన్న మైనది. అయితే మరి "యః ప్రాణః స వాయుః" అనే ఈ శ్రుతి ఎలా కుదురుతుంది? (సమాధానం)చెప్పబడుచున్నది- వాయువే శరీరంలో ప్రవేశించి ఐదు వ్యూహాలుగా ఏర్పడి విశేషరూపంలో ఉంటూ ప్రాణం అని చెప్పబడుతున్నది; అందుచేత ఇది మరొక తత్త్వము కాదు, వాయుమాత్రమూ కాదు. అందువల్ల భేదాభేదశ్రుతులు రెండూ కూడ విరుద్ధములు కావు. 9

## భాష్యమ్

స్యాదేతత్- ప్రాణోఽపి తర్హి జీవవదస్మిన్ శరీరే స్వాతంత్ర్యం ప్రాప్నోతి; శ్రేష్ఠత్వాద్గుణభావోపగమాచ్చ తం ప్రతి వాగాదీనామిన్ద్రియాణామ్. తథా హ్యనేకవిధా విభూతిః ప్రాణస్య శ్రావ్యతే-"సుప్తేషు వాగాదిషు ప్రాణ ఇతరాన్ ప్రాణాన్ రక్షతి మాతేవ పుత్రాన్" ఇతి. తస్మాత్ప్రాణస్యాపి జీవవత్ స్వాతన్త్ర్యప్రసఙ్గః. తం పరిహరతి:-

### సూ. చక్షురాదివత్తు తత్సహశిష్ట్యాదిభ్యః. 2.4.10

తుశబ్దః ప్రాణస్య జీవవత్స్వాతన్త్ర్యం వ్యావర్తయతి. యథా చక్షురాదీని, రాజప్రకృతివజ్జీవస్య కర్తృత్వం భోక్తృత్వం చ ప్రత్యుపకరణాని, న స్వతన్త్రాణి, తథా ముఖ్యోఽపి ప్రాణో రాజమన్త్రివత్ జీవస్య సర్వార్థకరత్వేనోపకరణభూతో న స్వతన్త్రః కుతః. తత్సహశిష్ట్యాదిభ్యః. తైశ్చక్షురాదిభిః సహైవ ప్రాణః శిష్యతే ప్రాణసంవాదాదిషు. సమానధర్మాణాం చ సహశాసనం యుక్తం బృహద్రథన్త రాదివత్. ఆదిశబ్దేన సంహతత్వాచేతనత్వాదీన్ ప్రాణస్య స్వాతన్త్ర్యనిరాకరణ

హేతూన్ దర్శయతి. 10.

బాలానందిని

స్యాదేతదితి :-అది అలా ఉండనీ (ఇలా చెప్పవలసి ఉంటుందేమో) అట్లయితే ప్రాణం శ్రేష్ఠం అవడంచేత, దానిని గూర్చి వాగాదీంద్రియాలు అప్రధానత్వాన్ని పొందడంచేత ఇది కూడ జీవుని వలె శరీరంలో స్వాతంత్ర్యాన్ని పొందుతుంది. అంతే కాకుండా "సుప్తేషు....పుత్రాన్"(వాగాదులు నిద్రపోతున్నప్పుడు ఒక్క ప్రాణమే మేల్కొని ఉంటుది. మృత్యువు దరి చేరనిది ప్రాణం ఒక్కటే. ప్రాణం సంవర్గం, ఎందువల్ల ననగా వాగాదులను ఉపసంహరిస్తుంది. ప్రాణం తల్లి పిల్లలను రక్షించి నట్లు ఇతరప్రాణాలను రక్షిస్తుంది) అని ప్రాణానికి ఉన్న విభూతి (మాహాత్మ్యం)అనేకవిధాలుగా వినబడుతున్నది. అందువల్ల ప్రాణానికి కూడ జీవునకు వలె స్వాతంత్ర్యం ఉండే ప్రసంగం ఏర్పడుతుంది. దీనిని పరిహరిస్తున్నాడు-

చక్షురాదీతి :-"చక్షురాదివత్తు=ప్రాణం కూడ చక్షురాదుల వలెనే, తత్సహశిష్ట్యాదిభ్యః=వాటితో కలిపి బోధించడం మొదలైన హేతువులవల్ల" అని సూత్రార్థం.

తుశబ్ద ఇతి :- తుశబ్దం ప్రాణానికి జీవునకు వలె స్వాతంత్ర్యాన్ని నిరాకరిస్తుంది. రాజప్రకృతులవలె, అనగా అమాత్యాదిప్రకృతులు రాజుకు సహాయపడి నట్లు, చక్షురాదులు జీవుని కర్తృత్వాన్ని భోక్తృత్వాన్నీ గూర్చి ఉపకారకములుగానే ఏ విధంగా ఉంటాయో స్వతంత్రంగా ఉండవో, ముఖ్యప్రాణం కూడ, అట్లే, రాజుకు ప్రధానుడైన మంత్రి వలె జీవునకు కావలసిన అన్ని ప్రయోజనాలను చేకూరుస్తూ ఉపకరణంగా మాత్రమే ఉంటుంది కాని స్వతంత్రం కాదు. ఎందువల్ల? తత్సహశిష్ట్యాదులవల్ల. ప్రాణసంవాదాదులలో (ప్రాణాలన్నీ కలసి తమలో తాము సంవాదం చేసుకొన్నాయి అని చెప్పే ఘట్టం మొదలైనవాటిలో) ప్రాణం చక్షురాదులతో కూడానే చెప్పబడుచున్నది. బృహద్రథన్తరాదులవిషయంలో వలె సమానధర్మమైనవాటినే కలిపి చెప్పడం యుక్తం. (బృహత్సామ, రథంతరసామ అనే రెండు సామలు ఎల్లప్పుడు కలిపే (ఒకదాని తరవాత ఒకటి) గానం చేస్తారు. అందుచేత, లేదా రెండూ సామలే అవడంచేత, వాటిని రెండింటినీ కలిపే పేర్కొనడం జరుగుతుంది. అట్లే ముఖ్యప్రాణం ఇతరప్రాణాలతో సమానధర్మం కాబట్టి వాటితో కలిపి చెప్పబడుచున్నది అని అర్థం). సూత్రంలోని ఆదిశబ్దంచేత

సంహతత్వం (అవయవాల కలయికచేత ఏర్పడడం),అచేతనత్వం మొదలైన, ప్రాణం స్వతంత్రం కాదు అని చెప్పడానికి తగిన, హేతువులను చూపుతున్నాడు. 10

భాష్యమ్

స్యాదేతత్-యది చక్షురాదివత్ప్రాణస్యాపి జీవం ప్రతి కరణభావోఽభ్యుపగమ్యేత, విషయాన్తరం రూపాదివత్ప్రసజ్యేత. రూపాద్యాలోచనాదిభిర్వృత్తిభిః (హి)యథాస్వం చక్షురాదీనాం జీవం ప్రతి కరణభావో భవతి. అపి చైకాదశైవ కార్యజాతాని రూపాలోచనాదీని పరిగణితాని యదర్థమేకాదశ ప్రాణాః సంగృహీతాః న తు ద్వాదశమపరం కార్యజాతమధిగమ్యతే యదర్థమయం ద్వాదశః ప్రాణః ప్రతిజ్ఞాయేతేతి. అత ఉత్తరం పఠతి-

సూ.అకరణత్వాచ్చ న దోషస్తథా హి దర్శయతి. 2.4.11

న తావద్విషయాన్తరప్రసఙ్గో దోషః, అకరణత్వాత్ ప్రాణస్య. న చక్షురాదివత్ ప్రాణస్య విషయపరిచ్ఛేదేన కరణత్వమభ్యుపగమ్యతే. న చాస్యైతావతా కార్యాభావ ఏవ. కస్మాత్? తథాహి శ్రుతిః ప్రాణాన్తరేష్వసంభావ్యమానం ముఖ్యప్రాణస్య వైశేషికం కార్యం దర్శయతి. ప్రాణసంవాదాదిషు-"అథ హ ప్రాణా అహంశ్రేయసి వ్యూదిరే" ఇత్యుపక్రమ్య "యస్మిన్వ ఉత్క్రాన్త ఇదం శరీరం పాపిష్ఠతరమివ దృశ్యతే స వః శ్రేష్ఠః" (ఛా.ఉ.5.16.7)ఇతి చోపన్యస్య ప్రత్యేకం వాగాద్యుత్క్రమణేన తద్వృత్తిమాత్రవిహీనం యథాపూర్వం జీవనం దర్శయిత్వా ప్రాణోచ్చిక్రమిషాయాం వాగాదిశైథిల్యాపత్తిం శరీరపాతప్రసంగం చ దర్శయన్తీ శ్రుతిః ప్రాణనిమిత్తాం శరీరేన్ద్రియస్థితిం దర్శయతి. "తాన్వరిష్ఠః ప్రాణ ఉవాచ మా మోహమాపద్యథాహమేవైతత్పఞ్చధాత్మానం ప్రవిభజ్యైతద్బాణమవష్టభ్య విధారయామి"(ప్ర.ఉ.2.3)ఇతి చ ఏతమేవార్థం శ్రుతిరాహ. "ప్రాణేన రక్షన్నవరం కులాయమ్"(బృ.ఉ.4.3.12)ఇతి చ సుప్తేషు చక్షురాదిషు ప్రాణనిమిత్తాం శరీరరక్షాం దర్శయతి. "యస్మాత్కస్మాచ్చాఙ్గాత్ప్రాణ ఉత్క్రామతి తదేవ తచ్ఛుష్యతి"

(బృ.ఉ.1.3.19)ఇతి. "తేన యదశ్నాతి యత్పిబతి తేనేతరాన్ ప్రాణానవతి" ఇతి చ ప్రాణనిమిత్తాం శరీరేన్ద్రియపుష్టిం దర్శయతి. "కస్మిన్నహముత్క్రాన్తే ఉత్క్రాన్తో భవిష్యామి కస్మిన్వా ప్రతిష్ఠితే ప్రతిష్ఠాస్యామి" ఇతి, "స ప్రాణమసృజత "(ప్ర.ఉ.6.3.4) ఇతి చ ప్రాణనిమిత్తే జీవస్యోత్క్రాన్తి ప్రతిష్ఠే దర్శయతి.11

బాలానందిని

స్యాదేతదితి :- (ఇది సరే) ఈ ఆశంక కలగవచ్చును-చక్షురాదుల వలె ప్రాణం కూడ జీవునకు కరణమే అని అంగీకరిస్తే అప్పుడు (దీనికి కూడ) రూపాదుల వంటి మరొక విషయం (గోచరమైనది)ప్రసక్తం అవుతుంది. చక్షురాదులు వాటి వాటికి ఉన్న రూపాదులను చూడడం మొదలైన వ్యాపారాలచేత జీవునికి కరణాలుగా ఉంటున్నాయి కదా? (అందుచేత శ్రేష్ఠప్రాణం కూడ జీవునకు ఒక కరణం అని చెప్పినట్లయితే దీనిచేత మాత్రమే గ్రహింపబడే విషయం ఏదైనా చూపవలసి ఉంటుంది). మరొక విషయమేమనగా- రూపం చూడడం మొదలైన పదకొండు కార్యసముదాయాలే లెక్కింపబడ్డాయి; వాటి కోసం పదకొండు ప్రాణాలు చెప్పబడ్డాయి. అంతకు మించి దేనికోసమై ఈ పన్నెండవ ప్రాణం చెప్పబడుతుందో అలాంటి పన్నెండవ కార్యసముదాయం ఏదీ కనబడడం లేదు. ఇందుకు సమాధానం పఠిస్తున్నాడు-

అకరణత్వాదితి:- "అకరణత్వాత్=ప్రాణం కరణం కాదు గాన, దోషః=దోషం, న=లేదు. తథా=అట్లు, దర్శయతి హి=శ్రుతి చూపుచున్నది కదా" అని సూత్రార్థం.

నేతి:-మరొక విషయం ఉండవలసివస్తుంది అనే దోషం లేదు. ఎందువల్ల ననగా ప్రాణం కరణం కాదు. ఏదో విషయాన్ని గ్రహించడాన్ని పట్టి చక్షురాదులకు కరణత్వం చెప్పినట్లు ప్రాణానికి ఏదో ఒక విషయాన్ని గ్రహించడాన్ని పట్టి కరణత్వం అంగీకరించబడలేదు. అంతమాత్రంచేత దీనికి కార్యం ఏదీ లేకపోవడం అనేది లేదు. ఎందువల్ల? ఎందువల్ల ననగా ప్రాణసంవాదం మొదలైన ఘట్టాలలో శ్రుతి, ఇతర ప్రాణాలలో ఊహించడానికి శక్యం కాని ఒక విశిష్టమైన కార్యం ముఖ్యప్రాణానికి ఉన్నట్లు చూపుతున్నది. "అథ......వ్యూదిరే" (ప్రాణా లన్నీ తమ తమ గొప్పతనాన్ని గూర్చి మాట్లాడినవి)అని ఉపక్రమించి, "యస్మిన్... శ్రేష్ఠః" (ఏ ప్రాణం లేచిపోతే ఈ శరీరం

పూర్తిగా చెడిపోయిన ట్లవుతుందో అది శ్రేష్ఠ మైనది)అని చెప్పి, వాగాదులు ఒక్కొక్కటి చొప్పున శరీరం విడచి వెళ్లిపోగా అలా వెళ్లిపోయినదాని వృత్తి మాత్రం లేకుండా (శరీరం) వెనుకటి వలెనే (మామూలుగా)జీవించి ఉన్నట్లు చూపి, శ్రేష్ఠప్రాణం లేచిపోదా మని అనుకొంటూండగానే వాగాదులు శిథిలములై పోయినట్లు, శరీరం పడిపోవడానికి సిద్ధమైనట్లు చూపుచు శ్రుతి శరీరేంద్రియాల స్థితి ప్రాణంమీద అధారపడి ఉన్నట్లు తెలుపుచున్నది. "తాన్....విధారయామి" అనే శ్రుతి కూడ ఈ విషయాన్నే చెపుతున్నది. "ప్రాణేన రక్షన్ అవరం కులాయమ్" (ప్రాణంచేత నీచమైన ఈ గూడును (దేహాన్ని) రక్షిస్తూ జీవుడు నిద్రపోతూన్నాడు) అని కూడ శ్రుతి చక్షురాదులు నిద్రిస్తూన్నప్పుడు ప్రాణంచేత శరీరరక్ష జరుగుతూన్న దని చూపుచున్నది. "యస్మాత్ ....శుష్యతి" (ఏ అవయవంనుండి యైనా ప్రాణం లేచిపోతే వెంటనే ఆ అవయవం ఎండిపోతుంది)అని, "తేన...అవతి" (జీవుడు ఆ ప్రాణంచేత ఏదితింటున్నాడో, ఏది త్రాగుతున్నాడో దానిచేత ఇతరప్రాణాలను రక్షిస్తున్నాడు) అనీ శరీరేంద్రియపుష్టి ప్రాణంవల్లనే కలుగుతుంది అనీ చూపుచున్నది. "కస్మిన్...ప్రతిష్ఠాస్యామి" అని, "స ప్రాణమసృజత" అనీ జీవుని ఉత్క్రాంతి (శరీరం విడచివెళ్లిపోవడం)గాని, ప్రతిష్ఠ గాని ప్రాణంవల్లనే జరుగుతా యని చెపుతూన్నది. 11

సూ. పఞ్చవృత్తిర్మనోవద్వ్యపదిశ్యతే. 2.4.12

ఇతశ్చాస్తి ముఖ్యస్య ప్రాణస్య వైశేషికం కార్యమ్, యత్కారణం పఞ్చవృత్తిరయం వ్యపదిశ్యతే శ్రుతిషు "ప్రాణోఽపానో వ్యాన ఉదానః సమానః"(బృ.ఉ.1.5.3) ఇతి. వృత్తిభేదశ్చాయం కార్యభేదాపేక్షః. ప్రాణః ప్రాగ్వృత్తిరుచ్ఛ్వాసాదికర్మా. అపానోఽర్వాగ్వృత్తిర్నిఃశ్వాసకర్మా. వ్యానస్తయోః సంధౌ వర్తమానో వీర్యవత్కర్మహేతుః. ఉదాన ఊర్ధ్వవృత్తిరుత్క్రాన్త్యాది హేతుః. సమానః సర్వేష్వఙ్గేషు యోఽన్నరసాన్నయతీతి. ఏవం పఞ్చవృత్తిః ప్రాణో మనోవత్. యథా మనసః పఞ్చవృత్తయ ఏవం ప్రాణస్యాపీత్యర్థః. శ్రోత్రాదినిమిత్తాః శబ్దాదివిషయాః మనసః పఞ్చ వృత్తయః ప్రసిద్ధాః. న తు కామః సంకల్ప ఇత్యాద్యాః పరిపఠితాః పరిగృహ్యేరన్, పఞ్చసంఖ్యాతిరేకాత్. నన్వత్రాపి శ్రోత్రాదినిరపేక్షా భూతభవిష్యదాదివిషయా మనసో వృత్తిరస్తీతి సమానః

పఞ్చసంఖ్యాతిరేకః? ఏవం తర్హి "పరమతమప్రతిషిద్ధమనుమతం భవతి" ఇతి న్యాయాదిహాపి యోగశాస్త్రప్రసిద్ధా మనసః పఞ్చ వృత్తయః పరిగృహ్యన్తే "ప్రమాణవిపర్యయవికల్పనిద్రాస్మృతయః" (పాత.యో.సూ.1.1.6) నామ. బహువృత్తిత్వమాత్రేణ వా మనః ప్రాణస్య నిదర్శనమితి ద్రష్టవ్యమ్. జీవోపకరణత్వమపి ప్రాణస్య పఞ్చవృత్తిత్వాన్మనోవదితి యోజయితవ్యమ్. 12.

బాలానందిని

పఞ్చేతి:- "మనోవత్=మనస్సువలె. పఞ్చవృత్తిః=ఐదు ప్రవృత్తులు కలదిగా వ్యపదిశ్యతే=చెప్పబడుచున్నది" అని సూత్రార్థం.

ఇతశ్చేతి :- ఈ కారణంవల్ల కూడ ముఖ్యప్రాణానికి ఒక ప్రత్యేకమైన కార్యం ఉంది, ఎందువల్ల ననగా దీనికి ఐదు వృత్తు లున్నట్లుగా "ప్రాణో......సమానః" అను శ్రుతిలో చెప్పబడింది. కార్యభేదాన్ని పట్టి ఈ వృత్తిభేదం. నాసికనుండి బైటకు వెళ్లే వృత్తిగలది, ఉచ్ఛ్వాసం మొదలైనది చేసేది ప్రాణం. లోపలికి వెళ్లేది, నిఃశ్వాసం మొదలైన కర్మలు కలది అపానం. వాటి మధ్య ఉంటూ బలంతో కూడిన పనులు చేయడానికి సహాయపడేది వ్యానం. పైకి లేచిపోవడం మొదలైనవాటికి హేతువైనది ఉదానం. అన్నరసాన్ని అన్ని అవయవాలలోను వ్యాపింపచేసేది సమానం. ఈ విధంగా ప్రాణం మనస్సు వలె పంచవృత్తి. మనస్సునకు వలె ప్రాణానికి ఐదు వృత్తులున్నాయి అని అర్థం శ్రోత్రాదులవల్ల మనస్సునకు కలిగే ప్రసిద్ధమైన ఐదు వృత్తులు గ్రహించాలి గాని "కామః సంకల్పః" ఇత్యాది శ్రుతి వాక్యంలో చెప్పినవాటిని గ్రహించకూడదు. వాటి సంఖ్య ఐదుకు మించి ఉంది. (ప్రశ్న)-ఇలా చెప్పినా కూడ మనస్సుకు శ్రోత్రాదుల అపేక్ష లేని భూతభవ్యత్తులను గూర్చిన వృత్తి ఉంటుంది గాన ఐదు సంఖ్యను మించడం అనేది ఉంది కదా?(సమాధానం) అట్లైతే "నిషేధించబడని పరమతం కూడ అంగీకార్యమే" అనే న్యాయాన్ని అనుసరించి ఇక్కడ కూడ "ప్రమాణవిపర్యయవికల్పనిద్రాస్మృతయః" అని యోగశాస్త్రంలో ప్రసిద్ధమైన ఐదు వృత్తులు గ్రహించబడతాయి. (ప్రమాణం=ప్రమ. విపర్యయం=భ్రాంతి. వికల్పం=శశవిషాణాదుల జ్ఞానం. నిద్ర=తామసవృత్తి. స్మృతి= స్మరణం). లేదా మనస్సుకు చాలా వృత్తు లుండడం అనేదానిని పట్టి ఇది ప్రాణానికి

నిదర్శనంగా చూపబడింది. ప్రాణం మనస్సు వలె పంచవృత్తి గాన ఇది కూడ మనస్సువలె జీవునకు ఉపకరణం మాత్రమే అని కూడ సూత్రానికి అర్థం చెప్పాలి. 12.

వాయుక్రియాధికరణం సమాప్తం

## 6. శ్రేష్ఠాణుత్వాధికరణమ్. సూ.13

### సూ.అణుశ్చ. 2.4.13.

అణుశ్చాయం ముఖ్యః ప్రాణః ప్రత్యేతవ్య ఇతర ప్రాణవత్. అణుత్వం చేహాఽపి సౌక్ష్మ్యపరిచ్ఛేదౌ న పరమాణుతుల్యత్వమ్. పఞ్చభిర్వృత్తిభిః కృత్స్న శరీరవ్యాపిత్వాత్. సూక్ష్మః ప్రాణః ఉత్క్రాన్తౌ పార్శ్వస్థేనానుపలభ్యమానత్వాత్; పరిచ్ఛిన్నశ్చోత్క్రాన్తిగత్యాగతిశ్రుతిభ్యః. నను విభుత్వమపి ప్రాణస్య సమామ్నాయతే-"సమః ప్లుషిణా సమో మశకేన సమో నగేన సమ ఏభిస్త్రిభిర్లోకైః సమోఽనేన సర్వేణ" (బృ.ఉ.1.3.22) ఇత్యేవమాదిప్రదేశేషు. తదుచ్యతే-ఆధి దైవికేన సమష్టివ్యష్టిరూపేణ హైరణ్యగర్భేణ ప్రాణాత్మనా ఏతద్విభుత్వ మామ్నాయతే, నాధ్యాత్మికేన. అపి చ సమః ప్లుషిణేత్యాదినా సామ్యవచనేన ప్రతిప్రాణివర్తినః ప్రాణస్య పరిచ్ఛేదః ఏవ ప్రదర్శ్యతే. తస్మాన్న దోషః.13

బాలానందిని

**అనురీతి**:-"అణుశ్చ=ఈ ముఖ్యప్రాణం అణువు కూడ" అని సూత్రార్థం.

**అవ**. "ప్రాణ ఉత్క్రామతి" అనే శ్రుతిని పట్టి ప్రాణం అల్పప్రమాణం కల దని తెలుస్తూన్నది. "సమోఽనేన సర్వేణ" అనే వాక్యంచేత విభు వని తెలస్తూన్నది. ఈ విధంగా విరోధం కనబడుతుండగా అధ్యాత్మికప్రాణం అల్పం అనీ ఆధిదైవికమైన ప్రాణం విభు వనీ చెప్పి విరోధపరిహారం చేయబడుచున్నది.

**అనురీతి**:-ఈ ముఖ్యప్రాణం కూడ ఇతరప్రాణాల వలెనే అణువుగా గ్రహింపదగినది. ఇక్కడ కూడ అణుత్వం అనగా సూక్ష్మత్వము. అల్పపరిమాణత్వము అని గ్రహించాలి కాని అణుపరిమాణంతో ఉండడం అని కాదు. ఎందువల్ల ననగా ఐదు వృత్తులతో ఇది శరీరా న్నంతనీ వ్యాపించి ఉంటుంది కదా? శరీరం వదలి వెళ్లిపోయేటప్పుడు దీనిని

ప్రక్కనున్న వాళ్లు చూడడం లేదు గాన ఇది సూక్ష్మం. పైకి వెళ్లిపోవడం ప్రయాణం చెయ్యడం తిరిగి రావడం అనేవి దీని కున్నట్లు చెప్పే శ్రుతులను బట్టి ఇది పరిచ్ఛిన్నము, అల్పప్రమాణం గలది. (ప్రశ్న)-"సమః-......సర్వేణ" ఇత్యాదిప్రదేశాలలో ప్రాణం విభువు అని కూడ చెప్పబడుచున్నది కదా? (ప్రాణం ప్లుషి (ఒక చిన్న పురుగు)తోను. దోమతోను, ఏనుగుతోను, ఈ మూడులోకాలతోను, ఈ సమస్తంతోను సమమైనది" అని ఈ వాక్యానికి అర్థం). దీనికి (సమాధానం) చెప్పబడుచున్నది. సమష్టిరూపమైన హిరణ్యగర్భునికి (విరాట్‌కు) సంబంధించిన ఆధిదైవికమైన ప్రాణస్వరూపాన్ని పట్టి దీనికి విభుత్వం చెప్పబడుచున్నది; అంతేనే కాని ఆధ్యాత్మికమైన (శరీరంలో ఉండే) స్వరూపాన్ని పట్టి కాదు.(చతుర్దశభువనాత్మకమైన సమష్టిరూపానికి హిరణ్యగర్భుడని పేరు. ఆ హిరణ్యగర్భునకు సంబంధించినంతవరకు ప్రాణం విభువు). మరొక విషయ మేమనగా- "సమః ప్లుషిణా" ఇత్యాదివిధంగా ప్లుష్యాదుల పరిమాణంతో సామ్యం చెప్పడంచేత ప్రతీ ప్రాణిలోను ఉన్న ప్రాణానికి పరిచ్ఛేదం (పరిమితమైన పరిమాణం) చూపబడుచున్నది గాన దోషం లేదు. 13.

శ్రేష్ఠాణుత్వాధికరణం సమాప్తం

### 7. జ్యోతిరాద్యధికరణమ్. సూ. 14-16

### సూ. జ్యోతిరాద్యధిష్ఠానం తు తదామననాత్. 2.4.14

తే పునః ప్రకృతాః ప్రాణాః కిం స్వమహిమ్నైవ స్వస్మై స్వస్మై కార్యాయ ప్రభవన్తి ఆహోస్విద్దేవతాధిష్ఠితాః ప్రభవన్తీతి విచార్యతే. తత్ర ప్రాప్తం తావద్యథాస్వం కార్యశక్తియోగాత్ స్వమహిమ్నైవ ప్రాణాః ప్రవర్తేరన్నితి. అపి చ దేవతాధిష్ఠితానాం ప్రాణానాం ప్రవృత్తావభ్యుపగమ్యమానాయాం తేసామేవాధిష్ఠాత్రీణాం దేవతానాం భోక్తృత్వప్రసంగాత్ శారీరస్య భోక్తృత్వం ప్రలీయేత. అతః స్వమహిమ్నైవైషాం ప్రవృత్తిరితి. ఏవం ప్రాప్త ఇదముచ్యతే- 'జ్యోతిరాద్యధిష్ఠానం తు' ఇతి. తుశబ్దేన పూర్వపక్షో వ్యావర్త్యతే. జ్యోతిరాదిభిరగ్న్యాద్యభిమానినీభిర్దేవతాభిః అధిష్ఠితం వాగాదికరణజాతం స్వకార్యేషు ప్రవర్తత ఇతి ప్రతిజానీతే. హేతుం

వ్యాచష్టే తదామననాదితి. తథా హ్యామనన్తి-"అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్"(ఐత.ఉ.2.4) ఇత్యాది. అగ్నేశ్చాయం వాగ్భావో ముఖప్రవేశశ్చ దేవతాత్మనా ధిష్ఠాతృత్వమఙ్గీకృత్యోచ్యతే. న హి దేవతాసమ్బన్ధం ప్రత్యాఖ్యాయాగ్నేర్వాచి ముఖే వా కశ్చిద్విశేషసంబన్ధో దృశ్యతే. తథా-"వాయుః ప్రాణో భూత్వా నాసికే ప్రావిశత్ "(ఐ.కు.ఉ.2.4) ఇత్యేవమాద్యపి యోజయితవ్యమ్. తథాన్యత్రాపి- "వాగేవ బ్రహ్మణశ్చతుర్థః పాదః సోఽగ్నినా జ్యోతిషా భాతి చ తపతి చ"(ఛా.ఉ. 3.18.3) ఇత్యేవమాదినా వాగాదీనామగ్న్యాదిజ్యోతిష్ట్వవచనేనైతమేవార్థం ద్రఢయతి. "స వై వాచమేవ ప్రథమామత్యవహత్సా యదా మృత్యుమత్యముచ్యత సోఽగ్నిరభవత్"(బృ.ఉ.1.3.12) ఇతిచైవమాదినా వాగాదీనామగ్న్యాదిభావాపత్తివచనేనైతమేవార్థం ద్యోతయతి. సర్వత్ర చైవాధ్యాత్మాధిదైవతవిభాగేన వాగాద్యగ్న్యాద్యనుక్రమణమనయైవ ప్రత్యాసత్త్యా భవతి. స్మృతావపి-

వాగధ్యాత్మమితి ప్రాహుర్బ్రాహ్మణాస్తత్త్వదర్శినః,

వక్తవ్యమధిభూతం తు వహ్నిస్తత్రాధిదైవతమ్" (మ.భా.శాం. ~~31.3.5~~ 313-5/1)

ఇత్యాదినా వాగాదీనామగ్న్యాదిదేవతాధిష్ఠితత్వం సప్రపఞ్చం దర్శితమ్. యదుక్తం స్వకార్యశక్తియోగాత్స్వమహిమ్నైవ ప్రాణాః ప్రవర్తేరన్నితి, తదయుక్తమ్ శక్తానామపి శకటాదీనామనడుహాద్యధిష్ఠితానామ్మం ప్రవృత్తిదర్శనాత్. ఉభయ థోపపత్తౌ చాగమాద్దేవతాధిష్ఠితత్వమేవ నిశ్చీయతే. 14.

బాలానందిని

జ్యోతిరితి:-"జ్యోతిరాద్యధిష్ఠానం తు=జ్యోతిస్సు మొదలైనవాటికి అధిష్ఠానమై వాగాదికరణసముదాయం పని చేస్తుంది. తదామననాత్=అట్లు శ్రుతిలో చెప్పడం వల్ల"అని సూత్రార్థం.

తే ఇతి :- ప్రకృతములైన ఆ ప్రాణాలు తమ మహిమచేతనే తమ తమ పనులు చేయడానికి సమర్థములౌతాయా లేక దేవతలచేత అధిష్ఠితములై అవుతాయా అని

విచారణ చేయబడుచున్నది. తమ తమ పనులు చేయడానికి తగిన శక్తిఉండడం చేత అవే స్వతంత్రంగా తమ తమ పనులు చేస్తాయి అని ప్రాప్తించినది. అలా కాక దేవతలచేత అధిష్ఠింపబడిన ప్రాణాలు పనులుచేస్తాయి అన్నట్లయితే అధిష్ఠాతలైన ఆ దేవతలకే భోక్తృత్వం కలిగే ప్రసక్తి ఏర్పడుతుంది గాన శారీరునకు భోక్తృత్వం లేకుండా పోతుంది అందువల్ల ఇవి తమ మహిమచేతనే పనులు చేస్తాయి. ఇట్లు ప్రాప్తించగా "జ్యోతిరాద్యధిష్ఠానం తు" అని చెప్పబడుచున్నది. తుశబ్దంచేత పూర్వపక్షం నిరాకరించబడుతుంది. జ్యోతిరాదులచేత, అనగా అగ్న్యాద్యభిమానదేవతలచేత, అధిష్ఠితమైనదై వాగాది కరణసముదాయం తనకార్యాలలో ప్రవర్తిస్తుంది అని ప్రతిజ్ఞ చేయుచున్నాడు. "తదామననాత్" అని అందుకు హేతువును చెప్పుతున్నాడు. "అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్" ఇత్యాదికం పఠిస్తున్నారు కదా? అగ్ని దేవతాత్మగా అధిష్ఠించి ఉన్నాడు అని అంగీకరించి అగ్ని వాక్కుగా అయిందనీ ముఖంలో ప్రవేశించిన దనీ చెప్పబడుచున్నది. దేవతాసంబంధం తప్ప వాక్కునందు గాని ముఖమునందు గాని అగ్నికి విశేషసంబంధం ఏదీ కనబడదు కదా? "వాయుః...ప్రావిశత్" ఇత్యాదికం కూడ ఇలాగే అన్వయించాలి. "వాగేవ...తపతి చ" (వాక్కు మనోరూపమైన బ్రహ్మయొక్క చతుర్థపాదం. అది అగ్నిరూపమైన జ్యోతిస్సుచేత ప్రకాశిస్తుంది; తన కార్యం చేస్తుంది) ఇత్యాదికంచేత కూడ వాగాదులు అగ్న్యాదిజ్యోతిఃస్వరూప మైనవి అని చెప్పడంచేత ఈ విషయాన్నే (వాగాదులకు అగ్న్యాదులు అధిష్ఠానదేవతలు అనే విషయాన్నే) దృఢం చేస్తున్నది. "స...అభవత్" (ఆ ప్రాణం ఉద్గీథకర్మలో ప్రధానమైన వాక్కును అనృతం మొదలైన మృత్యువునుండి దూరంచేసి అగ్నిదేవతాస్వరూపాన్ని పొందించింది) ఇత్యాదికం చేత కూడ వాగాదులు అగ్న్యా దిరూపాన్ని పొందాయి అని చెప్పడంచేత ఈ విషయాన్నే సూచిస్తున్నది. అన్ని చోట్లా కూడా అధ్యాత్మం (శరీరానికి సంబంధించినది)అధిదైవతం (దేవతకు సంబంధించినది) అనే విభాగంచేత వాగాద్యగ్న్యాద్యనుక్రమణం (అధ్యాత్మం వాగాదులను, అధిదైవతం అగ్న్యాదులను చెప్పడం)ఈ సంబంధంచేతనే జరుగుతున్నది. "వాగధ్యాత్మ....అధిదైవతమ్" ఇత్యాదిస్మృతిలో కూడ వాగాదులు అగ్న్యాద్యధిష్ఠాన దేవతలచేత అధిష్ఠించబడి నట్లు సవిస్తరంగా చూపబడింది. శరీరమునం దున్నది వాక్కు. చెప్పదగిన వస్తువు అధిభూతం. వాక్కుయొక్క అధిదేవస్వరూపం అగ్ని అని ఈ శ్లోకానికి అర్థం. ప్రాణాదులు స్వకార్యశక్తి ఉండడంవల్ల తామే తమ మహిమచేతనే ప్రవర్తిస్తాయి

అని చెప్పడం యుక్తం కాదు. బళ్లు మొదలైనవి శక్తములే అయినా ఎద్దులు మొదలైనవాటిచేత అధిష్ఠింపబడి నప్పుడే (వాటి సహాయం ఉన్నప్పుడే) వాటి పని చేయడం కనబడుతున్నది కదా? 'రెండు విధాలా కూడ అనగా ఇతరాధిష్ఠితములైనా కాకపోయినా కూడ ప్రవృత్తి కుదురుతుంది అనుకొన్నా కూడ శాస్త్రం ప్రకారం దేవతాధిష్ఠితములై పని చేస్తాయి అనే నిశ్చయింపబడుతుంది. 14.

భాష్యమ్

యదప్యుక్తం దేవతానామేవాధిష్ఠాత్రీణాం భోక్తృత్వప్రసంగః; న శారీరస్యేతి, తత్పరిహ్రియతే-

సూ. ప్రాణవతా శబ్దాత్. 2.4.15.

సతీష్వపి ప్రాణానామధిష్ఠాత్రీషు దేవతాసు ప్రాణవతా కార్యకరణ సంఘాతస్వామినా శారీరేణైవైషాం ప్రాణానాం సంబన్ధః శ్రుతేరవగమ్యతే. తథాహి శ్రుతిః- "అథ యత్రైతదాకాశమను విషణ్ణం చక్షుః స చాక్షుషః పురుషో దర్శనాయ చక్షురథ యో వేదేదం జిఘ్రాణీతి స ఆత్మా గన్ధాయ ఘ్రాణమ్" (ఛా.ఉ.8.12.14) ఇత్యేవంజాతీయకా శారీరేణైవ ప్రాణానాం సంబన్ధం శ్రావయతి. అపి చానేకత్వా త్ప్రతికరణమధిష్ఠాత్రీణాం దేవతానాం న భోక్తృ త్వమస్మిన్ శరీరే ఽవకల్పతే. ఏకో హ్యేవమస్మిన్ శరీరే శారీరో భోక్తా ప్రతిసంధానాదిసంభవాదవగమ్యతే. 15.

బాలానందిని

యదితి :- ప్రాణాలను అధిష్ఠించి ఉన్న దేవతకే భోక్తృత్వం ప్రసక్తం అవుతుంది కాని జీవునికి భోక్తృత్వం లేకుండా పోతుంది అనే ఆక్షేపం పరిహరించబడుచున్నది.

ప్రాణవతేతి:-" ప్రాణవతా=ప్రాణాలుగల శారీరునితోనే ప్రాణాలకు సంబంధము. శబ్దాత్=ఆ విధంగా శ్రుతివాక్యం ఉండడం వలన" అని సూత్రార్థం.

సతీష్వితి :- ప్రాణాలకు అధిష్ఠానదేవత లున్నా కూడ ప్రాణాలకు సంబంధం ప్రాణవంతునితోనే అనగా శరీరేంద్రియసంఘాతానికి స్వామి అయిన శారీరునితోనే, అని శ్రుతివల్ల తెలుస్తూన్నది. ఎందువల్ల ననగా- "అథ....ఘ్రాణమ్" ఇత్యాదివిధమైన శ్రుతి

ప్రాణాలకు శారీరునితోనే సంబంధం (భోక్తృభోగ్యభావం) ఉన్నట్లు చెప్పుచున్నది. (ఎవని భోగం నిమిత్తం చక్షుస్సు ఆకాశాన్ని (నేత్రగోళాన్ని) ప్రవేశించిందో ఆ పురుషుడు చాక్షుషుడు. అతడు చూడడంకొరకే చక్షుస్సు ఉపయోగిస్తుంది. నేను దీనిని వాసన చూస్తున్నాను అని ఎవడు తెలుసుకొంటున్నాడో అతడు ఆత్మ (జీవుడు). అతడు వాసనచూడడానికే ఘ్రాణేంద్రియం అని ఈ శ్రుతివాక్యానికి అర్థం). మరొక విషయ మేమనగా ఒక్కొక్క కరణానికి ఒక్కొక్క అధిష్ఠాతయైన దేవత ఉండడంచేత ఆ దేవత లందరికి ఈ శరీరంలో భోక్తృత్వం కుదరదు. ఈ శరీరంలో భోక్తయైన శారీరుడు ఒక్కడే అని తెలుస్తూన్నది. ఒక్కడు కాకపోతే ఏ నేను రూపం చూచానో ఆ నేనే శబ్దం వింటున్నాను ఇత్యాదివిధమైన ప్రతిసంధానం కుదరదు. 15

## సూ. తస్య చ నిత్యత్వాత్. 2.4.16

తస్య చ శారీరస్యాస్మిన్ శరీరే భోక్తృత్వేన నిత్యత్వం పుణ్యపాపోపలేపసంభవాత్ సుఖదుఃఖోపభోగసంభవాచ్చ. న దేవానామ్. తా హి పరస్మిన్నైశ్వర్యే పదేఽవతిష్ఠమానా న హీనేఽస్మిన్ శరీరే భోక్తృత్వం ప్రతిలబ్ధుమర్హన్తి. శ్రుతిశ్చ భవతి-"పుణ్యమేవాముం గచ్ఛతి, న వై దేవాన్ పాపం గచ్ఛతి" (బృ.ఉ.1.5.3) ఇతి. శారీరేణైవ చ నిత్యః ప్రాణానాం సంబన్ధః-ఉత్క్రాన్త్యాదిషు తదనువృత్తిదర్శనాత్-"తముత్క్రామన్తం ప్రాణోఽనూత్క్రామతి ప్రాణమనూత్క్రామన్తం సర్వే ప్రాణా అనూత్క్రామన్తి" (బృ.ఉ.4.4.2) ఇత్యాదిశ్రుతిభ్యః. తస్మాత్సతీష్వపి కరణానాం నియన్త్రీషు దేవతాసు న శారీరస్య భోక్తృత్వమపగచ్ఛతి. కరణపక్షస్యైవ హి దేవతా న భోక్తృపక్షస్యేతి. 16.

బాలానందిని

తస్యేతి:- "తస్య=ఆ జీవుడే, నిత్యత్వాత్=ఈ శరీరంలో నిత్యుడుగా ఉండడంవల్ల ప్రాణాలకు వానితోనే సంబంధం నిత్యం" అని సూత్రార్థం.

తస్యేతి :- పుణ్యపాపాలతో సంబంధమూ సుఖదుఃఖాల భోగము జీవునికే సంభవం అవడంవల్ల ఈ శరీరంలో జీవుడే భోక్తగా నిత్యుడు; అంతేనే కాని దేవతలకు (ఈ

శరీరంలో)నిత్యత్వం లేదు. ఉత్తమమైన ఐశ్వర్యం (ప్రభుత్వం)ఉన్న స్థానంలో ఉన్న ఆ దేవతలు హీనమైన ఈ శరీరంలో భోక్తృత్వాన్ని పొందడానికి తగరు (పొందరు). "పుణ్యా ....గచ్ఛతి" (వీనిని పుణ్యమే చేరుతుంది, దేవతలకు పాపం అంటదు)అని శ్రుతి చెప్పు చున్నది. (ఈ సూత్రానికే మరొక వ్యాఖ్య)-ఉత్క్రాంత్యాదులలో ప్రాణాలు జీవుణ్ణే అనుసరిస్తాయి అని "తమ్....అనూత్క్రామన్తి" ఇత్యాదిశ్రుతులు చెప్పుచున్నాయి గాన ప్రాణాలకు శారీరునితోనే నిత్యమైన సంబంధం. అందువల్ల ప్రాణాల నియంత్రణ చేసే దేవతలు ఉన్నా కూడ శారీరునికి భోక్తృత్వం లేకుండాపోదు. దేవత కరణపక్షానికే చెందు తుంది (కరణాలు పనిచేసే టట్లు చూస్తుంది) కాని భోక్తృపక్షానికి చెందదు. 16.

జ్యోతిరాద్యధికరణం సమాప్తం

8. ఇన్ద్రియాధికరణమ్. సూ. 17-19

## సూ. త ఇన్ద్రియాణి తద్వ్యపదేశాదన్యత్ర శ్రేష్ఠాత్ 2-4-17

ముఖ్యశ్చైక ఇతరే చైకాదశ ప్రాణా అనుక్రాన్తాః. తత్రేదమపరం సందిహ్యతే-కిం ముఖ్యస్యైవ ప్రాణస్య వృత్తిభేదా ఇతరే ప్రాణా ఆహోస్విత్తత్త్వాన్త రాణీతి. కిం తావత్ప్రాప్తమ్? ముఖ్యస్యైవేతరే వృత్తిభేదా ఇతి. కుతః? శ్రుతేః. తథాహి శ్రుతిః ముఖ్యమితరాంశ్చ ప్రాణాన్ సంనిధాప్య ముఖ్యాత్మతామితరేషాం ఖ్యాపయతి-"హన్తాస్యైవ సర్వే రూపమసామేతి. త ఏతస్యైవ సర్వే రూపమభవన్" (బృ.ఉ.1.5.21) ఇతి. ప్రాణైకశబ్దత్వాచ్చైకత్వాధ్యాసః. ఇతరథాహ్యన్యాయ్య మనేకార్థత్వం ప్రాణశబ్దస్య ప్రసజ్యేత. ఏకత్ర వా ముఖ్యత్వమితరత్ర వా లాక్షణికత్వమాపద్యేత. తస్మాద్యథైకస్యైవ ప్రాణస్య ప్రాణాద్యాః పఞ్చ వృత్తయ ఏవం వాగాద్యా అప్యేకాదశేతి.

బాలానందిని

త ఇతి:-"శ్రేష్ఠాత్ అన్యత్ర=శ్రేష్ఠప్రాణం తప్ప మిగిలినవాటి విషయంలో, తద్వ్యపదేశాత్=అట్లుచెప్పడంవల్ల తే=ఆ ఇతరప్రాణాలు. ఇన్ద్రియాణి=ఇంద్రియాలు" అని సూత్రార్థం.

ముఖ్య ఇతి:- ఒక ముఖ్యప్రాణము ఇతరమైన పదకొండు ప్రాణాలు చెప్పబడ్డాయి. ఇతరప్రాణా లన్నీ ముఖ్యప్రాణంయొక్క వృత్తిభేదాలా లేక తత్త్వాంతరాలా (వేరైన పదార్థాలా)అని వాటివిషయంలోనే ఇప్పుడు సందేహింపబడుచున్నది. ఏమి ప్రాప్తించింది? ఇతర ప్రాణా లన్నీ ముఖ్యప్రాణంయొక్క వృత్తిభేదాలే అని ప్రాప్తించింది. ఎందువల్ల? శ్రుతివల్ల. "హన్తాస్యైవ...అభవన్" అను శ్రుతి ముఖ్యప్రాణాన్ని ఇతరప్రాణాలను ఒక చోట చేర్చి ఇతరప్రాణాలన్నీ ముఖ్యప్రాణరూపాలే అని చెప్పుచున్నది. (మనం అందరమూ దీని రూపాలుగానే ఉన్నాము. అవి అన్నీ (ఆ ప్రాణాలన్నీ)దీని (ముఖ్యప్రాణంయొక్క రూపాలుగానే అయ్యాయి) అని శ్రుతివాక్యానికి అర్థం. వీటికన్నింటికి 'ప్రాణం' అని ఒకే పేరు ఉండడంవల్ల కూడ ఇవన్నీ ఒకటే అని నిర్ణయం. అలా కాకపోతే ప్రాణశబ్దానికి అన్యాయ్యమైన అనేకార్థత్యం ప్రసక్తం అవుతుంది. (ఒకే ప్రాణశబ్దానికి వేరు వేరు అర్థాలు చెప్పవలసివస్తుంది. అది అన్యాయ్యం అని అర్థం). లేదా ఈపదం ఒకచోట ముఖ్యార్థం బోధిస్తుందనీ మరొక చోట లాక్షిణికమైన అర్థం బోధిస్తుం దనీ చెప్పవలసి వస్తుంది. అందువల్ల ఒకే ప్రాణానికి ప్రాణం మొదలైన ఐదు వృత్తులు ఎలా ఉన్నాయో అలాగే వాక్కుమొదలైన పదకొండు కూడ దీని వృత్తులే.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః-తత్త్వాన్తరాణ్యేవ ప్రాణాద్వాగాదీనీతి. కుతః? వ్యపదేశభేదాత్. కోఽయం వ్యపదేశభేదః? తే ప్రకృతాః ప్రాణాః శ్రేష్ఠం వర్జయిత్వా అవశిష్టాః ఏకాదశేన్ద్రియాణీత్యుచ్యన్తే. శ్రుతావేవం వ్యపదేశదర్శనాత్. "ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేన్ద్రియాణి చ" (ము.ఉ.2-1-3). ఇతి హ్యేవం జాతీయకేషు ప్రదేశేషు పృథక్ ప్రాణో వ్యపదిశ్యతే పృథక్చేన్ద్రియాణి. నను మనసోఽప్యేవం వర్జనమిన్ద్రియత్వేన స్యాత్; "మనః సర్వేన్ద్రియాణి చ" ఇతి పృథగ్వ్యపదేశదర్శనాత్? సత్యమేతత్. స్మృతౌ త్వేకాదశేన్ద్రియాణీతి మనోఽపీన్ద్రియత్వేన శ్రోత్రాదివత్సంగృహ్యతే. ప్రాణస్య త్విన్ద్రియత్వం న శ్రుతౌ స్మృతౌ వా ప్రసిద్ధమస్తి. వ్యపదేశభేదశ్చాయం తత్వభేదపక్ష ఉపపద్యతే. తత్త్వైకత్వే తు స ఏవైకః సన్ ప్రాణ ఇన్ద్రియవ్యపదేశం లభతే న లభతే చేతి విప్రతిషిద్ధమ్.

తస్మాత్తత్త్వాన్తరభూతాః ముఖ్యాదితరే. 17.

బాలానందిని

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాం-వాగాదులు ప్రాణంకంటె భిన్న మైన తత్త్వాలే. ఎందువల్ల? వ్యపదేశభేదంవల్ల. ప్రకృతము లైన ఆ ప్రాణాలు, శ్రేష్ఠప్రాణం మినహాయించి మిగిలినవి, పదకొండు ఇంద్రియా లని చెప్పబడుచున్నాయి. "ఏతస్మాత్... ఇన్ద్రియాణి చ'" ఇత్యాదిప్రదేశాలలో ప్రాణం వేరుగా చెప్పబడుచున్నది, ఇంద్రియాలు వేరుగా చెప్పబడుచున్నాయి. (ప్రశ్న) అట్లైతే-"మనః సర్వేన్ద్రియాణి చ" అని మనస్సునూ. ఇంద్రియాలను వేరు వేరుగా చెప్పడంవల్ల మనస్సు కూడ ప్రాణం వలెనే ఇంద్రియం కాదని చెప్పవలసి వస్తుంది కదా? ఇది నిజమే. కాని (ఇన్ద్రియాణి దశైకం చ పఞ్చ చేన్ద్రియగోచరాః' అనే) స్మృతిలో ఇంద్రియాలు పదకొండు అని చెప్పి మనస్సు కూడ శ్రోత్రాదుల వలె ఇంద్రియంగా గ్రహించబడుచున్నది. ప్రాణం ఇంద్రియం అని మాత్రం శ్రుతిలో కాని స్మృతిలో కాని ప్రసిద్ధంగా కనబడడం లేదు. ఈ విధంగా వేరు వేరుగా చెప్పడం రెండూ వేరు వేరు తత్త్వాలు అన్నప్పుడే కుదురుతుంది. ఒకే తత్త్వం అన్నట్లయితే ఒక్కటే అయిన ఆ ప్రాణం ఇంద్రియ మనీ చెప్పబడుతుంది, ఇంద్రియమని చెప్పబడదు కూడ అనడం విరుద్ధంగా ఉంటుంది. అందువల్ల ఇతరప్రాణాలు ముఖ్యప్రాణంకంటె భిన్నమైన తత్త్వాలే. 17

భాష్యమ్

కుతశ్చ తత్త్వాన్తరభూతాః ముఖ్యాదితరే-

సూ. భేదశ్రుతేః. 2.4.18

భేదేన వాగాదిభ్యః ప్రాణః సర్వత్ర శ్రూయతే-"తే హ వాచమూచుః" (బృ.ఉ.1.3.2) ఇత్యుపక్రమ్య వాగాదీనసురపాప్మవిధ్వస్తానుపన్యస్యోపసంహృత్య వాగాదిప్రకరణమ్-"అథ హేమమాసన్యం ప్రాణమూచుః" ఇత్యసురవిధ్వంసినో ముఖ్యస్య ప్రాణస్య పృథగుపక్రమణాత్. తథా-"మనో వాచం ప్రాణం తాన్యాత్మనేఽకురుత" (బృ.ఉ.1.5.7)ఇత్యేవమాద్యా అపి భేదశ్రుతయః

ఉదాహర్తవ్యాః. తస్మాదపి తత్త్వాన్తరభూతా ముఖ్యాదితరే. 18.

బాలానందిని

భేదేతి:- 'భేదశ్రుతే:=భేదంతో వినబడడంచేత కూడ ఇతరప్రాణాలు ముఖ్య ప్రాణంకంటె భిన్నమైనవి" అని సూత్రార్థం.

భేదేనేతి :- "తే హ వాచమూచుః" (అవి వాక్కుతో ఇలా అన్నాయి) అని ప్రారంభించి, వాగాదులు అసురపాపంచేత కొట్టబడినట్లు చెప్పి, వాగాదుల ప్రకరణాన్ని ముగించి "అథ హేమ మాసన్యం ప్రాణమూచుః" (తరవాత అవి ముఖంలో ఉన్న ప్రాణంతో ఇలా అన్నాయి) అని అసురులను నశింపజేసే ముఖ్యప్రాణాన్ని వేరుగా చెప్పడంవల్ల అంతటా కూడ ప్రాణం వాగాదులకంటె వేరుగా వినబడుచున్నది.

వి. శాస్త్రీయమైన ఇంద్రియమనోవృత్తులే దేవతలు. పాపవృత్తులు అసురులు. ఉద్గీథం చేయడానికి ప్రారంభించిన వాక్కుతో దేవతలు "నువ్వు అసురులు నశించే టట్లు ఉద్గానం చెయ్యి" అని కోరాయి. సరే అని ఉద్గానం చేస్తూన్న వాక్కును అసురులు అనృతం (అసత్యం పలకడం)మొదలైన దోషంతో నశింపచేశాయి. ఇదే విధంగా, వరసగా అన్ని ఇంద్రియాలు పాపగ్రస్తా లయ్యాయి అని ముందు చెప్పి ఈ ప్రకరణాన్ని నిలిపి "తరవాత" అని ప్రారంభించి అవి ప్రాణం దగ్గరికి వెళ్లి ఉద్గానం చేయవలసిందిగా కోరినట్లు అప్పుడు దానిని ఏమీ చేయజాలక అసురులునశించినట్లు చెప్పబడింది. దీనినిపట్టి ఇంద్రియాలు వేరు ముఖ్యప్రాణం వేరు అని తెలుస్తూన్నది.

తథేతి:- ఇట్లే "మనో.......అకురుత" (ప్రజాపతి మనస్సును, వాక్కును ప్రాణాన్నీ తనకొరకు నిర్మించుకొన్నాడు) ఇత్యాదులైన భేదప్రతిపాదకశ్రుతులు కూడ ఉదాహరించాలి. అందువల్ల కూడ ముఖ్యప్రాణంకంటె ఇతర ప్రాణాలు భిన్నమైన తత్త్వాలు. 18

భాష్యమ్

సూ. వైలక్షణ్యాచ్చ. 2.4.19

వైలక్షణ్యం భవతి ముఖ్యస్యేతరేషాం చ. సుషుప్తేషు వాగాదిషు ముఖ్య ఏకో జాగర్తి; స ఏవ చైకో మృత్యునాఽనాప్త ఆప్తాస్త్వితరే. తస్యైవ చ స్థిత్యు త్క్రాన్తిభ్యాం దేహధారణపతనహేతుత్వం నేన్ద్రియాణామ్, విషయా

లోచనహేతుత్వం చేన్ద్రియాణాం న ప్రాణస్యేత్యేవం జాతీయకో భూయాన్ లక్షణభేదః ప్రాణేన్ద్రియాణామ్. తస్మాదప్యేషాం తత్త్వాన్తరత్వసిద్ధిః. యదుక్తమ్. "త ఏతస్యైవ సర్వే రూపమభవన్" (బృ.ఉ.1.5.21) ఇతి శ్రుతేః ప్రాణ ఏవేన్ద్రియాణీతి, తదయుక్తమ్. తత్రాపి పౌర్వాపర్యాలోచనాద్భేదప్రతీతేః. తథాహి- "వదిష్యామ్యేవాహ మితి వాగ్దధ్రే" (బృ.1.5.21) ఇతి వాగాదీనీన్ద్రియాణ్యనుక్రమ్య "తాని మృత్యుః శ్రమో భూత్వోపయేమే తస్మాచ్ఛ్రామ్యత్యేవ వాక్" ఇతి చ శ్రమరూపేణ మృత్యునా గ్రస్తత్వం వాగాదీనామభిధాయ "అథేమమేవ నాప్నోద్యోఽయం మధ్యమః ప్రాణః" (బృ.ఉ.1.5.21) ఇతి పృథక్ ప్రాణం మృత్యునానభిభూతం తమనుక్రామతి. "అయం వై నః శ్రేష్ఠః" (బృ.ఉ.1.5.21) ఇతి చ శ్రేష్ఠతామస్యావధారయతి. తస్మాత్తదవిరోధేన వాగాదిషు పరిస్పన్దలాభస్య ప్రాణాయత్తత్వం తద్రూపభవనం వాగాదీనామితి మన్తవ్యం న తాదాత్మ్యమ్. అత ఏవ చ ప్రాణశబ్దస్యేన్ద్రియేషు లాక్షణికత్వసిద్ధిః. తథా చ శ్రుతిః-"త ఏతస్యైవ రూపమభవన్, తస్మాదేత ఏతేనాఖ్యాయన్తే ప్రాణాః" ఇతి ముఖ్య ప్రాణవిషయస్యైవ ప్రాణశబ్దస్యేన్ద్రియేషు లాక్షణికీం వృత్తిం దర్శయతి. తస్మాత్తత్త్వాన్తరాణి ప్రాణాదిన్ద్రియాణి. 19.

బాలానందిని

కుత ఇతి:- మరి ఇంకా ఏ కారణంచేత ఇతరప్రాణాలు ముఖ్యప్రాణంకంటె భిన్నమైనవి?

వైలక్షణ్యాదితి:- వైలక్షణ్యాత్ = ముఖ్యప్రాణానికి ఇతరప్రాణాలకీ వైలక్షణ్యం ఉండడంవల్ల కూడ ఇవి భిన్నమైనవి" అని సూత్రార్థం.

వైలక్షణ్యమితి:-ముఖ్యప్రాణానికి ఇతరప్రాణాలకీ వైలక్షణ్యం(వేరువేరు లక్షణాలుండడం) కూడ ఉన్నది. వాగాదులు నిద్రిస్తున్నప్పుడు ఒక్క ముఖ్యప్రాణమే మేల్కొని ఉంటుంది. అది మృత్యువుచేత ఆక్రమించబడదు. ఇతరమైనవి ఆక్రమించబడ్డాయి. ముఖ్యప్రాణమే స్థితిచేత, పైకిలేచిపోవడంచేత దేహంయొక్క

ధారణపతనాలకు హేతువు. ఇంద్రియాలు కావు. ఇంద్రియాలు విషయాలను గ్రహించడానికి హేతువులు, ప్రాణం కాదు. ఈ విధమైన అత్యధికమైన లక్షణ భేదం ప్రాణ- ఇంద్రియాల మధ్య ఉన్నది. అందువల్ల కూడ ఇవి వేరు వేరు తత్త్వాలు అని సిద్ధిస్తుంది. "త ఏతస్యైవ సర్వే రూపమభవన్" అను శ్రుతిని అనుసరించి ప్రాణమే ఇంద్రియాలు అని చెప్పినది యుక్తం కాదు. అక్కడ కూడ పౌర్వాపర్యం పరీక్షిస్తే భేదం ఉన్నట్లు తెలుస్తుంది. అది ఎట్లనగా-"వదిష్యామ్యేవాహమితి వాగ్దధ్రే"(నేను మాట్లాడుతూనే ఉంటాను అని వాక్కు వ్రతం ధరించినది) అని వాగాదీంద్రియాలను గూర్చి చెప్పడం ప్రారంభించి "తాని...వాక్" (మృత్యువు శ్రమగా అయి (శ్రమరూపంలో) వచ్చి వాటిని చేరుతుంది. అందుచేత వాక్కు తప్పక అలిసిపోతుంది) అని వాగాదులు శ్రమరూపమైన మృత్యువుచేత గ్రస్తము లవుతాయి అని మృత్యువుచేత అక్రమించబడని ఆ ప్రాణాన్ని వేరుగా పేర్కొంటున్నాడు. "అయం నః శ్రేష్ఠః" (ఇది మనలో శ్రేష్ఠమైనది)అని దానికి శ్రేష్ఠత్వాన్ని నిర్ధారణచేస్తున్నాడు. అందుచేత దీనికంతకీ విరుద్ధంగా ఉండకుండా ఉండాలంటే వాగాదులు ప్రాణంతో విరోధం లేకుండా ఆ ప్రాణంమీదనే ఆధారపడి స్పందనాన్ని పొందడమే ఆ ప్రాణరూపాన్ని పొందడం అనగా అని తెలుసుకోవాలి కాని ప్రాణంతో తాదాత్మ్యం కాదు. అందుచేతనే ప్రాణశబ్దం ఇంద్రియా లనే అర్థంలో లాక్షణికంగా ప్రయోగించడం కుదురుతుంది. అట్లే-"త...ప్రాణాః" ( ఆ ప్రాణా లన్నీ ఈ ముఖ్యప్రాణం యొక్క రూపాలయ్యాయి. అందుచేతనే ఇవి ప్రాణా లని చెప్పబడుతున్నాయి) అను శ్రుతి ప్రాణశబ్దం ముఖ్యంగా ముఖ్యప్రాణాన్నే బోధిస్తుందనీ ఇంద్రియాలను లక్షణావృత్తిచేత బోధిస్తుందనీ చూపుతున్నది. అందువల్ల ఇంద్రియాలు ప్రాణంకంటె భిన్నమైన తత్త్వాలు.19

ఇంద్రియాధికరణం సమాప్తం

### 9. సంజ్ఞామూర్తిక్లృప్త్యధికరణమ్. సూ. 20-22

### సూ. సంజ్ఞామూర్తిక్లప్తిస్తు త్రివృత్కుర్వత ఉపదేశాత్ 2-4-20

సత్ప్రక్రియాయాం తేజోబన్నానాం సృష్టిమభిదాయోపదిశ్యతే-"సేయం దేవతైక్షత హన్తాహమిమాస్తిస్రో దేవతాః అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే

వ్యాకరవాణీతి, తాసాం త్రివృతం త్రివృతమేకైకాం కరవాణీతి" (ఛా.ఉ.6-3-2) ఇతి. తత్ర సంశయః-కిం జీవకర్తృకమిదం నామరూపవ్యాకరణమాహో స్విత్పరమేశ్వర కర్తృకమితి. తత్ర ప్రాప్తం తావజ్జీవకర్తృకమేవేదం నామరూప వ్యాకరణమితి. కుతః? "అనేన జీవేనాత్మనా" ఇతి విశేషణాత్. యథా లోకే చారేణాహం పరసైన్యమనుప్రవిశ్య సంకలయానీత్యేవంజాతీయప్రయోగే చారకర్తృకమేవ సత్ సంకలనం హేతుకర్తృత్వాద్రాజాత్మన్యధ్యారోపయతి సంకలయానీత్యుత్తకపురుషప్రయోగేణ ఏవం జీవకర్తృకమేవ సన్నామరూపవ్యాకరణం హేతుకర్తృత్వాద్దేవతాత్మన్యధ్యారోపయతి వ్యాకరవాణీత్యుత్తమపురుష ప్రయోగేణ. అపి చ డిత్థ-డవిత్థాదిషు నామసు ఘటశరావాదిషు చ రూపేషు జీవస్యైవ వ్యాకర్తృత్వం దృష్టమ్. తస్మాజ్జీవకర్తృకమేవేదం నామరూపవ్యాకరణమ్.

బాలానందిని

సంజ్ఞేతి :- "సంజ్ఞామూర్తిక్లృప్తిస్తు=నామరూపాల నిర్మాణ మైతే, త్రివృత్కుర్వత: = పరమేశ్వరునియొక్క పనియే. ఉపదేశాత్=అట్లు శ్రుతిలో చెప్పడంవల్ల" అని సూత్రార్థం.

సదితి:- సత్‌ను గూర్చి చెప్పిన ప్రకరణంలో తేజోబన్నాల సృష్టిని చెప్పి "సేయం...కరవాణి" అని చెప్పబడింది. అక్కడ-ఈ నామరూపవ్యాకరణం (నామరూపవిభాగం) జీవుడు చేసినదా పరమేశ్వరుడు చేసినదా అని సంశయం. ఈ నామరూపవ్యాకరణానికి కర్త జీవుడే అని ప్రాప్తించినది. ఎందువల్ల? "అనేన జీవేనాత్మనా" (ఈ జీవస్వరూపంతో ప్రవేశించి)అని విశేషించి చెప్పడంవల్ల. నేను గూఢచారి ద్వారా శత్రుసైన్యం ప్రవేశించి పరిశీలిస్తాను అని లోకంలో చేసే ప్రయోగాలలో ఏ విధంగా రాజు చారులు చేసిన పరిశీలననే, తాను ప్రేరకుడవడంచేత "సంకలయాని" అని ఉత్తమపురుష ప్రయోగం చేసి తనమీద ఆరోపించుకుంటాడో ఆ విధంగా జీవకర్తృకమైన వ్యాకరణాన్నే 'వ్యాకరవాణి' అని ఉత్తమపురుషను ప్రయోగించి దేవత (పరమేశ్వరుడు) ప్రేరకకర్త అవడంచేత, తనమీద ఆరోపించుకొనుచున్నది. మరొక విషయమేమనగా 'డిత్థ' "డవిత్థ" మొదలైన పేర్ల విషయంలోను, ఘటాలు, శరావాలు మొదలైన రూపాల

విషయంలోను జీవుడే వ్యాకర్త అని చూడబడుచున్నది. అందువల్ల ఈ నామరూపవ్యాకరణం చేసినవాడు జీవుడే.

## భాష్యమ్

ఇత్యేవం ప్రాప్తేఽభిధత్తే "సంజ్ఞామూర్తిక్లప్తిస్తు" ఇతి. తుశబ్దేన పక్షం వ్యావర్తయతి. సంజ్ఞామూర్తిక్లప్తిరితి-నామరూపవ్యాక్రియేత్యేతత్. త్రివృత్కుర్వత ఇతి పరమేశ్వరం లక్షయతి. త్రివృత్కరణే తస్య నిరపవాదకర్తృత్వనిర్దేశాత్. యేయం సంజ్ఞాక్లప్తిర్మూర్తిక్లప్తిశ్చ అగ్నిరాదిత్యశ్చన్ద్రమా విద్యుదితి, తథా కుశకాశపలాశాదిషు పశుమృగమనుష్యాదిషు చ ప్రత్యాకృతి ప్రతివ్యక్తి చానేక ప్రకారా సా ఖలు పరమేశ్వరస్యైవ తేజోబన్నానాం నిర్మాతుః కృతిర్భవితుమర్హతి. కుతః? ఉపదేశాత్. తథాహి- "సేయం దేవతైక్షత" ఇత్యుపక్రమ్య "వ్యాకరవాణి" ఇత్యుత్తమపురుషప్రయోగేణ పరస్యైవ బ్రహ్మణః వ్యాకర్తృత్వమిహోపదిశ్యతే. నను జీవేనేతి విశేషణాజ్జీవకర్తృకత్వం వ్యాకరణ స్యాధ్యవసితమ్. నైతదేవమ్. జీవేనేత్యేతదనుప్రవిశ్యేత్యనేన సంబధ్యతే, అనన్తర్యాత్, న వ్యాకరవాణి ఇత్యనేన. తేన హి సంబన్ధే వ్యాకరవాణీత్యయం దేవతావిషయ ఉత్తమపురుష ఔపచారికః కల్ప్యేత. న చ గిరినదీసముద్రాదిషు నానావిధేషు నామరూపేష్వనీశ్వరస్య జీవస్య వ్యాకరణసామర్థ్యమస్తి. యేష్వపి చాస్తి సామర్థ్యం తేష్వపి పరమేశ్వరాయత్తమేవ తత్. న చ జీవో నామ పరమేశ్వరాదత్యన్తభిన్నశ్చార ఇవ రాజ్ఞః, ఆత్మనేతి విశేషణాత్. ఉపాధిమాత్ర నిబన్ధనత్వాచ్చ జీవభావస్య. తేన తత్కృతమపి నామరూపవ్యాకరణం పరమేశ్వరకృతమేవ భవతి. పరమేశ్వర ఏవ చ నామరూపయోర్వ్యాకర్తేతి సర్వోపనిషత్సిద్ధాన్తః - "ఆకాశో హ వై నామ నామరూపయోర్నిర్వహితా" (ఛా.ఉ.8.14.1) ఇత్యాదిశ్రుతిభ్యః తస్మాత్పరమేశ్వరస్యైవ త్రివృత్కుర్వతః కర్మ నామరూపయోర్వ్యాకరణమ్. త్రివృత్కరణపూర్వకమేవేదమిహ నామరూపవ్యాకరణం వివక్ష్యతే, ప్రత్యేకం

నామరూపవ్యాకరణస్య తేజోబన్నోత్పత్తి వచనేనైవోక్తత్వాత్. తచ్చ త్రివృత్కరణమగ్న్యాదిత్యచన్ద్రవిద్యుత్సు శ్రుతిర్దర్శయతి- "యదగ్నే రోహితం రూపం తేజసస్తద్రూపం, యచ్ఛుక్లం తదపాం యత్కృష్ణం తదన్నస్య" (ఛా.ఉ.6.4.1) ఇత్యాదినా. తత్ర అగ్నిరితీదం రూపం వ్యాక్రియతే. సతి చ రూపవ్యాకరణే విషయప్రతిలమ్భాదగ్నిరితీదం నామ వ్యాక్రియతే. ఏవమేవాదిత్యచన్ద్రవిద్యుత్స్వపి ద్రష్టవ్యమ్. అనేన చాగ్న్యాద్యుదాహరణేన భౌమామ్భసతైజసేషు త్రిష్వపి ద్రవ్యేష్వవిశేషేణ త్రివృత్కరణముక్తం భవతి, ఉపక్రమోపసంహారయోః సాధారణత్వాత్. తథా హ్యవిశేషేణైవోపక్రమః-"ఇమాస్తిస్రో దేవతాస్త్రివృత్త్రివృదేకైకా భవతి" (ఛా.ఉ.6.3.4) ఇతి. అవిశేషేణైవ చోపసంహారః - "యదు రోహితమివాభూదితి తేజసస్తద్రూపమ్" ఇత్యేవమాదిః, "యదవిజ్ఞాతమివాభూదిత్యే తాసామేవ దేవతానాం సమాసః" (ఛా.ఉ.6.4.7) ఇత్యేవమన్తః. 20.

బాలానందిని

ఇత్యేవమితి:-ఈ విధంగా ప్రాప్తించగా సంజ్ఞామూర్తిక్లప్తిస్తు అని చెప్పుతున్నాడు. తుశబ్దంచేత పూర్వపక్షాన్ని నివారిస్తున్నాడు. 'సంజ్ఞామూర్తిక్లప్తి' అనగా నామరూపవ్యాకరణం అని అర్థం. త్రివృత్కుర్వతః అని పరమేశ్వరుణ్ణి బోధిస్తుంది. ఎందువల్ల ననగా త్రివృత్కరణం విషయంలో పరమేశ్వరుడే కర్త అని నిఃస్సంశయంగా చెప్పబడింది. ఆదిత్యుడు, చంద్రుడు, విద్యుత్తు అని ఏ సంజ్ఞాక్లప్తి (నామవిధానము) మూర్తి క్లప్తి (రూపవిధానము) ఉన్నాయో, అట్లే కుశలు, రెల్లుగడ్డి, పలాశం మొదలైనవాటిలోను, పశువులు, మృగాలు, మనుష్యులు మొదలైనవాటిలోను, ప్రతీ జాతికి ప్రతీ వ్యక్తికీ సంబంధించిన అనేక విధాలైన ఏ నామరూపవిధానం ఉన్నదో అది తేజస్సును జలాన్ని పృథ్వినీ సృష్టించిన పరమేశ్వరుడు చేసిన పనియే అయి ఉండాలి. ఎందువల్ల? ఉపదేశంవల్ల. అదెట్లనగా - "సేయం దేవతైక్షత" అని ఉపక్రమించి వ్యాకరవాణి అని ఉత్తమపురుషప్రయోగంచేత పరబ్రహ్మయే వ్యాకర్త అని ఇక్కడ చెప్పబడుచున్నది. (ప్రశ్న) జీవేన అనే విశేషణంచేత నామరూపవ్యాకరణం చేసినవాడు జీవుడే అని నిర్ణయించాం కదా? (సమాధానం) ఇది ఇట్లు కాదు. జీవేన అనేది అనుప్రవిశ్య అనేది

దగ్గరగా ఉండడంచేత దానితోనే సంబంధిస్తుంది కాని "వ్యాకరవాణి" అనేదానితో సంబంధించదు. దానితో సంబంధించే పక్షంలో దేవత విషయంలో ప్రయోగించబడిన "వ్యాకరవాణి" అనే ఈ ఉత్తమపురుష ఔపచారికం (లాక్షణికం) అని చెప్పవలసి వస్తుంది. గిరినదీసముద్రాదులైన అనేకవిధాలైన నామరూపాల విషయంలో ఈశ్వరభిన్నుడైన జీవునకు వ్యాకరణం చేసే సామర్థ్యం పరమేశ్వరుని మీద ఆధారపడినదే. మరొక విషయ మేమనగా-రాజుకంటె వేరుగా గూఢచారి ఉన్నట్లు పరమేశ్వరునికంటె భిన్నుడుగా జీవు డనేవాడు లేడుకదా? అందుచేతనే 'ఆత్మనా' ( నా ఆత్మయైన జీవునిచేత ప్రవేశించి) అని ('జీవేన' అనేదానికి) విశేషణం ఉపయోగింపబడింది. జీవత్వం కేవలం ఉపాధిని పట్టి మాత్రమే ఏర్పడింది. అందుచేత జీవుడు చేసిన నామరూపవ్యాకరణం కూడ పరమేశ్వ రకృతమే అవుతుంది. "ఆకాశో....నిర్వహితా" ఇత్యాదిశ్రుతులలో చెప్పినట్లు పరమేశ్వరుడే నామరూపవ్యాకరణం చేసినవాడు అనేది సమస్తమైన ఉపనిషత్తుల సిద్ధాంతం. అందుచేత ఈ నామరూపవ్యాకరణం త్రివృత్కరణం చేసిన పరమేశ్వరుని కర్మయే.

వి. త్రివృత్కరణం అయిన తరవాతనే నామరూపవ్యాకరణం చేయబడింది. ఈ నామరూపవ్యాకరణం భౌతికసృష్టికి సంబంధించినది. అనగా పృథివ్యాదిభూతాలు ముందు పుట్టిన తరవాత వాటినుండి పుట్టినవి భౌతికాలు. వాటి నామరూపవ్యాకరణాన్ని గూర్చి ప్రధానంగా ఇక్కడ చెప్పబడుచున్నది. ఈ విషయం సూచించడానికే సూత్రంలో త్రివృత్కరణం చేసిన పరమేశ్వరుడే నామరూపవ్యాకరణం చేశాడు అని చెప్పబడింది. అగ్ని, జలం, పృథివి అనే మూడు భూతాలను ఒక్కొక్కదానిని రెండేసి సమభాగాలు చెయ్యాలి. ఆ మూడింటి మూడు సమభాగాలను (అర్ధ భాగాలు) వేరు వేరుగా ఉంచి వాటి మిగిలిన మూడు అర్ధభాగాలను రెండేసి భాగాలుగా చేసి వాటిని ఇతరభూతాల రెండు అర్ధభాగాలలో కలపాలి. ఉదాహరణకి- తేజస్సును రెండు సమభాగాలుగా చేసి, ఒకటి వేరుగా ఉంచి రెండవ సమభాగం రెండు భాగాలుగా చేసి వాటిలో ఒకభాగం జలసమభాగంలోను, మరొకటి పృథివీసమభాగంలోను కలపాలి. అట్లే జలాదుల విషయంలో కూడ. ఈ విధంగా అన్ని భూతాలలోను ఇతరభూతాల అంశం కూడ కలిసి ఉంటుంది దీనికి త్రివృత్కరణం అని పేరు.

త్రివృదితి:- ఇక్కడ నామరూపవ్యాకరణం ముందుగా త్రివృత్కరణం చేసిన

తరవాతనే చేయబడినట్లు గ్రహించాలి. (ఇక్కడ తేజోబన్నాల నామరూపవ్యాకరణాన్ని గూర్చి చెప్పవలసిన పని లేదు. ఎందువల్లననగా) తేజోబన్నాలు పుట్టినట్లు చెప్పడంచేతనే వేరు వేరుగా వాటి నామరూపవ్యాకరణం చేసినట్లు అవుతుంది. (అందుచేత ఇక్కడ చెప్పిన వ్యాకరణం ప్రధానంగా భౌతికసృష్టికి సంబంధించినదే అని అర్థం). "యదగ్నే......అన్నస్య" ఇత్యాదివాక్యాలచేత అగ్న్యాదిత్యచంద్రవిద్యుత్తులలో త్రివృత్కరణం ఉన్నట్లు చెప్పబడినది. (అగ్నిలో ఉన్న ఎఱ్ఱని రూపం తెజస్సుది, తెల్లని రూపం జలానిది, నల్లని రూపం పృథివిది అని చెప్పడంచేత అక్కడ చెప్పిన అగ్న్యాదులు త్రివృత్కరణం చేసిన తరవాత కనబడే అగ్న్యాదులే అని తెలుస్తూన్నది అని భావం). అక్కడ 'అగ్ని' అని రూపం వ్యాకరించబడుతున్నది. రూపవ్యాకరణం అయిన తరవాత ఒక విషయం (పదార్థం) లభించినది గాన దానికి 'అగ్ని' అని పేరు పెట్టబడింది. ఆదిత్యచంద్ర విద్యుత్తుల విషయంలో కూడ ఇట్లే చూచుకోవాలి. ఈ అగ్న్యాద్యుదాహరణంచేత భౌమములు (భూమినుండి పుట్టినవి) ఆంభసములు (జలంనుండి పుట్టినవి) తైజసములు (తేజస్సునుండి పుట్టినవి) అయిన ద్రవ్యాలన్నింటిలోనూ త్రివృత్కరణం చెప్పబడి నట్లు అవుతుంది. ఎందువల్ల ననగా ఉపక్రమోపసంహారాలు ఒకే విధంగా ఉన్నాయి. "ఇమాః...భవతి ( ఈమూడు దేవతలలో ఒక్కొక్క దేవత త్రివృత్ త్రివృత్ అవుతుంది) అని భేదం ఏమీ లేకుండానే ఉపక్రమం చేయబడింది. "యదు....రూపమ్" (ఎఱ్ఱగా ఉన్నట్లు కనబడేది తేజస్సుయొక్కరూపం) అనేది మొదలు "యదవిజ్ఞాత...సమాసః" (ఏ కపోతరూపాదికం ఎరుపు నలుపు తెలుపు ఇద్యాదివిధాలతో స్పష్టంగా తెలియదో అది కూడ ఈ దేవతల కలయికయే) వరకు ఉపసంహారం కూడ భేదం ఏదీ లేకుండా చేయబడింది. ఈ విధంగా ఏ పరమేశ్వరుడు త్రివృత్కరణం చేశాడో ఆ పరమేశ్వరుడే సమస్త భూతభౌతికాల నామరూపవ్యాకరణం చేసినట్లు శ్రుతి చెప్పుచున్నది గాన ప్రజాపతి మొదలైన జీవులు నామరూపవ్యాకరణం చేయడం అనేది సంభావ్యం కాదు అని భావం.20

## భాష్యమ్

తాసాం తిసృణాం దేవతానాం బహిస్త్రివృత్కృతానాం సతీనామధ్యాత్మ మపరం త్రివృత్కరణముక్తమ్. "ఇమాస్తిస్రోదేవతాః పురుషం ప్రాప్య

త్రివృత్త్రివృదేకైకా భవతి" (ఛా.ఉ.6.4.7) ఇతి. తదిదానీమాచార్యో యథాశ్రుత్యేవోప దర్శయత్యాశఙ్కితం కంచిద్దోషం పరిహరిష్యన్-

సూ. మంసాది భౌమం యథాశబ్దమితరయోశ్చ. 2-4-21

భూమేస్త్రివృత్కృతాయాః పురుషేణోపభుజ్యమానాయా మాంసాది కార్యం యథాశబ్దం నిష్పద్యతే. తథా హి శ్రుతిః- "అన్నమశితం త్రేధా విధీయతే. తస్య యః స్థవిష్ఠో ధాతుస్తత్పురీషం భవతి. యో మధ్యమస్తన్మాంసం. యోఽణిష్ఠ స్తన్మనః" (ఛా.ఉ,6.5-1) ఇతి. త్రివృత్కృతా భూమిరేవైషా వ్రీహియవాద్యన్న రూపేణాద్యత ఇత్యభిప్రాయః. తస్యాశ్చ స్థవిష్ఠం రూపం పురీషభావేన బహిర్గచ్ఛతి. మధ్యమమధ్యాత్మం మాంసం వర్ధయతి. అణిష్ఠం తు మనః. ఏవమితరయో రప్తేజసోర్యథాశబ్దం కార్యమవగన్తవ్యమ్. మూత్రం లోహితం ప్రాణశ్చాపాం కార్యమ్. అస్థి,మజ్జా,వాక్ తేజస ఇతి. 21.

బాలానందిని

తాసామితి :-బైట త్రివృత్కృతాలైన ఆ మూడు దేవతలు శరీరంలో మరొకవిధమైన త్రివృత్కరణం పొందుతాయని "ఇమా.... భవతి" (ఈ మూడు దేవతలు పురుషుణ్ణి పొంది ఒక్కొక్కటి త్రివృత్ త్రివృత్ గా అవుతుంది)అని చెప్పబడింది. ఈ విషయాన్నే ఆచార్యుడు ఆశంకించిన ఒక దోషాన్ని పరిహరించనున్నవాడై, శ్రుతిలో చెప్పినవిధంగానే, చెపుతున్నాడు-

మంసాదీతి :- భౌమమ్ =భూమికి సంబంధించినది మాంసాది=మాంసాదికం కూడ, యథాశబ్దమ్=శ్రుతిలో చెప్పిన విధంగా మూడేసి విధాలుగా మారుతుంది. ఇతరయోశ్చ=తైజసాప్యాలకు కూడ" అని సూత్రార్థం.

భూమేరితి :-పురుషుడు భుజించిన త్రివృత్కృతమైన భూమినుండి, శ్రుతిలో చెప్పినట్లు మాంసాదికార్యం తయారవుతుంది. "అన్నమ్....మనః" అని శ్రుతి చెప్పుచున్నది. (తిన్న అన్నం మూడు విధాలవుతుంది. దానిలోని స్థూలమైన ధాతువు పురీషం అవుతుంది, మధ్యరకం ధాతువు మాంసం అవుతుంది; సూక్ష్మమైన ధాతువు మనస్సు అవుతుంది అని ఈ వాక్యానికి అర్థం. త్రివృత్కృతమైన ఈ భూమియే వ్రీహి

యవాదిరూపమైన అన్నంగా భుజించబడుతుం దని అభిప్రాయం. దాని స్థూలతమమైన రూపం పురీషరూపంలో బైటకు పోతుంది. మధ్యమమైన రూపం శరీరంలో మాంసం వృద్ధి పొందిస్తుంది. అతిసూక్ష్మ మైనది మనస్సుగా పరిణమిస్తుంది. ఈ విధంగానే శ్రుత్యనుసారం మిగిలిన జలతేజస్సుల కార్యం కూడ గ్రహించాలి. మూత్రం, రక్తం, ప్రాణం ఈ మూడు జలంయొక్క కార్యాలు; ఎముక, మజ్జ, వాక్కు ఈ మూడు తేజస్సు యొక్క కార్యాలు. (భూతాల విషయంలో త్రివృత్కరణం అనగా మూడు భూతాల మూడు భాగాలు కలిసి ఒక భూతంగా అవడం. శరీరంలో ఈ భూతాల త్రివృత్కరణం ఒక్కొక్క భూతం మూడేసి కార్యాలు పుట్టించడం). 21

## భాష్యమ్

అత్రాహ - యది సర్వమేవ త్రివృత్కృతం భూతభౌతికమవిశేషశ్రుతేః "తాసాం త్రివృతం త్రివృతమేకైకామకరోత్" ఇతి, కింకృతస్తర్హ్యయం విశేషవ్యపదేశః ఇదం తేజః, ఇమా అపః, ఇదమ్ అన్నమ్ ఇతి, తథా ఆధ్యాత్మమిదమన్నస్యాశితస్య కార్యం మాంసాది, ఇతమపాం పీతానాం కార్యం లోహితాది, ఇదం తేజసోఽశితస్య కార్యమస్థ్యాది ఇతి? అత్రోచ్యతే -

### సూ. వైశేష్యాత్తు తద్వాదస్తద్వాదః 2.4.22

తుశబ్దేన చోదితం దోషమపనుదతి. విశేషస్య భావో వైశేష్యమ్, భూయస్త్వమితి యావత్. సత్యపిత్రివృత్కరణే క్వచిత్కస్యచిద్భూతధాతో ర్భూయస్త్వ ముపలభ్యతే. అగ్నేస్తేజోభూయస్త్వమ్. ఉదకస్యాబ్భూయస్త్వం, పృథివ్యా అన్న భూయస్త్వ మితి. వ్యవహారప్రసిద్ధ్యర్థం చేదం త్రివృత్కరణమ్. వ్యవహారశ్చ త్రివృత్కృతరజ్జువదేకత్వాపత్తౌ సత్యాం న భేదేన భూతత్రయ గోచరో లోకస్య ప్రసిద్ధ్యేత్. తస్మాత్సత్యపి త్రివృత్కరణే వైశేష్యాదేవ తేజోబన్న విశేషవాదో భూతభౌతికవిషయ ఉపపద్యతే. తద్వాదస్తద్వాద ఇతి పదాభ్యాసోఽధ్యాయపరిసమాప్తిం ద్యోతయతి. 22.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీగోవిన్ద భగవత్పూజ్యపాద శిష్యశ్రీమచ్ఛఙ్కర భగవతః కృతౌ శ్రీ మచ్ఛారీరకమీమాంసాభాష్యే ద్వితీయాధ్యాయస్య చతుర్థః పాదః. సమాప్తశ్చ అధ్యాయః.

బాలానందిని

అత్రాహేతి :- ("ఆశఙ్కితం చ కం చిద్దోషం పరిహరిష్యన్" అని వెనుక చెప్పిన దోషాన్ని విశదీకరిస్తున్నారు). ఇక్కడ ఇలా అంటున్నాడు- "తాసాం...అకరోత్" అని విశేషం ఏమీ లేని (అనగా అన్నింటికీ సమంగా వర్తించే) శ్రుతిని పట్టి సమస్తమైన భూత-భౌతికం (మహాభూతాలు, వాటినుండి పుట్టినవి)కూడ త్రివృత్కృతం అవుతే ఇది తేజస్సు,ఇది జలం, ఇది అన్నం (పృథివి) అని విశేషవ్యపదేశం (వేరువేరుగా చెప్పడం), అట్లే శరీరంలో ఈ మాంసాదికం తిన్న అన్నంయొక్క కార్యం. ఈ రక్తాదికం త్రాగిన నీళ్ల కార్యం, ఈ ఎముకలు మొదలైనవి తిన్న తేజస్సుయొక్క కార్యం అని వేరువేరుగా చెప్పడం దేనిని పట్టి ఏర్పడింది? (త్రివృత్కరణం జరిగి ఉండడంచేత పృథివిలో నీరు, అగ్ని కూడ ఉన్నాయి, అట్లే ఇతరమైన రెండింటిలోను కూడ. అందుచేత పృథివి అనేదానినే అగ్ని అనీ, జలం అనీ కూడ అనవచ్చు కదా అని అర్థం). ఈ విషయంలో చెప్పబడుచున్నది-

వైశేష్యాదితి:- "వైశేష్యాత్తు = అధికంగా ఉండడాన్ని బట్టి, తద్వాదః= తేజస్సు అనీ, జలం అనీ, పృథివి అనీ చెప్పడం జరుగుచున్నది" అని సూత్రార్థం.

తుశబ్దేనేతి :- తుశబ్దంచేత చోదితమైన (ఆక్షేపపూర్వకంగా చెప్పబడిన) దోషాన్ని తొలగిస్తున్నాడు. విశేషంయొక్క ధర్మం వైశేష్యం. అనగా అధికత్వం అని అర్థం. త్రివృత్కరణం ఉన్నా కూడ అగ్నిలో తేజస్సు పాలు అధికంగా ఉండడం, పృథివిలో అన్నం (భూమి) పాలు ఎక్కువగా ఉండడం ఈ విధంగా ఒకదానిలో ఒక భూతధాతువు అధికంగా కనబడుతూన్నది. ఈ త్రివృత్కరణం వ్యవహారంయొక్క ప్రసిద్ధికొరకు (నిపట్టి) చెప్పబడింది. మూడు పేటలు వేసి పేనిన త్రాడు ఒక్కటే అని వ్యవహరించి నట్లు లోకంలో వేరు వేరుగా మూడు భూతాలకు సంబంధించిన వ్యవహారం ప్రసిద్ధం కాదు. (అనగా ఒక్కొక్క భూతంలో మూడు భూతాలూ ఉన్నా కూడ అవి కలిసి ఏకం అయిపోవడంచేత ఎక్కువగా ఉన్నదానిని పట్టి లోకవ్యవహారం జరుగుచున్నది). అందుచేత త్రివృత్కరణం ఉన్నా కూడ ఆధిక్యాన్ని పట్టి మాత్రమే భూతభౌతికాలవిషయంలో ఇది తేజస్సు, ఇది జలం, ఇది

పృథివి అనే విశేషకథనం కుదురుతుంది). "తద్వాదః తద్వాదః" అని పదాన్ని రెండు సార్లు అవృత్తి చేయడం అధ్యాయం పూర్తి అయిన దని సూచిస్తున్నది. 22.

"బాలానందిని" అను శ్రీమచ్ఛాంకర శారీరక మీమాంసా భాష్యాంధ్రవ్యాఖ్యానంలో ద్వితీయాధ్యాయంలోని చతుర్థపాదం సమాప్తం.

శ్రీమద్బ్రహ్మసూత్రశాంకరభాష్యంలో అవిరోధాధ్యాయం అనే పేరు గల ద్వితీయాధ్యాయం సమాప్తం.

# అథ తృతీయోఽధ్యాయః

(తృతీయే సాధనాఖ్యాధ్యాయే పథమపాదే గత్యాగతిచిన్తా, వైరాగ్యనిరూపణవిచారశ్చ)

## 1. తదన్తరప్రతిపత్త్యధికరణమ్. సూ 1-7

**సూ. తదన్తరప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యామ్. 3.1.1**

ద్వితీయేఽధ్యాయే స్మృతిన్యాయవిరోధో వేదాన్తవిహితబ్రహ్మదర్శనే పరిహృతః; పరపక్షాణాం చానపేక్షత్వం ప్రపఞ్చితమ్, శ్రుతివిప్రతిపేధశ్చ పరిహృతః. తత్ర చ జీవవ్యతిరిక్తాని తత్త్వాని జీవోపకరణాని బ్రహ్మణో జాయన్త ఇత్యుక్తమ్. అథేదానీముపకరణోపహితస్య జీవస్య సంసారగతిప్రకారస్తదవస్థాన్తరాణి, బ్రహ్మతత్త్వం, విద్యావిద్యాభేదౌ, గుణోపసంహారానుపసంహారౌ, సమ్యగ్దర్శనాత్పురుషార్థసిద్ధిః, సమ్యగ్దర్శనోపాయవిధిప్రభేదో, ముక్తిఫలానియమశ్చేత్యేతదర్థజాతం తృతీయేఽధ్యాయే నిరూపయిష్యతే ప్రసంగాగతం చ కిమప్యన్యత్ తత్ర ప్రథమే తావత్పాదే పఞ్చాగ్ని విద్యామాశ్రిత్య సంసారగతిప్రభేదః ప్రదర్శ్యతే వైరాగ్యహేతోః; "తస్మాజ్జుగుప్సేత" ఇతి చాన్తే శ్రవణాత్.

బాలానందిని

తదితి.- "తదన్తరప్రతిపత్తౌ=మరొక దేహాన్ని పొందడంలో, జీవుడు, సంపరిష్వక్తః దేహానికి బీజాలైన భూతసూక్ష్మాలతో కూడినవాడై, రంహతి=వెడతాడు. ప్రశ్న నిరూపణాభ్యామ్ =ప్రశ్నచేత నిరూపణంచేత ఇట్లు తెలుస్తూన్నది" అని సూత్రార్థం.

ద్వితీయ ఇతి:- వేదాంతాలచేత ప్రతిపాదించబడిన బ్రహ్మదర్శనంలో స్మృతిన్యాయాలతో విరోధం లేదని ద్వితీయాధ్యాయంలో నిరూపించబడింది. పరపక్షాలు అనపేక్షాలని (వాటికి శ్రుత్యుపష్టంభం లేదని కూడ వివరింపబడింది. శ్రుతుల మధ్య నున్న విరోధం కూడ పరిహరింపబడింది. జీవునికంటె భిన్నమైనవి. జీవునకు ఉపకరణాలు అయిన తత్వాలు కూడ బ్రహ్మనుండే పుట్టాయని చెప్పబడింది. ఇంక ఇప్పుడు ఉపకరణాలతో కూడిన జీవుడు సంసారం ఏ విధంగా పొందుతాడో అది, జీవుని ఆ యా (జాగ్రదాది) అవస్థలు, జీవునకు బ్రహ్మస్వరూపత్వము, వివిధములైన విద్యల భేదా భేదాలు, గుణాల ఉపసంహారానుపసంహారాలు, సమ్యగ్దర్శనంవల్ల పురుషార్థసిద్ధి, సమ్యగ్దర్శనానికి ఉపాయాలైనవాటి విధులలో భేదం, ముక్తి రూపమైన ఫలం విషయంలో తారతమ్యాదినియామాలు లేకపోవడం ఈ విషయాలు, ఇంకా ప్రసంగవశంచేత వచ్చే మరి కొన్ని విషయాలు కూడ తృతీయాధ్యాయంలో నిరూపించబడతాయి.

అందులోని ప్రథమపాదంలో పంచాగ్నివిద్యను (ద్యు-పర్జన్య - పృథివీ - పురుష యోషిత్తులను అగ్నులనుగా భావించే విద్యను) ఆశ్రయించి వైరాగ్యం కలగడంకొరకై సంసారగతిభేదం చూపబడుతుంది. అందుచేతనే చివర "తస్మాజ్జుగుప్సేత" (దానినుండి జుగుప్స చెందాలి) అని చెప్పబడింది.

వి. వేదాంతార్థంలో విరోధం లేదు గాన దానిని తెలుసుకొనడానికి తగిన సాధనాల చింత చేయడానికి అవసరం ఏర్పడుతుంది. ఈ విధంగా ద్వితీయతృతీయాధ్యాయాలకు హేతుహేతుమద్భావసంగతి. లింగశరీరం అనే ఉపాధి సిద్ధిస్తే దానిచేత ఉపహితుడైన జీవుని సంసారచింత కూడ ఆవశ్యకం అవుతుంది. అందుచేత ద్వితీయాధ్యాయచతుర్థ పాదానికి తృతీయాధ్యాయప్రథమపాదానికి కూడా హేతుహేతుమద్భావసంగతి.

## భాష్యమ్

జీవో ముఖ్యప్రాణసచివః సేన్ద్రియః సమనస్కోఽవిద్యాకర్మపూర్వ ప్రజ్ఞాపరిగ్రహః పూర్వదేహం విహాయ దేహాన్తరం ప్రతిపద్యత ఇత్యేతదవగతమ్- "అథైనమేతే ప్రాణా అభిసమాయన్తి" ఇత్యేవమాదేః "అన్యన్నవతరం కల్యాణతరం రూపం కురుతే" (బృ.ఉ. 4.4. 1-4) ఇత్యేవమన్తాత్ సంసార

ప్రకరణస్థాత్ శబ్దాత్. ధర్మాధర్మఫలోపభోగసంభవాచ్చ. స కిం దేహబీజైర్భూత సూక్ష్మైరసంపరిష్వక్తో గచ్ఛత్యాహోస్విత్సంపరిష్వక్త ఇతి చిన్త్యతే. కిం తావత్ ప్రాప్తమ్? అసంపరిష్వక్త ఇతి. కరణోపాదానవద్భూతోపాదానస్యాశ్రుతత్వాత్. ''స ఏతాస్తేజోమాత్రాః సమభ్యాదదానః'' (బృ. ఉ. 4.4.1) ఇతి హ్యత్ర తేజోమాత్రాశబ్దేన కరణానాముపాదానం సంకీర్తయతి; వాక్యశేషే చక్షురాది సంకీర్తనాత్. నైవం భూతమాత్రోపాదానకీర్తనమస్తి. సులభాశ్చ సర్వత్ర భూతమాత్రాః. యత్రైవ దేహ ఆరబ్ధవ్యస్తత్రైవ సన్తి. తతశ్చ తాసాం నయనం నిష్ప్రయోజనమ్. తస్మాదపరిష్వక్తో యాతీతి.

### బాలానందిని

జీవ ఇతి:- ''అథైన ... సమాయన్తి'' (మరణించ నున్నవానిని ఈ ప్రాణాలన్నీ చేరుతాయి అనగా వాని హృదయంలో కలిసి ఉంటాయి అని ప్రారంభించి ''అన్యత్ ... కురుతే'' (మరొక క్రొత్తదీ మంగళప్రదమూ అయిన రూపం ధరిస్తాడు) వరకు ఉన్న సంసారాన్ని గూర్చిన ప్రకరణంలో ఉన్న శబ్దాన్ని పట్టి, ధర్మాధర్మఫలాల భోగం కూడ (ఇవన్నీ కూడా ఉంటేనే) కుదురుతుంది కాబట్టి, జీవుడు ముఖ్యప్రాణాలతో కూడినవాడై ఇంద్రియంతోను, మనస్సుతోను కూడినవాడై, అవిద్య, ధర్మాధర్మరూపమైన కర్మ జన్మాంతరసంస్కారం వీటితో కూడినవాడై, పూర్వదేహం విడచి మరొక దేహాన్ని పొందుతాడు అని తెలుస్తున్నది. అ జీవుడు దేహానికి బీజాలైన సూక్ష్మభూతాలతో కలిసి వెడతాడా లేక వాటితో కలవకుండానే వెడతాడా అని విచారణ చేయబడుచున్నది. ఏమి ప్రాప్తించింది? వాటితో కలవకుండా వెడతాడని. ఎందువల్ల? కరణాలను (ఇంద్రియాదులను) కూడా తీసుకొని వెడతాడు) అన్నట్లు భూతాలను కూడా తీసికొని వెడతాడు అని (శ్రుతిలో) వినబడడం లేదు కదా? ''స ఏతాస్తేజోమాత్రాః సమభ్యాదదానః'' అనే వాక్యంలో తేజోమాత్రాశబ్దంచేత కరణాల గ్రహణాన్ని మాత్రమే చెప్పుచున్నది. వాక్యశేషంలో చక్షురాదులను గూర్చి చెప్పడంచేత తేజోమాత్రాశబ్దానికి చక్షురాదీంద్రియా లనే అర్థమే గ్రహించాలి. ఈ విధంగా భూతమాత్రలను తీసికొని వెడతాడు అని లేదు. భూతమాత్రలు అంతటా సులభంగా లభిస్తాయి. ఎక్కడైతే దేహం పుట్టాలో అక్కడనే అవి లభిస్తాయి గాన

వాటిని తీసికొని వెళ్లడంలో ప్రయోజనం లేదు. అందుచేత భూతసూక్ష్మాలను కూడా తీసికొనకుండానే వెడతాడు.

భాష్యమ్

ఏవం ప్రాప్తే పఠత్యాచార్యః- "తదన్తరప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః" ఇతి. తదన్తర ప్రతిపత్తౌ దేహాద్దేహాన్తరప్రతిపత్తౌ దేహబీజైర్భూతసూక్ష్మైః సంపరిష్వక్తో రంహతి గచ్ఛతీత్యవగన్తవ్యమ్. కుతః? ప్రశ్ననిరూపణాభ్యామ్. తథాహి ప్రశ్నః "వేత్థ యథా పఞ్చమ్యామాహుతావాపః పురుషవచసో భవన్తి" (ఛా. ఉ. 5.3.3) ఇతి. నిరూపణం చ ప్రతివచనం ద్యుపర్జన్యపృథివీ పురుషయోషిత్సు పఞ్చస్వగ్నిషు శ్రద్ధాసోమవృష్ట్యన్నరేతోరూపాః పఞ్చాహుతీర్దర్శయిత్వా-"ఇతి తు పఞ్చమ్యామాహుతావాపః పురుషవచసో భవన్తి" (ఛా.ఉ.5.1.1.) ఇతి. తస్మాదద్భిః పరివేష్టితో జీవో రంహతి, వ్రజతీతి గమ్యతే. నన్వన్యా శ్రుతిః జలూకావత్పూర్వదేహం న ముఞ్చతి యావన్న దేహాన్తరమాక్రామతీతి దర్శయతి- "తద్యథాతృణజలాయుకా" (బృ.ఉ. 4.4.3) ఇతి? తత్రాప్యపరివేష్టితస్యైవ జీవస్య కర్మోపస్థాపితప్రతి పత్తవ్యదేహవిషయభావనాదీర్ఘభావమాత్రం జలూకయోపమీయత ఇత్యవిరోధః ఏవం శ్రుత్యుక్తే దేహాన్తరప్రతిపత్తిప్రకారే సతి యాః పురుషమతి ప్రభవాః కల్పనాః - వ్యాపినాం కరణానామాత్మనశ్చ దేహాన్తరప్రతిపత్తౌ కర్మవశాద్వృత్తి లాభస్తత్రభవతి, కేవలస్యైవాత్మనో వృత్తిలాభస్తత్ర భవతి, ఇన్ద్రియాణి తు దేహవదభినవాన్యేవ తత్ర తత్ర భోగస్థాన ఉత్పద్యన్తే; మన ఏవ వా కేవలం భోగస్థానమభిప్రతిష్ఠేత; జీవ ఏవ వోత్ప్లుత్య దేహాద్దేహాన్తరం ప్రతిపద్యతే శుక ఇవ వృక్షాద్వృక్షాన్తరమ్ ఇత్యేవమాద్యాః సర్వా ఏవానాదర్తవ్యాః శ్రుతివిరోధాత్.

బాలానందిని

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా ఆచార్యుడు "తదన్తర ప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః"

అని పలిస్తున్నాడు. తదన్తరప్రతిపత్తియందు, అనగా ఒక దేహంనుండి మరొక దేహాన్ని పొందడంలో దేహానికి బీజాలైన భూతసూక్ష్మాలతో కలిసి వెడతాడు అని తెలుసుకోవాలి. ఎందువల్ల? "వేత్థ .. భవన్తి" (ఉదకం) ఐదవ ఆహుతిలో పురుషుడని చెప్పదగినది ఎట్లు అవుతుందో, పురుషుడుగా ఎలా మారుతుందో, నువ్వు ఎరుగుదువా) అని ప్రశ్న ఉన్నది. ద్యులోకం, పర్జన్యుడు, పృథివి, పురుషుడు, స్త్రీ అనే ఐదు అగ్నులలో శ్రద్ధ, సోమం, వృష్టి, అన్నం, రేతస్సు అనే ఐదు ఆహుతులను చూపి "ఇతి.. భవన్తి" (ఈ విధంగా ఉదకం పంచమాహుతిలో పురుషుడుగా అవుతుంది) అని నిరూపణ, అనగా ప్రతివచనం కూడ ఉన్నది. అందువల్ల జీవుడు ఉదకంతో పరివేష్టితుడై (చుట్టబడి) వెడతాడు అని తెలుస్తూన్నది.

వి. జీవుడు ప్రాణేంద్రియాలతో కలిసి దేహాంతరానికి వెడతాడు అని శ్రుతి చెప్పుచున్నది గాని భూతసూక్ష్మాలతో కూడ కలిసి వెడతాడని శ్రుతి ప్రత్యక్షంగా చెప్పడం లేదు. అయినా కూడ పంచాగ్నివిద్యలో చెప్పినదానిని పట్టి జీవుడు భూతసూక్ష్మాలతో కూడ కలిసి వెడతాడు అని తెలుస్తూన్నది. పంచాగ్నివిద్య ఛాందోగ్యోపనిషత్తులో ఉంది. ద్యులోకం, పర్జన్యుడు, పృథివి, పురుషుడు, స్త్రీ ఈ ఐదింటిని అగ్నిగా భావించి ఉపాసన చెయ్యాలి అని ఈ విద్య బోధిస్తూన్నది - ప్రవాహణుడనే రాజు తన సభకు వచ్చిన శ్వేతకేతువును 'వేత్థ యథా పఞ్చమ్యామాహుతావాపః పురుషవచసో భవన్తి'' అని ప్రశ్నించాడు. ఈ లోకంలో జలమయాలైన పాలు, పెరుగు మొదలైన ద్రవ్యాలను హోమం చేయగా హోమం చేసిన ఆ జలం యజమానుణ్ణి (యజ్ఞం చేసినవానిని) చేరుతుంది. వాని ద్వారా ద్యులోకం అనే అగ్నిని చేరుతుంది. అది శ్రద్ధ అనే ఆహుతిగా అవుతుంది. దానిని యాజమానుని ఇంద్రియాధిష్ఠానదేవతలు ఆ అగ్నిలో హోమం చేస్తారు. అలా హోమం చేయబడిన జలం సోమం అనే దేహంగా మారుతుంది. ఆ జలమయమైన దేహం వృష్ట్యభిమానదేవతయైన పర్జన్యుడనే అగ్నిలో హోమం చేయబడి వర్షంగా మారుతుంది. ఈ విధంగా సోమరూపాన్నీ, వృష్టిరూపాన్నీ పొందిన ఆ జలమే పృథివి అనే అగ్నిలో హోమం చేయబడి వ్రీహియవాద్యన్నరూపం పొందుతుంది. అన్నంగా అయిన ఆ జలం పురుషుడనే అగ్నిలో హోమం చేయబడి రేతస్సుగా మారుతుంది. రేతోరూపాన్ని పొందిన ఐదవ ఆహుతి యైన ఆ జలం స్త్రీ అనే అగ్నిలో హోమం చేయబడి గర్భంగా ఏర్పడి పురుషుడు అనే పేరు పొందుతుంది. జలం పురుషవచస్సు అవుతుందనగా ఇదే అర్థం. ఐదవ ఆహుతి హోమం

చేయగా జలం పురుషశబ్దవాచ్యం ఎలా అవుతుందో నీకు తెలుసునా అని రాజు అడిగాడు. శ్వేతకేతువు తండ్రి యైన గౌతముని దగ్గరికి వెళ్లి రాజు నన్ను ఈవిధంగా అడిగాడు. నాకు తెలియలేదని చెప్పాడు. గౌతముడికి కూడ తెలియకపోవడంతో అతడు రాజు దగ్గరికి వెళ్లి అదేదో నువ్వే చెప్పు అని కోరాడు. అప్పుడు రాజు అతనికి ఈ పంచాగ్నివిద్య బోధించాడు. దీనిని పట్టి యజమానుడు మరణానంతరం ఆ ఉదకంతో సహా ద్యులోకానికి వెడతాడనీ తరవాత క్రమంగా పర్జన్యాదుల ద్వారా మళ్లీ పురుషుడుగా జన్మిస్తాడనీ తెలుస్తూన్నది గాన జీవుడు మరణానంతరం ఇంద్రియాదులతో పాటు జలంతో కూడ (జలం అనగా త్రివృత్కృతజలంగాన, జలతేజఃపృథ్వుల సూక్ష్మరూపంతో (కూడ) వెడతాడని తెలుస్తున్నది అని భావం.

నన్వితి:- (ఆశంక) గడ్డి మీద సంచరించే జలూక (ఒక పొడుగు కాళ్ల పురుగు) అవతల ఉన్న గడ్డిని పట్టుకొన్న తరవాతనే తానున్న గడ్డిని విడచిపెట్టినట్లు జీవుడు మరొక దేహం గ్రహించే వరకు పూర్వ దేహం విడవడు అని ''తద్యథా తృణజలాయుకా'' అనే మరొక శ్రుతి చెప్పుచున్నది కదా? (అలాంటప్పుడు జీవుడు జలంతో కలిసి వెళ్లి పోయిన తరువాత మరొక దేహంలోనికి వెడతాడని చెప్పడం యుక్తం కాదు కదా?) (సమాధానం) ఆ శ్రుతిలో కూడ (అ శ్రుతి ప్రకారం కూడా) జలంచేత పరివేష్టతుడైన జీవునకే కర్మచేత ఏర్పడిన, తనచేత పొందదగిన, దేహాన్ని గూర్చిన భావనయొక్క దీర్ఘభావం మాత్రమే జలూకతో పోల్చబడుతున్నది గాన విరోధం లేదు.

వి. తృణజలూక ఒక తృణాగ్రం మీద నిలబడి పొడవుగా సాగి అవతలి తృణాగ్రాన్ని పట్టుకొని అప్పుడు వెనుకటి తృణాగ్రాన్ని విడిచి పెడుతుంది. అదే విధంగా జీవుడు ఈ దేహంలో ఉండగానే రాబోయే దేహాన్ని పట్టుకొని తరవాత ఈ దేహాన్ని విడిచి పెడతాడు అనే అభిప్రాయంతో ఈ తృణజలూకోపమానం చూపబడలేదు. వీనికి కర్మబలంచేత, రాబోయే స్థూలశరీరాన్ని గూర్చిన భావన కలుగుతుంది. ఆ భావన తృణజలూకా శరీరంవలె దీర్ఘమైనది గాన దీర్ఘత్వం విషయంలోనే ఈ ఉపమానం - ఇది బ్రహ్మవిద్యా భరణకారుని వ్యాఖ్య. దీనినిపట్టి జీవునికి భావిశరీరభావన ఎట్లు కలిగిందనగా కర్మ బలంచేత అని చెప్పుకోవాలి. అందుచేత ''కర్మోపస్థాపిత'' అనే దానికి ''భావనా'' తో అన్వయం అయితే భావిదేహానుభవం ఉంటేనే కాని దాని భావన ఉండదు గాన

భామతీకారుడు దీనికి మరొక విధంగా అర్థం చెప్పాడు. కర్మ అనగా రంహణకర్మ; రంహణం అనే పనిచేత సమకుర్చబడిన, పొందదగిన దేహానికి సంబంధించిన భావన యొక్క అనగా పుట్టుకయొక్క దీర్ఘభావం అని చెప్పాడు.

ఏవమితి:- దేహాంతరాన్ని పొందే ప్రకారం శ్రుతిలో ఈ విధంగా చెప్పబడి ఉండగా - (1) సర్వ వ్యాప్తాలైన అంతఃకరణాదికరణాలకీ ఆత్మకీ దేహాంతరలాభం కలగగానే కర్మవశంచేత ఆ దేహంలో వృత్తి (చేష్టాదికం) లభిస్తుంది. అనీ (2) ఆ దేహంలో కేవలమైన ఆత్మకే వృత్తిలాభం (జ్ఞానాదివ్యవహారం) కలుగుతుంది, ఇంద్రియాలైతే (శరీరం వలెనె) భోగస్థానమైన శరీరంలో క్రొత్తవి పుడతాయి అనీ, (3) కేవలం మనస్సు మాత్రమే భోగ స్థానానికి బయలుదేరి వెడుతుందనీ, (4) లేదా చిలక ఎగిరి ఒక చెట్టునుండి మరొక చెట్టుమీదికి వెళ్లినట్లు జీవుడే ఒక దేహంనుంచి ఎగిరి మరొక దేహంలోనికి వెడతాడనీ, ఈవిధంగా పురుషుల బుద్ధులనుండి పుట్టుకొని వచ్చిన కల్పన లన్నీ, శ్రుతివిరుద్ధములు గాన ఆదరింపదగినవి కావు.

వి. పైన చెప్పిన వాటిలో మొదటిది సాంఖ్యుల అభిప్రాయం. రెండవది నైయాయికుల మతం. మూడవది ఆత్మా బాహ్యేంద్రియాలూ కూడ విభువులే; మనస్సు మాత్రం అల్ప ప్రమాణం కలది అనేవాళ్ల మతం. నాల్గవది దిగంబరజైనుల మతం.

## భాష్యమ్

ననూదాహృతాభ్యాం ప్రశ్నప్రతివచనాభ్యాం కేవలాభిరద్భిః సంపరిష్వక్తో రంహతీతి ప్రాప్నోతి, అప్‌శబ్దశ్రవణాత్. తత్ర కథం సామాన్యేన ప్రతిజ్ఞాయతే సర్వైరేవ భూతసూక్ష్మైః సంపరిష్వక్తో రంహతీతి? అత ఉత్తరం పఠతి-

## సూ. త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్ 3.1.2

తుశబ్దేన చోదితామాశఙ్కాముచ్ఛినత్తి - త్ర్యాత్మికా హ్యాపస్త్రివృత్కరణ శ్రుతేః. తాస్వారమ్భికాస్వభ్యుపగతాసు ఇతరదపి భూతద్వయమవశ్యమభ్యుప గన్తవ్యం భవతి. త్ర్యాత్మక శ్చ దేహస్త్రయాణామపి తేజోబన్నానాం తస్మిన్ కార్యోపలబ్ధేః. పునశ్చ త్ర్యాత్మకః త్రిధాతుత్వాత్త్రిభిర్వాతపిత్తశ్లేష్మభిః. న భూతాన్తరాణి

న ప్రత్యాఖ్యాయ కేవలాభిరద్భిరారబ్ధుం శక్యతే. తస్మాద్భూయస్త్వాపేక్షోఽయమాపః పురుషవచస ఇతి ప్రశ్న ప్రతివచనయోరప్శబ్దో న కైవల్యాపేక్షః, సర్వదేహేషు హి రసలోహితాదిద్రవద్రవ్యభూయస్త్వం దృశ్యతే. నను పార్థివో ధాతుర్భూయిష్ఠో దేహేషూలభ్యతే? నైష దోషః. ఇతరాపేక్షయాప్యపాం బాహుల్యం భవిష్యతి. దృశ్యతే చ శుక్రశోణితలక్షణేఽపి దేహబీజే ద్రవబాహుల్యమ్. కర్మ చ నిమిత్తకారణం దేహాన్తరారమ్భే. కర్మాణి చాగ్నిహోత్రాదీని సోమాజ్యపయఃప్రభృతిద్రవ్యవ్యపాశ్రయాణి. కర్మ సమవాయిన్యశ్చాపః శ్రద్ధాశబ్దోదితాః సహ కర్మభిర్ద్యులో కాఖ్యేఽగ్నౌ హూయన్త ఇతి వక్ష్యతి. తస్మాదప్యపాం బాహుల్యసిద్ధిః. బాహుల్యాచ్చాప్శబ్దేన సర్వేషామేవ దేహబీజానాం భూతసూక్ష్మాణాముపాదానమితి నిరవద్యమ్.

బాలనందిని

నన్వితి:- ఉదాహరించబడిన ప్రశ్నప్రతివచనాలచేత, అక్కడ అప్‌శబ్దం వినబడడంవల్ల కేవలం ఉదకంతో మాత్రమే కలిసి వెడతాడని ప్రాప్తిస్తుంది. అలాంటప్పుడు అన్ని భూతసూక్ష్మాలతోను సంపరిష్వక్తుడై వెడతాడని, సామాన్యరూపంలో ఎలా చెప్పబడుచున్నది? అందుకు సమాధానం పఠిస్తున్నాడు.

త్ర్యాత్మకేతి:- "త్ర్యాత్మకత్వాత్తు =జలం భూతత్రయాత్మకం అవడంవల్ల, భూయస్త్వాత్= జలం పాలు అధికంగా ఉండడంవల్ల అలా చెప్పబడింది" అని సూత్రార్థం.

తుశబ్దేనేతి:- తుశబ్దంచేత చోదించిన ఆశంకను పెకిలించి వేస్తున్నాడు. త్రివృత్కరణ శ్రుత్యనుసారం జలం త్రిభూతాత్మకం కదా? జలం దేహారంభకం అని అంగీకరిస్తే మిగిలిన రెండు భూతాలూ కూడ ఆరంభకాలే అని అంగీకరించాలి. అ దేహంలో తేజోబన్నాల మూడింటి కార్యాలూ కూడ కనబడడంచేత కూడ (పాకం తేజః కార్యం, స్వేదాదికం జలకార్యం, గంధం పృథివీకార్యం) దేహం త్ర్యాత్మకం. వాతపిత్తశ్లేష్మాలనే మూడు ధాతువు లుండడంచేత కూడ ఇది త్ర్యాత్మకమే. అందుచేత ఇతరభూతాల అపేక్ష

లేకుండా కేవలం జలంచేత దేహం ఆరంభించబడడానికి (పుట్టడానికి) శక్యం కాదు. అందుచేత "ఆపః పురుషవచసః" అనే వాక్యం భూయస్త్వాన్ని (అవి అధికంగా ఉండడాన్ని) పట్టి చెప్పబడినది. ప్రశ్నప్రతివచనాలలో ఉన్న అప్శబ్దం కూడ కైవల్యాన్ని పట్టి (అది ఒక్కటే ఉండడంవల్ల) చెప్పినది కాదు. అన్ని దేహాలలోను రసం, రక్తం మొదలైన ద్రవ ద్రవ్యాలు అధికంగా కనబడుతున్నాయి కదా? (ప్రశ్న) దేహాలలో పార్థివధాతువు అధికంగా కనబడుతున్నది కదా? (సమాధానం) ఇది దోషం కాదు. ఇతర ధాతువులకంటె కూడ జలానికి బాహుల్యం ఉంటుంది. (పరిశీలిస్తే నీళ్లపాలే ఎక్కువ అని అర్థం). శుక్ర శోణితరూపమైన దేహబీజంలో కూడ ద్రవమే అధికంగా ఉండడం కనబడుతుంది. దేహాంతరారంభానికి కర్మ నిమిత్తకారణం. అగ్నిహోత్రాదికర్మలలో సోమం, అజ్యం, క్షీరం మొదలైనవి అధికంగా ఉపయోగించబడతాయి. కర్మతో సంబంధించిన జలానికే కర్మలతో సహ శ్రద్ధ అని పేరు; అనగా కర్మసహితమైన, కర్మతో సంబంధించిన, ఉదకానికి శ్రద్ధ అని పేరు. అట్టి పేరుగల ఉదకం ద్యులోకం అనే అగ్నిలో హోమం చేయబడుతుంది అని చెప్పనున్నాడు. అందువల్ల కూడ ఉదకం అధిక ప్రమాణంలో ఉంటుంది అనే ప్రసిద్ధి ఏర్పడింది. ఉదకం అధికంగా ఉండడంచేత దానిచేత (అప్శబ్దంచేత) దేహ బీజాలైన అన్ని భూతసూక్ష్మాలనూ గ్రహించాలి. ఉదకం అధికంగా ఉండడంచేత ఉదకం అని అన్నా కూడ మొత్తం మూడు భూతాలను గ్రహించాలి అని భావం.-

## సూ. ప్రాణగతేశ్చ 3.1.3.

ప్రాణానాం చ దేహాన్తరప్రతిపత్తౌ గతిః శ్రావ్యతే - "తముత్క్రామన్తం ప్రాణోఽనూత్క్రామతి ప్రాణముత్క్రామన్తం సర్వే ప్రాణా అనూత్క్రామన్తి" (బృ.ఉ.4.4.2) ఇత్యాదిశ్రుతిభిః. సా చ ప్రాణానాం గతిర్నాశ్రయమన్తరేణ సంభవతీత్యతః ప్రాణగతిప్రయుక్తా తదాశ్రయభూతానామపామపి భూతాన్తరోపసృష్టానాం గతిరవగమ్యతే. న హి నిరాశ్రయాః ప్రాణాః క్వచిద్గచ్ఛన్తి తిష్ఠన్తి వా, జీవతోఽదర్శనాత్ 3.

### బాలానందిని

అవ. ఇక్కడ ఒక ఆశంక కలుగుతుంది. పంచాగ్ని విద్యను పరిశీలించగా భూత

సూక్ష్మాలతో కూడిన జీవుడు వెడతాడు అని తెలుస్తూన్నది అని చెప్పిన పక్షంలో, పంచాగ్ని విద్యోపాసకులు దక్షిణమార్గంలో వెడతారు గాన, వాళ్లు మాత్రమే. భూతసూక్ష్మాలతో పయనిస్తారు అని అర్థం వస్తుంది. ఉత్తరమార్గగాములు గాని, నరకాదులకు పోయేవాళ్లు గాని భూతసూక్ష్మాలతో వెళ్లరని కూడా అర్థం వస్తుంది. వాళ్ల విషయంలో ఎట్లు అని ఆశంకించుకొని అందరూ కూడ భూతసూక్ష్మాలతో వెడతారు; పంచాగ్నివిద్య ఒక శ్రౌత ప్రమాణంగా చూపబడింది అని సూచించడం కోసం ఈ సూత్రం చెప్పబడుచున్నది.

ప్రాణేతి:- "ప్రాణగతేశ్చ=ప్రాణాలకు గతి చెప్పడంవల్ల కూడ, ప్రతీ జీవుడు భూత సూక్ష్మాలతోనే పయనిస్తాడు అని తెలుస్తూన్నది" అని అర్థం.

ప్రాణానామితి:- (జీవుడు) దేహాంతరం పొందే సందర్భంలో ప్రాణాలకు గతి ఉంటుందని - "తముత్క్రామన్తం .. అనూత్క్రామతి" ఇత్యాది శ్రుతులు చెపుతున్నాయి. ఆధారం లేకుండా ప్రాణాలు వెళ్లడం కుదరదు గాన ప్రాణగతిని పట్టి వాటికి ఆశ్రయమైన, ఇతరభూతాలతో కూడిన ఉదకం కూడ వెడుతుందని తెలుస్తూన్నది. ప్రాణాలు ఆశ్రయం లేకుండా ఎక్కడికీ వెళ్లడం గాని, ఉండడం గాని కుదరదు కదా? జీవించి ఉన్నప్పుడు అలాంటి దేదీ కనబడడం లేదు కదా; అనగా జీవుడు దేహంలో ఉన్నప్పుడు ఆ దేహంలోనే ప్రాణాలుంటున్నాయి కాని దూరంగా ఎన్నడూ లేవు గదా అని భావం. 3.

## సూ.అగ్న్యాదిగతిశ్రుతేరితి చేన్న భాక్తత్వాత్ 3.1.4

స్యాదేతత్; నైవ ప్రాణా దేహాన్తర ప్రతిపత్తౌ సహ జీవేన గచ్ఛన్తి, అగ్న్యాదిగతి శ్రుతేః. తథా హి శ్రుతిః మరణకాలే వాగాదయః ప్రాణాః అగ్న్యాదీన్ దేవాన్ గచ్ఛన్తీతి దర్శయతి - "యత్రాస్య పురుషస్య మృతస్యాగ్నిం వాగప్యేతి, వాతం ప్రాణః" (బృ.ఉ. 3.2.13) ఇత్యాదినేతి చేత్, న.భాక్తత్వాత్ వాగాదీనామగ్న్యాది గతిశ్రుతిర్గౌణీ, లోమసు కేశేషు చాదర్శనాత్. "ఓషధీర్లోమాని వనస్పతీన్ కేశాః" (బృ.ఉ. 3.2.13) ఇతి చ తత్రామ్నాయతే. న హి లోమాని కేశాశ్చోత్ప్లుత్య ఓషధీర్వనస్పతీంశ్చ గచ్ఛన్తీతి సంభవతి. న చ జీవస్య ప్రాణోపాధిప్రత్యాఖ్యానే గమనమవకల్పతే. నాపి ప్రాణైర్వినా దేహాన్తర ఉపభోగ ఉపపద్యతే. స్పష్టం చ

ప్రాణానాం సహ జీవేన గమనమన్యత్ర శ్రావితమ్. అతో వాగాద్యధిష్ఠాత్రీణా మగ్న్యాదిదేవతానాం వాగాద్యుపకారిణీనాం మరణకాల ఉపకారనివృత్తి మాత్రమ పేక్ష్య వాగాదయోఽగ్న్యాదీన్గచ్ఛన్తీత్యుపచర్యతే.4.

బాలానందిని

అగ్న్యాదీతి:- "అగ్న్యాదిగతిశ్రుతేః=వాగాదులు అగ్న్యాదులను చేరుతాయి అని వినబడడంవల్ల, న= ప్రాణాలు జీవునితో వెళ్లవు, ఇతి చేత్=అన్నట్లయితే, న=కాదు. భాక్తత్వాత్ అగ్న్యాదిగమనం భాక్తం అవడంవల్ల" అని సూత్రార్థం.

స్యాదితి:- అది అట్లుండనీ; అగ్న్యాదిగతిశ్రుతి ఉండడంవల్ల, జీవుడు దేహాంతరంలోనికి వెళ్లినప్పుడు ప్రాణాలు జీవునితో వెళ్లవు. "యత్రాస్య... ప్రాణః" (పురుషుడు మరణించినప్పుడు వాని వాక్కు అగ్నిని చేరుతుంది. ప్రాణం వాయువును చేరుతుంది) ఇత్యాదివాక్యాలచేత శ్రుతి మరణకాలంలో వాగాదిప్రాణాలు అగ్న్యాదిదేవతలను చేరుతాయని చెప్పుచున్నది కదా అన్నట్లయితే, అది కాదు. ఎందువల్ల ననగా అది (అగ్న్యాది గమనం) భాక్తం(గౌణం) . వాగాదులు అగ్న్యాదులను చేరుతాయి అని చెప్పే శ్రుతి గౌణి మాత్రమే; ఎందువల్ల ననగా లోమాలలోను, కేశాలలోను గమనం కనబడడం లేదు కదా? "ఓషధీః... కేశాః" (లోమాలు ఓషధులను చేరుతాయి, కేశాలు వృక్షాలను చేరుతాయి) అని కూడ అక్కడ చెప్పబడింది. లోమాలు కేశాలు ఎగిరి వెళ్లి ఓషధులను వృక్షాలను చేరుతాయి అని చెప్పడం కుదరదు కదా? ప్రాణం అనే ఉపాధి లేకపోతే జీవునకు (సర్వవ్యాప్త పరబ్రహ్మాభిన్నుడైన జీవునకు) గమనమే కుదరదు. ప్రాణాలులేకుండా దేహాంతరంలో భోగం కుదరదు. ప్రాణాలు జీవునితో కలసి వెడతాయని స్పష్టంగా మరొక శ్రుతిలో చెప్పబడింది. అందుచేత - అంతవరకు వాగాదులకు ఉపకారం చేసిన అగ్న్యాది దేవతలు మరణకాలంలో ఉపకారం చేయడం మానివేస్తాయి అనేదానిని మాత్రమే చూచి వాగాదులు అగ్న్యాదులను చేరుతాయి అని ఉపచారం (అరోపణం) చేయబడుతున్నది. (అవి అగ్న్యాదులను చేరక పోయినా చేరుతున్నట్లు చెప్పబడుచున్నది).4.

**సూ. ప్రథమేఽశ్రవణాదితిచేన్న తా ఏవ హ్యుపపత్తేః 3.1.5**

స్యాదేతత్; కథం పునః "పఞ్చమ్యామాహుతావాపః పురుషవచసో భవన్తి"

(ఛా.ఉ.5-3.3) ఇత్యేతన్నిర్ధారయితుం పార్యతే? యావతా నైవ ప్రథమేఽగ్నావపాం శ్రవణమస్తి. ఇహ హి ద్యులోకప్రభృతయః పఞ్చాగ్నయః పఞ్చానామాహుతీనామాధారత్వేనాధీతాః. తేషాం చ ప్రముఖే "అసౌ వావ లోకో గౌతమాగ్నిః" (ఛా.ఉ.5.4.1) ఇత్యుపన్యస్య "తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవాః శ్రద్ధాం జుహ్వతి (ఛా.ఉ.5.4.2)" ఇతి శ్రద్ధా హోమ్యద్రవ్యత్వేనావేదితా. న తత్రాపో హోమ్యద్రవ్యతయా శ్రుతాః. యది నామ పర్జన్యాదిషూత్తరేషు చతుర్ష్వగ్నిష్వపాం హోమ్యద్రవ్యతా పరికల్ప్యేత పరికల్ప్యతాం నామ. తేషు హోతవ్యతయోపాత్తానాం సోమాదీనామబ్బహులత్వోపపత్తేః. ప్రథమే త్వగ్నౌ శ్రుతాం శ్రద్ధాం పరిత్యజ్యాశ్రుతా ఆపః పరికల్ప్యన్త ఇతి సాహసమేతత్. శ్రద్ధా చ నామ ప్రత్యయవిశేషః, ప్రసిద్ధిసామర్థ్యాత్. తస్మాదయుక్తః పఞ్చమ్యామాహుతావపాం పురుషభావః ఇతి చేత్-

బాలానందిని

ప్రథమ ఇతి:- "ప్రథమే=ప్రారంభంలో, అశ్రవణాత్ ఇతి చేత్ = అప్ వినబడకపోవడం వల్ల పంచమాహుతిలో అప్పులకు ఆహుతిత్వం కుదర దన్నట్లయితే, న=కాదు, తా ఏవ=ఆ అప్పులే, ఉపపత్తే=ఉపపత్తివల్ల" అని సూత్రార్థం.

స్యాదేతదితి :- ఇది ఇలా ఉండనీ, "పఞ్చమ్యామాహుతౌ ఆపః పురుషవచసో భవన్తి" అని నిర్ధారణ చేయడం ఎట్లు కుదురుతుంది ? ఎందువల్ల ననగా ప్రథమాగ్నిలో అప్పుల (ఉదకంయొక్క) శ్రవణం లేదు. ఈ ఘట్టంలో ద్యులోకం మొదలైన ఐదు అగ్నులు ఐదు ఆహుతులకు ఆధారాలుగా చెప్పబడ్డాయి. వాటిలో ప్రారంభంలో "అసౌ వావ లోకో గౌతమాగ్నిః"(గౌతమా! ఆ ద్యులోకమే అగ్ని) అని చెప్పి, "తస్మిన్.......జుహ్వతి" (ఈ అగ్నిలో దేవతలు శ్రద్ధను హోమం చేస్తారు)అని శ్రద్ధ హోమం చేయవలసిన ద్రవ్యంగా చెప్పబడింది. అక్కడ అప్పులు హోమ్యద్రవ్యాలుగా వినబడడంలేదు. పర్జన్యుడు మొదలైన తరవాత చెప్పిన నాలుగు అగ్నులలో, హోమం చేయదగినవిగా చెప్పబడిన సోమాదులు ఉదకబహులంగా ఉండడంచేత కుదురుతుంది కాబట్టి అప్పులు హోమ్యద్రవ్యాలుగా కల్పించబడితే కల్పించబడుగాక. ప్రథమాగ్నిలో మాత్రం స్పష్టంగా

వినబడుతూన్న శ్రద్ధను విడచివేసి అప్పులు కల్పించబడతా యనేది సాహసమే అవుతుంది. ప్రసిద్ధిని అనుసరించి శ్రద్ధ అనగా ఒకనొక జ్ఞానవిశేషం. అందుచేత పంచమాహుతిలో అప్పులు పురుషత్వాన్ని పొందుతా యని చెప్పడం యుక్తం కాదు అన్నట్లయితే -

భాష్యమ్

నైష దోషః. హి యత : తత్రాపి ప్రథమేఽగ్నౌ తా ఏవాపః శ్రద్ధాశబ్దేనాభి ప్రేయన్తే. కుతః? ఉపపత్తేః. ఏవం హ్యాదిమధ్యావసానసంగానాదనా కులమేతదేకవాక్యముపపద్యతే. ఇతరథా పునః పఞ్చమ్యామాహుతావపాం పురుషవచస్త్వప్రకారే పృష్టే ప్రతివచనావసరే ప్రథమాహుతిస్థానే యద్యనపో హౌమ్యద్రవ్యం శ్రద్ధాం నామావతారయేత్తతోఽన్యథా ప్రశ్నోఽన్యథా ప్రతివచన మిత్యేకవాక్యతా న స్యాత్. "ఇతి తు పఞ్చమ్యామాహుతవాపః పురుషవచసో భవన్తి" ఇతి చోపసంహరన్నేతదేవ దర్శయతి. శ్రద్ధాకార్యం చ సోమవృష్ట్యాది స్థూలీభవదబ్బహులం లక్ష్యతే. సా చ శ్రద్ధాయా అప్త్వే యుక్తిః. కారణానురూపం హి కార్యం భవతి. న చ శ్రద్ధాఖ్యః ప్రత్యయో మనసో జీవస్య వా ధర్మః సన్ధర్మిణో నిష్కృష్య హోమాయోపాదాతుం శక్యతే పశ్వాదిభ్య ఇవ హృదయాదీనీత్యాప ఏవ శ్రద్ధాశబ్దాః భవేయుః. శ్రద్ధాశబ్దశ్చాప్సూపపద్యతే, వైదిక ప్రయోగదర్శనాత్ - "శ్రద్ధా వా ఆపః" ఇతి. తనుత్వం చ శ్రద్ధాసారూప్యం గచ్ఛన్త్య ఆపో దేహబీజభూతా ఇత్యతః శద్ధాశబ్దాః స్యుః, యథా సింహపరాక్రమో నరః సింహశబ్దో భవతి. శ్రద్ధాపూర్వకర్మసమవాయాచ్చాప్సు శ్రద్ధాశబ్ద ఉపపద్యతే, మఞ్చశబ్ద ఇవ పురుషేషు. శ్రద్ధాహేతుత్వాచ్చ శ్రద్ధాశబ్దోపపత్తిః- "అపో హాస్మై. శ్రద్ధాం సంనమన్తే పుణ్యాయ కర్మణే" ఇతి శ్రుతేః 5.

బాలానందిని

నైష దోష ఇతి- ఈ దోషం లేదు. హి=ఎందువల్ల ననగా, ఆ ప్రథమాగ్నియందు కూడ, తా ఏవ=ఆ అప్పులే, శ్రద్ధాశబ్దంచేత ఉద్దిష్టమైవి. ఎందువల్ల? ఉపపత్తివల్ల. ఇలా చెపితేనే ఆదిలోను, మధ్యయందు, అంతమునందు విరోధం లేని సరియైన సమన్వయం

ఉండడంచేత ఈ వాక్యం ఆకులం కాక (అర్థరహితంగా ఉండక) ఏకవాక్యంగా ఉంటుంది. అలా కాని పక్షంలో పంచమాహుతిలో ఉదకానికి పురుషవచస్త్వం ఎలా వస్తుంది అని ప్రశ్నించగా దానికి సమాధానం చెప్పినప్పుడు ప్రథమాహుతిస్థానంలో ఉదకభిన్నమైన శ్రద్ధ అనేదానిని దేనినో దింపితే ప్రశ్న ఒక విధంగా ఉండి ప్రతివచనం మరొక విధంగా ఉండడంచేత ఏకవాక్యత ఉండదు. "ఇతి...భవన్తి" అని ఉపసంహరిస్తూ దీనినే చూపుచున్నది. శ్రద్ధయొక్క కార్యమైన (శ్రద్ధను హోమం చేయగా పుట్టిన) సోమవృష్ట్యాదికం స్థూలం అయినప్పుడు ఉదకబహులంగానే కనబడుచున్నది. శ్రద్ధ ఉదకమే అని చెప్పడానికి ఇది కూడ ఒక యుక్తి. కార్యం కారణానురూపంగానే ఉంటుంది కదా? మనస్సు యొక్క గాని జీవుని యొక్క గాని ధర్మమైన శ్రద్ధ అనే ఒక ప్రత్యయాన్ని (జ్ఞానాన్ని) యజ్ఞపశువులనుండి వాటి గుండెలు మొదలైనవి తీసినట్లు, ధర్మినుండి పైకి లాగి హోమం కోసం గ్రహించడం కుదరదు కదా? అందుచేత శ్రద్ధ అనగా అప్పులే. "శ్రద్ధా వా అపః" అని వైదిక ప్రయోగం ఉండడంచేత శ్రద్ధాశబ్దం ఉదకం అనే అర్థంలో ఉపపన్నంగా ఉంటుంది. దేహబీజాలైన అప్పులు సూక్ష్మత్వాన్ని పొందడంచేత శ్రద్ధతో సామ్యాన్ని (మనస్సులోని శ్రద్ధ ఏ విధంగా ఇతరులకు ఇంద్రియగ్రాహ్యం కాదో అట్లే ఇవికూడ ఇంద్రియగ్రాహ్యములు కానంతగా సూక్ష్మంగా ఉండడాన్ని) పట్టి, సింహం వంటి పరాక్రమం కలవాడు సింహశబ్దవాచ్యుడైనట్లు శ్రద్ధాశబ్దవాచ్యా లవుతాయి. మరొక టేమనగా-("మఞ్చాః క్రోశన్తి" (మంచాలు ఏడుస్తున్నాయి) ఇత్యాదులలో) మఞ్చశబ్దం పురుషులతో సంబంధాన్ని పట్టి పురుషుల విషయంలో ప్రయోగించబడినట్లు, శ్రద్ధాపూర్వకంగా చేసే కర్మలతో సంబంధం ఉండడంవల్ల కూడ అప్పుల విషయంలో శ్రద్ధాశబ్దం యుక్తమే. "అపో...కర్మణే"(ఉదకం ఈ యజమానునికి పుణ్యకర్మ చేయడానికి శ్రద్ధను పుట్టిస్తూంది) అను శ్రుతిని అనుసరించి ఉదకం శ్రద్ధాహేతువు గాన ఆ కారణంచేత కూడ శ్రద్ధ అని చెప్పబడుచున్నది. 5.

సూ. అశ్రుతత్వాదితి చేన్నేష్టాదికారిణాం ప్రతీతేః. 3.1.6.

అథాపి స్యాత్-ప్రశ్నప్రతివచనాభ్యాం నామాపః శ్రద్ధాదిక్రమేణ పఞ్చమ్యామాహుతౌ పురుషాకారం ప్రతిపద్యేరన్; న తు తత్సంపరిష్వక్తా జీవా

రంహేయుః, అశ్రుతత్వాత్. న హ్యత్రాపామివ జీవానాం శ్రావయితా కశ్చిచ్ఛబ్దోఽస్తి. తస్మాద్రంహతి తత్సంపరిష్వక్తః ఇత్యయుక్తమితి చేత్, నైష దోషః. కుతః? ఇష్టాదికారిణాం ప్రతీతేః - "అథ య ఇమే గ్రామ ఇష్టాపూర్తే దత్తమిత్యుపాసతే తే ధూమమభిసంభవన్తి" (ఛా.ఉ. 5.10.6) ఇత్యుపక్రమ్యేష్టాదికారిణాం ధూమాదినా పితృయాణేన పథా చన్ద్రప్రాప్తిం కథయతి "ఆకాశాచ్చన్ద్రమసమేష సోమో రాజా" (ఛా.ఉ. 5.10.4) ఇతి. త ఏవేహాపి ప్రతీయన్తే "తస్మిన్నేవాగ్నౌ దేవాః శ్రద్ధాం జుహ్వతి తస్యా ఆహుతేః సోమో రాజా సంభవతి" (ఛా.ఉ. 5.4.2) ఇతి శ్రుతిసామాన్యాత్. తేషాం చాగ్నిహోత్రదర్శ పూర్ణమాసాదికర్మసాధనభూతాః దధిపయఃప్రభృతయో ద్రవద్రవ్యభూయస్త్వాత్ ప్రత్యక్షమేవాపః సన్తి. తాః ఆహవనీయే హుతాః సూక్ష్మా ఆహుత్యోఽపూర్వరూపాః సత్యస్తానిష్టాదికారిణ ఆశ్రయన్తి. తేషాం చ శరీరం నైధనేన విధానేన అన్త్యేఽగ్నౌ ఋత్విజో జుహ్వతి "అసౌ స్వర్గాయ లోకాయ స్వాహా" ఇతి. తతస్తాః శ్రద్ధాపూర్వకకర్మసమవాయిన్యః ఆహుతిమయ్య అపోఽపూర్వరూపాః సత్యస్తానిష్టాదికారిణో జీవాన్ పరివేష్ట్యాముం లోకం ఫలదానాయ నయన్తీతి యత్తదత్ర జుహోతినాఽభిధీయతే "శ్రద్ధాం జుహ్వతి" (ఛా.ఉ.5.4.2) ఇతి. తథా చాగ్నిహోత్రే షట్ప్రశ్నీనిర్వచనరూపేణ వాక్యశేషేణ "తే వా ఏతే ఆహుతీ హుతే ఉత్క్రామతః" (శ.బ్రా .11.6.2.6) ఇత్యేవమాదినాగ్నిహోత్రాహుత్యోః ఫలారమ్భాయ లోకాన్తరప్రాప్తిః ప్రదర్శితా. తస్మాదాహుతీమయీభిరద్భిః సంపరిష్వక్తా జీవా రంహన్తి స్వకర్మఫలోపభోగాయేతి శ్లిష్యతే. 6

## బాలానందిని

**అశ్రుతత్వాదితి** :- "అశ్రుతత్వాత్=ఇక్కడ జీవుడు వినబడడం లేదు గాన జీవుడు అప్పులతో వెళ్లడు; ఇతి చేత్=అన్నట్లయితే; న=కాదు. ఇష్టాదికారిణామ్=ఇష్టాదులు చేసేవారియొక్క, ప్రతీతేః=ప్రతీతికలుగుచుండుటవలన" అని సూత్రార్థం.

అథోచ్యతే:- ప్రశ్నప్రతివచనాలను బట్టి అప్పులు శ్రద్ధాదిక్రమంచేత పంచమాహుతిలో పురుషాకారం పొందుతే పొందవచ్చును గాక. కాని వాటితో కలిసి జీవులు పయనించరు, అక్కడ వాళ్లు వినబడడంలేదు. అక్కడ అప్పులను గూర్చి చెప్పినట్లుగా జీవులను గూర్చి చెప్పే శబ్దం ఏదీ కనబడడంలేదు కదా? అందువల్ల "రంహతి సంపరిష్వక్తః" అని చెప్పడం యుక్తం కాదు అన్నట్లయితే ఇది దోషం కాదు. ఎందువల్ల? ఇక్కడ ఇష్టాదికారుల ప్రతీతి ఉన్నది. "అథ...అభిసంభవన్తి" (గ్రామంలో ఉన్న ఎవరు అనగా ఏ గృహస్థులు ఇష్టం (యజ్ఞాదికం); పూర్తం (వాపీకూపతటాకాదినిర్మాణం), దత్తం (దానం); అని చెస్తుంటారో వాళ్లు ధూమాన్ని చేరుతారు. ధూమంగా అవుతారు) అని ప్రారంభించి ఇష్టాదికారులు ధూమం మొదలైన పితృయాణమార్గంచేత చంద్రుణ్ణి చేరుతా రని "ఆకాశచ్చన్ద్రమసమేష సోమో రాజా" (ఆకాశంనుండి చంద్రుణ్ణి పొందుతారు ఈ చంద్రుడే రాజైన (సోముడు (మము)"అని చెప్పుచున్నది. "తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవాః శ్రద్ధాం జుహ్వతి తస్యా ఆహుతేః సోమో రాజా సంభవతి" అని సమానమైన శ్రుతి ఉండడంవల్ల వాళ్లే (ఇష్టాపూర్తదత్తాదికారులే) ఇక్కడ కూడ తెలియుచున్నారు. (అనగా ద్యులోకం అనే అగ్నిలో శ్రద్ధాహవిస్సు హోమం చేయగా సోమరాజు పుడతా డని ముందు చెప్పి వాక్యశేషంలో ధూమాదిమార్గం ద్వారా ఆకాశంనుండి చంద్రుణ్ణి పొందిన ఇష్టాదికారులనే "ఏష సోమో రాజా" అని నిర్దేశించడం జరిగింది. 'సోమో రాజా' అనేది ఆ శ్రుతివాక్యంలోను ఈ శ్రుతివాక్యంలోనూ కూడ సమంగా ఉండడంచేత సోమరాజుగా అయేవారు ఇష్టాపూర్త కారులే అని తెలుస్తూన్నది అని భావం). ఇష్టాదికారులకు అగ్నిహోత్రం, దర్శపూర్ణమాసాలు మొదలైన కర్మలకు సాధనాలైన పెరుగు పాలు మొదలైనవి ద్రవద్రవ్యం ఎక్కువగా ఉండడంచేత ప్రత్యక్షంగానే అప్పులుగా ఉన్నాయి (కనబడుతున్నాయి). ఆహవనీయంలో హోమం చేయబడిన ఆ అప్పులే సూక్ష్మమైన ఆహుతులుగా అపూర్వరూపంలో ఉండి ఆ ఇష్టాదికారులను ఆశ్రయించుకొని ఉంటాయి. (వాళ్లు మరణించినప్పుడు) వాళ్ల శరీరాన్ని ప్రేతవిధానాన్ని అనుసరించి ఋత్విక్కులు- "అసౌ స్వర్గాయ లోకాయ స్వాహా" అని హోమం చేస్తారు. తరవాత శ్రద్ధాపూర్వకంగా ఆచరించిన కర్మతో సంబంధించిన ఆహుతులైన ఆ అప్పులు అపూర్వరూపంలో ఉంటూ ఇష్టాదులు చేసిన ఆ జీవుల్ని పరివేష్టించి ఫలం ఇవ్వడంకొరకై పరలోకానికి తీసి

కొనివెడతాయి. ఆ విషయమే ఇక్కడ "శ్రద్ధాం జుహ్వతి" అని 'హు' ధాతువుచేత చెప్పబడుచున్నది. అట్లే (బృహదారణ్యకంలో) అగ్నిహోత్రానికి సంబంధించిన ఆరు ప్రశ్నలకు సమాధానం చెప్పే సందర్భంలో "తే వా ఏతే ఆహుతీ హుతే ఉత్క్రామతః" ఇత్యాది వాక్యశేషంచేత అగ్నిహోత్రాహుతులే ఫలం ఇవ్వడానికి లోకాంతరం వెడతాయి అని చెప్పబడింది. అందువల్ల జీవులు ఆహుతిమయాలైన అప్పులతో కలిసి స్వకర్మఫలాన్ని అనుభవించడానికి పయనిస్తారు అని చెప్పడం యుక్తం.

2. అగ్నిహోత్రాహుతులను గూర్చి మాటలాడుచు జనకుడు యాజ్ఞవల్క్యునితో "సాయంకాలమందు ప్రాతఃకాలమందు అగ్నిహోత్రకర్మలో చేసే ఆహుతులు (రెండూ) ఎక్కడికి వెడతాయి, ఎలా వెడతాయి, ఎలా ప్రతిష్ఠితా లవుతాయి. ఎలా తృప్తి చెందుతాయి. మళ్లీ తిరిగి ఎలా వస్తాయి. లోకంలో మళ్లీ ఎలా ఆవిర్భావిస్తాయి అనే విషయం నీకు తెలియదు" అని అంటాడు. నాకు తెలియ దని యాజ్ఞవల్క్యుడు అంగీకరిస్తాడు. అప్పుడు జనకుడు వీటి సమాధానాలు చెపుతాడు. "ఈ ఆహుతులు అంతరిక్షంలో ప్రవేశిస్తాయి. అవి అంతరిక్షాన్ని ఆహవనీయాగ్నిగాను, వాయువును సమిధగాను, కిరణాన్ని ఆహుతిగాను చేసుకొని అంతరిక్షాన్ని తృప్తి పొందిస్తాయి. తరవాత ద్యులోకంలో ప్రవేశిస్తాయి. ద్యులోకాన్ని ఆహవనీయాగ్నిగాను, సూర్యుణ్ని సమిధగాను, చంద్రుణ్ణి తెల్లని ఆహుతిగాను చేసి ద్యులోకాన్ని తృప్తిపొందిస్తాయి. అక్కడినుంచి తిరిగి వస్తాయి" అని ప్రారంభించి పృథివీ-పురుష-యోషిత్తులను ఆహవనీయాగ్నిగా కల్పించి సంవత్సరాదులను సమిధాదులుగా కల్పించి యోషిదగ్నినుండి పుట్టినవాడే లోకాన్ని చేరినవాడు అని నిరూపిస్తాడు. అందుచేత ఇక్కడ కూడ ఆహుతులకు ఆరోహావరోహాలు చెప్పడంచేత "ఆపః పురుషవచసః" అన్న చోట చెప్పిన అప్పులు ఆహుతిరూపమైన అప్పులే అని తెలుస్తూన్నది.

## భాష్యమ్

కథం పునరిదమిష్టాదికారిణాం స్వకర్మఫలోపభోగాయ రంహణం ప్రతిజ్ఞాయతే, యావతా తేషాం ధూమప్రతీకేన వర్త్మనా చన్ద్రమసమధిరఢానామన్న భావం దర్శయతి-"ఏష సోమో రాజా తద్దేవానామన్నం తం దేవా భక్షయన్తి"

(ఛా.ఉ.5-10-4) ఇతి. "తే చన్ద్రం ప్రాప్యాన్నం భవన్తి తాంస్తత్ర దేవా యథా సోమం రాజానమాప్యాయయస్వాపక్షీయస్వేత్యేవమేతాంస్తత్ర భక్షయన్తి" (బృ.ఉ.6-2-16) ఇతి చ సమానవిషయం శ్రుత్యన్తరమ్. న చ వ్యాఘ్రాదిభిరివ దేవైర్భక్ష్యమాణా నాముపభోగః సంభవతీతి. అత ఉత్తరం పఠతి-

సూ. భాక్తం వానాత్మవిత్త్వాత్తథాహి దర్శయతి. 3.1.7

వాశబ్దశ్చోదితదోషవ్యావర్తనార్థః. భాక్తమేషామన్నత్వం న ముఖ్యమ్. ముఖ్యే హ్యన్నత్వే "స్వర్గకామో యజేత" ఇత్యేవంజాతీయకాధికారశ్రుతిరుపరుధ్యేత. చన్ద్రమణ్డలే చేదిష్టాదికారిణాముపభోగో న స్యాత్కిమర్థమిష్టాదికారిణ ఇష్టాద్యాయాసబహులం కర్మ కుర్యుః? అన్నశబ్దశ్చోపభోగసామాన్యాదనన్నేఽప్యుపచర్యమాణో దృశ్యతే, యథా విశోఽన్నం రాజ్ఞామ్; పశవోఽన్నం విశామ్ ఇతి. తస్మాదిష్టస్త్రీపుత్రమిత్రభృత్యాదిభిరివ గుణభావోపగతైరిష్టాదికారిభిర్యత్సుఖవిహరణం దేవానాం తదేవైషాం భక్షణమభిప్రేతం న మోదకాదివచ్చర్వణం నిగరణం వా. "న హ వై దేవా అశ్నన్తి న పిబన్త్యేతదేవామృతం దృష్ట్వా తృప్యన్తి" (ఛా. ఉ.3.6.1) ఇతి చ దేవానాం చర్వణాదివ్యాపారం వారయతి. తేషాం చేష్టాదికారిణాం దేవాన్ ప్రతి గుణభావోపగతానామప్యుపభోగ ఉపపద్యతే రాజోపజీవినామివ పరిజనానామ్. అనాత్మవిత్త్వాచ్చేష్టాదికారిణాం దేవోపభోగ్యభావ ఉపపద్యతే. తథాహి శ్రుతిరనాత్మవిదాం దేవోపభోగ్యతాం దర్శయతి. "అథ యోఽన్యాం దేవతాముపాస్తేఽన్యోఽసావన్యోఽహమస్మీతి న స వేద యథా పశురేవం స దేవానామ్" (బృ.ఉ.1.4.10) ఇతి. స చాస్మిన్నపి లోక ఇష్టాదిభిః ప్రీణయన్ పశువద్దేవానాముపకరోత్యముష్మిన్నపి లోకే తదుపజీవీ తదాదిష్టం ఫలముపభుఞ్జానః పశువద్దేవానాముపకరోతీతి గమ్యతే.

బాలానందిని

కథమితి:-ఇష్టాదులు చేసినవాళ్లు కర్మఫలం అనుభవించడానికి (దేహం విడిచి) వెడతా రని ఎట్లు చెప్పబడుచున్నది? ఎందువల్ల ననగా ధూమం చిహ్నంగా గల మార్గం ద్వారా చంద్రుణ్ణి అధిష్ఠించిన వాళ్లు అన్నం అయిపోతా రని - "ఏష...భక్షయన్తి" (ఈ సోమరాజు దేవతల అన్నం, వానిని దేవతలు భక్షిస్తారు) అనే శ్రుతి చెప్పుచున్నది. "తే చన్ద్రం......భక్షయన్తి"(ఇష్టాదికారులు చంద్రుణ్ణి పొంది అన్నంగా అవుతారు. ఋత్విక్కులు చమసంలో (ఒక పాత్రలో) ఉన్న రాజైన సోమాన్ని (సోమరసాన్ని మాటిమాటికి నింపి, మాటిమాటికి ఎలా ఖాళీచేస్తూ తింటారో అట్లే అక్కడ దేవతలు వీళ్లను భక్షిస్తారు)అని సమానవిషయాన్ని ప్రతిపాదించే మరొక శ్రుతి కూడ చెప్పుచున్నది. వ్యాఘ్రాదులచేత వలె దేవతలచేత భక్షింపబడేవాళ్లకు భోగం కుదరదు కదా? దీనికి సమాధానం పఠిస్తున్నాడు:-

భాక్తమితి :- "అనాత్మ విత్త్వాత్=ఆత్మజ్ఞానం కలవారు కాకపోవడంవల్ల, భాక్తం వా=వీళ్లను భక్షించడం అనేది, గౌణము. తథా=అట్లు, దర్శయతి హి=శ్రుతి చూపుచున్నది కదా" అని సూత్రార్థం.

వాశబ్దఇతి :- వాశబ్దం చోదితమైన దోషాన్ని నిరాకరించడానికి. వీళ్ల అన్నత్వం గౌణమే కాని ముఖ్యం కాదు. అన్నత్వం ముఖ్యమైన ట్లయితే "స్వర్గకామో యజేత" మొదలైన అధికారశ్రుతి (ఫలంమీద కోరిక ఉన్నవాడు అధికారి అని చెప్పే శ్రుతి) బాధిత మవుతుంది. ఇష్టాదులు చేసినవాళ్లకి చంద్రమండలంలో ఉపభోగం లేకపోతే అధికారవంతులు అయాసబహులమైన ఇష్టం మొదలైన కర్మ ఎందుకు చేస్తారు? ప్రజలు రాజులకు అన్నం, పశువులు ప్రజలకు అన్నం, ఇత్యాది ప్రయోగాలలో అనుభవించడానికి హేతువు అనే సామాన్యం (సాదృశ్యం)చేత అన్నశబ్దం అన్నం కాని దాని విషయంలో కూడ ఉపచారంచేత (ఆరోపణంచేత) ప్రయోగించబడడం కనబడుతున్నది. అందుచేత ఇష్టులైన స్త్రీలతోను, పుత్రులతోను, మిత్రులతోను, భృత్యాదులతోను సుఖంగా విహరించినట్లు దేవతలు తమకు అప్రధానులుగా లొంగిఉన్న ఇష్టాదికారులతో సుఖంగా విహరించడమే వాళ్లను భక్షించడం అంటే అర్థం; అంతే కాని మధురభక్ష్యాదులను వలె నమలడం కాని మ్రింగడం కాని కాదు. "న హ ...తృప్యన్తి" (దేవతలు తినరు త్రాగరు. ఈ

అమృతాన్నే చూచుకొంటూ తృప్తి చెందుతారు)అని (శ్రుతి)దేవతలకు చర్వణాదివ్యాపారం లేదని చెపుతున్నది. దేవతలకు లొంగి ఉన్నా కూడ ఇష్టాదికారులు, రాజును ఆశ్రయించుకొని ఉన్న పరిజనుల వలె, భోగాలు అనుభవించడం కుదురుతుంది, ఆత్మజ్ఞానసంపన్నులు కాకపోవడంచేత ఆ ఇష్టాదికారులు దేవతలకు ఉపభోగ్యాలు (అనుభవింపదగినవాళ్లు) అవడం కూడ ఉపపన్నం అవుతుంది. అందుచేతనే "అథ.... దేవానామ్" (ఎవడైతే మరొక దేవతను నేను వేరు ఆ దేవత వేరు అనే బుద్ధితో ఉపాసిస్తాడో అతడు (సత్యం) తెలిసినవాడు కాదు; వాడు దేవతలకు పశువువంటివాడు)అనే శ్రుతి ఆత్మవేత్తలు కానివాళ్లు దేవతలకు ఉపభోగ్యు లని చెప్పుచున్నది. అలాంటివాడు ఈ లోకంలో ఇష్టాదికర్మలచేత దేవతలకు ప్రీతి కలిగిస్తూ పశువు వలె వాళ్లకు ఉపకరిస్తున్నాడు; పరలోకంలో కూడ వాళ్లమీద ఆధారపడి జీవిస్తూ వాళ్లు చూపిన ఫలం అనుభవిస్తూ దేవతలకు పశువువలె ఉపకరిస్తాడు అని తెలుస్తూన్నది.

భాష్యమ్.

"అనాత్మవిత్త్వాత్తథా హి దర్శయతి" ఇత్యస్యాపరా వ్యాఖ్యా-అనాత్మవిదో హ్యేతే కేవలకర్మిణః ఇష్టాదికారిణో న జ్ఞానకర్మసముచ్చయానుష్ఠాయినః. పఞ్చాగ్నివిద్యామిహాత్మవిద్యేత్యుపచరన్తి ప్రకరణాత్. పఞ్చాగ్నివిజ్ఞానవిహీనత్వా చ్చేదమిష్టాదికారిణాం గుణవాదేనాన్నత్వముద్భావ్యతే పఞ్చాగ్నివిద్యాప్రశంసాయై. పఞ్చాగ్నివిద్యా హీహ విధిత్సితా, వాక్యతాత్పర్యావగమాత్. తథా హి శ్రుత్యన్తరం చన్ద్రమణ్డలే భోగసద్భావం దర్శయతి. "స సోమలోకే విభూతిమనుభూయ పునరావర్తతే"(ప్ర.ఉ.5.4)ఇతి. తథాన్యదపి శ్రుత్యన్తరం "అథ తే శతం పితౄణాం జితలోకానామానన్దాః స ఏకః కర్మదేవానామానన్దో యే కర్మణా దేవత్వమభిసంపద్యన్తే" (బృ.ఉ.4.3.33) ఇతీష్టాదికారిణాం దేవైః సహ సంవసతాం భోగప్రాప్తిం దర్శయతి. ఏవం భాక్తత్వాదన్నభావవచనస్య ఇష్టాదికారిణోఽత్ర జీవా రంహన్తీతి ప్రతీయతే. తస్మాద్రంహతి సంపరిష్వక్త ఇతి యుక్తమేవోక్తమ్. 7

బాలానందిని

అవ. అనాత్మవిత్త్వాత్ అనే పదానికి ఆత్మజ్ఞానం లేనివా ళ్లవడంవల్ల అని పైన వ్యాఖ్యానించబడింది. ఇప్పుడు పంచాగ్నివిద్యయొక్క జ్ఞానమే ఆత్మజ్ఞానం. పంచాగ్నివిద్యను గూర్చిన జ్ఞానం లేకుండా ఇష్టాదికర్మలు చేసేవాళ్లు అన్నం వంటివాళ్లు అని చెప్పబడుతున్నది. ఇలా చెప్పడంవల్ల పంచాగ్నివిద్య చాల ప్రశస్తమైన దని చెప్పిన ట్లవుతుంది. ఆ విధంగా వ్యాఖ్యానిస్తున్నారు - అనాత్మేతి:- "అనాత్మవిత్త్వాత్తథా హి దర్శయతి" అనేదానికి మరొక వ్యాఖ్య. కేవలం కర్మమాత్రం చేసే ఈ ఇష్టాది కారులు అనాత్మవేత్తలు. వాళ్లు జ్ఞానకర్మసముచ్చయానుష్ఠానం చేసేవాళ్లు కారు. ఇక్కడ ప్రకరణాన్ని పట్టి పంచాగ్నివిద్యయే ఆత్మవిద్య అని ఉపచారంచేత చెపుతున్నారు. ఇష్టాదికారులు పంచాగ్నివిద్యావిహీను లవడంచేత వాళ్లు అన్నం అని గుణవాదంచేత (గౌణవ్యవహారంచేత) ఊహించబడుతున్నారు. ఇలా చేయడం పంచాగ్నివిద్యను స్తుతించడం కొరకే. (విరుద్ధ మైన విషయాన్ని చెప్పే అర్థవాదను గుణవాదం అంటారు. ఇష్టాది కారులకు అన్నత్వం లేకపోయినా అన్నత్వం చెప్పబడింది గాన ఇది గుణవాదం). ఇక్కడ వాక్యతాత్పర్యాన్ని పట్టి పంచాగ్నివిద్య విధించడానికి ఉద్దిష్టమైనది. (అందుచేతనే దాని స్తుతి అని భావం)

అవ.తథా హి దర్శయతి అనేదానికి అర్థం చెపుతున్నారు-తథాహీతి:- చంద్రమండలంలో భోగం ఉన్నట్లు "స.....ఆవర్తతే" (అతడు చంద్రలోకంలో వైభవం అనుభవించి మళ్లీ తిరిగి వస్తాడు) అనే మరొక శ్రుతి చెపుతున్నది. "అథ.....సంపద్యన్తే" అను మరొక శ్రుతి కూడ దేవతలతో కలిసి నివసిస్తూన్న ఇష్టాదికారులకు కూడ భోగం లభిస్తుందని చూపుచున్నది. (లోకాన్ని జయించిన పితృదేవతల వంద అనందాలు కర్మలు చేసి దేవత్వాన్ని పొందిన కర్మదేవతలయొక్క ఆనందం అని ఆ వాక్యానికి అర్థం). ఈ విధంగా అన్నం అవుతారు అని చెప్పడం గౌణం గాన ఇష్టాదులు చేసిన జీవులు గమనం చేస్తారు అని తెలుస్తూన్నది. అందువల్ల "రంహతి సంపరిష్వక్తః" అని యుక్తంగానే చెప్పబడింది. 7

తదంతరప్రతిపత్త్యధికరణం సమాప్తం

## 2. కృతాత్యయాధికరణమ్. సూ. 8-11

**సూ. కృతాత్యయేఽనుశయవాన్ దృష్టస్మృతిభ్యాం యథేతమనేవం చ. 3.1.8.**

ఇష్టాదికారిణాం ధూమాదినా కర్మణా చన్ద్రమణ్డలమధిరూఢానాం భుక్తభోగానాం తతః ప్రత్యవరోహ అమ్నాయతే-"తస్మిన్ యావత్సంపాత ముషిత్వాథైతమేవాధ్వానం పునర్నివర్తన్తే యథేతమ్"(ఛా.ఉ.5.10.5) ఇత్యారభ్య యావత్ - "రమణీయ చరణా బ్రాహ్మణాదియోనిమాపద్యన్తే కపూయచరణాః శ్వాదియోనిమ్" ఇతి. తత్రేదం విచార్యతే-కిం నిదనుశయా భుక్తకృత్స్నకర్మాణోఽవరోహన్త్యాహోఽస్విత్సానుశయా ఇతి. కిం తావత్ప్రాప్తమ్? నిరనుశయా ఇతి. కుతః? యావత్సంపాతమితి విశేషణాత్. సంపాతశబ్దేనాత్ర కర్మాశయ ఉచ్యతే. సంపతన్త్యనేనాస్మాల్లోకాదముం లోకం ఫలోపభోగాయేతి. యావత్సంపాతముషిత్వేతి చ కృత్స్నస్య తస్య కృతస్య తత్రైవ భుక్తతాం దర్శయతి. "తేషాం యదా తత్పర్యవైతి"(బృ.ఉ. 6.2.16) ఇతి చ శ్రుత్యన్తరేణైష ఏవార్థః ప్రదర్శ్యతే. స్యాదేతత్- యావదముష్మిన్ లోక ఉపభోక్తవ్యం కర్మ తావదుపభుజ్యత ఇతి కల్పయిష్యామీతి. నైవం కల్పయితుం శక్యతే; యత్కించేత్యన్యత్ర పరామర్శాత్.

"ప్రాప్యాన్తం కర్మణస్తస్య యత్కించేహ కరోత్యయమ్,
తస్మాల్లోకాత్పునరేత్యస్మై లోకాయ కర్మణే." (బృ.ఉ.4.4.6)

ఇతి హ్యపరా శ్రుతిః యత్కించేత్యవిశేషపరామర్శేన కృత్స్నస్యేహ కృతస్య కర్మణస్తత్ర క్షయితాం దర్శయతి. అపి చ ప్రాయణమనారబ్ధ ఫలస్య కర్మణోఽభివ్యఞ్జకమ్, ప్రాక్ప్రాయణాదారబ్ధఫలేన కర్మణా ప్రతిబద్ధస్య అభివ్యక్త్యనుపపత్తేః. తచ్చావిశేషాద్యావత్కించి దనారబ్ధఫలం తస్య సర్వస్యాభివ్యఞ్జకమ్. న హి సాధారణే నిమిత్తే నైమిత్తికమసాధారణం భవితుమర్హతి. న హ్యవిశిష్టే ప్రదీపసంనిధౌ ఘటోఽభివ్యజ్యతే న పట ఇత్యుపపద్యతే. తస్మాన్నిరనుశయా అవరోహన్తీతి.

బాలానందిని

కృతాత్యయ ఇతి :- "కృతాత్యయే=కర్మయొక్క అంతమునందు, అనుశయవాన్=కర్మశేషం కలవాడై జీవుడు పరలోకంనుండి తరిగి వస్తాడు. దృష్టస్మృతిభ్యామ్ =శ్రుతి స్మృతులచేత , యథేతమ్. ఎలా వెళ్లాడో అట్లు, అనేవం చ=మరొక విధంగా కూడ వస్తాడు" అని సూత్రార్థం.

ఇష్టాదీతి: "తస్మిన్.....యథేతమ్" (చంద్రమండలంలో, ఆలోకంలోనికి వెళ్లడానికి సహాయపడిన కర్మ ఉన్నంతవరకు ఉండి ఏ మార్గాన వెళ్లారో ఆ మార్గంలోనే తిరిగి వస్తారు)అని ప్రారంభించి "రమణీయ...యోనిమ్" (మంచి చరణం గలవారు బ్రాహ్మణ యోనిని పొందుతారు, చెడ్డ చరణం కలవారు కుక్కలు మొదలైనవాటి జన్మ పొందుతారు) అను వాక్యం వరకు, చంద్రలోకంలో భోగాలు అనుభవించినవాళ్లు అక్కడినుండి తిరిగి రావడం చెప్పబడుచున్నది. కర్మశేషం ఏమీ లేకుండా సమస్తకర్మ అనుభవించి దిగుతారా లేక కొంత కర్మతో కూడ దిగుతారా అని విచారణ చేయబడుచున్నది. ఏమి ప్రాప్తించింది? నిరనుశయలుగానే దిగుతారు అని ప్రాప్తించింది. ఎందువల్ల? "యావత్సంపాతమ్" అని విశేషణంవల్ల. ఇక్కడ సంపాతశబ్దానికి కర్మాశయం (కర్మ) అని అర్థం. సంపతన్తి అనేన ఇతి సంపాతః=(దీనిచేత ఈ లోకం నుండి ఫలభోగం కోసం వెడతారు కాబట్టి సంపాతం) అనే విగ్రహంచేత కర్మ అని అర్థం. "యావత్సంపాతముషిత్వా" (సంపాతం ఉన్నంత వరకు ఉండి)అని సమస్తమైన కర్మా కూడ అక్కడ అనుభవించబడినదని చూపుచున్నది. 'తేషాం యదా తత్పర్యవైతి" (ఇష్టాదికారుల కర్మ ఎప్పుడైతే క్షీణం అవుతుందో అప్పుడు తిరిగి వస్తారు)అని మరొక శ్రుతి కూడ ఈ అర్థాన్నే చూపుచున్నది. (ఆక్షేపం) ఇది ఇలా ఉండనీ (ఎవరైన ఇలా అనవచ్చును) ఆ లోకంలో అనుభవించ దగిన కర్మ ఎంతవరకు ఉంటుందో అంతవరకు అనుభవిస్తాడు అని కల్పిస్తాను. (సమాధానం) మరొక శ్రుతిలో 'యత్కించ' (ఎంత కర్మైతే ఉందో అంతా కూడ అని పరామర్శించడంవల్ల ఈ విధంగా కల్పించడానికి శక్యం కాదు. "ప్రాప్య.....కర్మణే" (జీవుడు ఎంత కర్మచేసి ఉన్నాడో అంత కర్మనూ కూడ పూర్తిచేసికొని మళ్లీ కర్మచేయడానికి ఈ లోకానికి తిరిగి వస్తాడు)అని మరొక శ్రుతి విశేషం ఏదీ లేకుండా (ఈ కర్మ ఆ కర్మ అని చెప్పకుండా) మొత్తం కర్మ అంతా అక్కడ క్షీణిస్తుందని చెప్పుచున్నది. మరొక విషయమేమనగా - మరణానికి పూర్వం ఫలం

ఇవ్వడానికి ప్రారంభించిన కర్మచేత అడ్డుకొనబడడంచేత ఏ కర్మ తన ఫలాన్ని ఇవ్వకుండా ఉన్నదో దానిని మరణం అభివ్యక్తం చేస్తుంది. (అనగా-ఒకానొక కర్మకు ఫలంగా ఈ శరీరం లభించింది. ఆ కర్మఫలం అనుభవించబడుతున్నది. ఈ సమయంలో, ఇంకా చాలా కర్మ నిల్వలో ఉన్నా కూడ దాని ఫలం అనుభవించడానికి అవకాశం ఉండదు. మరణం రాగానే నిల్వ ఉన్న ఆ కర్మ అంతా అభివ్యక్తమై దాని ఫలాన్ని ఇవ్వడం ప్రారంభిస్తుంది అని భావం). మరణం అనారబ్ధఫలమైన (ఇంకా ఫలం ఇవ్వడానికి ప్రారంభించని) ఏ కర్మ ఉన్నదో దాని నంతనీ కూడ, ఏ విశేషమూ లేకుండా, (ఇంతకర్మనే, ఈ కర్మనే అనే విశేషం లేకుండా) వ్యంజింప చేస్తుంది. నిమిత్తం సాధారణం అయినపుడు నైమిత్తికం అసాధారణం అవడానికి వీలుండదు కదా(అనగా అనారబ్ధఫలమైన కర్మ ఫలం ఇవ్వడానికి ప్రారంభించడానికి నిమిత్తం మరణం. ఇది సాధారణమైన, మొత్తం కర్మ నంతనూ వ్యంజింప దగిన నిమిత్తం. అలాంటపుడు నైమిత్తిక మైనది అసాధారణం అనడానికి, మొత్తం కర్మలోని ఈ భాగం మాత్రమే, ఆ భాగం కాదు అనడానికి, కారణం ఏదీ లేదు అని భావం). దీపం దగ్గర ఉండడంలో తేడా లేనప్పుడు ఘటమే ప్రకాశిస్తుంది కాని పటం ప్రకాశించదు అని చెప్పడం ఉపపన్నం కాదు కదా? అందువేత అనుశయరహితులుగానే తిరిగివస్తారు.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః- కృతాత్యయేऽనుశయవానితి. యేన కర్మవృన్దేన చన్ద్రమసమారూఢాః ఫలోపభోగాయ తస్మిన్నుపభోగేన క్షయితే తేషాం యదమ్మయం శరీరం చన్ద్రమస్యుపభోగాయారబ్ధం తదుపభోగక్షయదర్శనశోకాగ్ని సంపర్కాత్ప్రవిలీయతే, సవితృకిరణసంపర్కాదివ హిమకరకాః. హుతభుగర్చిః సంపర్కాదివ ఘృతకాఠిన్యమ్. తతః కృతాత్యయే, కృతస్యేష్టాదేః కర్మణః ఫలోప భోగేనోపక్షయే సతి సానుశయా ఏవేమమవరోహన్తి. కేన హేతునా? దృష్టస్మృతిభ్యామిత్యాహ-తథాహి ప్రత్యక్షా శ్రుతిః సానుశయానామవరోహం దర్శయతి-"తద్య ఇహ రమణీయచరణా అభ్యాశో హ యత్తే రమణీయాం

యోనిమాపద్యేరన్ శ్వయోనిం వా సూకరయోనిం వా చణ్డాలయోనిం వా" (ఛా.ఉ.5.10.7) ఇతి. చరణశబ్దేనానుశయః సూచ్యత ఇతి వర్ణయిష్యతి. దృష్టశ్చాయం జన్మనైవ ప్రతిప్రాణ్యుచ్చావచరూప ఉపభోగః ప్రవిభజ్యమాన ఆకస్మికత్వాసంభవాదనుశయసద్భావం సూచయతి. అభ్యుదయప్రత్య వాయయోః సుకృతదుష్కృతహేతుత్వస్య సామాన్యతః శాస్త్రేణావగమి తత్వాత్. స్మృతిరపి "వర్ణా ఆశ్రమాశ్చ స్వకర్మనిష్ఠాః ప్రేత్య ఫలమనుభూయ శేషేణ విశిష్టజాతికులరూపాయుః శ్రుత వృత్త విత్తసుఖ మేధసో జన్మ ప్రతిపద్యన్తే" (గౌ.ధ.సూ.2.2.29) ఇతి సానుశయానామేవావరోహం దర్శయతి.

### బాలానందిని

ఏవమితి :-ఇట్లు ప్రాప్తించగా "కృతాత్యయే అనుశయవాన్" అని సమాధానం చెపుతున్నాం. ఏ కర్మసముదాయంతో ఫలోపభోగంకొరకు చంద్రలోకం వెడతారో ఆ కర్మ ఉపభోగంచేత క్షీణించగా, చంద్రునిలో భోగాలు అనుభవించడంకోసం వాళ్లకు ఉదకమయమైన ఏ శరీరం ఆరబ్ధమో (పుట్టిందో) అది ఆ భోగాలు క్షీణిస్తున్నాయి అని చూడగానే కలిగిన శోకాగ్నియొక్క సంపర్కంవల్ల, సూర్యకిరణసంపర్కంవల్ల మంచుముక్కల (వడగళ్ల) వలె, అగ్నిజ్వాల తగలగానే నేతియొక్క కాఠిన్యం వలె కరిగిపోతాయి. అప్పుడు, కృతాత్యయే=చేసిన ఇష్టాదికర్మ ఫలోపభోగంచేత క్షీణించగానే అనుశయంతో కూడినవా ళ్లవుతూనే దిగుతారు. ఏ హేతువు చేత? దృష్టస్మృతులచేత అని అంటున్నాడు. ఆ విధంగానే "తద్య.......వా" అను ప్రత్యక్షమైన శ్రుతి జీవులు అనుశయంతో కూడిన వా ళ్లవుతూనే దిగుతా రని చెప్పుచున్నది. (క్రిందికి దిగుచున్న జీవులలో ఎవరైతే ఈ కర్మ భూమిలో పుణ్యకర్మలు కలవారో వాళ్లు తప్పక మంచి యోనిని (జన్మను) -బ్రాహ్మణ యోనిని గాని, క్షత్రియయోనిని గాని, వైశ్యయోనిని గాని పొందుతారు. పాపకర్మ కలవాళ్లు తప్పక పాపయోనిని- శ్వయోనిని గాని, సూకర యోనిని గాని, చండాల యోనిని గాని పొందుతారు అని ఈ వాక్యానికి అర్థం). చరణశబ్దంచేత అనుశయం సూచింపబడుతుం దని (సూత్రకారుడు) చెప్పగలడు. అభ్యుదయానికి హేతువు సుకృత మని, ప్రత్యవాయానికి

హేతువు దుష్కృత మని సామాన్యరూపంలో శాస్త్రంచేత బోధించబడుతున్నది. అందుచేత పుట్టుకనుండీ కూడ ప్రతీ ప్రాణిలోను అనేక విధాలుగా విభజింపబడి ఉన్న, మనం ప్రత్యక్షంగా చూస్తున్న, (సుఖదుఃఖ) భోగం, అకస్మికంగా (ఏ కారణమూ లేకుండా) కలగడం కుదరదు కాబట్టి అనుశయం ఉన్నది అని సూచిస్తున్నది. "వర్ణా.....ప్రతిపద్యన్తే" అను స్మృతి కూడ జీవులు కర్మతోనే పుడతారని చూపుతున్నది. తమ తమ కర్మలు అచరించిన వర్ణాలు ఆశ్రమాలూ కూడ మరణించి కర్మఫలం అనుభవించి తరవాత మిగిలిన కర్మతో విశిష్టమైన (వేరు వేరుగా ఉండే) దేశ-జాతి-కుల-రూప-అయుర్-విద్యా-చరిత్ర. ధన. సుఖ. మేధలు కలవారై జన్మిస్తారు అని పై స్మృతివాక్యానికి అర్థం.

భాష్యమ్

కః పునరనుశయో నామేతి? కేచిత్తావదాహుః-స్వర్గార్థస్య కర్మణః భుక్తఫలస్యావశేషః కశ్చిదనుశయో నామ భాణ్డానుసారిస్నేహవత్. యథా హి స్నేహభాణ్డం రిచ్యమానం న సర్వాత్మనా రిచ్యతే భాణ్డానుసార్యేవ కశ్చిత్ స్నేహశేషోఽవతిష్ఠతే తథానుశయోఽపీతి. నను కార్యవిరోధిత్వాదదృష్టస్య న భుక్తఫలస్యావశేషావస్థానం న్యాయ్యమ్. నాయం దోషః. న హి సర్వాత్మనా భుక్తఫలత్వం కర్మణః ప్రతిజానీమహే. నను నిరవశేషకర్మఫలభోగాయ చన్ద్రమణ్డలమారూఢః? బాఢమ్. తథాపి స్వల్పకర్మావశేషమాత్రేణ తత్రావస్థాతుం న లభ్యతే. యథా కిల కశ్చిత్సేవకః సకలైః సేవోపకరణైః రాజకుల ముపసృప్తశ్చిరప్రవాసాత్పరిక్షీణబహూపకరణశ్ఛత్రపాదుకాదిమాత్రావశేషో న రాజకులేఽవస్థాతుం శక్నోతి, ఏవమనుశయమాత్రపరిగ్రహో న చన్ద్రమణ్డలేఽవస్థాతుం శక్నోతీతి. న చైతద్యుక్తమివ. న హి స్వర్గార్థస్య కర్మణో భుక్తఫలస్యావశేషానువృత్తిరుపపద్యతే, కార్యవిరోధాదిత్యుక్తమ్. నన్వేతదప్యుక్తం-న స్వర్గఫలస్య కర్మణో నిఖిలస్య భుక్తఫలత్వం భవిష్యతీతి? తదపేశలమ్. స్వర్గార్థం కిల కర్మ స్వర్గస్థస్యైవ స్వర్గఫలం న జనయతి, స్వర్గచ్యుతస్యాపి కంచిత్ఫలలేశం జనయతీతి, న శబ్దప్రమాణకానామీదృశీ కల్పనాఽవకల్పతే.

A
ప్రశ్న – జీవుడు నిరవశేష ఫలభోగానంతరము చంద్రమండలాన్ని అధిరోహించాడు
కదా! నిరవశేష ఫలభోగము సంభవించదు అనడం అయుక్తము?
సమాధానము........ (ఇంత విషయము ముద్రితము కాలేదు)



స్నేహభాణ్డే తు స్నేహలేశానువృత్తిర్దృష్టత్వాదుపపద్యతే. తథా సేవకస్యోపకరణలేశానువృత్తిశ్చ దృశ్యతే, న త్విహ తథా స్వర్గఫలస్య కర్మణో లేశానువృత్తిర్దృశ్యతే. నాపి కల్పయితుం శక్యతే, స్వర్గఫలత్వశాస్త్రవిరోధాత్.

బాలానందిని

క ఇతి :- అనుశయం అనగా ఏమిటి? కొంతమం దైతే ఇలా అంటున్నారు పాత్రను అంటి పెట్టుకొని ఉన్న చమురు వలె స్వర్గాన్ని ఇచ్చే కర్మయొక్క అనుభవించగా మిగిలిన ఒక అవశేషమే అనుశయం అనగా. నూనె పోసిన పాత్ర (ఖాళీ)చేసినప్పుడు అది పూర్తిగా రిక్తం కాక ఆ పాత్రను పట్టుకొని ఒక స్నేహావశేషం ఏ విధంగా మిగిలి ఉంటుందో అట్లే అనుశయం కూడ. (ప్రశ్న). అదృష్టం, అనగా అదృష్టమైన కర్మ కార్యానికి విరోధి గాన, అనగా భోగరూపమైన కార్యంచేత నశింపచేయబడుతుంది గాన, ఫలం అనుభవించగా కర్మ మిగలడం అనేది న్యాయ్యం (యుక్తి సమ్మతం) కాదు. (సమాధానం) ఈ దోషం లేదు. పూర్తి కర్మయొక్క ఫలం అనుభవించబడుతుం దని మేం అనడం లేదు కదా? A
(సమాధానం) నిజమే. అయినా కూడ స్వల్పంగా మిగిలిన కర్మతో అక్కడ ఉండడం శక్యం కాదు. రాజసేవ కుపకరించే ఉపకరణా లన్నీ తీసికొని రాజు కొలువుకు వెళ్లిన సేవకుడు చాల కాలం ఉండడంచేత ఆ ఉపకరణా లన్నీ క్షీణించగా ఛత్రపాదుకాదులు మాత్రమే మిగిలి ఉన్నప్పుడు ఇంక ఆ రాజగృహంలో ఏ విధంగా ఉండజాలడో అదే విధంగా అనుశయం మాత్రమే ఆస్తిగా ఉన్నవాడు చంద్రమండలంలో ఉండజాలడు. (ఇది అనుశయాన్ని గూర్చి కొందరి(ఏకదేశుల)అభిప్రాయం. ఇప్పుడు సిద్ధాంతం చెప్పబడుచున్నది). ఇది బాగున్నట్లులేదు. కార్యంతో విరోధం ఉండడంవల్ల స్వర్గం కోసం చేసిన కర్మ ఫలం అనుభవించిన తరవాత శేషించడం ఉపపన్నం కాదు అని చెప్పబడింది కదా? (ప్రశ్న)-స్వర్గఫలక మైన కర్మ పూర్తిగా భుక్తఫలం కాదని కూడ చెప్పబడింది కదా? (సమాధానం) ఇది యుక్తం కాదు స్వర్గం ప్రయోజనంగా గల (స్వర్గాన్ని ఇచ్చే) కర్మ స్వర్గం చేరినవానికే పూర్తిగా తన ఫలం ఇవ్వదు. స్వర్గంనుండి చ్యుతుడైన తరవాత కూడ కొంచెం ఫలం ఇస్తుంది అని ఇలాంటి కల్పన శబ్దం ప్రమాణం అని అంగీకరించేవాళ్లకి తగదు స్నేహభాండంలో నైతే కొంత చమురు ఇంకా అంటుకొని ఉండడం ప్రత్యక్షంగా కనబడుతూన్నది కాబట్టి అది ఉపపన్నమే. అట్లే సేవకుని దగ్గర

కొంచెం ఉపకరణాలు మాత్రమే మిగిలి ఉండడం కూడ ప్రత్యక్షంగా కనబడుతున్నది. ఆ విధంగా ఇక్కడ స్వర్గఫలకమైన కర్మయొక్క లేశం అనువర్తిస్తున్నట్లుగా కనబడడంలేదు. అలా కల్పించడానికి కూడ శక్యం కాదు. అలా కల్పిస్తే అది స్వర్గఫలత్వశాస్త్రానికి (ఆ కర్మ స్వర్గం ఇస్తుంది అని చెప్పే శాస్త్రానికి) విరుద్ధం అవుతుంది.

భాష్యమ్.

అవశ్యం చైతదేవం విజ్ఞేయమ్. న స్వర్గఫలస్యేష్ట్యాదేః కర్మణో భాణ్డానుసారిస్నేహవదేకదేశోఽనువర్తమానోఽనుశయ ఇతి. యది హి యేన సుకృతేన కర్మణా ఇష్టాదినా స్వర్గమన్వభూవంస్తస్యైవ కశ్చిదేకదేశోఽనుశయః కల్ప్యేత తతో రమణీయ ఏవైకోఽనుశయః స్యాన్న విపరీతః. తత్రేయమనుశయవిభాగశ్రుతిరుపరుధ్యేత "తద్య ఇహ రమణీయచరణాః" "అథ కపూయచరణాః" (ఛా.ఉ. 5.10.7) ఇతి. తస్మాదాముష్మికఫలే కర్మజాత ఉపభుక్తేఽవ శిష్టమైహికఫలం కర్మాన్తరజాతమనుశయస్తద్వన్తోఽవరోహన్తీతి. యదుక్తం - యత్కించేత్యవిశేషపరామర్శాత్సర్వస్యేహ కృతస్య కర్మణః ఫలపభోగేనాన్తం ప్రాప్య నిరనుశయా అవరోహన్తీతి; నైతదేవమ్. అనుశయ సద్భావస్యావగమితత్వాత్. యత్కించిదిహ కృతమాముష్మికఫలం కర్మారబ్ధభోగం తత్సర్వం ఫలోపభోగేన క్షపయిత్వేతి గమ్యతే. యదుక్తం ప్రాయణవిశేషాదనారబ్ధ ఫలం కృత్స్నమేవ కర్మాభివ్యనక్తి, తత్ర కేన చిత్కర్మణాఽముష్మిన్ లోకే ఫలమారభ్యతే, కేన చిదస్మిన్నిత్యయం విభాగో న సంభవతి ఇతి. తదప్యనుశయసద్భావప్రతిపాదవేనైవ ప్రత్యుక్తమ్.

బాలనందిని

**అవశ్యమితి:-** పాత్రను అంటి పెట్టుకొని ఉన్న చమురు వలె అనువర్తించే, స్వర్గాదిఫలకమైన కర్మయొక్క ఒక భాగం అనుశయం కాదని ఈ కారణంచేత కూడ తెలుసుకోవాలి. ఎందుచేత ననగా - ఇష్టాదికమైన ఏ సుకృతంచేత స్వర్గాన్ని అనుభవించారో

దాని ఒక భాగమే అనుశయం అని కల్పించిన ట్లయితే ఆ ఒక్క అనుశయం రమణీయమే అయి ఉంటుంది కాని దానికి విపరీతంగా ఉండదు. అలాంటప్పుడు "తద్య ఇహ రమణీయచరణాః" "అథ య ఇహ కపూయచరణాః" అని అనుశయంలో విభాగాన్ని (పుణ్యరూపమైనది పాపరూపమైనది అని) చెప్పే శ్రుతికి ఉపరోధం కలుగుతుంది. అందుచేత ఆముష్మికఫలం గల (పరలోకంలో అనుభవించదగిన ఫలం గల) కర్మ సముదాయం అనుభవించబడిన తరువాత మిగిలిన ఐహికఫలం గల ఇతరకర్మల సముదాయమే అనుశయ మనగా; దానితో వాళ్లు దిగుతారు (అని చెప్పాలి). విశేషం ఏమీ లేకుండా "యత్కిం చ" అని చెప్పడంచేత ఇక్కడ చేసిన మొత్తం కర్మయొక్క అంతాన్ని, దాని ఫలం అనుభవించడం ద్వారా పొంది నిరనుశయులై దిగుతారు అని ఏది చెప్పబడిందో అది అట్లు కాదు. అనుశయం ఉంటుందని చూపించబడింది గాన (యత్కించ అనగా) ఇక్కడ చేసిన ఆముష్మికఫలం గల ఎంత కర్మైతే భోగం ఇవ్వడానికి ప్రారంభించినదో దాని నంతనీ ఫలభోగం ద్వారా క్షీణింపచేసి అను అర్థమే తెలుస్తూన్నది. మరణం ఫలం ఇవ్వడానికి ప్రారంభించని మొత్తం కర్మ నంతనీ వ్యంజింపచేస్తుంది; అలాంటప్పుడు ఒక కర్మచేత పరలోకంలో ఫలం అరంభించబడుతుంది, ఒక కర్మ చేత ఇహలోకంలో ఆరంభించబడుతుంది అనే విభాగం కుదరదు అని ఏది చెప్పబడిదో అది కూడ అనుశయం ఉంటుందని ప్రతిపాదించడంచేత నిరాకృతమైనది.

భాష్యమ్

అపి చ కేన హేతునా ప్రాయణమనారబ్ధఫలస్య కర్మణోఽభివ్యఞ్జకం ప్రతిజ్ఞాయత ఇతి వక్తవ్యమ్. ఆరబ్ధఫలేన కర్మణా ప్రతిబద్ధస్యేతరస్య వృత్త్యుద్భవానుపపత్తేస్తదుపశమాత్ప్రాయణకాలే వృత్త్యుద్భవో భవతీతి యద్యుచ్యతే తతో వక్తవ్యమ్ - యథైవ తర్హి ప్రాక్ప్రాయణాదారబ్ధఫలేన కర్మణా ప్రతిబద్ధస్యేతరస్య వృత్త్యుద్భవానుపపత్తిరిత్యేవం ప్రాయణకాలేఽపి విరుద్ధఫలస్యానేకస్య కర్మణో యుగపత్ఫలారమ్భాసంభవాద్బలవతా ప్రతిబద్ధస్య వృత్త్యుద్భవానుపపత్తిరితి. న హ్యనారబ్ధఫలత్వసామ్యేన జాత్యన్తరోపభోగ్య ఫలమప్యనేకం కర్మైకస్మిన్ ప్రాయణే యుగపదభివ్యక్తం సదేకాం జాతిమారభతే

ఇతి శక్యం వక్తుమ్. ప్రతినియతఫలత్వవిరోధాత్. నాపి కస్య చిత్కర్మణః ప్రాయణేఽభివ్యక్తిః కస్య చిదుచ్ఛేద ఇతి శక్యతే వక్తుమ్ - ఐకాన్తిక ఫలత్వవిరోధాత్. న హి ప్రాయశ్చిత్తాదిభిర్హేతుభిర్వినా కర్మణాముచ్ఛేదః సంభావ్యతే. స్మృతిరపి విరుద్ధఫలేన కర్మణా ప్రతిబద్ధస్య కర్మాన్తరస్య చిరమవస్థానం దర్శయతి -

"కదాచిత్సుకృతం కర్మ కూటస్థమిహ తిష్ఠతి,

మజ్జమానస్య సంసారే యావద్దుఃఖాద్విముచ్యతే" (మ.భా.శా.290-18)

ఇత్యేవంజాతీయకా. యది చ కృత్స్నమనారబ్ధఫలం కర్మైకస్మిన్ ప్రాయణేఽభివ్యక్తంసదేకాంజాతిమారభేతతతః స్వర్గనరకతిర్యగ్యోనిష్వధికారానవగమాద్ధర్మాధర్మానుత్పత్తౌనిమిత్తాభావాన్నోత్తరాజాతిరుత్పద్యేత. బ్రహ్మహత్యాదీనాం చైకైకస్య కర్మణోఽనేక జన్మనిమిత్తత్వం స్మర్యమాణముపరుధ్యేత.

బాలానందిని

**అపి చేతి:-** మరొక విషయ మేమనగా - మరణం అనారబ్ధఫలకమైన కర్మను అభివ్యంజింప చేస్తుంది (అది తన ఫలం ఇవ్వడానికి ప్రారంభించేటట్లు చేస్తుంది) అని ఏ హేతువుచేత చెప్పబడుతున్నదో (నువ్వు) చెప్పవలసి ఉంది. ఫలం ఇవ్వడానికి ఆరంభించిన కర్మచేత అడ్డుకొనబడిన ఇతరకర్మకు వృత్త్యుద్భవం (పనిచేయడం) కుదరదు: మరణసమయంలో ఆ ప్రతిబంధకం తొలగిపోవడంచేత దానికి (ఇతరకర్మకు) వృత్త్యుద్భవం కలుగుతుందని అన్నట్లయితే అప్పుడు మరణానికి పూర్వం ఆరబ్ధఫలమైన కర్మచేత ప్రతిబద్ధమైన ఇతరకర్మకు వృత్త్యుద్భవం ఏ విధంగా కుదరదో అదే విధంగా మరణకాలంలో కూడ విరుద్ధఫలాలు గల అనేకవిధాలైన కర్మలు ఒకే సారి ఫలం ఇవ్వడం సంభవం కాదు గాన బలవంతమైన కర్మచేత ప్రతిబద్ధమైన కర్మకు వృత్త్యుద్భవం కుదరదని చెప్పాలి. అనారబ్ధఫలత్వం అనే సామాన్యంచేత, అనగా మిగిలిన కర్మలన్నీ అనారబ్ధ ఫలా లనే విషయంలో సమంగానే ఉండడంచేత, మరొక జన్మలో అనుభవింపవలసిన ఫలం గల అనేక కర్మలు ఒకే ప్రాయణంలో ఒకే సారి అభివ్యక్తములై ఒకే జన్మను ఆరంభిస్తాయి (కలిగిస్తాయి) అని చెప్పడం యుక్తం కాదు కదా? అలా చెపితే ప్రతినియతఫలత్వానికి,

అనగా ఈ కర్మకు ఈఫలం అనే నియమానికి విరోధం కలుగుతుంది. ఒక కర్మ మరణ సమయంలో అభివ్యక్తం అవుతుంది, మరొక కర్మ నశిస్తుంది అని చెప్పడం కూడ శక్యం కాదు. ఐకాన్తికఫలత్వానికి (కర్మ తప్పకుండా ఫలం ఇచ్చి తీరుతుంది అనే నియమానికి) విరోధం కలుగుతుంది. ప్రాయశ్చితం మొదలైన హేతువులు లేకుండా కర్మలకు నాశం సంభావ్యం కాదు కదా?

వి. ఒక కర్మకు ఫలితంగా ఈ దేహం వచ్చింది. ఈ విధంగా ఒక కర్మ తన ఫలాన్ని ఇవ్వడానికి ప్రారంభించి మిగిలిన కర్మ లేవీ వాటి వాటి ఫలితాన్ని ఇవ్వకుండా అడ్డుకొంటూన్నది. ఈ దేహం రాలి పోగానే అడ్డుతీరడంచేత మిగిలిన కర్మలన్నీ తమ ఫలం ఇవ్వడానికి ప్రారంభించి మరొక జన్మను ఇస్తాయని పూర్వపక్షి అభిప్రాయం. దానికి సిద్ధాంతి చేప్పే అభ్యంతరం ఇది - మిగిలిన కర్మలలో (ఒక్క కర్మ కాదు) అనేక విధాలైన కర్మలుంటాయి. ఒక కర్మ ఇచ్చే ఫలం ఒక విధంగా ఉంటే మరొక టిచ్చే ఫలం మరొక విధంగా ఉంటుంది. ఈ విధంగా రెండు కాదు, మూడు కాదు, అనేకకర్మలు తమ తమ ఫలాలు ఇవ్వడానికి ఉంటాయి. ఒక్క మరణం ఆ కర్మల నన్నింటినీ ఒకే సారి వ్యంజింపజాలదు. ఒక్కొక్క కర్మకు ఒక్కొక్క జన్మ ఎత్త వలసి ఉంటుంది. ఉదాహరణకి - ఒకడు చేసిన ఒక కర్మకు ఫలితంగా మనుష్య జన్మ ఎత్త వలసి ఉంటుంది. మరొక కర్మకు ఫలితంగా వానరజన్మ, ఇలాగే బిడాలజన్మ, దేవతాజన్మ, ఈ విధంగా ఎన్నో కర్మల ఫలితంగా ఎన్నో జన్మలు ఎత్తవలసి ఉంటుంది. అరబ్ధఫలం గల కర్మ ఇతర కర్మలు అభివ్యక్తం కాకుండా అడ్డుకొంటుం దనీ మరణంతో ఆ అడ్డు తీరి ఇతర కర్మలు ఫలం ఇవ్వడం ప్రారంభిస్తాయనీ నువ్వు ఏ విధంగా చెపుతున్నావో అదే విధంగా మిగిలిన కర్మలు కూడ విరుద్ధ ఫలా లవడంచేత వాటిలో ఒక కర్మ తన ఫలం ఇవ్వడం ప్రారంభిస్తే, ఒక జన్మ ఇస్తే, అదే జన్మలో అనుభవించడానికి శక్యం కాని ఫలం ఇచ్చే మిగిలిన కర్మలన్నీ దానిచేత అడ్డుకొనబడతాయి. ఈ కర్మ చేత ప్రాప్తించిన దేహం నశించగానే మరొక కర్మ తన ఫలం ఇవ్వడానికి ప్రారంభిస్తుంది. ఈ విధంగా ఒక్క మరణంచేత మిగిలిన కర్మ లన్నీ వ్యంజితము లవుతా యని చెప్పడం అయుక్తం. ఒక్క మరణంవల్ల ఒక్క కర్మయే అభివ్యక్తం అవుతుంది. మిగిలిన కర్మ లన్నీ నశించిపోతాయి అని చెప్పడం కూడ శాస్త్రవిరుద్ధం. ఎందువల్ల ననగా ఏదైనా కర్మ నశించాలంటే ప్రాయశ్చిత్తాదులవల్ల

నశించాలిగాని అలా కాకపోతే అది దాని ఫలం ఏనాటికైనా ఇచ్చి తీరుతుంది అని శాస్త్రం చెపుతున్నది.

స్మృతిరితి:- విరుద్ధమైన ఫలంగల కర్మ చేత ప్రతిబద్ధమైన (అడ్డుకొనబడిన) మరొక కర్మ చాలాకాలం నిలవలో ఉంటుంది అని "కదాచిత్... విముచ్యతే" ఇత్యాదివిధమైన స్మృతులు కూడ చెపుతున్నాయి. (సంసారంలో మునిగిపోతున్న జీవుడు దుఃఖంనుండి విముక్తు డయ్యేవరకు వాడు చేసికొని ఉన్న పుణ్యకర్మ స్థిరంగా ఉంటుంది. అనగా ఒకడు పుణ్యకర్మ పాపకర్మ కూడ చేసి ఉన్నాడు. పాపకర్మ తన ఫలం ముందుగా ఇవ్వడం ప్రారంభించింది. దానివల్ల కలిగే దుఃఖా న్నంతనీ అతడు అనుభవించడం పూర్తి అయేవరకు పుణ్యకర్మ తన ఫలం ఇవ్వకుండా సమయానికై వేచి ఉంటుంది అని ఈ మహాభారతశ్లోకానికి భావం). మరియు, ఒకే మరణంలో అనారబ్ధఫలమైన సమస్తకర్మా కూడ అభివ్యక్తమై ఒకే జన్మను ఇచ్చిన ట్లయితే (ఆ జన్మలో ఆ జీవుడు స్వర్గంలో పుట్టినా, నరకంలో పుట్టినా, తిర్యగ్జంతువులలో పుట్టినా) ఆ స్వర్గనరక తిర్యగ్యోనులకు కర్మాచరణం చేసే అధికారం లేకపోవడంచేత ధర్మాధర్మాలు కలగవు గాన, నిమిత్తం లేకపోవడంచేత తర్వాత మరే జన్మా కూడ లేకుండా పోతుంది. అంతే కాకుండా బ్రహ్మహత్య మొదలైన ఒక్కొక్క కర్మ అనేక జన్మలకు హేతువు అవుతుందని చెప్పే స్మృతివాక్యానికి ఉపరోధం కలుగుతుంది.

[redacted]. "శ్వసూకరఖరోష్ట్రాణాం గోఽజావిమృగపక్షిణామ్, [redacted]చణ్డాలపుల్కసానాం చ బ్రహ్మహా యోనిమృచ్ఛతి" 9-1½ ; 9-2½
. అను స్మృతి ప్రకారం బ్రహ్మహత్య చేసినవాడు మంచి జన్మ వచ్చేలోగా ఇన్ని జన్మలు (శునకాది జన్మలు) ఎత్త వలసి ఉంటుంది గాన మరణించగానే మిగిలిన కర్మల ఫలాలనన్నింటినీ ఒకే జన్మలో అనుభవిస్తాడు అని చెప్పడం యుక్తం కాదు.

భాష్యమ్

న చ ధర్మాధర్మయోః స్వరూపసాధనాదిసమధిగమే శాస్త్రాదతిరిక్తం కారణం శక్యం సంభావయితుమ్. న చ దృష్టఫలస్య కర్మణః కారీర్యాదేః

ప్రాయణమభివ్యఞ్జకంసమ్భవతీత్యప్యవ్యాపికాపీయం ప్రాయణస్యాభివ్యఞ్జకత్వ కల్పనా. ప్రదీపోపన్యాసోఽపి కర్మబలాబలప్రదర్శనేనైవ ప్రతినీతః. స్థూలసూక్ష్మరూపాభివ్యక్త్యనభివ్యక్తివచ్చేదం ద్రష్టవ్యమ్. యథాహి దీపః సమానేఽపి సంనిధానే స్థూలం రూపమభివ్యనక్తి న సూక్ష్మమ్, ఏవం ప్రాయణం సమానేఽప్యనారబ్ధఫలస్య కర్మజాతస్య ప్రాప్తావసరత్వే బలవతః కర్మణో వృత్తిముద్భావయతి న దుర్బలస్యేతి. తస్మాచ్ఛ్రుతి స్మృతిన్యాయవిరోధాదశ్లిష్టోఽయమశేషకర్మాభివ్యక్త్యభ్యుపగమః. శేషకర్మ సద్భావేఽనిర్మోక్షప్రసంగ ఇత్యయమప్యస్థానేసంభ్రమః; సమ్యగ్దర్శనాదశేషకర్మక్షయశ్రుతేః. తస్మాత్ స్థితమేతదేవానుశయవన్తోఽవరోహన్తీతి. తేచావరోహన్తో యథేతమనేవం చావరోహన్తి. యథేతమితి యథాగతమిత్యర్థః. అనేవమితి తద్విపర్యయేణేత్యర్థః. ధూమాకాశయోః పితృయాణేఽధ్వన్యుపాత్తయోరవరోహే సంకీర్తనాద్యథేతం శబ్దాచ్చ యథాగతమితి ప్రతీయతే. రాత్ర్యాద్యసంకీర్తనాత్ అభ్రాద్యుప సంఖ్యానాచ్చ విపర్యయోఽపి ప్రతీయతే. 8

బాలానందిని

నచేతి :- ధర్మాధర్మాల స్వరూపం, ఫలం, సాధనాలు మొదలైనవాటిని తెలుసుకొనడానికి శాస్త్రంకంటె భిన్నమైన కారణం ఏదీ ఊహించడానికి శక్యం కాదు కదా? (అందుచేత ఒకే పాపం అనేక జన్మలకు కారణం ఎలా అవుతుంది అనే ఆశంకకు అవకాశం లేదని అర్థం). ప్రత్యక్షంగా కనబడే (వర్షాది) ఫలాన్ని ఇచ్చే కారీర్యాదికర్మలను మరణం వ్యంజింపచేస్తుం దనడం కూడ సంభవం కాదు; అందుచేత మరణం కర్మాభివ్యం జకం అని కల్పించడం అవ్యాపకం, అనగా అవ్యాప్తిదోషదుష్టం. దీపాన్ని దృష్టాంతంగా చూపడం కూడ కర్మల బలాబలాలను చూపడంచేతనే నిరసించబడింది.

వి:- దీపం వస్తువులను ప్రదర్శించినట్లు మరణం కర్మలను అభివ్యంజింపచేయడ మనేది లేదు గాన దీపదృష్టాంతం ఇక్కడ కుదరదు. ఒక కర్మ ఫలం ఇవ్వడానికి ఆరంభించిం దనగా దానిని బలమైన కర్మ ఏదీ అడ్డుకొనలేదని అర్థం. అంతేకాని

మరణానికి కర్మాభివ్యక్తికీ సంబంధం లేదు గాన ఆ దృష్టాంతం సరి కాదు.

స్థూలేతి:- (దీపదృష్టాంతం అన్వయించుకొన్నా కూడ) స్థూలసూక్ష్మరూపాల అభివ్యక్త్యనభివ్యక్తుల వలె చూచుకోవాలి. సంనిధానం సమానమే అయినా దీపం ఏ విధంగా స్థూలరూపాన్నే అభివ్యక్తం చేస్తుంది కాని సూక్ష్మరూపాన్ని అభివ్యక్తం చేయదో అట్లే మరణం కూడ, అనారబ్ధఫలాలైన కర్మసముదాయం ప్రాప్తావసరమైనా కూడ (తమ తమ ఫలాలు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నా కూడ) ప్రబలమైన కర్మయొక్క వృత్తిని కలగ చేస్తుంది. (ఫలం ఇచ్చేటట్లు చేస్తుంది) కాని దుర్బలకర్మవృత్తిని కాదు. అందువల్ల, శ్రుతి-స్మృతి-న్యాయాలకు విరుద్ధంగా ఉండడంచేత మరణం సమస్తకర్మలనూ అభివ్యక్తం చేస్తుంది అని అంగీకరించడం సరియైనది కాదు. కొన్ని కర్మలు మిగులుతాయి అని అంగీకరిస్తే అనిర్మోక్ష ప్రసంగం కదా (మోక్షమే కలగకపోవడం అనేది -ప్రసక్తం అవుతుంది కదా) అనేది కూడ కారణం లేకుండా కంగారు పడడమే. సమ్యగ్దర్శనంవల్ల సమస్తకర్మలు నశిస్తాయని శ్రుతి చెప్పుచున్నది కదా? అందువల్ల అనుశయంతోనే దిగుతారనేది నిశ్చితం. ఆ దిగేవాళ్లు వెళ్లినట్లు, మరొక విధంగాను కూడ దిగుతారు. 'యథేతమ్' అనగా ఎలా వెళ్లారో అదే మార్గంలో అని అర్థం. "అనేవమ్" అనగా అందుకు మార్పుగాను అని అర్థం. పితృయాణమార్గంలో చెప్పిన ధూమాకాశాలను దిగే మార్గంలో కూడ చెప్పడంచేత, శ్రుతిలో ఉన్న "యథేతమ్" అనే పదంచేత ఎలా వెళ్లారో అల్లాగ అని తెలుస్తూన్నది. (గమనమార్గంలో చెప్పిన) రాత్ర్యాదులను అవరోహణ మార్గంలో చెప్పకపోవడంచేత, దీనిలో అధికంగా అభ్రాదులను చెప్పడంచేత వెళ్లినదానికి విపర్యయంగా ఉన్న మార్గంలో తిరిగి వస్తారు అని కూడ తెలుస్తూన్నది. 8

### సూ. చరణాదితిచేన్నోపలక్షణార్థేతి కార్ష్ణాజినిః.3.1.9

అథాపి స్యాత్-యా శ్రుతిరనుశయసద్భావప్రతిపాదనాయోదాహృతా-"తద్య ఇహ రమణీయచరణాః" (ఛా.ఉ.5.10.7) ఇతి, సా ఖలు చరణాద్యోన్యాపత్తిం దర్శయతి, నానుశయాత్. అన్యచ్చరణమన్యోఽనుశయః, చరణం, చరిత్రమ్, ఆచారః, శీలమిత్యనర్థాన్తరమ్. అనుశయస్తు భుక్తఫలాత్కర్మణోఽతిరిక్తం కర్మాభిప్రేతమ్. శ్రుతిశ్చ కర్మచరణే భేదేన వ్యపదిశతి- "యథాకారీ యథాచారీ

తథా భవతి" (బృ.ఉ.4.4.5) ఇతి, "యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని నో ఇతరాణి, యాన్యస్మాకం సుచరితాని తాని త్వయోపాస్యాని (తై.ఉ.1.11.2) ఇతి చ. తస్మాచ్చరణాద్యోన్యాపత్తిశ్రుతేర్నానుశయసిద్ధిరితి చేత్, నైషదోషః. యతోఽను శయోపలక్షణార్థైవైషా చరణశ్రుతిరితి కార్ష్ణాజినిరాచార్యో మన్యతే. 9.

బాలానందిని

చరణాదితి :- "చరణాత్=చరణం(ఆచారం)అని చెప్పడంవల్ల చరణమే అవరోహణానికి కారణం, ఇతి చేత్=అన్నట్లయితే, న=కాదు, లక్షణార్థా=చరణశ్రుతి లక్షణార్థం గలది అని, కార్ష్ణాజినిః కార్ష్ణాజిని అంటున్నాడు" అని సూత్రార్థం.

అథాపీతి :- ఈ విధంగా కూడ చెప్పవచ్చును-అనుశయం ఉన్నదని చెప్పే "తద్య....చరణాః" అను ఏ శ్రుతి ఉదహరించబడినదో అది చరణంవల్లనే జన్మ లభిస్తుం దని చెపుతున్నది కాని అనుశయంవల్ల కాదు. చరణం వేరు అనుశయం వేరు. చరణమ్, చారిత్రమ్, ఆచారం, శీలమ్-ఇవన్నీ సమానార్థకాలు. ఫలం అనుభవించిన కర్మకంటె భిన్నమైన కర్మ అనుశయ మని అంగీకరించబడింది. "యథాకారీ...భవతి"(ఎలాంటి కర్మ చేస్తాడో,ఏ ఆచారం చేస్తాడో అవిధంగా అవుతాడు)అని, "యాని...ఉపాస్యాని" (మా నిర్దుష్టమైన కర్మలు ఏవి ఉన్నయో అవి సేవించదగినవి, ఇతరమైనవి కావు, మా మంచి చరితములు ఏవి ఉన్నాయో అవి నీచేత సేవించదగినవి) అనీ శ్రుతి కర్మను, చరణాన్ని వేరువేరుగా చెప్పుచున్నది. అందువల్ల చరణంవల్ల జన్మ లభిస్తుంది అని వినబడడంవల్ల అనుశయం సిద్ధించదు అన్నట్లయితే-ఈ దోషం లేదు. ఎందువల్ల ననగా ఈ చరణశ్రుతి ఉపలక్షణచేత అనుశయాన్ని చెప్పడంకొరకే అని కార్ష్ణాజిని అనే ఆచార్యుడు తలచుచున్నాడు. 10

## సూ. ఆనర్థక్యమితి చేన్న తదపేక్షత్వాత్.3.1.10

స్యాదేతత్- కస్మాత్పునః చరణశబ్దేన శ్రౌతం శీలం విహాయ లాక్షణికోఽనుశయః ప్రత్యాయ్యతే? నను శీలస్యైవ తు శ్రౌతస్య విహితప్రతిషిద్ధస్య సాధ్వసాధురూపస్య శుభాశుభయోన్యాపత్తిః ఫలం భవిష్యతి.

అవశ్యం చ శీలస్యాపి కించిత్ఫలమభ్యుపగన్తవ్యమ్; అన్యథాహ్యానర్థక్యమేవ శీలస్య ప్రసజ్యేతేతి చేత్; నైష దోషః. కుతః? తదపేక్షత్వాత్. ఇష్టాది హి కర్మజాతం చరణాపేక్షమ్. న హి సదాచారహీనః కశ్చిదధికృతః స్యాత్. "ఆచారహీనం న పునన్తి వేదాః" ఇత్యాది స్మృతిభ్యః. పురుషార్థత్వేఽప్యాచారస్య నానర్థక్యమ్. ఇష్టాదౌ హి కర్మజాతే ఫలమారభమాణే తదపేక్ష ఏవాచారః తత్రైవ కంచిదతిశయమారప్స్యతే. కర్మ చ సర్వార్థకారీతి శ్రుతిస్మృతిప్రసిద్ధిః. తస్మాత్కర్మైవ శీలోపలక్షితమనుశయభూతం యోన్యాపత్తౌ కారణమితి కార్ష్ణాజినేర్మతమ్. న హి కర్మణి సంభవతి శీలాద్యోన్యాపత్తిర్యుక్తా. న హి పద్భ్యాం పలాయితుం పారయమాణో జానుభ్యాం రంహితుమర్హతీతి. 10.

బాలానందిని

అనర్థక్యమితి:- "ఆనర్థక్యమితి చేత్= కర్మయే జన్మకారణమైతే చరణం వ్యర్థం అవుతుంది అన్నట్లయితే, న=కాదు. తదపేక్షత్వాత్–కర్మ చరణాపేక్షం కాబట్టి" అని సూత్రార్థం.

స్యాదేతదితి:- ఇది ఇలా ఉండనీ. చరణశబ్దంచేత శ్రౌతమైన అనగా ముఖ్యార్థమైన శీలాన్ని విడిచిపెట్టి లాక్షణికమైన (లక్షణావృత్తిచేత బోధింపబడే)అనుశయం ఎందువల్ల గ్రహించబడుచున్నది? శ్రుతిచేత బోధించబడినది, విహిత-ప్రతిషిద్ధరూపము, మంచిదిగాను చెడ్డదిగాను ఉండేది అయిన శీలానికే శుభాశుభయోనులను పొందడం అనేది ఫలం అవుతుంది. శీలానికి కూడ తప్పక ఏదో ఒక ఫలం ఉంటుందని అంగీకరించాలి. అలా కాకపోతే శీలం వ్యర్థమే అవుతుంది అని అన్నట్లయితే-ఈ దోషం లేదు. ఎందువల్ల? తదపేక్షత్వంవల్ల. ఇష్టాదిక మైన కర్మసముదాయం చరణంమీద ఆధారపడి ఉన్నది కదా? "ఆచారహీనం న పునన్తి వేదాః" (ఆచారం లేనివానిని వేదాలు పవిత్రం చెయ్యవు) ఇత్యాది స్మృతుల ననుసరించి సదాచారహీను డెవ్వడూ కూడ కర్మలు ఆచరించడానికి అధికృతుడు (అధికారం కలవాడు)కాడు కదా? (స్నానాదులవలె) ఆచారం కూడ పురుషార్థం అనగా పురుషుని సంస్కారంకొరకే, అని అంగీకరించినా కూడ ఆచారం వ్యర్థం కాదు. ఇష్టాదికర్మసముదాయం ఫలాన్ని ఆరంభిస్తున్నప్పుడు దానికి ఆధారమైన ఆచారం ఆ

ఫలమునందే కొంత అతిశయాన్ని పుట్టిస్తుంది. కర్మయే సర్వార్థాలను సాధించేది అని శ్రుతిస్మృతులలో ప్రసిద్ధి ఉంది. అందుచేత శీలోపలక్షితమై అనుశయమైన కర్మయే జన్మ పొందడంలో కారణం అని కార్ష్ణాజిని మతం. కర్మ ఉండగా శీలం వల్ల యోని కలగడం యుక్తం కాదు. పాదాలతో పరుగెత్త కలిగినవాడు మోకాళ్లతో పాకడం తగదు కదా? 10.

సూ. సుకృతదుష్కృతే ఏవేతి తు బాదరిః. 3.1.11.

బాదరిస్త్వాచార్యః సుకృతదుష్కృతే ఏవ చరణశబ్దేన ప్రత్యాయ్యేతే ఇతి మన్యతే. చరణమనుష్ఠానం కర్మేత్యనర్థాన్తరమ్. తథాహి-అవిశేషేణ కర్మమాత్రే చరతిః ప్రయుజ్యమానో దృశ్యతే. యో హీష్టాదిలక్షణం పుణ్యం కర్మ కరోతి తం లౌకికా ఆచక్షతే ధర్మం చరత్యేష మహాత్మేతి. ఆచారోఽపి చ ధర్మవిశేష ఏవ. భేదవ్యపదేశస్తు కర్మచరణయోర్బ్రాహ్మణపరివ్రాజకన్యాయేనాప్యుపపద్యతే. తస్మాద్రమణీయచరణాః ప్రశస్తకర్మాణః, కపూయచరణాః నిన్దితకర్మాణ ఇతి నిర్ణయః. 11.

బాలానందిని

సుకృతేతి- "తు=అయితే, బాదరిః=బాదరి, సుకృతదుష్కృతే ఏవేతి=చరణం అనగా పుణ్యపాపాలే అని అన్నాడు" అని సూత్రార్థం.

బాదరిరితి:- బాదరి అనే ఆచార్యుడైతే చరణశబ్దంచేత సుకృతదుష్కృతాలే గ్రహించబడతాయి అని భావిస్తున్నాడు. 'చరణమ్' "అనుష్ఠానమ్" "కర్మ" అనేవి సమానార్థకపదాలు. అందువల్లనే 'చర' ధాతువు ఏ విశేషమూ లేకుండా 'కర్మ' అనే అర్థంలో ప్రయోగించబడుచున్నట్లు కనబడుచున్నది. ఇష్టాదిలక్షణ మైన పుణ్యకర్మ చేసేవానిని ఈ మహాత్ముడు ధర్మం ఆచరిస్తున్నాడు అని లౌకికులు అంటారు. ఆచారం కూడ ధర్మంలో ఒక విశేషమే. కర్మకు చరణానికి భేదవ్యపదేశం (ఇది వేరు అది వేరు అన్నట్లు వ్యవహరించడం) బ్రాహ్మణపరివ్రాజకన్యాయంచేత కూడ కుదురుతుంది అందువల్ల రమణీయచరణాః అనగా ప్రశస్తమైన కర్మ కలవాళ్లు. కపూయచరణాః అనగా నిందితమైన కర్మ కలవాళ్లు అని నిర్ణయం.

కృతాత్యయాధికరణం సమాప్తం

### 3. అనిష్టాదికార్యధికరణమ్. సూ. 12-21

### సూ. అనిష్టాదికారిణామపి చ శ్రుతమ్. 3.1.12

ఇష్టాదికారణశ్చన్ద్రమసం గచ్ఛన్తీత్యుక్తమ్. యే త్వితరేఽనిష్టాదికారిణస్తేఽపి కిం చన్ద్రమసం గచ్ఛన్త్యుత న గచ్ఛన్తీతి చిన్త్యతే. తత్ర తావదాహుః-ఇష్టాదికారిణ ఏవ చన్ద్రమసం గచ్ఛన్తీత్యేతన్న. కస్మాత్? యతోఽనిష్టాదికారిణామపి చన్ద్రమణ్డలం గన్తవ్యత్వేన శ్రుతమ్. తథా హ్యవిశేషేణ కౌషీతకినః సమామనన్తి. "యే వైకే చాస్మాల్లోకాత్ప్రయన్తి చన్ద్రమసమేవ తే సర్వే గచ్ఛన్తి" (కౌషీ. 1.2)ఇతి. దేహారమ్భోఽపి చ పునర్జాయమానానాం నాన్తరేణ చన్ద్రప్రాప్తిమవకల్పతే; పఞ్చమ్యామాహుతావిత్యాహుతిసంఖ్యానియమాత్. తస్మాత్సర్వ ఏవ చన్రదమసమాసీదేయుః. ఇష్టాదికారిణామితరేషాం చ సమానత్వం న యుక్తమితి చేత్; న. ఇతరేషాం చన్ద్రమణ్డలే భోగాభావాత్. 12.

బాలానందిని

**అనిష్టేతి**:- "అనిష్టాదికారిణామపి=ఇష్టాదులు చేయనివాళ్లకి కూడ, శ్రుతమ్=చంద్రలోకగమనము వినబడినది (శ్రుతిలో చెప్పబడినది)" అని సూత్రార్థం.

**ఇష్టాదీతి**:- ఇష్టాదులు చేసినవాళ్లు చంద్రుణ్ణి చేరుతారు అని చెప్పబడింది. ఇష్టాదులు చేయని ఇతరులు కూడ చంద్రుణ్ణి పొందుతారా పొందరా అని విచారణ చేయబడుచున్నది. ఈ విషయంలో ఇలా అంటున్నారు-ఇష్టాదికారులు మాత్రమే చంద్రుణ్ణి చేరుతారు అనేది కాదు. ఎందువల్ల? ఎందువల్ల ననగా ఇష్టాదికారులు కానివాళ్లు కూడ చంద్రమండలానికి వెడతారని వినబడింది. కౌషీతకులు విశేషం లేకుండా-"యే...గచ్ఛన్తి" ఈ లోకం విడిచి వెళ్లేవా ళ్లందరూ చంద్రుణ్ణే చేరుతారు) అని పఠిస్తున్నారు. "పఞ్చమ్యామహుతౌ" అని ఆహుతినియమం ఉండడంవల్ల మళ్లీ పుట్టవలసినవాళ్లకి చంద్రుణ్ణి చేరితే తప్ప దేహారంభం కుదరదు. అందుచేత అందరూ కూడ చంద్రమండలానికి వెడతారు. ఇష్టాదికారులకు ఇతరులకు కూడ ఒకే విధమైన గతి

ఉండడం యుక్తం కాదు అన్నట్లయితే అది కాదు. ఇతరులకు చంద్రమండంలంలో భోగం ఉండదు (అందుచేత ఆ భేదం ఉంటుందని అర్థం). 12

**సూ. సంయమనే త్వనుభూయేతరేషామారోహావరోహౌ తద్గతిదర్శనాత్ 3.1.13.**

తుశబ్దః పక్షం వ్యావర్తయతి. నైతదస్తి సర్వే చన్ద్రమసం గచ్ఛన్తీతి. ఏతత్కస్మాత్? యతో భోగాయైవ చన్ద్రారోహణం న నిష్ప్రయోజనమ్. నాపి ప్రత్యవరోహాయైవ. యథా కశ్చిద్వృక్షమారోహతి పుష్పఫలోపాదానాయైవ న నిష్ప్రయోజనం, నాపి పతనాయైవ. భోగశ్చానిష్టాదికారిణాంచన్ద్రమసి నాస్తీత్యుక్తమ్. తస్మాదిష్టాదికారిణ ఏవ చన్ద్రమసమారోహన్తి నేతరే. తే తు సంయమనం యమాలయమవగాహ్య స్వదుష్కృతానురూపా యామీర్యాతనా అనుభూయ పునరేవేమం లోకం ప్రత్యవరోహన్తి. ఏవంభూతౌ తేషామారోహావరోహౌ భవతః. కుతః? తద్గతిదర్శనాత్. తథాహి యమవచనరూపా శ్రుతిః ప్రయతామనిష్టాదికారిణాం యమవశ్యతాం దర్శయతి.

"న సాంపరాయః ప్రతిభాతి బాలం ప్రమాద్యన్తం విత్తమోహేన మూఢమ్,
అయం లోకో నాస్తి పర ఇతి మానీ పునః పునర్వశమాపద్యతే మె" (క.ఉ.2.6)

ఇతి "వైవస్వతం సంగమనం జనానామ్" ఇత్యేవంజాతీయకం బహ్వేవ యమవశ్యతాప్రాప్తిలిఙ్గం భవతి. 13.

బాలానందిని

సంయమన ఇతి:- "ఇతరేషాంతు = ఇష్టాదికర్మలు చేయని వాళ్లకైతే సంయమనే = యమలోకంలో, అనుభూయ=పాపఫలం అనుభవించి (తిరిగి రావడం ఉంటుంది). ఆరోహావరోహౌ=వాళ్ల ఆరోహణావరోహణాలు ఈ విధంగానే ఉంటాయి. తద్గతి దర్శనాత్=ఆ విధమైన గమనం కనబడడంవల్ల" అని సూత్రార్థం.

తు శబ్ద ఇతి:- తుశబ్దం పూర్వపక్షాన్ని నిరాకరిస్తుంది. అందరు చంద్రుణ్ణే చేరుతారనేది లేదు. ఇది ఎందువల్ల? ఎందువల్ల ననగా చంద్రుణ్ణి ఎక్కడం భోగం కోసమే కాని ఏ

ప్రయోజనము లేకుండా కాదు. కేవలం దిగిరావడానికి మాత్రమే కాదు. (లోకంలో) ఒకడు పుష్పఫలాదులు తీసికొనడంకొరకే వృక్షం ఎక్కుతాడు గాని ఏ ప్రయోజనమూ లేకుండా ఎక్కడు; కేవలం అక్కడినుండి పడడానికి కూడ ఎక్కడు; అట్లే ఇక్కడ కూడ ఇష్టాదులు చేయనివాళ్లకు చంద్రమండలలో భోగం లేదని కూడ చెప్పబడింది కదా? అందువల్ల ఇష్టాదికారులు మాత్రమే చంద్రమండలం మీదికి వెడతారు గాని ఇతరులు వెళ్లరు. వాళ్లైతే సంయమనంలో, అనగా యమలోకంలో, ప్రవేశించి తమ పాపాలకు తగిన యమయాతనలను అనుభవించి మళ్లీ ఈ లోకంలోనికి దిగి వస్తారు. వాళ్ల ఆరోహావరోహాలు ఈ విధంగానే ఉంటాయి. ఎందువల్ల? ఆ విధమైన గమనం శ్రుతిలో చెప్పబడింద కొబట్టి. అ దెట్లనగా యముని మాటల రూపంలో ఉన్న శ్రుతి మరణించిన ఇష్టాదికర్మలు చేయనివాళ్లు యమునికి వశ్యు లవుతారని చూపుచున్నది. "న... ఆపద్యతే మే" (ధనమోహంచేత మూఢుడై పొరబాటుపడుతుండే తెలివితక్కువవానికి పరలోకానికి సుఖంగా వెళ్లే ఉపాయం తోచదు. ఇదే లోకం, పరలోకం అంటూ లేదు అని అనుకునే వాడు మాటి మాటికి నాకు వశుడైపోతాడు) అని శ్రుతి చెప్పుచున్నది. "వైవస్వతం సంగమనం జనానామ్" (జనులందరూ కలిసే యమలోకం) ఇత్యాదికమైన అనేక లింగాలు యమునికి జనులు వశు లవుతా రని చెప్పడానికి ఉన్నాయి. 13

## సూ. స్మరన్తి చ. 3.1.14.

అపి చ మనువ్యాసప్రభృతయః శిష్టాః సంయమనే పురే యమాయత్తం కపూయకర్మవిపాకం స్మరన్తి నాచికేతోపాఖ్యానాదిషు. 14

### బాలానందిని

స్మరన్తతి:- "స్మరన్తి చ = స్మృతికారులు కూడ చెపుతున్నారు" అని సూత్రార్థం.

అపి చేతి:- మరియు మనువు, వ్యాసుడు మొదలైన శిష్టులు సంయమనపురంలో, దుష్టకర్మఫలానుభవం యముని చేతులలో ఉన్న దని నాచికేతోపాఖ్యానాదులలో చెపుతున్నారు. 14

## సూ. అపి చ సప్త. 3.1.15

అపి చ సప్త నరకా రౌరవప్రముఖా దుష్కృతఫలోపభోగభూమిత్వేన

స్మర్యన్తే పౌరాణికైః తానానిష్టాదికారిణః(ప్రాప్నువన్తి. కుతస్తే చన్ద్రం ప్రాప్నుయురిత్యభిప్రాయః. 15

బాలానందిని

అపీతి:- "అపి చ= మరియు, సప్త = ఏడు నరకాలు చెప్పబడుచున్నవి" అని సూత్రార్థం.

అపి చేతి:- మరియు రౌరవం మొదలైన ఏడు నరకాలు పాపఫలాన్ని అనుభవించవలసిన దేశాలుగా పౌరాణికులచేత చెప్పబడుతున్నాయి. ఇష్టాదులు చేయని వాళ్లు ఆ నరకాలకు వెడతారు. వాళ్లు చంద్రలోకానికి ఎందుకు వెడతారు అని అభిప్రాయం. / 15

భాష్యమ్

నను విరుద్ధమిదం యమాయత్తా యాతనాః పాపకర్మాణోఽనుభవన్తీతి. యావతా తేషు రౌరవాదిష్వన్యే చిత్రగుప్తాదయో నానాధిష్ఠాతారః స్మర్యన్త ఇతి. నేత్యాహ-

సూ. తత్రాపి చ తద్వ్యాపారాదవిరోధః. 3.1.16

తేష్వపి సప్తసు నరకేషు యమస్యాధిష్ఠాతృవ్యాపారాభ్యుపగమాదవిరోధః. యమప్రయుక్తా ఏవ హి తే చిత్రగుప్తాదయోఽధిష్ఠాతారః స్మర్యన్తే.16

బాలానందిని

నన్వితి:- ఆ రౌరవాదినరకాలలో చిత్రగుప్తాదులు అధికారులుగా ఉంటా రని చెప్పబడుచున్నది. అందుచేత పాపాత్ములు యముడు కల్పించిన యాతనలను అనుభవిస్తారు అని చెప్పడం అందుకు విరుద్ధం కదా? కాదంటున్నాడు -

తత్రేతి :- "తత్రాపి చ ఆ రౌరవాదులలో కూడ, తద్వ్యా పారాత్ = ఆ యముని వ్యాపారం (పని) ఉండడంవల్ల, అవిరోధః = విరోధం లేదు" అని సూత్రార్థం.

తేష్వితి:- ఆ ఏడు నరకాలలో కూడ యమునికే అధిష్ఠాతగా ఉండడం అనే

వ్యాపారాన్ని అంగీకరించడంవల్ల విరోధం లేదు. చిత్రగుప్తుడు మొదలైన ఆ అధికారులు యమునిచేతనే నియోగింపబడతా రని (పురాణాదులలో) చెప్పబడుచున్నది.16

## సూ. విద్యాకర్మణోరితి తు ప్రకృతత్వాత్ 3.1.17.

పఞ్చాగ్నివిద్యాయాం "వేత్థ యథాసౌ లోకో న సంపూర్యతే" (ఛా.ఉ. 5.3.3) ఇత్యస్య ప్రశ్నస్య ప్రతివచనావసరే శ్రూయతే - "అథైతయోః పథోర్న కతరేణ చ న తానీమాని క్షుద్రాణ్యసకృదావర్తీని భూతాని భవన్తి. జాయస్వ మ్రియస్వేత్యేతత్తృతీయం స్థానం తేనాసౌ లోకో న సంపూర్యతే" (ఛా.ఉ.5.10.8) ఇతి. తత్రైతయోః పథోరితి విద్యాకర్మణోరిత్యేతత్. కస్మాత్? ప్రకృతత్వాత్. విద్యాకర్మణీ హి దేవయానపితృయాణయోః పతిపత్తౌ పథోః ప్రకృతే. "తద్య ఇత్థం విదుః" ఇతి విద్యా. తయా ప్రతిపత్తవ్యో దేవయానః పన్థాః ప్రకీర్తితః. "ఇష్టాపూర్తే దత్తమ్"(ఛా.ఉ. 5.10.1,3) ఇతి కర్మ తేన ప్రతిపత్తవ్యః పితృయాణః పన్థాః ప్రకీర్తితః. తత్ప్రక్రియాయాం "అథైతయోః పథోర్న కతరేణ చ" ఇతి శ్రుతమ్. ఏతదుక్తం భవతి యే న విద్యాసాధనేన దేవయానే పథ్యధికృతా నాపి కర్మణా పితృయాణే తేషామేష క్షుద్రజన్తులక్షణో ఽసకృదావర్తీ తృతీయః పన్థాః భవతీతి. తస్మాదపి నానిష్టాదికారిభిశ్చన్ద్రమాః ప్రాప్యతే.

### బాలానందిని

విద్యేతి:- "విద్యాకర్మణోః ఇతి = విద్యాకర్మ లని, ప్రకృతత్వాత్ ప్రకృతం అవడంవల్ల ఇతరులు చంద్రలోకానికి వెళ్లరు" అని సూత్రార్థం.

పఞ్చాగ్నీతి:- పంచాగ్ని విద్యలో "వేత్థ యథాసౌ లోకో న సంపూర్యతే" (ఆ లోకం ఎందుచేత జీవులచేత నింపబడడం లేదో తెలుసునా?) అనే ప్రశ్నకు ప్రతివచనం ఇచ్చే సందర్భంలో - అథైతయోః... సంపూర్యన్తే" (ఈ దేవపితృమార్గాలు రెండింటిలోను ఏ ఒక్కదానిచేతా కూడ వెళ్లని క్షుద్రజీవులు మాటిమాటికి తిరుగుతూ ఉంటారు. మాటి మాటికి పుట్టడం మరణించడం అనేది ఈ మూడవ స్థానం. అందుచేతనే ఆ లోకం

నింపబడదం లేదు) అని వినబడుచున్నది. ఇక్కడ "ఏతయోః పథోః" అనగా విద్యాకర్మ లని అర్థం. ఎందువల్ల? అవి ప్రకృతం అవడంవల్ల. దేవయానపితృయాణాలనే మార్గాలను పొందడానికి సాధనాలుగా విద్యాకర్మలు ప్రకృత మైనవి. "తద్య ఇత్థం విదుః" (ఎవరైతే ఇట్లు తెలుసుకొనుచున్నారో) అని విద్య, దానిచేత పొందదగిన దేవయానమార్గమూ చెప్పబడ్డాయి. "ఇష్టాపూర్తే దత్తమ్" అని కర్మ దానిచేత పొందవలసిన పితృయాణమార్గమూ చెప్పబడ్డాయి. ఆ సందర్భంలోనే "అథైతయోః పథోర్న కతరే చ" (ఈ మార్గాలలో ఏ ఒక్కదాని చేతా కూడ) అని వినబడుచున్నది. ఇక్కడ చెప్పిన విషయం ఇది - విద్య అనే సాధనంతో దేవయానమార్గంలో వెళ్లడానికి ఎవరికి అధికారం లేదో కర్మ అనే సాధనంతో పితృయాణమార్గంలో వెళ్లడానికి అధికారం లేదో వాళ్లకి మాటి మాటికీ తిరుగుతూ ఉండే క్షుద్రజంతురూపమైన (క్షుద్రజంతువులు వెళ్లే) మూడవ మార్గం లభిస్తుంది.

## భాష్యమ్

స్యాదేతత్- తేఽపి చన్ద్రబిమ్బమారుహ్య తతోఽవరుహ్య క్షుద్రజన్తుత్వం ప్రతిపత్స్యన్తే ఇతి. తదపి నాస్తి; ఆరోహానర్థక్యాత్. అపి చ సర్వేషు ప్రయత్సు చన్ద్రలోకం ప్రాప్నువత్సు అసౌ లోకః ప్రయద్భిః సంపూర్యేతేత్యతః ప్రశ్నవిరుద్ధం ప్రతివచనం ప్రసజ్యేత. తథా హి ప్రతివచనం దాతవ్యం యథాసౌ లోకో న సంపూర్యతే. అవరోహాభ్యుపగమాదసంపూరణోపపత్తిరితి చేత్; న. అశ్రుతత్వాత్. సత్యమవరోహాదసంపూరణముపపద్యతే. శ్రుతిస్తు తృతీయస్థానసంకీర్తనేనాసంపూరణం దర్శయతి - "ఏతత్తృతీయం స్థానం తేనాసౌ లోకో న సంపూర్యతే" (ఛా.ఉ.5.10.8) ఇతి. తేనానారోహాదేవాసంపూరణమితి యుక్తమ్. అవరోహస్యేష్టాదికారిష్వప్యవిశిష్టత్వే సతి తృతీయస్థానోక్త్యానర్థక్య ప్రసంగాత్. తుశబ్దస్తు శాఖాన్తరీయవాక్యప్రభవామశేషగమనాశఙ్కాముచ్ఛినత్తి ఏవం సత్యధికృతాపేక్షః శాఖాన్తరీయే వాక్యే సర్వశబ్దోఽవతిష్ఠతే - యే వై కేచిదధికృతా అస్మాల్లోకాత్ప్రయన్తి చన్ద్రమసమేవ తే సర్వే గచ్ఛన్తీతి. 17

బాలానందిని

స్యాదితి - ఎవరైనా ఇలా చెప్పవచ్చు- వాళ్లు కూడ చంద్రబింబం పైకి ఎక్కి అక్కడినుండి దిగి క్షుద్రజంతువులుగా పుడతారు (అని). అది కూడ కుదరదు. ఎక్కడం నిరర్థకం గదా? మరొక విషయం ఏమనగా - మరణించినవాళ్లంతా చంద్రలోకం చేరుకుంటే వీళ్లతో ఆలోకం నిండిపోదా అనే ప్రశ్నకు విరుద్ధ మైన సమాధానం ఇచ్చినట్లు ప్రసక్తమవుతుంది. ఆ లోకం ఏ విధంగా నిండిపోదో చెపుతూ సమాధానం ఇవ్వాలి. దిగివస్తా రని అంగీకరించడంచేత నిండిపోకుండా ఉండడం కుదురుతుంది అన్నట్లయితే అది యుక్తం కాదు. అది (తిరిగి రావడం) వినబడడం లేదు కదా? నిజమే; దిగివచ్చేయడం వల్ల కూడ అసంపూరణం ఉపపన్నమే. కాని శ్రుతి "ఏతత్... పూర్యతే" అని మూడవ స్థానాన్ని గూర్చి చెప్పడంచేత అసంపూరణాన్ని చూపుతున్నది. అందుచేత అసంపూరణం వీళ్లవరూ దానిమీదకు వెళ్లకపోవడంచేతనే అని చెప్పడమే యుక్తం. దిగడం అనేది ఇష్టాదికారుల విషయంలో కూడ ఉన్నప్పుడు మూడవ స్థానాన్ని గూర్చి చెప్పడం వ్యర్థం అనే ప్రసక్తి ఏర్పడుతుంది. సూత్రంలోని తు శబ్దం మరొక శాఖలో ఉన్న వాక్యాన్ని పట్టి కలిగిన అందరూ కూడ వెడతారనే ఆశంకను తొలగిస్తుంది. ఇలా చెప్పవలసి ఉన్నప్పుడు శాఖాంతరగతమైన వాక్యంలోని సర్వశబ్దం ఎవరికి అధికారం ఉన్నదో వాళ్లందరూ అనే అర్థాన్ని బోధిస్తుంది. - అధికారం కలవాళ్లు ఎవరైతే ఈ లోకం నుండి వెడతారో వాళ్లందరూ చంద్రలోకంలోనికే వెడతారు అని చెపుతుంది. 17

భాష్యమ్

యత్పునరుక్తం - దేహలాభోపపత్తయే సర్వే చన్ద్రమసం గన్తుమర్హన్తి, పఞ్చమ్యామాహుతావిత్యాహుతిసంఖ్యానియమాత్ - ఇతి, తత్ప్రత్యుచ్యతే-

సూ. న తృతీయే తథోపలబ్ధేః. 3.1.18

న తృతీయే స్థానే దేహలాభాయ పఞ్చసంఖ్యానియమ ఆహుతీనా మాదర్తవ్యః కుతః? తథోపలబ్ధేః తథా హ్యన్తరేణైవాహుతిసంఖ్యానియమం వర్ణితేన ప్రకారేణ తృతీయస్థానప్రాప్తిరుపలభ్యతే - "జాయస్వ మ్రియస్వే

త్యేతత్తృతీయం స్థానమ్'' (ఛా.ఉ. 5.10.8) ఇతి. అపి చ ''పఞ్చమ్యావాహుతావాపః పురుషవచసో భవన్తి'' (ఛా. ఉ. 5.3.3) ఇతి మనుష్యశరీరహేతుత్వే నాహుతిసంఖ్యా సంకీర్త్యతే; న కీటపతఙ్గాదిశరీరహేతుత్వేన; పురుషశబ్దస్య మనుష్యజాతివచనత్వాత్. అపి చ పఞ్చమ్యామాహుతావపాం పురుషవచస్త్వ ముపదిశ్యతే నాపఞ్చమ్యామాహుతౌ పురుషవచస్త్వం ప్రతిషిధ్యతే; వాక్యస్య ద్వ్యర్థతాదోషాత్. తత్ర యేషామారోహావరోహౌ సంభవతస్తేషాం పఞ్చమ్యామాహుతౌ దేహ ఉద్భవిష్యతి. అన్యేషాం తు వినైవాహుతిసంఖ్యయా భూతాన్తరోపసృష్టాభిరద్భిర్దేహ ఆరప్స్యతే. 18

బాలానందిని

యత్పునరితి:- ''పఞ్చమ్యామాహుతౌ'' అని ఆహుతిసంఖ్యానియమం ఉండడం వల్ల దేహం లభించాలంటే అందరూ చంద్రమండలానికి వెళ్లాలి అని చెప్పినదానికి సమాధానం చెప్పబడుచున్నది.

నేతి:- ''తృతీయే = తృతీయ స్థానంలో, న =పంచసంఖ్యానియమం లేదు. తథా= అట్లు, ఉపలబ్ధేః = శ్రుతిలో కనబడడంవల్ల అని సూత్రార్థం.

నేతి:- తృతీయస్థానంలో దేహలాభంకొరకు ఆహుతుల పంచసంఖ్యానియమాన్ని ఆదరించవలసిన పనిలేదు. ఎందువల్ల? ఆ విధంగానే కనబడుతూండడంవల్ల. అదెట్లనగా - ''జాయస్వ మ్రియస్వేత్యేచత్తృతీయం స్థానమ్'' అని ఆహుతిసంఖ్యానియమం లేకుండానే పైన చెప్పిన పద్ధతిలో తృతీయస్థానప్రాప్తి కనబడుచున్నది. మరొక విషయమేమనగా ''పఞ్చమ్యామ్... భవన్తి'' అని ఆహుతిసంఖ్య మనుష్యశరీరానికి హేతువుగా మాత్రమే చెప్పబడుచున్నది గాన పురుగులు, మిడతలు మొదలైనవాటి శరీరానికి హేతువుగా చెప్పబడడం లేదు. ఎందువల్ల ననగా పురుషశబ్దం మనుష్యజాతిని చెపుతుంది. మరియు - పంచమాహుతిలో ఉదకానికి పురుషవచస్త్వం చెప్పబడుచున్నది గాని ఐదవది కాని ఆహుతిలో పురుషవచస్త్వం రాదు అని నిషేధించబడడం లేదు. అలా కూడ చెపితే వాక్యానికి రెండర్థాలు చెప్పడం అనే దోషం కలుగుతుంది. ఇతరులకైతే ఆహుతి సంఖ్య

లేకుండానే ఇతర భూతాలతో కూడిన ఉదకంచేత దేహం ఆరంభించబడుతుంది. 18

సూ. స్మర్యతేఽపి చ లోకే. 3.1.19.

అపి చ స్మర్యతే లోకే ద్రోణధృష్టద్యుమ్నప్రభృతీనాం సీతాద్రౌపదీప్రభృతీనాం చాయోనిజత్వమ్, తత్ర ద్రోణాదీనాం యోషిద్విషయైకాహుతిర్నాస్తి. ధృష్టద్యుమ్నాదీనాం తు యోషిత్పురుషవిషయే ద్వే అప్యాహుతీ న స్తః. యథా చ తత్రాహుతిసంఖ్యానాదరో భవత్యేవమన్యత్రాపి భవిష్యతి. బలాకాప్యన్తరేణైవ రేతఃసేకం గర్భం ధత్త ఇతి లోకరూఢిః 19

బాలానందిని

స్మర్యతే ఇతి:- "లోకే= లోకంలో, స్మర్యతేఽపి చ = స్మరింపబడుచున్నది కూడ" అని సూత్రార్థం.

అపి చేతి:- మరియు ద్రోణధృష్టద్యుమ్నాదులు సీతాద్రౌపద్యాదులు అయోనిజులని లోకంలో స్మృతులు భారతాదులు చెప్పుచున్నాయి. వారిలో ద్రోణాదులకు స్త్రీ విషయమైన ఒక ఆహుతి లేదు. ధృష్టద్యుమ్నాదులకు స్త్రీ పురుషవిషయకాలైన రెండు ఆహుతులూ కూడ లేవు. వాళ్లవిషయంలో ఏ విధంగా ఆహుతిసంఖ్యానియమం లేదో ఇతరుల విషయంలో అలాగే కావచ్చును. కొంగ కూడ రేతఃసేకం లేకుండానే గర్భం ధరిస్తుందని లోకంలో ప్రసిద్ధి. 19

సూ. దర్శనాచ్చ 3.1.20

అపి చ చతుర్విధే భూతగ్రామే జరాయుజాణ్డజస్వేదజోద్భిజ్జాదిలక్షణే స్వేదజోద్భిజ్జయోరన్తరేణైవ గ్రామ్యధర్మముత్పత్తిదర్శనాదాహుతిసంఖ్యానాదరో భవతి. ఏవమన్యత్రాపి భవిష్యతి. 20

బాలానందిని

దర్శనాదితి:- "దర్శనాచ్చ = లోకంలో చూడడంవల్ల కూడ ఆహుతి సంఖ్యానియమం లేదు" అని సూత్రార్థం.

**అపిచేతి:-** అంతే కాక జరాయుజాలు, అండజాలు స్వేదజాలు, ఉద్భిజ్జాలు అని నాలుగు విధాలైన ప్రాణిసముదాయంలో స్వేదజాలు (దోమలు నల్లులు మొదలైనవి) ఉద్భిజ్జాలు (మొక్కలు మొదలైనవి) గ్రామ్యధర్మం (స్త్రీ-పురుషసంగమం) లేకుండానే పుట్టడం కనబడుతుంది గాన ఆహుతిసంఖ్యను పట్టించుకొనవలసిన పని లేదు. కొన్ని ఇతరప్రాణులవిషయంలో కూడ ఇలాగే ఉండవచ్చు. 20.

## భాష్యమ్

నను "తేషాం ఖల్వేషాం భూతానాం త్రీణ్యేవ బీజాని భవన్తి అణ్డజం జీవజముద్భిజ్జమ్" (ఛా.ఉ. 6.3.1) ఇత్యత్ర త్రివిధ ఏవ భూతగ్రామః శ్రూయతే; కథం చతుర్విధత్వం భూతగ్రామస్య ప్రతిజ్ఞాతమితి. అత్రోచ్యతే -

## సూ. తృతీయశబ్దావరోధః సంశోకజస్య 3.1.21

"అణ్డజం జీవజముద్భిజ్జమ్" (ఛా.ఉ. 6.3.1) ఇత్యత్ర తృతీయేనోద్భిజ్జశబ్దే నైవ స్వేదజోపసంగ్రహః కృతః ప్రత్యేతవ్యః; ఉభయోరపి స్వేదజోద్భిజ్జ యోర్భూమ్యుదకోద్భేదప్రభవత్వస్య తుల్యత్వాత్. స్థావరోద్భేదాత్తు విలక్షణో జఙ్గమోద్భేద ఇతి అన్యత్ర స్వేదజోద్భేదజయోర్భేదవాద ఇత్యవిరోధః.21

## బాలానందిని

**తృతీయేతి:-** "సంశోకజస్య= స్వేదజానికి, తృతీయశబ్దావరోధః=మూడవదైన ఉద్భిజ్జశబ్దంచేత గ్రహణం" అని సూత్రార్థం.

**అణ్డజమితి:-** "అణ్డజం జీవజముద్భిజ్జమ్" అనే చోట ఉద్భిజ్జశబ్దంచేత స్వేదజాల ఉపసంగ్రహం కూడ చేయబడినట్లు గ్రహించాలి. స్వేదజోద్భిజ్జాలు రెండింటిలోను ఒకటి (ఉద్భిజ్జం) భూమిని చీల్చుకొని పుడుతుంది. రెండవది జలాన్ని చీల్చుకొని పుట్టుకొని వస్తుంది. ఈ విధంగా ఉద్భిజ్జత్వం రెండింటికీ సమానమే. అయితే స్థావరాలైన మొక్కల ఉద్భేదం కంటె జఙ్గమాలైన మశకాదుల ఉద్భేదం విలక్షణంగా ఉంటుంది గాన మరొక చోట స్వేదజోద్భిజ్జాలు రెండూ వేరు వేరుగా చెప్పబడ్డాయి గాన విరోధం లేదు.21.

అనిష్టాదికార్యధికరణం సమాప్తం

## 4. సాభావ్యాపత్త్యధికరణమ్. సూ. 22

### సూ. సాభావ్యాపత్తిరుపపత్తేః 3.1.22.

ఇష్టాదికారణశ్చన్ద్రమసమారుహ్య తస్మిన్యావత్సమ్పాతముషిత్వా తతః సానుశయా అవరోహన్తీత్యుక్తమ్. అథావరోహప్రకారః పరీక్ష్యతే. తత్రేయమవ రోహశ్రుతిర్భవతి-"అథైతమేవాధ్వానం పునర్నివర్తన్తే యథేతమాకాశమాకాశా ద్వాయుం వాయుర్భూత్వా ధూమో భవతి ధూమో భూత్వాఽభ్రం భవత్యభ్రం భూత్వా మేఘో భవతి మేఘో భూత్వా ప్రవర్షతి" (ఛా.ఉ.5.10.5) ఇతి. తత్ర సంశయః-కిమాకాశాదిస్వరూపమేవావరోహన్తః పతిసద్యన్తే కిం వాఽఽకాశాది సామ్యమితి. తత్ర ప్రాప్తం తావదాకాశాదిస్వరూపమేవ ప్రతిపద్యన్త ఇతి. కుతః? ఏవం హి శ్రుతిర్భవతి. ఇతరథా లక్షణా స్యాత్. శ్రుతిలక్షణావిశయే చ శ్రుతిర్న్యాయ్యా న లక్షణా. తథా చ వాయుర్భూత్వా ధూమో భవతీత్యాదీన్యక్షరాణి తత్తత్స్వరూపాపత్తావాఞ్జస్యేనావకల్పన్తే. తస్మాదాకాశాదిస్వరూపాపత్తిరితి.

బాలానందిని

సాభావ్యాపత్తిరితి:- "ఉపపత్తేః=ఉపపత్తివలన, సాభావ్యాపత్తిః= చంద్రమండలం నుండి దిగే జీవులు ఆకాశాదులతో సాదృశ్యం పొందడం జరుగుతుంది" అని సూత్రార్థం.

ఇష్టేతి :- ఇష్టాదులు చేసేవారు చంద్రమండలం ఎక్కి అక్కడ సంపాతం (కర్మ ఉన్నంత)వరకు ఉండి అక్కడినుండి అనుశయంతో (ఇంకా ఫలం ఇవ్వవలసి ఉన్న కర్మతో) దిగుతారు అని చెప్పబడింది. ఇప్పుడు దిగే పద్ధతి విచారించబడుచున్నది. అక్కడ అవరోహశ్రుతి (దిగడాన్ని గూర్చి చెప్పే శ్రుతి) ఈ విధంగా ఉంది- "అథ...ప్రవర్షతి." (తరవాత వాడు వెళ్లినట్లుగానే ఈ మార్గాన్నే అనుసరించి తిరిగి వస్తాడు. ముందు ఆకాశాన్నీ, ఆకాశం నుంచి వాయువును పొందువాడు. వాయువుగా అయి ధూమం అవుతాడు. ధూమం అయి అభ్రం (నీళ్లు ఉన్న మేఘం) గా అవుతాడు. అభ్రం అయి మేఘం (వర్షించే మేఘం)గా అవుతాడు. మేఘం అయి వర్షిస్తాడు. (వర్షంగా భూమిమీదకు

దిగి (వ్రీహియవాదిరూపు డవుతాడు అని భావం) అని ఈ వాక్యాని కర్థం.) ఇక్కడ దిగుతున్నవాళ్లు ఆకాశాదిస్వరూపాన్నే పొందుతారా లేక ఆకాశాదులతో సామ్యాన్ని (సమత్వాన్ని)పొందుతారా అని సంశయం. ఆకాశాదిస్వరూపాన్నే పొందుతారు అని ప్రాప్తించింది. ఎందువల్ల? శ్రుతియా (విన్న పదానికి ముఖ్యార్థమే గ్రహించాలా)లక్షణయా అని సందేహం కలిగిన నపుడు శ్రుతినే ఆశ్రయించాలి; లక్షణ న్యాయ్యమైనది కాదు. అలా చెపితేనే వాయువుగా అయి ధూమం అవుతాడు ఇత్యాద్యక్షరాలు ఆ యా స్వరూపాలను పొందుతాడు అని చెప్పడంలో సరిగా ఒప్పుతాయి. అందువల్ల ఆకాశాదిస్వరూపాన్ని పొందడమే అని చెప్పాలి.

వి. వెనుకటి అధికరణంలో రెండు మార్గాలు చెప్పి మూడవది మార్గం అని లక్షణచేత చెప్పడం యుక్తమే. పాలు పెరుగుగా అయ్యాయి అన్నట్లు వాయువుగా అయ్యాడు, ధూమంగా అయ్యాడు అని చెప్పి నపుడు వాటి స్వరూపాన్ని పొందాడు అని చెప్పడమే యుక్తం కాని లక్షణను స్వీకరించి సాదృశ్యాన్ని పొందుతాడని చెప్పడం యుక్తం కాదు అని ప్రత్యుదాహరణసంగతిచేత పూర్వపక్షం.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః - ఆకాశాదిసామ్యం ప్రతిపద్యన్త ఇతి. చన్ద్రమణ్డలే యదమ్మయం శరీరముపభోగార్థమారబ్ధం తదుపభోగక్షయే సతి ప్రవిలీయమానం సూక్ష్మమాకాశసమం భవతి. తతో వాయోర్వశమేతి. తతో ధూమాదిభిః సంపృచ్యతే ఇతి. తదేతదుచ్యతే-"యథేతమాకాశమాకాశాద్వాయుమ్" (ఛా.ఉ.5-10-5)ఇత్యేవమాదినా. కుతః? ఏతదుపపత్తేః. ఏవం హ్యేతదుపపద్యతే. న హ్యన్యస్యాన్యభావో ముఖ్య ఉపపద్యతే. ఆకాశస్వరూపప్రతిపత్తౌ చ వాయ్వాదిక్రమేణావరోహో నోపపద్యతే. విభుత్వాచ్చాకాశేన నిత్యసంబన్ధత్వాన్న తత్సాదృశ్యాపత్తేరన్య స్తత్సమ్బన్ధో ఘటతే. శ్రుత్యసంభవే చ లక్షణాశ్రయణం న్యాయ్యమేవ. అత ఆకాశాదితుల్యతాపత్తిరేవాకాశాదిభావ ఇత్యుపచర్యతే. 22.

బాలానందిని

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాము-ఆకాశాదులతో సామ్యాన్ని పొందుతారు. చంద్రమండలంలో ఉపభోగం కోసం ఆరబ్ధమైన జలమయమైన శరీరం ఉపభోగం క్షీణించగా కరిగిపోయి సూక్ష్మంగా ఆకాశంతో సమం అయిపోతుంది. తరవాత వాయువుకు వశ మవుతుంది. తరవాత ధూమాదులతో కలుస్తుంది. ఈ విషయమే "యథేతమాకాశమాకాశాద్వాయుమ్" ఇత్యాదివాక్యంచేత చెప్పబడుచున్నది. ఎందువల్ల? ఇదే కుదురుతుంది కాబట్టి. ఇది ఇలా మాత్రమే కుదురుతుంది. ఒక వస్తువు ముఖ్యంగా మరొకటిగా అయిపోవడం ఉపపన్నం కాదు కదా? అది ఆకాశస్వరూపంగా మారిపోతే తరవాత వాయ్వాదిక్రమంలో దిగడం కుదరదు. ఆకాశం విభువు గాన దానితో ఎల్లప్పుడూ సంబంధించియే ఉంటుంది, అందుచేత దానితో సమంగా అవడం తప్ప దానితో మరొక సంబంధం కుదరదు. శ్రుతి(ముఖ్యార్థం)కుదరనప్పుడు లక్షణ ఆశ్రయించడం న్యాయ్యమే. అందుచేత ఆకాశాదులతో తుల్యత్వాన్ని పొందడమే ఆకాశాదిభావంగా ఉపచరించబడుచున్నది. 22.

సాభావ్యాపత్త్యధికరణం సమాప్తం

## 5. నాతిచిరాధికరణమ్. సూ.23

## సూ. నాతిచిరేణ విశేషాత్. 3.1.23.

తత్రాకాశాదిప్రతిపత్త్యా ప్రాగ్వ్రీహ్యాదిప్రతిపత్తేర్విశయః-కిం దీర్ఘం దీర్ఘం కాలం పూర్వపూర్వసాదృశ్యేనావస్థాయోత్తరోత్తరసాదృశ్యం గచ్ఛన్తి ఉతాల్పా ల్పమితి. తత్రానియమో నియమకారిణః శాస్త్రస్యాభావాదితి. ఏవం ప్రాప్త ఇదమాహ-నాతిచిరేణేతి. అల్పమల్పం కాలమాకాశాదిభావేనావస్థాయ వర్షధారాభిః సహేమాం భువమాపతన్తి. కుత ఏతత్? విశేషదర్శనాత్. తథాహి వ్రీహ్యాదిభావాపత్తేరనన్తరం విశినష్టి- "అతో వై ఖలు దుర్నిష్ప్రపతరమ్" (ఛా.ఉ.5.10.6)ఇతి. తకార ఏకశ్ఛాన్దస్యాం ప్రక్రియాయాం లుప్తో మన్తవ్యః

దుర్నిష్ప్రతతరం, దుర్నిష్క్రమతరమ్. దుఃఖతరమస్మాద్వ్రీహ్యాదిభావాన్నిఃసరణం భవతీత్యర్థః. తత్ర దుఃఖం నిష్పతనం ప్రదర్శయన్ పూర్వేషు సుఖం నిష్ప్రపతనం దర్శయతి. సుఖదుఃఖతావిశేషశ్చాయం నిష్ప్రపతనస్య కాలాల్పత్వదీర్ఘత్వనిమిత్తః. తస్మిన్నవధౌ శరీరానిష్పత్తేరుపభోగాసంభావాత్. తస్మాద్వ్రీహ్యాదిభావాపత్తేః ప్రాగల్పేనైవ కాలేనావరోహః స్యాదితి. 23.

బాలానందిని

నాతిచిరేణేతి:-"నాతిచిరేణ=శీఘ్రంగానే మేఘాదిసాదృశ్యాన్ని పొందుతాడు. విశేషాత్=తరవాత విశేషం చెప్పడంవల్ల" అని సూత్రార్థం.

తత్రేతి:- ఆకాశాదిసామ్యాన్ని పొందిన తరవాత వ్రీహ్యాదిసామ్యాన్ని పొందడానికి పూర్వం, జీవులు పూర్వపూర్వములైన ఆకాశాదుల సాదృశ్యాన్ని దీర్ఘదీర్ఘమైన కాలం పొంది, తరవాత ఉత్తరోత్తరవస్తువులతో సాదృశ్యం పొందుతారా లేక అల్పాల్పకాలంలోనే పొందుతారా అని సంశయం కలుగుతుంది. నియమం చేసే శాస్త్రం ఏదీ లేకపోవడం చేత(దీర్ఘకాల మనీ అల్పకాలమనీ) నియమం లేదు అని చెప్పాలి. ఇలా ప్రాప్తించగా "నాతిచిరేణ" అని చెప్పుచున్నాడు.(జీవులు)కొంచెం కొంచెం కాలమే ఆకాశాదిభావంతో ఉండి వర్షధారలతో కూడ ఈ భూమిమీద పడతారు. ఇది ఎందువలన? విశేష దర్శనం వల్ల. అదెట్లనగా-వ్రీహ్యాదిభావం పొందిన తరవాత "అతో వై ఖలు దుర్నిష్ప్రపతరమ్" అని విశేషించి చెప్పుచున్నాడు. వైదికప్రక్రియానుసారం ("దుర్నిష్ప్రపతతరమ్" లోని) ఒక తకారం లోపించి నట్లు తెలుసుకోవాలి. దుర్నిష్ప్రపతరం అనగా దుర్నిష్క్రమతరం అని అర్థం. అనగా ఈ వ్రీహ్యాదిభావంనుండి బైటకు రావడం చాల కష్టం అని అర్థం. ఈ విధంగా ఇక్కడ నిష్ప్రపతనం (బైటకు రావడం) దుఃఖము అని చెపుతూ వెనుకటివాటితో సుఖ మైనది అని చూపుతున్నాడు. ఈ నిష్ప్రతనం సుఖమైనది దుఃఖమైనది అనే విశేషం కాలం అల్పం అవడం, దీర్ఘం అవడం అనే నిమిత్తంవల్ల ఏర్పడినది. (నిష్ప్రపతనానికి అల్పకాలం పట్టితే సుఖం అని దీర్ఘకాలం పట్టితే దుఃఖం అని అర్థం). (అంతేనే కాని సుఖము దుఃఖము అనే అర్థాలలో గ్రహించకూడదు) ఎందువల్లననగా ఆ అవధిలో

శరీరం నిష్పన్నం కాలేదుగాన సుఖభోగం గాని దుఃఖభోగం గాని ఉండదు. అందువల్ల వ్రీహ్యాదిభావం పొందడానికి ముందు అవరోహం అల్పకాలంచేతనే జరుగుతుంది. 23.

నాతిచిరాధికరణం సమాప్తం.

## 6. అన్యాధిష్ఠితాధికరణమ్. సూ. 24.27

## సూ. అన్యాధిష్ఠితేషు పూర్వవదభిలాపాత్. 3.4.24.

తస్మిన్నేవావరోహే ప్రవర్షణానన్తరం పఠ్యతే-"త ఇహ వ్రీహియవా ఓషధివనస్పతయస్తిలమాషా ఇతి జాయన్తే"(ఛా.ఉ.5.10.6)ఇతి. తత్ర సంశయః-కిమస్మిన్నవధౌ స్థావరజాత్యాపన్నాః స్థావరసుఖదుఃఖభాజోఽనుశయినో భవన్త్యాహోస్విత్ క్షేత్రజ్ఞాన్తరాధిష్ఠితేషు స్థావరశరీరేషు సంశ్లేషమాత్రం గచ్ఛన్తీతి. కిం తావత్ప్రాప్తమ్? స్థావరజాత్యాపన్నాస్తత్సుఖదుఃఖభాజోఽనుశయినో భవన్తీతి. కుత ఏతత్? జనేర్ముఖ్యార్థత్వోపపత్తేః. స్థావరభావస్య చ శ్రుతిస్మృత్యోరుపభోగస్థానత్వప్రసిద్ధేః. పశుహింసాదియోగాచ్చేష్టాదేః కర్మజాతస్య అనిష్టఫలత్వోపపత్తేః. తస్మాన్ముఖ్యమేవేదమనుశయినాం వ్రీహ్యాదిజన్మ, శ్వాది జన్మవత్. యథా శ్వయోనిం సూకరయోనిం వా చణ్డాలయోనిం వేతి ముఖ్యమేవానుశయినాం శ్వాదిజన్మ తత్సుఖదుఃఖాన్వితం భవతి, ఏవం వ్రీహ్యాదిజన్మాపీతి.

### బాలానందిని

అన్యేతి:- "అన్యాధిష్ఠితేషు=ఇతరజీవులచేత అధిష్ఠించబడిన వ్రీహ్యాదులలో సంబంధం మాత్రమే తిరిగి వచ్చే జీవులకు ఉంటుంది; పూర్వవత్=వెనుక చెప్పిన ఆకాశాదులందు వలెనె. అభిలాపాత్=పూర్వమునందు వలె ఇక్కడ కూడ సంబంధమాత్రాన్ని చెప్పడం వల్ల" అని సూత్రపదాల అర్థం.

తస్మిన్నితి :- దిగి రావడంలోనే వర్షం తరవాత-"త ఇహ... జాయన్తే" (వాళ్లు వ్రీహులుగాను, యవలుగాను, ఓషధులుగాను, వృక్షాలుగాను తిలలు గానూ, మాషాలుగాను అవుతారు)అని పఠింపబడుతున్నది. అక్కడ సంశయం-ఈ అవధిలో

స్థావరజాతిని పొందిన అనుశయులు (కర్మతోకూడ దిగినవాళ్లు) ఆ స్థావరాల సుఖదుఃఖాలను పొందుతారా లేక ఇతరజీవులచేత అధిష్ఠితాలైన స్థావరశరీరాలతో సంబంధం మాత్రమే పొందుతారా అని. ఏమి ప్రాప్తించింది? అనుశయులు స్థావర జన్మలు పొంది వాటి సుఖదుఃఖాలను అనుభవిస్తారు అని ప్రాప్తించింది. ఇది ఎందువల్ల? అలా చెప్పినప్పుడు జనీధాతువుయొక్క ముఖ్యార్థం చెప్పినట్లు అవుతుంది. స్థావరత్వం సుఖదుఃఖాల భోగానికి స్థానం అని శ్రుతిస్మృతులలో ప్రసిద్ధి కూడ ఉంది. మరొక విషయ మేమనగా ఇష్టాది కర్మలలో పశుహింసాదు లుండడంవల్ల అవి అనిష్ట ఫలం ఇవ్వడం ఉపపన్నమే కూడ. అందుచేత అనుశయులకు వ్రీహ్యాదిజన్మ శునకాదిజన్మ వలె ముఖ్యమే. "శ్వయోనిం. సూకరయోనిం వా, చణ్డాలయోనిం వా" అని చెప్పినప్పుడు అనుశయులకు శునకాదిజన్మ ఏ విధంగా వాటి సుఖదుఃఖాలతో కూడి ఉంటుందో అట్లే వ్రీహ్యాదిజన్మ కూడ.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః-అన్యైర్జీవైరధిష్ఠితేషు వ్రీహ్యాదిషు సంసర్గ మాత్రమనుశయినః ప్రతిపద్యన్తే న తత్సుఖభాజో భవన్తి. పూర్వవత్. యథా వాయుధూమాదిభావోఽనుశయవతాం తత్సంశ్లేషమాత్రమ్. ఏవం వ్రీహ్యాది భావోఽపి జాతిస్థావరైః సంశ్లేషమాత్రమ్. కుత ఏతత్? తద్వదేవేహాప్యభిలాపాత్. కోఽభిలాపస్య తద్వద్భావః.? కర్మవ్యాపారమన్తరేణ సంకీర్తనమ్. యథాకాశాదిషు ప్రవర్షణాన్తేషు న కంచిత్కర్మవ్యాపారం పరామృశత్యేవంవ్రీహ్యాదిజన్మన్యపి. తస్మాన్నాస్త్యత్ర సుఖదుఃఖభాక్త్వమనుశయినామ్. యత్ర తు సుఖదుఃఖ భాక్త్వమభిప్రైతి పరామృశతి తత్ర కర్మవ్యాపారం రమణీయచరణాః కపూయచరణా ఇతి చ. అపి చ ముఖ్యేఽనుశయినాం వ్రీహ్యాదిజన్మని వ్రీహ్యాదిషు లూయమానేషు కణ్డ్యమానేషు భజ్యమానేషు పచ్యమానేషు భక్ష్యమాణేషు చ తదభిమానినః అనుశయినః ప్రవసేయుః. యో హి జీవో యచ్ఛరీరమభిమన్యతే స తస్మిన్ పీడ్యమానే ప్రవసతీతి ప్రసిద్ధమ్. తత్ర వ్రీహ్యాదిభావాద్రేతః సిగ్భావో ఽనుశయినాంనాభిలప్యేత. అతః సంసర్గమాత్రమనుశయినామన్యాధిష్ఠితేషు

వ్రీహ్యాదిషు భవతి. ఏతేన జనేర్ముఖ్యార్థత్వం ప్రతిబ్రూయాత్, ఉపభోగస్థానత్వం చ స్థావరభావస్య. న చ వయముపభోగస్థానత్వం స్థావరభావస్యావజానీమహే. భవత్వన్యేషాం జన్తూనామపుణ్యసామర్థ్యేన స్థావరభావముపగతానామేతదుపభోగస్థానమ్. చన్ద్రమసస్త్వవరోహన్తోఽనుశయినః న స్థావరభావముపభుఞ్జత ఇత్యాచక్ష్మహే. 24.

బాలానందిని

ఏవమితి :-ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాము. అనుశయులు ఇతరజీవులచేత అధిష్ఠించబడిన వ్రీహ్యాదులయందు కేవలం సంబంధం మాత్రమే పొందుతారు గాని ఆ జీవుల సుఖదుఃఖాలను పొందరు, వెనుకటి వలెనే. అనుశయులకు వాయుధూమాది భావం అనగా వాటితో సంశ్లేషం మాత్రమే కాని వాటి సుఖదుఃఖోపభోగం ఎట్లు కాదో అట్లే వ్రీహ్యాదిభావం కూడ స్థావరజన్మలో ఉన్న వాటితో కలిసిఉండడం మాత్రమే. ఇది ఎందువల్ల? ఇక్కడ కూడ అక్కడవలనే అభిలాపంవల్ల? అభిలాపం అలాగే ఉండడం. అనగా ఏమిటి? కర్మయొక్క వ్యాపారం లేకుండా చెప్పడం. ఆకాశం మొదలు వర్షణం వరకు ఉన్నవాటిలో ఏ విధంగా కర్మవ్యాపారాన్ని దేనినీ పరామర్శించలేదో వ్రీహ్యాదిజన్మలలో కూడ అట్లే. అందుచేత అనుశయులు సుఖదుఃఖాలను పొందడం ఉండదు. ఎక్కడైతే సుఖదుఃఖాలు అనుభవిస్తారు అని చెప్పదలచుకొన్నదో అక్కడ సత్కర్మ కలవారు, పాపకర్మ కలవారు (రమణీయచరణాః, కపూయచరణాః) అని కర్మయొక్క వ్యాపారాన్ని పరామర్శిస్తున్నది. మరొక విషయ మేమనగా-అనుశయులకు వ్రీహ్యాదిజన్మ ముఖ్యమైనదే అన్నట్లయితే వ్రీహ్యాదులను ఖండించే టప్పుడు, మాసూలుచేసేటప్పుడు, విరగగొట్టినప్పుడు, వండినప్పుడు, తిన్నప్పుడూ వాటి అభిమానులైన (వాటిలోని జీవులైన) అనుశయులు వాటిని విడిచి దూరంగా వెళ్లిపోతారు. ఎవడు ఏ శరీరాన్ని అభిమానిస్తాడో అతడు ఆ శరీరం పీడించబడుతున్నప్పుడు దానినివి డిచివెళ్లిపోతా డని ప్రసిద్ధమే కదా? అప్పుడు అనుశయులకు వ్రీహ్యాదిభావంనుండి రేతఃసిగ్భావం చెప్పబడి ఉండేది కాదు. (వ్రీహ్యాదులను విడచి వెళ్లిపోయిన తరవాత వాళ్లు రేతస్సులో ఉండరు కదా?). అందువల్ల అనుశయులు ఇతరజీవులచేత అధిష్ఠింపబడిన వ్రీహ్యాదులతో కేవలం

సంబంధించి ఉంటారు. అందుచేత ఇక్కడ నున్న జనీధాతువునకు ముఖ్యార్థత్వాన్ని, స్థావరత్వం ఉపభోగస్థానం అనే విషయాన్ని,నిరాకరిచాలి. అయితే స్థావరభావం(స్థావరత్వం) ఉపభోగానికి స్థానం కాదని మేం అనడం లేదు. పాపంయొక్క సామర్థ్యంచేత స్థావరజన్మ పొందిన ఇతరజంతువులకు ఇది ఉపభోగస్థానం అగుగాక. చంద్రమండలంనుండి దిగుతూన్న అనుశయులు మాత్రం స్థావరభావాన్ని అనుభవించరు అని మాత్రమే మేం చెపుతున్నాం. 24.

## సూ. అశుద్ధమితి చేన్న శబ్దాత్. 3.1.25

యత్పునరుక్తమ్-పశుహింసాదియోగాదశుద్ధమాధ్వరికం కర్మ, తస్యానిష్టమపి ఫలమవకల్పత ఇత్యతో ముఖ్యమేవానుశయినాం వ్రీహ్యాది జన్మాస్తు. తత్ర గౌణీ కల్పనార్థికా ఇతి. తత్పరిహ్రియతే. న. శాస్త్రహేతుత్వాద్ధ ర్మాధర్మవిజ్ఞానస్య. అయం ధర్మోఽయమధర్మ ఇతి శాస్త్రమేవ విజ్ఞానే కారణమ్, అతీన్ద్రియత్వాత్తయోః. అనియతదేశకాలనిమిత్తత్వాచ్చ. యస్మిన్ దేశే కాలే నిమిత్తే చ యో ధర్మోఽనుష్ఠీయతే స ఏవ దేశకాలనిమిత్తాన్తరేష్వధర్మో భవతి. తేన శాస్త్రాదృతే ధర్మాధర్మవిషయం విజ్ఞానం న కస్య చిదస్తి. శాస్త్రాచ్చ హింసానుగ్రహాద్యాత్మకో జ్యోతిష్టోమో ధర్మ ఇద్యవధారితమ్; స కథమశుద్ధ ఇతి శక్యతే వక్తుమ్? నను "న హింస్యాత్సర్వా భూతాని" ఇతి శాస్త్రమేవ భూతవిషయాం హింసామధర్మ ఇత్యవగమయతి? బాఢమ్; ఉత్సర్గస్తుసః. అయఞ్చాపవాదః- "అగ్నీషోమీయం పశుమాలభేత" ఇతి. ఉత్సర్గాపవాదయోశ్చ వ్యవస్థిత విషయత్వమ్. తస్మాద్విశుద్ధం వైదికం కర్మ, శిష్టైరనుష్ఠీయమానత్వాదనిన్ద్యమానత్వాచ్చ. తేన న తస్య ప్రతిరూపం ఫలం జాతిస్థావరత్వమ్. న చ శ్వాదిజన్మవత్ వ్రీహ్యాది జన్మ భవితుమర్హతి. తద్ధి కపూయచరణానధికృత్యోచ్యతే, నైవమిహ వైశేషికః కశ్చిదధికారోఽస్తి. అతశ్చన్ద్రమణ్డలస్ఖలితానామనుశయినాం వ్రీహ్యాది సంశ్లేషమాత్రం తద్భావ ఇత్యుపచర్యతే. 25.

బాలానందిని

**అశుద్ధమితి:-** "అశుద్ధమితి చేత్=యాగాదికర్మ అశుద్ధ మైనది అన్నట్లయితే, న=కాదు. శబ్దాత్=వేదశబ్దంచేత చెప్పబడడంవల్ల" అని సూత్రార్థం.

యత్తునరితి:- పశుహింసాదు లుండడంవల్ల యజ్ఞకర్మ కూడ అశుద్ధమైనది; అందుచేత దానికి అనిష్టమైన ఫలం కూడ ఉండడానికి అవకాశం ఉంది. అందువల్ల అనుశయులకు ముఖ్యమైన వ్రీహ్యాదిజన్మయే ఉండవచ్చును, గౌణార్థకల్పన అనావశ్యకం అని ఏది చెప్పబడిందో అది పరిహరించబడుచున్నది. అది యుక్తం కాదు. ధర్మాధర్మ విజ్ఞానం శాస్త్రహేతుకం కదా? ఇది ధర్మం ఇది అధర్మం అని నిర్ణయించడానికి ప్రమాణం శాస్త్రమే కదా? ఎందువల్ల ననగా అవి ఇంద్రియాలకు గోచరించనివి. అంతే కాదు అవి నియతం కాని దేశకాలనిమిత్తాలు కలవి. ఏ దేశంలో ఏ కాలంలో, ఏ నిమిత్తాన్ని పురస్కరించుకొని ఏ ధర్మం అనుష్ఠించబడుతుందో (ఏది ధర్మం అని అనుష్ఠించబడుతుందో) అదే మరొక దేశంలో మరొక కాలంలో, మరొక నిమిత్తంలో అధర్మం అవుతుంది. అందుచేత శాస్త్రం లేకుండా ధర్మాధర్మాలను గూర్చిన విజ్ఞానం ఎవరికీ లేదు. హింసానుగ్రహాత్మకమైన, అనగా దేనిలో హింస అంగీకరించబడిందో అట్టి, జ్యోతిష్టోమం ధర్మం అని శాస్త్రంచేత నిర్ధారిత మైనప్పుడు అది అశుద్ధ మని చెప్పడం ఎలా శక్యం అవుతుంది? (ఆశంక) "న హింస్యాత్సర్వా భూతాని" ( ఏ ప్రాణినీ హింసించకూడదు) అనే శాస్త్రమే భూతహింస అధర్మ మని తెలుపుచున్నది కదా? (సమాధానం) నిజమే; తెలుపుతున్నది. అది సామాన్యశాస్త్రం మాత్రమే. "అగ్నీషోమీయం పశుమాలభేత" (అగ్నీషోమయాగానికి సంబంధించిన పశువును ఆలంభనం చెయ్యాలి; ఆలంభనం అనగా చంపడం)అనేది అపవాదశాస్త్రం. సామాన్యశాస్త్రవిషయం వేరు అపవాదశాస్త్రానికి విషయం వేరు. అనగా అపవాదశాస్త్రం ప్రవర్తించే చోట సామాన్య శాస్త్రం ప్రవర్తించదు. అందుచేత శిష్టులచేత అనుష్ఠింపబడడంవల్ల నిందింపబడకపోవడంవల్లా వైదికకర్మ శుద్ధమైనదే. అందుచేత జాతిస్థావరత్వం (స్థావరజన్మ)దానికి తగిన ఫలం కాదు. అట్లే వ్రీహ్యాదిజన్మ శునకాదిజన్మ వంటిది కూడ కాజాలదు. శునకాదిజన్మ పాపకర్మ కలవాళ్లను

గూర్చి చెప్పినది. ఇక్కడ (వ్రీహ్యాదిజన్మ విషయంలో)వైశేషికమైన (ప్రత్యేకమైన)అధికారం (ప్రస్తావన) ఏదీ లేదు. అందువల్ల చంద్రమండలంనుంచి వచ్చిన అనుశయులు వ్రీహ్యాదులతో కలవడం మాత్రమే ప్రవీహ్యాదిభావం అని ఉపచారం చేత చెప్పబడుచున్నది.25.

సూ. రేతఃసిగ్యోగోఽథ 3.1.26.

ఇతశ్చ వ్రీహ్యాదిసంశ్లేషమాత్రం తద్భావః యత్కారణం వ్రీహ్యాదిభావస్యానన్తరమనుశయినాం రేతఃసిగ్భావః అమ్నాయతే-"యో యో హ్యన్నమత్తి యో రేతః సిఞ్చతి తద్భూయ ఏవ భవతి" (ఛా.ఉ.5.10.6)ఇతి. న చాత్ర ముఖ్యో రేతఃసిగ్భావః సంభవతి. చిరజాతో హి ప్రాప్తయౌవనో రేతఃసిగ్భవతి. కథమివానుపచరితతద్భావమద్యమానాన్నానుగతోఽనుశయీ ప్రతిపద్యతే? తత్ర తావదవశ్యంరేతఃసిగ్యోగఏవరేతఃసిగ్భావోఽభ్యుపగన్తవ్యః.తద్వద్వ్రీహ్యాదిభావోఽపి వ్రీహ్యాదియోగ ఏవేత్యవిరోధః. 26.

బాలానందిని

**రేత ఇతి** :-"అథ=వ్రీహ్యాదిభావం తరవాత, రేతఃసిగ్యోగః=రేతస్సును సేకంచేసేవానితో సంబంధం చెప్పబడింది" అని సూత్రార్థం.

**ఇతశ్చేతి**:- ఈ కారణంవల్ల కూడ వ్రీహ్యాదిభావం అనగా వ్రీహ్యాదులతో కలయికమాత్రమే; ఎందువల్ల ననగా-వ్రీహ్యాదిభావం చెప్పిన తరువాత అనుశయుల రేతఃసిగ్భావం (రేతఃసేకం చేసేవాడుగా అవడం) "యో యో.........భవతి" (ఎవ డెవడు అన్నం తింటాడో, ఎవ డైతే రేతఃసేకం చేస్తాడో అతడు రేతఃసిక్కుగానే అవుతాడు) అని చెప్పబడుచున్నది. అయితే ఇక్కడ ముఖ్యమైన రేతఃసిగ్భావం (రేతఃసేచకు డవడం) కుదరదు. చాలా కాలం క్రితం పుట్టి యౌవనం పొందినవాడే రేతఃసిక్ అవుతాడు కదా. తినబడుచున్న అన్నాన్ని అనుసరించిన అనుశయి ఉపచరితం కాని, అనగా ముఖ్యమైన, రేతఃసిగ్భావాన్ని ఎలా పొందగలడు? అందుచేత అక్కడ రేతఃసిగ్భావం అనగా రేతఃసిగ్యోగమే అని అంగీకరించాలి. అదే విధంగా వ్రీహ్యాదిభావం అంటే కూడ వ్రీహ్యాదులతో సంబంధమే అని గ్రహించాలి గాన విరోధం ఏదీ లేదు.

వి. పై శ్రుతివాక్యంలో వ్రీహ్యాద్యన్నం తిని ఎవడైతే రేతఃసేకం చేస్తాడో వాడుగా అనుశయి అవుతాడు అని చెప్పబడింది. అనుశయి రేతఃసేకం చేసేవా డవడం అసంభవం. రేతఃసేకం చేయాలంటే వాడు జన్మించి యౌవనం పొందాలి. అందుచేత ఇక్కడ హారేతఃసిగ్భావం ఔపచారికం. అంతవరకూ వ్రీహ్యాదులతో సంబంధించిన అనుశయి రేతఃసేకం చేసేవానితో సంబధిస్తాడు అని అర్థం చెప్పాలి. ఇక్కడ ఏ విధంగా రేతఃసిగ్భావం ఔపచారికం అని చెప్పి రేతఃసేచకునితో సంబంధం అని అర్థం చెప్పామో అట్లే వ్రీహ్యాదిభావం అన్నప్పుడు వ్రీహ్యాదిసంబంధం అని గ్రహించాలి అని భావం. 26.

## సూ. యోనేః శరీరమ్. 3.1.27

అథ రేతఃసిగ్భావస్యానన్తరం యోనౌ నిషిక్తే రేతసి యోనేరధి శరీరమనుశయినామనుశయఫలోపభోగాయ జాయత ఇత్యాహ శాస్త్రమ్ "తద్య ఇహ రమణీచరణాః" (ఛా.ఉ.5.10.7) ఇత్యాది. తస్మాదప్యవగమ్యతే నావరోహే వ్రీహ్యాదిభావావసరే తచ్ఛరీరమేవ సుఖదుఃఖాన్వితం భవతీతి. తస్మాద్వ్రీహ్యాదిసంశ్లేషమాత్రమనుశయినాం తజ్జన్మేతి సిద్ధమ్. 27.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీగోవిన్దభగవత్పూజ్యపాదశిష్య శ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌ శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యేతృతీయాధ్యాయస్య ప్రథమః పాదః.

### బాలానందిని

యోనేరితి:- "యోనేః=యోనినుండి, శరీరమ్=శరీరం పుట్టుచున్నది" అని సూత్రార్థం.

అథేతి:- పిమ్మట, రేతఃసిగ్భావం తరవాత, రేతస్సు యోనియందు చల్లబడగా, అనుశయుల ఫలోపభోగంకొరకు యోనిలో శరీరం పుడుతుంది అని "తద్య...చరణాః" ఇత్యాదిశాస్త్రం చెప్పుచున్నది. దీనివల్ల కూడ క్రిందికి దిగునప్పుడు వ్రీహ్యాదిశరీరభావం పొందినప్పుడు ఆ శరీరమే (వ్రీహ్యాదిశరీరమే)సుఖదుఃఖాలను పొందదు అని తెలుస్తున్నది.

అందువల్ల అనుశయులు వ్రీహ్యాదులతో కలవడం మాత్రమే వ్రీహ్యాదిజన్మ పొందడం అని నిశ్చితం.

అన్యాధిష్ఠితాధికరణం సమాప్తం

'బాలానందిని' అను శ్రీమచ్ఛారీరకభాష్యాంధ్రవ్యాఖ్యానంలో తృతీయాధ్యాయంలో ప్రథమపాదం సమాప్తం.

# తృతీయాధ్యాయే ద్వితీయః పాదః

## అత్ర పాదే తత్త్వంపదార్థపరిశోధనవిచారః

### 1. సంధ్యాధికరణమ్. సూ.1-6

### సూ. సంధ్యే సృష్టిరాహ హి. 3.2.1.

అతిక్రాన్తే పాదే పఞ్చాగ్నివిద్యాముదాహృత్య జీవస్య సంసారగతిప్రభేదః ప్రపఞ్చితః. ఇదానీం తు తస్యైవ అవస్థాభేదః ప్రపఞ్చ్యతే. ఇదమామనన్తి-"స యత్ర ప్రస్వపితి" (బృ.ఉ.4.3.9) ఇత్యుపక్రమ్య "న తత్ర రథా న రథయోగా న పన్థానో భవన్త్యథ రథాన్ రథయోగాన్ పథః సృజతే" (బృ.ఉ.4.3.10) ఇత్యాది. తత్ర సంశయః-కిం ప్రబోధ ఇవ స్వప్నేఽపి పారమార్థికా సృష్టిరాహోస్విన్మాయామయీతి. తత్ర తావత్ప్రతిపాద్యతే సంధ్యే తథ్యరూపా సృష్టిరితి. సంధ్యమితి స్వప్నస్థానమాచష్టే, వేదే ప్రయోగదర్శనాత్-"సంధ్యం తృతీయం స్వప్నస్థానమ్ (బృ.ఉ.4.3.9) ఇతి. ద్వయోర్లోకస్థానయోః ప్రబోధప్రసాదస్థానయోర్వా సంధౌ భవతీతి సంధ్యమ్. తస్మిన్ సంధ్యే స్థానే తథ్యరూపైవ సృష్టిర్భవితుమర్హతి. కుతః? యతః ప్రమాణభూతా శ్రుతిరేవమాహ "అథ రథాన్ రథయోగాన్ పథః సృజతే" (బృ.ఉ.4.3.10) ఇత్యాది. "స హి కర్తా" ఇతి చోపసంహారా దేవమేవావగమ్యతే. 1.

## బాలానందిని

సంధ్య ఇతి:- "సంధ్యే=స్వప్నసమయమునందు, సృష్టిః=సృష్టి సత్యమైనది. ఆహ హి=శ్రుతి ఇట్లు చెప్పుచున్నది కదా?" అని సూత్రార్థం (ఇది పూర్వపక్షసూత్రం).

అతిక్రాన్తే ఇతి:- గడచిన పాదంలో పంచాగ్నివిద్యను ఉదాహరించి జీవుని సంసారగమనాగమన ప్రభేదం సవిస్తరంగా చెప్పబడింది. ఇప్పుడైతే ఆ జీవునియొక్కయే అవస్థాభేధం చెప్పబడుచున్నది. " స యత్ర ప్రస్వపితి" (అతడు ఎప్పుడు నిద్రిస్తాడో)అని ఉపక్రమించి "న తత్ర...సృజతే" (అక్కడ రథాలు కాని, రథాలకు కట్టే అశ్వాదులు కాని మార్గాలు కాని లేవు. అయితే అక్కడ రథాలను అశ్వాదులను, మార్గాలను సృష్టిస్తున్నాడు) ఇత్యాదికం పఠిస్తున్నారు. అక్కడ-జాగ్రదవస్థలో వలె స్వప్నంలో కూడ పారమార్థికమైన సృష్టియా లేక మాయామయమైన సృష్టియా అని సంశయం. ఆ సందర్భంలో సంధ్యయందు సృష్టి సత్యమైనదే అని ప్రతిపాదించబడుచున్నది. "సంధ్యం తృతీయం స్వప్నస్థానమ్" అని వేదంలో ప్రయోగం ఉండడంవల్ల సంధ్యమ్ అనే పదం స్వప్న మనే అర్థాన్ని బోధిస్తుంది. రెండు లోకస్థానములయొక్క లేదా ప్రతిబోధసుషుప్త్యవస్థల యొక్క మధ్య ఉంటుంది కాబట్టి సంధ్యం అని చెప్పబడుతుంది.

ఏ. మరణించడానికి సిద్ధంగా ఉన్న వాని సర్వేంద్రియాలు ఉపసంహరించబడడం వల్ల లోకానికి సంబంధించిన జ్ఞానం ఉండదు. కేవలం వాసనామాత్రంచేత ఈ లోకం స్మృతి ఉంటుంది. కర్మబలంచేత హృదయంలో పరలోకస్ఫూర్తి రూపమైన స్వప్నం కనబడుతుంది. ఈ విధంగా ఇది రెండు లోకాల సంధిలో ఉంటుంది కాబట్టి సంధ్యమని ఒక అర్థం. జాగ్రత్సుషుప్తుల మధ్య ఉండేది కాబట్టి సంధ్యమని మరొక అర్థం. అయితే మొదటి రకమైన స్వప్నం ఎప్పుడో ఒక్కమాటు చూచేది గాన దానిని కాక రెండవదానిని గ్రహించడం యుక్త మనే ఉద్దేశ్యంతో ప్రసిద్ధమైన రెండవది చెప్పబడింది.

తస్మిన్నితి:- ఆ సంధ్యస్థానంలో సృష్టి యథార్థమైనదిగా ఉండడమే యుక్తం. ఎందువల్ల? ఎందువల్లననగా-ప్రమాణమైన శ్రుతి "అథ...సృజతే" అని చెప్పుచున్నది. "స హి కర్తా" (అతడే కర్త)అని ఉపసంహారంవల్ల ఇట్లే అని తెలుస్తూన్నది. 1.

సూ. నిర్మాతారం చైకే పుత్రాదయశ్చ. 3.2.2.

అపి చైకే శాఖినః అస్మిన్నేవ సంధ్యే స్థానే కామానాం నిర్మాతారమాత్మా నమామనన్తి-"య ఏష సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః" (క.ఉ.5.8) ఇత్యాది. పుత్రాదయశ్చ తత్ర కామా అభిప్రేయన్తే కామ్యన్త ఇతి. నను కామశబ్దేనేచ్ఛావిశేషా ఏవోచ్యేరన్? న. "శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ" (క.ఉ.1..23) ఇతి ప్రకృత్యాన్తే "కామానాం త్వా కామభాజం కరోమి" (క.ఉ.1.24)ఇతి ప్రకృతేషు తత్ర పుత్రాదిషు కామశబ్దస్య ప్రయుక్తత్వాత్. ప్రాజ్ఞం చైనం నిర్మాతారం ప్రకరణవాక్యశేషాభ్యాం ప్రతీమః. ప్రాజ్ఞస్య హీదం ప్రకరణమ్-"అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాత్" (క.ఉ.2.14)ఇత్యాది. తద్విషయ ఏవ చ వాక్యశేషోఽపి-

"తదేవ శుక్లం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే

తస్మిన్ లోకాః శ్రితాః సర్వే తదు నాత్యేతి కశ్చన" (క.ఉ.5.8)ఇతి.

ప్రాజ్ఞకర్తృకా చ సృష్టిస్తథ్యరూపా సమధిగతా జాగరితాశ్రయా. తథా స్వప్నాశ్రయాపి సృష్టిర్భవితుమర్హతి. తథా చ శ్రుతిః "అథో ఖల్వాహుర్జాగరితదేశ ఏవాస్యైష ఇతి యాని హ్యేవ జాగ్రత్పశ్యతి తాని సుప్తః" (బృ.ఉ.4.3.14)ఇతి స్వప్నజాగరితయోః సమానన్యాయతాం శ్రావయతి. తస్మాత్తథ్యరూపైవ సంధ్యే సృష్టిరితి. 2.

బాలానందిని

నిర్మాతారమితి:- "ఏకే=ఒక శాఖవారు. నిర్మాతారమ్=ఆత్మను సృష్టికర్తగా చెప్పుచున్నారు. పుత్రాదయశ్చ=పుత్రులుమొదలైనవాళ్లు కామములు" అని సూత్రార్థం.(ఇది కూడ పూర్వపక్షసూత్రమే)

అపి చేతి:- ఇంతే కాక కొన్ని శాఖలకు చెందినవారు "య...నిర్మిమాణః" అని ఈ సంధ్యస్థానంలో ఆత్మయే నిర్మాణం చేస్తూన్న దని చెపుతున్నారు. (ఇంద్రియాదులు నిద్రించుచుండగా ఏ పురుషుడు) మేల్కొని ఉండి ప్రతీ కామాన్నీ నిర్మిస్తున్నాడో అని

శ్రుతివాక్యాని కర్థం) అక్కడ 'కామాః' అనగా "కామ్యన్త ఇతి కామాః" (కోరబడుచున్నవి గాన కామములు)అనే విగ్రహంచేత, పుత్రాదు లని అభిప్రాయం. (ప్రశ్న)కామశబ్దంచేత ఇచ్ఛావిశేషాలే (ఒకరకమైన కోరికలే)చెప్పబడతాయికదా?(సమాధానం) కాదు. "శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ" (నూరుసంవత్సరాల ఆయుర్దాయం గల పుత్రులను పౌత్రులను కోరుకొనుము)అని ప్రస్తావించి (ప్రారంభించి) చివర"కామానాం.....కరోమి"(నిన్ను కామాలలో ఏది కావాలో ఆ కామాన్ని పొందేవానినిగా చేస్తాను)అని ప్రకృతములైన పుత్రాదుల విషయంలో కామ శబ్దం ప్రయోగించబడింది కదా? ప్రకరణంచేత వాక్యశేషంచేతా కూడ ఈ అత్మ పరమాత్మయే అని తెలుసుకొంటున్నాము. "అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాత్" ఇత్యాదికం పరమాత్మకు సంబంధించిన ప్రకరణం. " తదేవ... కశ్చన" అనే వాక్యశేషం కూడ పరమాత్మను గూర్చినదే. (అదే పరిశుద్ధమైనది. అదియే బ్రహ్మ. అదే అమృతమని చెప్పబడుచున్నది. అన్ని లోకాలు దానిమీదనే ఆధారపడి ఉన్నవి. ఎవరూ దానిని అతిక్రమించ జాలరు అని శ్రుతివాక్యానికి అర్థం). పరమేశ్వరుడు సృష్టించిన, జాగ్రదవస్థకు సంబంధించిన సృష్టి సత్య మైనదిగా కనబడుచున్నది గాన స్వప్నాశ్రయమైన సృష్టి కూడ సత్యమవడానికే తగి ఉంది. "అథో...సుప్తః" (ఇట్లు చెప్పుచున్నారు-వీని ఈ స్వప్నం జాగ్రదవస్థలో పదార్థాలు ఏ ప్రదేశంలో ఉంటాయో అక్కడే ఉంటుంది. జాగ్రదవస్థలో వేటిని చూస్తాడో నిద్రించి కూడ వాటినే చూస్తాడు)అని శ్రుతి కూడ స్వప్నజాగరితస్థానాలు సమానరూపము లని చెప్పుచున్నది. అందువల్ల సంధ్యలో సృష్టి యథార్థమైనదే.

వి. కర్మాచరణాసక్తులకు గత్యాగతిరూపమైన సంసారం తప్పదు అని అనుసంధానం చేసుకోవడంచేత కర్మఫలంమీద వైరాగ్యం కలుగుతుంది. దానివల్ల కలిగే తత్త్వం. పదార్థవివేకం వాక్యార్థజ్ఞానానికి సాధనం. అలాంటి సాధనం ఈ పాదంలో నిరూపించబడుతున్నది గాన వెనుకటి పాదానికి ఈ పాదానికి హేతుసాధ్యభావసంగతి. ఈ పాదం సాధనవిచారం గాన దీనికి ఈ అధ్యాయంలో సంగతి. ఈ పాదంలోని పదకొండవ సూత్రానికి పూర్వం అవస్థానిరూపణద్వారా త్వంపదార్థవివేచనం చేయబడుతుంది. అది మొదలు పాదసమాప్తి వరకు తత్పదార్థవివేకం చేయబడుతుంది. 2.

భాష్యమ్

ఏవం ప్రాప్తే ప్రత్యాహ -

**సూ. మాయామాత్రం తు కార్త్స్న్యేనానభివ్యక్తస్వరూపత్వాత్. 3.2.3.**

తుశబ్దః పక్షం వ్యావర్తయతి. నైతదస్తి యదుక్తం స్వప్నే సృష్టిః పారమార్థికీతి. మాయైవ సంధ్యే సృష్టిర్న పరమార్థగన్ధోఽప్యస్తి. కుతః? కార్త్స్న్యేనానభివ్యక్తస్వరూపత్వాత్. న హి కార్త్స్న్యేన పరమార్థవస్తుధర్మేణాభివ్యక్త స్వరూపః స్వప్నః. కిం పునరత్ర కార్త్స్న్య మభిప్రేతమ్? దేశకాలనిమిత్తసంపత్తి రబాధశ్చ. న హి పరమార్థవస్తువిషయాణి దేశకాలనిమిత్తాన్యబాధశ్చ స్వప్నే సంభావ్యన్తే. న తావత్స్వప్నే రథాదీనాముచితో దేశః సంభవతి. న హి సంవృతే దేహదేశే రథాదయోఽవకాశం లభేరన్. స్యాదేతత్-బహిర్దేహాత్ స్వప్నాన్ ద్రక్ష్యతి. దేశాన్తరితద్రవ్యగ్రహణాత్. దర్శయతి చ శ్రుతిర్బహిర్దేహాత్స్వప్నమ్ "బహిష్కులాయాదమృతశ్చరిత్వా, స ఈయతేఽమృతో యత్ర కామమ్" (బృ.ఉ.4.3.12) ఇతి. స్థితిగతిప్రత్యయభేదశ్చ నానిష్క్రాన్తే జన్తౌ సామఞ్జస్య మశ్నువీతేతి. నేత్యుచ్యతే. న హి సుప్తస్య జన్తోః క్షణమాత్రేణ యోజనశతాన్తరితం దేశం పర్యేతుం విపర్యేతుం చ తతః సామర్థ్యం సంభావ్యతే. క్వచిచ్చ ప్రత్యాగమనవర్జితం స్వప్నం శ్రావయతి-కురుష్వహమద్య శయానో నిద్రయాభిప్లుతః స్వప్నే పఞ్చాలానభిగతశ్చాస్మిన్ ప్రతిబుద్ధశ్చేతి. దేహాచ్చేదపే యాత్పఞ్చాలేష్వేవ ప్రతిబుధ్యేత. న తానసావభిగత ఇతి కురుష్వేవ తు ప్రతిబుధ్యతే. యేన చాయం దేహేన దేశాన్తరమశ్నువానో మన్యతే తమన్యే పార్శ్వస్థాః శయనదేశ ఏవ పశ్యన్తి. యథాభూతాని చాయం దేశాన్తరాణి స్వప్నే పశ్యతి న తాని తథాభూతాన్యేవ భవన్తి-పరిధావంశ్చేత్పశ్యేజ్జాగ్రద్వద్వస్తుభూతమర్థ మాకలయేత్. దర్శయతి చ శ్రుతిరన్తరేవ దేహే స్వప్నమ్-"స యత్రైత్ స్వప్న్యయా చరతి" ఇత్యుపక్రమ్య "స్వే శరీరే యథాకామం పరివర్తతే"

(బృ.ఉ.2.1.18) ఇతి. అతశ్చ శ్రుత్యుపపత్తివిరోధాద్బహిష్కులాయశ్రుతిర్గౌణీ వ్యాఖ్యాతవ్యా బహిరివ కులాయాదమృతశ్చరిత్వా ఇతి. యో హి వసన్నపి శరీరే న తేన ప్రయోజనం కరోతి స బహిరివ శరీరాద్భవతీతి.

బాలానందిని

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా దానికి సమాధానం చెప్పుచున్నాడు-

మాయేతి:- "మాయామాత్రం తు=స్వప్నసృష్టి కేవలం మాయామాత్ర మైనదే. కార్త్స్న్యేన=పూర్తిగా, అనభివ్యక్తస్వరూపత్వాత్=అభివ్యక్తం కాని స్వరూపం కల దవడం వల్ల" అని సూత్రార్థం.

తుశబ్ద ఇతి:-తుశబ్దం పూర్వపక్షాన్ని నివారిస్తుంది. సంధ్యావస్థలో సృష్టి సత్యమైన దని ఏది చెప్పబడిందో అది లేదు. సంధ్యలోని సృష్టి మాయయే కాని దానిలో పరమార్థగంధం కూడ లేదు. ఎందువల్ల? కార్త్స్న్యంతో అభివ్యక్త స్వరూపం కాదు కాబట్టి. స్వప్నం పరమార్థమైన వస్తువుల ధర్మమైన కార్త్స్న్యంతో వ్యక్తమైనస్వరూపం కలది కాదు గదా? ఏమిటి ఇక్కడ మీరు అంగీకరించే కార్త్స్న్యం? దేశ-కాల-నిమిత్తాలన్నీ సరిగా ఉండడం. బాధ లేకపోవడం. పరమార్థవస్తువునకు సంబంధించిన దేశకాలనిమిత్తాలు, బాధలేకపోవడం (నిషేధించబడకపోవడం) ఇవి స్వప్నంలో సంభావ్యములు కావు కదా? రథాదులకు స్వప్నంలో తగిన ప్రదేశం ఉండదు. దేహం ఉన్న సంవృతమైన దేశంలో (గది మొదలైనవాటిలో) రథాదులకు (లేదా ఇరుకైన దేహంలో అని కూడ అర్థం చెప్పవచ్చును) అవకాశం ఉండదుకదా? (ప్రశ్న) ఇది ఇలా ఉండనీ; దూరదేశంలో ఉన్న వస్తువులను చూస్తున్నాడు గాన దేహంనుండి బైటనే (దేహంనుంచి బైటకు వచ్చి) స్వప్నం చూస్తాడు. "బహిః....కామమ్" (అమృతుడైన జీవుడు గూడునుండి బైట సంచరిస్తూ కామం (భోగ్యపదార్థజాతం) ఎక్కడ ఉన్నదో అక్కడికి వెడతాడు) అను శ్రుతి కూడ దేహం బైటనే స్వప్నం చూడబడుచున్నట్లు చెప్పుచున్నది. జీవుడు శరీరంనుండి బైటకు రాకపోతే నిలబడ్డట్లు నడుస్తున్నట్లు జ్ఞానంకూడ సమంజసంగా ఉండదు.(సమాధానం)ఇది యుక్తం కాదు అని చెప్పబడుతుంది(కాదంటాం). నిద్రపోతున్నవాడు క్షణకాలంలో నూరు యోజనాల దూరంలో ఉన్న ప్రదేశానికి వెళ్లడానికి అక్కడినుండి తిరిగి రావడానికి సామర్థ్యం

సంభావ్యం కాదు కదా? "నేను ఈ రోజున నిద్రాపరవశుడనై కురుదేశంలో నిద్రించి పంచాలదేశం వెళ్లాను; అక్కడనే పాంచాల దేశంలోనే మేల్కొన్నాను" అని (స్వప్నం చూచినవాడు)తిరిగి రావడం లేని స్వప్నాన్ని గూర్చి చెపుతాడు. అతడు దేహంనుంచి బైటకు వెళ్లి ఉన్నట్లయితే పంచాలదేశంలోనే మేల్కొని ఉండేవాడు. అతడు అక్కడికి వెళ్లనే లేదు గాన కురుదేశంలోనే మేల్కొంటున్నాడు. అతడు ఏ దేహంతో దేశాంతరానికి వెళ్లినట్లు అనుకుంటున్నాడో ఆ దేహాన్ని ప్రక్క నున్న వాళ్లు శయనదేశంలోనే చూస్తున్నారు. అతడు స్వప్నంలో ఇతరదేశాలను ఏవిధంగా ఉన్నట్లు చూస్తున్నాడో అవి ఆ విధంగా ఉండడంలేదు. అతడు జాగ్రదస్థలోవలె వెళ్లి చూచేటట్లయితే ఆ వస్తువులను అవి ఎలా ఉన్నాయో అదే విధంగా చూచి ఉండేవాడు. "స యత్రై తత్స్వప్నయా చరతి" (అతడు ఏ సమయంలో స్వప్నంలో సంచరిస్తాడో)అని ఉపక్రమించి "స్వే శరీరే యథాకామం పరివర్తతే"(అప్పుడు తన శరీరంలో స్వేచ్ఛగా సంచరిస్తాడు) అను శ్రుతి కూడ స్వప్నదర్శనం దేహం లోపలనే స్వప్నాన్ని చెప్పుచున్నది. అందువల్ల శ్రుతికి, ఉపపత్తికి విరోధం ఉండడంవల్ల బహిష్కులాయశ్రుతికి-"అమృతుడైన జీవుడు కులాయంనుండి బైట వలె చరించి" అని గౌణార్థం చెప్పుకోవాలి. ఎవడు శరీరంలో ఉండి కూడ ఆ శరీరంతో పని చేయడో అతడు శరీరంనుండి బైటకు వెళ్లిపోతాడా అన్నట్లు ఉంటుంది కదా. (ఈ విధంగా ఇది ఔపచారికప్రయోగం అని అర్థం).

## భాష్యమ్.

స్థితిగతిప్రత్యయభేదోఽప్యేవం సతి విప్రలమ్భ ఏవాభ్యుపగన్తవ్యః. కాలవిసంవాదోఽపి చ స్వప్నే భవతి. రజన్యాం సుప్తో వాసరం భారతే వర్షే మన్య తే. తథా ముహూర్తమాత్రవర్తిని స్వప్నే కదాచిద్బహువర్ష పూగానతి వాహయతి. నిమిత్తాన్యపి చ స్వప్నే న బుద్ధయే కర్మణే వోచితాని విద్యన్తే. కరణోపసంహారాద్ధి నాస్య రథాదిగ్రహణాయ చక్షురాదీని సన్తి. రథాదినిర్వర్తనేఽపి కుతోఽస్య నిమేషమాత్రేణ సామర్థ్యం దారూణి వా? బాధ్యన్తే చైతే రథాదయః స్వప్నదృష్టాః ప్రబోధే. స్వప్న ఏవ చైతే సులభబాధా భవన్తి. ఆద్యన్తయోర్వ్య

1భిచారదర్శనాత్. రథోఽయమితి హి కదాచిత్స్వప్నే నిర్ధారితః క్షణేన మనుష్యః సంపద్యతే, మనుష్యోఽయమితి నిర్ధారితః క్షణేన వృక్షః. స్పష్టం చాభావం రథాదీనాం స్వప్నే శ్రావయతి శాస్త్రమ్-"న తత్ర రథా....భవన్తి" ఇత్యాది. తస్మాన్మాయామాత్రం స్వప్నదర్శనమ్. 3.

బాలానందిని

స్థితీతి:- ఈ విధంగా ఉన్నప్పుడు నిలబడడం, నడవడం మొదలైన జ్ఞానాల భేదం కూడ విప్రలంభమే (మోసమే; మిథ్యయే) అని అంగీకరించాలి. రాత్రి నిద్రపోయినవాడు భారతవర్షంలోనే పగ లని అనుకుంటాడు. ఈ విధంగా కాలం విషయంలో కూడ విసంవాదం(భేదం) స్వప్నంలో ఉంటుంది. తెలుసుకొనడానికి గాని, ఏదైన పని చేయడానికి గాని తగిన నిమిత్తాలు కూడ స్వప్నంలో ఉండవు. ఇంద్రియాలన్నీ ఉపసంహరింప బడడంచేత రథాదులను గ్రహించడానికి, వీనికి, చక్షురాదు లుండవు. ఒక నిమేషంలో రథాదులను తయారుచేయడానికి కూడ వీనికి సామర్థ్యం కాని, కఱ్ఱలు కాని ఎక్కడున్నాయి? స్వప్నంలో చూడబడిన ఈ రథాదులు మెలకువ రాగానే బాధించబడతాయి కూడ. స్వప్నంలోనే ఈ పదార్థాలు అనాయాసంగా బాధింపబడుతుంటాయి; ఎందువల్ల ననగా- ఆదిలోను అంతంలోను వ్యభిచారం(మారిపోతూండడం)కనబడుతుంది. ఒకప్పుడు ఇది రథం అని స్వప్నంలో నిర్ధారణచేయబడినది మరుక్షణంలో మనుష్యుడుగా మారిపోతుంది. మనుష్యుడని నిర్ణయింపబడినది మరుక్షణంలో వృక్షంగా మారిపోతుంది. "న తత్ర...భవన్తి" ఇత్యాది శాస్త్రం స్వప్నంలో రథాదులు లేవని స్పష్టంగా చెపుతున్నది. అందువల్ల స్వప్నదర్శనం మాయామాత్రమే. 3

## సూ. సూచకశ్చ హి శ్రుతేరాచక్షతే చ తద్విదః. 3.2.4.

మాయామాత్రత్వాత్తర్హి న కశ్చిత్స్వప్నే పరమార్థగన్ధోఽస్తీతి. నేత్యుచ్యతే. సూచకశ్చ హి స్వప్నో భవతి భవిష్యతోః సాధ్వసాధునోః. తథాహి శ్రూయతే-

"యదా కర్మసు కామ్యేషు స్త్రియం స్వప్నేషు పశ్యతి,

సమృద్ధిం తత్ర జానీయాత్తస్మిన్ స్వప్ననిదర్శనే" (ఛా.ఉ.5.2.9) తథా-

"పురుషం కృష్ణం కృష్ణదన్తం పశ్యతి స ఏనం హన్తి"(ఛా.ఉ.5.2.9)ఇత్యేవమాదిభిః

స్వప్నైరచిర జీవిత్వమావేద్యతే ఇతి శ్రావయతి. ఆచక్షతే చ స్వప్నాధ్యాయవిదః- కుఞ్జరారోహణాదీని స్వప్నే ధన్యాని ఖరయానాదీన్యధన్యానీతి. మన్త్రదేవతా ద్రవ్యవిశేషనిమిత్తాశ్చ కేచిత్ స్వప్నాః సత్యార్థగన్ధినో భవన్తీతి మన్యన్తే. తత్రాపి భవతు నామ సూచ్యమానస్య వస్తునః సత్యత్వమ్; సూచకస్య తు స్త్రీదర్శనాదేః భవత్యేవ వైతథ్యమ్, బాధ్యమానత్వాదిత్యభిప్రాయః. తస్మాదుపపన్నం స్వప్నస్య మాయామాత్రత్వమ్.

బాలానందిని

సూచక ఇతి:-“ సూచకశ్చ హి=స్వప్నం శుభాశుభాలను సూచించేది కూడ కదా? శ్రుతేః=శ్రుతివల్ల, తద్విదః=స్వప్నశాస్త్రం తెలిసివాళ్లు. ఆచక్షతే చ=చెపుతున్నారు కూడ” అని సూత్రార్థం.

మాయేతి :- స్వప్నం మాయామాత్రం అవడంచేత స్వప్నంలో పరమార్థగంధం కూడ లేదని అర్థమా? కాదు అని చెప్పబడుచున్నది. స్వప్నం రాబోయే మంచిచెడ్డలను సూచిస్తుంది. అది ఎట్లనగా-“యథా....నిదర్శనే” అని వినబడుచున్నది. అట్లే “పురుషం...హన్తి” ఇత్యాదివాక్యాలచేత స్వప్నాలు అచిరజీవిత్వాన్ని సూచిస్తాయని చెప్పుచున్నది. స్వప్నంలో గజారోహణాదికం శుభకరం, ఖరారోహణాదికం అశుభకరం అని స్వప్నాధ్యాయం తెలిసినవాళ్లు కూడ (స్వప్నాధ్యాయం అనగా స్వప్న పరిశీలన లేదా స్వప్నాలను గూర్చి తెలిపే గ్రంథం) చెపుతున్నారు. మంత్ర విశేష దేవతావిశేష ద్రవ్యవిశేషాలను బట్టి కొన్ని స్వప్నాలకు సత్యార్థగంథం ఉంటుందని కూడ అభిప్రాయపడుతున్నారు. అప్పుడు కూడ సూచించబడే వస్తువు సత్యమైతే కావచ్చును; సూచకమైన స్త్రీదర్శనాదిక మైతే బాధింపబడుతుంది గాన అసత్యమే అవుతుంది అని అభిప్రాయం. అందువల్ల స్వప్నం మాయామాత్రం అనడం యుక్తమే.

భాష్యమ్

యదుక్తమ్ ఆహ హి ఇతి తేదవం సతి భాక్తం వ్యాఖ్యాతవ్యమ్. యథా లాఙ్గలం గవాదీనుద్వహతీతి నిమిత్త మాత్రత్వాదేవముచ్యతే న తు ప్రత్యక్షమేవ లాఙ్గలం గవాదీనుద్వహతి, ఏవం నిమిత్తమాత్రత్వాత్సుప్తో రథాదీన్ సృజతే, స

హి కర్తేతి చోచ్యతే. న తు ప్రత్యక్షమేవ సుప్తో రథాదీన్ సృజతి. నిమిత్తత్వం త్వస్య రథాదిప్రతిభాననిమిత్తమోదత్రాసాదిదర్శనాత్తన్నిమిత్తభూతయోః సుకృతదుష్కృతయోః కర్తృత్వేనేతి వక్తవ్యమ్. అపి చ జాగరితే విషయేన్ద్రియసంయోగాదాదిత్యాదిజ్యోతిర్వ్యతికరాచ్చాత్మనః స్వయంజ్యోతిష్ట్వం దుర్వివేచనమితి తద్వివేచనాయ స్వప్న ఉపన్యస్తః. తత్ర యది రథాదిసృష్టివచనం శ్రుత్యా నీయేత తదా స్వయంజ్యోతిష్ట్వం న నిర్ణీతం స్యాత్. తస్మాద్రథాద్యభావవచనం శ్రుత్యా, రథాదిసృష్టివచనం తు భక్త్యేతి వ్యాఖ్యేయమ్. ఏతేన నిర్మాణశ్రవణం వ్యాఖ్యాతమ్.

బాలానందిని

యదితి :- ఇది ఈ విధంగా ఉంది గాన "అహ హి" అని (రథాదులను ఆత్మ సృష్టిస్తున్న దని శ్రుతి చెప్పుచున్నది కదా అని) ఏది చెప్పబడింది అది గౌణమైన దని వ్యాఖ్యానించాలి. (గోవులు మొదలైనవాటి పోషణకు తగిన సస్యాదులను పుట్టించడానికి) నిమిత్తం అవడంచేత "నాగలి గోవులు మొదలైనవాటిని పోషిస్తున్నది" అని ఏ విధంగా అంటామో, అంతే కాని లాంగలం ఏ విధంగా గవాదులను ప్రత్యక్షంగా పోషించదో అట్లే నిద్రపోతున్నవాడు కేవలం నిమిత్తం అవడంచేత "రథాదులను సృష్టిస్తాడు. అతడే వాటి నిర్మాత" అని చెప్పబడుతున్నాడు. అంతేనే కాని నిద్రిస్తున్నవాడు ప్రత్యక్షంగానే రథాదులను సృజించడంలేదు. ఇతడు దీనికి నిమిత్తం ఎలా అవుతతాడనగా-రథాదులు కనబడడంవల్ల వీనికి సంతోషం భయం మొదలైనవి కలుగుతాయి. వాటికి కారణాలు ఇతడు చేసిన పుణ్యపాపాలు. ఈ సుకృతదుష్కృతాలను చేయడం ద్వారా ఇతడు రథాదులకు నిమిత్తం అవుతున్నాడు. మరొక విషయ మేమనగా-(ఆత్మ స్వయం జ్యోతిస్సు, తనంతట తానే ప్రకాశించే తేజస్సు, అని ప్రతిపాదించవలసి ఉంది). జాగరితంలో విషయేంద్రియాల సంయోగంవల్ల, ఆదిత్యాదిజ్యోతిస్సుల సంకరంవల్ల, ఆత్మ కున్న స్వయంజ్యోతిష్ట్వం వివేచనం చేయడం కష్టమనే అభిప్రాయంతో దాని వివేచనం (విడదీసి స్పష్టంగా చూపడం) చేయడం కోసం స్వప్నం చెప్పబడింది. అలాంటప్పుడా రథాదిసృష్టివాక్యానికి,

శ్రుతిచేత (అనగా చెప్పినది చెప్పినట్లుగా ముఖ్యమే అని)అర్థం చెపితే అప్పుడు స్వయంజ్యోతిష్ట్వం నిర్ణీతం కాదు. అందుచేత రథాదులు లేవని చెప్పే వాక్యం శ్రుతిచేత, అనగా ముఖ్యవృత్తిచేత, అనీ రథాదిసృష్టివచన మైతే ఉపచారంచేత అనీ వ్యాఖ్యానించాలి. అనగా రథాదుల లేవు. అని చెప్పే శ్రుతివాక్యం 'లేవు' అనే ముఖ్యార్థాన్నే బోధిస్తూన్న దనీ సృష్టిస్తున్నాడు అని చెప్పే వాక్యం 'సృష్టిస్తున్నట్లు కనబడుతున్నాడు.' అనే లాక్షణికార్థాన్ని బోధిస్తూన్న దనీ గ్రహించాలి. దీనిచేత "కామం కామం పురుషో నిర్మిమాణః" అను పుత్రాదికామాలను నిర్మిస్తాడని చెప్పే వాక్యం కూడ వ్యాఖ్యానించబడినట్లే. అనగా అక్కడ కూడ నిర్మాణం భాక్తమే (గౌణమే) అని అర్థం.

## భాష్యమ్

యదప్యుక్తమ్- "ప్రాజ్ఞమేనం నిర్మాతారమామనన్తి" ఇతి తదప్యసత్. శ్రుత్యన్తరే "స్వయం విహత్య స్వయం నిర్మాయ స్వేన భాసా స్వేన జ్యోతిషా ప్రస్వపితి" (బృ.ఉ.4.3.9) ఇతి ప్రసిద్ధానువాదాజ్జీవ ఏవాయం కామానాం నిర్మాతా సంకీర్త్యతే. తస్య తు వాక్యశేషేణ "తదేవ శుక్రం తద్బ్రహ్మ" ఇతి జీవభావం వ్యావర్త్య బ్రహ్మభావ ఉపదిశ్యతే "తత్త్వమసి" (ఛా.ఉ.6.9.4) ఇత్యాదివదితి న బ్రహ్మప్రకరణం విరుధ్యతే. న చాస్మాభిః స్వప్నేఽపి ప్రాజ్ఞవ్యవహారః ప్రతిషిధ్యతే; తస్య సర్వేశ్వరత్వాత్సర్వాస్వవ్యవస్థాను అధిష్ఠాతృత్వోపపత్తేః. పారమార్థికస్తు నాయం సంధ్యాశ్రయః సర్గో వియదాదిసర్గవదిత్యేతత్ప్రతిపాద్యతే. నచ వియదాదిసర్గస్యాప్యాత్యన్తికం సత్యత్వమస్తి. ప్రతిపాదితం హి "తదనన్యత్వమారమ్భణశబ్దాదిభ్యః" (బ్ర.సూ.2.1.14) ఇత్యత్ర సమస్తస్య ప్రపఞ్చస్య మాయామాత్రత్వమ్. ప్రాక్తు బ్రహ్మాత్మత్వదర్శనాత్ వియదాదిప్రపఞ్చో వ్యవస్థితరూపో భవతి. సంధ్యాశ్రయస్తు ప్రపఞ్చః ప్రతిదినం బాధ్యత ఇత్యతో వైశేషికమిదం సంధ్యస్య మాయామాత్రత్వముదితమ్. 4.

బాలానందిని

యదపీతి :- ఈ నిర్మాత పరమాత్మయే అని అంటారు అని చెప్పినది కూడ యుక్తం కాదు "స్వయం...ప్రస్వపితి" (స్వయంగా జాగ్రద్దేహాన్ని చేష్టారహితం చేసి, స్వయంగా వాసనాదేహాన్ని నిర్మించుకొని, తన బుద్ధివృత్తితో, తన స్వరూపచైతన్యంతో, స్వప్నం అనుభవిస్తున్నాడు) అని మరొక శ్రుతిలో జీవుని వ్యాపారమే వినబడుచున్నది. ఇక్కడ కూడ "య ఏష సుప్తేషు జాగర్తి" అని ప్రసిద్ధుడైన జీవుణ్ణే అనువదించడంచేత ఈ జీవుడే కామనిర్మాత అని చెప్పబడుచున్నాడు. అయితే "తదేవ శుక్రం తద్బ్రహ్మ" అనే వాక్యశేషంచేత," తత్త్వమసి" ఇత్యాదివాక్యాలచేత వలె, వాని జీవభావాన్ని నిషేధించి బ్రహ్మాత్మభావం బోధించబడుతున్నది. అందుచేత బ్రహ్మప్రకరణానికి ఏమీ విరోధం రాదు. స్వప్నంలో కూడ ప్రాజ్ఞుని వ్యవహారం ఉంటుందనే విషయాన్ని మేం కూడ నిరాకరించడంలేదు. ఎందుచేత ననగా అతడు సర్వేశ్వరుడు గాన అన్ని అవస్థలలోను అతడు అధిష్ఠాతగా ఉండడం ఉపపన్నమే. అయితే ఈ సంధ్యలోని సృష్టి వియదాదిసృష్టి వలె పారమార్థికం కాదని మాత్రమే ప్రతిపాదించబడుచున్నది. నిజానికి వియదాదిసృష్టికి కూడ ఆత్యంతికమైన, పారమార్థికమైన, సత్యత్వం లేదు. "తదనన్యత్వమారమ్భణశబ్దాదిభ్యః" అనే చోట సమస్త ప్రపంచమూ కూడ మాయామాత్రమే అని ప్రతిపాదించబడింది కదా? అయితే-వియదాదికమైన ప్రపంచం బ్రహ్మాత్మత్వజ్ఞానం కలగడానికి పూర్వం, అంతవరకు వ్యవస్థితమైన రూపంతో ఉంటుంది. సంధ్యాశ్రయమైన ప్రపంచమైతే ప్రతిదినమూ బాధించబడుతూనే ఉంటుంది. అందుచేత సంధ్యసృష్టి మాయామాత్ర మని ప్రత్యేకంగా చెప్పబడింది. 4.

సూ. పరాభిధ్యానాత్తు తిరోహితం తతో హ్యస్య బన్ధవిపర్యయౌ. 3.2.5

అథాపి స్యాత్పరస్యైవ తావదాత్మనోంఽశో జీవోఽగ్నేరివ విస్ఫులిఙ్గః, తత్రైవం సతి యథాగ్నివిస్ఫులిఙ్గయోః సమానే దహనప్రకాశనశక్తీ భవత ఏవం జీవేశ్వరయోరపి జ్ఞానైశ్వర్యశక్తీ; తతశ్చ జీవస్య జ్ఞానైశ్వర్యవశాత్సాంకల్పికీ స్వప్నే రథాదిసృష్టిర్భవిష్యతీతి. అత్రోచ్యతే- సత్యపి జీవేశ్వరయోరంశాంశిభావే ప్రత్యక్షమేవ జీవస్యేశ్వరవిపరీతధర్మత్వమ్. కిం పునర్జీవస్యే శ్వరసమానధర్మత్వం

నాస్త్యేవ? న నాస్త్యేవ. విద్యమానమపి తత్తిరోహితమవిద్యాదివ్యవధానాత్. తత్పునస్తిరోహితం సత్పరమేశ్వరమభిధ్యాయతో యతమానస్య జన్తోర్విధూత ధ్వాన్తస్య తిమిరతిరస్కృతేవ దృక్శక్తిరౌషధీధవీర్యాదీశ్వరప్రసాదాత్సంసిద్ధస్య కస్య చిదేవావిర్భవతి, న స్వభావత ఏవ సర్వేషాం జన్తూనామ్. కుతః? తతో హీశ్వరా ద్ధేతోరస్య జీవస్య బన్ధమోక్షౌ భవతః. ఈశ్వరస్వరూపా పరిజ్ఞానాద్బన్ధస్తత్స్వ రూపపరిజ్ఞానాత్తు మోక్షః. తథా చ శ్రుతిః

'జ్ఞాత్వా దేవం సర్వపాశాపహానిః క్షీణైః క్లేశైర్జన్మమృత్యుప్రహాణిః,

తస్యాభిధ్యానాత్తృతీయం దేహభేదే విశ్వైశ్వర్యం కేవల ఆప్తకామః' (శ్వే.ఉ.1.11) ఇత్యేవమాద్యా. 5.

బాలానందిని

పరేతి :- "తు=కాని, తిరోహితమ్=(అవిద్యచేత)కప్పబడిన జీవుని రూపం, పరాభిధ్యానాత్=పరమాత్మను ధ్యానించడంలన వ్యక్త మవుతుంది. అస్య=ఈ జీవునకు, బన్ధవిపర్యయౌ=బంధమోక్షాలు, తతో హి=అ పరమాత్మవలననే కలుగుతాయి కదా?" అని సూత్రార్థం.

అథాపీతి :- అగ్నికి విస్ఫులింగం వలె, జీవుడు పరమాత్ముని ఒక అంశ. అందుచేత అగ్నిలోను విస్ఫులింగంలోను దహనశక్తి ప్రకాశనశక్తి ఏ విధంగా సమంగా ఉంటాయో అదే విధంగా జీవేశ్వరులలో జ్ఞానైశ్వర్యశక్తులు సమంగా ఉంటాయి. అందుచేత జీవునిలో జ్ఞానైశ్వర్యశక్తులవల్ల, స్వప్నంలో సంకల్పంచేతనే, రథాదిసృష్టి అవుతుంది అని ఆశంక కలగవచ్చును. ఈ విషయంలో చెప్పబడుచున్నది. జీవేశ్వరులకు అశాంశిభావం ఉన్నా కూడ జీవునిలో, ఈశ్వరునిలో ఉన్న ధర్మాలకంటె విపరీతమైన ధర్మా లున్నా యనేది ప్రత్యక్షమే. అయితే జీవునకు ఈశ్వరునితో సమానధర్మత్వం లేనే లేదా? లేకపోవడం లేదు. ఉన్నా కూడ అది అవిద్యాదుల వ్యవధానంవల్ల కప్పబడి ఉంది. తిరోహితమైన అది (సమానధర్మత్వం) పరమేశ్వరుణ్ణి ధ్యానిస్తూ ప్రయత్నించగా తమస్సు తొలగిపోయిన, ఈశ్వరానుగ్రహంచేత సంసిద్ధుడైన (అణిమాదిసిద్ధులు పొందిన) ఏ

ఒక్కనియందో, ఔషధశక్తిచేత నేత్రశక్తి వలె, ఆవిర్భవిస్తుంది. అంతేనే కాని సమస్తజంతువులకు సహజంగానే ఆవిర్భవించదు. ఎందువల్ల? ఎందువల్ల ననగా ఆ ఈశ్వరునివల్ల జీవునకు బంధమోక్షాలు కలుగుతున్నాయి. ఈశ్వరస్వరూపం తెలియకపోవడంచేత బంధం కలుగుతున్నది. తెలుసుకొనడంవల్ల మోక్షం కలుగుతున్నది "జ్ఞాత్వా....ఆప్తకామః" అను శ్రుతి ఇతరశ్రుతులు కూడ ఈ విషయాన్నే చెపుతున్నాయి. ("బ్రహ్మైవాహమ్" అని ధ్యానిస్తూండేవాని అవిద్యాదిసర్వపాశాలూ తొలగిపోతాయి క్లేశాలు క్షీణించగానే జన్మమృత్యువులు నశిస్తాయి. ఆ పరమాత్మను ధ్యానించడంవల్ల (సగుణోపాసనవల్ల), దేహపాతానంతరం మూడవదైన (బంధమోక్షాలు కాక మూడవదైన) అణిమాదిసమస్తైశ్వర్యము లభిస్తుంది. తరవాత కేవలుడై (ద్వైతశూన్యుడై) ఆప్తకాముడు (స్వయంజ్యోతీరూపమైన ఆనందాన్ని పొందినవాడు) అవుతాడు అనగా క్రమముక్తిని పొందుతాడు అని పై మంత్రానికి అర్థం. 5.

## సూ. దేహయోగాద్వా సోఽపి. 3.2.6.

కస్మాత్పునర్జీవః పరమాత్మాంశ ఏవ సంస్తిరస్కృతజ్ఞానైశ్వర్యో భవతి? యుక్తం తు జ్ఞానైశ్వర్యయోరతిరస్కృతత్వం విస్ఫులిఙ్గస్యేవ దహనప్రకాశనయోరితి. ఉచ్యతే; సత్యమేవైతత్. సోఽపి తు జీవస్య జ్ఞానైశ్వర్యతిరోభావః, దేహయోగాద్దేహేన్ద్రియమనోబుద్ధివిషయవేదనాది యోగాద్భవతి. అస్తి చాత్రోపమా-యథాగ్నేర్దహనప్రకాశనసంపన్నస్యాప్యరణిగతస్య దహనప్రకాశనే తిరోహితే భవతో, యథా వా భస్మచ్ఛన్నస్య, ఏవమవిద్యా ప్రత్యుపస్థాపితనామరూపకృతదేహాద్యుపాధియోగాత్తదవివేకభ్రమకృతో జీవస్య జ్ఞానైశ్వర్యతిరోభావః. వాశబ్దో జీవేశ్వరయోరన్యత్వశఙ్కావ్యావృత్త్యర్థః. నన్వన్య ఏవ జీవ ఈశ్వరాదస్తు తిరస్కృతజ్ఞానైశ్వర్యత్వాత్; కిం దేహయోగకల్పనయా? నేత్యుచ్యతే. న హ్యన్యత్వం జీవస్యేశ్వరాదుపపద్యతే "సేయం దేవతైక్షత" (ఛా.ఉ.6.3.2) ఇత్యుపక్రమ్య "అనేన జీవేనాత్మనానుప్రవిశ్య" (ఛా.ఉ.6.3.2)ఇత్యాత్మశబ్దేన జీవస్య పరామర్శాత్. "తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" (ఛా.ఉ.6.9.4)ఇతి చ జీవాయోపది

శతీశ్వరత్వమ్; అతోఽనన్య ఏవేశ్వరాజ్జీవః సన్ దేహయోగాత్తి రోహితజ్ఞానైశ్వర్యో భవతి. అతశ్చ న సాంకల్పికీ జీవస్య స్వప్నే రథాదిసృష్టిర్ఘటతే. యది చ సాంకల్పికీ స్వప్నే రథాదిసృష్టిః స్యాన్నైవానిష్టం కశ్చిత్స్వప్నం పశ్యేత్. న హి కశ్చిదనిష్టం సంకల్పయతే. యత్పునరుక్తం జాగరితదేశశ్రుతిః స్వప్నస్య సత్యత్వం స్థాపయతీతి, న తత్సామ్యవచనం సత్యత్వాభిప్రాయమ్; స్వయంజ్యోతిష్ట్వవిరోధాత్. శ్రుత్యైవ చ స్వప్నే రథాద్యభావస్య దర్శితత్వాత్. జాగరితప్రభవవాసనానిర్మితత్వాత్తు స్వప్నస్య తత్తుల్యనిర్భాసత్వాభిప్రాయం తత్. తస్మాదుపపన్నం స్వప్నస్య మాయామాత్రత్వమ్. 6.

బాలానందిని

దేహేతి :- "సోఽపి=జీవుని జ్ఞానైశ్వర్యాల తిరోభావం కూడ, దేహయోగాద్వా = దేహంతో సంబంధంవలననే" అని సూత్రార్థం.

కస్మాదితి :-జీవుడు పరమాత్ముని అంశయే అయిఉన్నా కూడ ఎందువల్ల అతని జ్ఞానైశ్వర్యాలు తిరస్కృతా లవుతున్నాయి? విస్ఫులింగంలో ఉన్న దహనప్రకాశాలు ఏ విధంగా తిరస్కృతములు కావో అట్లే వీని జ్ఞానైశ్వర్యాలు కూడ తిరస్కృతములు కాకుండా ఉండడం యుక్తం కదా? (సమాధానం) చెప్పబడుచున్నది- ఇది నిజమే. సోఽపి=జీవుని జ్ఞానైశ్వర్యతిరోభావం కూడ, దేహయోగాత్= దేహం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, విషయాలు, వేదన మొదలైనవాటితో సంబంధంవల్ల కలుగుచున్నది. ఇక్కడ ఒక ఉపమ కూడ ఉన్నది. అగ్నిలో దహనప్రకాశనాలు ఉన్నా కూడ అరణిలో ఉన్న అగ్నియొక్క దహనప్రకాశనాలు ఏ విధంగా తిరోహితాలుగానే ఉంటాయో,భస్మంచేత కప్పబడిన అగ్నియొక్క దహనప్రకాశనాలు ఏవిధంగా తిరోహితాలై ఉంటాయో అట్లే జీవుని జ్ఞానైశ్వర్యాల తిరోభావం కూడ అవిద్యచేత ఏర్పడిన నామరూపాలచేత చేయబడిన దేహాద్యుపాధులతో సంబంధంవల్ల, వాటినుండి వివేకం లేకపోవడంవల్ల కలిగించబడినది. జీవేశ్వరులు వేరు వేరే అను ఆశంకను నివారించడానికై 'వా' శబ్దం ప్రయోగింపబడింది. (ప్రశ్న)-తిరస్కృతములైన జ్ఞానైశ్వర్యాలు కలవా డవడంచేత జీవుడు ఈశ్వరునికంటె అన్యుడే కావచ్చును కదా? దేహయోగకల్పనచేత, అనగా దేహాదిసంబంధంచేత, వాని

శక్తులు కప్పబడిపోయాయి అని చెప్పబడంచేత, ఏమి ప్రయోజనం? అట్లు కాదంటాం. జీవుడు ఈశ్వరునికంటె భిన్నుడవడం కుదరదు. “ సేయం దేవతైక్షత” అని ఉపక్రమించి “అనేన...అనుప్రవిశ్య” అని ఆత్మశబ్దంచేత జీవుడు పరామర్శించబడ్డాడు. అనగా జీవుడే పరమేశ్వరుని ఆత్మ అని చెప్పబడ్డాడు. “తత్సత్యం...శ్వేతకేతో” అని జీవుడు ఈశ్వరస్వరూపుడని ఉపదేశిస్తున్నాడు. అందుచేత జీవుడు ఈశ్వరునికంటె అభిన్నుడే అయి ఉండి దేహసంబంధంవల్ల తిరోహితమైన జ్ఞానైశ్వర్యాలు కలవా డవుతున్నాడు. అందుచేత కూడ (వాని జ్ఞానైశ్వర్యాలు తిరోహితా లయిపోవడంచేత కూడ) స్వప్నంలో రథాదిసృష్టి జీవుని సంకల్పంవల్ల జరిగినది అనడం కుదరదు. స్వప్నంలోని రథాదిసృష్టి సంకల్పకృతమే అయితే ఎవ్వడూ కూడ అనిష్టమైన స్వప్నం చూడకూడదు. ఎవ్వడూ కూడ అనిష్టాన్ని సంకల్పించడు కదా? స్వప్నం కూడ జాగరితదేశమే అని (జాగరితదేశంలోనే స్వప్నం కూడ చూడబడుచున్నది గాన జాగరితం వలెనే స్వప్నం కూడ సత్యమే అని) ఏది చెప్పబడిందో ఆ సామ్యవచనం (జాగరిత– స్వప్నాల దేశాలు రెండూ ఒకటే అని చెప్పడం) సత్యత్వాన్ని ప్రతిపాదించడానికి చెప్పబడలేదు. అప్పుడు స్వయంజ్యోతిష్ట్వానికే విరోధం కలుగుతుంది.

2. ఇతరజ్యోతిస్సు లేవీ లేకపోయినా జీవుడు స్వప్నాన్ని చూస్తున్నాడంటే అట్లు ఆత్మజ్యోతిస్సుతోనే చూస్తున్నాడు అని చెప్పడంకోసం, ఈ విధంగా జీవుని స్వయంజ్యోతిష్ట్వాన్ని స్థాపించడంకోసం, స్వప్నావస్థ వర్ణించబడింది. స్వప్నంలోని వెలుతురు మొదలైనవి కూడ సత్యములే అయితే ఆత్మయొక్క స్వయంజ్యోతిష్ట్వం స్పష్టంగా తెలియదు అని భావం.

శ్రుత్యైవేతి :- మరొక విషయ మేమనగా రథాదులు లేవని శ్రుతియే చెప్పుచున్నది. అయితే స్వప్నం జాగ్రదవస్థలో ఏర్పడిన వాసనలచేత నిర్మించబడి జాగరితం వలెనే కనబడుతుంది. స్వప్నం జాగరితదేశం అని శ్రుతి చెప్పడంలో అభిప్రాయం ఇదే. అందువల్ల స్వప్నం మాయామాత్రమేఅని చెప్పడం ఉపపన్నమే. 6.

సంధ్యాధికరణం సమాప్తం

## 2. తదభావాధికరణమ్. సూ. 7-8

### సూ. తదభావో నాడీషు తచ్ఛ్రుతేరాత్మని చ. 3.2.7.

స్వప్నావస్థా పరీక్షితా. సుషుప్తావస్థేదానీం పరీక్ష్యతే. తత్రైతాః సుషుప్తి విషయాః శ్రుతయో భవన్తి. క్వచిచ్ఛ్రూయతే-"తద్యత్రైతత్సుప్తః సమస్తః సంప్రసన్నః స్వప్నం న విజానాత్యాసు తదా నాడీసు తదా సృప్తో భవతి" (ఛా.ఉ.8.6.3) ఇతి. అన్యత్ర తు నాడీరేవానుక్రమ్య శ్రూయతే "తాభిః ప్రత్యవసృప్య పురీతతి శేతే" (బృ.ఉ.2.1.19) ఇతి. తథాన్యత్ర నాడీరేవానుక్రమ్య "తాసు తదా భవతి, యదా సుప్తః స్వప్నం కంచన న పశ్యత్యథాస్మిన్ ప్రాణ ఏవైకధా భవతి" (కౌ.షీ. 4.19) ఇతి. తథాన్యత్ర "సతా సోమ్య తదా సంపన్నో భవతి, స్వమపీతో భవతి" (ఛా. ఉ.6.8.1) ఇతి. తథా "ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో బాహ్యం కించన వేద నాన్తరమ్" (బృ.ఉ.4.3.21) ఇతి చ. తత్ర సంశయః-కిమేతాని నాడ్యాదీని పరస్పరనిరపేక్షాణి భిన్నాని సుషుప్తిస్థానాన్యాహోస్విత్పరస్పరాపేక్షయైకం సుషుప్తిస్థానమితి. కిం తావత్ప్రాప్తమ్? భిన్నానీతి. కుతః? ఏకార్థత్వాత్. న హ్యేకార్థానాం క్వచిత్పర స్పరాపేక్షత్వం దృశ్యతే వ్రీహియవాదీనామ్. నాడ్యాదీనాం చైకార్థతా సుషుప్తౌ దృశ్యతే-"నాడీషు సుప్తో భవతి" (ఛా.ఉ.8.6.3) "పురీతతి శేతే" (బృ.ఉ.2.1.19) ఇతి చ తత్ర తత్ర సప్తమీనిర్దేశస్య తుల్యత్వాత్. నను నైవం సతి సప్తమీనిర్దేశో దృశ్యతే -"సతా సోమ్య తదా సంపన్నో భవతి" (ఛా.ఉ.6.8.1) ఇతి. నైష దోషః తత్రాపి సప్తమ్యర్థస్య గమ్యమానత్వాత్. వాక్యశేషే హి తత్రాయతనైషీ జీవః స దుపసర్పతీత్యాహ. "అన్యత్రాయతనమలబ్ధ్వా ప్రాణమేవాభిశ్రయతే"(ఛా.ఉ.6.8.2) ఇతి ప్రాణశబ్దేన చ తత్ర ప్రకృతస్య సత ఉపాదానాత్. ఆయతనం చ సప్తమ్యర్థః. సప్తమీనిర్దేశోఽపి తత్ర వాక్యశేషే దృశ్యతే "సతి సంపద్య న విదుః సతి సంపద్యామహే"(ఛా.ఉ.6.9.1) ఇతి. సర్వత్ర చ విశేషవిజ్ఞానోపరమలక్షణం సుషుప్తం న విశిష్యతే. తస్మాదేకార్థత్వాన్నాడ్యాదీనాం వికల్పేన కదాచిత్ కించిత్ స్థానం స్వాపాయోపసర్పతీతి.

బాలానందిని

**తదభావ ఇతి**:-"తదభావః=సుషుప్తి, నాడీషు=నాడులయందుగా, ఆత్మని చ=ఆత్మయందూ కూడ. తచ్ఛ్రుతేః=అది (అట్లు)వినబడుటవలన" అని సూత్రార్థం.

**సప్నేతి**:- స్వప్నావస్థ పరీక్షించబడింది. ఇప్పుడు సుషుప్తావస్థ పరీక్షించబడుచున్నది. సుషుప్తికి సంబంధించిన ఈ శ్రుతు లున్నాయి. ఒక చోట "తద్యత్ర....భవతి" అని వినబడుచున్నది. మరొకచోట నాడులనే ఉపక్రమించి "తాభిః...శేతే" (అనాడుల ద్వారా వెళ్లి పురీతత్ అనే నాడిలో శయనిస్తాడు) అని చెప్పబడినది. అట్లే మరొక చోట కూడ నాడులనే ఉపక్రమించి "తాసు...భవతి" (నిద్రపోయినవాడు ఎప్పుడు స్వప్న మేదీ చూడదో అప్పుడు ఈ ప్రాణమునందే అనగా బ్రహ్మయందే ఏకత్వాన్ని పొందుతాడు)అని చెప్పబడింది. అట్లే మరొక చోట "సతా...భవతి" అనీ, "ప్రాజ్ఞేన .....నాన్తరమ్" అని చెప్పబడింది. అక్కడ-ఈ నాడ్యాదు లన్నీ పరస్పరనిరపేక్షాలైన (స్వతంత్రాలైన) వేరు వేరు సుషుప్తిస్థానాలా లేక పరస్పరాపేక్షచేత ఒక్కటే సుషుప్తిస్థానమా అని సంశయం. ఏమి ప్రాప్తించింది? వేరు వేరు స్థానాలని. ఎందువల్ల? ఒకే ప్రయోజనం కలవి అవడంవల్ల. (పురోడాశానికి ఉపయోగించడం అనే) ఒకే ప్రయోజనం గల వ్రీహి-యవాదులు పరస్పరసాపేక్షాలుగా కనబడడం లేదు కదా? అనగా పురోడాశం వ్రీహులతో నైనా చెయ్యాలి లేదా యవలతోనైనా చెయ్యాలి. అట్లే ఇక్కడ కూడ "నాడీషు సృప్తో భవతి, పురీతతి శేతే" అని అక్కడక్కడ సప్తమీనిర్దేశం సమంగానే కనబడడంవల్ల, సుషుప్తివిషయంలో నాడ్యాదులకు ఒకే ప్రయోజనం కనబడుచున్నది. అనగా వేటి కవి సుషుప్తి స్థానాలుగా చెప్పినట్లుగా కనబడుచున్నది. (ప్రశ్న). సత్ విషయంలో ఈ విధంగా సప్తమీనిర్దేశం లేదు కదా? "సతా....భవతి" అని తృతీయానిర్దేశమే ఉన్నది. ఈ దోషం లేదు. అక్కడ కూడ సప్తమ్యర్థం గమ్యం అవుతున్నది కదా? అక్కడ స్థానాన్ని కోరుతూ జీవుడు సత్తును చేరుతున్నాడు అని "అన్యత్రాయతనమలబ్ధ్వా ప్రాణమేవాశ్రయతే" అని వాక్యశేషంలో చెప్పబడింది. ఇక్కడ ప్రాణశబ్దంచేత ప్రకృతమైన సత్ గ్రహించబడుతుంది. ఆయతనం (అధికరణం) సప్తమికి అర్థం. అనగా ప్రాణాన్ని ఆయతనంగా చేరుతున్నాడు, అనగా ప్రాణంలో, సత్తులో చేరుతున్నాడు, అనే అర్థం. అక్కడనే వాక్యశేషంలో "సతి.....సంపద్యామహే" అని కనబడుచున్నది. విశిష్టమైన జ్ఞానం శాంతించడం అనే లక్షణం గల సుషుప్తం అన్నింటిలోను సమంగానే ఉన్నది. అందుచేత నాడ్యాదు

లన్నింటికీ ప్రయోజనం ఒకటే గాన జీవుడు స్వాపం (సుషుప్తి)కొరకు వికల్పంగా ఒకప్పుడొక స్థానాన్నీ, మరొకప్పుడు మరొకస్థానాన్ని చేరుతాడు.

వి. బాహ్యాలైన చక్షురాదీంద్రియా లన్నీ ఉపరమించినప్పుడు మనోవాసనలచేత అవిద్య ఉద్దీపితమై స్వప్నాలను చూపిస్తుంది. ఆ స్వప్నాలను చూచేవాడు స్వయంజ్యోతిః స్వరూపుడైన జీవుడే. స్వప్నావస్థలో మనస్సు మాత్రం పని చేస్తూంటుంది. మనస్సు కూడ లీనమైనప్పుడు అది సుషుప్తి. మనస్సు పనిచేసే స్వప్నానికీ, మనస్సు కూడ లీనమయే సుషుప్తికీ ప్రతియోగ్యనుయోగిభావసంబంధం. ఈ సంబంధంచేత స్వప్నాన్ని వర్ణించిన అధికరణం తరవాత సుషుప్తిని వర్ణించే అధికరణం చెప్పబడుతున్నది. పూర్వపక్షంలో ఒక స్థానం అని నిర్ణయం లేకపోవడం చేత జీవబ్రహ్మైక్యానిర్ణయం ఫలం. సిద్ధాంతంలో నాడుల ద్వారా పురీతత్తు చేరి హృదయంలో బ్రహ్మయందే శయనిస్తా డని చెప్పడంచేత జీవబ్రహ్మైక్యనిర్ణయం ఫలం.

భాష్యమ్

ఏవం ప్రాప్తే ప్రతిపాద్యతే-తదభావో నాడీష్వాత్మని చేతి. తదభావః ఇతి తస్య ప్రకృతస్య స్వప్నదర్శనస్యాభావః సుషుప్తమిత్యర్థః. నాడీష్వాత్మని చేతి సముచ్చయేనైతాని నాడ్యాదీని స్వాపాయోపైతి న వికల్పేనేత్యర్థః. కుతః? తచ్ఛ్రుతేః. తథాహి-సర్వేషామేవ నాడ్యాదీనాం తత్ర తత్ర సుషుప్తస్థానత్వం శ్రూయతే. తచ్చ సముచ్చయే సంగృహీతం భవతి, వి కల్పే హ్యేషాం పక్షే బాధః స్యాత్. నన్వేకార్థత్వాద్వికల్పో నాడ్యాదీనాం వ్రీహియవాదివదిత్యుక్తమ్? నేత్యుచ్యతే. న హ్యేకవిభక్తినిర్దేశమాత్రేణైకార్థత్వం వికల్పశ్చాపతతి. నానార్థత్వ సముచ్చయయోరప్యేకవిభక్తినిర్దేశదర్శనాత్, ప్రాసాదే శేతే, పర్యఙ్కే శేతే ఇత్యేవమాదిషు. తథేహాపి నాడీషు పురీతతి, బ్రహ్మణి చ స్వపితీత్యేతదుపపద్యతే సముచ్చయః. తథా చ శ్రుతిః-"తా సు తదా భవతి సుప్తః స్వప్నం న కంచన పశ్యత్యథాస్మిన్ప్రాణ ఏవైకధా భవతి" (కౌషీ. 4-19) ఇతి సముచ్చయం నాడీనాం ప్రాణస్య చ సుషుప్తౌ శ్రావయతి. ఏకవాక్యోపాదానాత్. ప్రాణస్య చ బ్రహ్మత్వం

సమధిగతమ్. "ప్రాణస్తథానుగమాత్" (బ్ర.సూ.1.1.28) ఇత్యత్ర. యత్రాపి నిరపేక్షా ఇవ నాడీః సుప్తిస్థానత్వేన శ్రావయతి- "ఆసు తదా నాడీషు సుప్తో భవతి" (ఛా.ఉ.8.6.3) ఇతి తత్రాపి ప్రదేశాన్తరప్రసిద్ధస్య బ్రహ్మణో౽ప్రతిషేధాన్నాడీద్వారేణ బ్రహ్మణ్యేవావతిష్ఠత ఇతి ప్రతీయతే. న చైవమపి నాడీషు సప్తమీ విరుధ్యతే. నాడీద్వారాపి బ్రహ్మోపసర్పన్ సుప్త ఏవ నాడీషు భవతి. యో హి గఙ్గయా సాగరం గచ్ఛతి గత ఏవ స గఙ్గాయాం భవతి.

బాలానందిని

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా ప్రతిపాదించబడుచున్నది. తదభావః అనగా ప్రకృతమైన స్వప్నదర్శనంయొక్క అభావం, సుషుప్తం అని అర్థం. నాడులలోను, ఆత్మయందూ కూడ అని సముచ్చయంచేత స్వాపంకొరకు ఈ నాడ్యాదు లన్నింటినీ పొందుతాడు. వికల్పంచేత కాదు అని అర్థం. ఎందువల్ల? అట్లు వినడంవల్ల. అదెట్లనగా సమస్తమైన నాడ్యాదులు అక్క డక్కడ సుషుప్తిస్థాన మని వినబడుచున్నది. అది సముచ్చయంలో సంగ్రహించబడుతుంది; వికల్పం అయిన ట్లయితే ఒక పక్షంలో వాటికి బాధ కలుగుతుంది (అనగా నాడ్యాదులు సుషుప్తిస్థానాలని చెప్పి నప్పుడు వాటిలో అన్నింటిలోనూ సంబంధం ఉన్నట్లు చెప్పాలంటే సముచ్చయమే గ్రహించాలి. అప్పుడు అన్నింటికీ సుషుప్తిస్థానత్వం కుదురుతుంది. అట్లు కాక వికల్పం అని చెప్పినట్లయితే కొన్నింటికి స్థానత్వం లేకుండా పోతుంది అని భావం). (ప్రశ్న) వ్రీహియవాదులవలె ఒకే ప్రయోజనం కలవి అవడంచేత నాడ్యాదులకు వికల్ప మని చెప్పబడింది కదా? (సమాధానం) అది కాదంటాం. ఒకే విభక్తిలో నిర్దేశించినంతమాత్రంచేత అవన్నీ ఒకే ప్రయోజనం కలవై ఉంటాయనీ, వికల్పమనీ రాదు కదా?. నానార్థత్వం (వేరు వేరు ప్రయోజనా లుండడం)సముచ్చయం వీటిలో కూడ ఏకవిభక్తిప్రయోగం-ప్రాసాదంలో పండుకొంటున్నాడు, పరుపుమీద పండుకొన్నాడు ఇత్యాదులలో కనబడుచున్నది. ఇక్కడ సముచ్చయం ఉంది, అయినా నానార్థత్వం కూడ (మేడలో పరుపుమీద అని) ఉన్నది. అట్లే ఇక్కడ కూడ నాడులలోను, పురీతత్తులోను, బ్రహ్మయందు కూడ నిద్రిస్తున్నాడు అని సముచ్చయం కుదురుతుంది. ఆ విధంగానే "తాసు....భవతి" అను శ్రుతి నాడులను

ప్రాణాన్నీ ఒకే వాక్యంలో చెప్పడంద్వారా సుషుప్తిలో ఆరెండింటికీ కూడ సముచ్చయాన్ని చెప్పుచున్నది. "ప్రాణస్తథాధిగమాత్" అనే సూత్రాన్ని అనుసరించి ప్రాణం అనగా బ్రహ్మ అని నిర్ణయించబడింది. "ఆసు తదా నాడీషు సృప్తో భవతి" ఇత్యాదివాక్యాలలో ఎక్కడ ఇతరాపేక్ష లేని (స్వతంత్రమైన) నాడులనే సుప్తిస్థానంగా చెపుతాడో అక్కడ కూడ ఇతరప్రదేశాలలో చెప్పబడిన బ్రహ్మ నిషేధింపబడలేదు గాన నాడీద్వారా బ్రహ్మయందే ఉంటాడు అని తెలుస్తూన్నది. ఇలా చెప్పినా కూడ 'నాడీషు' అని సప్తమికి విరోధం రాదు నాడుల ద్వారా బ్రహ్మను చేరినవాడు కూడ నాడులలో ప్రవేశించినవాడే అవుతతాడు. గంగ ద్వారా సముద్రం పొందిన వాడు కూడ గంగలోనికి వెళ్లినవాడే అవుతాడు కదా?

## భాష్యమ్

అపి చాత్ర రశ్మినాడీద్వారాత్మకస్య బ్రహ్మలోకమార్గస్య వివక్షితత్వా న్నాడీస్తుత్యర్థం సృప్తిసంకీర్తనమ్. "నాడీషు సృప్తో భవతి" (ఛా.ఉ.8.6.3) ఇత్యుక్త్వా "అతస్తం న కశ్చన పాప్మా స్పృశతి" (ఛా.ఉ.8.6.3) ఇతి బ్రువన్నాడీః ప్రశంసతి. బ్రవీతి చ పాప్మస్పర్శాభావే హేతుమ్ "తేజసా హి తదా సంపన్నో భవతి" (ఛాఉ.8.6.3) ఇతి. తేజసా నాడీగతేన పిత్తాఖ్యేనాభివ్యాప్తకరణో న బాహ్యాన్విషయానీక్షత ఇత్యర్థః. అథవా తేజసేతి బ్రహ్మణ ఏవాయం నిర్దేశః; శ్రుత్యన్తరే-"బ్రహ్మైవ తేజ ఏవ" (బృ.ఉ.4.4.7)ఇతి తేజఃశబ్దస్య బ్రహ్మణి ప్రయుక్తత్వాత్. బ్రహ్మణి తదా సంపన్నో భవతి నాడీద్వారేణాతస్తం న కశ్చన పాప్మా స్పృశతీత్యర్థః. బ్రహ్మసంపత్తిశ్చ పాపస్పర్శాభావే హేతుః సమధిగతః- "సర్వే పాప్మానోఽతో నివర్తన్తేఽపహతపాప్మా హ్యేష బ్రహ్మలోకః" (బృ.ఉ.8.4.2) ఇత్యాదిశ్రుతిభ్యః. ఏవం చ సతి ప్రదేశాన్తరప్రసిద్ధేన బ్రహ్మణా సుషుప్తి స్థానేనానుగతః నాడీనాం సముచ్చయః సమధిగతో భవతి. తథా పురీతతోఽపి బ్రహ్మప్రక్రియాయాం సంకీర్తనాత్ తదనుగుణమేవ సుషుప్తిస్థానత్వం విజ్ఞాయతే- "య ఏషోఽన్తర్హృదయ ఆకాశస్తస్మిన్ శేతే" (బృ.ఉ.2.1.17) ఇతి హృదయాకాశే సుప్తిస్థానే ప్రకృతే ఇదముచ్యతే "పురీతతి శేతే" (బృ.ఉ.2.1.19) ఇతి. పురీతదితి

హృదయపరివేష్టనముచ్యతే. తదన్తర్వర్తిన్యపి హృదయాకాశే శయానః శక్యతే పురీతతి శేత ఇతి వక్తుమ్. ప్రాకారపరిక్షిప్తేఽపి హి పురే వర్తమానః ప్రాకారే వర్తత ఇత్యుచ్యతే. హృదయాకాశస్య చ బ్రహ్మత్వం సమధిగతమ్-"దహర ఉత్తరేభ్యః" (బ్ర.సూ.1.3.14) ఇత్యత్ర.

బాలానందిని

**అపి చేతి** :-మరొకవిషయ మేమనగా-ఇకడ్క రశ్మలు, నాడులు అనే బ్రహ్మలోకమార్గం చెప్పడానికి ఉద్దిష్టమైనది గాన ఈ సృష్టికీర్తనం (జీవుని వెళ్లడాన్ని గూర్చి చెప్పడం) నాడులను స్తుతించడంకొరకే. "నాడీషు సృప్తో భవతి" అని చెప్పి "అతస్తం న కశ్చిత్ పాప్మా స్పృశతి" (అందువల్ల వానిని పాపం ఏదీ స్పృశించదు) అని అంటూ నాడులను ప్రశంసించుచున్నాడు. "తేజసా హి తదా సంపన్నో భవతి" (అప్పుడు తేజస్సుతో కూడి ఉంటాడు) అని అంటూ పాపస్పర్శ లేకపోవడానికి హేతువును కూడ చెపుతున్నాడు. తేజసా=నాడులలో ఉన్న పిత్త మనే తేజస్సుచేత, వ్యాప్తమైన ఇంద్రియాలు కలవాడై, బాహ్యవిషయాలను చూడడు అని (ఈ వాక్యానికి) అర్థం. లేదా-తేజసా అనేది బ్రహ్మకే నిర్దేశం. ఎందువల్ల ననగా-"బ్రహ్మైవ తేజ ఏవ" అను మరొక శ్రుతిలో తేజః శబ్దం బ్రహ్మయందు ప్రయోగించబడింది. అప్పుడు నాడుల ద్వారా బ్రహ్మలో చేరి ఉండడంచేత వానిని పాప మేదీ స్పృశించదు అని అర్థం. బ్రహ్మసంపత్తి పాపస్పర్శ లేకపోవడానికి హేతువుగా- "సర్వే...బ్రహ్మలోకః" (వీని నుండి పాపాలన్నీ మరలి పోతాయి; ఈ బ్రహ్మ తొలగించబడిన పాపాలు కలది గదా) ఇత్యాదిశ్రుతులవల్ల తెలుస్తూన్నది. ఈ విధంగా చెప్పిన ట్లయితే ప్రదేశాంతరాలలో (ఇతర శ్రుతులలో) ప్రసిద్ధమైన సుషుప్తిస్థానమైన బ్రహ్మతో నాడుల సముచ్చయం అనుగతంగా ఉన్నట్లు తెలుస్తుంది. అనగా బ్రహ్మ సుషుప్తి స్థాన మనీ, ఆ స్థానానికి చేర్చడం ద్వారా నాడులు సుషుప్తి స్థాన మనీ తెలుస్తూన్నది. అట్లే బ్రహ్మప్రక్రియలో పురీతత్తును కూడ చెప్పడంవల్ల సుప్తిస్థానత్వం దానికి అనుగుణంగానే ఉంటుంది అని తెలుస్తుంది. "య ఏషో...శేతే" అని సుప్తిస్థానమైన హృదయాకాశం ప్రకృతమై ఉండగా (హృదయాకాశాన్ని చెప్పే సందర్భంలో) "పురీతతి శేతే" అని చెప్పబడింది. హృదయాన్ని చుట్టి ఉన్నదానికి (హృదయగతావకాశానికి) "పురీతత్" అని పేరు. దాని లోపల నున్న ఆకాశంలో శయనించినవాడు కూడ

పురీవత్తులో శయనిస్తున్నాడు అని చెప్పడానికి శక్యమవుతుంది. (అనగా నాడుల ద్వారా పురీతత్తును చేరి అక్కడ బ్రహ్మయందు శయనిస్తాడు అని చెప్పినట్లయింది). ప్రాకారంచేత చుట్టబడిన పురంలో ఉన్నవానిని గూర్చి ప్రాకారంలో ఉన్నాడు అని చెప్పవచ్చును కదా? "దహర ఉత్తరేభ్యః" అనే చోట హృదయాకాశం బ్రహ్మ అనే విషయం తెలిసినది.

భాష్యమ్

తథా నాడీపురీతత్సముచ్చయోఽపి-"తాభిః ప్రత్యవసృప్య పురీతతి శేతే" (బృ.ఉ.2.1.19) ఇత్యేకవాక్యోపాదానాదవగమ్యతే. సత్ప్రాజ్ఞయోశ్చ ప్రసిద్ధమేవ బ్రహ్మత్వమ్. ఏవమేతాసు శ్రుతిషు త్రీణ్యేవ సుషుప్తిస్థానాని సంకీర్తితాని నాడ్యః పురీతద్బ్రహ్మ చేతి. తత్రాపి చ ద్వారమాత్రం నాడ్యః పురీతచ్చ. బ్రహ్మైవత్వేకం సుషుప్తిస్థానమ్. అపి చ నాడ్యః పురీతద్వా జీవస్యోపాధ్యాధార ఏవ భవతి తత్రాస్య కరణాని వర్తన్త ఇతి. న హ్యుపాధిమన్తరేణ స్వత ఏవ జీవస్యాధారః కశ్చిత్సంభవతి. బ్రహ్మావ్యతిరేకేణ స్వమహిమప్రతిష్ఠితత్వాత్. బ్రహ్మాధారత్వమప్యస్య సుషుప్తే న హ్యాధారాధేయభేదాభిప్రాయేణోచ్యతే. కథం తర్హి? తాదాత్మ్యాభిప్రాయేణ. యత ఆహ-"సతా సోమ తదా సంపన్నో భవతి, స్వమపీతో భవతి"(ఛా.ఉ.6.8.1)ఇతి. స్వశబ్దేనాత్మాఽభిలప్యతే. స్వరూపమాపన్నః సుషుప్తో భవతీత్యర్థః. అపి చ-న కదాచిజ్జీవస్య బ్రహ్మణా సంపత్తిర్నాస్తి స్వరూపస్యానపాయిత్వాత్, స్వప్నజాగరితయోస్తూపాధిసంపర్కవశాత్పర రూపాపత్తిమివాపేక్ష్య తదుపశమాత్సుషుప్తే స్వరూపాపత్తిర్వివక్ష్యతే. అతశ్చ సుషుప్తావస్థాయాం కదా చిత్సతా సంపద్యతే కదా చిన్న సంపద్యత ఇత్యయుక్తమ్.

బాలానందిని

తథేతి:-"తాభిః...శేతే" (వాటి ద్వారా వెళ్లి పురీతత్తులో శయనిస్తున్నాడు) అని ఒక వాక్యంలో చెప్పడంవల్ల నాడీపురీతత్తుల సముచ్చయం కూడ కనబడుచున్నది. సత్, ప్రాజ్ఞుడూ కూడ బ్రహ్మయే అని ప్రసిద్ధమే. (అనగా సత్ అన్నా ప్రాజ్ఞః అన్నా బ్రహ్మ అనియే అర్థం కాబట్టి "సతా సోమ్య తదా సంపన్నో భవతి","ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తః" అని

ఉండడంచేత జీవుడు నాడీపురీతత్‌బ్రహ్మలతోనే కాకుండా సత్‌తోను, ప్రాజ్ఞునితోను కూడా కలుస్తాడు కదా అని ఆశంకకు అవకాశం లేదని భావం). ఈ విధంగా ఈ శ్రుతులల్లో నాడులు, పురీతత్, బ్రహ్మ అని మూడే సుషుప్తిస్థానాలు చెప్పబడ్డాయి. వాటిలో కూడ నాడులు పురీతత్ కూడా ద్వారాలు మాత్రమే. బ్రహ్మ ఒక్కటే సుషుప్తిస్థానం.

అవ. నాడులైనా పురీతత్తైనా కూడ ఉపాధిసహితుడైన జీవునకే ఆధారంగా అవడం కుదురుతుంది. సుషుప్తిలో జీవుని ఉపాధులు లీనం అయి ఉండడంచేత నిజానికి నాడులు గాని, పురీతత్తు కాని జీవునికి ఆధారం కాజాలవు అని చెపుతున్నాడు-అపి చేతి:- మరొక విషయ మేమనగా-నాడులు గాని, పురీతత్తుగాని జీవుని ఉపాధులకే ఆధారం అవడానికి అవకాశం ఉంటుంది; ఎందువల్ల ననగా వాని సాధనాలు (ఇంద్రియాలు మనస్సు మొదలైనవి) వాటిలో (నాడీపురీతత్తులలో) ఉంటాయి. ఉపాధిసంబంధం లేకపోతే జీవునకు ఏదీ కూడ స్వతః ఆధారం కాజాలదు కదా? ఎందువల్లననగా జీవుడు బ్రహ్మాభిన్నుడవడంచేత తన మహిమలోనే ప్రతిష్ఠితుడై ఉంటాడు; (ఏ ఆధారంమీదా ఆధారపడి ఉండడు). జీవుడు సుషుప్తిలో బ్రహ్మను పొందుతా డనగా అర్థం బ్రహ్మకీ జీవునికీ ఆధారాధేయభావరూపమైన (బ్రహ్మ ఆధారం, జీవుడు ఆధేయం అనే) భేదం ఉన్న దనే అభిప్రాయంచేత చెప్పబడడంలేదు. మరే మనగా తాదాత్మ్యం అనే అభిప్రాయంచేత చెప్పబడుచున్నది. అందుచేతనే-"సతా....భవతి" అని చెప్పబడింది. ఇక్కడ స్వశబ్దంచేత ఆత్మ చెప్పబడుచున్నది. సుషుప్తుడు స్వరూపాన్ని పొందినవా డవుతాడు అని అర్థం. మరొక విషయ మేమనగా-జీవుని స్వస్వరూపం ఏ నాటికీ తొలగిపోయేదికాదు గాన జీవునకు ఎన్నడూ కూడ బ్రహ్మతో సంపత్తి లేకపోవడం అనేది లేదు. స్వప్నజాగరితావస్థలలో నైతే జీవునకు ఉపాధిసంపర్కం ఉండడంవల్ల అతడు మరొక రూపాన్ని పొందిన ట్లవడాన్ని పట్టి ఆ రెండవస్థలూ ఉపశమించడంచేత సుషుప్తిలో స్వరూపప్రాప్తి వచ్చినట్లు చెప్పబడుచున్నది. అందువల్ల కూడ సుషుప్తావస్థలో ఒకప్పుడు సత్‌తో సంబంధించి ఉంటాడు ఒకప్పుడు ఉండడు అనడం అయుక్తం.

## భాష్యమ్

అపి చ స్థానవికల్పాభ్యుపగమేఽపి విశేషవిజ్ఞానోపశమలక్షణం సుషుప్తం న క్వచిద్విశిష్యతే, తత్ర సతి సంపన్నస్తావదేకత్వాన్న విజానాతీతి యుక్తమ్.

"తత్కేన కం విజానీయాత్" ఇది శ్రుతేః. నాడీషు పురీతతి చ శయానస్య న కించిదవిజ్ఞానే కారణం శక్యం విజ్ఞాతుం, భేదవిషయత్వాత్. "యత్ర వాన్యదివ స్యాత్తత్రాన్యోఽన్యత్ పశ్యేత్" (బృ.ఉ.4.3.31) ఇతి శ్రుతేః. నను భేదవిషయస్యాప్యతిదూరాది కారణమవిజ్ఞానే స్యాత్? బాఢమ్; ఏవం స్యాద్యది జీవః పరిచ్ఛిన్నోఽభ్యుపగమ్యేత; యథా విష్ణుగుప్తః ప్రవాసే స్వగృహం న పశ్యతీతి-న తు జీవస్యోపాధివ్యతిరేకేణ పరిచ్ఛేదో విద్యతే. ఉపాధిగతమేవాతిదూరాది కారణమవిజ్ఞాన ఇతి యద్యుచ్యేత తథాప్యుపాధేరుపశాన్తత్వాత్సత్యేవ సంపన్నో న విజానాతీతి యుక్తమ్. న చ వయమిహ తుల్యవన్నాడ్యాది సముచ్చయం ప్రతిపాదయామః. న హి నాడ్యః సుప్తిస్థానం పురీతచ్చేత్యనేన విజ్ఞానేన కిం చిత్ప్రయోజనమస్తి. న హ్యేతద్విజ్ఞానప్రతిబద్ధం కించిత్ఫలం శ్రూయతే. నాప్యేతద్విజ్ఞానం ఫలవతః కస్య చిదఙ్గముపదిశ్యతే. బ్రహ్మ త్వనపాయి సుప్తిస్థానమిత్యేతత్ప్రతిపాదయామః. తేన తు విజ్ఞానేన ప్రయోజనమస్తి, జీవస్య బ్రహ్మాత్మత్వావధారణం, స్వప్నజాగరితవిముక్తత్వావధారణం చ. తస్మాదాత్మైవ తు సుప్తిస్థానమ్. 7

బాలానందిని

**అపి చేతి:-** మరొక విషయ మేమనగా-స్థానవికల్పం అంగీకరించినా కూడ అనగా ఒకప్పుడు నాడులలో ప్రవేశించి సుషుప్తుడౌతాడు. మరొకసారి పురీతత్తులో ప్రవేశించి సుషుప్త డౌతాడు, మరొకసారి సత్తులో అని అంగీకరించినా కూడ విశేషవిజ్ఞానం ఏదీ లేకుండా ఉండడం అనే సుషుప్తంలో (అది ఈ మూడు స్థానాలలో ఎక్కడ జరిగినాకూడ) విశేషం ఏదీ లేదు, అంలాంటప్పుడు సత్తులో సంపన్నుడై దానితో ఐక్యం పొందడంవల్ల ఏమీ తెలుసుకొనడం లేదు అని చెప్పడం యుక్తంగా ఉంటుంది. "తత్కేన కం విజానీయాత్" (అక్కడ దేనిని దేనిచేత తెలుసుకొనకలుగుతాడు)అని శ్రుతి చెపుచున్నది కదా? నాడులలోను, పురీతత్తులోను శయనించినప్పుడు మాత్రం భేదం ఉండడంవల్ల జ్ఞానం లేకుండా ఉండడానికి కారణం ఏదీ లేదు. "యత్ర...పశ్యేత్" (ఎప్పుడైతే మరొకటి

ఉన్నట్లుంటుందో అప్పుడు ఒకడు మరొకదానిని చూస్తాడు) అని శ్రుతి చెప్పుచున్నది కదా? (ఆశంక)నాడ్యాదులలో ఉన్నప్పుడు జీవునకు భేదం ఉన్నాకూడ చాల దూరంగా ఉండడం మొదలైనది తెలియకపోవడానికి కారణం కావచ్చును కదా? (సమాధానం) జీవుడు స్వతః పరిచ్ఛిన్నుడు అని అంగీకరిస్తే ప్రవాసంలో ఉన్న విష్ణుమిత్రుడు తన ఇల్లు చూడజాలనట్లు నిజంగా నువ్వు చెప్పినట్లే అయేది. ఉపాధి లేకపోతే జీవునకు పరిచ్ఛేదమే లేదు. ఉపాధికి సంబంధించిన అతిదూరత్వాదికమే తెలియకపోవడానికి కారణం అన్నట్లయితే అలా అయినా కూడ (అలా చెప్పడంకంటె) సత్తుతో సంపన్నుడై, ఉపాధి శాంతించడంచేతనే తెలుసుకొనడం లేదు అని చెప్పడమే యుక్తం. ఇక్కడ మేం నాడ్యాది సముచ్చయం తుల్యంగానే ఉంది, అనగా నాడులలోను, పురీతత్తులోను కూడ సమంగానే సుషుప్తు డౌతాడు, అని ప్రతిపాదించడంలేదు. నాడులు, పురీతత్తు సుషిప్తిస్థానాలు అని తెలుసుకొనడంచేత ప్రయోజనం ఏదీ లేదు కదా? దీని జ్ఞానానికి సంబంధించిన ఫలం ఏదీ వినబడడం లేదు కదా? దీని విజ్ఞానం ఫలం గల మరొకదానికి దేనికీ అంగం గా కూడ ఉపదేశించబడడంలేదు కదా. (ఈ విజ్ఞానానికే ఏదో ఫలం ఉందని చెప్పినా, ప్రత్యక్షంగా దీనికి ఫలం లేకపోయినా ఫలం ఉన్న మరొకదానికి అంగం అని చెప్పినా దీనికి సార్థకత్వం ఉండేది. అది లేదు అని భావం). అయితే - బ్రహ్మయే, అనపాయియైన, (ఏ నాటికీ మారని)సుషుప్తిస్థానం అని ప్రతిపాదిస్తున్నాం. ఈ విజ్ఞానంచేత నైతే-జీవుడు బ్రహ్మస్వరూపుడు అని నిర్ధారణ చేయడం, స్వప్న-జాగరితాల వ్యవహారంనుండి ఇతడు విముక్తుడు (వాస్తవంలో జీవునకు స్వప్న జాగరితాల వ్యవహారంతో సంబంధం లేదు) అని నిర్ధారణ చేయడం అనే ప్రయోజనం ఉంది. అందువల్ల సుషుప్తిస్థానం ఆత్మయే. 7.

### సూ. అతః ప్రబోధోఽస్మాత్. 3.2.8

యస్మాచ్చాత్మైవ సుషుప్తి స్థానమత ఏవ చ కారణాన్నిత్యవదేవాస్మాదాత్మనః ప్రబోధః స్వాపాధికారే శిష్యతే-"కుత ఏతదాగాత్" (బృ.ఉ.2-1.16)ఇత్యస్య ప్రశ్నస్య ప్రతివచనావసరే "యథాగ్నేః క్షుద్రాః విస్ఫులిఙ్గాః వ్యుచ్చరన్త్యేవమేవైతస్మా దాత్మనః సర్వే ప్రాణాః" (బృ.ఉ.2.1.20) ఇత్యాదినా. "సత ఆగమ్య న విదుః సత

అగచ్ఛామహే" (ఛా.ఉ.6.10-2) ఇతి చ. వికల్ప్యమానేషు తు సుషుప్తిస్థానేషు కదాచిన్నాడీభ్యః ప్రతిబుధ్యతే, కదాచిత్పురీతతః, కదాచిదాత్మన ఇత్యశాసిష్యత్. తస్మాదప్యాత్మైవ సుప్తిస్థానమితి. 8.

బాలానందిని

అతఇతి :- "అతః=అందువలలనే, అస్మాత్=అత్మనుండి, ప్రబోధః=మేల్కొనుట చెప్పబడుచున్నది" అని సూత్రార్థం.

యస్మాదితి:- ఆత్మయే సుప్తిస్థానం అనే కారణంవల్లనే, ప్రబోధం తప్పని సరిగా ఈ అత్మనుండియే జరుగుతున్నట్లు స్వాపాధికారంలో (స్వాపాన్ని గూర్చిన ప్రసంగంలో) "కుత ఏత దాగాత్" (ఇది ఎక్కడినుండి వచ్చినది) అనే ప్రశ్నకు సమాధానం చెప్పే సందర్భంలో-"యథా...ప్రాణాః" ఇత్యాదికంచేత చెప్పబడుచున్నది. "సత...అగచ్ఛామహే" అని కూడ చెప్పబడింది. సుషుప్తిస్థానాల విషయంలో వికల్పం ఉండే పక్షంలో-ఒకప్పుడు నాడులనుండి మేల్కొంటాడు, ఒకప్పుడు పురీతత్తునుండి మేల్కొంటాడు, ఒకప్పుడు ఆత్మనుండి మేల్కొంటాడు అని చెప్పి ఉండేది. ఆ కారణంవల్ల కూడ సుప్తిస్థానం ఆత్మయే. 8.

తదభావాధికరణం సమాప్తం

3. కర్మానుస్మృతిశబ్దవిధ్యధికరణమ్. సూ.9.

సూ. స ఏవ తు కర్మానుస్మృతిశబ్దవిధిభ్యః. 3.2.9

తస్యాః పునః సత్సంపత్తేః ప్రతిబోధమానః కిం య ఏవ సంత్సంపన్నః స ఏవ ప్రతిబుధ్యతే ఉత స వా అన్యో వేతి చిన్త్యతే. తత్ర ప్రాప్తం తావదనియమ ఇతి. కుతః? యదా హి జలరాశౌ కశ్చిజ్జలబిన్దుః ప్రక్షిప్యతే జలరాశిరేవ స తదా భవతి, పునరుద్ధరణే చ స ఏవ జలబిన్దుర్భవతీతి దుఃసంపాదమ్. తద్వత్సుప్తః పరేణైకత్వమాపన్నః సంప్రసీదతీతి న స ఏవ పునరుత్థాతుమర్హతి, తస్మాత్స ఏవేశ్వరో వాన్యో వా జీవః ప్రతిబుధ్యత ఇతి.

ఏవం ప్రాప్త ఇదమాహ-స ఏవ తు జీవః సుప్తః స్వాస్థ్యం గతః పునరుత్తిష్ఠతి నాన్యః. కస్మాత్? కర్మానుస్మృతిశబ్దవిధిభ్యః. విభజ్య హేతుం దర్శయిష్యామి. కర్మశేషానుష్ఠానదర్శనాత్తావత్స ఏవోత్థాతుమర్హతి నాన్యః. తథా హి పూర్వేద్యురనుష్ఠితస్య కర్మణోఽపరేద్యుః శేషమనుతిష్ఠన్ దృశ్యతే. న చాన్యేన సామి కృతస్య కర్మణోఽన్యః శేషక్రియాయాం ప్రవర్తితుమర్హతి. అతిప్రసఙ్గాత్. తస్మాదేక ఏవ పూర్వేద్యురపరేద్యుశ్చైకస్య కర్మణాతిచిరాధికరణమ్ఋణః కర్తేతి గమ్యతే.

బాలానందిని

స ఏవేతి:- "కర్మానుస్మృతిశబ్దవిధిభ్యః=కర్మస్మరణం, శబ్దం, విధి-వీటివల్ల, స ఏవ తు=సుషుప్తిస్థానాన్ని పొందిన జీవుడే మేల్కొని పైకి వస్తున్నాడు" అని సూత్రార్థం.

తస్యా ఇతి:- ఆ సత్సంపత్తి (సత్తులో కలిసిన స్థితి) నుండి మేల్కొనేవాడు, ఎవడైతే సత్సంపన్నుడైనాడో అతడే మేల్కొంటాడా లేదా అతడు కాని మరొకడు కాని మేల్కొంటాడా-అనగా ఒకప్పుడు అతడు మేల్కొంటాడు, మరొకప్పుడు మరొకడు మేల్కొంటాడు అని చెప్పాలా అని విచారణ చేయబడుచున్నది. నియమం లేదని ప్రాప్తిస్తున్నది. ఎందువల్ల? ఒక జలరాశిలో ఒక జలబిందువును వేసినప్పుడు అది కూడ జలరాశియే అయిపోతుంది. దానిని తిరిగి పైకి తీసినప్పుడు ఆ జలబిందువే వస్తుందని చెప్పడం కష్టం. (దానినే తీయడం శక్యం కాదు). అట్లే నిద్రపోయినవాడు పరమాత్మతో ఏకత్వాన్ని పొంది సంప్రసన్నుడౌతాడు గాన అతడే తిరిగి రావడం శక్యం కాదు. అందువల్ల అతడే కాని, ఈశ్వరుడు కాని, మరొక జీవుడు కాని లేస్తాడు అని ప్రాప్తించింది.

వి. సుషుప్తిలో ఉపాధులు నశించడంవల్ల, కర్మానుస్మృత్యాదులు కనబడడంవల్ల సంశయం. అందుచేత జీవుడు ఈ బ్రహ్మనుండే లేస్తున్నాడు అని చెప్పడంచేత బ్రహ్మయే సుషుప్తిస్థానం అని "అతః ప్రబోధోఽస్మాత్" అని సూత్రంలో చెప్పినది యుక్తం కాదు. బ్రహ్మనుండియే లేచే పక్షంలో సుప్తుడు కాక మరొకడు కూడ లేవడానికి అవకాశం ఉంది అందుచేత సుషుప్తునికి నాడ్యాదిస్థానాలను అంగీకరించడం మంచిది అని ఆక్షేపసంగతిచేత పూర్వపక్షం. పూర్వపక్షం ప్రకారం-సుషుప్తివల్లనే అనావృత్తిరూపమైన మోక్షం సిద్ధిస్తున్నది

గాన జ్ఞానం వ్యర్థం. సిద్ధాంతం ప్రకారం బ్రహ్మస్వరూపజ్ఞానం లేనివాడు సుషుప్తిలో బ్రహ్మాత్మనా ఉన్నా కూడ మళ్ళీ లేస్తాడు. అందుచేత జ్ఞానం అవశ్యకం.

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా ఇది చెప్పుచున్నాడు. నిద్రించిన జీవుడే స్వాస్థ్యమును పొంది (స్వస్వరూపంలో కొంత సేపు ఉండి) మళ్ళీ లేస్తాడు. మరొక డెవడూ లేవడు. ఎందువల్ల? కర్మానుస్మృతిశబ్దవిధులవల్ల. హేతువును విడదీసి చూపుతాను. చేయగా మిగిలిన పనిని చేయడంవల్ల ఆ జీవుడే లేచుటకు తగి ఉన్నాడు కాని అన్యుడు కాడు. అదెట్లనగా-క్రిందటి రోజున చేయగా మిగిలిన పని మరునాడు చేస్తున్నాడు. ఒకడు సగం చేసి విడచిన పనిలో మిగిలినదానిని మరొకడు చేయడానికి ప్రవర్తించడం ఉండదు కదా? అట్లయితే అతిప్రసంగం ఏర్పడుతుంది. అలా అయితే ఎవడు ఏ పని ప్రారంభిస్తాడు ఎవడు పూర్తిచేస్తాడు, ఎలా పూర్తి చేస్తాడు ఇత్యాదివిషయాలలో అనిశ్చితత్వం ఏర్పడుతుంది. అట్లే ఒక యాగం ప్రారంభించినది ఒకడు, పూర్తి చేసినది మరికొందరు అయితే యజమానుడు ఎవడో ఋత్విక్కులు ఎవరో నియమం లేకుండా పోతుంది. అందుచేత వెనుకటి రోజున మరుసటి రోజునా కూడ ఒక పనిని ఒకడే చేస్తున్నాడు అని తెలుస్తున్నది.

## భాష్యమ్

ఇతశ్చ స ఏవోత్తిష్ఠతి యత్కారణమతీతేఽహన్యహమదోఽద్రాక్షమితి పూర్వానుభూతస్య పశ్చాత్స్మరణమన్యస్యోత్థానే నోపపద్యమే. న హ్యన్యదృష్ట మన్యోఽనుస్మర్తుమర్హతి. సోఽహమస్మీతి చాత్మానుస్మరణమాత్మాన్తరోత్థానే నావకల్పతే. శబ్దేభ్యశ్చ తస్యైవోత్థానమవగమ్యతే. తథాహి- "పునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి బుద్ధాన్తాయైవ" (బృ.ఉ,4.3.16) "ఇమాః సర్వాః ప్రజాః అహరహర్గచ్ఛన్త్య ఏతం బ్రహ్మలోకం న విన్దన్తి" (ఛా.ఉ.8.3.2) "త ఇహ వ్యాఘ్రో వా సింహో వా వృకో వా వరాహో వా కీటో వా పతఙ్గో వా దంశో వా మశకో వా యద్యద్భవన్తి తత్తదా భవన్తి" (ఛా.ఉ.6.9.3) ఇత్యేవమాదయః శబ్దాః స్వాపప్రబోధాధికారే పఠితా నాత్మాన్తరోత్థానే సామఞ్జస్యమీయుః. కర్మవిద్యా విధిభ్యశ్చైవమేవావగమ్యతే. అన్యథా హి కర్మ విద్యావిధయోఽనర్థకాః స్యుః.

అన్యోత్థానపక్షే హి సుప్తమాత్రో ముచ్యత ఇత్యాపద్యేత. ఏవం చేత్స్యాద్వద కిం కాలాన్తరఫలేన కర్మణా విద్యయా వా కృతం స్యాత్.

బాలానందిని

ఇతశ్చేతి :- ఈ కారణంవల్ల కూడ అతడే లేస్తున్నాడు; ఏ కారణంచేత ననగా నిన్న నేను దానిని చూచి ఉన్నాను అని పూర్వం అనుభవించినదానిని తరవాత స్మరించడం ఇతరుడు లేచి నట్లయితే ఉపపన్నం కాదు. ఒకడు చూచినదానిని మరొకడు స్మరింపజాలడు కదా? అదే విధంగా ఆ వ్యక్తియే నేను అని తనను గూర్చిన స్మరణం కూడ మరొక ఆత్మ లేచిన పక్షంలో కుదరదు. శబ్దాలవల్ల కూడ (శ్రుతులవల్ల కూడ) అతడే లేస్తున్నట్లు తెలుస్తూన్నది. "పునః...బుద్ధాన్తాయైవ" (ప్రతిన్యాయంలోను అనగా ప్రతిసుషుప్తి గమనంలోను, మేల్కొనడానికి, ఆ యా ఇంద్రియాల స్థానాలవైపే మేల్కొనుటకై వస్తాడు) "ఇమాః....విన్దన్తి" (ఈ జీవులందరూ ప్రతిరోజూ ఈ బ్రహ్మలోకాన్ని పొందుతున్నా కూడ (అజ్ఞానం ఉండడంచేత) పూర్తిగా పొందరు) "త ఇహ...భవన్తి" (ఆ జీవులు-పెద్దపులియైనా, సింహమైనా తోడేలైనా, వరాహమైనా, పురుగైనా, మిడతయైనా, కరిచే ఈగయైనా, దోమయైనా, పూర్వం మేల్కొన్నప్పుడు ఏవిగా ఉండేవో అవిగానే మళ్లీ మేల్కొనప్పుడు అవుతాయి) అని నిద్రించడం మేల్కొనడం గూర్చిన ఘట్టంలో చెప్పిన ఈ విధమైన శబ్దాలు (శ్రుతివాక్యాలు)మరొక ఆత్మ లేచే పక్షంలో సమంజసంగా ఉండవు. కర్మవిధులవల్ల, విద్యావిధులవల్లా కూడ ఇట్లే తెలుస్తూన్నది. అట్లు కాని పక్షంలో కర్మవిద్యావిధులు వ్యర్థము లవుతాయి. మరొకడు లేచే పక్షంలో నిద్రిస్తే చాలు ప్రతిఒక్కడూ ముక్తుడైపోతాడని చెప్పవలసి వస్తుంది. ఇలాగైతే కాలాంతరంలో ఫలం ఇచ్చే కర్మ చేతగాని, విద్య చేతగాని ఏమి ప్రయోజనం ఉంటుంది; చెప్పు.

భాష్యమ్

అపి చాన్యోత్థానపక్షే యది తావచ్ఛరీరాన్తరే వ్యవహరమాణో జీవ ఉత్తిష్ఠేత్తత్రత్యవ్యవహారలోపప్రసంగః స్యాత్. అథ తత్ర సుప్త ఉత్తిష్ఠే త్కల్పనానర్థక్యం స్యాత్. యో హి యస్మిన్ శరీరే సుప్తః స తస్మిన్ నోత్తిష్ఠతి. అన్యస్మిన్ శరీరే సుప్తోఽన్యస్మిన్నుత్తిష్ఠతీతి కోఽస్యాం కల్పనాయాం లాభః

స్యాత్? అథ ముక్త ఉత్తిష్ఠేత్ అన్తవాన్ మోక్ష ఆపద్యేత. నివృత్తావిద్యస్య చ పునరుత్థానమనుపపన్నమ్. ఏతేనేశ్వరస్యోత్థానం ప్రత్యుక్తమ్, నిత్యనివృత్తావిద్యాత్వాత్. అకృతాభ్యాగమకృతవిప్రణాశౌ చ దుర్నివారావన్యోత్థానపక్షే స్యాతామ్. తస్మాత్స ఏవోత్తిష్ఠతి నాన్య ఇతి. యత్పునరుక్తం యథా జలరాశౌ ప్రక్షిప్తో జలబిన్దుర్నోద్ధర్తుం శక్యత ఏవం సతి సంపన్నో జీవో నోత్పతితుమర్హతీతి, తత్పరిహ్రియతే. యుక్తం తత్ర వివేక కారణాభావాజ్జలబిన్దోరనుద్ధరణమ్, ఇహ తు విద్యతే వివేకకారణం కర్మ చావిద్యా చేతి వైషమ్యమ్. దృశ్యతే చ దుర్వివేచనయోరప్యస్మజ్జాతీయైః క్షీరోదకయోః సంసృష్టయోర్హంసేన వివేచనమ్.

అపి చ న జీవో నామ కశ్చిత్పరస్మాదన్యో విద్యతే యో జలబిన్దురివ జలరాశేః సతో వివిచ్యేత. సదేవ తూపాధిసంపర్కాజ్జీవ ఇత్యుపచర్యత ఇత్యసకృత్ప్రపఞ్చితమ్. ఏ వం చ సతి యావదేకోపాధిగతా బన్ధానువృత్తిస్తావ దేకజీవవ్యవహారః. ఉపాధ్యన్తరగతాయాం తు బన్ధానువృత్తౌ జీవాన్తరవ్యవహారః. స ఏవాయముపాధిః స్వాపప్రబోధయోర్బీజాఙ్కుర న్యాయేనేత్యతః స ఏవ జీవః ప్రతిబుధ్యత ఇతి యుక్తమ్. 9.

### బాలానందిని

**అపి చేతి:-** మరొక విషయ మేమనగా-మరొకడు లేస్తాడు అనే పక్షంలో ఆ లేచే జీవుడు మరొక శరీరంలో వ్యవహరిస్తూన్న జీవుడైతే ఆ శరీరంలో వ్యవహారం లోపించే ప్రసంగం ఏర్పడుతుంది. అట్లు కాక ఆ శరీరంలో నిద్రిస్తూన్నవాడు లేస్తాడు అని అంటే అలా కల్పించడంలో ప్రయోజనం ఏమీ లేదు. ఏ జీవుడు ఏ శరీరంలో నిద్రిస్తున్నాడో వాడు ఆ శరీరంలో లేవడు, మరొక శరీరంలో నిద్రిస్తున్నవాడు ఈ శరీరంలో లేస్తాడు అని ఈ కల్పనలో ఏమి లాభం ఉంది? అట్లు కాక ముక్తుడు లేస్తాడు అన్నట్లయితే అప్పుడు మోక్షానికి అంతం ఉంటుందని చెప్పినట్లవుతుంది. అవిద్య తొలగిపోయినవాడు మళ్లీ పుట్టడం యుక్తం కాదు. దీనిచేత ఈశ్వరుడే లేస్తాడు అనేది నిరాకరించినట్లే; ఈశ్వరుడు ఎప్పుడూ కూడ అవిద్య లేనివాడు కదా? మరొకడు లేస్తాడు అనే పక్షంలో

అకృతాభ్యాగమకృతవిప్రణాశాలు (వీడు చేయని కర్మల ఫలం వీనికి రావడం, వీడు చేసిన కర్మలఫలం వీడు అనుభవించకపోవడం) కలుగుతాయి. అందువల్ల ఆ సుప్తుడైన జీవుడే లేస్తాడు కాని మరొకడు లేవడు. జలరాశిలో వేసిన జలబిందువు ఏవిధంగా మళ్లీ తిరిగి తీయడానికి శక్యంకాదో అదే విధంగా సత్తునందు సంపన్నుడైన జీవుడు పైకి రాజాలడు అని ఏది చెప్పబడిందో అది పరిహరించబడుతున్నది-అక్కడ విడదీయడానికి తగిన కారణం లేకపోవడంచేత జలబిందువును పైకి తీయడం శక్యం కాకపోవడం యుక్తమే. ఇక్కడైతే కర్మ, అవిద్య అనే వివేకకారణం(విడదీయడానికి కారణం) ఉంది. అందుచేత ఈ రెండింటికీ వైషమ్యం (తేడా) ఉంది. మనవంటివాళ్లు విడదీయలేకపోయినా, కలిసి ఉన్న నీరక్షీరాలను హంస విడదీయడం కనబడుతున్నది గదా?

మరొక విషయ మేమనగా-జలరాశినుండి జలబిందువును విడదీసి నట్లు సత్తునుండి విడదీయడానికి పరమాత్మకంటె భిన్నుడుగా జీవు దనేవాడు లేడు. సత్తే (బ్రహ్మయే) ఉపాధిసంపర్కంవల్ల జీవు డని ఉపచారంచేత చెప్పబడుచున్నాడని అనేకపర్యాయాలు వివరించబడింది. ఇది అసలు విషయమైనప్పుడు-ఇక ఉపాధికి సంబంధించిన బంధానువృత్తి ఎంతవరకు ఉంటుందో అంతవరకు ఒక జీవుడనే వ్యవహారం ఉంటుంది. బంధానువృత్తి మరొక ఉపాధిలో ఉంటే అప్పుడు మరొక జీవుడు అని వ్యవహారం ఉంటుంది. స్వాపంలోనైనా ప్రబోధంలోనైనా బీజాంకురన్యాయంచేత అదే ఉపాధి అనువృత్త మౌతూ ఉంటుంది గాన ఆ జీవుడే మేల్కొంటాడని చెప్పడం యుక్తం. 9

కర్మానుస్మృతిశబ్దవిధ్యధికరణం సమాప్తం

## 4. ముగ్ధేఽర్ధసంపత్త్యధికరణమ్. సూ.10

## సూ. ముగ్ధేఽర్ధసంపత్తిః పరిశేషాత్. 3.2.10.

అస్తి ముగ్ధో నామ యం మూర్ఛిత ఇతి లౌకికాః కథయన్తి. స తు కివస్థ ఇతి పరీక్షాయాముచ్యతే-తిస్రస్తావదవస్థాః శరీరస్థస్య జీవస్య ప్రసిద్ధాః-జాగరితం స్వప్నః, సుషుప్తమితి. చతుర్థీ శరీరాదపసృతిః. న తు పఞ్చమీ కాచిదవస్థా జీవస్య శ్రుతౌ స్మృతౌ వా ప్రసిద్ధాస్తి. తస్మాచ్చతసృణామేవావస్థానామన్యతమావస్థా మూర్ఛేతి.

ఏవం ప్రాప్తే బ్రూమః-న తావన్ముగ్ధో జాగరితావస్థో భవితుమర్హతి. న హ్యయమిన్ద్రియైర్విషయానీక్షతే. స్యాదేతత్; ఇషుకారన్యాయేన ముగ్ధో భవిష్యతి ఇషుకారో జాగ్రదపీష్వాసక్తమనస్తయా నాన్యాన్విషయానీక్షతే ఏవం ముగ్ధో ముసలసంపాతాదిజనితదుఃఖానుభవవ్యగ్రమనస్తయా జాగ్రదపి నాన్యాన్విషయానీక్షత ఇతి. న. అచేతయమానత్వాత్. ఇషుకారో హి వ్యాపృతమనాః బ్రవీతీషుమేవాహమేతావన్తం కాలముపలభమానోఽభూవమితి. ముగ్ధస్తు లబ్ధసంజ్ఞో బ్రవీత్యన్ధే తమస్యేతావన్తం కాలం ప్రక్షిప్తోఽభూవం, న కించిన్మయా చేతితమితి. జాగ్రతశ్చైకవిషయవిషక్తచేతసోఽపి దేహో విధ్రియతే, ముగ్ధస్య తు దేహో ధరణ్యాం పతతి. తస్మాన్న జాగర్తి. నాపి స్వప్నాన్ పశ్యతి నిఃసంజ్ఞకత్వాత్. నాపి మృతః, ప్రాణోష్మణోర్భావాత్. ముగ్ధే హి జన్తౌ మృతోఽయం స్యాన్న వా మృత ఇతి సంశయానా ఊష్మాస్తి నాస్తీతి హృదయమాలభన్తే నిశ్చయార్థం. ప్రాణోఽస్తి నాస్తీతి చ నాసికాదేశమ్. యది ప్రాణోష్మణోరస్తిత్వం నావగచ్ఛన్తి తతో మృతోఽయమిత్యవసాయ దహనాయారణ్యం నయన్తి. అథ తు ప్రాణమూష్మాణం వా ప్రతిపద్యన్తే తతో నాయం మృత ఇత్యధ్యవసాయ సంజ్ఞాలాభాయ భిషజ్యన్తి. పునరుత్థానాచ్చ న దిష్టం గతః. న హి యమరాష్ట్రాత్ప్రత్యాగచ్ఛతి.

బాలానందిని

ముగ్ధే ఇతి:- "పరిశేషాత్=పరిశేషన్యాయంచేత, జాగ్రదవస్థ. స్వప్నావస్థా కూడ కాదు గాన, ముగ్ధే=ముగ్ధునియందు (ముగ్ధావస్థలో), అర్ధసంపత్తిః=సగం సత్సంపత్తి ఉంటుంది" అని సూత్రార్థం.

అస్తీతి :- ముగ్ధుడనేవా డొకడున్నాడు; వానినే లౌకికులు మూర్ఛితు డని అంటారు. వాని అవస్థ ఏది అని పరీక్షలో ఇట్లు చెప్పబడుచున్నది. శరీరంలో ఉన్న జీవునికి జాగరితం, స్వప్నం, సుషుప్తి అని మూడు అవస్థ లుంటాయి. శరీరంనుంచి లేచి పోవడం నాల్గవ అవస్థ. అంతే కాని జీవునికి ఐదవ అవస్థ ఉన్నట్లు శ్రుతిలో కాని స్మృతిలో కాని ప్రసిద్ధంగా లేదు. అందుచేత మూర్ఛ ఈ నాల్గు అవస్థలలోనే ఏదో ఒకటి అయి ఉంటుంది.

వి. సుషుప్తిలో ఉన్నవానికి విశేషజ్ఞానం ఏదీ లేనట్లే ముగ్ధునికి కూడ విశేషజ్ఞానం ఏదీ ఉండదు. సుషుప్తినుండి వేచినవానికి ఆ నిద్రించినవాడను నేనే అని ప్రత్యభిజ్ఞ ఉన్నట్లు వీనికి కూడ ఉంటుంది. అందుచేత మూర్ఛ సుషుప్తియే అని దృష్టాంతసంగతిచేత పూర్వపక్షం.

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాం. ముగ్ధుడు జాగరితావస్థలో ఉన్నవాడు కావడానికి వీలులేదు. అతడు ఇద్రియాలతో విషయాలను చూడడం లేదు కదా? అదీ సరే!(పూర్వ పక్షి- ఇది ఇలా కావచ్చుకదా-) ముగ్ధుడు ఇషుకారన్యాయంతో (బాణాలు తయారుచేసేవాని పోలికలో) ఉంటాడు. ఇషుకారుడు మేల్కొని ఉన్నా కూడ, బాణాలమీద ఏకాగ్రం చేయబడిన మనస్సు కలవాడవడంచేత ఇతరవిషయాలను వేటినీ ఏవిధంగా చూడడో అట్లే ముగ్ధుడు రోకలి మొదలైనది (తలమీద) పడడంచేత కలిగిన దుఃఖాన్ని అనుభవించడంలో వ్యగ్రుడవడంచేత మేల్కొని ఉన్నా కూడ ఇతర విషయాలను చూడడు. ఇది యుక్తం కాదు. ముగ్ధుడు స్పృహలో ఉండడు కదా. బాణం చేయడంలో తన్మయమైన మనస్సుగల ఇషుకారుడు ఇంత సేపూ నా మనస్సు బాణంమీదనే ఉంది అని అంటాడు. తిరిగి స్పృహ వచ్చిన ముగ్ధుడైతే ఇంతసేపూ కూడ నేను అంధతమస్సులో పడి ఉన్నాను. నాకేమీ తెలియలేదు అని అంటాడు. ఒకే విషయంమీద ఆసక్తచిత్తుడైనా కూడ మేల్కొని ఉన్నవాని దేహం నిలబడుతుంది. ముగ్ధుని దేహమైతే నేలమీద పడిపోతుంది. అందుచేత ముగ్ధుడు సంజ్ఞలేనివాడై మేల్కొని ఉండడు, స్వప్నాలూ చూడడు. మరణించనూ మరణించడు, ఎందువల్ల ననగా వీనిలో ప్రాణాలూ వేడీ కూడ ఉంటాయి. ఒక మనిషి ముగ్ధుడైనప్పుడు ఈతడు మరిణించాడా లేదా అని సందేహిస్తున్న (ప్రక్కనున్న) వాళ్లు వేడి ఉందా లేదా అని నిశ్చయం కోసం హృదయప్రదేశాన్ని స్పృశిస్తారు. ప్రాణం ఉందా లేదా అని ముక్కు దగ్గర స్పృశిస్తారు. ప్రాణాలు, వేడీ కూడ లేవని తెలిస్తే అప్పుడు ఇతడు మరిణించినాడు అని నిర్ధారణ చేసికొని దహనం చేయడంకోసం అరణ్యానికి తీసికొనిపోతారు. అట్లు కాక ప్రాణమూ, వేడీ ఉన్నట్లు కనబడితే ఇతడు మరణించలేదు అని నిర్ధారణ చేసికొని వానికి స్పృహ రావడం కోసం చికిత్స చేస్తారు. అతడు మళ్లీ లేస్తే అతడు మరణించ నట్లే. యమలోకంనుండి తిరిగి రాడు కదా?

## భాష్యమ్

అస్తు తర్హి సుషుప్తో నిఃసంజ్ఞత్వాదమృతత్వాచ్చ. న. వైలక్షణ్యాత్. ముగ్ధః కదా చిచ్చిరమపి నోచ్ఛ్వసితి. సవేపథురస్య దేహో భవతి, భయానకం చ వదనమ్. విస్ఫారితే నేత్రే. సుషుప్తస్తు ప్రసన్నవదనస్తుల్యకాలం పునః పునరుచ్ఛ్వసితి, నిమీలితే చాస్య నేత్రే భవతః, న చాస్య దేహో వేపతే. పాణిపేషణమాత్రేణ చ సుషుప్తముత్థాపయన్తి న తు ముగ్ధం ముద్గరఘాతేనాపి. నిమిత్తభేదశ్చ భవతి మోహస్వాపయోః. ముసలసంపాతాది నిమిత్తత్వాన్మోహస్య; శ్రమాదినిమిత్తత్వాచ్చ స్వాపస్య. న చ లోకేఽస్తి ప్రసిద్ధిః ముగ్ధః సుప్త ఇతి. పరిశేషాదర్ధసంపత్తిర్ముగ్ధతేత్యవగచ్ఛామః. నిఃసంజ్ఞత్వాత్సంపన్న ఇతరస్మాచ్చ వైలక్షణ్యాదసంపన్న ఇతి. కథం పునరర్ధసంపత్తిర్ముగ్ధతేతి శక్యతే వక్తుమ్, యావతా సుప్తం ప్రతి తావదుక్తం శ్రుత్యా-"సతా సోమ్య తదా సంపన్నో భవతి" (ఛా.ఉ.6.8.1)ఇతి, "అత్ర స్తేనోఽస్తేనో భవతి" (బృ.ఉ.4.3.12), "నైతం సేతుమహోరాత్రే తరతో న జరా న మృత్యుర్న శోకో న సుకృతం దుష్కృతమ్" (ఛా ఉ. 8.4.1) ఇత్యాది. జీవే హి సుకృతదుష్కృతయోః ప్రాప్తిః సుఖిత్వదుఃఖిత్వప్రత్యయోత్పాదనేన భవతి. న చ సుఖిత్వప్రత్యయో దుఃఖిత్వప్రత్యయో వా సుషుప్తే విద్యతే. ముగ్ధేఽపి తౌ ప్రత్యయౌ నైవ వార్యేతే. తస్మాదుపాధ్యుపశమాత్సుషుప్తవన్ముగ్ధేఽపి కృత్స్నసంపత్తిరేవ భవితుమర్హతి నార్ధసంపత్తిరితి. అత్రోచ్యతే న బ్రూమోఽర్ధ సంపత్తి ర్జీవస్య బ్రహ్మణా భవతీతి; కిం తర్హి; అర్ధేన సుషుప్తపక్షస్య భవతి ముగ్ధత్వమ్, అర్ధేనావస్థాన్తరపక్షస్యేతి బ్రూమః. దర్శితే చ మోహస్య స్వాపేన సామ్యవైషమ్యే. ద్వారం చైతన్మరణస్య. యదాస్య సావశేషం కర్మ భవతి తదా వాఙ్మనసే ప్రత్యాగచ్ఛతః. యదా తు నిరవశేషం కర్మ భవతి తదా ప్రాణోష్మాణావపగచ్ఛతః. తస్మాదర్ధసంపత్తిం బ్రహ్మవిద ఇచ్ఛన్తి. యుత్తూక్తం న పఞ్చమీ కాచిదవస్థా ప్రసిద్ధాస్తీతి; నైష దోషః. కాదాచిత్కీయమవస్థేతి న

ప్రసిద్ధా స్యాత్. ప్రసిద్ధా చైషా లోకాయుర్వేదయోః. అర్ధసంపత్త్యభ్యుపగమాచ్చ న పఞ్చమీ గణ్యత ఇత్యనవద్యమ్. 10.

బాలానందిని

అస్మీతి:- అయితే ముగ్ధుడు, సంజ్ఞ లేనివా డవడంచేత, మరణించకపోవడంచేత సుషుప్తుడు అని అందాం. అది కాదు. ఎందువల్లననగా వైలక్షణ్యం ఉంది. ముగ్ధు డౌకప్పుడు చాలా సేపైనా కూడ సరిగా శ్వాస పీల్చడు. దేహం వణుకుతుంది. ముఖం భయంకరంగా ఉంటుంది. కళ్లు బాగా తెరుచుకొని ఉంటాయి. సుషుప్తుడైతే ప్రసన్నముఖంతో ఉంటాడు, మాటిమాటికి సమానమైన కాలంలో (ఒకే పద్ధతిలో) శ్వాసక్రియ చేస్తాడు; వీని కళ్లు మూసికొని ఉంటాయి; వీని దేహం వణకదు. చేతితో మెల్లిగా నొక్కినంతమాత్రం చేతనే సుషుప్తుణ్ణి లేపగలుగుతారు. ముగ్ధుణ్ణైతే ముద్గరంతో కొట్టి కూడా లేపజాలరు. మోహస్వాపాల నిమిత్తాలలో కూడ భేదం ఉంటుంది. మోహం రోకటి దెబ్బవల్ల కలుగుతుంది. స్వాపం శ్రమాదులవల్ల కలుగుతుంది. లోకంలో ముగ్ధుణ్ణి చూచి నిద్రపోతున్నా డని అనరు. అందుచేత పరిశేషన్యాయంచేత ముగ్ధత అనగా అర్ధసంపత్తి అని తెలుసుకొంటున్నాం-సంజ్ఞ లేకపోవడంచేత సంపన్నుడు, ఇతరములైన వైలక్షణ్యాలచేత అసంపన్నుడు. (ఆక్షేపం) ముగ్ధత్వం అర్ధసంపత్తి అని చెప్పడం ఎలా శక్య మవుతుంది? ఎందుచేత ననగా సుప్తుణ్ణి గూర్చి శ్రుతి-"సతా...భవతి" అని "అత్ర స్తే నోఽస్తేనో భవతి" (ఈ అవస్థలో దొంగవాడు దొంగకానివా డవుతాడు)అని, "నైతం...దుష్కృతమ్" (సంప్రసాదరూపమైన ఈ ఆత్మయే సేతువు. దీనిని అహోరాత్రాలు పరిచ్ఛిన్నం చేయజాలవు. దీనికి జర గాని, మృత్యువు గాని, శోకం గాని సుకృతదుష్కృతాలు (ధర్మాధర్మాలు)గాని లేవు) అనీ ఈ విధంగా చెప్పుచున్నది. జీవునిలో సుఖవంతుడు అని దుఃఖవంతు డనీ భావాలను కలిగించడంచేత సుకృతదుష్కృతాల ప్రాప్తి ఉంటుంది. అనగా సుకృతదుష్కృతాల ఫలితంగా సుఖదుఃఖాలు జీవునికి కలుగుతాయి. సుషుప్తునిలో సుఖవంతుడ ననే జ్ఞానం గాని, దుఃఖవంతుడ ననే జ్ఞానం గాని ఉండదు. ముగ్ధునిలో కూడ ఆ ప్రత్యయాలు ఉండవు. అందువల్ల ఉపాధులు ఉపశమించడంవల్ల సుషుప్తునిలో వలెనే ముగ్ధునిలో కూడ పూర్తిగా (బ్రహ్మతో) సంపత్తి ఉండాలి గాని అర్ధసంపత్తి కాదు. (సమాధానం)-ఇక్కడ చెప్పబడుచున్నది. ముగ్ధావస్థలో జీవునకు బ్రహ్మతో అర్ధసంపత్తి కలుగుతుందని మేం అనడం లేదు. (సుషుప్తిలో వలె బ్రహ్మలో పూర్తి సంపత్తియే

కలుగుతుంది). మరే మనగా ముగ్ధత్వం సగం సుషుప్తపక్షానికీ సగం మరొక అవస్థయొక్క పక్షానికీ చేరుతుం దని అంటున్నాం. మోహానికి స్వాపంతో ఉన్న సామ్య వైషమ్యాలు పైన చూపించాం. ఇది మరణానికి ద్వారం. పీని కర్మ ఇంకా మిగిలి ఉంటే అప్పుడు వాక్కు మనస్సు తిరిగి వస్తాయి. కర్మ నిరవశేషం అయితే మాత్రం అప్పుడు ప్రాణం వేడీ తొలగి పోతాయి. అందుచేత ముగ్ధత్వం అర్ధసంపత్తి అని బ్రహ్మవేత్త లంటారు. ఐదవ అవస్థ ఏదీ ప్రసిద్ధంగా లేదు అని ఏది చెప్పబడిందో అది దోషం కాదు. ఇది ఎప్పుడో వచ్చే అవస్థ గాన ప్రసిద్ధం కాకపోవచ్చు. అయితే ఇది లోకంలోను, ఆయుర్వేదంలోను ప్రసిద్ధమే. అయితే ఇది అర్ధసంపత్తి అని అంగీకరించడంచేత ఐదవ అవస్థగా పరిగణింపబడదు. ఈ విధంగా దోషం ఏదీ లేదు. 10.

ముగ్ధేర్ధసంపత్త్యధికరణం సమాప్తం

## 5. ఉభయలిఙ్గాధికరణమ్. సూ. 11-21

### సూ. న స్థానతోఽపి పరస్యోభయలిఙ్గం సర్వత్ర హి. 3.2.11

యేన బ్రహ్మణా సుషుప్త్యాదిషు జీవ ఉపాధ్యుపశమాత్సంపద్యతే తస్యే దానీం స్వరూపం శ్రుతివశేన నిర్ధార్యతే. సన్త్యుభయలిఙ్గాః శ్రుతయో బ్రహ్మవిషయాః "సర్వకర్మా సర్వకామః సర్వగన్ధః సర్వరసః" (ఛా.ఉ.3.14.2) ఇత్యేవమాద్యాః సవిశేషలిఙ్గాః, "అస్థూలమనణ్వహ్రస్వమదీర్ఘమ్" (బృ.ఉ.3.8.8) ఇత్యేవమాద్యాశ్చ నిర్విశేషలిఙ్గాః. కిమాసు శ్రుతిషూభయలిఙ్గం బ్రహ్మ ప్రతిపత్తవ్య ముతాన్యతరలిఙ్గమ్. యదాప్యన్యతరలిఙ్గం తదపి కిం సవిశేషముత నిర్విశేషమితి మీమాంస్యతే. తత్రోభయలిఙ్గశ్రుత్యనుగ్రహాదుభయలిఙ్గమేవ బ్రహ్మేతి.

బాలానందిని

అవ. త్వంపదార్థం జాగ్రదాద్యవస్థలచేత అలిప్తమైనది అని త్వంపదార్థవిచారణ చేసి ఇప్పుడు ఇది మొదలు పాదసమాప్తివరకు తత్పదార్థవిచారం (బ్రహ్మస్వరూపనిరూపణం) చేయబడుచున్నది. ఉద్దేశ్యాన్ని ముందుగా చెప్పడం యుక్తం గాన దానిని పరిశోధించి ఇప్పుడు తత్పదార్థపరిశోధనం చేయబడుచున్నది. ఈవిధంగా దీనికి అవసరసంగతి.

శ్రుతిప్రామాణ్యాన్ని పట్టి ముగ్ధత్వం సుషుప్తి- మరణోభయరూప మని అంగీకరించినట్లుగా బ్రహ్మ శ్రుతిబలంచేత ఉభయరూపం కావచ్చును అని దృష్టాంతసంగతిచేత పూర్వ పక్షం.

నేతి:- "పరస్య=పరబ్రహ్మకు, స్థానతోఽపి=పృథివ్యాదిస్థానసంబంధంవల్ల కూడ, ఉభయలిఙ్గమ్=రెండువిధాలైన లింగం అనగా రూపం, న=లేదు, సర్వత్ర హి=అంతటా కూడ ఏకలింగమే (నిర్విశేషరూపమే) చెప్పబడుచున్నది కదా?" అని సూత్రార్థం.

యేనేతి:- సుషుప్త్యాదులలో ఉపాధులు ఉపశమించడంచేత జీవుడు ఏ బ్రహ్మతో సంపన్నుడవుతాడో ఆ బ్రహ్మయొక్క స్వరూపం ఇప్పుడు శ్రుత్యనుసారం నిర్ధరించ బడుచున్నది. బ్రహ్మను గూర్చి "సర్వకర్మా.....సర్వరసః" ఇత్యాది సవిశేష లింగాలు (సవిశేషబ్రహ్మస్వరూపాన్ని చెప్పేవి) "అస్థూల...అహ్రస్వమ్" మొదలైన నిర్విశేషలింగాలు, ఈ విధంగా ఉభయలింగా లైన శ్రుతులు కనబడుతున్నాయి. ఈ శ్రుతులను పట్టి బ్రహ్మ ఉభయలింగ మని గ్రహించాలా లేదా ఏదో ఒక లింగం గల దని గ్రహించాలా. ఏదో ఒక లింగం గలదిగా గ్రహించాలి అన్నప్పుడు కూడ సవిశేషలింగం గ్రహించాలా నిర్విశేషలింగం గ్రహించాలా అని విచారణ చేయబడుచున్నది. ఉభయలింగాలను ప్రతిపాదించే శ్రుతులను బట్టి బ్రహ్మ ఉభయలింగ మని గ్రహించాలి (అని పూర్వపక్షం).

భాష్యమ్.

ఏవం ప్రాప్తే బ్రూమః- న తావత్స్వత ఏవ పరస్య బ్రహ్మణ ఉభయలిఙ్గత్వ ముపపద్యతే. న హ్యేకం వస్తు స్వత ఏవ రూపాదివిశేషోపేతం తద్విపరీతం చేత్యవధావయితుం శక్యమ్; విరోధాత్. అస్తు తర్హి స్థానతః పృథివ్యాద్యుపాధి యోగాదితి. తదపి నోపపద్యతే. నహ్యుపాధియోగాదప్యన్యా దృశస్య వస్తునోఽన్యాదృశః స్వభావః సంభవతి. న హి స్వచ్ఛః సన్ స్ఫటికః అలక్తకాద్యు పాధియోగాదస్వచ్ఛో భవతి; భ్రమమాత్రత్వాదస్వచ్ఛతాభినివేశస్య; ఉపాధీనాం చా విద్యాప్రత్యుపస్థాపితత్వాత్. అతశ్చాన్యతరలిఙ్గ పరిగ్రహేఽపి సమస్త విశేషరహితం నిర్వికల్పకమేవ బ్రహ్మ ప్రతిపత్తవ్యం న తద్విపరీతమ్. సర్వత్ర హి బ్రహ్మస్వరూపప్రతిపాదనపరేషు వాక్యేషు "అశబ్దమస్పర్శమరూప

మవ్యయమ్'' (క.ఉ.3.1.5) ముక్తి.ఉ.2.72) ఇత్యేవమాదిష్వపాస్తసమస్తవిశేషమేవ బ్రహ్మోపదిశ్యతే. 11.

బాలానందిని

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాం. పరబ్రహ్మకు స్వతఃసిద్ధంగా ఉభయలింగత్వం కుదరదు. ఒకే వస్తువు సహజంగా రూపాదివిశేషాలలో కూడిన దనీ, అందుకు విపరీత మనీ(రూపాదివిశేషాలు లేని దనీ) నిర్ధారణ చేయాడానికి శక్యం కాదు కదా? అలా చెప్పడం పరస్పరవిరుద్ధం అవుతుంది. అయితే స్థానతః=పృథివ్యాద్యుపాధులతో సంబంధాన్ని పట్టి (ఉభయలింగం) కావచ్చును. అది కూడ ఉపపన్నం కాదు. ఉపాధిసంబంధం ఉన్నా కూడ ఒక విధంగా ఉన్న వస్తువుయొక్క స్వభావం మరొకవిధ మైనది అయిపోదు కదా? స్వచ్ఛమైన స్ఫటికమాణిక్యం లత్తుక మొదలైన ఉపాధుల సంయోగంవల్ల అస్వచ్ఛం అయిపోదు కదా? మరొక విషయ మేమనగా ఉపాధులు అవిద్యచేత సమకూర్చబడినవి. అందువల్ల కూడ ఏదో ఒక లింగాన్ని గ్రహించినా కూడ బ్రహ్మ సమస్తవిశేషరహితమనీ, నిర్వికల్ప మనీ మాత్రమే గ్రహించాలి కాని అందుకు విపరీతంగా గ్రహించకూడదు. ఎందుచేతననగా-బ్రహ్మస్వరూపాన్ని ప్రతిపాదించే "అశబ్దమస్పర్శమరూపమవ్యయమ్" ఇత్యాది వాక్యాలన్నింటిలోను సకలవిశేషరహితమైన బ్రహ్మయే ఉపదేశించబడుతున్నది. 11.

## సూ. న భేదాదితి చేన్న ప్రత్యేకమతద్వచనాత్. 3.2.12

అథాపి స్యాద్యదుక్తం నిర్వికల్పమేవ బ్రహ్మ నాస్య స్వతః స్థానతో వా ఉభయలిఙ్గత్వమితి, తన్నోపపద్యతే. కస్మాత్? భేదాత్. భిన్నా హి ప్రతివిద్యం బ్రహ్మణ ఆకారా ఉపదిశ్యన్తే. చతుష్పాద్బ్రహ్మ, షోడశకలం బ్రహ్మ, వామనీత్వాది లక్షణం బ్రహ్మ, త్రైలోక్యశరీరవైశ్వానరశబ్దోదితం బ్రహ్మ ఇత్యేవం జాతీయకమ్. ననూక్తం నోభయలిఙ్గత్వం బ్రహ్మణః సంభవతీతి? అయమప్యవిరోధః. ఉపాధికృతత్వాదాకారభేదస్య. అన్యథా హి నిర్విషయమేవ భేదశాస్త్రం ప్రసజ్యే తేతి చేత్; నేతి బ్రూమః. కస్మాత్? ప్రత్యేకమతద్వచనాత్. ప్రత్యుపాదిభేదం

హ్యభేదమేవ శ్రావయతి శాస్త్రమ్-"యశ్చాయమస్యాం పృథివ్యాం తేజోమయోఽమృత మయః పురుషో యశ్చాయమధ్యాత్మం శారీరస్తేజోమయోఽమృతమయః పురుషోఽయమేవ స యోఽయమాత్మా"(బృ.ఉ.2.5.1) ఇత్యాది. అతశ్చ న భిన్నాకారయోగో బ్రహ్మణః శాస్త్రీయ ఇతి శక్యతే వక్తుమ్. భేదస్యోపాసనార్థత్వా దభేదే తాత్పర్యాత్. 12.

బాలానందిని

భేదాదితి :-"భేదాదితి చేత్=ప్రతీ ఉపాసనలోను భేదం చెప్పడంవల్ల, న=బ్రహ్మనిర్విశేషలింగం గలది కాదు, ఇతి చేత్=అన్నట్లయితే, న=కాదు, ప్రత్యేకమ్=భేదసూచక మైన ప్రతీ వాక్యంలోను, అతద్వచనాత్=అభేదం చెప్పడంవల్ల" అని సూత్రార్థం.

అథేతి :- (ఎవరైనా)ఇలా కూడ అనవచ్చును-బ్రహ్మ నిర్వికల్పకమ్, దీనికి స్వతఃగా గాని స్థానంవల్ల గాని ఉభయలింగత్వం లేదు అని చెప్పినది ఉపపన్నం కాదు. ఎందువల్ల? భేదంవల్ల. ప్రతీ విద్య (ఉపాసన)లోను బ్రహ్మయొక్క వేరువేరు ఆకారాలు ఉపదేశించబడుతున్నాయి. బ్రహ్మ చతుష్పాత్ అనీ, బ్రహ్మ పదహారు కళలు కలదనీ, బ్రహ్మకు వామనీత్వాదిలక్షణా లున్నా యని, త్రైలోక్యమే శరీరంగా గల వైశ్వానరశబ్దంచేత బ్రహ్మ చెప్పబడుచున్నదనీ ఈ విధ మైన వేరు వేరు ఆకారాలు చెప్పబడుతున్నాయి. అందువల్ల బ్రహ్మ సవిశేషం అని కూడ అంగీకరించాలి. బ్రహ్మకు ఉభయలింగత్వం కుదర దని చెప్పాం కదా? ఈ విరోధం కూడ లేదు. ఎందువల్ల ననగా ఆకారభేదం ఉపాధులచేత ఏర్పడినది. అలా కాకపోతే భేదశాస్త్రానికి విషయమే లేకుండా పోతుంది అన్నట్లయితే, కాదంటాం. ఎందువల్ల? ప్రత్యేకమతద్వచనాత్-ప్రతీఉపాధిభేదంలోనూ కూడ "యశ్చా...ఆత్మా" ఇత్యాదిశాస్త్రం బ్రహ్మకు అభేదాన్ని చెపుతూన్నది. (ఈ పృథివిలో తేజోమయుడు, అమృతమయుడు అయిన ఏ పురుషుడున్నాడో శరీరంలో తేజోమయుడు, అమృతమయుడు అయిన శారీరు డైన ఏ పురుషు డున్నాడోఇతడు ఆ ఆత్మయే-ఆ ఇద్దరూ ఒకే ఆత్మ అని శ్రుతివాక్యాని కర్థం). ఆ కారణంచేత కూడ బ్రహ్మకు వేరు వేరు ఆకారాలతో సంబంధం శాస్త్రీయ మని చెప్పడానికి శక్యం కాదు. ఎందువల్ల ననగా భేదం

కేవలం ఉపాసనకొరకే చెప్పబడుచున్నది. పరమతాత్పర్యం మాత్రం అభేదంలోనే. 12.

సూ. అపి చైవమేకే. 3.2.13.

అపి చైవం భేదదర్శననిన్దాపూర్వకమభేదదర్శనమేవైకే శాఖినః సమామనన్తి- "మనసైవేదమాప్తవ్యం నేహ నానాస్తి కించన,
మృతోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" (క.ఉ.4.11) ఇతి.
తథాన్యేఽపి-
"భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మ మే తత్" (శ్వే.ఉ.1.12)
ఇతి సమస్తస్య భోగ్యభోక్తృనియన్తృలక్షణస్య ప్రపఞ్చస్య బ్రహ్మైకస్వభావతా మధీయతే. 13.

బాలానందిని

అపీతి :- "అపి చ=మరియు, ఏకే= ఒక శాఖకు చెందినవారు, ఏవమ్=అభేదదర్శనాన్ని పఠిస్తున్నారు" అని సూత్రార్థం.

అపీతి:-మరియు ఒక శాఖకు చెందినవారు- "మనసైవేద...పశ్యతి" అని భేదనింద చేస్తూ అభేదదర్శనాన్నే పఠిస్తున్నారు. అట్లే మరికొంతమంది "భోక్తా....తత్" (భోక్త, భోగ్యము, ఈ రెండింటినీ ప్రేరేపించే ఈశ్వరుడు-వీటిని గూర్చి బాగుగ ఆలోచించి నాకు చెప్పబడింది. ఈ త్రివిధమైనదీ కూడ బ్రహ్మయే)అని, భోక్త, భోగ్యం, వాటి నియామకుడు అనే రూపం గల సమస్తప్రపంచానికి బ్రహ్మయే స్వరూపం అని చెప్పుచున్నారు. 13.

భాష్యమ్

కథం పునరాకారవదుపదేశినీష్వనాకారవదుపదేశినీషు చ బ్రహ్మవిషయాసు శ్రుతిషు సతీష్వనాకారమేవ బ్రహ్మావధార్యతే న పునర్విపరీతమితి. అత ఉత్తరం పఠతి-

## సూ. అరూపవదేవ హి తత్ప్రధానత్వాత్. 3.2.14

రూపాద్యాకారారహితమేవ బ్రహ్మావధారయితవ్యం న రూపాదిమత్. కస్మాత్? తత్ప్రధానత్వాత్. "అస్థూలమనణ్వహ్రస్వమదీర్ఘమ్" (బృ.ఉ.3.8.8) "అశబ్దమస్పర్శమరూపమవ్యయమ్" (క.ఉ.3.15.ముక్తి. ఉ.2.72)"ఆకాశో వై నామ నామరూపయోర్నిర్వహితా తే యదన్తరా తద్బ్రహ్మ" (ఛా.ఉ.8.14.1),"దివ్యో హ్యమూర్తః పురుషః స బాహ్యాభ్యన్తరో హ్యజః"(ము. ఉ.2.1.2),"తదేతద్బ్రహ్మ...సర్వానుభూః"(బృ.ఉ.2.5.19)ఇత్యేవమాదీని వాక్యాని నిష్ప్రపఞ్చ బ్రహ్మతత్త్వప్రధానానీత్యేతత్ప్రతిష్ఠాపితం "తత్తు సమన్వయాత్" (బ్ర.సూ.1.1.4)ఇత్యత్ర. తస్మాదేవంజాతీయకేషు వాక్యేషు యథాశ్రుతం నిరాకారమేవ బ్రహ్మావధారయితవ్యమ్. ఇతరాణి త్వాకారవద్బ్రహ్మవిషయాణి వాక్యాని న తత్ప్రధానాని. ఉపాసనావిధిప్రధానాని హి తాని. తేష్వసతి విరోధే యథాశ్రుతమాశ్రయితవ్యమ్. సతి తు విరోధే తత్ప్రధానాన్యతత్ప్రధానేభ్యో బలీయాంసి భవన్తీతి. ఏష వినియమనాయాం హేతుః, యేనోభయీష్వపి శ్రుతిషు అనాకారమేవ బ్రహ్మావధార్యతే న పునర్విపరీతమితి. 14.

### బాలానందిని

కథమితి:-ఆకారం ఉన్నదానిని ఉపదేశించేవి, ఆకారం లేనిదానిని ఉపదేశించేవి అయిన బ్రహ్మను గూర్చిన శ్రుతులు ఉంటూండగా బ్రహ్మ అనాకారమే అని ఎలా నిర్ధారణచేయబడుచున్నది; అందుకు విపరీతమైనదిగా (ఆకారవత్తుగా)ఎందుకు నిర్ధారణచేయబడడం లేదు? ఇందుకు సమాధానం పలికిస్తున్నాడు-

అరూపేతి:-" అరూపవదేవ హి=బ్రహ్మ అరూపమైనదే; తత్ప్రధానత్వాత్=శ్రుతి అదే ప్రధానంగా కలదవడంవల్ల" అని సూత్రార్థం.

రూపాదీతి :- బ్రహ్మ రూపాద్యాకారములు లేనిదే అని నిర్ధారణ చెయ్యాలిగాని రూపాదిమత్తుగా నిర్ధారణ చేయగూడదు. ఎందువల్ల? తత్ప్రధానత్వంవల్ల: "అస్థూలం...అదీర్ఘమ్","అశబ్దమ్...అవ్యయమ్", "ఆకాశో...బ్రహ్మ","దివ్యో...అజః",

"తదేతద్...సర్వానుభూః" ఇత్యాదివాక్యాలు నిష్ప్రపంచబ్రహ్మతత్త్వప్రధానములు(ప్రధానంగా నిష్ప్రపంచమైన బ్రహ్మతత్త్వాన్ని బోధిస్తున్నాయి), మరొక విషయాన్ని దేనినీ ప్రధానంగా బోధించడం లేదు అని "తత్తు సమన్వయాత్" అనే సూత్రం దగ్గర స్థాపించబడింది. అందుచేత ఇలాంటి వాక్యాలలో, ఏ విధంగా వినబడుచున్నదో అదే విధంగా, నిరాకారమైన బ్రహ్మనే నిర్ధారణ చెయ్యాలి. ఆకారం గల బ్రహ్మను చెప్పే ఇతర వాక్యాలైతే ప్రధానంగా ఆకారాన్ని చెప్పడంకోసం ఉద్దిష్టమైనవి కావు. ఎందుచేత ననగా వాటిలో ప్రధానంగా చెప్పదలచినవి ఆ యా ఉపాసనలు. అలాంటి వాక్యాలలో విరోధం లేకపోతే విన్నది విన్నట్లుగా గ్రహించవచ్చును కాని విరోధం ఉంటేమాత్రం తత్ప్రధాన మైనవి (నిష్ప్రపంచబ్రహ్మపరమైనవి) అతత్ప్రధానములకంటె (అవి పైకి దేనిని చెపుతున్నట్లు కనబడుతున్నాయో అది ప్రధానం కాని వాక్యాల కంటె, సాకారబ్రహ్మవాక్యాలకంటె)ఎక్కువ బలం గలవి. వినిగమనంలో (ఇదే గ్రహించాలి దానిని గ్రహించ కూడదు అని నియమించడంలో)హేతువు ఇదే. దీనిని పట్టియే రెండు విధాలైన శ్రుతు లున్నా కూడ ఏకాకారమైన బ్రహ్మయే నిర్ధారణ చేయబడుచున్నది కాని తద్విపరీతమైనది నిర్ధారణ చేయబడదు. 14.

భాష్యమ్

కా తర్హ్యాకారవద్విషయాణాం శ్రుతీనాం గతిః? అత ఆహ-

సూ. ప్రకాశవచ్చావైయర్థ్యాత్. 3.2.15.

యథా ప్రకాశః సౌరశ్చాన్ద్రమసో వా వియద్వ్యాప్యావతిష్ఠమానోఽఙ్గుల్యాద్యుపాధిసంబన్ధాత్ తేష్వృజువక్రాదిభావం ప్రతిపద్యమానేషు తద్భావమివ ప్రతిపద్యతే, ఏవం బ్రహ్మాపి పృథివ్యాద్యుపాధిసంబన్ధాత్తదాకారతామివ ప్రతిపద్యతే. తదాలమ్బనో బ్రహ్మణ ఆకారవిశేషోపదేశ ఉపాసనార్థో న విరుధ్యతే. ఏవమవైయర్థ్యమాకారవద్బ్రహ్మవిషయాణామపి వాక్యానాం భవిష్యతి. న హి వేదవాక్యానాం కస్య చిదర్థవత్త్వం, కస్య చిదనర్థవత్త్వమితి యుక్తం ప్రతిపత్తుం, ప్రమాణత్వావిశేషాత్. నన్వేవమపి యత్పురస్తాత్ప్రతిజ్ఞాతం-నోపాధియోగాద

ప్యుభయలిఙ్గత్వం బ్రహ్మణోఽస్తీతి తద్విరుధ్యతే. నేతి బ్రూమః. ఉపాధినిమిత్తస్య వస్తుధర్మత్వానుపపత్తేః. ఉపాధీనాం చావిద్యాప్రత్యుపస్థాపితత్వాత్. సత్యామేవ చ నైసర్గిక్యామవిద్యాయాం లోకవేదవ్యవహారావతార ఇతి తత్ర తత్రావోచామ.15.

బాలానందిని

కేతి:- అయితే అకారవత్తైన బ్రహ్మను చెప్పే శ్రుతులకు ఏమి గతి? ఇందుకు సమాధానంగా చెపుతున్నారు-

ప్రకాశవదితి:- (కొన్ని పుస్తకాలలో ఈ సూత్రం "ప్రకాశవచ్చావైయర్థ్యమ్" అని ఉన్నది). "ప్రకాశవత్=సూర్యచంద్రాదిప్రకాశ వలె=అవైయర్థ్యమ్ =సాకారబ్రహ్మశ్రుతులకు వ్యర్థత్వం లేదు" అని సూత్రార్థం.

యథేతి:-ఆకాశాన్ని వ్యాపించి ఉన్న సూర్యప్రకాశ గాని, చంద్రప్రకాశ గాని వ్రేళ్ల మొదలైన ఉపాధుల సంబంధంవల్ల అవి ఋజుత్వం వక్రత్వం మొదలైన అకారాలు పొందినప్పుడు ఋజుత్వవక్రత్వాదులను పొందుతున్నట్లు ఎలా ఉంటుందో, ఇట్లే బ్రహ్మ కూడ పృథివ్యాద్యుపాధుల సంబంధంవల్ల వాటి ఆకారమును పొందినట్లుంటుంది. దానిని పట్టి ఉపాసనకొరకై బ్రహ్మకు అకారవిశేషం ఉన్నట్లు చేసిన ఉపదేశం విరుద్ధం కాదు. అకారం గల బ్రహ్మను చెప్పే వాక్యాలకు కూడ ఈ విధంగా సార్థకత్వం లభిస్తుంది. వేదవాక్యాలు అన్నీ ప్రమాణములే అయి ఉన్నప్పుడు కొన్నింటికి ప్రయోజనం ఉన్న దనీ, కొన్నింటికి లేదనీ చెప్పడం యుక్తం కాదు కదా? (ప్రశ్న) అయతే- బ్రహ్మ కున్న ఉపాధిసంబంధాన్ని పట్టి కూడ దానికి ఉభయలింగత్వం లేదని వెనుక చెప్పిన దానికీ ఇక్కడ చెప్పినదానికీ విరోధం కదా? లేదంటాం. ఉపాధిని పట్టి ఏర్పడినది వస్తువుయొక్క ధర్మం కాజాలదు కదా? ఎందుచేత ననగా ఉపాధులు అవిద్యచేత ఏర్పరుపబడినవి. సహజమైన ఈ అవిద్య ఉన్నప్పుడే లౌకికవ్యవహారాలు, వైదికవ్యవహారాలు జరుగుతాయి అని అక్కడక్కడ చెప్పి ఉన్నాం. 15.

## సూ. ఆహ చ తన్మాత్రమ్. 3.2.16

ఆహ చ శ్రుతిశ్చైతన్యమాత్రం విలక్షణరూపాన్తరరహితం నిర్విశేషం బ్రహ్మ- "స యథా సైన్ధవఘనోఽనన్తరోఽబాహ్యః కృత్స్నో రసఘన ఏవ ఏవం వా

**అరేఽయమాత్మానన్తరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ"(బృ.ఉ.4.5.13) ఇతి. ఏతదుక్తం భవతి. నాస్యాత్మనోన్తర్బహిర్వా చైతన్యాదన్యద్రూపమస్తి. చైతన్యమేవ తు నిరన్తరమస్య స్వరూపమ్. యథా సైన్ధవఘనస్యాన్తర్బహిశ్చ లవణరస ఏవ నిరన్తరో భవతి న రసాన్తరం తథైవేతి. 16.**

బాలానందిని

**అహేతి :-**" తన్మాత్రమ్=బ్రహ్మ కేవలం చైతన్యస్వరూపమే అని, ఆహ చ=శ్రుతి చెప్పుచున్నది కూడ"-అని సూత్రార్థం

అహ చేతి:-"స యథా...ఏవ" (ఉప్పు ముద్ద(ఊయి) లోపల బైటా కూడ ఏవిధంగా ఉప్పతనంతోనే ఉంటుందో ఈ ఆత్మ కూడ లోపలా బైటా అంతటా కూడ చైతన్య ఘనమే) అని శ్రుతి బ్రహ్మ శుద్ధ చైతన్యరూప మనీ, విలక్షణా లైన ఇతర రూపాలు ఏవీ లేని దనీ ఎట్టి విశేషాలూ లేని దనీ చెప్పుచున్నది. దీని అభిప్రాయం ఇది-ఈ ఆత్మకు లోపల గాని, బైట గాని చైతన్యం తప్ప మరొక రూపం ఏదీ లేదు. నిరంతరమైన (దట్టమైన)చైతన్యమే దీని స్వరూపం. సైంధవఘనం లోపలగాని బైటగాని నిరంతరమైన లవణరసం మాత్రమే ఎలా ఉంటుందో, మరొక రసం ఏదీ ఉండదో, అట్లే ఇది కూడ.16.

**సూ. దర్శయతి చాథో అపి చ స్మర్యతే. 3.2.17.**

**దర్శయ తి చ శ్రుతిః పరరూపప్రతిషేధేనైవ బ్రహ్మ నిర్విశేషత్వాత్- "అథాత ఆదేశో నేతి నేతి" (బృ.ఉ.2.3.6)ఇతి; "అన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి" (కే.ఉ.1.3)ఇతి; "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ"(తై.ఉ.2.4.1) ఇత్యాద్యా. బాష్కలినా చ బాధ్వః పృష్టః సన్నవచనేనైవ బ్రహ్మ ప్రోవాచేతి శ్రూయతే-"స హోవాచాధీహి భగవో బ్రహ్మేతి స తూష్ణీం బభూవ, తం హ ద్వితీయే వా తృతయే వా వచన ఉవాచ బ్రూమః ఖలు త్వం తు న విజానాసి, ఉపశాన్తోఽయమాత్మా"ఇతి. తథా స్మృతిష్వపిపరప్రతిషేధేనైవోపదిశ్యతే- "జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వామృతమశ్నుతే,**

**అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే"(భ.గీ.13.12)**

ఇత్యేవమాద్యాసు. తథా విశ్వరూపధరో నారాయణః నారదమువాచేతి స్మర్యతే-
"మాయాహ్యేషా గుణమయీ యన్మాం పశ్యసి నారద,
సర్వభూతగుణైర్యుక్తం నైవం మాం జ్ఞాతుమర్హసి."(మ.భా.శా.339.45)ఇతి. 17

బాలానందిని

దర్శయతీతి:-"దర్శయతి=శ్రుతి ఇట్లే చెప్పుచున్నది. అథో=మరియు, స్మర్యతే=స్మృతులలో కూడ చెప్పబడుచున్నది" అని సూత్రార్థం.

దర్శయతీతి:- "అథాత....నేతి" అని, "అన్యదేవ...అధి." అని, "యతో...సహ" అనీ, ఈ మొదలైన శ్రుతులు బ్రహ్మ నిర్విశేష మవడంచేత దానిని ఇతరరూపాలను నిషేధించడం ద్వారా మాత్రమే చూపుచున్నాయి. బాష్కలిచేత ప్రశ్నించబడిన బాధ్వుడు మాటలాడకుండానే (మౌనంతోమాత్రమే)బ్రహ్మను గూర్చి చెప్పాడని "సహోవాచ...ఆత్మా" అని చెప్పినట్లు వినబడుచున్నది. (పూజ్యుడా! బ్రహ్మను ఉపదేశించుము అని బాష్కలుడు అడిగాడు. రెండు మాట్లు అడిగాడు, మూడు మాట్లు అడిగాడు. అప్పుడు బాధ్వుడిలా అన్నాడు. మేం చెపుతూనే ఉన్నాం. నువ్వైతే అర్థం చేసుకొనడం లేదు. ఈ ఆత్మ శాంతించినది అని ఈ శ్రుతివాక్యానికి అర్థం). అట్లే-"జ్ఞేయం....ఉచ్యతే" మొదలైన స్మృతులలో కూడ ఇతరవస్తువులను నిషేధించి తద్ద్వారామాత్రమే(ఆత్మస్వరూపం) ఉపదేశించబడుతున్నది. (ఏది తెలియదగినదో, దేనిని తెలుసుకొని ముక్తిని పొందుతాడో దానిని గూర్చి చెపుతాను. పరమైన ఆ బ్రహ్మ ఆది లేనిది. అనగా కార్యం కాదు. అది ఇంద్రియాలకు గోచరం కాదు గాన 'సత్' అని చెప్పబడదు, స్వప్రకాశమై అపరోక్షమైనది గాన 'అసత్' అని కూడ చెప్పబడదు అని ఈ శ్లోకాని కర్థం). అట్లే విశ్వరూపం ధరించిన నారాయణుడు నారదునితో-"మాయా...అర్హసి" అని చెప్పినట్లు స్మృతిలో (భారతంలో) చెప్పబడింది. (నారదా! సమస్తభూతముల గంధాదిగుణాలతో కూడినవానినిగా నన్ను చూస్తున్నావు కదా! ఇదంతా నాచేత సృజించబడిన మాయ మాత్రమే. నన్ను నీవు ఈ విధంగా ద్వైత ప్రపంచంతో కూడిన వానినిగా, తెలిసికొనడానికి తగవు; అలా తెలిసికొనగూడదు అని ఈ శ్లోకానికి భావం). 17.

సూ.అత ఏవచోపమా సూర్యకాదివత్. 3.2.18 (౨-౩-౫౦)

యత ఏవ చాయమాత్మా చైతన్యరూపో నిర్విశేషో వాఙ్మనసాతీతః పరప్రతిషేధోపదేశ్యః అత ఏవ చాస్య ఉపాధినిమిత్తామపారమార్థికీం విశేషవత్తామభిప్రేత్య జలసూర్యకాదివదిత్యుపమీయతే మోక్షశాస్త్రేషు-

"యథా హ్యయం జ్యోతిరాత్మా వివస్వానపో భిన్నా బహుధైకోఽను గచ్ఛన్,
ఉపాధినా క్రియతే భేదరూపో దేవః క్షేత్రేష్వేవమజోఽయమాత్మా" ఇతి.
"ఏక ఏవహి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః"
"ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచన్ద్రవత్ "(బ్ర.బిం.ఉ.12)ఇత్యేవమాదిషు. 18.

బాలానందిని

అత ఏవేతి:-"అత ఏవ=అందువలననే, సూర్యకాదివత్=జలసూర్యకాదులవలె అని, ఉపమా=ఉపమ చెప్పబడినది" అని సూత్రార్థం.

యత ఇతి:- అత్మ చైతన్యరూప మైనది. నిర్విశేషము, వాఙ్మనస్సులకు అతీత మైనది. ఇతర వస్తువులను నిషేధించడం ద్వారా చెప్పదగినది (ఇది కాదు, ఇది కాదు అని అంటూ చెప్పదగినదే కాని ఇది ఇలా ఉంటుంది అని చెప్పడానికి శక్యం కానిది). అందుచేతనే దీనికి ఉన్న విశేషాలన్నీ కేవలం ఉపాధిసంబంధం మాత్రంచేతనే ఏర్పడిన వనీ, పారమార్థికములు కాదనీ అంగీకరించి "యథా....ఆత్మా" (జ్యోతిఃస్వరూపుడైన ఈ సూర్యుడు తానొక్కడే అయినా వేరు వేరుగా ఉన్న ఉదకాలను అనుసరిస్తూ అనేకంగా చేయబడతతాడో అట్లే నిత్యుడైన ఈ ఆత్మకూడ శరీరాలలో, ఉపాధియైన మాయచేత వేరు వేరు రూపాలు కలవాడుగా చేయబడతాడు)అని, "ఏకధా....జలచన్ద్రవత్" (జలంలో ఉన్న చంద్రుడు వలె ఒక్కడుగాను అనేకరూపాలు కలవాడుగాను చేయబడుచున్నాడు)అని ఈ మొదలైన మోక్షశాస్త్రాలలో (ఉపనిషత్తులలో) జలసూర్యకాదివత్=జలంలో ఉన్న సూర్యప్రతిబింబాదుల వలె అని చెప్పబడుచున్నది. 18.

భాష్యమ్.

అత్ర ప్రత్యవస్థీయతే-

సూ. అమ్బువదగ్రహణాత్తు న తథాత్వమ్. 3.2.19.

న జలసూర్యకాదితుల్యత్వమిహోపపద్యతే, తద్వదగ్రహణాత్. సూర్యాదిభ్యో హి మూర్తేభ్యః పృథగ్భూతం విప్రకృష్టదేశం మూర్తం జలం గృహ్యతే. తత్ర యుక్తః సూర్యాదిప్రతిబిమ్బోదయః. న త్వాత్మా మూర్తః న చాస్మాత్పృథగ్భూతా విప్రకృష్టదేశాశ్చోపాధయః. సర్వగతత్వాత్, సర్వానన్యత్వాచ్చ. తస్మాదయుక్తోఽయం దృష్టాన్త ఇతి. 19

బాలానందిని

అత్రేతి:- ఇక్కడ ఎదుర్కొనడం జరుగుతున్నది, అనగా ప్రతిపక్షి ఎదురుప్రశ్న వేస్తున్నాడు-

అమ్బువదితి:- "అమ్బువత్=జలంవలె, అగ్రహణాత్=దూరంగా గ్రహించకపోవడం వల్ల, తథాత్వమ్=జలసూర్యకసాదృశ్యం, న=కుదరదు" అని సూత్రార్థం.

నేతి:- జలాదులవలె గ్రహించకపోవడంవల్ల ఇక్కడ జలసూర్యాదులతో పోలిక కుదరదు. మూర్తములైన (అకారం గల)సూర్యాదులకంటె వేరుగ దూరప్రదేశంలో ఉన్న జలం గ్రహించబడుచున్నది. అందుచేత అక్కడ సూర్యాదిప్రతిబింబం కనబడడం యుక్తమే. అయితే-ఆత్మ మూర్తమూ కాదు, ఉపాధులు దీనికంటె వేరుగా ఉండి దూరమైన దేశంలో లేనూ లేవు. ఆత్మ సర్వగతం, సర్వాభిన్నమూ కదా? అందువల్ల దృష్టాంతం యుక్తంగా లేదు (అని ఎదురు ప్రశ్న వేయబడుతున్నది అని అన్వయం). 19.

భాష్యమ్

అత్ర ప్రతివిధీయతే-

సూ.వృద్ధిహ్రాసభాక్త్వమన్తర్భావాదుభయసామఞ్జస్యాదేవమ్. 3.2.20.

యుక్త ఏవ త్వయం దృష్టాన్తో వివక్షితాంశసంభవాత్. న హిదృష్టాన్తదార్ష్టాన్తికయోః క్వచిత్కంచి ద్వివక్షితాంశం ముక్త్వా సర్వసారూప్యం కేన చిద్దర్శయితుం శక్యతే. సర్వసారూప్యే హి దృష్టాన్తదార్ష్టాన్తికభావోచ్ఛేద

ఏవ స్యాత్. న చేదం స్వమనీషయా జలసూర్యకాదిదృష్టాన్తప్రణయనమ్. శాస్త్రప్రణీతస్య త్వస్య ప్రయోజనమాత్రముపన్యస్యతే. కిం పునరత్ర వివక్షితం సారూప్యమితి. తదుచ్యతే. వృద్ధిహ్రాసభాక్త్వమితి. జలగతం హి సూర్యబిమ్బం జలవృద్ధౌ వర్ధతే; జలహ్రాసే హ్రసతి. జలచలనే చలతి; జలభేదే భిద్యతే ఇత్యేవం జలధర్మానుయాయి భవతి; న తు పరమార్థతః సూర్యస్య తథాత్వమస్తి. ఏవం పరమార్థతోఽవికృతమేకరూపమపి సద్బ్రహ్మ దేహాద్యుపాధ్యన్తర్భావాత్ భజత ఇవోపాధిధర్మాన్ వృద్ధిహ్రాసాదీన్. ఏవముభయోర్దృష్టాన్తదార్ష్టాన్తికయోః సామఞ్జస్యాదవిరోధః. 20.

బాలానందిని

అత్రేతి:- ఈ విషయంలో సమాధానం చెప్పబడుచున్నది-

"వృద్ధీతి:- అన్తర్భావాత్=ఉపాధులలో అంతర్భావంవల్ల, (ఆత్మకు), వృద్ధిహ్రాసభాక్త్వమ్=వృద్ధిహ్రాసాలను పొందడం ఉంటుంది, ఏవమ్=ఈవిధంగా, ఉభయసామఞ్జస్యాత్=దృష్టాన్తదార్ష్టాంతికాలు రెండింటికి సామంజస్యం ఉన్నది గాన దోషం లేదు" అని సూత్రార్థం.

యుక్త ఇతి :- చెప్పదలచిన అంశాలు కుదురుతాయి గాన ఈ దృష్టాంతం యుక్తమే. దృష్టాన్తదార్ష్టాంతికాలకు ఒకచోట, ఒక వివక్షితమైన అంశంలో తప్ప పూర్తిగా సారూప్యం(సామ్యం) ఎవ్వరూ చూపించ జాలరు. పూర్తిగా సారూప్యం ఉంటే దృష్టాంతదార్ష్టాంతికభావానికే భంగం కలుగుతుంది కదా? ఈ జలసూర్యకాది దృష్టాంతం తన బుద్ధిచేత చూపినది కాదు. శాస్త్రంలో చెప్పిన ఈ దృష్టాంతంయొక్క ప్రయోజనం మాత్రమే చెప్పబడుతున్నది. ఇక్కడ చెప్పదలచిన సారూప్యం ఏమిటి? అది చెప్పబడుచున్నది- వృద్ధిహ్రాసభాక్త్వమే చెప్పదలచిన సాదృశ్యం. జలంలో ఉన్న సూర్యప్రతిబింబం జలం పెరుగుతే పెరుగుతుంది, జలం తగ్గుతే తగ్గుతుంది. జలం కదలితే కదులుతుంది, జలం వేరుగా ఉంటే ఇది కూడ వేరుగా ఉంటుంది. ఈ విధంగా జలధర్మాన్ని అనుసరించి ఉంటుంది. అయితే సూర్యునికి వాస్తవంలో అదేమీ లేదు. అదే విధంగా వాస్తవంలో ఏ వికారాలూ లేనిదే అయినా, ఒకే రూపంలో ఉన్నా, బ్రహ్మ

దేహాద్యుపాధులలోపల ఉండడంచేత ఉపాధిధర్మాలైన వృద్ధిహ్రాసాదులను పొందుతున్నట్లు కనబడుతుంది. ఈ విధంగా దృష్టాంతదార్ష్టాంతికాలు రెండింటికీ సామంజస్యం ఉండడంవల్ల విరోధం లేదు. 20.

## సూ. దర్శనాచ్చ. 3.2.21

దర్శయతి చ శ్రుతిః పరస్యైవ బ్రహ్మణః దేహాదిషూపాధిష్వన్తరనుప్రవేశమ్-

"పురశ్చక్రే ద్విపదః పురశ్చక్రే చతుష్పదః,

పురః స పక్షీ భూత్వా పురః పురుష ఆవిశత్." (బృ.ఉ.2.5.18)

ఇతి. "అనేన జీవేనాత్మనానుప్రవిశ్య" (ఛా.ఉ.6.3.2) ఇతి చ. తస్మాద్యుక్తమేతత్- "అత ఏవ చోపమా సూర్యకాదివత్" (బ్ర.సూ.3.2.18) ఇతి. తస్మాన్నిర్వికల్పైకలిఙ్గమేవ బ్రహ్మ నోభయలిఙ్గం విపరీతలిఙ్గం చేతి సిద్ధమ్.

### బాలానందిని

**దర్శనాదితి:-** "దర్శనాచ్చ=బ్రహ్మ ఉపాధులలోపల ప్రవేశించిన దని శ్రుతి చూపుచున్నది గాన అందువల్ల కూడ దృష్టాంతదార్ష్టాంతికాల మధ్య అసామంజస్యం లేదు" అని సూత్రార్థం.

**దర్శయతీతి:-** "పుర....ఆవిశత్" అను శ్రుతి, "అనేన....అనుప్రవిశ్య" అను శ్రుతీ కూడ పరబ్రహ్మయే దేహాద్యుపాధులలో ప్రవేశించి నట్లు చూపుచున్నది కూడ. (ద్విపదః పురః=మనుష్యాదిదేహాలను చేసెను. చతుష్పదః పురః=పశువుల దేహములను సృష్టించెను. సః=ఆ ఈశ్వరుడు, పక్షీ=లింగశరీరం కలవాడుగా అయి, ఆ శరీరాలను ప్రవేశించెను. అయినా కూడ పురుషుడు గానే అనగా పూర్ణుగానే ఉండెను అని మొదటి శ్రుతివాక్యానికి అర్థం. అందుచేత "అత ఏవ చోపమా సూర్యకాదివత్" అని చెప్పడం యుక్తమే. అందువల్ల బ్రహ్మ ఒకే నిర్వికల్పకలింగం గలదే కాని ఉభయలింగము లేదా విపరీతలింగం అనగా సవిశేషలింగం కాదు అని సిద్ధించినది.

## భాష్యమ్

అత్ర కేచిద్ద్వే అధికరణే కల్పయన్తి. ప్రథమం తావత్-కిం ప్రత్యస్తమితాశేషప్రపఞ్చమ్ ఏకాకారం బ్రహ్మ ఉత ప్రపఞ్చవదనేకాకారోపేతమితి. ద్వితీయం తు స్థితే ప్రత్యస్తమితప్రపఞ్చత్వే కిం సల్లక్షణం బ్రహ్మ ఉత బోధలక్షణమ్, ఉతోభయలక్షణమితి. అత్ర వయం వదామః-సర్వథాప్యా నర్థక్యమధికరణాన్తరారమ్భస్యేతి. యది తావదనేకలిఙ్గత్వం పరస్య బ్రహ్మణో నిరాకర్తవ్యమిత్యయం ప్రయాసస్తత్పూర్వేణైవ "న స్థానతోఽపి" ఇత్యనేనాధికరణేన నిరాకృతమిత్యుత్తరమధికరణం "ప్రకాశవచ్చ" ఇత్యేతద్వ్యర్థమేవ భవేత్. న చ సల్లక్షణమేవ బ్రహ్మ న బోధలక్షణమితి శక్యం వక్తుమ్; విజ్ఞానఘన ఏవేత్యాదిశ్రుతివైయర్థ్యప్రసఙ్గాత్. కథం వా నిరస్తచైతన్యం బ్రహ్మ చేతనస్య జీవస్యాత్మత్వేనోపదిశ్యేత? నాపి బోధలక్షణమేవ బ్రహ్మ న సల్లక్షణమితి శక్యం వక్తుమ్-"అస్తీత్యేవోపలబ్ధవ్యః" (క.ఉ.6.13) ఇత్యాది శ్రుతి వైయర్థ్యప్రసంగాత్. కథం వా నిరస్తసత్తాకో బోధోఽభ్యుపగమ్యేత? నాప్యుభయలక్షణమేవ బ్రహ్మేతి శక్యం వక్తుమ్; పూర్వాభ్యుపగమవిరోధ ప్రసంగాత్. సత్తావ్యావృత్తేన చ బోధేన బోధవ్యావృత్తయా సత్తయా ఉపేతం బ్రహ్మ ప్రతిజానానస్య తదేవ పూర్వాధికరణప్రతిషిద్ధం సప్రపఞ్చత్వం బ్రహ్మణః ప్రసజ్యేత. శ్రుతత్వాదదోష ఇతి చేత్;న. ఏకస్యానేకస్వభావత్వానుపపత్తేః. అథ సత్తైవ బోధో బోధ ఏవ చ సత్తా; నానయోః పరస్పరవ్యావృత్తిరస్తీతి యద్యుచ్యేత, తథాపి కిం సల్లక్షణం బ్రహ్మ ఉత బోధలక్షణమ్, ఉత ఉభయలక్షణమిత్యయం వికల్పో నిరాలమ్బన ఏవ స్యాత్. సూత్రాణి త్వేకాధికరణత్వేనైవాస్మాభిర్నీతాని. అపి చ బ్రహ్మవిషయాసు శ్రుతిష్వాకారవదనాకార ప్రతిపాదనేన విప్రతిపన్నాసు అనాకారే బ్రహ్మణి పరిగృహీతేఽవశ్యం వక్తవ్యేతరాసాం శ్రుతీనాం గతిః. తాదర్థ్యేన ప్రకాశవచ్చేత్యాదీని సూత్రాణ్యర్థవత్తరాణి సంపద్యన్తే.

బాలానందిని

అత్రేతి:- కొందరు ఇక్కడ రెండు అధికరణాలు కల్పిస్తున్నారు. మొదటిదానిలో ("న స్థానతోఽపి" మొదలు ఒక అధికరణంలో) బ్రహ్మ సమస్తమైన ప్రపంచమూ అస్తమించగా ఏకాకారంగా ఉన్నదా లేక ప్రపంచంతో కూడినదై అనేకాకారాలతో ఉంటుందా అని విచారణ చేయబడుతుంది. రెండవ దానిలో ("ప్రకాశవచ్చ" అనే సూత్రంతో ప్రారంభించే అధికరణంలో) (ప్రథమాధికరణంలో నిర్ణయించిన)ప్రత్యస్తమితప్రపంచత్వం ఉండగా బ్రహ్మ సల్లక్షణమా(సద్రూపమా) లేక బోధలక్షణమా (చిద్రూపమా) లేక ఉభయలక్షణమా అని విచారణ చేయబడుతుంది. (అప్పుడు "ప్రకాశవచ్చ" ఇత్యాది సూత్రానికి బ్రహ్మ సద్రూపమే కాక చిద్రూపం కూడ; ఎందువలన అనగా "సత్యం జ్ఞానమ్" "సదేవ సోమ్య" అని రెండు శ్రుతులు బ్రహ్మ ద్విరూపం అని చెప్పితేనే సార్థకం అవుతాయి అని అర్థం. ఇది పూర్వపక్షం. "ఆహ చ తన్మాత్రమ్" అనగా బ్రహ్మ సన్మాత్రమే అని శ్రుతి చెప్పుచున్నది అని అర్థం.) ఇక్కడ రెండవ అధికరణం ప్రారంభించడం అన్ని విధాలా అనావశ్యక మని మేం అంటాం. పరబ్రహ్మకు అనేకలింగత్వాన్ని నిరాకరించడంకోసం ఈ ప్రయాస అంతా అయితే అది "న స్థానతోఽపి" అనే పూర్వాధికరణంచేతనే నిరాకరించబడినది గాన "ప్రకాశవచ్చ" ఇత్యాదికమైన ఈ రెండవ అధికరణం వ్యర్థమే అవుతుంది. బ్రహ్మ సల్లక్షణమే కాని బోధలక్షణం కాదు అనడానికి శక్యం కాదు. అలా చెపితే "విజ్ఞానఘన ఏవ" ఇత్యాది శ్రుతులు వ్యర్థం అవుతాయి. చైతన్యం లేని బ్రహ్మ చేతనమైన జీవునకు ఆత్మగా ఎలా ఉపదేశించబడుతుంది? బ్రహ్మ బోధలక్షణమే కాని సల్లక్షణం కాదు అనడానికి కూడ శక్యం కాదు. అప్పుడు "అస్తీత్యేవోపలబ్ధవ్యః" (బ్రహ్మ ఉన్నది అని మాత్రమే గ్రహించదగినది) ఇత్యాదిశ్రుతులు వ్యర్థం అయిపోతాయి. అది కాక-సత్త లేని బోధ ఎట్లు అంగీకరించబడుతుంది. (అనగా బోధకు సత్త లేదు అంటే అది శశవిషాణంవంటి దని చెప్పినట్లవుతుంది). బ్రహ్మ రెండు లక్షణములూ కలది అని చెప్పడానికి కూడ శక్యం కాదు. మొదట అంగీకరించినదానికి విరోధం కలుగుతుంది. సత్తకంటె భిన్నమైన బోధతోను. బోధకంటె భిన్నమైన సత్తతోను బ్రహ్మ కూడి ఉన్నది అని అంగీకరిస్తే పూర్వాధికరణంలో ఏ సప్రపంచత్వం నిరాకరించబడిందో అదే బ్రహ్మకు సంప్రాప్తిస్తుంది. అనగా బ్రహ్మను సప్రపంచ మని చెప్పిన ట్లవుతుంది. శ్రుతిలో చెప్పబడింది గాన దోషం

లేదు అని అంటే-అది యుక్తం కాదు. ఒకదానికి అనేకస్వభావా లుండడం ఉపపన్నం కాదు. అట్లు కాక సత్తయే బోధ, బోధయే సత్త; ఈ రెండూ పరస్పర భిన్నములు కావు అని అంటే-అప్పుడు బ్రహ్మసల్లక్షణమా, బోధలక్షణమా, లేక ఉభయలక్షణమా అనే వికల్పానికి ఆధారమే ఉండదు. మేమైతే సూత్రాలను ఒకే అధికరణంగా వ్యాఖ్యానించాం. మరొక విషయ మేమనగా ఆకారం గల బ్రహ్మను, అకారం లేని బ్రహ్మను ప్రతిపాదిస్తూ శ్రుతులు పరస్పరవిరుద్ధంగా ఉండగా అనాకారమైన బ్రహ్మను అంగీకరించి నప్పుడు ఇతర శ్రుతులకు కూడ తప్పక గతి చూపించవలసి ఉంటుంది. ఆ విధంగా వాటికి గతిని చూపడం కోసం ఉద్దిష్టమైనవి అని వ్యాఖ్యానిస్తేనే "ప్రకాశవచ్చ" ఇత్యాదిసూత్రాలకు సరియైన సార్థకత్వం లభిస్తుంది.

## భాష్యమ్

యదప్యాహుః- ఆకారవాదిన్యోఽపి శ్రుతయః ప్రపఞ్చప్రవిలయముఖేన అనాకారప్రతిపత్త్యర్థా ఏవ న పృథగర్థా ఇతి, తదపి న సమీచీనమివ లక్ష్యతే. కథమ్? యే హి పరవిద్యాధికారే కేచిత్ప్రపఞ్చా ఉచ్యన్తే యథా- "యుక్తా హ్యస్య హరయః శతా దశేత్యయం వై హరయోఽయం వైదశ చ సహస్రాణి బహూని చానన్తాని చ" (బృ.ఉ.2.5.19) ఇత్యేవమాదయస్తే భవన్తి ప్రవిలయార్థాః- "తదేతద్ బ్రహ్మాపూర్వమనపరమనన్తరమబాహ్యమ్"(బృ.ఉ.2.5.19)ఇత్యుప సంహారాత్. యే పునరుపాసనాధికారే ప్రపఞ్చా ఉచ్యన్తే యథా "మనోమయః ప్రాణశరీరో భారూపః"(ఛా.ఉ.3.14.2)ఇత్యేవమాదయో న తేషాం ప్రవిలయార్థత్యం న్యాయ్యమ్. "స క్రతుం కుర్వీత"(ఛా.ఉ.3.14.1)ఇత్యేవంజాతీయకేన ప్రకృతేనైవోపాసనావిధినా తేషాం సంబన్ధాత్. శ్రుత్యా చైవంజాతీయకయా గుణానాముపాసనార్థకత్వేఽవకల్ప్యమానే న లక్షణయా ప్రవిలయార్థత్వ మవకల్పతే. సర్వేషాం చ సాధారణే ప్రవిలయార్థత్వే సతి "అరూపవదేవ హి తత్ప్రధానత్వాత్ "(బ్ర.సూ.3.2.14) ఇతి వినిగమనకారణవచనమనవకాశం స్యాత్. ఫలమప్యేషాం యథోపదేశం క్వచిద్దురితక్షయః, క్వచిదైశ్వర్యప్రాప్తిః,

క్వచిత్క్రమముక్తిరిత్యవగమ్యత ఏవేత్యతః పార్థగర్థ్యమేవోపాసనావాక్యానాం బ్రహ్మవాక్యానాం చ న్యాయ్యం, నైకవాక్యత్వమ్.

బాలానందిని

యదపీతి:-సాకారబ్రహ్మను బోధించే శ్రుతులు ప్రపంచప్రవిలయం ద్వారా అనాకారబ్రహ్మను తెలుసుకొనానికి ఉద్దిష్ట మైనవే కాని వాటికి వేరుగా ప్రయోజనం ఏదీ లేదు అని వాళ్లు అనేది కూడ సరిగా ఉన్నట్లు కనబడదు. ఎందువల్ల? జ్ఞేయమైన పరబ్రహ్మను గూర్చి చెప్పే ప్రకరణంలో ఏ ప్రపంచాలు (విస్తృతవిషయాలు) "యుక్తా...అనన్తాని చ" ఇత్యాదివాక్యాలలో చెప్పబడ్డాయో అవి,-"తదేత...అబాహ్యమ్" అని ఆ ప్రకరణాన్ని ముగించడంచేత, ప్రవిలయంకోసం చెప్పబడినవి అవుతాయి.

వి. ఒక కార్యాన్ని పరీక్షించి చూస్తే దానికి ఏది కారణమో దానికంటె వేరుగా నిజానికి ఈ కార్యం అంటూ లేదు. దాని కారణం కంటె వేరుగా అది లేదు. ఉదాహరణకి కారణమైన మట్టికంటె వేరుగా కుండ అంటూ, వాస్తవంలో, ఏదీ లేదు. పృథివికి కారణమైన ఉదకం కంటె వేరుగా పృథివి అనేది లేదు. ఈ విధంగా నిషేధించుకుంటూ మూలకారణమైన బ్రహ్మవరకూ వెళ్లి బ్రహ్మకంటె వేరుగా ప్రపంచం అంటూ ఏదీ లేదు అని తెలుసుకొనడం ప్రంచవిలయం. ఇది ప్రతీసాధకుడు వైయక్తికంగా చేసికొనవలసిన, అతని బుద్ధికి మాత్రమే సంబంధించిన విషయం. ఇలా ప్రపంచవిలయం చేయడంచేత ఈ ప్రపంచం లేకుండా పోతుందని అర్థం కాదు. ఈ ప్రపంచం ఇతరు లందరికీ ఇదే విధంగా కనబడుతూనే ఉంటుంది. సాధకునికి కూడ కనబడుతూనే ఉంటుంది. ఇంక విశేష మేమనగా-సాధకుడు ప్రపంచాన్ని చూస్తూనే దాని మూలకారణాన్ని భావన చేస్తూ ఉంటాడు.

సాకార బ్రహ్మ ప్రతిపాదకా లైన శ్రుతులన్నీ ప్రపంచవిలయనంకొరకే ఉద్దిష్టమైనవి అని చెప్పడం యుక్తం కాదు. వాటిలో బ్రహ్మజ్ఞానోపదేశానికి ఉద్దిష్టాలైన ఘట్టాలలో ఉన్న సాకారప్రతిపాదకవాక్యాలే విలయనం కోసం ఉద్దిష్టమైనవి. వివిధఫలాలిచ్చే ఉపాసనాదులను బోధించే వాక్యాలు మాత్రం ప్రవిలయం కోసం చెప్పబడినవి కాదు. "యుక్తా హ్యస్య" ఇత్యాది వాక్యం పరవిద్యాప్రకరణంలో ఉంది గాన ఇది ప్రవిలయంకోసం చెప్పబడినదే. యుక్తా ఇత్యాదివాక్యానికి అర్థం-జీవుడుగా అయిన ఈశ్వరునికి పది

గుళ్ళాలు-పది ఇంద్రియాలు-పూన్చబడ్డాయి.(జీవభేదాన్నిపట్టి) వందలకొలది, వేలకొలది గుఱ్ఱాలు పూన్చబడ్డాయి. అయితే పదులలో, వందలలో, వేలలో, ఉన్న అనేకమైన, అనంతములైన ఈ హయాలు నిజానికి ఈశ్వరుడే. ఇది పరవిద్యాధికారం. అందుచేతనే "తదేతద్బ్రహ్మాపూర్వమనపరమనన్తరమబాహ్యమ్" అని ఈ ఘట్టం ముగించబడింది. ఇలాంటి స్థలాలలో సాకారవాక్యాలు ప్రవిలయార్థా లని చెప్పడంలో తప్పు లేదు.

యే పునరితి:- అయితే, ఉపాసనాధికారంలో (ఉపాసనాప్రకరణంలో) "మనోమయః ప్రాణశరీరో భారూపః" మొదలైన ఏ విస్తృతవిషయాలు చెప్పబడుచున్నాయో అవి కూడ ప్రవిలయం కోసమే చెపపబడ్డాయి అనడం న్యాయ్యం కాదు. ఎందువల్ల ననగా అవి "స క్రతుం కుర్వీత" ఇత్యాది వాక్యాలలో ఉన్న ప్రకృతమైన ఉపాసనావిధితోనే సంబధిస్తాయి. ఈ విధమైన గుణా లన్నీ ఉపాసనకొరకు ఉపయోగిస్తాయి అని శ్రుతి చెపుతూండగా, లక్షణచేత అవి ప్రవిలయార్థము లని చెప్పడం కుదరదు. అన్ని వాక్యాలూ ప్రవిలయార్థములే అయిన పక్షంలో "అరూపవదేవ హి తత్ప్రధానత్వాత్" అని వినిగమనకారణం చెప్పడం నిరవకాశం అవుతుంది.

వి. సాకారప్రతిపాదకాలు, నిరాకారప్రతిపాదకాలు అని రెండు విధాలైన శ్రుతు లున్నప్పుడు బ్రహ్మ అనాకారమే అని చెప్పడానికి వినిగమకం (నిర్ణాయకప్రమాణం)ఏమిటి అని సందేహం కలిగినప్పుడు "అస్థూలమనణు" ఇత్యాదివాక్యాలకు నిరాకారమునందే తాత్పర్యం గాన అదే నియామకం అని అరూపవదేవేత్యాదిసూత్రం చెపుతూన్నది. అన్ని వాక్యాలకు ప్రవిలయమే ప్రయోజనం అని చెప్పినట్లయితే ఈ సూత్రానికి అవకాశమే లేదు. అన్ని వాక్యాలు నిరాకారప్రతిపాదకాలైనప్పుడు శంకకే అవకాశం లేదు కదా.

ఫలమితి:-ఈ ఉపాసనలకు, శాస్త్రంలో చెప్పిన విధంగా కొన్నింటికి పాపక్షయం కొన్నింటికి ఐశ్వర్యప్రాప్తి, కొన్నింటికి క్రమముక్తి ఫలంగా కనబడుతున్నది గాన ఉపాసనావాక్యాలు బ్రహ్మవాక్యాలు వేరు వేరు ప్రయోజనాలనే బోధిస్తున్నాయి గాన వీటికి ఏకవాక్యత్వం చెప్పడం న్యాయ్యం కాదు.

## భాష్యమ్

కథం చైషామేకవాక్యతోత్ప్రేక్ష్యత ఇతి వక్తవ్యమ్. ఏకనియోగప్రతీతేః

ప్రయాజదర్శపూర్ణమాసవాక్యవదితి చేత్-న. బ్రహ్మవాక్యేషు నియోగాభావాత్, వస్తుమాత్రపర్యవసాయీని హి బ్రహ్మవాక్యాని న నియోగోపదేశీనీత్యేతద్విస్తరేణ ప్రతిష్ఠాపితం "తత్తుసమన్వయాత్" (బ్ర.సూ.1.1.4)ఇత్యత్ర. కింవిషయశ్చాత్ర నియోగోఽభిప్రేయత ఇతి వక్తవ్యమ్. పురుషో హి నియుజ్యమానః కుర్వితి స్వవ్యాపారే కస్మింశ్చిన్నియుజ్యతే. నను ద్వైతప్రపఞ్చవిలయో నియోగవిషయో భవిష్యతి. అప్రవిలాపితే హి ద్వైతప్రపఞ్చే బ్రహ్మతత్త్వావబోధో న భవతి, అతో బ్రహ్మతత్త్వావబోధప్రత్యనీకభూతో ద్వైతప్రపఞ్చః ప్రవిలాప్యః; యథా స్వర్గకామస్య యాగోఽనుష్ఠాతవ్య ఉపదిశ్యతే ఏవమపవర్గకామస్య ప్రపఞ్చప్ర విలయః. యథా చ తమసి వ్యవస్థితం ఘటాది తత్త్వమవబుభుత్సమానేన తత్ప్రత్య నీకభూతం తమః ప్రవిలాప్యతే ఏవం బ్రహ్మ తత్త్వమవబుభుత్సమానేన తత్ప్రత్యనీకభూతః ప్రపఞ్చః ప్రవిలాపయితవ్యః. బ్రహ్మస్వభావో హి ప్రపఞ్చో న ప్రపఞ్చస్వభావం బ్రహ్మ. తేన నామరూపవిలాపనేన బ్రహ్మతత్త్వావబోధో భవతీతి.

### బాలానందిని

**కథమితి:-** ఈ వాక్యాలకి ఏకవాక్యత ఉందని ఊహించడంకూడ ఎలా అనే విషయం చెప్పాలి. ప్రయాజదర్శపూర్ణమాసాదులలో వలె ఒకే నియోగం (విధి) కనబడుతున్నది కాబట్టి ఏకవాక్యత ఊహించబడున్నది అన్నట్లయితే-

వి. "దర్శపూర్ణమాసాభ్యాం యజేత" అని దర్శపూర్ణమాసయాగాలు విధింపబడ్డాయి. వాటికి అంగాలుగా ప్రయాజహోమా లనే హోమాలు విధింపబడ్డాయి. అంగి యైన దర్శపూర్ణమాసయాగాలచేత, అంగాలైన ప్రయాజలచేత సంపాదించవలసిన, ఫలజనకమైన పరమాపూర్వంకొరకైన నియోగం ఒక్కటేగాన దర్శపూర్ణమాసవిధాయక ప్రయాజవిధాయ కవాక్యాలకు ఏకవాక్యత ఏ విధంగా అంగీకరించబడినదో అట్లే తత్త్వ జ్ఞానం కావాలనుకొనేవాడు ప్రపంచవిలయనం చెయ్యాలి అనే ఒకే నియోగంలో సంబంధించి ఉండడంచేత ఈ సాకారానాకారవాక్యాలకు ఏకవాక్యత చెప్పవచ్చును అని పూర్వపక్షి అభిప్రాయం.

నేతి:- ఇది యుక్తం కాదు. బ్రహ్మవాక్యాలలో నియోగం (విధి)లేదు కదా? బ్రహ్మవాక్యాలు వస్తుతత్త్వాన్ని మాత్రమే చెప్పడంలో పర్యవసానం చెందుతాయి కాని నియోగాన్ని ఉపదేశించవు అని "తత్తు సమన్వయాత్" అనే చోట స్థాపించబడింది. ఇంతకీ-ఇక్కడ దేనిని గూర్చిన నియోగం అంగీకరించబడుతుందో చెప్పాలి. నియోగించబడే పురుషుడు ఈ పని చెయ్యి అని తాను చేయవలసిన ఒకానొక పనిలో నియోగించబడుతాడు కదా? (పూర్వపక్షి)-ద్వైతప్రపంచప్రవిలయం నియోగవిషయం. అవుతుంది; అనగా ద్వైతప్రపంచాన్ని విలీనం చెయ్యాలి అనేది విధించబడుతుంది. ద్వైతప్రపంచం విలాపితం కానంతవరకు బ్రహ్మతత్త్వావబోధం కలగదు. అందుచేత బ్రహ్మతత్త్వావబోధానికి విఘ్నకరమైన ద్వైతప్రపంచంయొక్క ప్రవిలాపనం చెయ్యాలి. స్వర్గకామం కలవానికి యాగం చేయదగినదిగా ఏ విధంగా ఉపదేశించబడుతున్నదో అట్లే మోక్షం కావాలనుకొన్నవానికి ప్రపంచప్రవిలయం విధించబడుతుంది. చీకటిలో ఉన్న ఘటాదివస్తువును తెలిసికొన దలచినవానిచేత దానికి అడ్డుగా ఉన్న తమస్సు ఏ విధంగా తొలగించబడుతుందో అట్లే బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకొనదలచుకొన్నవానిచేత బ్రహ్మతత్త్వజ్ఞానానికి విఘ్నకరమైన ప్రపంచం ప్రవిలాపితం చేయబడాలి. ప్రపంచం (కార్యం అవడంచేత) బ్రహ్మస్వరూపమైనది కాని బ్రహ్మ ప్రపంచస్వరూపం కాదు. అందుచేత నామరూపాత్మకమైన ప్రపంచాన్ని విలాపితం చేయడంచేత బ్రహ్మతత్త్వావబోధం కలుగుతుంది.

## భాష్యమ్

అత్ర వయం పృచ్ఛామః-కోఽయం ప్రపఞ్చప్రవిలయో నామ? కిమగ్నిప్రతాపసంపర్కాత్ ఘృతకాఠిన్యప్రవిలయ ఇవ ప్రపఞ్చప్రవిలయః కర్తవ్యః ఆహోస్విదేకస్మింశ్చన్ద్రే తిమిరకృతానేకచన్ద్రప్రపంచవదవిద్యాకృతో బ్రహ్మణి నామరూపప్రపఞ్చో విద్యయా ప్రవిలాపయితవ్య ఇతి. తత్ర యది తావద్విద్యమానోఽయం ప్రపఞ్చో దేహాదిలక్షణ ఆధ్యాత్మికః బాహ్యశ్చ పృథివ్యాదిలక్షణః ప్రవిలాపయితవ్య ఇత్యుచ్యతే స పురుషమాత్రేణాశక్యః ప్రవిలాపయితుమితి తత్ప్రవిలాపోపదేశోఽశక్యవిషయ ఏవ స్యాత్. ఏకేన

చాదిముక్తేన పృథివ్యాది ప్రవిలయః కృత ఇతీదానీం పృథివ్యాదిశూన్యం జగదభవిష్యత్. అథ అవిద్యాధ్యస్తో బ్రహ్మణ్యేకస్మిన్నయం ప్రపఞ్చో విద్యయా ప్రవిలాప్యత ఇతి బ్రూయాత్. తతో బ్రహ్మైవ అవిద్యాధ్యస్తప్రపఞ్చ ప్రత్యాఖ్యానేన అవేదయితవ్యమ్-"ఏకమేవాద్వితీయం బ్రహ్మ తత్సత్యం స ఆత్మా తత్త్వమసి" ఇతి. తస్మిన్నావేదితే విద్యా స్వయమేవోత్పద్యతే, తయా చావిద్యా బాధ్యతే. తతశ్చావిద్యాధ్యస్తః సకలోఽయం నామరూపప్రపఞ్చః స్వప్నప్రపఞ్చవత్ప్ర విలీయతే. అనావేదితే తు బ్రహ్మణి, బ్రహ్మవిజ్ఞానం కురు, ప్రపఞ్చవిలయం చ ఇతి శతకృత్వోఽప్యుక్తే న బ్రహ్మవిజ్ఞానం ప్రపఞ్చవిలయో వా జాయతే.

బాలానందిని

అత్రేతి:-ఈ విషయంలో మేం ఒక ప్రశ్న వేస్తున్నాం-ఏమిటీ ప్రపంచవిలయం అంటే? అగ్నియొక్క వేడి తగలడంవల్ల నెయ్యి కరిగినట్లు ప్రపంచప్రవిలయం చెయ్యాలా లేక ఒక చంద్రుని విషయంలో తిమిరదోషం (ఒకవిధమైన నేత్రదోషం) చేత కల్పింపబడిన అనేకచంద్రుల ప్రపంచంవలె బ్రహ్మయందు అవిద్యాకల్పితమైన నామరూపప్రపంచాన్ని విద్యచేత ప్రవిలాపితం చెయ్యాలా? దేహాదిరూపమైన ఈ ఆధ్యాత్మికప్రపంచమూ, బాహ్యమైన పృథివ్యాదిరూపమైన ప్రపంచమూ నిజంగానే ఉండగా దాని ప్రవిలాపనం చెయ్యాలి అని చెపితే దానిని మానవమాత్రుడు ప్రవిలాపనం చేయజాలడు గాన దాని ప్రవిలాపనం చెయ్యాలి అని చెప్పడం అశక్యమైన విషయమే అవుతుంది. (అథవా శక్యం అవుతుంది అనుకున్నా కూడ) ఎవడో ఒక ఆదిముక్తుడు (మొట్టమొదట మోక్షం పొందినవాడు) పృథివ్యాదిప్రవిలయం చేసే ఉంటాడు కాబట్టి ఇప్పుడు జగత్తు పృథివ్యాదిశూన్యం అయి ఉండేది. అట్లు కాక అద్వితీయమైన బ్రహ్మయందు అవిద్యచేత అధ్యసించబడిన ఈ ప్రపంచం విద్యచేత ప్రవిలాపితం చేయబడుతుంది అని అన్నట్లయితే అప్పుడు అవిద్యచేత అధ్యసించబడిన ప్రపంచాన్ని నిరాకరించి "ఏకమేవాద్వితీయం బ్రహ్మ", "తత్సత్యం స ఆత్మా తత్త్వమసి" అని బ్రహ్మనే తెలపాలి. ఆ బ్రహ్మను బోధిస్తే విద్య స్వయంగానే పుడుతుంది, దానిచేత అవిద్య బాధించబడుతుంది. దానితో అవిద్యాధ్యస్తమైన ఈ సమస్తమైన నామరూపప్రపంచమూ కూడ స్వప్నప్రపంచం వలె

లీనమై పోతుంది. బ్రహ్మను బోధించకుండా "బ్రహ్మజ్ఞానం చెయ్యి (సంపాదించు). ప్రపంచప్రవిలయం కూడ చెయ్యి" అని వందసార్లు (వందలకొలది పర్యాయాలు)చెప్పినా కూడ బ్రహ్మవిజ్ఞానం పుట్టదు; ప్రపంచప్రవిలయం జరగదు.

## భాష్యమ్

నన్వావేదితే బ్రహ్మణి తద్విజ్ఞానవిషయః ప్రపఞ్చవిలయవిషయో వా నియోగః స్యాత్? న. నిష్ప్రపఞ్చబ్రహ్మాత్మవేదనేనైవోభయసిద్ధేః. రజ్జుస్వరూపప్రకాశనేనైవ హి తత్స్వరూపవిజ్ఞానమవిద్యాధ్యస్తసర్పాది ప్రపఞ్చప్రవిలయశ్చ భవతి. న చ కృతమేవ పునః క్రియతే. నియోజ్యోఽపి చ ప్రపఞ్చావస్థాయాం యోఽవగమ్యతే జీవో నామ స ప్రపఞ్చపక్షస్యైవ వా స్యాద్బ్రహ్మపక్షస్యైవ వా? ప్రథమే వికల్పే నిష్ప్రపఞ్చబ్రహ్మత్వప్రతిపాదనేన పృథివ్యాదివజ్జీవస్యాపి ప్రవిలాపితత్వాత్కస్య ప్రపఞ్చవిలయే నియోగ ఉచ్యేత, కస్య వా నియోగనిష్ఠతయా మోక్షోఽవాప్తవ్య ఉచ్యేత? ద్వితీయేఽపి బ్రహ్మైవానియోజ్యస్వభావం జీవస్య స్వరూపం జీవత్వం త్వవిద్యాకృతమేవేతి ప్రతిపాదితే బ్రహ్మణి నియోజ్యాభావాన్నియోగాభావ ఏవ. ద్రష్టవ్యాదిశబ్దా అపి పరవిద్యాధికారపఠితాస్తత్త్వాభిముఖీకరణప్రధానా న తత్త్వావబోధవిధిప్రధానా భవన్తి. లోకేఽపీదం పశ్య, ఇదమాకర్ణయ ఇతి చైవంజాతీయకేషు నిర్దేశేషు ప్రణిధానమాత్రం కుర్విత్యుచ్యతే న సాక్షాత్ జ్ఞానమేవ కుర్వితి. జ్ఞేయాభిముఖస్యాపి జ్ఞానం కదాచిజ్జాయతే కదాచిన్న జాయతే, తస్మాత్తం ప్రతి జ్ఞానవిషయ ఏవ దర్శయితవ్యో జ్ఞాపయితుకామేన. తస్మిన్ దర్శితే స్వయమేవ యథావిషయం యథాప్రమాణం చ జ్ఞానముత్పద్యతే. న చ ప్రమాణాన్తరేణాన్యథాప్రసిద్ధేఽర్థేఽన్యథాజ్ఞానం నియుక్తస్యాప్యుపపద్యతే. యది పునర్నియుక్తోఽహమిత్యన్యథాజ్ఞానం కుర్యాన్న తద్ జ్ఞానమ్; కిం తర్హి? మానసీ సా క్రియా. స్వయమేవ చేదన్యథోత్పద్యేత భ్రాన్తిరేవ స్యాత్. జ్ఞానం తు ప్రమాణజన్యం యథాభూతవిషయం చ న

తన్నియోగశతేనాపి కారయితుం శక్యతే. న చ ప్రతిషేధశతేనాపి వారయితుం శక్యతే. న హి తత్పురుషతన్త్రమ్; వస్తుతన్త్రమేవ తత్. అతోఽపి నియోగాభావః.

బాలానందిని

నన్వితి :-(ప్రశ్న) బ్రహ్మ బోధించబడిన తరవాత ఆ బ్రహ్మయొక్క జ్ఞానాన్ని గూర్చి గాని, ప్రపంచ ప్రవిలయాన్ని గూర్చిగాని నియోగం ఉండవచ్చును కదా? (సమాధానం) అది యుక్తం కాదు. నిష్ప్రపంచమైన బ్రహ్మయే ఆత్మఅని చెప్పడంచేతనే ఆ రెండూ కూడ (బ్రహ్మవిజ్ఞాన-ప్రపంచవిలయాలు) సిద్ధిస్తాయి కదా? రజ్జువుయొక్క స్వరూపాన్ని ప్రకాశింపచేయడంచేతనే దాని స్వరూపం తెలియడం, అవిద్యచేత అధ్యసించబడిన సర్పాదిప్రపంచంయొక్క ప్రవిలయమూ కూడ జరుగుతాయి కదా? ఒక మాటు చేసిన దానినే మళ్లీ చేయడం ఉండదు. ప్రపంచావస్థలో నియోజ్యుడని చెప్పబడే జీవు డనేవా డెవడున్నాడో వాడు ప్రపంచపక్షానికి చెందుతాడా బ్రహ్మపక్షానికి చెందుతాడా? మొదటి వికల్పంలో -నిష్ప్రపంచబ్రహ్మతత్వాన్ని ప్రతిపాదించడంచేత పృథివ్యాదులవలె జీవుడు కూడ ప్రవిలాపితు డైపోవడంచేత ప్రపంచవిలయం చేయమని ఎవడు నియోగింప బడతాడు? ఆ నియోగాన్ని పాటించడంచేత ఎవడు మోక్షం పొందాలని చెప్పబడతాడు?రెండవ వికల్పంలో కూడ నియోగించబడడానికి శక్యం కాని స్వభావం గల బ్రహ్మయే జీవుని స్వరూపం, జీవత్వమైతే అవిద్యాకల్పితమే అని ప్రతిపాదించిన తరవాత బ్రహ్మవిషయంలో నియోగింపతగిన వా డెవడూ లేకపోవడంచేత నియోగానికి అభావమే(నియోగం ఉండదు). పరవిద్యాధికారంలో పఠింపబడిన (ఆత్మవిద్యను బోధించే ఘట్టాలలో కనబడే)" ద్రష్టవ్యః" (ఆత్మను తెలుసుకొనాలి) ఇత్యాదిశబ్దాలు కూడ తత్వం విషయమై(సాధకుణ్ణి)అభిముఖుణ్ణి చేయడంకోసమే ప్రధానంగా ఉద్దిష్ట మైనవి కాని తత్వాన్ని తెలుసుకోవాలి అని విధించడంకోసం ప్రధానంగా ఉద్దిష్టమైనవి కావు. లోకంలో కూడ "ఇది చూడు, ఇది విను" ఇత్యాది నిర్దేశాలలో మనస్సును ఏకాగ్రం చెయ్యి అని మాత్రమే చెప్పబడుతుందిగాని సాక్షాత్తు జ్ఞానమునే చెయ్యి అని చెప్పబడడంలేదు. తెలియదగి నదానికి అభిముఖుడుగా ఉన్నవానికి కూడ ఒకప్పుడు జ్ఞానం కలుగుతుంది. ఒకప్పుడు కలగదు. అందుచేత వానిని తెలుసుకొనేటట్లు చేయదలచినవాడు వానికి జ్ఞానవిషయాన్ని మాత్రమే(దేనిని తెలుసుకోవాలో దానిని

మాత్రమే)చూపించాలి. అది చూపించిన తరవాత విషయానుసారంగా ప్రమాణానుసారంగా (చక్షురాద్య నుసారంగా)జ్ఞానం పుడుతుంది. మరొక ప్రమాణంచేత మరొక విధంగా ప్రసిద్ధ మైన(నిర్ధితమైన)ఒక వస్తువు విషయంలో, ఇతరులచేత నియోగింపబడిన వానికి కూడ, మరొక విధమైన జ్ఞానం కలగదు కదా?(ఉదాహరణకి ఎదుట నున్న గోవును చూపి దీనిని మనిషిగా గ్రహించాలి అని చెప్పినా కూడ వానికి మనిషి అనే జ్ఞానం కలగదు). ఇతడు నన్ను ఆ జ్ఞాపిస్తున్నాడు కదా అని ఆ వస్తువును మరొక వస్తువుగానే గ్రహిస్తే అది జ్ఞానం కాదు; మానసమైన క్రియ మాత్రమే; అనగా కావాలని మనస్సులో ఆ విధంగా చేసిన భావన మాత్రమే. వానికి స్వయంగానే మరొకవస్తు వనే జ్ఞానం కలిగితే అది భ్రాంతిమాత్రమే అవుతుంది. జ్ఞాన మైతే ప్రమాణాలవల్ల పుడుతుంది; వస్తువు ఎలా ఉంటే అలాగ దానిని గ్రహిస్తుంగి. వంద నియోగాలు చేసినా దానిని చేయించడం శక్యం కాదు; వందసార్లు నిషేధించినా నివారించడానికి( కలగకుండా చేయడానికి) శక్యం కాదు. అది పురుషాధీనం కాదు. వస్త్వధీన మైనది. ఆ కారణంవల్ల కూడ (ఇక్కడ)నియోగానికి అవకాశం లేదు.

## భాష్యమ్

కిం చాన్యత్ నియోగనిష్ఠతయైవ పర్యవస్యత్యామ్నాయే యదభ్యుపగతమనియోజ్యబ్రహ్మాత్మత్వం జీవస్య తదప్రమాణమేవ స్యాత్. అథ శాస్త్రమేవానియోజ్యబ్రహ్మాత్మత్వమప్యాచక్షీత తదవబోధే చ పురుషం నియుఞ్జీత తతో బ్రహ్మశాస్త్రస్యైకస్య ద్వ్యర్థపరతా, విరుద్ధార్థపరతా చ ప్రసజ్యేయాతామ్. నియోగపరతాయాం చ శ్రుతహానిరశ్రుతకల్పనా కర్మఫలవన్మోక్షఫలస్యాదృష్టఫలత్వమ్ అనిత్యత్వం చేత్యేవమాదయో దోషా న కేన చిత్పరిహర్తుం శక్యాః. తస్మా దవగతినిష్ఠాన్యేవ బ్రహ్మవాక్యాని,న నియోగనిష్ఠాని. అతశ్చైకనియోగప్రతీతేరేకవాక్యతేత్యయుక్తమ్. అభ్యుపగమ్యమానేఽపి చ బ్రహ్మవాక్యేషు నియోగసద్భావే తదేకత్వం నిష్ప్రపఞ్చోపదేశేషు సప్రపఞ్చోపదేశేషు చ సిద్ధమ్. న హి శబ్దాన్తరాదిభిః ప్రమాణైర్నియోగభేదేఽవ గమ్యమానే సర్వత్రైకో నియోగ ఇతి శక్యమాశ్రయితుమ్. ప్రయాజదర్శపూర్ణమాసవాక్యేషు త్వధికారాంశేన

అభేదాద్యుక్తమేకత్వమ్. న త్విహ సగుణనిర్గుణచోదనాసు కశ్చిదేకత్వాధికారాంశోఽస్తి. న హి భారూపత్వాదయో గుణాః ప్రపఞ్చప్రవిలయోపకారిణః, నాపి ప్రపఞ్చప్రవిలయో భారూపత్వాదిగుణోపకారీ; పరస్పరవిరోధిత్వాత్. న హి కృత్స్నప్రపఞ్చప్రవిలాపనం, ప్రపఞ్చైకదేశాపేక్షణం చైకస్మిన్ ధర్మిణి యుక్తం సమావేశయితుమ్. తస్మాదస్మదుక్త ఏవ విభాగః అకారవదనాకారోపదేశానాం యుక్తతర ఇతి. 21.

బాలానందిని

కిం చేతి:- మరొక విషయ - శ్రుతికి పర్యవసానం నియోగంలోనే అని అంటే జీవుడు అనియోజ్యబ్రహ్మ స్వరూపు డని అంగీకరించడం అప్రాణికమే అవుతుంది. అలా కాక శాస్త్రమే అనియోజ్యబ్రహ్మత్మత్వాన్ని బోధిస్తూన్నది. ఆ బ్రహ్మను తెలుసుకొనవలసిందిగా శాస్త్రమే పురుషుణ్ణి నియోగిస్తూన్నది (అందుచేత అప్రామాణ్యదోషం లేదు) అని అంటే ఒకే బ్రహ్మశాస్త్రం రెండు అర్థాలు (అనియోజ్యబ్రహ్మత్మత్వాన్నీ,నియోగాన్నీ) బోధిస్తూన్నదని, ఆ బోధించబడే అర్థాలు కూడ విరుద్ధార్థా లనీ చెప్పినట్లవుతుంది. వేదాంతాలు నియోగపరాలని చెప్పే టట్లయితే వేదాంతాలలో ప్రధానంగా శ్రుతమైన (చెప్పబడిన) బ్రహ్మరూపమైన అర్థానికి హాని, వినబడని నియోగాన్ని కల్పించడం, కర్మఫలం వలె మోక్షరూప మైన ఫలం కూడ అదృష్టఫలం (అదృష్టంయొక్క ఫలం, లేదా ఇప్పుడు చూడబడని మరణానంతరం లభించే ఫలం) అని చెప్పవలసి ఉండడం, అది అనిత్యం అవడం - ఈ మొదలైన దోషాలను ఎవ్వరూ పరిహరింపజాలదు. అందువల్ల బ్రహ్మవాక్యాలు జ్ఞాననిష్ఠములే (జ్ఞానప్రతిపాదకములే) కాని నియోగవిషములు (విధి రూపములు) కావు. అందువల్ల కూడ ఒకే నియోగాన్ని ప్రతిపాదించడంచేత ఈ రెండు విధాలైన వాక్యాలకు ఏకవాక్యత అని చెప్పడం అయుక్తం. బ్రహ్మవాక్యాలలో నియోగం ఉన్నదని అంగీకరించినా కూడ నిష్ప్రపంచాన్ని ఉపదేశించే వాక్యాలలోను సప్రపంచాన్ని ఉపదేశించే వాక్యాలలోను ఒకే నియోగం ఉన్న దనే మాట అసిద్ధం (ఒకే నియోగం లేదు). శబ్దాంతరం మొదలైన ప్రమాణాలచేత నియోగభేదం తెలుస్తూండగా అన్నింటిలోనూ ఒకే నియోగం అని చెప్పడానికి శక్యం కాదు.

వి. బ్రహ్మవాక్యాలలో నియోగం లేదు అనేది సిద్ధాంతం. అయితే పూర్వపక్షి

అభిప్రాయం ప్రకారం నియోగం ఉన్నది అని అంగీకరించినా కూడ రెండు రకాలైన వాక్యాలలోను ఉన్న నియోగం ఒకటే అని చెప్పడం కుదరదు అని ఇక్కడ చెప్పబడుచున్నది. వేరు వేరు క్రియలను బోధించే శబ్దాలను ప్రయోగించినప్పుడు అక్కడ వేరు వేరు నియోగాలు. ఉదాహరణకి "యజతి, దదాతి" అను రెండు విభిన్నక్రియాబోధకపదాలు ప్రయోగించి నప్పుడు అవి రెండు నియోగాలు, కాని-ఒకే నియోగం కాదు. అట్లే ఇక్కడ కూడ 'వేద' 'ఉపాసీత' అని వేరు వేరు శబ్దాలు ప్రయోగింపబడుతున్నాయి గాన ఈ రెండు నియోగాలు ఒకటి కాదు. ఇట్లే ఒకటి నిర్గుణప్రతిపాదకము. రెండవది సగుణప్రతిపాదకము అనే రూపభేదంచేత, ప్రకరణాల భేదంచేత, ఒకదాని ఫలం ముక్తి, రెండవదాని ఫలం అభ్యుదయం అనే ఫలభేదంచేత-ఈ కారణాలచేత కూడ నిర్గుణ జ్ఞానవిషయకమైన నియోగానికి, సగుణోపాసనావిషయకనియోగానికీ భేదం ఉంది. అందుచేత నియోగం ఒకటే గాన ఏకవాక్యత అని చెప్పడం అయుక్తం అని భావం.

ప్రయాజేతి:- ప్రయాజదర్శపూర్ణమానవాక్యాలలో అయితే అధికారాంశంలో అభేదంచేత ఏకత్వం యుక్తమ్. (అనగా ప్రయాజలు అంగం, దర్శపూర్ణమాసాలు అంగి. స్వర్గం కావాలనే కోరిక కలవాడే సాంగమైన దర్శపూర్ణమాసయాగాలను చేయడానికి అధికారి. ఆ రెండూ కలిసి ఒక ఫలాపూర్వాన్ని సృష్టిస్తాయి. అందుచేత ఆ వాక్యాలకు ఏకనియోగత్వము, ఏకవాక్యత్వమూ చెప్పబడింది గాని ఇక్కడ స్థితి అలాంటిది కాదని అర్థం). ఈ సగుణనిర్గుణబోధనలలో నైతే ఏకత్వాధికారాంశం ఏదీ లేదు. ఎందువల్ల ననగా భారూపత్వం మొదలైన గుణాలు ప్రపంచప్రవిలయానికి ఉపకరించవు. ప్రపంచప్రవిలయం భారూపత్వం మొదలైన గుణాలకు ఉపకరించదు. ఇవి పరస్పరవిరుద్ధములు. (భారూపత్వం ఉంటే ప్రపంచప్రవిలయనం ఉండదు; ప్రపంచ ప్రవిలనయనం ఉంటే భారూపత్వం ఉండదు. ఈ విధంగా పరస్పరవిరుద్ధ మైనవాటికి అంగాంగిభావం ఉండదు అని భావం). సమస్తమైన ప్రపంచంయొక్క ప్రవిలాపనం చేయడం ప్రపంచంలోని ఒక భాగాన్ని (భారూపత్వాదికాన్ని) అపేక్షించడం అనేవి ఒకే ధర్మి యందు(బ్రహ్మయందు)కలపడం యుక్తం కాదు కదా? అందుచేత ఆకారవదనాకారోపదేశాల విషయంలో మేం చెప్పిన విభాగమే చాల యుక్తంగా ఉన్నది. 2.1.

ఉభయలిఙ్గాధికరణం సమాప్తం.

### 6. ప్రకృతైతావత్త్వాధికరణమ్. సూ. 22-30

**సూ. ప్రకృతైతావత్త్వం హి ప్రతిషేధతి తతో బ్రవీతి చ భూయః. 3.2.22.**

"ద్వే వా వ బ్రహ్మణో రూపే మూర్తం చైవామూర్తం చ" (బృ.ఉ.2.3.1) ఇత్యుపక్రమ్య పఞ్చ మహాభూతాని ద్వైరాశ్యేన ప్రవిభజ్య అమూర్తరసస్య చ పురుషశబ్దోదితస్య మాహారజనాదీని రూపాణి దర్శయిత్వా పునః పఠ్యతే- "అథాత ఆదేశో నేతి నేతి న హ్యేతస్మాదితి నేత్యన్యత్పరమస్తి" (బృ.ఉ.2.3.6) ఇతి. తత్ర కోఽస్య ప్రతిషేధస్య విషయ ఇతి జిజ్ఞాసామహే-న హ్యత్రేదం తదితి విశేషితం కించిత్ప్రతిషేధ్యముపలభ్యతే. ఇతిశబ్దేన త్వత్ర ప్రతిషేధ్యం కిమపి సమర్ప్యతే, నేతి నేతీతి ఇతిపరత్వాన్నఞ్ప్రయోగస్య. ఇతిశబ్దశ్చాయం సంనిహితాలమ్బన ఏవంశబ్దసమానవృత్తిః ప్రయుజ్యమానో దృశ్యతే-"ఇతి హ స్మోపాధ్యాయః కథయతి" ఇత్యేవమాదిషు. సంనిహితం చాత్ర ప్రకరణ సామర్థ్యాద్రూపద్వయం సప్రపఞ్చం బ్రహ్మణః, తచ్చ బ్రహ్మ యస్య తే ద్వే రూపే. తత్ర సంశయ ఉపజాయతే-కిమయం ప్రతిషేధో రూపే రూపవచ్చోభయమపి ప్రతిషేధతి ఆహోస్విదేకతరమ్. యదాప్యేకతరం తదాపి కిం బ్రహ్మ ప్రతిషేధతి రూపే పరిశినష్టి, ఆహోస్విద్రూపే ప్రతిషేధతి బ్రహ్మ పరిశినష్టీతి. తత్ర ప్రకృతత్వావిశేషాదుభయమపి ప్రతిషేధతీత్యాశఙ్కామహే. ద్వౌ చైతౌ ప్రతిషేధౌ ద్విర్నేతి శబ్దప్రయోగాత్. తయోరేకేన సప్రపఞ్చం బ్రహ్మణో రూపం ప్రతిషిధ్యతేఽపరేణ రూపవద్బ్రహ్మేతి భవతి మతిః. అథవా బ్రహ్మైవ రూపవత్ప్రతిషిధ్యతే. తద్ధి వాఙ్మనసాతీతత్వాదసంభావ్యమానసద్భావం ప్రతి షేధార్హమ్; న తు రూపప్రపఞ్చః ప్రత్యక్షాదిగోచరత్వాత్ప్రతిషేధార్హః. అభ్యాస స్త్వాదరార్థ ఇతి.

### బాలానందిని

అవ.బృహదారణ్యకంలో బ్రహ్మకు రెండు రూపా లున్నాయని చెపుతూ పృథివీ-

తేజో-జలాత్మకమైన రూపం మూర్త మనీ, ఆదిత్యమండలం దాని కార్య మనీ చెప్పబడింది వాయ్వన్తరిక్షాత్మకమైన బ్రహ్మరూపం అమూర్తం. ఆదిత్యమండలంలోపల నున్న పురుషుడు అమూర్తబ్రహ్మయొక్క కార్యం. ఇది అధిదైవత మైన మూర్తామూర్తప్రపంచం. అట్లే అధ్యాత్మమైన, అనగా శరీరాంతర్గతమైన, మూర్తామూర్తనిరూపణం చేయబడింది. శరీరారంభకమైన తేజోబన్నాత్మకమైన రూపం అధ్యాత్మికమైన మూర్తం. దాని కార్యం నేత్రగోలం. శరీరంలో ఉన్న వాయ్వాకాశాత్మకమైన రూపం అమూర్తరూపం. దాని కార్యం లింగశరీరం. దీనికి పురుషు డని పేరు. అది అమూర్తరసం. లింగశరీరంయొక్క రూపం పసుపురంగు బట్ట వలె, తెల్లని ఉన్ని బట్ట వలె, ఇంద్రగోపం వలె, విద్యుత్తు వలె నానావర్ణాలతో ఉంటుంది అని చెప్పబడింది. ఆ ఘట్టంలో ఉన్న విషయాన్ని గూర్చి ఇప్పుడు చర్చ చేయబడుచున్నది-

ప్రకృతేతి:- "ప్రకృతైతావత్త్వమ్=నేతి నేతి అను శ్రుతి ప్రకృతమై రూపద్వయాత్మకమైన పరిచ్ఛేద్యాన్ని, ప్రతిషేధతి=నిషేధించుచున్నది. తతః=ప్రపంచాన్ని నిషేధించిన తరవాత, భూయః=మరల బ్రహ్మ ఉన్నదని, బ్రవీతి చ=చెప్పుచున్నది కూడ. అందుచేత బ్రహ్మను నిషేధించడం లేదు" అని సూత్రార్థం.

ద్వే ఇతి :- "ద్వే...అమూర్తం చ" (బ్రహ్మయొక్క రూపాలు మూర్తము అమూర్తము అని రెండు) అని ఉపక్రమించి పంచమహాభూతాలను రెండు రాసులుగా విభజించి పురుషు డనే పేరు గల అమూర్తరసానికి సంబంధించిన మహారాజనాదిరూపాలను (పసుపుబట్టవంటి రూపం మొదలైనవాటిని) చూపించి మళ్లీ "అథ...అస్తి" అని పఠించబడుచున్నది. (అథ=సత్యదాత్మకమైన ప్రపంచాన్ని గూర్చి చెప్పిన తరువాత, అతః=ఈ ఆరోపం నిషేధంకొరకే చెప్పబడింది కాబట్టి, నేతి నేతి=నిషేధంచేత, ఆదేశః=ఉపదేశం చేయబడుచన్నది. ఏతస్మాత్=ఈ ఆత్మకంటె పరమ్=పరమైన, అన్యత్=మరొకటి ఏదీ, నాస్తి=లేదు గాన, నేతి అని చెప్పబడుచున్నది అని ఈ వాక్యానికి అర్థం). ఇక్కడ ఈ నిషేధానికి విషయం ఏది (ఏది నిషేధించబడుచున్నది)అని తెలియగోరుతున్నాం. ఇక్కడ ఈ ఫలానాది నిషేధించబడుచున్నది అని ఏదీ కనబడడంలేదు. అయితే నఞ్ప్రయోగానికి పరంగా 'ఇతి' అనేది ఉండడంచేత ప్రతిషేధించదగినది ఏదో ఒకటుందని ఇతిశబ్దం ఆ ప్రతిషేధ్యాన్ని సమర్పిస్తున్నది. ఇతి శబ్దాన్ని ఏవంశబ్దంవలె

దగ్గర ఉన్నదానిని నిర్దేశిస్తూన్నట్లు ప్రయోగించడం "ఇతి హ స్మోపాధ్యాయః కథయతి" (ఉపాధ్యాయుడు ఇలా చెప్పాడు) ఇత్యాదులలో కనబడుతున్నది. ఇక్కడ ప్రకరణ సామర్థ్యాన్ని పట్టి బ్రహ్మయొక్క సప్రపంచమైన రూపద్వయమూ, ఈ రెండు రూపాలూ దేనికి సంబంధించినవో ఆ బ్రహ్మ కూడ సన్నిహితంగా ఉన్నాయి. అక్కడనే-ఈ ప్రతిషేధం రూపాలను, రూపవత్తును ఉభయాన్నీ నిషేధిస్తూన్నదా లేక ఏదో ఒకదానినే నిషేధిస్తున్నదా అని మాకు సంశయం కలుగుచున్నది. ఒకదానిని నిషేధిస్తూన్నది అని చెప్పినప్పుడు కూడ బ్రహ్మను నిషేధించి రూపాలను మిగుల్చుచున్నదా లేక రూపాలను నిషేధించి బ్రహ్మను మిగల్చుచున్నదా అని సంశయం. ఉభయమూ ప్రకృతమే గాన భేదం ఏదీ లేకుండా ఉభయాన్నీ నిషేధిస్తూన్న దని మాకు ఆశంక కలుగుచున్నది. 'నేతి' అనే శబ్దాన్ని రెండు మార్లు ప్రయోగించడంచేత ఇక్కడ నిషేధాలు కూడ రెండున్నాయి. వాటిలో ఒకదానిచేత బ్రహ్మయొక్క సప్రపంచమైన రూపం నిషేధించబడుచున్నది, రెండవదానిచేత రూపవత్తైన బ్రహ్మ నిషేధించబడుచున్నది అని అభిప్రాయం కలుగుతుంది. లేదా రూపవత్తైన బ్రహ్మయే నిషేధించబడుచున్నది; ఎందువల్లననగా అది వాఙ్మనస్సులకు అతీతం అవడంచేత దాని ఉనికి సంభావ్యం కాదు గాన నిషేధించడానికి తగినదే. అంతే కాని ప్రత్యక్షాదులకు గోచరం అవడంచేత ఈ రూపప్రపంచం నిషేధార్హం కాదు. 'నేతి' అనే దానిని అవృత్తి చేయడమైతే ఆదరం చూపడం కోసం.

వి.నిషేధశ్రుతులచేత నిర్విశేషమైన బ్రహ్మ సిద్ధిస్తుంది అని వెనుక చెప్పబడింది. కాని బ్రహ్మ కూడ ఆ శ్రుతులచేత నిషేధింపబడినది గాన అది అయుక్తం అని ఆక్షేపసంగతితో ఈ పూర్వపక్షం చేయబడింది. పూర్వపక్షంలో బ్రహ్మయే సిద్ధించకపోవడం ఫలం, సిద్ధాంతంలో బ్రహ్మసిద్ధి ఫలం.

భాష్యమ్.

ఏవం ప్రాప్తే బ్రూమః-న తావదుభయప్రతిషేధ ఉపపద్యతే, శూన్యవాదప్రసంగాత్. కించిద్ధి పరమార్థమాలమ్బ్యాపరమార్థం ప్రతిషిధ్యతే, యథా రజ్జ్వాదిషు సర్పాదయః. తచ్చ పరిశిష్యమాణే కస్మింశ్చిద్భావేఽవకల్పతే. కృత్స్నప్రతిషేధే తు కోఽన్యో భావః పరిశిష్యేత? అపరిశిష్యమాణే చాన్యస్మిన్య ఇతరః ప్రతిషేద్ధుమారభ్యతే ప్రతిషేద్ధుమశక్యత్వాత్తస్యైవ పరమార్థత్వాపత్తేః

ప్రతిషేధానుపపత్తిః. నాపి బ్రహ్మప్రతిషేధ ఉపపద్యతే-"బ్రహ్మ తే బ్రవాణి" (బృ.ఉ.2.1.1). ఇత్యాద్యుపక్రమవిరోధాత్. "అసన్నేవ స భవతి, అసద్బ్రహ్మేతి వేద చేత్" (తై.ఉ.2.6.1)ఇత్యాదినిన్దావిరోధాత్. "అస్తీత్యేవోపలబ్ధవ్యః" (క.ఉ.6.13)ఇత్యవధారణవిరోధాత్, సర్వవేదాన్తవ్యాకోపప్రసంగాచ్చ. వాఙ్మనసాతీత్వమపి బ్రహ్మణో నాభావాభిప్రాయేణాభిధీయతే. న హి మహతా పరికరబన్ధేన "బ్రహ్మవిదాప్నోతి పరమ్" (తై.ఉ.2.1.1)," సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" (తై.ఉ.2.11.1) ఇత్యేవమాదినా వేదాన్తేషు బ్రహ్మ ప్రతిపాద్య తస్యైవ పునరభావోఽభిలప్యేత. "ప్రక్షాలనాద్ధి పఙ్కస్య దూరాదస్పర్శనం వరమ్" ఇతి హి న్యాయః. ప్రతిపాదనప్రక్రియా.త్వేషా "యతో వాచో నివర్తతే అప్రాప్య మనసా సహ" (తై.ఉ.2.4.1)ఇతి. ఏతదుక్తం భవతి-వాఙ్మనసాతీతమవిషయాన్తఃపాతి ప్రత్యగాత్మభూతం నిత్యశుద్ధముక్తస్వభావం బ్రహ్మేతి. తస్మాద్బ్రహ్మణో రూపప్రపఞ్చం ప్రతిషేధతి, పరిశినష్టి బ్రహ్మేత్యభ్యుపగన్తవ్యమ్. తదేతదుచ్యతే-ప్రకృతైతావత్త్వం హి ప్రతిషేధతీతి.

బాలానందిని

ఏవమితి:-ఇట్లు ప్రాప్తించగా చెపుతున్నాం. ఉభయప్రతిషేధం యుక్తం కాదు. అప్పుడు శూన్యవాదం అంగీకరించిన ట్లవుతుంది. రజ్జ్వాదులయందు సర్పాదులను నిషేధించి నట్లు ఏదో ఒక పరమార్థమైనదానిని ఆధారంగా తీసికొని అపరమార్థమైనది నిషేధించబడుతుంది. ఏదైన ఒక భావపదార్థం మిగిలి నప్పుడే అది కుదురుతుంది. సమస్తాన్నీ నిషేధిస్తే ఇంక మిగిలే భావపదార్థం ఏముంటుంది? మరొక టేదీ మిగలకపోతే ఏ ఇతరవస్తువును నిషేదించడానికి ఉపక్రమం చేయబడిందో దానిని నిషేధించడం శక్యం కాదు గాన, అది పరమార్థం అయిపోతుందిగాన ప్రతిషేధమే కుదరదు.

ఏ. ఒక వస్తువు కనబడింది. దానిని నిషేధిస్తున్నాం. అప్పుడు ఆ వస్తువు లేదని అర్థమయింది. అయితే అక్కడ ఏదో ఒక వస్తువు కనబడింది కదా? కనబడినదానిని లేదంటున్నాం. అందుచేత అక్కడున్నది ఒకటి కనబడినది ఒకటి అని చెప్పితీరాలి. ఉదాహరణకి కనబడిన సర్పాన్ని నిషేధించినప్పుడు అది దేనిమీద కనబడిందో ఆ త్రాడు

ఉన్నట్లు అంగీకరించాలి. ఆ త్రాడును అంగీకరించకపోతే ఏదైతే కనబడిందో ఆ సర్పమే నిజమై నట్లు చెప్పవలసి వస్తుంది. దానిని నిషేధించడం కుదరదు. అట్లే ప్రపంచాన్ని నిషేధించి నప్పుడు దాని కాధార మైన బ్రహ్మ ఉంది అని చెప్పకపోతే, అనగా ఉన్నది బ్రహ్మయే, అది ప్రపంచంగా కనబడింది అని చెప్పకపోతే, ప్రపంచాన్ని నిషేధించడం కుదరదు. కనబడుతున్నదానిని ఎలా నిషేధిస్తావు? అని భావం.

నాపీతి:- మరొక విషయ మేమనగా-బ్రహ్మను నిషేధించడం కుదరనే కుదరదు. "బ్రహ్మ తే బ్రవాణి" (నీకు బ్రహ్మను గూర్చి చెపుతాను) అనే ఉపక్రమానికి ఇది విరుద్ధం. (నీకు బ్రహ్మను గూర్చి చెపుతాను అని ప్రారంభించి చివరికి బ్రహ్మ అనేది లేదు అని చెప్పడం అసంగతం కదా?). (ఆ విధంగా నిషేధించడం), "అసన్నేవ...వేద చేత్" (బ్రహ్మలేదు అనేవాడే లేనివాడవుతాడు-తనను, తాను నిరాకరించుకొన్నవా డవుతాడు) ఇత్యాదినిందావచనానికి (బ్రహ్మ భావవచననిందకు)విరుద్ధం. అట్లే "అస్తీత్యేవోపలబ్ధవ్యః" (బ్రహ్మ ఉన్నది అని మాత్రమే గ్రహించాలి)అనే నిర్ధారణవచనానికి కూడ విరుద్ధం. సమస్తమైన వేదాంతాలకీ వ్యాకోపం కలుగుతుంది (ముప్పు వాటిల్లుతుంది). బ్రహ్మ వాక్కుకు మనస్సుకు అందనిది అని చెప్పడంలో అభిప్రాయం బ్రహ్మ లేదని చెప్పడంలో కాదు. ఎంతో పరికరబంధంతో (హంగామాతో)"బ్రహ్మవిదాప్నోతి పరమ్", "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" ఇత్యాదివాక్యాలచేత వేదాంతాలలో బ్రహ్మను ప్రతిపాదించి, చివరికి అది లేదు అని చెప్పబడదు కదా? "ప్రక్షాలనాద్ధి....వరమ్" (బురద త్రొక్కనేల కాలు కడగనేల)అని కదా లోకోక్తి? "యత్...సహ" అనేది బ్రహ్మను ప్రతిపాదించే ఒక విధానం మాత్రమే. బ్రహ్మ వాక్కుకు మనస్సుకూ అతీత మైనది. (దృశ్యములైన) విషయాల కోవకు చెందనిది, ప్రత్యగాత్మ యైనది. నిత్యశుద్ధముక్తస్వభావము అని మాత్రమే ఇలా చెప్పడంలోని అభిప్రాయం. అందువల్ల (నేతీత్యాదివాక్యం)బ్రహ్మయొక్క రూపప్రపంచాన్ని నిషేధిస్తూన్నది, బ్రహ్మను మిగల్చుచున్నది అని అంగీకరించాలి. ఈ విషయమే "ప్రకృతైతావత్త్వం హి ప్రతిషేధతి" అనే సూత్రంచేత చెప్పబడుచున్నది.

భాష్యమ్

ప్రకృతం యదేతావదియత్తాపరిచ్ఛిన్నం మూర్తామూర్తలక్షణం బ్రహ్మణో

రూపం తదేవ శబ్దః ప్రతిషేధతి. తద్ధి ప్రకృతం ప్రపఞ్చితం చ పూర్వస్మిన్ గ్రన్థేఽధిదైవతమధ్యాత్మం చ. తజ్జనితమేవ చ వాసనాలక్షణమపరం రూపమమూర్తరసభూతం పురుషశబ్దోదితం లిఙ్గాత్మవ్యపాశ్రయం మహారజనాద్యుపమాభిర్దర్శితమ్. అమూర్తరసస్య పురుషస్య చక్షుర్గ్రాహ్య రూపయోగిత్వానుపపత్తేః. తదేతత్సప్రపఞ్చం బ్రహ్మణో రూపం సంనిహితాలమ్బనేనేతికరణేన ప్రతిషేధకనఞాం ప్రత్యుసనీయత ఇతి గమ్యతే. బ్రహ్మ తు రూపవిశేషణత్వేన షష్ఠ్యా నిర్దిష్టం పూర్వస్మిన్ గ్రన్థే న స్వప్రధానత్వేన. ప్రపఞ్చితే చ తదీయే రూపద్వయేరూపవతఃస్వరూప జిజ్ఞాసాయామిదముపక్రాన్తమ్-"అథాత ఆదేశో నేతి నేతి"(బృ.ఉ.2.3.6) ఇతి. తత్ర కల్పితరూపప్రత్యాఖ్యానేన బ్రహ్మణః స్వరూపావేదనమిదమితి నిర్ణీయతే. తదాస్పదం హీదం సమస్తం కార్యం నేతి నేతీతి ప్రతిషిద్ధమ్. యుక్తం చ కార్యస్య వాచారమ్భణశబ్దాదిభ్యోఽసత్త్వమితి నేతి నేతీతి ప్రతిషేధనమ్; న తు బ్రహ్మణః; సర్వకల్పనామూలత్వాత్.

బాలానందిని

ప్రకృతమితి:- ప్రకృతమైన, ఏతావత్=ఇంత అని కొలవబడిన మూర్తామూర్తలక్షణమైన బ్రహ్మయొక్క ఏ రూపం గలదో దానిని ఈ శబ్దం (నేతి నేతి అనేది) నిషేధిస్తూన్నది. అధిదైవతమనీ, అధ్యాత్మమనీ అదే ప్రకృత మైనది, వెనుకటి గ్రంథంలో వివరించబడింది కూడ. దానినుండే పుట్టిన వాసనారూప మైన మరొక అమూర్తరసం కూడ చెప్పబడింది. లింగాత్మకు సంబంధించిన దానినే పురుషశబ్దంచేత నిర్దేశిస్తూ మాహారజనం మొదలైన ఉపమలచేత చూపించడం జరిగింది. అమూర్తరసమైన పురుషునకు చక్షుస్సుచేత గ్రహింపదగిన రూపంతో సంబంధం కుదరదు గాన (ఇది వాసనామయమైన రూపమని చెప్పబడింది). సప్రపంచమైన బ్రహ్మయొక్క అట్టి ఈ రూపమునే, సంనిహితమైనదానిని బోధించే ఇతిశబ్దంచేత నిషేధార్థమైన నఞ్‌తో చేరుస్తూన్నది (అనగా సప్రపంచమైన ఈ బ్రహ్మయే నేతి అనేదానిచేత నిషేధించబడుచున్నది)అని తెలుస్తూన్నది. బ్రహ్మ అయితే, పూర్వగ్రంథంలో, రూపానికి విశేషణంగా షష్ఠిచేత (బ్రహ్మయొక్క రూపం అని) నిర్దేశించబడింది, స్వప్రధానంగా (బ్రహ్మకు ప్రాధాన్యం ఉండేటట్లు) నిర్దేశింపబడలేదు. (బ్రహ్మయొక్క రూపం అన్నప్పుడు ప్రాధాన్యం రూపానికే కాని బ్రహ్మకు కాదు).దాని

బ్రహ్మ యొక్క) రూపద్వయాన్ని ప్రపంచించిన తరవాత రూపవత్తుయొక్క (ఆ రూపద్వయం గల బ్రహ్మయొక్క) స్వరూపం ఎట్టిది అని తెలుసుకొనడానికి ఇచ్ఛ కలగగా (తెలుసుకొనవలసి ఉండగా) "అథాత ఆదేశో నేతి నేతి" అని ప్రారంభించబడింది. బ్రహ్మయందు కల్పితమైన రూపాలను నిరాకరించడం ద్వారా బ్రహ్మయొక్క స్వరూపాన్ని వాక్యం చెప్పుచున్నది అని నిర్ణయించబడుతుంది. ఆ బ్రహ్మయే అధారంగా గల (బ్రహ్మమీదనే ఆరోపించబడిన) ఈ సమస్తకార్యమూ నేతి నేతి అని నిషేధించబడుచున్నది. వాచారమ్భణశబ్దాదులవల్ల కార్యానికి అసత్త్వం (కార్యం అసత్ అని చెప్పడం)యుక్తం గాన "నేతి నేతి" అని ఆ కార్యాన్ని నిషేధించడమే యుక్తం కాని బ్రహ్మను నిషేధించడం యుక్తం కాదు. ఎందువల్ల ననగా అన్ని కల్పనలకు, (అన్ని ఆరోపాలకు) బ్రహ్మయే మూలం, అనగా అధారం.

## భాష్యమ్

న చాత్రేయమాశఙ్కాకర్తవ్యా కథం హి శాస్త్రం స్వయమేవ బ్రహ్మణో రూపద్వయం దర్శయిత్వా స్వయమేవ పునః ప్రతిషేధతి- "ప్రక్షాలనాద్ధి పఙ్కస్య దూరాదస్పర్శనం వరమ్" ఇతి; యతో నేదం శాస్త్రం ప్రతిపాద్యత్వేన బ్రహ్మణో రూపద్వయం నిర్దిశతి, లోకప్రసిద్ధం త్విదం రూపద్వయం బ్రహ్మణి కల్పితం పరామృశతి ప్రతిషేధ్యత్వాయ, శుద్ధబ్రహ్మస్వరూపప్రతిపాదనాయ చేతి నిరవద్యమ్. ద్వౌ చేతౌ ప్రతిషేధౌ యథాసంఖ్యాన్యాయేన ద్వే అపి మూర్తామూర్తే ప్రతిషేధతః. యద్వా పూర్వః ప్రతిషేధః భూతరాశిం ప్రతిషేధత్యుత్తరో వాసనారాశిం ప్రతిషేధతి. అథ వా నేతి నేతి ఇతి వీప్సేయమ్. "ఇతి" ఇతి యావత్కించి ద్ముత్ప్రేక్ష్యతే తత్సర్వం న భవతీత్యర్థః. పరిగణితప్రతిషేధే హి క్రియమాణే యది నైతద్బ్రహ్మ కిమన్యద్బ్రహ్మ భవేదితి జిజ్ఞాసా స్యాత్. వీప్సాయాం తు సత్యాం సమస్తస్య విషయజాతస్య ప్రతిషేధాదవిషయః ప్రత్యగాత్మా బ్రహ్మేతి జిజ్ఞాసా నివర్తతే. తస్మాత్ప్రపఞ్చమేవ బ్రహ్మణి కల్పితం ప్రతిషేధతి, పరిశినష్టి బ్రహ్మేతి నిర్ణయః. ఇతశ్చైష ఏవ నిర్ణయః యతః-తతః ప్రతిషేధాత్ భూయో బ్రవీతి "అన్యత్పర మస్తి" (బృ.ఉ.2.3.6)ఇతి. అభావావసానే హి ప్రతిషేధే క్రియమాణే కిమన్యత్ పరమస్తీతి బ్రూయాత్? తత్రైషాక్షరయోజనా-నేతినేతీతి

బ్రహ్మోద్దిశ్య తమేవాదేశం పునర్నిర్వక్తి-నేతినేతీత్యన్య కోఽర్థః? న హ్యేతస్మాద్బ్రహ్మణః వ్యతిరిక్తమస్తీత్యతో నేతినేతీత్యుచ్యతే, న పునః స్వయమేవ నాస్తీత్యర్థః. తచ్చ దర్శయతి-అన్యత్పరమప్రతిషిద్ధం బ్రహ్మాస్తీతి. యదా పునరేవ మక్షరాణి యోజ్యన్తే న హ్యేతస్మాదితి నేతి, న హి ప్రపఞ్చ ప్రతిషేధరూపాదాదేశనాదన్యత్పరమాదేశనం బ్రహ్మణో ఽస్తీతి, తదా తతో బ్రవీతి చ భూయః ఇత్యేతన్నామధేయవిషయం యోజయితవ్యమ్-"అథ నామధేయమ్-సత్యస్య సత్యమితి, ప్రాణా వై సత్యం, తేషామేష సత్యమ్" ఇతి హి బ్రవీతి (బృ.ఉ.2.1.20)ఇతి. తచ్చ బ్రహ్మావసానే ప్రతిషేధే సమఞ్జసం భవతి. అభావావసానే తు ప్రతిషేధే కిం సత్యస్య సత్యమిత్యుచ్యేత? తస్మాద్బ్రహ్మావసానోఽయం ప్రతిషేధో నాభావావసాన ఇత్యధ్యవస్యామః. 22.

బాలానందిని

న చేతి:- శాస్త్రం స్వయంగానే బ్రహ్మకు రెండు రూపా లున్నా యని చెప్పి స్వయంగానే వాటిని ఎలా నిషేధిస్తుంది? బురద త్రొక్కి కడుక్కొనడంకంటె దాన్ని స్పృశించకుండా దూరంగా ఉండడం మంచిది కదా? అని ఇక్కడ ఆశంక చేయకూడదు. ఎందువల్ల ననగా ఈ శాస్త్రం బ్రహ్మకు రెండు రూపాలున్నా యని క్రొత్తగా ప్రతిపాదించా లని ఆ రూపద్వ యాన్ని నిర్దేశించడం లేదు. కేవలం బ్రహ్మయందు కల్పితమైన, లోక ప్రసిద్ధమైన రూపద్వయాన్ని నిషేధించడం కోసం పరామర్శిస్తున్నది. శుద్ధమైన బ్రహ్మస్వరూపాన్ని ప్రతిపాదించడంకొరకు మాత్రమే ఇలా చేస్తున్నది గాన దోషం ఏదీ లేదు. ఇక్కడ ఉన్న రెండు ప్రతిషేధాలు యథాసంఖ్యన్యాయంచేత మూర్తామూర్తాలను రెండింటినీ కూడ నిషేధిస్తున్నాయి. లేదా మొదటి నిషేధం భూతరాశిని నిషేధిస్తున్నది రెండవది వాసనారాశిని నిషేధిస్తున్నది. లేదా-నేతి నేతి అనేది వీప్స; అనగా ద్విరుక్తి. ఇది అని ఊహించబడే (చెప్పబడే) ఏ వస్తువు కూడ లేదు అని దీని అర్థం. (ఇలా చెప్పకుండా)లెక్కపెట్టిన ఏవో కొన్ని వస్తువులను మాత్రమే నిషేధిస్తే- ఇది బ్రహ్మ కాకపోతే మరి బ్రహ్మ ఏది అని జిజ్ఞాస కలుగుతుంది. వీప్సను అంగీకరించినప్పుడు సమస్తమైన విషయసముదాయాన్ని నిషేధించడంవల్ల ప్రత్యగాత్మయే అయిన బ్రహ్మ విషయం కాదు అని జిజ్ఞాస నివర్తిస్తుంది (కలగదు). అందువల్ల బ్రహ్మమీద కల్పితమైన ప్రపంచాన్ని

మాత్రమే ఈ వాక్యం నిషేధిస్తూన్నది. బ్రహ్మను మిగిలేటట్లు చేస్తుంది అని నిర్ణయం. ఇందువల్ల కూడ ఇదే నిర్ణయం-ఎందువల్ల ననగా-తతః=ప్రతిషేధం చేసిన తరవాత, మళ్లీ, అన్యత్పరమస్తి (పరమైన మరొకటి ఉన్నది)అని శ్రుతి చెపుతున్నది. అభావంతో ముగిసే ప్రతిషేధం చేసే పక్షంలో పరమైన మరొకటి ఏది ఉందని చెపుతుంది? (శ్రుతివాక్యానికి) అక్షరార్థం (అర్థం) ఇది - నేతి నేతి అని బ్రహ్మను ఆదేశించి (బ్రహ్మను గూర్చి చెప్పి)ఆ ఆదేశాన్నే మళ్లీ నిర్వచిస్తూన్నది-నేతి నేతి అనగా అర్థం ఏమిటి? ఈ బ్రహ్మకంటె భిన్నంగా మరొకటి లేదు కాబట్టి నేతి నేతి అని చెప్పబడుచున్నది. అంతే కాని బ్రహ్మయే లేకపోవడంచేత కాదు అని అర్థం. ఆ విషయాన్నే "అన్యత్ పరమస్తి" (అన్యమైన అనగా నిషేధించబడినదానికన్న భిన్నమైన, పరమైన, అనగా ప్రతిషేధించబడని, బ్రహ్మ ఉన్నది) అని చెపుతున్నాడు. ఏతస్మాత్=ఈ బ్రహ్మకంటె పరమైనది, న హి ఇతి=లేదు కాబట్టి, నేతి = న అని చెప్పబడుచున్నది, పరమ్=నిషిద్ధమైనదానికంటె పరమైన బ్రహ్మ అస్తి=ఉన్నది అని వాక్యానికి అర్థం. దీనినిపట్టి "తతో బ్రవీతి చ భూయః" అనే సూత్రాంశానికి దానికంటె (నిషేధించబడినదానికంటె) భిన్నమైన ఆత్మను మళ్లీ చెపుతున్నది అని అర్థం చెప్పాలి.

**అవ** :-ఈ వాక్యానికే మరొక విధంగా – "ఏతస్మాత్= ఈ, ఇతి న ఇతి=ఇది కాదు ఇది కాదు అనే దానికంటె, అన్యత్=మరియొక, పరమ్=వేరైన బ్రహ్మదేశనం, న అస్తి హి=లేదు కదా అని అర్థం చెప్పవచ్చు నని చెపుతున్నారు -యదేతి:- "న హి ఏతస్మాత్ ఇతి న ఇతి న ఇతి" అని భాష్యవాక్యంలో పదచ్ఛేదం. వాక్యంలోని పదాలు "నహ్యేతస్మాత్ ఇతి న ఇతి న ఇతి" అని అన్వయించి "ప్రపంచాన్ని నిషేధించడం అనే ఆదేశనంకంటె భిన్నమైన, వేరే విధమైన బ్రహ్మదేశనం లేదు కదా, అని అర్థం చెప్పిన పక్షంలో "తతో బ్రవీతి చ భూయః" అనే సూత్రాంశాన్ని నామధేయానికి సంబంధించినదానినిగా అన్వయించుకోవాలి. అప్పుడు దీనికి తతః=దాని తరవాత, భూయః=మళ్లీ, బ్రవీతి చ="అథ నామధేయం సత్యస్య...సత్యమ్" అని చెప్పుచున్నాడు అని అర్థం. ("సత్యానికి సత్యం. సత్యమనగా ప్రాణాలు. వాటికి ఇది(బ్రహ్మ) సత్యం" అని పై శ్రుతివాక్యానికిఅర్థం). ఇలా చెప్పడం ప్రతిషేధం బ్రహ్మావసానం అవుతేనే, (బ్రహ్మ తప్ప మిగిలినవాటిని నిషేధి స్తేనే) సమంజసంగా ఉంటుంది. ప్రతిషేధం అభావావసానం అయినట్లయితే (చివరికి

మిగిలేది అభావమే అన్నట్లయితే)"సత్యస్య సత్యమ్" అని ఏది చెప్పబడుతుంది? అందు వల్ల ఈ ప్రతిషేధం బ్రహ్మావసానమే కాని అభావావసానం కాదని నిర్ణయిస్తున్నాం. 22.

## సూ. తదవ్యక్తమాహ హి. 3.2.23.

యత్ప్రతిషిద్ధాత్ప్రపఞ్చజాతాదన్యత్పరం బ్రహ్మ తదస్తి చేత్కస్మాన్న గృహ్యత ఇతి. ఉచ్యతే-తదవ్యక్తమనిన్ద్రియగ్రాహ్యం, సర్వదృశ్యసాక్షిత్వాత్. ఆహ హ్యేవం శ్రుతిః- "న చక్షుషా గృహ్యతే నాపి వాచా నాన్యైర్దేవైస్తపసా కర్మణా వా" (ము.ఉ.3.1.8)"స ఏష నేతి నేత్యాత్మాఽగృహ్యో న హి గృహ్యతే" (బృ.ఉ.3.9.26), "యత్తదద్రేశ్యమగ్రాహ్యమ్" (ము. ఉ.1.1.6), "యదాహ్యేవైష ఏతస్మిన్న దృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనే"(తై.ఉ.2.7.1) ఇత్యాద్యా. స్మృతిరపి-"అవ్యక్తోఽయమచిన్త్యోఽయమవికార్యోఽయముచ్యతే (భ.గీ.2.2.5) ఇత్యాద్యా. 23.

### బాలానందిని

తదితి :-"తత్=ఆ బ్రహ్మ అవ్యక్తమ్=వ్యక్తం కానిది. ఆహ హి=ఈ విధంగా శ్రుతి చెప్పుచున్నది కదా?" అని సూత్రార్థం.

యదితి:- నిషేధించబడిన ప్రపంచసముదాయంకంటె భిన్నమైన ఏ పరబ్రహ్మ ఉన్నదో అది నిజంగా ఉంటే ఎందుకు గ్రహించబడడం లేదు? (సమాధానం) చెప్పబడుచున్నది- అది, అవ్యక్తమ్=ఇంద్రియాలచేత గ్రహింప యోగ్యమైనది కాదు. అది సమస్తమైన దృశ్యవస్తువులకు సాక్షి కదా? ఈ విధంగానే "న చక్షుషా...వా" (బ్రహ్మ నేత్రంచేత గ్రహించబడదు. వాక్కుచేత గ్రహించబడదు, ఇతరదేవతలచేత (ఇంద్రియాలచేత)గ్రహించబడదు. తపస్సుచేత గాని కర్మ చేత గాని గ్రహించబడదు), "స ఏష....గృహ్యతే", "యత్తద...గ్రాహ్యమ్" యదా... అనిలయనే" ఇత్యాదిశ్రుతి చెప్పు చున్నది. "అవ్యక్తో....ఉచ్యతే" ఇత్యాదిస్మృతి కూడ ఈ విషయమే చెప్పుచున్నది. 23.

## సూ. అపి చ సంరాధనే ప్రత్యక్షానుమానాభ్యామ్. 3.2.24

అపి చైనమాత్మానం నిరస్తసమస్తప్రపఞ్చమవ్యక్తం సంరాధనకాలే పశ్యన్తి యోగినః. సంరాధనం చ భక్తిధ్యానప్రణిధానాద్యనుష్ఠానమ్. కథం పునరవగమ్యతే సంరాధనకాలే పశ్యన్తీతి ప్రత్యక్షానుమానాభ్యామ్శ్రుతిస్మృతిభ్యామిత్యర్థః. తథా

హి శ్రుతిః-

"పరాఞ్చి ఖాని వ్యతృణత్స్వయంభూస్తస్మాత్పరాఙ్పశ్యతి నాన్తరాత్మన్,

కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షదావృత్తచక్షురమృతత్వమిచ్ఛన్" (క.ఉ.4.1) ఇతి.

"ధ్యానప్రసాదేన విశుద్ధసత్త్వస్తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః" (ము.ఉ.3.1.8) ఇతి చైవమాద్యా. స్మృతిరపి-

"యం వినిద్రా జితశ్వాసాః సంతుష్టాః సంయతేన్ద్రియాః,

జ్యోతిః పశ్యన్తి యుఞ్జానాస్తస్మై యోగాత్మనే నమః" (మ.భా.శా.47.55)

"యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్" (మ.భా.ఉ.~~4.6.1~~ 46-1) ఇతి చైవమాద్యా 24.

బాలానందిని

అపి చేతి:-"అపి చ=మరియు, సంరాధనే=సంరాధనమునందు ఆత్మను సాక్షాత్కరించుకుంటారు. ప్రత్యక్షానుమానాభ్యామ్=శ్రుతిస్మృతల ప్రామాణ్యాన్ని బట్టి" అని సూత్రార్థం.

అపీతి:- మరియు తొలగించబడిన సమస్త ప్రపంచము గలది, అవ్యక్తము అయిన ఈ ఆత్మను యోగులు సంరాధనకాలమునందు చూస్తారు. భక్తి, ధ్యానం, ప్రణిధానం మొదలైన వాటి అనుష్ఠానానికి సంరాధనం అని పేరు. సంరాధనకాలంలో చూస్తారని ఎలా తెలుస్తూన్నది? ప్రత్యక్షానుమానాలచేత, అనగా శ్రుతిస్మృతులచేత అని అర్థం. అది ఎట్లనగా-"పరాఞ్చి...ఇచ్ఛన్" (బ్రహ్మ ఇంద్రియాలను బహిర్ముఖాలుగానే ఉండేటట్లు హింసించాడు. అందువలననే మానవుడు పైకి మాత్రమే చూస్తాడు గాని అంతరాత్మను చూడజాలడు. ఎవ్వడో బుద్ధిమంతుడు మోక్షాన్ని కోరుతూ, లోనికి త్రిప్పబడిన దృష్టి కలవాడై ప్రత్యగాత్మను చూస్తాడు), అని, "ధ్యాన....ధ్యాయమానః" (విశుద్ధమైన బుద్ధి గలవాడు జ్ఞానం నిర్మలం అవడంచేత అటు పిమ్మట ధ్యానం చేస్తూ అఖండమైన ఆ ఆత్మను చూస్తాడు). అని ఈ మొదలైన శ్రుతి చెప్పుచున్నది. "యం...నమః"

(అలసత్వం లేనివారు, శ్వాసను జయించినవారు, ఇంద్రియాలను, నిగ్రహించుకొన్నవారు సంతుష్టాంతరంగులు అయిన యుంజానులు(యోగాభ్యాసం చేస్తూన్న యోగులు) ఏ జ్యోతిని చూస్తారో అట్టి యోగాత్మునికి నమస్కారం). "యోగినః...సనాతనమ్"(సనాతనుడైన ఆ భగవంతుణ్ణి యోగులు చూస్తారు) ఇత్యాదిస్మృతి కూడ చెప్పుచున్నది. 24.

## భాష్యమ్

నను సంరాధ్యసంరాధకభావాభ్యుపగమాత్ పరేతరాత్మనోరన్యత్వం స్యాదితి; నేత్యుచ్యతే-

**సూ. ప్రకాశాదివచ్చావైశేష్యం ప్రకాశశ్చ కర్మణ్యభ్యాసాత్. 3.2.25**

యథా ప్రకాశాకాశసవితృప్రభృతయోఽఙ్గులికరకోదకప్రభృతిషు కర్మసూపాధిభూతేషు సవిశేషా ఇవావభాసన్తే, న చ స్వాభావికీమవిశేషతాం జహతి, ఏవముపాధినిమిత్త ఏవాయమాత్మభేదః; స్వతస్త్వైకాత్మ్యమేవ. తథా హి వేదాన్తేష్వభ్యాసేన అసకృజ్జీవప్రాజ్ఞయోరభేదః ప్రతిపాద్యతే. 25.

## బాలానందిని

నన్వితి:-(ప్రశ్న) సంరాధ్యసంరాధకభావాదులను (ధ్యానించదగినవాడు ధ్యానించేవాడు ఇత్యాదిధర్మాలను)అంగీకరిస్తే పరమాత్మజీవాత్మలకు భేదం చెప్పినట్లవుతుంది కదా? (సమాధానం) కాదు అని చెప్పబడుచున్నది-

ప్రకాశాదీతి:- "ప్రకాశాదివత్ చ=సూర్యప్రకాశాదుల వలె, కర్మణి= ధ్యానాదికర్మయందు, ప్రకాశః=ఆత్మ ఉపాధివశంచేత భిన్నంగా కనబడుతుంది. కాని, అవైశేష్యమ్=వాస్తవంలో విశేషం లేదు. అభ్యాసాత్= వేదాంతాలలో జీవబ్రహ్మభేదం అనేక పర్యాయాలు చెప్పడంవల్ల" అని సూత్రార్థం.

యథేతి:-ప్రకాశ - ఆకాశ - సూర్యాదులు వ్రేళ్లు, పాత్ర ఉదకము మొదలైన, కర్మసు=ఉపాధులయందు, సవిశేషముల వలె ఏవిధంగా భాసిస్తాయో, అయినా కూడ తమ సహజమైన అవిశేషాత్మత్వాన్ని (విశేషాలేవీ లేకపోవడాన్ని)ఏ విధంగా విడువవో, అట్లే ఈ ఆత్మభేదం ఉపాధులవల్ల ఏర్పడినది. స్వతః అయితే ఏకాత్మత్వమే. అందువల్లనే

వేదాంతాలలో, అభ్యాసంచేత, అనగా అనేకపర్యాయాలు జీవప్రాజ్ఞులకు అభేదం ప్రతిపాదించబడుచున్నది. 25.

## సూ. అతోఽనన్తేన తథాహి లిఙ్గమ్. 3.2.26

అతశ్చ స్వాభావికత్వాదభేదస్య, అవిద్యాకృతత్వాచ్చభేదస్య విద్యయా అవిద్యాం విధూయ జీవః పరేణానన్తేన ప్రాజ్ఞేనాత్మనైకతాం గచ్ఛతి. తథాహి లిఙ్గమ్-"స యో హ వైతత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" (ము.ఉ.3.2.9), "బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" (బృ.ఉ.4.4.6) ఇత్యాది. 26.

అత ఇతి:-"అతః=ఆ కారణంవల్ల, జీవుడు, అనన్తేన=పరమాత్మతో ఐక్యం పొందుతతాడు. తథా=అట్లు, లిఙ్గమ్=శ్రుతిరూప మైన లింగం, హి=ఉన్నది కదా" అని సూత్రార్థం.

అతశ్చేతి:- అతః=అభేదం స్వాభావికం అవడంవల్ల భేదం అవిద్యాకృతం అవడం వల్లా కూడ, జీవుడు అవిద్యను విద్యచేత ఎగురగొట్టి, పరుడైన, అనన్తేన=ప్రాజ్ఞాత్మతో, ఏకత్వాన్ని పొందుతాడు. అవిధంగానే "స...భవతి" (ఎవడైతే ఆ పరబ్రహ్మను తెలుసుకొంటాడో అతడు బ్రహ్మగానే అవుతాడు). "బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" (ఎల్లపుడూ బ్రహ్మగానే ఉన్న జీవుడు బ్రహ్మను పొందుతాడు) ఇత్యాదిలింగం చెప్పుచున్నది. 26.

## సూ.ఉభయవ్యపదేశాత్త్వహికుణ్డలవత్. 3.2.27

తస్మిన్నేవ సంరాధ్యసంరాధకభావే మతాన్తరముపన్యస్యతి స్వమత విశుద్ధయే. క్వచిజ్జీవప్రాజ్ఞయోర్భేదో వ్యపదిశ్యతే-"తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః" (ము.ఉ.3.1.8)ఇతి ధ్యాతృధ్యాతవ్యత్వేన, ద్రష్టృద్రష్టవ్యత్వేన చ, "పరాత్పరం పురుషముపైతి దివ్యమ్" (ము.3.28) ఇతి గన్తృగన్తవ్యత్వేన, "యః సర్వాణి భూతాన్యన్తరో యమయతి" (ఇతి నియన్తృ నియన్తవ్యత్వేన చ. క్వచిత్తు తయోరేవాభేదో వ్యవదిశ్యతే-"తత్త్వమసి" (ఛా.ఉ.6.8.7), "అహం బ్రహ్మాస్మి" (బృ.ఉ.1.4.10)."ఏష త ఆత్మా సర్వాన్తరః" (బృ.ఉ.3.4.1), "ఏషత

ఆత్మాన్తర్యామ్యమృతః"(బృ.ఉ.3.7.3) ఇతి. తత్రైవముభయవ్యపదేశే సతి యద్య భేద ఏవైకాన్తతో గృహ్యతే భేదవ్యపదేశో నిరాలమ్బన ఏవ స్యాత్. అత ఉభయ వ్యపదేశదర్శనాదహికుణ్డలవదత్ర తత్త్వం భవితుమర్హతి-యథాఽహిరిత్యభేదః కుణ్డలాభోగప్రాంశుత్వాదీనీతి తు భేద ఏవమిహాపీతి. 27.

బాలానందిని

ఉభయేతి:-ఉభయవ్యపదేశాత్తు=భేదాభేదాల రెండింటిని చెప్పడంవల్ల నైతే=,అహికుణ్డలవత్=అహికుండలముల వలె గ్రహించాలి అని సూత్రార్థం.

తస్మిన్నితి:-తన మతంయొక్క విశుద్ధికొరకు (తన మతం నిర్దుష్టంగా ఉండడంకొరకు)ఆ సంరాధ్యసంరాధకభావంలోనే మరొక అభిప్రాయం చెపుతున్నాడు. "తతస్తు...ధ్యాయమానః" అని ధ్యాతృధ్యాతవ్యత్వంచేత (ధ్యానించేవాడు ధ్యానించబడేది అనే సంబంధంచేత), ద్రష్టృద్రష్టవ్యత్వంచేత (చూచేవాడు చూడదగినవాడు అనే సంబం ధంచేత),"పరాత్....దివ్యమ్" అని గంతృగంతవ్యత్వంచేత (పొందేవాడు పొందబడేవాడు అనే సంబంధంచేత), "యః...యమయతి" అని నియన్తృ నియమ్యత్వంచేత (నియమించేవాడు నియమించబడేవాడు అనే సంబంధంచేత)కొన్నిచోట్ల జీవునకు ప్రాజ్ఞునకు భేదం చెప్పబడుతున్నది. కొన్నిచోట్లలో నైతే-"తత్త్వమసి" అని, "ఏష త ఆత్మా సర్వాన్తరః" అని "ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః " అనీ ఆ జీవప్రాజ్ఞులకే అభేదం చెప్పబడుచున్నది. ఈ విధంగా భేదాభేదాల రెండింటి వ్యపదేశం ఉన్నప్పుడు కేవలం అభేదమే గ్రహింపబడినట్లయితే భేదవ్యపదేశానికి ఆధారం లేకుండా పోతుంది. అందుచేత ఉభయవ్యపదేశం కనబడుచున్నది గాన ఇక్కడ తత్త్వం అహికుండలాల విషయంలో వలె ఉంటుంది. (ఒక జంతువును చూసి) ఇది సర్పం అని అంటే అది అభేదం. దానిని గూర్చియే-కుండలం (పాముచుట్ట), దాని శరీరం పొడవు ఇత్యాది విధంగా చెప్పినట్లయితే భేదం ఎట్లో (ఎట్లు చెప్పబడినట్లవుతాయో)అట్లే ఇక్కడ కూడ. 27.

సూ. ప్రకాశాశ్రయవద్వా తేజస్త్వాత్. 3.2.28.

అథవా ప్రకాశాశ్రయవదేతత్ప్రతిపత్తవ్యమ్. యథా ప్రకాశః సావిత్రః

తదాశ్రయశ్చ సవితా నాత్యన్తభిన్నావుభయోరపి తేజస్త్వావిశేషాత్, అథ చ భేదవ్యపదేశభాజౌ భవత ఏవమిహాపీతి. 28.

బాలానందిని

ప్రకాశేతి:-"వా=లేక,తేజస్త్వాత్=తేజ స్సవడంచేత, ప్రకాశాశ్రయవత్= ప్రకాశము, దాని ఆశ్రయమూ ఏ విధంగా అభిన్నములో అట్లే ఇక్కడ కూడ" అని సూత్రార్థం.

అథవేతి:- లేదా దీనిని ప్రకాశతదాశ్రయాలనువలె గ్రహించాలి. సూర్యుని సంబంధ మైన ప్రకాశ దానికి ఆశ్రయమైన సూర్యుడు, ఈ రెండు కూడ తేజస్సులే అవడంచేత, ఏ విధంగా అత్యంతభిన్నములు కావో, అయినా కూడ (సూర్యుని తేజస్సు అని)భేదనిర్దేశాన్ని పొందుతాయో అట్లే ఇక్కడ కూడ. 28.

సూ. పూర్వవద్వా. 3.2.29

యథా వా పూర్వముపన్యస్తం ప్రకాశాదివచ్చావైశేష్యమ్ ఇతి తథైవైత ద్భవితుమర్హతి. తథా హ్యవిద్యాకృతత్వాద్బన్ధస్య విద్యయా మోక్ష ఉపపద్యతే. యది పునః పరమార్థత ఏవ బద్ధః కశ్చిదాత్మాహికుణ్డలన్యాయేన పరస్యాత్మనః సంస్థానభూతః, ప్రకాశాశ్రయన్యాయేన చ ఏకదేశభూతోఽభ్యుపగమ్యేత తతః పారమార్థికస్య బన్ధస్య తిరస్కర్తుమశక్యత్వాత్ మోక్షశాస్త్రవైయర్థ్యం ప్రసజ్యేత. న చాత్రోభావపి భేదాభేదౌ శ్రుతిస్తుల్యవద్వ్యపదిశతి. అభేదమేవ హి ప్రతిపాద్యత్వేన నిర్దిశతి, భేదం తు పూర్వప్రసిద్ధమేవానువదత్యర్థాన్తరవివక్షయా. తస్మాత్ప్ర కాశాదివచ్చావైశేష్యమిత్యేష ఏవ సిద్ధాన్తః. 29.

బాలానందిని

పూర్వేతి:- "వా=లేదా, పూర్వవత్=వెనుక చెప్పినటు" అని సూత్రార్థం.

యథేతి:-లేదా వెనుక "ప్రకాశాదివచ్చావైశేష్యమ్" అని ఏది చెప్పబడిందో అట్లే ఇది అవుతుంది. అలా చెపితేనే బంధం అవిద్యచేత ఏర్పడినది కాబట్టి విద్యచేత మోక్షం ఉపపన్నం అవుతుంది. అలా కాక అహికుండలన్యాయంచేత (పాముయొక్క చుట్టవలె)

పరమాత్మయొక్క ఒకరకమైన అవయవవిన్యాసరూపుడు గాని, లేదా ప్రకాశ-తదాశ్రయాలవలె పరమాత్మయొక్క ఒక అవయవం (భాగం) గా ఉన్నవాడుగాని అయిన ఒక ఆత్మ నిజంగానే బద్ధుడౌతాడు అని అంగీకరిస్తే అప్పుడు పారమార్థికమైన బంధాన్ని తిరస్కరించడం శక్యం కాదు గాన మోక్షశాస్త్రం వ్యర్థం అయిపోతుంది. ఇక్కడ శ్రుతి భేదాభేదాలను రెండింటిని ఒకే విధంగా నిర్దేశించడంలేదు. అభేదాన్నే ప్రధానంగా ప్రతిపాదింపదగినదానినిగా నిర్దేశిస్తూ, మరొక విషయం చెప్పాలనే అభిప్రాయంతో, పూర్వంనుండీ (ప్రత్యక్షాదులద్వారా)ప్రసిద్ధమైన భేదాన్నికేవలం అనువదిస్తూన్నది. అందువల్ల "ప్రకాశాదివచ్చావైశేష్యమ్" అనియే సిద్ధాంతం. 29.

## సూ. ప్రతిషేధాచ్చ. 3.2.30.

ఇతశ్చైష ఏవ సిద్ధాన్తః, యత్కారణం పరస్మాదాత్మనోఽన్యత్ చేతనం ప్రతిషేధతి శాస్త్రమ్- "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" (బృ.ఉ.3.2.23) ఇత్యేవమాది. "అథాత ఆదేశో నేతి నేతి"(బృ.ఉ.2.3.6) "తదేతద్బ్రహ్మాపూర్వమనన్తరమబాహ్యమ్" (బృ.ఉ.2.5.19) ఇతి చ బ్రహ్మవ్యతిరిక్తప్రపఞ్చనిరాకరణాద్బ్రహ్మమాత్రపరిశేషాచ్చైష ఏవ సిద్ధాన్త ఇతి గమ్యతే. 30.

### బాలానందిని

ప్రతిషేధాదితి:- "ప్రతిషేధాచ్చ=బ్రహ్మకంటె భిన్నమైనదానిని నిషేధించడంవల్ల కూడ ఇదే సిద్ధాంతం." అని సూత్రార్థం.

ఇతశ్చేతి:-ఇందువల్ల కూడ ఇదే సిద్ధాంతం. ఎందువల్ల ననగా "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" ఇత్యాదిశాస్త్రం పరమాత్మకంటె భిన్నమైన మరొక చేతనాన్ని నిషేధిస్తున్నది "అథ...నేతి", "తదేతద్..అబాహ్యమ్"అని బ్రహ్మకంటె వ్యతిరిక్త మైన ప్రపంచాన్ని నిరాకరించడంవల్ల బ్రహ్మను మాత్రమే మిగల్చబడంవల్లా కూడ ఇదే సిద్ధాంత మని తెలుస్తూన్నది. 30.

ప్రకృతైతావత్త్వాధికరణం సమాప్తం

## 7.పరాధికరణమ్. సూ. 31-37

### సూ. పరమతః సేతూన్మానసంబన్ధభేదవ్యపదేశేభ్యః 3.2.31

యదేతన్నిరస్తసమస్తప్రపఞ్చం బ్రహ్మ నిర్ధారితమస్మాత్పరమన్యత్తత్త్వమస్తి నాస్తీతి శ్రుతివిప్రతిపత్తేః సంశయః. కాని చిద్ధి వాక్యాన్యాపాతేనైవ ప్రతిభాసమానాని బ్రహ్మణోఽపి పరమన్యత్తత్త్వం ప్రతిపాదయన్తీవ. తేషాం హి పరిహారమభిధాతుమయముపక్రమః క్రియతే. పరమతో బ్రహ్మణోఽన్యత్తత్త్వం భవితుమర్హతి. కుతః? సేతువ్యపదేశాత్, ఉన్మానవ్యపదేశాత్, సంబన్ధవ్యపదేశాత్, భేదవ్యపదేశాచ్చేతి. సేతువ్యపదేశస్తావత్-"అథ య ఆత్మా స సేతుర్విధృతిః" (ఛా. ఉ.8.4.1) ఇత్యాత్మశబ్దాభిహితస్య బ్రహ్మణః సేతుత్వం సంకీర్తయతి. సేతుశబ్దశ్చ హి లోకే జలసంతానవిచ్ఛేదకరే, మృద్దార్వాదిప్రచయే ప్రసిద్ధః. ఇహ తు సేతుశబ్ద ఆత్మని ప్రయుక్త ఇతి లౌకికసేతోరివాత్మసేతోరన్యస్య వస్తునోఽస్తిత్వం గమయతి. "సేతుం తీర్త్వా" ఇతి చ తరతిశబ్ద ప్రయోగాత్. యథా లౌకికం సేతుం తీర్త్వా జాఙ్గలమసేతుం ప్రాప్నోత్యేవమాత్మానం సేతుం తీర్త్వానాత్మానమసేతుం ప్రాప్నోతీతి గమ్యతే.

#### బాలానందిని

పరమితి :-"సేతూన్మానసంబన్ధభేదవ్యపదేశేభ్యః = సేతువునుగా చెప్పడంవల్ల, అవయవపరిచ్ఛేదాన్ని సంబంధమును భేదమును చెప్పడంవల్ల, అతః=ఈ బ్రహ్మకంటె పరమ్=పరమైనది ఏదో ఉంది" అని సూత్రార్థం. (ఇది పూర్వపక్షసూత్రం).

యదితి :- ఏ ఈ బ్రహ్మ తొలగించబడిన సమస్త ప్రపంచం కలదిగా నిర్ధారించబడినదో దీనికంటె పరమైన మరొక తత్త్వం ఏదైనా ఉందా లేదా అని విచారణ, శ్రుతులలో విప్రతిపత్తి ఉండడంవల్ల, చేయబడుచున్నది. బ్రహ్మకంటె కూడ పరమైన మరొక తత్త్వం ఉన్నట్లు ప్రతిపాదిస్తున్నాయా అన్నట్లు కొన్ని వాక్యాలు పైకి కనబడుతున్నాయి. వాటికి పరిహారం చెప్పడం కోసం ఈ ఉపక్రమం చేయబడుచున్నది. బ్రహ్మకంటె ఉత్కృష్టమైన మరొక తత్త్వం ఉండడానికి అవకాశం ఉంది. ఎందువల్ల? 1.సేతువ్యపదేశంవల్ల, 2.ఉన్మానవ్యపదేశంవల్ల, 3.సంబంధవ్యపదేశంవల్ల, 4.భేదవ్యపదేశంవల్ల. 1.సేతువ్యపదేశం ఎట్లనగా-"అథ...విధృతిః" అను వాక్యం ఆత్మశబ్దంచేత చెప్పబడిన బ్రహ్మ సేతువు అని

చెప్పుచున్నది. జలప్రవాహాన్ని అడ్డుకొనే మట్టి కఱ్ఱలు మొదలైనవాటి సముదాయానికి సేతువని పేరు లోకంలో ప్రసిద్ధం. ఇక్కడ సేతుశబ్దం ఆత్మవిషయంలో ప్రయోగించబడినది గాన లౌకికమైన సేతువుకంటె వేరైన మరొక వస్తువున్నట్లు ఆత్మ అనే సేతువుకంటె భిన్నమైన మరొక సేతువు ఉన్నట్లు చెప్పుచున్నది. "సేతుం తీర్త్వా" (సేతువును దాటి) అని తౄధాతువు కూడ ప్రయోగించబడింది. లౌకికమైన సేతువును దాటి సేతువుకంటె భిన్నమైన ప్రదేశానికి ఏ విధంగా వెడతాడో అట్లే ఆత్మసేతువును దాటి సేతువుకంటె భిన్నమైన అనాత్మవస్తువును పొందుతాడు అని తెలుస్తూన్నది.

## భాష్యమ్

ఉన్మానవ్యపదేశశ్చ భవతి "తదేతద్బ్రహ్మ చతుష్పాదష్టాశఫం షోడశకలమ్" ఇతి. యచ్చ లోకే ఉన్మితమ్ ఏతావదిదమితి పరిచ్ఛిన్నం కార్షాపణాది తతో ఽన్యద్వస్త్వస్తీతిప్రసిద్ధమ్. తథా బ్రహ్మణోఽప్యున్మానాత్తతోఽన్యేన వస్తునా భవితవ్యమితి గమ్యతే. తథా సంబన్ధవ్యపదేశోఽపి భవతి. "సతా సోమ్య తదా సంపన్నో భవతి" (ఛా.ఉ.6.8.1) ఇతి. "శారీర ఆత్మా" (తై.ఉ.2.3.1) "ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తః (బృ.ఉ.4.3.2) ఇతి చ. మితానాం చ మితేన సంబన్ధో దృష్టః యథా నరాణాం నగరేణ. జీవానాం చ బ్రహ్మణా సంబన్ధం వ్యపదిశతి సుషుప్తౌ. అతస్తతః పరమన్యదమితమస్తీతి గమ్యతే. భేదవ్యపదేశశ్చైతమేవార్థం గమయతి. తథా హి-"అథ య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే" (ఛా.ఉ.1.6.6) ఇత్యాదిత్యాధారమీశ్వరం వ్యపదిశత్సతో భేదేనాక్ష్యాధారమీశ్వరం వ్యపదిశతి- "అథ య ఏషోఽన్తరక్షిణి పురుషో దృశ్యతే" (ఛా.ఉ.1.7.5)ఇతి. అతిదేశం చాస్యామునా రూపాదిషు కరోతి- "తస్యైతస్య తదేవ రూపం యదముష్య రూపం, యావముష్యగేష్ణౌ తౌ గేష్ణౌ యన్నామ తన్నామ"(ఛా.ఉ.1.7.5)ఇతి. సావధికం చేశ్వరత్వముభయోర్వ్యపదిశతి "యే చాముష్మాత్పరాఞ్చో లోకాస్తేషాం చేష్టే దేవకామానాం చ"(ఛా.ఉ.1.6.8) ఇత్యేకస్య "యే చైతస్మాదర్వాఞ్చో లోకాస్తేషాం చేష్టే మనుష్యకామానాం చ" (ఛా.ఉ.1.7.3) ఇత్యేకస్య. యథేదం మాగధస్య రాజ్యమిదం వైదేహస్యేతి. 31

బాలానందిని

ఉన్మానేతి :- "తదేతద్...షోడశకలమ్" అని ఉన్మానంయొక్క వ్యపదేశం కూడ ఉన్నది(ఉన్మానం అనగా దీనిలో ఇన్ని భాగాలు ఉన్నాయని కొలవడం.) నాలుగు దిక్కులు నాలుగు కలలు, ఇది "ప్రకాశవాన్" అనే పాదం. పృథివి అంతరిక్షం, ద్యులోకం, సముద్రం ఇవి "అనంతవాన్" అనే పాదం అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుత్తు ఇవి "జ్యోతిష్మాన్" అనే పాదం. చక్షుస్సు, శ్రోత్రం, వాక్కు, మనస్సు అని ఇవి "ఆయనవాన్" అనే పాదం. ఈ విధంగా గోవులు మొదలైనవాటికి నాలుగు పాదాలున్నట్లు బ్రహ్మకు నాలుగు పాదాలు. గోవు నాలుగు పాదాలకు ఎనిమిది (చీలిన)డెక్కలున్నట్లు బ్రహ్మలో ఎనిమిది పాదార్థాలు అనే శఫా లున్నాయి. ఒక్కొక్క పాదంలో నాలుగేసి కల లున్నాయి అని ఈ శ్రుతి వాక్యానికి భావం. (ఈ విధంగా ఇంత సంఖ్యలో అవయవా లున్నవి అని వర్ణించిన గోవుకంటె భిన్నమైన ఇతరపదార్థాలున్నట్లు, బ్రహ్మకంటె కూడ భిన్నమైన పదార్థాలుండాలి అని అభిప్రాయం).

లోకంలో ఇది ఇంత అని పరిచ్ఛిన్నమైన కార్షాపణం మొదలైనదానికంటె భిన్నమైన ఇతరమైన వస్తువు లుంటాయి అనేది ప్రసిద్ధమే. (పదహారు పణాలు ఒక కార్షాపణం అనే నాణెం). అట్లే ఇక్కడ బ్రహ్మకు కూడ ఉన్మానం చెప్పడంచేత బ్రహ్మకంటె భిన్నమైన ఇతరవస్తువులు కూడ ఉంటాయని తెలుస్తూన్నది.[3] అట్లే-"సతా...భవతి", "శారీర ఆత్మా", "ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తః" అని సంబంధంయొక్క వ్యపదేశం కూడ ఉన్నది. మనుష్యులకు నగరాలతో సంబంధం ఉన్నట్లు మితులకు (పరిమితమైన స్వరూపం కలవారికి)మితులతో సంబంధం కనబడుచున్నది. జీవులకు సుషుప్తిలో బ్రహ్మతో సంబంధం ఉంటుందని చెపుతున్నది. అందువల్ల ఆ బ్రహ్మకంటె పరమైన అమితమైన దేదో ఉన్నదని తెలుస్తూన్నది. భేదవ్యపదేశం కూడ ఈ విషయాన్నే సూచిస్తూన్నది. అదెట్లనగా-"అథ...దృశ్యతే" అని ఈశ్వరునికి ఆదిత్యుడు ఆధారమని చెప్పి, ఆ ఈశ్వరునికంటె భిన్నుడైన నేత్రంలో ఉండే ఈశ్వరుణ్ణి "అథ...దృశ్యతే" అను వాక్యం వ్యపదేశిస్తూన్నది. రూపాదుల విషయంలో అక్షిపురుషునకు ఆదిత్యగతపురుషునితో అతిదేశం కూడ "తస్యైతస్య....తన్నామ" అను వాక్యం చేస్తూన్నది. "యే...దేవకామానాం చ" అని ఆదిత్యగతపురుషుడు లోకానికి పైనున్న లోకాలను దేవకామాలను పాలిస్తాడు అని "యే చైతస్మాద్...మనుష్యకామానాంచ"

అని అక్షిస్థపురుషుడు ఈ లోకానికి -కిందనున్న లోకాలను, మనుష్యకామాలను పాలిస్తాడు అనీ చెపుతూ, ఇది మాగధుని రాజ్యం, ఇది వైదేహుని రాజ్యం అన్నట్లు ఆదిత్యగతపురుషునికీ అక్షిగత పురుషునికీ వేరు వేరు అధికారాలున్నట్లు చెప్పబడింది. 31.

ఎ. "నేతి నేతి" ఇత్యాది వాక్యాలు బ్రహ్మకంటె భిన్నమైన దేదీ లేదని నిషేధిస్తున్నాయి అని చెప్పడం యుక్తం కాదు. సేత్వాదిశ్రుతులచేత బ్రహ్మకంటె పరమైన దేదో ఉన్నదని తెలుస్తూన్నది కదా అని ఆక్షేపసంగతిచేత పూర్వపక్షం.

### భాష్యమ్

ఏవమేతేభ్యః సేత్వాదివ్యపదేశేభ్యః బ్రహ్మణః పరమస్తీత్యేవం ప్రాప్తే ప్రతిపాద్యతే-

### సూ. సామాన్యాత్తు. 3.2.32

తుశబ్దేన ప్రదర్శితాంప్రాప్తిం నిరుణద్ధి.న బ్రహ్మణోऽన్యత్కించిద్భవితు మర్హతి, ప్రమాణాభావాత్. న హ్యన్యస్యాస్తిత్వే కిం చిత్ప్రమాణముపలభామహే. సర్వస్య హి జనిమతో వస్తుజాతస్య జన్మాది బ్రహ్మణో భవతీతి నిర్ధారితమ్, అనన్యత్వం చ కారణాత్కార్యస్య. న చ బ్రహ్మవ్యతిరిక్తం కించిదజం సంభవతి- "సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్" (ఛా.ఉ.6.2.1) ఇత్యవధారణాత్. ఏకవిజ్ఞానేన చ సర్వవిజ్ఞానప్రతిజ్ఞానాన్న బ్రహ్మవ్యతిరిక్తవస్త్వస్తిత్వమవకల్పతే. నను సేత్వాదివ్యపదేశాః బ్రహ్మవ్యతిరిక్తం తత్త్వం సూచయన్తీత్యుక్తమ్? నేత్యుచ్యతే. సేతువ్యపదేశస్తావన్న బ్రహ్మణో బాహ్యస్య సద్భావం ప్రతిపాదయితుం క్షమతే; సేతురాత్మేతి హ్యాహ, న పునస్తతః పరమస్తీతి. తత్ర పరస్మిన్నసతి సేతుత్వం నావకల్పత ఇతి పరం కిమపి కల్ప్యేత-న చైతన్న్యాయ్యం, హఠో హ్యప్రసిద్ధకల్పనా. అపి చ సేతువ్యపదేశాదాత్మనో లౌకికసేతునిదర్శనేన సేతుబాహ్యవస్తుతాం ప్రసఞ్జయతా మృద్దారుమయతాపి ప్రాసజ్యేత. న చైతన్న్యాయ్యమ్, అజత్వాదిశ్రుతివిరోధాత్. సేతుసామాన్యాత్తు సేతుశబ్ద ఆత్మని

ప్రయుక్త ఇతి శ్లిష్యతే. జగతస్తన్మర్యాదానాం చ విధారకత్వం సేతుసామాన్య మాత్మనః, అతః సేతురితి ప్రకృత ఆత్మా స్తూయతే. సేతుం తీర్త్వా ఇత్యపి తరతేరతిక్రమాసంభవాత్ ప్రాప్నోత్యర్థ ఏవ వర్తతే. యథా వ్యాకరణం తీర్ణ ఇతి ప్రాప్త ఇత్యుచ్యతే, నాతిక్రాన్తస్తద్వత్. 32.

బాలానందిని

ఏవమితి :-ఇట్లు సేత్వాదివ్యపదేశాలవల్ల బ్రహ్మకంటె పరమైనది ఉన్న దని ప్రాప్తించగా ప్రతిపాదించబడుతున్నది.

సామాన్యాదితి :- సామాన్యాత్తు=సామ్యంవల్లనే సేతుత్వం చెప్పబడింది అని సూత్రార్థం.

తుశబ్దేనేతి :- తుశబ్దంచేత పైన చూపబడిన పూర్వపక్షప్రాప్తిని అడ్డుకొను చున్నాడు. బ్రహ్మకంటె భిన్నమైన మరొక వస్తువేదో ఉండడానికి వీలు లేదు. అందుకు ప్రమాణం ఏదీ లేదు. మరొకటి ఉన్నదని చెప్పడానికి ప్రమాణం ఏదీ మాకు కనబడడంలేదు కదా. పుట్టిన ప్రతీ వస్తుసముదాయంయొక్క జన్మాదికం బ్రహ్మవల్లనే జరుగుతుందనీ, కార్యం కారణంకంటె భిన్నం కాదనీ నిర్ధారణ చేయబడింది. " సదేవ ...అద్వితీయమ్" అని నిర్ధారణ చేయడంవల్ల బ్రహ్మకంటె భిన్నమైన మరేదీ కూడ అజం (జన్మరహితం) అవడానికి వీలులేదు. అట్లే ఏకవిజ్ఞానంచేత సర్వవిజ్ఞానం కలుగుతుందని ప్రతిజ్ఞ చేయడంచేత బ్రహ్మకంటె భిన్నమైన వస్తువునకు అస్తిత్వం కూడ కుదరదు. సేత్వాదివ్యపదేశాలు బ్రహ్మకంటె భిన్నమైన (బ్రహ్మకు అవతలనున్న) వస్తువు ఉన్నట్లు సూచిస్తున్నాయి అని చెప్పాం కదా? అది యుక్తం కాదంటాం. సేతువు అని చెప్పడం బ్రహ్మకంటె బాహ్యమైన వస్తువు ఉన్నదని ప్రతిపాదించడానికి సమర్థం కాదు. ఆత్మ సేతువు అని మాత్రమే చెప్పింది కాని దానికంటె (ఆత్మకంటె) పరమైనది ఉన్నది అని చెప్పలేదు కదా? మరొక టేదో లేకపోతే సేతుత్వం కుదరదు గాన మరొక వస్తువును కల్పించాలి అన్నట్లయితే-ఇది న్యాయ్యం కాదు. అప్రసిద్ధమైనదానిని కల్పించడం హఠం (బలాత్కారంగా చేసిన పని)అవుతుంది. మరొక విషయమేమనగా - ఆత్మను సేతు వనడాన్ని బట్టి లోకంలో ఉండే సేతువుయొక్క నిదర్శనంచేత ఆ సేతువుకు బాహ్యమైన

వస్తువు కూడా ఉండాలి అని చెప్పేవాడు బ్రహ్మ కూడ (సేతువు వలెనే)మట్టి-కఱ్ఱల సముదాయంగా ఉంటుంది అని కల్పించే అవకాశం కూడ ఉంటుంది. ఇది న్యాయ్యం కాదు. ఇది బ్రహ్మకు అజత్వాదులను బోధించే శ్రుతికి విరుద్ధం కదా? అందుచేత సేతువుతో పోలిక ఉండడంచేత సేతుశబ్దం బ్రహ్మవిషయంలో ప్రయోగించబడినది అని చెప్పడమే యుక్తంగా ఉంటుంది. జగత్తును, దాని కట్టుబాట్లను, (సేతువు నీళ్లప్రవాహాన్ని నిలబెట్టినట్లు) నిలబెట్టడమే ఆత్మకు సేతువుతో ఉన్న పోలిక. అందుచేత సేతువు వంటి సేతువు అని ఆత్మ స్తుతించబడుచున్నది. "సేతుం తీర్త్వా అనే" చోట తౄధాతువునకు దాటడం అనే అర్థం కుదరదు గాన పొందడం అనే అర్థాన్నే అది బోధిస్తుంది. వ్యాకరణం దాటాడు అన్నప్పుడు వ్యాకరణశాస్త్రాన్ని పొందాడు అని మాత్రమే అర్థం కాని దానిని దాటినవాడు అనే అర్థం ఏ విధంగా లేదో అట్లే ఇక్కడ కూడ. 32.

సూ. బుద్ధ్యర్థః పాదవత్. 3.2.33.

యదప్యుక్తమున్మానవ్యపదేశాదస్తి పరమితి, తత్రాభిధీయతే-ఉన్మానవ్యపదేశోఽపి న బ్రహ్మవ్యతిరిక్తవస్త్వస్తిత్వప్రతిపత్త్యర్థః. కిమర్థస్తర్హి? బుద్ధ్యర్థః, ఉపాసనార్థ ఇతి యావత్. చతుష్పాదష్టాశఫం షోడశకలమిత్యేవం రూపా బుద్ధిః కథం ను నామ బ్రహ్మణి స్థిరా స్యాదితి వికారద్వారేణ బ్రహ్మణ ఉపమానకల్పనైవ క్రియతే. న హ్యవికారేఽనన్తే బ్రహ్మణి సర్వైః పుంభిః శక్యా బుద్ధిః స్థాపయితుం, మన్దమధ్యమోత్తమబుద్ధిత్వాత్పుంసామితి. పాదవత్. యథా మనఆకాశయోరధ్యాత్మమధిదైవతం చ బ్రహ్మప్రతీకయోరామ్నాతయో శ్చత్వారో వాగాదయో మనఃసబన్ధినః పాదాః కల్ప్యన్తే, చత్వారశ్చాగ్న్యాదయ ఆకాశసంబన్ధినః అధ్యానాయ తద్వత్. అథ వా పాదవదితి, యథా కార్షాపణే పాదవిభాగో వ్యవహారప్రాచుర్యాయ కల్ప్యతే, న హి సకలేనైవ కార్షాపణేన సర్వదా సర్వే జనాః వ్యవహర్తుమీశతే,క్రయవిక్రయే పరిమాణాని యమాత్తద్వదిత్యర్థః. 33.

బాలానందిని

బుద్ధీతి :- "పాదవత్=పాదముల వలె, బుద్ధ్యర్థం=ఉపాసనకోసం (ఉన్మానం)

చెప్పబడింది" అని సూత్రార్థం.

యదపీతి:- ఉన్మానం చెప్పడంవల్ల బ్రహ్మకంటె పరమైన దని ఏది చెప్పబడిందో దాని విషయంలో చెప్పబడుచున్నది. ఉన్మానవ్యపదేశం కూడ బ్రహ్మకంటె వ్యతిరిక్తమైన వస్తువు ఉన్నదని తెలుసుకొనడానికి చెప్పబడలేదు. అయితే మరెందుకు? బుద్ధికోసం చెప్పబడింది. అనగా ఉపాసనకోసం చెప్పబడింది అని అర్థం. బుద్ధిని బ్రహ్మయందు స్థిరంగా ఎట్లు నిలపడమా అని, దానికి ఉపాయంగా చతుష్పాత్తనీ, అష్టాశఫం అనీ షోడశకలం అనీ, వికారాల ద్వారా (కార్యాల ద్వారా) బ్రహ్మకు ఉన్మానకల్పన చేయబడుచున్నది. పురుషులలో మందబుద్ధులు, మద్యమబుద్ధులు, ఉత్తమబుద్ధులు కూడ ఉంటారు. అందరు పురుషులూ కూడ అవికారము, అనంతము అయిన బ్రహ్మయందు బుద్ధిని నిలపజాలరు కదా? పాదవత్-అధ్యాత్మంగా బ్రహ్మకు ప్రతీకంగా చెప్పబడిన మనస్సు, అధిదైవతంగా బ్రహ్మకు ప్రతీకగా చెప్పబడిన అకాశం వీటిలో వాగాదులు (వాక్-ప్రాణ-చక్షుస్-శ్రోతాలు) మనస్సుయొక్క పాదా లనీ, అగ్ని-వాయు ఆదిత్య-దిక్కులు అకాశంయొక్క పాదా లనీ ధ్యానం కోసం ఎట్లు కల్పించబడ్డాయో అట్లే ఇక్కడ కూడ. లేదా-"పాదవత్" అనుదానికి (మరొక అర్థం). క్రయవిక్రయాలలో వస్తువులయొక్క వాటి మూల్యంయొక్క పరిమాణంలో నియమం ఉండదుగాన అందరూ ఎల్లప్పుడూ పూర్తి కార్షాపణంతో వ్యవహరించజాలరు. అందుచేత వ్యవహారప్రాచుర్యంకొరకై కార్షాపణంలో నాల్గవవంతు అని విభాగం ఏ విధంగా చేయబడుచున్నదో అట్లే ఇక్కడ కూడ అని అర్థం. 33.

### సూ. స్థానవిశేషాత్ప్రకాశాదివత్. 3.2.34

ఇహ సూత్రే ద్వయోరపి సంబన్ధభేదవ్యపదేశయోః పరిహారో విధీయతే. యదప్యుక్తమ్-సంబన్ధవ్యపదేశాద్భేదవ్యపదేశాచ్చ పరమతః స్యాదితి, తదప్యసత్. యత ఏకస్యాపి స్థానవిశేషాపేక్షయైతౌ వ్యపదేశావుపపద్యేతే. సంబన్ధవ్యపదేశే తావదయమర్థః:-బుద్ధ్యాద్యుపాధిస్థానవిశేషయోగాదుద్భూతస్య విశేషవిజ్ఞానస్యోపాధ్యుపశమే య ఉపశమః స పరమాత్మనా సంబన్ధ ఇత్యుపాధ్యపేక్షయైవోపచర్యతే న పరిమితత్వాపేక్షయా. తథా భేదవ్యపదేశోఽపి

బ్రహ్మణః ఉపాధిభేదాపేక్షయైవోపచర్యతే, న స్వరూపభేదాపేక్షయా. ప్రకాశాదివదిత్యుపమోపాదానమ్. యథైకస్య ప్రకాశస్య సౌరస్య చాన్ద్రమసస్య వోపాధియోగాదుపజాతవిశేషస్య ఉపాధ్యుపశమాత్ సంబన్ధవ్యపదేశో భవతి, ఉపాధిభేదాచ్చ భేదవ్యపదేశః, యథా వా సూచీపాశాకాశాదిషూపాధ్యపేక్షయైవైతౌ సంబన్ధభేదవ్యదేశౌ భవతః తద్వత్. 34.

బాలానందిని

స్థానేతి:- "స్థానవిశేషాత్=ఉపాధివిశేషంవల్ల, ప్రకాశాదివత్=ప్రకాశాదులకు వలె సంబంధవ్యపదేశభేదవ్యపదేశములు చేయబడుచున్నవి" అని సూత్రార్థం.

ఇహేతి:- ఈ సూత్రంలో సంబంధవ్యపదేశ భేదవ్యపదేశాలు రెండింటికీ పరిహారం విధించబడుచున్నది. సంబంధవ్యపదేశంవల్ల, భేదవ్యపదేశంవల్లా కూడ బ్రహ్మకంటె పరమైనది ఉండవచ్చును అని ఏది చెప్పబడిందో అది కూడ యుక్తం కాదు. ఎందువల్ల ననగా-స్థానవిశేషాన్ని పట్టి ఒకే వస్తువునకు ఈ రెండు వ్యపదేశాలూ కుదురుతాయి. సంబంధవ్యపదేశం విషయంలో అర్థం ఇది- ఆత్మకు బుద్ధిమొదలైన స్థానవిశేషాలతో సంబంధం ఉన్నప్పుడు విశేషవిజ్ఞానం కలుగుతుంది. ఆ ఉపాధులు ఉపశమించగానే అది (విశేషజ్ఞానం)శాంతిస్తుంది. (సుషుప్తిలో జరిగే) ఆ విశేషవిజ్ఞానోపశమమే (జీవునకు) పరమాత్మతో కలిగిన సంబంధం అని (అంతవరకు ఉన్న)ఉపాధిసంబంధాన్ని పట్టి ఉపచారంచేత చెప్పబడుచున్నది. అంతే కాని పరిమితత్వాన్ని పట్టి కాదు. అనగా పరిమితుడైన జీవుడు పరమాత్మతో కలవడంచేత కాదు. అదే విధంగా భేదవ్యపదేశం కూడ బ్రహ్మకు కలిగిన ఉపాధికల్పితభేదాన్ని పట్టి మాత్రమే ఉపచారంచేత చెప్పబడుచున్నది, అంతే కాని (బ్రహ్మయొక్క) స్వరూపాపేక్షచేత, అనగా బ్రహ్మలో సహజంగా ఉన్నభేదం చేత, కాదు. ప్రకాశాదివత్ అనేది ఉపమాప్రదర్శనం. ఒక్కటే యైన సూర్యకాంతికి గాని, చంద్రకాంతికి గాని ఉపాధులతో (అంగుల్యాదులతో) సంబంధం ఉన్నప్పుడు కొన్ని (హ్రస్వత్వ - దీర్ఘత్వ - వక్రత్వాది) విశేషాలు ఏర్పడతాయి. ఆ ఉపాధులు తొలగిపోగానే విశేషాలుగా కనబడినవి సూర్య-చంద్రాదిప్రకాశంలో కలసిపోయి నట్లు చెప్పబడతాయి. ఈ విధంగా అక్కడ ఉపాధిభేదంచేత భేదవ్యపదేశం, ఉపాధిప్రశమనంచేత మహాప్రకాశతో

సంబంధం కలిగినట్లు వ్యపదేశమూ చేయబడుచున్నది.(ఈ విధంగా ఆదిత్యుడు చక్షుస్సు అనే స్థానాల భేదంచేత హిరణ్మయపురుషభేదకల్పన చేయబడుచున్నదని భావం). లేదా-సూది రంధ్రం మొదలైనవాటిలోని ఆకాశాదులకు ఉపాధులను పట్టియే సంబంధ వ్యపదేశభేదవ్యపదేశాలు చేయబడుతున్నాయి. అట్లే ఆత్మవిషయంలో కూడ. 34.

## సూ. ఉపపత్తేశ్చ. 3.2.35

ఉపపద్యతే చాత్రేదృశ ఏవ సంబన్ధో నాన్యాదృశః. యథా "స్వమపీతో భవతి" (ఛా.ఉ.6.8.1) ఇతి హి స్వరూపసంబన్ధమేనమామనన్తి, స్వరూపస్య చానపాయిత్వాత్ న నరనగరన్యాయేన సంబన్ధో ఘటతే,. ఉపాధి కృతస్వరూపతిరోభావాత్తు "స్వమపీతో భవతి" ఇత్యుపపద్యతే, తథా భేదోఽపి నాన్యాదృశః సంభవతి, బహుతరశ్రుతిప్రసిద్ధైకేశ్వరత్వవిరోధాత్.తథా చ శ్రుతిరేకస్యాప్యాకాశస్య స్థానకృతం భేదముపపాదయతి -"యోఽయం బహిర్ధా పురుషాదాకాశః" (ఛా.ఉ.3.12.7),"యోఽయమన్తః పురుష ఆకాశః" (ఛా.ఉ.3.12.8) "యోఽయమన్తర్హ్రదయ ఆకాశః" (ఛా.ఉ.3.12.9) ఇతి చ. 35

### బాలానందిని

**ఉపపత్తేరితి**:-"ఉపపత్తేశ్చ=ఉపపత్తి ఉండడంవల్ల కూడ సంబంధభేదనిర్దేశం ఉపాధికృతమే అని చెప్పడం యుక్తం" అని సూత్రార్థం.

**ఉపపద్యత ఇతి** :- ఇలాంటి సంబంధమే ఉపపన్నం కాని మరొకవిధమైనది ఉపపన్నం కాదు. ఎట్లనగా - "స్వమపీతో భవతి" అని ఇది స్వరూపంతో సంబంధమే అని చెపుతున్నారు. స్వరూపం ఎన్నటికీ దూరం అవడం అనేది ఉండదు గాన ఈ సంబంధం (తనను తాను పొందడం అనేది), నరనగరన్యాయం తో కుదరదు. (వేరు వేరు వస్తువులైన నరుడు నగరమూ దూరంగా ఉండవచ్చును, నరుడు వచ్చి నగరంలో ప్రవేశిస్తే ఆ నరనగరాలకు సంబంధం కలిగింది అని చెప్పడం యుక్తమే. జీవునికి తనస్వరూపమే అయిన ఆత్మనుండి విడిపోవడం అనేదే లేప్పుడు వచ్చి దానిలో కలవడం అసలే లేదు అని భావం). ఉపాధిచేత స్వరూపం కప్పబడి పోవడంచేత (ఉపాధికృతభేదంచేత వేరుగా

ఉన్నట్లు కనబడుతున్న జీవుడు ఆ ఉపాధి తొలగగానే "స్వమపీతో భవతి" అని చెప్పడం ఉపపన్నం అవుతుంది. అట్లే అనేకశ్రుతులలో చాటబడిన ఏకేశ్వరత్వానికి విరుద్ధంగాన భేదం కూడ మరొక విధమైనది(ఉపాధికృతమే తప్ప మరొకవిధమైన భేదం) కుదరదు. ఆకాశం ఒక్కటే అయినా దానికి స్థానాలచేత ఏర్పడిన భేదవ్యపదేశాన్ని "యోఽయం బహిర్ధా పురుషాదాకాశః"(పురుషుని బైట నున్న ఆకాశం), "యోఽయమన్తః పురుష ఆకాశః" (పురుషుని లోపల నున్న ఆకాశం) "యోఽయమన్తర్హృదయ ఆకాశః" (హృదయం లోపలనున్న ఆకాశం)ఇత్యాది విధంగా సమర్థిస్తున్నది. 35.

## సూ. తథాన్యప్రతిషేధాత్. 3.2.36

ఏవం సేత్వాదివ్యపదేశాన్ పరపక్షహేతూనున్మథ్య సంప్రతి స్వపక్షం హేత్వన్తరేణోపసంహరతి. తథాన్యప్రతిషేధాదపి న బ్రహ్మణః పరం వస్త్వన్తరమస్తీతి గమ్యతే. తథాహి-"స ఏవాధస్తాత్ "(ఛా.ఉ.7.25.2)"అహమేవాధస్తాత్" (ఛా.ఉ.7.25.1) "ఆత్మైవాధస్తాత్" (ఛా.ఉ.7.25.2) "సర్వం తం పరాదాద్యోఽన్యత్రాత్మనః సర్వం వేద" (బృ.ఉ.2.4.6) "బ్రహ్మైవేదం సర్వమ్", "ఆత్మైవేదం సర్వమ్"(ఛా.ఉ.7.25.2) "నేహ నానాస్తి కించన"(బృ.ఉ.4.4.19), "యస్మాత్పరం నాపరమస్తి కించిత్" (శ్వే.ఉ.3.9) 'తదేతద్బ్రహ్మాపూర్వమనపరమనన్తరమబాహ్యమ్'(బృ.ఉ.2.5.19)ఇత్యేవమాదివాక్యాని స్వప్రకరణస్థాన్యన్యార్థత్వేన పరిణేతుమశక్యాని బ్రహ్మవ్యతిరిక్తం వస్త్వన్తరం వారయన్తి. సర్వాన్తరశ్రుతేశ్చ న పరమాత్మనోఽన్యోఽన్తరాత్మాస్తీత్యవధార్యతే. 36.

### బాలానందిని

**తథేతి:-** "తథా=అట్లే అన్యప్రతిషేధాత్=బ్రహ్మకంటె భిన్నమైనదానిని నిషేధించడంవల్ల కూడ బ్రహ్మకంటె భిన్నమైన మరొక వస్తువు లేదు" అని సూత్రార్థం.

ఏవమితి:- ఈ విధంగా పరుల పక్షానికి హేతువులైన సేత్వాదివ్యపదేశాలను నిరాకరించి ఇప్పుడు తన పక్షాన్ని మరొకహేతువు కూడ చెపుతూ ఉపసంహరిస్తున్నాడు. అట్లే ఇతరమైనదానిని నిషేధించడంవల్ల కూడ బ్రహ్మకంటె పరమైన వస్తువు లేదని

తెలుస్తూన్నది. అదెట్లనగా-"స ఏవాధస్తాత్" (అదే క్రింద కూడ) "అహమేవాధస్తాత్" (నేనే క్రింద కూడ) "ఆత్మైవాధస్తాత్" (ఆత్మయే క్రింద కూడ ) "సర్వం తం పరాదాద్యోఽన్యత్రాత్మనః సర్వం వేద" (ఆత్మకంటె వేరుగా సర్వమూ ఉన్న దని అనుకునేవానిని ఆ సర్వమూ మ్రింగివేస్తుంది), "బ్రహ్మైవేదం సర్వమ్", "ఆత్మైవేదం సర్వమ్" "నేహ నానాస్తి కించన", "యస్మాత్పరం నాపరమస్తి కించిత్" "తదేతత్..అబాహ్యమ్" మొదలైన, తమ ప్రకరణంలో ఉండడంచేత మరొక విషయాన్ని దేనినో ప్రతిపాదించడానికి ఉద్దిష్టమైనవి అని చెప్పడానికి శక్యం కాని శ్రుతివాక్యాలు బ్రహ్మకంటె భిన్నమైన మరొక వస్తువును నివారిస్తున్నాయి. సర్వాన్తరశ్రుతిని పట్టి కూడ (ఆత్మ అన్నింటికికంటె లోపల నున్నది అని చెప్పే శ్రుతిని పట్టి కూడ) పరమాత్మకంటె వేరుగా మరొక అంతరాత్మ లేదని నిశ్చయించబడుచున్నది. 36.

సూ. అనేన సర్వగతత్వమాయామశబ్దాదిభ్యః. 3.2.37.

అనేనసేత్వాదినిరాకరణవ్యపదేశనిరాకరణేన, అన్యప్రతిషేధసమాశ్రయణేన చ సర్వగతత్వమప్యాత్మనః సిద్ధం భవతి. అన్యథా హి తన్న సిధ్యేత్. సేత్వాదివ్యపదేశేషు హి ముఖ్యేష్వఙ్గీక్రియమాణేషు పరిచ్ఛేద ఆత్మనః ప్రసజ్యేత; సేత్వాదీనామేవమాత్మకత్వాత్. తథాన్యప్రతిషేధేఽప్యసతి వస్తు వస్త్వన్తరాద్వ్యావర్తత ఇతి పరిచ్ఛేద ఏవాత్మనః ప్రసజ్యేత. సర్వగతత్వం చాస్యాయామశబ్దాదిభ్యో విజ్ఞాయతే. ఆయామశబ్దో వ్యాప్తివచనః శబ్దః-"యావాన్వాయమాకాశస్తావానేషోఽన్తర్హృదయ ఆకాశః" (ఛా.ఉ.8.1.3) "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః", "జ్యాయాన్దివః జ్యాయానాకాశాత్ "(ఛా.ఉ.3.14.3), "నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః" (భ.గీ.2.2.4) ఇత్యేవమాదయో హి శ్రుతిస్మృతిన్యాయాః సర్వగతత్వమాత్మనోఽవబోధయన్తి. 37

బాలానందిని

అనేనేతి:- "అనేన=సేత్వాదివ్యపదేశనిరాకరణంచేత, అన్యప్రతిషేధంచేత, ఆయామశబ్దాదిభ్యః=బ్రహ్మ సర్వగతం అని చెప్పే శబ్దాదులవల్ల, సర్వగతత్వమ్=బ్రహ్మకు సర్వగతత్వం సిద్ధిస్తూన్నది" అని సూత్రార్థం.

అనేనేతి :- ఈ విధంగా సేత్వాదివ్యపదేశాన్ని నిరాకరించడంచేత, ఇతరమైన వాటి నిషేధాన్ని ఆశ్రయించడంచేత (బ్రహ్మభిన్నమైనది ఏదీ లేదని చెప్పడంచేత) ఆత్మయొక్క సర్వగతత్వం కూడ సిద్ధిస్తుంది. అట్లు కాకపోతే ఇది సిద్ధించదు. సేత్వాదివ్యపదేశాలు ముఖ్యములే అని అంగీకరిస్తే ఆత్మకు పరిచ్ఛేదం (పరిచ్ఛిన్నత్వం)ప్రసక్తం అవుతుంది. ఎందువల్ల ననగా సేత్వాదులు ఇలాంటివి, అనగా పరిచ్ఛిన్నమైనవి. అట్లే బ్రహ్మకంటె భిన్నమైన వస్తువులను నిషేధించకపోతే ఒక వస్తువు మరొక వస్తువుకంటె భిన్నం అవుతుంది గాన (ఘటం పటం కంటె భిన్నం అన్నట్లు బ్రహ్మ యథార్థములే అయిన ఇతరవస్తువులకంటె భిన్నం అని చెప్పాలి గాన) ఆత్మకు పరిచ్ఛిన్నత్వమే ప్రసక్తం అవుతుంది.(ఘటం ఉన్నచోట పటం ఉండదు. పటం ఉన్న చోట ఘటం ఉండదు. అట్లే ఆత్మకంటె భిన్నమైన వస్తువు లున్నాయి అని అంటే ఆ వస్తువు లున్నచోట ఆత్మ ఉండదు గాన ఆత్మ సర్వగతం అనడం కుదరదు). ఆత్మ సర్వగత మని అయామశబ్దాదులవల్ల తెలుస్తూన్నది. ఆయామశబ్దం అనగా వ్యాప్తిని (సర్వవ్యాపకము అని) చెప్పే శబ్దం. "యావాన్వా...ఆకాశః" "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః" "జ్యాయాన్ దివః" "జ్యాయానాకాశాత్" "నిత్యః సర్వగతః స్థాణురచలోయం సనాతనః" (ఈ ఆత్మ నిత్యం, అంతటా వ్యాపించి ఉన్నది. స్థిరమైనది, కదలనిది, అతిప్రాచీనము, సర్వదా ఉండేది) ఈ మొదలైన శ్రుతిస్మృతిన్యాయాలు ఆత్మ సర్వగతం అని బోధిస్తున్నాయి.

వి. బ్రహ్మ ఎట్లు సత్యమే జగత్తు కూడ అలాగే సత్యమైతే జగత్తు ఉన్నచోట ఆత్మ ఉండడానికి వీలు లేదు. అది ఉన్నచోటు విడిచి మరొక చోట ఆత్మ ఉండాలి. అప్పుడు ఆత్మసర్వగతం అనే వేదాంతసిద్ధాంతానికి వ్యాఘాతం కలుగుతుంది. అలా కాక ఆత్మ ఒక్కటే సత్యం, జగత్తు దాని మీద ఆరోపింపబడింది, ఆత్మయే జగత్తుగా భాసిస్తూన్నది అని చెప్పినప్పుడు ఆత్మకు సర్వగతత్వం కుదురుతుంది. రజ్జువుమీద సర్పం భాసించినా ఆ సర్పం ఉన్నచోటు అంతటా రజ్జువు ఉన్నట్లు, జగత్తు ఉన్న స్థానంలో బ్రహ్మ ఉంది అని చెప్పవచ్చును గాన దాని సర్వగతత్వానికి భంగం ఏమీ ఉండదు. "అధ్యస్తం జగత్ అధిష్ఠానేన బ్రహ్మణా వ్యాప్తమ్; అధ్యస్తత్వాత్; రజ్జ్వావ్యాప్తసర్పవత్" (అధ్యస్తమైన జగత్తు అధిష్ఠానమైన బ్రహ్మచేత వ్యాప్తమైనది, అధ్యస్తం కాబట్టి, రజ్జువుచేత వ్యాప్తమైన సర్పంవలె) ఇత్యాదులు న్యాయాలు. పైన ఉదాహరించిన శ్రుతిస్మృతులచేత, ఇలాంటి న్యాయాలచేత

ప్రతిపాదింపబడిన సర్వవ్యాప్తత్వం కుదరాలంటే సేత్వాదివ్యపదేశనిరాకరణము, అన్యప్రతిషేధమూ అవశ్యకములని భావం. 37

పరాధికరణం సమాప్తం

## 8. ఫలాధికరణమ్. సూ. 38-41

### సూ. ఫలమత ఉపపత్తేః. 3.2-38.

తస్యైవ బ్రహ్మణో వ్యావహారిక్యామీశిత్రీశితవ్యవిభాగావస్థాయామయ మన్యః స్వభావో వర్ణ్యతే. యదేతదిష్టానిష్టవ్యామిశ్రలక్షణం కర్మఫలం సంసారగోచరం త్రివిధం ప్రసిద్ధం జన్తూనాం కిమేతత్కర్మణో భవత్యాహోస్విదీశ్వరాత్, ఇతి భవతి విచారణా. తత్ర తావత్ప్రతిపాద్యతే-ఫలమత ఈశ్వరాద్భవితుమర్హతి. కుతః? ఉపపత్తేః. స హి సర్వాధ్యక్షః సృష్టిస్థితిసంహారాన్విచిత్రాన్విదధత్ దేశకాలవిశేషాభిజ్ఞత్వాత్కర్మిణాంకర్మానురూపంఫలం సంపాదయతీత్యుపపద్యతే. కర్మణస్త్వనుక్షణవినాశినః కాలాన్తరభావి ఫలం భవతీత్యనుపపన్నమ్. అభావాద్భావానుత్పత్తేః. స్యాదేతత్; కర్మ వినశ్యత్స్వకాలమేవ స్వానురూపం ఫలం జనయిత్వా వినశ్యతి, తత్ఫలం కాలాన్తరితం కర్త్రా భోక్ష్యత ఇతి. తదపి న పరిశుధ్యతి. ప్రాగ్భోక్తృసంబన్ధాత్ ఫలత్వానుపపత్తేః. యత్కాలం హి యత్సుఖం దుఃఖం వాత్మనా భుజ్యేత తస్యైవ లోకే ఫలత్వం ప్రసిద్ధమ్. న హ్యసంబద్ధస్యాత్మనా సుఖస్య దుఃఖస్య వా ఫలత్వం ప్రతియన్తి లౌకికాః. అథోచ్యతే -మాభూత్కర్మానన్తరం ఫలోత్పాదః. కర్మకార్యాదపూర్వాత్ఫలముత్పత్స్యత ఇతి. తదపి నోపపద్యతే. అపూర్వస్యాచేతనస్య కాష్ఠలోష్టసమస్య చేతనేనా ప్రవర్తితస్య ప్రవృత్త్యనుపపత్తేః. తదస్తిత్వే చ ప్రమాణాభావాత్. అర్థాపత్తిః ప్రమాణమితి చేత్? న. ఈశ్వరసిద్ధేరర్థాపత్తిక్షయాత్. 38.

బాలానందిని

ఫలమితి :-"ఫలమ్=కర్మఫలం, అతః=ఈ పరమేశ్వరుని వలననే కలుగును

ఉపపత్తేః=అలా చెపితేనే ఉపపన్నంగా ఉంటుంది కాబట్టి" అని సూత్రార్థం.

తస్యేతి :- ఈశిత(అధికారం నెరపేవాడు)ఈశితవ్యుడు (అధికారానికి లోబడి ఉండవలసినవాడు)అనే వ్యావహారికమైన అవస్థలో ఆ బ్రహ్మకే సంబంధించిన మరొక స్వభావం వర్ణించబడుతూన్నది. సంసారానికి సంబంధించిన ఇష్టం, అనిష్టం, వ్యామిశ్రం (ఇష్టానిష్టాలు రెండూ కలసినది) అని త్రివిధమైన ఏ జంతువు లనుభవించవలసిన కర్మఫలం ఉన్నదో అది కర్మవల్లనే కలుగుతుందా లేక ఈశ్వరునివల్ల కలుగుతుందా అని విచారణ జరుగుచున్నది. ఆ సందర్భంలో-ఫలం, అతః=ఈ ఈశ్వరునివల్ల కలగడానికి తగి ఉన్నది అని ప్రతిపాదించబడుచున్నది. ఎందువల్ల? ఉపపత్తివల్ల. సర్వాధ్యక్షుడైన ఆ ఈశ్వరుడు విచిత్రములైన సృష్టిస్థితిసంహారకార్యాలను చేస్తూ దేశకాలవిశేషాలు తెలిసిన వా డవడంవల్ల కర్మలు చేసేవాళ్లకు (వాళ్ల వాళ్ల) కర్మలకు తగిన ఫలం ఇస్తా డని చెప్పడం ఉపపన్నంగా ఉంటుంది. క్షణంలో నశించే కర్మవల్ల కాలాంతరంలో ఉండే ఫలం లభిస్తుందని చెప్పడం ఉపపన్నం కాదు. అభావంవల్ల (కర్మ నశించి దాని అభావమే మిగలింది గాన ఆ అభావంవల్ల) భావవస్తువు పుట్టదు కదా? (ప్రశ్న)-అది సరి, కర్మనశిస్తూ దాని సమయంలోనే తనకు తగిన ఫలాన్ని పుట్టించి నశిస్తుంది. దాని ఫలాన్ని కాలాంతరంలో కర్త అనుభవిస్తాడు. (సమాధానం) అది పరిశుద్ధంగాలేదు. భోక్తతో సంబంధించ డానికి పూర్వం అది ఫలం కాజాలదు. ఏ సుఖం లేదా ఏ దుఃఖం ఏకాలంలో ఆత్మచేత అనుభవించబడుతుందో అదే ఫలం అని లోకంలో ప్రసిద్ధంగా ఉంది. ఆత్మకి సంబంధించని సుఖాన్ని గాని, దుఃఖాన్ని గాని ఫలం అని లౌకికు లెవ్వరూ భావించరు కదా? (ఆశంక)కర్మ చేసినవెంటనే ఫలోత్పత్తి కలగకపోవుగాక; కర్మకు కార్యమైన (కర్మవల్ల పుట్టిన) అపూర్వంవల్ల ఫలం పుడుతుంది. (సమాధానం) అది కూడ యుక్తంకాదు. కాష్ఠలోష్టాదుల వలె అచేతనమైన అపూర్వం చేతనంచేత ప్రవర్తింపచేయబడకుండా ప్రవర్తించజాలదు కదా? అపూర్వం అనేది ఒకటుందని చెప్పడానికి ప్రమాణం కూడ లేదు. అర్థాపత్తి ప్రమాణం అని అంటే అది యుక్తం కాదు. ఈశ్వరసిద్ధిచేతనే అర్థాపత్తి క్షీణిస్తుంది.

వి. ఏదో యాగం చేస్తే స్వర్గం లభిస్తుందని శ్రుతి చెపుతున్నది. శ్రుతి చెప్పినది అసత్యం కాకూడదు. అందుచేత అనిత్యమైన కర్మ స్థిరమైన అపూర్వాన్ని పుట్టిస్తుంది.

అది యాగం చేసినవాని ఆత్మతో కలిసి ఉండి తగిన దేశకాలాలలో ఫలితం ఇస్తుంది అని అర్థాపత్తియే అపూర్వం అనేది ఉంది అనడానికి ప్రమాణం అనడం యుక్తం కాదు. క్షణికమైన కర్మ కాలాంతరంలో లభించే ఫలానికి హేతువు కాజాలదు గాన ఏదైన ఒక నిత్యమైన దానిని అంగీకరించాలి అనే అర్థాపత్తి ప్రమాణంచేత అపూర్వమే సిద్ధించాలని ఎక్కడ ఉంది? కర్మ అనిత్యమైనా దాని ఫలాన్ని ఈశ్వరుడు తగిన సమయంలో ఇస్తాడు అని అంగీకరించినా కూడ నీవు చూపిన అర్థాపత్తి సరిపోతుంది కదా? ఈ అర్థాపత్తిచేత ఈశ్వరుడు సిద్ధిస్తున్నాడు గాన ఇది అపూర్వాన్ని సాధించజాలదు అని భావం. 38.

### సూ. శ్రుతత్వాచ్చ. 3.2.39

న కేవలముపపత్తేరేవేశ్వరం ఫలహేతుం కల్పయామః; కిం తర్హి? శ్రుతత్వాదపీశ్వరమేవ ఫలహేతుం మన్యామహే. తథా చ శ్రుతిర్భవతి -"స వా ఏష మహానజ ఆత్మాన్నాదో వసుదానః "(బృ.ఉ.4.4.24) ఇత్యేవంజాతీయకా. 39.

బాలానందిని

శ్రుతేతి :-" శ్రుతత్వాచ్చ=శ్రుతిలో వినబడుచున్నాడు, అందుచేత కూడ ఈశ్వరుడే ఫలదాత" అని సూత్రార్థం.

నేతి:- కేవలం ఉపపత్తిని పట్టి మాత్రమే ఈశ్వరుడు ఫలహేతువని మేం కల్పించడంలేదు. మరే మనగా-ఆ విధంగా వినబడుచున్నాడు, అందుచేత కూడ ఈశ్వరుడే ఫలహేతువని భావిస్తున్నాం. "స వా...వసుదానః" (అజుడైన అట్టి ఈ ఆత్మయే ప్రాణులకు అన్నం ఇచ్చేది, ధనం ఇచ్చేది)ఇత్యాదిశ్రుతులు ఈ విషయాన్ని చెపుతున్నాయి.

### సూ. ధర్మం జైమినిరత ఏవ. 3.2.40.

జైమినిస్త్వాచార్యో ధర్మం ఫలస్య దాతారం మన్యతే. అత ఏవ హేతోః, శ్రుతేరుపపత్తేశ్చ. శ్రూయతే తావదయమర్థః "స్వర్గకామో యజేత" ఇత్యేవమాదిషు వాక్యేషు. తత్ర చ విధిశ్రుతేః విషయభావోపగమాద్యాగః స్వర్గస్యోత్పాదక ఇతి గమ్యతే. అన్యథాహ్యననుష్ఠాతృకో యాగ ఆపద్యేత; తత్రాస్యోపదేశవైయర్థ్యం స్యాత్. నన్వనుక్షణవినాశినః కర్మణః ఫలం నోపపద్యత ఇతి పరిత్యక్తోఽయం

పక్షః? నైష దోషః. శ్రుతిప్రామాణ్యాత్. శ్రుతిశ్చేత్ప్రమాణం యథాయం కర్మఫలసంబన్ధః శ్రుత ఉపపద్యతే తథా కల్పయితవ్యః. న చానుత్పాద్య కిమప్యపూర్వం కర్మ వినశ్యత్కాలాన్తరితం ఫలం దాతుం శక్నోతి. అతః కర్మణో వా సూక్ష్మా కా చిదుత్తరావస్థా; ఫలస్య వా పూర్వావస్థాఽపూర్వం నామ అస్తీతి తర్క్యతే. ఉపపద్యతే చాయమర్థ ఉక్తేన ప్రకారేణ. ఈశ్వరస్తు ఫలం దదాతీత్యనుపపన్నమ్. అవిచిత్రస్య కారణస్య విచిత్రకార్యానుపపత్తేః. వైషమ్య నైర్ఘృణ్యప్రసంగాత్, అనుష్ఠానవైయర్థ్యాపత్తేశ్చ. తస్మాద్ధర్మాదేవ ఫలమితి. 40.

బాలానందిని

ధర్మమితి:- "అతఏవ=పైన చెప్పిన కారణాలవల్లనే, ధర్మమ్=ధర్మమును ఫలం ఇచ్చేదానినిగా, జైమినిః=జైమిని తలచుచున్నాడు" అని సూత్రార్థం.

జైమినిరితి:- ఆచార్యుడైన జైమిని యైతే ధర్మమే ఫలం ఇస్తుందని తలచుచున్నాడు; ఈ కారణంవల్లనే అనగా శ్రుతివల్ల, ఉపపత్తివల్లా కూడ. ఈ విషయం "స్వర్గకామో యజేత" (స్వర్గంమీద కోరిక ఉన్నవాడు యజ్ఞం చెయ్యాలి) ఇత్యాదివాక్యాలలో వినబడుచున్నది. వీటిలో విధి వినబడుచున్నది గాన ఆ విధిలో విషయమైన, అనగా విధింపబడిన, యాగం స్వర్గాన్ని పుట్టిస్తుంది అని తెలుస్తూన్నది. అలా కాకపోతే (యాగం స్వర్గాన్ని పుట్టించకపోతే) యాగాన్ని అనుష్ఠించేవాళ్లెవరూ ఉండరు. అప్పుడు ఈ ఉపదేశం వ్యర్థం అవుతుంది. క్షణకాలంలోనే నశించే కర్మవల్ల ఫలం కలగడం ఉపపన్నం కాదనే కారణంచేత ఈ పక్షం విడవబడింది కదా? ఈ దోషం లేదు. శ్రుతి ప్రమాణం కదా? శ్రుతి ప్రమాణం అయితే (దాని ప్రామాణ్యాన్ని సంరక్షించడంకోసం) వినబడుతూన్న ఈ కర్మ-ఫలసంబంధం (కర్మకీ ఫలానికీ ఉన్న సంబంధం) ఎలా ఉపపన్నంగా ఉంటుందో అలా కల్పించాలి. నశించిపోయే కర్మ ఏదో ఒక అపూర్వాన్ని పుట్టించకుండా కాలాంతరితమైన (కాలంచేత వ్యవహితమైన) ఫలాన్ని ఇవ్వడానికి సమర్థం కాదు. అందుచేత అపూర్వం అనేది ఒకటి ఉన్నది అని ఊహించబడుతుంది. ఇది కర్మయొక్క సూక్ష్మమైన ఉత్తరావస్థ (కర్మ పూర్తియైన తరవాత జనించిన దాని సూక్ష్మమైన అవస్థ)అని గాని, కాలాంతరంలో రాబోయే ఫలంయొక్క పూర్వావస్థ అని గాని (బీజంలో సూక్ష్మరూపంలో

వృక్షాదులున్నట్లు)అని చెప్పాలి. ఈ విషయం పైన చెప్పిన ప్రకారంచేత ఉపపన్నంగా ఉంటుంది. ఈశ్వరుడు ఫలం ఇస్తాడు అనేది మాత్రం అనుపపన్నం. (విచిత్రమైన కర్మలు లేకుండా)విచిత్రమైన కార్యాలు పుట్టడం అనుపపన్నంగాన అవిచిత్రమైన ఈశ్వరరూపకారణానికి వైషమ్యమూ, నైర్ఘృణ్యమూ ప్రసక్తం అవుతాయి. ఫలం ఇచ్చేది కర్మ కాకుండా ఈశ్వరు డన్నట్లయితే కర్మానుష్ఠానం వ్యర్థం అవుతుంది. అందువల్ల ఫలం ధర్మంవల్లనే కలుగుతుంది. (ఇది జైమిని మతం) 40.

సూ. పూర్వం తు బాదరాయణో హేతువ్యపదేశాత్ 3.2.41

బాదరాయణస్త్వాచార్యః పూర్వోక్తమీశ్వరం ఫలహేతుం మన్యతే. కేవలాత్కర్మణో ఽపూర్వాద్వా కేవలాత్ ఫలమిత్యయం పక్షస్తుశబ్దేన వ్యావర్త్యతే. కర్మాపేక్షాదపూర్వాపేక్షాద్వా యథా తథా భవతు, ఈశ్వరాత్ఫలమితి సిద్ధాన్తః. కుతః? హేతువ్యపదేశాత్. ధర్మాధర్మయోరపి కారయితృత్వేనేశ్వరో హేతుర్వ్యపదిశ్యతే, ఫలస్య చ దాతృత్వేన - "ఏష హ్యేవ సాధు కర్మ కారయతి యమేభ్యోలోకేభ్య ఉన్నినీషతే, ఏష ఉ ఏవాసాధు కర్మ కారయతి తం యమధో నినీషతే"(కౌ.ఉ.3.8) ఇతి. స్మర్యతే చాయమర్థో భగవద్గీతాసు-

"యోయో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి"
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్.
స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధనమీహతే,
లభతే చ తతః కామాన్మయైవ విహితాన్ హితాన్" (భ.గీ.7.21,22)

ఇతి. సర్వవేదాన్తేషు చేశ్వరహేతుకా ఏవ సృష్టయో వ్యపదిశ్యన్తే. తదేవ చేశ్వరస్య ఫలహేతుత్వం యత్స్వకర్మానురూపాః ప్రజాః సృజతీతి. విచిత్రకార్యానుపపత్త్యాదయో ఽపి దోషాః కృతప్రయత్నాపేక్షత్వాదీశ్వరస్య న ప్రసజ్యన్తే. 41

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీగోవిన్దభగవత్పూజ్యపాదశిష్య

## శ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌ శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యే తృతీయాధ్యాయస్య ద్వితీయః పాదః.

### బాలానందిని

**పూర్వమితి** :- బాదరాయణస్తు = బాదరాయణుడైతే, పూర్వమ్=వెనుక చెప్పిన ఈశ్వరుణ్ణి కర్మఫలప్రదాతనుగా చెపుతున్నాడు. హేతువ్యపదేశాత్=కర్మలు చేయించడానికి కూడ హేతువు ఈశ్వరుడే అని చెప్పడం వల్ల" అని సూత్రార్థం.

బాదరాయణ ఇతి:- బాదరాయణాచార్యుడైతే వెనుక చెప్పిన ఈశ్వరుడే ఫలానికి హేతువని భావిస్తున్నాడు. కేవలమైన కర్మవల్ల గాని, కేవలమైన అపూర్వంవల్ల గాని ఫలం కలుగుతుంది అనే పక్షం తుశబ్దంచేత నివారించబడుతున్నది. ఈశ్వరుడు కర్మాపేక్షుడు (కర్మను పట్టి ఇచ్చేవాడు)గాని, అపూర్వాపేక్షుడు గాని, ఏమయినా ఫలం ఇచ్చేది మాత్రం ఈశ్వరుడే అని సిద్ధాంతం. ఎందువల్ల? హేతువ్యపదేశంవల్ల. ధర్మాధర్మాలలో కూడ హేతువుగా (ధర్మాధర్మాలు చేయించే హేతువుగా) ఈశ్వరుడే "ఏష...నినీషతే" ఇత్యాది శ్రుతివాక్యంలో చెప్పబడ్డాడు. ఈ విషయమే భగవద్గీతలో కూడ "యో యో...తాన్" అని చెప్పబడింది. (ఏ యే భక్తుడు నా ఏ యే స్వరూపాన్ని శ్రద్ధతో పూజించడానికి కోరతాడో ఆ యా భక్తునికి నిశ్చలమైన అలాంటి శ్రద్ధనే ఇస్తాను. అతడు ఆ శ్రద్ధతో ఆ స్వరూపాన్ని ఆరాధించడానికి కోరుతాడు. దానివల్ల నేనే సమకూర్చిన ఆ యా కామాలను పొందుతాడు అని ఈ శ్లోకాల తాత్పర్యం). సృష్టుల కన్నింటికీ ఈశ్వరుడే హేతువని సమస్త వేదాంతాలలోను చెప్పబడుచున్నది. ఈశ్వరుడు ఫలానికి హేతువనగా అర్థం ఏమనగా ప్రజలను వాళ్ల వాళ్ల కర్మలకు అనురూపంగా సృష్టిస్తాడు అని మాత్రమే.(పైన పూర్వపక్షి చూపిన) విచిత్ర కార్యాలు అనుపపన్నములు ఇత్యాది దోషాలు ప్రసక్తములు కావు; ఎందువల్ల ననగా ఈశ్వరుడు ఆ యా మానవులు చేసిన ప్రయత్నాన్ని పట్టి ఫలం ఇస్తాడు.

ఫలాధికరణం సమాప్తం

బాలానందిని అను శ్రీమచ్ఛాంకరశారీరకమీమాసాభాష్యాంధ్రవ్యాఖ్యానంలో తృతీయాధ్యాయంలోని ద్వితీయపాదం సమాప్తం.

## తృతీయాధ్యాయే తృతీయః పాదః

(అత్ర పరాపరబ్రహ్మవిద్యాగుణోపసంహారవివరణమ్)

### సర్వవేదాన్తప్రత్యయాధికరణమ్. సూ. 1-4

### సూ. సర్వవేదాన్తప్రత్యయం చోదనాద్యవిశేషాత్ 3.3.1

వ్యాఖ్యాతం విజ్ఞేయస్య బ్రహ్మణస్తత్త్వమ్. ఇదానీం తు ప్రతివేదాన్తం విజ్ఞానాని భిద్యన్తే వా న వేతి విచార్యతే. నను విజ్ఞేయం బ్రహ్మ పూర్వాపరాది భేదరహితమేకరసం సైన్ధవఘనవదవధారితమ్. తత్ర కుతో విజ్ఞానభేదాభేద చిన్తావతారః? న హి కర్మబహుత్వవత్ బ్రహ్మబహుత్వమపి వేదాన్తేషు ప్రతిపి పాదయిషితమితి శక్యం వక్తుమ్; బ్రహ్మణ ఏకత్వా దేకరూపత్వాచ్చ. నచైకరూపే బ్రహ్మణ్యనేకరూపాణి విజ్ఞానాని సంభవన్తి. న హ్యన్యథార్థోఽన్యథా జ్ఞానమిత్య భ్రాన్తం భవతి. యది పునరేకస్మిన్ బ్రహ్మణి బహూని విజ్ఞానాని వేదాన్తాన్తరేషు ప్రతిపిపాదయిషితాని తేషామేకమభ్రాన్తం, భ్రాన్తానీతరాణీత్యనాశ్వాసప్రసంగో వేదాన్తేషు. తస్మాన్న తావత్ప్రతివేదాన్తం బ్రహ్మవిజ్ఞానభేద ఆశఙ్కితుం శక్యతే. నాప్యస్య చోదనాద్యవిశేషాదభేద ఉచ్యేత. బ్రహ్మవిజ్ఞానస్యాచోదనాలక్షణత్వాత్. అవిధిప్రధానైర్హి వస్తుపర్యవసాయిభిర్బ్రహ్మవాక్యైర్బ్రహ్మవిజ్ఞానం జన్యత ఇత్యతోఽవోచదాచార్యః "**తత్తు సమన్వయాత్**" (బ్ర.సూ. 1.1.4) ఇత్యత్ర. తత్కథమిమాం భేదాభేదచిన్తామారభత ఇతి.

#### బాలానందిని

సర్వేతి:- "సర్వవేదాన్త ప్రత్యయమ్సర్వవేదాంతాలలో తెలియబడుచున్న ఉపాసనలు భిన్నములు కావు. చోదనాద్యవిశేషాత్ = చోదనాదులలో విశేషం లేదు గావ" అని సూత్రార్థం.

**వ్యాఖ్యాతమితి.** విజ్ఞేయమైన బ్రహ్మయొక్క తత్త్వం విశదీకరించబడింది. వేదాంతాలలో ఉన్న విజ్ఞానాలు పరస్పరభిన్నములా కావా అని ఇప్పుడు విచారణ

చేయుబడుచున్నది. (ఆశంక). విజ్ఞేయమైన బ్రహ్మ పూర్వము, అపరము, ఇత్యాది భేదాలు లేని దనీ, ఉప్పుముద్ద (ఖాయి)వలె ఏకరస మనీ నిర్ధారణ చేయబడినది కదా? అలాంటప్పుడు విజ్ఞానాలలో భేదం ఉందా లేక వీటిలో భేదం లేదా అనే ఈ విచారణకు అవతారం (ప్రవేశం, అవకాశం) ఎక్కడ? కర్మలు అనేకవిధాలుగా ఉంటాయన్నట్లు బ్రహ్మ కూడా అనేకవిధాలుగా ఉంటుందని వేదాంతాలు ప్రతిపాదించడానికి ప్రయత్నిస్తున్నాయి అని చెప్పడానికి శక్యం కాదు కదా? ఎందువల్ల ననగా బ్రహ్మ ఒక్కటే, దాని స్వరూపం కూడా ఒక్కటే. ఏకరూపమైన బ్రహ్మ విషయంలో అనేకరూపాలైన విజ్ఞానాలు సంభవించవు. పదార్థం ఒక విధంగా ఉండగా జ్ఞానం మరొక విధంగా ఉంటే అది భ్రాంతి కాని, జ్ఞానం (ప్రమాత్మకమైన జ్ఞానం) కాజాలదు కదా? అందువల్ల ఒకే బ్రహ్మ విషయంలో, వేరు వేరు వేదాంతాలలో, అనేకవిధాలైన విజ్ఞానాలు ప్రతిపాదించడానికి ఉద్దేశించబడితే వాటిలో ఒక్కటి మాత్రమే అభ్రాంతం కావాలి. ఇతరమైనవి భ్రాంతి రూపాలవ్వాలి. అలాంటప్పుడు వేదాంతాల విషయంలో అవిశ్వాసం ఏర్పడుతుంది. అందువల్ల ఒక్కొక్క వేదాంతంలో ఉన్న బ్రహ్మవిజ్ఞానం భిన్నంగా ఉంటుందని ఆశంకించడానికే శక్యం కాదు. చోదనాదులలో విశేషం లేదు గాన బ్రహ్మవిజ్ఞానం అభిన్నమే అని చెప్పడం కూడా కుదరదు. ఎందువల్ల ననగా బ్రహ్మ విజ్ఞానం చోదనాలక్షణం (విధిరూపం) కాదు. విధి ప్రధానంగా లేనివి, వస్తువును మాత్రమే బోధించేవి అయిన బ్రహ్మవాక్యాలచేత బ్రహ్మవిజ్ఞానం పుట్టింపబడుతుంది అని ఆచార్యుడు "**తత్తు సమన్వయాత్**" అనేచోట చెప్పి ఉన్నాడు. కదా? అలాంటప్పుడు ఈ భేదాభేదచింతనను ఎలా ప్రారంభిస్తున్నాడు?

## భాష్యమ్

తదుచ్యతే-సగుణబ్రహ్మవిషయా ప్రాణాదివిషయా చేయం విజ్ఞాన భేదచిన్తేత్యదోషః. అత్ర హి కర్మవదుపాసనానాం భేదాభేదౌ సంభవతః. కర్మవదేవ చోపాసనాని దృష్టఫలాన్యదృష్టఫలాని చోచ్యన్తే. క్రమముక్తిఫలాని చ కాని చిత్సమ్యగ్జ్ఞానోత్పత్తిద్వారేణ. తేష్వేషా చిన్తా సంభవతి - కిం ప్రతివేదాన్తం విజ్ఞానభేద ఆహోస్విన్నేతి. తత్ర పూర్వపక్షహేతవస్తావదుపన్యస్యన్తే. నామ్నస్తావద్భేదప్రపత్తి పత్తిహేతుత్వం ప్రసిద్ధం జ్యోతిరాదిషు. అస్తి చాత్ర

వేదాన్తాన్తర విహితేషు విజ్ఞానేషు అన్యదన్యన్నామ తైత్తిరీయకమ్, వాజసనేయకమ్, కౌథుమకమ్, శాట్యాయనకమ్ ఇత్యేవమాది. తథా రూపభేదోఽపి కర్మభేదస్య ప్రతిపాదకః ప్రసిద్ధః "**వైశ్వదేవ్యామిక్షా వాజిభ్యో వాజినమ్**" ఇత్యాదిషు. అస్తి చాత్ర రూప భేదః. తద్యథా కేచిచ్ఛాఖినః పఞ్చాగ్నివిద్యాయాం షష్ఠమపరమగ్ని మామనన్తి, అపరే పునః పఞ్చైవ పఠన్తి తథా ప్రాణ సంవాదాదిషు కేచిదూనాన్వాగాదీనా మనన్తి, కేచిదధికాన్. తథా ధర్మవిశేషోఽపి కర్మభేదస్య పత్రిపాదక ఆశఙ్కితః కారీర్యాదిషు. అస్తి చాత్ర ధర్మవిశేషః, యథా ఆథర్వణికానాం శిరోవ్రతమితి. ఏవం పునరుక్త్యాదయోఽపి భేదహేతవః యథాసంభవం వేదాన్తాన్తరేషు యోజయితవ్యాః తస్మాత్ప్రతివేదాన్తం విజ్ఞానభేద ఇతి.

### బాలానందిని

**తదితి** :- ఈ విషయంలో చెప్పబడుచున్నది. ఈ విజ్ఞానభేదవిచారం సగుణ బ్రహ్మకు, ప్రాణాదులకు సంబంధించినది గాన దోషం లేదు. ఇక్కడ వేదాంతాలలో ఉపాసనలకు, కర్మలకు వలె భేదాభేదాలు సంభవం అవుతాయి. కర్మల వలెనే ఉపాసనలు దృష్టఫలాలు (వెంటనే కనబడే ఫలం గలవి) అదృష్టఫలాలు (కాలాంతరంలో లభించే ఫలాలు గలవి) అని చెప్పబడుచున్నాయి. కొన్ని సమ్యగ్జ్ఞానాన్ని కలిగించడం ద్వారా క్రమముక్తి ఫలంగా కలవి (క్రమముక్తి నిచ్చేవి). వాటి విషయంలో ప్రతీ వేదాంతంలోను విజ్ఞానానికి భేదం ఉన్నదా లేక లేదా అనే విచారం సంభవిస్తుంది. అందులో పూర్వపక్షహేతువులు చెప్పబడుచున్నాయి. జ్యోతిరాదులలో పేరు భేదజ్ఞానానికి హేతువు అవడం (పూర్వమీమాంసలో) ప్రసిద్ధమే. ఇక్కడ కూడా ఆ యా వేదాంతాలలో విధించబడిన విజ్ఞానాలలో తైత్తిరీయకం, వాజసనేయకం, కౌథుమకం, శాట్యాయనకం ఇత్యాదికమైన వేరు వేరు పేరు ఉన్నది.

ఏ. జ్యోతిష్టోమయాగాన్ని గూర్చి చెప్పి అక్కడ "అథైష జ్యోతిరథైష సర్వజ్యోతిరేతేన సహస్రదక్షిణేన యజేత" అని ఒక వాక్యం పఠించబడింది. ప్రకృతమైన జ్యోతిష్టోమయాగాన్నే ఉద్దేశించి సహస్రదక్షిణ అనే గుణవిశేషం విధించబడుచున్నదా.

లేక మరొక యాగం విధించబడుచున్నదా అని సందేహం కలగగా ఇక్కడ జ్యోతిష్టోమం అనే పేరు కాక 'జ్యోతిస్' అనే మరొక పేరు చెప్పడంచేత ఇది వేరే మరొక యాగం అని నిర్ణయించబడింది. తైత్తిరీయకం, వాజసనేయకం ఇత్యాదులలో కూడా జ్యోతిష్టోమ - జ్యోతిర్యాగాల విషయంలోవలెనే నామభేదం ఉండడంచేత వేరు వేరు విద్య లని అంగీకరించాలి.

**తథేతి** : అట్లే "**వైశ్వదేవ్యామిక్షా వాజిభ్యో వాజినమ్**" ఇత్యాదులలో రూపభేదం కర్మభేదాన్ని ప్రతిపాదిస్తుంది అని ప్రసిద్ధం. ఇక్కడ కూడా రూపభేదం ఉంది. అదెట్లనగా - ఒక శాఖకు చెందినవారు పంచాగ్నివిద్యలో అరవదైన మరొక అగ్నిని పఠిస్తున్నారు. కొందరైతే ఐదే పఠిస్తున్నారు. అట్లే ప్రాణసంవాదాదులలో కొందరు వాగాదులలో కొన్నింటిని తగ్గించి పఠిస్తున్నారు. కొందరు కొన్నింటిని అధికంగా చేర్చి పఠిస్తున్నారు.

**వి.** "**తప్తే పయసి దధ్యానయతి, సా వైశ్వదేవ్యామిక్షా వాజిభ్యో వాజినమ్**" అనే వాక్యం ఉంది. కాచిన పాలలో పెరుగు కలపగా ఆ పాలు విరిగి నప్పుడు గట్టిగా ఉన్న పదార్థానికి అమిక్ష అని, పల్చగా నీళ్ల వలె ఉన్నదానికి వాజినం అనీ పేరు. "**యాగస్య ద్వే రూపే, ద్రవ్యం దేవతా చ**" అని చెప్పినట్లు ద్రవ్యమూ, దేవతా ఈ రెండూ యాగంయొక్క రూపం. ఇక్కడ విశ్వేదేవతలు దేవతగా గల అమిక్షాయాగం విధించబడింది. ఇంక వాజినం అనేది ఈ అమిక్షాయాగంలోనే గుణంగా విధించబడుతున్నదా, లేక ఇది వేరే యాగమా అని సందేహం కలగగా అమిక్షాయాగంయొక్క రూపం విశ్వేదేవతలు, ఆమిక్షా అనేవి, అందుచేత ఇదొక యాగం. వాజియాగం అనేది మరొక యాగం. ఎందువల్ల ననగా దీని రూపం వేరు. వాజులు దేవత, వాజినం అనేది ద్రవ్యం. ఈ విధంగా రూపభేదాన్ని పట్టి ఇవి రెండూ వేరువేరు యాగాలని నిర్ణయించినట్లు పంచాగ్నివిద్యాదులను కూడ వేరు వేరు స్వతంత్రవిద్య లని గ్రహించాలని భావం.

***తథేతి*** :- అట్లే ధర్మవిశేషం కూడా (విశిష్టంగా చెప్పిన ధర్మం కూడా) కారీర్యాదులయందు కర్మభేదాన్ని ప్రతిపాదిస్తుంది అని ఆశంక చేయబడింది. ఇక్కడ కూడా ధర్మ (అంగ)విశేషం ఉన్నది. ఎట్లనగా - అథర్వణికులకు శిరోవ్రతం అనే ఒక ధర్మం (అంగం) విశేషంగా చెప్పబడింది.

**వి.** కారీరేష్టి అనే ఒక ఇష్టి (యాగం) ఉంది దానికి సంబంధించిన వేదభాగాన్ని

పఠించేటప్పుడు తైత్తిరీయశాఖకు చెందినవాళ్లు నేలమీద భోజనం చేస్తారు. ఇతరులు చెయ్యరు. అగ్న్యధ్యయనం (చయనాన్ని గూర్చి చెప్పే వేదభాగంయొక్క అధ్యయనం) చేసే కొన్ని శాఖలవాళ్లు ఉపాధ్యాయునికి ఉదకుంభం తీసుకొనివచ్చి ఇస్తారు. కొందరు ఇవ్వరు. అశ్వమేధాధ్యయనం చేసేటప్పుడు కొందరు పచ్చగడ్డి తీసుకొని వస్తారు. కొందరు తీసుకొనిరారు. ఈ ధర్మ భేదాలను పట్టి కారీర్యాదులలో కూడ భేదం ఉన్న దని ఆశంక ముండకాధ్యయనం చేసేటప్పుడు నెత్తిమీద అంగారపాత్ర (మండుతున్న బొగ్గులు పోసిన పాత్ర) కొందరు ధరిస్తారు. కొందరు ధరించరు. అందుచేత ఇది విద్యాభేదానికి కారణమని ఆశంకకుని అభిప్రాయం.

**ఏవమితి** :- ఇట్లే ఆ యా వేదాంతాలలో పునరుక్తి మొదలైన భేదహేతువు లున్నట్లుగా యథాసంభవంగా అన్వయించుకోవాలి. అందువల్ల ప్రతీ వేదాంతంలోను విద్యాభేదం ఉంది (అని పూర్వపక్షం).

౨. పునరుక్తి అనగా రెండుమూడు సార్లు చెప్పడం. **"సమిధో యజతి" "తనూనపాతం యజతి" "ఇడాం యజతి" "బర్హిర్యజతి" "స్వాహాకారం యజతి"** అను ఐదు వాక్యాలలో విధించబడేది ఒకే కర్మయా లేక ఐదు వేరు వేరు కర్మలా అని సందేహం కలగగా "యజతి" అనేదానిని ఐదుసార్లు ఆవృత్తి చేయడంచేత ఇవి ఐదు వేరు వేరు కర్మలని సిద్ధాంతం చేయబడింది. అట్లే పంచాగ్నివిద్యాదులను వేరు వేరు శాఖలలో ఆవృత్తి చేయడంచేత అవి వేరు వేరు విద్యలు కావాలి అని భావం.

పూర్వపాదంలో తత్త్వంపదార్థాల నిరూపణం చేయబడింది. ఈ పాదంలో వాక్యార్థం నిర్ణయించబడుచున్నది. వాక్యార్థనిర్ణయానికి పదార్థనిర్ణయం హేతువు గాన ఈ రెండు పాదాలకు హేతుహేతుమద్భావసంగతి. సగుణవిద్య చిత్తశుద్ధి ద్వారా వాక్యార్థజ్ఞానానికి ఉపయోగిస్తుంది గాన సగుణ విద్యకు సంబంధించిన విచారణ కూడ చేయబడుచున్నది.

### భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః - సర్వవేదాన్తప్రత్యయాని విజ్ఞానాని తస్మింస్తస్మిన్వేదాన్తే తాని తాన్యేవ భవితుమర్హన్తి. కుతః? - చోదనాద్యవిశేషాత్. ఆదిశబ్దేన శాఖాన్తరాధికరణసిద్ధాన్తసూత్రోదితా అభేదహేతవ ఇహాకృష్యన్తే.

సంయోగరూపచోదనాఖ్యావిశేషాదిత్యర్థః. యథైకస్మిన్నగ్నిహోత్రే శాఖాభేదేఽపి పురుషప్రయత్నస్తాదృశ ఏవ చోద్యతే జుహుయాదితి, ఏవం "యో హ వై జ్యేష్ఠం చ శ్రేష్ఠం చ వేద" (బృ.ఉ. 6.1.1., ఛా.ఉ. 5.1.1.) ఇతి వాజసనేయినాం ఛాన్దోగ్యానాం చ తాదృశ్యేవ చోదనా. ప్రయోజనసంయోగోఽప్యవిశిష్ట ఏవ - "జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ స్వానాం భవతి" (బృ.ఉ. 6.1.1.) ఇతి. రూపమప్యుభయత్ర తదేవ విజ్ఞానస్య యదుత జ్యేష్ఠశ్రేష్ఠాదిగుణవిశేషాన్వితం ప్రాణతత్త్వమ్. యథా చ ద్రవ్యదేవతే యాగస్య స్వరూపం విజ్ఞేయం రూపం విజ్ఞానస్య. తేన హి తద్రూప్యతే. సమాఖ్యాపి సైవ ప్రాణవిద్యేతి. తస్మాత్సర్వవేదాన్తప్రత్యయత్వం విజ్ఞానానామ్. ఏవం పఞ్చాగ్నివిద్యా వైశ్వానరవిద్యా శాణ్డిల్యవిద్యా ఇత్యేవమాదిషు యోజయితవ్యమ్. యే తు నామరూపాదయో భేదహేత్వాభాసాః తే ప్రథమ ఏవ కాణ్డే "నామ్నా స్యాదచోదనాభిధానత్వాత్" ఇత్యారభ్య పరిహృతాః

బాలానందిని

**ఏవమితి** :- ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాము. సర్వ వేదాంతాలచేత (ద్వారా) తెలియబడుచున్న విజ్ఞానాలు ఆ యా వేదాంతాలలో ఆ యా విజ్ఞానాలుగానే అవడానికి తగి ఉన్నవి. (అనగా వేరు వేరు వేదాంతాలలో కనబడినా కూడ చాలా వరకు పోలిక లున్న ఒక విజ్ఞానాన్ని ఒకే విజ్ఞానంగా పరిగణించాలి గాని వేరు వేరు విజ్ఞానాలుగా పరిగణించకూడదు అని అర్థం). ఎందువల్ల? చోదనాద్యవిశేషంవల్ల ('చోదనాది'లోని) ఆదిశబ్దంచేత పూర్వమీమాంసలోని "**శాఖాంతరాధికరణం**"లోని సిద్ధాంతసూత్రంలో చెప్పబడిన అభేదహేతువులు ఇక్కడ ఆకర్షింపబడతాయి. సంయోగ - రూప - చోదనా - ఆఖ్యల అవిశేషంవల్ల, (అవి ఒకే విధంగా ఉండడంవల్ల) అని అర్థం.

ఏ. ఆ యా వేదశాఖలలో ఉన్న కర్మలకు ఇది ఆ కర్మయే అనే ప్రత్యభిజ్ఞను పట్టి ఏకత్వం చెప్పబడింది. అట్లే ఆ యా వేదశాఖలలో ఉన్న విజ్ఞానాలకు (ఉపాసనలకు) కూడ ఈ విజ్ఞానం అదే అని ప్రత్యభిజ్ఞానంచేత ఏకత్వం సిద్ధిస్తుంది. అలాంటి ప్రత్యభిజ్ఞానానికి చోదనాదులు ఒకే విధంగా ఉండడం కారణం. చోదనా అనగా ప్రతిపాదక

శబ్దం, లేదా ప్రయత్నాన్ని బోధించే శబ్దం. అర్థసంయోగం అనగా ప్రయోజనంతో సంబంధం. రూపం అనగా అగ్నిహోత్రాదికర్మలలో నైతే ద్రవ్యదేవతాదికం, ఉపాసనలలో రూపం, అనగా ఉపాస్యం (ఉపాసించదగినది). ఆఖ్యా అనగా పేరు. ఇవి ఒకే విధంగా ఉన్నప్పుడు ఈ కర్మ ఆ కర్మా, ఈ ఉపాసనా ఆ ఉపాసనా ఒకటే అని గ్రహించాలి.

యథేతి : శాఖాభేదం ఉన్నా కూడ అగ్నిహోత్రం అనే ఒక కర్మలో ఏ విధంగా **'జుహుయాత్'** (హోమం చెయ్యాలి) అని ఒకే విధమైన పురుషప్రయత్నం విధించబడుచున్నదో అట్లే "యో హ వై జ్యేష్ఠం చ శ్రేష్ఠం చ వేద" (ఎవడు ప్రాణాన్ని జ్యేష్ఠమనీ, శ్రేష్ఠమనీ తెలుసుకుంటాడో) అని వాజసనేయులకు ఛందోగులకు కూడా ఒకే విధమైన చోదన ('వేద' అని) ఉన్నది. **"జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ స్వానాం భవతి"** (ఇలా ఉపాసన చేసినవాడు తనవాళ్లలో జ్యేష్ఠుడూ శ్రేష్ఠుడూ అవుతాడు) అని ప్రయోజనం యొక్క సంబంధం కూడా అవిశిష్టమే (తేడా లేకుండా ఉన్నది). రెండు చోట్లా రూపం కూడ ఒక్కటే. ఎందువల్లననగా రెండు చోట్లా తెలియదగినది జ్యేష్ఠ శ్రేష్ఠాదిగుణవిశేషాలతో కూడిన ప్రాణతత్త్వమే. ద్రవ్యమూ దేవతా ఏ విధంగా యాగానికి రూపమో అట్లే విజ్ఞానానికి రూపం విజ్ఞేయం (తెలియదగినది). దానిచేతనే (ఆ విజ్ఞేయుంచేతనే) అది (విజ్ఞానం) నిరూపించబడుతుంది కదా. సమాఖ్య కూడా ప్రాణవిద్య అనేదే రెండింటిలోను ఉన్నది. అందుచేత విజ్ఞానాలు సర్వవేదాంతప్రత్యయాలు. పంచాగ్నివిద్య, వైశ్వానరవిద్య, శాండిల్యవిద్య, ఇత్యాదులలో కూడ ఈ విధంగానే (చోదనాద్యవిశేషం) చూచుకోవాలి. ఇక విజ్ఞానాలకు భేదం ఉన్నట్లు కనబడడానికి హేతువుల వలె పైకి కనబడే ఏ నామరూపాదులున్నాయో అవి ప్రథమకాండలో (పూర్వమీమాంసలో) **"న నామ్నా స్యాత్ చోదనాభిధానత్వాత్"** అని ప్రారంభించి పరిహరించబడ్డాయి. (అందుచేత ఆ హేత్వాభాసలను పట్టి విద్యాభేద మని గ్రహించకూడదు అని అర్థం) 1.

## భాష్యమ్

ఇహాపి కం చిద్విశేషమాశఙ్క్య పరిహరతి

**సూ. భేదాన్నేతి చేన్నైకస్యామపి. 3.3.2**

స్యాదేతత్-సర్వవేదాన్తప్రత్యయత్వం విజ్ఞానానాం గుణభేదాన్నోపపద్యతే

తథా హి - వాజసనేయినః పఞ్చాగ్నివిద్యాం ప్రస్తుత్య షష్ఠమపరమగ్నిమామనన్తి - "తస్యాగ్నిరేవాగ్నిర్భవతి" (బృ.ఉ. 6.2.14.) ఇత్యాదినా. ఛన్దోగాస్తు తం నామనన్తి. పఞ్చసంఖ్యయైవ చోపసంహరన్తి "అథ హ య ఏతానేవ పఞ్చాగ్నీన్ వేద" (ఛా.ఉ. 5.10.10.) ఇతి. యేషాం చ స గుణోఽస్తి యేషాం చ నాస్తి కథముభయేషామేకా విద్యోపపద్యేత? నా చాత్ర గుణోపసంహారః శక్యతే ప్రత్యేతుమ్ పఞ్చసంఖ్యావిరోధాత్. తథా ప్రాణసంవాదే శ్రేష్ఠాదన్యాంశ్చతురః ప్రాణాన్ వాక్చక్షుఃశ్రోత్రమనాంసి ఛన్దోగా ఆమనన్తి. వాజసనేయినస్తు పఞ్చమమప్యామనన్తి. "రేతో వై ప్రజాపతిః ప్రజాయతే హ ప్రజయా పశుభిర్య ఏవం వేద" (బృ.ఉ. 6.1.6) ఇతి. ఆవాపోద్వాపభేదాచ్చ విద్యాభేదో భవతి. వేద్యభేదాచ్చ విద్యాభేదో ద్రవ్యదేవతాభేదాదివ యాగస్య ఇతి చేత్.

**బాలానందిని**

**ఇహేతి** : ఇక్కడ కూడా ఒక విశేషాన్ని ఆశంకించి పరిహరిస్తున్నాడు. **భేదాదితి**- "**భేదాత్** = గుణభేదం ఉండడంవల్ల, **నేతి చేత్** = విజ్ఞానాలకి అభేదం లేదు అన్నట్ల = యితే, **న** = అది కాదు, **ఏకస్యామపి** = ఒకే విద్యలో కూడ గుణభేదం కుదురుతుంది" అని సూత్రార్థం.

**స్యాదితి** : ఇది ఇలా ఉండనీ. (ఈ క్రింది ఆశంక కలగవచ్చును.) విజ్ఞానాలలో గుణభేదం కనబడుతున్నది గాన వాటికి సర్వవేదాంతప్రత్యయత్వం కుదరదు. అ దెట్లనగా - పంచాగ్నివిద్యను ప్రస్తావించి వాజసనేయులు మరొక అరవ అగ్నిని కూడా "తస్యాగ్నిరేవాగ్నిర్భవతి" ఇత్యాదికంచేత పఠిస్తున్నారు. ఛందోగులు మాత్రం దానిని పఠించకుండా "అథ హ య ఏతానేవ పఞ్చాగ్నీన్వేద" అని పంచసంఖ్యచేతనే ఉపసంహరిస్తున్నారు. ఆ గుణం (షష్ఠాగ్నిరూపమైన గుణం) ఎవరికి ఉన్నదో వాళ్లకూ ఎవరికి లేదో వాళ్లకూ ఒకే విద్య అని ఎలా కుదురుతుంది? గుణోపసంహారాన్ని గ్రహించడానికి కూడ వీలు లేదు. ఎందుచేతననగా - ఐదు అనే సంఖ్యకు విరోధం వస్తుంది.

ని. గుణోపసంహారం అనగా ఒకే విద్యను (ఈ ఘట్టంలో 'విద్య' 'విజ్ఞానం' 'ఉపాసన' సమానార్థకాలు) రెండు మూడు చోట్ల (శాఖలలో) చెప్పినప్పుడు, ఏదైనా ఒక శాఖలో అధికంగా చెప్పిన గుణాలను ఇతరశాఖలలోని విద్యలోనికి తెచ్చి అన్వయించుకొనడం. ఇక్కడ ఛాందోగులు (ఐదు) సంఖ్యతో ముగించిన తరువాత ఆరవదానిని చేర్చి గుణోపసంహారం చేయడం కుదరదని భావం.

**తథేతి** :- అట్లే ప్రాణసంవాదంలో ఛందోగులు శ్రేష్ఠప్రాణంకంటె భిన్నమైన వాక్కు, చక్షుస్సు, శ్రోత్రం, మనస్సు అనే నాలుగు ప్రాణాలను పఠిస్తున్నారు. వాజసనేయులైతే "రేతో......వేద" (రేతస్సే ప్రజాపతి, ఈ విధంగా తెలుసుకున్నవాడు సంతానంతోను, పశువులతోను కూడి ఉంటాడు) అని అయిదవదైన రేతస్సును కూడా పఠిస్తున్నారు. ఆవాపఉద్వాపభేదాన్నిపట్టి వేద్యం భిన్నం అవుతుంది. (ఆవాపం అనగా క్రొత్తదానిని చేర్చడం, ఉద్వాపం అనగా ఉన్నదానిని తీసివేయడం). ద్రవ్యదేవతల భేదాన్ని పట్టి యాగభేదం కలిగినట్లు వేద్యభేదంవల్ల విద్యాభేదం ఏర్పడుతుంది.

## భాష్యమ్

నైష దోషః. యత ఏకస్యామపి విద్యాయామేవంవిధో గుణభేద ఉపపద్యతే. యద్యపి షష్ఠస్యాగ్నేరుపసంహారో న సంభవతి తథాపి ద్యుప్రభృతీనాం పఞ్చానామగ్నీనాముభయత్ర ప్రత్యభిజ్ఞాయమానత్వాన్న విద్యాభేదో భవితుమర్హతి. న హి షోడశిగ్రహణాగ్రహణయోరతిరాత్రో భిద్యతే. పఠ్యతే పి చ షష్ఠోఽగ్నిశ్ఛన్దోగైః "తంప్రేతం దిష్టమితోఽగ్నయ ఏవం హరన్తి" (ఛా'ఉ. 5.9.2) ఇతి. వాజసనేయినస్తు సాంపాదికేషు పఞ్చస్వగ్నిష్వనువృత్తాయాః సమిద్ధూమాదికల్పనాయాః నివృత్తయే "తస్యాగ్నిరేవాగ్నిర్భవతి సమిత్సమిత్" (బృ.ఉ. 6.2.14) ఇత్యాది సమామనన్తి. స నిత్యానువాదః. అథాప్యుపాసనార్థ ఏష వాదస్తథాపి న గుణః శక్యతే ఛన్దోగైరప్యుపసంహర్తుమ్. న చాత్రపఞ్చసంఖ్యావిరోధ ఆశఙ్క్యః, సాంపాదికాగ్న్యభిప్రాయైషా హ్యేషా పఞ్చసంఖ్యా నిత్యానువాదభూతా న విధిసమవాయినీత్యదోషః. ఏవంప్రాణ

సంవాదాదిష్వప్యధికస్య గుణస్య ఇతరత్రోపసంహారో న విరుధ్యతే. న చావాపోద్వాపభేదాద్వేద్యభేదో విద్యాభేదశ్చాశఙ్క్యః. కస్యచిద్వేద్యాంశస్యావాపోద్వాపయోరపి భూయసో వేద్యరాశేరభేదావగ మాత్. తస్మాదైకవిద్యమేవ.2

**బాలానందిని**

**నైష ఇతి** :- ఈ దోషం లేదు. ఎందువల్ల ననగా ఒకే విద్యలో కూడ ఈ విధమైన గుణభేదం ఉపపన్నమే. ఆరవదైన అగ్నిని ఉపసంహరించడం కుదరకపోయినా ద్యులోకం మొదలైన ఐదు అగ్నులు కూడా రెండింటిలోను గుర్తింపబడుతున్నాయి గాన విద్యాభేదం అవడానికి వీలు లేదు. షోడశిగ్రహణాగ్రణాలచేత అతిరాత్రం భిన్నం కాదు కదా?

వి. **"అతిరాత్రే శోడశినం గృహ్ణాతి, నాతిరాత్రే షోడశినం గృహ్ణాతి"** అని రెండు వాక్యా లుండడంచేత అతిరాత్రంలో షోడశిగ్రహణం వైకల్పికం అని నిర్ణయించబడింది. కొందరు గ్రహించవచ్చును, మరికొందరు గ్రహించకపోవచ్చు. తావన్మాత్రంచేత అతిరాత్రం ఏ విధంగా వేరు కాదో అట్లే ఆరవది ఉన్నా లేకపోయినా మిగిలిన వన్నీ సమంగా ఉండడంవల్ల విద్యాభేదం కలగదు. అయితే ఇది వ్యవస్థితవికల్పం అని గ్రహించి ఛందోగులకు పంచాగ్న్యుపాసన, వాజసనేయులుకు షడగ్న్యుపాసన అని చెప్పవచ్చు. (ఇది ఒక సమాధానం).

**పఠ్యతే ఇతి** :- ఛందోగులు **"తం ప్రేతం... హరన్తి"** (ఈ లోకం నుండి పరలోకానికి వెళ్ళినవానిని జ్ఞాతులు అగ్నికి సమర్పిస్తారు) అని ఆరవ అగ్నిని కూడా పఠిస్తూనే ఉన్నారు. వాజసనేయులైతే సాంపాదికములైన (అనగా అగ్నిత్వం ఆరోపించిన) అయిదు అగ్నులలో అనువర్తిస్తూ వచ్చిన సమిద్ధూమాదికల్పనను నివృత్తి చేయడానికి **"తస్యాగ్నిరేవ ... సమిత్"** (ఈ అగ్నికి అగ్నియే అగ్ని, సమిధయే సమిధ) అని చెప్పుచున్నారు. ఇది నిత్యానువాదం.

వి. ద్యులోకాదులయందు అగ్నిత్వం ఆరోపించబడింది. ద్యులోకాదులు అగ్ని అన్న తరువాత సమిధలు ధూమమూ కావాలి గాన ఆ యా వస్తువులమీద సమిత్త్వం మొదలైనది ఆరోపించబడింది. అయితే మృతశరీరం ఏ అగ్నిలో ఉంచబడినదో అది వాస్తవమైన అగ్నియే గాన ఆ అగ్నియందు అగ్నిత్వారోపం గాని, ధూమసమిధాదులయందు ధూమసమిత్త్వారోపం గాని చేయవలసిన పని లేదని సూచించడానికై "తస్యాగ్నిరేవ ..."

ఇత్యాదివాక్యం వాజసనేయులచేత పఠించబడింది. అనగా అగ్నిలో సహజంగా ఉన్న విషయాలనే ఇక్కడ పేర్కొనడం జరిగింది. అందుచేత "తం ప్రేతం ... హరన్తి" అని ఛందోగులు కూడా ఆరవ అగ్నిని పఠిస్తున్నారు గాన ఛాందోగ్య - వాజసనేయులకు ఇద్దరికీ కూడ ఆరు అగ్నుల ఉపాసన ఉన్నదని చెప్పవచ్చును. లేదా, మరణించినవాని శరీరాన్ని ఉంచిన అగ్నిని (అది అనువాదమే గాన, ఉన్నదానిని చెప్పడమే గాన) ఉపాసన చేయని పక్షాన రెండు చోట్లా పంచాగ్న్యుపాసన మాత్రమే చెప్పబడిందని గ్రహించవచ్చును అని పై వాక్యాలకు అర్థం.

అవ. ఇప్పుడు షడగ్న్యుపాసనమే గ్రహించవచ్చును అనేదానికి ఉపపత్తి చూపుతున్నారు- **అథేతి** :- ఇది (ఆరు అగ్నుల నిర్దేశం) (పైన సూచించినట్లు) ఉపాసన కొరకే అని చెప్పినప్పుడు కూడ ఆ గుణాన్ని ఛందోగులు కూడ ఉపసంహరించుకొనవచ్చును. అయితే పంచసంఖ్యకు విరోధం రాదా అని ఆశంకకు అవకాశం లేదు. ఈ పంచ సంఖ్య (ఛందోగులు చెప్పిన పంచసంఖ్య) సాంపాదికములైన అగ్నులను దృష్టిలో పెట్టుకొని చెప్పినది గాని, ఆ విధంగా అనువాదంమాత్రమే కాని, విధిలో (ఉపాసనావిధిలో) సమన్వయించదు. (ఐదింటిని మాత్రమే ఉపాసించాలి అనే అర్థాన్ని తెలుపదు. అందుచేత రెండు చోట్లా కూడ ఆరు అగ్నులూ ఉపాస్యాలే అని అర్థం). ఇట్లే ప్రాణసంవాదాదులలో కూడ ఒకచోట అధికంగా ఉన్న గుణాన్ని మరొక చోట ఉపసంహరించడంలో విరోధం లేదు.

వి. "యో హ వై జ్యేష్ఠం చ శ్రేష్ఠం చ" ఇత్యాదివాక్యాలలో చెప్పబడిన ప్రాణవిద్య ఛాందోగ్యవాజసనేయకాలు రెండింటిలోనూ ఒకటే అని ప్రత్యభిజ్ఞ ద్వారా తెలిసిన తరవాత వాజసనేయకంలో చెప్పిన రేతోరూపమైన ప్రాణాన్ని ఛాందోగ్యంలో ఉపసంహరించుకొనవచ్చునని అభిప్రాయం.

న చేతి- అవాపోద్వాపాలు చేసినంత మాత్రంచేత వేద్యభేదం గాని విద్యాభేదం గాని శంకించవలసిన పని లేదు. ఏదో ఒక వేద్యాంశానికి ఆవాపోద్వాపాలు చేసినా కూడ అత్యధికమైన వేద్యరాశి (వేద్యములైన వాటి సముదాయం) విషయంలో అభేదం కనబడుచున్నది కదా? అందువల్ల వీటిని ఏకవిద్య లనే అంగీకరించాలి. 2

## సూ. స్వాధ్యాయస్య తథాత్వేన హి సమాచారేఽధికారాచ్చ సవవచ్చ తన్నియమః. 3.3.3

యదప్యుక్తమ్-అథర్వణికానాం విద్యాం ప్రతి శిరోవ్రతాద్యపేక్షణా దన్యేషాం చ తదనపేక్షణాత్ విద్యాభేద ఇతి, తత్రప్రత్యుచ్యతే. స్వాధ్యాయస్యైష ధర్మో న విద్యాయాః. కథమిదమవగమ్యతే? యతస్తథాత్వేన స్వాధ్యాయ ధర్మత్వేన సమాచారే వేదవ్రతోపదేశపరే గ్రన్థే ఆథర్వణికా ఇదమపి వేదవ్రతత్వేన వ్యాఖ్యాతమితి సమామనన్తి. "నైతదచీర్ణవ్రతోఽధీత" చాధికృతవిషయాదేత చ్ఛబ్దాదధ్యయనశబ్దాచ్చ స్వోపనిషదధ్యయనధర్మ ఏవైష ఇతి నిర్ధార్యతే. నను చ - "తేషామేవైతాం" బ్రహ్మవిద్యాం వదేచ్ఛిరోవ్రతం విధివ ద్యైస్తు చీర్ణమ్" (ము. ఉ. 3.2.10) ఇతి బ్రహ్మవిద్యాసంయోగశ్రవణాదేకైవ సర్వత్ర బ్రహ్మవిద్యేతి సంకీర్త్యతైష ధర్మః? న. తత్రాప్యేతామితి ప్రకృతపరామర్శాత్. ప్రకృతత్వం చ బ్రహ్మవిద్యాయాః గ్రన్థవిశేషాపేక్షమితి గ్రన్థవిశేసంయోగ్యేవైష ధర్మః. సవవచ్చ తన్నియమః ఇతి నిదర్శననిర్దేశః. యథా చ సవాః సప్త సౌర్యాదయః శతౌదన పర్యన్తాః వేదాన్తరోరితత్రేతాగ్న్యనభి సంబన్ధాదాథర్వణోదితైకాగ్న్యభి సంబన్ధాచ్చ ఆథర్వణికానామేవ నియమ్యన్తే తథైవాయమపి ధర్మః స్వాధ్యాయవిశేషసంబ న్ధాత్తత్రైవ నియమ్యతే. తస్మాదప్యనవద్యం విద్యైకత్వమ్. 6

### బాలానందిని

**స్వాధ్యాయేతి** :- "స్వాధ్యాయస్య = స్వాధ్యాయముయొక్క, తథాత్వేన = ధర్మంగా, సమాచారే హి = సమాచారం అనే గ్రంథంలో చెప్పబడింది కదా? అధికారాచ్చః= ప్రస్తావనవల్ల కూడ అట్లే. తన్నియమః = దానినియమం, సవవచ్చ= సవం విషయంలో వలె చేయబడును" అని సూత్రార్థం.

**యదపీతి** :- ఆథర్వణికుల విద్యా విషయంలో శిరోవ్రతాదులు అపేక్షింపబడడం చేత ఇతరుల విద్య విషయంలో వాటిని అపేక్షించకపోవడంచేత విద్యాభేదం అంగీకరించాలి అని ఏది చెప్పబడిందో దానికి సమాధానం చెప్పబడుచున్నది. ఇది

స్వాధ్యాయంయొక్క ధర్మం కాని విద్యాధర్మం కాదు. ఇట్లు (ఎలా) తెలుస్తున్నది? ఎందువల్ల ననగా, తథాత్వేన=స్వాధ్యాయధర్మంగా, సమాచారే=వేదవ్రతాలను ఉపదేశించే ఒక గ్రంథంలో, ఆథర్వణికులు, ఇది కూడా వేదవ్రతంగా వ్యాఖ్యానింపబడినది అని చెప్పుచున్నారు. "నైతదచీర్ణవ్రతోఽధీతే" (వ్రతం ఆచరించనివాడు దీని అధ్యయనం చేయకూడదు) అను వాక్యంలోని అధికృతవిషయమైన ప్రస్తుతవిషయాన్ని పరామర్శించే ఏతచ్ఛబ్దంవల్ల, అధ్యయనశబ్దంవల్ల కూడా ఇది తమ ఉపనిషత్తును అధ్యయనం చేసేటప్పుడు చేయదగిన ధర్మమే అని నిర్ధారణ చేయబడుచున్నది. (ఆశంక) "తేషామ్ . . . చీర్ణమ్" (ఈ బ్రహ్మవిద్యను శిరోవ్రతాన్ని యథావిధిగా ఆచరించినవాళ్ళకే చెప్పాలి) అని ఈ శిరోవ్రతానికి బ్రహ్మవిద్యాసంయోగం వినబడుచున్నది గాన, బ్రహ్మవిద్య అంతటా ఒకటే అవడంచేత ఈ ధర్మం (శిరోవ్రతం) అన్నింటిలోను చేర్చవలసి ఉంటుంది కదా? (సమాధానం) అట్లు కాదు. అక్కడ కూడ 'ఏతామ్' అని (ప్రకృతమైనది) పరామర్శించబడింది. ఇక్కడ ప్రకృతమైన బ్రహ్మవిద్య గ్రంథవిశేషాపేక్షమే గాన, అనగా బ్రహ్మవిద్యను బోధించే గ్రంథమే ప్రకృతం గాన, ఈ ధర్మం గ్రంధ విశేషంతో మాత్రమే సంబంధిస్తుంది. దీని నియమం సవానికి సంబంధించిన నియమం వంటిది అని నిదర్శనం చూపబడుచున్నది. సౌర్యం మొదలు శతౌదనం వరకు ఉన్న ఏడు సవాలు (హోమాలు) ఇతరవేదాలలో చెప్పబడిన త్రేతాగ్నితో సంబంధించకపోవడంచేతను, అథర్వణంలో చెప్పబడిన (ఏకర్షి అని ప్రసిద్ధమైన) ఏకాగ్నితో సంబంధించడంచేతను ఇది ఆథర్వణికులకు మాత్రమే అని ఏ విధంగా నియమించబడుచున్నాయో అట్లే ఈ ధర్మంకూడ స్వాధ్యాయవిశేషంతో సంబంధం ఉండడంవల్ల స్వాధ్యాయం విషయంలోనే నియమించబడుచున్నది. (అందుచేత ఇది విద్యకు సంబంధించిన ధర్మం కాదు: విద్యాభేదహేతువు కాదు అని అర్థం). అందువల్ల విద్యైకత్వం నిర్దుష్టమైనది.

## సూ. దర్శయతి చ. 3.3.4

దర్శయతిచ వేదోఽపి విద్యైకత్వం సర్వవేదాన్తేషు విద్యైకత్వోపదేశాత్ - "సర్వే వేదా యత్పదమామనన్తి" (క.ఉ.2-15) ఇతి. తథా "ఏతమేవ బ్రాహ్మణా మహత్యుక్థే మీమాంసన్తే, ఏతమగ్నావధ్వర్యవః, ఏతం మహావ్రతే ఛన్దోగాః" (ఐ.ఆ.3.2.3-12) ఇతి చ. తథా "మహద్భయం వజ్రముద్యతమ్" (క.ఉ.3.2)

ఇతి కాఠకే ఉక్తస్య ఈశ్వరగుణస్య భయహేతుత్వస్య తైత్తిరీయకే భేదదర్శననిన్దాయై పరామర్శో దృశ్యతే - "యదా హ్యేవైష ఏతస్మిన్నుదరమన్తరం కురుతే, అథ తస్య భయం భవతి. తత్త్వేవ భయం విదుషోఽ మన్వానస్య" (తై.ఉ.2.7.1) ఇతి తథా వాజసనేయకే ప్రాదేశమాత్రసంపాదితస్య వైశ్వానరస్య ఛాన్దోగ్యే సిద్ధవదుపాదానమ్ "యస్త్వేతమేవమభివిమానమాత్మానం ప్రాదేశమాత్రం వైశ్వానరముపాస్తే" (ఛా.ఉ.5.18.1) ఇతి. తథా సర్వవేదాన్త ప్రత్యయత్వేనాన్యత్ర విహితానాముక్థాదీనామన్యత్రోపాసనవిధానాయోపాదానాత్ప్రాయదర్శనన్యాయేనోపాసనానామపి సర్వవేదాన్తప్రత్యయత్వసిద్ధిః. 4

**బాలానందిని**

**దర్శయతీతి** :- "దర్శయతి చ = వేదం కూడ సర్వవేదాంతాలలో విద్యైకత్వాన్ని చూపుతున్నది" అని సూత్రార్థం.

**దర్శయతీతి** :- "సర్వే వేదా యత్పదమామనన్తి" (సమస్తవేదాలూ ఏ స్థానాన్ని, నిర్గుణబ్రహ్మను, బోధిస్తున్నాయో) ఇత్యాదివాక్యాలచేత, "ఏతమేవ . . . ఛన్దోగాః" (దీనినే ఈ సగుణబ్రహ్మనే) బ్రాహ్మణులు గొప్పదైన ఉక్థంలో చర్చిస్తున్నారు. అధ్వర్యువులు దీనినే అగ్నియందు చర్చిస్తున్నారు. ఛందోగులు మహావ్రతంలో చర్చిస్తున్నారు. అని సర్వ వేదాలలోను వేద్యమైనది. (నిర్గుణమైనా సగుణమైనా) ఒక్కటే అని వేదం కూడ విద్యైకత్వాన్ని స్పష్టంగా ప్రతిపాదిస్తున్నది.

అవ. కొన్ని శ్రుతులు శాఖాంతరీయశ్రుతులలో చెప్పిన విషయాలను సిద్ధవత్తుగా గ్రహించి వాటికి సంబంధించిన విషయాలను ప్రతిపాదిస్తూంటాయి. దీనిని బట్టి కూడ ఒక శాఖలోని విషయం మరొక శాఖలోనికి అన్వయించుకోవాలని సూచితమవుతున్నదని చెపుతున్నారు - **తథేతి** :- అట్లే "మహద్భయం వజ్రముద్యతమ్" (పరమేశ్వరుడు తలమీదికి ఎత్తబడిన భయంకరమైన వజ్రం) అని కాఠకంలో చెప్పబడిన ఈశ్వరగుణమైన భయహేతుత్వాన్ని "యదా. . . భవతి" (ఈ నరుడు ఎప్పుడైతే ఈ అద్వితీయబ్రహ్మయందు ఈషన్మాత్రం భేదం కూడ చూస్తాడో అప్పుడు వానికి భయం కలుగుతుంది) అని "తత్త్వేవ . . అమన్వానస్య" (నేనే బ్రహ్మను అని భావించనివానికి ఆ బ్రహ్మయే భయంకరం

అవుతుంది) అనీ తైత్తిరయకంలో భేదాన్ని నిందించడాన్ని పరామర్శించడం జరిగింది. అట్లే వాజసనేయకంలో ప్రాదేశికమాత్రంగా సంపాదించబడిన (చెప్పబడిన) వైశ్వానరుణ్ణి "యస్త్వేతమేవ . . ఉపాస్తే" అని సిద్ధవత్తుగా అంగీకరించి పరామర్శించడం కనబడుతున్నది. (దీనిని పట్టి ఒక శ్రుతిలో ఉన్నది మరొక చోట కూడ గ్రహించబడుతుం దని (ఉపసంహారం చేయబడుతుం దని) సూచింపబడుచున్నదని భావం) అట్లే! సర్వవేదాంత ప్రత్యయములుగా ఒక శాఖలో విధించబడిన ఉక్థాదులను మరొకచోట ఉపాసనాదుల నిమిత్తం గ్రహించడంవల్ల ఉపాసనలకు కూడ సర్వవేదాంతప్రత్యయత్వం సిద్ధిస్తుంది.

వి. శాఖాభేదం ఉన్నా కూడ ఉక్థాదులకు ఏ విధంగా భేదం లేదో అట్లే ఉక్థాదుల సంనిధిలో చెప్పబడిన ఉపాసనలకు కూడా శాఖాభేదంచేత భేదం లేదు అని భావం.

సర్వవేదాన్తప్రత్యయాధికరణం సమాప్తం

## 2. ఉపసంహారాధికరణమ్. సూ. 5

## సూ. ఉపసంహారోఽర్థభేదాద్విధిశేషవత్సమానే చ. 3.3.5

ఇదం ప్రయోజనసూత్రమ్. స్థితం చైవం సర్వవేదాన్తప్రత్యయత్వే సర్వ విజ్ఞానానామన్యత్రోదితానాం విజ్ఞానగుణానామన్యత్రాపి సమానే విజ్ఞానే ఉపసంహారో భవతీతి, అర్థాభేదాత్. య ఏవ హి తేషాం గుణానామేకత్రార్థో విశిష్టవిజ్ఞానోపకారకః స ఏ వాన్యత్రాపి. ఉభయత్రాపి హి తదేవైకం విజ్ఞానమ్; తస్మాదుపసంహారః. విధిశేషవత్. యథాహి విధిశేషాణామగ్నిహోత్రాదిధర్మాణాం తదేవైకమగ్నిహోత్రాది కర్మ సర్వత్రేత్యర్థా భేదాదుపసంహార ఏవమిహాపి. యది హి విజ్ఞానభేదో భవేత్తతో విజ్ఞానాన్తర నిబద్ధత్వాద్గుణానాం, ప్రకృతివికృతిభావాభావాచ్చ న స్యాదుసంహారః విజ్ఞానైకత్వే తు నైవమితి. అస్యైవ తు ప్రయోజనసూత్రస్య ప్రపఞ్చః సర్వాభేదాదిత్యారభ్య భవిష్యతి.

బాలానందిని

ఉపసంహార ఇతి : - "అర్థాభేదాత్ = అర్థంలో (ప్రయోజనంలో) భేదం

లేకపోవడంవల్ల, విధిశేషవత్ = విధిశేషములైన ధర్మాలలకు వలె, సమానే = సమానమైనదానియందు, ఉపసంహారః = గుణాల ఉపసంహారం చేయదగినది" అని సూత్రార్థం.

వి. శాఖాభేదం ఉన్నప్పుడు సమానమైన విద్యలో చెప్పబడిన గుణాలు ఆ శ్రుతికి మాత్రమే సంబంధించి ఉంటాయా లేక ఒక చోట లేనివాటిని ఇతరశాఖనుండి ఉపసంహరించాలా అని సందేహం. విద్యకు అక్కడ చెప్పిన గుణాలతో ఉపకారం సిద్ధిస్తున్నప్పుడు ఇతర శాఖలనుండి ఉపసంహారం అనావశ్యకం అని పూర్వపక్షం అలాంటప్పుడు వెనుక చేసిన విద్యైకత్వవిమర్శ అనావశ్యకం అని పూర్వపక్షఫలం ఉపసంహారం చెయ్యా లని సిద్ధాంతం.

**ఇదమితి** :- ఇది ప్రయోజనాన్ని (గుణోపసంహారంవల్ల లభించే ప్రయోజనాన్ని) చెప్పే సూత్రం. ఈ విధంగా సర్వవిజ్ఞానాలు సర్వవేదాంతప్రత్యయాలు అనే విషయం నిశ్చితము కాగా ఒక చోట చెప్పిన విజ్ఞానగుణాలకు సమానమైన మరొక విజ్ఞానంలో కూడ ఉపసంహారం జరుగుతుంది. ఎందువల ననగా ఆ రెండు విజ్ఞానాల అర్థంలోను (ప్రయోజనంలోను) భేదం లేదు. అనగా ఉపాసన అనే వాటి ప్రయోజనం ఒక్కటే. ఒక చోట విశిష్టమైన విజ్ఞానానికి ఉపకారకమైన ఆ గుణాల ఏ అర్థం (ప్రయోజనం) ఉన్నదో అదే రెండవ చోట కూడ ఉన్నది. రెండు చోట్లా అదే విజ్ఞానం (ఉపాసన) కదా? విధిశేషంవలె. అగ్నిహోత్రాదివిధికి అంగాలుగా ఉన్న ధర్మాలను అగ్నిహోత్రాదికర్మలు అభిన్నము లవడంచేత, అన్ని చోట్లా ఉపసంహరించడం ఎట్లు జరుగుతుందో అట్లే ఇక్కడ కూడ (అగ్నిహోత్రం అనే కర్మ ఒక్కటే. అందుచేత దానికి సంబంధించిన కొన్ని ధర్మాలను వేరు వేరు శాఖలలో వేరు వేరుగా చెప్పినా వాటి నన్నింటినీ ఏ విధంగా ఉపసంహరించాలో అట్లే ఇక్కడ కూడా అని అర్థం.) అయితే విజ్ఞానభేదం ఉంటే మాత్రం ఆ గుణాలు మరొక విజ్ఞానంతో సంబంధించినవి అవడం చేత ( ఆ విజ్ఞానాలకి) పకృతి - వికృతి భావం లేక పోవడం చేతా ఉపసంహారం ఉండదు. విజ్ఞానం ఒక్కటే అయితే మాత్రం ఇట్లు కాదు. ఉపసంహారం ఉంటుంది.) "సర్వాభేదాదన్యత్రేమే" (బ్ర.సూ. 3.3.10) అనే సూత్రం నుండి ప్రారంభించి ఈ ప్రయోజనసూత్రానికే ప్రపంచం (విస్తృత వివరణం) చేయబడగలదు

వి. కొన్ని యాగాలకు కావలసిన అంగా లన్నీ చెప్పబడతాయి ఆ యాగాలకు ప్రకృతి యాగాలు అని పేరు. కొన్ని యాగాలకు కొన్ని అంగాలు మాత్రమే చెప్పబడతాయి. వీటికి వికృతియాగా లని పేరు. ఇలా కొన్ని అంగాలు మాత్రమే చెప్పిన వికృతియాగాన్ని "ప్రకృతివద్వికృతిః కర్తవ్యా" (వికృతియాగాన్ని ప్రకృతియాగం వలె చెయ్యాలి) అనే నియమాన్ని అనుసరించి ప్రకృతియాగం వలె చెయ్యాలి. అనగా దీనికి చెప్పకుండా విడచివేసిన అంగాలను ప్రకృతియాగంనుండి గ్రహించాలి. అయితే రెండు విజ్ఞానాలు వేరు వేరు విజ్ఞానాలైనప్పుడు వాటి మధ్య ప్రకృతివికృతిభావసంబంధం వంటి సంబంధం ఏదీ లేదు గాన ఒక విజ్ఞానానికి సంబంధించిన ధర్మాలను మరొక విజ్ఞానంలో చేర్చుకొనగూడదు.

**ఉపసంహారాధికరణం సమాప్తం**

## 3. అన్యథాత్వాధికరణమ్. సూ. 6-8

## సూ. అన్యథాత్వం శబ్దాదితి చేన్నావిశేషాత్ 3.3.6

వాజసనేయకే : **"తే హ దేవా ఊచుర్హ న్తాసురాన్యజ్ఞ ఉద్గీథేనాత్యయామేతి"** (బృ.ఉ.1.3.1) **"తే హ వాచమూచుస్త్వం న ఉద్గాయ"** (బృ.ఉ.1.3.2) ఇతి ప్రక్రమ్య వాగాదీన్ ప్రాణానసురపాప్మవిద్ధత్వేన నిన్దిత్వా ముఖ్యప్రాణపరిగ్రహః పఠ్యతే - **"అథ హేమమాసన్యం ప్రాణమూచుస్త్వం న ఉద్గాయేతి. తథేతి తేభ్య ఏష ప్రాణ ఉదగాయత్"** (బృ.ఉ. 1.3.7) ఇతి. తథా ఛాన్దోగ్యేఽపి - **"తద్ధ దేవా ఉద్గీథమాజహ్రురనేనైనానభిభవిష్యామః"** (ఛా. ఉ- 1.2.1) ఇతి ప్రక్రమ్యేతరాన్ ప్రాణానసురపాప్మ విద్ధత్వేన నిన్దిత్వా తథైవ ముఖ్యప్రాణపరిగ్రహః పఠ్యతే **"అథ హ య ఏవాయం ముఖ్యః ప్రాణస్తముద్గీథముపాసాంచక్రిరే"** (ఛా.ఉ. 1.2.7) ఇతి. ఉభయత్రాపి చ ప్రాణప్రశంసయా ప్రాణవిద్యావిధిరధ్యవసీయతే. తత్ర సంశయః - కి మత్ర విద్యాభేదః స్యాదాహోస్విద్విద్యైక్యమితి. కిం తావత్ప్రాప్తమ్? పూర్వేణ న్యాయేన విద్యైకత్వమితి. నను న యుక్తం విద్యైకత్వం; ప్రక్రమభేదాత్ అన్యథా హి ప్రక్రమన్తే వాజసనేయినోఽన్యథా ఛాన్దోగాః "త్వంనఉద్గాయ"

(బృ.ఉ.1.3.2) ఇతి వాజసనేయినః ఉద్గీథస్య కర్తృత్వేన ప్రాణమామనన్తి. ఛన్దోగాస్తూద్గీథత్వేన - "తముద్గీథముపాసాంచక్రిరే" (ఛా.ఉ. 1.2.7) ఇతి. తత్కథం విద్యైకత్వం స్యాదితి చేత్; నైష దోషః. న హ్యేతావతా విశేషేణ విద్యైకత్వమపగచ్ఛతి; అవిశేషస్యాపి బహుతరస్య ప్రతీయమానత్వాత్. తథాహి దేవాసురసంగ్రామోపక్రమత్వమ్, అసురాత్యయాభిప్రాయ ఉద్గీథోపన్యాసః, వాగాదిసంకీర్తనమ్, తన్నిన్దయా ముఖ్యప్రాణవ్యపాశ్రయః, తద్వీర్యాచ్చాసుర విధ్వంసనమ్ అశ్మమృల్లోష్టనిదర్శ నేన ఇత్యేవం బహవోఽర్థాః ఉభయత్రాప్య విశిష్టాః ప్రతీయన్తే. వాజసనేయకేఽపి చోద్గీథసామానాధికరణ్యం ప్రాణస్య శ్రుతమ్ "ఏష ఉ వా ఉద్గీథః" (బృ.ఉ.1.3.23) ఇతి. తస్మాచ్ఛాన్దోగ్యేఽపి కర్తృత్వం లక్షయితవ్యమ్. తస్మాచ్చ విద్యైకత్వమితి. 6

**బాలానందిని**

**అన్యథాత్వమితి** :- "శబ్దాత్ : శబ్దంవల్ల, అన్యథాత్వమ్ = వాజసనేయ ఛాందోగ్యాలలోని ప్రాణవిద్యలకు భేదం, ఇతి చేత్ = అన్నట్లయితే; న = కాదు; అవిశేషాత్ = విశేషం లేదు కదా?" అని సూత్రార్థం. (ఇది పూర్వపక్షసూత్రం)

**వాజసనేయక ఇతి**:- వాజసనేయకంలో "**తేహ . . ఇతి**" (ఆ దేవతలు, అనగా సాత్త్వికవృత్తులైన ప్రాణాలు. పరస్పరం ఇలా అనుకొన్నాయి. ఇప్పుడీ యజ్ఞంలో ఉద్గీథం చేత (ఔద్గాత్రకర్మ చేత) రజస్తమోవృత్తిరూపులైన అసురులను అతిక్రమించి దేవత్వాన్ని పొందుదాము) అని "**తే హ . . ఉద్గాయ**" (అవి వాక్కుతో నీవు మాకు ఔద్గాత్రం చెయ్యుము) అని ఉపక్రమించి వాగాదిప్రాణాలు అసురపాప్మచే కొట్టబడినట్లు నిందించి, "**అథ . . ఉదగాయత్**" (తరవాత అవి ముఖంలో ఉన్న ప్రాణంతో నువ్వు మాకు ఔద్గాత్రం చేయుము అని అన్నాయి. అది సరే అని పలికి వాటికోసం ఉద్గానం చేసింది) అని ముఖ్య ప్రాణాన్ని (ఉపాస్యంగా) స్వీకరించినట్లు పఠించబడింది. అట్లే ఛాందోగ్యంలో కూడ "**తద్ధ . . . అభిభవిష్యామః**" (అప్పుడు అనగా, పరస్పరం అణచివేయడం అనే యుద్ధం ప్రవర్తించినప్పుడు, దేవతలు, ఈ ఉద్గీథంచేత అసురులను జయించెదము అని ఉద్గీథాన్ని తీసికొనివచ్చాయి) అని ఉపక్రమించి ఇతరప్రాణాలు అసురపాపంచేత కొట్టబడినట్లు

చెప్పి వాటిని నిందించి అట్లే ముఖ్యప్రాణాన్ని ఉపాసించినట్లు "అథ ... ఉపాసాంచక్రిరే" (తరువాత ముఖ్యప్రాణమైన ఏఉద్గీథం ఉన్నదో దానిని ఉపాసించిరి) అని చెప్పబడింది రెండు చోట్లా కూడ ప్రాణాన్ని ప్రశంసించడంచేత ఇది ప్రాణవిద్యా విధి అని నిర్ణయించబడుచున్నది. ఇక్కడ విద్యాభేదం ఉన్నదా లేక విద్యైకత్యమేనా అని సంశయం. ఏమి ప్రాప్తించినది? పూర్వం వెనుకటి అధికరణాలలో చెప్పిన న్యాయం చేత విద్యైకత్వమే అని ప్రాప్తించినది. (ప్రశ్న) - ఇక్కడ ఉపక్రమంలో భేదం ఉండడం వల్ల విద్యైకత్వం కుదరదు కదా? వాజసనేయులు ఒక విధంగా ఉపక్రమిస్తే ఛాందోగులు మరొక విధంగా ఉపక్రమిస్తున్నారు. వాజసనేయులు "త్వం న ఉద్గాయ" అని ప్రాణాన్ని ఉద్గీథకర్తగా పఠిస్తున్నారు. ఛందోగు లైతే "తముద్గీథముపాసాంచక్రిరే" అని ప్రాణమే ఉద్గీథం అన్నట్లు ఉపక్రమిస్తున్నారు. అలాంటప్పుడు విద్యైకత్వం ఎలా ఉంటుంది అని అంటే - (సమాధానం) ఇది దోషం కాదు. ఏతావన్మాత్రంచేత విద్యైకత్వానికి భంగం రాదు. ఎందువల్లననగా అవిశేషం (భేదం లేకపోవడం) కూడ అత్యధికంగా కనబడుతున్నది. అదెట్లనగా - దేవాసురసంగ్రామంతో ప్రారంభం, అసురుల జయం కోసం సంవాదం, ఉద్గీథాన్ని పేర్కొనడం, వాగాదులను గూర్చి చెప్పడం, వాటిని నిందించడం ద్వారా ముఖ్య ప్రాణాన్ని ఆశ్రయించడం, ప్రాణంయొక్క వీర్యంవల్ల ఱాతితో ఢీకొన్న మట్టిబెడ్డల వలె అసురులు నశించడం ఈ మొదలైన చాలా అంశాలు రెండు చోట్ల కూడ భేదం లేకుండా కనబడుతున్నాయి. "ఏష వా ఉద్గీథః" (ఈ ప్రాణమే ఉద్గీథం) అని వాజసనేయకంలో కూడ ప్రాణానికి ఉద్గీథంతో సామానాధికరణ్యం వినపడుతున్నది. అందుచేత ఛాందోగ్యోపనిషత్తులో కూడ ప్రాణానికి కర్తృత్వం ఉన్నట్లు ఊహించాలి. అందువల్ల విద్యైక్యత్వమే.

వి : వెనుకటి అధికరణంలోని న్యాయం ప్రకారం ఉద్గీథవిద్య అని ఒకే పేరు ఉండడంవల్ల విద్యైక్యం అని పూర్వపక్షం. ఈ విధంగా పూర్వాధికరణంతో దీనికి అపవాదసంగతి.

### సూ. న వా ప్రకరణభేదాత్పరోవరీయస్త్వాదివత్. 3.3.7

న వా విద్యైకత్వమత్ర న్యాయ్యమ్; విద్యాభేద ఏవాత్ర న్యాయ్యః

కస్మాత్? ప్రకరణభేదాత్. ప్రక్రమభేదాదిత్యర్థః. తథాహి - ఇహ ప్రక్రమభేదో దృశ్యతే. ఛాన్దోగ్యే తావత్ "ఓమిత్యేతదక్షరముద్గీథముపాసీత" (ఛా.ఉ. 1.1.1) ఇత్యేవముద్గీథావయవస్య ఓంకారస్యోపాస్యత్వం ప్రస్తుత్య రసతమాది గుణోపవ్యాఖ్యానం చ తత్ర కృత్వా "అథ ఖల్వేతస్యైవాక్షరస్యోపవ్యాఖ్యానం భవతి" (ఛా.ఉ. 1.1.10) ఇతి పునరపి తమేవోద్గీథావయవమోంకారమనువర్త్య దేవాసురాఖ్యాయికాద్వారేణ "తం ప్రాణముద్గీథముపాసాంచక్రిరే" (ఛా.ఉ. 1.2.2) ఇత్యాహ. తత్ర యద్యుద్గీథశబ్దేన సకలా భక్తిరభిప్రేయేత తస్యాశ్చ కర్తా ఉద్గాతా ఋత్విక్ తత ఉపక్రమశ్చోపరుధ్యేత, లక్షణా చ ప్రసజ్యేత. ఉపక్రమానురోధేన చైకస్మిన్ వాక్యే ఉపసంహారేణ భవితవ్యమ్. తస్మాదత్ర తావదుద్గీథావయవే ఓంకారే ప్రాణదృష్టిరుపదిశ్యతే. వాజసనేయకే తు ఉద్గీథశబ్దేనావయవగ్రహణే కారణాభావాత్ సకలైవ భక్తిరావేద్యతే "త్వం న ఉద్గాయ" (బృ. ఉ. 1.3.2) ఇత్యపి తస్యాః కర్తా ఉద్గాతా ఋత్విక్ ప్రాణత్వేన నిరూప్యత ఇతి ప్రస్థానాన్తరమ్.

### బాలానందిని

**నేతి** :- "ప్రకరణభేదాత్ = ఉపక్రమంలో భేదంవల్ల, న వా = విద్యైకత్వం లేదు; పరోవరీయస్త్వాదివత్ = పరోవరీయస్త్వాదికం వలె" అని సూత్రార్థం.

**న వేతి** :- ఇక్కడ విద్యైకత్వం న్యాయ్యం కాదు; విద్యాభేదమే న్యాయ్యం. ఎందువల్ల? ప్రకరణభేదంవల్ల. ఉపక్రమభేదంవల్ల అని అర్థం. అదెట్లనగా ఇక్కడ ఉపక్రమంలో భేదం కనబడుతున్నది. ఛాందోగ్యంలో "ఓమిత్యేతదక్షరముద్గీథమపాసీత" (ఓమ్ అనే అక్షరాన్ని, ఉద్గీథాన్ని, అనగా ఉద్గీథంలో ఒక అవయవమైన "ఓమ్" అనే అక్షరాన్ని ఉపాసించాలి) అని ఉద్గీథావయవమైన ఓంకారం ఉపాసించదగినది అని ప్రస్తావించి, దానియందు రసతమం మొదలైన గుణాలను చెప్పి (పృథివ్యాదిరసాలలో) ఓంకారం రసతమమైనది, ఇదియే ఆప్తి ఇదియే సమృద్ధి అని ఓంకారగుణాలను చెప్పి "అథ . . భవతి" (ఈ అక్షరముయొక్క వివరణమే చేయబడుచున్నది) అని తిరిగి

ఉద్గీథావయవమైన ఆ ఓంకారాన్నే దేవాసురాఖ్యాయిక ద్వారా కొనసాగిస్తూ "తం ప్రాణముద్గీథముపాసాంచక్రిరే" అని చెప్పుచున్నాడు.

వి. యజ్ఞంలో ఉద్గాత అనే ఋత్విక్కు సామవేదంలోని కొన్ని భాగాలను గానం చేస్తాడు. సామవేదంలోని ఒక భక్తికి (అనగా ఒక విభాగానికి) ఉద్గీథం అని పేరు. ఆ ఉద్గీథం అనే సామభక్తితో ఒక అవయవం ఓంకారం. ఉద్గీథావయవం అవడంచేత దీనిని కూడా ఉద్గీథం అని నిర్దేశించడం ఉంది. ఛాందోగ్యంలో ప్రారంభంలో ఉద్గీథావయవమైన ఓంకారం ప్రసక్తే ఉంది గాని మొత్తం ఉద్గీథం ప్రసక్తి లేదు. ఆ ఓంకారంయొక్క ఉపాసనయే ఇక్కడ చెప్పబడుచున్నది.

తత్రేతి :- అక్కడ ఉద్గీథశబ్దంచేత ఉద్గీథం అనే పేరు గల సమస్తమైన సామభక్తినీ, దాని కర్త యైన ఉద్గాత అనే ఋత్త్విక్కునీ గ్రహించి నట్లయితే అప్పుడు (కేవలం ఓంకారాన్ని మాత్రమే నిర్దేశించిన) ఉపక్రమానికి ఉపరోధం కలుగుతుంది; "ఆ ఉద్గీథాన్ని గానం చేసే ఉద్గాత " అని లాక్షణికార్థం కూడా చెప్పవలసి వస్తుంది. ఒక వాక్యంలో ఉపసంహారం ఉపక్రమాన్ని అనుసరించి ఉండాలి. అందుచేత ఇక్కడ (ఛాందోగ్యంలో) ఉద్గీథావయవమైన ఓంకారంలో ప్రాణదృష్టి ఉపదేశించబడుచున్నది. (అనగా ఓంకారాన్ని ప్రాణంగా ఉపాసించాలి అని విధించబడుచున్నది). బృహదారణ్యకంలో ఉద్గీథశబ్దం చేత ఉద్గీథావయవాన్ని గ్రహించడానికి తగిన కారణం లేకపోవడంవల్ల, మొత్తం ఉద్గీథభక్తియే చెప్పబడుతుంది. దానికి కర్త అయిన (దానిని గానం చేసే) ఉద్గాత అనే ఋత్విక్కు "త్వం న ఉద్గాయ" అని ప్రాణంగా నిరూపించబడుచున్నాడు. ("ఓ ప్రాణమా! నువ్వు మా కోసం ఉద్గానం చెయ్యి" అని చెప్పడంచేత ప్రాణమే ఉద్గాత అన్నట్లు చెప్పబడుచున్నది అని అర్థం)

## భాష్యమ్

యదపి తత్రోద్గీథసామానాధికరణ్యం ప్రాణస్య తదప్యుద్గాతృత్వేనైవ దిదర్శయిషితస్య ప్రాణస్య సర్వాత్మత్వప్రతిపాదనార్థమితి న విద్యైకత్వమావహతి. సకలభక్తి విషయ ఏవ చ తత్రాప్యుద్గీథశబ్ద ఇతి వైషమ్యమ్. న చ ప్రాణస్యోద్గాతృత్వమసంభవేన హేతునా పరిత్యజ్యతే; ఉద్గీథభావవదుద్గాతృ

భావస్యాప్యుపాసనార్థత్వేనోపదిశ్యమానత్వాత్. ప్రాణవీర్యేణైవ చోద్గాతా ఔద్గాత్రం కర్మ కరోతీతి నాస్త్యసంభవః. తథా చ తత్రైవ శ్రావితమ్ - "వాచా చ హ్యేవ స ప్రాణేన చోదగాయత్" (బృ. ఉ. 1.3.24) ఇతి. న చ వివక్షితార్థభేదేఽవగమ్యమానే వాక్యచ్ఛాయానుకారమాత్రేణ సమానార్థత్వమధ్యవసాతుం యుక్తమ్. తథా హ్యభ్యుదయవాక్యే పశుకామవాక్యే చ "త్రేధా తణ్డులాన్విభజేద్యే మధ్యమాః స్యుస్తానగ్నయే దాత్రే పురోడాశమష్టాకపాలం కుర్యాత్" ఇత్యాదినిర్దేశసామ్యేఽపి ఉపక్రమభేదాదభ్యుదయవాక్యే దేవతాపనయోఽధ్యవసితః, పశుకామవాక్యే తు యాగ విధిః. తథా ఇహాప్యుపక్రమభేదాద్విద్యాభేదః, పరోవరీయస్త్వాదివత్, యథా పరమాత్మదృష్ట్యధ్యాససామ్యేఽపి "ఆకాశో హ్యేవైభ్యో జ్యాయానాకాశః పరాయణమ్" (ఛా.ఉ. 1.9.1) "స ఏష పరోవరీయానుద్గీథః స ఏషోఽనన్తః" (ఛా. ఉ. 1.9.2) ఇతి పరోవరీయస్త్వాదిగుణవిశిష్టముద్గీథోపాసనమక్ష్యాదిత్యాదిగతహిరణ్య శ్మశ్రుత్వా దిగుణవిశిష్టోద్గీథోపాసనాద్భిన్నం; న చేతరేతరగుణోపసంహార ఏకస్యా మపి శాఖాయాం, తద్వచ్ఛాఖాన్తరస్థేష్వప్యేవంజాతీయకేషూపాసనేష్వితి. 7

బాలానందిని

**యదపీతి** :- ప్రాణానికి ఉద్గీథంతో సామానాధికరణ్యం ("య ఏవాయం ముఖ్యః ప్రాణస్తముద్గీథమ్" అనే వాక్యంలో ప్రాణమే ఉద్గీథం అని చెప్పడం) ఉద్గీథంగా చూప నిచ్చయింపబడిన ప్రాణం సర్వాత్మకం అని చెప్పడం కోసం ఉద్దిష్ట మైనది గాన అది విద్యైకత్వాన్ని సాధించజాలదు. (దానిని పట్టి రెండు విద్యలూ ఒకటే అని చెప్పడం కుదరదు). అక్కడ కూడా ఉద్గీథశబ్దం సమస్తసామభక్తిని చెప్పుచున్నది గాన ఆ వైషమ్యం (తేడా) కూడ ఉన్నది. ప్రాణం ఉద్గాత అనడం అసంభవం గాన దానిని (ప్రాణానికి చెప్పిన ఉద్గాతృత్వాన్ని) పరిత్యజించవలసిన అవసరం కూడా లేదు. ప్రాణానికి ఉద్గీథభావం (ప్రాణమే ఉద్గీథం అని) ఏ విధంగా ఉపాసనకోసం చెప్పబడిందో ఉద్గాతృత్వం కూడ ఉపాసన కోసమే చెప్పబడింది. మరొక విషయ మేమనగా - ఉద్గాత ప్రాణవీర్యంచేతనే ఔద్గాత్రం (ఉద్గాత చేయవలసిన సామగానం) అనే పని చేయకలుగుతాడు గాన

అసంభవం కూడా కాదు. ఆ విధంగా అక్కడనే "వాచా. . ఉదగాయత్" (ఆ ఉద్గాత వాక్సహితమైన ప్రాణంచేతనే ఉద్గానం చేశాడు) అని చెప్పబడింది. చెప్పదలచిన అర్థంలో భేదం కనబడుతున్నప్పుడు కేవలం వాక్యచ్ఛాయలో పోలిక ఉన్నంత మాత్రంచేత సమానార్థత్వాన్ని నిర్ణయించడం యుక్తం కాదు. అది ఎట్లనగా అభ్యుదయవాక్యంలోను, పశుకామవాక్యంలోను కూడా "త్రేధా . . కుర్యాత్" ఇత్యాది వాక్యాలచేత నిర్దేశంలో సామ్యం ఉన్నా కూడ ఉపక్రమంలో భేదం ఉండడంవల్ల అభ్యుదయవాక్యంలో దేవతాపనయం (అసలు దేవతలను తొలగించి వేరు దేవతలను చేర్చడం) నిర్ణయించబడింది. పశుకామవాక్యంలో నైతే యాగవిధి నిర్ణయించబడింది. అట్లే ఇక్కడ కూడా ఉపక్రమభేదంవల్ల విద్యాభేదం చెప్పాలి; పరోవరీయస్త్వాదులవలె.

వి. ఒక యజమానుడు దర్శం (అమావాస్య) అనే భ్రాంతిచేత చతుర్దశినాడే దర్శకర్మ చేయడానికి ప్రవర్తించినపుడు చంద్రుడు ఉదయిస్తే (ఆనాడు చతుర్దశి అవడంచేత చంద్రుడుదయిస్తే) ఒక ప్రాయశ్చిత్తం చెప్పబడింది. ఆ సందర్భంలో "త్రేధా తండులాన్విభజతే" ఇత్యాదివాక్యంచేత దర్శయాగంలో వచ్చే దేవతలకంటె భిన్నులైన కొందరు దేవతల నుద్దేశించి కొన్ని హవిస్సులు సమర్పించాలి అని చెప్పబడింది. అయితే ఇది క్రొత్త యాగం కాదు; అదే దర్శయాగం; అయితే దేవతలు మాత్రం మారతారు అని నిర్ణయించబడింది. అట్లే మరొకచోట పశుకామం కలవాడు చేయవలసిన యాగం చెపుతూ "త్రేధా తణ్డులాన్ విభజతే" ఇత్యాదివాక్యమే చెప్పబడింది. కాని ఇది ఒక యాగవిశేషం. ఈ రెండు స్థానాలలో వాక్య నిర్దేశం సమంగా ఉన్నా కూడ ఉపక్రమాలు వేరుగా ఉండడం చేత రెండు వేరు వేరు కర్మ లని ఏ విధంగా నిర్ణయించబడిందో అట్లే ఇక్కడ ఉపక్రమభేదాన్ని పట్టి రెండూ వేరు వేరు విద్య లని అంగీకరించాలి అని పూర్వమీమాంసకు సంబంధించిన ఒక అంశం ఇక్కడ ఉదాహరణగా చూపబడింది. దీని విస్తృత ప్రతిపాదనం భామతీబ్రహ్మవిద్యాభరణాదులలో చూచుకొనవచ్చును.

యథేతి:- పరమాత్మదృష్ట్యధ్యానంలో సామ్యం ఉన్నా కూడ ఆకాశో . . . పరాయణమ్" (ఈ ఆకాశం పరమాత్మ, అన్నింటికంటె పెద్దది, ఇదే పరాయణం) అని "స ఏష . . . అనన్తః" (ఈ ఉద్గీథం పరంకంటె పరం, శ్రేష్ఠమైనదానికంటె శ్రేష్ఠం) అని పరోవరీయస్త్వాదిగుణాలతో కూడిన ఉద్గీథోపాసనం అక్షి - ఆదిత్యాదులలో ఉన్న

హిరణ్యశ్మశ్రుత్వాదిగుణాలతో విశిష్టమైన ఉపాసనకంటె ఏ విధంగా భిన్నమో, ఒకే శాఖలో ఉన్నా కూడ పరస్పర గుణోపసంహారం ఎలా చేయబడదో, అట్లే శాఖాంతరాలలో ఉన్న ఇలాంటి ఉపాసనలలో కూడ గ్రహించాలి.

ఏ . ఆకాశవిద్యలోను ("ఆకాశో హ్యేవైభ్యః . . . స ఏష పరోవరీయాన్" ఇత్యాది వాక్యవిహితమైన విద్యలోను), అంతరాదిత్యవిద్యలోను (ఆదిత్యునిలోను అక్షిలోను చెప్పిన ఉపాసనలోను) కూడ ఉద్గీథాన్నే పరమాత్మదృష్టితో ఉపాసించాలి. అయితే మొదటిదానిలో పరోవరీయస్త్వాదిగుణాలు చెప్పబడ్డాయి. రెండవదానిలో హిరణ్యశ్మశ్రుత్వాదులు చెప్పబడ్డాయి. ఈ విధంగా గుణభేదాన్ని పట్టి ఒకే శాఖలో నున్నా కూడ ఈ రెండూ వేరు వేరు విద్య లని ఏ విధంగా గ్రహించబడిందో అట్లే వేరు వేరు శాఖలలో ఉన్న విద్యల విషయంలో కూడా భిన్నత్వాన్ని అంగీకరించాలి అని అర్థం.

## సూ. సంజ్ఞాతశ్చేత్తదుక్తమస్తి తు తదపి. 3.3.8.

అథోచ్యేత సంజ్ఞైకత్వాద్విద్యైకత్వమత్ర న్యాయ్యమ్; ఉద్గీథవిద్యేతి హ్యుభయత్రాప్యేకా సంజ్ఞేతి; తదపి నోపపద్యతే. ఉక్తం హ్యేతత్ - "న వా ప్రకరణభేదాత్పరోవరీయస్త్వాదివత్" (బ్ర.సూ. 3.3.7) ఇతి. తదేవ చాత్ర న్యాయ్యతరం; శ్రుత్యక్షరానుగతం హి తత్; సంజ్ఞైకత్వం తు శ్రుత్యక్షరబాహ్యమ్. ఉద్గీథశబ్దమాత్రప్రయోగాల్లౌకికైర్వ్యవహర్తృభిరుపచర్యతే. అస్తి చైతత్సంజ్ఞైకత్వం ప్రసిద్ధభేదేష్వపి పరోవరీయస్త్వాద్యుపాసనేషు ఉద్గీథవిద్యేతి. తథా ప్రసిద్ధ భేదానామప్యగ్నిహోత్రదర్శపూర్ణమాసాదీనాం కాఠకైకగ్రన్థపఠితానాం సంజ్ఞైకత్వం దృశ్యతే; తథేహాపి భవిష్యతి. యత్ర తు నాస్తి కశ్చిదేవంజాతీయకో భేదహేతుస్తత్ర భవతు సంజ్ఞైకత్వాద్విద్యైకత్వమ్, యథా సంవర్గవిద్యాదిషు. 8

### బాలానందిని

సంజ్ఞాత ఇతి :- సంజ్ఞాతశ్చేత్ = ఒకే సంజ్ఞ ఉండడంవల్ల విద్యైకత్వం అన్నట్లయితే, తత్ = అది, ఉక్తమ్ = పై సూత్రంలో చెప్పబడింది. తదపి = సంజ్ఞైకత్వం. అస్తి తు = భిన్న విద్యలకు కూడా ఉన్నది" అని సూత్రార్థం.

**అథేతి** :- సంజ్ఞయొక్క ఏకత్వంచేత (ఒకే సంజ్ఞ ఉండడంచేత) ఇక్కడ విద్యైకత్వం న్యాయ్యమైనది; రెండు చోట్లా కూడ ఉద్గీథవిద్య అని ఒకే సంజ్ఞ ఉన్నది కదా అని అన్నట్లయితే - అది కూడా ఉపపన్నం కాదు. దీనికి సమాధానం "న వా ప్రకరణ భేదాత్" ఇత్యాది సూత్రంలో చెప్పబడింది కదా ? అదే ఇక్కడ యుక్తతరమైనది. ఎందువల్ల ననగా అది శ్రుత్యర్థానికి అనుగుణంగా ఉంది. సంజ్ఞైకత్వ మైతేశ్రుత్యక్షరబాహ్య మైనది. (శ్రుతిలో లేదు) ఈ రెండింటిలోను ఉద్గీథశబ్దాన్ని ప్రయోగించినంతమాత్రంచేత లౌకికులైన వ్యవహర్తలచేత ఈ పేరు వీటికి ఆరోపించబడింది. వేరు వేరు విద్యలుగా నిశ్చితములైన పరోవరీయస్త్వాద్యుపాసనలలో ఉద్గీథవిద్య అని ఒకే సంజ్ఞ ఉండడం కనబడుచున్నది. అట్లే కాఠక మనే ఒక గ్రంథంలో చెప్పబడిన, ప్రసిద్ధభేదములైన అగ్నిహోత్ర దర్శపూర్ణమాసాదులకు కాఠకం అనే ఒక సంజ్ఞ ఉండడం కనబడుతున్నది. (ఒకే పేరున్న మాత్రంచేత ఒకే విద్య అని చెప్పవలసిన పని లేదని దీనివల్ల తెలుస్తూన్నది). ఇక్కడ కూడ అట్లే అవుతుంది. అయితే ఎక్కడైతే ఈ విధమైన భేదకారణం లేదో అక్కడ సంజ్ఞైకత్వాన్ని పట్టి, సంవర్గవిద్యాదులందు వలె, విద్యైకత్వం అంగీకరించవచ్చును. 8

**అన్యథాత్వాధికరణం సమాప్తం**

## 3. వ్యాప్త్యధికరణమ్. సూ. 9

## సూ. వ్యాప్తేశ్చ సమఞ్జసమ్. 3.3.9

**"ఓమిత్యేతదక్షరముద్గీథముపాసీత"** (ఛా.ఉ. 1.1.1.) ఇత్యత్ర అక్షరోద్గీథశబ్దయోః సామానాధికరణ్యే శ్రూయమాణే అధ్యాసాపవాదైకత్వవిశేషణ పక్షాణాం ప్రతిభాసనాత్ కతమోఽత్ర పక్షో న్యాయ్యః స్యాదితి విచారః. తత్రాధ్యాసో నామ ద్వయోర్వస్తునోరనివర్తితాయామేవాన్యతరబుద్ధౌ అన్యతరబుద్ధిరధ్యస్యతే, యస్మిన్నితరబుద్ధిరధ్యస్యతేఽ నువర్తత ఏవ తస్మింస్తద్బుద్ధిరధ్యస్తే తరబుద్ధావపి. యథా నామ్ని బ్రహ్మబుద్ధౌ అధ్యస్య మానాయామప్యనువర్తతే నామబుద్ధిః, న బ్రహ్మబుద్ధ్యా నివర్తతే. యథా వా ప్రతిమాదిషు విష్ణ్వాదిబుద్ధ్యధ్యాసః. ఏవ మిహాప్యక్షరే ఉద్గీథబుద్ధిరధ్యస్యతే

ఉద్గీథేవాక్షరబుద్ధిరితి. అపవాదో నామ యత్ర కస్మింశ్చిద్వస్తుని పూర్వని విష్టాయాం మిథ్యాబుద్ధౌ నిశ్చితాయాం పశ్చాదుపజాయమానా యథార్థా బుద్ధిః పూర్వనివిష్టాయా మిథ్యాబుద్ధేర్నివర్తికా భవతి. యథా దేహేన్ద్రియసంఘాత ఆత్మబుద్ధిః ఆత్మన్యేవ ఆత్మబుద్ధ్యా పశ్చాద్భావిన్యా "తత్త్వమసి" (ఛా. ఉ. 6.8.7) ఇత్యనయా యథార్థబుద్ధ్యా నివర్తతే; యథా వా దిగ్భ్రాన్తిబుద్ధిః దిగ్యాథార్థ్య బుద్ధ్యా నివర్త్యతే ఏవమిహాప్యక్షరబుద్ధ్యా ఉద్గీథబుద్ధిర్నివర్త్యతే, ఉద్గీథబుద్ధ్యా వాక్షరబుద్ధిరితి. ఏకత్వం త్వక్షరోద్గీథశబ్దయోరనతిరిక్తార్థవృత్తిత్వమ్; యథా ద్విజోత్తమో, బ్రాహ్మణో, భూమిదేవ ఇతి. విశేషణం తు పునః సర్వవేదవ్యాపినః ఓమిత్యేతస్యాక్షరస్య గ్రహణప్రసక్తే ఔద్గాత్రవిషయస్య సమర్పణమ్, యథా నీలం యదుత్పలం తదానయేతి. ఏవమిహాప్యుద్గీథో య ఓంకారః తముపాసీతేతి. ఏవమేతస్మిన్ సామానాధికరణ్యవాక్యే విమృశ్యమానే ఏతే పక్షాః ప్రతిభాన్తి. తత్రాన్యతమనిర్ధారణకారణాభావాత్ అనిర్ధారణప్రాప్తౌ ఇదముచ్యతే "వ్యాప్తేశ్చ సమఞ్జసమ్" ఇతి. చశబ్దోఽయం తుశబ్దస్థాననివేశీ ప్రక్షత్రయవ్యావర్తన ప్రయోజనః; తదిహ త్రయః పక్షాః సావద్యా ఇతి పర్యుదస్యన్తే - విశేషణపక్ష ఏవైకో నిరవద్య ఇత్యుపాదీయతే.

### బాలానందిని

**వ్యాప్తేరితి :-** "వ్యాప్తేః = ఓంకారం ప్రతీ బుక్కులోనూ, ప్రతీ అనువాకంలోను, ప్రతీ సామలోను ఆద్యంతాలలో వ్యాపించి ఉండడంవల్ల, సమంజమమ్ = ఉద్గీథం అనేది ఓంకారానికి విశేషణ మవడమే యుక్తము" అని సూత్రార్థం.

**ఓమితీతి :-** "ఓమిత్యేతదక్షరముద్గీథముపాసీత" అనునప్పుడు అక్షరానికీ ఉద్గీథానికీ (అక్షరమ్ ఉద్గీథమ్ అని) సామానాధికరణ్యం వినబడుతున్నది. ఈ సామానాధికరణ్యాన్ని పట్టి అధ్యాసను గ్రహించాలా, అపవాదం గ్రహించాలా, ఏకత్వం గ్రహించాలా, విశేషణత్వం గ్రహించాలా అని నాలుగు పక్షాలు భాసించడంవల్ల ఏ పక్షం న్యాయ్యమైనది అని విచారం కలగవచ్చును. వాటిలో 1అధ్యాస అనగా - రెండు

వస్తువులలో వాటి అన్యతరబుద్ధి నివర్తింపచేయబడకుండగానే, అనగా ఆ రెండు వస్తువులను రెండు వస్తువులుగా గ్రహిస్తూనే, వాటిలో ఒకదానియందు మరొకటి అనే బుద్ధి అధ్యసించబడుతుంది. అనగా ఒకటి మరొకటిగా గ్రహించబడుతుంది. అయితే దేనియందు మరొక బుద్ధి అధ్యసించబడుతుందో దానియందు ఇతరబుద్ధితో పాటు దాని బుద్ధి కూడ అనువర్తిస్తూనే ఉంటుంది. ఉదాహరణకి - నామమునందు బ్రహ్మ అని బుద్ధి అధ్యసించినా కూడ (నామను బ్రహ్మగా భావించినా కూడా) నామబుద్ధి కూడ అనువర్తిస్తూనే ఉంటుంది. బ్రహ్మబుద్ధిచేత అది నివర్తింపచేయబడుదు. లేదా ప్రతిమాదులయందు విష్ణుబుద్ధ్యధ్యాస అట్లే. అనగా ప్రతిమయందు విష్ణుత్వాన్ని అధ్యసించినా (ఆరోపించినా) ఇది ప్రతిమ అనే బుద్ధి కూడా అనువర్తిస్తూనే ఉంటుంది. అట్లే ఇక్కడ ఉద్గీథంమీద అక్షరబుద్ధి అధ్యసించబడుతుంది. లేదా అక్షరంమీద ఉద్గీథబుద్ధి అధ్యసించబడుతుంది. అపవాద అనగా - ఎక్కడైతే ఒక వస్తువునందు ముందుగా ఒక మిథ్యాబుద్ధి (భ్రాంతి) నిశ్చితంగా కలిగి, తరువాత కలిగిన యథార్థబుద్ధి పూర్వం ఏర్పడిన మిథ్యాబుద్ధిని నివర్తింపచేస్తుందో అది అపవాద . దేహేంద్రియసంఘాతంమీద ముందు ఆత్మబుద్ధి కలిగిన తరవాత "తత్త్వమసి" అనే యథార్థబుద్ధిచేత ఆత్మయందే ఆత్మబుద్ధి కలుగగా అప్పుడు ముందు కలిగిన అయథార్థ బుద్ధి తొలగించబడుతుంది; లేదా దిగ్భ్రాంతిబుద్ధి యథార్థదిగ్బుద్ధిచేత నివర్తించబడుతుంది. అట్లే ఇక్కడ అక్షరబుద్ధిచేత ఉద్గీథబుద్ధి నివర్తింపబడుతుంది. లేదా ఉద్గీథబుద్ధిచేత అక్షరబుద్ధి నివర్తింపబడుతుంది. (ఇది అపవాదపక్షం). ఉద్గీథశబ్ద-అక్షరశబ్దాలు ద్విజోత్తమ, బ్రాహ్మణః, భూమిదేవః ఇత్యాది పదాల వలె ఒకే అర్థాన్ని బోధిస్తాయి అని అంటే అది ఏకత్వం. సమస్తవేదంలోను వ్యాపించి ఉన్న (అనేక ప్రదేశాలలో ఉన్న) "ఓమ్" అనే అక్షరాన్ని గ్రహించవలసి ఉన్నప్పుడు ఔద్గాత్రానికి (ఉద్గీథానికి) సంబంధించిన ఓంకారాన్నే గ్రహించాలి అని దానిని సమర్పించడం విశేషణం. అనేకఉత్పలాలను తీసికొనిరావడానికి అవకాశం ఉన్నప్పుడు ఏది నీలంగా ఉన్నదో దానిని తీసికొనిరా అని చెప్పినట్లు (ఉద్గీథానికి సంబంధించిన ఓంకారాన్ని ఉపాసించా లని చెప్పడం). ఈ విధంగా సామానాధికరణ్యం ఉన్న వాక్యాన్ని పరిశీలించినప్పుడు ఈ పక్షాలు భాసిస్తున్నాయి. వాటిలో ఒకదానిని నిర్ధారణ చేయడానికి తగిన కారణం లేకపోవడంవల్ల అనిర్ధారణ ప్రాప్తించగా "వ్యాప్తేశ్చ సమఞ్జసమ్"

అని చెప్పబడుతున్నది. తుశబ్దస్థానంలో ప్రయోగించబడిన (తుకు బదులుగా ప్రయోగించబడిన) చశబ్దం మూడు పక్షాలను వ్యావర్తింపచేయడ మనే ప్రయోజనం గలది. (తుశబ్దసమానార్థకమైన చశబ్ధం పక్షత్రయాన్ని నిషేధిస్తున్నది అని అర్థం). అందుచేత ఇక్కడ మొదటి మూడు పక్షాలు దుష్టము లని పరిహరించబడుచున్నది. ఒక్క విశేషణ పక్షం మాత్రమే నిర్దుష్ట మని స్వీకరించబడుచున్నది.

## భాష్యమ్

తత్రాధ్యాసే తావద్యా బుద్ధిరితరత్రాధ్యస్యతే తచ్ఛబ్దస్య లక్షణావృత్తిత్వం ప్రసజ్యేత, తత్ఫలం చ కల్ప్యేత. శ్రూయత ఏవ ఫలమ్ - **"ఆపయితా హ వై కామానాం భవతి"** (ఛా. ఉ. 1.1.7) ఇత్యాదీతి చేత్, న. తస్యాన్యఫలత్వాత్. ఆప్త్యాదిదృష్టిఫలం హి తన్నోద్గీథాధ్యాసఫలమ్. అపవాదేఽపి సమానః ఫలాభావ. మిథ్యాజ్ఞాననివృత్తిః ఫలమితి చేత్, న. పురుషార్థోపయోగానవగమాత్. న చ కదాచిదప్యోంకారాదోంకారబుద్ధిర్నివర్తతే, ఉద్గీథాద్వోద్గీథబుద్ధిః. న. చేదం వాక్యం వస్తుతత్త్వప్రతిపాదనపరమ్; ఉపాసనవిధిపరత్వాత్ నాప్యేకత్వపక్షః సంగచ్ఛతే. నిష్ప్రయోజనం హి తదా శబ్దద్వయోచ్చారణం స్యాత్, ఏకేనైవ వివక్షితార్థసమర్పణాత్. న చ హౌత్రవిషయే వాధ్వర్యవవిషయే వాక్షరే ఓంకారశబ్దవాచ్యే ఉద్గీథశబ్దప్రసిద్ధిరస్తి. నాపి సకలాయాం సామ్నో ద్వితీయాయాం భక్తావుద్గీథవాచ్యాయామోంకారశబ్దప్రసిద్ధిః, యేన అనతిరిక్తార్థతా స్యాత్ పరిశేషాద్విశేషణపక్షః పరిగృహ్యతే, వ్యాప్తేః, సర్వవేదసాధారణ్యాత్. సర్వవ్యాప్యమక్షరమిహ మా ప్రసఞ్జీత్యత ఉద్గీథశబ్దేనాక్షరం విశేష్యతే, కథం నామోద్గీథావయవభూత ఓంకారో గృహ్యేతేతి. నన్వస్మిన్నపి పక్షే సమానా లక్షణా, ఉద్గీథశబ్దస్యావయవలక్షణార్థత్వాత్. సత్యమేవమేతత్. లక్షణాయా మపి తు సంనికర్షవిప్రకర్షౌ భవత ఏవ. అధ్యాసపక్షే హ్యర్థాన్తరబుద్ధిరర్థాన్తరే నిక్షిప్యత ఇతి విప్రకృష్టా లక్షణా. సముదాయేషు హి ప్రవృత్తాః శబ్దాః అవయవేష్వపి ప్రవర్తమానా దృష్టాః పటగ్రామాదిషు. అతశ్చ వ్యాప్తేర్హేతోః ఓమిత్యేతదక్షరం

మిత్యేతస్య ఉద్గీథమిత్యేతద్విశేషణమితి సమఞ్జసమితి, నిరవద్యమిత్యర్థః.

**బాలానందిని**

**తత్రేతి** :-[1] వాటిలో అధ్యాసపక్షంలో ఏ బుద్ధి రెండవదానియందు అధ్యసించబడుతుందో (ఏ ఉద్గీథబుద్ధి ఓంకారంమీద అధ్యసించబడుతుందో) దానిని చేప్పే శబ్దానికి (ఉద్గీథశబ్దానికి) (ఓంకారం అనే అర్థంలో) లక్షణ చెప్పవలసి ఉంటుంది. అనగా ఉద్గీథమే ఓంకారం అన్నప్పుడు వాస్తవంలో ఉద్గీథం వేరు ఓంకారం వేరు గాన ఉద్గీథశబ్దం లక్షణావృత్తిచేత ఓంకారాన్ని చెపుతుంది అని అంగీకరించవలసి ఉంటుంది ఈ విధంగా ఆరోపించి ప్రతీకోపాసన చేసినందుకు ఏదైన ఫలం చూపవలసి ఉంటుంది (ఇది గౌరవం, అనగా అవసరం లేని బరువు). క్రొత్తగా ఫలం కల్పించవలసిన పని లేదు. "ఆపయితా హ వై కామానాం భవతి" అనే వాక్యంలో ఫలం చెప్పబడింది కదా అనడానికి వీలు లేదు. ఎందుచేత ననగా కామాలను పొందడం అనేది అప్త్యాదిదృష్టికి ఫలంగా అనగా ఓంకారాన్ని ఆప్తి అనీ సమృద్ధి అనీ ఎవరు ఉపాసిస్తాడో వానికి లభించే ఫలంగా చెప్పబడింది. ఉద్గీథాధ్యాసకు (ఓంకారంమీద ఉద్గీథత్వాధ్యాసానికి) ఫలంగా కాదు.[2] అపవాదపక్షంలో కూడ ఫలం లేకపోవడం సమానమే. మిథ్యాజ్ఞాననివృత్తియే ఫలం అని చెపుతాం అంటే అది యుక్తం కాదు. దీనివల్ల ఏదైన పురుషార్థం లభిస్తుంది అని చెప్పబడలేదు. మరొక విషయమేమనగా ఓంకారబుద్ధినుండి ఎన్నడూ ఓంకారబుద్ధి నివర్తించదు. ఉద్గీథబుద్ధినుండి ఉద్గీథబుద్ధి నివర్తించదు. (అలాంటప్పుడు భ్రాంతియే లేదు గాన ఇది అపవాదం అయే ప్రశ్నయే లేదని భావం). మరియు ఈ వాక్యం వస్తుతత్త్వాన్ని ప్రతిపాదించడం కోసం ఉద్దిష్టమైనది కాదు (అప్పుడు దీనికి అపవాదత్వం సంభావ్యం అయిఉండేది). ఇది ఉపాసనవిధిపరమైన వాక్యం.[3] ఇంక ఏకత్వపక్షం కూడా కుదరదు. అప్పుడు రెండు శబ్దాలను ఉచ్చరించడం అనావశ్యకం. (ఓంకారం అన్నా ఉద్గీథం అన్నా ఒకటే గాన) ఒక శబ్దం ప్రయోగిస్తేనే అనుకొన్న అర్థం లభిస్తుంది మరొక విషయ మేమనగా - హౌత్రానికి (హోత అనే ఋత్విక్కు చేసే కర్మకు) ఆధ్వర్యవానికి (అధ్వర్యుడు అనే ఋత్విక్కు చేసే కర్మకు) సంబంధించిన ఓంకారరూపమైనర అక్షరానికి ఉద్గీథం అనే ప్రసిద్ధి లేదు; అట్లే ఉద్గీథం అని చెప్పబడే సామయొక్క రెండవ భక్తికి

అంతటికీ ఓంకారప్రసిద్ధి లేదు. (అలా ఉన్నట్లయితే ఓంకారం అన్నా ఉద్గీథం అన్నా పర్యాయపదాలు అయి ఉండేవి అని భావం).[1] అందుచేత పరిశేషన్యాయంచేత విశేషణ పక్షం గ్రహించబడుతుంది. వ్యాప్తేః = సకలవేదసాధారణ్యంవల్ల అంతటా వ్యాపించి ఉన్న (ఓంకారరూపమైన) అక్షరం ఇక్కడ ప్రసక్తం కాకూడదు అనే అభిప్రాయంతో ఉద్గీథావయవమైన ఓంకారమే గ్రహింపబడడం కోసం ఉద్గీథశబ్దంచేత ఓంకారం విశేషించబడుతున్నది.

౧. సామవేదంలోని ద్వితీయభక్తికి ఉద్గీథం అని పేరు. ఓంకారం ఉద్గీథంలోనూ ఉంది, ఇతర వేదభాగాలలోను ఉంది. "ఓంకారమును" అని మాత్రమే అంటే వేదంలోని ఎక్కడ ఉన్న ఓంకారా న్నైనా గ్రహించవచ్చు. కాని ఇక్కడ గ్రహించవలసినది ఉద్గీథావయవమైన, ఉద్గీథంలో ఉన్న, ఓంకారమే అని విశేషించడం కోసం ఉద్గీథశబ్దం ఓంకారానికి విశేషణంగా ప్రయోగించబడింది. అని అర్థం.

నన్వితి : (ప్రశ్న) ఈ పక్షంలో కూడా (మొత్తం సామభక్తికి పేరైన) ఉద్గీథశబ్దాన్ని లక్షణచేత అవయవమైన ఓంకారాన్ని చెపుతున్నట్లు ప్రయోగించడంచేత ఈ పక్షంలో కూడా (అధ్యాసపక్షంలో వలె) లక్షణ సమానమే కదా? (సమాధానం) ఇది నిజమే. అయితే లక్షణలో కూడా దగ్గర, దూరం అనేవి ఉంటాయి. అధ్యాసపక్షంలో ఒక వస్తువుమీద మరొక వస్తువు అనే బుద్ధి ఉంచబడుతుంది. గాన అక్కడ లక్షణ దూర మైనది. విశేషణపక్షంలో నైతే అవయవివాచకశబ్దం అవయవం అనే అర్థంలో ప్రయోగించబడుచున్నది గాన లక్షణ సంనిహిత మైనది. సముదాయాన్ని బోధించే శబ్దాలు అవయవాల విషయంలో కూడా ప్రవర్తించడం పట గ్రామ మొదలైన శబ్దాలలో కనబడుతున్నది. (వస్త్రంలో ఒక చిన్న భాగం అంటుకొన్నా బట్టకాలిపోయిందని, గ్రామంలోని పది ఇళ్ళు దగ్ధములైనా గ్రామం అంటుకున్నదని అంటాం) అందువల్ల వ్యాప్తి అనే హేతువువల్ల "ఓం" అనే అక్షరానికి "ఉద్గీథమ్" అనేది విశేషణం అని చెప్పడం సమంజసమైనది, అనగా ఇది నిర్దుష్టము అని అర్థం 9.



వ్యాప్త్యధికరణం సమాప్తం

## 5. సర్వాభేదాధికరణమ్. సూ. 10

## సూ. సర్వాభేదాదన్యత్రేమే 3.3.10

వాజసనేయినాం ఛన్దోగానాం చ ప్రాణసంవాదే శ్రైష్ఠ్యగుణాన్వితస్య ప్రాణస్యోపాస్యత్వముక్తమ్ - వాగాదయోపి హి తత్ర వసిష్ఠత్వాదిగుణాన్వితా ఉక్తాః. తే చ గుణాః ప్రాణే పునః ప్రత్యర్పితాః. "యద్వా అహం వసిష్ఠోఽస్మి త్వం తద్వసిష్ఠోఽసి" (బృ.ఉ. 6.1.14) ఇత్యాదినా. అన్యేషామపి చ శాఖినాం కౌషీతకిప్రభృతీనాం ప్రాణసంవాదేషు **"అథాతో నిఃశ్రేయసాదానమ్" "ఏతా హ వై దేవతా అహంశ్రేయసే వివదమానాః"** (కౌ. 2.14) ఇత్యేవంజాతీయకేషు ప్రాణస్య శ్రైష్ఠ్యముక్తం, న త్విమే వసిష్ఠత్వాదయోఽపి గుణాః ఉక్తాః. తత్ర సంశయః - కిమిమే వసిష్ఠత్వాదయో గుణాః క్వచిదుక్తా అన్యత్రాప్యస్యేరన్ ఉత నాస్యేరన్నితి. తత్ర ప్రాప్తం తావన్నాస్యేరన్నితి. కుతః? ఏవంశబ్ద సంయోగాత్ **"అథో య ఏవైవం విద్వాన్ ప్రాణే నిఃశ్రేయసం విదిత్వా"** ఇతి తత్ర తత్రైవంశబ్దేన వేద్యం వస్తు నివేద్యతే. ఏవంశబ్దశ్చ సంనిహితాలమ్బనో న శాఖాన్తరపఠితమేవం జాతీయకం గుణజాతం శక్నోతి నివేదయితుమ్. తస్మాత్స్వప్రకరణస్థైరేవ గుణైర్నిరాకాఙ్క్షత్వమితి.

### బాలానందిని

**సర్వేతి** :- "సర్వాభేదాత్ = అంతటా కూడ అభేదంవల్ల, ఇమే = ఈ వసిష్ఠత్వాదిగుణాలు, అన్యత్ర = ఇతరప్రదేశాలలో కూడ ఉపసంహరించబడును" అని సూత్రార్థం.

**వాజసనేయినామితి** :- వాజస నేయుల ప్రాణసంవాదంలోను, ఛందోగుల ప్రాణసంవాదంలోను కూడా శ్రైష్ఠ్యం అనే గుణంతో కూడిన ప్రాణం ఉపాస్యం అని చెప్పబడింది. అక్కడ వాగాదులకు వసిష్ఠత్వం మొదలైన గుణా లున్నట్లు చెప్పి ఆ గుణాలు"యద్వా . . అసి" (నేను వసిష్ఠుడనై ఉండడం అనేది ఏది కలదో అందుచేత నువ్వు వసిష్ఠుడ వైనావు) ఇత్యాదివాక్యాలచేత ప్రాణానికి తిరిగి ఇచ్చివేయబడి నట్లు

చెప్పబడింది.,

వి. వాగ్మి సుఖంగా ఉంటాడు. అందుచేత వాక్కులో వసిష్ఠత్వం అనే గుణం ఉంది. కండ్లు కలవాడు పాదాలను నిలపగలుగుతాడు ; అందుచేత చక్షుస్సులో ప్రతిష్ఠా అనే గుణం ఉంది. వినడం ద్వారా సమస్తప్రయోజనాలు పొందవచ్చును. అందుచేత శ్రోత్రంలో సంపత్ అనే గుణం ఉంది. మనస్సు వృత్తి ద్వారా సమస్త భోగ్యాలకీ ఆశ్రయం. అందుచేత మనస్సులో **ఆయతనత్వం** అనే గుణం ఉంది. ప్రాణం శ్రేష్ఠమైన దని నిశ్చయించిన వాగాదులు ఈ గుణా లన్నీ దానికి అర్పించివేసినవి అని రెండు శాఖలలోను కూడ ఉన్న విషయం.

**అన్యేషామితి** : కాషీతకి మొదలైన ఇతరశాఖలవాళ్ళకు కూడా "అథాతోనిఃశ్రేయసాదానమ్" (ఇప్పుడు శ్రేష్ఠత్వంయొక్క నిర్ణయం చేయబడుచున్నది) "ఏతా . . . వివదమానాః" (తమ తమ శ్రేష్ఠత్వాన్ని గూర్చి కలహించుచున్న ఈ వాగాదిదేవతలు) ఇత్యాదులైన ప్రాణసంవాదాలలో ప్రాణానికి శ్రేష్ఠత్వం చెప్పబడింది గాని ఈ వసిష్ఠత్వాది గుణాలు చెప్పబడలేదు. ఒక చోట వినబడుతున్న ఈ వసిష్ఠత్వాదిగుణాలు ఇతర స్థలాలలో కూడ చేర్చాలా, అక్కరలేదా అని అక్కడ సంశయం. చేర్చవలసిన పని లేదని ప్రాప్తించింది. ఎందువల్ల? "ఏవం" అని ఉండడం వల్ల. "అథోయ . . . విదిత్వా" అని అక్కడ "ఏవం" అనే శబ్దంచేత (దీనిని తెలుసుకొని అని) వేద్యమైన వస్తువు (ఫలానాది అని) తెలుపబడుతున్నది. దగ్గర ఉన్న దానిని మాత్రమే నిర్దేశించే 'ఏవం' శబ్దం శాఖాంతరంలో చెప్పబడిన ఈ రకమైన గుణసముదాయాన్ని తెలుపడానికి సమర్థం కాదు. అందువల్ల తన ప్రకరణంలో ఉన్న గుణాలచేతనే ఇది ఆకాంక్షారహితం అవుతుంది.

వి. 'ఏవమ్' - ఇట్లు అనగానే ఎట్లు అనే ఆకాంక్ష కలుగుతుంది. ఎట్లు అన్నప్పుడు ప్రక్కనున్నవి అన్వయిస్తాయి. దానితో ఆ ఆకాంక్ష తీరుతుంది. అందుచేత శాఖాంతరంలో ఉన్న వాటిని గ్రహించవలసిన పని లేదని అర్థం.

వెనుకటి అధికరణంలో ఓంకారం సర్వవేదవ్యాప్తమైనా కూడా ఉద్గీథశబ్దాన్ని దానికి విశేషణంగా ప్రయోగించడంచేత దాని సర్వవేదవ్యాప్తి తొలగించబడింది. సర్వవేదవ్యాప్త మైన ఓంకారాన్ని కాక ఉద్గీథంలో ఉన్నదానినే గ్రహించాలి అని చెప్పబడింది. అట్లే ఇక్కడ కూడా ఏవంశబ్దప్రయోగం చేత ప్రకృతవిద్యలో ఉన్న గుణాలనే గ్రహించాలి

గాని ఇతరవిద్యలలో ఉన్న వాటిని గ్రహించకూడదు అని దృష్టాంతసంగతి చేత పూర్వపక్షం.

భాష్యమ్

ఏవం ప్రాప్తే ప్రత్యాహ - అస్యేరన్నిమే గుణాః క్వచిదుక్తా వసిష్ఠత్వాదయోఽన్యత్రాపి. కుతః? సర్వాభేదాత్. సర్వత్రైవ హి తదేవైకం ప్రాణవిజ్ఞానమభిన్నం ప్రత్యభిజ్ఞాయతే; ప్రాణసంవాదాది సారూప్యాత్. అభేదే చ విజ్ఞానస్య కథమిమే గుణాః క్వచిదుక్తా అన్యత్ర నాస్యేరన్? నన్వేవం శబ్దస్తత్ర తత్ర భేదేనైవంజాతీయకం గుణజాతం వేద్యత్వాయ సమర్పయతీత్యుక్తమ్? అత్రోచ్యతే - యద్యపి కౌషీతకిబ్రాహ్మణగతేనైవంశబ్దేన వాజసనేయిబ్రాహ్మణ గతం గుణజాతమనంశబితమసంనిహితత్వాత్తథాపి తస్మిన్నేవ విజ్ఞానే వాజసనేయిబ్రాహ్మణగతేనైవంశబ్దేన తత్సంశబ్దితమితి న పరశాఖాగతమప్య భిన్నవిజ్ఞానావబద్ధం గుణజాతం స్వశాఖాగతాద్విశిష్యతే. న చైవం సతి శ్రుతహానిర శ్రుతకల్పనా వా భవతి. ఏకస్యామపి హి శాఖాయాం శ్రుతాః గుణాః శ్రుతా ఏవ సర్వత్ర భవన్తి, గుణవతో భేదాభావాత్; న హి దేవదత్తః శౌర్యాధిగుణత్వేన స్వదేశే ప్రసిద్ధో దేశాన్తరం గతస్తద్దేశ్యైరవిభావితశౌర్యాదిగుణోఽ ప్యతద్గుణో భవతి. యథా చ తత్ర పరిచయవిశేషాద్దేశాన్తరేఽపి దేవదత్తగుణా విభావ్యన్తే ఏవమ భియోగవిశేషాచ్ఛాఖాన్తరేఽ ప్యుపాస్యా గుణాః శాఖాన్తరే ప్యస్యేరన్. తస్మాదేక ప్రధానసంబద్ధా ధర్మా ఏకత్రాప్యుచ్యమానాః సర్వత్రైవోపసంహర్తవ్యా ఇతి. 10

బాలానందిని

**ఏవమితి :-** ఇట్లు ప్రాప్తించగా సమాధానం చెపుతున్నాడు. ఒక చోట చెప్పబడిన ఈ వసిష్ఠత్వాదిగుణాలు మరొక చోట చేర్చబడతాయి. ఎందువల్ల? సర్వాభేదంవల్ల అంతటా కూడ ఆ ప్రాణవిజ్ఞానం ఒక్కటే అని, వేరు కాదని గుర్తించబడుచున్నది కదా? అందుకు కారణం ప్రాణసంవాదాదులలో సాదృశ్యం ఉండడం. విజ్ఞానం అభిన్నమైనప్పుడు ఒక చోట చెప్పబడిన ఈ గుణాలు మరొకచోట ఎలా చేర్చబడకుండా ఉంటాయి? (ప్రశ్న) 'ఏవం' శబ్దం అక్క డక్కడ ఈ రకమైన గుణసముదాయాన్ని వేరు వేరుగానే

వేద్యంగా చూపుతున్నది అని చెప్పాం కదా? ఇక్కడ సమాధానం చెప్పబడుచున్నది. కౌషీతకిబ్రాహ్మణంలో నున్న ఏవంశబ్దంచేత వాజసనేయబ్రాహ్మణంలోని గుణసముదాయం దగ్గరగా లేకపోవడంచేత, గ్రహింపబడకపోయినా అదే విజ్ఞానంలో వాజసనేయబ్రాహ్మణంలో ఉన్న ఏవంశబ్దంచేత అది (వాజసనేయ బ్రాహ్మణగతగుణజాతం) గ్రహించబడింది గాన ఒకే విజ్ఞానానికి సంబంధించిన పరశాఖాగతమైన గుణజాతం స్వశాఖలో ఉన్నదాని కంటెభిన్నం కాదు. (అనగా కౌషీతకి బ్రాహ్మణంలోని 'ఏవం'శబ్దం దూరంగా ఉన్న వాజసనేయబ్రాహ్మణగత గుణసముదాయాన్ని నిర్దేశించజాల దనే మాట నిజమే. అయితే వాజసనేయ బ్రాహ్మణంలోని ఏవంశబ్దం వాజసనేయిబ్రాహ్మణగతమైన గుణసముదాయాన్ని నిర్దేశిస్తున్నది కదా. ఆ రెండు బ్రాహ్మణాలలో చెప్పిన రెండు విద్యలూ ఒక్కటే అని స్పష్టంగా తెలుస్తూన్నప్పుడు గుణాలు గుణిని విడిచి ఉండవు గాన విజ్ఞానాన్ని గూర్చి చెప్పినప్పుడు అర్థాన్ని పట్టి ఆ గుణాలను కూడా గుణితో పాటు చెప్పినట్లే అవుతుంది. అందుచేత కౌషీతకిబ్రాహ్మణంలోని ఏవశబ్దం అదే బ్రాహ్మణంలో చెప్పిన గుణాలను ప్రత్యక్షంగా నిర్దేశిస్తుంది. ఇతర బ్రాహ్మణంలో చెప్పిన గుణాలను, అర్థతః (పరోక్షంగా) గ్రహిస్తుంది అని భావం). ఇలా చెప్పడంచేత శ్రుతహాని (స్పష్టంగా వినబడుతున్న దానిని విడిచిపెట్టడం) అశ్రుతకల్పన (లేనిదానిని కల్పించడం) అనే దోషం కలగదు. గుణవత్తులో (గుణాలుగలదానిలో) భేదం లేనపుపడు ఒక చోట వినబడుతున్న గుణాలు అన్నిచోట్ల అన్వయించడంలో తప్పులేదు. శౌర్యాదిగుణా లన్నవాడుగా స్వదేశంలో ప్రసిద్ధి చెందిన దేవదత్తుడు మరొక దేశానికి వెళ్ళినప్పుడు ఆ గుణా లున్నవాడుగా అక్కడివాళ్ళచేత గుర్తింపబడకపోయినా ఆ గుణాలు లేనివాడైపోడు కదా? కొంత పరిచయం ఏర్పడిన తరవాత ఆ దేశంలో కూడా ఏ విధంగా అతనిలోని గుణాలు గుర్తించబడతాయో అట్లే సంబంధాన్ని పట్టి ఒక శాఖలో ఉపాసింపదగినవిగా చెప్పబడినవి మరొక శాఖలో కూడా చేర్చబడతాయి. అందువల్ల-ప్రధానమైన ఒకే విజ్ఞానానికి సంబంధించిన ధర్మాలు ఒకే చోట చెప్పబడుచున్నా కూడ వాటిని అన్ని చోట్లా ఉపసంహరించుకోవాలి. 10

సర్వాభేదాధికరణం సమాప్తం

## 6. ఆనన్దాద్యధికరణమ్. సూ.11-13

## సూ. ఆనన్దాదయః ప్రధానస్య. 3.3.11

బ్రహ్మస్వరూపప్రతిపాదనపరాసు శ్రుతిషు ఆనన్దరూపత్వం, విజ్ఞానఘనత్వం, సర్వగతత్వం, సర్వాత్మత్వమ్ ఇత్యేవంజాతీయకా బ్రహ్మణో ధర్మాః క్వచిత్ కేచిచ్ఛ్రూయన్తే. తేషు సంశయః-కిమానన్దాదయో బ్రహ్మధర్మాః యత్ర యావన్తః శ్రూయన్తే తావన్త ఏవ తత్ర ప్రతిపత్తవ్యాః కిం వా సర్వే సర్వత్రేతి. తత్ర యథాశ్రుతివిభాగం ధర్మప్రతిపత్తౌ ప్రాప్తాయామిదముచ్యతే ఆనన్దాదయః ప్రధానస్య బ్రహ్మణో ధర్మాః సర్వే సర్వత్ర ప్రతిపత్తవ్యాః. కస్మాత్? సర్వాభేదాదేవ. సర్వత్ర హి తదేవైకం ప్రధానం విశేష్యం బ్రహ్మ న భిద్యతే. తస్మాత్సార్వత్రికత్వం బ్రహ్మధర్మాణాం తేనైవ పూర్వాధికరణోదితేన దేవదత్తశౌర్యాదినిదర్శనేన. 11.

### బాలానందిని

**ఆనన్దేతి** :- "ప్రధానస్య=ప్రధానమైన బ్రహ్మయొక్క, ఆనన్దాదయః=ఆనందం మొదలైన ధర్మాలు, ఉపసంహరించదగినవి" అని సూత్రార్థం.

వి. ప్రాణం సవిశేషంగాన ఒక శాఖలో చెప్పిన వసిష్ఠత్వాదిగుణాలను మరొక శాఖలోనికి ఉపసంహరించడం యుక్తమే అయినా బ్రహ్మ నిర్విశేషం అవడంచేత ఒక చోట చెప్పిన దాని ధర్మాలను మరొక చోటికి ఉపసంహరించడం ఆవశ్యకం కాదు. స్వశాఖలో చెప్పిన ధర్మాల ద్వారానే బ్రహ్మను గుర్తించవచ్చును అని ప్రత్యుదాహరణ సంగతిచేత పూర్వపక్షం.

బ్రహ్మేతి :- బ్రహ్మస్వరూపం ప్రతిపాదించే శ్రుతులలో ఆనందరూపత్వం, విజ్ఞానఘనత్వం, సర్వగతత్వం సర్వాత్మత్వం మొదలైన కొన్ని బ్రహ్మకు సంబంధించిన ధర్మాలు కొన్ని చోట్ల వినబడుతున్నాయి. ఈ ఆనాందాదిధర్మాలలో ఏవి ఎక్కడ వినబడుతున్నాయో వాటిని అక్కడ మాత్రమే గ్రహించాలా లేక అన్నింటినీ అన్నిచోట్ల గ్రహించాలా అని సంశయం. ఏ శ్రుతిలో ఉన్న ధర్మాలు ఆ శ్రుతిలో మాత్రమే గ్రహించాలి అని ప్రాప్తించగా చెప్పబడుచున్నది-ప్రధానమైన బ్రహ్మయొక్క ఆనందం మొదలైన

ధర్మాలన్నీ అన్ని స్థలాలలోను గ్రహించాలి. ఎందువల్ల? సర్వాభేదంవల్ల. అంతటా కూడ ప్రధానమైన ఆ బ్రహ్మ ఒక్కటే విశేష్యంగా ఉన్నది; ఏ మాత్రమూ భేదం లేదు. అందువల్ల పూర్వాధికరణంలో చెప్పిన దేవదత్తశౌర్యాధినిదర్శనంచేత బ్రహ్మధర్మాలన్నీ అంతటా ఉపసంహరించాలి. 11

భాష్యమ్.

నన్వేవం సతి ప్రియశిరస్త్వాదయోఽపి ధర్మాః సర్వే సర్వత్ర సంకీర్యేరన్. తథాహి-తైత్తిరీయక ఆనన్దమయమాత్మానం ప్రక్రమ్యామ్నాయతే. "తస్య ప్రియమేవ శిరః, మోదో దక్షిణః పక్షః, ప్రమోద ఉత్తరః పక్షః, ఆనన్ద ఆత్మా, బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" (తై.ఉ.2.5) ఇతి. అత ఉత్తరం పఠతి-

సూ. ప్రియశిరస్త్వాద్యప్రాప్తిరుపచయాపచయౌ హి భేదే. 3.3.12.

ప్రియశిరస్త్వాదీనాం ధర్మాణాం తైత్తిరీయక ఆమ్నాతానాం నాస్త్యత్ర ప్రాప్తిః, యత్కారణం ప్రియం, మొదః ప్రమోదః, ఆనన్ద ఇత్యేతే పరస్పరాపేక్షయా భోక్త్రన్తరాపేక్షయా చోపచితాపచితరూపా ఉపలభ్యన్తే. ఉపచయాపచయౌ చ సతి భేదే సంభవతః. నిర్భేదం తు బ్రహ్మ "ఏకమేవాద్వితీయమ్" (ఛా.ఉ.6.2.1) ఇత్యాదిశ్రుతిభ్యః. న చైతే ప్రియశిరస్త్వాదయో బ్రహ్మధర్మాః, కోశధర్మాస్త్వేత ఇత్యుపదిష్టమస్మాభిః "ఆనన్దమయోఽభ్యాసాత్" (బ్ర.సూ.1.1.12) ఇత్యత్ర. అపి చ పరస్మిన్ బ్రహ్మణి చిత్తావతారోపాయమాత్రత్వేనైతే పరికల్ప్యన్తే న ద్రష్టవ్యత్వేన. ఏవమపి సుతరామన్యత్రాప్రాప్తిః ప్రియశిరస్త్వాదీనామ్. బ్రహ్మధర్మాంస్త్వేతాన్ కృత్వా న్యాయమాత్రమిదమాచార్యేణ ప్రదర్శితం ప్రియశిరస్త్వాద్యప్రాప్తిరితి. స చ న్యాయోఽన్యేషు నిశ్చితేషు బ్రహ్మధర్మేషూపాసనాయోపదిశ్యమానేషు నేతవ్యః సంయద్వామాదిషు, సత్యకామాదిషు చ. తేషు హి సత్యప్యుపాస్యస్య బ్రహ్మణ ఏకత్వే ప్రక్రమభేదాదుపాసనాభేదే సతి నాన్యోన్యధర్మాణామన్యోన్యత్ర ప్రాప్తిః. యథా చ ద్వే నార్యావేకం నృపతిముపాసాతే ఛత్రేణైకా చామరేణాన్యా తత్రోపా

స్యైకత్వేఽప్యుపాసనాభేదో ధర్మవ్యవస్థా చ భవత్యేవమిహాపీతి. ఉపచితాపచిత గుణత్వం హి సతి భేదవ్యవహారే సగుణే బ్రహ్మణ్యుపపద్యతే న నిర్గుణే పరస్మిన్ బ్రహ్మణి. అతో న సత్యకామత్వాదీనాం ధర్మాణాం క్వచిచ్ఛ్రుతానాం సర్వత్ర ప్రాప్తిరిత్యర్థః. 12.

బాలానందిని

నన్వితి :- అట్లైతే ప్రియశిరస్త్వం మొదలైన అన్ని ధర్మాలను కూడ అన్ని స్థానాలలోను ఉపసంహరించవలసి ఉంటుంది. అదెట్లనగా తైత్తిరీయంలో ఆనందమయాత్మను ఉపక్రమించి-"తస్య....ప్రతిష్ఠా" అని పఠించబడుచున్నది ( ఆ గుణాలను అన్నిచోట్లా అన్వయించాలి అని భావం). అందువల్ల సమాధానం పఠిస్తున్నాడు-

ప్రియేతి :-"ప్రియశిరస్త్వాద్యప్రాప్తిః=ప్రియశిరస్త్వంమొదలైనవాటికి ఇతరస్థలాలలో ప్రాప్తి ఉండదు. హి=ఎందువల్లననగా, ఉపచయాపచయౌ=హెచ్చుతగ్గులు, భేదే=భేదం ఉన్నప్పుడు మాత్రమే కుదురుతాయి" అని సూత్రార్థం.

ప్రియేతి :- తైత్తి రీయకంలో చెప్పబడిన ప్రియశిరస్త్వాదిధర్మాలకు ఇతరస్థలాలలో చేర్చడం ఉండదు. కారణ మేమనగా-ప్రియం, మోదం, ప్రమోదం, ఆనందం అనే ఈ ధర్మాలు పరస్పరాపేక్షచేత (వాటిలో అవి), వేరు వేరు భోక్తల అపేక్షచేతను హెచ్చుతగ్గులతో ఉన్నవిగా కనబడుతున్నాయి ఈ హెచ్చుతగ్గులు భేదం ఉన్నప్పుడు మాత్రమే సంభవిస్తాయి బ్రహ్మైతే "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" ఇత్యాదిశ్రుతుల ననుసరించి భేదరహితమైనది నిజానికి ఈ ప్రియశిరస్త్వాదులు బ్రహ్మధర్మాలు కావు, ఇవి కోశధర్మాలు మాత్రమే అని "ఆనన్దమయోఽభ్యాసాత్" అనే చోట మేం ప్రతిపాదించి ఉన్నాం. మరొక విషయ మేమనగా పరబ్రహ్మమీద చిత్తం నిలపడంకోసం ఉపాయాలుగా మాత్రమే ఈ ధర్మాలు చెప్పబడుతున్నాయి కాని వీటిని చూడాలి (ఉపాసించాలి)అనే ఉద్దేశ్యంతో చెప్పబడటంలేదు ఈ దృష్టితో చూస్తే కూడ ప్రియశిరస్త్వాదులు ఏ విధంగానూ కూడ ఇతరస్థలాలో ప్రాప్తించవు. అయితే ప్రియశిరస్త్వాదులు బ్రహ్మధర్మాలు అని కల్పించుకొని ఆచార్యుడు (సూత్రకారుడు)ప్రియశిరస్త్వాద్యప్రాప్తి అని ఈ న్యాయం మాత్రం చూపాడు. (నిజానికి ప్రియశిరస్త్వాదులు బ్రహ్మధర్మాలు కానే కావు గాన) నిశ్చితంగా బ్రహ్మధర్మాలుగా

ఉపాసనకొరకు ఉపదేశించబడిన సంయద్వామాదులు సత్యకామాదులు అయిన ఇతరధర్మాల విషయంలో ఈ న్యాయాన్ని ప్రవర్తింపచెయ్యాలి. ఉపాస్యమైన బ్రహ్మ ఒక్కటే అయినా కూడ ప్రక్రమభేదాన్ని పట్టి ఉపాసనాభేదం ఏర్పడడంచేత ఒకచోట ఉన్న ధర్మాలు మరొక చోట ప్రాప్తించవు. ఒక స్త్రీ ఛత్రంచేత, మరొక స్త్రీ చామరంచేత, ఈ విధంగా ఇద్దరు స్త్రీలు ఒకే రాజును ఉపాసిస్తున్నప్పుడు ఉపాస్యుడొక్కడే అయినా కూడ ఉపాసనలో భేదము, ధర్మాల వ్యవస్థ ఏ విధంగా ఉంటాయో అట్లే ఇక్కడ కూడ. సగుణబ్రహ్మవిషయంలో భేదవ్యవహారం ఉన్నప్పుడు ఉపచితాపచితగుణత్వం (గుణాలలో హెచ్చుతగ్గులు) ఉండడానికి అవకాశం ఉంటుంది కాని నిర్గుణమైన పరబ్రహ్మ విషయంలో ఉండదు. అందువల్ల ఒక చోట వినబడుతూన్న సత్యకామత్వాదిధర్మాలకు మరొక చోట ప్రాప్తి లేదు అని అర్థం. 12

## సూ. ఇతరే త్వర్థసామాన్యాత్. 3.3.13.

ఇతరే త్వానన్దాదయో ధర్మాః బ్రహ్మస్వరూపప్రతిపాదనాయైవోచ్యమానాః అర్థసామాన్యాత్ ప్రతిపాద్యస్య బ్రహ్మణో ధర్మిణః ఏకత్వాత్సర్వే సర్వత్ర ప్రతీయేరన్నితి వైషమ్యమ్. ప్రతిపత్తిమాత్రప్రయోజనా హి త ఇతి. 13.

### బాలానందిని

ఇతర ఇతి :- "ఇతరే తు=ఇతరములైన ఆనందాదిధర్మాలైతే, అర్థసామాన్యాత్=ధర్మియైన బ్రహ్మ ఒక్కటే అవడంవల్ల ఉపసంహరింపబడతాయి" అని సూత్రార్థం.

ఇతర ఇతి :- బ్రహ్మస్వరూపాన్ని ప్రతిపాదించడం కొనం మాత్రమే చెప్పబడుచున్న ఇతరములైన ఆనందాదిధర్మాలైతే, అర్థసామాన్యాత్=ప్రతిపాదింపదగిన, ధర్మియైన బ్రహ్మ ఒక్కటే అవడంచేత, అవన్నీ కూడ అన్నిచోట్లా తెలియబడతాయి అని వైషమ్యం (సత్యకామత్వాదులకు వీటికీ తేడా). వాటి ప్రయోజనం బ్రహ్మను తెలుసుకొనడం మాత్రమే కదా? 13.

ఆనందాద్యధికరణం సమాప్తం

### 7. అధ్యానాధికరణమ్. సూ. 14-15

### సూ. ఆధ్యానాయ ప్రయోజనాభావాత్. 3.3.14.

కాఠకే పఠ్యతే "ఇన్ద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః, మనసస్తు పరా బుద్ధి." ఇత్యారభ్య "పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః" (క. ఉ.3.11) ఇతి. తత్ర సంశయః కిమిమే సర్వ ఏవార్థాదయస్తతః పరత్వేన ప్రతిపాద్యన్తే. ఉత పురుష ఏవైభ్యః సర్వేభ్యః పరః ప్రతిపాద్యత ఇతి. తత్ర తావత్సర్వేషామేవైషాం పరత్వేన ప్రతిపాదనమితి భవతి మతిః. తథాహి శ్రూయతే ఇదమస్మాత్ప రమిదమస్మాత్పర మితి. నను బహుష్వర్థేషు పరత్వేన ప్రతిపిపాదయిషితేషు వాక్యభేదః స్యాత్? నైష దోషః. వాక్యబహుత్వోపపత్తేః. బహూన్యేవ హ్యేతాని ప్రభవన్తి బహువిషయాన్ పరత్వోపేతాన్ ప్రతిపాదయితుమ్. తస్మాత్ప్రత్యేకమేషాం పరత్వప్రతిపాదనమితి.

బాలానందిని

ఆధ్యానేతి :- "ఆధ్యానాయ=ధ్యానపూర్వకమైన సాక్షాత్కారం కొరకు పురుషుడే పరుడుగా చెప్పబడుచున్నాడు. ఇంద్రియాదుల పరత్వం చెప్పబడడంలేదు. ఎందువల్లననగా-ప్రయోజనాభావాత్= దాని జ్ఞానంవల్ల ప్రయోజనం లేదు" అని సూత్రార్థం

కాఠక ఇతి కాఠకంలో - "ఇన్ద్రియేభ్యః....బుద్ధిః" అని ప్రారంభించి "పురుషాత్...గతిః". అని పఠించబడుచున్నది. ఇక్కడ అర్థాలు మొదలైన వన్నీ ఆ యా వస్తువులకంటె పరము లని ప్రతిపాదించబడుతున్నాయా లేక వీటి అన్నింటికంటె పురుషుడొక్కడే పరుడుగా ప్రతిపాదింపబడుచున్నాడా అని సంశయం ఇవన్నీ కూడ పరములుగా ప్రతిపాదించబడుచున్నాయి అని అభిప్రాయం కలుగుచున్నది ఇది దీనికంటె పరం, ఇది దీనికంటె పరం, అని చెప్పబడుచున్నది కదా? (ప్రశ్న) చాలా వస్తువులు పరములు అని చెపితే వాక్యభేదం (ఒకే వాక్యానికి అనేక అర్థాలు చెప్పవలసిన అవసరం) కలుగుతుంది కదా? (సమాధానం) ఈ దోషం లేదు. వీటిని చాలా వాక్యాలుగా తీసికొనవచ్చును. చాలా ఉన్న ఈ వాక్యాలు చాల వస్తువులను పరములనుగా చెప్పడానికి సమర్థము లవుతాయి.

అందుచేత ఇక్కడ ఉన్న వస్తువులలో ప్రతిఒక్కటీ ఒక్కొక్క వాక్యంచేత పరంగా చెప్పబడుతుంది.

వి. బ్రహ్మస్వరూపాలైన ఆనందాదులు ఉపసంహార్యము లనీ అవి బ్రహ్మజ్ఞానోపాయా లనీ చెప్పబడింది. ఇప్పుడు ఆ బ్రహ్మస్వరూపం కానిది, అనుపసంహార్యమూ అయిన ఇంద్రియాదిపరత్వం అనే ధర్మం బ్రహ్మజ్ఞానోపాయమని చెప్పబడుచున్నది. ఈ విధంగా ఏకఫలత్వసంగతి.పూర్వపక్షంలో "ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థాః" ఇత్యాదివాక్యాలు అనేకవాక్యాలవడంచేత ఇవి అనేకవిద్యలు. సిద్ధాంతంలో ఒకే వాక్యం గాన ఒకే విద్య.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః-పురుష ఏవ హ్యేభ్యః సర్వేభ్యః పరః ప్రతిపాద్యత ఇతి న యుక్తం ప్రత్యేకమితరేషాం పరత్వప్రతిపాదనమ్. కస్మాత్? ప్రయోజనాభావాత్. న హీతరేషు పరత్వేన ప్రతిపన్నేషు కించి త్ప్రయోజనం దృశ్యతే శ్రూయతే వా. పురుషే త్విన్ద్రియాదిభ్యః పరస్మిన్ సర్వానర్థవ్రాతాతీతే ప్రతిపన్నే దృశ్యతే ప్రయోజనం మోక్షసిద్ధిః. తథా చ శ్రుతిః- "నిచాయ్య తం మృత్యుముఖా త్ప్రముచ్యతే"(క.ఉ.3.15) ఇతి. అపి చ పరప్రతిషేధేన కాష్ఠాశబ్దేన చ పురుష విషయ మాదరం దర్శయన్ పురుషప్రతిపత్త్యర్థైవ పూర్వాపరప్రవాహోక్తిరితి దర్శయతి-అధ్యానాయేతి. ఆధ్యానపూర్వకాయ సమ్యగ్దర్శనాయేత్యర్థః. సమ్యగ్దర్శనార్థమేవ హీహాధ్యానముపదిశ్యతే న త్వాధ్యానమేవ స్వప్రధానమ్. 14.

## బాలానందిని

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాం వీటి అన్నింటికంటె పరుడుగా పురుషుడే ప్రతిపాదించబడుచున్నాడు గాన మిగిలినవాటిని ఒక్కొక్క దానిని పరంగా చెప్పడం యుక్తం కాదు. ఇతరమైనవాటిని పరములుగా గ్రహించడంవల్ల ప్రయోజనం ఏమీ కనబడడంలేదు, చెప్పబడలేదు. సకలానర్థసముదాయాలకు అతీతుడైన పురుషుడు ఇంద్రియాదులకంటె పరుడుగా తెలియబడిన ట్లయితే మాత్రం మోక్షసిద్ధిరూపమైన ప్రయోజనం కనబడుతున్నది. "నిచాయ్య తం మృత్యుముఖాత్ప్రముచ్యతే" అని శ్రుతి

చెప్పుచున్నది. మరొక విషయ మేమనగా -(పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః" అని) పురుషునికంటె పరమైనది లేదని చెపుతూ కాష్ఠాశబ్దంచేత పురుషుణ్ణి గూర్చిన ఆదరాన్ని చూపుతూ (దీనికంటె ఇది పరమైనది, దీనికంటె ఇది పరమైనది అని అంటూ)పూర్వాపరప్రవాహాన్ని చెప్పడం పురుషుణ్ణి తెలుసుకొనడంకోసమే ఉద్దిష్ట మైనదని చూపుచున్నాడు. ఆధ్యానాయ అనగా ధ్యానపూర్వకమైన సమ్యగ్జ్ఞానంకొరకు అని అర్థం. ఇక్కడ ఈ ఆధ్యానం (ఆ యా వస్తువులు పరమైనవి అని ధ్యానించడం) సమ్యగ్దర్శనంకోసం చెప్పబడుచున్నది. అంతే కాని ఆధ్యానమే స్వతంత్రంగా ప్రధానం కాదు. 14.

## సూ. ఆత్మశబ్దాచ్చ. 3.3.15

ఇతశ్చ పురుష ప్రతిపత్త్యర్థైవేయమిన్ద్రియాదిప్రవాహోక్తిః, యత్కారణమ్-

"ఏష సర్వేషు భూతేషు గూఢోఽత్మా న ప్రకాశతే,

దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః"(క.ఉ,3-12)

ఇతి ప్రకృతం పురుషమాత్మేత్యాహ. అతశ్చానాత్మత్వమితరేషాం వివక్షితమితి గమ్యతే. తస్యైవ చ దుర్విజ్ఞానతాం సంస్కృతమతిగమ్యతాం చ దర్శయతి. తద్విజ్ఞానాయైవ చ "యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞః" (క.ఉ. 3.13) ఇత్యాధ్యానం విదధాతి. తద్వ్యాఖ్యాతమ్-"ఆనుమానికమప్యేకేషామ్"(బ్ర.సూ.1.4.1) ఇత్యత్ర. ఏవమనేకప్రకార ఆశయాతిశయః శ్రుతేః పురుషే లక్ష్యతే నేతరేషు. అపి చ "సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్" (క.ఉ.3.9) ఇత్యుక్తే కిం తదధ్వనః పారంవిష్ణోః పదమిత్యస్యామాకాఙ్క్షాయామిన్ద్రియాద్యనుక్రమణాత్ పరమపదప్రతిపత్త్యర్థ ఏవాయమాయాస ఇత్యవసీయతే. 15.

### బాలానందిని

ఆత్మేతి :- "ఆత్మశబ్దాచ్చ=ఇక్కడ ఆత్మశబ్దం ఉండడంవల్ల కూడ పురుషుడే తెలియదగినవాడు" అని సూత్రార్థం.

ఇతశ్చేతి :- ఈ కారణంవల్ల కూడ ఈ ఇంద్రియాదిప్రవాహవచనం పురుషుణ్ణి

తెలుసుకొనడంకొరకే. ఎందువల్ల ననగా-"ఏష...సూక్ష్మదర్శిభిః" అని ప్రకృతు డైన పురుషుడు ఆత్మ అని చెపుతున్నది. దీనిని పట్టి మిగిలిన వన్నీ అనాత్మ లని చెప్పడం ఉద్దేశ్య మని తెలుస్తూన్నది. ఆ ఆత్మయే తెలియడానికి చాలకష్టమైన దనీ, సంస్కృత మైన బుద్ధికలవారిచేత మాత్రమే తెలియదగిన దనీ చెపుతున్నది. దానిని తెలుసుకొనడానికే "యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞః" అని ఆధ్యానాన్ని విధిస్తూన్నది. ఈ విషయం "అనుమానికమప్యేకేషామ్" ఇత్యాదిసూత్రంలో వివరించబడింది. ఈ విధంగా శ్రుతియొక్క అనేకవిధాలైన అభిప్రాయం పురుషుని విషయంలోనే ఉన్న దని తెలుస్తూన్నది గాని ఇతరుల విషయంలో తెలియడం లేదు. మరొక విషయ మేమనగా-"సోఽధ్వనః....పదమ్' అనగా అధ్వయొక్క పారమైన విష్ణువుయొక్క ఆ పరమపదం ఏది అనే ఆకాంక్ష కలగగా ఇంద్రియాదులతో ఉపక్రమించిన ఈ ప్రయాస అంతా ఆ పరమపదాన్ని తెలుసుకొనడంకొరకే అని నిర్ణయించబడుచున్నది. 15

ఆధ్యానాధికరణం సమాప్తం

## 8. ఆత్మగృహీత్యధికరణమ్. సూ. 16 - 17

### సూ. ఆత్మగృహీతిరితరవదుత్తరాత్. 3.3.16.

తైత్తిరీయకే శ్రూయతే- "ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీన్నాన్యత్కించన మిషత్స ఈక్షత లోకాన్ను సృజా ఇతి" (ఐ.ఉ.1.1)." స ఇమాన్ లోకానసృజత అమ్భోర్మరీచీర్మరమాపః" (ఐ.ఉ.1.2)ఇత్యాది. తత్ర సంశయః-కిం పర ఏవాత్మా ఇహాత్మశబ్దేనాభిలప్యత ఉతాన్యః కశ్చిదితి. కిం తావత్ప్రాప్తమ్? న పరమాత్మేహాత్మశబ్దాభిలాప్యో భవితుమర్హతీతి. కస్మాత్? వాక్యాన్వయదర్శనాత్. నను వాక్యాన్వయః సుతరాం పరమాత్మవిషయో దృశ్యతే, ప్రాగుత్పత్తేరాత్మైకత్వావధారణాత్, ఈక్షణపూర్వకస్రష్టృత్వవచనాచ్చ. నేత్యుచ్యతే లోకసృష్టివచనాత్. పరమాత్మని హి స్రష్టరి పరిగృహ్యమాణే మహాభూతసృష్టిరాదౌ వక్తవ్యా, లోకసృష్టిస్త్విహాదావుచ్యతే, లోకాశ్చ మహాభూతసంనివేశవిశేషాః. తథా చామ్భః ప్రభృతీన్ లోకత్వేనైవ నిర్బ్రవీతి-"అదోఽమ్భః పరేణ దివమ్" (తై.ఉ.1.2) ఇత్యాదినా.

లోకసృష్టిశ్చ పరమేశ్వరాధిష్ఠితేనాపరేణ కేన చిదీశ్వరేణ క్రియత ఇతి శ్రుతిస్మృత్యోరుపలభ్యతే. తథాహి శ్రుతిర్భవతి- "ఆత్మైవేదమగ్ర ఆసీత్పురుషవిధః" (బృ.ఉ.1.4.1) ఇత్యాద్యా. స్మృతిరపి-

"స వై శరీరీ ప్రథమః స వై పురుష ఉచ్యతే,

ఆదికర్తా స భూతానాం బ్రహ్మాగ్రే సమవర్తత" ఇతి

ఐతరేయిణోఽపి "అథాతో రేతసః సృష్టిః, ప్రజాపతే రేతో దేవాః" ఇత్యత్ర పూర్వస్మిన్ ప్రకరణే ప్రజాపతికర్తృకాం విచిత్రాం సృష్టి మామనన్తి. ఆత్మ శబ్దోఽపి తస్మిన్ ప్రయుజ్యమానో దృశ్యతే- "ఆత్మైవేదమగ్ర ఆసీత్పురుషవిధః" (బృ.ఉ.1.4.1) ఇత్యత్ర. ఏకత్వావధారణమపి తస్య ప్రాగుత్పత్తేః స్వవికారాపేక్షముపపద్యతే. ఈక్షణమపి తస్య చేతనత్వాభ్యుపగమాదుపపన్నమ్. అపి చ "తాభ్యో గామాన యత్తాభ్యోఽశ్వమానయత్తాభ్యః పురుషమానయత్తా అబ్రువన్" ఇత్యేవంజాతీయకో భూయాన్ వ్యాపారవిశేషః లౌకికేషు విశేషవత్సు ఆత్మసు ప్రసిద్ధ ఇహానుగమ్యతే. తస్మాద్విశేషవానేవ కశ్చిదాత్మా స్యాదితి.

బాలానందిని

**ఆత్మేతి.**- "ఆత్మగృహీతిః=(ఆత్మశబ్దంచేత) పరమాత్మకే గ్రహణం. ఇతరవత్=ఇతరవాక్యాలలో వలె. ఉత్తరాత్ తరవాత వచ్చే వాక్యంవల్ల" అని సూత్రార్థం.

ఐతరేయక ఇతి :- ఐతరేయకంలో "ఆత్మా...సృజా" "స ఇమాన్....అపః" ఇత్యాది వాక్యం వినబడుచున్నది. (ప్రారంభంలో ఇదంతా ఒక్క ఆత్మమాత్రమే ఉండేది. మరొకటి ఏదీ చలించలేదు. నేను లోకాలను సృష్టిస్తాను అని అది ఆలోచించింది. అది స్వర్గాన్ని, అంతరిక్షలోకాన్ని, మర్త్యలోకాన్ని, పాతాలలోకాన్ని-ఈ లోకాలను సృజించినది అని ఈ వాక్యాల అర్థం). ఇక్కడ ఆత్మ శబ్దంచేత పరమాత్మయే చెప్పబడుచున్నాడా లేక మరొక రెవరైన చెప్పబడుచున్నాడా అని సంశయం. ఏమి ప్రాప్తించింది? ఇక్కడ ఆత్మశబ్దంచేత చెప్పబడేవాడు పరమాత్మ కాజాలడని ప్రాప్తించింది. ఎందువల్ల? వాక్యాన్వయం ఆ విధంగా కనబడడంవల్ల (ప్రశ్న). ఉత్పత్తికిపూర్వం ఒక్కడే ఉన్నాడు అని చెప్పడంచేత.

ఈక్షణపూర్వకంగా సృష్టించాడని చెప్పడంచేత వాక్యాన్వయం పరమాత్మవిషయంలోనే బాగా కనబడుచున్నది కదా?(సమాధానం)అట్లు కాదంటాం. లోక సృష్టి చెప్పడంవల్ల. పరమాత్మ సృష్టికర్త అని చెపితే ముందుగా మహాభూతసృష్టి చెప్పాలలి. కాని ఇక్కడ లోకాల సృష్టి చెప్పబడుచున్నది. లోకా లనగా మహాభూతాల సంనివేశవిశేషాలు (కూర్పులలోని విశేషాలు,భేదాలు). అందుచేతనే "అదోఽమ్భః పరేణ దివమ్"(ద్యులోకానికి పైన చంద్రునిలోని జలంచేత వ్యాప్తమైన ఏ లోకం ఉన్నదో అది అంభస్)ఇత్యాదివాక్యంచేత అంభస్ మొదలైనవి లోకాలే అని నిర్వచిస్తున్నది. లోకాల సృష్టి పరమేశ్వరునిచేత అధిష్ఠింపబడిన ఒకానొక ఈశ్వరునిచేత (హిరణ్యగర్భునిచేత)చేయబడుతుంది అని శ్రుతులలోను స్మృతులలోను కనబడుతూన్నది. అదెట్లనగా-"ఆత్మైవేదమగ్ర ఆసీత్ పురుషవిధః"(సృష్టికి ప్రారంభంలో నరాకారంలో హిరణ్యగర్భు డుండెను)ఇత్యాదిశ్రుతి ఈ విషయమే చెప్పుచున్నది. అట్లే-"స వై...సమవర్తత" ( ఆ హిరణ్యగర్భుడే మొట్టమొదటి శరీరధారి. అతడే పురుష డని చెప్పబడుచున్నాడు. అతడే ప్రారంభంలో లోకాలను సృజించిన బ్రహ్మదేవుడుగా ఉన్నాడు) అని స్మృతి చెప్పుచున్నది. ఐతరేయులు కూడ వెనుకటి ప్రకరణంలో "అథాతో..దేవాః"(వీని రేతస్సునుండి సృష్టి జరిగినది. దేవతలు ప్రజాపతి యొక్క రేతస్సు అనగా కార్యం) అని విచిత్రమైన సృష్టికి కర్త ప్రజాపతి అని చెప్పుచున్నారు. "ఆత్మైవేదమగ్ర ఆసీత్పురుషవిధః" అనే వాక్యంలో ఆత్మశబ్దం కూడ ఆ ప్రజాపతి విషయంలో ప్రయోగింపబడుచున్నట్లు కనబడుచున్నది. సృష్టికి పూర్వం తన వికారాలను అపేక్షించి ఏకత్వనిశ్చయం కూడ కుదురుతుంది. (సృష్టికి పూర్వం హిరణ్యగర్భు డొక్కడే ఉన్నాడు; పరమేశ్వరుడు, పరమేశ్వరునివల్ల పుట్టిన మహాభూతాదులూ-ఉన్నా కూడ హిరణ్యగర్భునివల్ల పుట్టిన కార్యా లేవీ లేకపోవడంచేత అత డొక్కడే ఉన్నాడు అని చెప్పబడింది అని అర్థం). అతడు చేతను డని అంగీకరించబడింది గాన ఈక్షణం కూడ ఉపపన్నమే. మరియు "తాభ్యో...అబ్రువన్" (వాటికోసం గోవును తీసికొనివచ్చాడు. వాటికోసం అశ్వం తీసికొని వచ్చాడు. వాటికోసం పురుషుణ్ణి తీసికొని వచ్చాడు, అప్పుడు అవి ఇట్లు పలికినవి) ఈ విధంగా శరీరాదివిశేషాలున్న లౌకికములైన ఆత్మలలో ప్రసిద్ధమైన అధికమైన వ్యాపారవిశేషం కూడ ఇక్కడ చెప్పబడుచున్నది. అందువల్ల ఇక్కడ విశేషం (దేహాదికం) గల ఒకానొక పురుషుడే ఆత్మ అయి ఉండాలి.

వి. దేవతాసహితాలైన ఇంద్రియాలను సృష్టించిన తరవాత మాకు భోగం సిద్ధించడానికి తగిన స్థానం ఏదైనా సృష్టించమని అవి స్రష్టను అడిగాయి. అప్పుడు గోవులను అశ్వాలను సృష్టించారు. ఇవి మాకు భోగాయతనంగా చాలవు అని అవి చెప్పగా మనుష్యశరీరం సృష్టించారు. అప్పుడవి అంగీకరించాయి. ఈ విధమైన వ్యాపారం అంతా సశరీరుడైన వానికి కుదురుతుంది గాని అశరీరుడైన పరమాత్మకు కుదరదుగాన ఇక్కడ ఆత్మ అనగా సశరీరుడైన హిరణ్య గర్భుడే అని భావం.

అర్థాదులను కూడ పరత్వం చెపితే "పురుషాన్నపరం" ఇత్యాదివాక్యానికి భేదప్రసంగం కలుగుతుంది గాన వాటికి పరత్వం చెప్పకూడదు అని పై అధికరణంలో నిర్ణయించబడింది. అట్లే "ప్రజాపతే రేతో దేవాః" అనే పూర్వవాక్యంనుండి భేదం కలుగుతుంది గాన ఆత్మా వా ఇత్యాదివాక్యంలోని ఆత్మశబ్దం బ్రహ్మపరంకాదు అని పూర్వపక్షానికి పూర్వాధికరణంతో దృష్టాంతసంగతి. పూర్వపక్షంలో ఈ వాక్యం హిరణ్యగర్భోపాసనాపరం గాన ఆనందాద్యుపసంహారం ఇక్కడ ఉండదు. సిద్ధాంతం ప్రకారం ఉంటుంది.

భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః - పర ఏవాత్మేహాత్మశబ్దేన గృహ్యతే ఇతరవత్. యథా ఇతరేషు సృష్టిశ్రవణేషు "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" (తై.ఉ.2.1.1) ఇత్యేవమాదిషు పరస్యాత్మనో గ్రహణమ్, యథా చేతరస్మిన్ లౌకికాత్మశబ్దప్రయోగే ప్రత్యగాత్మైవ ముఖ్య ఆత్మశబ్దేన గృహ్యతే తథేహాపి భవితుమర్హతి. యత్ర తు "ఆత్మైవేదమగ్ర ఆసీత్"(బృ.ఉ.1.4.1) ఇత్యేవమాదౌ పురుషవిధః ఇత్యేవమాది విశేషణాన్తరం శ్రూయతే భవేత్తత్ర విశేషవత ఆత్మనో గ్రహణమ్. అత్ర పునః పరమాత్మగ్రహణానుగుణమేవ విశేషణమప్యుత్తరముపలభ్యతే- "స ఈక్షత లోకాన్ను సృజా ఇతి" (ఐ.ఉ.1.1) "స ఇమాన్ లోకానసృజత" (ఐ.ఉ.1.2) ఇత్యేవమాది. తస్మాత్తస్యైవ గ్రహణమితి న్యాయ్యమ్. 16.

బాలానందిని

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాము- ఇతరస్థలాలలో వలె ఇక్కడ కూడ

పరమాత్మయే ఆత్మశబ్దంచేత గ్రహింపబడతాడు. "తస్మాద్వా...సంభూతః" ఇత్యాది సృష్టివాక్యాలలో ఏ విధంగా పరమాత్మ యే గ్రహించబడుతుందో, ఇతరమైన లౌకికమైన ఆత్మశబ్దప్రయోగంలో ఆత్మశబ్దంచేత ప్రత్యగాత్మయే (జీవాత్మయే) ఏ విధంగా గ్రహించబడుతుందో అట్లే ఇక్కడ కూడ గ్రహింపబడడం తగి ఉంటుంది. "ఆత్మైవేద మగ్ర ఆసీత్" ఇత్యాదులలో ఎక్కడ పురుషవిధః ఇత్యాదికమైన మరొక విశేషణం వినబడుతుందో అక్కడ విశేషం గల ఆత్మయొక్క గ్రహణం జరుగుతుంది. ఇక్కడైతే - 'స ఈక్షత లోకాన్ను సృజా ఇతి' "స ఇమాన్ లోకానసృజత" ఇత్యాదికమైన పరమాత్మను గ్రహించడానికే అనుగుణమైన విశేషణం తరవాత కనబడుతున్నది. అందువల్ల పరమాత్మనే గ్రహించడం న్యాయ్యం. 16

## సూ. అన్వయాదితి చేత్స్యాదవధారణాత్. 3.3.17

వాక్యాన్వయదర్శనాత్ న పరమాత్మగ్రహణమితి పునర్యదుక్తం తత్పరిహర్తవ్యమితి. అత్రోచ్యతే. స్యాదవధారణాదితి. భవేదుపపన్నం పరమాత్మనో గ్రహణమ్. కస్మాత్? అవధారణాత్. పరమాత్మగ్రహణే హి ప్రాగుత్పత్తేరాత్మైకత్వావ ధారణమాఞ్జసమవకల్పతే. అన్యథా హ్యనాఞ్జసం తత్పరికల్ప్యేత. లోకసృష్టివచనం తు శ్రుత్యన్తరప్రసిద్ధమహాభూతసృష్ట్యనన్తరమితి యోజయిష్యామి. యథా "తత్తేజోఽసృజత" (ఛా.ఉ.6.2.3) ఇత్యేతత్ శ్రుత్యన్తరప్రసిద్ధ వియద్వాయుసృష్ట్యనన్తరమిత్యయూయు జమేవమిహాపి. శ్రుత్యన్తర ప్రసిద్ధో హి సమానవిషయో విశేషః శ్రుత్యన్తరేషూపసంహర్తవ్యో భవతి. యోఽప్యయం వ్యాపారవిశేషానుగమస్తాభ్యో గామానయదిత్యేవమాదిః సోఽపి వివక్షితార్థా వధారణానుగుణ్యేనైవ గ్రహీతవ్యః. న హ్యయం సకలః కథాప్రబన్ధః వివక్షిత ఇతి శక్యతే వక్తుమ్. తత్ప్రతిపత్తౌ పురుషార్థాభావాత్. బ్రహ్మాత్మత్వం త్విహ వివక్షితమ్. తథా హ్యమ్భః ప్రభృతీనాం లోకానాం లోకపాలానాం చాగ్నేయాదీనాం సృష్టిం శిష్ట్వా కరణాని కరణాయతనం చ శరీరముపదిశ్య స ఏవ స్రష్టా "కథం న్విదం మదృతే స్యాత్" (ఐ.ఉ.3.11) ఇతి వీక్ష్యేదం శరీరం ప్రవివేశేతి దర్శయతి- "స ఏతమేవ సీమానం విదార్యైతయా ద్వారా ప్రాపద్యత" (ఐ.ఉ.3.12)ఇతి. పునశ్చ "యది వాచాభివ్యాహృతం యది ప్రాణేనాభిప్రాణితమ్ (ఐ.ఉ.3.11) ఇత్యేవమాదినా

కరణవ్యాపారవివేచనపూర్వకమ్ "అథ కోఽహమ్" (ఐ.ఉ.3.11) ఇతి వీక్ష్య-"స ఏతమేవ పురుషం బ్రహ్మ తతమపశ్యత్" (ఐ.ఉ.1.1.3) ఇతి బ్రహ్మాత్మత్వదర్శన మవధారయతి. తథోపరిష్టాదపి "ఏష బ్రహ్మైష ఇన్ద్రః" (ఐ.ఉ.5.3) ఇత్యాదినా సమస్తభేదజాతం సహ మహాభూతైరనుక్రమ్య "సర్వం తత్ప్రజ్ఞానేత్రం ప్రజ్ఞానే ప్రతిష్ఠితం ప్రజ్ఞానేత్రో లోకః ప్రజ్ఞాప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ" (ఐ.ఉ.5.3) ఇతి బ్రహ్మాత్మత్వదర్శమవ ధారయతి. తస్మాదిహాత్మగృహీతిరిత్యనపవాదమ్.

### బాలానందిని

అన్వయాదితి:- "అన్వయాదితి చేత్=వాక్యాన్వయంవల్ల హిరణ్యగర్భుణ్ణే గ్రహించాలి అన్నట్లయితే-(కాదు)అవధారణాత్="ఏకమేవ" అని నిర్ధారణవల్ల, స్యాత్=పరబ్రహ్మయే అవుతుంది" అని సూత్రార్థం.

వాక్యేతి:-వాక్యాన్వయం కనబడడంవల్ల పరమాత్మను గ్రహించకూడదు అని చెప్పినదానిని పరిహరించాలి. ఈ విషయంలో చెప్పబడుచున్నది-స్యాదవధారణాత్. పరమాత్మను గ్రహించడమే యుక్తం. ఎందువల్ల? అవధారణంవల్ల. ఉత్పత్తికి (సృష్టికి)పూర్వం ఏకత్వాన్ని నిర్ధరిచండం పరమాత్మను గ్రహిస్తేనే కుదురుతుంది. అట్లు కాకపోతే అది అసమంజసం అవుతుంది. ఇక్కడ చెప్పిన లోకసృష్టిని ఇతరశ్రుతులలో ప్రసిద్ధమైన మహాభూతసృష్టి తరవాత జరిగినదానినిగా అన్వయిస్తాను (అనగా ఆ పరమాత్మ ప్రప్రథమంగా లోకాలను సృష్టించాడు అని కాకుండా ప్రప్రథమంగా మహాభూతాలను సృష్టించి తరవాత లోకాలను సృష్టించాడు అని అన్వయిస్తాను అని అర్థం) "తత్తేజోఽసృజత" అనేదానిని ఇతర శ్రుతులలో ప్రసిద్ధమైన వియద్వాయువుల సృష్టి తరవాత తేజస్సును సృష్టించినది అని ఎలా అన్వయించానో అట్లే ఇక్కడ కూడ. ఒక సమానమైన అంశానికి సంబంధించి ఒక శ్రుతిలో చెప్పబడిన విశేషాన్ని మరొక శ్రుతిలో కూడ ఉపసంహరించవలసి ఉంటుంది. "తాభ్యః గామానయత్"ఇత్యాదివ్యాపారవిశేషాల అనుగమం (సంబంధం) కూడ చెప్పదలచిన విషయంయొక్క నిర్ధారణకు అనుగుణంగానే గ్రహించదగినది. (అనగా ఏకత్వ నిర్ధారణను పట్టి ఇక్కడ చెప్పబడిన స్రష్ట పరమేశ్వరుడే అని నిర్ణయించడంచేత ఆ నిర్ణయానికి అనుగుణంగా ముందు మహాభూతాలను సృజించి, తరవాత లోకాలను సృజించి,

తరవాత ఈ పనులన్నీ చేశాడు అని అన్వయించుకోవాలి). ఇక్కడ చెప్పిన ఈ కథాప్రబంధం అంతా చెప్పడానికి ఉద్దిష్ట మైనది అనడానికి వీలులేదు. దీనిని తెలుసుకొనడంవల్ల పురుషార్థం ఏదీ లేదు. ఇక్కడ వివక్షిత మైనది బ్రహ్మాత్మత్వం మాత్రమే. అది ఎట్లనగా- అంభస్ మొదలైన లోకాల సృష్టిని, ఆగ్నేయాదిలోకపాలుల సృష్టినీ చెప్పి, ఇంద్రియాలను, ఇంద్రియాలకు అయతనమైన శరీరాన్ని గూర్చి చెప్పి ఆ స్రష్టయే "కథం న్విదం మదృతే స్యాత్" (నేను లేకుండా ఇది ఎలా ఉంటుంది)అని ఆలోచించి ఈ శరీరంలో ప్రవేశించాడు అని-"స ఏతమేవ...ప్రాపద్యత" అనే వాక్యంచేత చూపుచున్నది.(ఆ పరమాత్మ కేశాంతం దగ్గర ఉన్న బ్రహ్మరంధ్రాన్ని బ్రద్దలు కొట్టి కొని దాని ద్వారా (లింగశరీరంతో)శరీరంలో ప్రవేశించాడు అని ఈ వాక్యానికి అర్థం) తిరిగి (తరవాత)"యది....అభిప్రాణితమ్" (వాగింద్రియం మాటలాడుతూంటే, ప్రాణం ప్రాణనవ్యాపారం చేస్తూంటే)అని ఆ యా కరణాలు చేసే వ్యాపారాన్ని వివేచిస్తూ "అథ కోఽహమ్" (అయితే నే నెవరు) అని ఆలోచించి "స ఏతమేవ...అపశ్యత్" (అతడు సర్వత్రా వ్యాపించి ఉన్న ఈ పురుషుణ్ణే బ్రహ్మగా చూచాడు) అని బ్రహ్మాత్మత్వదర్శనాన్ని నిర్ధరించుచున్నది.

వి. శరీరాన్ని సృష్టించి పరమాత్మయే నేను లేకపోతే ఈ శరీరం ఎలా ఉంటుంది అని ఆలోచించి జీవరూపంలో శరీరంలో ప్రవేశించింది. తరవాత ఆ యా ఇంద్రియాలు వాటి వాటి పనుల చేసికొంటూండడం చూచి అయితే "నేను ఎవరు" అనే ఆలోచనతో ఆ ఇంద్రియాదులకంటె భిన్నంగా త్వంపదార్థాన్ని విడదీసి ఆలోచించి బ్రహ్మయే సర్వవ్యాప్త మైనది అని చూచాడు అని చెప్పడంచేత ఇక్కడ వివక్షితమైన విషయం బ్రహ్మాత్మత్వదర్శనమే అని స్పష్టం అవుతున్నదని భావం.

తథేతి:- అట్లే తరవాత కూడ "ఏష బ్రహ్మైష ఇన్ద్రః" (ఇతడే బ్రహ్మ ఇతడే ఇంద్రుడు) ఇత్యాదివాక్యాలచేత మహాభూతాలతో సహా సమస్తభూతసముదాయాన్నీ అనుక్రమించి (నిర్దేశిస్తూ) ఇదంతా ప్రజ్ఞయే (బ్రహ్మయే) నాయకుడుగా గలది అనగా బ్రహ్మచేతనే నియమించబడుతుంది, బ్రహ్మయందే ప్రతిష్ఠితమైనది, లోకం అంతా ప్రజ్ఞయే (చైతన్యమే)నాయకుడుగా గలది, ప్రజ్ఞయే ప్రతిష్ఠ, ప్రజ్ఞానమే బ్రహ్మ అని బ్రహ్మాత్మత్వదర్శనాన్ని నిర్ధరిస్తూన్నది. అందువల్ల ఇక్కడ ఆత్మగృహీతియే అని చెప్పడంలో అపవాదం (విరోధం) ఏదీ లేదు.

### భాష్యమ్

అపరా యోజనా-ఆత్మగృహీతిరితరవదుత్తరాత్-వాజసనేయకే "కతమ ఆత్మేతి యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యన్తర్జ్యోతిః పురుషః" (బృ.ఉ.4.3.7) ఇత్యాత్మశబ్దేనోపక్రమ్య తస్యైవ సర్వసంగవినిర్ముక్తత్వప్రతిపాదనేన బ్రహ్మాత్మతామవ ధారయతి. తథాహ్యుపసంహరతి-"స వా ఏష మహానజ ఆత్మాఽజరోఽమరోఽమృతోఽభయో బ్రహ్మ" (బృ.ఉ.4.4.25) ఇతి. ఛాన్దోగ్యే తు సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం బ్రహ్మ" ఇత్యన్తరేణైవాత్మశబ్దముపక్రమ్య ఉదర్కే "స ఆత్మా తత్త్వమసి" ఇత్యుపదిశతి. తత్ర సంశయః-తుల్యార్థత్వం కిమనయోరామ్నానయోః స్యాదతుల్యార్థత్వం వేతి. అతుల్యార్థత్వమితి తావత్ప్రాప్తమతుల్యత్వాదామ్నానయోః. న హ్యామ్నాయవైషమ్యే సత్యర్థసామ్యం యుక్తం ప్రతిపత్తుమ్, ఆమ్నానతన్త్రత్వాదర్థపరిగ్రహస్య. వాజసనేయకే చాత్మ శబ్దోపక్రమాదాత్మతత్త్వోపదేశ ఇతి గమ్యతే. ఛాన్దోగ్యే తూ పక్రమవిపర్యయాదుపదేశవిపర్యయః. నను ఛన్దోగానామప్యుదర్కే తాదాత్మ్యోపదేశ ఇత్యుక్తమ్? సత్యముక్తమ్. ఉపక్రమతన్త్రత్వాదుపసంహారస్య తాదాత్మ్యసంపత్తిః సేతి మన్యతే.

### బాలానందిని

అప. పైన చేసిన వాఖ్యానంలో గుణోపసంహారం అస్ఫుటంగా ఉండడంవల్ల పాదసంగతి సరిగా లేదనే అభిప్రాయంతో మరొక వ్యాఖ్య చేస్తున్నారు (రత్నప్రభ). ఇంతవరకు ఈ రెండు సూత్రాలలో ఐతరేయకవాక్యం హిరణ్యగర్భపర మనే శంక నివారించబడి నట్లు వ్యాఖ్యానించి, ఇప్పుడు సద్విద్య ("సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్"ఇత్యాది విద్య) కేవలం సత్త అనే జాతిని మాత్రమే నిర్దేశిస్తుంది అనే శంకను నివారిస్తున్నట్లుగా ఈ సూత్రాలను వ్యాఖ్యానిస్తున్నారు (బ్రహ్మవిద్యాభరణం)-అపరేతి--ఈ సూత్రాలకు మరొక అన్వయం- "ఆత్మగృహీతిరితరవదుత్తరాత్"-వాజసనేయకంలో "కతమ...పురుషః" అని ఆత్మశబ్దంతో ఉపక్రమించి ఆ ఆత్మ సర్వసంగవిముక్తము అని ప్రతిపాదించి అది బ్రహ్మరూపము అని నిర్ధారణ చేస్తున్నాడు. అందుచేతనే-"స వా....బ్రహ్మ" అని ఉపసంహరించాడు. ఛాందోగ్యంలో నైతే-"సదేవ....అద్వితీయమ్" అని ఆత్మశబ్దం ప్రయోగించకుండానే ఉపక్రమించి ఉపసంహారంలో "స ఆత్మా తత్త్వమసి" అని తాదాత్మ్యన్ని ఉపదేశిస్తున్నాడు. ఈ రెండు తుల్యార్థములా లేక భిన్నార్థకములా అని

సంశయం. ఆమ్నానం (చెప్పిన పద్ధతి) తుల్యంగా లేకపోవడంవల్ల ఇవి అతుల్యార్థములే అని ప్రాప్తించినది. ఆమ్నానంలో వైషమ్యం ఉన్నప్పుడు అర్థంలో సామ్యం ఉన్న దని చెప్పడం యుక్తం కాదు కదా? ఎందువల్ల ననగా ఆమ్నానాన్ని పట్టి అర్థం గ్రహించబడుతుంది వాజసనేయకంలో ఆత్మశబ్దంతో ఉపక్రమం చేయడంవల్ల అది ఆత్మతత్త్వోపదేశమే అని తెలుస్తూన్నది. ఛాందోగ్యంలో నైతే ఉపక్రమంలో మార్పు ఉండడంవల్ల ఉపదేశంలో కూడ మార్పు ఉండాలి. (ప్రశ్న) ఛందోగులకు కూడ ఉపసంహారంలో తాదాత్మ్యోపదేశం ఉన్న దని చెప్పబడింది కదా? (సమాధానం) నిజమే; చెప్పబడింది ఉపసంహారం ఉపక్రమంమీద ఆధారపడి ఉంటుంది గాన ఇది తాదాత్మ్యసంపత్తి అని తెలియబడుతుంది

వి. సచ్ఛబ్దానికి ఉన్నది అని అర్థం. ఈ సత్త (ఉండడం)అనేది ఆత్మకు అనాత్మకూ కూడ సాధారణమే. అందుచేత ఛాందోగ్యంలో సత్త అనే సామాన్యం (జాతి)మీద బ్రహ్మత్వం ఆరోపించి ఉపాసన చెయ్యాలి అని చెప్పబడుతున్నది గాన ఇది సంపదుపాసన (భాష్యంలోని "తాదాత్మ్యసంపత్తిః" అనే దాని అర్థం ఇదే). అంతేనే కాని ఇక్కడ బ్రహ్మాత్మత్వప్రతిపాదనం లేదు. బృహదారణ్యకంలో నైతే నిర్గుణవిద్య ఉపదేశించబడుచున్నది. అందుచేత ఈ రెండు విద్యలలో పరస్పరగుణోపసంహారం లేదని పూర్వపక్షాశయం. వెనుకటి అధికరణంలో వాక్యానికి ఏకవాక్యత్వం అంగీకరించడంవల్ల ఆ వాక్యాలు అర్థాదిపరములు కావని చెప్పి విద్యైకత్వం స్థాపించడింది ఇక్కడ నైతే ఒక చోట ఉపక్రమం ఆత్మశబ్దంతో చేయబడింది, మరొకచోట సత్తాజాతివాచకమైన 'సత్' శబ్దంతో చేయబడింది. అందుచేత ఉపక్రమంలో భేదం ఉండడంవల్ల విద్యాభేదం అని ప్రత్యుదాహరణసంగతి.

## భాష్యమ్

తథా ప్రాప్తేఽభిధీయతే-ఆత్మగృహీతిః "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్" (ఛా.ఉ.6.2.1)ఇత్యత్ర ఛన్దోగానామపి. భవితుమర్హతీతరవత్. యథా "కతమ ఆత్మా" (బృ.ఉ.4.3.7)ఇత్యత్ర వాజసనేయినామాత్మగృహీతిస్తథైవ. కస్మాత్? ఉత్తరాత్తాదాత్మ్యోపదేశాత్. "అన్వయాదితి చేత్స్యాదవధారణాత్"-యదుక్తమ్-ఉపక్రమాన్వయాదుపక్రమే చాత్మశబ్దశ్రవణాభావాన్నాత్మగృహీతిః ఇతి తస్య కః

పరిహార ఇతి చేత్; సోఽభిధీయతే - స్యాదవధారణాదితి. భవేదుపపన్నేహాత్మగృహీతిః, అవధారణాత్. తథాహి-"యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతమ్"(ఛా.ఉ.6.1.1). ఇత్యేకవిజ్ఞానేన సర్వవిజ్ఞానమవధార్య తత్సంపిపాదయిషయా 'సదేవ' ఇత్యాహ. తచ్చాత్మగృహీతౌ సత్యాం సంపద్యతే. అన్యథా హి యో ఽయం ముఖ్య ఆత్మా స న విజ్ఞాత ఇతి నైవ సర్వవిజ్ఞానం సంపద్యేత. తథా ప్రాగుత్పత్తేరేకత్వావధారణం, జీవస్య చాత్మశబ్దేన పరామర్శః, స్వాపావస్థాయాం చ తత్స్వభావసంపత్తికథనం, పరిచోదనాపూర్వకం చ పునః "తత్త్వమసి" (ఛా.ఉ.6.8.7) ఇత్యవధారణమితి చ సర్వమేతత్తాదాత్మ్యప్రతిపాదనాయామేవావకల్పతే న తాదాత్మ్యసంపాదనాయామ్. న చాత్రోపక్రమతన్త్రతోపన్యాసో న్యాయ్యః. న హ్యుపక్రమ ఆత్మత్వసంకీర్తనమనాత్మత్వ సంకీర్తనం వాస్తి. సామాన్యోపక్రమశ్చ న వాక్యశేషగతేన విశేషేణ విరుధ్యతే, విశేషాకాఙ్క్షిత్వాత్సామాన్యస్య. సచ్ఛబ్దార్థోఽపి చ పర్యాలోచ్యమానో న ముఖ్యాదాత్మనో ఽన్యః సంభవతి, అతో ఽన్యస్య వస్తుజాతస్య ఆరమ్భణశబ్దాదిభ్యః అనృతత్వోపపత్తేః. ఆమ్నానవైషమ్యమపి నావశ్యమర్థవైషమ్య మావహతి. ఆహర పాత్రమ్. పాత్రమాహరేత్యేవమాదిష్వర్థసామ్యే ఽపి తద్దర్శనాత్. తస్మాదేవంజాతీయకేషు వాక్యేషు ప్రతిపాదన ప్రకారభేదే ఽపి ప్రతిపాద్యార్థభేద ఇతి సిద్ధమ్. 17.

**బాలానందిని**

తథేది:-ఇట్లు ప్రాప్తించగా చెప్పబడుచున్నది. " సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్" అనే చోట ఛందోగులకు కూడ, ఇతరులకు వలెనే, ఆత్మగ్రహణం చేయడం తగి ఉన్నది. కతమ ఆత్మా అన్నప్పుడు వాజసనేయులకు ఆత్మగ్రహణం ఎట్లో అట్లే. ఎందువల్ల? తరవాత వచ్చిన తాదాత్మ్యోపదేశంవల్ల. అన్వయంవల్ల (వాక్యాన్వయంవల్ల ఆత్మను గ్రహించకూడదు)అన్నట్లయితే, అవధారణం ఉండడంవల్ల ఆత్మనే గ్రహించాలి. ఉపక్రమంయొక్క అన్వయంవల్ల, ఉపక్రమంలో (సచ్ఛబ్దమే కాని) ఆత్మశబ్దం వినబడకపోవడంవల్ల ఆత్మను గ్రహించకూడదు అని చెప్పినదానికి పరిహారం ఏమిటి అన్నట్లయితే అది (పరిహారం) 'అవధారణాత్' అని చెప్పబడుచున్నది. ఇక్కడ అవధారణం ఉండడంవల్ల ఆత్మగ్రహణం జరగవచ్చును. అదెట్లనగా-"యేన......విజ్ఞాతమ్" అని

ఏకవిజ్ఞానంచేత సర్వవిజ్ఞానాన్ని నిర్ధారణచేసి దానిని సంపాదించా లనే అభిప్రాయంతో "సదేవ" అని అంటున్నాడు. అది (సర్వవిజ్ఞానం)ఆత్మను గ్రహిస్తేనే కుదురుతుంది. అట్లు కాకపోతే ముఖ్యమైన ఆత్మ తెలియబడనేలేదు గాన సర్వవిజ్ఞానం కుదరదు. అట్లే సృష్టికి పూర్వం ఏకత్వాన్ని నిర్ధారణ చేయడం, ("అనేన జీవేనాత్మనా" అని)జీవుణ్ణి ఆత్మ శబ్దంచేత పరామర్శించడం, సుషుప్త్యవస్థలో జీవుడు సత్తుతో సంపన్ను డవుతాడని చెప్పడం, ప్రశ్నపూర్వకంగా మాటి మాటికి "తత్త్వమసి" అని (తొమ్మిది సార్లు) నిర్ధారణ చేయడం ఇదంతా కూడ తాదాత్మ్యాన్ని (జీవునకు సత్పదవాచ్యమైన ఆత్మకు అభేదాన్ని)ప్రతిపాదిస్తేనే ఉపపన్నం అవుతుంది. తాదాత్మ్యాన్ని సంపాదించడానికి (అనగా సత్తను బ్రహ్మగా భావించాలి అని సంపదుపాసనను చెప్పడానికి) ఉపపన్నం కాదు. ఉపక్రమాన్ని పట్టి ఉపసంహారాన్ని సమన్వయించుకోవాలి అని చెప్పడం ఇక్కడ యుక్తం కాదు. ఉపక్రమంలో ఆత్మత్వసంకీర్తనం కాని, అనాత్మత్వసంకీర్తనం కాని లేదు కదా? సామాన్యం విశేషాన్ని ఆకాంక్షిస్తూంటుంది గాన సామాన్యంతో ఉపక్రమించినా కూడ అది వాక్యశేషంలో ఉన్న విశేషానికి విరుద్ధం కాదు. (ఉపక్రమంలో సత్తకు ఆశ్రయమైన ఒక సామాన్యాన్ని నిర్దేశించగా ఆ సత్తకు ఆశ్రయమైనది ఏది అని ఆకాంక్ష కలిగి నపుడు అది ఆత్మ అని చెప్పబడుచున్నది. దీనిలో పరస్పరవిరోధం ఏముంది అని భావం). మరొక విషయ మేమనగా- జాగర్తగా పరిశీలిస్తే ముఖ్యమైన ఆత్మకంటె భిన్నమైనది ఏదీ కూడ సచ్ఛబ్దార్థం అవడానికి వీలు లేదు. ఎందువల్ల ననగా ఆత్మకంటె భిన్నమైన సమస్తవస్తుసముదాయమూ కూడ అనృతమే (మిథ్యయే)అని ఆరంభణశబ్దాదులచేత నిశ్చయింపబడింది. ఆమ్నానంలో వైషమ్యం (తేడా)తప్పకుండా అర్థంలో వైషమ్యాన్ని కలిగించా లనే మాట లేదు. అర్థం ఒకటే అయినా "ఆహర పాత్రమ్" (తీసికొనిరా పాత్రను) "పాత్రమాహర"(పాత్ర తీసికొనిరా) ఇత్యాదులలో ఆమ్నానవైషమ్యం కనబడుచున్నది కదా? అందువల్ల ఈ విధమైన వాక్యాలు ప్రతిపాదించే ప్రకారంలో భేదం ఉన్నా కూడ ప్రతిపాదించబడే అర్థం మాత్రం ఒక్కటే అని నిశ్చితం. 17.

ఆత్మగృహీత్యధికరణం సమాప్తం

### 4. 9. కార్యాఖ్యానాధికరణమ్. సూ.18

### ★ సూ. కార్యాఖ్యానాదపూర్వమ్. 3.3.18

ఛన్దోగా వాజసనేయినశ్చ ప్రాణసంవాదే శ్వాదిమర్యాదం ప్రాణస్యాన్న మామ్నాయ తస్యైవాపో వాస ఆమనన్తి. అనన్తరం చ ఛన్దోగా ఆమనన్తి - "తస్మాద్వా ఏతదశిష్యన్తః పురస్తాచ్చోపరిష్టాచ్చాద్భిః పరిదధతి" (ఛా.ఉ.5.2.2) ఇతి. వాజసనేయినస్త్వామనన్తి-"తద్విద్వాంసః శ్రోత్రియా అశిష్యన్త ఆచామన్త్యశిత్వా చాచామన్త్యేతమేవ తదనమనగ్నం కుర్వన్తో మన్యన్తే" (బృ.ఉ.6.1.14) "తస్మాదేవంవిదశిష్యన్నాచామేదశిత్వా చాచామేదేతమేవ తదనమనగ్నం కురుతే" ఇతి. తత్ర త్వాచమనమనగ్నతాచిన్తనం చ ప్రాణస్య ప్రతీయతే. తత్కిము భయమపి విధీయతే ఉత ఆచమనమేవ, ఉతానగ్నతాచిన్తనమేవేతి విచార్యతే. కిం తావత్ప్రాప్తమ్? ఉభయమపి విధీయత ఇతి. కుతః? ఉభయస్యాప్యవగమ్య మానత్వాత్. ఉభయమపి చైతదపూర్వత్వాద్విధ్యర్హమ్. అథవాఽఽచమనమేవ విధీయతే. విస్పష్టా హి తస్మిన్విధివిభక్తిః "తస్మాదేవం విదశిష్యన్నాచామే దశిత్వాచాఽఽచామేత్" ఇతి. తస్యైవ చ స్తుత్యర్థమనగ్నతాసంకీర్తనమితి.

#### బాలానందిని

కార్యేతి:- "కార్యాఖ్యానాత్=పవిత్రత్వంకొరకు చేయదగిన ఆచమనాన్నే చెప్పడం వల్ల అది విధేయం కాదు. అపూర్వమ్=క్రొత్త దైన ఉదకమే ప్రాణానికి వస్త్రము అను చింతనమే విధేయం" అని సూత్రార్థం.

ఛన్దోగా ఇతి :- ప్రాణసంవాదంలో ఛందోగులు వాజసనేయులూ కూడ కుక్కల వరకు ఉన్నదానిని అంతనూ ప్రాణానికి అన్నంగా చెప్పి దానికే (ప్రాణనికే) ఉదకాన్ని వస్త్రంగా చెప్పుచున్నారు. (నాకు అన్నం ఏది, వస్త్రం ఏది అని ప్రాణం వాగాదులను అడుగగా కుక్కల వరకు క్రిముల వరకు సర్వప్రాణులచేత భుజించబడే అన్నమే నీకు అన్నం, ఉదకం వస్త్రం అని అవి చెప్పాయి). తరవాత ఛందోగులు-"తస్మాద్వా....పరిదధతి" (అందువల్లనే తినబోయేవాళ్లు ముందుగాను తరవాత కూడ దానిని ఉదకంచేత

కప్పుచున్నారు) అని పఠిస్తున్నారు. వాజసనేయులైతే-"తద్విద్వాంసః.....మన్యన్తే"(అందువల్లనే విద్వాంసు లైన శ్రోత్రియులు భుజింపబోతూ ఆచమనం చేస్తారు. భుజించిన తరవాత కూడ ఆచమనం చేస్తారు. ఈ విధంగా ఆ ప్రాణాన్ని నగ్నం కానిదానినిగా చేస్తున్నట్లు భావిస్తున్నారు) అని పఠిస్తున్నారు. "తస్మాదేవం...కురుతే" (అందువల్ల ఇట్లు తెలుసుకొన్నవాడు తినబోతూ ఆచమనం చెయ్యాలి. తిన్న తరవాత కూడ ఆచమనం చెయ్యాలి. ఈ విధంగా ఈ ప్రాణాన్ని అనగ్నంగా చేస్తున్నాడు)అని కూడ పఠిస్తున్నారు ఇక్కడ ఆచమనము, అనగ్నతాచింతనమూ కూడ కనబడుచున్నది. అయితే ఇక్కడ ఉభయమూ విధించబడుచున్నదా, లేక ఆచమనం మాత్రమే విధించబడుచున్నదా, లేక అనగ్నతాచింతనం మాత్రమే విధించబడుచున్నదా అని విచారించబడుచున్నది. ఏమి తేలింది? ఉభయమూ విధించబడుచున్న దని తేలింది. ఎందువల్ల? ఉభయమూ తెలియబడడంవల్ల. క్రొత్తగా చెప్పబడుచున్నది. క్రొత్తగా చెప్పబడుచున్నది గాన ఉభయమూ కూడ విధించతగినదే కదా? లేదా ఆచమనం మాత్రమే విధించబడుచున్నది. ఎందువల్లననగా - "ఏవంవిదశిష్యన్నాచామేత్ అశిత్వా చాచామేత్" అని విధివాచకపదం స్పష్టంగా వినబడుచున్నది. దానిని స్తుతించడానికే అనగ్నతాసంకీర్తనం.

వి. సందిగ్ధంగా ఉన్న సదుపక్రమంలో వాక్యశేషంచేత ఈ సత్ ఆత్మయే అని నిర్ణయించినట్లు 'ఆచామన్తి' అనే పదం విధివాచకమా కాదా అని సందేహం కలిగినప్పుడు "ఆచామేత్" అని వాక్యశేషంలో ఉండడంవల్ల విధినిగా నిర్ణయించాలి అని దృష్టాంతసంగతి చేత పూర్వపక్షం. ప్రాణవిద్యకు అంగంగా అపూర్వమైన ఆచమనం విధించబడింది గాన దానిని ఇతరస్థలాలలో కూడ ఉపసంహరించాలి అని పూర్వపక్షఫలం. అది విధేయం కాదు గాన దానిని అంగంగా ఉపసంహరించవలసిన పని లేదు అని సిద్ధాంతఫలం.

### భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః- నాచమనస్య విధేయత్వముపపద్యతే, కార్యాఖ్యానాత్. ప్రాప్తమేవ హీదం కార్యత్వేనాచమనం ప్రాయత్యార్థం స్మృతిప్రసిద్ధమన్వాఖ్యాయతే నన్వియం శ్రుతిస్తస్యాః స్మృతేః మూలం స్యాత్? నేత్యుచ్యతే; విషయనానాత్వాత్. సామాన్యవిషయా హి స్మృతిః పురుషమాత్రసంబద్ధం ప్రాయత్యార్థమాచమనం

ప్రాపయతి. శ్రుతిస్తు ప్రాణవిద్యాప్రకరణపఠితా తద్విష యమేవాచమనం విదధతీ విదధ్యాత్. న చ భిన్నవిషయయోః శ్రుతిస్మృత్యోః మూలమూలి భావో ఽవకల్పతే. న చేయం శ్రుతిః ప్రాణవిద్యాసంయోగ్యాచమనం విధాస్యతీతి శక్యమాశ్రయితుమ్; పూర్వస్యైవ పురుషమాత్రసంయోగిన ఆచమనస్యేహ ప్రత్యభిజ్ఞాయమానత్వాత్. అత ఏవ చ నోభయవిధానమ్. ఉభయవిధానే చ వాక్యం భిద్యేత. తస్మాత్ప్రాప్తమేవాశి శిషతామశితవతాం చోభయత ఆచమనమనూద్య "ఏతమేవ తదనగ్నం కుర్వన్తో మన్యన్తే" (బృ.ఉ.6.1.14)ఇతి ప్రాణస్యానగ్నతాకరణసంకల్పో ఽనేన వాక్యేనాచ మనీయాస్వప్సు ప్రాణవిద్యాసంబన్ధిత్వేనాపూర్వ ఉపదిశ్యతే. న చాయమనగ్నతావాద ఆచమనస్తుత్యర్థ ఇతి న్యాయ్యమ్; ఆచమనస్యావిధేయత్వాత్. స్వయం చానగ్నతా సంకల్పస్య విధేయత్వప్రతీతేః. న చైవం సత్యేకస్యాచమనస్యోభయార్థతాభ్యుపగతా భవతి, ప్రాయత్యార్థతా పరిధానార్థ తా చేతి; క్రియాన్తరత్వాభ్యుపగమాత్. క్రియాన్తరమేవ హ్యాచమనం నామ ప్రాయత్యార్థం పురుషస్యాభ్యుపగమ్యతే. తదీయాసు త్వప్సు వాసఃసంకల్పనం నామ క్రియాన్తరమేవ పరిధానార్థం ప్రాణస్యాభ్యుగమ్యత ఇత్యనవద్యమ్.

బాలానందిని

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాం. ఆచమనానికి విధేయత్వం ఉపపన్నం కాదు; కార్యాఖ్యానంవల్ల. పవిత్రత్వంకొరకై చేయదగినదిగా ప్రాప్తించిన (చెప్పబడిన) స్మృతిప్రసిద్ధమైన ఆచమనమే అనువదించబడుచున్నది. (ప్రశ్న)-ఈ శ్రుతియే ఆ స్మృతికి మూలం కావచ్చును కదా? (సమాధానం)కాదంటాం. ఎందువల్ల ననగా విషయభేదం ఉన్నది. సామాన్య విషయమైన (అన్ని కర్మలలోను ఆచమనాన్ని విధించే) ("ద్విజో నిత్యముప స్పృశేదపః"ఇత్యాది) స్మృతి పవిత్రత్వంకొరకై ప్రతిపురుషునకు సంబంధించిన ఆచమనాన్ని విధిస్తున్నది. ప్రాణవిద్యాప్రకరణంలో పఠించబడి ఆచమనాన్ని విధిస్తున్న శ్రుతి యైతే ఆ ప్రాణవిద్యకు సంబంధించిన ఆచమనాన్ని మాత్రమే విధించగలదు. వేరు వేరు విషయాలు గల శ్రుతిస్మృతులకు మూలమూలి భావం(ఈ శ్రుతి మూలం, ఆ స్మృతి మూలి అని చెప్పడం) కుదరదు. పోనీ ఈ శ్రుతి ప్రాణవిద్యకు సంబంధించిన ఆచమనాన్ని

క్రొత్తగా విధిస్తున్నది అని చెప్పడానికి కూడ శక్యం కాదు. ఎందువల్లననగా వెనుక చెప్పిన ప్రతిపురుషుడూ చేయదగిన (స్మృత్యుక్తమైన) ఆచమనమే ఇక్కడ గుర్తించబడుతున్నది. (ఆ స్మృతికి మూలమైన మరొక శ్రుతి ఉండి ఉంటుందని ఊహించుకోవాలని భావం). అందుచేతనే ఉభయవిధానం కూడ కుదరదు. ఉభయవిధానం అంగీకరించే పక్షంలో వాక్యభేదదోషం కలుగుతుంది. అందువల్ల తినదలచుకున్నవాళ్లకి, తిన్నవాళ్లకీ స్మృతిప్రాప్తమైన ఆచమనాన్నే అనువదిస్తూ "ఏతమేవ...మన్యన్తే" అనే వాక్యం. ఆచమనం చేయదగిన ఉదకంలో, ప్రాణవిద్యకు సంబంధించి, అపూర్వమైన ప్రాణానగ్నతాకరణసంకల్పాన్ని ఉపదేశిస్తున్నది. ఈ అనగ్నతావాదం ఆచమనస్తుతి కోసం చేయబడు చున్నది అనడం న్యాయ్యం కాదు. ఆచమనం విధేయం కాదు కదా? (దేనినైనా విధిస్తేనే)దానిని స్తుతించడం జరుగుతుంది). స్వయంగా అనగ్నతాసంకల్పమే (క్రొత్తది గాన)విధేయం అని తెలుస్తున్నది. (విధేయ మైనది స్తావకం కాకూడదు). అయితే-ఒకే ఆచమనం పవిత్రత్వంకొరకు, పరిధానీయత్వంకొరకు చేయబడుతున్నది గాన దానికి ఉభయార్థత్వం అంగీకరించి నట్లు అవుతుంది కదా అని శంకించవలసిన పనిలేదు. ఎందువల్ల ననగా- అది (ఆచమనం) (పవిత్రత్వం కొరకు చేసే) మరొక క్రియ అని అంగీకరించబడింది. అయితే ఆచమనానికి ఉపయోగించిన జలాన్ని ప్రాణం ధరించడంకోసం ఉపయోగించే వస్త్రంగా సంకల్పించడం అనే మరొక క్రియ అంగీకరించబడుచున్నది గాన ఏ దోషమూ లేదు.

## భాష్యమ్

అపి చ "యదిదం కిం చాశ్వభ్య: ఆ కృమిభ్య ఆ కీటపతంగేభ్యస్తత్తేఽన్నమ్" (బృ.ఉ.6.1.14) ఇత్యత్ర తావన్న సర్వాన్నాభ్యవహారశ్చోద్యత ఇతి శక్యం వక్తుమ్; అశబ్దత్వాదశక్యత్వాచ్చ. సర్వం తు ప్రాణస్యాన్నమితీయమన్నదృష్టిశ్చోద్యతే. తత్సాహచర్యాచ్చాపో వాస ఇత్యత్రాపి నాపామాచమనం చోద్యతే. ప్రసిద్ధాస్వేవ త్వాచమనీయాస్వప్సు పరిధానదృష్టిశ్చోద్యత ఇతి యుక్తమ్. న హ్యర్థవైశసం సంభవతి. అపి చాచామన్తీతి వర్తమానాపదేశిత్వాన్నాయం శబ్దో విధిక్షమః. నను మన్యన్త ఇత్యత్రాపి సమానం వర్తమానాపదేశిత్వమ్? సత్యమేవ తత్.

అవశ్యవిధేయే త్వన్యతరస్మిన్వాసః కార్యాఖ్యానాదపాం వాసఃసంకల్పనమేవా పూర్వం విధీయతే,నాచమనమ్; పూర్వవద్ధి తత్ ఇత్యుపపాదితమ్. యదప్యుక్తం- విస్పష్టే చాచమనే విధివిభక్తిరితి, తదపి పూర్వవత్త్వేనైవాచమనస్య ప్రత్యుక్తమ్. అత ఏవాచమనస్యావిధిత్సితత్వాదేతమేవ తదనమనగ్నం కుర్వన్తో మన్యన్త ఇత్యత్రైవ కాణ్వాః పర్యవస్యన్తి: నామనన్తి తస్మాదేవంవిదిత్యాది. తస్మాన్మాధ్యంది నానామపి పాఠే అచమనానువాదేనైవంవిత్త్వమేవ ప్రకృతప్రాణవాసోవిత్త్వం విధీయతే ఇతి ప్రతిపత్తవ్యమ్. యోఽప్యయమభ్యుపగమః క్వచిదాచమనం విధీయతాం క్వచిద్వాసో విజ్ఞానమితి సోఽపి న సాధుః. ఆపో వాస ఇత్యాదికాయా వాక్యప్రవృత్తేః సర్వత్రైకరూపాత్వాత్. తస్మాద్వాసోవిజ్ఞానమేవేహ విధీయతే నాచమనమితి న్యాయ్యమ్. 18.

బాలానందిని

అపి చేతి :- మరొక విషయమేమనగా-"యదిదం....తేఽన్నమ్" అనే చోట సర్వాన్నభక్షణం విధించబడుచున్నది(అనగా ఉపాసకుడు శ్వకీటకాద్యన్నాన్ని భక్షించాలని విధించబడుచున్నది) అనడం కుదరదు. ఎందుచేత ననగా అలా విధించే శబ్దం ఏదీ లేదు. ఇది శక్యం కూడ కాదు. అందుచేత ఆ వాక్యం సర్వమూ ప్రాణానికి అహారమే అను దృష్టిని (భావనను)విధిస్తూన్నది. దానితో సాహచర్యంవలన ఉదకాచమనం విధింపబడడంలేదు, ప్రసిద్ధమైన (శాస్త్రాంతరంచేత ప్రాప్తమైన) అచమనం చేసే ఉదకం విషయంలో పరిధానదృష్టి విధించబడుతున్నది అని చెప్పడమే యుక్తం . సగం చంపడం యుక్తం కాదు కదా.

వి. "యదిదం కిం చ" ఇత్యాది వాక్యంలో శ్వకీటకాదికం ఉపాసకునికి అహారంగా విధించబడుచున్నది అని చెప్పడం కుదరదు గాన సర్వమూ ప్రాణానికి అన్నమే అని ధ్యానం చెయ్యాలి అని ధ్యానం ప్రాణవిద్యాంగంగా ఉపదేశించబడుతున్నది అని చెప్పాలి. దాని ప్రక్కనే చెప్పిన ఈ వాక్యంలో కూడ అనగ్నతాకరణధ్యానమే విధించబడుతుం దని చెప్పడం న్యాయ్యం కాని అచమనక్రియ చెప్పబడుచున్న దని చెప్పడం న్యాయ్యం కాదు

అని అర్థం. ఒకే ఘట్టంలో ఉన్న వాటిని వేరు వేరు రీతులలో అన్వయిస్తే అది ఒక జంతువును భక్షించడం కోసం సగం ఖండించి నట్లు అవుతుం దని భావం.

అపి చేతి:- మరొక విషయ మేమనగా-'ఆచామన్తి' అనే పదం వర్తమానార్థాన్ని బోధిస్తుంది గాన ఇది విధిని బోధించడానికి సమర్థం కాదు. మన్యన్తే అన్నప్పుడు కూడ వర్తమానార్థాన్ని చెప్పడం సమానమే కదా? ఆ మాట నిజమే. అయితే (అచమన-వాసఃసంకల్పాలలో)ఏదో ఒకదానిని తప్పకుండా విధించవలసి ఉన్నప్పుడు ఉదకం వాసఃకార్యాన్ని చేస్తూన్నది అని చెప్పడంచేత అపూర్వమైన (పూర్వం, అనగా దేనిచేతా విధింపబడని) వాసఃసంకల్పాన్నే విధించడం యుక్తం. ఆచమనం పూర్వవత్ (పూర్వమే పావనత్వోపాయంగా విధించబడినది) అని (పైన)ఉపపాదించబడింది. ఆచమనం విషయంలో విధివాచకపదం స్పష్టంగా ఉన్నది అని ఏది చెప్పబడిందో అది కూడ ఆచమనం పూర్వవత్ అవడంచేతనే నిరాకృతమైనది. (అనగా ఒక వాక్యంచేత విధించబడినదానినే మళ్లీ మరొకవాక్యంచేత విధించగూడదు గాన విధివాచకశబ్దం కనబడినా కూడ అది అనువాదబోధకయే అని గ్రహించాలి). ఆచమనం విధించడానికి ఉద్దిష్టం కాదు కనకనే కాణ్వులు "తస్మాదేవంవిద్" ఇత్యాదివాక్యాన్ని "ఏతదేవ తదనమనగ్నం కుర్వన్తో మన్యన్తే" అనేచోటనే ఆపివేస్తున్నారు, "తస్మాదేవంవిదశిష్యన్నా చామేదశిత్వా చాచామేత్" అనే వాక్యాన్ని పఠించడం లేదు. అందువల్ల మాధ్యందినుల పాఠంలో కూడ ఏవంవిత్త్వమే, అనగా ప్రకృతమైన ప్రాణవాసోవిత్త్వమే(ఉదకం ప్రాణవాసస్సు అనే విషయమే)విధించబడుచున్న దని గ్రహించాలి. (పాఠబలంవల్ల మాధ్యందినంలో ఆచమనం విధించాలి కాణ్వంలో వాసోవిజ్ఞానం విధించాలి. అని అంగీకరించడం కూడ యుక్తం కాదు. "ఆపో వాసః" ఇత్యాదివాక్యం అంతటా కూడ ఒకే విధంగా ప్రవర్తిస్తూన్నది కదా? అందువల్ల ఇక్కడ వాసోవిజ్ఞానమే విధించబడుతుంది కాని ఆచమనం కాదు అని చెప్పడమే న్యాయ్యం (న్యాయసంగతం,యుక్తి యుక్తం).

కార్యాఖ్యానాధికరణం సమాప్తం

## 10. సమానాధికరణమ్. సూ. 19

### సూ. సమాన ఏవం చాభేదాత్. 3.3.19

వాజసనేయిశాఖాయామగ్నిరహస్యే శాణ్డిల్యనామాఙ్కితా విద్యా విజ్ఞాతా. తత్ర చ గుణాః శ్రూయన్తే-"స ఆత్మానముపాసీత మనోమయం ప్రాణశరీరం భారూపమ్" ఇత్యేవమాదయః. తస్యామేవ శాఖాయాం బృహదారణ్యకే పునః పఠ్యతే "మనోమయోఽయం పురుషో భాః సత్యస్తస్మిన్నన్తర్హృదయే యథా వ్రీహిర్వా యవో వా స ఏష సర్వస్యేశానః సర్వస్యాధిపతిః సర్వమిదం ప్రశాస్తి యదిదం కించ" (బృ.ఉ.5.6.1)ఇతి. తత్ర సంశయః-కిమియమేకా విద్యాగ్నిరహస్యబృహదారణ్యకయోర్గుణోపసంహారశ్చ ఉత ద్వే విద్యే గుణానుపసంహారశ్చేతి. కిం తావత్ప్రాప్తమ్. విద్యాభేదో గుణవ్యవస్థా చేతి. కుతః? పౌనరుక్త్యప్రసంగాత్. భిన్నాసు హి శాఖాస్వధ్యేతృవేదితృభేదాత్ పౌనరుక్త్యపరిహారమాలోచ్య విద్యైకత్వమధ్యవసాయైకత్రాతిరిక్తా గుణా ఇతరత్రోపసంహ్రియన్తే ప్రాణసంవాదాదిష్విత్యుక్తమ్. ఏకస్యాం పునః శాఖాయామధ్యేతృవేదితృభేదాభావాదశక్యపరిహారే పౌనరుక్త్యే న విప్రకృష్టదేశస్థైకా విద్యా భవితుమర్హతి. న చాత్రైకమామ్నానం విద్యావిధానార్థమపరం గుణవిధానార్థమితి విభాగః సంభవతి. తదాహ్యతిరిక్తా ఏవ గుణాః ఇతరేతరత్ర చామ్నాయేరన్న సమానాః. సమానా అపి చోభయత్రామ్నాయన్తే మనోమయత్వాదయః. తస్మాన్నాన్యోన్యగుణోపసంహార ఇతి.

#### బాలానందిని

సమాన ఇతి :- "సమానే చ=సమానమైన శాఖావిశేషంలో కూడ, ఏవం=ఇట్లు గుణోపసలహారం చేయబడుతుంది. అభేదాత్=విద్యలలో భేదం లేదు కదా" అని సూత్రార్థం

వాజసనేయీతి :-వాజసనేయిశాఖలో, అగ్నిరహస్యంలో శాండిల్యవిద్య అనే విద్య

ఉన్నది. దానిలో "స ఆత్మానమ్......భారూపమ్" (అతడు మనోమయుడు, ప్రాణశరీరుడు, కాంతిరూపుడు అయిన ఆత్మను ఉపాసించవలెను)ఇత్యాది గుణాలు చెప్పబడి ఉన్నాయి అదే శాఖలో బృహదారణ్యకంలో "మనోమయో...కించ .(ఈ పురుషుడు మనోమయుడు, కాంతి, సత్యమైనవాడు. హృదయంలో వ్రీహి వలె, యవ వలె ఉన్నాడు, అట్టి ఈ పురుషుడు సర్వమునకు ఈశుడు. సర్వాధిపతి. ఏదైతే ఉన్నదో దాని నంతనీ శాసిస్తున్నాడు) అని మళ్లీ పఠించబడింది. అగ్నిరహస్యబృహదారణ్యకాలలో ఉన్న ఈ విద్య ఒకటేనా, గుణోపసంహారం కూడ చెయ్యాలా, లేకరెండు విద్యలా, గుణోపసంహారం చేయనక్కరలేదా అని సంశయం. ఏమి ప్రాప్తించింది? విద్యాభేదం అని, గుణవ్యవస్థ అనీ (దేని గుణాలు దానికే నని)ప్రాప్తించింది. ఎందువల్ల? పౌనరుక్త్యప్రసంగంవల్ల. శాఖలు వేరైనప్పుడు అధ్యయనం చేసేవాళ్ళు తెలుసుకొనే వాళ్లూ వేరు వేరుగా ఉంటారు గాన పౌనరుక్త్య దోషానికి పరిహారం చూచి (ఒక శాఖలో చెప్పిన విద్యను మరొక శాఖలో చెప్పకపోతే ఆ శాఖ చదవనివానికి అది తెలియదు గాన విద్య ఒకటే అయినా రెండు శాఖలలో చెప్పడంలో పునరుక్తత్వదోషం లేదు అని గ్రహించి), విద్యైకత్వాన్ని నిశ్చయించి ప్రాణసంవాదాదులలో ఒక చోట అధికంగా ఉన్న గుణాలు మరొక చోట ఉపసంహరించబడతాయి అని చెప్పబడింది. ఒక శాఖలో అధ్యేతృవేదితృభేదం ఉండదు గాన (విద్య ఒక్కటే అన్నట్లయితే) పౌనరుక్త్యదోషాన్ని పరిహరించడం శక్యం కాదు గాన దూరంగా ఉన్న విద్య ఒక్కటే అవడానికి తగదు. ఇక్కడ ఒక ఆమ్నానం విద్యావిధానంకోసం చేయబడింది, రెండవది గుణాలను విధించడానికి చేయబడింది అని విభాగం కూడ సంభవం కాదు. ఆ పక్షంలో అధికంగా ఉన్న గుణాలే దీనిలోను దానిలోను పఠించబడాలి కాని సమానమైన గుణాలు పఠింపబడకూడదు. అయితే రెండు చోట్లా కూడ మనోమయత్వం మొదలైన సమానమైన గుణాలు కూడ పఠింపబడుచున్నాయి. అందుచేత అన్యోన్యగుణోపసంహారం ఉండగూడదు.

వి. శాస్త్రాంతరప్రాప్తమైన ఆచమనాన్ని అనువదించి అనగ్నతాధ్యానం విధించబడుచున్న దని పూర్వాధికరణంలో చెప్పబడింది. ఇక్కడ నైతే- ఒకే శాఖలో దూరదూరంగా ఉన్న వాక్యాలలో ఒకటి విధి అనీ రెండవది అనువాదం అనీ చెప్పడానికి శక్యం కాదు గాన రెండూ విద్యావిధులే అని ప్రత్యుదాహరణసంగతి చేత పూర్వపక్షం.

### భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమహే - యథా భిన్నాసు శాఖాసు విద్యైకత్వం గుణోపసంహారశ్చభవత్యేవమేకస్యామపి శాఖాయాం భవితుమర్హతి. ఉపాస్యాభేదాత్. తదేవ హి బ్రహ్మ మనోమ యత్వాదికగుణముభయత్రాప్యుపాస్యమ్ అభిన్నం ప్రత్యభిజానీమహే. ఉపాస్యం చ రూపం విద్యాయాః. న చ విద్యమానే రూపాభేదే విద్యాభేదమధ్యవసాతుం శక్నుమః. నాపి విద్యాఽభేదే గుణవ్యవస్థానమ్. నను పౌనరుక్త్య ప్రసంగాద్విద్యాభేదోఽధ్యవసితః? నేత్యుచ్యతే, అర్థవిభాగోపపత్తేః. ఏకం హ్యామ్నానం విద్యావిధానార్థమ్, అపరం గుణవిధానార్థమితి న కించిన్నోపపద్యతే. నన్వేవం సతి యదపఠితమగ్నిరహస్యే తదేవ బృహదారణ్యకే పఠితవ్యమ్-"స ఏష సర్వస్యేశానః" ఇత్యాది. యత్తు పఠితమేవ మనోమయమిత్యాది తన్న పఠితవ్యమ్. నైష దోషః. తద్బలేనైవ ప్రదేశాన్తరస్థితవిద్యాప్రత్యభిజ్ఞానాత్. సమానగుణామ్నానేన హి విప్రకృష్టదేశాం శాణ్డిల్యవిద్యాం ప్రత్యభిజ్ఞాప్య తస్యామీశానత్వాద్యుపదిశ్యతే. అన్యథా హి కథం తస్యామయం గుణవిధిరభిధీయతే? అపి చాప్రాప్తాంశోపదేశేన అర్థవతి వాక్యే సంజాతే ప్రాప్తాంశపరామర్శస్య నిత్యానువాదతయాప్యుపపద్యమానత్వాన్న తద్బలేన ప్రత్యభిజ్ఞోపేక్షితుం శక్యతే. తస్మాదత్ర సమానాయామపి శాఖాయాం విద్యైకత్వం గుణోపసంహారశ్చేత్యుపపన్నమ్. 19.

### బాలానందిని

**ఏవమితి**:- ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాం- ఉపాస్య మైనది ఒకటే అవడంవల్ల వేరు వేరు శాఖలలో విద్యైకత్వము, గుణోపసంహారమూ ఏ విధంగా ఉంటాయో అట్లే ఒక శాఖలో కూడ ఉండడం యుక్తంగా ఉంటుంది. రెండు స్థానాలలోను కూడ మనోమయత్వాది గుణాలు గల అదే బ్రహ్మ అభిన్నమైనది అని గుర్తిస్తున్నాం కదా? విద్యకు రూపం

ఉపాస్యమే. రూపం అభిన్నమైనప్పుడు విద్యాభేదాన్ని నిశ్చయించడానికి శక్తులం కాము కదా? (నిశ్చయించ జాలము కదా?) విద్యలకు అభేదం ఎప్పు డున్నదో అప్పుడు గుణాలకు వ్యవస్థానం(దేని గుణాలు దానికే అనే మాట) ఉండదు. (ప్రశ్న) పౌనరుక్త్యదోష ప్రసంగంవల్ల విద్యాభేదం అని నిర్ణయించబడింది కదా?(సమాధానం) అట్లు కాదంటాం. ఎందువల్ల ననగా విషయవిభాగం చేయవచ్చును. ఒక అమ్నానం విద్యావిధానంకొరకు రెండవది గుణాలను విధించడంకొరకు అని విషయవిభాగం ఉండడంవల్ల అనుపపన్న మైనది ఏదీ లేదు.(ప్రశ్న) అట్లయితేఅగ్నిరహస్యంలో ఏది పఠించబడలేదో అట్టి "స సర్వస్యేశానః" ఇత్యాదికాన్నే బృహదారణ్యకంలో పఠించాలి కాని దానిలో పఠించబడిన "మనోమయః" ఇత్యాదికం కూడ పఠించకూడదు కదా? (సమాధానం) ఇది దోషం కాదు. దాని బలం చేతనే (మనోమయత్వాదులను కూడ పఠించడంచేతనే)కదా ప్రదేశాంతరంలో పఠించిన విద్యను గుర్తించినది? సమానమైన గుణాలను పఠించడంచేతనే దూరంగా ఉన్న శాండిల్యవిద్యను గుర్తించే టట్లు చేసి దానియందు ఈశానత్వాదికం ఉపదేశించబడుతున్నది. అలా ప్రత్యభిజ్ఞ లేకపోతే దానియందు ఈ గుణవిధి ఎలా చేయబడుతుంది? మరొక విషయ మేమనగా- ఒక వాక్యం అప్రాప్తమైన (పూర్వం దేనిచేతా తెలియని)అంశాలను చెప్పడంచేత సార్థకం అవుతుంది. ఇంక అదే వాక్యంలో ప్రాప్తములైన అంశాల పరామర్శ కూడ ఏదైనా ఉంటే అది నిత్యానువాదం అని గ్రహిస్తే కూడ సరిపోతుంది. అందుచేత ప్రాప్తాంశపరామర్శను పట్టి ప్రత్యభిజ్ఞను (రెండూ ఒకే విద్య అని గుర్తించడాన్ని) ఉపేక్షించడం శక్యం కాదు. అందువల్ల ఇక్కడ సమానశాఖలోనే విద్యైకత్వమూ, గుణోపసంహారమూ కూడ ఉన్నాయి అని చెప్పడం ఉపపన్నం.

వి.గుణాలు అధికంగా ఉన్నది ప్రధానవిధి. తక్కువ గుణాలు ఉన్నది ప్రధానవిద్యను వాదపూర్వకంగా కొన్ని క్రొత్త గుణాలను కూడ విధించే గుణవిధి. ఇక్కడ అగ్నిచయనంలోని విధి ప్రధానవిధి, బృహదారణ్యకంలోని విధి గుణవిధి. 19.

సమానాధికరణం సమాప్తం

## 11. సంబన్ధాధికరణమ్. సూ.20-22

### సూ. సంబన్ధాదేవమన్యత్రాపి. 3.3.20

బృహదారణ్యకే "సత్యం బ్రహ్మ" (బృ.ఉ.5.3.1) ఇత్యుపక్రమ్య "తద్యత్తత్సత్యమసౌ స ఆదిత్యో య ఏష ఏతస్మిన్మణ్డలే పురుషో యశ్చాయం దక్షిణేఽక్షన్ పురుషః" (బృ.ఉ.5.5.3) ఇతి తస్యైవ సత్యస్య బ్రహ్మణోఽధిదైవత మధ్యాత్మం చాయతనవిశేషముపదిశ్య వ్యాహృతిశరీరత్వం చ సంపాద్య ద్వే ఉపనిషదావుపదిశ్యేతే-తస్యోపనిషదహరిత్యధిదైవతమ్; తస్యోపనిషదహ మిత్యధ్యాత్మమ్. తత్ర సంశయః-కిమవిభాగేనైవోభే ఉపనిషదౌ ఉభయత్రాను సంధాతవ్యే ఉత విభాగేన- ఏకాధిదైవతమ్, ఏకాధ్యాత్మమితి. తత్ర సూత్రేణైవోపక్రమతే. యథా శాణ్డిల్యవిద్యాయాం విభాగేనాప్యధీతాయాం గుణోపసంహార ఉక్తః ఏవమన్యత్రాప్యేవంజాతీయకే విషయే భవితుమర్హతి. ఏకవిద్యాభిసంబన్ధాత్. ఏకా హీయం సత్యవిద్యా అధిదైవతమధ్యాత్మం చాధీతా ఉపక్రమాభేదాద్వ్యతిషక్తపాఠాచ్చ. కథం తస్యాముదితో ధర్మః తస్యామేవ న స్యాత్? యో హ్యాచార్యే కశ్చిదనుగమనాది రాచారశ్చోదితః స గ్రామ గతేఽరణ్యగతేచ తుల్యవదేవ భవతి. తస్మాదుభయోరప్యుపనిషదోరుభయత్ర ప్రాప్తిరితి.

#### బాలానందిని

సంబన్ధాదితి:-"సంబన్ధాత్=ఏకవిద్యాత్వం అనే సంబంధంవల్ల, ఏవమ్-శాండిల్యవిద్యలో వలెనే, అన్యత్రాపి=సత్యవిద్యలో కూడ గుణోపసంహారం ఉంటుంది" అని సూత్రార్థం. (ఇది పూర్వపక్షసూత్రం).

బృహదారణ్యక ఇతి :- బృహదారణ్యకంలో "సత్యం బ్రహ్మ" అని ఉపక్రమించి "తద్యత్...పురుషం" అని సత్యమైన ఆ బ్రహ్మకే అధిదైవతము, అధ్యాత్మము స్థానవిశేషాన్ని

ఉపదేశించి దానికి వ్యాహృతులే (భూః, భువః, సువః అనేవి వ్యాహృతులు)శరీర మని సంపాదించి-దానికి "అహః" అనేది ఆధిదైవతమైన ఉపనిషత్తు (రహస్యమైన నామం) దానికి "అహమ్" అని అధ్యాత్మమైన ఉపనిషత్తు అని చెప్పబడింది.

ఏ. బృహదారణ్యకంలోని సప్తమప్రపాఠకంలో "స యో హైతం మహద్యక్షం ప్రథమజం వేద సత్యం బ్రహ్మేతి" అని హిరణ్యగర్భోపాసన విధించబడింది సత్యపదవాచ్యుడైన ఆ హిరణ్యగర్భుడు ఉదకంనుండి పుట్టినట్లు చెప్పి. దానికి అంగంగా 'సత్యమ్' అనే అక్షరాల ఉపాసన చెప్పబడింది. ఆ సత్యాన్నే గూర్చి చెపుతూ "తద్యత్తత్ సత్యం...పురుషః" (ఆ సత్యమే ఆదిత్యుడు; ఆదిత్యమండలంలో ఉన్న పురుషుడు.)అని ఆ సత్యం ఆదిత్యమండలంలోను, అక్షిస్థానంలోను ఉన్నదని చెప్పి, మళ్లీ ఆదిత్యస్థానగతపురుషుణ్ణి "య ఏష ఏతస్మిన్ మణ్డలే పురుషః" అని అనుకర్షించి (ముందుకు తీసికొనివచ్చి)భూర్భువస్సువారూపమైన మూడు వ్యాహృతులు ఆ పురుషుని శిరో-బాహు పాదరూపాలైన అంగాలు అని చెప్పబడింది. ఆ పురుషునికి సంబంధించిన ఉపనిషత్తు (రహస్యం) అహః అనే పేరు అని చెప్పి, "య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే" అని అక్షిస్థపురుషుణ్ణి నిర్దేశిస్తూ పైన చెప్పినట్లే మూడు వ్యాహృతులను మూడు అంగాలుగా చెప్పి దాని ఉపనిషత్తునుగా "అహమ్" అనే పేరు చెప్పబడింది. ఈ విధంగా 'అహః' అనేది అధి దైవత నామం, "అహమ్" అనేది అధ్యాత్మనామం.

తత్రేతి:- ఈ రెండు ఉపనిషత్తులనూ విభాగం లేకుండా రెండు చోట్లా అనుసంధానం చెయ్యాలా లేదా ఒకటి అధిదైవం, మరొకటి అధ్యాత్మం అని విభాగంచేత అనుసంధానం చెయ్యాలా అని సంశయం. ఈ విషయం సూత్రంచేతనే ఉపక్రమిస్తున్నాడు. వేరుగా పఠించబడినా కూడ శాండిల్యవిద్యలో ఏ విధంగా గుణోపసంహారం చెప్పబడిందో అట్లే ఈ విధమైన ఇతరవిద్యలలో కూడ, ఒకే విద్యతో సంబంధం ఉండడంవల్ల (ఉపసంహారాదికం) గ్రహించడం యుక్తం. అధిదైవమూ అధ్యాత్మమూ పఠించబడిన ఈ సత్యవిద్యయొక్క ఉపక్రమంలో భేదం లేదు. రెండు భాగాలూ కూడ దగ్గర దగ్గరగా పఠించబడ్డాయి. అందుచేత ఇది ఒకటే విద్య. అందుచేత ఒకే విద్యలో పఠించబడిన ధర్మం అదే విద్యలో ప్రవర్తించకుండా ఎలా ఉంటుంది? ఆచార్యుని విషయంలో (శిష్యునకు)విధించబడిన అనుగమనాద్యాచారం (ఆచార్యు డెక్కడికి వెడితే తాను కూడ

అక్కడికి వెళ్లడం మొదలైన ఆచారం) ఆ ఆచార్యుడు గ్రామంలో ఉన్నా, అరణ్యంలో ఉన్నా కూడ సమంగా వర్తింస్తుంది కదా. అందువల్ల రెండు ఉపనిషత్తులకు రెండు చోట్ల కూడ ప్రాప్తి ఉంటుంది. (దృష్టాంతసంగతిచేత పూర్వపక్షం అని బాష్యంలోనే సూచించబడింది). 20

భాష్యమ్

ఏవం ప్రాప్తే ప్రతివిధత్తే-

సూ. న వా విశేషాత్. 3.3.21

నవోభయోరుభయత్ర ప్రాప్తిః. కస్మాత్? విశేషాత్. ఉపాసనాస్థాన విశేషోపనిబన్ధాదిత్యర్థః. కథం స్థానవిశేషోపనిబన్ధ ఇతి? ఉచ్యతే-"య ఏష ఏతస్మిన్ మణ్డలే పురుషః" (బృ.ఉ.5.5.3) ఇతిహ్యాధిదైవికం పురుషం ప్రకృత్య తస్యోపనిషదహరితి శ్రావయతి. "యోఽయం దక్షిణేఽక్షన్ పురుషః" (బృ.ఉ.5.5.4) ఇతి హ్యాధ్యాత్మికం పురుషం ప్రకృత్య తస్యోపనిషదహమితి. తస్యేతి చైతత్సన్నిహితావలమ్బనం సర్వనామ. తస్మాదాయతనవిశేషవ్యపాశ్రయేణైవేతే ఉపనిషదావుపదిశ్యేతే. కుత ఉభయోరుభయత్ర ప్రాప్తిః? నన్వేక ఏవాయమధి దైవమధ్యాత్మం చ పురుషః. ఏకస్యైవ సత్యస్య బ్రహ్మణః ఆయతనద్వయ ప్రతిపాదనాత్.సత్యమేవమేతత్. ఏకస్యాపి హ్యవస్థావిశేషోపాదానేన ఉపనిషద్విశేషోపదేశాత్ తదవస్థస్యైవ సా భవితుమర్హతి. అస్తి చాయం దృష్టాన్తః సత్యప్యాచార్యస్వరూపానపాయే యదాచార్యస్యాసీన స్యానువర్తనముక్తం న తత్తిష్ఠతో భవతి, యచ్చ తిష్ఠత ఉక్తం న తదాసీనస్యేతి. గ్రామారణ్యయోస్తో చార్యస్వరూపానపాయాత్ తత్స్వరూపానుబద్ధస్య చ ధర్మస్య గ్రామారణ్య కృతవిశేషాభావాత్ ఉభయత్ర తుల్యవద్భావ ఇత్యదృష్టాన్తః సః. తస్మాద్వ్యవస్థాఽనయోరుపనిషదోః. 21

బాలానందిని

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా సమాధానం చెపుతున్నాడు-

నేతి :-" విశేషాత్- విశేషం ఉండడంవల్ల, న వా=రెండింటికి రెండు చోట్ల ప్రాప్తి లేదు" అని సూత్రార్థం.

నేతి :-రెండింటికీ రెండు చోట్ల ప్రాప్తి లేదు. ఎందువల్ల? విశేషంవల్ల ఉపాసనస్థానవిశేషాలను చెప్పడంవల్ల అని అర్థం. స్థానవిశేషోపనిబంధం ఎట్లు? చెప్పబడుచున్నది-"య ఏష ఏతస్మిన్మణ్డలే పురుషః" అని ఆధిదైవికపురుషుణ్ణి ప్రస్తావించి వానికి ఉపనిషత్తు "అహః" అనేది అని చెప్పుచున్నాడు. "యోఽయం దక్షిణేఽక్షన్ పురుషః" అని ఆధ్యాత్మికపురుషుణ్ణి ప్రస్తావించి వానికి "అహమ్" అనేది ఉపనిషత్తు అని చెప్పుచున్నాడు. "తస్య" అనేది దగ్గర ఉన్నదానిని నిర్దేశించే సర్వనామ. అందుచేత ఈ రెండు ఉపనిషత్తులు వేరు వేరు స్థానాలను బట్టి మాత్రమే చెప్పబడుచున్నాయి అలాంటప్పుడు రెండూ రెండుచోట్లా ప్రాప్తించడం ఎట్లు? (ఆశంక) సత్యమైన ఒకే బ్రహ్మకు రెండు స్థానాలు చెప్పడంచేత అధిదైవతపురుషుడు అధ్యాత్మపురుషుడూ కూడ ఒక్కడే కదా? ఈ మాట నిజమే. ఒక్కడే అయినా కూడ అవస్థావిశేషాన్ని పట్టియే ఉపనిషద్విశేషాన్ని ఉపదేశించడంవల్ల ఆ ఉపనిషత్తు ఆ పురుషుడు ఆ అవస్థలో ఉన్నప్పుడు మాత్రమే వర్తించడం యుక్తంగా ఉంటుంది. (ఈ విషయంలో కూడ)ఈ దృష్టాంతం ఉంది-ఆచార్యస్వరూపంలో మార్పు లేకపోయినా ఆచార్యుడు కూర్చొని ఉన్నప్పుడు ఏ విధమైన అనువర్తనం చెప్పబడిందో అది అతడు నిలచి ఉన్నప్పుడు ఉండదు; నిలబడి ఉన్నప్పుడు చెప్పిన అనువర్తనం కూర్చొని ఉన్నప్పుడు ఉండదు గ్రామారణ్యాలలో నైతే ఆచార్యుని స్వరూపంలో మార్పు ఉండదు గాన అతని స్వరూపానికి సంబంధించిన ధర్మానికి గ్రామాన్ని పట్టి అరణ్యాన్ని పట్టి విశేషం ఉండదు. రెండుచోట్ల అది (ధర్మం) తుల్యంగానే ఉండవచ్చును గాన అది దృష్టాంతం కాదు. అందువల్ల ఈ రెండు ఉపనిషత్తులకు వ్యవస్థ ఉంటుంది. 21.

## సూ. దర్శయతి చ. 3.3.22

అపిచైవంజాతీయకానాం ధర్మాణాం వ్యవస్థేతి లిఙ్గదర్శనం భవతి

"తస్యైతస్య తదేవ రూపం యదముష్య రూపం, యావముష్యగేష్ణౌ తౌ గేష్ణౌ, యన్నామ తన్నామ'' (ఛా.ఉ.1.7.5) ఇతి. కథమస్య లిఙ్గత్వమితి? తదుచ్యతే. అక్ష్యాదిత్యస్థానభేదభిన్నాన్ ధర్మాన్ అన్యోన్యస్మిన్నుపసంహార్యాన్పశ్యన్ ఇహ అతిదేశేన ఆదిత్యపురుషగతాన్ రూపాదీన్ అక్షిపురుష ఉపసంహరతి-''తస్యైతస్య తదేవ రూపమ్'' (ఛా.ఉ.1.7.5) ఇత్యాదినా. తస్మాద్వ్యవస్థితే ఏవైతే ఉపనిషదావితి నిర్ణయః. 22.

బాలసందీపి

దర్శయతీతి :- "దర్శయతి=వ్యవస్థను చూపుచున్నాడు కూడ'' అని సూత్రార్థం.

అపి చేతి :- అంతేకాకుండా ఈ రకమైన ధర్మాలకు వ్యవస్థ ఉంటుందని "తస్యైతస్య....తన్నామ'' అని లింగం కూడ కనబడుచున్నది. ఇది లింగం ఎట్లయింది? చెప్పబడుచున్నది-అక్షి ఆదిత్యుడు అనే స్థానాల భేదంచేత భిన్నములైన ధర్మాలు పరస్పరము ఉపసంహరించదగినవి అని చూచుచు (తలచి)ఇక్కడ అతిదేశంచేత ఆదిత్యపురుషునిలో ఉన్న రూపాదులను అక్షి పురుషునిలో "తస్యైతస్య తదేవ రూపమ్'' ఇత్యాదికంచేత ఉపసంహరిస్తున్నాడు. అందువల్ల ఈ ఉపనిషత్తులు వ్యవస్థితములే అని నిర్ణయం.

వి. ఆదిత్యునిలోను అక్షిలోను ఉన్న పురుషుడు ఒక్కడే-ఆదిత్యపురుషునికి కొన్ని రూపాదులు చెప్పబడ్డాయి, అక్షిగతపురుషునకు కొన్ని రూపాదులు చెప్పబడ్డాయి. అయితే పురుషుడు ఒక్కడే అయినా స్థానాలు వేరు కాబట్టి ఒక స్థానంలో ఉన్న పురుషునికి చెప్పిన ధర్మాలు మరొక స్థానంలో ఉన్న పురుషునకు వర్తించ వనే అభిప్రాయంచేతనే వీని రూపాదులే వాని రూపాదులు, వాని రూపాదులే వీని రూపాదులు అని అతిదేశం చేయవలసి వచ్చింది. దీనిని పట్టి ఇలాంటి అతిదేశం లేకపోతే అవి పరస్పరము వర్తించవు అని సూచించబడుచున్నది.

సంబన్ధాధికరణం సమాప్తం.

## 12. సంభృత్యధికరణమ్. సూ. 23

### సూ. సంభృతిద్యువ్యాప్త్యపి చాతః. 3.3.23.

"బ్రహ్మ జ్యేష్ఠా వీర్యా సంభృతాని బ్రహ్మాగ్రే జ్యేష్ఠం దివమాతతాన" ఇత్యేవం రాణాయనీయానాం ఖిలేషు వీర్యసంభృతిద్యునివేశప్రభృతయో బ్రహ్మణో విభూతయః పఠ్యన్తే. తేషామేవ చోపనిషది శాణ్డిల్యవిద్యాప్రభృతయో బ్రహ్మవిద్యాః పఠ్యన్తే. తాసు బ్రహ్మవిద్యాసు తా బ్రహ్మవిభూతయ ఉపసంహ్రియేరన్న వేతి విచారణాయాం బ్రహ్మసంబన్ధాదుపసంహారప్రాప్తౌ ఏవం పఠతి- సంభృతి ద్యువ్యాప్తిప్రభృతయో విభూతయః శాణ్డిల్యవిద్యాదిషు నోపసంహర్తవ్యాః, అత ఏవ చాయతనవిశేషయోగాత్. తథాహి-శాణ్డిలవిద్యాయాం హృదయాయతన త్వం బ్రహ్మణ ఉక్తమ్-"ఏష మ ఆత్మాన్తర్హృదయే" (ఛా.ఉ.4.114.3) ఇతి. తద్వదేవ దహరవిద్యాయామపి "దహరం పుణ్డరీకం వేశ్మ దహరోఽస్మిన్నన్తరాకాశః" (ఛా.ఉ.8.1.1)ఇతి. ఉపకోసలవిద్యాయాం తు అక్ష్యాయతనత్వం-"య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే"(ఛా.ఉ.4.15.1) ఇతి. ఏవం తత్ర తత్రాధ్యాత్మిక మాయతనమే తాసు విద్యాసు ప్రతీయతే. ఆధిదైవిక్యస్త్వేతా విభూతయః సంభృతి ద్యువ్యాప్తిప్రభృతయః, తాసాం కుత ఏతాసు ప్రాప్తిః?

బాలానందిని

సంభృతీతి :- "అతః=ఈకారణం వల్లనే, సంభృతిద్యువ్యాప్త్యపి= సంభృతిద్యువ్యాప్తులు కూడ ఉంపసంహరింపబడవు" అని సూత్రార్థం.

బ్రహ్మేతి:- రాణాయనీయశాఖవారి ఖిలగ్రంథంలో "బ్రహ్మ జ్యేష్ఠా...ఆతతాన" (బ్రహ్మయే కారణంగా గల ఆకాశోత్పాదనం మొదలైన పరాక్రమవిశేషాలు నిర్విఘ్నంగా జరిగాయి. జ్యేష్ఠమైన ఆ బ్రహ్మ దేవాదుల ఉత్పత్తికి ముందే స్వర్గాన్ని వ్యాపించి ఉంది) అని వీర్యసంభృతి, ద్యునివేశం మొదలైన బ్రహ్మయొక్క విభూతులు పఠింపబడుతున్నాయి. వాళ్ల ఉపనిషత్తులోనే శాండిల్యవిద్య మొదలైన బ్రహ్మవిద్యలు పఠింపబడ్డాయి. ఆ విద్యలలోనికి బ్రహ్మయొక్క ఆ విభూతులు ఉపసంహరింపబడతాయా

ఉపసంహరింపబడవా అని విచారణ చేయగా బ్రహ్మసంబంధంవల్ల ఉపసంహారం చేయవచ్చును అని ప్రాప్తించగా పరిస్తున్నాడు-సంభృతి, ద్యువ్యాప్తి మొదలైన విభూతులను శాండిల్యవిద్యాదులలో ఉపసంహరించకూడదు. అతః-స్థానవిశేషంతో సంబంధంవల్ల. అదెట్లనగా -శాండిల్యవిద్యలో "ఏష...అన్తర్హృదయే" అని బ్రహ్మ హృదయాయతనం అని చెప్పబడింది. "దహరం...ఆకాశః" అని దహరవిద్యలో కూడ అట్లే చెప్పబడింది. అయితే ఉపకోసలవిద్యలో "య ఏషో ఽక్షిణి పురుషో దృశ్యతే" అని అక్షి ఆయతనంగా చెప్పబడింది. ఈ విధంగా ఈ విద్యలలో శరీరంలో ఆ యా స్థానం బ్రహ్మయొక్క ఆయతనంగా చెప్పబడుచున్నది. సంభృతి ద్యువ్యాప్తి మొదలైన ఈ విభూతు లైతే ఆధిదైవిక మైనవి. అవి ఈ విద్యలో ఎలా ప్రాప్తిస్తాయి?

## భాష్యమ్

నన్వేతాస్వప్యాధిదైవిక్యో విభూతయః శ్రూయన్తే-"జ్యాయాన్దివో జ్యాయానేభ్యో లోకేభ్యః" (ఛా.ఉ.3.14.3), "ఏష ఉ భామనీరేష హి సర్వేషు లోకేషు భాతి" (ఛా. 4.15.4), "యావాన్వా అయమాకాశస్తావానేషో ఽన్తర్హృదయ ఆకాశ ఉభే అస్మిన్ ద్యావాపృథివీ అన్తరేవ సమాహితే" (ఛా.ఉ. 8.1.3) ఇత్యేవమాద్యాః. సన్తి చాన్యా ఆయతనవిశేషహీనా అపీహ బ్రహ్మవిద్యాః షోడశకలాద్యాః. సత్యమేవమేతత్. తథాప్యత్ర విద్యతే విశేషః సంభృత్యాద్యనుపసంహారహేతుః. సమానగుణామ్నానేన హి ప్రత్యుపస్థాపితాసు విప్రకృష్టదేశాస్వపి విద్యాసు విప్రకృష్టదేశా గుణా ఉపసంహ్రియేరన్నితి యుక్తమ్. సంభృత్యాదయస్తు శాణ్డిల్యాదివాక్యగోచరాశ్చ మనోమయత్వాదయో గుణాః పరస్పరవ్యావృత్తస్వరూపత్వాన్న ప్రదేశాన్తరవర్తి విద్యాప్రత్యుపస్థాపనక్షమాః. న చ బ్రహ్మసంబన్ధమాత్రేణ ప్రదేశాన్తరవర్తి విద్యాప్రత్యుపస్థాపనమిత్యుచ్యతే, విద్యాభేదేఽపి తదుపపత్తేః. ఏకమపి హి బ్రహ్మ విభూతి భేదైరనేకధోపాస్యత ఇతి స్థితిః. పరోవరీయస్త్వాదివద్భేదదర్శనాత్. తస్మాద్వీర్యసంభృత్యాదీనాం శాణ్డిల్యవిద్యాదిష్వనుపసంహార ఇతి. 23.

బాలనందిని

నన్వితి :-(ప్రశ్న) ఈ విద్యలలో కూడ-"జ్యాయాన్.....లోకేభ్యః", "ఏష ఉ...భాతి", "యావాన్వా...సమాహితే" ఈ విధమైన అధిదైవికములైన విభూతులు వినబడుచున్నాయి కదా? అంతేకాక ఆయతన విశేషాలు ఏవీ లేని షోడశకల మొదలైన ఇతరమైన బ్రహ్మవిద్యలు కూడ ఉన్నాయి. (సమాధానం)-ఇది నిజమే. అయినా కూడ ఇక్కడ సంభృత్యాదులను ఉపసంహరించకపోవడానికి ఒక విశేషం ఉంది. దూరంగా ఉన్నా విద్యలు సమానమైన గుణాలను చెప్పడంచేత ఉపస్థాపితములైనప్పుడు దూరంగా ఉన్న గుణాలు కూడ ఉపసంహరించబడతాయి అనేది యుక్తం. అయితే-సంభృత్యాదులు. శాండిల్యాదివిద్యలకు సంబంధించిన మనోమయత్వాదిగుణాలు పరస్పరము వేరైన స్వభావం కలవవడంవల్ల అవి ఇతరప్రదేశాలలో ఉన్న విద్యలను ఉపస్థాపించడానికి సమర్థములు కావు. బ్రహ్మసంబంధం ఉన్నంతమాత్రంచేత ఇతరప్రదేశాలలో ఉన్న విద్యలను ఉపస్థాపించా లని చెప్పకూడదు. విద్యాభేదం ఉన్నా కూడ బ్రహ్మతో (ఆ రెండు విద్యలకు)సంబంధం ఉండవచ్చును. బ్రహ్మ ఒక్కటే అయినా కూడ వేరు వేరు విభూతులను బట్టి వేరు వేరు విధాలుగా ఉపాసించబడుతుంది అనేది నిశ్చితమైన ఒక సత్యం. పరోవరీయస్త్వాదులందు వలె భేదం కనబడుతుంది. అందువల్ల శాండిల్య విద్యాదులలో వీర్యసంభృత్యాదుల ఉపసంహారం చేయబడదు.

Page. 1130 - Line. 23....

ఏ. ఒకే ఉద్గీథంలో చేయబడే పరోవరీయస్త్వాదిగుణాల ఉపాసన హిరణ్య శ్మశ్రుత్వాదిగుణాల ఉపాసన వేరైన వవడంచేత అవి భిన్నములని అంగీకరించినట్లే ఒకే బ్రహ్మ విషయంలో విద్యాభేదం ఉండడానికి అవకాశం ఉంది గాన బ్రహ్మప్రత్యభిజ్ఞ ఉన్నంత మాత్రంచేత గుణోపసంహారం చేయకూడదు.

స్థానవిశిష్టమైన పురుషుని భేదంవల్ల వెనుకటి అధికరణంలో నామాల వ్యవస్థ చెప్పినట్లే సంభృత్యాదిగుణవిశిష్టుడైన బ్రహ్మ, శాండిల్యాదివిద్యలలో చెప్పిన గుణాలతో కూడిన బ్రహ్మ వేరుగాన, పరస్పరరూపభేదం ఉండడంవల్ల సంభృత్యాదిగుణాల ఉపసంహారం ఉండదు అని పూర్వోక్తన్యాయమే ఇక్కడ అతిదేశించబడుచున్నది. అందుచేత వేరు సంగత్యాదుల అపేక్ష లేదు. 23.

సంభృత్యధికరణం సమాప్తం

### 13. పురుషాద్యధికరణమ్. సూ. 24.

## సూ. పురుషవిద్యాయామివ చేతరేషామనామ్నానాత్. 3.3.24.

అస్తి తాణ్డినాం, పైఙ్గినాం చ రహస్యబ్రాహ్మణే పురుషవిద్యా. తత్ర పురుషో యజ్ఞః కల్పితః. తదీయ మాయుస్త్రేధావిభజ్య సవనత్రయం కల్పితమ్. అశిశిషాదీని చ దీక్షాదిభావేన కల్పితాని, అన్యే చ ధర్మాస్తత్ర సమధిగతాశ్చాశీర్మన్త్ర ప్రయోగాదయః. తైత్తిరీయకా అపి కంచిత్పురుషయజ్ఞం కల్పయన్తి-''విదుషో యజ్ఞస్యాత్మా యజమానః శ్రద్ధా పత్నీ'' (నారా.ఉ.25) ఇత్యనేనానువాకేన. తత్ర సంశయః-కిం యే ఇతరత్రోక్తాః పురుషయజ్ఞస్య ధర్మాః తే తైత్తిరీయకేషూ పసంహర్తవ్యాః కిం వా నోపసంహర్తవ్యా ఇతి. పురుషయజ్ఞత్వావిశేషాదుపసంహార ప్రాప్తావాచక్ష్మహే-నోపసంహర్తవ్యా ఇతి. కస్మాత్?తద్రూపప్రత్యభిజ్ఞానాభావాత్. తదాహాచార్యః-పురుషవిద్యాయామివేతి. యథైకేషాం శాఖినాం తాణ్డినాం పైఙ్గినాం చ పురుషవిద్యాయామామ్నానం నైవమితరేషాం తైత్తిరీయాణామామ్నానమస్తి. తేషాం హీతరవిలక్షణ మేవ యజ్ఞసంపాదనం దృశ్యతే పత్నీయజమానవేదవేదిబర్హి ర్యూపాజ్యపశ్వృత్విగాద్యను క్రమణాత్. యదపి సవనసంపాదనం తదపీతరవి లక్షణమేవ ''యత్ప్రాతర్మధ్యందినం సాయం చ తాని సవనాని'' ఇతి. యదపి కించిన్మరణావభృథత్వాదిసామ్యం తదప్యల్పీయస్త్వాద్భూయసా వైలక్షణ్యేన అభిభూయమానం న ప్రత్యభిజ్ఞాపనక్షమమ్.

### బాలానందిని

పురుషేతి:-'' పురుషవిద్యాయామివ=పురుషవిద్యలో వలె, ఇతరేషామ్ =తైత్తిరీయులు, అనామ్నానాత్=ఆమ్నానం చేయకపోవడంవల్ల గుణోపసంహారం లేదు'' అని సూత్రార్థం.

అస్తీతి :- తాండిరహస్యబ్రాహ్మణంలోను, పైంగిరహస్యబ్రాహ్మణంలోను పురుషవిద్య ఉంది. అక్కడ పురుషుడు యజ్ఞంగా కల్పించబడ్డాడు. వాని ఆయుర్దాయాన్ని మూడు

భాగాలుగా విభజించి సవనత్రయం కల్పించబడింది భోజనేచ్ఛ మొదలైనవి దీక్షాదిరూపంలో కల్పించబడ్డాయి. అట్లే అక్కడ ఆశీర్మంత్రప్రయోగం మొదలైన ఇతరధర్మాలు కూడ కనబడుతున్నాయి.

వి. ఛాందోగ్యంలో ఉన్నపురుషవిద్యలో ఈ విధంగా చెప్పబడింది-పురుషుడే యజ్ఞం. అతని ఇరవైనాలుగు సంవత్సరాలు ప్రాతఃసవనం. తరవాత వచ్చే నలభైనాలుగు సంవత్సరాలు మాధ్యందినసవనం. తరవాత వచ్చే నలభైఎనిమిది సంవత్సరాలు తృతీయసవనం. ఆకలి దప్పికలు సహిస్తాడు, విహరించడు-ఇదే దీక్ష. తింటాడు, త్రాగుతాడు, విహరిస్తాడు-ఇదే ఉపసదం. నవ్వుతాడు, బాగా తింటాడు, మైథునం చేస్తాడు- ఇవి స్తుతశస్త్రాలు. తపోదానాదికం చేస్తాడు-అది దక్షిణ. రోగాదులు వచ్చినప్పుడు వసురుద్రాదులను ప్రార్థిస్తాడు-ఇది ఆశీర్వాదం. దీనిలో మంత్రాల ప్రయోగం చేయబడుతుంది. మరణమే అవభృథం. ఈ యజ్ఞానికి ఫలం నూటపదహారు సంవత్సరాలు జీవించడం. ఈ విధంగా తాండిశాఖీయులు పైంగిశాఖీయులు చెపుతున్నారు.

తైత్తిరీయకా ఇతి:- తైత్తిరీయకులు కూడ "తస్యైవ...పత్నీ" ఇత్యాద్యనువాకంచేత ఒక పురుషయజ్ఞాన్ని కల్పిస్తున్నారు.

వి. తైత్తిరీయకంలో ఈ విధంగా చెప్పబడింది. ఆత్మ యజమానుడు. శ్రద్ధ యజమానపత్ని. శరీరం కట్టె. వక్షఃస్థలం వేది. రోమాలు బర్హిస్సు. శిఖ వేదం (దర్భల కట్ట). హృదయం యూపస్తంభం. కామం ఆజ్యం. కోపం పశువు. తపస్సు అగ్ని. శాంతింపచేసే దమం దక్షిణ. వాక్కు హోత అనే ఋత్విక్కు. ప్రాణం ఉద్గాత. చక్షుస్సు అధ్వర్యువు. మనస్సు బ్రహ్మ. శ్రోత్రం అగ్నీత్-ఎంతవరకు జీవిస్తాడో అది దీక్ష. తిన్నది హవిస్సు. త్రాగేది సోమపానం. రమించడం ఉపసదం. సంచరిస్తాడు కూర్చుంటాడు, నిలబడతాడు-ఇది ప్రవర్గ్యం. ముఖం ఆహవనీయాగ్ని. మాట్లాడడం ఆహుతి. వీని విజ్ఞానం హోమం. సాయంకాల-ప్రాతః కాలాలలో తింటాడు-అది సమిధలు. ప్రాతర్మధ్యాహ్న సాయంకాలాలు సవనాలు. అహోరాత్రాలు దర్శపూర్ణమాసాలు. అర్ధమాసాలు, మాసాలు, చాతుర్మాస్యాలు, ఋతువులు-ఇవి పశుబంధాలు. సంవత్సరాలు, పరివత్సరాలు-ఇవి అహర్గణాలు. ఇది సర్వవేదసమైన యజ్ఞం. మరణమే అవభృథస్నానం.

తత్రేతి:- తాండిశాఖాదులలో చెప్పబడిన పురుషయజ్ఞధర్మాలను తైత్తిరీయకంలో

చెప్పిన యజ్ఞంలో ఉపసంహరించాలా అక్కరలేదా అని సంశయం. రెండూ పురుషయజ్ఞాలే గాన ఉపసంహారం చెయ్యాలి అని ప్రాప్తించగా ఉపసంహరించకూడదు అని చెపుతున్నాం. ఎందువల్ల? వాటి రూపంయొక్క (రెండు విద్యల స్వరూపమూ ఒక్కటే అని)ప్రత్యభిజ్ఞ లేకపోవడంవల్ల. ఈ విషయమే ఆచార్యుడు(సూత్రకారుడు) పురుషవిద్యాయామివ అని చెపుతున్నాడు. తాండులు, పైంగులు అనే శాఖలకు చెందిన పురుషవిద్యలో అమ్నానం ఏ విధంగా ఉన్నదో ఇతరులైన తైత్తిరీయుల పురుషవిద్యలో అ విధమైన అమ్నానం లేదు. పత్ని, యజమానుడు, వేదము, వేది, బర్హిస్సు. యూపము, అజ్యము, పశువు, ఋత్విజులు మొదలైనవాటిని చెప్పడంవల్ల తైత్తిరీయుల అమ్నానం ఇతరుల అమ్నానంకంటె విలక్షణంగా కనబడుచున్నది "యత్ప్రాతః..సవనాని" అని సవనసంపాదనం కూడ ఇతరవిద్యలలోనిదానికి విలక్షణంగానే ఉన్నది. మరణాన్ని అవభృథ మని చెప్పడంలో ఏ సామ్యం ఉన్నదో అది చాల అల్పం అవడంచేత ఈ విద్యలలో ఉన్న వైలక్షణ్యంచేత తిరస్కరింపబడి ప్రత్యభిజ్ఞ కలిగించడానికి సమర్థం కాదు.

భాష్యమ్

న చ తైత్తిరీయకే పురుషస్య యజ్ఞత్వం శ్రూయతే. విదుషో యజ్ఞస్యేతి హి న చైతే సమానాధికరణే షష్ఠ్యౌ -విద్వానేవ యో యజ్ఞస్తస్యేతి. న హి పురుషస్య ముఖ్యం యజ్ఞత్వమస్తి-వ్యధికరణేత్వేతే షష్ఠ్యౌ విదుషో యో యజ్ఞస్తస్యేతి. భవతి హి పురుషస్య ముఖ్యో యజ్ఞసంబన్ధః. సత్యాం చ గతౌ ముఖ్య ఏవార్థ అశ్రయితవ్యః న భాక్తః. "ఆత్మా యజమాన" ఇతి చ యజమానత్వం పురుషస్య నిర్బ్రువన్ వైయధికరణ్యేనైవాస్య యజ్ఞసంబన్ధం దర్శయితి. అపి చ "తస్యైవం విదుషః" ఇతి సిద్ధవదనువాదశ్రుతౌ సత్యాం పురుషస్య యజ్ఞభావమాత్మాదీనాం చ యజమానాదిభావం ప్రతిపిత్సమానస్య వాక్యభేదః స్యాత్. అపి చ ససంన్యాసామాత్మవిద్యాం పురస్తాదుపదిశ్యానన్తరం తస్యైవంవిదుష ఇత్యాద్యనుక్రమణం పశ్యన్తః పూర్వశేష ఏవైష అమ్నాయో న స్వతన్త్ర ఇతి ప్రతీమః. తథా చైకమేవ ఫలముభయోరనువాకయోరుపలభామహే

"బ్రహ్మణో మహిమానమాప్నోతి" ఇతి. ఇతరేషాం త్వనన్యశేషః పురుషవిద్యామ్నాయః. అయురభివృద్ధిఫలో హ్యసౌ "ఏష హ షోడశవర్షశతం జీవతి య ఏవం వేద" (ఛా. ఉ.3.16.7) ఇతి సమభివ్యాహారాత్. తస్మాచ్ఛాఖాన్తరాధీతానాం పురుషవిద్యాధర్మాణామాశీర్మన్త్రాదీనామప్రాప్తి స్తైత్తిరీయకే. 24.

బాలానందిని

న చేతి :- మరొక విషయ మేమనగా-తైత్తిరీయకంలో పురుషునకు యజ్ఞత్వం వినబడడం లేదు. "విదుషః యజస్య" అనేవి "విద్యాంసుడే యజ్ఞం-దానియొక్క" అని సమానాధికరణము లైన (ఒకే వస్తువులో అన్వయించే) షష్ఠీవిభక్తులు కావు. పురుషునకు ముఖ్యమైన యజ్ఞత్వం లేదు కదా? "విద్వాంసుని యజ్ఞముయొక్క" అని ఇవి వ్యధికరణషష్ఠులు. పురుషునికి ముఖ్యమైన యజ్ఞసంబంధం ఉంటుంది కదా? గతి ఉన్నప్పుడు ముఖ్యార్థమే ఆశ్రయించాలి కాని లాక్షణికార్థం ఆశ్రయించకూడదు. "ఆత్మా యజమానః" అని పురుషుడు యజమానుడు అని చెపుతూ వీనికి వైయధికరణ్యంచేతనే (పురుషునియొక్క యజ్ఞం అని)యజ్ఞంతో సంబంధాన్ని చూపుచున్నది.

వి. "పురుషస్య యజ్ఞస్య" అనగా పురుషుడనే యజ్ఞం అని అర్థం చెపితే అది నీలమైన ఉత్పలము అన్నట్లు సామానాధికరణ్యం అవుతుంది. 'పురుషునియొక్క యజ్ఞం' అని చేపితె రామునియొక్క గృహం అన్నట్లు వైయధికరణ్యం అవుతుంది. పురుషుడే యజ్ఞం కాజాలడు గాన అప్పుడది లాక్షణికార్థం. పురుషునియొక్క యజ్ఞం అన్నప్పుడు పురుషునికి యజ్ఞంతో ముఖ్యమైన సంబంధమే కుదురుతుంది గాన అది ముఖ్యార్థం. లాక్షణికార్థం చెప్పడం అగతికగతి. ముఖ్యార్థం గ్రహించడమే యుక్తం.

అపి చేతి:- మరొక విషయ మేమనగా-"తస్య ఏవం విదుషః" (ఈవిధంగా తెలుసుకొనవానియొక్క) అని అలా తెలుసుకొన్న వాడొకడు సిద్ధంగా ఉన్నట్లు అనువాదం వినబడుతుండగా పురుషునికి యజ్ఞత్వాన్ని, ఆత్మాదులకు యజమానత్వాదికాన్నీ తెలియగోరుచున్నవానికి వాక్యభేదం కలుగుతుంది.

వి. "ఈ విధంగా తెలుసుకొన్నవానియొక్క యజ్ఞం" అని అంటూ ఒక పురుషుని

యజ్ఞాన్ని అనువదిస్తూ పురుషుని అంగాలయందు యజ్ఞాంగత్వాలను ఆరోపించడం జరిగింది. అలాంటప్పుడు పురుషుడనే వాడే యజ్ఞ మనీ వాని అంగాలు యజ్ఞాంగా లనీ వేరుగా చెపితే ఒకే వాక్యానికి రెండు అర్థాలు చెప్పిన ట్లవుతుంది గాన వాక్యభేదదోషం ఏర్పడుతుంది.

అపి చేతి:- మరొక విషయ మేమనగా-ముందు సంన్యాససహితమైన ఆత్మవిద్యను ఉపదేశించి తరవాత "ఏవం విదుషః" (ఇలా తెలుసుకొన్నవానియొక్క) అని అనుక్రమణం చూస్తున్న మేం ఈ ఆమ్నానం వెనుక చెప్పినదానికి అంగమే కాని స్వతంత్రం కాదు అని తెలుసుకొంటున్నాం. అట్లే రెండు అనువాకాలకూ కూడ "బ్రహ్మణో మహిమానమాప్నోతి" అని ఒకే ఫలం చెప్పబడినట్లు చూస్తున్నాం. ఇతరశాఖీయుల పురుషవిద్యామ్నాయమైతే దేనికీ శేషం కాదు. (స్వతంత్రమైనది). "ఏష హ షోడశవర్షశతం జీవతి య ఏవం వేద" (ఇలా తెలుసుకొన్నవాడు నూటపదహారు సంవత్సరాలు జీవిస్తాడు) అని చెప్పడంవల్ల ఈ పురుషవిద్యకు ఆయురభివృద్ధి ఫలం. అందువల్ల ఇతరశాఖలలో చెప్పబడిన పురుషవిద్యాధర్మాలు, ఆశీర్మంత్రాదులు కూడ తైత్తిరీయకంలో ప్రాప్తించవు. 24.

పురుషాద్యధికరణం సమాప్తం.

## 14. వేధాద్యధికరణమ్. సూ. 25

## సూ. వేధాద్యర్థభేదాత్ 3.3.25

అస్త్యాధర్వణికానాముపనిషదారమ్భే మన్త్రసమామ్నాయః-"సర్వం ప్రవిధ్య హృదయం ప్రవిధ్య ధమనీః ప్రవృజ్య శిరోఽభివృజ్య త్రిధా విపృక్తః" ఇత్యాదిః. తాణ్డినాం "దేవసవితః ప్రసువ యజ్ఞమ్" ఇత్యాదిః.శాట్యాయనినామ్ - "శ్వేతాశ్వో హరినీలోఽసి" ఇత్యాదిః. కఠానాం తైత్తిరీయకాణాం చ -"శం నో మిత్రః శం వరుణః" (తై. ఉ.1.1.1) ఇత్యాదిః. వాజసనేయినాం తు ఉపనిషదారమ్భే ప్రవర్గ్య బ్రాహ్మణే పఠ్యతే-"దేవా హ వై సత్రం నిషేదుః" ఇత్యాదిః. కౌషీతకినామప్యగ్నిష్టోమబ్రాహ్మణమ్. "బ్రహ్మ వా అగ్నిష్టోమో బ్రహ్మైవ తదహర్బ్రహ్మణైవ తే బ్రహ్మపయన్తి, తేఽమృతత్వమాప్నువన్తి య ఏతదహరుపయన్తి" ఇతి. కిమిమే సర్వే ప్రవిధ్య ఇత్యాదయో మన్త్రాః ప్రవర్గ్యాదీని చ కర్మాణి విద్యాసూపసంహ్రియేరన్ కిం వా నోపసంహ్రియేరన్నితి మీమాంసామహే. కిం తావన్నః ప్రతిభాతి?

ఉపసంహార ఏవైషాం విద్యాస్వితి. కుతః? విద్యాప్రధానానాముపనిషదాం సమీపే పాఠాత్. నన్వేషాం విద్యార్థతయా వచనం నోపలభామహే? బాఢమ్. అనుపలభమానా అపి త్వనుమాస్యామహే సంనిధిసామర్థ్యాత్. న హి సంనిధేరర్థవత్త్వే సంభవత్యకస్మాదసావనాశ్రయితుం యుక్తః. నను నైషాం మన్త్రాణాం విద్యావిషయం కించిత్సామర్థ్యం పశ్యామః? కథం చ ప్రవర్గ్యాదీని కర్మాణ్యన్యార్థత్వేనైవ వినియుక్తాని సన్తి విద్యార్థత్వేనాపి ప్రతిపద్యేమహీతి. నైష దోషః. సామర్థ్యం తావన్మన్త్రాణాం విద్యావిషయమపి కించిచ్ఛక్యం కల్పయితుమ్, హృదయాదిసంకీర్తనాత్. హృదయాదీని హి ప్రాయేణోపాసనాదిష్వాయతనాదిభావేనోపదిష్టాని, తద్ద్వారేణ చ హృదయం ప్రవిధ్యేత్యేవంజాతీయకానాం మన్త్రాణాముపపన్నముపాసనాఙ్గత్వమ్. దృష్టశ్చోపాసనేష్వపి మన్త్రవినియోగః-"భూః ప్రపద్యేమునామునా" (ఛా.ఉ.3.15.3) ఇత్యేవమాదిః. తథా ప్రవర్గ్యాదీనాం కర్మణామన్యత్రాపి వినియుక్తానాం సతామవిరుద్ధో వినియోగో వాజపేయ ఇవ బృహస్పతిసవస్యేతి.

బాలానందిని

వేధేతి :-"వేధాద్యర్థ భేదాత్ ="హృదయం ప్రవిధ్య" ఇత్యాదిమంత్రాల అర్థంలో భేదం ఉండడంవల్ల వాటికి ఉపసంహారం లేదు" అని సూత్రార్థం.

అస్తీతి:-ఆథర్వణికుల ఉపనిషత్తుల ప్రారంభంలో మంత్రసమామ్నాయం "సర్వం...విప్యక్తః" మొదలైన (మంత్రపాఠం) ఉంది. (ఓ!దేవతా! నా శత్రువుయొక్క శరీరాన్నంతనీ చీల్చివెయ్యి. విశేషించి హృదయం ఛేదించు. నాడులను త్రెంపివెయ్యి. శిరస్సు బ్రద్ధలు కొట్టు. ఈ విధంగా నా శత్రువు మూడు విధాలుగా ఛేదించబడుగాక అని పై వాక్యానికి అర్థం). తండిశాఖలో "దేవసవితః ప్రసువ యజ్ఞమ్" (ఓ సవితృదేవా! యజ్ఞాన్ని నిర్వర్తింపచెయ్యి) ఇత్యాదికం ఉన్నది. శాట్యాయనినుల గ్రంథంలో "శ్వేతాశ్వో హరితనీలోఽసి" (తెల్లని ఉచ్చైఃశ్రవస్సు అనే అశ్వం గల నువ్వు పచ్చగడ్డివంటి నీలవర్ణం కలవాడవు) ఇత్యాదికం ఉన్నది. కఠ-తైత్తిరీయశాఖలలో "శం నో మిత్రః శం వరుణః" (మిత్రుడు వరుణుడు మనకు సుఖం ఇచ్చేవాళ్లు అగుదురుగాక) ఇత్యాదికం ఉన్నది. వాజసనేయుల ఉపనిషత్ప్రారంభంలో, ప్రవర్గ్యబ్రాహ్మణంలో "దేవా హ వై సత్రం నిషేదుః" (దేవతలు యజ్ఞంచేయడానికి కూర్చున్నారు)ఇత్యాదికం . పఠించబడింది. కౌషీతకుల అగ్నిష్టోమబ్రాహ్మణంలో "బ్రహ్మ....ఉపయన్తి" (అగ్నిష్టోమమే బ్రహ్మ. అగ్నిష్టోమం

చేసే దివసం బ్రహ్మ. అందువల్ల ఈ దివసంలో సాధించదగిన కర్మను ఎవరు చేస్తారో వాళ్లు ఈ బ్రహ్మ అనే సాధనంచేత బ్రహ్మనే పొందుతారు. (క్రమంగా మోక్షం పొందుతారు) ఇత్యాదికం ఉన్నది. ఈ ప్రవిధ్య ఇత్యాదిమంత్రాలు, ప్రవర్గ్యాదికర్మలు, విద్యలలో ఉపసంహరించబడతాయా ఉపసంహరించబడవా అని విచారిస్తున్నాం. అయితే మాకేమి తోస్తూన్నది? వీటికి విద్యలలో ఉపసంహారం చెయ్యాలని తోస్తున్నది. ఎందువల్ల? విద్యాప్రధానాలైన ఉపనిషద్గ్రంథాల దగ్గర పఠించడంవల్ల. ఇవి విద్యకోసం అన్నట్లు విధి ఏదీ మాకు కనబడడంలేదు కదా? నిజమే. కనబడకపోయినా సంనిధియొక్క సామర్థ్యం వల్ల అనుమానం చేస్తాం. సంనిధికి ఏదో ప్రయోజనం చెప్పడానికి అవకాశం ఉన్నప్పుడు హటాత్తుగా దానిని (ఆ సంనిధిని)ఆశ్రయించకుండా ఉండడం యుక్తం కాదు కదా?(ప్రశ్న) ఈ మంత్రాలకు విద్యలకు సంబంధించిన సామర్థ్య మేమీ మాకు కనబడడంలేదు కదా? మరొక ప్రయోజనం కోసం వినియోగించబడిన ప్రవర్గ్యం మొదలైన కర్మలు విద్యకోసం ఉద్దిష్ట మైనవి అని మేం ఎలా గ్రహించగలం? (సమాధానం) ఈ దోషం లేదు. హృదయాదులను గూర్చి చెప్పడంవల్ల మంత్రాలకు విద్యకు సంబంధించినది కూడ ఏదైన చెప్పడానికి శక్యం అవుతుంది. సాధారణంగా హృదయాదులు ఉపాసనాదులలో స్థానాదిరూపంలో చెప్పబడ్డాయి. అందుచేత హృదయాదుల ద్వారా "హృదయం ప్రవిధ్య" ఇత్యాదిమంత్రాలు ఉపాసనకు అంగా లవడం కుదురుతుంది. ఉపాసనలలో కూడ "భూః ప్రపద్యేఽమునామునామునా" ఇత్యాదిమంత్రవినియోగం కనబడుచున్నది.

వి. ఛాందోగ్యంలో పుత్రునకు దీర్ఘాయుర్దాయంకొరకై త్రిలోకాలనూ ఒక కోశంగా ఉపాసించడం చెప్పబడింది. ఈ ఉపాసనలో "భూః ప్రపద్యే" ఇత్యాదికం తండ్రి పఠించే ప్రార్థనామంత్రం. అమునా అనగా ఫలానా అని మూడు సార్లు పుత్రుని పేరు చెప్పబడుతుంది. ఈ ఫలానా పుత్రునితో కలిసి ఈ భూలోకాన్ని పరలోకాన్ని కూడ పొందుదును గాక అని దీని అర్థం. అందుచేత ఉపాసనలలో (విద్యలలో) కూడ మంత్రాలు అంగాలుగా ఉండడం కనబడుచున్న దని అర్థం.

తథేతి :-బృహస్పతిసవం వాజపేయానికి అంగం అయి నట్లు మరొక చోట వినియోగింపబడినదైనా ప్రవర్గ్యాదికర్మలను విద్యలలో వినియోగించడంలో విరోధం ఏదీ లేదు.

భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః-నైషాముపసంహారో విద్యాస్వితి. కస్మాత్? వేధాద్యర్థభేదాత్. హృదయం ప్రవిధ్యేత్యాదికానాం హి మన్త్రాణాం యేఽర్థాః హృదయవేధాదయో భిన్నాః, అనభిసంబద్ధాః త ఉపనిషదుదితాభిర్విద్యాభిః. న తేషాం తాభిః సంగన్తుం సామర్థ్యమస్తి. నను హృదయస్యోపాసనేష్వప్యుపయోగాత్ తద్ద్వారక ఉపాసనాసంబన్ధః ఉపన్యస్తః? నేత్యుచ్యతే. హృదయమాత్రసంకీర్తనస్య హ్యేవముపయోగః కథంచిదుత్ప్రేక్ష్యేత. న చ హృదయమాత్రమత్ర మన్త్రార్థః. "హృదయం ప్రవిధ్య, ధమనీః ప్రవృజ్య" ఇత్యేవంజాతీయకో హి న సకలో మన్త్రార్థః విద్యాభిరభిసంబధ్యతే. అభిచారికవిషయో హ్యేషోఽర్థః; తస్మాదాభిచారికేణ కర్మణా సర్వం ప్రవిధ్యేత్యస్య మన్త్రస్యాభిసంబన్ధః. తథా "దేవసవితః ప్రసువ యజ్ఞమ్" ఇత్యస్య యజ్ఞప్రసవలిఙ్గాత్ యజ్ఞేన కర్మణాభిసంబన్ధః. తద్విశేషసంబన్ధస్తు ప్రమాణాన్తరాదనుసర్తవ్యః. ఏవమన్యేషామపి మన్త్రాణాం కేషాం చిల్లిఙ్గేన, కేషాం చిద్వచనేన, కేషాం చిత్ప్రమాణాన్తరేణేత్యేవమర్థాన్తరేషు వినియుక్తానాం రహస్యపఠితానామపి సతాం న సన్నిధిమాత్రేణ విద్యాశేషత్వోపపత్తిః. దుర్బలో హి సంనిధిః శ్రుత్యాదిభ్య ఇత్యుక్తమ్ ప్రథమే తన్త్రే-"శ్రుతిలిఙ్గవాక్యప్రకరణస్థానసమాఖ్యానాం సమవాయే పారదౌర్బల్యమర్థవిప్రకర్షాత్" (జై.సూ.3.3.13) ఇత్యత్ర. తథా కర్మణామపి ప్రవర్గ్యాదీనామన్యత్ర వినియుక్తానాం న విద్యాశేషత్వోపపత్తిః. న హ్యేషాం విద్యాభిః సహైకార్థ్యం కించిదస్తి. వాజపేయే తు బృహస్పతిసవస్య స్పష్టం వినియోగాన్తరమ్-"వాజపేయేనేష్ట్వా బృహస్పతిసవేన యజేత" ఇతి. అపి చైకోఽయం ప్రవర్గ్యః సకృదుత్పన్నో బలీయసా ప్రమాణేనాన్యత్ర వినియుక్తో న దుర్బలేన ప్రమాణేనాన్యత్రాపి వినియోగమర్హతి. అగృహ్యమాణవిశేషత్వే హి ప్రమాణయోరేతదేవం స్యాన్న తు బలవదబలవతోః ప్రమాణయోరగృహ్యమాణ

విశేషతా సమ్భవతి, బలవదబలవత్త్వవిశేషాదేవ. తస్మాదేవంజాతీయకానాం మన్త్రాణాం కర్మణాం వా న సన్నిధిపాఠమాత్రేణ విద్యాశేషత్వమాశఙ్కితవ్యమ్. అరణ్యానువచనధర్మసామాన్యాత్తు సంనిధిపాఠ ఇతి సంతోష్టవ్యమ్. 25.

## బాలానందిని

ఏవమితి :-ఇట్లు ప్రాప్తించగా - వీటికి విద్యలలో ఉపసంహారం లేదని అంటున్నాం. ఎందువల్ల? వేధాదుల అర్థభేదంవల్ల. "హృదయం ప్రవిధ్య" ఇత్యాదిమంత్రాల, హృదయాన్ని చీల్చివేయడం మొదలైన అర్థాలు భిన్నమైనవి; అవి ఉపనిషత్తులలో చెప్పబడిన విద్యలతో సంబంధం లేనివి. వాటికి ఆ విద్యలతో సంబంధించడానికి సామర్థ్యం లేదు. (ప్రశ్న) హృదయం ఉపాసనలలో కూడ ఉపయోగిస్తుంది గాన ఆ హృదయం ద్వారా ఉపాసనలతో సంబంధం చెప్పబడింది కదా? (సమాధానం) అది కాదు అంటాం. కేవలం హృదయాన్ని మాత్రం చెపితే ఏదో విధంగా ఇలాంటి ఉపయోగాన్ని ఊహించవచ్చునేమో. ఇక్కడ మంత్రార్థం హృదయం మాత్రం కాదు. "హృదయం ప్రవిధ్య, ధమనీః ప్రవృజ్య" ఇత్యాది మంత్రం సమస్తమైన మంత్రార్థం విద్యలతో సంబంధించదు. ఇది అభిచార ప్రక్రియకు సంబంధించిన అర్థం. అందుచేత 'సర్వం ప్రవిధ్య' అనే మంత్రానికి ఆభిచారికకర్మతోనే సంబంధం. అట్లే "దేవసవితః ప్రసువ యజ్ఞమ్" అనే మంత్రంలో యజ్ఞాన్ని ప్రసవించడం (చేయడం)అనే లింగం ఉండడంచేత దీనికి కర్మతో సంబంధం. ఏ యజ్ఞవిశేషంతో సంబంధం అనే విషయం ఇతరప్రమాణాలచేత గ్రహించబడుతుంది. (ఈ వాక్యానికి "ప్రదక్షిణతోఽగ్నిం పర్యుక్షేత్" అనే వాక్యంవల్ల అగ్నిపర్యుక్షణంలోను, "సావిత్రం జుహోతి కర్మణః పురస్తాత్ సవనసేవనే జుహోతి" అనే వాక్యాన్ని బట్టి వాజపేయం అనే ఒకానొక కర్మతోను సంబంధం). ఈ విధంగా ఉపనిషత్తులలో పఠింపబడినవైనా ఇతరమంత్రాలకు కూడ కొన్నింటికి లింగంచేత, కొన్నింటికి వచనంచేత, కొన్నింటికి మరొక ప్రమాణంచేత మరొక అర్థంలో వినియోగం ఉంటుంది గాన సంనిధిమాత్రంచేత విద్యలకు అంగాలవడం కుదరదు. సంనిధి శ్రుత్యాదులకంటె దుర్బలమైన దని ప్రథమతంత్రంలో (పూర్వమీమాంసలో)శ్రుతిలింగేత్యాదిసూత్రంలో చెప్పబడింది.

వి. ఏ మంత్రాన్ని ఏ కర్మయందు వినియోగించాలి, ఏది దేనికి అంగము అని

నిర్ణయించడానికి - శ్రుతి, లింగం, వాక్యం, ప్రకరణం, స్థానం, సమాఖ్య అనేవి ఉపయోగి స్తాయి. ఒక స్థలంలో వీటిలోని రెండు లేదా మూడు గాని లేదా అధిక సంఖ్యగలవిగాని చేరినప్పుడు, అనగా శ్రుతిచేత ఒక విధంగాను, లింగంచేత మరొక విధంగాను, వాక్యంచేత మరొక విధంగాను నిర్ణయించవలసివచ్చి నప్పుడు దేనిని గ్రహించాలి అని సందేహం వచ్చినప్పుడు, పూర్వ పూర్వం ఉత్తరోత్తరం కంటె అధికబలం గలది అని ఈ సూత్రానికి అర్థం. లింగాదు లైదింటికంటె శ్రుతి బలీయమైనది. లింగం వాక్యాదులు నాల్గింటికంటె బలీయమైనది. వాక్యం ప్రకరణాదులు మూడింటికంటె బలీయమైనది. ఈ విధంగానే మిగిలినవి కూడ. ఒక చోట లింగంచేత నిర్ణయించాలనుకొన్నప్పుడు అదే విషయంలో దానికి విరుద్ధమైన శ్రుతి ఉంటే ఆ శ్రుతిని పట్టి నిర్ణయించాలి కాని లింగాన్ని పట్టి నిర్ణయించగూడదు. శ్రుతి లేకపోతే లింగాన్ని పట్టి నిర్ణయించవచ్చు. లింగం ఒక విధంగాను వాక్యం ఒక విధంగాను ఉన్నప్పుడు వాక్యాన్ని బాధించి లింగాన్నే అనుసరించాలి. ఇదే ఇతరమైనవాటి విషయంలో కూడ.

(1)శ్రుతి . ఇతరాపేక్ష ఏదీ లేకుండా ప్రత్యక్షంగా ఒక విషయాన్ని విధించే శబ్దం "శ్రుతి". "కదా చన స్తరీరసి" ఇత్యాదిమంత్రం ఉంది. ఈ మంత్రం అర్థం పరిశీలించగా ఇది ఇంద్రుణ్ణి స్తుతించే మంత్రం అని తెలుస్తూన్నది. దీనిని పట్టి ఈ మంత్రంతో ఇంద్రోపస్థానం (ఇంద్రస్తుతి) చెయ్యాలి అని తెలుస్తూన్నది. ఇదే లింగం. అయితే ఐన్ద్ర్యా గార్హ పత్యముపతిష్ఠతే" అని ఒక శ్రుతి ఉంది. ఈ ఇంద్రదేవతాకమైన మంత్రంచేత గార్హపత్యాగ్నిని స్తుతించాలి అని దీని అర్థం. ఈ శ్రుతి లింగంకంటె బలీయం గాన, దీనిచేత ఇంద్రుణ్ణి స్తుతించాలి అని లింగం చెపుతున్నా, అలా కాక దీనిచేత గార్హపత్యాగ్నినే స్తుతించాలి.

(2) లింగం:- దర్శపూర్ణమాసప్రకరణంలో పురోడాశాన్ని ఒక చోట ఉంచే సందర్భంలో- "స్యోనం తే సదనం కరోమి. ఘృతస్య ధారయా సుశేవం కల్పయామి; తస్మిన్ సీదామృతే ప్రతితిష్ఠ వ్రీహీణాం మేధ సుమనస్యమానః" అనే వాక్యం ఉంది. "ఓ పురోడాశమా! నీకు మంచి స్థానం కల్పిస్తున్నాను. ఆ స్థానంలో కూర్చో" అని దీని భావం. పై వాక్యంలోని "స్యోనం......కల్పయామి" అనే భాగాన్ని చదవగానే దాని అర్థాన్ని పట్టి ఈ మంత్రం సదనానికి, స్థానం ఏర్పరచడానికి, అంగం అని తెలుస్తూన్నది. తరువాతి వాక్యంతో కలిపితే కూర్చోపెట్టడం అనే అర్థం కూడ తెలుస్తూన్నది. అందుచేత మొత్తం వాక్యాన్ని పట్టి ఈ మంత్రం అంతా సాదనానికి లేదా సదన-సాదనాలు రెండింటికి అంగం అని చెప్పడానికి

అవకాశం ఉంది. కాని మొదటి అర్ధంయొక్క అర్థాన్ని పట్టి, అనగా లింగాన్ని పట్టి, ఆ పూర్వార్థం సదనానికే అంగమని గ్రహించాలి కాని మొత్తం మంత్రం అంతా వాక్యం అనే ప్రమాణాన్ని పట్టి సాదనానికో, సదనసాదనాలు రెండింటికో అంగం అని గ్రహించకూడదు అని నిర్ణయించబడింది. ఈ విధంగా లింగం వాక్యంకంటె బలీయం గాన మంత్రంలోని పూర్వార్థం సదనకరణానికి అంగం. - పురుడోశాన్ని ఉంచే చోటు చేస్తున్నప్పుడు పఠించదగినది అని అర్థం.

(3) వాక్యం :- దర్శపూర్ణమాసప్రకరణంలో "ఇన్ద్రాగ్నీ ఇదం హవిరజుషేతాం మహో జ్యాయో ఽక్రాతామ్" అనే మంత్రం ఉంది. దీనిలో 'ఇంద్రాగ్నీ' అనే లింగం ఉండడంచేత (ఇంద్రాగ్నులు దర్శయాగదేవతలు)ఇది దర్శాంగం అని తెలుస్తున్నది. ఇంక మిగిలిన "ఇదం హవిః" ఇత్యాదివాక్యం "ఇంద్రాగ్నీ" అనే దానితో అన్వయిస్తున్నది. అందుచేత ఇది కూడ దర్శాంగమా లేక ఈ మంత్రం దర్శపూర్ణమాసప్రకరణంలో పఠించబడడంచేత దర్శపూర్ణమాసాలు రెండింటికీ అంగమా అని సందేహం. కాని ప్రకరణంకంటె వాక్యం అధికబలం గలది గాన ఇది కేవలం దర్శకు మాత్రమే అంగం అని నిర్ణయించబడింది.

(4) ప్రకరణమ్ :- ప్రకరణం అనగా పరస్పరాకాంక్ష.. రెండు విషయాలు చెప్పబడ్డాయి. మొదటిదానికి ఆకాంక్ష ఉంటుంది-ఎలా చెయ్యాలి అని. రెండవదానికి ఇది చేసి దేన్ని సంపాదించాలి అని ఆకాంక్ష ఉంటుంది. అప్పుడు ఆ రెండు వాక్యాలను కలిపి అన్వయించుకుంటే ఎలా చెయ్యాలో, ఏమి సాధించాలో తెలుస్తుంది. ఇది ప్రకరణం. రాజసూయయాగం అనే యాగం స్వారాజ్యం అనే ఫలంకోసం విధించబడింది దానికి అంగంగా కొన్ని కర్మలు విధించబడ్డాయి. వాటిలో అభిషేచనీయం అనే సోమయాగం ఒకటి. దాని సంనిధిలో "అక్షైర్దీవ్యతి. రాజన్యం జినాతి" ఇత్యాదివాక్యాలున్నాయి. "పాచికలు ఆడాలి, రాజులను జయించాలి" అని వీటి అర్థం. ఈ అక్షదేవనాదులు దగ్గర ఉన్న అభిషేచనీయానికి అంగాలా లేక రాజసూయానికి అంగాలా అని సంశయం. అభిషేచనీయానికి దగ్గర ఉన్నాయి గాన దానికి అంగాలని చెప్పవలసి ఉండగా ప్రకరణాన్ని పట్టి రాజసూయానికే అంగములని నిశ్చయించబడింది. ఇది ప్రకరణం స్థానంకంటె బలవత్తరం అనడానికి ఉదాహరణం.

(5)స్థానం :-ఒకే ప్రదేశంలో చెప్పడం లేదా చెయ్యడం స్థానం. (పాఠం కాని అనుష్ఠానం కాని ఒకే ప్రదేశంలో ఉండడం స్థానం. ఇదే సంనిధి). "శున్ధధ్వం దైవ్యాయ కర్మణే దేవయజ్యాయై"" అనే మంత్రం పౌరోడాశికం అనే పేరు గల మంత్రకాండంలో ఉంది. అయితే ఈ మంత్రం సాంనాయ్యయాగాంగం దగ్గర పఠించబడింది. ఈ మంత్రం పౌరోడాశికం అనే పేరును (సమాఖ్యను) పటి పురోడాశపాత్రాంగమా లేక సంనిధినిపట్టి సాంనాయ్యపాత్రాంగమా అని సంశయం కలిగినప్పుడు సమాఖ్యకంటె స్థానం (సంనిధి)బలీయం గాన సాంనాయ్యపాత్రాంగం అని నిర్ణయించబడింది.

(6)సమాఖ్య అనగా యౌగికశబ్దం (యోగార్థం చెప్పడానికి వీలున్న శబ్దం) "హోతృచమసః" అని ఒక పేరు ఉంది. అనగా హోతయొక్క చమసం అని అర్థం. ఈ అర్థాన్ని పట్టి హోత అనే ఋత్విక్కు చమసభక్షణానికి అంగం అని తెలుస్తూన్నది. ఇవి శ్రుత్యాదుల సంక్షిప్తరూపం. విస్తృతంగా మీమాసాన్యాయప్రకాశాదులలో వీటి స్వరూపం నిరూపించబడింది. ఈ విధంగా సంనిధి (స్థానం)అనేది శ్రుతి-లింగ-వాక్య-ప్రకరణాలు ఐదింటికంటె దుర్బలం గాన శ్రుత్యాదులచేత ఒక విధంగా అంగాంగిభావం నిర్ణయించడానికి వీలున్నప్పుడు సంనిధి అకించిత్కరం అని అర్థం.

**తథేతి**:-అట్లే మరొకచోట వినియోగింపబడిన ప్రవర్గ్యాదికర్మలు కూడ విద్యలకు అంగా లవడం యుక్తం కాదు. వీటికి విద్యలతో ఏకకార్యం ఏదీ లేదు. (ఇవీ విద్యలూ కలిసి సాధించదగిన కార్యం ఏదీ లేదు కదా?) బృహస్పతిసవం వాజపేయంతో సంబంధించడానికి "వాజపేయేనేష్ట్వా బృహస్పతిసవం యజేత" అనే వినియోగాంతరం (మరియొక వినియోగాన్ని చెప్పే వాక్యం)ఉంది. మరొక విషయ మేమనగా-ఒకే సారి ఉత్పన్నమైన (విధించబడిన)ఈ ప్రవర్గ్యం అధికబలం గల ఒక ప్రమాణంచేత ఒక చోట వినియుక్త మైపోయిన తరవాత దుర్బలమైన (మరొక) ప్రమాణంచేత మరొక చోట కూడ వినియోగించబడడానికి తగదు. రెండు ప్రమాణాల విశేషం తెలియనప్పుడు ఇలా జరిగితే జరగవచ్చును. ఒకటి బలం కలది రెండవది దుర్బలమూ అయిన రెండు ప్రమాణాల విశేషం గ్రహించబడకపోవడం ఉండదు. ఈ బలవదబలవత్త్వమే విశేషం.

ఏ. రెండు ప్రమాణాలు సమానబలము లైనప్పుడు ఒక ప్రమాణంచేత ఒక చోట వినియోగించబడినది ఆ ప్రమాణం వంటి బలమే గల మరొక ప్రమాణంచేత మరొక చోట

వినియోగింపబడవచ్చునేమో కాని ఒక ప్రమాణం బలము కలది మరొకటి దుర్బలమూ అయినప్పుడు బలం గల ప్రమాణంచేత వినియోగం చేయబడిన తరవాత తిరిగి దుర్బలమైన ప్రమాణం మరొక చోట వినియోగింపచేయజాలదు. ఇక్కడ సంనిధి అనేది అన్నింటికంటె దుర్బలప్రమాణం. ఇతరములైన శ్రుత్యాదిప్రమాణాలచేత వినియోగం చేయబడినదానికి తిరిగి సాంనిధ్యమాత్రంచేత మరొక వినియోగం కుదరదు అని భావం.

తస్మాదితి :-ఆ కారణంవల్ల ఈ రకాలవైన మంత్రాలకు గాని, కర్మలకు గాని సంనిధిపాఠమాత్రంచేత విద్యాశేషత్వం ఉంటుందని ఆశంకించకూడదు. వాటి దగ్గర వీటిని పఠించడం ఎందువల్ల జరిగినదనగా అవీ అరణ్యంలోనే పఠించాలి, ఇవీ (విద్యలూ)అరణ్యంలోనే పఠించాలి గాన అది ఒకదాని సంనిధిలో ఒకటి పఠింపబడ్డాయి అని సమాధానం చెప్పుకొని సంతోషించాలి. 25.

వేధాద్యధికరణం సమాప్తం

15. హాన్యధికరణమ్. సూ.26.

సూ. హానౌ తూపాయనశబ్దశేషత్వాత్కుశాచన్దఃస్తుత్యుపగానవత్తదుక్తమ్. 3.3.26.

అస్తి తాణ్డినాం శ్రుతిః-"అశ్వ ఇవ రోమాణి విధూయ పాపం, చన్ద్ర ఇవ రాహోర్ముఖాత్ప్రముచ్య ధూత్వా శరీరమకృతం కృతాత్మా బ్రహ్మలోకమభిసంభవామి" (ఛా.ఉ.8.13.1) ఇతి. తథాథర్వణికానామ్ "తథా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరఞ్జనః పరమం సామ్యముపైతి (ము.ఉ.3.2.8)ఇతి. తథా శాట్యాయనినః పఠన్తి "తస్య పుత్రా దాయముపయన్తి సుహృదః సాధుకృత్యాం ద్విషన్తః పాప కృత్యామ్" ఇతి. తత్రైవ కౌషీతకినః-"సుకృతదుష్కృతే విధూనుతే తస్య ప్రియా జ్ఞాతయః సుకృతముపయన్త్యప్రియా దుష్కృతమ్" (కౌ.1.4) A ఇతి. తదిహ క్వచి త్సుకృతదుష్కృతయోర్హానం శ్రూయతే, క్వచిత్తయోరేవ విభాగేన ప్రియైరప్రియైశ్చో పాయనం, క్వచిత్తూభయమపి హానముపాయనం చ. తద్యత్రోభయం శ్రూయతే తత్ర తావన్న కించిద్వక్తవ్యమస్తి. యత్రాప్యుపాయనమేవ శ్రూయతే న హానం తత్రాప్యర్థాదేవ హానం సంనిపతతి, అన్యైరాత్మీయయోః సుకృతదుష్కృత

A. प्रियेषु स्वेषु सुकृतमप्रियेषु च दुष्कृतम् । विसृज्य ध्यानयोगेन ब्रह्माप्येति सनातनम् (मनुस्मृतिः 6-79)

యోరుపేయమానయోరావవశ్యకత్వాత్తద్ధానస్య. యత్ర తు హానమేవ శ్రూయతే నోపాయనం తత్రోపాయనం సంనిపతేద్వా న వేతి విచికిత్సాయామ్ అశ్రవణా దసంనిపాతః, విద్యాన్తరగోచరత్వాచ్చ శాఖన్తారీయస్య శ్రవణస్య. అపి చాత్మకర్తృకం సుకృతదుష్కృయోర్హానం, పరకర్తృకం తూపాయనం, తయోరసత్యావశ్యకభావే కథం హానేనోపాయనమాక్షిప్యేత? తస్మాదసంనిపాతో హానావుపాయనస్యేతి.

బాలానందిని

హానావితి :- "హానౌ=హానిని మాత్రమే చెప్పినప్పుడు, ఉపాయన శబ్దశేషత్వాత్=ఉపాయనశబ్దం శేషం అవడంవల్ల అనగా హానబ్దంచేత ఉపాయనశబ్దం అపేక్షించబడడంవల్ల, ఉపాయనం ఉపసంహరించబడుతుంది. కుశాఛన్దఃస్తుత్యుపగానవత్ =కుశాలు, ఛందస్సు, స్తుతి, ఉపగానం వీటియందు వలె, తత్=అది, ఉక్తమ్= జైమినిచేత చెప్పబడినది" అని సూత్రార్థం. భావం భాష్యంలో స్పష్టం అవుతుంది.

అస్తీతి :- "అశ్వ ఇవ.....అభిసంభవామి" అని తాండిశ్రుతి ఉన్నది. (అశ్వం రోమాలను దులిపివేసి కొన్నట్లు పాపాన్ని దులిపివేసికొని, చంద్రుడు రాహుముఖంనుండి బైటకు వచ్చి స్పష్టం అయినట్లు శరీరాన్ని విడిచిపెట్టి కృతాత్ముడనై (దేహాభిమానం నుండి ముక్తుడనై) బ్రహ్మ అనే లోకాన్ని పొందుతాను అని ఆ వాక్యానికి అర్థం). అట్లే "తథా...ఉపైతి" అని ఆథర్వణికుల వాక్యం ఉన్నది. (నదులు సముద్రంలో చేరి నామరూపాలు విడచినట్లు విద్వాంసుడు పుణ్యపాపాలు విదల్చుకొని,శుద్ధుడై పరబ్రహ్మను పొందుతాడు అని ఈ వాక్యానికి అర్థం). అట్లే శాట్యాయనినులు-"తస్య.....పాపకృత్యామ్" (వానియొక్క, మరణించిన జ్ఞానియొక్క, పుత్రులు దాయాన్ని పొందుతారు, మిత్రులు పుణ్యాన్ని పొందుతారు, ద్వేషించేవాళ్లు వాని పాపాలను పొందుతారు)అని పఠిస్తున్నారు. అట్లే కౌషీతకులు-"తత్సుకృత.... దుష్కృతమ్"(అతడు తన విద్యాబలంవల్ల పుణ్యపాపాలను దులిపివేసేస్తాడు. వాని ప్రియులైన జ్ఞాతులు సుకృతాన్ని పొందుతారు. అప్రియులు పాపాలను పొందుతారు) అని పఠిస్తున్నారు. ఈ విధంగా ఇక్కడ కొన్ని చోట్ల సుకృత దుష్కృతాలను విడవడం వినబడుతున్నది. కొన్నిచోట్ల ఆ రెండింటిని వేరు వేరుగా మిత్రులు శత్రువులు (ప్రియులు అప్రియులు)పొందుతారని వినబడుచున్నది. కొన్నిచోట్ల విడవడము తీసికొనడమూ కూడ వినబడుచున్నది. రెండూ వినబడుచున్నచోటిని గూర్చి

చెప్పవలసినది ఏదీ లేదు. ఎక్కడైతే ఉపాయనం (ప్రియాప్రియాలు పొందడం) మాత్రమే వినబడుచున్నదో అక్కడ కూడ అర్థాన్ని పట్టి హానం (విడిచిపెట్టడం)తెలుస్తూన్నది. వాని సుకృతదుష్కృతాలను ఇతరులు తీసికొంటున్నప్పుడు అతడువాటిని విడవడం తప్పదు కదా? అయితే ఎక్కడైతే విడిచిపెట్టడం మాత్రమే వినబడుతున్నదో, ఉపాయనం వినబడడం లేదో అక్కడ ఉపాయనం చేరుతుందా చేరదా అని సందేహం కలగగా, అక్కడ అది వినబడడంలేదుగాన, శాఖాంతరంలో ఉన్న ఉపాయనశ్రవణం మరొక విద్యకు సంబంధించినది అవడంచేత కూడ, అది చెప్పబడని చోట చేర్చబడదు అని చెప్పాలి మరొక విషయ మేమనగా-సుకృతదుష్కృతాలను విడవడంలో కర్త తాను, అనగా జ్ఞాని. ఉపాయనంలో కర్త పరులు. ఆ రెండింటికీ అవశ్యకత్వం లేనప్పుడు అనగా మరొకరు గ్రహిస్తేనే వాటిని విడవడం చెప్పడానికి కుదురుతుంది అన్న మాట లేనప్పుడు, హానంచేత ఉపాయనం ఎలా అక్షేపించబడుతుంది? అందుచేత హానం చెప్పినచోట ఉపాయనానికి సంనిపాతం (చేర్చుకొనడం) లేదు.

వి. మంత్రాలు, కర్మలు అనావశ్యకములు గాన విద్యలలో వాటికి ఉపసంహారం లేదు అని పూర్వాధికరణంలో చెప్పినట్లు, పరులు గ్రహించకపోయినా పుణ్యపాపాలను విడవడంలో అభ్యంతరం లేదు గాన ఉపాయనాన్ని ఉపసంహరించవలసిన పని లేదు అని దృష్టాంతసంగతితో పూర్వపక్షం.

## భాష్యమ్

అస్యాం ప్రాప్తౌ పఠతి - హానౌ త్వితి. హానౌ త్వేతస్యాం కేవలాయామపి శ్రూయమాణాయాముపాయనం సంనిపతితుమర్హతి. తచ్ఛేషత్వాత్. హానశబ్దశేషో హ్యుపాయనశబ్దః సమధిగతః కౌషీతకిరహస్యే. తస్మాదన్యత్ర కేవలహాన శ్రవణేఽప్యుపాయనానువృత్తిః.యదుక్తమ్-అశ్రవణాద్విద్యాన్తరగోచరత్వాదనావశ్య కత్వాచ్చాసన్నిపాత ఇతి; తదుచ్యతే- భవేదేషా వ్యవస్థోక్తిర్యద్యనుష్ఠేయం కించిదన్యత్ర శ్రుతమన్యత్ర నినీష్యేత. న త్విహ హానముపాయనం వానుష్ఠేయత్వేన సంకీర్త్యతే. విద్యాస్తుత్యర్థం త్వనయోః సంకీర్తనమ్-ఇత్థం మహాభాగా విద్యా యత్సామర్థ్యాదస్య విదుషః సుకృతదుష్కృతే సంసారకారణ

భూతే విధూయేతే, తే చాస్య సుహృద్ద్విషత్సు నివిశేతే ఇతి. స్తుత్యర్థే చాస్మిన్ సంకీర్తనే హానానన్తరభావిత్వేనోపాయనస్య క్వచిచ్ఛ్రుతత్వాదన్యత్రాపి హానశ్రుతౌ ఉపాయనానువృత్తిం మన్యతే స్తుతిప్రకర్షలాభాయ. ప్రసిద్ధా చార్థవాదాన్తరాపేక్షాఽర్థవాదాన్తరప్రవృత్తిః -"ఏకవింశో వా ఇతోఽసావాదిత్యః" (ఛా.ఉ. 2-10-5) ఇత్యేవమాదిషు. కథం హీహ ఏకవింశతాదిత్యస్య అభిధీయతే అనపేక్ష్యమాణేఽర్థవాదాన్తరే-"ద్వాదశమాసాః పఞ్చర్తవస్త్రయ ఇమే లోకా అసావాదిత్య ఏకవింశః" ఇత్యేతస్మిన్? తథా-"త్రిష్టుభౌ భవతః సేన్ద్రియత్వాయ" ఇత్యేవమాదిషు వాదేష్వపి "ఇన్ద్రియం వై త్రిష్టుప్" ఇత్యేవమాద్యర్థవాదాన్తరాపేక్షా దృశ్యతే. విద్యాస్తుత్యర్థ త్వాచ్చాస్యోపాయనవాదస్య కథమన్యదీయే సుకృత దుష్కృతే అన్యైరభ్యుపేయేతే ఇతి నాతీవాభినివేష్టవ్యమ్. "ఉపాయనశబ్దశేషత్వాత్" ఇతి తు శబ్దశబ్దం సముచ్చారయన్ స్తుత్యర్థామేవ హానావుపాయనానువృత్తిం సూచయతి. గుణోపసంహారవివక్షాయాం హ్యుపాయనార్థస్యైవ హానానువృత్తిం బ్రూయాత్. తస్మాద్గుణోపసంహారవిచార ప్రసంగేన స్తుత్యుపసంహారప్రదర్శనార్థ మిదం సూత్రమ్.

బాలానందిని

**అస్యామితి** :- ఈ పూర్వపక్షప్రాప్తియందు హనౌ త్వితి అని చెప్పుచున్నాడు. కేవలమైన ఈ హాని వినబడుతున్నప్పుడు కూడ ఉపాయనం వచ్చి చేరడానికి తగి ఉన్నది. ఎందువల్ల ననగా ఇది హానానికి శేషం. కౌషీతకిరహస్యంలో ఉపాయనశబ్దం హానశబ్దానికి శేషంగా కనబడుచున్నది. అందువల్ల కేవలహానశబ్దం మాత్రమే వినబడిన చోట కూడ ఉపాయనం అనువర్తిస్తుంది. వినబడకపోవడంవల్ల, మరొక విద్యకు సంబంధించిన దవడంవల్ల, అనావశ్యకం అవడంవల్లా కూడ దీనికి సంనిపాతం లేదు అని చెప్పినదానికి సమాధానం చెప్పబడుతున్నది. ఒక విద్యలో చెప్పబడిన అనుష్ఠించవలసిన కర్మ ఏదైనా మరొక చోటికి తీసికొనివెళ్లాలి అన్నప్పుడు ఈ వ్యవస్థ ఉండవచ్చును. కాని ఇక్కడ హానం కాని, ఉపాయనం గాని అనుష్ఠేయంగా చెప్పబడడంలేదు. ఈ విద్య ఎంత గొప్పదనగా- దీని సామర్థ్యంచేత సంసారానికి కారణమైన, ఈ విద్వాంసుని, సుకృతదుష్కృతాలు

విదల్చివేయబడతాయి. అవి పోయి వాని మిత్రులను శత్రువులను ఆశ్రయిస్తాయి అని విద్యను స్తుతించడంకొరకే ఇవి చెప్పబడుచున్నాయి. ఈ సంకీర్తనం కేవలం స్తుతికొరకే అని నిశ్చితమైనది గాన ఆ స్తుతికే మరికొంచెం ప్రకర్ష రావడంకోసమే (సూత్రకారుడు) హానం తరవాత కొన్ని చోట్ల ఉపాయనం వినబడుతున్నది గాన, అది(ఉపాయనం) వినబడని చోట కూడ హానం వినబడిన చోట దాని అనువృత్తి (ఉపాయనానువృత్తి) ఉంటుందని తలచుచున్నాడు "ఏకవింశో...అదిత్యః" (ఈ భూలోకం నుండి ఆదిత్యుడు ఇరవై ఒకటవ వాడు) ఇత్యాద్యర్థవాదలలో ఒక అర్థవాద మరొక అర్థవాదను అపేక్షించడం కనబడుచున్నది. "ద్వాదశ.....ఏకవింశః" (పన్నెండు మాసాలు, ఐదు ఋతువులు (హేమంతశిశిరాలను ఒక్కటిగా లెక్కపెట్టగా) ఈ మూడు లోకాలు, ఈ సూర్యుడు ఇరవై ఒకటవ వాడు)అనే మరొక అర్థవాదను అపేక్షించకపోతే ఇక్కడ (పైన చెప్పిన "ఏకవింశో వా" ఇత్యాద్యర్థవాదంలో) ఆదిత్యుడు ఇరవై ఒకటవవాడుగా చెప్పడం ఎలా కుదురుతుంది? అట్లే "త్రిష్టుభౌ భవతః సేన్ద్రియత్వాయ" ఇత్యాదివాదాలలో (అర్థవాదలలోకూడ "ఇన్ద్రియం వై త్రిష్టుప్" మొదలైన ఇతరార్థవాదం అపేక్ష కనడుచున్నది. (యజ్ఞాన్ని పురుషుడుగా కల్పించే ఘట్టంలో "సేన్ద్రియత్వాయ త్రిష్టుభౌ భవతః" (త్రిష్టుప్పులు రెండూ ఇంద్రియాలు ఉండడానికి వర్తిస్తాయి)అని బహ్వృచబ్రాహ్మణంలో చెప్పబడింది. త్రిష్టుమ్ అనేది ఛందస్సు కదా, దానికి ఇంద్రియత్వకల్పన ఎలా కుదురుతుంది అని ఆశంక కలిగినప్పుడు "ఇంద్రియం వై త్రిష్టుభ్" అనే యజుర్వేదవాక్యం అక్కడ సంబంధిస్తుంది అని అర్థం). ఈ ఉపాయనాన్ని చెప్పే ఈ అర్థవాదం కేవలం విద్యను స్తుతించడంకోసమే చెప్పబడింది. అందుచేత ఒకరి సుకృతదుష్కృతాలు మరొకరిని ఎలా చేరుతాయి అని పట్టుదలతో వాదించ కూడదు. (సూత్రకారుడు) (ఉపాయనశేషత్వాత్ అని అనకుండా) "ఉపాయనశబ్దశేషత్వాత్" అని శబ్దశబ్దాన్ని ప్రయోగిస్తూ హానంలో ఉపాయనానువృత్తి కేవలం స్తుతికోసమే అని సూచిస్తున్నాడు. ఉపాయనం అనే గుణాన్నే ఉపసంహరించాలి అనే అభిప్రాయమైతే హానంలో ఉపాయనం అనే అర్థం అనువర్తిస్తుంది అని చెప్పి ఉండే వాడు. (శబ్దానువృత్తి అవడంచేత ఇది మాటలో చెప్పడమే కాని నిజంగా ఉపాయనం ఉండదు అని చెప్పినట్లయింది అని భావం). అందుచేత గుణోపసంహారాన్ని విచారించే ప్రసంగంలో ఈ సూత్రం స్తుత్యుపసంహారాన్ని చెప్పడం కోసం ఉద్దిష్ట మైనది. (అనగా

వాస్తవంలో ఇక్కడ గుణోపసంహారం లేదు గాన ఈ ఘట్టంలో ఈ సూత్రం చెప్పడం యుక్తం కాకపోయినా ఏదో ఒక సంహారం చెపుతూన్న సందర్భంలో స్తుత్యుపసంహారం చెప్పదాం అనే ఉద్దేశ్యంతో ఇక్కడ పఠించబడింది అని భావం).

భాష్యమ్

"కుశాఛన్దఃస్తుత్యుపగానవత్" ఇత్యుపమానోపాదానమ్. తద్యథా భాల్లవినామ్ -" కుశా వానస్పత్యాః స్థ తా మా పాత" ఇత్యేతస్మిన్నిగమే కుశానామవిశేషేణ వనస్పతియోనిత్వేన శ్రవణే శాట్యాయనినామ్ "ఔదమ్బరాః కుశాః" ఇతి విశేషవచనాదౌదమ్బర్యః కుశా ఆశ్రీయన్తే, యథా చ క్వచిద్దేవాసురచ్ఛన్దసామవిశేషేణ పౌర్వాపర్యప్రసంగే "దేవచ్ఛన్దాంసి పూర్వాణి" ఇతి పై ఙ్గామ్నానాత్ప్రతీయతే, యథా చ షోడశిస్తోత్రే కేషాం చిత్కాలవిశేషప్రాప్తౌ "సమయాధ్యుషితే సూర్యే" ఇత్యార్చశ్రుతేః కాలవిశేషప్రతిపత్తిః, యథైవ చావి విశేషేణోపగానం కేచిత్సమామనన్తి విశేషేణ భాల్లవినః, యథైతేషు కుశాదిషు శ్రుత్యన్తరగతవిశేషాన్వయ ఏవం హానావప్యుపాయనాన్వయః ఇత్యర్థః. శ్రుత్యన్తరకృతం హి విశేషం శ్రుత్యన్తరేఽనభ్యుపగచ్ఛతః సర్వత్రైవ వికల్పః స్యాత్. స చాన్యాయ్యః సత్యాం గతౌ. తదుక్తం ద్వాదశలక్షణ్యామ్-"అపి తు వాక్యశేషత్వాత్పర్యుదాసః స్యాత్ప్రతిషేధే వికల్పః స్యాత్" (జై.సూ.10.8.15) ఇతి.

బాలానందిని

కుశేతి :- "కుశాఛన్దఃస్తుత్యుపగానవత్" అనేది ఉపమాగ్రహణం. అదెట్లనగా "కుశాః....పాత" (ఓ కుశములారా! మీరు వనస్పతులకు, (అరణ్యంలో ఉండే పెద్ద వృక్షాలకు)సంబంధించిన వారు. అట్టి మీరు నన్ను రక్షించండి)అనే భాల్లవుల నిగమంలో విశేషం ఏమీ లేకుండా కుశలు, అన్ని కుశలూ కూడ, వనస్పతినుండి పుట్టినవిగా చెప్పబడ్డాయి. అయితే శాట్యాయనులు "ఔదుమ్బరాః కుశాః" (ఉద్దుంబరవృక్షంనుండి పుట్టిన కుశలు అని విశేషం చెప్పడంచేత "కుశా వానస్పత్యాః" అన్నప్పుడు ఉదుంబరవృక్షం నుండి పుట్టిన కుశలు (ఉద్గాత స్తోత్రాలు లెక్కపెట్టడంకోసం తీసుకున్న ఉదుంబరవృక్షం

యొక్క నన్నని పుల్లలు)గ్రహించబడతాయి. ఇంకా ఎట్లనగా- ఒక చోట దేవాసురఛంద స్సులకు విశేషం ఏదీ లేకుండా పౌర్వాపర్యం ప్రసక్త మైనప్పుడు (ముందు వెనుకల విషయంలో నియమం లేదు అన్న స్థితి ఉన్నప్పుడు) "దేవఛన్దాంసి పూర్వాణి" (దేవచందస్సులను ముందు చదవాలి) అని పైంగిశాఖలోని ఆమ్నానంవల్ల పౌర్వాపర్యం తెలుస్తూన్నది.

ఏ.తొమ్మిది అక్షరా లున్నవి అసురచ్ఛందస్సులు. వాటికంటె భిన్నమైనవి దైవచ్ఛందస్సులు. ఒక చోట "ఛన్దోభిః "(ఛందస్సులచేత స్తుతించాలి)అన్నప్పుడు ముందు ఏవి చదవాలి తరవాత ఏవి చదవాలి అని నియమం కనబడడంలేదు. కాని పైంగ్యామ్నానంలో దేవచ్ఛందస్సులు ముందు చదవాలి అని చెప్పడంచేత ఆ నియమం ఇక్కడ కూడ పాటించబడుతుంది.

యథాచేతి :- ఇంకా ఎట్లనగా - షోడశిస్తోత్రవిషయంలో కొందరికి (ఛందోగులు మొదలైనవాళ్లకు) ఆ స్తోత్రం చదవవలసిన కాలాన్ని గూర్చి విశేషం ఏదీ చెప్పబడలేదు. అలాంటప్పుడు "సమయాధ్యుషితేసూర్యే" (సూర్యుడు ఉదయసమయంలో ఉండగా అని రత్నప్రభ. అస్తమయసన్నిహితుడై ఉండగా అని బ్ర.వి. అ) అనే ఆర్చశ్రుతివల్ల (ఆర్చు లనగా ఋగధ్యయనం చేసినవారు) కాలవిశేషంయొక్క జ్ఞానం కలుగుతుంది. ఇంకా ఎట్లనగా-కొందరు విశేషం ఏమీ లేకుండా ఉపగానాన్ని చెపుతున్నారు. భాల్లవులు విశేషం చెపుతున్నారు. (ఉద్గాతలు గానం చేస్తూన్నప్పుడు మిగిలిన ఋత్విక్కులు చేసే 'హో' అనే ధ్వని ఉపగానం. 'ఋత్విజ ఉపగాయన్తి' అనే వాక్యం విశేషం ఏమీ లేకుండా ఋత్విక్కులం దరూ ఉపగానం చెయ్యాలి అని చెపుతూన్నది. "నాధ్వర్యురుపగాయతి" అని భాల్లవులు అధ్వర్యువు ఉపగానం చేయకూడదు అని చెపుతున్నారు. దీనిని బట్టి మొదటి వాక్యంలో ఋత్విక్కు లనగా అధ్వర్యుడు తప్ప మిగిలిన ఋత్విక్కులు అని అర్థం చెప్పబడింది). ఈ కుశాదుల విషయంలో ఏ విధంగా ఇతరశ్రుతులలో ఉన్న విశేషాల అన్వయం అంగీకరించబడిందో అట్లే హానంలో ఉపాయనాన్వయం చెయ్యాలి అని అర్థం. ఒక శ్రుతిలో చెప్పిన విశేషాల్ని మరొక శ్రుతిలో అన్వయించక పోయిన ట్లయితే అన్ని చోట్ల వికల్పం చెప్పవలసిన అవసరం ఏర్పడుతుంది. గతి ఉన్నపుడు వికల్పం చెప్పడం అన్యాయ్యం.

ఎ. ఉదాహరణకి - "ఋత్విక్కులు ఉపగానం చెయ్యాలి" అని చెప్పి అధ్వర్యువు చేయకూడదు అని చెప్పినప్పుడు ఈ రెండు వాక్యాలకీ ఏకవాక్యత కల్పించి అధ్వర్యువు తప్పమిగిలినవాళ్లు ఉపగానం చెయ్యాలి అని అర్థం చెప్పుకొన్నాం. అలా కాకపోతే అధ్వర్యువు మొదటి వాక్యాన్ని పట్టి ఉపగానం చేస్తే చేయవచ్చు, రెండవ వాక్యాన్ని పట్టి మానవచ్చు అని అర్థం వస్తుంది.

వికల్పం అష్టదోషదుష్టం అంటారు మీమాంసకులు. అందుచేత మరొక మార్గం ఏదీ లేకపోతే వికల్పం అంగీకరించాలని వాళ్ల సిద్ధాంతం. "వ్రీహిభిర్యజేత" (వ్రీహులతో యాగం చెయ్యాలి) "యవైర్యజేత" (యవలతో యాగం చెయ్యాలి) అని రెండు వాక్యాలున్నాయి. రెండు వాక్యాలూ ప్రమాణములే. వ్రీహులతో యాగం చేస్తే యవలకు అవకాశం ఉండదు, యవలతో చేస్తే వ్రీహులకు అవకాశం ఉండదు. రెండింటిని ఒకే యాగంలో ఉపయోగించడం కుదరదు గాన వికల్పం (వ్రీహులతో గాని యవలతో గాని అని) అంగీకరించబడింది. కాని వికల్పం అంగీకరించడంలో ఎనిమిది దోషా లుంటాయి. వ్రీహివాక్యాన్ని ఆశ్రయించినప్పుడు (1) యవవాక్యంయొక్క ఇష్టమైన ప్రామాణ్యాన్ని త్యజించడం (2) దానికి అనిష్టమైన అప్రామాణ్యాన్ని అంగీకరించడం (3) ఒకప్పుడు యవవాక్యాన్ని ఆశ్రయిస్తే అంతకు మునుపు విడవబడిన ప్రామాణ్యాన్ని స్వీకరించడం, (4) స్వీకరించిన అప్రామాణ్యాన్ని విడిచిపెట్టడం అనే నాలుగు దోషాలు యవవాక్యం విషయంలో ఏర్పడతాయి. అట్లే యవవాక్యాన్ని ఆశ్రయించి నప్పుడు (1) వ్రీహివాక్యం యొక్క ఇష్టమైన ప్రామాణ్యాన్ని విడిచిపెట్టడం (2) దానికి అనిష్టమైన అప్రామాణ్యాన్ని స్వీకరిచడం (3) ఒకప్పుడు వ్రీహి వాక్యాన్ని ఆశ్రయిస్తే విడచిన దాని ప్రామాణ్యాన్ని మళ్లీ గ్రహించడం (4) స్వీకరించిన అప్రామాణ్యాన్ని విడిచిపెట్టడం అనే నాలుగు దోషాలు వ్రీహివాక్యంవిషయంలో ఏర్పడతాయి. ఈ విధంగా వికల్పాన్ని ఆశ్రయించిన ప్రతీ స్థలంలోను ఎనిమిది దోషాలుంటాయి గాన వికల్పాన్ని అంగీకరించడం అగతికగతి. వ్రీహియవలవిషయంలో తప్పకపోవడంచేత అది గ్రహించబడింది.

తదుక్తమితి:- ఈ విషయమే ద్వాదశలక్షణియందు (పన్నెండు అధ్యాయాల గ్రంథమైన పూర్వమీమాసాశాస్త్రంలో) "అపి తు...స్యాత్" అని చెప్పబడింది.

ఎ. జ్యోతిష్టోమప్రకరణంలో "దీక్షితో న జుహోతి" (దీక్షితుడు హోమంచేయగూడదు)

అని దీక్షితునికి హోమం నిషేధించబడింది. "యావజ్జీవమగ్నిహోత్రం జుహుయాత్" జీవించి ఉన్నంతకాలం అగ్నిహోత్రహోమం చెయ్యాలి)అని మరొక చోట చెప్పడింది. ఇక్కడ న దీక్షితవాక్యం హోమాన్ని నిషేదిస్తుంది అని చెప్పిన పక్షంలో అప్పుడు క్రత్వర్థంగా (క్రతువు చేసే టప్పుడు ఉపయోగించే విధంగా) నిషేధం పాటించాలి. అలా కాకపోతే యావజ్జీవవాక్యంచేత హోమం చెయ్యాలి అని వికల్పం ఏర్పడుతుంది. వికల్పం అష్టదోష దుష్టం. అందుచేత వికల్పాన్ని అంగీకరించకుండా యావజ్జీవవాక్యానికి నదీక్షితవాక్యం అంగం గాన ఈ వాక్యంలో ఉన్న నకారానికి పర్యుదాస అర్థం చెప్పుకొని ('న' అనే దానిని "జుహుయాత్" తో కాక దీక్షితః తో (అన్వయించి) న దీక్షితః=దీక్షితుడు కానివాడు హోమం చెయ్యాలి అని అర్థం చెప్పాలి. అప్పుడు వికల్పప్రసక్తి ఉండదు. ఈ రెండు వాక్యాలకీ ఏకవాక్యత ఏర్పడుతుంది. జైమిని సూత్రానికి- అపి తు=మరేమనగా, వాక్యశేషత్వాత్="దీక్షితః న జుహుయాత్" అనే వాక్యం "యావజ్జీవమగ్నిహోత్రంజుహోతి" అనే వాక్యానికి శేషం కాబట్టి, ఇతరపర్యుదాసః= దీక్షితేతరుల పర్యుదాస (నివారణం),స్యాత్=అవుతుంది (చెప్పాలి). ప్రతిషేధే=హోమాన్ని నిషేధించిన పక్షంలో, వికల్పః స్యాత్ =వికల్పం చెప్పవలసి వస్తుంది అని అర్థం. నఞ్ కు పర్యుదాస ప్రసజ్యప్రతిషేధం అని రెండు అర్థాలు చెపుతారు. ప్రక్కనే ఉన్న పదంతో (నామాదికంతో) నఞ్ అన్వయిస్తే అది పర్యుదాస. క్రియతో అన్వయిస్తే ప్రసజ్యప్రతిషేధం. "న అశ్వః అగచ్ఛతి" అనే వాక్యంలోని 'న', 'అగచ్ఛతి' తో అన్వయిస్తే అశ్వం రావడంలేదు అని అర్థం. ఇది ప్రసజ్యప్రతిషేధం లేదా ప్రతిషేధం. 'న' ను అశ్వః తో అన్వయిస్తే అశ్వం కానిది వస్తున్నది అని అర్థం. ఇది పర్యుదాసం.

"పర్యుదాసః స విజ్ఞేయః యత్రోత్తరపదేన నఞ్,
ప్రతిషేధః స విజ్ఞేయః క్రియయా సహ యత్ర నఞ్"

"ప్రతిషేధః స విజ్ఞేయః" కు బదులు "ప్రసజ్యప్రతిషేధోఽయమ్" అను పాఠం కొందరు కల్పించారు. అది యుక్తం కాదు అని మీమాంసాన్యాయప్రకాశవ్యాఖ్యానంలో మ.మ.చిన్నస్వామిశాస్త్రిగారు. పేజి. 162. ఈ హిందీ వ్యాఖ్యానసహిత గ్రంథంలో పేజీ 417.

భాష్యమ్

అథవా - ఏతాస్వేవ విధూననశ్రుతిషు ఏతేన సూత్రేణ ఏతచ్చిన్తయితవ్యమ్- కిమనేన ధూననవచనేన సుకృతదుష్కృతయోర్హానమభిధీయతే, కిం వాఽర్థాన్తరమితి. తత్ర చైవం ప్రాపయితవ్యమ్-న హానం విధూననమభిధీయతే, "ధూఞ్ కమ్పనే" ఇతి స్మరణాత్ "దోధూయన్తే ధ్వజాగ్రాణి" ఇతి చ వాయునా చాల్యమానేషు ధ్వజాగ్రేషు ప్రయోగదర్శనాత్. తస్మాచ్చాలనం విధూననమభిధీయతే. చాలనం తు సుకృత దుష్కృతయోః కం చిత్కాలం ఫలప్రతిబన్ధాదిత్యేవం ప్రాపయ్య ప్రతివక్తవ్యమ్-హానావేవైష విధూననశబ్దో వర్తితుమర్హతి. ఉపాయనశబ్దశేషత్వాత్. న హి పరపరిగ్రహభూతయోః సుకృతదుష్కృతయోరప్రహీణయోః పరైరుపాయనం సంభవతి. యద్యపీదం పరకీయయోః సుకృతదుష్కృతయోః పరైరుపాయనం నాఞ్జసం సంభావ్యతే తథాపి తత్సంకీర్తనాత్తావత్త దానుగుణ్యేన హానమేవ విధూనన నామేతి నిర్ణేతుం శక్యతే. క్వచిదపి చేదం విధూననసంనిధావుపాయనం శ్రూయమాణం కుశాఛన్దఃస్తుత్యుపగానవద్విధూననశ్రుత్యా సర్వత్రాప్యపేక్ష్యమాణం సార్వత్రికం నిర్ణయకారణం సంపద్యతే. న చ చాలనం ధ్వజాగ్రవత్సుకృతదుష్కృతయోర్ముఖ్యం సంభవతి, అద్రవ్యత్వాత్. అశ్వశ్చ రోమాణి విధున్వానః త్యజన్ రజః సహైవ తేన రోమాణ్యపి జీర్ణాని శాతయతి. "అశ్వ ఇవ రోమాణి విధూయ పాపమ్" (ఛా.ఉ.8.13.1) ఇతి చ బ్రాహ్మణమ్. అనేకార్థత్వాభ్యుపగమాచ్చ ధాతూనాం న స్మరణవిరోధః. తదుక్తమితి వాఖ్యాతమ్. 26.

బాలానందిని

అథవేతి :- లేదా-ఈ విధూననశ్రుతుల విషయంలోనే ఈ సూత్రంచేత - ఈ విధూననవాక్యంచేత సుకృత దుష్కృతాలను విడవడం చెప్పబడుతుందా లేక మరొక అర్థమేదైనా చెప్పబడుతుందా అని విచారణ చెయ్యాలి. అప్పుడు ఈ విధంగా (పూర్వపక్షం)

ప్రాప్తింపచెయ్యాలి. "ధూఞ్ కమ్పనే" అను వ్యాకరణస్మృతిని అనుసరించి ధూఞ్ ధాతువునకు కదల్చడం అనే అర్థం మాత్రమే ఉండడంవల్ల విధూననం అనగా హానం (విడిచిపెట్టడం) అని అర్థం చెప్పబడదు. గాలికి కదలచున్న ధ్వజాగ్రాలను గూర్చి చెపుతూ "దోధూయన్తే ధ్వజాగ్రాణి" (జెండాల చివరి భాగాలు ఎక్కువగా కదలుచున్నవి)అని ప్రయోగం కనబడుచున్నది. అందుచేత విధూననం అనగా చాలన మని మాత్రమే అర్థం. సుకృతదుష్కృతాల చాలనం అనగా కొంతకాలం పాటు అవి తమ ఫలం ఇవ్వకుండా అడ్డుకొనడం, అని పూర్వపక్షాన్ని ప్రాప్తింపజేసి ఈ విధంగా సమాధానం చెప్పాలి. విధూననశబ్దానికి ఉపాయనశబ్దం శేషంగా ఉండడంవల్ల ఈ శబ్దం (విధూననశబ్దం) హానాన్నే బోధించడానికి తగి ఉంది. ఒకరి సొత్తుగా ఉన్న సుకృత దుష్కృతాలు వారి నుండి విడివడి బైటకు వస్తేనే కాని ఇతరులు వాటిని గ్రహించడం కుదరదు కదా? నిజానికి పరులకు సంబంధించిన సుకృతదుష్కృతాలను మరొకరు గ్రహించడం అనేది యుక్తంగా ఉన్నట్లు ఊహించడానికి శక్యం కాకపోయినా, అలా చెప్పడంవల్ల (ఇతరులచేత గ్రహించబడతాయి అని చెప్పడంవల్ల) దానికి అనుగుణంగా ఇక్కడ విధూననం అనగా హానమే అని నిర్ణయించడానికి శక్యం అవుతుంది. ఈ ఉపాయనం ఎక్కడనో, ఒకటి రెండు వాక్యాలలో మాత్రమే, విధూననం దగ్గర వినబడుతున్నా కూడా కుశాఛన్దః స్తుత్యుపగానముల వలె విధూననశ్రుతిచేత (ఉపాయనం చెప్పబడని ఇతరవాక్యాలలో విధూననశబ్దం వినబడడంచేత) అన్ని వాక్యాలలోను అపేక్షితమై అన్నింటిలోను సంబంధిస్తుంది అని నిర్ణయించడానికి కారణం అవుతుంది. సుకృతదుష్కృతాలు ద్రవ్యాలు కావు గాన ధ్వజాగ్రముల విషయంలో వలె వీటి విషయంలో ముఖ్యమైన చాలనం కుదరదు. అశ్వం రోమాలు దులుపుకొంటూ శరీరానికి అంటిన ధూళినీ, దానితో పాటు జీర్ణములైన రోమాలనూ కూడ క్రింద పడవేస్తుంది. అందుచేతనే "అశ్వ ఇవ రోమాణి విధూయ పాపమ్" అని బ్రాహ్మణం చెపుతున్నది. ధాతువులు అనేకార్థములని అంగీకరించబడింది గాన వ్యాకరణస్మృతి విరోధం లేదు. (హానౌ తూపాయనేత్యాదిసూత్రంలో ఉన్న) "తదుక్తమ్" అనేది వెనుకనే (జైమినిసూత్రోదాహకరణపూర్వకంగా) వ్యాఖ్యానించబడింది.

వి. పూర్వవర్ణకంలో విధూననం అనగా హాని అనే అర్థాన్ని సిద్ధవత్‌గా చేసికొని

ఉపాయనోపసంహారం చెప్పబడింది. ఈ వర్ణకంలో హాని అనే అర్థమే సాధించబడినది, ఇదే రెండు వర్ణకాలలో భేదం. ధాతువులు అనేకార్థాలు అనే విషయంలో ఈ క్రింది కారిక బ్రహ్మవిద్యాభరణంలో ఉదాహరించబడింది-

"క్రియావాచిత్వమాఖ్యాతుమేకోఽర్థః ప్రతిపాదితః,
ప్రయోగతోఽనుసర్తవ్యా అనేకార్థా హి ధాతవః"

ధాతువులకు ధాతుపాఠంలో చెప్పిన అర్థాలే కాక మరి కొన్ని అర్థాలుండవచ్చును అనే దానికి "కుర్ద-ఖుర్దద-గుర్ద-గుద క్రీడాయామేవ" అనే చోట ప్రయోగించిన 'ఏవ' కారం జ్ఞాపకమని వైయాకరణలే ప్రతిపాదించి ఉన్నారు. కుర్దాది ధాతువులకు క్రీడ అని మాత్రమే అర్థం అని ఏవకారం చెపుతున్నది. దీనిని పట్టి ఇతరధాతువులకు వలె ఈ ధాతువులకు చెప్పిన అర్థంకంటె అధికమైన అర్థంగ్రహించకూడదని (ఇతరధాతువులకు చెప్పిన అర్థమే కాక అర్థాంతరా లుండవచ్చునని) సూచిత మగుచున్నది అని వైయాకరణుల అభిప్రాయం అని అస్మద్వేదాన్తాచార్య వర్యులు మ.మ. శ్రీ యస్. ఆర్. కృష్ణమూర్తి శాస్త్రిగారు పాదసూచికలో సూచించిఉన్నారు. (ఉత్తరార్థం. పే.జి. 581).

హాన్యధికరణం సమాప్తం

## 16. సాంపరాయాధికరణమ్ సూ. 27-28

### సూ. సాంపరాయే తర్తవ్యాభావాత్తథా హ్యన్యే. 3.3.27

**దేవయానేన పథా పర్యఙ్కస్థం బ్రహ్మాభిప్రస్థితస్య వ్యధ్వని సుకృతదుష్కృతయోర్వియోగం కౌషీతకినః పర్యఙ్కవిద్యాయామామనన్తి - "స ఏతం దేవయానం పన్థానమాసాద్యాగ్నిలోకమాగచ్ఛతి" (కౌ.1.3) ఇత్యుపక్రమ్య "స ఆగచ్ఛతి విరజాం నదీం తాం మనసైవాత్యేతి తత్సుకృతదుష్కృతే విధూనుతే" (కౌ.1.4) ఇతి. తత్కిం యథాశ్రుతం వ్యధ్వన్యేవ వియోగవచనం ప్రతిపత్తవ్యమ్ అహోస్విదాదావేవ దేహాపసర్పణ ఇతి విచారణాయాం శ్రుతిప్రామాణ్యాత్ యథాశ్రుతి ప్రతిపత్తిప్రసక్తౌ పఠతి-సాంపరాయ ఇతి. సాంపరాయే గమన ఏవ, దేహాదపసర్పణ ఇదం విద్యాసామర్థ్యాత్సుకృతదుష్కృతహానం భవతీతి ప్రతిజానీతే.**

హేతుం వ్యాచష్టే- తర్తవ్యాభావాదితి. న హి విదుషః సంపరేతస్య విద్యయా బ్రహ్మ సంప్రేప్సతః అన్తరాలే సుకృతదుష్కృతాభ్యాం కించిత్ప్రాప్తవ్యమస్తి యదర్థం కతి చిత్ క్షణానక్షీణౌ కల్ప్యేయాతామ్. విద్యావిరుద్ధఫలత్వాత్తు విద్యాసామర్థ్యేన తయోః క్షయః. న చ యదైవ విద్యా ఫలాభిముఖీ తదైవ భవితుమర్హతి. తస్మాత్ ప్రాగేవ సన్నయం సుకృతదుష్కృతక్షయః పశ్చాత్పఠ్యతే. తథా హ్యన్యేఽపి శాఖినస్తాణ్డినః శాట్యాయనినశ్చ ప్రాగవస్థాయామేవ సుకృతదుష్కృతహాని మామనన్తి-"అశ్వఇవ రోమాణి విధూయ పాపమ్" (ఛా.ఉ.8.13.1) ఇతి. "తస్యపుత్రా దాయముపయన్తి సుహృదః సాధుకృత్యాం ద్విషన్తః పాపకృత్యామ్" ఇతి చ 27.

బాలానందిని

సాంపరాయ ఇతి:- "సాంపరాయే=దేహం విడచి వెళ్లే సమయంలోనే సుకృతదుష్కృతాలను విడిచిపెడతాడు. తర్తవ్యాభావాత్=వాటివల్ల పొందదగిన ఫలం ఏదీ లేదు కదా? అన్యే=ఇతర శాఖీయులు, తథాహి=అట్లే చెప్పుచున్నారు కదా" అని సూత్రార్థం.

దేవయానేనేతి :- పర్యంకంమీద కూర్చొని ఉన్న బ్రహ్మ దగ్గరికి వెళ్లడానికి దేవయానమార్గంలో బయలుదేరిన ఉపాసకుడు మార్గమధ్యంలో తన సుకృతుష్కృతాలను విడిచిపెడతా డని కౌషీతకులు-"స ఏతం....ఆగచ్ఛతి" (ఇతడు దేవయానమార్గం పొంది అగ్నిలోకం చేరుకుంటాడు) అని -ప్రారంభించి "స ఆగచ్ఛతి...విధూనుతే" (అతడు విరజానదిని చేరి దానిని మనస్సుచేతనే దాటివేసి, తన విద్యాప్రభావంవల్ల సుకృతదుష్కృతాలను విడిచివేస్తాడు) అని పర్యంకవిద్యలో పఠిస్తున్నారు. ఇక్కడ చెప్పబడినట్లు సుకృతదుష్కృతవియోగం మార్గమధ్యంలోనే జరుగుతుం దని గ్రహించాలా లేక అంతకు ముందే దేహపరిత్యాగకాలంలో జరిగుతుందని గ్రహించాలా అని విచారణ చేయవలసి ఉండగా ఈ శ్రుతియొక్క ప్రామాణ్యంచేత శ్రుత్యనుసారంగానే గ్రహించాలి అని చెప్పవలసి ఉండగా - "సాంపరాయే" అని పఠిస్తున్నాడు. విద్యాసామర్థ్యంవల్ల కలిగే ఈ సుకృతదుష్కృతహానం సాపరాయమునందే, గమనమునందే, దేహంనుంచి బైటకు

వెళ్లేటప్పుడే, జరుగుతుంది అని ప్రతిజ్ఞ చేస్తున్నాడు. "తర్తవ్యాభావాత్" అని హేతువును చెప్పుచున్నాడు. మరణించి విద్యచేత బ్రహ్మను పొందదలచుచున్న విద్వాంసునికి మధ్యలో సుకృతదుష్కృతాలచేత పొందవలసినది ఏదీ లేదు కదా? అలాంటి దేదైనా ఉంటే కొన్ని క్షణాల పాటు అవి క్షీణం కాకుండా ఉంటాయి అని కల్పించవలసి ఉండేది. అవి విద్యకు విరుద్ధమైన ఫలాన్ని ఇస్తాయి. అందుచేత అవి విద్యాసామర్థ్యంచేత క్షీణిస్తాయి. అలా క్షీణించడం విద్య ఫలాభిముఖం అయి నప్పుడే జరగడం యుక్తం. అందువల్ల ఈ సుకృతదుష్కృతాల క్షయం ముందుగానే జరిగినా తరవాత పఠించబడుచున్నది. అందుచేతనే ఇతరశాఖీయులు-తాండులు, శాట్యాయనినులు- "అశ్వ ఇవ రోమాణి విధూయ పాపమ్" అని "తస్య...పాపకృత్యామ్" అని కూడ ముందుగానే సుకృతదుష్కృతహానిని పఠిస్తున్నారు. 27.

సూ. ఛన్దత ఉభయావిరోధాత్ 3.3.28.

యది చ దేహాదపసృప్తస్య దేవయానేన పథా ప్రస్థితస్యార్ధపథే సుకృతదుష్కృతక్షయోఽభ్యుపగమ్యేత తతః పతితే దేహే యమనియమ విద్యాభ్యాసాత్మకస్య సుకృతదుష్కృతక్షయహేతోః పురుష ప్రయత్న స్యేచ్ఛాతోఽనుష్ఠానానుప పత్తేదనుపపత్తిరేవ తద్ధేతుకస్య సుకృతదుష్కృత క్షయస్య స్యాత్. తస్మాత్ పూర్వమేవ సాధకావస్థాయాం ఛన్దతోఽనుష్ఠానం తస్య స్యాత్, తత్పూర్వకం చ సుకృతదుష్కృతహానమితి ద్రష్టవ్యమ్. ఏవం చ నిమిత్త నైమిత్తికయోశ్చోపపత్తిః. తాణ్డిశాట్యాయనిశ్రుత్యోశ్చ సంగతిరితి. 28

బాలానందిని

ఛన్దత ఇతి:- "ఛన్దతః=స్వేచ్ఛానుసారం విద్యానుష్ఠానం జీవించి ఉన్నప్పుడే కుదురుతుంది గాన మరణనమనంతరమే లేదా మరణపూర్వక్షణంలోనే సుకృతదుష్కృతక్షయం కలుగుతుంది. ఉభయావిరోధాత్=ఇట్లు చెపితే విద్యాకర్మక్షయాల హేతుహేతుమద్భావంతోను తాండ్యాదిశ్రుతులతోను విరోధం ఉండదు" అని సూత్రార్థం.

యదీతి:- దేహంనుంచి బైటకు వచ్చి దేవయానమార్గంలో ప్రయాణమైనవాని సుకృతదుష్కృతాలు మార్గమధ్యలో క్షీణిస్తాయి అని అంగీకరిస్తే అప్పుడు, సుకృతదుష్కృతాల

క్షయానికి హేతువైన, యమ-నియమ-విద్యల అభ్యాసరూప మైన పురుషప్రయత్నం ఇచ్ఛానుసారంగా చేయడం దేహపాతానంతరం కుదరదుగాన అది (పురుషప్రయత్నం) హేతువుగా గల సుకృతదుష్కృతాల క్షయం అనుపపన్నం అవుతుంది. అందువల్ల, అనగా కర్మహానం విద్యవల్ల కలగాలి గాన మరణాత్పూర్వం సాధకావస్థలోనే ఆ ప్రయత్నం చేయడం కుదురుతుంది. ఆ ప్రయత్నాన్నిపట్టి సుకృతదుష్కృతహానం కలుగుతుంది అని గ్రహించాలి. ఈ విధంగా నిమిత్తనైమిత్తికాలకి (ఇచ్ఛాపూర్వకపురుష ప్రయత్న-సుకృతదుష్కృతహానాలకు) ఉపపత్తి ఉంటుంది. తాండి-శాట్యాయనశ్రుతలకు సంగతి కుదురుతుంది. 28.

సాంపరాయాధికరణం సమాప్తం.

### 17. గతేరర్థవత్త్వాధికరణమ్. సూ. 29.30

### సూ. గతేరర్థవత్త్వముభయథాఽన్యథా హి విరోధః 3.3.29

క్వ చిత్పుణ్యాపాపహానసంనిధౌ దేవయానః పన్థాః శ్రూయతే, క్వచిన్న. తత్ర సంశయః=కిం హానావవిశేషేణైవ దేవయానః పన్థాః సంనిపతేదుత విభాగేన క్వచిత్తం నిపతేత్ క్వచిన్నేతి. యథా తావద్ధానావవిశేషేణైవ ఉపాయనానువృత్తిరుక్తా ఏవం దేవయానానువృత్తిరపి భవితుమర్హతీత్యస్యాం ప్రాప్తావాచక్ష్మహే-గతేర్దేవయానస్య పథోఽర్థవత్త్వముభయథా భవితుమర్హతి. క్వచిదర్థవతీ గతిః క్వచిన్నేతి; నాఽవిశేషేణ. అన్యథా హ్యవిశేషేణైవాస్యాం గతావఙ్గీక్రియమాణాయాం విరోధః స్యాత్. "పుణ్యాపాపే విధూయ నిరఞ్జనః పరమం సామ్యముపైతి" (ము. ఉ. 3.1.3)ఇత్యస్యాం శ్రుతౌ దేశాన్తరప్రాపణీ శ్రుతిర్విరుధ్యేత. కథం హి నిరఞ్జనోఽగన్తా దేశాన్తరం గచ్ఛేత్? గన్తవ్యం చ పరమం సామ్యం న దేశాన్తర ప్రాప్త్యాయత్తమిత్యానర్థక్యమేవాత్ర గతేర్మన్యామహే. 29.

బాలానందిని

**గతేరితి** :- "గతేః=గమనముయొక్క అర్థవత్త్వమ్=సార్థకత్వం, ఉభయథా=వేరు వేరుగా రెండు విధాలుగా ఉంటుంది. అన్యథా=అట్లు కాక అంతటా ఒకే విధం అన్నట్లయితే, విరోధః=విరోధం కలుగుతుంది" అని సూత్రార్థం.

**క్వచిదితి** :- కొన్ని చోట్ల పుణ్యపాపాల హానం చెప్పినదాని సంనిధిలో దేవవాయమార్గం వినబడుచున్నది. కొన్నిచోట్ల వినబడడం లేదు. అక్కడ హానం ఉన్న ప్రతీ చోటా ఏ విశేషమూ లేకుండా దేవయానమార్గం చేరుతుందా (ఉపసంహరించబడుతుందా) లేదా కొన్ని చోట్ల చేరడం కొన్నిచోట్ల చేరకపోవడం అనే విభాగం ఉంటుందా అని సంశయం. హానం ఉన్నప్పుడు ఏ విశేషమూ లేకుండా ఉపాయనం అనువర్తిస్తుం దని వెనుకటి అధికరణంలో ఏ విధంగా చెప్పబడిందో అట్లే దేవయానం కూడ (విశేషం ఏమీ లేకుండ) అనువర్తిస్తుంది అని ప్రాప్తించగా చెపుతున్నాం. (ఇక్కడ ఈ విధంగా దృష్టాంతసంగతిచేత పూర్వపక్షం). గతేః=దేవయానానికి, అర్థవత్త్వం, అనగా సార్థకత్వం, ఉభయథా=విభాగంచేత (కొన్ని చోట్ల అనువృత్తి ఉండడం కొన్ని చోట్ల లేక పోవడం అనే రీతిలో) ఉండడానికి తగి ఉంటుంది. కొన్ని చోట్ల గతి ప్రయోజనం కలదిగా ఉంటుంది. కొన్ని చోట్ల ఉండదు. అలా కాక, ఏ విశేషమూ లేకుండానే ఈ గతి అంగీకరించబడితే విరోధం కలుగుతుంది. " పుణ్యపాపే....ఉపైతి" అనే శ్రుతిలో మరొక దేశానికి తీసికొనివెళ్లే గతి విరుద్ధం అవుతుంది. ఎక్కడికీ వెళ్లని విరంజనుడు దేశాంతరానికి ఎలా వెడతాడు? పొందదగిన పరమమైన సామ్యం దేశాంతరాన్ని చేరడంమీద ఆధారపడినది కాదు గాన ఇక్కడ గతి వ్యర్థమే అని తలచుచున్నాము. (సగుణవిద్యలో చెప్పబడిన మార్గం సార్థకమైనది. కాని నిర్గుణవిద్యలో ఎక్కడికీ వెళ్లే ప్రసక్తి లేదు గాన గమనవచనం నిరర్థక మని భావం).

## సూ. ఉపపన్నస్తల్లక్షణార్థోపలబ్ధేర్లోకవత్. 3.3.30

ఉపపన్నశ్చాయముభయభావః క్వ చిదర్థవతీ గతిః, క్వ చిన్నేతి; తల్లక్షణార్థోపలబ్ధేః. గతికారణభూతో హ్యర్థః పర్యఙ్కవిద్యాదిషు సగుణేషూ పాసనేషూపలభ్యతే. తత్ర హి పర్యఙ్కరోహణం, పర్యఙ్కస్థితేన బ్రహ్మణా సంవదనం, విశిష్టగన్ధాదిప్రాప్తిశ్చేత్యేవమాది బహు దేశాన్తరప్రాప్త్యాయత్తం ఫలం శ్రూయతే, తత్రార్థవతీ గతిః. న హి సమ్యగ్దర్శనార్థోపలబ్ధిరస్తి. న

హ్యాత్మదర్శినామాప్తకామానామిహైవదగ్ధాశేషక్లేశబీజానామ్ అరబ్ధభోగకర్మాశయ క్షపణవ్యతిరేకేణాపేక్షితవ్యం కిం చిదస్తి. తత్రానర్థికా గతిః. లోకవచ్చైష విభాగో ద్రష్టవ్యః యథా లోకే గ్రామప్రాప్తౌ దేశాన్తరప్రాపణః పన్థా అపేక్ష్యతే, నారోగ్యప్రాప్తౌ, ఏవ మిహాపీతి. భూయశ్చైనం విభాగం చతుర్థాధ్యాయే నిపుణతరముపపాదయి ష్యామః. 30.

బాలానందిని

ఉపపన్న ఇతి :- "ఉపపన్నః=ఈ ఉభయథాభావం, యుక్తంగా ఉంది; లోకవత్=లోకమునందు వలె, తల్లక్షణోపలబ్ధేః=సగుణవిద్యలలో గతి కారణంగా గల ఫలం కనబడడంవల్ల" అని సూత్రార్థం.

ఉపపన్న ఇతి :- కొన్ని చోట్ల గతికి ప్రయోజనం ఉంది, కొన్ని చోట్ల లేదు అని ఈ విధమైన ఉభయథాభావం ఉపపన్నమే. ఎందువల్ల ననగా తల్లక్షణార్థం కనబడుచున్నది. పర్యంకవిద్య మొదలైన సగుణోపాసనలో గతికి కారణ మైన ప్రయోజనం కనబడుతూన్నది. అక్కడ పర్యంకం ఎక్కడం, పర్యంకంమీద కూర్చొని ఉన్న బ్రహ్మతో మాట్లాడడం, విశిష్టమైన గంధాదులు పొందడం మొదలైన, దేశాంతరప్రాప్తిమీద ఆధారపడిన బహువిధమైన ఫలం వినబడుచున్నది. అందుచేత అక్కడ గతికి ప్రయోజనం ఉంటుంది. సమ్యగ్దర్శనంలో నైతే అలాంటి ప్రయోజనం ఏదీ కనబడదు. ఆప్తకాములై ఇక్కడనే సమస్తక్లేశబీజాలనూ దహింపచేసిన, ఆత్మైకత్వం చూడగలిగినవాళ్లకి భోగం ఇవ్వడం ప్రారంభించిన కర్మాశయాన్ని క్షీణింపచేసుకొనడం తప్ప చేయవలసిన పని ఏదీ లేదు గాన వాళ్ల విషయంలో గతికి ప్రయోజనం ఏదీ ఉండదు. ఈ విభాగం లోకంలో వలెనే చూడదగినది. లోకంలో మరొక గ్రామం పొందవలసి నప్పుడు మరొక ప్రదేశానికిచేర్చే మార్గంయొక్క అవసరం ఉంటుంది, ఆరోగ్యం పొందాలంటే అలాంటి మార్గం ఏదీ అవసరం ఉండదు. అట్లే ఇక్కడ కూడ. ఈ విభాగాన్ని మళ్లీ చతుర్థాధ్యాయంలో ఇంకా నేర్పుగా (స్పష్టంగా) ప్రతిపాదించగలం.30.

గతేరర్థవత్త్వాధికరణం (గత్యర్థవత్త్వాధికరణం) సమాప్తం.

## 18. అనియమాధికరణమ్ సూ. 31

**సూ. అనియమః సర్వాసామవిరోధః శబ్దానుమానాభ్యామ్. 3.3.31**

సగుణాసు విద్యాసు గతిరర్థవతీ, న నిర్గుణాయాం పరమాత్మవిద్యాయామిత్యుక్తమ్. సగుణాస్వపి విద్యాసు కాసు చిద్గతిః శ్రూయతే, యథా పర్యఙ్కవిద్యాయామ్, ఉపకోసలవిద్యాయామ్, పఞ్చాగ్నివిద్యాయామ్, దహరవిద్యాయామితి: నాన్యాసు, యథా మధువిద్యాయాం, శాణ్డిల్యవిద్యాయాం, షోడశకలవిద్యాయామ్, వైశ్వానరవిద్యాయామితి. తత్ర సంశయః-కిం యాస్వేవైషా గతిః శ్రూయతే తాస్వేవ నియమ్యేత,ఉత అనియమేన సర్వాభిరేవైవంజాతీయకాభిః విద్యాభిరభిసంబధ్యేతేతి. కి తావత్ప్రాప్తమ్? నియమ ఇతి. యత్రైవ శ్రూయతే తత్రైవ భవితుమర్హతి; ప్రకరణస్య నియామకత్వాత్. యద్యన్యత్ర శ్రూయమాణాపి గతిర్విద్యాన్తరం గచ్ఛేత్ శ్రుత్యాదీనాం ప్రామాణ్యం హీయేత: సర్వస్య సర్వార్థత్వప్రసంగాత్. అపి చార్చిరాదికైవ గతిరుపకోసలవిద్యాయాం పఞ్చాగ్నివిద్యాయాం చ తుల్యవత్ పఠ్యతే; తత్సర్వార్థకత్వేఽనర్థకం పునర్వచనం స్యాత్. తస్మాన్నియమ ఇతి.

### బాలానందిని

**అనియమఇతి** :- "సర్వాసామ్=అన్ని సగుణవిద్యలకూ, అనియమః=దేవయానం అనే గతి విషయంలో నియమం లేదు. శబ్దానుమానాభ్యామ్=శ్రుతిస్మృతులను పట్టి, అవిరోధః=విరోధం లేదు" అని సూత్రార్థం.

సగుణాస్వితి :- సగుణవిద్యలలో గతికి ప్రయోజనం ఉంటుంది, నిర్గుమైన పరమాత్మవిద్యలో ఉండదు అని చెప్పబడింది. సగుణవిద్యలలో కూడ కొన్నింటిలోనే. పర్యంకవిద్య, ఉపకోసలవిద్య, పంచాగ్నివిద్య దహరవిద్య మొదలైనవాటిలో, గతి వినబడుచున్నది. మధువిద్య, శాండిల్యవిద్య, షోడశకలవిద్య. వైశ్యానరవిద్య మొదలైన కొన్నింటిలో వినబడడంలేదు. ఈ గతి ఏ విద్యలలో వినబడుతున్నదో వాటికి మాత్రమే నియమితం కావాలా లేక ఈ విధమైన సమస్త మైన విద్యలలోను సంబంధిస్తుందా అని

సంశయం. ఏమి ప్రాప్తించింది? నియమ మని ప్రాప్తించింది. ప్రకరణం నియామకం కాబట్టి దేనిలో వినబడుచున్నదో అక్కడే ఉండడం యుక్తం. ఒక చోట వినబడుచున్న గతి మరొక చోటికి కూడ వెళ్లే పక్షంలో ప్రతీదీ ప్రతీదానికీ ఉపయోగిస్తుం దని చెప్పినట్లవుతుంది గాన శ్రుతి-లింగ-వాక్యాదుల ప్రామాణ్యానికి భంగం కలుగుతుంది. మరొక విషయ మేమనగా ఒకే అర్చిరాదిగతి ఉపకోసలవిద్యలోను, పంచాగ్నివిద్యలోను సమంగా పఠించబడుతూన్నది. ఒక చోట చెప్పినది అన్ని చోట్లా వర్తించే పక్షంలో ఈ విధంగా మళ్లీ చెప్పడం వ్యర్థ మవుతుంది. అందువల్ల నియమమే.

భాష్యమ్

ఏవం ప్రాప్తే పఠతి-అనియమ ఇతి. సర్వాసామేవాభ్యుదయప్రాప్తి ఫలానాం సగుణానాం విద్యానామవిశేషేణైషా దేవయానాఖ్యా గతిర్భవతి. నన్వనియమాభ్యుపగమే ప్రకరణవిరోధ ఉక్తః. నైషోఽస్తి విరోధః, శబ్దానుమానాభ్యామ్, శ్రుతిస్మృతిభ్యామిత్యర్థః. తథా హి శ్రుతిః-"తద్య ఇత్థం విదుః" (ఛా.ఉ.5.10.1)ఇతి పఞ్చాగ్నివిద్యావతాం దేవయానం పన్థానమవతారయన్తీ "యే చేమే ఽరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే" (ఛా.ఉ.5.10.1) ఇతి విద్యాన్తరశీలినామపి పఞ్చాగ్ని విద్యావిద్భిః సమానమార్గతాం గమయతి. కథం పునరవగమ్యతే విద్యాన్తరశీలినామియం గతిశ్రుతిరితి. నను శ్రద్ధాతపఃపరాయణానామేవ స్యాత్తన్మాత్రశ్రవణాత్? న హి కేవలాభ్యాం శ్రద్ధాతపోభ్యామన్తరేణ విద్యాబలమేషా గతిర్లభ్యతే-

1270· "విద్యయా తదారోహన్తి యత్ర కామాః పరాగతాః,

న తత్ర దక్షిణా యాన్తి నావిద్వాంసస్తపస్వినః".

ఇతి శ్రుత్యన్తరాత్. తస్మాదిహ శ్రద్ధాతపోభ్యాం విద్యాన్తరోపలక్షణమ్.

బాలానందిని

ఏవమితి :-ఇట్లు ప్రాప్తించగా 'అనియమః' అని పఠిస్తున్నాడు. అభ్యుదయప్రాప్తి (బ్రహ్మలోకప్రాప్తి)ఫలంగా గల సగుణవిద్య లన్నింటిలోను భేదం ఏదీ లేకుండా ఈ

దేవయాన మనే గతి ఉంటుంది. (ఆక్షేపం) నియమం అంగీకరించకపోతే ప్రకరణానికి విరోధం వస్తుం దని చెప్పాం కదా? (సమాధానం) ఈ విరోధం లేదు, శబ్దానుమానాలచేత అనగా శ్రుతి-స్మృతులచేత (వీటిలో చెప్పబడడంచేత) అని అర్థం. అదెట్లనగా-"తద్య ఇత్థం విదుః" అను శ్రుతి పంచాగ్నివిద్యావంతులకు దేవయానమార్గాన్ని చెపుతూ-"యే చేమేఽరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే" (అరణ్యంలో శ్రద్ధాతపస్సులను ఎవరు ఉపాసిస్తారో వాళ్లు కూడ ఈ మార్గాన్ని పొందుతారు) అని ఇతరవిద్యలు కలవాళ్లకు కూడ పంచాగ్నివిద్యావేత్తలతో సమానమైన మార్గం ఉంటుందని తెలుపుతూన్నది. (ఆక్షేపం)ఈ గతిశ్రుతి ఇతరవిద్యోపాసకులకు చెప్పబడిన దని ఎలా తెలుస్తూన్నది? ఈ వాక్యంలో శద్ధాతపస్సులు కలవారు మాత్రమే చెప్పబడ్డారు గాన ఈ గతిశ్రుతి శ్రద్ధాతపఃపరాయణులకు మాత్రమే వర్తిస్తుంది కదా? (సమాధానం). ఈ దోషం లేదు. విద్యాబలం లేకుండా కేవలం శ్రద్ధాతపస్సులచేత ఈ గతి లభించదు కదా? "విద్యయా...తపస్వినః" అని మరొక శ్రుతి చెప్పుచున్నది. ( ఏ బ్రహ్మలోకంలో కామాలు (కామక్రోధలోభాదులు) మరలిపోతాయో అట్టి బ్రహ్మలోకస్థానంలో విద్యచేత ప్రవేశిస్తారు. కేవలదక్షిణులు (కర్మిలు)గాని, విద్యలేని తపఃశాలులు గాని అక్కడికి వెళ్లజాలరు అని ఈ శ్రుతి వాక్యానికి అర్థం). అందువల్ల ఇక్కడ శ్రద్ధాతపస్సులచేత ఇతరవిద్యలను కూడ ఉపలక్షణచేత గ్రహించాలి.

## భాష్యమ్

వాజసనేయినస్తు పఞ్చాగ్నివిద్యాధికారేఽధీయతే-"యే ఏవమేతద్విదుర్యే చామీ అరణ్యే శ్రద్ధాం తప ఇత్యుపాసతే" (బృ.ఉ.6.2.15)ఇతి. తత్ర శ్రద్ధాలవో యే సత్యం బ్రహ్మోపాసత ఇతి వ్యాఖ్యేయమ్, సత్యశబ్దస్య బ్రహ్మణ్యసకృత్ప్ర యుక్తత్వాత్. పఞ్చాగ్నివిద్యావిదాం చేత్థం విత్తయైవోపాత్తత్వాత్ విద్యాన్తరపరా యణానామేవైతదుపాదానం న్యాయ్యమ్. "అథ యే ఏతౌ పన్థానౌ న విదుస్తే కీటపతఙ్గా యదిదం దన్దశూకమ్"(బృ.ఉ.6.2.16) ఇతి చ మార్గద్వయభ్రష్టానాం కష్టామధోగతిం గమయన్తీ శ్రుతిర్దేవయానపితృయాణయోరేవైనానన్తర్భావయతి. తత్రాపి విద్యావిశేషాదేషాం దేవయానప్రతిపత్తిః. స్మృతిరపి -

"శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే,
ఏకయా యాత్యనావృత్తిమన్యయాఽఽవర్తతే పునః." (భ.గీ.8 26)

ఇతి. యత్పునర్దేవయానస్య పథోఽర్చిరాదేర్ద్విరామ్నానముపకోసలవిద్యాయాం పఞ్చాగ్ని విద్యాయాం చ తదుభయత్రాప్యనుచిన్తనార్థమ్. తస్మాదనియమః. 31

బాలానందిని

వాజసనేయిన ఇతి:- వాజసనేయు లైతే పంచాగ్నివిద్యాధికారంలో "యే ఏవమ్.....ఉపాసతే" అని పఠిస్తున్నారు. అక్కడ శ్రద్ధావంతులైన ఎవరు సత్యమును, అనగా బ్రహ్మను ఉపాసిస్తారో అని వ్యాఖ్యానించాలి. సత్యశబ్దం బ్రహ్మ అనే అర్థంలో అనేక పర్యాయాలు ప్రయోగించబడింది కదా? ("యే చేమేఽరణ్యే" అను పూర్వోదాహృతవాక్యానికి ముందు) "ఇత్థం విదుః" అనే దానిచేత పంచాగ్నివిద్యావేత్తలు నిర్దేశించబడ్డారు గాన ("యే చేమే" ఇత్యాదివాక్యంలో) ఇతరవిద్యోపాసకులను గ్రహించడమే న్యాయ్యం. "అథ.....ద్దన్దశూకమ్" (ఎవరైతే ఈ రెండు మార్గాలనూ పొందరో వాళ్లు కృములు గాను, మిడతలు గాను, (లేదా పక్షులు గాను) సర్పాలుగాను పుడతారు) అని మార్గద్వయభ్రష్టులకు అధోగతిని చెపుతూన్న శ్రుతి వీళ్లను (వైశ్వానరాద్యుపాసకులను)దేవయానపితృయాణాలలోనే అంతర్గతులను చేస్తూన్నది. ( ఆ మార్గాలను పొందుతారని సూచిస్తున్నది). అందులోనూ విద్యావిశేషం ఉన్నవాళ్లకి మాత్రమే దేవయానప్రాప్తి. "శుక్ల...పునః" అను స్మృతి కూడ ఇట్లే చెపుతూన్నది. (జగత్తుకు, అనగా విద్యాకర్మాధికృతులైనవాళ్లకు, ఈ శుక్ల - కృష్ణగతులే (శుక్లగతి అనగా అర్చిరాదిమార్గం, కృష్ణగతి అనగా ధూమాదిమార్గం)నిశ్చితము లని అంగీకరింపబడినవి. శుక్లమార్గంలో వెళ్లినవాడు తిరిగి రాడు (బ్రహ్మలోకంలో కొంత కాలం ఉండి అక్కడ ముక్తి పొందుతాడు) కృష్ణమార్గంలో వెళ్లినవాడు తిరిగి వస్తాడు అని ఈ గీతాశ్లోకానికి భావం). ఉపకోసలవిద్యలోను, పంచాగ్నివిద్యలోను అర్చిరాదిదేవయాన మార్గాన్ని మళ్లీ చెప్పడం ఎందుకనగా ఆ రెండు విద్యలలో (వాటి అంగంగా)మార్గాన్ని కూడ చింతించడం కోసం. అందువల్ల నియమం లేదు. (ఎక్కడ మార్గం పఠింపబడిందో అక్కడనే అనే నియమం లేదు). 31.

అనియమాధికరణం సమాప్తం

## 19. యావదధికారాధికరణమ్. సూ. 32

### సూ. యావదధికారమవస్థితిరాధికారికాణామ్ 3.3.32.

విదుషో వర్తమానదేహపాతానన్తరం దేహాన్తరముత్పద్యతే న వేతి చిన్త్యతే. నను విద్యాయాః సాధనభూతాయాః సంపత్తౌ కైవల్యానిర్వృత్తిః స్యాన్నవేతి నేయం చిన్తోపపద్యతే. న హి పాకసాధనసంపత్తౌ ఓదనః భవేన్న వేతి చిన్తా సంభవతి. నాపి భుఞ్జానస్తృప్యేన్న వేతి చిన్త్యతే. ఉపపన్నా త్వియం చిన్తా; బ్రహ్మవిదామపి కేషాం చిదితిహాసపురాణయోర్దేహాన్తరోత్పత్తిదర్శనాత్. తథా హ్యపాన్తరతమా నామ వేదాచార్యః పురాణర్షిర్విష్ణునియోగాత్కలిద్వాపరయోః సంధౌ కృష్ణద్వైపాయనః సంబభూవేతి స్మరన్తి. వసిష్ఠశ్చ బ్రహ్మణో మానసః పుత్రః సన్నిమిశాపాదపగతపూర్వదేహః పునర్బ్రహ్మాదేశాన్మిత్రావరుణాభ్యాం సంబభూవేతి. భృగ్వాదీనామపి బ్రహ్మణ ఏవ మానసపుత్రాణాం వారుణే యజ్ఞే పునరుత్పత్తిః శ్రూయతే. సనత్కుమారోఽపి బ్రహ్మణ ఏవ మానసః పుత్రః స్వయం రుద్రాయ వరప్రదానాత్ స్కన్దత్వేన ప్రాదుర్బభూవ. ఏవమేవ దక్షనారదప్రభృతీనాం భూయసీ దేహాన్తరోత్పత్తిః కథ్యతే తేన తేన నిమిత్తేన స్మృతౌ. శ్రుతావపి మన్త్రార్థవాదయోః ప్రాయేణోపలభ్యతే. తే చ కేచిత్పతితే పూర్వదేహే దేహాన్తరమా దదతే. కేచిత్తు స్థితే ఏవ తస్మిన్ యోగైశ్వర్యవశా దనేకదేహాదానన్యాయేన. సర్వేచైతే సమధిగత సకలవేదార్థాః స్మర్యన్తే. తదేతాషాం దేహాన్తరోత్పత్తిదర్శనాత్ ప్రాప్తం బ్రహ్మవిద్యాయాః పాక్షికం మోక్షహేతుత్వ మహేతుత్వం వేతి.

#### బాలానందిని

యావదితి :-"అధికారికాణామ్=అధికారికపురుషులకు, యావదధికారమ్అధికారం ఉన్నంతవరకు, అవస్థితిః=ఉండుట" అని సూత్రార్థం.

విదుష ఇతి :-విద్వాంసుని వర్తమానదేహం పడిపోయిన తరవాత మరొక దేహం పుడుతుందా పుట్టదా అని విచారణ చేయబడుచున్నది. (అక్షేపం) (మోక్ష)సాధనమైన

విద్య సంపన్నమైన తరవాత కైవల్యం లభిస్తుందా లభించదా అని ఈ చింత ఉపపన్నం కాదు. వంటకు కావలసిన సాధనాలన్నీ సమకూడిన తరవాత అన్నం తయా రవుతుందా కాదా అను చింత ఉండదు కదా? అట్లే భుజిస్తూన్నవాడు తృప్తిపొందుతాడా పొందడా అని ఆలోచించడం ఉండదు కదా? (సమాధానం) -కొందరు బ్రహ్మవేత్తలకు కూడ దేహాంతరం పుట్టినట్లు ఇతిహాసపురాణాలలో కనబడుచున్నది. అందువల్ల ఈ చింత ఉపపన్నమే. అదెట్లనగా - వేదాచార్యుడైన అపాంతరతమస్సు అనే ఒక ప్రాచీనఋషి విష్ణువుయొక్క ఆజ్ఞవల్ల కలిద్వాపరాల సంధిలో కృష్ణద్వైపాయనుడుగా పుట్టాడని స్మరిస్తున్నారు (పురాణాదులలో చెపుతున్నారు). బ్రహ్మయొక్క మానసపుత్రుడైన వసిష్ఠుడు నిమిచక్రవర్తి శాపంవల్ల వెనుకటి దేహం పోగొట్టుకొని బ్రహ్మదేవుని ఆజ్ఞవల్ల మిత్రావరుణులనుండి మళ్ళీ జన్మించా డని చెపుతున్నారు. బ్రహ్మదేవుని మానసపుత్రులే అయిన భృగువు మొదలైనవాళ్లు కూడ వారుణయజ్ఞంలో మళ్ళీ పుట్టినట్లు వినబడుచున్నది. బ్రహ్మయొక్క మానసపుత్రుడే అయిన సనత్కుమారుడు, తానే రుద్రునకు వరం ఇచ్చి ఉండడంచేత, స్కందుడుగా పుట్టాడు. ఇట్లే దక్ష-నారదాదులు ఆ యా కారణాలచేత అనేక మైన దేహాంతరాలు ధరించి నట్లు స్మృతిలో (పురాణాదులలో), చెప్పబడుచున్నది. వేదంలో కూడ మంత్రాలలోను, అర్థవాదలలోను సాధారణంగా (ఇలా పుట్టడం) కనబడుచున్నది. వాళ్లలో కొందరు పూర్వదేహం పడిపోయిన తరవాత మరి యొక దేహం గ్రహిస్తున్నారు; మరొ కొందరైతే పూర్వదేహం అలా ఉండగానే యోగశక్తివల్ల అనేక దేహాలను గ్రహించడం అనే పద్ధతిలో దేహాంతరాలు గ్రహిస్తున్నారు. వీళ్లందరూ సంపూర్ణంగా వేదార్థం తెలిసినవారుగా చెప్పబడుచున్నారు. ఈ విధంగా వీళ్లకు దేహాంతరాలు పుట్టడం కనబడుతూండడంవల్ల బ్రహ్మవిద్య పాక్షికంగా మోక్షహేతువా (మోక్షం ఇవ్వవచ్చు ఇవ్వకపోవచ్చునని చెప్పాలా) లేక అది మోక్షహేతువు కానే కాదా (అని సంశయం కలుగుతుంది).

వి. నిర్గుణవిద్యకు ఫలం ముక్తి గాన అక్కడ గతి వ్యర్థమైనది. సగుణవిద్య లన్నింటిలోను గతి ఉంటుంది అని చేసిన వ్యవస్థ యుక్తం కాదు. ఎందువల్ల ననగా తత్త్వజ్ఞానం కలవారు కూడ మళ్ళీ పుడుతున్నట్లు వింటున్నాం అని అక్షేపసంగతిచేత పూర్వపక్షం.

## భాష్యమ్

అత ఉత్తరముచ్యతే-న; తేషామపాన్తరతమఃప్రభృతీనాం వేదప్రవర్తనాదిషు లోకస్థితి హేతుష్వధికారేషు నియుక్తానామధికారతన్త్రత్వాత్ స్థితేః. యథాసౌ భగవాన్ సవితా సహస్ర యుగపర్యన్తం జగతోఽధికారం చరిత్వా తదవసానే ఉదయాస్తమయవర్జితం కైవల్యమనుభవతి - "అథ తత ఊర్ధ్వ ఉదేత్య నైవోదేతా నాస్తమేతా ఏకల ఏవ మధ్యే స్థాతా" (ఛా ఉ.3.11.1) ఇతి శ్రుతేః. యథా చ వర్తమానా బ్రహ్మవిదః ప్రారబ్ధభోగక్షయే కైవల్యమనుభవన్తి- "తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ సంపత్స్యే (ఛా. ఉ.6.14.2) ఇతి శ్రుతేః; ఏవమపాన్తరతమఃప్రభృతయోఽపీశ్వరాః పరమేశ్వరేణ తేషు తేషు అధికారేషు నియుక్తాః సన్తః సత్యపి సమ్యగ్దర్శనే కైవల్యహేతౌ అక్షీణకర్మాణః యావదధికారమవతిష్ఠన్తే, తదవసానే చాపవృజ్యన్త ఇత్యవిరుద్ధమ్. సకృత్ప్రవృత్తమేవ హి తేఽధికారఫలదానాయ కర్మాశయమతివాహయన్తః స్వాతన్త్ర్యేణైవ గృహాదివ గృహాన్తరమన్యమన్యం దేహం సంచరన్తః స్వాధికారనిర్వర్తనాయా పరిముషితస్మృతయ ఏవ దేహేన్ద్రియప్రకృతివశిత్వా న్నిర్మాయ దేహాన్ యుగపత్ క్రమేణ వాఽధితిష్ఠన్తి.

## బాలానందిని

**అత ఇతి** :- ఇందువల్ల సమాధానం చెప్పబడుచున్నది. పైన చెప్పినది యుక్తం కాదు. ఎందువల్ల ననగా లోకంయొక్క స్థితికి హేతువులైన వేదప్రవర్తనం మొదలైన అధికారాలలో నియుక్తు లైన ఆ అపాంతరతమస్సు మొదలైన వారి స్థితి అధికారంమీద ఆధారపడి ఉంటుంది. భగవంతుడైన ఈ సూర్యుడు ఏ విధంగా వెయ్యి యుగాల వరకు జగత్తుమీద తన కున్న అధికారాన్ని సాగించి దాని తరవాత "అత.......స్థాతా" అని శ్రుతి చెప్పినట్లు ఉదయాస్తమయరహితమైన కైవల్యాన్ని పొందుతాడో, ప్రస్తుతం ఉంటూన్న బ్రహ్మవేత్తలు "తస్య...సంపత్స్యే" అని శ్రుతి చెప్పి నట్లు ప్రారబ్ధభోగం క్షీణించిన తరవాత ఏ విధంగా కైవల్యాన్ని పొందుతారో అట్లే అపాంతరతమస్సు మొదలైన ఈశ్వరులు కూడ

పరమేశ్వరునిచేత ఆయా అధికారాలలో నియుక్తులై, కైవల్యానికి హేతువైన సమ్యగ్జ్ఞానం ఉన్నా కూడ అధికారం ఉన్నంతవరకు ఉంటారు. దాని తరవాత ముక్తులవుతారు అనేది విరుద్ధం కాదు. ("అథ తత ఊర్ధ్వః" ఇత్యాది శ్రుతివాక్యానికి - తరువాత విలక్షణుడై అనగా ఉత్కృష్టుడై, పైకి, లేచి (అనగా ఆత్మాభిమానం విడచి), మళ్లీ ఉదయాస్తమయాలు లేనివాడై ఒంటరియై బ్రహ్మమధ్యలో బ్రహ్మస్థితిలో ఉంటాడు అని అర్థం). అయితే వాళ్లు అనేక జన్మ లెత్తి సాధించతగిన అధికారాన్ని ఇచ్చే కర్మ ఒకే పర్యాయం ఫలం ఇవ్వడానికి ప్రారంభించడంచేత ఆ కర్మను గడుపుతూ ఒక ఇంట్లోనుండి మరొక ఇంట్లోనికి వెళ్లినట్లు స్వతంత్రంగానే ఒక దేహం నుంచి మరొక దేహంలోనికి తమ అధికారం నిర్వహించడం కోసం స్మృతి మాత్రం తప్పకుండానే సంచరిస్తూ దేహాలు, ఇంద్రియాలు ప్రకృతీ కూడ వశంలో ఉన్నవా ళ్లవడంచేత ఒకే సమయంలో కాని, క్రమంగా గాని దేహాలను నిర్మించుకొని వాటిని అధిష్ఠించి ఉంటారు.

## భాష్యమ్

న చైతే జాతిస్మరా ఇత్యుచ్యన్తే; త ఏవైతే ఇతి స్మృతిప్రసిద్ధేః. యథా హి సులభా నామ బ్రహ్మవాదినీ జనకేన వివదితుకామా వ్యుదస్య స్వం దేహం జానకం దేహమావిశ్య వ్యుద్య తేన, పశ్చాత్స్వమేవ దేహమావివేశేతి స్మర్యతే. యది హ్యుపయుక్తే సకృత్ప్రవృత్తే కర్మణి కర్మాన్తరం దేహాన్తరారమ్భకారణ మావిర్భవేత్తతోఽన్యదప్యదగ్ధబీజం కర్మాన్తరం తద్వదేవ ప్రసజ్యేతేతి బ్రహ్మవిద్యాయాః పాక్షికం మోక్షహేతుత్వమహేతుత్వం వాఽఽశఙ్క్యే త. న త్వియమాశఙ్కా యుక్తా; జ్ఞానాత్కర్మబీజదాహస్య శ్రుతిస్మృతిప్రసిద్ధత్వాత్. తథా హి శ్రుతిః-

"భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః,

క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే. (ము. ఉ. 2.2.8)

ఇతి. "స్మృతిలమ్భే సర్వగ్రన్థీనాం విప్రమోక్షః" (ఛా.ఉ.7.2.6.2) ఇతి చైవ మాద్యా. స్మృతిరపి

"యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున,

జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా" (భ.గీ. 4.37) ఇతి

"బీజాన్యగ్న్యుపదగ్ధాని నరోహన్తి యథాపునః,

జ్ఞానదగ్ధైస్తథాక్లేశైర్నాత్మాసంపద్యతే పునః"

ఇతి చైవమాద్యా,

న చావిద్యాదిక్లేశదాహే సతి క్లేశబీజస్య కర్మాశయస్యైకదేశదాహః ఏకదేశప్రరోహశ్చేత్యుప పద్యతే. న హ్యగ్నిదగ్ధస్య శాలిబీజస్యైకదేశప్రరోహో దృశ్యతే. ప్రవృత్తఫలస్య తు కర్మాశయస్య ముక్తేషోరివ వేగక్షయాన్నివృత్తిః. "తస్య తావదేవ చిరమ్" (ఛా.ఉ.6.14.2)ఇతి శరీరపాతా వధిక్షేపకరణాత్. తస్మాదుపపన్నా యావదధికారమాధికారికాణామవస్థితిః.

బాలానందిని

నచేతి :- వీళ్లందరూ జాతిస్మరులు (పూర్వశరీరం పోయి మరొక కర్మయొక్క ఫలంగా మరొక జన్మ వచ్చినా పూర్వజన్మలోని విషయాలను స్మరించేవారు) అని చెప్పబడరు. ఎందువల్ల ననగా వీళ్లు వాళ్లే అని స్మృతులలో ప్రసిద్ధి ఉంది. ఎట్లనగా- సులభ అనే ఒక బ్రహ్మవాదిని జనకునితో వాదించాలనే కోరికతో తన దేహం విడిచిపెట్టి, జనకుని దేహంలో ప్రవేశించి, వానితో వాదించి, తరవాత తన దేహంలోనికి ప్రవేశించిందని చెప్పబడుచున్నది. దేహాన్ని ఇవ్వడానికి ఒక్కమారు ప్రారంభించిన ఒక కర్మ పూర్తి అయిపోయిన తరవాత మరొక దేహాన్ని పుట్టించే మరొక కర్మ పైకి వస్తే దానివలెనే, బీజం కాలని మరొక కర్మ కూడ తన ఫలాన్ని ఇవ్వడానికి ప్రారంభించవచ్చును. అప్పుడు బ్రహ్మవిద్య పాక్షికంగానే మోక్షహేతు వని కాని, అసలు మోక్షహేతువే కాదని గాని అశంకకు అవకాశం ఏర్పడుతుంది. జ్ఞానం కర్మబీజాలను దహించివేస్తుందని శ్రుతులలోను, స్మృతులలోను ప్రసిద్ధం గాన ఇలాంటి అశంక యుక్తం కాదు. "భిద్యతే....పరావరే" అను శ్రుతి, "స్మృతిలమ్భే సర్వగ్రన్థీనాం ప్రమోక్షః" (జ్ఞానం కలగగానే సర్వగ్రంథులూ విడిపోతాయి) అనే శ్రుతీ కూడ ఈ విషయమే చెపుతున్నాయి. అట్లే "యథైధాంసి...తథా" (అర్జునా!

ప్రజ్వలిస్తూన్న అగ్ని కట్టెలను భస్మం చేసినట్లు జ్ఞానాగ్ని సర్వకర్మలను భస్మం చేస్తుంది) అను స్మృతి, "బీజాన్య...పునః" (అగ్నిచేత దహించబడిన విత్తనాలు ఏ విధంగా మొలవవో అట్లే జ్ఞానంచేత కాల్చివేయబడిన క్లేశాలచేత (క్లేశాలు దగ్ధములు కాగా) ఇంక శరీరం పుట్టదు)అనే స్మృతీ కూడ ఈ విషయమే చెపుతున్నాయి. అవిద్యాదిక్లేశాలు కాల్చబడినప్పుడు క్లేశానికి బీజమైన లేదా క్లేశం బీజంగా గల కర్మాశయంయొక్క ఒక భాగం కాలుతుంది మరొక భాగం మొలుస్తుంది అనేది ఉపపన్నం కాదు కదా? అగ్నిలో కాలిన వరి విత్తనంలోని ఒక భాగం అంకురించడం కనబడదు కదా? "తస్య తావదేవ చిరమ్" అని శరీరపాతం వరకూ నిరీక్షించాలి అని చెప్పడంవల్ల ఫలం ఇవ్వడానికి ప్రారంభించిన కర్మాశయం మాత్రం విడవబడిన బాణం వలె దాని వేగం తగ్గినప్పుడే క్షయం పొందుతుంది. అందువల్ల ఆధికారికులు అధికారం ఉన్నంతవరకూ ఉండడం ఉపపన్నమే.

vi. వెనుకటి దేహం, పేరు, గుర్తులూ లేక పరతంత్రులై దేహాభిమానం కలవారై కేవలం పూర్వజన్మవిషయాల స్మృతి ఉన్నవాళ్లు జాతిస్మరులు. ఆధికారికు లైతే స్వతంత్రులు. వెనుకటి పేర్లే ఉంటాయి. వాళ్లకు దేహాభిమానాదికం ఉండదు. ఇది వాళ్లిద్దరి మధ్యా భేదం.

### భాష్యమ్

న చ జ్ఞానఫలస్యానైకాన్తికతా. తథా చ శ్రుతిః అవిశేషేణైవ సర్వేషాం జ్ఞానాన్మోక్షం దర్శయతి- "తద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తదభవత్త థర్షీణాం తథా మనుష్యాణామ్" (బృ.ఉ.1.4.10) ఇతి. జ్ఞానాన్తరేషు చైశ్వర్యాదిఫలేష్వాసక్తాః స్యుర్మహర్షయః. తే పశ్చాదైశ్వర్యక్షయదర్శనేన నిర్విణ్ణాః పరమాత్మజ్ఞానే పరినిష్ఠాః కైవల్యం ప్రాపురిత్యుపపద్యతే.

"బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే, *Page. 1500.*
పరస్యాన్తే కృతాత్మానః ప్రవిశన్తి పరం పదమ్".
*కూర్మ.పు. 1-12-269.*

ఇతి స్మరణాత్. ప్రత్యక్షఫలత్వాచ్చ జ్ఞానస్య ఫలవిరహాశఙ్కానుపపత్తిః. కర్మఫలే హి స్వర్గాదౌ అనుభవానారూఢే స్యాదాశఙ్కా భవేద్వా న వేతి. అనుభవారూఢం

తు జ్ఞానఫలమ్ - "యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ" (బృ.ఉ.2.4.1) ఇతి శ్రుతేః. "తత్త్వమసి" (ఛా.ఉ.6.8.7) ఇతి చ సిద్ధవదుపదేశాత్. న హి "తత్త్వమసి" ఇతి వాక్యస్యార్థస్తత్త్వం మృతో భవిష్యసీత్యేవం పరిణేతుం శక్యః. "తద్ధైతత్పశ్యన్ ఋషిర్వామదేవః ప్రతిపేదేఽహం మనురభవం సూర్యశ్చ" (బృ.ఉ.1.4.10) ఇతి చ సమ్యగ్దర్శనకాలమేవ తత్ఫలం సర్వాత్మత్వం దర్శయతి. తస్మాదైకాన్తికీ విదుషః కైవల్యసిద్ధిః. 32.

బాలానందిని

న చేతి :- జ్ఞానఫలానికి అనైకాంతికత్వం (తప్పకుండా లభించకపోవడం) లేదు. అందుచేతనే "తద్యో...మనుష్యాణామ్" అను శ్రుతి భేదం ఏమీ లేకుండా అందరికీ జ్ఞానంవల్ల మోక్షం కలుగుతుం దని చెప్పుచున్నది. మహర్షులు ఐశ్వర్యాదులు ఫలంగా గల ఇతరజ్ఞానాలలో ఆసక్తు లై ఉండి ఉంటారు (అందుచేతనే ఆ జ్ఞానాల ఫలితంగా అధికారిక పురుషులై ఉంటారు). తరవాత వాళ్లు ఐశ్వర్యం క్షీణించడాన్ని చూచి వైరాగ్యం చెంది పరమాత్మజ్ఞానంలో పరినిష్ఠితులై కైవల్యం పొందారు అని చెప్పడం ఉపపన్నంగా ఉంటుంది. "బ్రహ్మణా...పదమ్" (వాళ్లందరూ అధికారం పూర్తి అయిన తరవాత జ్ఞానవంతులై మహాప్రలయంలో, బ్రహ్మయొక్క (హిరణ్యగర్భుని) అంతంలో వానితో కూడ మోక్షం పొందుతారు) అని స్మృతి చెప్పుచున్నది. జ్ఞానంవల్ల కలిగే ఫలం ప్రత్యక్ష మైనది. అందుచేత దానికి ఫలం ఉంటుందా ఉండదా అనే ఆశంకకు అవకాశం లేదు. స్వర్గం మొదలైన కర్మఫలమైతే అనుభవారూఢం (ప్రత్యక్షంగా చూడబడినది) కాదు కాబట్టి లభిస్తుందా లభించదా అని ఆశంక కలగవచ్చు. "యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ" అను శ్రుతివల్ల "తత్త్వమసి" అని సిద్ధవత్ (సిద్ధంగా ఉన్నట్లు) చెప్పడంవల్లా కూడ జ్ఞానఫలం అనుభవారూఢ మైనది. "తత్త్వమసి" అనే వాక్యానికి అర్థం మరణానంతరం నువ్వు బ్రహ్మవుగా అవుతావు అని మార్చడానికి శక్యం కాదు కదా? "తద్ధైతత్...సూర్యశ్చ" అను శ్రుతి సమ్యగ్దర్శనం కలిగిన వెంటనే దానికి ఫలమైన సర్వాత్మత్వాన్ని చూపుతున్నది. అందువల్ల విద్వాంసునకు కైవల్యసిద్ధి తప్పక లభిస్తుంది. 32

యావదధికారాధికరణం సమాప్తం

## 20. అక్షరాద్యధికరణమ్. సూ.31

సూ. అక్షరధియాం త్వవరోధః సామాన్యతద్భావాభ్యామౌపసదవత్తదుక్తమ్. 3.3.33

వాజసనేయకే శ్రూయతే-"ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదన్తి అస్థూలమనణ్వహ్రస్వమదీర్ఘమలోహితమస్నేహమ్" (బృ.ఉ.3.8.8) ఇత్యాది తథాథర్వణే శ్రూయతే-"అథ పరా యయా తదక్షరమధిగమ్యతే యత్తదద్రేశ్యమగ్రాహ్యమగోత్రమవర్ణమ్"(ము.ఉ.1.1.5)ఇత్యాది. తథైవాన్యత్రాపి విశేషనిరాకరణద్వారేణాక్షరం పరం బ్రహ్మ శ్రావ్యతే. తత్ర చ క్వచిత్కే చిదతిరిక్తా విశేషాః ప్రతిషిధ్యన్తే. తాసాం విశేషప్రతిషేధబుద్ధీనాం కిం సర్వాసాం సర్వత్ర ప్రాప్తిరుత వ్యవస్థేతి సంశయే శ్రుతివిభాగాద్వ్యవస్థాప్రాప్తావుచ్యతే-అక్షరవిషయాస్తు విశేషప్రతిషేధబుద్ధయః సర్వాః సర్వత్ర అవరోద్ధవ్యాః. సామాన్యతద్భావాభ్యామ్. సమానో హి సర్వత్ర విశేషనిరాకరణరూపో బ్రహ్మప్రతి పాదనప్రకారః. తదేవ చ సర్వత్ర ప్రతిపాద్యం బ్రహ్మభిన్నం ప్రత్యభిజ్ఞాయతే. తత్ర కిమిత్యన్యత్ర కృతా బుద్ధయోఽన్యత్ర న స్యుః? తథా చ "ఆనన్దాదయః ప్రధానస్య" (బ్ర.సూ.3.3.11) ఇత్యత్ర వాఖ్యాతమ్. తత్ర విధిరూపాణి విశేషణాని చిన్తితాని, ఇహ ప్రతిషేధరూపాణీతి విశేషః. ప్రపఞ్చార్థశ్చాయం చిన్తాభేదః. ఔపసదవదితి నిదర్శనమ్. యథా జామదగ్న్యేఽహీనే పురోడాశినీషూపసత్సు చోదితాసు పురోడాశప్రదానమన్త్రాణామ్- "అగ్నేర్వేత్రం ధ్వరమ్" ఇత్యాదీనాముద్గాతృ వేదోత్పన్నానామప్యధ్వర్యుభిరభిసంబన్ధో భవతి, అధ్వర్యుకర్తృకత్వాత్పు రోడాశప్రదానస్య, ప్రధానతన్త్రత్వాచ్చాఙ్గానామ్, ఏవమిహాప్యక్షరతన్త్రత్వాత్తద్వి శేషణానాం యత్ర క్వచిదప్యుత్పన్నానామక్షరేణ సర్వత్రాభిసంబన్ధ ఇత్యర్థః. తదుక్తం ప్రథమే కాణ్డే- "గుణముఖ్యవ్యతిక్రమే తదర్థత్వాన్ముఖ్యేన వేదసంయోగః" (జై.సూ.3.3.8) ఇత్యత్ర. 33.

బాలానందిని

**అక్షరేతి**:- "అక్షరధియామ్=అక్షరమునందు, బ్రహ్మయందు, ద్వైతనిషేధబుద్ధులకు, అవరోధః=ఉపసంహారం చేయదగినది. సామాన్యతద్భావాభ్యామ్=ప్రతిపాద్యమైన బ్రహ్మ ఒక్కటే అయినందులవల్ల, అంతటా దాని ప్రత్యభిజ్ఞయే ఉండడంవల్ల. ఉపసదవత్=ఉపసందం వలె. తత్=అది, ఉక్తమ్=పూర్వభాగంలో చెప్పబడింది" అని సూత్రార్థం.

వాజసనేయకే ఇతి:- వాజసనేయకంలో "ఏతద్వై...అస్నేహమ్" ఇత్యాదికం వినబడుచున్నది. అట్లే ఆథర్వణంలో "అథ...అవర్ణమ్" ఇత్యాదికం వినబడుచున్నది. అట్లే ఇతరస్థలాలలో కూడ విశేషాలను నిరాకరించడం ద్వారా అక్షరమైన బ్రహ్మ ప్రతిపాదింపబడుచున్నది. వాటిలో కొన్ని చోట్ల కొన్ని విశేషాలు అధికంగా నిషేధించబడుతున్నాయి. ఈ విశేషనిషేధ బుద్ధులను అన్నింటిని అన్ని చోట్ల ఉపసంహారం చెయ్యాలా లేదా ఎక్కడ ఏవి చెప్పబడ్డాయో వాటిని అక్కడ మాత్రమే గ్రహించడం అనే వ్యవస్థ ఉంటుందా అని సంశయం కలగగా శ్రుతులు వేరవడంవల్ల వ్యవస్థయే యుక్తం అని ప్రాప్తించగా-అక్షరానికి సంబంధించిన విశేషనిషేధబుద్ధులన్నీ అన్ని చోట్లా ఉపసంహరించతగినవి; సామాన్యతద్భావములవల్ల అన్నిచోట్లా కూడ విశేషాలను నిరాకరించడం అనే బ్రహ్మ ప్రతిపాదనపద్ధతి సమానంగానే ఉన్నది. అంతటా కూడ ప్రతిపాద్యమైనది ఆ బ్రహ్మయే అని గుర్తింపబడుచున్నది. అలాంటప్పుడు ఒకచోట చెప్పిన బుద్ధులు (నిషేధప్రతిపాదనలు)మరొక చోట ఎందుకు ఉండగూడదు? ఈ విషయం "ఆనన్దాదయః ప్రధానస్య" అనే చోట కూడ వివరించబడింది. అక్కడ విధిరూపాలైన విశేషణాల చింత చేయబడింది ఇక్కడ నైతే ప్రతిషేధరూపాలైన విశేషణాలు చింతింపబడుతున్నాయి. ఇదే భేదం. ఈ చింతాభేదం కేవలం స్పష్టీకరణంకొరకు మాత్రమే (ఆ అధికరణంచేతనే ఈ అధికరణార్థం కూడ గతార్థ మైన దని అభిప్రాయం). ఔపసదవత్ అనేది నిదర్శనం. (ఒకచోట చెప్పబడిన శేషాలు (అంగాలు) మరొక చోట చెప్పబడిన అంగితో సంబంధిస్తాయి అనేదానికి దృష్టాంతం) ("జమదగ్నిః పుష్టి కామశ్చతూరాత్రేణ యజతే" అని ఉపక్రమించి చెప్పబడిన)జామదగ్న్యాహీనక్రతువులో (నాల్గు రోజులలో చేయవలసినది గాన ఇది అహీనక్రతువు)విధించబడిన పురోడాశం ఉన్న

ఉపసత్తులలో "అగ్నేర్వేర్హోత్రం వేరధ్వరమ్" మొదలైన మంత్రాలు ఉద్గాతయొక్క వేదంలో (సామవేదంలో) ఉత్పన్నము లైనా కూడ పురోడాశప్రదానం చేసేవాడు అధ్వర్యువు గాన, అంగాలు ప్రధానాన్ని ఆశ్రయించి ఉంటాయి గాన, ఏ విధంగా అధ్వర్యువుతో సంబంధిస్తాయో అట్లే ఇక్కడ కూడ అక్షరవిశేషణాలు అక్షరంమీద ఆధారపడి ఉన్నవిగాన అవి ఎక్కడ ఉత్పన్నములైనా (చెప్పబడినా)కూడ అన్ని స్థలాలలోను అక్షరంతో సంబంధం ఉంటుంది అని అర్థం. ఈ విషయం ప్రథమకాండలో (పూర్వమీమాంసలో) "గుణ...వేదసంయోగః" అనే సూత్రంలో చెప్పబడింది.

ఏ. నిర్గుణవిద్యలో మార్గం అవసరం లేదు గాన దాని ఉపసంహారం లేదు అని చెప్పబడింది. ఒకచోట చెప్పిన నిషేధాలు ఉపలక్షణం గాన సకలద్వైతనిషేధమూ లభిస్తుంది గాన ఒకచోట నున్న నిషేధాలను మరొక చోటికి ఉపసంహరించవలసిన పని లేదు అని దృష్టాంతసంగతిచేత పూర్వపక్షం.

జామదగ్న్యం నాలుగురాత్రుల రోజులు చేయవలసిన అహీనక్రతువు. ఈ క్రతువుకు అంగంగా చెప్పబడిన ఉపసత్తులలో ఏకకపాలం మొదలు ద్వాదశకపాలం వరకు పురోడాశం అనే ద్రవ్యం గల పన్నెండు హోమాలు విధించబడ్డాయి. (ఏకకపాలం ఒక మూకుడులో వండవలసిన పురోడాశం. పురోడాశం అనగా బియ్యంపిండితో చేసే రొట్టె వంటి హోమద్రవ్యం). ఆ హోమాలు చేసేటప్పుడు పఠించవలసిన "అగ్నేవేర్హోత్రమ్" మొదలైన పన్నెండు మంత్రాలు ఛాందోగుల తాండ్యబ్రాహ్మణంలో చెప్పబడ్డాయి. ఈ మంత్రాలకు, ఉపసత్తుకు అంగమైన పురోడాశాలకు సంబంధించినవి అవడంచేత ఔపసదాలు అని పేరు. ఇవి ఉద్గాతయొక్క వేదంలో (సామవేదంలో)ఉత్పన్నము లవడంచేత(చెప్పబడడంచేత)వాటిని ఉద్గాత అనే ఋత్విక్కు పఠించా లని ప్రాప్తిస్తుంది. అయితే ఇవి ఇక్కడ యజుర్వేదానికి సంబంధించిన ఉపసత్తులకు అంగంగా చెప్పబడడంచేత వీటిని అధ్వర్యువు అనే యజుర్వేదసంబంధి ఋత్విక్కు పఠించాలి అని ప్రాప్తిస్తున్నది. ఔద్గాత్రం సామవేదోత్పన్నం, ఆధ్వర్యవం యజుర్వేదోత్పన్నం అని నియమం. ఇవి ఛాందోగ్యోత్పన్న (సామవేదోత్పన్న) మంత్రా లవడంచేత ఉద్గాతయే పఠించాలి అని పూర్వపక్షం. దానికి సమాధానంగా గుణముఖ్యేత్యాది సూత్రం చెప్పబడింది. గుణముఖ్యవ్యతిక్రమే=గుణాలైన (అంగాలైన) మంత్రాలకూ, ముఖ్యములైన ఉపసత్తులకు

ధర్మవిరోధం ప్రసక్తం అయినప్పుడు, తదర్థత్వాత్=గుణాలు ప్రధానమైనదానికి ఉపకార కాలుగా ఉండాలిగాన, ప్రధానేనవేదసంయోగః=ఏ కర్త ప్రధానవేదానికి సంబంధించి ఉంటాడో అతడే ఈ మంత్రాల కర్త కావాలి" అని ఈ సూత్రానికి అర్థం. అంగాలు ఎక్కడ నున్నా ప్రధానాన్ని చేరుతాయి అనడానికి ఇది ఉదాహరణం. 33.

అక్షరాద్యధికరణం సమాప్తం

## 21. ఇయదధికరణమ్. సూ. 34

## సూ. ఇయదామననాత్. 3.3.34

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే,
తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యోఽభిచాకశీతి" (ము.ఉ.3.1.1)

ఇత్యధ్యాత్మాధికారే మన్త్రమాథర్వణికాః శ్వేతాశ్వతరాశ్చ పఠన్తి. తథా కఠాః-

"ఋతం పిబన్తౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధే,
ఛాయాతపౌ బ్రహ్మవిదో వదన్తి పఞ్చాగ్నయో యే చ త్రిణాచికేతాః" (క.ఉ.3.1)

ఇతి. కిమత్ర విద్యైకత్వముత విద్యానానాత్వమితి సంశయః. కిం తావత్ప్రాప్తమ్? విద్యానానాత్వమితి. కుతః? విశేషదర్శనాత్. ద్వా సుపర్ణేత్యత్ర హ్యేకస్య భోక్తృత్వం దృశ్యతే; ఏకస్య చాభోక్తృత్వమ్. ఋతం పిబన్తావిత్యత్రోభయోరపి భోక్తృత్వమేవ దృశ్యతే; తద్వేద్యం భిద్యమానం విద్యాం భిన్ద్యాదితి.

### బాలానందిని

ఇయదితి:- "ఇయదామననాత్=రెండు చోట్లా కూడ ఇంత అని పరిచ్ఛిన్నమైన రూపద్వయాన్ని చెప్పడంవల్ల ఉపసంహారం ఉంటుంది" అని సూత్రార్థం.

ద్వా సుపర్ణా ఇతి :- ఆథర్వణికులు, శ్వేతాశ్వతరులూ కూడ అధ్యాత్మప్రకరణంలో "ద్వాసుపర్ణా...అభిచాకశీతి" అను మంత్రాన్ని పఠిస్తున్నారు. అట్లే కఠులు కూడ - "ఋతం..త్రిణాచికేతాః" అను మంత్రం పఠిస్తున్నారు. ఇక్కడ విద్యలకు ఏకత్వమా లేక భేదమా అని సంశయం. ఏమి ప్రాప్తించినది? విద్యానానాత్వ మని ప్రాప్తించినది. ఎందు

వల్ల? విశేషం కనబడడంవల్ల. "ద్వా సుపర్ణా" అనే మంత్రంలో ఒకనికి భోక్తృత్వం మరొకనికి అభోక్తృత్వం కనబడుతున్నాయి. "ఋతం పిబన్తౌ" అనే చోట ఇద్దరికీ భోక్తృత్వం కనబడుతున్నది. అందుచేత వేద్యమైన రూపం విద్యను వేరు చేస్తుంది (వేద్యం వేరైనప్పుడు విద్యలు వేరవుతాయి కదా అని భావం)

వి. వేద్యమైన అక్షరం ఒక్కటే గాన విద్య కూడ ఏకమే అవడంచేత (పూర్వాధికరణంలో) అక్షరధీలకు ఉపసంహారం ఉంటే ఉండవచ్చు. కాని ఇక్కడ వేద్యభేదంచేత విద్యకూడ భిన్నమే గాన ఉపసంహారం ఉండదు అని ప్రత్యుదాహరణసంగతిచేత పూర్వపక్షం.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రవీతి విద్యైకత్వమితి. కుతః ? యతః ఉభయోరప్యనయో ర్మన్త్ర యోరియత్తాపరిచ్ఛిన్నం ద్వితోపేతం వేద్యరూపమ్ అభిన్నమామనన్తి. నను దర్శితో రూపభేదః? నేత్యుచ్యతే. ఉభావప్యేతౌ మన్త్రౌ జీవద్వితీయమీశ్వరం ప్రతిపాదయతో నార్థాన్తరమ్. "ద్వా సుపర్ణా" ఇత్యత్ర తావత్ "అనశ్నన్నన్యోఽభిచాకశీతి" ఇత్యశనాయాద్యతీతః పరమాత్మా ప్రతిపాద్యతే. వాక్యశేషేఽపి చ స ఏవ ప్రతిపాద్యమానో దృశ్యతే-"జుష్టం యదా పశ్యత్యన్య మీశమస్య మహిమానమ్" (శ్వే. ఉ.4.7) ఇతి. "ఋతం పిబన్తౌ" ఇత్యత్ర తు జీవే పిబత్యశనాయాద్యతీతః పరమాత్మాపి తత్సాహచర్యాత్ ఛత్రిన్యాయేన పిబతీత్యుపచర్యతే. పరమాత్మప్రకరణం హ్యేతత్-"అన్యత్ర ధర్మాదన్యత్రా ధర్మాత్"(క.ఉ.2.14) ఇత్యుపక్రమాత్. తద్విషయ ఏవచాత్రాపి వాక్యశేషో భవతి- "యః సేతురీజానానామక్షరం బ్రహ్మ యత్పరమ్" (క.ఉ.3.2) ఇతి.

"గుహాం ప్రవిష్టావాత్మానౌ హి" (బ్ర.సూ.1.2.11) ఇత్యత్రచైతత్ప్రపఞ్చితమ్. తస్మాన్నాస్తి వేద్యభేదః, తస్మాచ్చ విద్యైకత్వమ్. అపి చ త్రిష్వప్యేతేషు వేదాన్తేషు పౌర్వాపర్యాలోచనే పరమాత్మ విద్యైవావగమ్యతే తాదాత్మ్యవివక్షయైవ జీవోపాదానం నార్థాన్తరవివక్షయా. న చ పరమాత్మవిద్యాయాం భేదాభేదవిచారావతారోఽస్తీత్యుక్తమ్.తస్మాత్ప్రపఞ్చార్థ ఏవైష యోగః.తస్మాచ్చాధికధర్మోపసంహార ఇతి. 34.

బాలానందిని

**ఏవమితి** :- ఇట్లు ప్రాప్తించగా విద్యైకత్వమే అని చెపుతున్నాడు. ఎందువల్ల? ఎందువల్ల ననగా-ఈ రెండు మంత్రాలలోను కూడ ఇయత్తాపరిచ్ఛిన్న మైన (ఇంత అని కొలవబడిన), ద్విత్వంతో కూడిన, అభిన్నమైన వేద్యరూపాన్ని చెపుతున్నారు. (ప్రశ్న) రూపభేదం చూపించాం కదా? (సమాధానం) లేదంటాం. ఈ రెండు మంత్రాలూ కూడ జీవుడు రెండవవాడుగా గల ఈశ్వరుణ్ణి (జీవేశ్వరులను) ప్రతిపాదిస్తున్నాయి కాని మరొక అర్థాన్ని (వస్తువును) దేనినీ ప్రతిపాదించడంలేదు. "ద్వా సుపర్ణా" అనే చోట "అనశ్నన్న న్యోఽభిచాకశీతి" అని అశయనాయాదులకు (ఆకలి మొదలైనవాటికి) అతీతుడైన పరమాత్మ ప్రతిపాదించబడుచున్నది. "జుష్టం...మహిమానమ్" అనే వాక్యశేషంలో కూడ ఆ పరమాత్మయే ప్రతిపాదించబడుచున్నది. "ఋతం పిబన్తౌ" అనేచోట నైతే జీవుడు త్రాగుచుండగా వాని సాహచర్యంచేత పరమాత్మ కూడ త్రాగుతున్నట్లు ఛత్రిన్యాయంచేత ఆరోపించబడు చున్నది.(కొందరు కలిసివెడుతున్నప్పుడు ఒకరిద్దరి చేతులలో గొడుగులుండి మిగిలినవాళ్లచేతుల్లో లేకపోయినా "ఛత్రిణో గచ్ఛన్తి" (గొడుగులవాళ్లు వెడుతున్నారు) అంటాం. అలాగే పరమాత్మ పానం చేయకపోయినా పానం చేస్తూన్న జీవుని ప్రక్క ఉండడంచేత త్రాగుతున్నట్లు చెప్పబడింది). "అన్యత్ర ధర్మాదన్యత్రా ధర్మాత్" అని ఉపక్రమించడంవల్ల ఇది పరమాత్మప్రకరణం. ఇక్కడ "యః సేతురీజానానామక్షరం బ్రహ్మ యత్పరమ్" అనే వాక్యశేషం కూడ పరమాత్మను గూర్చియే ఉన్నది.

ఈ విషయం "గుహాం ప్రతిష్టౌ హి" అనే చోట కూడ వివరించబడింది. అందువల్ల వేద్యభేదం లేదు; అందుచేత విద్యైకత్వమే ఉన్నది. మరొక విషయ మేమనగా-ముందు వెనుకలు ఆలోచిస్తే ఈ మూడు ఉపనిషత్తులలోనూ కూడ పరమాత్మవిద్యయే తెలియబడుతూన్నది. జీవుణ్ణి గూర్చి చెప్పడం వానికి పరమాత్మతో తాదాత్మ్యం ఉన్న దని చెప్పడం కోసమే కాని మరొక విషయం ఏదీ చెప్పడకోసం కాదు. పరమాత్మవిద్యలో భేదాభేదవిచారానికి అవకాశం లేదని చెప్పి ఉన్నాం. అందువల్ల ఈ యోగం (సూత్రం)విషయస్పష్టీకరణం కోసం మాత్రమే. అందువల్ల అధికంగా ఉన్న ధర్మాల ఉపసంహారం చెయ్యాలి. 34.

ఇయదధికరణం సమాప్తం

## 22. అన్తరాభూతాధికరణమ్. సూ. 35-36

### సూ. అన్తరాభూతగ్రామవత్స్వాత్మనః. 3.3.35

"యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ, య ఆత్మా సర్వాన్తరః" బృ.ఉ.3.4.1-3.5.1) ఇత్యేవం ద్విరుషస్తకహోలప్రశ్నయోర్నైరన్తర్యేణ వాజసనేయినః సమామనన్తి- తత్ర సంశయః-విద్యైకత్వం స్యాద్విద్యానానాత్వం వేతి. విద్యానానాత్వమితి తావత్ప్రాప్తమ్, అభ్యాససామర్థ్యాత్. అన్యథా హ్యన్యూనానతిరిక్తార్థేద్విరామ్నాన మనర్థకమేవ స్యాత్.తస్మాద్యథాభ్యాసాత్కర్మభేద ఏవమభ్యాసాద్విద్యాభేద ఇతి.

బాలానందిని

అన్తరేతి :- పూర్వసూత్రం నుంచి 'ఆమననాత్' అనే పదం అనువర్తిస్తుంది. "అన్తరామననాత్= సర్వాంతర మని చెప్పడంచేత, స్వాత్మనః=స్వాత్మకు ఏకత్వం తెలుస్తున్నది. భూతగ్రామవత్-భూత గ్రామంలో వలె'' అని సూత్రార్థం.

యత్సాక్షాదితి :- "యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ య ఆత్మా సర్వాన్తరః"(ఏ బ్రహ్మ సాక్షాత్తుగా, అనగా ఘటాదులవలె చిద్విషయం కాకుండా, ప్రత్యక్షమో, ఏ ఆత్మ అన్నింటికంటె లోపల నున్నదో)అని ఉషస్తి - కహోలప్రశ్నలలో వాజసనేయులు రెండు సార్లు నిరంతరంగా(ఒకదాని తరవాత ఒకటి) పఠిస్తున్నారు. ఇక్కడ-విద్యైకత్వమా, విద్యాభేదమా అని సంశయం. అయితే విద్యాభేదమే అని ప్రాప్తించినది. అందుకు కారణం అభ్యాససామర్థ్యం అనగా రెండు పర్యాయాలు ఆవృత్తి చేయడం. అలా కాకపోతే అర్థంలో హెచ్చుతగ్గులు ఏవీ లేకుండా రెండుమార్లు ఆవృత్తి చేయడం వ్యర్థం అవుతుంది. అందుచేత ఒక పదం యొక్క అభ్యాసంవల్ల కర్మభేదం వలె (సమిధో యజతి తనూనపాతం యజతి ఇత్యాదివాక్యాలలో 'యజతి' పదాన్ని ఆవృత్తి చేయడంచేత ఆ కర్మలు వేరు అని అంగీకరించినట్లు) విద్యాభేదమే.

వి. పిబన్తౌ అనే పదం లాక్షణికంగాన వేద్యం ఒక్కటే గాన విద్య కూడ ఒక్కటే అని వెనుక నిర్ణయించబడింది. ఇక్కడైతే వేద్యం అక్కటే అయినా అభ్యాసంచేత విద్యకు ఐక్యం లేదు అని ప్రత్యుదాహరణసంగతి చేత పూర్వపక్షం.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే ప్రత్యాహ-అన్తరామ్నానావిశేషాత్ స్వాత్మనోవిద్యైకత్వమితి సర్వాన్తరో హి స్వాత్మా ఉభయత్రాప్యవిశిష్టః పృచ్ఛ్యతే చ ప్రత్యుచ్యతే చ. న హి ద్వావాత్మానౌ ఏకస్మిన్ దేహే సర్వాన్తరౌ సంభవతః. తదాహ్యేకస్యాఞ్జసం సర్వాన్తరత్వమవకల్ప్యేత. ఏకస్య తు భూతగ్రామవన్నైవ సర్వాన్తరత్వం స్యాత్. యథా చ పఞ్చభూతసమూహే దేహే పృథివ్యా ఆపోఽన్తరాః అద్భ్యస్తేజోన్తరమితి సత్యప్యాపేక్షికేఽన్తరత్వే నైవ ముఖ్యం సర్వాన్తరత్వం భవతి తథేహాపీత్యర్థః. అథవా భూతగ్రామవదితి శ్రుత్యన్తరం నిదర్శయతి. యథా "ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా" (శ్వే. ఉ.6.11)ఇత్యస్మిన్ మన్త్రే సమస్తేషు భూతగ్రామేష్వేక ఏవ సర్వాన్తర ఆత్మా ఆమ్నాయతే, ఏవమనయోరపి బ్రాహ్మణయోరిత్యర్థః. తస్మాద్వేద్యైక్యాద్విద్యైక్యమితి. 35.

### బాలానందిని

ఏవమితి :-ఇట్లు ప్రాప్తించగా సమాధానం చెపుతున్నాడు. స్వాత్మకు అంతరామ్నానంలో భేదం లేదు గాన విద్యైకత్వమే. రెండు చోట్లా కూడ భేదం లేకుండా సర్వాంతరమైన (అన్నింటికంటె లోపలనున్న) ఆత్మను గూర్చియే ప్రశ్నించడం సమాధానం చెప్పడం జరిగింది. ఒక దేహంలో రెండు ఆత్మలు సర్వాంతరాలుగా ఉండవు కదా. అప్పుడు ఒక ఆత్మకు సరియైన సర్వాంతరత్వం చెప్పవలసి ఉంటుంది. మరొకదానికి భూతగ్రామానికి వలె సర్వాంతరత్వం ఉండదు. పంచభూతసమూహాత్మకమైన దేహంలో పృథివికంటె ఉదకం లోపలిదిగా ఉంటుంది. ఉదకంకంటె తేజస్సు లోపలిదిగా ఉంటుంది. ఇక్కడ వీటికి ఆపేక్షికమైన అంతరత్వం ఉన్నా కూడ ముఖ్యమైన సర్వాంతరత్వం (ఒకదానికే కాని అన్నింటికీ) ఉండదు; అట్లే ఇక్కడ కూడ. లేదా "భూతగ్రామవత్" అనేది మరొక శ్రుతిని నిర్దేశిస్తున్నది. "ఏకో....సర్వభూతాన్తరాత్మా" అనే మంత్రంలో సమస్తభూతసముదాయంలోను ఒకే ఆత్మ సర్వాంతరం అని ఏ విధంగా చెప్పబడిందో అట్లే ఈ బ్రాహ్మణాలలో కూడ అని అర్థం. అందువల్ల వేద్యైక్యాన్ని పట్టి విద్యైక్యం అంగీకరించాలి. 3.

సూ. అన్యథా భేదానుపపత్తిరితి చేన్నోపదేశాన్తరవత్. 3.3.36

అథ యదుక్తమనభ్యుపగమ్యమానే విద్యాభేదే అమ్నాయభేదానుపపత్తిరితి తత్పరిహర్తవ్యమ్. అత్రోచ్యతే-నాయం దోషః. ఉపదేశాన్తరవదుపపత్తేః. యథా తణ్డినాముపనిషది షష్ఠే ప్రపాఠకే-"స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో "(ఛా.ఉ.6.8.7) ఇతి నవకృత్వోఽప్యుపదేశే న విద్యాభేదో భవత్యేవమిహాపి భవిష్యతి. కథం చ నవకృత్వోఽప్యుపదేశే విద్యాభేదో న భవతి? ఉపక్రమోపసంహారాభ్యామే కార్థత్వావగమాత్. "భూయ ఏవ మా భగవాన్ విజ్ఞాపయతు"(ఛా.ఉ.6.5.4) ఇతి చైకస్యైవార్థస్య పునః పునః ప్రతిపిపాదయిషితవ్యత్వేన ఉపక్షేపాత్. ఆశఙ్కాన్తరనిరాకరణేన చాసకృదుపదేశోపపత్తేః, ఏవమిహాపి ప్రశ్నరూపాభేదాత్, "అతోఽన్యదార్తమ్"(బృ.ఉ.3.4.2;3.5.1) ఇతి చ పరిసమాప్త్యవిశేషాదుపక్రమోప సంహారౌ తావదేకార్థవిషయౌ దృశ్యేతే. "యదేవ సాక్షాదపరోక్షాద్బ్రహ్మ" (బృ.ఉ.3.5.1) ఇతి ద్వితీయేఽపిప్రశ్నేఏవకారంప్రయుఞ్జానఃపూర్వప్రశ్న గతమేవార్థముత్తరత్రాకృష్యమాణం దర్శయతి. పూర్వస్మింశ్చ బ్రాహ్మణే కార్యకరణవ్యతిరిక్తస్యాత్మనః సద్భావః కథ్యతే. ఉత్తరస్మింస్తు తస్యైవాశనాయాది సంసారధర్మాతీతత్వం కథ్యతే ఇత్యేకార్థతోపపత్తిః. తస్మాదేకా విద్యేతి. 36

బాలానందిని

అన్యథేతి:-"అన్యథా=విద్యాభేదం అంగీకరించకపోతే, భేదానుపపత్తిశ్చేత్-అమ్నానభేదం ఉపపన్నం కాదు అన్నట్లయితే, న=అది దోషం కాదు. ఉపదేశాన్తరవత్=మరొక ఉపదేశం వలె ఉపపన్నం అవుతుంది" అని సూత్రార్థం.

యథేతి :- ఇప్పుడు విద్యాభేదం అంగీకరించకపోతే ఆమ్నానభేదం కుదరదు అని చెప్పినదానికి పరిహారం చెప్పాలి. ఈ విషయంలో చెప్పబడుచున్నది. ఇది దోషం కాదు. ఉపదేశాంతరం వలె ఉపపన్నం అవుతుంది. తాండుల ఉపనిషత్తులోని షష్ఠప్రపాఠకంలో-"స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" అని తొమ్మిది పర్యాయాలు ఉపదేశించినా విద్యాభేదం ఎలా లేదో అట్లే ఇక్కడ కూడ అవుతుంది. తొమ్మిది పర్యాయాలు ఉపదేశించినా

విద్యాభేదం ఎందుకు కలుగలేదు? ఉపక్రమోపసంహారములను బట్టి వీటి కన్నింటికీ ఒకే అర్థం అని తెలియతంవల్ల, "భూయ ఏవ మా భగవాన్ విజ్ఞాపయతు" (పూజ్యుడవైన నీవు నాకు మళ్ళీ బోధించెదవుగాక) అని ఒకేవిషయాన్ని మళ్ళీ మళ్ళీ ప్రతిపాదించడానికి కోరబడినట్లు చెప్పడంవల్ల వేరు వేరు ఆశంకలను తొలగించడంకోసం అనేకపర్యాయాలు ఉపదేశం ఉపపన్నం అవడంవల్లా కూడ. అట్లే ఇక్కడ కూడ ప్రశ్నల రూపంలో భేదం లేకపోవడంవల్లా, "అతో౽న్యదార్తమ్" అని ఉపసంహారంలో కూడ భేదం లేకపోవడం వల్లా ఉపక్రమోపసంహారాలు ఒకే విషయాన్ని గూర్చిన వని కనబడుతున్నాయి. "యదేవ సాక్షాదపరోక్షాద్బ్రహ్మ" అను ద్వితీయప్రశ్నలో కూడ ఏవకారం ప్రయోగిస్తూ పూర్వప్రశ్నకు సంబంధించిన విషయమే తరువాత వాక్యంలోనికి గ్రహించబడుతున్నట్లు చూపుచున్నాడు.

వి. బృహదారణ్యకంలో ఉషస్తుడు "యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ య ఆత్మా సర్వాన్తరః తం మే ఆచక్ష్వ" అని యాజ్ఞవల్క్యుణ్ణి ప్రశ్నించాడు. ఈ ప్రశ్నకు సమధానంగా "యః ప్రాణేన ప్రాణితి స త ఆత్మా సర్వాన్తరః" ఇత్యాదికంచేత కార్యకారణరహితమైన ఆత్మ ప్రతిపాదించబడింది. దాని తరువాతి బ్రాహ్మణంలో కహోలుడు వెనుకటి వలె ప్రశ్నించగా "యో౽శనాయాపిపాసే శోకం మోహం జరాం మృత్యుమత్యేతి" అని అశనాయాద్యతీతుడు ఆత్మ అని ప్రతిపాదించబడింది. అయితే ఇక్కడ రెండవ ప్రశ్నలో "యత్సాక్షాదపరోక్షాత్" అని కాకుండా "యదేవ సాక్షాదపరోక్షాత్" అని 'ఏవ' కారం కూడ ప్రయోగించబడింది. దీనిని పట్టి వెనుకటి ప్రశ్నకు సంబంధించినదే ఈ ప్రశ్నకు కూడ విషయ మని తెలుస్తూన్నది. ఏదైతే సాక్షాదపరోక్షమో దానినే చెప్పు అని ఏవకారాన్ని పట్టి అర్థం లభిస్తుంది కదా?

పూర్వస్మింశ్చేతి :-పూర్వబ్రాహ్మణలో కూడ కార్యకారణాలకంటె భిన్నమైన ఆత్మ ఉన్నది అని ప్రతిపాదించబడింది. తరువాతి బ్రాహ్మణంలో నైతే అశనాయాద్యతీతమైన ఆ ఆత్మయే చెప్పబడింది. ఈ విధంగా ఈ రెండింటిలోను చెప్పినది ఒక్క విషయమే అనేది ఉపపన్నం అవుతూన్నది. అందుచేత ఇది ఒక్క విద్యయే. 36.

అన్తరాభూతాధికరణం సమాప్తం

## 23. వ్యతిహారాధికరణమ్. సూ. 37

### సూ. వ్యతిహారో విశింషన్తి హీతరవత్. 3.3.37

"తద్యోఽహం సోఽసౌ యోఽసౌ సోఽహమ్" (ఐ.ఆ.2.2.4.6) ఇత్యాదిత్య పురుషం ప్రకృత్య ఐతరేయిణః సమామనన్తి. తథా జాబాలాః "త్వం వా అహమస్మి భగవో దేవతేఽహం వై త్వమసి" ఇతి. తత్ర సంశయః- కిమిహ వ్యతిహారేణోభయరూపా మతిః కర్తవ్యోత ఏకరూపైవేతి. ఏకరూపైవేతి తావదాహ. న హ్యత్రాత్మన ఈశ్వరేణైకత్వం ముక్త్వా అన్యత్కించిచ్చిన్తయితవ్యమస్తి. యది చైవం చిన్తయితవ్యో విశేషః పరికల్ప్యేత సంసారిణశ్చేశ్వరాత్మత్వమ్ ఈశ్వరస్య సంసార్యాత్మత్వమితి తత్ర సంసారిణస్తావదీశ్వరాత్మత్వే ఉత్కర్షోఽత్ర భవేత్; ఈశ్వరస్య తు సంసార్యాత్మత్వే నికర్షః కృతః స్యాత్. తస్మాదైకరూప్యమేవ మతేః. వ్యతిహారామ్నాయస్తు ఏకత్వదృఢీకరణార్థ ఇతి.

ఏవం ప్రాప్తే ప్రత్యాహ-వ్యతిహారోఽయమాధ్యానాయామ్నాయతే, ఇతరవత్. యథా ఇతరే గుణాః సర్వాత్మత్వప్రభృతయః ఆధ్యానాయామ్నా యన్తే తద్వత్. తథా హి విశింషన్తి సమామ్నాతార ఉభయోచ్చారణేన త్వమహమస్మి, అహం చ త్వమసి ఇతి. తచ్చోభయరూపాయాం మతౌ కర్తవ్యాయామర్థవద్భవతి. అన్యథాహీదం విశేషేణోభయామ్నానమనర్థకం స్యాత్, ఏకేనైవ కృతత్వాత్. న నూభయామ్నానస్యార్థవిశేషే పరికల్ప్యమానే దేవతాయాః సంసార్యాత్మత్వాపత్తేః నికర్షః ప్రసజ్యేతేత్యుక్తమ్? నైష దోషః. ఐకాత్మ్యస్యైవానేన ప్రకరణేన అనుచిన్త్యమా నత్వాత్. నన్వేవం సతి స ఏవైకత్వదృఢీకార ఆపద్యేత? న వయమేకత్వదృఢీకారం వారయామః, కిం తర్హి? వ్యతిహారేణేహ ద్విరూపా మతిః కర్తవ్యా వచనప్రా మాణ్యాత్, నైకరూపేత్యేతా వదుపపాదయామః. ఫలతస్త్వేకత్వ మపి దృఢీభవతి. యథా ఆధ్యానార్థేఽపి సత్యకామ త్వాదిగుణోపదేశే తద్గుణ ఈశ్వరః ప్రసిధ్యతి తద్వత్. తస్మాదయమాధ్యాతవ్యో వ్యతిహారః సమానే చ విషయే ఉపసంహర్తవ్యో భవతీతి . 37.

బాలానందిని

వ్యతిహార ఇతి :- వ్యతిహారః=వ్యతిహారం గ్రహించదగినది. విశింషన్తి హి=రెండు విధాలుగా విశేషిస్తున్నారు కదా. ఇతరవత్ = సత్యకామత్వాదులైన ఇతరగుణాదులందు వలె" అని సూత్రార్థం.

తద్య ఇతి :- ఐతరేయులు ఆదిత్యపురుషుణ్ణి ప్రస్తావించి "తద్యోహం....సోఽహమ్" (నేను ఎవడనో అతడు కూడ అతడే, అత డెవరో నేను అతనే-అనగ నేనే అతడు అతడే నేను) అని పఠిస్తున్నారు. అట్లే జాబాలులు కూడ "త్వం....త్వమసి" (ఓ! పూజ్యదేవతా! నువ్వే నేను; నేనే నువ్వు) అని పఠిస్తున్నారు. ఇక్కడ వ్యతిహారంచేత రెండు విధాలైన మతి (ఉపాసన) చెయ్యాలా లేక ఒకే విధమైన మతి చెయ్యాలా అని సంశయం. (ఒకే విషయాన్ని ఒక మాటు ఇటు ఒక మాటు అటూ చెప్పడం వ్యతిహారం. ఇక్కడ జీవేశ్వరుల పరస్పరవిశేషణవిశేష్యభావం వ్యతిహారం. నేనే నువ్వు అన్నప్పుడు జీవుడు విశేషణం ఈశ్వరుడు విశేష్యం. నువ్వే నేను అన్నప్పుడు ఈశ్వరుడు విశేషణం నేను అనే జీవుడు విశేష్యం). ఏకరూపమైన మతియే చెయ్యాలి అంటున్నాడు. ఇక్కడ జీవాత్మకు పరమాత్మతో ఏకత్వాన్ని ప్రతిపాదించడం తప్ప చెప్పవలసినది మరొకటి ఏదీ లేదు. ఇలా ఉండగా సంసారి ఈశ్వరాత్ము డనీ, ఈశ్వరుడు సంసార్యాత్ము డనీ చింతనలో విశేషం కల్పించిన పక్షంలో అప్పుడు సంసారికి ఈశ్వరాత్మత్వం చెప్పడంవల్ల ఉత్కర్ష కలుగుతుంది గాని ఈశ్వరునికి సంసార్యాత్మత్వం చెపితే (ఈశ్వరునికి)నికర్ష (తక్కువతనం) చెప్పిన ట్లవుతుంది. ("ఉత్కృష్టదృష్టిర్నికృష్టే కృతా ఫలవతీ" - తక్కువదానిని గొప్పదానినిగా భావిస్తే ఫలం కలుగుతుంది అని న్యాయం ఉన్నది కదా అని భావం). అందువల్ల మతి ఒకే విధంగా ఉండాలి. వ్యతిహారం చెప్పడం ఎందు కనగా-ఏకత్వాన్ని దృఢం చేయడంకొరకు. ("నువ్వే నేను, నేనే నువ్వు" అని చెప్పడంలో ఏకత్వాన్ని గట్టిగా నొక్కి చెప్పిన ట్లవుతుంది అని భావం).

ఇట్లు ప్రాప్తించగా సమాధానం చెపుతున్నాడు-ఇతరమైనవి వలె ఈ వ్యతిహారం కూడ ధ్యానం కోసం చెప్పబడుచున్నది. ఇతరమైన సర్వాత్మత్వం మొదలైన గుణాలు ఏ విధంగా ధ్యానం కోసం చెప్పబడుచున్నాయో ఇది కూడ అట్లే. సమామ్నాయం చేసినవాళ్లు "త్వమహమస్మి అహం చ త్వమసి" అని రెండింటినీ చెప్పడం ద్వారా విశేషిస్తున్నారు

(ప్రత్యేకంగా చెపుతున్నారు). ఉభయవిధమైన మతి చెయ్యాలి అంటేనే అలా అమ్నానం సార్థకం అవుతుంది. అలా కాక పోతే విశేషించి ఈ విధంగా అమ్నానం(పఠించడం) వ్యర్థం అవుతుంది; ఒక్కటి చెపుతేనే చాలు కదా? (ప్రశ్న) ఉభయామ్నానానికి ప్రయోజనం కల్పిస్తే దేవతను సంసార్యాత్మనుగా చెప్పడంచేత (దేవతను)కించపరచి నట్లువుతుం దని చెప్పాం కదా? ఇది దోషం కాదు. ఈ ప్రకారంచేత ఏకాత్మత్వం మాత్రమే చింతించబడుతుంది. (ప్రశ్న) అయితే మేం చెప్పిన ఏకత్వదృఢీకారమే అంగీకరించిన ట్లయింది కదా? (సమాధానం) మేం ఏకత్వదృఢీకారాన్ని నివారించడం లేదు; మరే మనగా - ఇక్కడ, వచనాని కున్న ప్రామాణ్యాన్ని పట్టి రెండు విధాలైన మతి చెయ్యాలి. ఏకరూప మైన మతి కాదు అని మాత్రమే మేం ప్రతిపాదిస్తున్నాం. ఇందుకు ఫలంగా ఏకత్వం కూడ దృఢం అవుతుంది. సత్యకామత్వాదిగుణాలు కేవలం ధ్యానం కోసం మాత్రమే చెప్పబడినా అప్పుడు ఈశ్వరుడు ఆ గుణాలతో కూడినవాడుగానే ఎలా కనబడతాడో అట్లే ఇక్కడ కూడ. అందుచేత ఈ వ్యతిహారం కూడ ధ్యానించవలసినదే; దీనిని సమానవిషయాలలో (ఇతరత్రా చెప్పిన అహంగ్రహోపాసనాదులలో) ఉపసంహరించాలి కూడ. 37.

వ్యతిహారాధికరణం సమాప్తం

## 24. సత్యాద్యధికరణమ్. సూ. 38

## సూ. సైవ హి సత్యాదయః. 3.3.38

"స యో హైతన్మహద్యక్షం ప్రథమజం వేద సత్యం బ్రహ్మ" (బృ.ఉ.5.4.1) ఇత్యాదినా వాజసనేయకే సత్యవిద్యాం సనామాక్షరోపాసనాం విధాయ అనన్తరమామ్నాయతే-"తద్యత్సత్యమసౌ స ఆదిత్యో య ఏష ఏతస్మిన్ మణ్డలే పురుషో యశ్చాయం దక్షిణేఽక్షన్ పురుషః" (బృ.ఉ.5.5.2) ఇత్యాది. తత్ర సంశయః- కిం ద్వే ఏతే సత్యవిద్యే కిం వైకైవేతి. ద్వే ఇతి తావత్ప్రాప్తమ్. భేదేన హి ఫలసంబన్ధో భవతి "జయతీమాన్ లోకాన్" (బృ.ఉ.5.4.1) ఇతి పురస్తాత్. "హన్తి పాప్మానం జహాతి చ య ఏవం వేద" (బృ.ఉ.5.5.3) ఇత్యుపరిష్టాత్. ప్రకృతాకర్షణం తూపాస్యైకత్వాదితి.

బాలానందిని

సైవేతి :- "సైవ=సత్యవిద్య అదే, ఒక్కటే. హి=ఎందువల్ల ననగా- సత్యాదయః=సత్యాదిధర్మాలు ఆకర్షింపబడుచున్నాయి" అని సూత్రార్థం.

స యు ఇతి:- వాజసనేయకంలో "స యో....బ్రహ్మ" ఇత్యాదికంచేత నామాక్షరోపాసనసహితమైన సత్యవిద్యను విధించి ఆ తరవాత - "తద్యత్తత్...పురుషః" ఇత్యాదికం పఠించబడుచున్నది.

వి. వాజసనేయకంలో హృదయం అనే హిరణ్యగర్భుణ్ణి ప్రస్తావించి "స యో హైతన్మహద్యక్షం ప్రథమజం వేద సత్యం బ్రహ్మేతి జయతీమాన్ లోకాన్" అని సత్యవిద్య విధించబడింది. "సర్వవ్యాపకము పూజ్యము, భౌతికము లన్నింటికంటె ముందుగా పుట్టినది అయిన ఈ హిరణ్యగర్భు డనే బ్రహ్మను "సత్యం బ్రహ్మ" అని ఎవడు ఉపాసిస్తాడో అతడు ఈ లోకాలను జయిస్తాడు" అని ఈ వాక్యానికి అర్థం. "సచ్చ త్యచ్చ సత్యమ్" సద్రూపము, బాహ్యపంచభూతాత్మకము అని అర్థం. హిరణ్యగర్భు డనే పేరుగల బ్రహ్మయే సత్యం. ఈ ఉపాసనకు అంగంగా "తదేతత్ త్ర్యక్షరం సత్యమితి స ఇత్యేకమక్షరం తీత్యేకమక్షరం యమిత్యే కమక్షరం ప్రథమోత్తమే అక్షరే సత్యం, మధ్యతోఽనృతం తదేతదనృతముభయతః సత్యేన పరిగృహీతం సత్యభూయమేవ భవతి" అని సత్యనామాక్షరోపాసన చెప్పబడింది. "సత్యమ్" అనేది మూడు అకరాలు కల పదం. 'స' ఒక అక్షరం 'త్' ఒక అక్షరం, 'యమ్' ఒక అక్షరం. మొదటి అక్షరం మూడవ అక్షరం సత్యమైనది. మధ్యనున్న త్ అసత్యం. రెండు ప్రక్కల సత్యంచేత పరివృతమైన మధ్యన్న అసత్యం కూడ సత్యమే అవుతుంది అని ఈ వాక్యానికి అర్థం. తరవాత-"తద్యత్తత్సత్యమసౌ స ఆదిత్యో య ఏష ఏతస్మిన్ మణ్డలే పురుషో యశ్చాక్షన్ దక్షిణే పురుషః" అని చెప్పబడింది. "హిరణ్యగర్భనామధేయం గల ఏ సత్య మున్నదో అదే ఈ ఆదిత్యుడు; ఆదిత్యమండలంలోని పురుషుడు. ఆ సత్యమే కుడికంట్లో ఉన్న పురుషుడు" అని ఈ వాక్యానికి అర్థం.

తత్రేతి:- ("స యో హైతత్" ఇత్యాదివాక్యంచేత చెప్పబడిన సత్యవిద్యా, "తద్యత్తత్సత్యమసౌ ఆదిత్యః" ఇత్యాదివాక్యంచేత చెప్పబడిన సత్యవిద్యా- ఈ రెండూ రెండు విద్యలా లేక ఒక్క విద్యయేనా అని సంశయం. ఇవి రెండు విద్య లని

ప్రాప్తిస్తున్నది. ఎందువల్ల ననగా- ముందు "జయతీమాన్ లోకాన్" అని ఒక ఫలం మొదటి విద్యకు చెప్పి తరవాత "హన్తి పాప్మానం జహాతి చ య ఏవం వేద" (ఇలా తెలుసుకున్నవాడు పాపాన్ని నశింపచేస్తాడు. పాపం విడిచిపెడతాడు) అని రెండు విధాలైన ఫలాలతో సంబంధం చెప్పబడింది. ("తద్యత్తత్సత్యమ్" అట్టి ఏ సత్యం ఉన్నదో అని) ప్రకృతమైన సత్యాన్ని ఆకర్షించడ మైతే ఉపాస్యమైన సత్యం ఒక్కటే కాబట్టి చేయబడింది.

వి. జీవబ్రహ్మల విషయంలో వ్యతిహారోక్తిభేదాన్ని పట్టి విద్య ద్విరూపమైన దని వెనుక చెప్పబడింది. అట్లే ఇక్కడ సత్యవిద్యలో లోకజయం ఫలంగా చెప్పబడింది. అనంతరవిద్యలో పాపనివృత్తి ఫలంగా చెప్పబడింది గాన ఫలభేదాన్ని పట్టి విద్యాభేద మని దృష్టాంతసంగతిచేత పూర్వపక్షం.

భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః- ఏకైవేయం సత్యవిద్యేతి. కుతః? "తద్యత్తత్సత్యమ్" ఇతి ప్రకృతాకర్షణాత్. నను విద్యాభేదేఽపి ప్రకృతాకర్షణముపాస్యైకత్వాదుపపద్యత ఇత్యుక్తమ్? నైతదేవమ్. యత్ర తు విస్పష్టాత్కారణాన్తరాద్విద్యాభేదః ప్రతీయతే తత్రైతదేవం స్యాత్. అత్ర తూభయథా సంభవే తద్యత్తత్సత్యమితి ప్రకృతాకర్షణాత్ పూర్వవిద్యాసంబన్ధమేవ సత్యముత్తరత్రానుకృష్యత ఇత్యేకవిద్యాత్వనిశ్చయః. యత్పునరుక్తం ఫలాన్తర శ్రవణాద్విద్యాన్తరత్వమితి. అత్రోచ్యతే-తస్యోపనిషద హరహమితి చ అఙ్గాన్తరోపదేశస్య స్తావకమిదం ఫలాన్తరశ్రవణ మిత్యదోషః. అపి చార్థవాదాదేన ఫలే కల్పయితవ్యే సతి విద్యైకత్వే చావయవేషు శ్రూయ మాణాని బహూన్యపి ఫలాన్యవయవిన్యామేవ విద్యాయాముప సంహర్తవ్యాని భవన్తి. తస్మాత్సైవేయమేకా సత్యవిద్యా తేన తేన విశేషేణోపేతా అమ్నాయత ఇత్యతః సర్వ ఏవ సత్యాదయో గుణాః ఏకస్మిన్నేవ ప్రయోగే ఉపసంహర్తవ్యాః.

బాలానందిని

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా ఈ సత్యవిద్య ఒక్కటే అని అంటాం. ఎందువల్ల?

"తద్యత్సత్యమ్" అని ప్రకృతమైనదానిని అనుకర్షించడంవల్ల (ముందుకు లాగడంవల్ల). (ప్రశ్న)-విద్యాభేదం ఉన్నా కూడ ఉపాస్యం ఒక్కటే గాన ప్రకృతాకర్షణం కుదురుతుంది అని చెప్పాం కదా? (సమాధానం) అది సరికాదు. స్పష్టమైన మరొక కారణం ఏదైనా ఉన్నచోట ఎక్కడైతే విద్యాభేదం తెలుస్తుందో అక్కడ ఇది ఇట్లే కావచ్చును. ఇక్కడైతే (కారణాంతరం ఏదీ లేదు గాన)రెండు విధాలా కూడ సంభవమే గాన, "తద్యత్సత్యమ్" అని ప్రకృతాకర్షణాన్ని పట్టి పూర్వవిద్యకు సంబంధించిన సత్యమే ముందుకు లాగబడుచున్నది గాన ఒకే విద్య అని నిశ్చయం. మరొక ఫలం వినబడుచున్నది గాన ఇది మరొక విద్యయే అని ఏది చెప్పబడిందో దాని విషయంలో చెపుతున్నాం. "తస్య ఉపనిషత్ అహః అహమ్" అనే ఈ ఫలాంతరశ్రవణం (చెప్పబడిన మరి యొక ఫలం) ఉపదేశించిన మరొక అంగాన్ని స్తుతించేది మాత్రమే గాన ఈ దోషం లేదు.

వి. "తస్యోపనిషదహరిత్యధిదైవతమ్. హన్తి పాప్మానం జహాతి చ య ఏవం వేద. తస్యోపనిషదహమిత్యధ్యాత్మం. హన్తి పాప్మానం జహాతి చ య ఏవం వేద" అనే వాక్యంలో ఆదిత్య పురుషోపాసనకు అంగంగా 'అహః' అను ఉపనిషత్తు, అక్షిపురుషోపాసకునకు అంగంగా 'అహమ్' అనే ఉపనిషత్తూ విధింపబడ్డాయి. అంగాలైన ఉపనిషత్తుకు 'హన్తి పాప్మానమ్' ఇత్యాదికం ఫలం చెప్పబడింది. అంతే కాని ప్రధానమైన సత్యవిద్యకు ఫలంగా చెప్పబడలేదు అని భావం.

అపి చేతి :- మరొక విషయ మేమనగా-అర్థవాదనుండి మాత్రమే ఫలాన్ని కల్పింపవలసి ఉన్నప్పుడు విద్యైకత్వం నిర్ణీత మైన స్థలంలో అంగాల విషయంలో వినబడుతూన్న అనేకఫలాలు కూడ ప్రధానవిద్యయందే ఉపసంహరించవలసి ఉంటుంది.

వి. లోకజయం అనేది "ప్రథమజం సత్యం బ్రహ్మేతివేద" అనే ప్రధానవిద్యకు ఫలం అని అంగీకరించి మేం పై సమాధానం చెప్పాం. వాస్తవంలో ప్రధానవిద్యావాక్యంలో 'ఏవం కామః' (ఇట్టి కోరిక గలవాడు) అని చెప్పి ఫలం చెపితే అది దాని ఫలం చెప్పినట్లవుతుంది. అలాంటి దేదీ ఇక్కడ లేదు. అందుచేత లోకజయం ప్రధానవిద్యాఫలం అని చెప్పడానికి అవకాశం లేదు. అలాంటప్పుడు ఏదో ఫలం కల్పించాలి గాన అర్థవాదవాక్యంలో చెప్పిన ఫలం సాంగమైనప్రధానవిద్యకు వర్తిస్తుంది. అందుచేత ఫలభేదం కూడ లేదు.

తస్మాదితి :- అందుచేత ఆ ఒక్క సత్యవిద్యయే ఆ యా విశేషాలతో కూడి నట్లు చెప్పబడుచున్నది గాన సత్యాదిగుణా లన్నీ ఒకే ప్రయోగంలో (చోట) ఉపసంహరించాలి.

## భాష్యమ్

కేచిత్పునరస్మిన్ సూత్రే ఇదం వాజసనేయకమ్, అక్ష్యాదిత్యపురుషవిషయం వాక్యం, చాన్దోగ్యే చ -"అథ య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే (ఛా. ఉ.1.6.6) "అథ య ఏషోఽన్తరక్షిణి పురుషో దృశ్యతే" (ఛా. 4.15.1) ఇత్యుదాహృత్య సైవాయమక్ష్యాదిత్యపురుషవిషయా విద్యోభయత్రైకేవేతి కృత్వా సత్యాదీన్ గుణాన్ వాజసనేయిభ్యః ఛన్దోగానాముపసంహర్తవ్యాన్మన్యన్తే. తన్న సాధు లక్ష్యతే. ఛాన్దోగ్యే హి జ్యోతిష్టోమకర్మసంబన్ధినీయముద్గీథవ్యపాశ్రయా విద్యా విజ్ఞాయతే. తత్ర హ్యాదిమధ్యావసానేషు కర్మసంబన్ధీని చిహ్నాని భవన్తి- "ఇయమేర్గగ్నిః,సామ" (ఛా.ఉ.1.6.1). ఇత్యుపక్రమే, "తస్యర్క్చ సామ చ గేష్ణౌ తస్మాదుద్గీథః" (ఛా.ఉ. 1.6.8) ఇతి మధ్యే, "య ఏవం విద్వాన్ సామ గాయతి" (ఛా.ఉ. 1.7.9) ఇత్యుపసంహారే. నైవం వాజసనేయకే కించిత్కర్మసంబన్ధి చిహ్నమస్తి. తత్ర ప్రక్రమభేధాద్విద్యాభేదే సతి గుణవ్యవస్థైవ యు క్తేతి. 38

## బాలానందిని

కేచిదితి :- కొందరైతే ఈ సూత్రంలో-వాజనేయంలో ఉన్న అక్ష్యాదిత్యపురుషులకు సంబంధించిన ఈ వాక్యాన్నీ, ఛాందోగ్యంలో ఉన్న "అథ య ఏషోఽన్తరాదిత్యే ...దృశ్యతే","అథ....దృశ్యతే" అను వాక్యాలను ఉదాహరించి అక్ష్యాదిత్యపురుషులకు సంబంధించిన ఆ విద్య రెండు చోట్లా ఒకటే అవడంచేత ఛందోగుల సత్యాదిగుణాలను వాజసనేయులనుండి ఉపసంహరించుకోవాలి అని అనుకొంటున్నారు. అది సరియైనదిగా కనబడడంలేదు. ఛాందోగ్యంలో ఉన్న ఈ ఉద్గీథానికి సంబంధించిన విద్య జ్యోతిష్టోమకర్మకు సంబంధించినట్లు తెలుస్తూన్నది. అక్కడ "ఇయమేవర్గగ్నిః సామః" అని ప్రారంభంలోను. "తస్యర్క్చ సామ చ గేష్ణౌ తస్మాదుద్గీథః" అని మధ్యలోను, "య ఏవం విద్వాన్ సామ గాయతి" అని ఉపసంహారంలోను-ఈ విధంగా ఆదిమధ్యావసానాలలో కర్మకు

సంబంధించిన చిహ్నాలు కనబడుతున్నాయి. వాజసనేయకంలో నైతే ఈ విధమైన కర్మకు సంబంధించిన చిహ్నం ఏదీ లేదు. అలాంటప్పుడు ప్రక్రమభేదాన్ని పట్టి విద్యాభేదం ఉండడంవల్ల గుణవ్యవస్థయే (ఎక్కడ చెప్పిన గుణాలు అక్కడనే అంగీకరించడం) యుక్తం. 38

సత్యాద్యధికరణం సమాప్తం

## 25. కామాద్యధికారాధికరణమ్. సూ. 39

### సూ. కామాదీతరత్ర తత్ర చాయతనాదిభ్యః. 3.3.39

"అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరం పుణ్డరీకం వేశ్మ దహరోఽస్మిన్నన్తరాకాశః"(ఛా.ఉ.8.1.1) ఇతి ప్రస్తుత్య ఛన్దోగా అధీయతే- "ఏష ఆత్మాపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాసః సత్యకామః సత్య సంకల్పః" (ఛా.ఉ.8.1.5) ఇత్యాది.తథా వాజసనేయినః-"స వా ఏష మహానజ ఆత్మా యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు య ఏషోఽన్తర్హృదయ ఆకాశస్తస్మిన్ శేతే సర్వస్య వశీ" (బృ.ఉ.4.4.22) ఇత్యాది. తత్ర విద్యైకత్వం పరస్పరగుణయోగశ్చ కిం వా నేతి సంశయే విద్యైకత్వమితి. (బ్రహ్మవిద్యాభరణోపేతపుస్తకే "సంశయః. తత్రేదముచ్యతే" ఇతి పాఠః).తత్రేదముచ్యతే-కామాదీతి. సత్యకామాదీత్యర్థః. యథా దేవదత్తో దత్తః, సత్యభామా భామేతి. యదేతత్ చాన్దోగ్యే హృదయాకాశస్య సత్యకామత్వాది గుణజాతముపలభ్యతే తదితరత్ర వాజసనేయకే "స వా ఏష మహానజ ఆత్మా" ఇత్యత్ర సంబధ్యేత. యచ్చ వాజసనేయకే వశిత్వాద్యుపలభ్యతే తదపీతరత్ర ఛాన్దోగ్యే "ఏష ఆత్మాపహతపాప్మా"(ఛా.ఉ.8.1.5) ఇత్యత్ర సంబధ్యేత. కుతః? ఆయతనాదిసామాన్యాత్. సమానం హ్యుభయత్రాపి హృదయమాయతనం సమానశ్చ వేద్య ఈశ్వరః, సమానం చ తస్య సేతుత్వం లోకాసంభేదప్రయోజన మిత్యేవమాది బహుతరం సామాన్యం దృశ్యతే.

బాలానందిని

కామాదీతి :- "తత్ర=అక్కడ ఉన్న, కామాది=సత్యకామత్వాదికం, ఇతరత్ర చ=మరొక చోట కూడ అన్వయిస్తుంది. ఇతరత్ర=మరొక చోట నున్నది. తత్ర=అక్కడ అన్వయిస్తుంది. ఆయతనాదిభ్యః=స్థానంమొదలైనవాటివల్ల ఉపసంహారంచెయ్యాలి" అని సూత్రార్థం.

అథేతి :- ఛందోగులు-"అథ...అన్తరాకాశః" అని ప్రారంభించి, "ఏష ఆత్మా...సత్యసంకల్పః" ఇత్యాదికం పఠిస్తున్నారు. అట్లే వాజసనేయులు "స వా...వశీ" ఇత్యాదికం పఠిస్తున్నారు. ఇక్కడ విద్యైకత్వము, పరస్పరగుణసంబంధమూ ఉన్నాయా లేవా అని సంశయం కలగగా-విద్యైకత్వ మని ప్రాప్తించగా-ఇది చెప్పబడుచున్నది. కామాది అనగా సత్యకామాదికం అని అర్థం. 'దేవదత్తః'కు' బదులు 'దత్తః' అని "సత్యభామా" కు బదులు 'భామా' అని ఎట్లో అట్లే ఇక్కడ కూడ. ఛాందోగ్యంలో హృదయాకాశానికి చెప్పిన సత్యకామత్వాదికం మరొకచోట అనగా వాజసనేయకంలో "స వా ఏష మహానజ ఆత్మా" అనే చోట సంబంధిస్తుంది. వాజసనేయకంలో ఉన్న వశిత్వాదికం, మరొక చోట అనగా ఛాందోగ్యంలో ఉన్న "ఏష ఆత్మాపహతపాప్మా" అనేదానితో సంబంధిస్తుంది. ఎందువల్ల? ఆయతనాదుల సామ్యంవల్ల. రెండు చోట్లా కూడ హృదయం అనే స్థానం సమానమే; వేద్యుడైన ఈశ్వరుడు సమానుడే లోకాలలో అసంభేదానాకి కారణమైన వాని సేతుత్వం కూడ సమానమే. ఈ విధంగా చాలా విషయాలలో సామ్యం కనబడుతున్నది.

భాష్యమ్

నను విశేషోఽపి దృశ్యతే, ఛాన్దోగ్యే హృదయాకాశస్య గుణయోగః, వాజసనేయకే తు ఆకాశాశ్రయస్య బ్రహ్మణ ఇతి. న. "దహర ఉత్తరేభ్యః" (బ్ర.సూ.1.3.14) ఇత్యత్ర ఛాన్దోగ్యేఽప్యాకాశశబ్దం బ్రహ్మైవేతి ప్రతిష్ఠాపితత్వాత్. అయంత్వత్ర విద్యతే విశేషః - సగుణా హి బ్రహ్మవిద్యా ఛాన్దోగ్యే ఉపదిశ్యతే "అథ య ఇహాత్మానమనువిద్య వ్రజన్త్యేతాంశ్చ కామాన్ (ఛా.ఉ.8.116) ఇత్యాత్మవత్కామానామపి వేద్యత్వశ్రవణాత్. వాజసనేయకే తు నిర్గుణమేవ పరం బ్రహ్మోపదిశ్యమానం దృశ్యతే - "అత ఊర్ధ్వం మోక్షాయైవ బ్రూహి" (బృ-

ఉ.4.3.14) "అసంగోహ్యయం పురుషః" (బృ-ఉ.4.3.15)ఇత్యాదిప్రశ్న ప్రతివచన సమన్వయాత్. వశిత్వాది తు తత్స్తుత్యర్థమేవ గుణజాతం వాజసనేయకే సంకీర్త్యతే. తథా చోపరిష్టాత్ - "స ఏష నేతి నేత్యాత్మా" (బృ.ఉ.3.9.26) ఇత్యాదినా నిర్గుణమేవ బ్రహ్మోపసంహరతి. గుణవతస్తు బ్రహ్మణ ఏకత్వాత్ విభూతి ప్రదర్శనాయాయం గుణోపసంహారః సూత్రితో నోపాసనాయేతి ద్రష్టవ్యమ్ 39

బాలానందిని

నన్వితి : - (ప్రశ్న) చాదోగ్యంలో గుణాలు హృదయాకాశానికి చెప్పబడ్డాయి. వాజసనేయంలో నైతే ఆకాశంలో ఉన్న బ్రహ్మకు చెప్పబడ్డాయి. ఈ విధంగా విశేషం కూడా కనబడుచున్నది కదా?

(సమాధానం) అది లేదు. "దహర ఉత్తరేభ్యః" అనే సూత్రంతో ఆకాశం అని చెప్పబడినది బ్రహ్మయే అని స్థాపించబడింది కదా? అయితే - ఇక్కడ ఈ విశేషం మాత్రం ఉంది. - ఛాందోగ్యంలో "అథ . . . కామాన్ (ఎవరైతే ఆత్మను తెలుసుకొని ఈ సత్యమైన కామాలను కూడా తెలుసుకొని వెడతారో) అని ఆత్మ వలె కామాలు కూడా వేద్యాలని చెప్పడంచేత అక్కడ చెప్పిన బ్రహ్మవిద్య సగుణబ్రహ్మవిద్య. వాజసనేయకంలోనైతే " అతఊర్ధ్వం విమోక్షాయైవ బ్రూహి" , 'అసంగో హ్యయం పురుషః' ఇత్యాది ప్రశ్నల, ప్రతివచనాల సమన్వయాన్ని పట్టి నిర్గుణమైన పరబ్రహ్మయే ఉపదేశించబడుచున్నట్లు కనబడుచున్నది. ఆ నిర్గుణబ్రహ్మస్తుతికొరకే వాజసనేయంలో వశిత్వం మొదలైన గుణసముదాయం చెప్పబడుచున్నది. అట్లే తరవాత "స ఏష నేతి నేత్యాత్మా' అని నిర్గుణబ్రహ్మయే ఉపసంహరించబడుతున్నది. అయితే గుణాలున్న బ్రహ్మ మాత్రం ఒక్కటే గాన ఆ బ్రహ్మయొక్క విభూతిని చూపడం కోసం ఈ గుణోపసంహారం చెప్పబడింది గాని ఉపాసన కోసం చెప్పబడలేదని గ్రహించాలి.

వి. ఒక చోట సగుణబ్రహ్మ చెప్పబడింది. మరొక చోట నిర్గుణ బ్రహ్మ చెప్పబడింది. ఈ భేదాన్ని పట్టి విద్యాభేదం అంగీకరించాలి. అయితే సుగుణమైనా, నిర్గుణమైనా బ్రహ్మ అనేది ఒక్కటే కాబట్టి ఆ బ్రహ్మయొక్క విభూతిని చూపడం కోసం మాత్రమే, ఆ బ్రహ్మను

స్తుతించడం కోసం మాత్రమే, గుణోపసంహారం చెప్పబడింది కాని ఉపాసన కోసం, అనగా ఈ గుణాలతో సహా నిర్గుణబ్రహ్మను ఉపాసించడం కోసం కాదు. అని భావం. 39.

కామాద్యధికారాధికరణం సమాప్తం

## 26. ఆదరాధికరణమ్. సూ- 40-41

### సూ ఆదరాదలోపః. 3.3.40

ఛాన్దోగ్యే వైశ్వానరవిద్యాం ప్రకృత్య శ్రూయతే - "తద్యద్భక్తం ప్రథమమాగచ్ఛే త్తద్ధోమీయం స యాం ప్రథమామాహుతిం జుహుయాత్ ప్రాణాయ స్వాహా" (ఛా. ఉ. 5-19.1) ఇత్యాది. తత్ర ప్రాణాహుతయో విహితాః. తాసు చ పరస్తాదగ్నిహోత్ర శబ్దః ప్రయుక్తః-"య ఏతదేవం విద్వానగ్నిహోత్రం జుహోతి"(ఛా.ఉ. 5.24.2) ఇతి.

"యథేహ క్షుధితా బాలా మాతరం పర్యుపాసతే,
ఏవం సర్వాణి భూతాన్యగ్నిహోత్రముపాసతే" (ఛా. ఉ. 5.24.5)

ఇతి చ. తత్రేదం విచార్యతే - కిం భోజనలోపే లోపః ప్రాణాగ్నిహోత్రస్య ఉత అలోప ఇతి. తద్యద్భక్తమితి భక్తాగమనశ్రవణాత్, భక్తాగమనస్య చ భోజనార్థత్వాత్, భోజనలోపే లోపః ప్రాణాగ్నిహోత్రస్యేతి. ఏవం ప్రాప్తే న లుప్యేతేతి తావదాహ. కస్మాత్? ఆదరాత్. తథా హి వైశ్వానరవిద్యాయామేవ జాబాలానాం శ్రుతిః "పూర్వోఽతిథిభ్యోఽశ్నీయాత్ యథాహ వై స్వయమహుత్వాగ్నిహోత్రం పరస్య జుహుయాదేవం తత్" ఇత్యతిథిభోజనస్య ప్రాథమ్యం నిన్దిత్వా స్వామిభోజనం ప్రథమం ప్రాపయన్తీ ప్రాణాగ్నిహోత్రే ఆదరం కరోతి. యా హి న ప్రాథమ్యలోపం సహతే న తరాం సా ప్రాథమ్యతోఽగ్నిహోత్రస్య లోపం సహేతేతి మన్యతే. నను భోజనార్థ భక్తాగమనసంయోగాత్ భోజనలోపే లోపః ప్రాపితః? న. తస్య ద్రవ్యవిశేషవిధానార్థత్వాత్. ప్రాకృతే హ్యగ్నిహోత్రే పయః ప్రభృతీనాం ద్రవ్యాణాం నియతత్వాత్ ఇహాప్యగ్నిహోత్రశబ్దాత్ కౌణ్డపాయినామయనవత్తద్ధర్మప్రాప్తౌ సత్యాం

భక్తద్రవ్యైకతాగుణవిశేషవిధానార్థమిదం వాక్యమ్ - "యద్భక్తమ్" ఇతి. అతో "గుణలోపే న ముఖ్యస్య" ఇత్యేవం ప్రాప్తమ్ - భోజనలోపేఽ ప్యద్భిర్వాన్యేన వా ద్రవ్యేణావిరుద్ధేన ప్రతినిధానన్యాయేన ప్రాణాగ్ని హోత్రానుష్ఠానమితి. 40

బాలానందిని

**ఆదరాదితి** :- "ఆదరాత్ = ఆదరంవల్ల, అలోపః = ప్రాణాగ్నిహోత్రానికి లోపం ఉండగూడదు" అని సూత్రార్థం (ఇది పూర్వపక్షసూత్రం)

**ఛాన్దోగ్య ఇతి**:- ఛాందోగ్యంలో వైశ్వానరవిద్యను ప్రస్తావించి - "తద్యద్భక్తం . . . స్వాహా" - అందువల్ల ముందుగా ఏ అన్నం లభిస్తుందో అది హోమానికి ఉపయోగించేది. ఏ ప్రథమాహుతి హోమం చేస్తారో దానిని ప్రాణాయ స్వాహా అని హోమం చెయ్యాలి ఇత్యాదికం వినబడుచున్నది. అక్కడ ప్రాణాహుతులు విధించబడ్డాయి. తరువాత ఆ ప్రాణాహుతుల విషయంలో "త ఏతదేవం విద్వానగ్నిహోత్రం జుహోతి" (అని అగ్నిహోత్ర శబ్దం ప్రయోగించబడింది. ప్రాణాహుతులు చేయడం అగ్నిహోత్రం అని చెప్పబడింది) "యథేహ. . . ఉపాసతే" (ఆకలి గొన్న బాలులు తల్లిని చేరినట్లు సమస్తభూతాలు అగ్నిహోత్రాన్ని చేరుతాయి. అని కూడా చెప్పబడింది. భోజనలోపం కలిగినప్పుడు (భోజనం లేని రోజున) ఈ ప్రాణాగ్నిహోత్రానికి కూడ లోపం వస్తుందా రాదా అని ఇక్కడ సంశయం ఇట్లు సంశయం. ప్రాప్తించగా లోపించదు అని అంటున్నారు. ఎందువల్ల? ఆదరం వల్ల. వైశ్వానరవిద్యలోనే ఉన్న "పూర్వోఽతిథిభ్యో. . ఏవం తత్" (అతిథులకంటె ముందుగానే తినాలి. అలా తినకపోతే అది తన అగ్నిహోత్రం చేసికొనకుండా ఇతరుల అగ్నిహోత్రం చేయడం వంటి దవుతుంది. అని జాబాలశ్రుతి అతిథిభోజనానికి ప్రాథమ్యాన్ని (ముందు అతిథులకు భోజనం పెట్టడాన్ని) నిందించి గృహస్వామికే ముందు భోజనాన్ని విధిస్తూ ప్రాణాగ్నిహోత్రంయొక్క ఆదరం చేస్తున్నది. భోజనప్రాథమ్యానికి లోపాన్నే సహించని ఆ శ్రుతి ప్రాథమ్యం ఉన్న అగ్నిహోత్రానికి లోపాన్ని అసలే సహించదు కదా! అని భావించబడుచున్నది. (ప్రశ్న) ప్రాణాగ్నిహోత్రం భోజనంకోసం అన్నం రావడంతో కలిసి (ముడివడి) ఉంది గాన భోజనానిని లోపం వచ్చినప్పుడు (భోజనం లేనప్పుడు) ఒక ద్రవ్యాన్ని విధించడంకోసం ఉద్దిష్టమైనది. ప్రకృతి యైన అగ్నిహోత్రంలో పయస్సు

మొదలైన ద్రవ్యాలు తప్పక ఉపయోగింపదగినవి గాన ఇక్కడ కూడ కౌండపాయినామ యనంలో వలె ఆ ధర్మాలు ప్రాప్తింపగా ఈ"తద్యద్భక్తమ్" అనే వాక్యం భక్తద్రవ్య మనే గుణవిశేషాన్ని విధించడం కోసం ఉద్దిష్టమైనది. అందుచేత "గుణలోపం ఉన్నా ముఖ్యానికి లోపం లేదు". అని చెప్పబడింది గాన భోజనానికి లోపం కలిగినా ఉదకం గాని విరుద్ధం కాని మరొక ద్రవ్యం గాని ప్రతినిధిరూపంలో ఉపయోగించి ప్రాణాగ్నిహోత్రం చెయ్యాలి అని ప్రాప్తిస్తున్నది.

వి. కుండపాయిసత్రానికి సంబంధించిన మాసాగ్ని హోత్రంలో "అగ్నిహోత్రం" అనే పేరును పట్టి నిత్యాగ్నిహోత్ర ధర్మాలైన పయోద్రవ్యాదులు లభిస్తాయి అని నిర్ణయించబడింది అదే విధంగా ఇక్కడ కూడ "అగ్నిహోత్రం" అనే నామధేయాన్ని పట్టి ప్రయోద్రవ్యాదులు ప్రాప్తిస్తుండగా "తద్యద్భక్తమ్" ఇత్యాదివాక్యం ఆ పయోద్రవ్యాదులకు అపవాదగా భక్తం అనే ఒక ద్రవ్యాన్ని గుణంగా (ఈ అగ్నిహోత్రానికి అంగంగా) విధిస్తున్నది. అనగా ఈ అగ్నిహోత్రంలో మాత్రం ఉపయోగించవలసిన ద్రవ్యం భక్తం అని అర్థం. అయితే భక్తం లభించనప్పుడు ఏం చేయాలి అని ప్రశ్న. గుణం (అంగం) లభించకపోయినా అంగిని మానడానికి వీలు లేదని "గుణలోపే న ముఖ్యస్య"అను జైమిని సూత్రం చెపుతున్నది. 10-3-63. భక్తం లేని పక్షంలో దానికి ప్రతినిధిగా పయోద్రవ్యాదులు ఉపయోగించి ఈ అగ్నిహోత్రం చెయ్యాలి అని అర్థం.

వి. వైశ్వానరోపాసకుడు అతిథిభోజనానికి పూర్వమే విద్యాంగమైన ఈ అగ్నిహోత్రం అనుష్ఠించడాన్ని గూర్చిన విచారం ఇది. నిర్గుణబ్రహ్మవిషయంలో ఉపాసన లేకపోయినా స్తుతికోసం గుణోపసంహారం చేసి నట్లు (గుణాల లోపం ఉండకూడ దన్నట్లు)భోజనం లోపం ఉన్నా కూడ ప్రాణాగ్నిహోత్రాన్ని ఆదరంతో స్తుతించినందుకు అగ్నిహోత్రలోపం ఉండకూడదు అని దృష్టాంతసంగతిచేత పూర్వ పక్షం 40.

భాష్యమ్

**అత ఉత్తరం పఠతి -**

**సూ. ఉపస్థితే ఽతస్తద్వచనాత్. 3.3.41**

ఉపస్థితే భోజనే ఽతస్తస్మాదేవ భోజనద్రవ్యాత్ ప్రథమోపనిపతితాత్ ప్రాణాగ్ని

హోత్రం నిర్వర్తయితవ్యమ్. కస్మాత్? తద్వచనాత్. తథా హి "తద్యద్భక్తం ప్రథమమాగచ్ఛేత్తద్ధోమీయమ్" (ఛా.ఉ. 5-19.1) ఇతి సిద్ధవద్భక్తోపనిపాత పరామర్శేన పరార్థద్రవ్యసాధ్యతాం ప్రాణాహుతీనాం విదధాతి. తా అప్రయోజకలక్షణాపన్నాః సత్యః కథం భోజనకాలే ద్రవ్యాన్తరం ప్రతినిధాపయేయుః? న చాత్ర ప్రాకృతాగ్నిహోత్రధర్మప్రాప్తిరస్తి. కుణ్డపాయినామయనే హి "మాసమగ్నిహోత్రం జుహోతి". ఇతి విధ్యుద్దేశగతః అగ్నిహోత్రశబ్దః తద్వద్భావం విధాపయేదితి యుక్తా తద్ధర్మప్రాప్తిః. ఇహ పునః అర్థవాదగతోఽగ్నిఽహోత్రశబ్దో న తద్వద్భావం విధాపయితుమర్హతి. తద్ధర్మప్రాప్తౌ చాభ్యుపగమ్యమానాయామగ్న్యుద్ధరణాదయోఽపి ప్రాప్యేరన్. న చాస్తి' సంభవః. అగ్న్యుద్ధరణం తావద్ధోమాది కరణభావాయ. న చాయమగ్నౌ హోమః, భోజనార్థతావ్యాఘాతప్రసంగాత్. భోజనోపనీతద్రవ్యసంబన్ధాచ్చాస్య ఏవైష హోమః. తథా చ జాబాలశ్రుతి :- "పూర్వోఽతిథిభ్యోఽశ్నీయాత్" ఇత్యాస్యాధారామేవే మాం హోమనిర్వృత్తిం దర్శయతి. అత ఏవ చేహాపి సాంపాదికాన్యేవాగ్నిహోత్రాఙ్గాని దర్శయతి-"ఉర ఏవ వేదిర్లోమాని బర్హి ర్హృదయం గార్హ పత్యో మనోఽన్వాహార్యపచన ఆస్యమాహవనీయః" (ఛా.ఉ.5.18.2)ఇతి. వేదిశ్రుతిశ్చాత్ర స్థణ్డిలమాత్రోపలక్షణార్థా ద్రష్టవ్యా, ముఖ్యాగ్నిహోత్రే వేద్యభావాత్. తదఙ్గానాం చాత్ర సంపిపాదయి షితత్వాత్. భోజనేనైవ చ కృతకాలేన సంయోగాన్నాగ్నిహోత్రకాలావరోధసంభవః. ఏవమప్యుపస్థానాదయో ధర్మాః కే చిత్కథంచిద్విరుధ్యన్తే. తస్మాద్భోజనపక్ష ఏవైతే మన్త్రద్రవ్యదేవతాసంయోగాత్పఞ్చ హోమా నిర్వర్తయితవ్యాః. యత్త్వాదరదర్శన వచనం తద్భోజనపక్షే ప్రాథమ్యవిధానార్థమ్. న హ్యస్తి వచనస్యాతి భారః. న త్వనేనాస్య నిత్యతా శక్యతే దర్శయితుమ్. తస్మాద్భోజనలోపే లోప ఏవ ప్రాణాగ్నిహోత్రస్యేతి. 41

బాలానందిని

**అత ఇతి** :-ఇందువల్ల ప్రత్యుత్తరము చదువుచున్నాడు:-

**ఉపస్థితే ఇతి** :-"ఉపస్థితే=భోజనం ఉపస్థితం కాగా(దగ్గరకురాగా), అతః=వచ్చిన ఆ భోజనద్రవ్యం నుండియే ప్రాణాగ్నిహోత్రం చెయ్యాలి. తద్వచనాత్-అట్లే చెప్పబడింది కాబట్టి" అని సూత్రార్థం.

**ఉపస్థిత ఇత** :-భోజనం ఉపస్థిత మైనప్పుడు ముందుగా ఉపస్థితమైన ఆ భోజనద్రవ్యంతో ప్రాణాగ్నిహోత్రం నిర్వర్తించాలి. ఎందువల్ల? అట్లు చెప్పడంవల్ల. అదెట్లనగా - "తద్యద్భక్తం ప్రథమమాగచ్ఛేత్ తద్ధోమీయమ్" అని సిద్ధంగా ఉన్న భక్తం రావడాన్ని పరామర్శిస్తూ ప్రాణాహుతులు పరార్థమైన, అనగా భోజనం అనే మరొక పనికోసం వచ్చిన, ద్రవ్యంచేత సాధించతగినవి అని చెపుతూన్నది. అప్రయోజకలక్షణం పొందిన ఆ ఆహుతులు భోజనలోపం కలిగిన పుడు మరొక ద్రవ్యాన్ని ఎలా ప్రతినిధిగా చేర్చగలవు?

ఏ.అప్ప్రణయనం అనేది క్రతువును పట్టి ఏర్పడినది. అనగా క్రతువుకోసం అప్ప్రణయణనం చెయ్యాలి. అనగా క్రతువు అప్ప్రణయనాకి ప్రయోజకం. ఆ అప్ప్రణయనాన్ని ఆశ్రయించి గోదోహం విధించబడింది. క్రతువే లేనప్పుడు గోదోహనం కూడ లోపిస్తుంది కాని తనకోసం మరియొక అప్ప్రణయంకంటె భిన్నమైన ఆశ్రయాన్ని కల్పించుకొనజాలదు. అట్లే ఇక్కడ కూడ సిద్ధంగా తినడానికి వచ్చిన అన్నాన్ని ఆశ్రయించి విధించబడిన ఆహుతులు కూడ అలాంటి అన్నం లోంపిచి నపుడు (లేనపుడు) లోపిస్తాయి కాని మరొక ఆశ్రయాన్ని (ఉదకాదులను)ప్రతినిధిగా కల్పించుకొన జాలవు(రత్నప్రభ)

న చేతి:- ప్రకృతి యైన నిత్యాగ్నిహోత్రానికి సంబంధించిన ధర్మాలు కూడ ఈ అగ్నిహోత్రంలో ప్రాప్తించవు. కుణ్డపాయినామయనంలో నైతే "మాసమగ్నిహోత్రం జుహోతి" అనే విధివాక్యంలో ఉద్దేశ్యంగా ఉన్న అగ్నిహోత్రశబ్దం తద్వద్భావాన్ని (నిత్యాగ్నిహోత్రసాదృశ్యాన్ని) విధింపచేస్తుంది. అనగా నిత్యాగ్నిహోత్రం ఎలా చెయ్యాలో అలాగే దీనిని కూడ చెయ్యాలి అని ఆ విధంగా చేయిస్తుంది. అందుచేత దాని ధర్మాలు మాసాగ్నిహోత్రంలో ప్రాప్తించడం యుక్తమే. ఇక్కడ అగ్నిహోత్రశబ్దమైతే అర్థవాదవాక్యంలో

ఉంది. అందుచేత ఇది తద్వద్భావాన్ని విధింపచేయజాలదు. నిత్యాగ్నిహోత్రధర్మాల ప్రాప్తిని అంగీకరిస్తే అగ్న్యుద్ధరణం మొదలైనవి కూడ ప్రాప్తించవలసి ఉంటుంది. వాటికి దీనిలో సంభవం లేదు. అగ్న్యుద్ధరణం హోమానికి అధికరణంగా ఉండడానికి చేయబడుతుంది. (అగ్నిలో హోమం చేయడానికి అగ్న్యుద్ధరణం చేయబడుతుంది). ఈ హోమం భోజనంకోసం ఉద్దిష్టమైనదిగాన ఇది అగ్నిలో చేయబడేది కాదు. అప్పుడు దీని భోజనార్థత్వానికి వ్యాఘాతం కలుగుతుంది. ఈ హోమం భోజనం కోసం తీసికొని రాబడిన ద్రవ్యంతో సంబంధం ఉండడంచేత ముఖంలోనే చేయబడుతుంది. అందుచేతనే "పూర్వోఽతిథిభ్యోఽశ్నీయాత్" అను జాబాలశ్రుతి ఈ హోమనిర్వహణానికి ముఖమే ఆధారం అని చూపుతున్నది. అందుచేతనే ఇక్కడకూడ అగ్నిహోత్రాంగాలన్నీ సాంపాదికములే (ఆరోపణ ద్వారా సంపాదించబడినవే;సంపద్రూపములే)అని "ఉర...ఆహవనీయః" అని చూపుచున్నది. ఇక్కడ వేది, స్థండిలాన్ని (తీనెవంటి ప్రదేశం)ఉపలక్షణయా చెప్పడం కోసమే చెప్పబడింది. ముఖ్యాగ్నిహోత్రంలో వేది లేదు కదా? ఇక్కడ ముఖ్యాగ్నిహోత్రంయొక్క అంగాలను సంపాదించ నుద్దేశింపడినది. (అందుచేత ముఖ్యాగ్నిహోత్రంలో స్థండిలమే కాని వేది లేదు గాన "ఉరః వేదిః" అన్నప్పుడు వేది శబ్దానికి లక్షణచేత స్థండిల మని అర్థం). అట్లే భోజనానికి ఏ కాలమో ఆకాలంలోనే ఈ ప్రాణాగ్ని చేయబడాలి గాన ముఖ్యాగ్నిహోత్రానికి చెప్పిన (సాయంప్రాతః కాలరూపమైన)కాలం కూడ దీనికి వర్తించదు. అట్లే ముఖ్యాగ్నిహోత్రానికి సంబంధించిన కొన్ని ఉపస్థానాదిధర్మాలు కూడ ఏదో విధంగా ఈ అగ్నిహోత్రంలో కుదరవు. మంత్ర (ప్రాణాయ స్వాహా ఇత్యాదికం) ద్రవ్య-దేవతాసంయోగంవల్ల ఈ ఐదు హోమాలూ కూడ భోజపక్షంలోనే జరిపించ తగినవి. (భోజనం లేనప్పుడు ఇవి ఉండవు). ఆదరం చూపడం ఏది ఉన్నదో అది భోజనపక్షంలోనే, ముందుగా (అతిథిభోజనానికి ముందు) దీనిని చెయ్యాలి అని చెప్పడంకోసం. (అతిథులు భోజనంచేసిన తరవాతనే గృహస్వామి భోజనం చెయ్యాలి అని శాస్త్రం ఉండగా అతిథుల కంటె ముందు ఎలా భోజనం చేస్తాడు అనే శంకకు అవకాశం లేదు; ఎందుచేత ననగా వచనానికి అతిభారం అంటూ లేదు. (అనగా ఈ వాక్యాన్ని పట్టి వైశ్వానరవిద్యోపాసన చేసేవాడు అతిథులకంటె ముందుగానే భోజనం చెయ్యాలి అని గ్రహించాలి. ఇంత అర్థాన్ని ఈ వాక్యం బోధించగలదా అనే శంకకు తావు లేదు. వాక్యం ఎంత అర్థాన్నైనా బోధించకలుగుతుంది. దీనిని పట్టి అతిథిభోజనానంతరమే స్వామి భోజనం చెయ్యాలనే

శాస్త్రం వైశ్వానరవిద్యోపాసకభిన్నులవిషయంలోనే అని గ్రహించా లని అభిప్రాయం). అయితే ఈ వాక్యంచేత ప్రాణాగ్నిహోత్రం నిత్య మని చెప్పడానికి శక్యం కాదు. అందువల్ల భోజనానికి లోపం కలిగితే ప్రాణాగ్నిహోత్రానికి లోపమే. 41.

ఆదరాధికరణం సమాప్తం

## 27. తన్నిర్ధారణాధికరణమ్. సూ. 42

సూ. తన్నిర్ధారణానియమస్తద్దృష్టేః పృథగ్ఘ్యప్రతిబన్ధః ఫలమ్. 3.3.42

సన్తి కర్మాఙ్గవ్యపాశ్రయాణి విజ్ఞానాని-"ఓమిత్యేతదక్షరముద్గీథముపాసీత" (ఛా.ఉ.1.1.1) ఇత్యేవమాదీని. కిం తాని నిత్యాన్యేవ స్యుః కర్మసు పర్ణమయీత్వాదివత్, ఉత అనిత్యాని గోదోహనాదివదితి విచారయామః. కిం తావత్ప్రాప్తమ్? నిత్యానీతి. కుతః? ప్రయోగవచనపరిగ్రహాత్. అనారభ్యాధీతాన్యపి హ్యేతాని ఉద్గీథాదిద్వారేణ క్రతుసంబన్ధాత్ క్రతుప్రయోగవచనేనైవాఙ్గాన్తరవత్సంస్పృశ్యన్తే. యత్త్వేషాం స్వవాక్యేషు ఫలశ్రవణమ్-"ఆపయితా హ వై కామానాం భవతి" (ఛా.ఉ.1.1.7)ఇత్యాది, తద్వర్తమానాపదేశరూపత్వాత్ అర్థవాదమాత్రమేవ, అపాపశ్లోకశ్రవణాదివత్; న ఫలప్రధానమ్. తస్మాద్యథా "యస్య పర్ణమయీ జుహూర్భవతి న స పాపం శ్లోకం శృణోతి" ఇత్యేవమాదీనామప్రకరణపఠితానామపి జుహ్వాదిద్వారేణ క్రతుప్రవేశాత్ ప్రకరణపఠితవన్నిత్యతా ఏవముద్గీథాద్యుపాసనానామపీతి.

### బాలానందిని

తదితి:- "తన్నిర్ధారణానియమః=కర్మాంగములను ఆశ్రయించిన ఉపాసనలకు, అనియమము అనగా నిత్యములకు వలె ప్రయోగం ఉండదు. తద్దృష్టేః=అనియమం శ్రుతిలో కనబడుచుండడంవల్ల. హి=ఎందువల్ల, పృథక్ అప్రతిబన్ధః=కర్మకు వీర్యవత్తరత్వరూపసమృద్ధిరూపమైన, ఫలమ్=ఫలంచెప్పబడినదో అందువల్ల కూడ ఉపాసన కర్మాంగం కాదు" అని సూత్రార్థం.

సన్నీతి:-కర్మాంగాలకు సంబంధించిన-"ఓమిత్యేతదక్షరముద్గీథముపాసీత" ఇత్యాది విజ్ఞానాలు (ఉపాసనలు) ఉన్నాయి. అవి పర్ణమయీత్వాదుల వలె కర్మలయందు నిత్యములా లేక గోదోహనాదులవలె అనిత్యములా అని విచారిస్తున్నాం. ఏమి ప్రాప్తించింది. నిత్యము లని. ఎందువల్ల? ప్రయోగవచనాలలో చెప్పడంవల్ల. క్రతుప్రయోగవచనంచేతనే (క్రతువును విధించిన వాక్యం చేతనే) ఇతరాంగాల వలె, స్పృశించబడతాయి (గ్రహించబడతాయి). వీటికి స్వవాక్యాలలో ఉన్న "ఆపయితా హ వై కామానాం భవతి" ఇత్యాదిఫలశ్రవణం వర్తమాననిర్దేశరూపంలో ఉండడంచేత, అపాపశ్లోకశ్రవణాదికం వలె. అర్థవాదంమాత్రమే కాని ఫలప్రధానం కాదు. అందువల్ల ప్రకరణంలో పఠింపబడకపోయినా "యస్య పర్ణమయీ...శృణోతి" ఇత్యాదులు జుహ్వాదుల ద్వారా క్రతువులో ప్రవేశించడంవల్ల ప్రకరణంలో పఠింపబడినవి వలె ఏ విధంగా నిత్యములో అట్లే ఉద్గీథాద్యుపాసనలు కూడ (నిత్యములు).

వి. అరభ్యాధీతము లనగా ఏదైన ఒక కర్మను విధించడంకోసం ప్రారంభించి ఆ ప్రకరణంలో పఠించబడినవి. అలాంటి వన్నీ ఆ కర్మకు అంగమవుతాయి. అలా ఒక కర్మ యొక్క ప్రకరణంలో పఠించబడనివి అనారభ్యాధీతములు. అలాంటివి దేనికైనా అంగము లవుతాయా అవవా అనేది ఇతరహేతువులను పట్టి నిర్ణయించాలి. "యస్య పర్ణమయీ జుహూర్భవతి న స పాపం శ్లోకం శృణోతి" (ఎవని జుహువు, ఒక హోమసాధనం, పలాశదారువుచేత చేయబడుతుందో అతడు అపకీర్తిని వినడు)అనే వాక్యం అనారభ్యాధీతం. అయినా కూడ పర్ణమయం అని చెప్పబడినది జుహువు గాన, జుహువు కర్మాంగం గాన ఆ జుహువు ద్వారా పర్ణమయత్వం కూడ నిత్యంగా కర్మాంగం అని నిర్ణయించబడింది. పశురూపమైన ఫలం కావాలనుకొనేవాడు అప్రణయనంలో గోదోహం గ్రహించాలి అని చెప్పబడింది. పశురూపఫలం అవసరం లేనివాడు అది చేయనక్కరలేదు. అందుచేత గోదోహం అనిత్యమైన కర్మాంగం అని నిర్ణయించబడింది. ప్రకృతంలో-"ఓమిత్యేతదక్షరమ్" ఇత్యాది వాక్యాలచేత విధింపబడిన ఓంకారోపాసనాదులు పర్ణమయత్వాదుల వలె కర్మలకు నిత్యాంగములా లేక గోదోహనాదుల వలె అనిత్యాంగములా అని సంశయం. ఇవి అప్రకరణపఠితములైనా కూడ పర్ణమయత్వాదులు వలె క్రతువునకు నిత్యాంగములే. అయితే ఇక్కడ ఉన్న "ఆపయితా హ" ఇత్యాదిఫలశ్రుతి అర్థవాదం మాత్రమే. ఎందువల్ల

ననగా ఇది దేని కంగంగా చెప్పబడుచున్నదో ఆ క్రతువునకే స్వతంత్రమైన ఫలం చెప్పబడింది గాన ఆ ఫలమే వీటికి వర్తిస్తుంది.

పూర్వాధికరణంలో అనిత్యభోజనాశ్రయమైన ప్రాణాగ్నిహోత్రం అనిత్యం అని చెప్పబడింది. అట్లే ఇక్కడ నిత్యకర్మాంగాలైన ఉపాసలు నిత్యము లని చెప్పాలి అని ప్రత్యుదాహరణదృష్టాంతంచేత పూర్వపక్షం.

భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః - తన్నిర్ధారణానియమ ఇతి. యాన్యేతా న్యుద్గీథాకర్మగుణయాథాత్మ్య నిర్ధారణాని రసతమ ఆప్తిః సమృద్ధిర్ముఖ్యప్రాణ ఆదిత్య ఇత్యేవమాదీని నైతాని నిత్య కర్మసు నియమ్యేరన్. కుతః? తద్దృష్టేః. తథా హ్యనియతత్వమేవం జాతీయకానాం దర్శయతి శ్రుతిః "తేనోభౌ కురుతో యశ్చైతదేవం వేద యశ్చ న వేద" (ఛా. ఉ. 1.1.10) ఇత్యవిదుషోఽపి క్రియాభ్యనుజ్ఞానాత్. ప్రస్తావాదిదేవతావిజ్ఞానవిహీనానామపి ప్రస్తోత్రాదీనాం యాజనాధ్యవసానదర్శనాత్ -"ప్రస్తోతర్యా దేవతా ప్రస్తావమన్వాయత్తా తాం చేదవిద్వాన్ ప్రస్తోష్యసి" (ఛా.ఉ. 1.10.9) "తాం చేదవిద్వానుద్గాస్యసి" (ఛా.ఉ. 1.10.-10), తాంచేదవిద్వాన్ ప్రతిహరిష్యసి (ఛా.10.11) ఇతి చ. అపి చైవంజాతీయకస్య కర్మవ్యపాశ్రయస్య విజ్ఞానస్య పృథగేవ కర్మణః ఫలముపలభ్యతే, కర్మఫలసిద్ధ్యప్రతిబన్ధః, తత్సమృద్ధిః, అతిశయవిశేషః కశ్చిత్ - "తేనోభౌ కురుతో యశ్చైతదేవం వేద యశ్చ న వేద నానా తు విద్యా చావిద్యా చ యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి" (ఛా. ఉ. 1.1-10)ఇతి. తత్ర నానాత్వితి విద్వదవిద్వత్ప్రయోగయోః పృథక్కరణాత్ వీర్యవత్తరమితి చ తరప్రత్యయ ప్రయోగాద్విద్యావిహీనమపి కర్మ వీర్యవదితి గమ్యతే . తచ్చానిత్యత్వే విద్యాయా ఉపదపత్యతే. నిత్యత్వే తు కథం తద్విహీనం కర్మ వీర్యవదిత్యనుజ్ఞాయేత? సర్వాఙ్గోపసంహారే హి వీర్యవత్కర్మేతి స్థితిః.

## బాలానందిని

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా - తన్నిర్ధారణానియమం అని చెపుతాం. ఉద్గీథం మొదలైన కర్మగుణాల (కర్మాంగాల) యాథాత్మ్యంయొక్క (యథార్థ స్వరూపంయొక్క) ఏ నిర్ధారణలు అనగా ఉపాసనలలో రసతమత్వం, ఆప్తి, సమృద్ధి, ముఖ్యప్రాణం, ఆదిత్యుడు మొదలైనవి చెప్పబడ్డాయో అవి కర్మలయందు నిత్యంగా నియమించబడవు. ఎందువల్ల ?తద్దృష్టివల్ల. "తేనోభౌ....వేద" (అందుచేత ఎవడు ఇట్లు తెలుసుకొంటున్నాడో, ఎవడు తెలుసుకోవడంలేదో ఇద్దరూ కూడా చేస్తున్నారు) అని అవిద్వాంసునకు కూడ (విజ్ఞానం లేని వానికి కూడ) క్రియ విషయంలో అనుజ్ఞ ఇవ్వడంవల్ల శ్రుతి ఈ రకమైనవి నియతములు కావు అని చూపుచున్నది. ఈ విధంగా తద్దృష్టివల్ల అనగా అనియమం కనబడడం వల్ల.

అవ. చాక్రాయణుడు ప్రస్తోత మొదలైన ఋత్విక్కులతో మీరు ప్రస్తావాదులకు ఏ దేవతలున్నారో ఆ దేవతలను తెలియకుండా ప్రస్తావాదులు చేసి నట్లయితే మీ తల పడిపోతుంది అని అంటాడు. దీనిని పట్టి దేవతావిజ్ఞానం లేకుండా కూడ కర్మయందు ప్రవృత్తి ఉండవచ్చు నని చూచింపబడుచున్నదని చెపుతున్నారు - ప్రస్తావాదీతి - "ప్రస్తోతర్యా ప్రస్తోష్యసి"(ఓ ప్రస్తోతా! ప్రస్తావానికి దేవవత ఎవరో తెలుసుకొనకుండా నువ్వు ప్రస్తావం చేస్తే నీ తలపడిపోతుంది) అని, "తాం . . . ఉద్గాస్యసి" ( ఆదేవతను తెలుసుకొనకుండా నువ్వు గానం చేస్తే ) "తాం . . . ప్రతిహరిష్యసి" (ఆ దేవతను తెలుసుకొనకుండా ప్రతిహారం చేస్తే) అని చెప్పడంచేత ప్రస్తావాదిదేవతల విజ్ఞానం లేని ప్రస్తోత్రాదులు కూడా యజ్ఞం చేయించడానికి సిద్ధం అవడం కనబడుతున్నది. మరొక విషయ మేమనగా కర్మతో సంబంధించి ఉన్న ఈ విధమైన విజ్ఞానానికి, కర్మకంటె వేరుగా (కర్మవల్ల కలిగే ఫలంకంటె వేరుగా) కర్మఫలసిద్ధికి ప్రతిబంధం లేకపోవడం, సమృద్ధి ఇవి "తేనోభౌ . . . వీర్యవత్తరం భవతి" (ఎవడు దీనిని ఈ విధంగా తెలుసుకుంటాడో అతడు, ఎవడు తెలుసుకొనడో అతడు ఇద్దరూ కూడా చేస్తున్నారు. విద్య (తెలుసుకోవడం) అవిద్య అనేవి భిన్నమైనవి. విద్యతోను, శ్రద్ధతోను, రహస్యజ్ఞానంతోను దేనినైతే చేస్తాడో అదే అధికవీర్యం కలదవుతుంది) అనే వాక్యంలో కనబడుతున్నది. అక్కడ "నానా తు" అని విద్వాంసుడు చేసిన కర్మ, అవిద్వాంసుడు చేసిన కర్మ వేరు వేరైనవి అని చెప్పడంవల్ల

వీర్యవత్తరమ్ అని తరప్ ప్రత్యయం ప్రయోగించడంవల్ల విద్యాహీనమైన కర్మకూడ (వీర్యవత్తరం కాదు కాని) వీర్యవత్తు అని తెలుస్తూన్నది. విద్య అనిత్యమైతేనే అలా పక్షం కుదురుతుంది. అది నిత్యం అయిన పక్షంలో అది లేని కర్మ వీర్యవత్తు అని ఎలా అంగీకరించబడుతుంది? అన్ని అంగాలూ కలిస్తే కదా కర్మ వీర్యవత్తు అవుతుంది అని స్థితి (నిర్ణయం).

భాష్యమ్

తథా లోకసామాదిషు ప్రతినియతాని ప్రత్యుపాసనం ఫలాని శిష్యన్తే - "కల్పన్తే హాస్మై లోకా ఊర్ధ్వాశ్చావృత్తాశ్చ" (ఛా. ఉ. 2.3.3) ఇత్యేవమాదీని. న చేదం ఫలశ్రవణమర్థవాదమాత్రం యుక్తం ప్రతిపత్తుమ్; తథా హి గుణవాద ఆపద్యేత. ఫలోపదేశే తు ముఖ్యవాదోపపత్తిః. ప్రయాజాదిషు త్వితికర్తవ్యతాకాఙ్క్షస్య క్రతోః ప్రకృతత్వాత్తాదర్థ్యే సతి యుక్తం ఫలశ్రుతేరర్థవాదత్వమ్. తథానారభ్యాధీతేష్వపి పర్ణమయీత్వాదిషు; న హి పర్ణమయీత్వాదీనామక్రియాత్మకానామాశ్రయమన్తరేణ ఫలసంబన్ధోఽవకల్పతే. గోదోహనాదీనాం హి ప్రకృతాప్ప్రణయనాద్యాశ్రయలాభాత్ ఉపపన్నః ఫలవిధిః. తథా బైల్వాదీనామపి ప్రకృతయూపాద్యాశ్రయలాభాత్ ఉపపన్నః ఫలవిధిః. న తు పర్ణమయీత్వాదిష్వేవంవిధః కశ్చిదాశ్రయః ప్రకృతోఽస్తి; వాక్యేనైవ తు జుహ్వాద్యాశ్రయతాం వివక్షిత్వా ఫలేఽపి విధిం వివక్షతో వాక్యభేదః స్యాత్. ఉపాసనానాం తు క్రియాత్మకత్వాద్విశిష్టవిధానోపపత్తేః ఉద్గీథాశ్రయాణాం ఫలే విధానం న విరుధ్యతే. తస్మాద్యథా క్రత్వాశ్రయాణ్యపి గోదోహనాదీని ఫలసంయోగాదనియతాన్యేవముద్గీథాద్యుపాసనాన్యపీతి ద్రష్టవ్యమ్. అత ఏవ చ కల్పసూత్రకారాః నైవంజాతీయకాన్యుపాసనాని క్రతుషు కల్పయాంచక్రుః. 42

బాలానందిని

తథేతి :- అట్లే లోకసామాదులయందు (సామయందు లోకాదిదృష్టి చేసే

ఉపాసనలందు) ప్రతి ఒక్క ఉపాసనకీ "కల్పన్తే . . . అవృతాశ్చ" (ఈ విద్వాంసునికి ఊర్ధ్వలోకాలు, అధోలోకాలు కూడా భోగానికి ఉపయోగిస్తాయి.) ఈ మొదలైన ఫలాలు విధించబడుచున్నాయి. ఈ ఫలశ్రవణం కేవలం అర్థవాదం మాత్రమే అనడం యుక్తం కాదు. అలా అంటే గుణవాదం (లక్షణచేత స్తుతి మాత్రమే అని చెప్పవలసినది. అయిపోతుంది.) ఫలాన్ని ఉపదేశిస్తుంది అని చెప్పినప్పుడే అది ముఖ్యవాదం (ఫలాన్ని అంగీకరించడంచేత ముఖ్యార్థం చెప్పినది) అవుతుంది. ప్రయాజాదుల విషయ మైతే వేరు. అక్కడ ఇతికర్తవ్యతాకాంక్ష గల దర్శపూర్ణమాసక్రతువు ప్రకృతం గాన ఈ ప్రయాజాదులు ఆ క్రతువు కోసం చెప్పబడి దానికంగం అయ్యాయి. అందుచేత వాటికి భ్రాతృవ్యాభిభూతి (శత్రుపరాజయం) అనే ఫలం చెప్పినా అది స్తుత్యర్థం అని చెప్పఃబడింది. అనారభ్యాధీతములైన పర్ణమయీత్వాదుల విషయం కూడ అంతే. పర్ణమయీత్వాదులు క్రియారూపములు కావు. అందుచేత (జుహూమొదలైన) ఆశ్రయం లేకుండా వాటికి ఫలసంబంధం కుదరదు. (వాటికి క్రతువు ఆశ్రయంగా లభించిన తరువాత ఆ క్రతువు యొక్క ఫలమే వాటికి కూడా పరోక్షంగా ఫలం అవుతుంది గాన వాటికి ప్రత్యేకంగా చెప్పిన ఆ పుణ్యశ్లోకశ్రవణాదికం స్తుతి మాత్రమే). గొదాహనాదులు (గొదాహనం - పాలుపితిగే పాత్ర) మొదలైనవాటికి కూడా ప్రకృతమైన అప్ప్రణయనం మొదలైన ఆశ్రయం లభించడంవల్ల ఫలవిధి ఉపపన్నమే (గోదాహనాదికం క్రతువుచేత అకాంక్షించబడలేదు గాన క్రత్వంగం కాదు. "యదపః ప్రణయేత్తత్పశుకామస్య సతో గోదోహనేన బ్రహ్మవర్చసకామస్య కాంస్యేన" ఇత్యాదివాక్యంచేత ఇవి ఫలాన్నే ఉద్దేశించి విధించబడ్డాయి గాన ఈ వాక్యాలు ఫలబోధకాలే. స్తుతిరూపార్థవాదలు కావు అని అర్థం). అట్లే బైల్వాదులకు కూడా ప్రకృతమైన యూపం మొదలైన ఆశ్రయం లభించడంవల్ల ఫలవిధి ఉపపన్నమే. (క్రతువుకు అంగంగా ఖాదిర (ఖదిరవృక్షం కఱ్ఱతో చేసిన) యూపం ఉండనే ఉంది. "బైల్వమన్నాద్యకామస్య ఖాదిరం వీర్యకామస్య" అని అన్నాద్యకాముడైతే బైల్వయూపస్తంభం చేయించాలి అని విధించబడింది. అందుచేత ఇది కూడా ఫలవిధియే కాని స్తుతి కాదు. అయితే పర్ణమయీత్వాదులలో ఇలాంటి ప్రకృతమైన ఆశ్రయం ఏదీ లేదు. "యస్య పర్ణమయీ" ఇత్యాదివాక్యమే జుహువుకు పర్ణమయీత్వాన్ని విధిస్తుంది. ఆ వాక్యమే ఫలాన్ని కూడా చెపుతుంది అని అంటే వాక్య భేదదోషం కలుగుతుంది. అందుచేత అక్కడ

వినబడే ఫలం స్తుతి మాత్రమే. అయితే ఉపాసనలు క్రియారూపములే గాన ఫల విశిష్టమైన ఉపాసనలను విధించడం కుదురుతుంది గాన ఉద్గీథాద్యాశ్రయములను ఫలం కోసం విధించడంలో దోషం లేదు. (అందుచేత ఇక్కడ ఉన్న ఫలశ్రుతి స్తుతి రూపార్థవాదం మాత్రమే అనడానికి వీలు లేదు). అందువల్ల క్రత్వాశ్రయములే అయినా గోదోహనాదులు ఏ విధంగా ఫలసంయోగం ఉండడంచేత అనిత్యములో అదే విధంగా ఉద్గీథాద్యుపాసనలు కూడ అనిత్యములే అని గ్రహించాలి. అందువల్లనే కల్పసూత్రకారులు ఈ రకమైన ఉపాసనలను క్రతువులలో కల్పించలేదు. (అవి నిత్యమే అయిన పక్షంలో అవి కూడా ఉంటేనే కాని క్రతువు సిద్ధించదు గాన వాటిని కూడా చెప్పి ఉండేవారు). 42

తన్నిర్ధారణాధికరణం సమాప్తమ్

## 28. ప్రదానాధికరణమ్. 43

### సూ . ప్రదానవదేవ తదుక్తమ్. 3.3.43

వాజసనేయకే "వదిష్యామ్యేవాహమితి వాగ్దధ్రే" (బృ.ఉ. 1.5.21) ఇత్యత్రాధ్యాత్మం వాగాదీనాం ప్రాణః శ్రేష్ఠః అవధారితః, అదిదైవతమగ్న్యాదీనాం వాయుః. తథా చాన్దోగ్యే "వాయుర్వా వ సంవర్గః" (ఛా.ఉ.4.3.1) ఇత్యత్రాధిదైవతమగ్న్యాదీనాం వాయుః సంవర్గోఽవ ధారితః. "ప్రాణో వా వ సంవర్గః" (ఛా. ఉ. 4,32) ఇత్యత్రాధ్యాత్మం వాగాదీనాం ప్రాణః. తత్ర సంశయః కిం పృథగేవేమౌవాయు ప్రాణావుపగన్తవ్యౌ స్యాతామపృథగ్వేతి. అపృథగేవేతి తావత్రాప్తం, తత్త్వాభేధాత్. న హ్యభిన్నే తత్త్వే పృథగనుచిన్తనం న్యాయ్యమ్. దర్శయతి చ శ్రుతిరధ్యాత్మమధిదైవతం చ తత్త్వాభేదమ్ - "అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్" (ఐ.ఉ. 2.4) ఇత్యారభ్య. తథా "త ఏతే సర్వ ఏవ సమాః సర్వేఽనన్తాః" (బృ.ఉ. 1.5.13) ఇత్యాధ్యాత్మికానాం ప్రాణానామాధిదైవికీం విభూతిమాత్మభూతాం దర్శయతి. తథాన్యత్రాపి తత్ర తత్ర అధ్యాత్మమధిదైవతం చ బహుధా తత్త్వాభేదదర్శనం భవతి. క్వచిచ్చ "యః ప్రాణః స వాయుః" ఇతి విస్పష్టమేవ వాయుం ప్రాణం చైకం కరోతి. తథోదాహృతేఽపి వాజసనేయ

బ్రాహ్మణే "యతశ్చోదేతి సూర్యః" (బృ. ఉ. 1.5.23) ఇత్యస్మిన్నుపసంహారశ్లోకే "ప్రాణాద్వా ఏష ఉదేతి, ప్రాణే స్తమేతి" (బృ. ఉ. 1.5.23) ఇతి ప్రాణేనైవోపసంహరన్ ఏకత్వం దర్శయతి. "తస్మాదేకమేవ వ్రతం చరేత్ప్రాణ్యాచ్చాపాన్యాచ్చ" (బృ.ఉ. 1.5.23) ఇతి చ ప్రాణవ్రతేనైకేన ఉపసంహరన్నేతదేవ ద్రఢయతి. తథా ఛాన్దోగ్యేఽపి పరస్తాత్. "మహాత్మనశ్చతురో దేవ ఏకః స జగార భువనస్య గోపాః" (ఛా. ఉ. 4.3.6) ఇత్యేకమేవ సంవర్గం గమయతి, న బ్రవీత్యేక ఏకేషాం చతుర్ణాం సంవర్గో పరో ఽపరేషామితి. తస్మాదపృథక్త్వముపగమనస్యేతి.

### బాలానందిని

ప్రదానేతి:- "ప్రదానవదేవ = దేవతాపృథక్త్వంచేత ప్రదానపృథక్త్వం అంగీకరించినట్లు ఇక్కడ కూడా పృథక్త్వం అంగీకరించాలి. తత్ = ఆ విషయం, ఉక్తమ్ = జైమినిచేత చెప్పబడింది" అని సూత్రార్థం.

వాజసనేయకంలో "వదిష్యామ్యేవాహమితి వాగ్దధ్రే" అనే చోట అధ్యాత్మంగా వాగాదులలో ప్రాణం శ్రేష్ఠమనీ, అధిదైవతంగా అగ్న్యాదులలో వాయువు శ్రేష్ఠమనీ నిర్ధారణ చేయబడింది. అట్లే ఛాందోగ్యంలో "వాయుర్వావ సంవర్గః" అన్నచోట అధిదైవతంగా అగ్న్యాదులలో వాయువు సంవర్గం అనీ, "ప్రాణో వా వ సంవర్గః" అనే చోట అధ్యాత్మంగా వాగాదులలో ప్రాణం సంవర్గం అనీ నిర్ణయించబడింది. ఈ వాయుప్రాణాలను వేరు వేరుగానే తెలుసుకొని ఉపాసించాలా, లేక ఇవి వేరు కాదు అని తెలుసుకొని ఉపాసించాలా అని సంశయం. (రెండు చోట్ల చెప్పిన వాయుప్రాణాల) తత్త్వంలో భేదం లేదు గాన వేరు కాదు అని ప్రాప్తించింది. తత్త్వంలో భేదం లేప్పుడు వేరుగా చింతనం న్యాయ్యం కాదు కదా? ఆధ్యాత్మంగాను, అధిదైవతంగానూ కూడా తత్త్వంలో భేదం లేదని "అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్" అని ప్రారంభించి శ్రుతి చూపుతున్నది. అట్లే "త ఏతే సర్వ ఏవ సమాః సర్వేఽనన్తాః" (ఇవన్నీ సమములే, అన్నీ అనంతములే) అని ఆధ్యాత్మికములైన ప్రాణాలకు ఆధిదైవికమైన విభూతియే స్వరూపం అయినట్లు చూపుతున్నది. అట్లే ఇతరస్థలాలలో కూడ ఆధ్యాత్మం గాను, అధిదైవంతం గాను కూడా అనేక విధాల తత్త్వాభేదం కనబడుతున్నది. కొన్ని చోట్ల "యః ప్రాణః స వాయుః" అని

స్పష్టంగా వాయువూ ప్రాణమూ ఒక్కటే అని చెబుతున్నది. అట్లే పైన ఉదహరించిన వాజసనేయి బ్రాహ్మణంలో "యతశ్చోదేతి సూర్యస్తం వద" (సూర్యుడెక్కడి నుండి ఉదయిస్తున్నా డో అది చెప్పు) అనే ఉపసంహారశ్లోకంలో "ప్రాణాద్వా ఏష ఉదేతి ప్రాణేఽస్తమేతి" అని ప్రాణంతోనే ఉపసంహారం చేస్తూ వాయుస్థానంలో ప్రాణాన్ని చెప్పడం ద్వారా) వాయుప్రాణాలు రెండూ ఒక్కటే అని చూపుతున్నాడు. "తస్మాదేకమేవ వ్రతం చరేత్ ప్రాణ్యాచ్చాపాన్యాచ్చ" (అందువల్ల ప్రాణాపాననిరోధరూపమైన ఒకే వ్రతం ఆచరించాలి) అని ఒక్క ప్రాణవ్రతంతోనే ఉపసంహరిస్తూ వాయుప్రాణాల ఏకత్వాన్ని ధ్రువీకరిస్తున్నాడు. (వాయుప్రాణాల ధ్యానం వేరు వేరుగా చేయవలసినట్లయితే ధ్యానాంగమైన వ్రతంలో కూడ భేదం ఉండేది, వాయువుకు సంబంధించిన వ్రతం కూడా చెప్పబడి ఉండేది). అట్లే ఛాందోగ్యంలో కూడా, తరువాత "మహాత్మన . . .గోపాః" (భువన రక్షకుడైన ఎవడు ఆ నలుగురు మహాత్ములను (అగ్ని -- సూర్య-దిక్-చంద్రరూపములైన నాల్గింటిని) వాక్ - చక్షుః-శ్రోత్ర-మనోరూపములైన నాల్గింటినీ) మింగివేశాడు (ఉపసంహరించాడు) అని ఒక సంవర్గాన్నే చెపుతున్నాడు. అంతేనే కాని ఒక నలుగురికి (చతుష్టయానికి) ఒకడు సంవర్గం అనీ, మరొక నలుగురికి (చతుష్టయానికి) మరొకడు సంవర్గం అనీ చెప్పడం లేదు. అందువల్ల ఉపగమనంలో పృథక్త్వం లేదు, (వాయు ప్రాణాలను వేరు వేరుగా గ్రహించి ఉపాసించవలసిన పని లేదు)

వి. కర్మాంగాలకు, వాటికి సంబంధించిన ఉపాసనలకు ఫలభేదాన్ని పట్టి నిత్యత్వానిత్యత్వరూపమైన ప్రయోగబేధం ఉంటే ఉండవచ్చు. ఇక్కడైతే వాయుప్రాణాల స్వరూపంలో భేదం లేదు కాన, వాటి స్వరూపాన్ని పొందడ మనే ఫలం కూడా ఒకటే గాన ధ్యానప్రయోగంలో ఏకత్వమే అని ప్రత్యుదాహరణసంగతిచేత పూర్వపక్షం.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః - పృథగేవ వాయుప్రాణావుపగన్తవ్యౌ ఇతి. కస్మాత్? పృథగుపదేశాత్. అధ్యానార్థో హ్యయమధ్యాత్మాధిదైవవిభాగోపదేశః, సోఽనేత్యాధ్యానపృథక్త్వే అనర్థక ఏవ స్యాత్. నన్వుక్తం న పృథగనుచిన్తనం తత్త్వాభేదాదితి? నైష దోషః. తత్త్వాభేదేఽప్యవస్థాభేదాదుపదేశభేదవశేన అనుచిన్తన

భేదోపపత్తేః. శ్లోకోపన్యాసస్య చ తత్త్వాభేదాభిప్రాయేణాప్యుపపద్యమానస్య పూర్వోదితధ్యేయభేదనిరాకరణసామర్థ్యాభావాత్. "సయథైషాం ప్రాణానాం మధ్యమః ప్రాణః ఏవమేతాసాం దేవతానాం వాయుః" (బృ. ఉ. 1.5.22) ఇతి చోపమానోపమేయకరణాత్. ఏతేన వ్రతోపదేశో వ్యాఖ్యాతః. "ఏకమేవ వ్రతమ్" (బృ.ఉ. 1.5.23) ఇతి చైవకారో వాగాదిత్రయనివర్తనేన ప్రాణవ్రతప్రతిపత్త్యర్థః. భగ్నవ్రతాని హి వాగాదీన్యుక్తాని - "తాని మృత్యుః శ్రమో భూత్వోపయేమే" (బృ.ఉ. 1.5.21) ఇతి శ్రుతేః. న వాయువ్రతనివృత్త్యర్థః "అథాతో వ్రతమీమాంసా" (బృ.ఉ.1.5.21) ఇతి ప్రస్తుత్య తుల్యవద్వాయుప్రాణయోరభగ్నవ్రతత్వస్య నిర్ధారితత్వాత్. "ఏకమేవ వ్రతం చరేత్" (బృ.ఉ. 1.5.27) ఇతి చోక్త్వా "తేనో ఏతస్యై దేవతాయై సాయుజ్యం సలోకతాం జయతి" (బృ. ఉ. 1.5.23) ఇతి వాయుప్రాప్తిం ఫలం బ్రువన్ వాయువ్రతమనివర్తితం దర్శయతి. దేవతేత్యత్ర వాయుః స్యాత్, అపరిచ్ఛిన్నాత్మకత్వస్య ప్రేప్సితత్వాత్. పురస్తాత్ప్రయోగాచ్చ "సైషానస్తమితా దేవతా యద్వాయుః" (బృ.ఉ. 1.5.22) ఇతి. తథా "**తౌ వా ఏతౌ ద్వౌ సంవర్గౌ వాయురేవ దేవేషు ప్రాణః ప్రాణేషు**" (ఛా.ఉ. 4.34) ఇతి భేదేన వ్యపదిశతి, "తే వా ఏతే పఞ్చాన్యే పఞ్చాన్యే దశ సన్త స్తత్కృతమ్" (ఛా. ఉ. 4.3.8) ఇతి చ భేదేనైవోపదిశతి. తస్మా త్పృథగేవోపగమనమ్, ప్రదానవత్.

**బాలానందిని**

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా వాయు-ప్రాణాలను వేరు వేరుగానే ఉపాసించా లని అంటాం. ఎందువల్ల ? వేరు వేరుగా ఉపదేశించడంవల్ల. అధ్యాత్మికం, అధిదైవికం అని విభాగంచేత ఈ ఉపదేశం ధ్యానం కోసమే కదా? ధ్యానంలో పృథక్త్వం (భేదం) లేకపోతే ఈ విధంగా ఉపదేశించడం వ్యర్థమే అవుతుంది. (ప్రశ్న) తత్త్వంలో భేదం లేదు గాన అనుచింతనంలో భేదం ఉండగూడదని చెప్పాం కదా? (సమాధానం) ఇది దోషం కాదు. తత్త్వంలో భేదం లేకపోయినా అవస్థాభేదాన్ని పట్టి ఉపదేశభేదానుసారం ధ్యానించడం కుదురుతుంది. ("యతశ్చోదేతి" ఇత్యాది) శ్లోకోపన్యాసం తత్త్వాభేదాన్ని పట్టి చేయబడిందని

చెప్పవచ్చును. దానికి పైన చెప్పిన ధ్యేయభేదాన్ని నిరాకరించడంలో సామర్థ్యం లేదు (తత్త్వం ఒక్కటే అయినా స్థానభేదాన్ని బట్టి ధ్యానభేదం అని చెప్పడంలో అసంగతి లేదని భావం). "స యథా . . . వాయుః" (ప్రాణం ప్రాణాలలో ఏ విధంగా మధ్యమమో అట్లె వాయువు ఈ దేవతలలో మధ్యమం) అని ఉపమానోపమేయభావం చెప్పబడింది (ఉపమానోపమేయ భావం భిన్నమైన వాటికే చెప్పబడుతుంది గాన ఇక్కడ ప్రాణవాయువులు భిన్నమైనవిగా గ్రహించబడుచున్నవి అని అర్థం). దీనిచేత వ్రతోపదేశం కూడ వ్యాఖ్యానించబడినట్లే. (శ్లోకోపన్యాసం వలె వ్రతైక్యోపన్యాసం కూడా తత్త్వం ఒక్కటే అనే అభిప్రాయంచేతనే చేయబడింది అని అర్థం). మరొక విషయమేమనగా "ఏకమేవ వ్రతమ్"అనే వాక్యంలోని ఏవకారం వాగాదుల వ్రతాన్ని నివర్తింపచేయడం ద్వారా ప్రాణవ్రతాన్ని గ్రహించడం కోసం ఉద్దిష్టమైనది. (అంతేకాని వాయుప్రాణాలకి రెండింటికీ ఒకటే వ్రతం అని చెప్పడం దీని అభిప్రాయం కాదు). "తాని మృత్యుః శ్రమో భూత్వోపయేమే' ' అని వాగాదులు భగ్నవ్రతము లైనవి అని చెప్పబడింది కదా? అంతేనే కాని (ఏవకారం) వాయునివృత్తి కోసం చేయబడింది కాదు. ఎందువల్ల ననగా "అథాతో వ్రతమీమాంసా" అని ఉపక్రమించి వాయుప్రాణాలు రెండూ సమంగా అభగ్నవ్రతములు అని నిర్ధారణ చేయబడింది. "ఏకమేవ వ్రతం చరేత్" అని చెప్పి "తేనో . . . జయతి" అని వాయుప్రాప్తి ఫలం అని చెపుతూ వాయువ్రతం నివర్తింపబడలేదు అని సూచిస్తున్నాడు. పై వాక్యంలో దేవతా అన్నప్పుడు వాయువునే గ్రహించాలి. ఎందువల్ల ననగా అపరిచ్ఛిన్నస్వరూపత్వమే పొందడానికి ఇష్టమైనది. (వాయువే అపరిచ్ఛిన్నం కాని ప్రాణం కాదు కదా). ముందుగా "సైషానస్తమితా దేవతా యద్వాయుః" అని చెప్పబడింది కూడ. అట్లే "తౌ వా . . ప్రాణేషు"(దేవతలలో వాయువు, ప్రాణాలలో ప్రాణం ఈ రెండూ సంవర్గాలు) అని భేదంచేత నిర్దేశిస్తున్నాడు కూడ. అట్లే తే "వా . . . కృతమ్" అని భేదంతోనే ఉపసంహరిస్తున్నాడు అందువల్ల ప్రాణ-వాయువులను ప్రదానంలో వలె వేరు వేరుగానే ఉపాసించాలి.

## భాష్యమ్

యథా "ఇన్ద్రాయ రాజ్ఞే పురోడాశమేకాదశకపాలమిన్ద్రాయాధిరాజాయేన్ద్రాయ స్వరాజ్ఞే" ఇత్యస్యాం త్రిపురోడాశిన్యామిష్టౌ "సర్వేషామభిగమయన్నవద్యత్యచ్ఛం వషట్కారమ్" ఇత్యతో వచనాత్ ఇన్ద్రాభేదాచ్చ సహప్రదానాశఙ్కాయాం.

రాజాదిగుణభేదాత్, యాజ్యానుకాక్యావ్యత్యా సవిధానాచ్చ యథాన్యాసమేవ దేవతాపృథక్త్వాత్ప్రదానపృథక్త్వం భవతి ఏవం తత్త్వాభేదేఽప్యాధ్యేయాంశ పృథక్త్వాదాధ్యానపృథక్త్వమిత్యర్థః. తదుక్తం సంకర్షే. "నానా వా దేవతాపృథగ్జ్ఞానాత్" ఇతి. తత్ర తు ద్రవ్యదేవతాభేదాద్యాగభేదో విద్యతే, నైవమిహ విద్యాభేదోఽస్తి. ఉపక్రమోపసంహారాభ్యామధ్యాత్మాది . దైవోపదేశేష్వేకవిద్యావిధానప్రతీతేః విద్యైక్యేఽపి. తు అధ్యాత్మాధిదైవభేతాత్ ప్రవృత్తిభేదో భవతి, అగ్నిహోత్ర ఇవ సాయంప్రాతఃకాలభేదాత్, ఇత్యేతావదభిప్రేత్య ప్రదానవదిత్యుక్తమ్. . 43

**బాలానందిని**

యథేతి :- "ఇన్ద్రాయ . . . స్వరాజ్ఞే" (రాజైన ఇంద్రునకు అధిరాజైన ఇంద్రునకు స్వర్గరాజైన ఇంద్రునకు పదకొండు కపాలలో సంస్కరించబడిన పురోడాశం) అని చెప్పిన మూడు పురోడాశా లున్న ఇష్టిలో "సర్వేషామభిగమయన్ అవద్యత్యచ్ఛం వషట్కారమ్" (దేవత లందరికీ అభిముఖంగా పొందిస్తూ వషట్కారం అనే దేవభాగం వ్యర్థం కాకుండా ఉండడం కోసం, హవిస్సును (ఒకేసారి) గ్రహిస్తున్నాడు) అనే వచనంవల్లా, దేవతయైన ఇంద్రుడు భిన్నుడు కాకపోవడంవల్లా మూడింటినీ కలిపి ఒకేసారి ఇవ్వాలనే శంక కలుగగా, రాజాదిగుణాలు (రాజు, అధిరాజు, స్వరాట్ అనే గుణాలు) భిన్నంగా ఉండడం వల్ల యాజ్యానువాక్యాలలో వ్యత్యాసాన్ని విధిచడంవల్ల, వాక్యంలో చెప్పినట్లే దేవతలు వేరు గాన ప్రదానాలు కూడ వేరు అని ఎట్లు నిర్ణయించబడిందో అట్లే తత్త్వంలో భేదం లేకపోయినా కూడ ధ్యానించవలసిన అంశాలలో భేదం ఉడడంవల్ల ధ్యానాలలో కూడ భేదమే అని అర్థం. ఈ విషయం సంకర్షకాండలో చెప్పబడింది. తదుక్తమ్ అనగా- "నానా వా దేవతా పృథగ్జ్ఞానాత్" (వేరు వేరుగా తెలియడంచేత దేవత వేరు) అని జైమినిచేత చెప్పబడింది అని అర్థం.

వి. అధ్వర్యువు 'యజ' అని ప్రైష చేయగా హోత చదివే మంత్రానికి యాజ్య అని పేరు. అనుబ్రూహి అని ప్రైష తరవాత చదివే మంత్రం పురోనువాక్య. ఈ ఇష్టిలో ప్రథమ పురోడాశం ఇచ్చేటప్పుడు ఏర్పరచిన యాజ్య రెండవ పురోడాశప్రదానంలో అనువాక్య. పూర్వం అనువాక్యగా ఉన్నది తరువాత యాజ్య అని "వ్యత్యాసమన్వాహ" అను శ్రుతి

చెపుతున్నది. దీనిని పట్టి కూడ పురోడాశప్రదానం వేరు వేరుగానే చెయ్యాలి అని అర్థం.

పన్నెండు అధ్యాయాల గ్రంథంలో చెప్పబడని విషయాలను న్యాయాలను విచారిస్తూ జైమినియే రచించిన గ్రంథానికి సంకర్షకాండ అని పేరు. ఇది ద్వాదశలక్షణికి పరిశిష్టం.

అవ. అయితే ఆ త్రిపురోడాశేష్టికీ దీనికీ భేదం ఉందని చెపుతున్నారు-తత్రత్వితి:- అక్కడైతే ద్రవ్య దేవతలభేదంవల్ల యాగాలలో కూడ భేదం ఉంది. ఆ విధంగా ఇక్కడ విద్యాభేదం లేదు. ఉపక్రమోపసంహారాలను బట్టి అధ్యాత్మాధిదైవోపదేశాలలో ఒకే విద్యను విధించినట్లు తెలుస్తూన్నది. విద్య ఒక్కటే అయినా కూడ అధ్యాత్మం అధిదైవం అనే భేదంచేత, సాయంకాలప్రాతఃకాలభేదంచేత ఒకే అగ్నిహోత్రంలో భేదం ఉన్నట్లు ప్రవృత్తిలో ఉపాసనాదులలో భేదం ఉంటుంది. 43

ప్రదానాధికరణం సమాప్తం

## 29. లిఙ్గభూయస్త్వాధికరణమ్. సూ. 44-52

### సూ. లిఙ్గభూయస్త్వాత్తద్ధి బలీయస్తదపి. 3.3.44

వాజసనేయకేఽగ్నిరహస్యే - "నైవ వా ఇదమగ్రే సదాసీత్ (శ.బ్రా10.5.31) ఇత్యేతస్మిన్ బ్రాహ్మణే మనోఽధికృత్య అధీయతే- "తత్ షట్త్రింశత్సహస్రాణ్యపశ్య దాత్మనోగ్నీనర్కాన్ మనోమయాన్ మనశ్చితః." ఇత్యాది తథైవ "వాక్చితః ప్రాణచితశ్చక్షుశ్చితః శ్రోత్రచితః కర్మచితోఽగ్నిచిః" ఇతి పృథగగ్నీనామనన్తి సాంపాదికాన్. తేషు సంశయః-కిమేతే మనశ్చిదాదయః క్రియానుప్రవేశినః తచ్ఛేషభూతా ఉత స్వతన్త్రాః కేవలవిద్యాత్మకా ఇతి. తత్ర ప్రకరణాత్క్రియానుప్రవేశే ప్రాప్తే స్వాతన్త్ర్యం తావత్ ప్రతిజానీతే లిఙ్గభూయస్త్వాదితి. భూయాంసి హి లిఙ్గాన్యస్మిన్ బ్రాహ్మణే కేవలవిద్యాత్మకత్వమేషాముపోద్బలయన్తి దృశ్యన్తే - "తద్యత్కించేమాని భూతాని మనసా సంకల్పయన్తి తేషామేవ సా కృతిః" ఇతి. "తాన్హైతానేవంవిదో సర్వదా సర్వాణి భూతాని చిన్వన్త్యపి స్వపతే" ఇతి చైవం జాతీయకాని. తద్ధి లిఙ్గం ప్రకరణాద్బలీయః. తదప్యుక్తం పూర్వస్మిన్ కాణ్డే -

"శ్రుతిలిఙ్గవాక్యప్రకరణవాక్యప్రకరణస్థానసమఖ్యానాం సమవాయే పారదౌర్బల్యమర్థవిప్రకర్షాత్" (జై.సూ 3.3.13) ఇతి. 44

బాలానందిని

లిఙ్గేతి :- లిఙ్గభూయస్త్వాత్=లింగములు అధికంగా ఉండడంవల్ల ఇవి విద్యలే. తత్ = లింగం, బలీయః బలవత్తరం కదా? తదపి = ఈ విషయం జైమినిచే చెప్పబడింది' ' అని సూత్రార్థం. (ఇది సిద్ధాంతసూత్రం)

వాజసనేయిన ఇతి:- వాజసనేయులు, అగ్నిరహస్యంలో "నైవ వా ఇదమగ్రే సదాసీత్" అనే బ్రాహ్మణంలో మనస్సును గూర్చి "తత్..మనశ్చితః" ఇత్యాదికం పఠిస్తున్నారు. అట్లే "వాక్చితః అగ్నిచితః" అని వేరుగా సాంపాదికాగ్నులను అనగా అగ్నులుగా ఆ యా వస్తువులమీద ఆరోపించబడినవాటిని, పఠిస్తున్నారు. వాటి విషయంలో ఈ మనశ్చిదాదులు క్రియలతో సంబంధం ఉన్నవై వాటికి అంగాలా లేక స్వతంత్రములై కేవలవిద్యా రూపములా అని సంశయం. ప్రకరణాన్ని పట్టి క్రియానుప్రవేశం అని ప్రాప్తించగా లిఙ్గభూయస్త్వాత్ అని వీటికి స్వాతంత్ర్యాన్ని ప్రతిజ్ఞ చేస్తున్నాడు.

వి. సృష్టికి పూర్వం ఇదేదీ సత్ గా గాని అసత్‌గా గాని లేదు అని ఉపక్రమించి మనః సృష్టిని చెప్పి, ఆ మనస్సు తనను చూచినది అని చెప్పి "తత్ షట్త్రింశత్సహస్రాణి" ఇత్యాదివాక్యం పఠింపబడింది. ఆ మనస్సు మనోమయములు, మనస్సుచేత చయనం చేయబడినవి అయిన తన ముప్పైఆరువేల, అర్కములైన (పూజ్యములైన) అగ్నులను చూచింది అని ఈ వాక్యానికి అర్థం. మనోవృత్తులు అసంఖ్యాకములైనా కూడా మానవుని ఆయుర్ధాయం నూరు సంవత్సరాలు గాన ముప్పై ఆరువేల అహోరాత్రాలలో కలిగే మనోవృత్తులు ముప్పై ఆరువేలు అనే అభిప్రాయంతో అట్లు చెప్పబడింది.అవే ముప్పైఆరువేల ఇష్టకలమీద ఏర్పరుప బడిన అగ్నులు. అవి మనస్సుచేత సంపాదించబడినవి గాన మనశ్చితాలు. మనోవృత్తులమీద సంపాదింపబడినవి గాన మనోమయాలు. అవి మనోరూపాలు. అట్లే వాక్కు, ప్రాణం మొదలైనవి కూడా తమ తమ వృత్తులే రూపాలుగా గల వృత్తులను చూచాయి. అవే వాక్చితాగ్ని,ప్రాణచితాగ్ని అనగా ఘ్రాణచితాగ్ని, చక్షుశ్చితాగ్ని, కర్మచితాగ్ని అనగా హస్తాదికర్మేంద్రియాలచేత చితమైన అగ్ని,

అగ్నిచితాగ్ని (త్వగింద్రియం చేత చితమైనది అని కొందరు, జఠరాగ్నిచితం అని కొందరు) ఇదంతా అగ్ని చయనప్రకరణం తరువాత చెప్పబడటంచేత ఇవి కర్మాంగాలా, స్వతంత్రాలా అని సంశయం .

విద్య ఒకటే అయినా దానికి ఆధ్యాత్మికం, అదిదైవికం అనే భేదంచేత ప్రయోగభేదం అని పూర్వాధికరణంలో చెప్పబడింది. మనశ్చిదాదులు కర్మను ఆశ్రయించి ఉడడంచేత వీటికి కర్మకంటె వేరుగా ప్రయోగం ఉండకూడదు అని ప్రత్యుదాహరణసంగతిచేత పూర్వపక్షం.

భూయాంసీతి :- ఈ బ్రాహ్మణలో ఉన్న చాలా లింగాలు, "తద్యత్ కించ... కృతిః" అని, "తాన్ . . . స్వపతే" ఈ మొదలైనవి, ఇవి కేవలవిద్యాత్మకములే అనే విషయానికి ఉపోద్బలకంగా ఉన్నాయి. "సమస్త భూతాలు మనస్సుచేత దేనినైనా సంకల్పిస్తే అది ఆ అగ్నుల పనియే" అని మొదటి వాక్యానికి అర్థం. (దీనిని పట్టి సకలజంతుమనోవృత్తులూ కూడ అగ్నులుగా ధ్యేయము లని తెలుస్తూన్నది. "ఈ విధంగా తెలుసుకొన్నవాడు మెలకువగా ఉన్నా, నిద్రిస్తూన్నా సమస్తభూతాలు వానికోసం ఈ అగ్నుల చయనం చేస్తుంటాయి. అని రెండవ వాక్యానికి అర్థం. (దీనిని పట్టి కూడా ఇది స్వతంత్రమైన విద్యయే అని తెలుస్తూన్నది. కర్మలు నియతసమయాలలోనే చేయబడతాయి కాని సర్వదా చేయబడవు కదా?) ఈ లింగం ప్రకరణంకంటె బలీయమైనది. ఈ విషయం కూడ పూర్వకాండలో "శ్రుతి...విప్రకర్షాత్" అనే సూత్రంలో చెప్పబడింది.44

సూ. పూర్వవికల్పః ప్రకరణాత్స్యాత్ క్రియామానసవత్. 3.3.45

నైతదుక్తం స్వతన్త్రా ఏతేఽగ్నయోఽనన్యశేషభూతాః ఇతి. పూర్వస్య క్రియామయస్యాగ్నేః ప్రకరణాత్తద్విషయ ఏవాయం వికల్పవిశేషోపదేశః స్యాన్న స్వతన్త్రః. నను ప్రకరణాల్లిఙ్గం బలీయః? సత్యమేవమేతత్. లిఙ్గమపి త్వేవంజాతీయకం న ప్రకరణాద్బలీయో భవతి. అన్యార్థదర్శనం హ్యేతత్; సాంపాదికాగ్నిప్రశంసారూపత్వాత్. అన్యార్థదర్శనం చాసత్యామన్యస్యాం ప్రాప్తౌ గుణవాదేనాప్యుపపద్యమానం ప్రకరణం బాధితుముత్సహతే. తస్మాత్సాంపాదికా

అప్యేతేఽగ్నయః ప్రకరణాత్క్రియానుప్రవేశిన ఏవ స్యుః. మానసవత్. యథా దశరాత్రస్య దశమేఽహన్యవికాక్యే పృథివ్యా పాత్రేణ సముద్రస్య సోమస్య ప్రజాపతయే దేవతాయై గృహ్యమాణస్య గ్రహణాసాదనహవనాహరణోపహ్వాన భక్షణాని మానసాన్యేవామ్నాయన్తే, స చ మానసోఽపి గ్రహకల్పః క్రియాప్రకరణాత్ క్రియాశేష ఏవ భవత్యేవమయమప్యగ్నికల్ప ఇత్యర్థః. 45

బాలానందిని

పూర్వేతి :-"ప్రకరణాత్=ప్రకరణంవల్ల, పూర్వవికల్పః=వెనుక చెప్పిన క్రియామయమైన అగ్ని యొక్క ఒకానొక విశేషమే, స్యాత్=అయి ఉంటుంది. మానసవత్, మానసం వలె, క్రియా=క్రియ" అని సూత్రార్థం.(ఇది పూర్వపక్షసూత్రం).

నైతదితి:- ఈ అగ్నులు స్వతంత్రమైనవే కాని అన్యశేషములు కావు అనేది యుక్తం కాదు. ఇది వెనుక చెప్పబడిన క్రియామయమైన అగ్నియొక్క ప్రకరణం అవడంవల్ల ఇది దానికే సబంధించిన వికల్పవిశేషంయొక్క ఉపదేశం అవుతుంది కాని స్వతంత్రం కాదు. (ప్రశ్న) ప్రకరణంకంటె లింగం బలవత్తరం కదా? (సమాధానం) ఆ మాట నిజమే. కాని ఈ విధమైన లింగం కూడ ప్రకరణంకంటె బలవత్తరం కాదు. ఇది మరొక ప్రయోజనం కోసం చెప్పిన విషయం; ఎందుచేత ననగా ఇది సాంపాదికాగ్నిని ప్రశంసించడానికి ఉద్దిష్టమైనది. మరొక ప్రమాణంచేత ప్రాప్తి లేనప్పుడు అన్యార్థదర్శనం గుణవాదంగా (స్తుతిరూపార్థవాదంగా) కూడ ఉపపన్న అవుతుంది గాన ప్రకరణాన్ని బాధించజాలదు(అనగా విధివాక్యంలో ఉన్న లింగమే ప్రకరణంకంటె బలీయం కాని అర్థవాదలో ఉన్నది కాదని అర్థం). అందుచేత ఈ అగ్నులు సాంపాదికాలే అయినా కూడ ప్రకరణాన్ని పట్టి క్రియతో సంబంధిస్తాయి. దశరాత్రంయొక్క పదవ రోజున అవి వాక్యంలో పృథివి అనే పాత్రచేత ప్రజాపతిదేవతకొరకు గ్రహించబడుచున్న సముద్ర మనే సోమానికి సంబంధించిన గ్రహణ-ఆసాదన-హవన-ఆహరణ-ఉపహ్వాన-భక్షణాలు మానసాలే ఏ విధంగా చెప్పబడు చున్నాయో, ఆ గ్రహకల్పం అంతా మానసమే అయినా కూడ, అది క్రియాప్రకరణం అవడంవల్ల క్రియాశేషమే ఎలా అవుతుందో అట్లే ఈ అగ్నికల్పం కూడ అని అర్థం.

వి. ద్వాదశాహక్రతువులో మొదటిది ప్రాయణీయాతిరాత్రం, తరవాత పృష్ఠ్యం అనే

షడహం, తరవాత ఛందోమచతుష్టయం, తరవాత ఉదయనీయాతిరాత్రం అని పన్నెండు రోజులు. మొదటిదీ చివరిదీ అయిన ప్రాయణీయోదయనీయాలను తీసివేయగా మధ్యనున్న పది రోజులకు దశరాత్రం అని పేరు. ఈ దశరాత్రంయొక్క దశమదివసంలో మానసగ్రహం- "అనయా త్వా పాత్రేణ సముద్రం రసయా ప్రాజాపత్యం మనోగ్రహం గృహ్ణాతి" అను వాక్యం ఉన్నది. ఈ పృథివి అనే పాత్రచేత, సముద్రమైన నిన్ను, అధ్వర్యువు ప్రజాపతిదేవతకొరకు మనోగ్రహంగా, అనగా మనసా భావించబడిన సోమరసాన్నిగా, గ్రహిస్తాడు అని ఈ వాక్యానికి తాత్పర్యం. ఇదంతా మానసకర్మయే గాన ఋత్విక్కులు కేవలం ధ్యానంమాత్రమే చేస్తుంటారు గాన, పఠించే వాక్యా లేవీ లేకపోవడంచేత దీనికి (దశమాహస్సుకు) అవివాక్యం అని పేరు. ఇక్కడ పృథివ్యాదులయందు పాత్రత్వాదిదృష్టి చెప్పబడింది. ఇక్కడ గ్రహణం (సోమ పాత్రను తీసికొనడం) ఆసాదనం(తీసికొన్నదానిని స్వస్థానంలో ఉంచడం) హవనం (సోమహోమం), ఆహరణం (హోమం చేయగా మిగిలినదానిని తీసికొనడం) ఉపాహ్వానం (మిగిలినదానిని భక్షించడం కోసం ఋత్విక్కులను పిలవడం)తరవాత భక్షించడం-ఇవన్నీ మానసాలే చెప్పబడ్డాయి. ఆ గ్రహకల్పం అంతా మానసమే అయినా కూడ క్రియాప్రకరణంలో ఉండడంవల్ల క్రియాశేషమే అయినట్లు ఈ అగ్నికల్పం కూడ క్రియాంగమే అవుతుంది. 45.

## సూ. అతిదేశాచ్చ. 3.3.46

అతిదేశశ్చైషామగ్నీనాం క్రియానుప్రవేశముపోద్బలయతి- "షట్త్రింశత్సహస్రాణ్యగ్నయోఽర్కాస్తేషామేకైక ఏవ తావాన్యావానసౌ పూర్వః" ఇతి సతి హి సామాన్యేఽతిదేశః ప్రవర్తతే. తతశ్చ పూర్వేణేష్టకాచితేన క్రియానుప్రవేశినాగ్నినా సాంపాదికానగ్నీనతిదిశన్ క్రియానుప్రవేశమేవైషాం ద్యోతయతి. 46.

### బాలానందిని

**అతిదేశాదితి** :-"అతిదేశాచ్చ=అతిదేశంవల్ల కూడ ఈ అగ్నులకు క్రియానుప్రవేశం ఉన్నది" అని సూత్రార్థం.

అతిదేశ్చేతి:- "షట్త్రింశత్...పూర్వః"(ఈ ముప్పై అరువేల పూజ్యములైన ఏ అగ్నులున్నాయో వాటిలో ఒక్కొక్కదాని మహిమ పూర్వం చెప్పబడిన ఇష్టకాచితాగ్నిమహిమ ఎంతో అంత) అని ఈ అగ్నుల అతిదేశం క్రియానుప్రవేశానికి ఉపోద్బలకంగా ఉంది. ఏదైనా పోలిక ఉంటేనే కదా అతిదేశం ప్రవర్తిస్తుంది. ఇష్టకలమీద ఏర్పరుపబడిన, క్రియతో సంబంధించిన వెనుకటి అగ్నితో ఈ సాంపాది కాగ్నులను అతిదేశిస్తూ వీటికి కూడ క్రియతో సంబంధాన్ని సూచిస్తున్నాడు. అనగా ఇష్టకాచితాగ్నికి బదులు దీనిని కూడ చేయవచ్చు నని సూచిస్తున్నాడు ( బ్ర.వి.అ)

## సూ. విద్యైవ తు నిర్ధారణాత్. 3.3.47

తుశబ్దః పక్షం వ్యావర్తయతి. విద్యాత్మకా ఏవైతే స్వతన్త్రా మనశ్చిదాదయోఽగ్నయః స్యుః న క్రియాశేషభూతాః. తథా హి నిర్ధారయతి-'తే హైతే విద్యాచిత ఏవ" ఇతి. "విద్యయా హైవైతమ్ ఏవంవిదశ్చితా భవన్తి" ఇతి చ. 47

బాలానందిని

విద్యేతి :-"నిర్ధారణాత్=నిర్ధారణవల్ల, విద్యైవ తు=విద్యయే" అని సూత్రార్థం.

తుశబ్ద ఇతి :- తుశబ్దం పూర్వపక్షాన్ని నివారిస్తుంది. ఈ మనశ్చిదాద్యగ్నులు విద్యాత్మకములే; స్వతంత్రమైనవే కాని క్రియాంగాలు కాదు. అందుచేతనే "తే హైతే...ఏవ" అని, "విద్యయా...భవన్తి" అని నిర్ధారణ చేస్తున్నాడు. "ఈ అగ్నులు విద్యాచితములే" అని మొదటి వాక్యానికి అర్థం. దీనికే రెండవ వాక్యం వివరణం-"ఇవి ఈ విధంగా తెలుసుకొన్నవానియొక్క విద్యచేతనే చితము లవుతాయి." 47

## సూ. దర్శనాచ్చ. 3.3.48

దృశ్యతే చేషాం స్వాతన్త్ర్యేలిఙ్గమ్. తత్ పురస్తాద్దర్శితమ్-"లిఙ్గభూయస్త్వాత్" ఇత్యత్ర. 48

బాలానందిని

దర్శనాదితి:-"దర్శనాచ్చ=ఇందుకు లింగం కనబడడంవల్ల కూడ ఇవి విద్యలే" అని సూత్రార్థం.

దృశ్యత ఇతి :- ఇవి స్వతంత్ర మైనవి అని చెప్పడానికి లింగం కూడ కనబడుచున్నది. అది లిఙ్గభూస్త్వాత్ అనే చోట వెనుక చూపబడినది. 48

భాష్యమ్

నను లిఙ్గమపి అసత్యామన్యస్యాం ప్రాప్తౌ అసాధకం కస్య చిదర్థస్య ఇత్యపాస్య తత్, ప్రకరణసామర్థ్యాత్క్రియాశేషత్వమధ్యవసితమ్ ఇత్యత ఉత్తరం పఠతి-

సూ. శ్రుత్యాదిబలీయస్త్వాచ్చ న బాధః. 3.3.49

నైవ ప్రకరణసామర్థ్యాత్ క్రియాశేషత్వమధ్యవసాయ స్వాతన్త్ర్యపక్షో బాధితవ్యః. శ్రుత్యాదేర్బలీయస్త్వాత్. బలీయాంసి హి ప్రకరణాత్ శ్రుతిలిఙ్గ వాక్యానీతి స్థితం శ్రుతిలిఙ్గసూత్రే. తాని చేహ స్వాతన్త్ర్యపక్షం సాధయన్తి దృశ్యన్తే. కథమ్? శ్రుతిస్తావత్-"తే హైతే విద్యాచిత ఏవ" ఇతి. తథా లిఙ్గమ్ - "సర్వదా సర్వాణ్యపి భూతాని చిన్వన్త్యపి స్వపతే" ఇతి. తథా వాక్యమపి "విద్యయా హ్యేవైత ఏవంవిదశ్చితా భవన్తి" ఇతి. "విద్యాచితే ఏవ" ఇతి హి సావధారణేయం శ్రుతిః క్రియానుప్రవేశేఽమీషానుభ్యుపగమ్యమానే పీడితా స్యాత్. నన్వబాహ్యసాధన త్వాభిప్రాయమిదమవధారణం భవిష్యతి? నేత్యుచ్యతే. తదభిప్రాయతాయాం హి విద్యాచితఇతీయతా స్వరూపసంకీర్తనేనైవ కృతత్వాదనర్థకమవధారణం భవేత్; స్వరూపమేవ హ్యేషామబాహ్యసాధనమితి. అబాహ్యసాధనత్వేఽపి తు మానసగ్రహవత్ క్రియానుప్రవేశశఙ్కాయాం తన్నివృత్తిఫలమవధారణ మర్థవద్భవిష్యతి.

బాలానందిని

నన్వితి :- మరి యొక ప్రాప్తి లేనప్పుడు (మరియొక వాక్యంచేత ప్రాప్తి లేనప్పుడు) లింగం కూడ ఏ అర్థాన్నీ సాధించజాలదు గాన దానిని విడచి ప్రకరణసామర్థ్యంచేత క్రియాశేషత్వం నిశ్చయింపబడింది కదా? అందువల్ల సమాధానం పఠిస్తున్నాడు.

శ్రుతీతి:-" శ్రుత్యాదిబలీయస్త్వాచ్చ=శ్రుతిమొదలైనవి బలీయములు గాన. బాధః న=స్వాతంత్ర్యపక్షానికి బాధ లేదు" అని సూత్రార్థం.

నైవేతి :- ప్రకరణసార్థ్యంచేత ఈ అగ్నులు క్రియాంగములే అని నిశ్చయించి ఇవి స్వతంత్రములే అనే పక్షం బాధించదగినది కాదు; ఎందువల్ల ననగా శ్రుత్యాదులు బలీయములు. ప్రకరణంకంటె శ్రుతి-లింగ-వాక్యాలు అధికబలం గల వని శ్రుతిలింగసూత్రంలో నిర్ణయించబడింది కదా? "తేహైతే విద్యాచిత ఏవ" అనేది ఇక్కడ శ్రుతి. (ఇవి విద్యారూపములే అని ప్రత్యక్షంగా చెప్పే వాక్యం). "సర్వదా సర్వాణి భూతాని చిన్వన్త్యపి స్వపతే" అనేది లింగం. అట్లే "విద్యయాహైవేత ఏవంవిధశ్చితా భవన్తి" అనేది వాక్యం. "విద్యాచితే ఏవ" (ఇవి విద్యాచితములే) అని అవధారణపూర్వకంగా చెపుతూన్న ఈ శ్రుతి, వీటికి క్రియానుప్రవేశం అంగీకరించిన పక్షంలో బాధితం అవుతుంది. (ప్రశ్న) బాహ్యసాధనా లేవీ లేవు అని చెప్పడం ఈ అవధారణకి అభిప్రాయం అని చెప్పవచ్చు గదా (అనగా) విద్యచేతనే ఇవి చితము లైనాయి కాని వీటి చయనానికి బాహ్యసాధనా లేవీ లేవు అని చెప్పడమే ఈ అవధారణకు అర్థం కాని వీటికి క్రియానుప్రవేశం లేదు అని చెప్పడం కాదు అని అర్థం. (సమాధానం) ఇది యుక్తం కాదంటాం. 'విద్యాచితః' అని స్వరూపాన్ని చెప్పడంచేతనే పై అర్థం (మీరు చెప్పిన బాహ్యసాధననిరపేక్షత్వం) లభిస్తూన్నపుడు ('ఏవ'ను ప్రయోగించి) అవధారణం చెయ్యడం వ్యర్థమే అవుతుంది. ఇవి అబాహ్యసాధనము లనేది వీటి స్వరూపమే కదా? (అలాం టప్పుడు ఇవి అబాహ్యసాధనము లని ప్రత్యేకించి చెప్పవలసిన పని లేదు). ఇవి అబాహ్యసాధనాలే అయినా కూడ మానసగ్రహాలకు వలె వీటికి క్రియానుప్రవేశం ఉండవచ్చు ననే శంక కలుగగా ఆ శంకను నివర్తింపచేయడంకోసం ఈ అవధారణ చేయబడింది అని చెప్పిన ట్లయితేనే ఈ అవధారణ సార్థకం అవుతుంది.

భాష్యమ్

తథా "స్వపతే జాగ్రతే చైవంవిదే సర్వదా సర్వాణి భూతాన్యేతానగ్నీంశ్చిన్వన్తి" ఇతి సాతత్యదర్శనమేషాం స్వాతన్త్ర్యేఽవకల్పతే. యథా సాంపాదికే వాక్ప్రాణమయేఽగ్నిహోత్రే - "ప్రాణం తథా వాచిజుహోతి. వాచం తథా ప్రాణే

**జుహోతి''** (కౌషీ 2.5) ఇత్యుక్త్వోచ్యతే **''ఏతే అనన్తే అమృతే ఆహుతీ జాగ్రచ్చ స్వపంశ్చ సతతం జుహోతి''** (కౌషీ.2.5) ఇతి తద్వత్. క్రియానుప్రవేశే తు క్రియాప్రయోగస్యాల్పకాలత్వేన న సాతత్యేనైషాం ప్రయోగః కల్పేత. న చేదమర్థవాదమాత్రమితి న్యాయ్యమ్. యత్ర హి విస్పష్టో విధాయకః లిఙాదిరుపలభ్యతే యుక్తం తత్ర సంకీర్తనమాత్రస్యార్థవాదత్వమ్. ఇహ తు విస్పష్టవిధ్యన్తరానుపలబ్ధేః సంకీర్తనాదేవైషాం విజ్ఞానవిధానం కల్పనీయమ్. తతశ్చ సామర్థ్యాదేషాం స్వాతన్త్ర్యసిద్ధిః. ఏతేన **''తద్యత్కించేమాని భూతాని మనసా సంకల్పయన్తి తేషామేవ కృతిః''** ఇత్యాది వ్యాఖ్యాతమ్. తథా వాక్యమపి **''ఏవంవిదే''** ఇతి పురుషవిశేషసంబన్ధమేవైషామాచక్షాణం న క్రతుసంబన్ధం మృష్యతే. తస్మాత్స్వాతన్త్ర్యపక్ష ఏవ జ్యాయానితి. 49

బాలానందిని

తథేతి:- అట్లే - "స్వపతే ... చిన్వన్తి" అని సాతత్యం చెప్పడం (అనగా అన్ని కాలాలలోను నిరవచ్ఛిన్నంగా ఈ చయనం సాగుతున్నది అని చెప్పడం) ఇవి స్వతంత్రములవుతేనే కుదురుతుంది. వాక్ప్రాణమయమైన(వాక్కుతోను ప్రాణంతోను నిర్వర్తించే)సాంపాదికమైన(భావనారూపమైన)అగ్నిహోత్రంలో "ప్రాణం...జుహతి"(అప్పుడు, అనగా ధ్యానకాలంలో, ప్రాణాన్ని వాక్కునందు హోమం చేస్తున్నాడు, వాక్కును అప్పుడు ప్రాణంలో హోమం చేస్తున్నాడు) అని చెప్పి "ఏతే...జుహోతి"(అనంతములా, అమృతములు అయిన ఈ రెండు ఆహుతులను మేల్కొని ఉన్నా, నిద్రిస్తున్నా నిరంతరమూ హోమం చేస్తున్నాడు)అని ఎట్లు చెప్పబడిందో(అట్లే ఇక్కడ కూడ చెప్పబడింది). వీటికి క్రియానుప్రవేశం ఉంటుం దని చెప్పిన పక్షంలో క్రియాప్రయోగం అల్పకాలంలో మాత్రమే జరుగుతుంది గాన వీటి ప్రయోగం నిరంతరమూ జరగడం కుదరదు. ఇది కేవలం అర్థవాదం మాత్రమే అనడం కూడ యుక్తం కాదు. ఒక కర్మను విధించే లిఙ్మొదలైనది ఎక్కడ ఉంటుందో అక్కడ సంకీర్తనం మాత్రమే (ఒక విషయాన్ని చెప్పడం మాత్రమే) ఉన్నప్పుడు అది అర్థవాద అనడం యుక్తమే. ఇక్క డైతే స్పష్టమైన మరొక విధి ఏదీ కనబడడంలేదు. అందుచేత కేవలసంకీర్తనాన్ని మాత్రమే ఆధారంగా చేసికొని (సర్వభూతాలు ఎల్లప్పుడూ నాకోసం అగ్ని

చయనం చేస్తున్నాయి అని ధ్యానం చెయ్యాలి అని)విజ్ఞానంయొక్క విధి కల్పించాలి. సాతత్యం కనబడడంచేత, అలాంటి విధి ఎట్లు చెప్పబడిందో అట్లే కల్పించడానికి శక్యం గాన అట్లే కల్పించబడుతుంది. అందువల్ల వీటికి సామర్థ్యం (అనగా లింగం) వల్ల స్వాతంత్ర్యం సిద్ధిస్తుంది. దీనిచేత, అనగా ఇది విధి అవడంచేత-"తద్యత్....కృతి" ఇత్యాదికం వ్యాఖ్యానించినట్లే (అనగా ఈ వాక్యాలలోని లింగాలు ప్రకరణంకంటె బలీయములే గాన దాన్ని బాధించగలవు అని భావం). అట్లే "ఏవంవిదే" (ఇట్లు తెలుసుకున్న వానికి)అనే వాక్యంకూడ వీటికి పురుషవిశేషంతో సంబంధాన్ని చెపుతూ (ఇలా తెలుసుకున్నవానికి సంబంధించినవి అని చెపుతూ) వీటికి క్రతుసంబంధం ఉన్నదనే విషయాన్ని సహించదు. (వాక్యం అనే ప్రమాణాన్ని పట్టి కూడ ఇవి స్వతంత్రమైన విద్యలే కాని క్రత్వంగములు కావు అని భావం): అందువల్ల స్వాతంత్ర్యపక్షమే మంచిది. 49.

సూ. అనుబన్ధాదిభ్యః ప్రజ్ఞాన్తరపృథక్త్వవద్దృష్టశ్చ తదుక్తమ్. **3.3.50.**

ఇతశ్చ ప్రకరణముపమృద్య స్వాతన్త్ర్యం మనశ్చిదాదీనాం ప్రతిపత్తవ్యమ్, యత్ క్రియావయవాన్ మనఆదివ్యాపారేష్వనుబధ్నాతి- "తే మనసైవాధీయన్త, మనసాచీయన్త, మనసైవ గ్రహా అగృహ్యన్త, మనసా స్తువన్, మనసాఽశంసన్ యత్కిఞ్చ యజ్ఞే కర్మ క్రియతే, యత్కిఞ్చ యజ్ఞియం కర్మ మనసైవ తేషు తన్మనోమయేషు మనశ్చిత్సు మనోమయమేవ క్రియతే" ఇత్యాదినా. సంపత్ఫలో హ్యయమనుబన్ధః. న చ ప్రత్యక్షాః క్రియావయవాః సన్తః సంపదా లిప్సితవ్యాః. న చాత్రోద్గీథాద్యుపాసనవత్ క్రియాఙ్గసంబన్ధాత్ తదనుప్రవేశిత్వమాశఙ్కితవ్యమ్; శ్రుతివైరూప్యాత్. న హ్యత్ర క్రియాఙ్గం కించిదాదాయ తస్మిన్నదో నామాధ్యవసితవ్యమితి వదతి. షట్త్రింశత్ సహస్రాణి తు మనోవృత్తి భేదానాదాయ తేష్వగ్నిత్వం గ్రహాదీంశ్చ కల్పయతి, పురుషయజ్ఞాదివత్. సంఖ్యాచేయం పురుషాయుషాహస్సు దృష్టా సతీ తత్సమ్బన్ధినీషు మనోవృత్తిష్వారోప్యత ఇతి ద్రష్టవ్యమ్. ఏవమనుబన్ధాత్ స్వాతన్త్ర్యం మనశ్చిదాదీనామ్.

బాలానందిని

**అనుబన్ధేతి** :- "అనుబన్ధాదిభ్యః=మనఆదివృత్తులందు కర్మాంగాల సంపాదనం మొదలైనవాటివల్ల ఈ అగ్నులకు స్వాతంత్ర్యమే. ప్రజ్ఞాన్తరపృథక్త్వవత్=శాండిల్యవిద్య మొదలైన ఇతరవిద్యల పృథక్త్వమువలె. దృష్టశ్చ=ఈ విధంగా కర్మ ప్రకర్షంనుండి ఉత్కర్ష (వేరు చేయడం అవేష్ట్యాదులలో) చూడబడింది. తత్=ఆవిషయం, ఉక్తమ్=పూర్వతంత్రంలో చెప్పబడింది" అని సూత్రార్థం.

**ఇతశ్చేతి**:- ఈ కారణంవల్ల కూడ ప్రకరణాన్ని మర్దించి (బాధించి) మనశ్చిదాదులకు స్వాతంత్ర్యం అంగీకరించాలి; ఎందువల్ల ననగా మనఆదివ్యాపారాలమీద క్రియావయవాలను-"తే మనసైవ...క్రియతే" ఇత్యాదివాక్యంచేత అనుబంధిస్తున్నాడు. సంపాదిస్తున్నాడు, ఆరోపిస్తున్నాడు. (ఆ అగ్నులను మనస్సుచేత ఆధానం చెయ్యాలి. మనస్సుచేతనే ఇష్టకల చయనం (పరచడం) చెయ్యాలి. మనస్సుచేతనే గ్రహాలు (పాత్రలు) గ్రహింపబడాలి. మనస్సుచేతనే ఉద్గాతలు స్తుతించాలి. మనస్సుచేతనే హోతలు శంసించాలి. యజ్ఞానికి ఉపయోగించే ప్రతీ కర్మా కూడ మనస్సుచేతనే చేయబడుతుంది. మనోమయాలైన ఆ మనశ్చిత్తులలో ప్రతీకర్మ మనస్సుచేతనే చెయ్యాలి అని శ్రుతికి అర్థం). ఈ అనుబంధానికి (ఆరోపణకి) ఫలం సంపద, అనగా సంపదుపాసనయే కదా. క్రియావయవాలు ప్రత్యక్షంగా ఉన్నప్పుడు వాటిని సంపదచేత (ఆరోపణచేత) పొందాలని ప్రయత్నం ఎందుకు? (అందుచేత ఇవి క్రియాంగాలు కావు. స్వతంత్రమైన ఉపాసనాంగాలే). ఇక్కడ ఉద్గీథాద్యుపాసనల వలె క్రియాంగంతో సంబంధంవల్ల వీటికి క్రియానుప్రవేశం చెప్పవచ్చును కదా అని ఆశంకించడానికి వీలు లేదు. అనగా మనోవృత్త్యాదులయందు అగ్నిత్వాదిధ్యానం క్రియాంగం కాకపోయినా, ఉద్గీథధ్యానం క్రియాంగానికి సంబంధించడం ద్వారా క్రియతో సంబంధించి నట్లు ఇవి కూడ క్రియాంగ సంబంధం ద్వారా క్రియతో సంబంధించవచ్చును కదా అనడం కుదరదు అని అర్థం. ఎందువల్ల ననగా శ్రుతిలో భేదం ఉంది. ఇక్కడ ఏదో ఒక క్రియాంగాన్ని గ్రహించి దానిమీద దీని అధ్యాస చెయ్యాలి (ఆరోపించాలి)అని శ్రుతి చెప్పడం లేదు. ముప్పైఆరువేల మనోవృత్తి భేదాలను తీసికొని వాటిమీద అగ్నిత్వాన్నీ, గ్రహాదులనూ, పురుషయజ్ఞంలో

కల్పించి నట్లు కల్పిస్తున్నది. పురుషుని ఆ యుద్ధాయంలోని రోజులలో ఉన్న ఈ సంఖ్య వాని మనోవృత్తులమీద ఆరోపించబడుచున్నది. ఈ విధంగా అనుబంధం (ఆరోపం) ఉండడంవల్ల మనశ్చిదాదాలకు స్వాతంత్ర్యం అంగీకరించాలి.

## భాష్యమ్

ఆదిశబ్దాదతిదేశాద్యపి యథాసంభవం యోజయితవ్యమ్. తథాహి - "తేషామేకైక ఏవ తావాన్యావానసౌ పూర్వః." ఇతి క్రియామయస్యాగ్నేర్మాహాత్మ్యం జ్ఞానమయానామేకైకస్యాతిదిశన్ క్రియాయామనాదరం దర్శయతి. న చ సత్యేవ క్రియాసంబన్ధే వికల్పః పూర్వేణోత్తరేషామితి శక్యం వక్తుమ్. న హి యేన వ్యాపారేణ ఆహవనీయధారణాదినా పూర్వః క్రియాయాముపకరోతి తేనోత్తరే ఉపకర్తుం శక్నువన్తి. యత్తు పూర్వపక్షేఽ ప్యతిదేశ ఉపోద్బలక ఇత్యుక్తమ్, సతి హి సామాన్యేఽతిదేశః ప్రవర్తత ఇతి, తదస్మత్పక్షేఽప్యగ్నిత్వసామాన్యేన అతిదేశసంభవాత్ప్రత్యుక్తమ్; అస్తి హి సాంపాదికానామప్యగ్నీనామగ్నిత్వమితి. శ్రుత్యాదీని చ కారణాని దర్శితాని. ఏవమనుబన్ధాదిభ్యః కారణేభ్యః స్వాతన్త్ర్యం మనశ్చిదాదీనామ్, ప్రజ్ఞాన్తరపృథక్త్వవత్. యథా ప్రజ్ఞాన్తరాణి శాణ్డిల్యవిద్యాప్రభృతీని స్వేన స్వేనానుబధ్యమానాని పృథగేవ కర్మభ్యః ప్రజ్ఞాన్తరేభ్యశ్చ స్వతన్త్రాణి భవన్త్యేవమితి. దృష్టశ్చావేష్టేః రాజసూయప్రకరణ పఠితాయాః ప్రకరణాదుత్కర్షో వర్ణత్రయానుబన్ధాద్రాజయజ్ఞత్వాచ్చ రాజసూయస్య. తదుక్తం ప్రథమే కాణ్డే- "క్రత్వర్థాయామితి చేన్న వర్ణత్రయసంయోగాత్"" (జై.సూ. 11.4.7) ఇతి. 50

## బాలానందిని

**ఆదీతి** :-(సూత్రంలోని) ఆదిశబ్దంచేత యథాసంభవంగా అతిదేశాదులను కూడ చేర్చాలి. అదెట్లనగా-"తేషామేకైక ఏవ తా వాన్యావానసౌ పూర్వః" అని క్రియకు సంబంధించిన అగ్నియొక్క మహాత్మ్యాన్ని జ్ఞానమయాగ్నులలో ఒక్కొక్కదానికే ఉన్న దని అతిదేశిస్తూ క్రియయందు అనాదరం చూపుతున్నారు. (క్రియామయాగ్నికంటె జ్ఞానమయాగ్నియే

గొప్పదని చూపుతున్నాడు). (అతిదేశం అనాదరం మూలాన చేయబడలేదు; వికల్పం కోసం ( ఆ అగ్ని గాని ఈ అగ్ని గాని ప్రవర్తింపచెయ్యాలి అని సూచించడంకోసం) చేయబడింది అనగానికి కూడ వీలు లేదు)- జ్ఞానమయాగ్నికి క్రియామయాగ్నితో సంబంధం ఉంటూండగా వికల్పం కుదరదు కదా? (అనగా అప్పుడు జ్ఞానమయాగ్ని కూడ సంబంధిస్తేనే క్రియామయాగ్ని పరిపూర్ణం అవుతుంది కదా అని భావం). మొదటిది (క్రియామయాగ్ని)ఆహవనీయాన్ని ధరించడం మొదలైన ఏ వ్యాపారంచేత క్రియలో ఉపకరిస్తుందో అదే వ్యాపారంచేత తరువాతివి (జ్ఞానమయాగ్నులు)ఉపకరించ జాలవు కదా? (ఒక పనిచేయడానికి రెండు వస్తువులకు సమానమైన సామర్థ్యం ఉన్నప్పుడు వాటికి వికల్పం చెప్పవచ్చును. ఉదాహరణకి వ్రీహుల అపేక్ష లేకుండా యవలు హోమానికి ఉపయోగిస్తాయి. యవల అపేక్ష లేకుండా వ్రీహులు ఉపయోగిస్తాయి. అందుచేత యవలచేత నైనా హోమం చేయవచ్చు వ్రీహులచేత నైనా చేయవచ్చును అని వికల్పం చెప్పవచ్చు. కాని క్రియామయాగ్ని చేయగలిగిన ఆహవనీయధారణాదికాన్ని జ్ఞానమయాగ్నులు చేయజాలవు. అందుచేత వాటికి వికల్పం కుదరదు అని భావం). ఏదైనా సామాన్యం (పోలిక)ఉంటేనే అతిదేశం కుదురుతుంది; (రెండు అగ్నులూ కూడ క్రియాంగములే గాన ఈ సామాన్యాన్ని పట్టి అతిదేశం చేయబడింది). అందుచేత క్రియాంగత్వం అంగీకరించాలి అని చెప్పడానికి (పూర్వపక్షానికి) అతిదేశం అనుకూలంగా ఉంది అని ఏది చెప్పబడిందో అది, మా పక్షంలో కూడ అనుకూలమే గాన, అగ్నిత్వం అనే సామాన్యంచేత అతిదేశం కుదురుతుంది గాన, నిరాకరించబడింది. (అతిదేశానికి కావలసిన సామ్యం మా పక్షంలో కూడ ఉంది అని అర్థం). సాంపాదికాగ్నులలో కూడ అగ్నిత్వం ఉంది కదా? ఇవి కాక శ్రుత్యాదికారణాలు కూడ చూపబడ్డాయి. ఈ విధంగా అనుబంధం మొదలైన కారణాలవల్ల ప్రజ్ఞాంతరముల పృథక్త్వం వలె మనశ్చిదాదులకు స్వాతంత్ర్యమే యుక్తం. శాండిల్యవిద్య మొదలైన ప్రజ్ఞాంతరాలు తమ తమ ఆరోపిత రూపాలతో కూడినవై ఏ విధంగా కర్మలకంటె, ఇతర ప్రజ్ఞల (విద్యల)కంటె వేరుగానే ఉన్నొ స్వతంత్రంగా ఉన్నాయో అట్లే ఇవి కూడ. రాజసూయప్రకరణంలో పఠించబడిన అవేష్టి వర్ణత్రయానికి సంబంధించిన దవడంచేత, రాజసూయయాగం క్షత్రియుడు మాత్రమే

చేయవలసిన యజ్ఞం అవడంచేత, దానికి (అవేష్టికి) ప్రకరణం నుండి ఉత్కర్షం (పైకి లాగడం, విడదీయడం) చూడబడుచున్నది. ఈ విషయం ప్రథమకాండలో "క్రత్వర్థానామ్.....సంయోగాత్" అనే సూత్రంలో చెప్పబడింది.

వి:- రాజసూయయాగం చేయడానికి అధికారం క్షత్రియునికి మాత్రమే ఉంది. రాజసూయప్రకరణంలో 'అవేష్టి' అనే ఒక ఇష్టి పఠించబడింది. ఈ ఇష్టిమాత్రం బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్యవర్ణాలవాళ్లు ముగ్గురూ చేయదగినది. అందుచేత దీనిని రాజసూయ ప్రకరణంనుంచి వేరు చేసి దీనిని క్షత్రియులే కాక బ్రాహ్మణ-వైశ్యులు కూడ చెయ్యాలని నిర్ణయించబడింది. "క్రత్వర్థయామితి చేత్ తంత్రప్రయోగం రాజసూయక్రతువులో చేసే ఇష్టిలోనే చెయ్యాలి అన్నట్లయితే, న=కాదు, వర్ణత్రయసంయోగాత్=దీనికి వర్ణత్రయంతో సంబంధం ఉండడంవల్ల" అని సూత్రార్థం. క్షత్రియుడు మాత్రమే చేయడానికి తగిన రాజసూయక్రతువులో వర్ణత్రయంచేత చేయదగిన అవేష్టి అంతర్గతం కాజాలదు గాన దానిని ఆ ప్రకరణంనుండి వేరు చేసినట్లు మనశ్చిదాదులను కూడ ప్రకరణంనుండి వేరు చేసి వీటిని స్వతంత్రవిద్యగా అంగీకరించాలి అని భావం.

**సూ. న సామాన్యాదప్యుపలబ్ధేర్మృత్యువన్న హి లోకాపత్తిః. 3.3.51**

యదుక్తం మానసవదితి తత్ప్రత్యుచ్యతే. న మానసగ్రహసామాన్యాదపి మనశ్చిదాదీనాం క్రియాశేషత్వం కల్ప్యమ్. పూర్వోక్తేభ్యః శ్రుత్యాదిహేతుభ్యః కేవల పురుషార్థత్వోపలబ్ధేః. న హి కించిత్కస్య చిత్కేన చిత్సామాన్యం న సంభవతి. న చ తావతా యథాస్వం వైషమ్యం నివర్తతే, మృత్యువత్. యథా "స వా ఏష ఏవ మృత్యుర్య ఏష ఏతస్మిన్మణ్డలే పురుషః" ఇతి, "అగ్నిర్వై మృత్యుః" (బృ.ఉ. 3.2.10) ఇతి చాగ్న్యాదిత్యపురుషయోః సమానేఽపి మృత్యుశబ్దప్రయోగే నాత్యన్తసామ్యాపత్తిః, యథా చ "అసౌ వావ లోకో గౌతమాగ్నిస్తస్యాదిత్య ఏవ సమిత్" (ఛా. ఉ. 5.4.1)ఇత్యత్ర న సమిదాది సామాన్యాల్లోకస్యాగ్నిభావాపత్తిస్తద్వత్. 51

బాలానందిని

నేతి:- "సామాన్యాదపి = మానసగ్రహంతో సామ్యం ఉన్నా కూడ, న=క్రత్వర్థత్వం లేదు. ఉపలబ్ధేః=ఇతరహేతువులచేత ఇవి కేవలం పురుషార్థములే అని తెలియడంవల్ల మృత్యువత్=మృత్యువు వలె. లోకాపత్తిః=లోకం అగ్నిగా అయిపోవడం, న హి=లేదు కదా?" అని సూత్రార్థం.

యదితి:-"మానసవత్" అని చెప్పినదానికి సమాధానం చెప్పబడుచున్నది. మానసగ్రహంతో పోలిక ఉన్నా కూడ మనశ్చిరాదులను క్రియాశేషము లని కల్పించకూడదు. ఎందువల్ల ననగా-పైన చెప్పిన శ్రుత్యాదిహేతువులవల్ల ఇవి కేవలం పురుషార్థములే అని (ఉపాసకునికి మాత్రం ఉపకరించేవే) అని తెలుస్తూన్నది. దేనికైనా, ఏదో ఒక పోలిక లేకుండా ఉండదు కదా? తావన్మాత్రంచేత వాటి వాటి కున్న వైషమ్యం నివర్తించదు కదా? మృత్యువత్-"స వా...పురుషః" ( ఈ మండలంలో ఉన్న పురుషుడే మృత్యువు) "అగ్నిర్వై మృత్యుః" (అగ్నియే మృత్యువు) అను వాక్యాలచేత అగ్న్యాదిత్యపురుషుల విషయంలో మృత్యుశబ్దం సమంగానే ప్రయోగింపబడినా కూడ ఆ రెండింటికీ పూర్తి సామ్యం ఏ విధంగా లేదో అట్లే ఇక్కడ కూడ. అట్లే-"అసౌ...సమిత్ ( ఓ! గౌతమా! ఈ లోకమే అగ్ని-ఆదిత్యుడే సమిధ)అనే చోట సమిధలు మొదలైనవాటితో సామ్యం చెప్పినంతమాత్రాన లోకం అగ్నిత్వాన్ని పొందడం ఏవిధంగా లేదో అట్లే ఇక్కడ కూడ. 51

సూ.పరేణ చ శబ్దస్య తాద్విధ్యం భూయస్త్వాత్త్వనుబన్ధః. 3.3.52

పరస్తాదపి "అయం వా వ లోక ఏషోఽగ్నిశ్చితః". ఇత్యేతస్మిన్ననన్తరే బ్రాహ్మణే తాద్విధ్యం కేవలవిద్యావిధిత్వం శబ్దస్య ప్రయోజనం లక్ష్యతే న శుద్ధ కర్మ విధిత్వమ్. తత్ర హి-

1204 విద్యయా తదారోహన్తి యత్ర కామాః పరాగతాః,
న తత్ర దక్షిణా యాన్తి నా విద్వాంసస్తపస్వినః.

ఇత్యనేన శ్లోకేన కేవలం కర్మ నిన్దన్విద్యాం చ ప్రశంసన్నాదరం గమయతి. తథా పురస్తాదపి "యదేతన్మణ్డలం తపతి" ఇత్యస్మిన్ బ్రాహ్మణే విద్యాప్రధానత్వమేవ

లక్ష్యతే- "సోఽమృతో భవతి మృత్యుర్యస్యాత్మా భవతి" ఇతి విద్యాఫలేనైవోపసంహారాన్న కర్మప్రధానతా. తత్సామాన్యాదిహాపి తథాత్వమ్. భూయాంసస్త్వగ్న్యవయవాః సంపాదయితవ్యాః విద్యాయామిత్యే తస్మాత్కారణాత్ అగ్నినానుబధ్యతే విద్యా న కర్మాఙ్గత్వాత్. తస్మాన్మనశ్చిదాదీనాం కేవల విద్యాత్మకత్వసిద్ధిః. 52

బాలానందిని

పరేణేతి:-పరేణ చ=తరువాత వచ్చిన బ్రాహ్మణంచేత కూడ, శబ్దస్య=శబ్దానికి, తాద్విధ్యమ్=కేవల విద్యను విధించడం అనే ప్రయోజనమే కనబడుచున్నది; భూయస్త్వాత్తు = సంపాదించవలసిన అగ్న్యవయవాల బాహుళ్యంవల్ల మాత్రమే. అనుబన్ధః=అగ్నితో సంబంధం చెప్పబడింది" అని సూత్రార్థం.

పరస్తాదితి :-తరవాత "అయం వా వ లోక ఏషోఽగ్నిశ్చితః" అనే అనంతర బ్రాహ్మణంలో శబ్దానికి తాద్విధ్యమే, అనగా కేవలవిద్యావిధిత్వమే, ప్రయోజనంగా కనబడుచున్నది గాని శుద్ధమైన కర్మకు అంగంగా విధింపబడడం కనబడడం లేదు. అక్కడ-"విద్యయా...తపస్వినః" అనే శ్లోకంచేత కేవలకర్మను నిందిస్తూ, విద్యను ప్రశంసిస్తూ ఈ విషయాన్నే సూచిస్తున్నాడు. అట్లే ముఖ్యంగా కూడ "యదేతన్మణ్డలం తపతి" అనే బ్రాహ్మణంలో-"సోఽమృతో భవతి మృత్యుర్యస్యాత్మా భవతి" (అతడు, ఎవనికి మృత్యువు ఆత్మ అవుతుందో అలాంటి అమృతు డవుతాడు)అని విద్యాఫలంతోనే ఉపసంహరించడంవల్ల విద్యాప్రధానత్వమే తెలుస్తున్నది. దాని పోలికచేత ఇక్కడ కూడ అట్లే (విద్యాప్రాధాన్యం). ఈ విద్యలో అగ్నికి సంబంధించిన అనేకమైన అవయవాలను సంపాదించవలసి ఉన్నదనే కారణంచేత ఈ విద్య అగ్నితో చేర్చడింది కాని కర్మాంగం అవడంవల్ల కాదు. అందువల్ల మనశ్చిదాదులు కేవల విద్యాత్మకములే అని సిద్ధిస్తుంది. 52.

లింగభూయస్త్వాధికరణం సమాప్తం.

## 30. ఐకాత్మ్యాధికరణమ్. సూ. 5-3-54

## సూ. ఏక ఆత్మనః శరీరే భావాత్. 3.3.53

ఇహ దేహ వ్యతిరిక్తస్యాత్మనః సద్భావః సమర్థ్యతే బన్ధమోక్షాధికారసిద్ధయే న హ్యసతి దేహవ్యతిరిక్తాత్మని పరలోకఫలాశ్చోదనాః ఉపపద్యేరన్; కస్య వా బ్రహ్మాత్మత్వముపదిశ్యేత? నను శాస్త్రప్రముఖ ఏవ ప్రథమే పాదే శాస్త్రఫలోపభోగయోగ్యస్య దేహవ్యతిరిక్తస్యాత్మనోఽస్తిత్వముక్తమ్? సత్యముక్తం భాష్యకృతా. న తు తత్రాత్మాస్తిత్వే సూత్రమస్తి. ఇహ తు స్వయమేవ సూత్రకృతా తదస్తిత్వమాక్షేపపురఃసరం ప్రతిష్ఠాపితమ్. ఇత ఏవ చాకృష్యాచార్యేణ శబరస్వామినా ప్రమాణలక్షణే వర్ణితమ్. అత ఏవ చ భగవతోపవర్షేణ ప్రథమే తన్త్రే ఆత్మాస్తిత్వాభిధానప్రసక్తౌ శారీరకే వక్ష్యామ ఇత్యుద్ధారః కృతః. ఇహచేదం చోదనాలక్షణేషూపాసనేషు విచార్యమాణేష్వాత్మాస్తిత్వం విచార్యతే కృత్స్న శాస్త్ర శేషత్వప్రతిపాదనాయ. అపి చ పూర్వస్మిన్నధికరణే ప్రకరణోత్కర్షాభిధానేన మనశ్చిదాదీనాం పురుషార్థత్వం వర్ణితమ్. కోఽసౌ పురుషః యదర్థా ఏతే మనశ్చిదాదయ ఇత్యస్యాం ప్రసక్తౌ ఇదం దేహవ్యతిరిక్తస్యాత్మనోఽస్తిత్వముచ్యతే. తదస్తిత్వాక్షేపార్థం చేదమాదిమం సూత్రమ్. ఆక్షేపపూర్వికా హి పరిహారోక్తి ర్వివక్షితేఽర్థే స్థూణానిఖననన్యాయేన దృఢాం బుద్ధిముత్పాదయేదితి.

### బాలానందిని

ఏక ఇతి :- "శరీరే=శరీరం ఉన్నప్పుడే, భావాత్=సుఖచైతన్యాదు లుండడంవల్ల. ఆత్మనః= ఆత్మయొక్క అభావాన్ని, ఏకే=కొందరు చెపుతున్నారు" అని సూత్రార్థం.

ఇహేతి:- బంధమూ, మోక్షాధికారమూ సిద్ధించడానికై ఇక్కడ, దేహంకంటె భిన్నమైన ఆత్మయొక్క ఉనికి సాధించడుచున్నది. దేహంకంటె భిన్నమైన ఆత్మ లేకపోతే పరలోకం ఫలంగా గల విధులు ఉపపన్నములు కావు కదా?(అలాంటి ఆత్మ లేని పక్షంలో) బ్రహ్మస్వరూపత్వం దేనికి ఉపదేశించబడుతుంది? (ప్రశ్న) శాస్త్రప్రారంభంలోనే (పూర్వమీమాంసాశాస్త్రంలోనే)ప్రథమపాదంలో శాస్త్రఫలాన్ని అనుభవించడానికి యోగ్యమైన,

దేహభిన్న మైన ఆత్మయొక్క అస్తిత్వం చెప్పబడింది కదా? (సమాధానం) నిజమే, భాష్యకారునిచేత చెప్పబడింది. కాని అక్కడ ఆత్మయొక్క అస్తిత్వాన్ని గూర్చి సూత్రం లేదు. ఇక్కడైతే సూత్రకారునిచేత (బాదరాయణునిచేత) స్వయంగానే (దేహాతిరిక్తమైన) ఆత్మయొక్క అస్తిత్వాన్ని ముందుగా ఆక్షేపించి అది స్థాపించబడింది. ఆచార్యుడైన శబరస్వామి ఇక్కడినుండిమేఆకర్షించి ఈ విషయాన్ని ప్రమాణలక్షణంలో చెప్పి ఉన్నాడు అందువల్లనే పూజ్యుడైన ఉపవర్షుడు, ప్రథమతంత్రంలో ఆత్మాస్తిత్వాన్ని గూర్చి చెప్పే ప్రసంగంలో "శారీరకంలో చెపుతాం" అని ఉద్ధారం (ఆక్షేపానికి పరిహారం) చేశాడు.

వి. పూర్వమీమాంసలో శబరస్వామి ఆత్మను గూర్చి చెప్పినఘట్టంలో వార్తికకారుడైన కుమారిలభట్టు-

"ఇత్యాహ నాస్తిక్యనిరాకరిష్ణురాత్మాస్తితాం భాష్యకృదత్ర యుక్త్యా,
దృఢత్వమేతద్విషయశ్చ బోధః ప్రయాతి వేదాన్తనిషేవణేన"

"నాస్తిక్యాన్ని నిరాకరించడం కోసమై బాష్యకారుడు ఇక్క ఆత్మాస్తిత్వాన్ని యుక్తిచేత ప్రతిపాదించాడు. ఆత్మయొక్క అసలు స్వరూపం వేదాంతాలను సేవిస్తే తెలుస్తుంది" అన్నారు.

ఇహేతి- ఇక్కడ చోదనారూపా లైన (విధిరూపాలైన) ఉపాసనలను గూర్చి విచారించబడుచున్నది గాన, మొత్తం శాస్త్రానికి (పూర్వోత్తరమీమాంసలకు) అంగంగా చూపడం కోసం(అనగా రెండు శాస్త్రాలకీ ఉపయోగించడానికై)ఆత్మాస్తిత్వవిచారణ చేయబడుచున్నది. మరొక విషయమేమనగా వెనుకటి అధికరణంలో ప్రకరణంనుండి మనశ్చిదాదుల ఉత్కర్ష(వేరు చేయడం) అంగీకరించడం ద్వారా అవి పురుషార్థము లని చెప్పబడింది. ఈ మనశ్చిదాదులు ఏ పురుషుని కోసం ఉద్దిష్టమైనవో ఆ పురుషుడు ఎవరు అని ప్రశ్న వచ్చినప్పుడు దేహవ్యతిరిక్తుడైన ఆత్మయొక్క అస్తిత్వం చెప్పబడుచున్నది (ఈ విధంగా ఈ అధికరణం శాస్త్రాని కంతకీ అంగం గాన శాస్త్రసంగతి. వెనుకటి అధికరణంతో ఆక్షేపసంగతి అని అర్థం). ఆత్మయొక్క అస్తిత్వాన్ని ఆక్షేపించడానికి ఈ మొదటి సూత్రం ప్రవర్తిస్తున్నది. ముందు ఆక్షేపం చేసి తరవాత పరిహారం చెప్పినట్లయితే అప్పుడు చెప్పదలచుకున్న విషయం, స్థూణానిఖననన్యాయంచేత (గునపం మొదలైనవి నేలలో గట్టిగా పాతుకొనడం కొరకు వాటిని నాలుగైదుసార్లు గ్రుచ్చినచోటనే గ్రుచ్చుతూ

పాతడం స్థూణానిఖననన్యాయం)దృఢమైన బుద్ధిని కలిగిస్తుంది.

భాష్యమ్

అత్రైకే దేహమాత్రాత్మదర్శినో లోకాయతికా దేహవ్యతిరిక్తస్యాత్మనోఽభావం మన్యమానాః సమస్తవ్యస్తేషు బాహ్యేషు పృథివ్యాదిష్వదృష్టమపి చైతన్యం శరీరాకారపరిణతేషు భూతేషు స్యాదితి సంభావయన్తః తేభ్యశ్చైతన్యం మదశక్తివద్విజ్ఞానమ్, చైతన్యవిశిష్టః కాయః పురుష ఇతి ఆహుః. న స్వర్గగమనాయాపవర్గగమనాయ వా సమర్థో దేహవ్యతిరిక్త ఆత్మాస్తి యత్కృతం చైతన్యం దేహే స్యాత్. దేహ ఏవ తు చేతనశ్చాత్మాచేతి ప్రతిజానతే. హేతుం చాచక్షతే శరీరే భావాదితి. యద్ధి యస్మిన్ సతి భవతి అసతి చ న భవతి, తత్ తద్ధర్మత్వేనాధ్యవసీయతే, యథాగ్నిధర్మావౌష్ణ్యప్రకాశౌ. ప్రాణచేష్టా చైతన్యస్మృత్యాదయశ్చాత్మధర్మత్వేనాభిమతాః ఆత్మ వాదినాం; తేఽప్యన్తరేవ దేహ ఉపలభ్యమానా బహిశ్చానుపలభ్యమానాః అసిద్ధే దేహవ్యతిరిక్తే ధర్మిణి దేహధర్మా ఏవ భవితుమర్హన్తి. తస్మాదవ్యతిరేకో దేహాదాత్మన ఇతి. 53.

బాలానందిని

అత్రేతి:- ఈ విషయంలో దేహమే ఆత్మ యని భావించే లోకాయతికు లనే కొందరు దేహంకంటె భిన్నమైన ఆత్మ లేదని అంటారు. సమస్తములుగా ఉన్న, లేదా వ్యస్తములుగా ఉన్న బాహ్యములైన పృథివ్యాదులలో చైతన్యం కనబడకపోయినా కూడ శరీరాకారంలో పరిణమించిన భూతాలలో ఉండవచ్చు నని వీళ్లు అంటారు. అలా శరీరాకారంలో పరిణమించిన ఆ భూతాలనుండి మదశక్తివలె (కొన్ని వస్తువుల కలయికవలన మాదకతాశక్తి పుట్టినట్లు) చైతన్యం పుడుతుం దనీ, అలాంటి చైతన్యంతో కూడిన శరీరమే పురుష డనీ అంటారు. స్వర్గానికి వెళ్లడానికి గాని, మోక్షం పొందడానికి గాని శరీరంకంటె వేరుగా ఆత్మ లేదు. అందుచేత దానివల్ల చైతన్యం దేహంలో కలిగే ప్రసక్తి లేదు. చేతనమైన దేహమే ఆత్మ అని వాళ్లు చెపుతారు. ఇందుకు వాళ్లు- శరీరం ఉన్నప్పుడే చైతన్యం ఉంటుంది గాన అని హేతువును కూడ చెపుతున్నారు. ఏది ఉన్నప్పుడు ఏది

ఉంటుందో, ఏది లేనప్పుడు ఏది ఉండదో అది దాని ధర్మం అని నిర్ణయించబడుతుంది ఉదాహరణకి అగ్నిధర్మాలైన ఉష్ణత్వ-ప్రకాశలు. (ఇవి అగ్ని ఉంటే ఉంటాయి అగ్ని లేకపోతే ఉండవు. అందుచేత అగ్నియొక్క ధర్మాలని చెప్పబడుచున్నాయి). ఆత్మవాదులు ఆత్మధర్మాలని చెప్పే ప్రాణం, చేష్ట, చైతన్యం, స్మృతి, మొదలైనవి కూడ దేహంలోపలనే కనబడుతున్నాయి. దేహానికి బైట కనబడడంలేదు. అందుచేత దేహంకంటె వేరుగా ధర్మి (ఆత్మ అనేది) లేదన్నప్పుడు అవి కూడ దేహధర్మాలే అని చెప్పడం యుక్తం. అందువల్ల దేహంకంటె భిన్నంగా ఆత్మ లేదు. 53.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః-

**సూ. వ్యతిరేకస్తద్భావాభావిత్వాన్న తూపలబ్ధివత్. 3.3.54**

న త్వేతదస్తి యదుక్తమవ్యతిరేకో దేహాదాత్మన ఇతి. వ్యతిరేక ఏవాస్య దేహాద్భవితుమర్హతి, తద్భావాభావిత్వాత్. యది దేహభావే భావిత్వాద్దేహధర్మత్వమాత్మధర్మాణాంమన్యేత తతో దేహభావేఽప్యభావాదతద్ధర్మత్వమేవైషాం కిం న మన్యేత? దేహధర్మవైలక్షణ్యాత్. యే హి దేహధర్మా రూపాదయస్తే యావద్దేహం భవన్తి. ప్రాణచేష్టాదయస్తు సత్యపి దేహే మృతావస్థాయాం న భవన్తి. దేహధర్మాశ్చ రూపాదయః పరైరప్యుపలభ్యన్తే, న త్వాత్మ ధర్మాశ్చైతన్యస్మృత్యాదయః. అపి చ సతి హి తావద్దేహే జీవదవస్థాయామేషాం భావః శక్యతే నిశ్చేతుం న త్వసత్యభావః, పతితేఽపి హి కదాచిదస్మిన్ దేహే దేహాన్తరసంచారేణ ఆత్మధర్మా అనువర్తేరన్. సంశయమాత్రేణాపి పరపక్షః ప్రతిషిధ్యతే. కి మాత్మకం పునరిదం చైతన్యం మన్యతే యస్య భూతేభ్య ఉత్పత్తి మిచ్ఛతీతి పరః పర్యనుయోక్తవ్యః. న హి భూతచతుష్టయవ్యతిరేకేణ లోకాయతికః కించిత్తత్త్వం ప్రత్యేతి. యదనుభవనం భూతభౌతికానాం తచ్చైతన్యమితి చేత్, తర్హి విషయత్వాత్తేషాం న తద్ధర్మత్వమశ్నువీత; స్వాత్మని క్రియావిరోధాత్. న హ్యగ్నిరుష్ణః సన్ స్వాత్మానం

దహతి, న హి నటః శిక్షితః స్వస్కన్ధమధిరోక్ష్యతి; న హి భూతభౌతికేన సతా చైతన్యేన భూతభౌతికాని విషయీక్రియేరన్. న హి రూపాదిభిః స్వం రూపం పరరూపం వా విషయీక్రియతే. విషయీక్రియన్తే తు బాహ్యాధ్యాత్మికాని భూతభౌతికాని చైతన్యేన; అతశ్చ యథైవాస్యా భూతభౌతికవిషయాయా ఉపలబ్ధేర్భావోఽభ్యుపగమ్యతే ఏవం వ్యతిరేకోఽప్యస్యాస్తేభ్యోఽభ్యుపగన్తవ్యః. ఉపలబ్ధిరూప ఏవ చ న ఆత్మేతి ఆత్మనో దేహవ్యతిరిక్తత్వమ్, నిత్యత్వం చ; ఉపలబ్ధేరైకరూప్యాత్. అహమిదమద్రాక్షమితి చావస్థాన్తరయోగేఽప్యుపలబ్ధృత్వేన ప్రత్యభిజ్ఞానాత్. స్మృత్యాద్యుపపత్తేశ్చ.

యత్తూక్తం- శరీరే భావాచ్ఛరీరధర్మ ఉపలబ్ధిరితి. తద్వర్ణితేన ప్రకారేణ ప్రత్యుక్తమ్. అపి చ సత్సు ప్రదీపాదిషూపకరణేషు ఉపలబ్ధిర్భవతి అసత్సు న భవతి. న చైతావతా ప్రదీపాదిధర్మ ఏవోపలబ్ధిర్భవతి. ఏవం సతి దేహే ఉపలబ్ధిర్భవతి, అసతి చ న భవతీతి న దేహధర్మో భవితుమర్హతి. ఉపకరణత్వమాత్రేణాపి ప్రదీపాదివద్దేహోపయోగోపపత్తేః. న చాత్యన్తం దేహస్యోపలబ్ధౌ ఉపయోగోఽపి దృశ్యతే; నిశ్చేష్టేఽప్యస్మిన్ దేహే, స్వప్నే నానావిధోపలబ్ధిదర్శనాత్. తస్మాదనవద్యం దేహవ్యతిరిక్తస్యాత్మనోఽస్తిత్వమ్. 54.

## బాలానందిని

వ్యతిరేక ఇతి : "తద్భావాభావిత్వాత్ = దేహం ఉన్నా కూడ ఆత్మధర్మా లైన చైతన్యాదులు లేకపోవడంవల్ల, వ్యతిరేకః=దేహానికి ఆత్మకంటె భిన్నత్వము. న తు= చైతన్యం దేహధర్మం మాత్రం కాదు, ఉపలబ్ధివత్ = జ్ఞానము వలె" అని సూత్రార్థం.

నేతి: ఆత్మ దేహంకంటె వ్యతిరిక్తం కాదు అని ఏది చెప్పబడిందో అది లేదు, దేహంకంటె ఆత్మకు వ్యతిరేకమే (భేదమే) ఉండడం యుక్తం; తద్భావభావిత్వంవలన. దేహం ఉన్నప్పుడే ఉండడంచేత ఆత్మధర్మాలు దేహధర్మాలు అని అన్నట్లయితే, దేహం ఉన్నా కూడ అవి ఉండకపోవడంచేత అవి దేహధర్మాలు కావు అని ఎందుకు అంగీకరించకూడదు? ఆత్మధర్మాలకీ దేహధర్మాలకీ వైలక్షణ్యం (భేదం) ఉన్నది కదా?

దేహధర్మాలైన రూపాదులు దేహం ఉన్నంతవరకూ ఉంటున్నాయి. ప్రాణం, చేష్టలు మొదలైనవైతే మృతావస్థలో దేహం ఉన్నా కూడ ఉండడంలేదు. దేహధర్మా లైన రూపాదులను ఇతరులు ప్రత్యక్షంగా చూడగలుగుతున్నారు. కాని ఆత్మధర్మాలైన చైతన్య-స్మృత్యాదులను ఇతరులు గ్రహించజాలరు. మరొక విషయమేమనగా జీవించి ఉన్న అవస్థలో దేహంలో వీటి ఉనికిని నిశ్చయించవచ్చును గాని దేహం లేప్పుడు ఇవి లేవని నిశ్చయంగా చెప్పడానికి శక్యం కాదు. ఈ దేహం పతితమైన తరవాత కూడా ఆత్మధర్మాలు, దేహాంతరంలోనికి సంచరించడంచేత ఒక వేళ అనువర్తించవచ్చును కదా? (అందుచేత దేహం లేప్పుడు చైతన్యస్మృత్యాదులు ఉండ వని నిశ్చితంగా చెప్పడానికి శక్యం కాదు గాన ఉండవచ్చునేమో అన్న సంశయానికి తావు లేకపోలేదు.) సంశయమాత్రంచేత కూడా పరపక్షం నిషేధించబడుతుంది. (అన్వయవ్యతిరేకా లున్నా యని గట్టిగా చెప్పడానికి వీలుండదు గాన చైతన్యాదులు దేహధర్మాలే అని స్థాపించడం శక్యం కాదు అని అర్థం). ఏ చైతన్యం భూతాలనుంచి పుడుతుం దని అంటున్నాడో ఆ చైతన్యం ఎలాంటిది అని ప్రతిపక్షిని ప్రశ్నించాలి. ఎందుచేత ననగా భూతచతుష్టయం తప్ప మరొక (ఐదవ) తత్త్వాన్ని దేనినీ లోకాయతికుడు అంగీకరించడు కదా? (చైతన్యాన్ని అంగీకరిస్తే ఐదవ తత్త్వం అంగీకరించినట్లవుతుంది అని భావం). భూతాలను, భౌతికాలను (పంచమహాభూతాలనుండి పుట్టినవాటినీ) తెలుసుకొనడం అనేది ఏది కలదో అదే చైతన్యం అని అంటే - అట్లైతే, అవి (భూతభౌతికాలు) విషయములు కాబట్టి ఈ చైతన్యం వాటి ధర్మం కాకూడదు. క్రియ తన విషయంలోనే ప్రవర్తించడం విరుద్ధం. (లోకాయతికుడు నాలుగు పదార్థాలకంటె భిన్నమైన ఐదవ తత్త్వం అంగీకరించలేదు గాన భూతభౌతికాలను గ్రహించేదిగా చెప్పిన చైతన్యం కూడా నాలుగు భూతాలలోనే అంతర్గతం కావాలి. అలాంటప్పుడు ఆ నాలుగు భూతాలు తమను తాము చూస్తున్నాయి అని చెప్పిన ట్లవుతుంది. అది అసంభవం అని భావం). వేడిగా ఉన్న అగ్ని తనను తాను కాల్చదు కదా? ఎంత అభ్యాసం చేసినా నటుడు తన బుజాల మీదికి ఎక్కజాలడు కదా? అట్లే భూత భౌతికాల ధర్మం అయి ఉండి చైతన్యం భూతభౌతికాలను విషయంగా చేసికొనజాలదు కదా? (పృథివ్యాదులధర్మాలైన)రూపాదులు తమ రూపాన్ని గాన్ని పరరూపాన్ని గాని చూడ జాలవు కదా? అయితే బాహ్యాలూ, అధ్యాత్మికాలూ అయిన భూతభౌతికాలు చైతన్యంచేత గ్రహింపబడుచున్నాయి. అందుచేత

భూతభౌతికవిషయకమైన ఉపలబ్ధి (జ్ఞానం) ఉన్నట్లు ఏ విధంగా అంగీకరించబడుచున్నదో అట్లే ఇది (చైతన్యం) భూతభౌతికాలకంటె భిన్నమైనది. అని కూడ అంగీకరించాలి. మా సిద్ధాంతం ప్రకారం ఆత్మ అనగా ఉపలబ్ధియే (జ్ఞానమే). అందుచేత ఉపలబ్ధిరూప మైన ఆత్మదేహంకంటె భిన్న మైనది. ఉపలబ్ధి ఒకే రూపంలో ఉంటుంది గాన ఇది (ఉపలబ్ధి, ఆత్మ) నిత్యం కూడ. అవస్థలలో భేదం ఉన్నా కూడ నేను ఇది చూచాను అని ఉపలబ్ధగా ప్రత్యభిజ్ఞానం (అప్పుడు చూచినవాడే ఇతడు అనే జ్ఞానం) ఉండడంవల్ల, స్మరణాదులు ఉపపన్నం అవడంవల్లా కూడ ఆత్మ నిత్యం. (ఆత్మ అనేది ఒకటి నిత్యమైనది లేకపోతే ఎప్పుడో అనుభవించినదానిని చాలాకాలం తరువాత స్మరించడం ఉండదు. అందుచేత కూడ ఆత్మ నిత్యం) ఉపలబ్ధి శరీరంలోనే కలుగుతున్నది గాన శరీరధర్మమే అని ఏది చెప్పబడిందో అది పైన చెప్పిన ప్రకారం నిరాకరించబడింది. మరొక విషయ మేమనగా దీపం మొదలైన సాధనాలు ఉన్నప్పుడు వస్తువుల జ్ఞానం కలుగుతుంది. అవి లేకపోతే కలగదు. తావన్మాత్రంచేత జ్ఞానం ప్రదీపాదుల ధర్మం కాజాలదు. ఇది ఇలా ఉన్నప్పుడు - దేహం ఉన్నప్పుడు జ్ఞానం కలుగుతున్నది. దేహం లేనప్పుడు జ్ఞానం కలగడం లేదు, అందుచేత జ్ఞానం దేహధర్మమే అనడం యుక్తం కాదు. ఎందుచేత ననగా - దేహం దీపాదుల వలె కేవలం ఉపకరణంగా మాత్రం ఉంటూ (జ్ఞానానికి) ఉపయోగించవచ్చును. మరొక విషయమేమనగా - అన్ని విధాలా దేహమే జ్ఞానానికి ఉపయోగిస్తుంది అనేది కూడ లేదు. ఎందువల్ల ననగా స్వప్నంలో ఈ దేహం నిశ్చేష్టంగా ఉన్నప్పుడు కూడ అనేకవిధాలైన జ్ఞానాలు కలుగుతున్నాయి. అందువల్ల దేహంకంటె భిన్నమైన ఆత్మ ఉన్నదనటం నిర్దుష్ట మైనది.

ఐకాత్మ్యాధికరణం సమాప్తం

## 31. అఙ్గావబద్ధాధికరణమ్. సూ. 55-56

### సూ. అఙ్గావబద్ధాస్తు న శాఖాసు హి ప్రతివేదమ్. 3.3.55

సమాప్తా ప్రాసంగికీ కథా; సంప్రతి తు ప్రకృతామేవానువర్తామహే. "ఓమిత్యేతదక్షరముపాసీత" (ఛా. ఉ. 1.1.1) "లోకేషు పఞ్చవిధం సామోపాసీత" (ఛా. ఉ. 2.2.1) "ఉక్థముక్థమితి వై ప్రజా వదన్తి తదిదమేవోక్థమ్" "ఇయమేవ

పృథివీ" (ఐ.ఆ. 2.1.2.1) "అయం వావ లోక ఏషోఽగ్నిశ్చితః" (శ.బ్రా. 10.5.4.1) ఇత్యేవమాద్యా యఉద్గీథాదికర్మాఙ్గావబద్ధాః ప్రత్యయాః ప్రతివేదం శాఖాభేదేషు విహితాస్తే తత్తచ్ఛాఖాగతేష్వేవోద్గీథాదిషు భవేయురథవా సర్వశాఖాగతేష్వితి విశయః. ప్రతిశాఖం చ స్వరాదిభేదాదుద్గీథాదిభేదానుపాదాయాయము పన్యాసః. కిం తావత్ప్రాప్తమ్? స్వశాఖాగతేష్వేవోద్గీథాదిషు విధీయేరన్నితి. కుతః? సన్నిధానాత్. "ఉద్గీథముపాసీత" (ఛా. ఉ. 1.11.1) ఇతి హి సామాన్యవిహితానాం విశేషాకాఙ్క్షాయాం పంనికృష్టేనైవ స్వశాఖాగతేన విశేషేణాకాఙ్క్షానివృత్తేః. తదతిలఙ్ఘనే శాఖాన్తరవిహితవిశేషోపాదానే కారణం నాస్తి. తస్మాత్ ప్రతిశాఖం వ్యవస్థేతి.

### బాలానందిని

అఙ్గేతి:- అఙ్గావబద్ధాస్తు = కర్మాంగములకు సంబంధించిన విద్యలైతే, ప్రతివేదమ్ = ప్రతీ వేదమునందు, శాఖాసు = స్వశాఖలయందే, న హి = వ్యవస్థితములు కావు" అని సూత్రార్థం.

సమాప్తేతి:- ప్రసంగాగతమైన కథ (విచారం) సమాప్తమైనది. ఇప్పుడైతే ప్రకృతమైనదానినే అనుసరిస్తాం. "ఓమితి . . . ఉపాసీత", "లోకేషు . . . ఉపాసీత" "ఉక్థముక్థమితి ఉక్థమ్" "ఇయమేవ పృథివీ" "అయం. . . చితః" ఈ మొదలైన ఉద్గీథాదికర్మావయవాలకు సంబంధించిన ఏ ప్రత్యయాలు ప్రతీ వేదంలోను శాఖాభేదాలలో విధించబడి ఉన్నాయో అవి ఆ యా శాఖలలో ఉండే ఉద్గీథాదులలోనే ఉంటాయా లేక సకలశాఖాగతా లైన ఉద్గీథాదులలో ఉంటాయా అని సంశయం.

వి. ఉద్గీథావయవమైన ఓంకారంమీద ప్రాణదృష్టి, హింకారమే పృథివి, ప్రస్తావం అగ్ని, ఉద్గీథం అన్తరిక్షం, ప్రతిహారం ఆదిత్యుడు, నిధనం ద్యులోకం - ఈ విధంగా హింకారాదిపంచవిధసామయందు పృథివ్యాదిలోకదృష్టి, ఉక్థం అనే శాస్త్రం మీద పృథివీదృష్టి, ఇష్టకాచిత మైన అగ్నిమీద లోకదృష్టి - ఈ కర్మాంగాలను ఆశ్రయించిన ఉపాసనలు చెప్పబడ్డాయి. కర్మకు అంగమైన సామాదులకు సంబంధించిన వవడంచేత వీటికి కర్మాంగావబద్ధోపానలు అని పేరు. వీటి విషయంలో సంశయం.

ప్రతిశాఖమితి:- ప్రతీ శాఖలోను స్వరాదుల భేదం ఉండడంవల్ల ఉద్గీథాదులు కూడ భిన్నము లవుతాయి గాన ఈ సంశయానికి తావు ఏర్పడింది. ఏమి ప్రాప్తించింది? ఇవి తమ శాఖలో ఉన్న ఉద్గీథాదుల విషయంలోనే విధింపబడాలి. ఎందువల్ల? సంవిధానంవల్ల. "ఉద్గీథముపాసీత" (ఉద్గీథాన్ని ఉపాసించాలి) అని సామాన్యంగా విధించబడి నప్పుడు ఏ ఉద్గీథాన్ని అని విశేషాన్ని గూర్చి ఆకాంక్ష కలిగి నప్పుడు దగ్గగా స్వశాఖలో ఉన్నదానిచేతనే ఆకాంక్షాదులు తీరిపోతాయి గాన, (ఈ ఉపాసనా విధాయక వాక్యం ఏ శాఖలో ఉందో అ శాఖలోనే ఉన్న విధంగా ఉపాసన చెయ్యాలి అని ఆకాంక్ష తీరిపోయిన తరువాత) దానిని కాదని మరొక శాఖలో విధించిన విశేషాన్ని గ్రహించడానికి తగిన కారణం లేదు. అందుచేత శాఖాభేదాన్ని పట్టి ఉపాసనావ్యవస్థ చేసికోవాలి.

వి. దేహాత్మలు భిన్నమైనవి గాన ఆత్మధర్మాలు దేహంలో ఎలా సంభవించవో అట్లే ఆ యా వేదాలలో ఉన్న ఉద్గీథాదులు వేరు వేరు గాన ఒక వేదంలో విధించిన ఉద్గీథాద్యుపాసనలు వేదాంతరంలో ఉన్న ఉద్గీథాద్యుపాసనలలో సంభవించవు అని దృష్టాంత సంగతిచేత పూర్వపక్షం.

### భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రవీత్యఙ్గావబద్ధాస్త్వితి. తుశబ్దః పక్షం వ్యావర్తయతి. నైతే ప్రతివేదం స్వశాఖాస్వేవ వ్యవతిష్ఠేరన్, అపి తు సర్వశాఖాస్వనువర్తేరన్. కుతః? ఉద్గీథాదిశ్రుత్యవిశేషాత్. స్వశాఖావ్యవస్థాయాం హ్యుద్గీథముపాసీతేతి సామాన్యాశ్రయః ప్రత్యయో నోపపద్యతే. తస్మాత్స్వరాదిభేదే సత్యప్యుద్గీథత్వాద్య విశేషాత్ సర్వశాఖాగతేష్వేవోద్గీథాదిషు ఏవంజాతీయకాః ప్రత్యయాః స్యుః. 55

### బాలానందిని

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా అఙ్గావబద్ధాస్తు అని చెపుతున్నాడు. తు శబ్దం పూర్వపక్షాన్ని వ్యావర్తింపచేస్తుంది. ఇవి ప్రతివేదంలోను తమశాఖలోనే వ్యవస్థితములు కాకూడదు. అన్ని శాఖలలోనికి అనువర్తించాలి. ఎందువలన? "ఉద్గీథముపాసీత" ఇత్యాది శ్రుతిలో విశేషం లేకపోవడంవల్ల. ("ఉద్గీథాన్ని ఉపాసించాలి" అని సామాన్యరూపంలో చెప్పినప్పుడు ఉద్గీథం అనేది ఏ శాఖలో ఉన్నా దాని ఉపాసన ప్రత్యక్షంగా శ్రుతి అనే

ప్రమాణంచేత చెప్పబడినట్లే). స్వశాఖమాత్రమే అనే వ్యవస్థ చేసిన పక్షంలో "ఉద్గీథము పాసీత" అనే, విశేషం ఏదీ లేకుండా అన్నింటి విషయంలోను ప్రవర్తించవలసిన, శ్రుతిని విశేషంమీద వ్యవస్థితం చేస్తే (దానికి మాత్రమే పరిమితం చేస్తే) పీడింపబడినదవుతుంది. అది న్యాయ్యం కాదు. సంనిధానంకంటె శ్రుతి బలీయమైనది కదా? ఇక్కడ సామాన్యానికి సంబంధించిన జ్ఞానం ఉపపన్నం కాదనేమాట కూడ లేదు - అందువల్ల స్వరాదులలో భేదా లున్నా ఉద్గీథత్వంలో విశేషం (భేదం) లేదు గాన సమస్తశాఖలకు సంబంధించిన ఉద్గీథాదులలోఈ విధమైన ప్రత్యయాలు (భావనలు) ఉంటాయి.

వి. లోకంలో "ఘటమానయ" (ఘటం తీసికొనిర్రా) అన్నప్పుడు ఘటశబ్దం ఘటసామాన్యాన్ని, అనగా లోకంలో ఉన్న అన్ని ఘటాలనూ, చెప్పినా, అన్ని ఘటాలను తీసికొని రావడం అశక్యం గాన సంనిధానాన్ని పట్టి ప్రక్కనున్న ఘటం గ్రహించబడుతుంది. ఇక్కడ ఉద్గీథం అని సామాన్యరూపంలో చెప్పినప్పుడు అన్ని వేదశాఖలలోనూ ఉన్న ఉద్గీథాన్ని గ్రహించడం అశక్యం కాదు గాన, సంనిధిని శ్రుతిచేత బాధించి అన్నింటినీ గ్రహించాలి అని అర్థం. 55

## సూ. మన్త్రాదివద్వాఽవిరోధః. 3.3.56

అథవా నైవాత్ర విరోధః శఙ్కితవ్యః, కథమన్యశాఖాగతేషూద్గీథాదిష్వన్యశాఖావిహితాః ప్రత్యయా భవేయురితి, మన్త్రాదివదవిరోధోపపత్తేః. తథాహి-మన్త్రాణాం కర్మణాం గుణానాం చ శాఖాన్తరోత్పన్నానామపి శాఖాన్తర ఉపసంగ్రహో దృశ్యతే. యేషామపి శాఖినాం "కుటరురసి "ఇత్యశ్మాదానమన్త్రో నామ్నాతస్తేషామప్యసౌ వినియోగో దృశ్యతే - "కుక్కుటోఽసీత్యశ్మానమాదత్తే కుటరురసీతి వా" ఇతి. యేషామపి చ సమిదాదయః ప్రయాజా నామ్నాతాస్తేషామపి తేషు గుణవిధిరామ్నాయతే - "ఋతవో వై ప్రయాజాః సమానత్ర హోతవ్యాః" ఇతి. తథా యేషామపి "అజోఽగ్నీషోమీయః" ఇతి జాతివిశేషోపదేశో నాస్తి తేషామపి తద్విషయో మన్త్రవర్ణ ఉపలభ్యతే - "ఛాగస్య వపాయా మేదసోఽను బ్రూహి"ఇతి. తథా వేదాన్తరోత్పన్నానామపి "అగ్నేర్వైర్హోత్రం వేరధ్వరమ్"

ఇత్యేవమాదిమన్త్రాణాం వేదాన్తరే పరిగ్రహో దృష్టః. తథా బహ్వృచపఠితస్య సూక్తస్య "యో జాత ఏవ ప్రథమో మనస్వాన్" (ఋవే. 2.6.7) ఇత్యస్య "అధ్వర్యవే నజనీయం శస్యమ్" ఇత్యత్ర పరిగ్రహో దృష్టః. తస్మాద్యథాశ్రయాణాం కర్మాఙ్గానాం సర్వత్రానువృత్తిః ఏవమాశ్రితానామపి ప్రత్యయానామిత్యవిరోధః 56

బాలానందిని

మన్త్రేతి:-" మన్త్రాదివద్వా = మంత్రాదులయందు వలె, అవిరోధః = విరోధం లేదు" అని సూత్రార్థం.

అథవేతి:- లేదా - ఒక శాఖలో ఉన్న ఉద్గీథాదులయందు మరొక శాఖలో విధించబడిన ప్రత్యయములు (భావనలు) ఎట్లు ఉంటాయి అని ఇక్కడ విరోధం శంకించతగినది కాదు. ఎందువల్లననగా - మంత్రాదులయందు వలె అవిరోధం కుదురుతుంది. అదెట్లనగా - ఒక శాఖలో ఉత్పన్నములైన (చెప్పబడిన) మంత్రాలను, కర్మలను, గుణాలను మరొక శాఖలో గ్రహించడం కనబడుచున్నది. ఏ శాఖవాళ్ళకు "కుటరురసి" ఇత్యాది అశ్మాదానమంత్రం చెప్పబడలేదో వాళ్ళకు కూడా ఈ వినియోగం - "కుక్కుటోఽసీత్యశ్మానమాదత్తే కుటరురసీతి వా" అని చెప్పబడినది.

వి. బియ్యం చూర్ణం చేసే ఱాయిని గ్రహించేటప్పుడు యజుర్వేదులకు కుక్కుటోఽసి అని మంత్రం ఉంది కాని "కుటరురసి" అనేది లేదు. అయినా కుక్కుటోఽసి అని గాని కుటరురసి అని గాని ఱాయిని గ్రహించాలి". అనే వాక్యంచేత వాళ్ళకు కూడా వికల్పంగా కుటరురసి అనే మంత్రం విధించబడింది.

అవ. సూత్రంలో ఆదిపదం ప్రయోగించడంచేత కర్మకు ఉదాహరణం చూపుతున్నారు-యేషామితి:- ఏ శాఖవాళ్ళకు సమిదాదిప్రయాజలు చెప్పబడలేదో వాళ్ళకు కూడా "ఋతవో వై ప్రయాజాః సమానత్ర హోతవ్యాః" (సమానమైన కర్మ ఉన్న చోట ఐదు ప్రయాజల హోమం చెయ్యాలి) అని (పంచత్వం) అనే గుణంతో కూడిన గుణులు (ప్రయాజలు) పఠించబడుచున్నాయి. (ఈ వాక్యాన్ని బట్టి ఈ ఐదు ప్రయాజలను చెప్పని మైత్రాయణీశాఖవాళ్ళకు కూడ ఈ వాక్యంచేత ఐదు ప్రయాజ లనే గుణులు విధించబడ్డాయి).

అట్లే అగ్నీషోమీయపశువు అజం (మేక) అని ఏ శాఖవాళ్ళకి చెప్పబడలేదో (అగ్నీషోమీయపశువు ఆలంభనం చెయ్యాలి అని మాత్రమే చెప్పబడిందో) అట్టి యజుః శాఖీయులకు కూడ ఆ పశువిశేషాన్ని చెప్పే "ఛాగస్య వపాయా మేదసోఽనుబ్రూహి" అనే మంత్రం కనబడుతున్నది. ఏ పశువో చెప్పకపోయినా ఈ ఛాగస్య ఇత్యాదిప్రైషమంత్రంచేత (ఫలానా దేవతకు ఫలానా హవిస్సు ఇస్తున్నామని చెప్పుము అనే మంత్రాలకి ప్రైషమంత్రాలని పేరు) ఆ పశువు మేక అనే విషయం తెలుస్తూన్నది. (ఇది గుణానికి ఉదాహరణం). అట్లే ఒక వేదంలో (సామవేదంలో) పఠించబడిన "అగ్నేర్వైర్హోత్రమ్" ఇత్యాది మంత్రాలను మరొక వేదంలో (యజుర్వేదంలో) తీసికొనడం కనబడుతున్నది. (ఇది మంత్రాలకు మరొక ఉదాహరణం). అట్లే బహ్వృచులు పఠించిన "యో జాత ఏవ ప్రథమో మనస్వాన్" అనే "మంత్రాన్ని "అధ్వర్యవే సజనీయం శస్యమ్" (సజనీయాన్ని అధ్వర్యువు పఠించాలి) అనే చోట గ్రహించడం కనబడుతుంది. (సజనాస ఇన్ద్రః అనే మాటలు చివర ఉన్న ఋక్కులతో కూడిన సూక్తానికి సజనీయసూక్తం అని పేరు. పై వాక్యంచేత ఋగ్వేదంలోని ఈ మంత్రాలు యజుర్వేదానికి సంబంధించిన అధ్వర్యువు పఠించా లని విధించబడింది గాన ఇది కూడా మంత్రాల కుదాహరణం). అందువల్ల ఆశ్రయాలైన కర్మాంగాలు అన్నిచోట్ల అనువర్తించి నట్లు, అంగాశ్రితాలైన ప్రత్యయాలకు అన్ని చోట్లా అనువృత్తి చెప్పాలి. 56

అంగావబద్ధాధికారాధికరణం సమాప్తం

### 32. భూమజ్యాయస్త్వాధికరణమ్ . సూ 57

### సూ. భూమ్నః క్రతువజ్జ్యాయస్త్వం తథా హి దర్శయతి 3.3.57

"ప్రాచీనశాల ఔపమన్యవః" (ఛా. ఉ. 5.11.1) ఇత్యస్యామాఖ్యాయికాయాం వ్యస్తస్య సమస్తస్య చ వైశ్వానరస్యోపాసనం శ్రూయతే. వ్యస్తోపాసనం తావత్ - "ఔపమన్యవ కం త్వమాత్మానముపాస్సే" ఇతి, "దివమేవ భగవో రాజన్నితి హోవాచ, ఏష వై సుతేజా ఆత్మా వైశ్వానరో యం త్వమాత్మానముపాస్సే" (ఛా.ఉ. 5.12.1) ఇత్యాది. తథా సమస్తోపాసనమపి "తస్య హ వా ఏతస్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజాశ్చక్షుర్విశ్వరూపః ప్రాణం పృథగ్వర్త్మాత్మా సందేహో బహులో

బస్తిరేవ రయిః పృథివ్యేవ పాదౌ" (ఛా. ఉ. 5-18-2) ఇత్యాది. తత్ర సంశయః కిమిహోభయథాప్యుపాసనం స్యాద్వ్యస్తస్య సమస్య చ, ఉత సమస్తస్యైవేతి. కిం తావత్ప్రాప్తమ్? ప్రత్యవయవం సుతేజః ప్రభృతిషు 'ఉపాస్సే' ఇతి క్రియాపదశ్రవణాత్ "తస్మాత్తవ సుతం ప్రసుతమాసుతం కులే దృశ్యతే" (ఛా. ఉ. 5.12.1) ఇత్యాది ఫలభేదశ్రవణాచ్చ వ్యస్తాన్యుపాసనాని స్యురితి ప్రాప్తమ్.

బాలానందిని

భూమ్న ఇతి:- "క్రతువత్ = క్రతువునకు వలె, భూమ్నః = సమస్తోపాసనకు, జ్యాయస్త్వమ్ = ఉత్తమత్వము. తథా=అట్లు, దర్శయతి హి = చూపుచున్నాడు కదా'' అని సూత్రార్థం.

ప్రాచీనేతి :- "ప్రాచీనశాల ఔపమన్యవః" అనే అఖ్యాయికలో వైశ్వానరుని వ్యస్తోపాసన సమస్తోసాపనా కూడ వినబడుచున్నది. (ద్యులోకం, ఆదిత్యుడు మొదలైనవాటిని ఒక్కొక్కదానిని వైశ్వానరుడుగా ఉపాసించడం వ్యస్తోపాసనం. ఇవన్నీ అవయవాలుగా ఉన్న అవయవిని ఉపాసించడం సమస్తోపాసనం). "ఔపమన్యవ . . . ఉపాస్సే" ఔపమన్యవా, నువ్వు దేనిని ఆత్మగా ఉపాసిస్తున్నావు?) అని, "దివమేవ . . . ఉపాస్సే" (పూజ్యుడవైన రాజా! నేను ద్యులోకాన్ని ఉపాసిస్తున్నాను. మంచి తేజస్సు గల ఇదియే ఆత్మయైన వైశ్వానరుడు. దేనిని నువ్వు ఆత్మగా ఉపాసిస్తున్నావో అదే ఇది) ఇత్యాదికం వ్యస్తోపాసనం. "తస్యహ . . . పాదౌ" ఇత్యాదికం సమస్తోపాసనం. ఇక్కడ వ్యస్తోపాసనా, సమస్తోపాసనా రెండూ చెయ్యాలా లేక ఒక్క సమస్తోపాసనం మాత్రమే చెయ్యాలా అని సంశయం. ఏమి ప్రాప్తించినది? ప్రతీ అవయవంలోను,సుతేస్సు మొదలైనవాటిలో 'ఉపాస్సే' అని క్రియాపదం వినబడుతున్నది. అట్లే తస్మాత్ దృశ్యతే అని వేరు వేరు ఫలాలు వినబడుతున్నాయి. అందుచేత వ్యస్తోపాసనలే చెయ్యాలి అని ప్రాప్తిస్తున్నది.

వి. సంనిధానమాత్రంచేత శ్రుతిసంకోచం యుక్తం కాదు అని వెనుకటి అధికరణంలో చెప్పబడింది. అట్లయితే సమస్తోపాసనాసంనిధిమాత్రంచేత వ్యస్తోపాసనలను కేవలం స్తావకా లని చెప్పకూడదు. అవి విధేయములే అని దృష్టాంతసంగతిచేత పూర్వపక్షం.

భాష్యమ్

**తతోఽభిధీయతే** - భూమ్నః, పదార్థోపచయాత్మకస్య సమస్తస్య వైశ్వానరోపాసనస్య జాయస్త్వం ప్రాధాన్యేనాస్మిన్ వాక్యే వివక్షితం భవితుమర్హతి, న ప్రత్యేకమవయవోపాసనానామపి, క్రతువత్. యథా క్రతుషు దర్శపూర్ణమాస ప్రభృతిషు సామస్త్యేన సాఙ్గప్రధానప్రయోగ ఏవైకో వివక్ష్యతే న వ్యస్తానామపి ప్రయోగః ప్రయాజాదీనామ్, నాప్యేకదేశాఙ్గయుక్తస్య ప్రధానస్య తద్వత్. కుత ఏతద్భూమైవ జ్యాయానితి? తథా హి శ్రుతిర్భూమ్నో జ్యాయస్త్వం దర్శయతి; ఏకవాక్యతావగమాత్. ఏకం హీదం వాక్యం వైశ్వానరవిద్యావిషయం పౌర్వాపర్యాలోచనాత్ ప్రతీయతే. తథా హి - ప్రాచీనశాలప్రభృతయః ఉద్దాలకావసానాః షడృషయః వైశ్వానరవిద్యాయాం పరినిష్ఠామప్రతిపద్యమానాః అశ్వపతిం కైకేయం రాజానమభ్యాజగ్ముః ఇత్యుపక్రమ్య ఏకైకస్యర్షేరుపాస్యం ద్యుప్రభృతీనామేకైకం శ్రావయిత్వా "మూర్ధా తే వ్యపతిష్యన్మా నాగమిష్యః" (ఛా. ఉ. 5.12.2) ఇత్యాదినా చ వ్యస్తోపాసనమపవదతి. పునశ్చ వ్యస్తోపాసనం వ్యావర్త్య, సమస్తోపాసనమేవానువర్త్య "స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మస్వన్నమత్తి" (ఛా. ఉ. 5.18.1) ఇతి భూమాశ్రయమేవ ఫలం దర్శయతి. యత్తు ప్రత్యేకం సుతేజఃప్రభృతిషు ఫలభేదశ్రవణం తదేవం సతి అఙ్గఫలాని ప్రధాన ఏవాభ్యుపగతానీతి ద్రష్టవ్యమ్. తథా ఉపాస్స ఇతి ప్రత్యవయవమాఖ్యాతశ్రవణం పరాభిప్రాయానువాదార్థం, న వ్యస్తోపాసన విధానార్థమ్. తస్మాత్సమస్తోపాసనపక్ష ఏవ శ్రేయానితి.

బాలానందిని

**తత్ ఇతి:-** ఇట్లు ప్రాప్తించగా చెప్పబడుచున్నది. భూమ్నః = పదార్థసము దాయాత్మకమైన సమస్తమైన వైశ్వానరోపాసనమునకు, జ్యాయస్త్వమ్ = గొప్పతనం, ప్రధానంగా ఈ వాక్యంలో చెప్పడానికి ఉద్దేశించబడిన దని చెప్పడం యుక్తం, అంతే కాని వేరు వేరుగా అవయవోపాసనలు వివక్షితములు కావు. క్రతువత్ = దర్శపూర్ణమాసాది క్రతువులలో పూర్తిగా సాంగమైన ప్రధానంయొక్క ఒక్క ప్రయోగమే ఏ విధంగా వివక్షితమో,

వ్యస్తములైన ప్రయాజాద్యంగాల ప్రయోగం మాత్రం కాని, ఏవో కొన్ని అంగాలతో కూడిన ప్రధానంయొక్క ప్రయోగం కాని వివక్షితం కాదో అట్లే ఇక్కడ కూడ. "భూమైవ జ్యాయాన్" అని ఎందుకు చెప్పబడుచున్నది? ఎందువల్ల ననగా - ఇక్కడ ఏకవాక్యత కనబడడంవల్ల శ్రుతి భూమకు జ్యాయస్త్వాన్ని చూపుచున్నది. పౌర్వాపర్యాన్ని ఆలోచించగా వైశ్వానరవిద్యకు సంబంధించిన ఈ వాక్యం ఒక్కటే అని తెలుస్తూన్నది. అదెట్లనగా - ప్రాచీనశాలుడు మొదలు, ఉద్దాలకుని వరకు ఉన్న అరుగురు ఋషులు వైశ్వానర విద్యలో పరినిష్ఠితత్వాన్ని పొందజాలక అశ్వపతి అనే రాజు దగ్గరికి వెళ్లారు అని ఉపక్రమించి ఒక్కొక్క ఋషి ద్యులోకం మొదలైన వాటిలో ఒక్కొక్కదానిని ఉపాసిస్తూన్నట్లు చెప్పి "మూర్ధాతే . . . నాగమిష్యః" (నువ్వు నాదగ్గరికి వచ్చి ఉండకపోతే నీ శిరస్సు పడిపోయి ఉండేది) ఇత్యాది వాక్యాలచేత వ్యస్తోపాసనను నిందిస్తాడు. మళ్లీ వ్యస్తోపాసనను నివర్తింపచేసి, సమస్తోపాసనాన్నే అనువర్తింపచేస్తూ "స సర్వేషు . . . అత్తి" అని భూమకే సంబంధించిన ఫలాన్ని చెపుతాడు. ఇది ఈ విధంగా ఉన్నప్పుడు - సుతేజఃప్రభృతులకు ప్రత్యేకంగా ఫలం చెప్పడం అనేది ఏది ఉందో అది అంగాలకి చెప్పిన ఫలాలు ప్రధానానికే చెందుతాయి అని అంగీకరించి నట్లు గ్రహించాలి. ప్రతీ అవయవం దగ్గర ఉపాస్సే అని క్రియాపదం ప్రయోగించడం కూడా పరుల అభిప్రాయాన్ని (వ్యస్తోపాసనలకు వేరు వేరు ఫలాలుంటాయి అనే ఇతరుల అభిప్రాయాన్ని) అనువదించడం మాత్రమే కాని వ్యస్తోపాసనలను విధించడం కోసం కాదు. అందువల్ల సమస్తోపాసనపక్షమే మంచిది.

### భాష్యమ్

కేచిత్త్వత్ర సమస్తోపాసనపక్షం జ్యాయాంసం ప్రతిష్ఠాప్య జ్యాయస్త్వవచనాదేవ కిల వ్యస్తోపాసనాపక్షమపి సూత్రకారోఽనుమన్యత ఇతి కథయన్తి. తదయుక్తమ్. ఏకవాక్యతావగతౌ సత్యాం వాక్యభేదకల్పనస్యాన్యాయ్యత్వాత్. "మూర్ధాతే వ్యపతిష్యత్" ఇతి చైవమాదినిన్దావచనవిరోధాత్. స్పష్టే చోపసంహారస్థే సమస్తోపాసనావగమే తదభావస్య పూర్వపక్షే వక్తుమశక్యత్వాత్. సౌత్రస్య చ జ్యాయస్త్వవచనస్య ప్రమాణవత్త్వాభిప్రాయేణాప్యుపపద్యమానత్వాత్. 57.

బాలానందిని

**కేచిదితి:-** కొందరైతే సమస్తోపాసనపక్షం అధికంగా ప్రశస్యం అని స్థాపించి జ్యాయస్త్వాన్ని చెప్పడంచేత సూత్రకారుడు వ్యస్తోపాసనపక్షాన్ని కూడ అంగీకరిస్తున్నాడు అని చెపుతున్నారు. అది యుక్తం కాదు. ఏకవాక్యత కనబడుతున్నప్పుడు వాక్యభేదాన్ని కల్పించడం అన్యాయం. ఇది "మూర్ధా తే వ్యపతిష్యత్" అనే వ్యస్తోపాసనానిందకు విరుద్ధంగా కూడ ఉంటుంది. ఉపసంహారవాక్యంలో సమస్తోపాసన స్పష్టంగా కనబడుతూండగా అది లేదని పూర్వపక్షంలో చెప్పడం యుక్తం కాదు. సూత్రంలో చెప్పిన జ్యాయస్త్వం (సమస్తోపాసనకు) తగిన ప్రమాణం ఉంది అని అభిప్రాయం చెపితే కూడ ఉపపన్నంగా ఉంటుంది. 57.

భూమజ్యాయస్త్వాధికరణం సమాప్తం

**33. శబ్దాదిభేదాధికరణమ్. సూ. 58**

**సూ. నానా శబ్దాదిభేదాత్. 3.3.58**

పూర్వస్మిన్నధికరణే సత్యామపి సుతేజఃప్రభృతీనాం ఫలభేదశ్రుతౌ సమస్తోపాసనం జ్యాయ ఇత్యుక్తమ్. అతః ప్రాప్తా బుద్ధిరన్యాన్యపి చ భిన్నశ్రుతీన్యుపాసనాని సమస్యోపాసిష్యన్త ఇతి. అపి చ నైవ వేద్యాభేదే విద్యాభేదో విజ్ఞాతుం శక్యతే. వేద్యం హి రూపం విద్యాయాః; ద్రవ్యదైవతమివ యాగస్య. వేద్యశ్చైక ఏవేశ్వరః శ్రుతినానాత్వేప్యవగమ్యతే. "మనోమయః ప్రాణశరీరః" (ఛా.ఉ. 3.14.2) "కం బ్రహ్మ ఖం బ్రహ్మ" (ఛా. ఉ. 4.10.5) "సత్యకామః సత్యసంకల్పః" (ఛా. ఉ. 4.3.3) ఇత్యేవమాదిషు. తథా ఏక ఏవ ప్రాణః "ప్రాణో వావ సంవర్గః ప్రాణో వావ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ" (ఛా. ఉ. 5.1.1) "ప్రాణో హ పితా ప్రాణో హ మాతా"(ఛా. ఉ. 7.15.1) ఇత్యేవమాదిషు. వేద్యైకత్వాచ్చ విద్యైకత్వం శ్రుతమ్. శ్రుతినానాత్వమప్యస్మిన్ పక్షే గుణాన్తరపరత్వాన్నానర్థకమ్ తస్మాత్స్వపదశాఖా విహితమేవ వేద్యవ్యపాశ్రయం గుణజాతముపసంహర్తవ్యం విద్యాకార్త్స్న్యాయేతి.

## బాలానందిని

**నానేతి:-** "శబ్దాదిభేదాత్ = శబ్దాదుల భేదంవల్ల, నానా = విద్యలు భిన్నములు" అని సూత్రార్థం.

**పూర్వస్మిన్నితి:-** సుతేజస్సు మొదలైన వాటిలో ఫలభేదం వినబడుతున్నా కూడ సమస్తోపాసనమే మంచిది అని వెనుకటి అధికరణంలో చెప్పబడింది. దీనిని పట్టి వేరు వేరు శ్రుతులు గల ఇతరమైన ఉపాసనలు కూడ కలిపి ఉపాసించబడతాయి అనే అభిప్రాయం కలుగుతుంది. (దీనిని పట్టి దృష్టాంతసంగతిచేత పూర్వపక్షం అని సూచింపబడినది). మరొక విషయమేమనగా యాగానికి ద్రవ్య-దేవతల వలె విద్యకు వేద్యమే రూపం. శ్రుతులు వేరు వేరుగా కనబడుతున్నా కూడ "మనోమయః ప్రాణశరీరః" "కం బ్రహ్మ ఖం బ్రహ్మ" "సత్యకామః సత్యసంకల్పః" ఇత్యాదులలో వేద్యుడైన ఈశ్వరుడు ఒక్కడే. అట్లే "ప్రాణో వా వ సంవర్గః ప్రాణో వా వ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ" "ప్రాణో హ పితా ప్రాణో మాతా" ఇత్యాదిశ్రుతులలో వేద్యమైన ప్రాణం ఒక్కటే. వేద్యం ఒక్కటైనప్పుడు విద్య కూడ ఒక్కటే అని వినబడినది (చెప్పబడినది). ఈ పక్షంలో వేరు వేరు గుణాలను చెప్పడమే అభిప్రాయం కాబట్టి శ్రుతులలో భేదం ఉన్నా అది వ్యర్థం కాదు. అందుచేత విద్యకు పరిపూర్ణత్వం రావాలంటే ఒకే వేద్యానికి సంబంధించిన, స్వపరశాఖలలో విధించబడిన గుణసముదాయాన్ని ఉపసంహరించాలి.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే ప్రతిపాద్యతే- నానేతి. వేద్యాభేదేఽప్యేవంజాతీయకా విద్యాభిన్నా భవితుమర్హతి. కుతః? శబ్దాదిభేదాత్. భవతి హి శబ్దభేదః వేద, ఉపాసీత, స క్రతుం కుర్వీత ఇత్యేవమాదిః. శబ్దభేదశ్చ కర్మభేదహేతుః సమధిగతః పురస్తాత్ - "శబ్దాన్తరే కర్మభేదః కృతానుబన్ధత్వాత్" ఇతి. ఆదిగ్రహణాద్గుణాదయోఽపి యథాసంభవం భేదహేతవో యోజయితవ్యాః. నను వేదేత్యాదిషు శబ్దభేద ఏవావగమ్యతే న యజతీత్యాదివత్ అర్థభేదః, సర్వేషామేవైషాం మనోవృత్త్యర్థత్వాభేదాత్, అర్థాన్తరాసంభవాచ్చ. తత్కథం శబ్దభేదాద్విద్యాభేద ఇతి? నైష దోషః. మనోవృత్త్యర్థత్వాభేదేఽప్యనుబన్ధభేదాద్వేద్యభేదే సతి విద్యాభేదోపపత్తేః.

ఏకస్యాపి హీశ్వరస్య ఉపాస్యస్య ప్రతిప్రకరణం వ్యావృత్తా గుణాః శిష్యన్తే తథైకస్యాపి ప్రాణస్య తత్ర తత్రోపాస్యాభేదేఽపి అన్యాదృగ్గుణోఽన్యత్రోపాసితవ్యః, అన్యాదృగ్గుణశ్చాన్యత్రేత్యనుబన్ధభేదే సతి విద్యాభేదో విజ్ఞాయతే. న చాత్రైకో విద్యావిధిరితరే గుణవిధయ ఇతి శక్యం వక్తుమ్. వినిగమనాయాం హేత్వభావాత్ అనేకత్వాచ్చ ప్రతిప్రకరణం గుణానాం ప్రాప్తవిద్యానువాదేన గుణవిధానానుపపత్తేః న చాస్మిన్ పక్షే సమానాః సన్తః సత్యకామాదయో గుణాః అసకృచ్ఛ్రావయితవ్యాః. ప్రతిప్రకరణం చేదం కామేనేదముపాసితవ్యమ్; ఇదంకామేన చ ఇదమితి నైరాకాఙ్క్ష్యావగమాత్ నైకవాక్యతాపత్తిః. న చాత్ర వైశ్వానరవిద్యాయామివ సమస్తచోదనాపరాస్తి యద్బలేన ప్రతిప్రకరణవర్తీన్యవయవోపాసనాని భూత్వా ఏకవాక్యతామీయుః. వేద్యైకత్వనిమిత్తే చ విద్యైకత్వే సర్వత్ర నిరఙ్కుశే ప్రతిజ్ఞాయమానే సమస్తగుణోపసంహారోఽశక్యః ప్రతిజ్ఞాయేత. తస్మాత్సుష్ఠూచ్యతే నానా శబ్దాది భేదాత్ ఇతి. స్థితే చైతస్మిన్నధికరణే సర్వవేదాన్త ప్రత్యయమ్ ఇత్యాది ద్రష్టవ్యమ్. 58

బాలానందిని

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా నానా అని (వేరు వేరు అని) ప్రతిపాదించబడుచున్నది. వేద్యం అభిన్నం అయినా కూడ ఈ విధమైన విద్య భిన్నమైనది అవడమే యుక్తం. ఎందువల్ల ? శబ్దాధిభేదంవల్ల. వేద, ఉపాసీత, "స క్ర తుం కుర్వీత" ఈ మొదలైన శబ్దభేదం ఉన్నది కదా? పూర్వం (పూర్వమీమాంసాగ్రంథంలో) "శబ్దాన్తరే . . . అనుబన్ధత్వాత్" అనే సూత్రంలో శబ్దభేదం కర్మభేదానికి హేతువుగా తెలియబడినది. సూత్రంలో శబ్దాది అని ఆదిశబ్దం చేర్చడంవల్ల యథాసంభవంగా భేదహేతువులైన గుణాదులను కూడా చేర్చాలి. (అనగా శబ్దభేదం, గుణభేదం మొదలైనవాటివల్ల అని అర్థం).

వి. విధివాక్యాలలో యజతి, దదాతి, జుహోతి ఇత్యాదిపదాలు ఉపయోగించబడు తున్నాయి. దేవతను ఉద్దేశించి ద్రవ్యాన్ని త్యజించడం యాగం. తన సొత్తును ఇతరుల సొత్తునుగా చేయడం దానం. ప్రక్షేపం (అగ్నిలో పడవేయడం) అధికంగా ఉన్న యాగం

హోమం. యాగాద్యవచ్ఛిన్నమైన, కర్మ అనే మరొక పేరు గల భావన వీటి అన్నింటిలోను ఒక్కటా వేరా అని సందేహం. వేరు వేరు అర్థాలున్న ధాతువులు వేరు వేరుగా ఉండడంచేత, ఆ అర్థాలతో కృతానుబంధమైన (ఏర్పడిన సంబంధం గల) కర్మ (భావన) వేరే అని ఈ సూత్రానికి అర్థం. అందుచేత ఇక్కడ కూడ శబ్దభేదం ఉండడంచేత ఉపాసనాభేదమే అని భావం.

నన్వితి:- (ప్రశ్న) వేద ఇత్యాదులలో శబ్దభేదమే కనబడుచున్నది గాని యజతీత్యాదులలో వలె అర్థభేదం ఏదీ లేదు కదా? ఈ పదా లన్నింటికీ మనోవృత్తి అనియే కదా అర్థం? మరొక అర్థం ఏదీ కుదరదు కూడా. అలాంటప్పుడు శబ్దభేదంవల్ల విద్యాభేదం అని చెప్పడం ఎలా కుదురుతుంది? (సమాధానం) ఈ దోషం లేదు. మనోవృత్తి అనే అర్థంలో భేదం లేకపోయినా అనుబంధాల (కూడా చెప్పబడినవాటి) భేదాన్ని బట్టి వేద్యం భిన్నం అవుతుంది గాన విద్యాభేదం ఉపపన్నమే. ఉపాసింపదగిన ఈశ్వరుడు ఒక్కడే అయినా ప్రతీ ప్రకరణంలోను వేరు వేరైన గుణాలు చెప్పబడుచున్నాయి. అట్లే అక్క డక్కడ ఉపాస్యమైన ప్రాణం ఒక్కటే అయినా, భేదం లేకపోయినా, ఒకచోట ఒక విధమైన గుణం ఉపాసించాలి, మరొక చోట మరొక విధమైన గుణం ఉపాసించాలి గాన అనుబంధాల (ప్రాణాలతో పాటు చెప్పిన గుణాల) బేదాన్ని పట్టి వేద్యం భిన్నం అవడంచేత విద్యాభేదం తెలియబడుతుంది. ఇక్కడ ఒక విధి విద్యావిధి; మిగిలిన వన్నీ గుణవిధులు అని చెప్పడానికి శక్యం కాదు. ఏది విద్యావిధి ఏది గుణవిధి అని నిర్ణయించడానికి తగిన ఆధారం ఏదీ లేదు కదా? ప్రతీ ప్రకరణంలోను అనేకములైన గుణాలుండడంచేత, ప్రాప్తమైన ఒక విద్యను అనువదించి గుణాలను విధించడం ఉపపన్నం కాదు. (వాక్యభేదదోషం కలుగుతుంది అని భావం) మరొక విషయ మేమనగా - ఈ పక్షంలో సమానములే అయిన సత్యకామాదిగుణాలను అనేక పర్యాయాలు చెప్పకూడదు. (ఒకచోట ఒకసారి చెప్పినవే అన్ని చోట్ల గ్రహించబడతాయి గాన రెండు మూడు చోట్ల చెప్పడం అవసరం లేదు). ఏ ప్రకరణానికి ఆ ప్రకరణంలో ఈ కోరిక గలవాడు ఇది ఉపాసించాలి, ఆ కోరిక గలవాడు అది ఉపాసించాలి అని చెప్పివేసిన తరువాత ఆకాంక్ష ఉండదు గాన (ఈ ఉపాసన ఎందుకు చెయ్యాలి, అదెందుకు చెయ్యాలి అనే ప్రశ్న ఉండదు గాన, ( ఏ వాక్యనికి ఆ వాక్యమే సంపూర్ణం గాన) ఏకవాక్యత కూడా (విభిన్న వాక్యాలకు

పరస్పరసంబంధరూపమైన ఏకవాక్యత) ఉండదు. వైశ్వానరవిద్యలో వలె ఇక్కడ మరొక సమస్తవిద్యావిధి ఉండి ఉంటే దాని బలంచేత ప్రతిప్రకరణంలోను ఉన్నవి (ఆ సమస్తవిద్యకు) అవయవోపాసనలుగా అయినదానితో ఏకవాక్యత్వం పొందడానికి అవకాశం ఉండేది, కాని అలాంటి సమస్తచోదన ఏదీ లేదు. వేద్యైకత్వం ఉంటే విద్యైకత్వమే అని అంతటా నిరంకుశంగా ఒక నియమం అంగీకరిస్తే శక్యం కాని సమస్త గుణోపసంహారం చెయ్యాలని చెప్పినట్లవుతుంది. (అనగా వేద్యైకత్వం ఉన్నంతమాత్రంచేత ఎక్కడెక్కడ ఆ గుణాలున్నా వాటి ఉపసంహారం చెయ్యా లని చెపితే అది అశక్యమైన పని). అందుచేత నానా శబ్దాదిభేదాత్ అని యుక్తియుక్తంగానే చెప్పబడింది.

స్థితే చేతి:- ఈ అధికరణం ఉంటూండగా సర్వవేదాన్తప్రత్యయమ్ ఇత్యాదికాన్ని సమన్వయించుకొనాలి అని ఈ వాక్యానికి అర్థం. రత్నప్రభలో దీనికి అవతారిక ఈ విధంగా ఇచ్చి భావం విశదీకరించబడింది. అవతారిక-"విద్యల నానాత్వం సిద్ధించిన తరువాత దహరాదివిద్య ప్రతీ వేదాంతంలోనూ ఒక్కటేనా లేక అనేకమా అనే చింత యుక్తంగా ఉంటుంది. ముందుగానే ఆ చింత ఎందుకు చేయబడింది. అని ఆశంకంచుకొని స్థితే చ అని చెపుతున్నాడు. విద్యానానాత్వాధికరణం నిజానికి పాదప్రారంభంలోనే యుక్తంగా ఉంటుంది. ఇక్కడ ప్రాసంగికం అని భావం."

బ్రహ్మవిద్యాభరణంలో ఈ విధంగా చెప్పబడింది - ప్రతీ ప్రకరణంలోను విద్యాభేదం అని చెప్పిన ట్లయితే శాఖాభేదంచేత భేదం ఉన్నా కూడ విద్యకు అభేదమే అని సర్వవేదాన్త ప్రత్యయాధికరణంలో చెప్పినదానికి ఇది విరుద్ధం కదా అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు-

స్థితే చేతి:- "ఇక్కడ చెప్పిన రీతిలో ఉపాసనలకు భేదం సిద్ధిస్తూండగానే ఎక్కడైతే చోదనాదులలో భేదం లేకపోవడంచేత ప్రత్యభిజ్ఞానం ఉంటుందో అక్కడ విద్యలకు అభేదమే అని భావం". ఈ అధికరణంలో చెప్పిన న్యాయం పూర్తిగా పట్టిన చోట విద్యాభేదమే. ఇది సామాన్య శాస్త్రం వంటిది. ఏవైన ఇతరవిశేషాలుంటే మాత్రం అక్కడ సర్వవేదాంతప్రత్యయాధికరణాదులలో చెప్పిన న్యాయాలు ప్రవర్తిస్తాయి. అవి దీనికి అపవాదాలు అని ఈ వాక్యనికి భావం అని ఈ ఇద్దరి వ్యాఖ్యాతల అభిప్రాయం.

శబ్దాదిభేదాదికరణం సమాప్తం

## 34. వికల్పాధికరణమ్ . సూ. 59

### సూ. వికల్పోఽవిశిష్టఫలత్వాత్. 3.3.59

స్థితే విద్యాభేదే విచార్యతే-కిమాసామిచ్ఛయా సముచ్చయో వికల్పో వా స్యాత్ అథవా వికల్ప ఏవ నియమేనేతి. తత్ర స్థితత్వాద్విద్యాభేదస్య న సముచ్చయనియమే కించిత్కారణమస్తి. నను భిన్నానామప్యగ్నిహోత్రదర్శ పూర్ణమాసాదీనాం సముచ్చయనియమో దృశ్యతే? నైష దోషః. నిత్యతాశ్రుతిర్హి తత్ర కారణమ్. నైవ విద్యానాం క్వచిన్నిత్యతాశ్రుతిరస్తి. తస్మాన్న సముచ్చయ నియమః. నాపి వికల్పనియమః, విద్యాన్తరాధికృతస్య విద్యాన్తరాప్రతిషేధాత్. పారిశేష్యాద్యాథాకామ్యమాపద్యతే. నన్వవిశిష్ట ఫలత్వాదాసాం వికల్పో న్యాయ్యః. తథాహి - "మనోమయః ప్రాణశరీరః." (ఛా. ఉ. 8.1.5)" కం బ్రహ్మ ఖం బ్రహ్మ "(ఛా.ఉ. 4.10.5)" సత్యకామః సత్యసంకల్పః" (ఛా.ఉ.8.1.5.) ఇత్యాద్యా స్తుల్యవదీశ్వరప్రాప్తిఫలా లక్ష్యన్తే. నైష దోషః. సమానఫలేష్వపి స్వర్గాదిసాధనేషు కర్మసు యాథాకామ్యదర్శనాత్. తస్మాద్యాథాకామ్యప్రాప్తావుచ్యతే - వికల్ప ఏతాసాం భవితుమర్హతి, న సముచ్చయః. కస్మాత్? అవిశిష్టఫలత్వాత్. అవిశిష్టం హ్యేసాం ఫలముపాస్య విషయసాక్షాత్కరణమ్. ఏకేన చోపాసనేన సాక్షాత్కృత ఉపాస్యే విషయ ఈశ్వరాదౌ ద్వితీయమనర్థకమ్. అపి చాసంభవ ఏవ సాక్షాత్కరణస్య సముచ్చయపక్షే, చిత్తవిక్షేపహేతుత్వాత్. సాక్షాత్కరణసాధ్యం చ విద్యాఫలం దర్శయన్తి శ్రుతయః "యస్య స్యాదద్ధా న విచికిత్సాస్తి" (ఛా. ఉ. 3.14.4) ఇతి, "దేవో భూత్వా దేవానప్యేతి" (బృ. ఉ. 4.1.2) ఇతి చైవమాద్యాః. స్మృతయశ్చ "సదా తద్భావభావితః" (భ.గీ. 8.6) ఇత్యేవమాద్యాః. తస్మాదవిశిష్ట ఫలానాం విద్యానామన్యతమామాదాయ తత్పరః స్యాద్యావదుపాస్య విషయసాక్షాత్కరణేన తత్ఫలం ప్రాప్తమ్ ఇతి. 59

బాలానందిని

వికల్పఇతి:- "అవిశిష్టఫలత్వాత్ = భేదం లేని ఫలం కల వగుటవలన, వికల్పః - అలాంటి విద్యలకు వికల్పమే" అని సూత్రార్థం.

స్థితే ఇతి:- (ఈ విధంగా) విద్యాభేదం ఉంటూండగా వీటికి ఇచ్ఛానుసారం సముచ్చయమా, వికల్పమా, లేదా నియమంచేత వికల్పమేనా అని విచారించబడుచున్నది.
నను విద్యాభేదం ఉండడంవల్ల (నిశ్చితమై ఉండడంవల్ల) భిన్నములే అయినా వాటి విషయంలో సముచ్చయనియమం (అవన్నీ తప్పక చెయ్యాలి అనే నియమం) కనబడుచున్నది కదా? (సమాధానం) ఇది దోషం కాదు. అక్కడ నిత్యతాశ్రుతి ఏదీ లేదు. అందుచేత సముచ్చయ నియమం లేదు. వికల్పనియమం కూడా లేదు. ఒక విద్యలో అధికారం ఉన్నవానికి మరొక విద్యలో అధికారం నిషేధించబడలేదు కదా? ఇంక పారిశేష్యం చేత (పరిశేషన్యాయం చేత) యాథాకామ్యం (ఇష్టం ప్రకారం చేయవచ్చు నని) ప్రాప్తిస్తుంది. (ప్రశ్న) వీటి ఫలంలో భేదం లేదు గాన వికల్పమే న్యాయ్యం కదా? ఎందువల్ల ననగా "మనోమయః ప్రాణ శరీరః," "కం బ్రహ్మ ఖం బ్రహ్మ" "సత్యకామః సత్యసంకల్పః" ఈ మొదలైన విద్యలకు ఈశ్వరప్రాప్తియే ఫలం అని కనబడుతున్నది. (సమాధానం) ఇది దోషం కాదు. స్వర్గాదులకు సాధనాలైన కర్మలు సమానఫలాలైనా కూడ వాటి విషయంలో యాథాకామ్యం కనబడుతున్నది. అందువల్ల యాథాకామ్యం ప్రాప్తిస్తూండగా చెప్పబడుచున్నది. ఈ విద్యలకు వికల్పమే యుక్తం కాని సముచ్చయం కాదు. ఎందువల్ల? అవిశిష్టఫలత్వం వల్ల. ఉపాసింప దగిన విషయాన్ని సాక్షాత్కరించుకొనడం అనే వీటి ఫలంలో భేదం లేదు. ఒక ఉపాసనచేత, ఉపాసింపదగిన ఈశ్వరుడు మొదలైన విషయాన్ని సాక్షాత్కరించుకొన్న తరువాత రెండవ ఉపాసన వ్యర్థం అవుతుంది. మరొక విషయమేమనగా సముచ్చయపక్షంలో అది చిత్తవిక్షేపానికి హేతువు గాన (ఒక ఉపాసనలో చిత్తాన్ని ఏకాగ్రం చేయడం కుదరదు గాన) సాక్షాత్కారం అసంభవమే అవుతుంది. "యస్య స్యాదద్ధా న విచికిత్సాస్తి" (ఎవనికి నేను ఈశ్వరుడను అను సాక్షాత్కారం కలుగుతుందో, నేను ఈశ్వరుడను ఔనా కాదా అను సందేహం ఉండదో, వానికే ఐశ్వర్యం లభిస్తుంది అని అర్థం) "దేవో భూత్వా దేవానప్యేతి"(జీవించి ఉండగానే భావనచేత దేవత్వాన్ని పొంది మరణానంతరం దేవతలను పొందుతాడు అని అర్థం) ఇత్యాదిశ్రుతులు ఉపాస్యదేవతాసాక్షాత్కారం చేతనే విద్యాఫలం

సాధ్యం అని చెపుతున్నాయి. "సదా తద్భావభావితః" ఇత్యాదిస్మృతులు కూడా ఈ విషయమే చెపుతున్నాయి. ("ఏ యే భావాన్ని స్మరిస్తూ చివర దేహం విడిచిపెడతాడో, ఎల్లప్పుడు ఆ భావంతోనే కూడిన చిత్తం గల అతడు దానినే పొందుతాడు" అని మొత్తం భగవద్గీతా శ్లోకానికి భావం). అందువల్ల ఫలంలో భేదం లేని విద్యలలో ఏదో ఒకదాన్ని తీసికొనిఉపాస్యమైన విషయాన్ని సాక్షాత్కరించుకొనడంచేత దాని పలం పొందేవరకు తత్పరుడై ఉండాలి. (ఈ విధంగా ఈ అధికరణంలో ఉపాస్యసాక్షాత్కారం ద్వారా ఫలాన్ని ఇచ్చే అహంగ్రహోపాసనలలో వికల్పం ఉంటుం దని ప్రతిపాదించబడింది). 59

వికల్పాధికరణం సమాప్తం

35. కామ్యాధికరణమ్. సూ. 60

సూ. కామ్యాసు యథాకామం సముచ్చీయేరన్న వా పూర్వహేత్వభావాత్. 3.3.60

అవిశిష్టఫలత్వాదిత్యస్య ప్రత్యుదాహరణమ్. యాసు పునః కామ్యాసు విద్యాసు "స య ఏతమేవ వాయుం దిశాం వత్సం వేద న పుత్రరోదం రోదితి" (ఛా. ఉ. 3.15.2) "స యో నామ బ్రహ్మేత్యుపాస్తే యావన్నామ్నో గతం తత్రాస్య యథాకామచారో భవతి" (ఛా. ఉ. 7.1.5) ఇతి చైవమాద్యాసు క్రియావదదృష్టేనాత్మనా ఆత్మీయం తత్తత్ ఫలం సాధయన్తీషు సాక్షాత్కరణాపేక్షా నాస్తి, తా యథాకామం సముచ్చీయేరన్, న వా సముచ్చీయేరన్ పూర్వహేత్వభావాత్. పూర్వస్యావిశిష్టఫలత్వాదిత్యస్య వికల్పహేతోరభావాత్ . 60

బాలానందిని

కామ్య ఇతి:- "కామ్యాస్తు = కామ్యోపాసనలైతే, పూర్వహేత్వభావాత్ = వెనుక చెప్పిన హేతువు లేకపోవడంవల్ల, యథాకామమ్ = యథేష్టంగా, సముచ్చీయేరన్ = సముచ్చయం చేయబడతాయి, న వా = చేయబడకపోవచ్చును" అని సూత్రార్థం.

అవిశిష్టేతి:- ఇది "అవిశిష్టఫలత్వాత్" అనే దానికి ప్రత్యుదాహరణం. "స య . . . రోదితి" (ఎవడైతే వాయువును, అంగాలు కల్పించబడిన దిక్కుల వత్సనుగా

ఉపాసిస్తాడో అతడు పుత్రమరణనిమిత్త మైన రోదనం చెయ్యడు), "స యో నామ . . భవతి" ఎవడైతే నామమును బ్రహ్మగా ఉపాసిస్తాడో అతడు పేరు ఎంతవరకు పెడుతుందో అంతవరకు, యథాకామచారుడు (ఇష్టం వచ్చిన ప్రకారం సంచరించగలిగినవాడు అవుతాడు) మొదలైన, క్రియల వలె అదృష్టమైన స్వరూపంతో (పైకి కనబడకుండా) ఆ యా ఫలాలను సాధించే ఏ కామ్యవిద్యలలో సాక్షాత్కరణాపేక్ష ఉండదో వాటిని యథేచ్ఛగా సముచ్చయం చేయవచ్చు లేదా చేయకపోవచ్చును, ఎందువల్ల ననగా వెనుక చెప్పిన హేతువు లేదు, అనగా వెనుక చెప్పిన అవిశిష్టఫలత్వాత్ అనే వికల్పహేతువు లేదు. 60

కామ్యాధికరణం సమాప్తం

## 36. యథాశ్రయభావాధికరణమ్. సూ. 61-66

### సూ. అఙ్గేషు యథాశ్రయభావః. 3.3.61

కర్మాఙ్గేషూద్గీథాదిషు య ఆశ్రితాః ప్రత్యయా వేదత్రయవిహితాః కిం తే సముచ్చీయేరన్ కిం వా యథాకామం స్యురితి సంశయే యథాశ్రయభావ ఇత్యాహ. యథైవైషామాశ్రయాః స్తోత్రాదయః సంభూయ భవన్త్యేవం ప్రత్యయా అపి; ఆశ్రయతన్త్రత్వాత్ ప్రత్యయానామ్. 61

బాలానందిని

అఙ్గేష్వితి:- "అఙ్గేషు = కర్మాంగములయందు, యథాశ్రయభావః = వాటి ఆశ్రయాలను అనుసరించి కలిసి ఉండుట" అని సూత్రార్థం.

కర్మేతి:- కర్మాంగాలైన ఉద్గీథాదులయందు వాటిని ఆశ్రయించి ఉన్న వేదత్రయవిహితాలైన ప్రత్యయాలు (భావనలు) సముచ్చితము లవుతాయా లేక ఇష్టం వచ్చినట్లు చేయబడతాయా అని సందేహం కలగగా యథాశ్రయభావః అని చెబుతున్నాడు. వీటికి ఆశ్రయాలైన స్తోత్రాదులు ఏ విధంగా కలిసి జరుగుతాయో అట్లే ప్రత్యయాలు కూడా చేయబడతాయి. ఎందువల్ల ననగా ప్రత్యయాలు ఆశ్రయాలమీద ఆధారపడి ఉంటాయి. 61

## సూ. శిష్టేశ్చ. 3.3.62

యథా చాశ్రయాః స్తోత్రాదయస్త్రిషు శిష్యన్తే ఏవమాశ్రితా అపి ప్రత్యయాః. నోపదేశకృతోఽపి కశ్చిద్విశేషోఽఙ్గానాం తదాశ్రయాణాం చ ప్రత్యయానా మిత్యర్థః.62

బాలానందిని

శిష్టేరితి:- "శిష్టేశ్చ విధానంవల్ల కూడా ప్రత్యయాలు సముచ్చితము లవుతాయి" అని సూత్రార్థం .

యథేతి:- ఆశ్రయాలైన స్తోత్రాదులు మూడు వేదాలలోను ఏ విధంగా విధించబడ్డాయో, వాటిని ఆశ్రయించిన ప్రత్యయాలు కూడ ఆ విధంగానే విధించబడ్డాయి. అంగాలకు, వాటిని ఆశ్రయించిన ప్రత్యయాలకు ఉపదేశాన్ని పట్టి కూడా విశేషం ఏదీ లేదని అర్థం. 62

## సూ. సమాహారాత్. 3.3.63

"హోతృషదనాద్ధైవాపి దురుద్గీథమనుసమాహరతి" (ఛా.ఉ. 1.5.5) ఇతి చ ప్రణవోద్గీథైకత్వవిజ్ఞానమాహాత్మ్యాదుద్గాతా స్వకర్మణ్యుత్పన్నం క్షతం హౌత్రాత్కర్మణః ప్రతిసమాదధాతీతి బ్రువన్ వేదాన్తరోదితస్య ప్రత్యయస్య వేదాన్తరోదితపదార్థసంబన్ధసామాన్యాత్ సర్వవేదోదితప్రత్యయోపసంహారం సూచయతీతి లిఙ్గమ్. 63

బాలానందిని

సమాహారాదితి:- "సమాహారాత్ = సరిచేయడంవల్ల కూడా వేరు వేరు వేదాలు ఉన్న విద్యలకు సముచ్చయం అని అర్థం.

హోతృషదనాదితి:- "హోతృషదనాత్..సమాహరతి" (హౌత్రకర్మచేత ఉద్గీథంలోని లోపాలను సరి చేస్తాడు) అని ప్రణవోద్గీథాల ఏకత్వంయొక్క విజ్ఞానంయొక్క మహాత్మ్యం వల్ల ఉద్గాత తన కర్మలో కలిగిన లోపాన్ని హౌత్రకర్మచేత సరిదిద్దుకుంటాడు అని చెపుతూ

ఒక వేదంలో చెప్పబడిన ప్రత్యయానికి మరొక వేదంలో చెప్పిన పదార్థసంబంధంయొక్క సామ్యంవల్ల సకల వేదాలలో చెప్పబడిన ప్రత్యయాల ఉపసంహారాన్ని సూచిస్తున్నాడు గాన ఇది ఒక లింగం

వి. ఋగ్వేదంలో చెప్పబడిన ప్రణవమూ సామవేదంలో చెప్పబడిన ఉద్గీథమూ ఒక్కటే అని ఛాందోగ్యోపనిషత్తులో "య ఉద్గీథః స ప్రణవః యః ప్రణవః స ఉద్గీథః" అని చెప్పబడింది. దీనిచేత ఉద్గీథావయవమైన ప్రణవాన్నీ, హౌత్రప్రణవాన్నీ అభిన్నములుగా ఉద్గాత అనుసంధానం చెయ్యాలని విధించబడుచున్నది. ఇలా చేసినందుకు ఫలం ఏమనగా ఉద్గీథంలో అంగలోపాదులచేత ఏవైనా దోషాలున్నా, నిర్దుష్టంగా చేసిన హౌత్ర కర్మచేత సరిదిద్దుకొనవచ్చును అని హోతృషదనాత్ ఇత్యాదివాక్యం చెపుతూన్నది. (ఈ వాక్యంలో దురుద్గీథమ్ కు బదులు దురుద్గీతమ్ అని పఠించి బ్రహ్మవిద్యాభరణకారుడు లోపం ఉన్న ఉద్గాతృకర్మను అని అర్థం చెప్పాడు). దీనిని పట్టి సామవేదంలో విధించబడిన ఈ ఉపాసనకు హోతృవేదం (ఋగ్వేదం)లోని ప్రణవంతో సంబంధం నియతమైనది (తప్పనిసరి యైనది) అని చెప్పాలి. ఈ విధంగా రెండు వేదాలలోను చెప్పబడిన అంగాశ్రితో పాసనలకు సముచ్చయం చెయ్యాలి అని సూచింపబడుచున్నది. ఇది సముచ్చయానికి లింగం. 63

## సూ. గుణసాధారణ్యశ్రుతేశ్చ. 3.3.64

విద్యాగుణం చ విద్యాశ్రయం సన్తమోంకారం వేదత్రయసాధారణం శ్రావయతి "తేనేయం త్రయీ విద్యా వర్తతే, ఓమిత్యాశ్రావయత్యోమితి శంసత్యోమిత్యుద్గాయతి"(ఛా. ఉ. 1.1.9) ఇతి చ. తతశ్చ ఆశ్రయసాధారణ్యాదాశ్రిత సాధారణ్యమితి లిఙ్గదర్శనమేవ. అథవా - గుణసాధారణ్యశ్రుతేశ్చేతి- యదీమే కర్మగుణా ఉద్గీథాదయః సర్వే ప్రయోగసాధారణా న స్యుర్న స్యాత్తతః తదాశ్రయాణాం ప్రత్యయానాం సహభావః. తే తూద్గీథాదయః సర్వాఙ్గగ్రాహిణా ప్రయోగవచనేన సర్వే సర్వప్రయోగసాధారణాః శ్రావ్యన్తే, తతశ్చాశ్రయసహభావాత్ ప్రత్యయసహభావ ఇతి.64

బాలానందిని

గుణేతి:- "గుణసాధారణ్యశ్రుతేశ్చ=గుణం సాధారణ మని వినబడడంవల్ల కూడ సముచ్చయం అంగీకరించాలి" అని సూత్రార్థం.

విద్యేతి:- విద్యాగుణము, విద్యాశ్రయమూ అయిన ఓంకారం సర్వవేదాలకు సాధారణమైనది అని "తేనేయం . . . ఉద్గాయతి" (వేదత్రయం (వేదత్రయోక్తమైన కర్మ) ఓంకారంతోనే ప్రవర్తిస్తున్నది. ఓమ్ అని ఆశ్రావణం చేస్తాడు, ఓమ్ అని శస్త్రం పఠిస్తాడు. ఓమ్ అని ఉద్గానం చేస్తాడు) అనే వాక్యం చెప్పుచున్నది. అందుచేత ఆశ్రయమైన ధ్యేయమైన ఓంకారం (అన్ని వేదాలకీ) సాధారణం గాన దానిని ఆశ్రయించిన ధ్యానాలు కూడా సాధారణములే. ఇది సముచ్చయానికి లింగం. లేదా గుణసాధారణ్యశ్రుతేశ్చ - ఉద్గీథం మొదలైన కర్మగుణా లన్నీ అన్ని ప్రయోగాలలోను సాధారణాలు కాకపోతే అప్పుడు వాటిని ఆశ్రయించిన ప్రత్యయాలు సముచ్చితాలు కాకపోయేవి. ఆ ఉద్గీథాదులు అన్నీ సర్వాంగాలనూ గ్రహించే ప్రయోగవాక్యంచేత సర్వప్రయోగాలలోను సాధారణాలుగా వినబడుతున్నాయి. అందువల్ల ఆశ్రయాలకు సముచ్చయం ఉండడంవల్ల వాటిని ఆశ్రయించిన ఉపాసనలకు కూడా సముచ్చయం అని అర్థం. 64

సూ. న వా తత్సహభావాశ్రుతేః. 3.3.65

న వేతి పక్షవ్యావర్తనమ్. న యథాశ్రయభావ ఆశ్రితానాముపాసనానాం భవితుమర్హతి. కుతః? తత్సహభావాశ్రుతేః. యథా హి త్రివేదీవిహితానామఙ్గానాం స్తోత్రాదీనాం సహభావః శ్రూయతే "గ్రహం వా గృహీత్వా చమసం వోన్నీయ స్తోత్రముపాకరోతి, స్తోత్రమనుశంసతి, ప్రస్తోతః సామ గాయ, హోతరేతద్యజ" ఇత్యాదినా నైవముపాసనానాం సహభావశ్రుతిరస్తి. నను ప్రయోగవచన ఏవాసాం సహభావం ప్రాపయేత్? నేతి బ్రూమః. పురుషార్థత్వాదుపాసనానామ్. ప్రయోగవచనో హి క్రత్వర్థానాముద్గీథాదీనాం సహభావం ప్రాపయేత్. ఉద్గీథాద్యుపాసనాని క్రత్వర్థాశ్రయాణ్యపి గోదోహనాదివత్ పురుషార్థానీత్యవోచామ -"పృథగ్ఘ్యప్రతిబన్ధః ఫలమ్" (బ్ర. సూ. 3.3.42) ఇత్యత్ర. అయమేవ చోపదేశాశ్రయో

విశేషోఽఙ్గానాం తదాలమ్బనానాం చోపాసనానాం యదేకేషాం క్రత్వర్థత్వమేకేషాం పురుషార్థత్వమితి. పరం చ లిఙ్గద్వయమకారణముపాసనసహభావస్య, శ్రుతి న్యాయాభావాత్. న చ ప్రతిప్రయోగ మాశ్రయకార్త్స్న్యోపసంహారాదాశ్రితానామపి తథాత్వం విజ్ఞాతుం శక్యమ్, అతత్ప్రయుక్తత్వాదుపాసనానామ్. ఆశ్రయతన్త్రాణ్యపి హ్యుపాసనాని కామమాశ్రయాభావే మా భూవన్, న త్వాశ్రయసహభావే సహభావనియమమర్హన్తి, తత్సహభావాశ్రుతేరేవ. తస్మాద్యథాకామమేవో పాసనాన్యనుష్ఠీయేరన్. 65

బాలానందిని

న వేతి:- (ఇది సిద్ధాంత సూత్రం) "సహభావాశ్రుతేః=అన్నీ కలిసి ఉండాలి అని వినబడకపోవడంవల్ల, న వా = ఉపాసనకు సముచ్చయం లేదు" అని సూత్రార్థం.

నవేతీతి:- న వా అని పూర్వపక్షనిరాకరణం - ఆశ్రయించి ఉన్న ఉపాసనలు వాటి ఆశ్రయములు ఏ విధంగా కలిసి ఉంటాయో అలా కలిసి ఉండడం ఉండదు - ఎందువల్ల? వాటికి సహభావం (కలిసి ఉండడం) వినబడకపోవడంవల్ల. మూడు వేదాలలో చెప్పబడిన స్తోత్రాద్యంగాలకు - "గ్రహం . . . యజ" ఇత్యాదివిధంగా ఏ విధంగా సహభావం వినబడుచున్నదో ఆ విధంగా ఉపాసనలకు సహభావశ్రుతి లేదు. (ప్రశ్న) ప్రయోగాన్ని బోధించే విధియే ఈ ఉపాసనలకు కూడా సహభావాన్ని బోధిస్తున్నది కదా? (సమాధానం) కాదంటాం. ఎందువల్ల ననగా ఉపాసనలు పురుషార్థములు. ప్రయోగాన్ని బోధించే విధి క్రత్వర్థాలైన ఉద్గీథాదులకు సహభావాన్ని పొందింపవచ్చును (అంతే కాని పురుషార్థాలైన ఉపాసనలకు సహభావాన్ని కల్పించజాలవు. ఉద్గీథాద్యుపాసనలు క్రత్వర్థమైన వాటిని ఆశ్రయించి ఉన్నా కూడ ఇవి మాత్రం క్రత్వర్థాలు కావు) గోదోహనాదుల వలె పురుషార్థములే అని పృథగ్ఘ్యప్రతిబన్ధః ఫలమ్ అనే సూత్రంలో చెప్పి ఉన్నాం. క్రత్వంగాలకీ, వాటిని ఆధారంగా చేసికొని ఉన్న ఉపాసనలకీ, ఉపదేశం విషయంలో (వాటిని విధించడం విషయంలో) ఇదే భేదం, అదేమనగా కొన్ని (అంగాలు) క్రత్వర్థాలు, మిగిలినవి (ఉపాసనలు) పురుషార్థాలు. (అందుచేత "శిష్టేశ్చ" అనే సూత్రంలో చెప్పినది యుక్తం కాదు). తరవాత చెప్పిన ("సమాహారాత్", "గుణసాధారణ్యశ్రుతేశ్చ" అనే సూత్రాలలో చెప్పిన) లింగాలు

కూడ ఉపాసనల సహభావాన్ని ప్రతిపాదించజాలవు. ఎందువల్ల ననగా అందుకు ప్రమాణమైన శ్రుతి గాని న్యాయం కాని లేదు. (ఇవి అర్థవాదవాక్యంలో ఉన్న లింగాలు గాన ప్రమాణాంతరసాహాయ్యం లేకుండా విషయాన్ని సాధించజాల వని భావం). ప్రతి ప్రయోగంలోను, ఆశ్రయాలైన క్రత్వంగాలు పూర్తిగా ఉపసంహరించబడినా కూడ ఆశ్రితాలైన (ఆ క్రత్వంగాలను ఆశ్రయించి ఉన్న) ఉపాసనలు కూడ పూర్తిగా ఉపసంహరింపబడాలి అనే నియమం లేదు, ఎందువల్ల ననగా - ఉపాసనలు ఆ కర్మాంగాలచేత ప్రయోగింపబడినవి వాటిని పట్టి, అవి ఉండడంచేత వచ్చినవి) కావు. ఉపాసనలు ఆశ్రయాలమీద ఆధారపడి ఉంటాయి గాన ఆశ్రయాలు లేకపోతే అవి కూడ లేకపోవచ్చును. తావన్మాత్రంచేత ఆశ్రయాలకు సహభావం ఉంది కదా అని వీటికి కూడ తప్పక సహభావం ఉండాలి అనే నియమానికి అవకాశం లేదు. ఎందువల్ల ననగా వీటికి (ఉపాసనలకు) సహభావం ఎక్కడా చెప్పబడలేదు. అందువల్ల ఉపాసనలు ఇష్టం ప్రకారమే చేయబడతాయి. (కాని వీటికి సహభావం సముచ్చయం తప్పక ఉండాలి అనే నియమం లేదు). 65

సూ. దర్శనాచ్చ. 3.3.66

దర్శయతి హి శ్రుతిరసహభావం ప్రత్యయానామ్ - "ఏవం విద్ధ వై బ్రహ్మా యజ్ఞం యజమానం సర్వాంశ్చర్త్విజోఽభిరక్షతి" (ఛా. ఉ. 4.17.10) ఇతి. సర్వప్రత్యయోపసంహారే హి సర్వే సర్వవిదః ఇతి న విజ్ఞానవతా బ్రహ్మణా పరిపాల్యత్వమితరేషాం సంకీర్త్యేత. తస్మాద్యథాకామముపాసనానాం సముచ్చయో వికల్పో వేతి. 66

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీగోవిన్దభగవత్పూజ్యపాదశిష్య

శ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌ శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యే

తృతీయాధ్యాయస్య తృతీయః పాదః.

బాలానందిని

దర్శనాదితి:- "దర్శనాచ్చ = శ్రుతిలో ఉపాసనలకు సహభావం లేకపోవడం కనబడుతున్నది కూడా గాన నియమం లేదు" అని సూత్రార్థం.

దర్శయతీతి:- "ఏవంవిద్ . . . అభిరక్షతి" (ఈ విధంగా తెలుసుకున్న బ్రహ్మ అనే ఋత్విక్కు (తన విజ్ఞానంచేత) యజ్ఞాన్ని యజమానుణ్ణి ఋత్విక్కులందరినీ కూడ రక్షిస్తాడు) అనే శ్రుతి ప్రత్యయాలకు సహభావం లేదని చూపుచున్నది సర్వప్రత్యయోపసంహారం చేయవలసినట్లయితే అందరూ అన్ని విషయాలూ తెలిసినవాళ్లే గాన వాళ్ళందరినీ విజ్ఞానవంతుడైన బ్రహ్మ పాలిస్తాడు అని చెప్పడం కుదరదు. అందువల్ల ఉపాసనలకు, ఇష్టానుసారం సముచ్చయం కాని వికల్పం గాని చెప్పాలి . 66

యథాశ్రయభావాధికరణం సమాప్తం

"బాలానందిని" అను శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యాంధ్రవ్యాఖ్యానంలో

తృతీయాధ్యాయంలోని తృతీయపాదం సమాప్తం

## అథ తృతీయాధ్యాయే చతుర్థః పాదః

(అత్ర నిర్గుణవిద్యాయాః అన్తరఙ్గబహిరఙ్గసాధనవిచారః)

### 1. పురుషార్థాధికరణమ్. సూ. 1 - 17

**సూ. పురుషార్థోఽతః శబ్దాదితి బాదరాయణః 3.4.1**

అథేదానీమౌపనిషదమాత్మజ్ఞానం కిమధికారిద్వారేణ కర్మణ్యేవానుప్రవిశతి ఆహోస్విత్ స్వతన్త్రమేవ పురుషార్థసాధనం భవతీతి మీమాంసమానః సిద్ధాన్తేనైవ తావదుపక్రమతేపురుషార్థోఽతఇతి. అతః అస్మాద్వేదాన్తవిహితాదాత్మజ్ఞానాత్స్వతన్త్రాత్ పురుషార్థః సిధ్యతీతి బాదరాయణ ఆచార్యో మన్యతే. కుత ఏతదవగమ్యతే? శబ్దాదిత్యాహ. తథాహి - "తరతి శోకమాత్మవిత్" (ఛా. ఉ. 7.1.3) "స యో హ వై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" (ము. ఉ. 3.2.9) "బ్రహ్మవిదాప్నోతి పరమ్" (తై. ఉ. 2.1.1) "ఆచార్యవాన్పురుషో వేద తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే అథ సంపత్స్యే" (ఛా. ఉ. 6.14.2) ఇతి, "య ఆత్మాపహతపాప్మా" (ఛా. ఉ 8.7.1) ఇత్యుపక్రమ్య "స సర్వాంశ్చ లోకానాప్నోతి సర్వాంశ్చ కామాన్యస్తమాత్మా నమనువిద్య విజానాతి" (ఛా. ఉ. 8.7.1) ఇతి, "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" (బృ. ఉ. 4.5.15) ఇత్యేవంజాతీయకా శ్రుతిః

కేవలాయా విద్యాయాః పురుషార్థహేతుత్వం శ్రావయతి . 1

బాలానందిని

పురుషార్థ ఇతి:- "అతః=వేదాంతవిహితమైన ఈ ఆత్మజ్ఞానంవల్ల, పురుషార్థః = పరమపురుషార్థమైన మోక్షం లభిస్తుంది. శబ్దాత్ = శ్రుతివల్ల, ఇతి = అని, బాదరాయణః = బాదరాయణుడు అంటున్నాడు" అని సూత్రార్థం.

వి. వెనుకటి పాదంలో గుణోపసంహారం చెప్పి పరాపరవిద్యల స్వరూపం నిరూపించబడింది. అవి కర్మలకు అంగం కాకుండా స్వతంత్రంగానే పురుషార్థహేతువు లని ఈ పాదంలో నిరూపించబడుచున్నది. దీనికి అంగము లేవి అని ఆకాంక్ష కలుగగా యజ్ఞాదులు బహిరంగా లని, శమాదులు అంతరంగా లని చెప్పబడుచున్నాయి. ఈ విధంగా పూర్వోత్తరపాదసంగతి గ్రహించాలి.

అథేతి:- ఇప్పుడు ఉపనిషత్ప్రతిపాదితమైన ఆత్మజ్ఞానం అధికారి ద్వారా కర్మలోనే ప్రవేశిస్తుందా, (అనగా కర్మాంగంగానే ఉంటుందా) లేక స్వతంత్రంగానే పురుషార్థసాధనం అవుతుందా అని విచారణ చేస్తూ పురుషార్థోతః అని సిద్ధాంతప్రతిపాదనపూర్వకంగా ప్రారంభిస్తున్నాడు. అతః = వేదాంతవిహితమైన స్వతంత్రమైన ఆత్మజ్ఞానం వల్లనే పురుషార్థం సిద్ధిస్తుం దని బాదరాయణాచార్యుడు భావిస్తున్నాడు. ఇది ఎట్లు తెలుస్తూన్నది? శబ్దంవల్ల తెలుస్తూన్నది అని అంటున్నాడు. అదెట్లనగా "తరతి శోకమాత్మవిత్" "స యో హ వై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" "బ్రహ్మ విదాప్నోతి పరమ్" "ఆచార్యవాన్ పురుషో వేద" "తస్య తావదేవ చిరం యావన్నవిమోక్ష్యేఽథ సంపత్స్యే" అని, "య ఆత్మాపహతపాప్మా అని ఉపక్రమించి "స సర్వాంశ్చ...విజానాతి" అని "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" అని ఉపక్రమించి, "ఏతావదరే ఖల్వమృతత్వమ్" ఈ మొదలైన శ్రుతి కేవలమైన విద్యయే పురుషార్థానికి హేతువు అని చెప్పుచున్నది.

భాష్యమ్

అథాత్ర పరః ప్రత్యవతిష్ఠతే

**సూ. శేషత్వాత్పురుషార్థవాదో యథాన్యేష్వితి జైమినిః. 3.4.2**

కర్తృత్వేనాత్మనః కర్మశేషత్వాత్ తద్విజ్ఞానమపి వ్రీహిప్రోక్షణాదివత్ విషయద్వారేణ కర్మసంబన్ధ్యేవేత్యతస్తస్మిన్నవగతప్రయోజనే ఆత్మజ్ఞానే యా ఫలశ్రుతిః సార్థవాద ఇతి జైమినిరాచార్యో మన్యతే. యథాన్యేషు ద్రవ్య సంస్కారకర్మసు-"యస్య పర్ణమయీ జుహూర్భవతి న స పాపం శ్లోకం శృణోతి", "యదాఙ్క్తే చక్షురేవ భ్రాతృవ్యస్య వృఙ్క్తే" "యత్ప్రయాజానూయాజా ఇజ్యన్తే వర్మ వా ఏతద్యజ్ఞస్య క్రియతే, వర్మ యజమానస్య భ్రాతృవ్యాభిభూత్యై" ఇత్యేవంజాతీయకా ఫలశ్రుతిరర్థవాదః తద్వత్. కథం పునరస్యానారభ్యాధీతస్యాత్మజ్ఞానస్య ప్రకరణాదీనామన్యతమేనాపి హేతునా వినా క్రతుప్రవేశ ఆశఙ్క్యతే? కర్తృద్వారేణ వాక్యాత్తద్విజ్ఞానస్య క్రతుసంబన్ధ ఇతి చేత్, న. వాక్యాద్వినియోగానుపపత్తేః. అవ్యభిచారిణా హి కేన చిద్ద్వారేణానారభ్యాధీతానామపి వాక్యనిమిత్తః క్రతుసంబన్ధోఽవకల్పతే. కర్తా తు వ్యభిచారి ద్వారమ్, లౌకికవైదికకర్మసాధారణ్యాత్. తస్మాన్న తద్ద్వారేణాత్మజ్ఞానస్య క్రతుసంబన్ధసిద్ధిరితి. న. వ్యతిరేకవిజ్ఞానస్య వైదికేభ్యః కర్మభ్యోఽన్యత్రానుపయోగాత్. న హి దేహవ్యతిరిక్తాత్మజ్ఞానం లౌకికేషు కర్మసూపయుజ్యతే. సర్వథా దృష్టార్థప్రవృత్త్యుపపత్తేః. వైదికేషు తు దేహపాతోత్తరకాలఫలేషు దేహవ్యతిరిక్తాత్మజ్ఞానమన్తరేణ ప్రవృత్తిర్నోపపద్యత ఇతి ఉపయుజ్యతే వ్యతిరేకవిజ్ఞానమ్. నన్వపహతపాప్మత్వాదివిశేషణాద సంసార్యాత్మవిషయమౌపనిషదం దర్శనం న ప్రవృత్త్యఙ్గం స్యాత్? న. ప్రియాదిసంసూచితస్య సంసారిణ ఏవాత్మనో ద్రష్టవ్యత్వేనోపదేశాత్. అపహత పాప్మత్వాదివిశేషణం తు స్తుత్యర్థం భవిష్యతి. నను తత తత్ర ప్రసాధితమేత దధికమసంసారి బ్రహ్మ జగత్కారణమ్, తదేవ చ సంసారిణ ఆత్మనః పారమార్థికం స్వరూపముపనిషత్సూపదిశ్యత ఇతి? సత్యమ్ ప్రసాధితమ్. తస్యైవ తు స్థూణానిఖననవత్ ఫలద్వారేణాక్షేపసమాధానే క్రియేతే దార్ఢ్యాయ. 2

బాలానందిని

**అథేతి**:- ఇప్పుడు ఇక్కడ ప్రతిపక్షి ఎదిరించి నిలబడుచున్నాడు.

**శేషత్వాదితి**:- "శేషత్వాత్=కర్మకు అంగం అవడంవల్ల, పురుషార్థవాదః= పురుషస్తుతిరూపమైన అర్థవాదము, అన్యేషు = ఇతరవాక్యములయందు, యథా = ఎట్లో అట్లే, ఇతి = అని, జైమినిః = జైమిని అంటున్నాడు". అని సూత్రార్థం. (2-7 సూత్రాలు పూర్వపక్షసూత్రాలు).

కర్తృత్వేనేతి :- కర్తగా (ఆచరించేవాడుగా) ఆత్మ కర్మలకు అంగమైనవాడు. అందువల్ల, ఆ ఆత్మయొక్క విజ్ఞానం కూడ, (యాగాంగమైన) వ్రీహుల ప్రోక్షణం వ్రీహుల ద్వారా ఏ విధంగా కర్మకు సంబంధిస్తుందో, అట్లే విషయం ద్వారా (విజ్ఞానానికి విషయమైన ఆత్మ ద్వారా) కర్మకు సంబంధించినదే. ఈ విధంగా ఆత్మజ్ఞానానికి ఫలం కర్మ సంబంధమే అని తెలిసిపోయిన తరువాత, దాని విషయంలో ఏ ఫలశ్రుతి ఉన్నదో, అది అర్థవాదం మాత్రమే అని జైమిన్యాచార్యుడు భావిస్తున్నాడు "యస్య . . . శృణోతి" (ఇది ద్రవ్యం) "యదాఙ్క్తే . . వృఙ్క్తే" (యజమానుని కండ్లకు పూస్తున్నా డనడగా వాని శత్రువుయొక్క నేత్రాన్ని ఖండించివేస్తున్నాడు. ఇది సంస్కారం) "యత్ప్రయాజా . . . అభిభూత్యై" (ప్రయాజానుయాజలు చేయబడుచున్నా యనగా అది యజ్ఞానికి కవచం తొడగడమే శత్రువులను ఓడించడం కోసం యజమానునికి కవచం తొడగడమే. ఇవి కర్మలు) ఈ విధంగా ఇతరములైన ద్రవ్య - సంస్కార-కర్మల విషయంలో వినబడుతున్న ఫలశ్రుతి ఏ విధంగా అర్థవాదమో ఇక్కడ కూడా అట్లే. (ప్రశ్న) అనారభ్యాధీతమైన ( ఏ ప్రకరణంలోను పఠించబడని) ఈ ఆత్మజ్ఞానానికి, ప్రకరణాదులలో ఏ ఒక్క హేతువూ లేకుండా క్రతుప్రవేశం ఎలా ఆశంకించబడుచున్నది? వాక్యప్రమాణంచేత ఆత్మవిజ్ఞానానికి కర్త ద్వారా క్రతుసంబంధం చెబుతాం అని అనడం యుక్తం కాదు. వాక్యంచేత వినియోగం చెప్పడం (ఇది దీనికి అంగం) అని చెప్పడం కుదరదు. ఎందువల్ల ననగా అనారభ్యాధీతాలకు కూడ వ్యభిచారం లేని ఏదైనా ఒక ద్వారంచేత వాక్య ప్రమాణాన్ని నిమిత్తంగా చేసుకొని క్రతు సంబంధం చెప్పవచ్చును, కాని కర్త లౌకికకర్మకీ వైదికకర్మకీ కూడ సాధారణ మైనవాడు గాన వ్యభిచారి యైన (అనగా క్రతువుకు మాత్రమే సంబంధించినవాడు అని చెప్పడానికి వీలు లేని) ద్వారం. అందువల్ల అలాంటి కర్త ద్వారా క్రతుసంబంధం

సిద్ధించదు. (సిద్ధాంతి చేసిన ఈ వాదానికి పూర్వపక్షి సమాధానం) అట్లు కాదు. వ్యతిరేక విజ్ఞానానికి వైదికకర్మలలో తప్ప ఇతర కర్మలలో ఉపయోగం లేదు. దేహంకంటె భిన్నుడైన ఆత్మను గూర్చిన జ్ఞానం లౌకికకర్మలలో ఉపయోగించదు కదా? లౌకికకర్మలలో అన్ని విధాలా ప్రత్యక్షంగా కనబడే ప్రయోజనం కోసమే ప్రవృత్తి జరుగుతుంది. దేహపాతం తరవాత ఫలం ఇచ్చే వైదికకర్మల విషయంలో ప్రవర్తించడం అయితే దేహంకంటె వ్యతిరిక్తమైన ఆత్మయొక్క జ్ఞానం లేకుండా కుదరదు. అందుచేత అక్కడ వ్యతిరేక విజ్ఞానానికి ఉపయోగం ఉంది. (సిద్ధాంతి ప్రశ్న) అపహతపాప్మత్వం మొదలైన విశేషణాలుండడం వల్ల అసంసారియైన ఆత్మను గూర్చిన ఔపనిషదదర్శనం ప్రవృత్తికి (కర్మాచరణానికి) అంగం కాదు కదా; (పూర్వపక్షి సమాధానం) అది కాదు. ప్రియాదుల చేత (ప్రతి ప్రియు డవుతాడు, జాయ ప్రియురా లవుతుంది ఇత్యాదినిర్దేశాలచేత) సూచించబడిన ఆత్మయే ద్రష్టవ్యః ఇత్యాదివాక్యాలచేత, ద్రష్టవ్యుడుగా బోధింపబడుచున్నాడు గాన అపహతపాప్మత్వాదికం కేవలం స్తుతిప్రయోజనమే అవుతుంది. (తటస్థుని ప్రశ్న) అసంసారియైన బ్రహ్మయే జగత్కారణం, అదే సంసారియైన ఆత్మయొక్క పారమార్థికమైన స్వరూపం అని ఉపనిషత్తులలో ఉపదేశించబడుచున్న దని అక్కడక్కడ అధికంగా ప్రతిపాదించబడింది కదా? (మళ్ళీ ఈ విచారణ ఎందుకు?) (సిద్ధాంతి సమాధానం) నిజమే, ప్రతిపాదించబడింది. ఆ విషయమే దృఢంగా నిలవడం కోసం స్థూణాని ఖననన్యాయంచేత, ఆత్మజ్ఞానఫలనిరూపణ ద్వారా ఆక్షేపసమాధానాలు చేయబడు చున్నాయి. 2

## సూ. ఆచారదర్శనాత్. 3.4.3

"జనకో హ వైదేహో బహుదక్షిణేన యజ్ఞేనేజే" (బృ. ఉ. 3.1.1) "యక్ష్యమాణో హ వై భగవన్తోఽహమస్మి" (ఛా. ఉ. 5.11.15) ఇత్యేవమాదీని బ్రహ్మవిదామపి అన్యపరేషు వాక్యేషు కర్మసంబన్ధదర్శనాని భవన్తి. తథోద్దాలకాదీనామపి పుత్రానుశాసనాదిదర్శనాత్ గార్హస్థ్యసంబన్ధోఽవగమ్యతే. కేవలాచ్చేత్ జ్ఞానాత్పురుషార్థసిద్ధిః స్యాత్ కిమర్థమనేకాయాససమన్వితాని కర్మాణి తే కుర్యుః? "అక్కే చేన్మధు విన్దేత కిమర్థం పర్వతాన్ వ్రజేత్" ఇతి న్యాయాత్. 3

బాలానందిని

**అచారేతి**:- "ఆచారదర్శనాత్=జ్ఞానులకుకూడ కర్మాచరణం కనబడడంవల్ల బ్రహ్మవిద్య కర్మాంగమే" అని సూత్రార్థం.

జనక ఇతి:- "జనకో...ఈజే" (విదేహరాజైన జనకుడు బహుదక్షిణలు గల యజ్ఞం చేశాడు) "యక్ష్యమాణో...అస్మి" (పూజ్యులారా! నేను యజ్ఞం చేయదలచుచున్నాను అని కేకయరాజు అన్నాడు) ఈ మొదలైన, బ్రహ్మవేత్తలకు కూడ కర్మసంబంధాన్ని చెప్పే, అన్యపరములైన అనగా విద్యావిధిపరములైన, వాక్యా లున్నాయి. అట్లే ఉద్దాలకాదులు పుత్రులకు ఉపదేశించినట్లు చెప్పడంచేత వాళ్లకు గృహస్థాశ్రమసంబంధం ఉన్నట్లు తెలుస్తూన్నది. కేవలమైన జ్ఞానంవల్లనే పురుషార్థం సిద్ధిస్తే వాళ్లు అనేకమైన శ్రమలతో కూడిన కర్మలను ఎందుకు చేస్తారు? "దగ్గరనే తేనె లభిస్తూంటే పర్వతాలు ఎక్కడం ఎందుకు?" ని కదా లోకోక్తి? 3.

సూ. తచ్ఛ్రుతేః. 3.4.4.

"యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి" (ఛా. ఉ. 1.1.10) ఇతి చ కర్మశేషత్వశ్రవణాద్విద్యాయా న కేవలాయాః పురుషార్థహేతుత్వమ్. 4.

బాలానందిని

**తదితి**:- "తచ్ఛ్రుతేః= కర్మాంగత్వం వినబడడంవల్ల ఆత్మజ్ఞానం కర్మశేషమే" అని సూత్రార్థం.

యదేవేతి:-"యదేవ....భవతి" అని విద్య కర్మకు శేషం అని వినబడంచేత కేవలమైన విద్య పురుషార్థహేతువు కాదు. 4.

సూ. సమన్వారమ్భణాత్. 3.4.5

"తం విద్యాకర్మణీ సమన్వారభేతే" (బృ.ఉ.4.4.2) ఇతి చ విద్యాకర్మణోః ఫలారమ్భే సహకారిత్వదర్శనాత్ న స్వాతన్త్ర్యం విద్యాయాః. 5.

బాలానందిని

సమారమ్భణాదితి:- "సమారమ్భణాత్=విద్యాకర్మలు ఫలాన్ని ఇవ్వడంవల్ల విద్య కర్మాంగమే" అని సూత్రార్థం.

తమితి:- "తం....సమన్వారభేతే" (విద్యాకర్మలు పరలోకానికి వెడుతూన్నవానిని వెంబడిస్తాయి)అని విద్యాకర్మలు ఫలం ఇవ్వడంలో పరస్పరసహకారులుగా ఉంటాయి అని చెప్పడంవల్ల విద్యకు స్వాతంత్ర్యం లేదు. 5.

## సూ. తద్వతో విధానాత్. 3.4.6

"ఆచార్యకులాద్వేదమధీత్య యథావిధానం గురోః కర్మాతిశేషేణాభిసమావృత్య కుటుమ్బే శుచౌ దేశే స్వాధ్యాయమధీయానః" (ఛా.ఉ.8.15.1) ఇతి చైవంజాతీయకా శ్రుతిః సమస్తవేదార్థవిజ్ఞానవతః కర్మాధికారం దర్శయతి. తస్మాదపి న విజ్ఞానస్య స్వాతన్త్ర్యేణ ఫలహేతుత్వమ్. నన్వత్రాధీత్యేత్యధ్యయనమాత్రం వేదస్య శ్రూయతే, నార్థవిజ్ఞానమ్. నైష దోషః. దృష్టార్థత్వాద్వేదాధ్యయనమర్థావబోధపర్యన్తమితి స్థితమ్. 6

బాలానందిని

తద్వత ఇతి:- "తద్వతః=వేదార్థజ్ఞానం కలవానికి, విధానాత్=కర్మ విధించబడడంవల్ల" అని సూత్రార్థం.

ఆచార్యేతి:-"ఆచార్య...అధీయానః"(గురుశుశ్రూషః చేయగా మిగిలిన కాలంలో వేదాధ్యయనం చేసి గురుకులంనుండి తిరిగి వచ్చి గార్హస్థ్యంలో ఉన్నవాడై పవిత్రమైన ప్రదేశంలో వేదాధ్యయనం చేస్తూ ఇతరములైన నిత్యకర్మాదులు కూడ చేస్తూ బ్రహ్మలోకం పొందుతాడు)-ఈ విధమైన శ్రుతి సమస్తవేదార్థవిజ్ఞానం ఉన్నవానికే కర్మాధికార మని చెపుతూన్నది. అందువల్ల కూడ విజ్ఞానం స్వతంత్రంగా ఫలహేతువు కాజాలదు. (ప్రశ్న) ఇక్కడ "అధీత్య" అని వేదాధ్యయనం మాత్రమే వినబడుచున్నది; అర్థవిజ్ఞానం చెప్పబడలేదు కదా? (సమాధానం) ఈ దోషం లేదు. ప్రత్యక్షంగా కనబడేదే వేదాధ్యయనానికి ఫలం గాన వేదాధ్యయనం అర్థావబోధం కలిగేవరకు చెయ్యాలి అని నిర్ణయించబడింది. 6.

సూ. నియమాచ్చ 3.4.7.

"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః,

ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే" (ఈ.ఉ.2)

ఇతి, తథా "ఏతద్వై జరామర్యం సత్రం యదగ్నిహోత్రం, జరయా హ్యేవాస్మాన్ముచ్యతే మృత్యునా వా" (శత. బ్రా. 12.4.1.1) ఇత్యేవంజాతీయకాన్నియమాదపి కర్మశేషత్వమేవ విద్యాయా ఇతి. 7.

బాలానందిని

నియమాదితి:- "నియమాచ్చ=కర్మచేసి తీరాలి అనే నియమంవల్ల కూడ, ఆత్మజ్ఞానం కర్మాంగమే" అని సూత్రార్థం.

కుర్వన్నితి :- "కుర్వన్...నరే" (కర్మలు చేస్తూనే ఈ దేహంలో నూరు సంవత్సరాలు జీవించాలని కోరుకోవాలి. నరుడ వైన నీవు ఈ విధంగా చేస్తూంటే నీయందు కర్మ లిప్తం కాదు. దీనికంటె మరొక మార్గం లేదు) అని, అట్లే "ఏతద్వై...మృత్యునా వా" (అగ్నిహోత్రం అనేది జరామర్యమైన సత్రం; ముసలితనంచేత గాని, మృత్యువుచేతగాని దీనినుండి ముక్తు డవుతాడు)ఈ విధమైన నియమంవల్ల కూడ విద్య కర్మశేషమే. 7.

భాష్యమ్

ఏవం ప్రాప్తే ప్రతివిధీయతే-

సూ. అధికోపదేశాత్తు బాదరాయణస్యైవం తద్దర్శనాత్. 3.4.8

తుశబ్దాత్పక్షో విపరివర్తతే. యదుక్తం "శేషత్వాత్పురుషార్థవాదః" (బ్ర.సూ.3.4.2)ఇతి తన్నోపపద్యతే. కస్మాత్? అధికోపదేశాత్. యది సంసార్యేవాత్మా శారీరః కర్తా భోక్తా చ శరీరమాత్రవ్యతిరేకేణ వేదాన్తేషూపదిష్టః స్యాత్తతో వర్ణితేన ప్రకారేణ ఫలశ్రుతేరర్థవాదత్వం స్యాత్. అధికస్తావచ్ఛారీరాదాత్మనోఽసంసారీశ్వరః కర్తృత్వాదిసంసారిధర్మరహితః, అపహతపాప్మత్వాదివిశేషణః, పరమాత్మా వేద్యత్వేనోపదిశ్యతే వేదాన్తేషు. న చ తద్విజ్ఞానం కర్మణాం ప్రవర్తకం భవతి,

ప్రత్యుత కర్మాణ్యుచ్ఛినత్తీతి వక్ష్యతి "ఉపమర్దం చ" (బ్ర.సూ.3.4.16)ఇత్యత్ర. తస్మాత్ "పురుషార్థోఽతః శబ్దాత్ "(బ్ర.సూ.3.4.1). ఇతి యన్మతం భగవతో బాదరాయణస్య తత్తథైవ తిష్ఠతి, న శేషత్వ ప్రభృతిభిర్హేత్వాభాసై శ్చాలయితుం శక్యతే.

బాలానందిని

అధికేతి :-"అధికోపదేశాత్తు=అధికంగా చెప్పడంవల్ల (జీవునికంటె అధికంగా పరమాత్మను కూడ చెప్పడంవల్ల),బాదరాయణస్య= బాదరాయణుని మతమే అంగీకార్యం, ఏవమ్=ఈ విధంగా, తద్దర్శనాత్= శారీరునికంటె అధికంగా ఈశ్వరుణ్ణి చూపడంవల్ల" అని సూత్రార్థం.

తుశబ్దాదితి:-తుశబ్దంవల్ల పూర్వపక్షం వెనుకకు మరలుతుంది. "శేషత్వాత్పురుషార్థవాదః" అని చెప్పినది ఉపపన్నం కాదు. ఎందువల్ల? అధికోపదేశంవల్ల. శరీరమాత్రంకంటె భిన్నుడైన, సంసారి, కర్త, భోక్త అయిన జీవాత్మమాత్రమే వేదాంతాలలో చెప్పబడి ఉంటే అప్పుడు (మీరు)చెప్పిన రీతిలో ఫలశ్రుతి అర్థవాదం అవడానికి అవకాశం ఉండేది. కాని వేదాంతాలలో, సంసారం లేనివాడు, ఈశ్వరుడు, కర్తృత్వం మొదలైన సంసారి ధర్మాలు లేనివాడు, అపహతపాప్మత్వం మొదలైన విశేషణాలు కలవాడు అయిన పరమాత్మ జీవాత్మకంటె అధికంగా చెప్పబడ్డాడు. అట్టి పరమాత్మయొక్క విజ్ఞానం కర్మలకు ప్రవర్తకం కాజాలదు సరి కదా కర్మలను పూర్తిగా పెకిలించి వేస్తుంది అని "ఉపమర్దం చ" అనే సూత్రంలో చెప్పనున్నాడు. అందువల్ల "పురుషార్థోఽతః శబ్దాత్" అని భగవంతుడైన బాదరాయణుడు చెప్పిన మతం అలాగే స్థిరంగా ఉంటుంది. శేషత్వం మొదలైన హేత్వాభాసలచేత దీనిని చలింపచేయడానికి శక్యం కాదు.

భాష్యమ్

తథాహి తమధికం శారీరాదీశ్వరమాత్మానం దర్శయన్తి శ్రుతయః-"యః సర్వజ్ఞః సర్వవిత్" (ము. ఉ. 1.1.9), "భీషాస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః" (తై. ఉ.2.8.1) "మహద్భయం వజ్రముద్యతమ్" (క.ఉ.6.2) "ఏతస్య వా

అక్షరస్య ప్రశాసనే గార్గి'' (బృ.ఉ.3.8.9)''తదైక్షత బహు స్యాం ప్రజాయేయేతి. తత్తేజో ఽసృజత''(ఛా. ఉ. 6.2.3) ఇత్యేవమాద్యాః. యత్తు ప్రియాదిసంసూచితస్య సంసారిణ ఏవాత్మనో వేద్యతయానుకర్షణమ్-''ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి, ఆత్మా వా అరే ద్రష్టవ్యః'' (బృ.ఉ.2.4.5), ''యః ప్రాణేన ప్రాణితి స ఆత్మా సర్వాన్తరః'' (బృ.ఉ.3.4.1) ''య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే'' (ఛా.ఉ.8.7.4)ఇత్యుపక్రమ్య ''ఏతం త్వేవ తే భూయోఽనువ్యాఖ్యాస్యామి'' (ఛా.ఉ.8.9.3) ఇతిచైవమాది, తదపి ''అస్య మహతో భూతస్య నిఃశ్వసిత మేతద్యదృగ్వేదః'' (బృ.ఉ.2.4.10), ''యోఽశనాయాపిపాసే శోకం మోహం జరాం మృత్యుమత్యేతి'' (బృ.ఉ.3.5.1), ''పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే స ఉత్తమః పురుషః'' (ఛా.ఉ.8.12.3)ఇత్యేవమాది భిర్వాక్యశేషైః సత్యామేవాధికోపదిదిక్షాయామత్యన్తాభేదాభిప్రాయమిత్యవిరోధః. పారమేశ్వరమేవ హి శారీరస్య పారమార్థికం స్వరూపమ్; ఉపాధికృతం తు శారీరత్వమ్-''తత్త్వమసి''(ఛా.ఉ.6.8.7), ''నాన్యదతోఽస్తి ద్రష్టృ'' (బృ.ఉ.3.8.11) ఇత్యాదిశ్రుతిభ్యః. సర్వం చైతత్పురస్తాత్తత్ర తత్ర వర్ణితమ్. 8.

బాలానందిని

**తథాహీతి** :- ఎందువల్ల ననగా- "యః సర్వజ్ఞః సర్వవిత్", "భీషా...సూర్యః" "మహద్భయం వజ్రముద్యతమ్", "ఏతస్య...గార్గి" "తదైక్షత...అసృజత" ఈ మొదలైన శ్రుతులు శారీరునికంటె అధికంగా పరమాత్మ యైన ఈశ్వరుణ్ణి చూపుతున్నాయి. (1)"ఆత్మనస్తు....ద్రష్టవ్యః" (2) "యః ప్రాణేన...సర్వాన్తరః" (3)"య ఏషోఽక్షిణి...దృశ్యతే" అని ఉపక్రమించి "ఏతం...వ్యాఖ్యాస్యామి" ఇత్యాదివాక్యాలలో ప్రియాదులచేత సూచింపబడిన సంసారి యైన ఆత్మయే వేద్యంగా అనుకర్షించడం ఏది కలదో అది కూడ (1)"అస్య మహతో...ఋగ్వేదః" (2)"యోఽశనాయా...అత్యేతి" (3)"పరం జ్యోతి...పురుషః" ఇత్యాది వాక్యశేషాలచేత జీవునికంటె అధికంగా పరమేశ్వరుణ్ణి ఉపదేశించాలనే అభిప్రాయం ఉంటూండగా, జీవపరమాత్మల అత్యంతాభేదాన్ని చెప్పడంకోసం ఉద్దిష్టమైనది గాన విరోధం లేదు.

వి. మొదటి మూడు వాక్యాలలోను శారీరుడు నిర్దేశించబడి నట్లుగా ప్రియాది సంస్పర్శను పట్టి తెలుస్తూన్న మాట నిజమే. అయితే తరువాతి మూడు వాక్యశేషాలలోను ఆ శరీరునికంటె అధికంగా పరమేశ్వరుణ్ణి గూర్చి చెప్పబడింది. చివరి వాక్యశేషాలలో పరమేశ్వరుణ్ణి గూర్చి చెప్పే టప్పుడు ఇంక ప్రారంభంలో శారీరుని నిర్దేశం ఎందు కనగా- దీనికి రెండు కారణా లున్నాయి-శారీరునికంటె అధికంగా పరమాత్మను చెప్పా లనే అభిప్రాయం ఒకటి, ఈ శారీరుడు పరమాత్మకంటె అత్యంతాభిన్ను డని చెప్పడం రెండవది. అందుచేతనే జ్ఞేయు డని చెపుతూ పరమాత్మతో ముగించడంవల్ల శారీరపరమాత్మలకు అత్యంతాభేదాన్ని చెప్పినట్లయింది అని భావం.

పారమేశ్వరమితి:- "తత్త్వమసి", "నాన్యదతోఽస్తి ద్రష్టృ" ఇత్యాదిశ్రుతుల ననుసరించి శారీరుని పారమార్థికస్వరూపం పారమేశ్వరమే. (వాస్తవంలో శారీరుడు పరమాత్మ స్వరూపుడే). వానికి శరీరోపాధిని పట్టి శారీరత్వం ఏర్పడింది. ఈ విషయం అంతా మేం వెనుక అక్క డక్కడ వర్ణించి ఉన్నాం. 8

సూ. తుల్యం తు దర్శనమ్. 3.4.9

యత్తూక్తమాచారదర్శనాత్ కర్మశేషో విద్యేతి; అత్ర బ్రూమః- తుల్యమాచారదర్శనమకర్మశేషత్వేఽపి విద్యాయాః. తథా హి శ్రుతిర్భవతి- "ఏతద్ధస్మ వై తద్విద్వాంస ఆహుః ఋషయః కావషేయాః కిమర్థా వయ మధ్యేష్యామహే, కిమర్థా వయం యక్ష్యామహే. ఏతద్ధ స్మ వై తత్పూర్వే విద్వాంసోఽగ్నిహోత్రం న జుహవాంచక్రిరే" (కౌ.ఉ.2.5) "ఏతం వై తమాత్మానం విదిత్వా బ్రాహ్మణాః పుత్రైషణాయాశ్చ, విత్తైషణాయాశ్చ, లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరన్తి" (బృ.ఉ.3.5.1) ఇత్యేవంజాతీయకా. యాజ్ఞవల్క్యాదీనామపి బ్రహ్మవిదామకర్మనిష్ఠత్వం దృశ్యతే-"ఏతావదరే ఖల్వమృతత్వమితి హోక్త్వా యాజ్ఞవల్క్యో విజహార" (బృ.ఉ.4.5.15) ఇత్యాదిశ్రుతిభ్యః. అపి చ "యక్ష్యమాణో హ వై భగవన్తోఽహమస్మి" (ఛా.ఉ.5.11.5) ఇత్యేతల్లిఙ్గదర్శనం వైశ్వానర విద్యావిషయమ్. సంభవతి చ సోపాధికాయాం బ్రహ్మవిద్యాయాం కర్మసాహిత్య

దర్శనమ్. న త్వత్రాపి కర్మాఙ్గత్వమస్తి, ప్రకరణాద్యభావాత్. 9.

బాలానందిని

తుల్యమితి:- "దర్శనమ్=ఆచారదర్శనం, తుల్యం తు=విద్య కర్మశేషం కాదనే విషయంలో కూడ సమానము" అని సూత్రార్థం.

యత్త్వితి :- ఆచారదర్శనంవల్ల విద్య కర్మశేషం అని ఏది చెప్పబడిందో దానిని గూర్చి చెపుతున్నాం. విద్య కర్మశేషం కాకపోయినా కూడ కర్మాచరణం కనబడడం సమానమే. అనగా ఈ క్రింది శ్రుతివాక్యాలు విద్య ఆచారానికి శేషం కాదని సూచిస్తున్నాయి అని అర్థం. ఎందువల్ల ననగా- "ఏతద్ధ...యక్ష్యామహే" (విద్వాంసులైన కావషేయఋషులు మనం ఏ ప్రయోజనాన్ని ఉద్దేశించి అధ్యయనం చెయ్యాలి? ఏ ప్రయోజనాన్ని ఉద్దేశించి యాగాలు చెయ్యాలి అని అంటున్నారు) "ఏతద్ధ స్మ...జుహవాంచక్రిరే" (అందుచేతనే ప్రాచీనులైన విద్వాంసులు అగ్నిహోత్రహోమం చేయలేదు)"ఏతం వై....చరన్తి" (ఆత్మను తెలిసికొన్న బ్రాహ్మణులు పుత్రైషణ, విత్తైషణ, లోకైషణ, విడిచిపెట్టి భిక్షాచర్యం చేస్తున్నారు)అని శ్రుతులు చెప్పుచున్నాయి. బ్రహ్మనిష్ఠ లైన యాజ్ఞవల్క్యాదులు కూడ కర్మనిష్ఠులు కాకుండా ఉండడం-"ఏతావదరే...విజహార" (ఓయీ! అమృతత్వం అంటే ఇదే అని చెప్పి పరివ్రాజకు డైనాడు)ఇత్యాది శ్రుతులనుండి తెలుస్తూన్నది. మరొక విషయ మేమనగా - "యక్ష్యమాణో హ వై భగవన్తోఽహమస్మి" అనే లింగం వైశ్వానరవిద్యకు సంబంధించినది. సోపాధిక మైన బ్రహ్మవిద్యలో నైతే కర్మసాహిత్యం ఉండవచ్చును. అయితే ఈ వైశ్వానరవిద్య కూడ కర్మాంగం కాదు. (కర్మాంగత్వాన్ని బోధించే)ప్రకరణాదు లేవీ లేవు కదా?

భాష్యమ్.

యత్పున రుక్తమ్ - "తచ్ఛ్రుతేః" (బ్ర.సూ.3.4.4)ఇతి. అత్ర బ్రూమః-

సూ. అసార్వత్రికీ. 3.4.10

"యదేవ విద్యయా కరోతి"(ఛా.ఉ.1.1.10)ఇత్యేషా శ్రుతిర్న సర్వవిద్యావిషయా, ప్రకృతవిద్యాభిసంబన్ధాత్. ప్రకృతా చోద్గీథవిద్యా- "ఓ

మిత్యేతదక్షరముద్గీథముపాసీత'' (ఛా.ఉ.1.1.1)ఇత్యత్ర. 10.

బాలానందిని

యదితి :- తచ్ఛ్రుతేః అని చెప్పినదానికి సమాధానం చెపుతున్నాం-

అసార్వత్రికీతి:-''అసార్వత్రికీ=ఈ శ్రుతి అన్ని చోట్ల అన్వయించేది కాదు'' అని సూత్రార్థం.

యదితి:- ''యదేవ విద్యయా కరోతి'' అనే శ్రుతి అన్ని విద్యలకు సంబంధించినది కాదు. ఎందువల్ల ననగా అది ప్రకృతమైన విద్యకు సంబంధించినది. ఇక్కడ ప్రకృత మైనది-''ఓమిత్యేదక్షరముద్గీథముపాసీత'' అని ఉద్గీథవిద్య. 10.

సూ. విభాగః శతవత్. 3.4.11

యదప్యుక్తం- ''తం విద్యాకర్మణీ సమన్వారభేతే'' (బృ.ఉ.4.4.2) ఇత్యేతత్సమారమ్భవచనమస్వాతన్త్ర్యే విద్యాయా లిఙ్గమితి, తత్రప్రత్యుచ్యతే. విభాగోఽత్ర ద్రష్టవ్యః-విద్యాన్యం పురుషమన్వారభతే కర్మాన్యమితి. శతవత్. యథా శతమాభ్యాం దీయతామిత్యుక్తే విభజ్య దీయతే పఞ్చాశదేకస్మై పఞ్చాశదపరస్మై తద్వత్. న చేదం సమన్వారమ్భవచనం ముముక్షువిషయమ్- ''ఇతి ను కామయమానః'' (బృ.ఉ.4.4.6)ఇతి సంసారివిషయత్వోపసంహారాత్. ''అథాకామయమానః'' ఇతి చ ముముక్షోః పృథగుపక్రమాత్. తత్ర సంసారివిషయే విద్యా విహితా ప్రతిషిద్ధా చ పరిగృహ్యతే, విశేషాభావాత్. కర్మాపి విహితం ప్రతిషిద్ధం చ యథాప్రాప్తానువాదిత్వాత్.ఏవం సత్యవిభాగేనాపీదం సమన్వారమ్భ వచనమవకల్పతే. 11.

బాలానందిని

విభాగ ఇతి :- ''శతవత్=శతమునందు వలె, విభాగః=విభాగము'' అని సూత్రార్థం.

యదపీతి :- ''తం విద్యాకర్మణీ సమన్వాదభేతే'' అని చెప్పిన సమన్వారంభం విద్య స్వతంత్రం కాదు అని చెప్పడానికి లింగం అని ఏది చెప్పబడిందో అది

నిరాకరించబడుచున్నది-ఇక్కడ విద్య ఒక పురుషుణ్ణి అనుసరిస్తుంది. కర్మ మరొకణ్ణి అనుసరిస్తుంది అని విభాగం గ్రహించాలి. శతంలో వలె. వీళ్లిద్దరికీ వంద ఇయ్యి అన్నప్పుడు దానిని విడగొట్టి ఒకనికి యాభై మరొకనికి యాభై ఏ విధంగా ఇవ్వబడుతుందో అట్లే ఇక్కడ కూడ.

అవ. ఇక్కడ సమన్వారంభవచనం ముముక్షువుకు సంబంధించినది అని అంగీకరించి కర్మ సంసారిని, విద్య ముముక్షువును అనుసరిస్తుంది అని సూత్రకారుడు విభాగం చెప్పాడు. నిజానికి ఆ విభాగం లేదు అని చెపుతున్నారు-న చేదమితి:- "ఇతి తు కామయమాన:"(ఇట్లు కోరికలు కలవాడు)అని ఈ సమారంభం సంసారికి సంంధించిన దని ఉపసంహరించడంవల్ల ఈ సమన్వారంభవచనం ముముక్షువును గూర్చి చెప్పినది కాదు. "అథాకామయమాన:"అని ముముక్షువును గూర్చి వేరుగా ఉపక్రమం చేయబడింది. సంసారి విషయంలో శాస్త్రవిహితమైన ఉద్గీథాదివిద్య, శాస్త్రనిషిద్ధమైన నగ్నస్త్రీధ్యానాది రూపమైన విద్యా కూడ గ్రహించబడితాయి. ప్రాప్తించినదానినే ఈ వాక్యం అనువదిస్తూన్నది గాన విహితకర్మ ప్రతిషిద్ధకర్మా కూడ గ్రహించబడతాయి. ఇలా చెప్పుకొన్నట్లయితే (విద్యాకర్మలు రెండూ అనుసరించేది సంసారినే కాబట్టి) ఈ సమన్వారంభవచనం అవిభాగంచేత కూడ ఉపపన్నం అవుతుంది. 11.

భాష్యమ్

యచ్చైతత్ "తద్వతో విధానాత్" (బ్ర.సూ.3.4.6)ఇతి, అత ఉత్తరం పఠతి-

## సూ. అధ్యయనమాత్రవత:. 3.4.12

"ఆచార్యకులాద్వేదమధీత్య" (ఛా.ఉ.8.15.1) ఇత్యత్రాధ్యయనమాత్రస్య శ్రవణాత్ అధ్యయనమాత్రవత ఏవ కర్మవిధిరిత్యధ్యవస్యామః. నన్వేవం సత్యవిద్వత్త్వాదనధికారః కర్మసు ప్రసజ్యేతే? నైష దోషః. న వయమధ్యయనప్రభవం కర్మావబోధనమధికారకారణం వారయామః. కిం తర్హి? ఔపనిషదమాత్మజ్ఞానం స్వాతన్త్ర్యేణైవ ప్రయోజనవత్ ప్రతీయమానం న

కర్మాధికారకారణతాం ప్రతిపద్యేత ఇత్యేతావత్ప్రతిపాదయామః. యథా చ న క్రత్వన్తరజ్ఞానం క్రత్వన్తరాధికారేణాపేక్ష్యతే ఏవమేతదపి ద్రష్టవ్యమితి. 12.

బాలానందిని

యచ్చేతి :- తద్వతో విధానాత్ అని చెప్పినదానికి సమాధానంగా పలికిస్తున్నాడు-

అధ్యయనేతి :- "అధ్యయనమాత్రవతః=అధ్యయనం మాత్రం ఉన్నవానికే కర్మాధికారం" అని సూత్రార్థం.

ఆచార్యేతి:- ఆచార్యకులాద్వేదమధీత్య అనే వాక్యంలో అధ్యయనంమాత్రమే చెప్పబడింది గాన అధ్యయనంమాత్రమే ఉన్నవానికి కర్మ విధించబడింది అని నిశ్చయిస్తున్నాం. (ప్రశ్న)అయితే అధ్యయనం మాత్రం ఉన్నవాడు అవిద్వాంసుడు గాన, అనగా వేదార్థజ్ఞానం లేనివాడు గాన, వానికి కర్మలయందు అధికారం లేకుండా పోతుంది కదా? (సమాధానం)ఈ దోషం లేదు అధ్యయనం చేయడంవల్ల కలిగిన, కర్మజ్ఞానం అధికారానికి కారణం అనే విషయాన్ని లేదా అధికారకారణమైన కర్మజ్ఞానాన్ని మేం నిషేధించడం లేదు; మరేమనగా-స్వతంత్రంగానే ప్రయోజనవత్తుగా కనబడుచున్న ఔపనిషదమైన ఆత్మజ్ఞానం కర్మాధికారానికి కారణం కాదనే విషయాన్ని మాత్రమే (అనగా ఔపనిషదాత్మజ్ఞానం కలిగిన తరవాత కర్మాధికారం ఉండదనే విషయాన్ని మాత్రమే) ప్రతిపాదిస్తున్నాం. ఒక క్రతువును గూర్చిన జ్ఞానం మరొక క్రతువు చేసే అధికారం విషయంలో ఎట్లు అపేక్షింపబడదో అట్లే ఇక్కడ కూడ అని గ్రహించాలి. (ఏదైన ఒక క్రతువు చేయదలచినవానికి దానికి సంబంధించిన జ్ఞానం ఉంటే చాలు. మరొక క్రతువుకు సంబంధించిన విషయాలు కూడ అతనికి తెలియకపోయినా మొదటి క్రతువు విషయంలో ఆతని కున్న అధికారానికి భంగం రాదు. అట్లే కర్మకాండలో నున్న విషయం వేరు. ఉపనిషత్ప్రతిపాదితమైన విషయం వేరు. కర్మలాచరించదలచినవానికి కర్మకాండజ్ఞానం ఉంటే చాలు. ఉపనిషత్ప్రతిపాదితమైన ఆత్మజ్ఞానం అసరం లేదు. అది వానికి కర్మమార్గాప్రవృత్తికి హేతు వవుతుంది కూడ అని భావం.)

భాష్యమ్

యదప్యుక్తం నియమాచ్చ (బ్ర.సూ.3.4.7) ఇతి. అత్రాభిధీయతే-

## సూ. నావిశేషాత్. 3.4.13

"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్" ఇత్యేవమాదిషు నియమశ్రవణేషు న విదుష ఇతి విశేషోఽస్తి. అవిశేషేణ నియమవిధానాత్. 13.

### బాలానందిని

యదపీతి :- నియమాచ్చ అని చెప్పినదానికి సమాధానం చెప్పబడుచున్నది-

నేతి:-" న = విద్వాంసునకు అనే నియమం లేదు; అవిశేషాత్ = విశేషం ఏమీ లేకుండా సామాన్య రూపంలోనే చెప్పబడింది కాబట్టి" అని సూత్రార్థం.

కుర్వన్నితి:- "కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్" ఇత్యాదినియమవాక్యాలలో 'విదుషః' అని (ఈ నియమం విద్వాంసునికి వర్తిస్తుందని) విశేషం ఏదీ లేదు. ఈ నియమం అవిశేషంగానే (సామాన్యరూపంలోనే)విధించబడింది. 13.

## సూ. స్తుతయేఽనుమతిర్వా. 3.4.14

"కుర్వన్నేవేహ కర్మాణి" (ఈ.ఉ.2) ఇత్యత్రాపరో విశేష ఆఖ్యాయతే. యద్యప్యత్ర ప్రకరణసామర్థ్యాద్విద్వానేవ కుర్వన్నితి సంబధ్యతే తథాపి విద్యాస్తుతయే కర్మానుజ్ఞానమేతద్ద్రష్టవ్యమ్. "న కర్మ లిప్యతే నరే" (ఈ.ఉ.2) ఇతి హి వక్ష్యతి. ఏతదుక్తం భవతి. యావజ్జీవం కర్మకుర్వత్యపి విదుషి పురుషే న కర్మ లేపాయ భవతి విద్యాసామర్థ్యాదితి. తదేవం విద్యా స్తూయతే. 14.

### బాలానందిని

స్తుతయ ఇతి:- "వా=లేక, స్తుతయే=విద్యాస్తుతి కొరకు, అనుమతిః=కర్మానుమతి అని చెప్పవచ్చును" అని సూత్రార్థం.

కుర్వన్నితి:-"కుర్వన్నేవేహ కర్మాణి" అన్నప్పుడు మరొక విశేషం చెప్పబడుచున్నది. ఇక్కడ ఉన్న ప్రకరణాన్ని పట్టి విద్వాంసుడే చేయుచూ అని అన్వయించినా కూడ ఇది విద్యను స్తుతించడం కోసం చేసిన కర్మానుజ్ఞానం (కర్మ చేయడానికి అనుజ్ఞ ఇవ్వడం) అని గ్రహించాలి. ఎందువల్ల ననగా-"న కర్మ లిప్యతే నరే" అని చెప్పనున్నాడు. ఇది చెప్పిన

ట్లవుతుంది-విద్వాంసుడైనవాడు యావజ్జీవమూ కర్మ చేస్తున్నా కూడ వానికి విద్యాసామర్థ్యం వల్ల కర్మ అంటదు. ఈ విధంగా విద్య స్తుతించబడుచున్నది. 14.

## సూ. కామకారేణ చైకే. 3:4.15

అపి చైకే విద్వాంసః ప్రత్యక్షీకృతవిద్యాఫలాః సన్తస్తదవష్టమ్భాత్ ఫలాన్తరసాధనేషు ప్రజాదిషు ప్రయోజనాభావం పరామృశన్తి కామకారేణేతి. శ్రుతిర్భవతి వాజసనేయినామ్-"ఏతద్ధ స్మ వై తత్ పూర్వే విద్వాంసః ప్రజాం న కామయన్తే కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయమాత్మాఽయం లోకః" (బృ.ఉ.4.4.22)ఇతి. అనుభవారూఢమేవ చ విద్యాఫలం న క్రియాఫలవత్కాలాన్తరభావీత్యసకృదవోచామ. అతోఽపి న విద్యాయాః కర్మశేషత్వం, నాపి తద్విషయాయాః ఫలశ్రుతేః అయథార్థత్వం శక్యమాశ్రయితుమ్. 15.

### బాలానందిని

కామకారేణేతి :- "ఏకే=కొందరు, కామకారేణ చ=స్వేచ్ఛగా కర్మలను పరిత్యజించారు" అని సూత్రార్థం.

అపిచేతి:- మరియు, కొందరు విద్వాంసులు విద్యాఫలాన్ని ప్రత్యక్షం చేసికొన్నవారై ఆ విద్యయొక్క అవష్టంభంవల్ల (దాని బలం చూచుకొని) ఇతరఫలాలకు సాధనాలైన సంతానాదులు నిష్ప్రయోజనము లని, స్వేచ్ఛగా (నిఃసంశయంగా)చెపుతున్నారు. "ఏతద్ధ......లోకః" (ప్రాచీనులైన విద్వాంసులు సంతానం కోరుకొనడంలేదు. మనకు ఆత్మ అనే ఈ లోకం ఉండగా సంతానంతో మనకేం పని)అని వాజసనేయుల శ్రుతి చెప్పుచున్నది. విద్యాఫలం వెంటనే అనుభవానికి వస్తుంది. కర్మఫలం వలె ఎప్పుడో కాలాంతరంలో లభించేది కాదు అని అనేక పర్యాయాలు చెప్పి ఉన్నాం. ఈ కారణంచేత కూడ విద్య కర్మశేషం అని కాని, ఆ విద్యవిషయంలో వినబడుచున్న ఫలం యథార్థం కాదని గాని చెప్పడానికి శక్యం కాదు. 15.

## సూ. ఉపమర్దం చ. 3.4.16.

అపి చ కర్మాధికారహేతోః క్రియాకారకఫలలక్షణస్య సమస్తస్య ప్రపఞ్చ

స్యావిద్యాకృతస్య విద్యాసామర్థ్యాత్ స్వరూపోపమర్దమామనన్తి- "యత్ర వా అస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్ కేన కం జిఘ్రేత్" (బృ.ఉ.2.4.14) ఇత్యాదినా. వేదాన్తోదితాత్మజ్ఞానపూర్వికాం తు కర్మాధికారసిద్ధిం ప్రత్యాశాసానస్య కర్మాధికారోచ్ఛిత్తిరేవ ప్రసజ్యేత. తస్మాదపి స్వాతన్త్ర్యం విద్యాయాః. 16.

బాలానందిని

**ఉపమర్దమితి :-** "ఉపమర్దం చ=అవిద్యాకృత మైన ప్రపంచంయొక్క బాధను కూడ శ్రుతి చెప్పుచున్నది" అని సూత్రార్థం.

**అపి చేతి :-**మరియు-కర్మాధికారానికి హేతువైన, క్రియా-కారక- ఫలస్వరూపమైన అవిద్యాకృతమైన సమస్తప్రపంచముయొక్క స్వరూపమూ కూడ విద్యాసామర్థ్యంచేత మర్దించబడుతుంది, బాధించడుతుంది, అని "యత్ర వా...కం జిఘ్రేత్" ఇత్యాదివాక్యాలచేత చెప్పుచున్నారు. కర్మాధికారసిద్ధి కావా లంటే ముందు వేదాంతంలో చెప్పిన ఆత్మజ్ఞానం కావాలి అని కోరుకునేవానికి కర్మాధికారమే పూర్తిగా ఉచ్ఛిన్నం అయి పోతుంది. ఆ కారణంవల్ల కూడ విద్య స్వతంత్రమైనది. 16.

## సూ. ఊర్ధ్వరేతస్సు చ శబ్దే హి. 3.4.17

**ఊర్ధ్వరేతస్సు** చ ఆశ్రమేషు విద్యా శ్రూయతే; న చ తత్ర కర్మాఙ్గత్వం విద్యాయా ఉపపద్యతే; కర్మాభావాత్. న హ్యగ్నిహోత్రాదీని వైదికాని కర్మాణి తేషాం సన్తి. స్యాదేతత్-ఊర్ధ్వరేతస ఆశ్రమా న శ్రూయన్తే వేద ఇతి. తదపి నాస్తి. తేఽపి హి వైదికేషు శబ్దేష్వవగమ్యన్తే-"త్రయో ధర్మస్కన్ధాః" (ఛా.ఉ.2.33.1) "యే చేమేఽరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే" (ఛా.ఉ.5.10.1), "తపఃశ్రద్ధే యే హ్యుపవసన్త్యరణ్యే" (ము.ఉ.1.2.11), "ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛన్తః ప్రవ్రజన్తి"(బృ.ఉ.4.4.22), "బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్"(జా.ఉ.4)ఇత్యేవమాదిషు. ప్రతిపన్నాప్రతిపన్నగార్హస్థ్యానామ్, అపాకృతానపాకృతర్ణత్రయాణాం చోర్ధ్వరేతస్త్వం శ్రుతిస్మృతిప్రసిద్ధమ్. తస్మాదపి స్వాతన్త్ర్యం విద్యాయాః. 17

## బాలానందిని

ఊర్ధ్వేతి :- "శబ్దే=వేదమునందు, ఊర్ధ్వరేతస్సు చ హి=ఊర్ధ్వరేతస్కుల విషయంలో కూడ విద్య వినబడుచున్నది" అని సూత్రార్థం.

ఊర్ధ్వరేతస్స్వితి :- ఊర్ధ్వరేతస్సులైన అశ్రమాలలో కూడ విద్య చెప్పబడుచున్నది. ఆ అశ్రమాలలో కర్మలే ఉండవు గాన అక్కడ విద్యకు కర్మాంగత్వం కుదరదు. వాళ్లకి అగ్నిహోత్రాదివైదికకర్మ లుండవు కదా? (ఆక్షేపం)-అది సరే-వేదంలో ఊర్ధ్వరేతస్సు లైన అశ్రమాలే చెప్పబడలేదు కదా? (సమాధానం)అది కూడ లేదు. (యుక్తం కాదు). అది కూడ "త్రయో ధర్మస్కన్ధాః" (కర్మప్రధానా లైన అశ్రమాలు మూడు, నాల్గవది బ్రహ్మసంస్థమైన అశ్రమం),"యే చేమే..ఉపాసతే;" "తపఃశ్రద్ధే యే హ్యుపవసన్త్యరణ్యే"(శ్రద్ధాతపోనిష్ఠులై అరణ్యంలో నివసిస్తారు అని పై రెండు వాక్యాల భావం)." ఏతమేవ...ప్రవ్రజన్తి" (సంన్యాసులు ఈ ఆత్మ రూపమైన లోకాన్నే కోరుకుంటూ ప్రవ్రజనం చేస్తారు) "బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్" ఇత్యాది శ్రుతులలో చెప్పబడింది. గార్హస్థ్యం గ్రహించినా గ్రహించకపోయినా, ఋషిఋణ-దేవఋణ- పితృఋణా లనే మూడు ఋణాలనూ తీర్చుకొన్నా తీర్చుకొనకపోయినా ఊర్ధ్వరేతస్త్వం శ్రుతిస్మృతులలో ప్రసిద్ధంగా ఉంది. అందువల్ల కూడ విద్య స్వతంత్రమైనది. 17.

పురుషార్థాధికరణం సమాప్తం

## 2. పరామర్శాధికరణమ్. సూ.18-20

### సూ. పరామర్శం జైమినిరచోదనా చాపవదతి హి. 3.4.18

"త్రయో ధర్మస్కన్ధాః" (ఛా.ఉ.2.23.1) ఇత్యాదయో యే శబ్దా ఊర్ధ్వరేతసామాశ్రమాణాం సద్భావాయోదాహృతాః న తే తత్ప్రతిపాదనాయ ప్రభవన్తి. యతః పరామర్శమేషు శబ్దేష్వాశ్రమాన్తరాణాం జైమినిరాచార్యో మన్యతే న విధిమ్. కుతః? న హ్యత్ర లిఙాదీనామన్యతమశ్చోదనాశబ్దోఽస్తి; అర్థాన్తర పరత్వం చైషాం ప్రత్యేకముపలభ్యతే. త్రయో ధర్మస్కన్ధా ఇత్యత్ర తావత్- "యజ్ఞోఽధ్యయనం దానమితి ప్రథమస్తప ఏవ, ద్వితీయో బ్రహ్మచార్యాచార్యకులవాసీ

తృతీయోఽత్యన్తమాత్మానమాచార్యకులేఽవసా దయన్సర్వ ఏతే పుణ్యలోకా భవన్తి" ఇతి పరామర్శపూర్వకమాశ్రమాణామనాత్యన్తికఫలత్వం సంకీర్త్యాత్యన్తికఫలతయా బ్రహ్మసంస్థతా స్తూయతే-"బ్రహ్మసంస్థోఽమృతత్వమేతి" (ఛా.ఉ. 2.23.1)ఇతి. నను పరామర్శేఽప్యాశ్రమా గమ్యన్త ఏవ. సత్యం గమ్యన్తే. స్మృత్యాచారాభ్యాం తు తేషాం ప్రసిద్ధిః,న ప్రత్యక్షశ్రుతేః. తతశ్చ ప్రత్యక్షశ్రుతివిరోధే సత్యనాదరణీయాస్తే భవన్తి. అనధికృతవిషయా వా.

బాలానందిని

పరామర్శమితి:- "జైమినిః=జైమిని, పరామర్శమ్=ఇతరాశ్రమాల పరామర్శ మాత్రమునుగా తలుస్తున్నాడు. అచోదనా చ=ఇది విధివాక్యం కాదు. అపవదతి హి=ఊర్ధ్వరేత ఆశ్రమాన్ని శ్రుతి నిందిస్తూన్నది కదా" అని సూత్రానికి అర్థం.

త్రయ ఇతి :- "త్రయో ధర్మస్కన్ధాః" మొదలైన ఏ శబ్దాలు ఊర్ధ్వరేతస్సులైన ఆశ్రమాల (సంన్యాసాశ్రమాల)ఉనికిని గూర్చి ఉదాహరించబడ్డాయో అవి వాటిని ప్రతిపాదించడానికి సమర్థములు కావు. ఎందువల్ల ననగా ఈ శబ్దాలలో ఇతరాశ్రమాల పరామర్శం మాత్రమే ఉంది, విధి లేదు అని ఆచార్యుడైన జైమిని భావిస్తున్నాడు. ఎందువల్ల? ఇక్కడ లిజ్ మొదలైన వాటిలో ఒకటైన చోదనాశబ్దం (విధివాచకశబ్దం)ఏదీ లేదు. ఈ శబ్దాలలో ఒక్కొక్కదానిలో అర్థాంతరపరత్వం (మరొక అర్థాన్ని ప్రతిపాదించే ఉద్దేశ్యం)కనబడుచున్నది. "త్రయో ధర్మస్కన్ధాః" అనే వాక్యంలో యజ్ఞం, అధ్యయనం, దానం అనే మొదటిది (త్రయం)తపస్సే. ఆచార్యకులంలో నివసించే బ్రహ్మచారి రెండవ అంశం. ఆజీవితాంతం ఆచార్యకులంలో ఉండి జీర్ణించిపోయేవాడు మూడవ అంశం. వీళ్లందరూ పుణ్యలోకు లవుతారు అని పరామర్శిస్తూ. ఆ ఆశ్రమము లనైకాంతికఫలము లని (అనిశ్చితఫలములు అని)చెప్పి, బ్రహ్మసంస్థ ఆత్యంతికఫలం కలదని (ఉత్తమఫలం ఇస్తుందని) "బ్రహ్మసంస్థోఽమృతత్వమేతి" అని స్తుతింపబడుచున్నది. (ప్రశ్న). ఇది పరామర్శయే అయినా కూడ ఆశ్రమాలు (సంన్యాసాశ్రమాలు) తెలుస్తాన్నాయి కదా? (సమాధానం). నిజమే, తెలుస్తున్నాయి. స్మృత్యాచారాలను పట్టి మాత్రమే అవి తెలుస్తున్నాయి కాని ప్రత్యక్షంగా శ్రుతివల్ల తెలియడంలేదు. అందువల్ల ప్రత్యక్షమైన శ్రుతితో విరోధం

ఉన్నప్పుడు అవి అనాదరణీయము లైనా కావాలి, లేదా (ఇతరాశ్రమాలలో) అధికారం లేనివాళ్లకొరకై చెప్పబడిన వైనా కావాలి.

వి. భాష్యంలోని "ఊర్ధ్వరేతసామ్ ఆశ్రమాణామ్" అనగా సంన్యాసాశ్రమం అని అర్థం. సంన్యాసాశ్రమం ఒక్కటే అయినా దానిలోని అవాంతరభేదాలను పట్టి బహువచనం ప్రయోగించబడింది. ఈ సందర్భంలో రత్నప్రభలో ఆ యా ఆశ్రమాల అవాంతర భేదాలు కాణ్వాయనస్మృత్యనుసారం ఈ క్రింది విధంగా చూపబడ్డాయి. (1) గాయత్రుడు (2) బ్రాహ్మడు (3)ప్రాజాపత్యుడు (4) బృహన్ అని బ్రహ్మచారి నాలుగు విధాలు ఉపనయనానంతరం కారం, ఉప్పు తినకుండా మూడు రోజుల పాటు గాయత్రీజపం చేసినవాడు గాయత్రుడు. వేదాధ్యయనం పూర్తి అయ్యే వరకు బ్రహ్మచర్యం అవలంబించినవాడు బ్రాహ్మడు. ఋతుకాలంలో స్వభార్యాగమనం చేస్తూ పూర్తిగా పరస్త్రీవిముఖుడైన వాడు ప్రాజాపత్యుడు. లేదా ఒక సంవత్సరం పాటు వేదవ్రతం అనే వ్రతం ఆచరించినవాడు ప్రాజాపత్యుడు. ఆమరణాంతం గురుకులంలోనే ఉండే నైష్ఠికుడు బృహన్ అనే బ్రహ్మచారి. (1) వార్తకుడు (2) యాయావరుడు (3) శాలీకుడు (4) ఘోరసంన్యాసికుడు అని గృహస్థుడు కూడ నాలుగు విధాలు. కృషి, గోరక్ష మొదలైన వైశ్యవృత్తితో జీవిస్తూ నిత్యాగ్నిక్రియ చేసేవాడు వార్తకవృత్తి. యాచన చేయకుండా జీవిస్తూ యాజన-అధ్యాపన-ప్రతిగ్రహాల విషయంలో విముఖుడుగా ఉండేవాడు యాయావరుడు. యజన- యాజన-అధ్యయన-అధ్యాపన-దాన-ప్రతిగ్రహా లనే ఆరు కర్మలు చేస్తూ ధనసంచయం చేసేవాడు శాలీనుడు. తాను స్వయంగా నదీకూపతటాకాదులనుండి గ్రహించిన ఉదకంమాత్రమే వాడుతూ, ప్రతిరోజూ ఉంఛవృత్తి(పొలాలలో పడిపోయిన ధాన్యపుగింజలు మొదలైనవి ఏరికొనడం ఉంఛవృత్తి)చేసుకొంటూ గ్రామంలో నివసించేవాడు ఘోరసంన్యాసి. సర్వథా హింసావిముఖు డవడంచేత ఈ పేరు. (1)వైఖానసుడు (2)ఔదుమ్బరుడు (3)వాలఖిల్యుడు (4)ఫేనపుడు అని వానప్రస్థుడు కూడ నాలుగు విధాలు. గ్రామం బైట దున్నకుండా మొలిచే ఓషధులతో (సస్యాలతో)జీవిస్తూ అగ్నిహోత్రాదికం చేస్తూండేవాడు వైఖానసుడు. ప్రాతఃకాలం లేవగానే ఏదిక్కు వైపు చూస్తాడో ఆ దిక్కునం దున్న ఉదుంబరాలు, రేగి నెవరుధాన్యం. శ్యావాకాలనే ధాన్యం ఏటితో పని జరుపుకొనేవాడు ఔదుంబరుడు. జటావల్కలాలు ధరించి ఎనిమిది మాసాలు

ఆహారం సంపాదించుకొని, నాలుగు మాసాలు ఆ నిలవచేసికొన్న ఆహారం తిని కార్తిక పూర్ణిమనాడు సంగ్రహించుకొన్న పుష్పఫలాదులను త్యజించేవాడు వాలఖిల్యుడు. ఎక్కడనో అక్కడ నివసిస్తూ, రాలిన ఆకులు పండ్లు తింటూ కర్మపరు లైనవాళ్లు ఫేనపులు. (1)కుటీచకులు (2)బహూదకులు (3)హంసలు (4)పరమహంసలు అని పరివ్రాజకులు కూడ నాలుగు విధాలు. తమ పుత్రుల ఇండ్లలోనే భిక్షాచరణం చేసే త్రిదండులు (మూడు దండాలు ధరించేవాళ్లు)కుటీచకులు. త్రిదండధారులై ఉట్టి, జలం,పవిత్రం, పాదుకలు, ఆసనం, శిఖాయజ్ఞోపవీతాలు,కౌపీనం,కాషాయవస్త్రాలు ధరించి, తీర్థయాత్ర చేస్తూ, భిక్షాటనం చేస్తూ ఆత్మచింతనం చేసేవాళ్లు బహూదకులు. ఏకదండధారులై, శిఖ లేకుండా, యజ్ఞోపవీతం ధరించి, ఉట్టి, కమండలువు చేతిలో ధరించి, ఒక గ్రామంలో ఒక్క రోజుమాత్రమే నివసిస్తూ కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతాలు చేసేవారు హంసలు. ఏకదండధారులై, బోడితలలతో, యజ్ఞోపవీతం లేకుండా, సమస్తకర్మలు త్యజించి ఆత్మనిష్ఠులైనవారు పరమహంసలు.

స్కంధశ్రుతిలో ఆశ్రమాలు విధించబడడం లేదు. ఆశ్రమాలను అనువదించి బ్రహ్మసంస్థత స్తుతించబడుచున్నది. సంన్యాసాశ్రమవిధాయకమైన శ్రుతి లేదు. స్మృత్యాచారాలలో సంన్యాసాశ్రమం ఉన్నా కూడ శ్రుతివిరోధంచేత అవి ప్రమాణం కావు అని పూర్వపక్షి అభిప్రాయం.

## భాష్యమ్

నను గార్హస్థ్యమపి సహైవోర్ధ్వరేతోభిః పరామృష్టమ్-"యజ్ఞోఽధ్యయనం ధ్యయనం దానమితి ప్రథమః" ఇతి? సత్యమేవమ్. తథాపి తు గృహస్థం ప్రత్యేవాగ్నిహోత్రాదీనాం కర్మణాం విధానాచ్ఛ్రుతిప్రసిద్ధమేవ హి తదస్తిత్వమ్. తస్మాత్ స్తుత్యర్థ ఏవాయం పరామర్శో న చోదనార్థః. అపి చాపవదతి ప్రత్యక్షా శ్రుతిరాశ్రమాన్తరమ్-"వీరహా వా ఏష దేవానాం యోఽగ్నిముద్వాసయతే,"(తై.సం. 1.5.2.1) "ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య ప్రజాతన్తుం మా వ్యవచ్ఛేత్సీః" (తై.ఉ.1.11.1) "నాపుత్రస్య లోకోఽస్తీతి తత్సర్వే పశవో విదుః" ఇత్యేవమాద్యా.

తథా "యే చేమేఽరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే" (ఛా.ఉ.5.10.1) "తపఃశ్రద్ధే యే హ్యుపవసన్త్యరణ్యే"(ము.ఉ.1.2.44) ఇతి చ దేవయానోపదేశో, నాశ్రమాన్తరోపదేశః. సందిగ్ధం చాశ్రమాన్తరాభిధానమ్-"తప ఏవ ద్వితీయమ్" (ఛా,ఉ.2.23.1) ఇత్యేదమాదిషు. తథా"ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛన్తః ప్రవ్రజన్తి" (బృ.ఉ.4.4.22)ఇతి లోకసంస్తవోఽయం న పారివ్రాజ్యవిధిః. నను "బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్" ఇతి విస్పష్టమిదం ప్రత్యక్షం పారివ్రాజ్యవిధానంజాబా లానామ్? సత్యమేతత్. అనపేక్ష్య త్వేతాం శ్రుతిమయం విచార ఇతి ద్రష్టవ్యమ్. 18.

బాలానందిని

నన్వితి :- (ప్రశ్న) "యజ్ఞోఽధ్యయనం దానమితి ప్రథమః" అని ఊర్ధ్వరేతస్సులతోపాటు గార్హస్థ్యం కూడ పరామర్శించబడింది కదా? (ఊర్ధ్వరేతస్త్వం కేవలం పరామర్శించబడిందే కాని విధింపబడలేదు అన్నట్లయితే గార్హస్థ్యం విషయం కూడా అంతే అనాలి గదా అని పృచ్ఛకుని అభిప్రాయం) (సమాధానం)-నిజమే. కాని అగ్నిహోత్రాదికర్మలన్నీ గృహస్థునికొరకే విధింపబడ్డాయి గాన గార్హస్థ్యం ఉన్న దనే విషయం శ్రుతిప్రసిద్ధమే. అందువల్ల ఈ పరామర్శ స్తుతికొరకు చేయబడినదే గాని విధికొరకు కాదు. మరొక విషయ మేమనగా "వీరహా...ఉద్వాసయతే"(అగ్నికి ఉద్వాసన చెప్పినవాడు దేవసంతానాన్ని చంపినవా డవుతాడు), "ఆచార్యాయ....వ్యవచ్ఛేత్సీః" (ఆచార్యునికి ఇష్టమైన ధనం సమర్పించి బ్రహ్మచర్యం పూర్తిచేసికొన్న తరవాత సంతానాన్ని ఛేదించకుము) "నాపుత్రస్య...విదుః" (పుత్రుడు లేనివానికి గతి లేదని అందరు మానవులూ ఎరుగుదురు) ఈ మొదలైన ప్రత్యక్షమైన శ్రుతి ఆశ్రమాంతరాన్ని నిషేధిస్తూన్నది. అట్లే "యే చేమే...ఉపాసతే " "తపః శ్రద్ధే యే హ్యుపవసన్త్యరణ్యే" అనేది దేవయానోపదేశమే కాని ఆశ్రమాంతరోపదేశం కాదు. అట్లే "తప ఏవ ద్వితీయమ్" ఇత్యాదులలో కూడ ఆశ్రమాంతరాన్ని చెప్పడం సందిగ్ధమే. అట్లే "ఏతమేవ....ప్రవ్రజన్తి" అనేది లోకస్తుతియే కాని సంన్యాసాశ్రమవిధి కాదు. (ప్రశ్న) "బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్" అని జాబాలుల పారివ్రాజ్యవిధానం స్పష్టంగా ఉంది కదా? (సమాధానం)ఈ శ్రుతిని అపేక్షించకుండా (ఉన్నట్లు గుర్తించకుండా)ఈ విచారం చేయబడిన దని చూచుకోవాలి. 18.

సూ. అనుష్ఠేయం బాదరాయణః సామ్యశ్రుతేః. 3.4.19.

అనుష్ఠేయమాశ్రమాన్తరం బాదరాయణ ఆచార్యో మన్యతే. వేదేఽశ్రవణాత్, అగ్నిహోత్రాదీనాం చావశ్యానుష్ఠేయతత్వాత్తద్విరోధా దనధికృతానుష్ఠేయమాశ్రమాన్తరమితీహీమాం మతిం నిరాకరోతి గార్హస్థ్యవదేవాశ్రమాన్తరమప్యనిచ్ఛతా ప్రతిపత్తవ్యమితి మన్యమానః. కుతః? సామ్యశ్రుతేః. సమానా హి గార్హస్థ్యేనాశ్రమాన్తరస్య పరామర్శశ్రుతిర్దృశ్యతే "త్రయో ధర్మస్కన్ధాః" (ఛా.ఉ.2.23.1)ఇత్యాద్యా. యథేహ శ్రుత్యన్తరవిహితమేవ గార్హస్థ్యం పరామృష్టమ్ ఏవమాశ్రమాన్తరమపీతి ప్రతిపత్తవ్యమ్; యథా చ శాస్త్రాన్తరప్రాప్తయోరేవ నివీతప్రాచీనావీతయోః పరామర్శ ఉపవీతవిధిపరే వాక్యే. తస్మాత్తుల్యమనుష్ఠేయత్వం గార్హస్థ్యేనాశ్రమాన్తరస్య. తథా "ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛన్తః ప్రవ్రజన్తి" (బృ.ఉ.4.4.22) ఇత్యస్య వేదానువచనాదిభిః సమభివ్యాహారః. "యే చేమేఽరణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే" (చా.ఉ.5.10.1)ఇత్యస్య చ పఞ్చాగ్నివిద్యయా. యత్తూక్తం-"తప ఏవ ద్వితీయః"(ఛా.ఉ.2.23.1) ఇత్యాదిష్వాశ్రమాన్తరవిధానం సన్దిగ్ధమితి, నైష దోషః. నిశ్చయకారణసద్భావాత్. "త్రయో ధర్మస్కన్ధాః" (ఛా.ఉ.2.23.1)ఇతి హి ధర్మస్కన్ధత్రిత్వం ప్రతిజ్ఞాతమ్. న చ యజ్ఞాదయో భూయాంసో ధర్మాః ఉత్పత్తినిమిత్తాః సన్తః అన్యత్రాశ్రమసంబన్ధాత్త్రిత్వేఽన్తర్భావయితుం శక్యన్తే. తత్ర యజ్ఞాదిలిఙ్గో గృహాశ్రమ ఏకో ధర్మస్కన్ధో నిర్దిష్టః. బ్రహ్మచారీతి చ స్పష్ట ఆశ్రమనిర్దేశః. తప ఇత్యపి కోఽన్యస్తపఃప్రధానాదాశ్రమాద్ధర్మస్కన్ధోఽభ్యుపగమ్యతే? "యే చేమేఽరణ్యే" (ఛా.ఉ.5.10.1) ఇతి చారణ్యలిఙ్గాత్ శ్రద్ధాతపోభ్యామాశ్రమగృహీతిః. తస్మాత్పరామర్శేఽప్యనుష్ఠేయమాశ్రమాన్తరమ్. 19.

బాలానందిని

అనుష్ఠేయమితి:-"సామ్యశ్రుతేః=గృహస్థాశ్రమంతో సమంగా వినబడడంవల్ల,

అనుష్ఠేయమ్=సంన్యాసాశ్రమమును కూడ అనుష్ఠేయమైనదానినిగా, బాదరాయణః=బాదరాయణుడు చెప్పుచున్నాడు" అని సూత్రార్థం.

అనుష్ఠేయమితి :-ఆశ్రమాంతరం అనుష్ఠేయమే అని ఆచార్యుడైన బాదరాయణుడు తలచుచున్నాడు. వేదంలో (సంన్యాసాశ్రమాన్ని గూర్చి) చెప్పకపోవడంవల్ల, అగ్నిహోత్రాదులు తప్పక ఆచరింపదగినవి గాన దానికి విరోధంవల్ల, ఈ ఆశ్రమాంతరం అధికారి కానివానిచేత (బ్రహ్మచర్యాదులయందు,అధికారం లేనివానిచేత)అనుష్ఠింపదగినది అనే ఈ అభిప్రాయాన్ని, బాదరాయణుడు, గార్హస్థ్యాన్ని అంగీకరించి నట్లే ఆశ్రమాంతరాన్ని కూడ, ఇష్టం లేక పోయినా కూడ, అంగీకరించి తీరాలి అని భావిస్తూ, నిరాకరిస్తున్నాడు. ఎందువల్ల? సామ్యశ్రుతివల్ల? ఆశ్రమాంతరాన్ని పరామర్శించే "త్రయో ధర్మస్కన్ధాః" ఇత్యాదిశ్రుతి గార్హస్థ్యానికీ, ఆశ్రమాంతరానికీ కూడ సమానమే కదా? మరొక శ్రుతిచేత విధించబడిన గార్హస్థ్యం ఏ విధంగా ఇక్కడ పరామర్శించబడిందో ఆశ్రమాంతరం కూడ అదే విధంగా పరామర్శించబడిన దని గ్రహించాలి. శాస్త్రాంతరంచేత ప్రాప్తములైన నివీత- ప్రాచీనావీతాలే ఉపవీతాన్ని విధించే వాక్యంలో ఏ విధంగా పరామర్శించబడుతున్నాయో అట్లే ఇక్కడ కూడ. అందువల్ల ఆశ్రమాంతరం గార్హస్థ్యంతో సమంగానే అనుష్ఠింపదగినది.

వి. "నివీతం మనుష్యాణాం ప్రాచీనావీతం పిత్ౠణామ్ ఉపవీతం దేవానామ్" (మనుష్యులకు సంబంధించిన క్రియలలో నివీతం, పిత్ర్యకర్మలలో ప్రాచీనావీతం, దైవకర్మలో ఉపవీతం)అని దైవకర్మలో ఉపవీతం విధించబడింది. ఎడమ బుజంమీద నుంచి కుడి పార్శ్వానికి వ్రేలాడే యజ్ఞసూత్రం ఉపవీతం. కుడి బుజంనుంచి ఎడమప్రక్కకు వ్రేల్లాడేది ప్రాచీనావీతం. కంఠంలో హారం వలె వ్రేలాడేది నివీతం. ఈ వాక్యంలో దైవకర్మలో ఉపవీతాన్ని విధిస్తూ మానుష-పిత్ర్యకర్మలకు సంబంధించిన, శాస్త్రాంతరంచేత విధించబడిన. నివీత-ప్రాచీనావీతాలను అనువదించడం జరిగింది. అదే విధంగా ఇక్కడ శ్రుత్యంతరవిహితాలైన గార్హస్థ్యసన్యాసాశ్రమాలు అనువదింపబడినవి. అట్లే "ఏతమేవ...ప్రవ్రజన్తి" అనేదానికి వేదానువచనాదులతో సమభివ్యాహారం (కలిపి చెప్పడం). (అందుచేత వేదానువచనాదుల వలె సంన్యాసం కూడ విధేయమే అని భావం). "యే చేమే...ఉపాసతే" అనే దానికి పంచాగ్ని విద్యతో సమభివ్యాహారం. (అందుచేత

పంచాగ్నివిద్యవలె ఇది, సంన్యాసం, కూడ విధేయం అని భావం). "తప ఏవ ద్వితీయః" ఇత్యాదులలో ఆశ్రమాంతరాన్ని గూర్చి చెప్పడం సందిగ్ధం అని ఏది చెప్పబడిందో ఆ దోషం లేదు. ఎందువల్ల ననగా నిశ్చయానికి తగిన కారణం ఉంది. "త్రయో ధర్మస్కన్ధాః" (ఛా ఉ.2.23.1)అని ధర్మస్కంధాలు మూడు అని ప్రతిజ్ఞ చేయబడింది. ఉత్పత్తి భిన్నాలైన అనేకమైన ధర్మాలు ఆశ్రమసంబంధం లేకపోతే మూడు అనే సంఖ్యలో అంతర్గతం చేయడానికి శక్యం కావు కదా?

వి. ఉత్పత్తిభిన్నాః=వేరువేరైన ఉత్పత్తివాక్యాలచేత, (విధించే వాక్యాల చేత)విధింపబడినవి అని అర్థం. అనగా యజ్ఞం 'యజేత' అనే విధిచేత విధించబడింది "అధ్యేతవ్యమ్", "దద్యాత్" అనే పదాలచేత అధ్యయనదానాలు విధించబడ్డాయి. ఈ విధంగా అనేకధర్మాలు విధింపబడి ఉన్నాయి. ఇవి త్రిత్వసంఖ్యలో ఇమడవు. మూడుకంటె అధికంగా ఉంటాయి కదా? వీటిని త్రిత్వసంఖ్యలో ఇమడ్చాలంటే మూడు ఆశ్రమాలు చెప్పబడి నట్లు, ఒక్కొక్క ఆశ్రమానికి కొన్ని ధర్మాలు చెప్పడంచేత అనేక ధర్మాలను మూడు సంఘాతాలుగా చేయడంచేత త్రిత్వసంఖ్యను చెప్పినట్లు అర్థం చెప్పుకొనవచ్చును. అందుచేత ఇక్కడ ఆశ్రమనిర్దేశం ఉందని అంగీకరించాలి అని భావం.

తత్రేతి:-వాటిలో యజ్ఞాదికం లింగంగా గల గృహాశ్రమం ఒక ధర్మస్కంధంగా నిర్దేశించబడింది. బ్రహ్మచారీ అని ఆశ్రమనిర్దేశం స్పష్టంగానే ఉంది. 'తపః' అని కూడ తపఃప్రధానమైన ఆశ్రమంకంటె (వానప్రస్థంకంటె)భిన్నమైన మరి ఏ స్కంధం అంగీకరించబడుతుంది? "యే చారణ్యే" అని అరణ్యం అనే లింగంవల్ల "శ్రద్ధాతపస్సుల" చేత ఆశ్రమాన్నే (వానప్రస్థాశ్రమాన్నే) గ్రహించాలి. అందువల్ల ఇది పరామర్శ మాత్రమే అయినా కూడ ఆశ్రమాంతరం (సంన్యాసం)అనుష్ఠేయమే. 19.

## సూ. విధిర్వా ధారణవత్. 3.4.20

విధిర్వాయమాశ్రమాన్తరస్య, న పరామర్శమాత్రమ్. నను విధిత్వాభ్యుపగమే ఏకవాక్యతాప్రతీతిరుపరుధ్యేత. ప్రతీయతే చాత్రైకవాక్యతా పుణ్యలోకఫలాస్త్రయో ధర్మస్కన్ధాః బ్రహ్మసంస్థతా త్వమృతత్వఫలేతి. సత్యమేతత్.

సతీమప్యేకవాక్యతాప్రతీతిం పరిత్యజ్య విధిరేవాభ్యుపగన్తవ్యః, అపూర్వత్వాత్, విధ్యన్తరస్యాదర్శనాత్. విస్పష్టాచ్చాశ్రమాన్తరప్రత్యయాత్ గుణవాదకల్పనయైకవాక్యత్వయోజనానుపపత్తేః. ధారణవత్. యథా-"అధస్తాత్సమిధం ధారయన్ననుద్రవేదుపరి హి దేవేభ్యో ధారయతి". ఇత్యత్ర సత్యామప్యధో ధారణేనైకవాక్యతాప్రతీతౌ విధీయత ఏవోపరిధారణమ్, అపూర్వత్వాత్. తథాచోక్తం శేషలక్షణే-"విధిస్తు ధారణేఽపూర్వత్వాత్" ఇతి. తద్వదిహాప్యాశ్రమపరామర్శ శ్రుతిర్విధిరేవేతి కల్ప్యతే.

బాలానందిని

విధిరితి :- "ధారణవత్=ధారణంవలె, విధిర్వా=ఇది సంన్యాసవిధియే(అనువాద మాత్రం కాదు)" అని సూత్రార్థం.

విధిర్వా ఇతి :-("త్రయో ధర్మస్కన్ధాః" అనే చోట) ఇది పరామర్శమాత్రం కాదు;విధియే. (ప్రశ్న)-ఇది విధి అని అంగీకరిస్తే ఏకవాక్యతాప్రతీతికి భంగం వస్తుంది. ఇక్కడ మూడు ధర్మస్కంధాలకీ ఫలం పుణ్యలోకం. బ్రహ్మసంస్థతకు మాత్రం ఫలం అమృతత్వం అని ఏకవ్యాక్యత కనబడుచున్నది కదా? (మొదటి మూడింటి విషయంలోను పరామర్శం, సంన్యాసం విషయంలో విధి అని చెప్పి నట్లయితే ఏకవాక్యతకు భంగం వస్తుంది అని అర్థం). (సమాధానం)- ఈ మాట నిజమే. ఏకవాక్యతాప్రతీతి ఉన్నా కూడ దానిని విడచి, (ఇది - సంన్యాసం) అపూర్వం (క్రొత్తది)కాబట్టి, మరొక విధివాక్యం ఏదీ కనబడడంలేదు కాబట్టి కూడ, ఇక్కడ విధినే అంగీకరించాలి. ఆశ్రమాంతరం (సంన్యాసం)యొక్క ప్రత్యయం స్పష్టంగా కనబడుచున్నది గాన, దీనిని గుణవాదంగా (స్తుతిరూపార్థ వాదంగా)కల్పించి అనూద్యమానములైన ఇతరాశ్రమాలతో ఏకవాక్యత్వం కల్పించడం యుక్తం కాదు కదా? ఇందుకు ఉదాహరణం ధారణం. "అధస్తాత్...ధారయతి"(సమిధను క్రింద ఉండేటట్లు పట్టు కొని తీసికొనివెళ్లాలి దేవతలకైతే పైన ఉండే టట్లు ధరిస్తాడు కదా)అనే చోట అధోధారణంతో ఏకవాక్యత ఉన్నా కూడ, అపూర్వం గాన ఉపరిధారణం ఏ విధంగా విధించబడుతుందో అట్లే శేషప్రకరణంలో (జైమినిచేత) "విధిస్తు

జై.సూ. 3-4-15
ధారణేఽపూర్వత్వాత్" అని చెప్పబడింది. అట్లే ఇక్కడ కూడ ఆశ్రమపరామర్శ శ్రుతి విధియే అని కల్పించబడుతుంది.

వి. ప్రేతాగ్నిహోత్రప్రకరణంలో "అధస్తాత్ సమిధమ్" ఇత్యాదివాక్యం ఉన్నది దైవకర్మలో స్రుక్కుయొక్క బిలానికి పైన సమిధ ధరించదుతుంది. అందుచేత ఇక్కడ సమిధను క్రింద ధరించాలి అని సమిధయొక్క అధోధారణం విధింబడుచున్నది. ఈ వాక్యంలోనే ఉపరిధారణం కూడ విధించబడితే వాక్యభేదదోషం కలుగుతుంది గాన ఉపరిధారణవిధి లేదు అని పూర్వపక్షం చేసి ఉపరిధారణం విధించే వాక్యాంతరం ఏదీ లేదు గాన, వాక్యభేదం కలిగినా కూడ, ఉపరిధారణం విధించబడుతుంది అని సిద్ధాంతం చెప్పబడింది. అపూర్వం గాన (ఉపరి)ధారణం విషయంలో కూడ ఇక్కడ విధి అంగీకరించాలి అని జైమినిసూత్రానికి అర్థం.

## భాష్యమ్

యద్యపి పరామర్శ ఏవాయమాశ్రమాన్తరాణాం తథాపి బ్రహ్మసంస్థతా తావత్సామర్థ్యాదవశ్యం విధేయాభ్యుపగన్తవ్యా. సా చ కిం చతుర్ష్వాశ్రమేషు యస్య కస్య చిత్ ఆహోస్విత్పరివ్రాజకస్యైవేతి వివేక్తవ్యమ్. యది చ బ్రహ్మచార్యన్తేష్వాశ్రమేషు పరామృశ్యమానేషు పరివ్రాజకోఽపి పరామృష్టః తతశ్చతుర్ణామప్యాశ్రమాణాం పరామృష్టతాత్వావిశేషాదనాశ్రమిత్వానుపపత్తేశ్చ యః కశ్చిచ్చతుర్ష్వాశ్రమేషు బ్రహ్మసంస్థో భవిష్యతి. అథ న పరామృష్టః తతః పరిశిష్యమాణః పరివ్రాడేవ బ్రహ్మసంస్థ ఇతి సేత్స్యతి. తత్ర తపఃశబ్దేన వైఖానసగ్రాహిణా పరామృష్టః పరివ్రాడపీతి కేచిత్. తదయుక్తమ్. న హి సత్యాం గతౌ వానప్రస్థవిశేషణేన పరివ్రాజకో గ్రహణమర్హతి. యథాత్ర బ్రహ్మచారి గృహమేధినావసాధారణేనైవ స్వేన స్వేన విశేషణేన విశేషితావేవం భిక్షువైఖానసావపీతి యుక్తమ్. తపశ్చాసాధారణో ధర్మో వానప్రస్థానాం కాయక్లేశప్రధానత్వాత్. తపఃశబ్దస్య చ తత్ర రూఢేః. భిక్షోస్తు కర్మ ఇన్ద్రియసంయమాదిలక్షణో నైవ

తపఃశబ్దేనోపలక్ష్యతే. చతుష్ట్వేన చ ప్రసిద్ధా ఆశ్రమాస్త్రిత్వేన పరామృశ్యన్త ఇత్యన్యాయ్యమ్.

### బాలానందిని

యద్యపి చేతి:- ఇది ఆశ్రమాంతరాల పరామర్శమే అని చెప్పినా కూడ స్తుతిసామర్థ్యం వల్ల బ్రహ్మసంస్థత్వం విధేయమే అని తప్పక అంగీకరించాలి. అది నాలుగు ఆశ్రమాలలోను ఏదో ఒక ఆశ్రమానికి సంబంధించినదా లేక పరివ్రాజకునికి మాత్రమే సంబంధించినదా అని వివేచన చెయ్యాలి. ఇక్కడ పరామర్శించబడుచున్న, బ్రహ్మచారివరకు ఉన్న, ఆశ్రమాలలో పరివ్రాజకుడు పరామర్శించబడినాడని అన్నట్లయితే అప్పుడు నాలుగు ఆశ్రమాలు సమంగానే పరామర్శించబడ్డాయి కాబట్టి, అనాశ్రమిత్వం (ఏదో ఒక ఆశ్రమం లేకుండా ఉండడం)యుక్తం కాదు కూడ గాన నాలుగు ఆశ్రమాలలోను ఎవడో ఒకడు బ్రహ్మసంస్థడవుతాడు. అలా కాక పరామర్శింపబడక పోయిన ట్లయితే మిగిలిన పరివ్రాట్టే బ్రహ్మసంస్థుడు అని సిద్ధిస్తుంది.

ఇక్కడ కొందరు వైఖానసుణ్ణి గ్రహించే తపఃశబ్దంచేత పరివ్రాట్టు కూడ గ్రహింపబడ్డాడు అని అంటున్నారు. అది యుక్తం కాదు. గతి ఉన్నప్పుడు వానప్రస్థుని విశేషణమైన తపస్సుచేత పరివ్రాజకుణ్ణి గ్రహించడం తగదు కదా? ఇక్కడ బ్రహ్మచారి-గృహస్థులు ఏవిధంగా తమ తమ అసాధారణమైన విశేషణంచేత విశేషించబడ్డారో భిక్షుకవైఖానసులుకూడ అలాగే విశేషింపబడ్డారు అని చెప్పడం యుక్తం. తపస్సు అనేది కాయక్లేశప్రధాన మైనది; తపఃశబ్దానికి ఆ అర్థంలోనే (కాయక్లేశం అనే అర్థంలోనే) రూఢి. అందుచేత తపస్సు వానప్రస్థుల అసాధారణధర్మం. (వాళ్లకు మాత్రమే సంబంధించిన ధర్మం.) సంన్యాసిధర్మమైన ఇంద్రియసంయమాదికం తపస్సు అని చెప్పబడదు. నాలుగు అని ప్రసిద్ధంగా ఉన్న ఆశ్రమాలను మూడు అనడం కూడ అన్యాయ్యం.

### భాష్యమ్

అపి చ భేదవ్యపదేశోఽత్ర భవతి-"త్రయ ఏతే పుణ్యలోకభాజః ఏకోఽమృతత్వభాక్" ఇతి. పృథక్త్వే చైష భేదవ్యపదేశోఽవకల్పతే. న హ్యేవం భవతి దేవదత్తయజ్ఞదత్తౌ మన్దప్రజ్ఞౌ అన్యతరస్త్వనయోర్మహాప్రజ్ఞ ఇతి. భవతి

త్యేవం దేవదత్తయజ్ఞదత్తౌ మన్దప్రజ్ఞౌ విష్ణుమిత్రస్తు మహాప్రజ్ఞ ఇతి. తస్మాత్పూర్వే త్రయ ఆశ్రమిణః పుణ్యలోకభాజః, పరిశిష్యమాణః పరివ్రాడేవామృతత్వభాక్. కథం పునర్బ్రహ్మసంస్థశబ్దో యోగాత్ప్రవర్తమానః సర్వత్ర సంభవన్ పరివ్రాజక ఏవావతిష్ఠేత? రూఢ్యభ్యుపగమే వాశ్రమమాత్రాదమృతత్వప్రాప్తేః జ్ఞానానర్థక్య ప్రసంగః ఇతి. అత్రోచ్యతే-బ్రహ్మసంస్థ ఇతి హి బ్రహ్మణి పరిసమాప్తిః, అనన్యవ్యాపారతారూపం తన్నిష్ఠత్వమభిధీయతే. తచ్చ త్రయాణామాశ్రమాణాం న సంభవతి; స్వాశ్రమవిహితకర్మాననుష్ఠానే ప్రత్యవాయశ్రవణాత్. పరివ్రాజకస్య తు సర్వకర్మసంన్యాసాత్ ప్రత్యవాయో న సంభవతి అననుష్ఠాననిమిత్తః. శమదమాదిస్తు తదీయో ధర్మో బ్రహ్మసంస్థతాయా ఉపోద్బలకో న విరోధీ. బ్రహ్మనిష్ఠత్వమేవ హి తస్య శమదమాద్యుపబృంహితం స్వాశ్రమవిహితం కర్మ యజ్ఞాదీని చేతరేషామ్. తద్వ్యతిక్రమే చ తస్య ప్రత్యవాయః.

బాలానందిని

**అపి చేతి** :-మరొక విషయ మేమనగా-"త్రయ...అమృతత్వభాక్" అని ఇక్కడ భేదనిర్దేశం కూడ ఉన్నది. ఇవి వేరు వేరైనప్పుడే ఇలా భేదనిర్దేశం కుదురుతుంది. దేవదత్త యజ్ఞదత్తు లిద్దరూ తెలివితక్కువవాళ్లు, వీళ్లిద్దరిలో ఒకడు మాత్రం మహాబుద్ధిశాలి అని అనరు కదా? దేవదత్తయజ్ఞదత్తు లిద్దరూ తెలివి తక్కువవాళ్లు, విష్ణుమిత్రుడు మాత్రం మహాబుద్ధిశాలి అని మాత్రం అనవచ్చు. అందువల్ల మొదటి మూడు ఆశ్రమాలవాళ్లు పుణ్యలోకాలకే వెళ్లేవాళ్లు, మిగిలిన పరివ్రాజకుడు మాత్రమే అమృతత్వం పొందేవాడు. (ప్రశ్న) 'బ్రహ్మసంస్థ' శబ్దం (బ్రహ్మయందు స్థిరంగా ఉన్నవాడు అను)యోగం (అవయవార్థం)చేత అందరివిషయంలోను ప్రయోగించడానికి తగినది; అది ఒక్క పరివ్రాజకుణ్ణి మాత్రమే ఎలా బోధిస్తుంది? (దీనికి యౌగికార్థం లేదు సంన్యాసి అనే అర్థంలో)రూఢిమాత్రమే అని చెప్పి నట్లయితే ఆశ్రమమాత్రంచేతనే అమృతత్వం లభిస్తుండగా జ్ఞానం వ్యర్థమని చెప్పవలసివస్తుంది. (రూఢిని మాత్రమే అంగీకరిస్తే బ్రహ్మనిష్ఠుడు అమృతత్వం పొందుతాడు అనగా సంన్యాసి అమృతత్వం పొందుతాడు

అని చెప్పిన ట్లవుతుంది. అనగా సంన్యాసాశ్రమంతీసికొంటే చాలు;మోక్షం లభిస్తుంది అని అర్థం. అపుడు జ్ఞానం అవసరం లేకుండా పోతుంది అని అర్థం). (సమాధానమ్)ఈ విషయంలో చెప్పబడుచున్నది-'బ్రహ్మసంస్థ' అనగా బ్రహ్మయందే పరిసమాప్తి, ఇతర వ్యాపారా లేవీ లేకుండా బ్రహ్మయందే స్థిరంగా ఉండడం అను అర్థం చెప్పబడుతుంది. అది మొదటి మూడు ఆశ్రమాలకి కుదరదు. తమ ఆశ్రమానికి విధించిన ధర్మాలు అనుష్ఠించకపోతే వాళ్లకు ప్రత్యవాయం కలుగుతుం దని చెప్పబడింది. పరివ్రాజకు డైతే సర్వకర్మలను సంన్యసించి ఉండడంచేత కర్మలను అనుష్ఠించకపోవడంవల్ల కలిగే ప్రత్యవాయం అతనికి కలగదు. వాని శమదమాదిధర్మమైతే బ్రహ్మసంస్థతకు ఉపోద్బలకమే కాని విరోధి కాదు. శమదమాద్యుపబృంహితమైన బ్రహ్మనిష్ఠత్వమే వానికి స్వాశ్రమవిహితమైన కర్మ. ఇతరులకు యజ్ఞాదికం (స్వాశ్రమవిహితమైన కర్మ). ఆ ధర్మాన్ని వ్యతిక్రమిస్తే వానికి (సంన్యాసికి)ప్రత్యవాయం కలుగుతుంది.

భాష్యమ్

తథా చ -"న్యాస ఇతి బ్రహ్మ బ్రహ్మ హి పరః పరో హి బ్రహ్మ, తాని వా ఏతాన్యవరాణి తపాంసి న్యాస ఏవాత్యరేచయత్" (నారా.ఉ.78),"వేదాన్త విజ్ఞానసునిశ్చితార్థాః, సంన్యాసయోగాద్యతయః శుద్ధసత్త్వాః" (ము.ఉ.3.26; నారా.ఉ.12.3 కైవల్య. 3) ఇత్యాద్యాః శ్రుతయః, స్మృతయశ్చ-"తద్బుద్ధయస్త దాత్మానస్తన్నిష్ఠాస్తత్పరాయణాః"(భ.గీ.5.17) ఇత్యాద్యా బ్రహ్మసంస్థస్య కర్మాభావం దర్శయన్తి, తస్మాత్పరివ్రాజకస్యాశ్రమమాత్రాదమృతత్వప్రాప్తేః జ్ఞానానర్థక్యప్రసంగ ఇత్యేషోఽపి దోషో నావతరతి. తదేవం పరామర్శేఽపీతరేషామాశ్రమాణాం పారివ్రాజ్యం తావద్బ్రహ్మసంస్థతాలక్షణం లభ్యతైవ. అనపేక్ష్యైవ జాబాలీం శ్రుతిమాశ్రమాన్తరవిధాయినీమయమాచార్యేణ విచారః ప్రవర్తితః. విద్యత ఏవ త్వాశ్రమాన్తరవిధిశ్రుతిః ప్రత్యక్షా "బ్రహ్మచర్యం పరిసమాప్య గృహీ భవేద్గృహీ భూత్వా వనీ భవేద్వనీ భూత్వా ప్రవ్రజేత్. యది వేతరథా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేద్గృహాద్వా వనాద్వా" (జాబా.4) ఇతి. న చేయం శ్రుతిరనధికృతవిషయా

శక్యా వక్తుమ్, అవిశేషశ్రవణాత్; పృథగ్విధానాచ్చానధికృతానామ్- "అథ పునరేవ వ్రతీ వాఽవ్రతీ వా స్నాతకో వాఽస్నాతకో వోత్సన్నాగ్నిరనగ్నికో వా" (జాబా.4) ఇత్యాదినా. బ్రహ్మజ్ఞానపరిపాకాఙ్గత్వాచ్చ పారివ్రాజ్యస్య నానధికృతవిషయత్వమ్. తచ్చ దర్శయతి- "అథ పరివ్రాడ్వివర్ణవాసా ముణ్డోఽపరిగ్రహః శుచిరద్రోహీ భైక్షాణో బ్రహ్మభూయాయ భవతి"(జాబా.5) ఇతి. తస్మాత్సిద్ధా ఊర్ధ్వరేతసామాశ్రమాః. సిద్ధం చోర్ధ్వరేతస్సు విధానాత్ విద్యాయాః స్వాతన్త్ర్యమితి. 20.

బాలానందిని

**తథా చేతి**:- అందువల్లనే-"**న్యాస...అత్యరేచయత్**" (సంన్యాసమే బ్రహ్మ; బ్రహ్మ (హిరణ్యగర్భుడు)పరుడు (శ్రేష్ఠుడు)కదా; అందుచేత బ్రహ్మ అని చెప్పబడిన సంన్యాసంకూడ పరమే. ఆ తపస్సు లన్నీ తక్కువతరగతికి చెందినవే. సంన్యాసమే అన్నింటికంటె గొప్పది), "**వేదాన్త...శుద్ధసత్త్వాః**" (సంన్యాసంచేత పరిశుద్ధమైన అంతఃకరణ గల యతులు వేదాంతవిజ్ఞానంచేత సునిశ్చితమైన విషయం గలవారు) మొదలైన శ్రుతులు, "**తద్బుద్ధయః...తత్పరాయణాః**" (ఆ బ్రహ్మయందే చిత్తం కలవారు, బ్రహ్మస్వరూపులు, బ్రహ్మనిష్ఠులు లేదా శ్రవణాదులయందు ఆసక్తులు, బ్రహ్మనే పొందుచున్నవాళ్లు) ఇత్యాదిస్మృతులు కూడ బ్రహ్మసంస్థునికి కర్మలు లేవని చూపుచున్నాయి. అందువల్ల పరివ్రాజకునికి ఆశ్రమమాత్రంవల్లనే అమృతత్వం లభిస్తుంది గాన జ్ఞానం అనర్థకమని చెప్పవలసివస్తుంది అనే దోషం కూడ అవతరించదు (ప్రసరించదు). ఈ విధంగా (ఈ వాక్యంలో) ఇతరాశ్రమాల (గృహస్థాద్యాశ్రమాల)పరామర్శ ఉన్నాకూడ బ్రహ్మసంస్థతారూపమైన సంన్యాసంమాత్రం తప్పక లభిస్తుంది. (అనగా సన్యాసాన్ని విధించినట్లుగానే గ్రహించాలి). సంన్యాసాశ్రమాన్ని విధించుచున్న జాబాలశ్రుతిని అపేక్షించకుండానే ఆచార్య డీ విచారాన్ని ప్రవర్తింపచేశాడు. అయితే-"బ్రహ్మచర్యం....వనాద్యా" అని ఆశ్రమాంతరాన్ని విధించే ప్రత్యక్షశ్రుతి ఉండనే ఉంది ("బ్రహ్మచర్యం పూర్తి చేసికొని గృహస్థుడు కావాలి. గృహస్థుడుగా ఉండి వానప్రస్థుడు కావాలి; వానప్రస్థాశ్రమంనుండి యైనా సంన్యసించవచ్చు" అని ఈ వాక్యానికి అర్థం). ఈ శ్రుతి కర్మాధికారి కానివానిని

దృష్టిలో ఉంచుకొని చెప్పిన దని చెప్పడానికి శక్యం కాదు. అలాంటి విశేషం ఏదీ వినబడడం లేదు కదా? మరొక విషయ మేమనగా-"అథ....అనగ్నికో వా" ఇత్యాదివాక్యంచేత అనధికారులకు సంన్యాసం వేరుగా విధించబడింది. (గోదానాదివేదవ్రతాలు చేసికొన్నా చేసికొనకపోయినా, స్నాతకుడైనా కాకపోయినా, విధురుడైనా, అగ్న్యాధానమే చేయనివాడైనా (సంన్యసించవచ్చు)అని దీని అర్థం). పారివ్రాజ్యం బ్రహ్మజ్ఞానం పరిపక్వం అవడానికి అంగం గాన ఇది అనధికృతలకొరకు విధించబడినది కాదు. ఈ విషయాన్నే "అథ....భవతి" (మాసిన వస్త్రాలు ధరించినవాడు, శిరోముండనం చేయించుకొన్నవాడు. పరిగ్రహం (వస్తుసంచయనం)లేనివాడు. పరిశుద్ధుడు. ద్రోహం తలబెట్టనివాడు, భిక్షావృత్తి కలవాడు అయిన పరివ్రాట్టు బ్రాహ్మీస్థితిని పొందకలుగుతాడు) అనే వాక్యం చెపుతూన్నది. (అందుచేత సంన్యాసం కుంటివాడు గ్రుడ్డివాడు మొదలైన కర్మానధికారులకోసం విధించబడినది కాదు). అందువల్ల ఊర్ధ్వరేతస్సులకు ఆశ్రమాలు (సంన్యాసాశ్రమభేదాలు) సిద్ధములు. అందుచేత కర్మాచరణం చేయని ఊర్ధ్వరేతస్సులకొరకు విధించడంవల్ల విద్య స్వతంత్రమే (కర్మాంగం కాదు) అని కూడ నిశ్చితము.

పరామర్శాధికరణం సమాప్తం.

### 3. స్తుతిమాత్రాధికరణమ్. సూ. 21-22

## సూ. స్తుతిమాత్రముపాదానాదితి చేన్నాపూర్వత్వాత్. 3.4.21

"స ఏష రసానాం రసతమః పరమః పరార్ధ్యోఽష్టమో యదుద్గీథః" (ఛా.ఉ.1.1.3), "ఇయమేవర్గగ్నిః సామ" (ఛా.ఉ.1.6.1), "అయం వా వ లోక ఏషోఽగ్నిశ్చితః" (శత.బ్రా. 10.5.4.1)"తదిదమేవోక్థమియమేవ పృథివీ" (ఐ.ఆ.2.1.2.1) ఇత్యేవంజాతీయకాః శ్రుతయః కిముద్గీథాదేః స్తుత్యర్థాః ఆహోస్విదుపాసనావిధ్యర్థా ఇత్యస్మిన్ సంశయే స్తుత్యర్థా ఇతి యుక్తమ్; ఉద్గీథాదీని కర్మాఙ్గాన్యుపాదాయ శ్రవణాత్. యథా-"ఇయ మేవ జుహూరాదిత్యః కూర్మః స్వర్గో లోకః ఆహవనీయః" ఇత్యాద్యా జుహ్వాదిస్తుత్యర్థాస్తద్వదితి చేత్;

నేత్యాహ. న హి స్తుతిమాత్రమాసాం శ్రుతీనాం ప్రయోజనం యుక్తమ్, అపూర్వత్వాత్. విధ్యర్థతాయాం హ్యపూర్వోఽర్థో విహితో భవతి, స్తుత్యర్థతాయాం త్వానర్థక్య మేవ స్యాత్. విధాయకస్య హి శబ్దస్య వాక్యశేషభావం ప్రతిపద్యమానా స్తుతిరుపయుజ్యతే ఇత్యుక్తమ్-"విధినా త్వేకవాక్యత్వాత్ స్తుత్యర్థేన విధీనాం స్యుః" ఇత్యత్ర. ప్రదేశాన్తరవిహితానాం తు ఉద్గీథాదీనామియం ప్రదేశాన్తరపఠితా స్తుతిర్వాక్యశేషభావమప్రతిపద్యమానాఽనర్థికైవ స్యాత్. ఇయమేవ జుహూ రిత్యాది తు విధిసంనిధావామ్నాతమితి వైషమ్యమ్. తస్మాద్విధ్యర్థకా ఏవైవం జాతీయకాః శ్రుతయః. 21.

బాలానందిని

స్తుతీతి:- "ఉపాదానాత్= కర్మాంగములను గ్రహించడంవల్ల, స్తుతి మాత్రమ్=స్తుతిమాత్రమే, ఇతి చేత్=అన్నట్లయితే, న=కాదు, అపూర్వత్వాత్=క్రొత్తగా చెప్పబడుచున్నాయి గాన ఉపాసనావిధులే" అని సూత్రార్థం.

స ఏష ఇతి :- "స ఏష....యదుద్గీథః", "ఇయమేవర్గగ్నిః సామ" "అయం వావ....చితః" "తదిదమ్....పృథివీ" ఈ మొదలైన వాక్యాలు ఉద్గీథాదులను స్తుతించడం కొరకు చెప్పబడినవా లేక ఉపాసనావిధికొరకు ఉద్దిష్టములా అని సంశయం కలగగా స్తుత్యర్థము లని చెప్పడమే యుక్తం. ఎందువల్ల ననగా ఈ వాక్యాలు కర్మాంగాలైన ఉద్గీథాదులను గ్రహించి చెప్పబడుచున్నాయి. "ఇయమేవ...ఆహవనీయః" (జుహూవే పృథివి, చయనంలో ఉన్నకూర్మమే ఆదిత్యుడు. ఆహవనీయమే స్వర్లోకం) ఇత్యాదివాక్యాలు ఏ విధంగా జుహ్వాదిస్తుతినిమిత్తం ఉద్దిష్టమైనవో ఇవి కూడ అట్లే, అని చెప్పిన ట్లయితే-కాదని అంటున్నాడు. ఈ శ్రుతులు అపూర్వములు, క్రొత్త విషయం చెపుతున్నాయి. అందుచేత స్తుతిమాత్రమే వీటి ప్రయోజనం అని చెప్పడం యుక్తం కాదు. ఈ వాక్యాలు విధ్యర్థములు అని చెపితే అప్పుడు ఒక క్రొత్త విషయం విధించిన ట్లవుతుంది. స్తుత్యర్థము లైతే ఇవి వ్యర్థములే అవుతాయి. ఏదైనా శబ్దం ఒక విషయాన్ని విధించినప్పుడు దానికి

జై.సూ. 1-2-7.

వాక్యశేషంగా ఉన్నది స్తుతిగా ఉపయోగిస్తుంది అని "విధినా త్వేకవాక్యత్వాత్ స్తుత్యర్థేన విధీనాం స్యుః" అనే చోట చెప్పబడింది. మరొక చోట ఎక్కడనో విధించబడిన ఉద్గీథాదులకు మరొక ప్రదేశంలో పఠించబడిన స్తుతి వాక్యశేషం కాదు గాన వ్యర్థమే అవుతుంది. "ఇయమేవ జుహూః" ఇత్యాదివాక్యమైతే విధివాక్యం ప్రక్కనే పఠింపబడింది గాన ఈ వాక్యాలకీ దానికీ వైషమ్యం ఉంది. అందువల్ల ఈ జాతికి చెందిన శ్రుతు లన్నీ విధ్యర్థములే (ఉపాసనను విధిస్తాయి).

వి. అనుష్ఠించదగిన గార్హస్థ్యాదులతో సమంగా పఠింపబడడంవల్ల పారివ్రాజ్యం అనుష్ఠేయమని వెనుకటి అధికరణంలో చెప్పబడింది. అట్లే ఈ శ్రుతులు కూడ జుహ్వాదిస్తుతిశ్రుతుల వలె ఉండడంవల్ల స్తుతిరూపములే అని దృష్టాంతసంగతిచేత పూర్వపక్షం చేయబడింది. 21.

## సూ. భావశబ్దాచ్చ 3.4.22

"ఉద్గీథముపాసీత" (ఛా.ఉ.1.1.1)"సామోపాసీత" (ఛా.ఉ.2.2.1), "అహముక్థమస్మీతి విద్యాత్" (ఐ. ఆ.2.1.26)ఇత్యాదయశ్చ విస్పష్టాః విధిశబ్దాః శ్రూయన్తే. తే చ స్తుతిమాత్రప్రయోజనతాయాం వ్యాహన్యేరన్. తథా చ న్యాయవిదాం స్మరణమ్-

కుర్యాత్ క్రియేత కర్తవ్యం భవేత్స్యాదితి పఞ్చమమ్,

ఏతత్ స్యాత్సర్వవేదేషు నియతం విధిలక్షణమ్. ఇతి.

లిఙాద్యర్థో విధిరితి మన్యమానాస్త ఏవం స్మరన్తి. ప్రతిప్రకరణం చ ఫలాని శ్రావ్యన్తే-"ఆపయితా హ వై కామానాం భవతి" (ఛా.1.1.7) "ఏష హ్యేవ కామాగానస్యేష్టే" (ఛా.ఉ.1.7.9) "కల్పన్తే హాస్మై లోకా ఊర్ధ్వా హ్యావృత్తాశ్చ" (ఛా.ఉ. 2.2.3) ఇత్యాదీని. తస్మాదప్యుపాసనవిధానార్థా ఉద్గీథాదిశ్రుతయః. 22

బాలానందిని

భావేతి:- "భావశబ్దాచ్చ=విధివాచకశబ్దం ఉండడంవల్ల కూడ స్తుత్యర్థకములు కావు" అని సూత్రార్థం.

ఉద్గీథమితి:- "ఉద్గీథముపాసీత", "సామోపాసీత", "అహముక్థమస్మీతి విద్యాత్" (ఉక్థము నేనే అని తెలుసుకోవాలి) ఈ మొదలైన విస్పష్టమైన విధిశబ్దాలు వినబడుచున్నాయి. ఈ వాక్యాల ప్రయోజనం స్తుతిమాత్రమే అన్నట్లయితే ఆ విధివాచకశబ్దాలు బాధితములవుతాయి. న్యాయవేత్తలు (మీమాంసకులు)"కుర్యాత్....విధిలక్షణమ్" (కుర్యాత్,క్రియేత, కర్తవ్యమ్, భవేత్, స్యాత్, అను ఈ ఐదూ సర్వవేదాంలోను విధివాక్యానికి లక్షణం)అని చెప్పుచున్నారు. లిఙాదుల అర్థం విధి అనే అభిప్రాయంతో వారు ఈ విధంగా చెపుతున్నారు. (అనగా "కుర్యాత్" ఇత్యాది పదాలే ప్రయోగించనవసరం లేదు. ఇది కేవలం ఉదాహరణప్రదర్శనం మాత్రమే. విధిలిఙ్, తవ్యప్రత్యయం మొదలైనవి ఎక్కడ వినబడినా అవి విధివాచకాలే అని అర్థం). ప్రతీ ప్రకరణంలోను "ఆపయితా...భవతి", "ఏష..ఈష్టే", "కల్పన్తే హాస్మై...అవృత్తాశ్చ" ఇత్యాదికములైన ఫలశ్రుతులు కూడ కనబడుచున్నాయి. అందువల్ల కూడ ఉద్గీథాదిశ్రుతులు ఉపాసనావిధానంకొరకే ఉద్దిష్టమైనవి. 22.

స్తుతిమాత్రాధికరణం సమాప్తం

4. పారిప్లవాధికరణమ్. సూ. 23-24

సూ. పారిప్లవార్థా ఇతి చేన్న విశేషితత్వాత్. 3.4.23

"అథ హ యాజ్ఞవల్క్యస్య ద్వే భార్యే బభూవతుః మైత్రేయీ కాత్యాయనీ చ" (బృ.ఉ.4.5.1)"ప్రతర్దనో వై దైవోదాసిరిన్ద్రస్య ప్రియం ధామోపజగామ" (కౌ.షీ.3.1) "జానశ్రుతిర్హ పౌత్రాయణః శ్రద్ధాదేయో బహుదాయీ బహుపాక్య ఆస" (ఛా.ఉ.4.1.1) ఇత్యాదిషు వేదాన్తపఠితేష్వాఖ్యానేషు సంశయః-కిమిమాని పారిప్లవప్రయోగార్థాని ఆహోస్విత్ సంనిహితవిద్యాప్రతిపత్త్యర్థానీతి. పారిప్లవార్థా ఇమా అఖ్యానశ్రుతయః.

ఆఖ్యానసామాన్యాత్. ఆఖ్యానప్రయోగస్య చ పారిప్లవే చోదితత్వాత్. తతశ్చ విద్యాప్రధానత్వం వేదాన్తానాం న స్యాత్, మన్త్రవత్ ప్రయోగశేషత్వాదితి చేత్; తన్న. కస్మాత్? విశేషితత్వాత్. తథాహి-"పారిప్లవమాచక్షీత" ఇతి హి ప్రకృత్య "మనుర్వైవస్వతో రాజా" ఇత్యేవమాదీని కాని చిదేవాఖ్యానాని తత్ర విశేష్యన్తే. ఆఖ్యానసామాన్యాచ్చేత్సర్వగృహీతిః స్యాదనర్థకమేవేదం విశేషణం భవేత్. తస్మాన్న పారిప్లవార్థా ఏతా ఆఖ్యానశ్రుతయః. 23.

బాలానందిని

పారిప్లవేతి:-"పారిప్లవార్థా ఇతి చేత్=పారిప్లవంకోసం అన్నట్లయితే, న=కాదు: విశేషితత్వాత్=ఫలానా అని విశేషించబడడంవల్ల" అని సూత్రార్థం.

అథేతి:- "అథ హ...కాత్యాయనీ చ", "ప్రతర్దనో...ఉపజగామ" "జానశ్రుతి....అస" ఇత్యాదులైన ఉపనిషత్పఠితములైన ఆఖ్యానాల విషయంలో-ఇవి పారిప్లవప్రయోగం కొరకా లేక దగ్గర నున్న విద్యను తెలుసుకొనడంకొరకా అని సంశయం. ఇవి కూడ అఖ్యానాలే గాన, పారిప్లవంలో ఆఖ్యానప్రయోగం చెప్పబడింది గాన, ఈ అఖ్యాన శ్రుతులు పారిప్లవంకొరకే. అప్పుడు వేదాంతాలు విద్యాప్రధానమైనవి అని చెప్పడం కుదరదు; ఎందువల్ల ననగా మంత్రాల వలె ఇవి కూడ ప్రయోగానికి (కర్మవిధానానికి)అంగాలు అవుతున్నాయి అని అన్నట్లయితే అది యుక్తం కాదు. ఎందువల్ల? విశేషితత్వంవలన.

వి. అశ్వమేధయాగంలో పుత్రాదులతో కూడి ఉన్న రాజుకు నానావిధాలైన అఖ్యానాలు చెప్పాలి అని "పారిప్లవమాచక్షీత" అనువాక్యం చెపుతూన్నది. ఇట్లు చెప్పే ఉపాఖ్యానాలకు పారిప్లవం అని పేరు.

"స ఏష రసానాం రసతమః" ఇత్యాదివాక్యాలు విధివిషయాన్ని సమర్పించడం ద్వారా మాత్రమే ప్రయోజనవంతములు అని చెప్పబడింది. అట్లే "అథ హ యాజ్ఞవల్క్యస్య" ఇత్యాద్యుపాఖ్యానాలు కూడ "పారిప్లవే సర్వాణ్యాఖ్యానాని శంసన్తి" అనే విధికి శేషములు కావాలి అని ఉదాహరణసంగతిచేత పూర్వపక్షం (బ్ర.వి.అ).

తథాహీతి:-అదెట్లనగా - "పారిప్లవమాచక్షీత" అని ప్రారంభించి "మనుర్వైవస్వతో

రాజా'' మొదలైన కొన్ని అఖ్యానాలు మాత్రమే అక్కడ ప్రత్యేకించి చెప్పబడుచున్నాయి. అఖ్యానం అనే పేరున్న వాటిని అన్నింటినీ గ్రహించేట ట్లయితే ఈ విశేషణం వ్యర్థం అవుతుంది. అందువల్ల అఖ్యానశ్రుతులు పారిప్లవం కొరకు కాదు. 23.

## సూ. తథా చైకవాక్యతోపబన్ధాత్. 3.4.24

అసతి చ పారిప్లవార్థత్వ ఆఖ్యానానాం సంనిహితవిద్యా ప్రతిపాదనోప యోగితైవ న్యాయ్యా, ఏకవాక్యతోపనిబన్ధాత్. తథా హి. తత్ర తత్ర సంనిహితాభిర్విద్యాభిరేకవాక్యతా దృశ్యతే,ప్రరోచనోపయోగాత్, ప్రతిపత్తి సౌకర్యోపయోగాచ్చ. మైత్రేయీ బ్రాహ్మణే తావత్-''ఆత్మా వా అరే ద్రష్టవ్యః'' (బృ.ఉ.4.5.6) ఇత్యాద్యయా విద్యయైకవాక్యతా దృశ్యతే. ప్రాతర్దనేఽపి ''ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా'' ఇత్యాద్యయా. జానశ్రుతిరిత్యత్రాపి ''వాయుర్వావ సంవర్గః''(ఛా.ఉ.4.3.1)ఇత్యాద్యయా. యథా చ ''స ఆత్మనో వపాముదఖిదత్'' ఇత్యేవమాదీనాం కర్మశ్రుతిగతానామాఖ్యానానాం సంనిహితవిధిస్తుత్యర్థతా తద్వత్. తస్మాన్న పారిప్లవార్థత్వమ్. 24.

### బాలానందిని

**తథేతి**:- ''తథా=ఆ విధంగా, ఏకవాక్యతోపబన్ధాత్=విద్యలతో ఏకవాక్యత్వం కూర్చడంవల్ల'' అని సూత్రార్థం.

**అసతి చేతి**:- ఆఖ్యానాలు పారిప్లవంకొరకు కాదు అని నిర్ణయించిన తరవాత, అవి సంనిహితములైన విద్యల ప్రతిపాదనంకొరకు ఉపయోగిస్తాయి అని చెప్పడమే న్యాయ్యం; ఎందువల్ల ననగా ఏకవాక్యతోపనిబంధం ఉంది. ఇవి ప్రరోచనకు (వినేవాళ్లకు ఆసక్తి కలిగించడం ప్రరోచన)ఉపయోగిస్తాయి; అర్థం చేసుకొనడంలో సౌకర్యం కలగడానికి కూడ ఉపయోగిస్తాయి. అందువల్ల అక్క డక్కడ దగ్గరనే ఉన్న విద్యలతో వీటికి ఏకవాక్యత్వం కనబడుచున్నది. మైత్రేయీబ్రాహ్మణంలో-''ఆత్మా వా అరే ద్రష్టవ్యః'' ఇత్యాదివిద్యతో (ఆఖ్యానానికి)ఏకవాక్యత్వం కనబడుతున్నది. ప్రాతర్దనాఖ్యానంలో కూడ ''ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా'' ఇత్యాదివిద్యతోను, జానశ్రుతిః అన్నప్పుడు కూడ ''వాయుర్వావ

సంవర్గః" ఇత్యాదివిద్యతోను ఏకవాక్యత్వం కనబడుచున్నది. "స ఆత్మనో వపాముదఖిదత్" (ప్రజాపతి హోమంచేయడం కోసం తన వపను పైకి తీశాడు) మొదలైన కర్మశ్రుతులలో ఉన్న ఉపాఖ్యానాలు దగ్గరనే ఉన్న ("ప్రాజాపత్యమజం తూపరమాలభేత" ఇత్యాది విధుల స్తుతికొరకు ఎట్లు ఉద్దిష్టములైనవో అట్లే అందువల్ల ఇవి పారిప్లవార్థములు కావు. 24

పారిప్లవాధికరణం సమాప్తం

## 5. అగ్నీన్ధనాద్యధికరణమ్. సూ.25

## సూ. అత ఏవ చాగ్నీన్ధనాద్యనపేక్షా. 3.4.25.

"పురుషార్థోఽతః శబ్దాత్" (బ్ర.సూ.3.4.1)ఇత్యేతద్వ్యవహితమపి సంభవాత్ అత ఇతి పరామృశ్యతే. అత ఏవ చ విద్యాయాః పురుషార్థహేతుత్వాదగ్నీన్ధనాదీన్యాశ్రమకర్మాణి విద్యయా స్వార్థసిద్ధౌ నాపేక్షితవ్యానీత్యాద్యస్యైవాధికరణస్య ఫలముపసంహరత్యధికవివక్షయా. 25.

బాలానందిని

**అత ఇతి.**-" అతఏవ=అందువలననే, అగ్నీన్ధనాద్యనపేక్షా=విద్యలో అగ్నీంధనాదుల అపేక్ష లేదు" అని సూత్రార్థం.

పురుషేతి :-అతః అనే పదంచేత "పురుషార్థోఽతః శబ్దాత్" అనేది దూరంగా ఉన్నా కూడ పరామర్శింబడుచున్నది. ఎందువల్ల ననగా అప్పుడే దీనికి అర్థం కుదురుతుంది

వి. మొదటి అధికరణంలో ప్రతిపాదించబడిన విద్యాస్వాతంత్ర్యాన్ని మూడు అధికరణాలచేత ధృడీకరించి ఈ అధికరణంలో మొదటి అధికరణంయొక్క ఫలాన్ని చెపుతున్నాడు అని అర్థం.

**అత ఏవేతి:-** విద్య పురుషార్థహేతువు గాన (క్రత్వర్థం కాదు గాన) తానివ్వవలసిన ఫలాన్ని సాధించడానికి విద్యచేత అగ్ని, ఇంధనాలు మొదలైన ఆశ్రమకర్మలు అపేక్షించబడవు అని, ఇంకా క్రొత్త విషయం చెప్పా లనే అభిప్రాయంతో మొదటి అధికరణం యొక్క ఫలాన్నే ఉపసంహరిస్తున్నాడు. 25

అగ్నీన్ధనాద్యధికరణం సమాప్తం

### 6. సర్వాపేక్షాధికరణమ్. సూ. 26-27

### సూ. సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతేరశ్వవత్. 3.4.26

ఇదమిదానీం చిన్త్యతే కిం విద్యాయా అత్యన్తమేవానపేక్షా ఽఽశ్రమకర్మణామ్, ఉతాస్తి కాచిదపేక్షేతి. తత్రాత ఏవాగ్నీన్ధనాద్యాశ్రమకర్మాణి విద్యాయాః స్వార్థసిద్ధౌ నాపేక్ష్యన్త ఇతి. ఏవమత్యన్తమేవానపేక్షాయాం ప్రాప్తాయామ్ ఇదముచ్యతే- సర్వాపేక్షాచేతి. అపేక్షతే చ విద్యా సర్వాణ్యాశ్రమకర్మాణి నాత్యన్తమనపేక్షైవ. నను విరుద్ధమిదం వచనమపేక్షతే చాశ్రమకర్మాణి విద్యా నాపేక్షతే చేతి? నేతి బ్రూమః. ఉత్పన్నా హి విద్యా ఫలసిద్ధిం ప్రతి న కించిదన్యదపేక్షతే, ఉత్పత్తిం ప్రతి త్వపేక్షతే. కుతః? యజ్ఞాదిశ్రుతేః. తథాహి శ్రుతిః- "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి, యజ్ఞేన, దానేన తపసానాశకేన" (బృ.ఉ.4.4.22) ఇతి యజ్ఞాదీనాం విద్యాసాధనభావం దర్శయతి. వివిదిషాసంయోగాచ్చైషాముత్పత్తిసాధన భావోఽవసీయతే. "అథ యద్యజ్ఞ ఇత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ తత్" (ఛా.ఉ.8.5.1)ఇత్యత్ర చ విద్యాసాధనభూతస్య బ్రహ్మచర్యస్య యజ్ఞాదిభిః సంస్తవాత్ యజ్ఞాదీనామపి హి సాధనభావః సూచ్యతే.

"సర్వే వేదా యత్పదమామనన్తి తపాంసి సర్వాణి చ యద్వదన్తి,

యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ బ్రవీమి "(క.ఉ.2.15)

ఇత్యేవమాద్యా చ శ్రుతిరాశ్రమకర్మణాం విద్యాసాధనభావం సూచయతి. స్మృతిరపి- మో. భ.(శాంతి పర్వము) 270-38

"కషాయపక్తిః కర్మాణి జ్ఞానం తు పరమా గతిః,

కషాయే కర్మభిః పక్వే తతో జ్ఞానం ప్రవర్తతే."

ఇత్యేవమాద్యా. అశ్వవదితి యోగ్యతాదర్శనమ్. యథా చ యోగ్యతావశేన అశ్వో న లాఙ్గలకర్షణే యుజ్యతే రథచర్యాయాం తు యుజ్యతే ఏవమాశ్రమ

కర్మాణి విద్యయా ఫలసిద్ధౌ నాపేక్ష్యన్తే, ఉత్పత్తౌ త్వపేక్ష్యన్తే ఇతి. 26.

బాలానందిని

సర్వేతి :- "యజ్ఞాదిశ్రుతేః=యజ్ఞాదిశ్రుతివల్ల, సర్వాపేక్షా చ=విద్య సర్వకర్మల అపేక్ష గలది. అశ్వవత్=అశ్వం వలె" అని సూత్రార్థం.

ఇదమితి :-విద్యకు పూర్తిగానే ఆశ్రమకర్మాదుల అపేక్ష లేదా లేక కొన్ని విషయాలలో ఉన్నదా అనే విషయం ఇప్పుడు చర్చించబడుచున్నది. విద్య స్వార్థసిద్ధికొరకు అగ్నీంధనాద్యాశ్రమకర్మలను అపేక్షించదు గాన పూర్తిగా దీనికి వాటి అపేక్ష లేదు అని ప్రాప్తించగా 'సర్వాపేక్షా చ' అని చెప్పబడుచున్నది. విద్య సమస్త మైన ఆశ్రమకర్మలను అపేక్షిస్తుంది. పూర్తిగా వాటి అపేక్ష లేకుండా ఉండదు. (ఆక్షేపం)విద్య ఆశ్రమకర్మలను అపేక్షిస్తుంది, అపేక్షించదు కూడ అని చెప్పడం పరస్పరవిరుద్ధంగా ఉంది. కదా? విరోధం ఏదీ లేదంటాం. విద్య ఉత్పన్న మైన తరవాత ఫలసిద్ధికోసం ఇతర మైనదానిని దేనినీ అపేక్షించదు; ఉత్పత్తికోసం మాత్రం అపేక్షిస్తుంది. ఎందువల్ల? యజ్ఞాదిశ్రుతివల్ల "తమేతం...అనాశకేన" (బ్రాహ్మణులు ఈ ఆత్మను వేదాధ్యయనంచేత, యజ్ఞంచేత, దానంచేత, అనాశకమైన తపస్సుచేత తెలిసికొనదలచుచున్నారు) అను శ్రుతి యజ్ఞాదులు కూడ విద్యాసాధనము లని చూపుచున్నది. వీటికి వివిదిషతో సంబంధం ఉండడంచేత ఇవి విద్యోత్పత్తికి సాధనములు అని నిశ్చయించబడుచున్నది. "అథ...తత్" (దేనిని యజ్ఞం అంటారో అది బ్రహ్మచర్యమే)అనే వాక్యంలో విద్యకు సాధనమైన బ్రహ్మచర్యం యజ్ఞాదిరూప మైన దని స్తుతించడంచేత యజ్ఞాదులు కూడ సాధనములే అని సూచింపబడుచున్నది.

వి. యజ్ఞాదులచేత తెలుసుకొనగోరుచున్నారు అన్నప్పుడు యజ్ఞాదులు కోరడానికి మాత్రమే సాధనాలు గాని, విద్యకు కాదు కదా అని సందేహం కలగవచ్చును. ఇక్కడ ఇవి పైకి వేదనేచ్ఛలో మాత్రమే సాధనా లని కనబడినా అవి ఇచ్ఛలో కర్మమైన వేదనానికి సాధనా లని గ్రహించాలి. "కాష్ఠైః పచతి" ఇత్యాది వాక్యాలలో పాకానికి కాష్ఠాలు సాధనాలని చెప్పబడుచున్నది. నిజానికి జ్వాల సాధనం కాని కాష్ఠాలు కాదు. అయినా

కూడ జ్వాల ద్వారా కాష్ఠాలు కూడ సాధనా లని చెప్పబడుచున్నాయి. అట్లే ఇక్కడ కూడ "అథ యద్యజ్ఞః" ఇత్యాదివాక్యంలో కూడ విద్యాప్రత్యక్షసాధనమైన బ్రహ్మచర్యాన్ని యజ్ఞంగా స్తుతించడంచేత కూడ యజ్ఞాదులు విద్యాసాధనా లని తెలుస్తూన్నది అని భావం.

సర్వ ఇతి :- "సర్వే వేదాః...బ్రవీమి" (సమస్త వేదాలు ఏ అత్యుత్తమస్థానాన్ని బోధిస్తున్నాయో, సమస్తమైన తపస్సులు దేనిని చెపుతున్నాయో, దేనిని కోరుచు బ్రహ్మచర్యం ఆచరిస్తున్నారో ఆ పదాన్ని గూర్చి నీకు సంగ్రహంగా చెపుతున్నాను)ఇద్యాదిశ్రుతి అశ్రమకర్మలు విద్యాసాధనము లనే విషయాన్ని సూచిస్తూన్నది. "కషాయ...ప్రవర్తతే"(కర్మలచేత కషాయాల (పాపాల)పాకములు, అనగా పాపకర్మలవల్ల కలిగే పాపాలు, పక్వములవుతాయి. జ్ఞానమైతే అత్యుత్తమ మైన గతి. కర్మలచేత కషాయం పక్వమైపోయిన తరవాత జ్ఞానం ప్రవర్తిస్తుంది). ఇత్యాది స్మృతులు కూడ ఈ విషయాన్నే చెపుతున్నాయి. అశ్వవత్ అనేది యోగ్యత విషయంలో నిదర్శనం. యోగ్యతను అనుసరించి అశ్వం నాగలి లాగడానికి ఏ విధంగా కట్టబడదో, రథం నడపడానికి మాత్రమే కట్టబడుతుందో అట్లే అశ్రమకర్మలు విద్యచేత ఫలసిద్ధికొరకు అపేక్షించబడవు. జ్ఞానోత్పత్తికొరకు మాత్రమే అపేక్షించ బడతాయి.26.

సూ. శమదమాద్యుపేతః స్యాత్ తథాపి తు తద్విధేస్తదఙ్గతయా తేషామవశ్యానుష్ఠేయత్వాత్. 3.4.27

యది కశ్చిన్మన్యతే యజ్ఞాదీనాం విద్యాసాధనభావో న న్యాయ్యో విధ్యభావాత్; "యజ్ఞేన వివిదిషన్తి" ఇత్యేవంజాతీయకీ హి శ్రుతిః అనువాదస్వరూపా విద్యాభిష్టవపరా. న యజ్ఞాదివిధిపరా, ఇత్థం మహాభాగా విద్యా యద్యజ్ఞాదిభిరేనామవాప్తుమిచ్ఛన్తీతి; తథాపి తు శమాద్యుపేతః స్యాద్విద్యార్థీ- "తస్మాదేవంవిచ్ఛాన్తో దాన్త ఉపరతస్తితిక్షుః సమాహితో భూత్వాత్మన్యేవాత్మానం పశ్యతి" (బృ-ఉ.4.4.23) ఇతి విద్యాసాధనత్వేన శమదమాదీనాం విధానాత్. విహితానాం అవశ్యానుష్ఠేయత్వాత్. నన్వత్రాపి శమాద్యుపేతో భూత్వా పశ్యతీతి

వర్తమానాపదేశ ఉపలభ్యతే, న విధిః? నేతి బ్రూమః. తస్మాదితి ప్రకకృతప్రశంసాపరిగ్రహాద్విధిత్వప్రతీతేః. పశ్యేదితి చ మాధ్యందినాః విస్పష్టమేవ విధిమధీయతే. తస్మాద్యజ్ఞానపేక్షాయామపి శమాదీన్యపేక్షితవ్యాని.

బాలానందిని

శమేతి:- "తథాపి తు=అట్లుయినా కూడ, శమదమాద్యుపేతః=శమదమాదులతో కూడినవాడు, స్యాత్=కావలెను. తద్విధేః=వాటి విధి ఉండడంవల్ల. తదఙ్గతయా=విద్యకు అంగంగా, తేషామ్=శమాదులు, అవశ్యానుష్ఠేయత్వాత్=తప్పక అనుష్ఠింప దగినవి అవడంవల్ల" అని సూత్రార్థం.

యదీతి :- విధి లేకపోవడంచేత యజ్ఞాదులు విద్యకు సాధనం అవడం న్యాయ్యం కాదు. "యజ్ఞేన వివిదిషన్తి" ఇత్యాదిశ్రుతి అనువాదరూప మైనది, విద్యను స్తుతిస్తుంది అంతే కాని యజ్ఞాదివిధికొరకు ఉద్దేశింపబడినది కాదు. విద్య ఎంత గొప్ప దనగా దీనిని యజ్ఞాదుల సాహాయ్యంచేతనే పొందగోరుతున్నారు అని స్తుతిని మాత్రమే ఈ వాక్యాలు చెపుతున్నాయి అని ఎవరైనా భావించినా కూడ "తస్మాచ్ఛాన్తే....పశ్యతి" అను శ్రుతి ననుసరించి, విద్యను కోరేవాడు శమదమాదులతో కూడినవాడు కావాలి. (ప్రశ్న)-ఇక్కడ శమాద్యుపేతుడై తెలుసుకొంటాడు అని వర్తమాననిర్దేశమే కనబడుచున్నది గాని విధి లేదు కదా? (సమాధానం)అది కాదంటాం. 'తస్మాత్' (ఆకారణాలవల్ల) అని ప్రకృతమైనదాని ప్రశంసను పరిగ్రహించడంవల్ల ఇది విధియే అని తెలుస్తూన్నది. మాధ్యందిను లైతే 'పశ్యేత్' అని స్పష్టంగానే విధివాచకపదాన్ని పఠిస్తున్నారు. అందువల్ల యజ్ఞాదుల అపేక్ష లేకపోయినా కూడ శమాదులు అపేక్షించదగినవే.

భాష్యమ్

యజ్ఞాదీన్యపి త్వపేక్షితవ్యాని, యజ్ఞశ్రుతేరేవ. ననూక్తం వివిదిషన్తీత్యత్ర న విధిరుపలభ్యత ఇతి? సత్యముక్తమ్; తథాపి త్వపూర్వత్వాత్సంయోగస్య విధిః పరికల్ప్యతే. న హ్యయం యజ్ఞాదీనాం వివిదిషాసంయోగః పూర్వం ప్రాప్తో

యేనానూద్యేత. "తస్మాత్పూషా ప్రపిష్టభాగోఽ దన్తకో హి" ఇత్యేవమాదిషు చా శ్రుతవిధికేష్వపి వాక్యేష్వపూర్వత్వాద్విధిం పరికల్ప్య పౌష్ణే పేషణం వికృతౌ ప్రతీయేతేత్యాదివిచారః ప్రథమే తన్త్రే ప్రవర్తితః. తథా చోక్తమ్- "విధిర్వా ధారణవత్" (బ్ర.సూ.3.4.20). స్మృతిష్వపి భగవద్గీతాద్యాసు అనభిసంధాయ ఫలమనుష్ఠితాని యజ్ఞాదీని ముముక్షోః జ్ఞానసాధనాని భవన్తీతి ప్రపఞ్చితమ్. తస్మాద్యజ్ఞాదీని శమాదీని చ యథాశ్రమం సర్వాణ్యేవాశ్రమకర్మాణి విద్యోత్పత్తావపేక్షితవ్యాని. తత్రాప్యేవంవిదితి విద్యాసంయోగాత్ప్రత్యాసన్నాని విద్యాసాధనాని శమాదీని, వివిదిషాసంయోగాత్తు బాహ్యానీతరాణి యజ్ఞాదీనీతి వివేక్తవ్యమ్. 27.

బాలానందిని

యజ్ఞాదీనీతి:- యజ్ఞశ్రుతి (యజ్ఞేన వివిధిషన్తి అను శ్రుతి) ఉన్నది కావుననే యజ్ఞాదులు కూడ అపేక్షింపదగినవే. (ప్రశ్న) 'వివిదిషన్తి' అన్న చోట విధి లేదని చెప్పాం కదా? (సమాధానం). నిజమే; చెప్పారు. అయినా కూడ సంయోగం అపూర్వం అవడం వల్ల విధి కల్పించబడుతుంది. యజ్ఞాదులకు వివిదిషతో సంబంధం పూర్వం మరొక వాక్యంచేత దేనిచేతా ప్రాప్తించలేదు. అలా ప్రాప్తించి ఉంటే ఇది అనువదించబడుచున్న దనడానికి అవకాశం ఉండేది. "తస్మాత్...అదన్తకో హి" ఇత్యాదివాక్యాలలో విధి వినబడకపోయినా అపూర్వం అవడంచేత విధిని కల్పించి వికృతియాగమైన పౌష్ణంలో పేషణం (పిండి చెయ్యడం)తెలుస్తూన్నది అని ఈ మొదలైన విచారం ప్రథమతంత్రంలో (పూర్వమీమాంసలో)ప్రవర్తింపచేయబడింది.

వి. "పూషా ప్రపిష్టభాగః" అనే వాక్యం దర్శపూర్ణమాసప్రకరణంలో ఉంది. ఇది అపూర్వం గాన పూష దేవతగా గల కర్మలో పేషణాన్ని విధిస్తుంది. పురోడాశంలో పేషణం ప్రాప్తించినా చరువులో పేషణప్రాప్తి లేదు. అయితే దర్శపూర్ణమాసాలలో పూషదేవత గల కర్మ లేదు. అందుచేత వికృతియాగాలలో (అనగా దర్శపూర్ణమాసాలు ప్రకృతిగా గల వికృతియాగాలలో) దేనిలో నైన పూష దేవతగా ఉన్నట్లయితే అక్కడ పేషణం చెయ్యాలి

అని విధివాక్యాన్ని కల్పించి ఈ విధివాక్యాన్ని ఉత్కర్ష (లాగికొనడం)చెయ్యాలి (వికృతి యాగంలోనికి తీసుకొనాలి). (వెనుకకూడ)"విధిర్వా ధారణవత్" చెప్పబడి ఉన్నది.

స్మృతిస్థితి :- భగవద్గీతతాదిస్మృతులలో కూడ ఫలాభిసంధానం లేకుండా చేసిన యజ్ఞాదులు ముముక్షువునకు జ్ఞానసాధనా లని చెప్పబడింది. అందువల్ల యజ్ఞాదులు, శమదమాదులు, ఆశ్రమానుసారం సమస్తమైన ఆశ్రమకర్మలూ కూడ విద్యోత్పత్తికొరకు అపేక్షింపదగినవి. వాటిలో కూడ- "ఏవంవిత్" అని విద్యతో సంబంధంచేత శమాదులు విద్యకు దగ్గరగా ఉండేసాధనాలు; యజ్ఞాదు లైతే వివిదిషతో సంబంధించిన వవడంచేత చాల బాహ్యమైనవి అని వివిక్తంగా తెలుసుకొనాలి. 27.

సర్వాపేక్షాధికరణం సమాప్తం

## సర్వాన్నానుమత్యధికరణమ్. సూ. 28-30

### సూ. సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయే తద్దర్శనాత్. 3.4.28

ప్రాణసంవాదే శ్రూయతే ఛన్దోగానామ్-"న హ వా ఏవంవిది కించనానన్నం భవతి" (ఛా.ఉ.5.2.1)ఇతి. తథా వాజసనేయినామ్-"న హ వా అస్యానన్నం జగ్ధం భవతి నానన్నం పరిగృహీతమ్"(బృ.ఉ.6.1.14) ఇతి. సర్వమేవాస్వాదనీయం భవతీత్యర్థః. కి మిదం సర్వాన్నానుజ్ఞానం శమాదివద్విద్యాఙ్గం విధీయతే ఉత స్తుత్యర్థం సంకీర్త్యతే ఇతి సంశయే విధిరితి తావత్ప్రాప్తమ్. తథా హి- ప్రవృత్తి విశేషకర ఉపదేశో భవతి, అతః ప్రాణవిద్యాసంనిధానాత్తదఙ్గత్వేనేయం నియమనివృత్తిరుపదిశ్యతే. నన్వేవం సతి భక్ష్యాభక్ష్యవిభాగశాస్త్ర వ్యాఘాతః స్యాత్. నైష దోషః. సామాన్యవిశేషభావాద్బాధోపపత్తేః. యథా ప్రాణిహింసా ప్రతిషేధస్య పశుసంజ్ఞపనవిధినా బాధః యథా చ-"న కాంచన స్త్రియం పరిహరేత్తద్వ్రతమ్" (ఛా.ఉ.2.13.2) ఇత్యనేన వామదేవ్యవిద్యావిషయేణ సర్వస్త్ర్యపరిహారవ చనేన తత్సామాన్యవిషయం గమ్యాగమ్యశాస్త్రం బాధ్యతే, ఏవమనేనాపి ప్రాణవిద్యావిషయేణ సర్వాన్నభక్షణవచనేన భక్ష్యాభక్ష్యవిభాగశాస్త్రం బాధ్యేతేతి

## బాలానందిని

సర్వేతి :- "సర్వాన్నానుమతిః = అన్ని అన్నాల అనుమతి, ప్రాణాత్యయే = ప్రాణాలు పోయే సమయంలో మాత్రమే. తద్దర్శనాత్ = ఆ విధంగా అనుమతి కనబడడం వల్ల" అని సూత్రార్థం.

ప్రాణేతి :- ఛందోగుల ప్రాణసంవాదంలో "న హ . . . భవతి" (సర్వమూ ప్రాణానికి అన్నం అని తెలుసుకొన్నవానికి అన్నం కాని దేదీ ఉండదు) అని, అట్లే వాజసనేయంలో (ప్రాణసంవాదంలో) "న హ . . ప్రతిగృహీతమ్" అని వినబడుచున్నది ప్రతీదీ తినదగినదే అని అర్థం. ఈ సర్వాన్నానుజ్ఞానం శమాదుల వలె విద్యాంగంగా విధించబడుతున్నదా లేదా స్తుతికొరకై చెప్పబడుచున్నదా అని సంశయం కలగగా ఇది విధియే అని ప్రాప్తించినది. ఎట్లనగా ఏదైన ఒక విషయం ఉపదేశిస్తే ఒక ప్రవృత్తివిశేషాన్ని కలిగిస్తుంది. అందుచేత ఇది ప్రాణవిద్యకు దగ్గరగా ఉండడంవల్ల ఈ నియమనివృత్తి (ఆహారం విషయంలో నియమాన్ని విడవడం) ప్రాణవిద్యకు అంగంగా చెప్పబడుచున్నది. (ప్రశ్న) - అట్లయితే భక్ష్యాభక్ష్యవిభాగశాస్త్రానికి దెబ్బ తగులుతుంది కదా? ఈ దోషం లేదు. సామాన్యశాస్త్రం విశేషశాస్త్రం అనే భేదాన్ని పురస్కరించుకొని దానిని బాధించవచ్చును. ఏ ప్రాణినీ హింసించకూడదు అనే శాస్త్రం యజ్ఞంలో పశ్వాలంభనం చెయ్యాలి అనే విధిచేత ఏ విధంగా బాధించబడుతుందో, వామదేవ్యవిద్యకు సంబంధించిన "న కాంచన . . . వ్రతమ్" అనే ఏ స్త్రీని పరిహరించకూడదు అని చెప్పే శాస్త్రంచేత స్త్రీసామాన్యాన్ని గూర్చి గమ్యాగమ్యవిభాగశాస్త్రం ఏ విధంగా బాధించబడుతుందో అట్లే ప్రాణవిద్యకు సంబంధించిన సర్వాన్నభక్షణవచనంచేత భక్ష్యాభక్ష్యవిభాగశాస్త్రం బాధించ బడుతుంది

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః - నేదం సర్వాన్నానుజ్ఞానం విధీయత ఇతి. న హ్యత్ర విధాయకః శబ్ద ఉపలభ్యతే - "న హ వా ఏవంవిది కించనానన్నం భవతి" (ఛా. ఉ. 5.2.1) ఇతి వర్తమానా పదేశాత్. న చాసత్యామపి విధిప్రతీతౌ ప్రవృత్తికరత్వలోభేనైవ విధిరభ్యుపగన్తుం శక్యతే. అపి చ శ్వాదిమర్యాదం ప్రాణస్యాన్నమిత్యుక్త్వా ఇదముచ్యతే -"నైవంవిదః కిం చిదనన్నం భవతి" ఇతి.

న చ శ్వాదిమర్యాదమన్నం మానుషేణ దేహేనోపభోక్తుం శక్యతే. శక్యతే తు ప్రాణస్యాన్నమిదంసర్వమితివిచిన్తయితుమ్.తస్మాత్ప్రాణాన్నవిజ్ఞానపరామర్శార్థోఽయమర్థవాదః; న సర్వాన్నానుజ్ఞానవిధిః. తద్దర్శయతి "సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయే" ఇతి. ఏతదుక్తం భవతి. ప్రాణాత్యయ ఏవ హి పరస్యామాపది సర్వమన్నమశనీయత్వేనాభ్యనుజ్ఞాయతే, తద్దర్శనాత్. తథాహి శ్రుతి శ్చాక్రాయణస్యర్షేః కష్టాయామవస్థాయామభక్ష్యభక్షణే ప్రవృత్తిం దర్శయతి - "మటచీహతేషు కురుషు" (ఛా. ఉ. 1.10.1) ఇత్యస్మిన్ బ్రాహ్మణే. చాక్రాయణః కిలర్షిరాపద్గత ఇభ్యేన సామి ఖాదితాన్ కుల్మాషాంశ్చఖాద, అనుపానం తు తదీయముచ్ఛిష్టదోషాత్ ప్రత్యాచచక్షే. కారణం చాత్రోవాచ - "న వా అజీవిష్యమిమానఖాదన్" (ఛా. ఉ. 1.10.4) ఇతి. "కామో మ ఉదపానమ్" (ఛా. ఉ. 1.10.4) ఇతి చ. పునశ్చోత్తరేద్యుస్తానేవ స్వపరోచ్ఛిష్టాన్ పర్యుషితాన్ కుల్మాషాన్ భక్షయాంబభూవేతి. తదేతదుచ్ఛిష్టోచ్ఛిష్టపర్యుషితభక్షణం దర్శయన్త్యాః శ్రుతేః ఆశయాతిశయో లక్ష్యతే ప్రాణత్యాగప్రసంగే ప్రాణసంధారణాయాభక్ష్యమపి భక్షయితవ్యమితి. స్వస్థావస్థాయాం తు తన్న కర్తవ్యం విద్యావతాపీత్యనుపానప్రత్యాఖ్యానాద్గమ్యతే. తస్మాదర్థవాదో - "న హ వా ఏవంవిది" (ఛా. ఉ. 5.2.1) ఇత్యేవమాదిః.

బాలానందిని

**ఏవమితి :-** ఈ విధంగా ప్రాప్తించగా చెప్పుచున్నాము. ఈ సర్వాన్నానుమతి విధించబడడం లేదు. ఇక్కడ "న హ వా . . . భవతి" అని వర్తమాననిర్దేశంవల్ల, విధాయకమైన శబ్దం ఏదీ కనబడడం లేదు. విధివాచకశబ్దం లేకపోయినా ఏదో ఒక ప్రవృత్తిని కలిగించాలి కదా అనే లోభంతో (అభిప్రాయంతో) విధిని అంగీకరించడానికి శక్యం కాదు. మరొక విషయం ఏమనగా - ప్రాణానికి కుక్కల వరకూ అన్నమే అని చెప్పి "నైవంవిదః కిం చిదనన్నం భవతి" అని చెప్పబడుచున్నది. కుక్కల వరకూ ఉన్న అన్నం (కుక్కల వరకు ఆ యా జంతువులు తినే అన్నం) మనుష్యదేహంతో తినడానికి

శక్యం కాదు కదా? ఇదంతా ప్రాణానికి అన్నమే అని ధ్యానించడానికి మాత్రం శక్యం అవుతుంది. అందువల్ల ఇది ప్రాణాన్నాన్ని తెలుసుకొనడాన్ని ప్రశంసించడం కోసం చెప్పిన అర్థవాదమే కాని సర్వాన్నానుజ్ఞానవిధి కాదు. ఈ విషయాన్ని "సర్వాన్నానుమితిశ్చ ప్రాణాత్యయే" అని చూపుతున్నాడు. ఇది చెప్పిన ట్లవుతున్నది - ప్రాణాలు పోతూన్న గొప్ప ఆపదలో మాత్రమే ఏ అన్నమైనా తినవచ్చు నని అనుజ్ఞ ఇవ్వబడుచున్నది. ఆ విధంగా శ్రుతిలో కనబడడం వల్ల. అ దెట్లనగా - "మటచీకహతేషు కురుషు" (కురుదేశంలో మటచి అనే చిన్న ఎఱ్ఱని పురుగుచేత పంటలు పాడుచేయబడగా) అనే బ్రాహ్మణంలో కష్టమైన స్థితిలో ఉన్న చాక్రాయణు డనే ఋషి అభక్ష్యభక్షణానికి ప్రవర్తించాడు అని శ్రుతి చూపుతున్నది.

వి. చాక్రాయణుడనే ఋషి చిన్న వయస్సులో ఉన్న భార్యతో కలిసి ప్రయాణం చేసి వెడుతూ మార్గమధ్యంలో ఏనుగులను పోషించేవాళ్ళు ఉండే గ్రామంలో ఆగాడు. ఆకలికి తట్టుకొనలేక ప్రాణాలు పోయే పరిస్థితిలో ఉన్నప్పుడు అక్కడ ఒక హస్తిపాలకుణ్ణి యాచించగా అతడు తను తినగా మిగిలిన గుగ్గిళ్ళు ఇచ్చాడు. ఇత డవి తిన్నాడు. తరవాత అతడు తాను త్రాగగా మిగిలిన నీళ్ళు ఇవ్వబోగా అవి వద్దు, ఉచ్ఛిష్టము లైన నీళ్ళు త్రాగకూడదు, అని అంటూ ఆ ఋషి నిరాకరించాడు. గుగ్గిళ్ళు మాత్రం ఉచ్ఛిష్టములు కావా అని అతడు ప్రశ్నించగా అవి తినకపోతే నా ప్రాణాలు పోయి ఉండేవి. అవి తిన్న తరువాత నిలిచాయి. నీళ్ళు తటాకాదులలో లభిస్తాయి కదా. అందుచేత అవి త్రాగను అని సమాధానం చెప్పాడు. అతని భార్య మాత్రం అలాంటి ప్రాణాపాయస్థితిలో లేకపోవడం చేత తన భర్త తినగా మిగిలిన గుగ్గిళ్ళ మూట గట్టుకొని కూడా తీసికొని వెళ్ళింది. మర్నాడు ఆ ఋషి ఇభ్యుని ఉచ్ఛిష్టమూ, తన ఉచ్ఛిష్టమూ అయిన ఆ గుగ్గిళ్ళను మళ్ళీ తినవలసివచ్చింది.

చాక్రాయణ ఇతి :- ప్రాణాపాయస్థితిలో ఉన్న చాక్రాయణు డనే ఋషి హస్తిపాలకుడు సగం తిన్న ఉలవగుగ్గిళ్ళు తిన్నాడట. అత డిచ్చిన అనుపానం మాత్రం నిరాకరించాడు. ఇందుకు కారణం కూడా - "న వా అజీవిష్యమిమానఖాదన్" (వీటిని తినకపోతే జీవించి ఉండేవాడను కాను) అని, "కామో మ ఉదపానమ్" (జలపానమైతే నాకు స్వేచ్ఛగా తటాకాదులలో లభిస్తుంది) అనీ అన్నాడట. మర్నాడు మళ్ళీ పరుడు

తినగా, తాను తినగా మిగిలిన ఆ పర్యుషితములైన (నిలవ ఉన్న) కుల్మాషాలనే తిన్నాడట. ఈ విధంగా ఉచ్ఛిష్టభక్షణాన్ని, ఉచ్ఛిష్టపర్యుషితభక్షణాన్ని చూపుతున్న శ్రుతికి విశేషభావం ఏ మనగా ప్రాణాపాయస్థితిలో ప్రాణాలు నిలబెట్టుకోనడం కోసం అభక్ష్యం కూడా భక్షించాలి. అని చెప్పడమే. స్వస్థావస్థలో విద్యావంతుడు కూడ అలా చేయకూడదు అని అనుపానాన్ని నిరాకరించడాన్ని పట్టి తెలుస్తున్నది. అందువల్ల "న హ వా ఏవంవిది" మొదలైనది అర్థవాదం మాత్రమే. 28

## సూ. అబాధాచ్చ. 3.4.29

ఏవం చ సతి ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః ఇత్యేవమాది భక్ష్యాభక్ష్యవిభాగ శాస్త్రమబాధితం భవిష్యతి. 29

### బాలానందిని

**అబాధాదితి** : "అబాధాచ్చ = శాస్త్రానికి బాధ ఉండకపోవడంవల్ల కూడ ఇట్లు చెప్పాలి" అని సూత్రార్థం.

ఏవమితి :- ఇట్లు చెపితేనే "**ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః**" (ఆహారం శుద్ధంగా ఉంటే అంతఃకరణం శుద్ధంగా ఉంటుంది) ఇత్యాదికమైన భక్ష్యాభక్ష్యవిభాగశాస్త్రం బాధించబడకుండా ఉంటుంది. 29

## సూ. అపి చ స్మర్యతే. 3.4.30

అపి చాపది సర్వాన్నభక్షణమపి స్మర్యతే విదుషోఽవిదుషశ్చావిశేషేణ

**"జీవితాత్యయమాపన్నో యోఽన్నమత్తి యతస్తతః,**

**లిప్యతే న స పాపేన పద్మపత్రమివామ్భసా"** (మనుస్మృతి 10. 104)

ఇతి. తథా "మద్యం నిత్యం బ్రాహ్మణః" "సురావస్య బ్రాహ్మణస్య ఉష్ణామాసిఞ్చేయురాస్యే" (గౌ.ధ. సూ. 3.5.1), "సురాపాః కృమయో భవన్త్యభక్ష్యభక్షణాత్" ఇతి చ స్మర్యతే వర్జనమనన్నస్య. 30

## బాలానందిని

**అపి చేతి:-** "అపి చ=మరియు, స్మర్యతే=స్మృతిలో చెప్పబడుచున్నది" అని సూత్రార్థం.

**అపి చేతి :-** మరియు ఆపత్కాలంలో విద్వాంసునికి అవిద్వాంసునికీ కూడా భేదం ఏమీ లేకుండా సర్వాన్నభక్షణం "**జీవితాత్యయ . . . అమ్భసా**" (ప్రాణసంశయాన్ని పొందినప్పుడు ఎక్కడ లభించినదైనా అన్నం తిన్నవానికి, తామరాకునకు నీరు అంటనట్లు పాపం అంటదు) అని స్మృతిలో చెప్పబడింది. అట్లే "మద్యం నిత్యం బ్రాహ్మణః" (బ్రాహ్మణుడు పూర్తిగా మద్యాన్ని వర్జించాలి.) "సురాపస్య ఆస్యే" (సుర త్రాగిన బ్రాహ్మణుని నోట్లో సలసలా మరుగుతున్న సురను (అతడు మరణించేవరకు) నింపాలి)"సూరాపాః...భక్షణాత్" (సుర త్రాగినవాళ్ళు పురుగు లవుతారు, అభక్ష్యభక్షణంవల్ల కూడ పురుగులవుతారు) అని అభక్ష్యాన్నవర్జనం స్మృతిలో చెప్పబడింది. 30

## సూ. శబ్దశ్చాతోఽ కామకారే 3.4.31

శబ్దశ్చాన్నస్య ప్రతిషేధకః కామకారనివృత్తిప్రయోజనః కారకానాం సంహితాయాం శ్రూయతే "తస్మాద్బ్రాహ్మణః సురాం న పిబేత్"ఇతి. సోఽపి "న హవా ఏవంవిది" (ఛా.ఉ. 5.2.1) ఇత్యస్య అర్థవాదత్వాత్ ఉపపన్నతరో భవతి. తస్మాదేవంజాతీయకా అర్థవాదాః న విధయ ఇతి. 31

## బాలానందిని

**శబ్ద ఇతి :- అతః** = అందువలన, **అకామకారే** = బోజనం విషయంలో స్వేచ్ఛ లేదు అను విషయంలో, శబ్దశ్చ = శ్రుతివాక్యం కూడా ఉంది" అని సూత్రార్థం.

**శబ్దశ్చేతి :-** అన్నం కానిదానిని నిషేధించే, కామకారనివృత్తి ప్రయోజనంగా గల (స్వేచ్ఛాప్రవృత్తి ఉండకూడదు అని చెప్పడం ప్రయోజనంగా గల) "తస్మాద్బ్రాహ్మణః సురాం న పిబేత్" అను శబ్దం కారకుల సంహితలో వినబడుచున్నది. "న హ వా ఏవంవిది" అనేది అర్థవాదం అవుతేనే ఈ నిషేధం మిక్కిలి యుక్తంగా ఉంటుంది. అందువల్ల ఈ రకమైన వాక్యాలు అర్థవాదలే కాని విధులు కావు. 31

## సర్వాన్నానుమత్యధికరణం సమాప్తం

## 8. ఆశ్రమకర్మాధికరణమ్. సూ. 32 - 36

## సూ. విహితత్వాచ్చాశ్రమకర్మాపి. 3.4.32

"సర్వాపేక్షా చ" (బ్ర. సూ. 3.4.26) ఇత్యత్రాశ్రమకర్మణాం విద్యాసాధనత్వమవధారితమ్. ఇదానీం తు కిం మముముక్షోరప్యాశ్రమమాత్రనిష్ఠస్య విద్యామకామయమానస్య తాన్యనుష్ఠేయాన్యుతాహో నేతి చిన్త్యతే. తత్ర- **"తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి"** (బృ. ఉ. 4.4.22) ఇత్యాదినా ఆశ్రమకర్మణాం విద్యాసాధనత్వేన విహితత్వాద్విద్యామనిచ్ఛతః ఫలాన్తరం కామయమానస్య నిత్యాన్యననుష్ఠేయాని. అథ తస్యాప్యనుష్ఠేయాని న తర్హ్యేషాం విద్యాసాధనత్వమ్, నిత్యానిత్యసంయోగవిరోధాదితి. అస్యాం ప్రాప్తౌ పఠతి ఆశ్రమమాత్రనిష్ఠస్యాప్యముముక్షోః కర్తవ్యాన్యేవ నిత్యాని కర్మాణి - **"యావజ్జీవమగ్నిహోత్రం జుహోతి"** ఇత్యాదినా విహితత్వాత్. న చ వచనస్యాతిభారో నామ కశ్చిదస్తి. 32

### బాలానందిని

**విహితత్వాదితి** :- "విహితత్వాత్ = విధించబడినదవడంవల్ల, ఆశ్రమకర్మాపి = ఆశ్రమాలకు సంబంధించిన కర్మ కూడ కర్తవ్యమే" అని సూత్రార్థం.

సర్వేతి :- "సర్వాపేక్షా చ" ఇత్యాదిసూత్రాలచేత ఆశ్రమకర్మలు కూడ విద్యాసాధనము లని నిశ్చయింపబడింది. ఇప్పుడైతే - విద్యను కోరకుండా ఆశ్రమంలో ఉన్న ముముక్షువు కానివాడు కూడ ఈ ఆశ్రమకర్మలను అనుష్ఠించాలా, అనుష్ఠించవవసరం లేదా అని విచారించబడుచున్నది. "**తమేతం.....వివిదిషన్తి**" ఇత్యాదిశ్రుతిచేత ఆశ్రమకర్మలు విద్యకు సాధనంగా విధింపబడ్డాయి గాన, విద్యను కోరకుండా ఇతర ఫలా లేవో కోరేవానికి ఈ నిత్యకర్మలు అనుష్ఠేయములు కావు. అలాంటివానికి కూడా ఇవి అనుష్ఠేయములే అని చెపితే అపు డివి విద్యాసాధనాలు కాజాలవు, ఎందువల్ల ననగా నిత్యానిత్యసంయోగవిరోధం ఏర్పడుతుంది.

వి. జ్ఞానం కావాలనే కోరికతో కర్మలు చేసే పక్షంలో (ఆ కోరిక లేనివాళ్ళు

చేయు నవసరం లేదు గాన) అవి అనిత్యా లని చెప్పవలసి ఉంటుంది. "యావజ్జీవమగ్నిహోత్రం జుహోతి" ఇత్యాది శ్రుతుల ననుసరించి అవి తప్పక చెయ్యా లని అంటే అప్పు డవి నిత్య కర్మలని చెప్పినట్లవుతుంది. ఈ విధంగా నిత్యత్వము, అనిత్యత్వమూ అనే విరుద్ధధర్మాలు ఏకరూపమైన కర్మలయందు కుదరవు. అందుచేత అనిత్యా లనడం యుక్తం అని భావం.

భక్ష్యాభక్ష్యవ్యవస్థను బోధించే వచనంతో విరోధంవల్ల సర్వాన్నానుమతివాక్యం అర్థవాదం అయినట్లే నిత్యత్వాన్ని ప్రతిపాదించే వచనములతో విరోధంవల్ల కర్మలు వివిదిషాంగాలు కావు అని ఉదాహరణసంగతితో పూర్వపక్షం.

అస్యామితి :- ఇట్లు ప్రశ్నించగా చెప్పుచున్నారు. ఆశ్రమమాత్రంలో ఉన్న ముముక్షువు కానివానికి (అముముక్షువైనా అతరు ఆశ్రమంలో ఉన్నాడనే కారణం మాత్రం చేతనే) నిత్య కర్మలు కర్తవ్యములే . ఎందువల్ల ననగా అవి "యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి" ఇత్యాదివాక్యాలచేత విధించబడ్డాయి. వచనానికి అతిభారం అంటూ ఏదీ లేదు కదా?

వి. అవశ్యకత్వం అనావశ్యకత్వం అనేవి ఉపాధిభేదంచేత నిర్ణయించవచ్చును జీవించి ఉంటే చాలు అగ్నిహోత్రం చేయవలసిందే. ఇక్కడ జీవనం ఉపాధి గాన వాటికి నిత్యత్వం . వివిదిష ఉంటే చెయ్యాలి అని చెప్పడంచేత వివిదిషను దృష్టిలో పెట్టుకొని చూస్తే అవి అనిత్యములే అని విషయ విభాగంచేత వాక్యాల సమన్వయం చేసికొనవచ్చును. గాన వచనానికి అతిభారం లేదు. విరోధం లేకుండా సమన్వయించే శక్తి దాని కుంది. 32

## భాష్యమ్

అథ యదుక్తం నైవం సతి విద్యాసాధనత్వమేషాం స్యాదితి, అత ఉత్తరం పఠతి

## సూ. సహకారిత్వేన చ. 3.4.33

విద్యాసహకారీణి చైతాని స్యుర్విహితత్వాదేవ - "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి" (బృ.ఉ.4.4.22) ఇత్యాదినా. తదుక్తమ్

"సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతేరశ్వవత్" (బ్ర.సూ.3.4.26) ఇతి. న చేదం విద్యాసహకారిత్వవచనమాశ్రమకర్మణాం ప్రయాజాదివద్విద్యాఫలవిషయం మన్తవ్యమ్. అవిధిలక్షణత్వాద్విద్యాయాః, అసాధ్యత్వాచ్చ విద్యాఫలస్య. విధిలక్షణం హి సాధనం దర్శపూర్ణమాసాది స్వర్గఫలసిషాధయిషయా సహకారి సాధనాన్తరమపేక్షతే, నైవం విద్యా. తథా చోక్తమ్ "అత ఏవ చాగ్నీన్ధనాద్యనపేక్షా" (బ్ర.సూ.3.4.25)ఇతి. తస్మాదుత్పత్తిసాధనత్వ ఏవైషాం సహకారిత్వవాచో యుక్తిః, న చాత్ర నిత్యానిత్యసంయోగవిరోధ ఆశఙ్క్యః; కర్మాభేదేఽపి సంయోగభేదాత్. నిత్యో హ్యేకః సంయోగః యావజ్జీవాది వాక్యకల్పితో న తస్య విద్యాఫలత్వమ్. అనిత్యస్త్వపరః సంయోగః "తమేతం వేదానువచనేన" (బృ.ఉ.4.4.22) ఇత్యాదివాక్యకల్పితస్తస్య విద్యాఫలత్వమ్, యథా ఏకస్యాపి ఖాధిరత్వస్య నిత్యేన సంయోగేన క్రత్వర్థత్వమ్ అనిత్యేన సంయోగేన పురుషార్థత్వం తద్వత్. 33

బాలానందిని

**అథేతి** :- అట్లైతే (ఇవి నిత్యకర్మ లైతే) వీటికి విద్యాసాధనత్వం కుదరదు అని ఏది చెప్పబడిందో దానికి సమాధానం పలిస్తున్నాడు.

**సహకారీతి** :- "సహకారిత్వేన చ = కర్మలు విద్యాసహకారాలుగా కూడ ఉంటాయి" అని సూత్రార్థం.

**విద్యేతి**:-ఈ కర్మలు-"తమేతం....వివిదిషన్తి" ఇత్యాదివాక్యాలచేత విధింపబడినవి గాన విద్యకు సహకారులుగా కూడ ఉంటాయి. ఈ విషయమే "సర్వాపేక్షా చ" ఇత్యాదిసూత్రంచేత చెప్పబడింది. ఆశ్రమకర్మలు విద్యకు సహకారు లవుతాయి అని చెప్పడంచేత ఇవి ప్రయాజాదుల వలె (అనగా ప్రయాజాదులు దర్శపూర్ణమాసాదులతో కలిసి ఏ విధంగా ఫలాన్ని కలిగిస్తాయో ఆ విధంగా) విద్యవల్ల కలిగే ఫలాన్ని కలిగిస్తాయి అనుకొనకూడదు. ఎందువల్ల ననగా విద్య విధిరూపమైనది కాదు. (అనగా విద్య విధివాక్యాలచేత విధింపబడలేదు. అందుచేత దీనికి అంగాపేక్ష లేదు, విహితాలైన

కర్మలు దీనికి అంగం కాజాలవు). అంతే కాకుండా విద్యాఫలమైన మోక్షం క్రొత్తగా సాధించవలసినది కాదు. విధి రూపమైన (విధించబడిన), స్వర్గాదిఫలసాధనమైన దర్శపూర్ణమాసాదికం, స్వర్గరూపమైన ఫలాన్ని సాధించాలనే అభిప్రాయంతో (సాధించడం కోసం) అందుకు సహకరించే మరొక (ప్రయాజాది) సాధనాన్ని ఏ విధంగా అపేక్షిస్తుందో విద్య అలా అపేక్షించదు. ఈ విషయం "**అత ఏవ చాగ్నీన్ధనాద్యనపేక్షా**" అనే సూత్రంలో చెప్పబడింది. అందువల్ల ఇవి ఉత్పత్తికి (విద్యోత్పత్తికి - జ్ఞానోత్పత్తికి) సాధనాలు గాన తావన్మాత్రంచేతనే వీటిని సహకారు లని చెప్పడం జరిగింది. ఇక్కడ నిత్యానిత్యసంయోగ విరోధం శంకించదగినది కాదు. ఎందువల్ల ననగా కర్మ ఒక్కటే అయినా సంయోగంలో భేదం ఉంది. యావజ్జీవాదివాక్యంలో కల్పితమైన ఒక సంయోగం (కర్మకీ అచరించేవానికీ సంబంధం) నిత్యమైనది, దాని ఫలం విద్య కాదు. "**తమేతం వేదానువచనేన**" ఇత్యాదివాక్యాలచేత కల్పితమైన రెండవ సంయోగం అనిత్యం. దానికి ఫలం విద్య. ఒకే ఖాదిరత్వానికి నిత్యసంయోగంచేత క్రత్వర్థత్వం, అనిత్యసంయోగం చేత పురుషార్థత్వము ఎట్లు చెప్పబడిందో ఇక్కడ కూడ అట్లే.

వి. తుల్యబలము లైన రెండు శ్రుతులు రెండు వినియోగాలు చెప్పినట్లయితే దానికి సంయోగభేదం లేదా సంయోగపృథక్త్వం అని పేరు. "**ఖాదిరో యూపో భవతి**" (ఖదిరవృక్షం కఱ్ఱతో చేసిన యూపస్తంభం ఉపయోగించాలి) అనే శ్రుతిచేత విధించబడిన ఖాదిరత్వం క్రత్వర్థం (క్రతువుకు ఉపయోగించేది) "**ఖాదిరం వీర్యకామస్య**" (వీర్యకాముడు ఖాదిరయూపస్తంభం ఉపయోగించాలి) అను శ్రుతిచేత విధించబడిన ఖాదిరత్వం పురుషార్థం (పురుషునికి ఉపయోగించేది). ఈ విధంగా ఒకే ఖాదిరత్వాన్ని రెండు పనుల కోసం వినియోగించినా, రెండు స్వతంత్రవాక్యా లుండడంచేత, దోషం లేదు. దీనిలో మొదటి వాక్యంలో ఒకే ఖాదిరత్వం నిత్యమైన క్రత్వర్థత్వంతో సంబంధించినది. రెండవ వాక్యంలో అనిత్యమైన పురుషార్థత్వంతో సంబంధించింది. అట్లే ఇక్కడ కూడా ఒకే యజ్ఞాదికం యావజ్జీవవాక్యంచేత ఫలాంతరాన్ని ఇచ్చినా "**తమేతం వేదానువచనేన**" ఇత్యాది వాక్యంచేత విద్య అనే ఫలం ఇవ్వవచ్చు. విధాయకవాక్యాలు రెండు గాన ఒకచోట వినియుక్తమైనది మరొక చోట ఎట్లు వినియోగించబడుతుంది అనే ఆశంకకు అవకాశం లేదు. 33

**సూ. సర్వథాపి చ త ఏవోభయలిఙ్గాత్. 3.4.34**

సర్వథాప్యాశ్రమకర్మత్వపక్షే విద్యాసహకారిత్వపక్షే చ త ఏవాగ్నిహోత్రాదయః ధర్మా అనుష్ఠేయాః. త ఏవేత్యవధారయన్నాచార్యః కిం నివర్తయతి? కర్మభేదశఙ్కామితి బ్రూమః. యథా కుణ్డపాయినామయనే "మాసమగ్నిహోత్రం జుహ్వతి" ఇత్యత్ర నిత్యాదగ్నిహోత్రాత్కర్మాన్తరముపదిశ్యతే నైవమిహ కర్మభేదోఽస్తీత్యర్థః. కుతః? ఉభయలిఙ్గాత్. శ్రుతిలిఙ్గాత్ స్మృతిలాఙ్గాచ్చ. శ్రుతిలిఙ్గం తావత్ "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి" ఇతి సిద్ధవదుత్పన్నరూపాణ్యేవ యజ్ఞాదీని వివిధిషాయాం వినియుఙ్క్తే. న తు జుహ్వతీత్యాదివత్ అపూర్వమేషాం రూపముత్పాదయతీతి. స్మృతిలిఙ్గమపి - "**అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః**" (భ.గీ.6.1) ఇతి విజ్ఞాత కర్తవ్యతాకమేవ కర్మ విద్యోత్పత్త్యర్థం దర్శయతి. "**యస్యైతేఽష్టాచత్వారింశత్ సంస్కారాః** -" ఇత్యాద్యా చ సంస్కారత్వప్రసిద్ధిర్వైదికేషు కర్మసు తత్సంస్కృతస్య విద్యోత్పత్తిమభిప్రేత్య స్మృతౌ భవతి. తస్మాత్సాధ్విదమభేదావధారణమ్.౩4

**బాలానందిని**

సర్వేతి :- సర్వథాపి = అన్ని విధాల కూడ, ఉభయలిఙ్గాత్ = శ్రుతిస్మృతులు రెండూ చెప్పడం అనే లింగంవల్ల, త ఏవ = ఆ కర్మలే" అని సూత్రార్థం.

సర్వథేతి :- సర్వథాపి = అశ్రమ కర్మ లయినా, విద్యా సహకారులైనా కూడ ఆ అగ్నిహోత్రాదిధర్మాలే అనుష్ఠింపదగినవి (అనుష్ఠింపబడేవి). **త ఏవ** అని అవధారణచేత (అవే అని చెప్పడంచేత) ఆచార్యుడు దేనిని నివర్తింపచేస్తున్నాడు? కర్మభేదశంకను నివర్తింప చేస్తున్నాడు అని అంటాం. కుణ్డపాయినామయనం అనే ఘట్టంలో "మాసమగ్నిహోత్రం జుహ్వతి" అనే వాక్యంలో ఏ విధంగా నిత్యాగ్నిహోత్రంకంటె భిన్నమైన అగ్నిహోత్ర మనే మరొక కర్మ ఉపదేశించబడుచున్నదో ఆ విధంగా ఇక్కడ (అశ్రమ కర్మలు వేరు వివిదిషాపయుక్తకర్మలు వేరు అని) కర్మభేదం లేదు అని అర్థం. ఎందువల్ల? ఉభయలింగం వల్ల. అనగా శ్రుతిలింగంవల్ల స్మృతిలింగంవల్లా కూడ. శ్రుతి రూపమైన

లింగం ఏదనగా "తమేతం...వివిదిషన్తి" అనే వాక్యం వాక్యాంతరములచేత విధింపబడి సిద్ధంగానే ఉన్న యజ్ఞాదులను వివిదిషలో వినియోగిస్తున్నది. అంతేనే కాని "జుహ్వతి" ఇత్యాదికం వలె ("మాసమగ్నిహోత్రం జుహ్వతి" ఇత్యాదివాక్యాలవలె) ఈ యజ్ఞాల క్రొత్త రూపాన్ని చేనినీ పుట్టించడం లేదు (విధించడం లేదు). అట్లే "అనాశ్రితః . . .యః" అనే స్మృతిరూపమైన లింగం కూడా ఏ కర్మ ఆచరింపగదగినది అని ముందుగానే ప్రమాణాంతరాలచేత తెలియబడినదో ఆ కర్మనే విద్యోత్పత్తికోసం (సాధనంగా) చూపుతున్నది. (ఎవడు కర్మఫలం కోరకుండా చేయదగిన కర్మ చేస్తాడో అని పై భగవద్గీతా వాక్యానికి అర్థం). వైదికకర్మలచేత సంస్కరింపబడినవానికే విద్యోత్పత్తి కలుగుతుంది. అనే అభిప్రాయంతోనే "యస్యైతేఽష్టాచత్వారింశత్ సంస్కారాః" ("ఎవనికైతే ఈ నలభైఎనిమిది సంస్కారాలుంటాయో. . ." ఈ నలభై ఎనిమిదిలో యజ్ఞాదులు కూడా ఉన్నాయి) ఇత్యాదివాక్యాలలో స్మృతిలో (గౌతమధర్మసూత్రంలో) వైదికకర్మలు సంస్కారాలు అని చెప్పడం జరిగింది. (అనగా "యస్యైతేఽష్టాచత్వారింశత్సంస్కారాః.. " ఇత్యాదిగౌతమధర్మసూత్రంలో యజ్ఞాలు కూడా సంస్కారాలనీ, అవి చిత్తశుద్ధి కలిగిస్తాయనీ చెప్పిన ట్లయింది. దీనిని బట్టి కూడ వివిదిషోపయుక్తాలైన యజ్ఞాదులు క్రొత్తవి కావని తెలుస్తూన్నది). అందుచేత ఈ అభేదావధారణం (నిత్యయజ్ఞాలు, వివిదిషోపయోగి యజ్ఞాలూకూడ ఒక్కటే అని నిర్ణయించడం) యుక్తమే.

వి. గౌతమ ధర్మ సూత్రంలో మనకిప్పుడు "యస్యైతే చత్వారింశత్ సంస్కారాః" అనే పాఠమే కనబడుచున్నది. నలభైసంస్కారాలుమాత్రమే చెప్పబడ్డాయికూడ.

## సూ. అనభిభవం చ దర్శయతి. 3.4.35

సహకారిత్వస్యైతదుపోద్బలకం లిఙ్గదర్శనమ్. అనభిభవం చ దర్శయతి శ్రుతిః బ్రహ్మచర్యాదిసాధనసంపన్నస్య రాగాదిభిః క్లేశైః - "ఏష హ్యాత్మా న నశ్యతి, యం బ్రహ్మచర్యేణానువిన్దతే" (ఛా. ఉ. 8.5.3) ఇత్యాదినా. తస్మాద్యజ్ఞాదీన్యాశ్రమకర్మాణి చ భవన్తి విద్యాసహకారీణి చేతి నిశ్చితమ్. 35.

### బాలానందిని

**అనభిభవమితి** :- "అనభిభవమ్ = రాగాదులచేత కప్పబడకపోవుటను,

దర్శయతి = శ్రుతి చూపుచున్నది" అని సూత్రార్థం.

**సహకారిత్వస్యేతి :-** సహకారులు అనే విషయానికి ఈ లింగదర్శనం ఉపోద్బలకం. "**ఏష . . . అనువిన్దతే**" (ఏ ఆత్మను బ్రహ్మచర్యంచేత పొందుతాడో అది ఏ నాటికీ వానికి దూరం కాదు) ఇత్యాదికంచేత శ్రుతి, బ్రహ్మచర్యాదిసాధనసంపన్నుడు రాగాదిక్లేశాలచేత వశంచేసికొనబడడు అని కూడ చూపుచున్నది. అందువల్ల యజ్ఞాదులు ఆశ్రమకర్మలుగాను ఉంటాయి, వివిదిషకు సహకారులుగా కూడా ఉంటాయి.

వి. భామతీరత్నప్రభాదుల ప్రకారం "**విహితత్వాచ్చాశ్రమకర్మాపి**" మొదలు "**అనభిభవం చ దర్శయతి**" అనే సూత్రం వరకు ఉన్న నాలుగు సూత్రాలు ఒకే అధికరణం (ఆశ్రమకర్మాధికరణం). భాష్యంలో కూడ ఒకే అధికరణం అన్నట్లుగానే కనబడుతుంది. పరిమలంలో అప్పయదీక్షితులు "యద్యపి "సర్వథాపి త ఏవోభయలిఙ్గాత్" ఇతి సూత్రమధికరణాన్తరపరత్వేన యోజయితుం శక్యమ్" అని అంటూ - 34, 35 సూత్రాలు వేరే అధికరణంగా చెప్పడానికి అవకాశం ఉంది, అయినా కారణాతరంచేత అలా చెప్పలేదు అని వ్రాశారు. (పేజి . 905). దానిని ఆధారంగా తీసికొని అద్వైతానందస్వామి, బ్రహ్మవిద్యాభరణంలో "సర్వథాపి త ఏవోభయలిఙ్గాత్" "**అనభిభవం చ దర్శయతి**" అనే సూత్రాలతో క్రొత్త అధికరణం, సర్వథాధికరణం రచించి ఉన్నారు. 35

ఆశ్రమకర్మాధికరణం సమాప్తం

## 9. విధురాధికరణమ్. 36-39

## సూ. అన్తరా చాపి తు తద్దృష్టేః 3.4.36

విధురాదీనాం ద్రవ్యాదిసంపద్రహితానాం చాన్యతమాశ్రమప్రతిపత్తిహీనానామన్తరాలవర్తినాం కిం విద్యాయామధికారోఽస్తి కిం వా నాస్తీతి సంశయే నాస్తీతి తావత్ ప్రాప్తమ్. ఆశ్రమకర్మణాం విద్యాహేతుత్వావధారణాత్, ఆశ్రమకర్మాసంభవాచ్చైతేషామితి. ఏవం ప్రాప్త ఇదమాహ - అన్తరాపి త్వనాశ్రమిత్వేనాన్తరాలే వర్తమానోఽపి విద్యాయామధి క్రియతే. కుతః! తద్దృష్టేః రైక్వవాచక్నవీప్రభృతీనామేవంభూతానామపి బ్రహ్మవిత్త్వశ్రుత్యుపలబ్ధేః. 36

బాలానందిని

**అన్తరేతి** :- అన్తరా చాపి = ఆశ్రమాల మధ్యలో ఉన్నవాళ్ళకి కూడా విద్యాధికారం ఉన్నది. తచ్ఛ్రుతేః = అది వినబడుటవలన" అని సూత్రార్థం.

విధురాదీనామితి :- విధురులు (మృతపత్నీకులు) మొదలైనవాళ్ళకు, ద్రవ్యాదిసంపదలు లేనివాళ్ళకు, ఏదో ఒక ఆశ్రమాన్ని స్వీకరించకుండా మధ్యలో ఉన్నవాళ్ళకు విద్యాధికారం ఉందా లేదా అని సంశయం కలగగా లేదు అని ప్రాప్తిస్తున్నది. ఎందువల్ల ననగా - ఆశ్రమకర్మలు విద్యకు హేతువు అని నిర్ణయించబడింది. వీళ్ళకి ఆశ్రమ కర్మ లేవీ ఉండటానికి అవకాశం లేదు. ఇట్లు ప్రాప్తించగా ఇది చెప్పుచున్నాడు. అన్తరాచాపి = ఆశ్రమం లేకుండా మధ్యలో ఉన్నవాడు కూడా విద్యలో అధికారం కలవాడవుతాడు. ఎందువల్ల? అది కనబడడంవల్ల. రైక్వుడు. వాచక్నవి మొదలైన ఈ విధమైనవాళ్ళు కూడా బ్రహ్మవేత్తలుగా కనబడుతున్నారు. 36

## సూ. అపి చ స్మర్యతే 3.4.37

సంవర్తప్రభృతీనాం చ నగ్నచర్యాదియోగాదనపేక్షితాశ్రమకర్మణాపి మహాయోగిత్వం స్మర్యతే ఇతిహాసే. 37

**అపి చేతి**:- "అపి చ=మరియు, స్మర్యతే = స్మృతిలో చెప్పబడుచున్నది" అని సూత్రార్థం.

సంవర్తేతి :- సంవర్తుడు మొదలైనవాళ్ళు నగ్నంగా సంచరించడం. మొదలైన పనులతో సంబంధం ఉండడంచేత ఆశ్రమకర్మాపేక్ష లేనివాళ్ళైనా, వాళ్ళు మహాయోగు లని ఇతిహాసంలో చెప్పబడుచున్నది. 27

భాష్యమ్

నను లిఙ్గమిదం శ్రుతిస్మృతిదర్శనముపన్యస్తమ్. కా ను ఖలు ప్రాప్తిరితి, సాభిధీయతే

## సూ. విశేషానుగ్రహశ్చ. 3.4.38

తేషామపి చ విధురాదీనామవిరుద్ధైః పురుషమాత్రసంబన్ధిభిః

జపోపవాసదేవతారాధనాదిభిః. ధర్మవిశేషైః అనుగ్రహో విద్యాయాః సంభవతి. తథా చ స్మృతిః-

"జప్యేనైవ చ సంసిధ్యేద్బ్రాహ్మణో నాత్ర సంశయః,

కుర్యాదన్యన్న వా కుర్యా న్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే" (మనుస్మృ 2.8.7)

ఇత్యసంభవదాశ్రమకర్మణోఽపి జప్యేఽధికారం దర్శయతి. జన్మాన్తరానుష్ఠితైరపి చాశ్రమకర్మభిః సంభవత్యేవ విద్యాయా అనుగ్రహః. తథా చ స్మృతిః "అనేక జన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్" (భ. గీ. 6.45) ఇతి జన్మాన్తరసంచితానపి సంస్కారవిశేషాననుగృహీత్వాన్ విద్యాయాం దర్శయతి. దృష్టార్థా చ విద్యా ప్రతిషేధాభావమాత్రేణాప్యర్థినమధికరోతి శ్రవణాదిషు. తస్మాద్విధురాదీనా మప్యధికారో న విరుధ్యతే. 38

బాలానందిని

నన్వితి :- ఈ శ్రుతిస్మృతులలో కనబడేది లింగంగా చెప్పబడింది. అనగా రైక్వాదులు జ్ఞానులు అని తెలుస్తూన్న దని అందుకు లింగం మాత్రం చెప్పబడింది. ప్రాప్తి ఏమిటో (అనగా వాళ్ళకు కూడా విద్య లభించడానికి కారణం ఏమిటో) చెప్పబడుచున్నది.

విశేషేతి :- "విశేషానుగ్రహశ్చ = విధురాదులకు కొన్ని విశేషాలచేత కూడ విద్యానుగ్రహం కలగవచ్చును" అని సూత్రార్థం.

తేషామితి :- ఆ విధురాదులకు కూడా శాస్త్రవిరుద్ధాలు కాని, పురుషమాత్రునికి (ప్రతీ పురుషుడూ చేయదగిన) జపం, ఉపవాసం, దేవతారాధన మొదలైన ధర్మవిశేషాల చేత విద్యయొక్క అనుగ్రహం సంభవిస్తుంది. ఆ విధంగా "జప్యేనైవ...ఉచ్యతే" (బ్రాహ్మణుడు జపమాత్రంచేతనే సిద్ధిని పొందుతాడు. ఈ విషయంలో సందేహం లేదు. మరొక కర్మ ఏదైనా చేసినా చేయకపోయినా కూడ జపం చేస్తే చాలు బ్రాహ్మణుడు మైత్రీస్వభావం కలవాడని చెప్పబడుచున్నాడు) అను స్మృతి ఆశ్రమకర్మ కుదరనివానికి కూడా జపంలో అధికారాన్ని చూపుచున్నది. జన్మాంతరంలో అనుష్ఠించిన ఆశ్రకర్మలచేత

కూడా విద్యానుగ్రహం తప్పక కలుగుతుంది. అందుచేతనే "అనేక . . .గతిమ్" అను స్మృతి జన్మాంతరాలలో సంచితమైన సంస్కారవిశేషాలు కూడ విద్యను అనుగ్రహిస్తాయి అని చెప్పుచున్నది. (అనేక జన్మల ద్వారా సిద్ధుడై తరవాత ఉత్తమగతిని పొందుతాడు అని పై భగవద్గీతావాక్యానికి భావం). దృష్టమైన ప్రయోజనం గల విద్య నిషేధం లేనంత మాత్రంచేత కూడ అర్థిని శ్రవణాదులలో అధికారవంతుణ్ణి చేస్తుంది. (విద్యవల్ల కలిగే ఫలం ప్రత్యక్షంగా కనబడుతుంది. అలాంటి విద్యను పొందగూడదు అనే నిషేధం లేనంత వరకు ప్రతీ అర్థికీ కూడ (విద్య కావాలనుకొనేవానికీ కూడ) శ్రవణాదులయందు అధికారం ఉంది అని భావం) అందువల్ల విధురాదులకు కూడ విద్యయందు అధికారం ఉండడం విరుద్ధం కాదు. 38

### సూ. అతస్త్వితరజ్జ్యాయో లిఙ్గాచ్చ. 3.4.39

అతస్త్వన్తరాలవర్తిత్వాత్ ఇతరత్ ఆశ్రమవర్తిత్వం జ్యాయః విద్యాసాధనమ్, శ్రుతిస్మృతిసందృష్టత్వాత్, శ్రుతిలిఙ్గాచ్చ "తేనైతి బ్రహ్మవిత్పుణ్యకృత్తైజసశ్చ" (బృ.ఉ. 4.4.9) ఇతి.

"అనాశ్రమీ న తిష్ఠేత దినమేకమపి ద్విజః"

"సంవత్సరమనాశ్రమీ స్థిత్వా కృచ్ఛ్రమేకం చరేత్". ఇతి స్మృతిలిఙ్గాత్

### బాలానందిని

**అత ఇతి :-** "అతః = అనాశ్రమిత్వంకంటె, ఇతరత్ = ఆశ్రమిత్వం, జ్యాయః = మంచిది. లిఙ్గాచ్చ = శ్రుతిస్మృతిలింగంవల్ల కూడ" అని సూత్రార్థం.

**అతస్త్వితి :-** మధ్యలో ఉండిపోవడంకంటె, ఇతరం అనగా ఏదో ఒక ఆశ్రమంలో ఉండడం మంచి విద్యాసాధనం. ఆ విధంగా శ్రుతిస్మృతులలో కనబడుచున్నది. "తేనైతి... తైజసశ్చ" (పుణ్యం చేసిన బ్రహ్మవేత్త శుద్ధసత్త్వం కలవాడై బ్రహ్మమార్గంచేత బ్రహ్మను పొందుతాడు) అని శ్రుతిలింగం ఉన్నది. "అనాశ్రమీ...ద్విజః" (ద్విజుడు ఒక్క రోజు కూడా ఆశ్రమం లేకుండా ఉండకూడదు) "సంవత్సర . . . చరేత్" (సంవత్సరం పాటు అనాశ్రమిగా ఉన్నవాడు ఒక కృచ్ఛ్రవ్రతం చెయ్యాలి) అని స్మృతిలింగం కూడ ఉంది. 39

### విధురాధికరణం సమాప్తం

## 10. తద్భూతాధికరణమ్. సూ. 40.

**సూ. తద్భూతస్య తు నాతద్భావో జైమినేరపి నియమాతద్రూపాభావేభ్యః. 3.4.40**

సన్త్యూర్ధ్వరేతస ఆశ్రమా ఇతి స్థాపితమ్. తాంస్తు ప్రాప్తస్య కథం చిత్తతః ప్రచ్యుతిరస్తి నవేతి సంశయః. పూర్వకర్మస్వనుష్ఠానచికీర్షయా వా, రాగాదివశేన వా ప్రచ్యుతోఽపి స్యాద్విశేషాభావాదితి. ఏవం ప్రాప్త ఇదముచ్యతే - తద్భూతస్య తు ప్రతిపన్నోర్ధ్వరేతోభావస్య న కథంచిదప్యతద్భావో, న తతః ప్రచ్యుతిః స్యాత్. కుతః? నియమాతద్రూపాభావేభ్యః. తథాహి - **"అత్యన్తమాత్మానమాచార్య కులేఽవసాదయన్"** (ఛా.ఉ. 2.2.3.1) **"అరణ్యమిదం పదం, తతో న పునరీయాదిత్యుపనిషత్"** ఇతి,

> **"ఆచార్యేణాభ్యనుజ్ఞాతశ్చతుర్ణామేకమాశ్రమమ్,**
>
> **ఆవిమోక్షాచ్ఛరీరస్య సోఽనుతిష్ఠేద్యథావిధి"**

ఇతిచైవంజాతీయకో నియమః ప్రచ్యుత్యభావం దర్శయతి. యథా చ **"బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్"** (జా. ఉ. 4) **"బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్"** (జా.ఉ. 4) ఇతిచైవమాదీన్యారోహరూపాణి వచాంస్యుపలభ్యన్తే నైవం ప్రత్యవరోహరూపాణి. న చైవమాచారాః శిష్టా విద్యన్తే. యత్తు పూర్వకర్మ స్వనుష్ఠానచికీర్షయా ప్రత్యవరోహణమితి, తదసత్. "శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్" (భ.గీ. 3.25) ఇతి స్మరణాత్. న్యాయాచ్చ యోహి యం ప్రతి విధీయతే స తస్య ధర్మో న తు యో యేన స్వనుష్ఠాతుం శక్యతే, చోదనారూపత్వాద్ధర్మస్య. న చ రాగాదివశాత్ ప్రచ్యుతిః, నియమశాస్త్రస్య బలీయస్త్వాత్. జైమినేరపీత్యపిశబ్దేన జైమినిబాదరాయణయోరత్ర సంప్రతిపత్తిం శాస్తి ప్రతిపత్తిదార్ఢ్యాయ 40.

బాలానందిని

**తద్భూతేతి** :- "తద్భూతస్య తు = ఊర్ధ్వరేతస్సు అయినవానికైతే, జైమినేరపి = జైమినిమతంలో కూడ, అతద్భావః = ఊర్ధ్వరేతస్సు కానివాడుగా అవడం, న = లేదు. నియమాతద్రూపాభావేభ్యః = క్రిందికి రాకూడదు అనే నియమం వల్ల, అతద్రూపం (రావచ్చు నని అనుమతి లేకపోవడం) వల్ల. శిష్టులలో అలాంటిది లేకపోవడంవల్ల" అని సూత్రార్థం.

**సన్తీతి** :- ఊర్ధ్వరేతస్సులైన ఆశ్రమాలు ఉన్నా యని స్థాపించబడింది. వాటిని పొందినవానికి ఏ విధంగా నైనా అక్కడినుండి తిరిగి క్రిందికి రావడం ఉందా లేదా అని సంశయం. పూర్వం చేయడానికి ప్రారంభించిన కర్మలను బాగా అనుష్ఠించా లనే ఇచ్ఛచేత గాని, రాగాదులచేత గాని ప్రచ్యుతుడు కూడ కావచ్చును, విశేషం ఏదీ లేదు కదా?

ఏ. విధురాదుల కర్మలకు కూడ విద్యోపయోగం ఉంది అని వెనుక చెప్పబడింది. అట్లయితే ఊర్ధ్వరేతస్త్వాన్ని పొంది తిరిగి గార్హస్థ్యంలోనికే వచ్చినవాడు ఆశ్రమకర్మ బాగా ఆచరిస్తే విద్యోపయోగం చాలా ఎక్కువగా ఉంటుం దని వేరే చెప్పనక్కరలేదు కదా అని ప్రత్యుదాహరణసంగతితో పూర్వపక్షం. (బ.వి.ఆ.)

**ఏవమితి** :- ఇట్లు ప్రాప్తించగా చెప్పబడుచున్నది. తద్భూతస్య తు = ఊర్ధ్వరేతస్త్వాన్ని పొందినవానికి, ఏ విధంగానూ **కూడ, అతద్భావః** = దానినుండి ప్రచ్యుతి (క్రిందికి దిగడం) ఉండదు. ఎందువల్ల? నియమాతద్రూపాభావాలవల్ల. అదెట్లనగా - "**అత్యన్త . . . అవసాదయన్**" (పూర్తిగా తనను ఆచార్యకులంలోనే క్షీణింపచేసుకుంటూ) అని, "**అరణ్య . . . ఉపనిషత్**" (పారివ్రాజ్యాన్ని పొందాలి అని శాస్త్రం, అక్కడినుండి తిరిగి రాకూడదు అనేది రహస్యం) అనీ, "**ఆచార్యేణ..... యథావిధి**" (అతడు ఆచార్యుని అనుమతి పొంది, నాలుగు ఆశ్రమాలలో ఒక ఆశ్రమాన్ని శరీరం పడిపోయే వరకు యథాశాస్త్రంగా అనుష్ఠించాలి) అనీ, ఈ విధమైన నియమం ప్రచ్యుతి ఉండ దని చూపుతున్నది. "బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్" "బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్" అని ఆరోహణాన్ని చెప్పు వాక్యాలు కనబడినట్లు ప్రత్యవరోహణం (క్రిందికి - దిగడం) చెప్పే వచనాలు కనబడడం లేదు ఇలాంటి ఆచారం గల (ఇలా చేసే)శిష్టులు కూడా కనబడడం లేదు. పూర్వకర్మను చక్కగా అనుష్ఠించే అభిలాషతో తిరిగి రావడం అని ఏది చెప్పబడిందో

అది యుక్తం కాదు. "శ్రేయాన్....స్వనుష్ఠితాత్" (బాగా చేయబడిన పరధర్మం కంటె విగుణంగా చేసినా స్వధర్మం మంచిది) అని స్మృతిలో చెప్పబడింది. న్యాయం కూడ (ఈ విషయాన్ని బలపరుస్తున్నది). ఏది ఎవనికి విధించబడుతుందో అది వానికి ధర్మం అవుతుంది. కాని, దేనిని ఎవడు బాగా ఆచరించకలుగుతాడో అది వానికి ధర్మం కాదు. ధర్మం అనేది చోదనాలక్షణం కదా (అనగా విధిరూపం కదా? (విధించినదే ధర్మం కాని మరొకటి కాదు). రాగాదిహేతువులచేత కూడ ప్రచ్యుతి ఉండకూడదు. నియమశాస్త్రం అధికమైన బలం కలది కదా? జైమినేరపి అని 'అపి' శబ్దంచేత ఈ విషయంలో జైమిని బాదరాయణులకు ఐకమత్యం ఉందని, తెలిసిన విషయం దృఢంగా ఉండడం కోసం చెప్పబడుచున్నది. ('అపి' శబ్దంచేత బ్రహ్మసూత్రకర్త యైన బాదరాయణుడు గ్రహించబడతాడు). 40.

**తద్భూతాధికరణం సమాప్తం**

**అధికారాధికరణమ్. సూ. 41 - 42**

**సూ. న చాధికారికమపి పతనానుమానాత్తదయోగాత్. 3.4.41**

యది నైష్ఠికో బ్రహ్మచారీ ప్రమాదాదవకీర్యేత కిం తస్య "బ్రహ్మచార్యవకీర్ణీ నైరృతం గర్దభమాలభేత" ఇత్యేతత్ప్రాయశ్చిత్తం స్యాదుత నేతి. నేత్యుచ్యతే. యదప్యధికారలక్షణే నిర్ణీతం ప్రాయశ్చిత్తం "**అవకీర్ణిపశుశ్చ తద్వదాధాన స్యాప్రాప్తఫలత్వాత్**" (జై.సూ 6.8.11) ఇతి. తదపి న నైష్ఠికస్య భవితుమర్హతి. కిం కారణమ్?

"**ఆరూఢో** నైష్ఠికం ధర్మం యస్తు ప్రచ్యవతే పునః,
ప్రాయశ్చిత్తం న పశ్యామి యేన శుధ్యేత్స ఆత్మహా"

ఇత్యప్రతిసమాధేయత్వశ్రవణాత్, ఛిన్నశిరస ఇవ ప్రతిక్రియానుపపత్తేః. ఉపకుర్వాణస్య తు తాదృశపతనస్మరణాభావాదుపపద్యతే తత్ ప్రాయశ్చిత్తమ్. 41

## బాలానందిని

**నేతి** :- "అధికారికమపి = అధికారలక్షణంలో నిర్ణయించిన ప్రాయశ్చిత్తం కూడ, న చ = లేదు; పతనానుమానాత్ = అవకీర్ణి పతితు డని స్మృతివల్ల, తదయోగాత్ = ఆ ప్రాయశ్చిత్తం కుదరదు గాన" అని సూత్రార్థం.

**యదీతి** :- నైష్ఠిక బ్రహ్మచారి (ఆజన్మాంతం బ్రహ్మచారిగా ఉంటానని శపథం చేసినవాడు) పొరబాటున వ్యభిచారం చేస్తే వానికి"బ్రహ్మచార్యవకీర్ణీ నైరృతం గర్ధభమాలభేత" (అవకీర్ణియైన (వ్యభిచారం చేసిన) బ్రహ్మచారి నిర్‌ృతి దేవత గల గర్ధభాలంభనం చెయ్యాలి, నిర్‌ృతికి గర్ధభం పశువుగా ఇచ్చే యాగం చెయ్యాలి) అనే ప్రాయశ్చిత్తం ఉంటుందా ఉండదా?

ఏ. ఊర్ధ్వరేతస్కుడు ప్రచ్యుతు డైతే వాని కర్మకు విద్యాఫలం ఉండ దని వెనుక చెప్పబడింది. అలాంటి ఊర్ధ్వరేతస్కులలో ఒకడైన నైష్ఠికబ్రహ్మచారికి వ్రతభంగం కలిగినపుడు ప్రాయశిత్తం చేసికొంటే వానికి కర్మవల్ల విద్యాఫలం లభిస్తుంది అని వెనుక చెప్పిన సామాన్యానికి అపవాదసంగతి.

**నేతి** :- ఉండదు అని చెప్పబడుచున్నది. అధికారలక్షంలో (పూర్వమీమాంస ఆరవ అధ్యాయంలో) "అవకీర్ణి . . . కాలత్వాత్" (అవకీర్ణి ఇవ్వవలసిన పశువు కూడా లౌకికాగ్నిలోనే ఇవ్వాలి, అతడు ఇంకా అగ్న్యాధానం చేయలేదు కదా) అని నిర్ణయించబడిన ప్రాయశ్చిత్తం నైష్ఠికునకు తగదు. ఎందువల్ల? "**ఆరూఢో . . . ఆత్మహా**" నైష్ఠికధర్మాన్ని అధిష్ఠించి ఎవడు దీనినుంచి చ్యుతుడవుతాడో అట్టి ఆత్మఘాతకుడు (తనను తానే చంపుకొన్నవాడు) శుద్ధి పొందడానికి తగిన ప్రాయశ్చిత్తం ఏదీ నాకు కనబడడం లేదు) అని వాని పతనాన్ని మరల్చే మార్గం ఏదీ లేదని స్మృతిలో చెప్పడంచేత, తల తెగి పడిపోయినవానికి వలె, ప్రతిక్రియ లేదు. ఉపకుర్వాణుని (అధ్యయనం పూర్తి అయ్యే వరకు మాత్రమే గురుకులంలో ఉండే బ్రహ్మచారి) కైతే అలాంటి పతనం చెప్పకపోవడంవల్ల ఆ ప్రాయశ్చిత్తం తగి ఉంటుంది. 41

### సూ. ఉపపూర్వమపి త్వేకే భావమశనవత్తదుక్తమ్. 3.4.42

అపి త్వేక ఆచార్యా ఉపపాతకమేవైతదితి మన్యన్తే, యన్నైష్ఠికస్య

గురుదారాదిభ్యోఽన్యత్ర బ్రహ్మచర్యం విశీర్యేత న తన్మహాపాతకం భవతి, గురుతల్పాదిషు మహాపాతకేష్వపరిగణనాత్. తస్మాదుపకుర్వాణవన్నైష్ఠికస్యాపి ప్రాయశ్చిత్తస్య భావమిచ్ఛన్తి. బ్రహ్మచారిత్వావిశేషాత్, అవకీర్ణిత్వావిశేషాచ్చ. అశనవత్: యథా బ్రహ్మచారిణో మధుమాంసాశనే వ్రతలోపః పునః సంస్కారశ్చ ఏవమితి. యే హి ప్రాయశ్చిత్తస్యాభావమిచ్ఛన్తి తేషాం న మూలముపలభ్యతే. యే తు భావమిచ్ఛన్తి తేషాం "బ్రహ్మచార్యవకీర్ణీ" ఇత్యేతదవిశేషశ్రవణం మూలమ్. తస్మాద్భావో యుక్తతరః. తదుక్తం ప్రమాణలక్షణే - "సమా విప్రతిపత్తిఃస్యాత్" (జై.సూ.1.3.8), "శాస్త్రస్థా వా తన్నిమిత్తత్వాత్" (జై.సూ.1.3.19) ఇతి. ప్రాయశ్చిత్తాభావస్మరణం త్వేవం సతి యత్నగౌరవోత్పాదనార్థమితి వ్యాఖ్యాతవ్యమ్. ఏవం భిక్షువైఖానసయోరపి - "వానప్రస్థో దీక్షాభేదే కృచ్ఛ్రం ద్వాదశరాత్రం చరిత్వా మహాకక్షం వర్ధయేత్" "భిక్షుర్వానప్రస్థవత్సోమవల్లివర్జం, స్వశాస్త్ర సంస్కారశ్చ" ఇత్యేవమాదిప్రాయశ్చిత్తస్మరణమనుసర్తవ్యమ్, 42

బాలానందిని

**ఉపేతి** :- "అపి తు = కాని, ఏకే = కొందరు, ఉపపూర్వమ్ = ఉపపాతక మునుగా చెప్పుచున్నారు. అశనవత్ = అభక్ష్యభక్షణమునందు వలె, భావమ్ = ప్రాయశ్చిత్తంయొక్క ఉనికిని చెప్పుచున్నారు. తత్ = అది, ఉక్తమ్ = పూర్వభాగంలో చెప్పబడింది"అని సూత్రార్థం.

**అపి త్వితి** :- కాని కొందరు ఆచార్యులు ఇది ఉపపాతకం మాత్రమే అని భావిస్తున్నారు. గురుభార్యాదులయందు తప్ప నైష్ఠికుని బ్రహ్మచర్యం ఇతరత్ర విశీర్ణం అయితే అది మహాపాతకం కాదు. దీనిని గురుతల్పగమనాదిమహాపాతకాలలో పరిగణించలేదు. అందువల్ల ఉపకుర్వాణబ్రహ్మచారికి వలె నైష్ఠికబ్రహ్మచారికి కూడ ప్రాయశ్చిత్తం ఉన్నదని అంటున్నారు. ఎందువల్ల ననగా వీళ్ళిద్దరూ బ్రహ్మచారులే, ఇద్దరూ అవకీర్ణులే, విశేషం ఏదీ లేదు. అశనం విషయంలో వలె. బ్రహ్మచారి మధుమాంసభక్షణం చేస్తే వ్రతలోపం ఎట్లో, మళ్ళీ సంస్కారం ఎట్లో, అట్లే ఇది కూడ. ప్రాయశ్చిత్తం లేదనేవాళ్ళకి

మూలం (ప్రమాణం) ఏదీ లేదు. ప్రాయశ్చిత్తం ఉన్నది అనేవాళ్ళకు మాత్రం విశేషం ఏదీ లేకుండా (ఈ రకమైన బ్రహ్మచారి అని చెప్పకుండా) "బ్రహ్మచార్యవకీర్ణీ" అనే శ్రుతి వాక్యం మూలం. అందువల్ల (ప్రాయశ్చిత్తం) ఉండడమే యుక్తతర మైనది. ఈ విషయమే "సమా. . . స్యాత్" "శాస్త్ర . . . నిమిత్తత్వాత్" అని ప్రమాణలక్షణంలో (పూర్వమీమాంసా శాస్త్రంలో) చెప్పబడింది.

ఏ. "యవమయశ్చరుః" (చరువును యవలతో తయారు చేయాలి) అన్నప్పుడు 'యవ' శబ్దార్థం విషయంలో అభిప్రాయభేదం ఉంది. కొందరు దీర్ఘశూకం (పొడవైన గింజ గల ఒక ధాన్యం) అనే అర్థంలో ఈ శబ్దాన్ని ప్రయోగిస్తారు. మరొక దేశంలో ప్రియంగుధాన్యం అనే అర్థంలో ప్రయోగిస్తారు. ఈ విధంగా సందేహం ఉంది గాన "సమా = సమానమైన, విప్రతిపత్తిః = వికల్పంగా గ్రహించడం, స్యాత్ = ఉండవచ్చును" అనగా రెండింటిలో దేనినైనా వికల్పంగా గ్రహించవచ్చును అని పూర్వపక్షం రాగా "శాస్త్రస్థా వా = శాస్త్రమూలకమైన ది గ్రహించాలి, తన్నిమిత్తత్వాత్ = కర్మ శాస్త్రమూలకమే కదా" అని సిద్ధాంతం చెప్పబడింది. "యదా చాన్యా ఓషధయో మ్లాయన్త్యథైతే యవా మోదమానాస్తిష్ఠన్తి" (మిగిలిన ఓషధు లన్నీ (సస్యాలన్నీ) వాడిపోతూంటే ఈ యవలు సంతోషిస్తూ నిలిచి ఉంటాయి) అనే శాస్త్రాన్ని పట్టి దీర్ఘశూకములనే గ్రహించాలని ని ర్ణయించబడింది. అట్లే శాస్త్రం ప్రకారం ప్రాయశ్చిత్తం ఉన్న దని అంగీకరించాలి.

ప్రాయశ్చిత్తేతి :- ఇలా నిర్ణయించినప్పుడు, ప్రాయశ్చిత్తం లేదనే స్మృతివాక్యం బ్రహ్మచర్యం కాపాడుకొనడం విషయంలో ఎక్కువ ప్రయత్నం చెయ్యాలి అని చెప్పడం కోసమే అని వ్యాఖ్యానించాలి.

ఇట్లే సంన్యాసివాప్రస్థులు కూడ స్మృతులలో చెప్పిన "వానప్రస్థో .... వర్ధయేత్" "భిక్షు....సంస్కారశ్చ" ఇత్యాదిప్రాయశ్చిత్తాన్ని అనుసరించాలి. "దీక్షకు భంగం కలిగినప్పుడు వానప్రస్థుడు పన్నెండు రోజులు కృచ్ఛ్రప్రాజాపత్యం ఆచరించి గడ్డి, పొదలూ ఉన్న ప్రదేశాన్ని జలదానాదులచేత పెంచాలి" అని, "సన్యాసి వానప్రస్థుడు వలెనే ప్రాయశ్చిత్తం చేసికోవాలి. సోమలత తప్ప మిగిలిన తృణకాష్ఠాదులను పెంచాలి. తన శాస్త్రంలో చెప్పిన సంస్కారం కూడా చేసికోవాలి". అని పై వాక్యల అర్థం. 42

అధికారికాధికరణం సమాప్తం

## 12. బహిరధికరణమ్. సూ. 43

### సూ. బహిస్తూభయథాపి స్మృతేరాచారాచ్చ. 3.4.43

యద్యూర్ధ్వరేతసాం స్వాశ్రమేభ్యః ప్రచ్యవనం మహాపాతకం యది వా **ఉపపాతకమ్ ఉభయథాపి శిష్టైస్తే బహిష్కర్తవ్యాః.**
**"ఆరూఢో నైష్ఠికం ధర్మం యస్తు ప్రచ్యవతే పునః,**
**ప్రాయశ్చిత్తం న పశ్యామి యేన శుధ్యేత్స ఆత్మహా" ఇతి,**
**ఆరూఢపతితం విప్రం మణ్డలాచ్చ వినిఃసృతమ్,**
**ఉద్బద్ధం కృమిదష్టం చ స్పృష్ట్వా చాన్ద్రాయణం చరేత్."**
ఇతి చైవమాదినిన్దాతిశయస్మృతిభ్యః, శిష్టాచారాచ్చ. న హి యజ్ఞాధ్యయనవివాహాదీని తైః సహాచరన్తి శిష్టాః. 43

బాలానందిని

**బహిరితి** :- స్మృతేః = స్మృతివల్ల, ఆచారాచ్చ = ఆచారంవల్ల, ఉభయథాపి = మహాపాతకమైనా ఉపపాతకమైనా కూడ, బహిః = వాళ్ళు బహిష్కరింపదగిన వాళ్ళే" అని సూత్రార్థం.

**యదీతి** :- ఊర్ధ్వరేతస్కులు తమ ఆశ్రమాలనుండి భ్రష్టు లవడం మహాపతకమైనా, ఉపపాతకమైనా రెండు విధాలా కూడ (ఏమైనాకూడ) వాళ్ళను శిష్టులు బహిష్కరించాలి. "**ఆరూఢో....స ఆత్మహా**" అని, "**ఆరూఢ ....చరేత్**" (అరూఢపతితుడు పై ఆశ్రమానికి వెళ్ళి పతితు డైనవాడు, తన మండలంనుండి, నివాసదేశం నుండి, బైటకు వెళ్ళినవాడు, ఉరితీయబడినవాడు, సర్పాదులు కరిచినవాడు అయిన బ్రాహ్మణుణ్ణి స్పృశిస్తే చాంద్రాయణం చెయ్యాలి) అనీ ఈ విధమైన అత్యధికమైన నిందను చెప్పే శ్రుతులవల్లా శిష్టాచారంవల్లా కూడ వాళ్ళని బహిష్కరించాలి. శిష్టులు అలాంటి వాళ్ళతో యజ్ఞ - అధ్యయన - వివాహాదులు చేసికొనరు కదా?

వి. పాపాలకు రెండు శక్తు లుంటాయి. ఒకటి ఇహలోకంలో అశుద్ధిని కలిగిస్తుంది. రెండవది పరలోకంలో అశుద్ధిని కలిగిస్తుంది. ప్రాయశ్చిత్తాలచేత

పరలోకాశుద్ధిని తొలగించుకుంటే నరకాదికం రాదు. ఐహికాశుద్ధిని తొలగించుకుంటే శిష్టులతో వ్యవహారం పెట్టుకొనవచ్చును. "**ఆరూఢపతితమ్**" ఇత్యాదివచనాలవల్ల, "నైష్ఠికానాం వనస్థానాం యతీనాం చావకీర్ణినామ్. శుద్ధానామపి లోకేఽస్మిన్ ప్రత్యాపత్తిర్నవిద్యతే" ఇత్యాదివచనాలవల్లా ఆరూఢపతితులకు ప్రాయశ్చిత్తంచేత పారలౌకికాశుద్ధి తొలగిపోయినా ఐహికాశుద్ధి మాత్రం తొలగదు. దీనిని పట్టి "ప్రాయశ్చిత్తం న పశ్యామి" అనేదానికి ఐహికాశుద్ధిహరమైన ప్రాయశిత్తం లేదని అర్థం. (బ్ర.వి. ఆ.) 43

బహిరధికరణం సమాప్తం

**13. స్వామ్యధికరణమ్. సూ. 44-46**

**సూ. స్వామినః ఫలశ్రుతేరిత్యాత్రేయః 3.4.44**

అఙ్గేషూపాసనేషు సంశయః - కిం తాని యజమానకర్మాణి, ఆహోస్విదృత్విక్కర్మాణీతి. కిం తావత్ప్రాప్తమ్? యజమానకర్మాణీతి. కుతః? ఫలశ్రుతేః. ఫలం హి శ్రూయతే - "వర్షతి హాస్మై వర్షయతి హ య ఏతదేవం విద్వాన్ వృష్టౌ పఞ్చవిధం సామోపాస్తే(ఛా.ఉ. 2.3.2) ఇత్యాది. తచ్చ స్వామిగామి న్యాయ్యమ్, తస్య సాఙ్గే ప్రయోగేఽధికృతత్వాత్. అధికృతాధికారత్వాచ్చైవం జాతీయకస్య. ఫలం చ కర్తర్యుపాసనానాం శ్రూయతే - "వర్షత్యస్మై య ఉపాస్తే" ఇత్యాది. నఽన్వృత్విజో ఽపి ఫలం దృష్టమ్ "ఆత్మనే వా యజమానాయ వా యం కామం. కామయతే తయాగామయతి" (బృ.ఉ. 1.3.28) ఇతి. న. తస్య వాచనికత్వాత్. తస్మాత్ స్వామిన ఏవ ఫలవత్సూపాసనేషు కర్తృత్వమిత్యాత్రేయ ఆచార్యో మన్యతే. 44

బాలానందిని

**స్వామిన ఇతి** :- ఫలశ్రుతేః = ఫలం వినబడుటవలన, స్వామినః = అంగోపాసనలు యజమానునికే, ఇతి = అని, ఆత్రేయః = ఆత్రేయుడు చెప్పుచున్నాడు" అని సూత్రార్థం.

**అఙ్గేష్వితి** :- అంగాలకు సంబంధించిన ఉపాసనల విషయంలో - అవి యజమానుడు చేయవలసినవా లేక ఋత్త్విక్కుల కర్మలా అని సంశయం. ఏమి ప్రాప్తించినది? యజమానుని కర్మలని ప్రాప్తించినది. ఎందువల్ల? ఫలం వినబడడంవల్ల. "**వర్షతి ....సామోపాస్తే**" హింకార ప్రస్తావ - ఉద్గీథ - ప్రతిహార - నిధనా లనే ఐదు విధాలైన సామయందు వృష్టిని ధ్యానం చేసినవాడు వర్షిస్తాడు, వీనికొరకు వర్షింపచేస్తాడు) ఇత్యాధిఫలం వినబడుచున్నది. ఆ ఫలం స్వామికి చెందడమే యుక్తం. అతడే సాంగమైన ప్రయోగంలో(కర్మలో) అధికారిగా ఉన్నాడు కదా? ఇలాంటివి ఎవ డైతే అధికారం కలవాడో వానికే సంబంధిస్తాయి. "వర్షత్యస్మై య ఉపాస్తే" (ఎవడు ఉపాసిస్తాడో వానికొరకు వర్షిస్తుంది) అని ఉపాసనచేసినవానికే ఫలం లభిస్తుందని వినబడుచున్నది. (ప్రశ్న) "**ఆత్మనే ...ఆగాయతి**" (తనకు గాని, యజమానునికి గాని ఏ కామం కోరుతాడో దానిని ఉద్గానంచేత సాధిస్తాడు) అని ఋత్విక్కుకు కూడా ఫలం చెప్పబడింది కదా? (సమాధానం) అది యుక్తం కాదు. అది వాచనికం (అనగా పైన చెప్పిన న్యాయంచేత (సాంగమైన ప్రయోగంలో అధికృతు డవడంచేత) స్వామికే ఫలం చెందవలసి ఉన్నా ఇక్కడ ప్రత్యేకించి ఋత్విక్కుకు కూడా ఫలం చెప్పబడింది. ఇది ఇక్కడ మాత్రమే వర్తిస్తుంది అని భావం). అందువల్ల ఫలం గల ఉపాసనలలో కర్తృత్వం స్వామికి మాత్రమే అని ఆచార్యుడైన ఆత్రేయుడు భావిస్తున్నాడు.

వి. "ప్రాయశ్చిత్తం చేసుకొన్నవాడు శిష్టులతో వ్యవహరించడానికి అర్హు డవుతాడు" అనే సామాన్యశాస్త్రానికి ఆరూఢపతితుని విషయంలో అపవాదం చెప్పబడింది. అదే విధంగా "క్రతువులలోని వ్యాపారం అంతా ఋత్విక్కులే చెయ్యాలి." అనే సామాన్యనియమానికి క్రత్వంగాలకు సంబంధించిన ఉపాసనలలో అపవాదం చెప్పి అది స్వామియే చెయ్యాలి అంటాం అని ఉదాహరణసంగతిచేత పూర్వపక్షం. 44

## సూ. ఆర్త్విజ్యమిత్యౌడులోమిస్తస్మై హి పరిక్రీయతే. 3.4.45

నైతదస్తి స్వామికర్మాణ్యుపాసనానీతి. ఋత్విక్కర్మాణ్యేతాని స్యురిత్యౌడులోమిరాచార్యో మన్యతే. కిం కారణమ్? తస్మై హి సాఙ్గాయ కర్మణే యజమానేన ఋత్విక్పరిక్రీయతే. తత్ప్రయోగాన్తఃపాతీని చ ఉద్గీథాద్యుపాసనాని

అధికృతాధికారత్వాత్. తస్మాద్గోదోహనాదినియమవదేవ ఋత్విగ్భిర్నిర్వర్త్యేరన్, తథా చ "తం హ బకో దాల్భ్యో విదాంచకార స హ నైమిషీయాణాముద్గాతా బభూవ" (ఛా. ఉ. 1.2.13) ఇత్యుద్గాతృకర్తృకతాం విజ్ఞానస్య దర్శయతి. యత్తూక్తం కర్త్రాశ్రయం ఫలం శ్రూయత ఇతి; నైష దోషః. పరార్థత్వాదృత్విజో ఽన్యత్ర వచనాత్ ఫలసంబన్ధానుపపత్తేః. 45

### బాలానందిని

**ఆర్త్విజ్యమితి** :- ఆర్త్విజ్యమితి = ఈ కర్మలు ఋత్విక్కులే చేయవలసినవి అని, ఔడులోమిః = ఔడులోమి తలచుచున్నాడు. తస్మై = కర్మకొరకే, పరిక్రీయతే హి = కొనబడతాడు కదా" అని సూత్రార్థం.

నైతదితి :- ఉపాసనలు స్వామి చేయవలసిన కర్మలు అనే మాట లేదు, ఇవి ఋత్విక్కు చేయవలసిన కర్మలే అని ఆచార్యుడైన ఔడులోమి తలచుచున్నాడు. ఎందువల్ల? ఆ సాంగమైన కర్మ చేయడం కోసమే యజమానునిచేత ఋత్విక్కు కొనబడతాడు కదా? ఉద్గీథాద్యుపాసనలు కూడ అధికృతాధికారా లవడంచేత అతడు చేయవలసిన ప్రయోగాలలోనే చేరుతాయి. అందువల్ల గోదోహనాదినియమాల వలెనే ఇవి కూడా ఋత్విక్కుల చేతనే చేయబడాలి. గోదోహనం సాంగమైన క్రతువులో అధికారియైనవానికి చెప్పబడడంచేత దాని ఫలం క్రత్వధికారికి చెందుతుంది. అదే విధంగా అంగోపాసనల ఫలం కూడా క్రత్వధికారికి మాత్రమే చెందుతుంది. అందుచేతనే "తం హ... బభూవ" (దాల్భ్యుడైన బకుడు నైమిషీయులకు ఉద్గాతగా ఉన్నాడు. అందుచేత దానిని తెలుసుకున్నాడు అనగా ఉపాసించాడు) అని విజ్ఞానానికి కర్త ఉద్గాతయే అని చూపుచున్నది. కర్తకు సంబంధించిన ఫలం వినబడుతున్నది అని ఏది చెప్పబడిందో అది దోషం కాదు. ఋత్విక్కు పరుని కొరకే పని చేస్తాడు గాన, ఆ ఫలం అతనికే చెందుతుం దని ప్రత్యేకంగా వచనం ఉంటే తప్ప, వానికి ఫలసంబంధం కుదరదు. (అది యజమానునికే చెందుతుంది). 45

### సూ. శ్రుతేశ్చ 3.4.46

"యాం వై కాం చన యజ్ఞే ఋత్విజ ఆశిషమాశాసత ఇతి యజమానాయైవ

**కామాశాసత ఇతి హోవా చ**" ఇతి, "తస్మాదు హైవంవిదుద్గాతా బ్రూయాత్కం తే **కామమాగాయాని**" (ఛా.ఉ. 1.7.8.9) ఇతి చ ఋత్విక్కర్తృకస్య విజ్ఞానస్య యజమానగామి ఫలం దర్శయతి. తస్మాదఙ్గోపాసనానామ్ ఋత్విక్కర్మత్వ సిద్ధిః. 46.

బాలానందిని

**శ్రుతేరితి** :- "శ్రుతేశ్చ = శ్రుతివల్ల కూడ అంగోపాసనలు ఋత్విక్కర్మయే" అని సూత్రార్థం.

**యామితి** :- "**యాం ....ఉవాచ**" (యజ్ఞంలో ఋత్విక్కులు ఏ కోరికను కోరుతారో దానిని యజమానునికొరకే కోరుతారు అని పలికెను) అని, "**తస్మాత్....అగాయాని**" (అందువల్లనే ఇట్లు తెలుసుకొన్న ఉద్గాత నీ కొరకు ఏ కోరికను గానం ద్వారా సాధింతును అని అడగాలి) అనీ శ్రుతి ఋత్విక్కులు కర్తగా గల విజ్ఞానంయొక్క ఫలం యజమానుణ్ణి చేరుతుంది. అని చూపుచున్నది. అందువల్ల అంగోపాసనలు ఋత్విక్కులు చేయవలసిన పనులే అని సిద్ధిస్తూన్నది. 46

స్వామ్యధికరణం సమాప్తం

## 14. సహకార్యన్తరవిధ్యధికరణమ్. సూ. 47 - 49

### సూ. సహకార్యన్తరవిధిః పక్షేణ తృతీయం తద్వతో విధ్యాదివత్ 3.4.47

"తస్మాద్బ్రాహ్మణః పాణ్డిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేద్బాల్యం చ పాణ్డిత్యం చ నిర్విద్యాథ మునిరమౌనం చ మౌనం చ నిర్విద్యాథ బ్రాహ్మణః" (బృ.ఉ. 3.5.1) ఇతి బృహదారణ్యకే శ్రూయతే. తత్ర సంశయః - మౌనం విధీయతే వా న వేతి. న విధీయత ఇతి తావత్ప్రాప్తమ్. బాల్యేన తిష్ఠాసేదిత్యత్రైవ విధేరవసితత్వాత్. న హ్యథ మునిరిత్యత్ర విధాయికా విభక్తిరుపలభ్యతే. తస్మాదయమనువాదో యుక్తః. కుతః ప్రాప్తిరితి చేత్, మునిపణ్డితశబ్దయోః జ్ఞానార్థత్వాత్ పాణ్డిత్యం నిర్విద్యైత్యేవ ప్రాప్తం మౌనమ్. అపి చామౌనం మౌనం

నిర్విద్య అథ బ్రాహ్మణ ఇత్యత్ర తావన్న బ్రాహ్మణత్వం విధీయతే; ప్రాగేవ ప్రాప్తత్వాత్. తస్మాదథ బ్రాహ్మణ ఇతి ప్రశంసావాదః. తథైవ అథ మునిరిత్యపి భవితుమర్హతి, సమాననిర్దేశత్వాదితి.

## బాలానందిని

సహకారీతి :- పక్షేణ = భేదదర్శనం ప్రాప్తించే పక్షంచేత (పక్షంలో), తద్వతః = పరోక్షజ్ఞానం గల సన్యాసికి, సహకార్యన్తరవిధిః = మరియొక సహకారియైన నిదిధ్యాసనం యొక్క విధి. తృతీయమ్ = మూడవదైన నిధిధ్యాసనం విధించబడుచున్నది. విధ్యాధివత్ = విధ్యాదుల వలె" అని సూత్రార్థం.

తస్మాదితి :- "తస్మాద్ ... బ్రాహ్మణః" అని బృహదారణ్యకంలో వినబడుచున్నది.

వి. తస్మాత్ = పూర్వం బ్రాహ్మణులు ఆత్మను తెలుసుకొని, సంన్యాసం స్వీకరించి, భిక్షాచర్యం చేసేవారు గాన, బ్రాహ్మణః = ఇప్పటి బ్రాహ్మణుడు కూడ, పాణ్డిత్యమ్ = ఆత్మజ్ఞానం పండ. పండ కలవాడు పండితుడు. వాని ధర్మం పాండిత్యం, ఆ పాండిత్యాన్ని, నిర్విద్య = నిశ్చితంగా పొంది, బాల్యేన = శ్రవణంవల్ల కలిగిన జ్ఞానంయొక్క బలరూపమైన మననంతో, లేదా బాలుని ధర్మమైన శుద్ధచిత్తంతో, తిష్ఠాసేత్ = ఉండా లని కోరుకోవాలి. బాల్యమును పాండిత్యమునూ, అనగా శ్రవణమననాలను, పొంది, అథ = అటు పిమ్మట, మునిః = నిదిధ్యాసనం చేస్తూ ఉండాలి. ఈ విధంగా, అమౌనమ్ = మౌనంకంటె భిన్నములైన శ్రవణమననాలను, మౌనం చ = నిదిధ్యాసనమును పొంది, తరువాత, బ్రాహ్మణః = బ్రహ్మసాక్షాత్కారం గల బ్రాహ్మణు డవుతాడు అని ఈ శ్రుతివాక్యానికి అర్థం.

తత్రేతి :- ఇక్కడ మౌనం విధించబడుచున్నదా లేదా అని సంశయం . విధించబడదు అని ప్రాప్తించినది. ''బాల్యేన తిష్ఠాసేత్'' అనే చోటనే విధి పూర్తి అయిపోయింది. అథ మునిః అనే చోట విధాయక మైన విధ్యర్థకపద మేమీ కనబడడం లేదు కదా? అందుచేత ఇది అనువాదం అని గ్రహించడమే యుక్తం. దీనికి ప్రాప్తి ఎట్లు అన్నట్లయితే - (అనగా మౌనం విధించబడడం లేదు అనువదించబడుచున్నది అన్నప్పుడు ముందు మరొక వాక్యంచేత ప్రాప్తించిన దానినే అనువదించడం అనేది సంభావ్యం గాన

అసలు మౌనం ఎలా ప్రాప్తించింది అని ప్రశ్నకు అర్థం). ముని - పండితశబ్దాలు జ్ఞానార్థకములు గాన "పాణ్డిత్యం నిర్విద్య" అనేదానిచేతనే మౌనం ప్రాప్తించింది. (అది అనువదింపబడుచున్నది అని భావం). మరొక విషయ మేమనగా "అమౌనం చ నిర్విద్య **అథ బ్రాహ్మణః"** అనే చోట బ్రాహ్మణత్వం విధించబడడం లేదు, అది ముందుగానే ప్రాప్తించి ఉన్నది. అందుచేత ఇక్కడ బ్రాహ్మణః అనేది ప్రశంసావాదం మాత్రమే. మునిః అనేది కూడా అట్లే ప్రశంసార్థం అవడానికి తగి ఉంటుంది. రెండింటి నిర్దేశమూ సమానంగానే ఉన్నది కదా?

వి. ఊర్ధ్వరేతస్సులను గూర్చి విచారించే సందర్భంలో ప్రసంగవంశంచేత ఉపాసనలు ఋత్విక్కులు చేయవలసిన కర్మలు అని ప్రతిపాదించబడింది. ఈ అధికరణంలో ఊర్ధ్వరేతస్సులకే సంబంధించిన ఒక ధర్మం నిరూపించబడుచున్నది. ఇదే సంగతి (బ్ర.వి.అ) "తం హ బకః" ఇత్యాదివాక్యశేషాన్ని పట్టి ఉద్గీథాద్యుపాసనం ఋత్విక్కర్మ అని నిర్ణయించి నట్లు "అథ బ్రాహ్మణః" అని విధిరహితమైన వాక్యశేషాన్ని పట్టి మౌనం కూడా అవిధేయమే అని నిశ్చయించాలి అని ఉదాహరణ సంగతితో పూర్వపక్షం (రత్నప్రభ).

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః - సహకార్యన్తరవిధిరితి. విద్యాసహకారిణో మౌనస్య బాల్యపాణ్డిత్యవద్విధిరేవాశ్రయితవ్యః, అపూర్వత్వాత్. నను పాణ్డిత్యశబ్దేనైవ మౌనస్యావగతత్వముక్తమ్? నైష దోషః. మునిశబ్దస్య జ్ఞానాతిశయార్థత్వాత్. మననాన్మునిరితి చ వ్యుత్పత్తిసంభవాత్. "మునీనామప్యహం వ్యాసః" (భ. గీ. 10.37) ఇతి చ ప్రయోగదర్శనాత్. నను మునిశబ్ద ఉత్తమాశ్రమవచనోఽపి శ్రూయతే - "గార్హస్థ్యమాచార్యకులం మౌనం వానప్రస్థమ్" ఇత్యత్ర? న. "వాల్మీకిర్మునిపుఙ్గవః" ఇత్యాదిషు వ్యభిచారదర్శనాత్. ఇతరాశ్రమసంనిధానాచ్చ తత్ర ఉత్తమాశ్రమోపాదానమ్, జ్ఞాన ప్రధానత్వాదుత్తమాశ్రమస్య. తస్మాద్బాల్యపాణ్డిత్యాపేక్షయా తృతీయమిదం

మౌనం జ్ఞానాతిశయరూపం విధీయతే. యత్తు బాల్య ఏవ విధేః పర్యవసానమితి, తథాప్యపూర్వత్వాన్మౌనిత్వస్య విధేయత్వమాశ్రీయతే మునిః స్యాదితి. నిర్వేదనీయత్వనిర్దేశాదపి మౌనస్య బాల్యపాణ్డిత్యవద్విధేయతాశ్రయణమ్. తద్వతో విద్యావతః సంన్యాసినః. కథం విద్యావతః సంన్యాసిన ఇత్యవగమ్యతే? తదధికారాత్. "ఆత్మానం విదిత్వా పుత్రాద్యేషణాభ్యో వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరన్తి" ఇతి. నను సతి విద్యావత్త్వే ప్రాప్నోత్యేవ తత్రాతిశయః, కిం మౌనవిధినేత్యత ఆహ - పక్షేణేతి. ఏతదుక్తం భవతి - యస్మిన్ పక్షే భేదదర్శన ప్రాబల్యాన్న ప్రాప్నోతి తస్మిన్నేష విధిరితి. విధ్యాదివత్. యథా "దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత" ఇత్యేవంజాతీయకే విధ్యాదౌ సహకారిత్వేనాగ్న్యాధానాదికమఙ్గజాతం విధీయతే ఏవమవిధిప్రధానేఽప్యస్మిన్విద్యావాక్యే మౌనవిధిరిత్యర్థః. 47

బాలానందిని

**ఏవమితి** :- ఇట్లు ప్రాప్తించగా సహకార్యంతరవిధి అని చెపుతున్నాం. ఇక్కడ మౌనం అపూర్వం గాన, బాల్యపాండిత్యాల వలె అది విద్యాసహకారిగా విధించబడుచున్న దని గ్రహించాలి. (ప్రశ్న) పాండిత్యశబ్దంచేతనే మౌనం గ్రహించబడింది అని చెప్పాం కదా? ఈ దోషం లేదు. మునిశబ్దానికి జ్ఞానాతిశయం అని అర్థం. "మననాత్ మునిః" (మననం చేయడంవల్ల ముని) అని వ్యుత్పత్తి చెప్పవచ్చును."మునీనామప్యహం వ్యాసః" (మునులలో వ్యాసుడు నేనే) అని ప్రయోగం కనబడుచున్నది (ప్రశ్న) "గార్హస్థ్యమ్, ఆచార్యకులమ్, మౌనమ్. వానప్రస్థమ్" అనే వాక్యంలో మునిశబ్దం సంన్యాసాశ్రమం అనే అర్థంలో కూడా కనబడుచున్నది కదా? కాదు. "వాల్మీకిర్మునిపుంగవః" ఇత్యాదులలో వ్యభిచారం కనబడుచున్నది. (వాల్మీకి సంన్యాసి కాడు కదా?) పై వాక్యంలో ఇతరమైన ఆశ్రమాలతో పాటు పఠించడంవల్ల సంన్యాసాశ్రమం జ్ఞానప్రధానం అవడంవల్ల పరిశేషన్యాయంచేత ఉత్తమాశ్రమం గ్రహించబడింది. అందుచేత బాల్యపాండిత్యాలను పట్టి మూడవదైన జ్ఞానాతిశయరూపమైన మౌనం విధించబడుచున్నది. బాల్యంలోనే

విధి పర్యవసానం చెందింది అని ఏది చెప్పబడిందో (అది నిజమే అన్నట్లు కనబడినా) మునిత్వం అపూర్వం (క్రొత్త విషయం) అవడంచేత "మునిః స్యాత్" (మునిగా అవాలి) అని మునిత్వానికి విధేయత్వం చెప్పబడుతుంది. (అమౌనం మౌనం చ నిర్విద్య) అని పొందదగిన దని చెప్పడంచేత బాల్యపాండిత్యాలవలె మౌనం కూడా విధేయమే (పొందదగినదే) అని చెప్పాలి. (సూత్రంలోని) తద్వతః అనగా విద్యావంతుడైన సంన్యాసికి అని అర్థం. విద్యావంతుడైన సంన్యాసికి అని ఎలా తెలుస్తున్నది? "ఆత్మానం ... చరన్తి" అని ఆ సంన్యాసియొక్క అధికారం (ప్రకరణం) అయి ఉండడంవల్ల తెలుస్తూన్నది విద్యావంతుడైతే దీనియందు అతిశయం చెప్పకపోయినా ప్రాప్తిస్తుంది కదా? ఇంక మౌనవిధి ఎందుకు అను అశంకకు సమాధానంగా (సూత్రకారుడు) "పక్షేణ" అని చెపుతున్నాడు. ఇది చెప్పినట్లయింది (దీని భావం ఇది) భేదదర్శనం ప్రబలంగా ఉన్నప్పుడు ఏ పక్షంలో విద్యాతిశయం ప్రాప్తం కాదో ఆ పక్షంలో ఈ (మౌన) విధి. **విధ్యాదివత్** - "దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత" ఈ రకమైన విధ్యాదియందు, అనగా ప్రధానమైన క్రతువునందు, అగ్న్యాధానం మొదలైన అంగసముదాయం ఏ విధంగా విధించబడుతుందో అట్లే. ఈ విద్యావాక్యంలో ఇది విధిప్రధానం కాకపోయినా మౌనం విధించబడుచున్నది అని అర్థం.

ఏ. విధ్యాదిః అనగా ముఖ్యమైన విధి, అనగా ప్రధానమైనది. "సమిధో యజతి" ఇత్యాదికం విధ్యంతం. అది ప్రధానవిధికి తరవాత చెప్పబడుతుంది కదా? (భామతి)47

## భాష్యమ్

ఏవం బాల్యాదివిశిష్టే కైవల్యాశ్రమే శ్రుతిమతి విద్యమానే కస్మాచ్ఛాన్దోగ్యే గృహిణోపసంహారః "అభిసమావృత్య కుటుమ్బే" ఇత్యత్ర? తేన హ్యుపసంహరన్ తద్విషయమాదరం దర్శయతీతి. అత ఉత్తరం పఠతి-

## సూ. కృత్స్నభావాత్తు గృహిణోపసంహారః 3.4.48

తుశబ్దో విశేషణార్థః. కృత్స్నభావోఽత్ర విశిష్యతే. బహులాయాసాని హి బహూన్యాశ్రమకర్మాణి యజ్ఞాదీని తం ప్రతి కర్తవ్యతయోపదిష్టాని,

ఆశ్రమాన్తరకర్మాణి చ యథాసంభవమహింసేన్ద్రియసంయమాదీని తస్య విద్యన్తే. తస్మాద్గృహమేధినోపసంహారో న విరుధ్యతే . 48

బాలానందిని

**ఏవమితి** :- ఈ విధంగా బాల్యాదులతో కూడిన, శ్రుతివిహిత మైన ఈ కైవల్యాశ్రమం (సంన్యాసం) ఉండగా ఛాందోగ్యంలో "అభిసమావృత్య కుటుమ్బే' అనే చోట గృహస్థునితోనే ఉపసంహారం ఎందుకు చేయబడింది? దానితో ఉపసంహరించడం వల్ల దాని విషయంలో అదరాన్ని సూచిస్తున్నది కదా? ఇందుకు సమాధానం చెపుతున్నాడు-

**కృత్స్నేతి**:- "కృత్స్నభావాత్తు = సంపూర్ణంగా (అధికంగా) ఉండడంవల్ల నైతే, గృహిణా = గృహస్థునితో, ఉపసంహారః = ఉపసంహారం చేయబడినది" అని సూత్రార్థం.

**తుశబ్ద ఇతి**:- తుశబ్దం విశేషించడం అనే అర్థం గలది. అనగా ఒక విశేషాన్ని సూచిస్తున్నది. దీనికి (గృహస్థాశ్రమానికి) కృత్స్నభావం విశేషంగా చెప్పబడుచున్నది. ఎంతో అయాసంతో కూడిన అనేకమైన యజ్ఞాద్యాశ్రమకర్మలు వానికి కర్తవ్యములుగా చెప్పబడ్డాయి. అహింస, ఇంద్రియసంయమం మొదలైన ఇతరాశ్రమకర్మలు కూడ యథాసంభవంగా వానికి ఉన్నాయి. అందువల్ల గృహమేధితో ఉపసంహరించడంలో విరోధం లేదు . 48

## సూ. మౌనవదితరేషామప్యుపదేశాత్ 3.4.49

యథా మౌనం గార్హస్థ్యం చైతావాశ్రమౌ శ్రుతిసంమతావేవమితరావపి వానప్రస్థగురుకులవాసౌ. దర్శితా హి పురస్తా చ్ఛృతిః - "తప ఏవ ద్వితీయో బ్రహ్మచార్యాచార్యకులవాసీ తృతీయః" (ఛా.ఉ. 2.23.1) ఇత్యాద్యా. తస్మాచ్చతుర్ణామప్యాశ్రమాణాముపదేశావిశేషాత్తుల్యవద్వికల్పసముచ్చయాభ్యాం ప్రతిపత్తిః. ఇతరేషామితి ద్వయోరాశ్రమయోర్బహువచనం వృత్తిభేదాపేక్షయా అనుష్ఠాతృభేదాపేక్షయా వేతి ద్రష్టవ్యమ్. 49

బాలానందిని

**మౌనవదితి** :- "ఇతరేషామపి = వానప్రస్థబ్రహ్మచర్యాలకు కూడ, మౌనవత్ =

సంన్యాసగృహస్థాశ్రమాలకు వలె, శ్రుతిసంమతత్వం ఉన్నది, ఉపదేశాత్ = శ్రుతిలో చెప్పడం వల్ల" అని సూత్రార్థం.

**యథేతి** :- మౌనమూ, గార్హస్థ్యమూ అనే ఈ రెండు ఆశ్రమాలూ ఏ విధంగా శ్రుతిసంమతాలో అట్లే ఇతరములైన వానప్రస్థగురుకులవాసాలు కూడ. వెనుక "తప. . . తృతీయః" ఇత్యాది శ్రుతి చూపబడింది కదా? అందువల్ల నాలుగు ఆశ్రమాలను విధించడంలో భేదం ఏదీ లేదు గాన వాటిని నాల్గింటిని సమంగానే వికల్పంగా గాని, సముచ్చయంచేత గాని స్వీకరించాలి. ఆశ్రమాలు రెండే అయినా వాటిలో ఉండే అవాంతర భేదాలను పట్టి గాని, అనుష్ఠాతల భేదాన్ని పట్టి గాని బహువచనం ప్రయోగింపబడిన దని గ్రహించాలి. 49

సహకార్యంతరవిధ్యధికరణం సమాప్తం

## 15. అనావిష్కారాధికరణమ్. సూ. 50

## సూ. అనావిష్కుర్వన్నన్వయాత్. 3.4.50

"తస్మాద్బ్రాహ్మణః పాణ్డిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్" (బృ.ఉ. 3.5.1) ఇతి బాల్యమనుష్ఠేయతయా శ్రూయతే. తత్ర బాలస్య భావః కర్మ వా బాల్యమితి తద్ధితే సతి బాలభావస్య వయోవస్థావిశేషస్యేచ్ఛయా సంపాదయితుమశక్యత్వాత్ యథోపపాదమూత్రపురీషాదిబాలచరితమన్తర్గతా వా భావశుద్ధిః, దమ్భదర్పప్రరూఢేన్ద్రియత్వాదిరహితతా వా బాల్యం స్యాదితి సంశయః. కిం తావత్ప్రాప్తమ్? కామచారవాదభక్షణతా, యథోపపాదమూత్రపురీషత్వం చ ప్రసిద్ధతరం లోకే బాల్యమితి; తద్గ్రహణం యుక్తమ్. నను పతితత్వాది దోషప్రాప్తేర్న యుక్తం కామచారతాద్యాశ్రయణమ్? న. విద్యావతః సంన్యాసినో వచనసామర్థ్యాద్దోషనివృత్తేః, పశుహింసాదిష్వివేతి.

**బాలానందిని**

**అనావిష్కుర్వన్నితి** :- "అన్వయాత్ = ప్రధానమైన జ్ఞానాభ్యాసానికి అనుకూలంగా

ఉండడంవల్ల, అనావిష్కుర్వన్ = తన ధార్మికత్వాదుల్ని ఆవిష్కరించకుండా ఉండాలి" అని సూత్రార్థం.

**తస్మాదితి** :- "తస్మాద్ . . . తిష్ఠాసేత్" అని బాల్యం అనుష్ఠేయంగా వినబడుచున్నది. "బాలస్య భావః కర్మ వా బాల్యమ్" (బాలుని స్వభావం లేదా పని) అనే అర్థంలో తద్ధితప్రత్యయం (ష్యఞ్ - య) చేర్చగా ఏర్పడిన 'బాల్య' శబ్దానికి బాలభావం (బాలుడుగా ఉండడం) అని అర్థం చెపితే వయోవిశేషం ఇష్టం ప్రకారం సంపాదించడానికి శక్యం కాదు గాన ఎలా ఉంటే అల్లా మూత్రపురీషవిసర్జనాదిక మైన బాలచరితం అనే అర్థం గ్రహించాలా, లేక భావపరిశుద్ధి, దంభం దర్పం ప్రరూఢేంద్రియత్వం (ఇంద్రియాల గట్టితనం) మొదలైనవి లేకపోవడం అనే అర్థం గ్రహించాలా అని సంశయం. ఏమి ప్రాప్తించింది? బాల్యం అనగా లోకంలో స్వేచ్ఛగా తిరగడం, మాట్లాడడం, తినడం యథోపపాదమూత్రపురీషత్వం అని ప్రసిద్ధంగా ఉంది. అందుచేత దానిని గ్రహించడం యుక్తం. (ప్రశ్న). కామచారతాదులను గ్రహిస్తే పతితత్వాదిదోషం ప్రాప్తిస్తుంది గాన ఆ అర్థం గ్రహించడం యుక్తం కాదు. (సమాధానం) అది కాదు. యజ్ఞంలో పశుహింసాదుల వలె, వచనసామర్థ్యంచేత విద్యావంతుడైన సంన్యాసికి దోషం ఉండదు.

వి. మౌనశబ్దం జ్ఞానాతిశయం అనే అర్థంలో ప్రసిద్ధం గాన ధ్యానం విధేయ మని వెనుకటి అధికరణంలో చెప్పబడింది. అట్లే బాల్యం అనగా కామచారాదులలో ప్రసిద్ధం గాన దాని విధిని గ్రహించాలి అని దృష్టాంతసంగతిచేత పూర్వపక్షం.

### భాష్యమ్

ఏవం ప్రాప్తేఽభిధీయతే. న. వచనస్య గత్యన్తరసంభవాత్. అవిరుద్ధే హ్యన్యస్మిన్ బాల్యశబ్దాభిలాప్యే లభ్యమానే న విధ్యన్తరవ్యాఘాతకల్పనా యుక్తా. ప్రధానోపకారాయ చాఙ్గం విధీయతే. జ్ఞానాభ్యాసశ్చ ప్రధానమిహ యతీనామనుష్ఠేయమ్. న చ నకలాయాం బాల్యచర్యాయా మఙ్గీక్రియమాణాయాం జ్ఞానాభ్యాసః సంభావ్యతే. తస్మాదాన్తరో భావవిశేషో బాలస్యాప్రరూఢేన్ద్రియత్వాదిరిహ బాల్యమాశ్రీయతే. తదాహ - అనావిష్కుర్వన్నితి. జ్ఞానాధ్యయనధార్మికత్వాదిభిరాత్మానమవిఖ్యాపయన్

దమ్భదర్పారహితో భవేత్. యథా బాలోఽ ప్రరూఢేన్ద్రియతయా న పరేష్వాత్మా నమావిష్కర్తుమీహతే తద్వత్. ఏవం హ్యస్య వాక్యస్య ప్రధానోపకార్యర్థానుగమ ఉపపద్యతే. తథా చోక్తం స్మృతికారైః -

"యం న సన్తం న చాసన్తం నాశ్రుతం న బహు శ్రుతమ్,

న సువృత్తం న దుర్వృత్తం వేత కశ్చిత్స బ్రాహ్మణః"

"గూఢధర్మాశ్రితో విద్వానజ్ఞాతచరితం చరేత్,

అన్ధవజ్జడవచ్చాపి మూకవచ్చమహీం చరేత్"

"అవ్యక్తలిఙ్గోఽవ్యక్తాచారః" ఇతిచైవమాది 50.

బాలానందిని

**ఏవమితి** :- ఇట్లు ప్రాప్తించగా చెప్పబడుచున్నది. అట్లు కాదు. వచనానికి మరొక గతి కుదురుతుంది కదా? బాల్యశబ్దంచేత బోధించబడే మరొక అవిరుద్ధమైన అర్థం లభిస్తూన్నప్పుడు మరొక విధికి (యథాకామచారుడుగా ఉండకూడదు ఇత్యాదికానికి) వ్యాఘాతం కల్పించడం యుక్తం కాదు. అంగం ప్రధాన మైనదానికి ఉపకరించడం కొరకే విధించబడుతుంది. ఇక్కడ యతులు ప్రధానంగా అనుష్ఠింప దగినది జ్ఞానాభ్యాసం. బాలులు చేసే సకలచర్యలూ అంగీకరిస్తే జ్ఞానాభ్యాసం కుదరదు. అందుచేత ఇక్కడ బాలునిలోని భావవిశేషమూ, అప్రరూఢేంద్రియత్వాదికమూ బాల్యంగా గ్రహించబడుతుంది. ఆ విషయమే "**అనావిష్కుర్వన్**" అని చెపుతున్నాడు. జ్ఞానం, అధ్యయనం, ధార్మికత్వం మొదలైనవాటిచేత తనకు తాను విఖ్యాతుణ్ణిగా చేసికొనకుండా దంభదర్పాదిరహితుడై ఉండాలి. అప్రరూఢేంద్రియు డవడంచేత బాలు డే విధంగా పరుల ఎదుట తనను ప్రకటించు కొనడానికి అభిలషించడో అట్లే ఉండాలి. ఇలా చెపితేనే ఈ వాక్యానికి ప్రధానవిషయానికి ఉపకరించే అర్థంయొక్క అన్వయం కుదురుతుంది. ఈ విషయమే స్మృతికారులచేత చెప్పబడింది-

"యం న. . . బ్రాహ్మణః" - "ఎవనిని గూర్చి మంచివా డని గాని, చెడ్డవా డని గాని, చదువు లేనివాడని గాని బాగా చదువుకొన్నవా డని గాని, మంచి నడవడిక కలవా

డని గాని, లేనివా డని గాని ఎవ్వడూ తెలిసికొనజాలడో అతడే బ్రాహ్మణుడు"

"గూఢ....చరేత్" "రహస్యమైన ధర్మాన్ని అవలంబించినవాడై విద్వాంసుడై యుండి ఎవరికీ తెలియని పద్ధతిలో ప్రవర్తించాలి. గ్రుడ్డివాడు వలె, జడుడు వలె, మూగవాడు వలె భూమి మీద సంచరించాలి". "అవ్యక్త" - "ఎవరికీ తెలియని గుర్తులు కలవాడై, అవ్యక్తమైన ఆచారం కలవాడై" ఇత్యాదికం (చెప్పబడింది) 50

అనావిష్కారాధికరణం సమాప్తం

**16. ఐహికాధికరణమ్. సూ. 51**

**సూ. ఐహికమప్యప్రస్తుతప్రతిబన్ధే తద్దర్శనాత్ 3.4.51**

"సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతేరశ్వవత్" (బ్ర.సూ. 2.4.26) ఇత్యత ఆరభ్యోచ్చావచం విద్యాసాధనమవధారితమ్ - తత్ఫలం విద్యా సిద్ధ్యన్తీ కిమిహైవ జన్మని సిద్ధ్యతి ఉత కదాచిదముత్రాపీతి చిన్త్యతే. కిం తావత్ప్రాప్తమ్? ఇహైవేతి. కిం కారణమ్? శ్రవణాదిపూర్వికా హి విద్యా. న చ కశ్చిదముత్ర మే విద్యాజాయతామిత్యభిసంధాయైతేషు ప్రవర్తమానో దృశ్యతే. యజ్ఞాదీన్యపి శ్రవణాదిద్వారేణైవ విద్యాం జనయన్తి; ప్రమాణజన్యత్వాద్విద్యాయాః. తస్మాదైహికమేవ విద్యాజన్మేతి.

బాలానందిని

**ఐహికమితి** :- అప్రస్తుతప్రతిబన్ధే = ప్రస్తుతమైన ప్రతిబంధం ఏదీ లేకపోతే, ఐహికమపి = ఐహికమైన విద్యాజన్మ కూడ కలగవచ్చును. తద్దర్శనాత్ = అట్లు కనబడడం వలన" అని సూత్రార్థం.

సర్వేతి :- "సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతేరశ్వవత్" అను సూత్రం మొదలుకొని అనేక విధాలైన విద్యాసాధనాలు నిర్ధారింపబడ్డాయి. ఆ సాధనాల ఫలమైన విద్య ఈ జన్మలోనే సిద్ధిస్తుందా, ఒకప్పుడు ఇతరజన్మలో కూడా సిద్ధించవచ్చునా అని విచారించబడుచున్నది. ఏమి ప్రాప్తించినది? ఇక్కడనే సిద్ధిస్తుం దని ప్రాప్తించినది. ఏమిటి కారణం? విద్య శ్రవణాదిపూర్వకమైనది కదా? నాకు పరజన్మలో విద్య పుట్టుగాక అని

కోరుకుంటూ ఎవడూ శ్రవణాదులలో ప్రవర్తించడు కదా? ఈ జన్మలోనే విద్యాజన్మ కలగాలి అని కోరుకుంటూ ఈ శ్రవణాదులలో ప్రవర్తిస్తున్నట్లు కనబడుతున్నాడు. విద్య ప్రమాణంవల్ల (శబ్దాదిప్రమాణంవల్ల) కలుగుతుంది గాన యజ్ఞాదులు కూడా శ్రవణాదుల ద్వారా మాత్రమే విద్యను పుట్టిస్తాయి. అందువల్ల విద్యాజన్మ ఇహలోకంలో జరిగేదే.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే వదామః - ఐహికం విద్యాజన్మ భవతి అసతి ప్రస్తుప్రతిబన్ధ ఇతి. ఏతదుక్తం భవతి. యదా ప్రక్రాన్తస్య విద్యాసాధనస్య కశ్చిత్ప్రతిబన్ధో న క్రియతే ఉపస్థితవిపాకేన కర్మాన్తరేణ, తదేహైవ విద్యోత్పద్యతే, యదా తు తత్ప్రతిబన్ధః క్రియతే తదాముత్రేతి. ఉపస్థితవిపాకత్వం చ కర్మణో దేశకాలనిమిత్తోపాదానాద్భవతి. యాని చైకస్య కర్మణో విపాచకాని దేశకాలనిమిత్తాని తాన్యేవాన్యస్యాపీతి నియన్తుం న శక్యతే, యతో విరుద్ధఫలాన్యపి కర్మాణి భవన్తి. శాస్త్రమప్యస్య కర్మణ ఇదం ఫలం భవతీత్యేతావతి పర్యవసితమ్, న దేశకాలనిమిత్తవిశేషమపి సంకీర్తయతి. సాధనవీర్యవిశేషాత్త్వతీన్ద్రియా కస్య చిచ్ఛక్తిరావిర్భవతి, తత్ప్రతిబద్ధా పరస్య తిష్ఠతి. న చావిశేషేణ విద్యాయామభిసన్ధిర్నోత్పద్యేత ఇహాముత్ర వా మే విద్యా జాయతామితి, అభిసన్ధేః నిరఙ్కుశత్వాత్. శ్రవణాదిద్వారాపి విద్యోత్పద్యమానా ప్రతిబన్ధక్షయాపేక్షయైవోత్పద్యతే. తథా చ శ్రుతిర్దుర్బోధత్వమాత్మనో దర్శయతి-

"శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః శృణ్వన్తోఽపి బహవో యం న విద్యుః,

ఆశ్చర్యోఽస్య వక్తా కుశలోఽస్య లబ్ధాశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః". (క.ఉ. 2.7)

ఇతి. గర్భస్థ ఏవ చ వామదేవః ప్రతిపేదే బ్రహ్మభావమితి వదన్తీ జన్మాన్తరసంచితాత్సాధనాదపి జన్మాన్తరే విద్యోత్పత్తిం దర్శయతి. న హి గర్భస్థస్యైవైహికం కించిత్సాధనం సంభావ్యతే. స్మృతావపి "అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి" (భ.గీ. 6.37) ఇత్యర్జునేన పృష్టో భగవాన్

వాసుదేవః "న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి" (భ.గీ. 6.40) ఇత్యుక్త్వా పునస్తస్య పుణ్యలోకప్రాప్తిం సాధుకులే సంభూతిం చాభిధాయానన్తరమ్ - "తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికమ్" ఇత్యాదినా "అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్" ఇత్యన్తేనైతదేవ దర్శయతి. తస్మాదైహికమాముష్మికం వా విద్యాజన్మ ప్రతిబన్ధక్షయాపేక్షయేతి స్థితమ్. 51

### బాలానందిని

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాం. ప్రస్తుతమైన ప్రతిబంధం ఏదీ లేకపోతే విద్యాజన్మ ఇహలోకంలోనే (ఈ జన్మలోనే) జరుగుతుంది. దీని భావం ఇది ఫలం ఇవ్వడానికి ప్రారంభించిన మరొక కర్మ ఏదైనా, ఉపక్రమించిన ఈ విద్యాసాధనానికి ప్రతిబంధం ఏదీ కల్పించకపోతే అప్పుడు ఈ జన్మలోనే విద్య పుడుతుంది. కర్మాంతరం చేత ప్రతిబంధం కలిగితే మాత్రం మరొక జన్మలో కలుగుతుంది. ఒక కర్మ తన ఫలాన్ని ఇవ్వడానికి ప్రారంభించడం అనేది దేశం, కాలం, ఇతరనిమిత్తాలు వీటి కలయికవల్ల జరుగుతుంది. ఏ దేశకాలనిమిత్తాలు ఒక కర్మవిపాకానికి దారి తీస్తాయో అవే ఇతరకర్మవిపాకం కూడా కలిగిస్తాయి అని నియమించడం శక్యం కాదు. ఎందువల్ల ననగా కర్మలు విరుద్ధఫలం ఇచ్చేవిగా కూడ ఉంటాయి. (ఒకే దేశంలో ఒకే కాలంలో పరస్పరవిరుద్ధాలైన రెండు ఫలాలు కలగవు కదా?). శాస్త్రం కూడ ఈ కర్మకు ఈ ఫలం కలుగుతుంది అని మాత్రమే చెపుతుంది కాని (ఆ ఫలం కలగడానికి తగిన) దేశకాలనిమిత్తాల విశేషాన్ని కూడా చెప్పదు. సాధనాల వీర్యవిశేషం (సామర్థ్యవిశేషం) వల్ల ఒక కర్మకు సంబంధించిన అతీంద్రియమైన శక్తి ఆవిర్భవిస్తుంది. (ముందుకు వస్తుంది). ఆ శక్తిచేత ప్రతిబద్ధమై రెండవ కర్మయొక్క శక్తి (అప్పుడు తన ఫలాన్ని ఇవ్వకుండా) నిలిచిపోతుంది. (దీనిని పట్టి ఇతరకర్మలవల్లశ్రవణాదికర్మల ఫలానికి కొంతకాలం అడ్డు తగలవచ్చు. లేదా శ్రవణాదులు, ఇతర కర్మలు ఫలం ఇవ్వకుండా అడ్డు తగలకపోతే, తమ ఫలం ఇచ్చివేయవచ్చు. ఇది వాటి బలాబలాల మీద ఆధారపడి ఉంటుంది. ఏది బలవత్తరంగా ఉంది ఏది లేదు అనేది ఫలాన్ని పట్టి మాత్రమే నిర్ణయించ దగిన దని భావం). ఏ విశేషమూ లేకుండా ఈ జన్మలో కాని పరజన్మలో కాని నాకు

విద్య కలుగుగాక అని కోరిక పుట్టదని చెప్పడానికి వీలు లేదు. ఇచ్ఛ నిరంకుశం కదా? (అడ్డు లేనిది కదా?). శ్రవణాదుల ద్వారా విద్య పుట్టాలంటే ప్రతిబంధక్షయాన్ని అపేక్షించియే (ప్రతిబంధాలు నశించిన తరువాతనే) పుడుతుంది. అందుచేతనే - "శ్రవణాయాపి... అనుశిష్టః" అను శ్రుతి ఆత్మ దుర్బోధం (ఎంతో కష్టంమీద కాని తెలియదు) అని చెపుతున్నది. (ఏ ఆత్మ వినడానికి కూడ చాలామందికి లభ్యం కాదో, వింటూన్న వాళ్ళలో కూడ చాలామంది దేనిని తెలుసుకొనజాలరో, అట్టి ఈ ఆత్మను గూర్చి చెప్పేవాడు ఆశ్చర్యకరుడు (అరుదు). దీనిని పరోక్షంగా నైనా తెలుసుకొనే కుశలుడు ఆశ్చర్యభూతుడు ఎందువల్ల ననగా కుశలునిచేత బోధింపబడినా తెలుసుకొనగలిగినవాడు ఆశ్చర్యభూతుడు అని ఈ వాక్యానికి అర్థం. "శృణ్వన్తోఽపి న విద్యుః" అనే దానిచే ప్రతిబంధకము లుంటాయి అని సూచిత మగుచున్నది). వామదేవుడు గర్భంలో ఉన్నప్పుడే బ్రహ్మభావం పొందాడు అని చెప్పుచున్న శ్రుతి జన్మాంతరంలో సంపాదించుకొన్న సాధనం వల్ల కూడ మరొక జన్మలో జ్ఞానం కలగవచ్చు నని చూపుతున్నది. గర్భంలో ఉండగా వానికి ఐహికమైన సాధనం ఏదైనా ఉండి ఉంటుం దని ఊహించడానికి శక్యం కాదు కదా? స్మృతిలో (భగవద్గీతలో) కూడ "అప్రాప్య....గచ్ఛతి" (కృష్ణా! చేస్తున్న యోగానికి సిద్ధిని పొందని వాడు ఏ గతి పొందుతాడు) అని అర్జునునిచేత ప్రశ్నింపబడిన భగవంతుడైన వాసుదేవుడు "నహి...గచ్ఛతి" "(నాయనా! మంచి పని చేసేవాడు ఎవడూ కూడ దుర్గతిని పొందడు కదా) అని ప్రారంభించి "అనేక ...గతిమ్" (అనేకజన్మలయందు సంసిద్ధుడై ఉత్తమగతిని పొందుతాడు) వరకూ ఉన్న గ్రంథంచేత ఈ విషయాన్నే ప్రతిపాదిస్తున్నాడు. అందువల్ల ఇహలోకంలో (ఈ జన్మలో) కలిగినా, పరలోకంలో (మరొక జన్మలో) కలిగినా విద్యాజన్మ ప్రతిబంధక్షయాన్ని పట్టి మాత్రమే ఉంటుంది. అని నిశ్చితం. 51

**ఐహికాధికరణం సమాప్తం**

## 17. ముక్తిఫలాధికరణమ్. సూ. 52

## సూ. ఏవం ముక్తిఫలానియమస్తదవస్థావధృతేస్తదవస్థావధృతేః 3.4.52

యథా ముముక్షోః విద్యాసాధనావలమ్బినః సాధనవీర్యవిశేషాద్విద్యా లక్షణే ఫలే ఐహికాముష్మికఫలత్వకృతో విశేషప్రతినియమో దృష్టః, ఏవం ముక్తి

లక్షణేఽప్యుత్కర్షాపకర్షకృతః కశ్చిద్విశేషప్రతినియమః స్యాదిత్యాశఙ్క్యాహ - ఏవం ముక్తిఫలానియమః ఇతి. న ఖలు ముక్తిఫలే కశ్చిదేవంభూతో విశేషప్రతినియమ ఆశఙ్కితవ్యః కుతః?. తదవస్థావధృతేః. ముక్త్యవస్థా హి సర్వేషు వేదాన్తేష్వేకరూపైవావధార్యతే. బ్రహ్మైవ హి ముక్త్యవస్థా. న బ్రహ్మణోఽనేకాకారయోగోఽస్తి. ఏకలిఙ్గత్వావధారణాత్ - "అస్థూలమనణు" (బృ.ఉ. 3.8.8) "స ఏష నేతి నేత్యాత్మా" (బృ.ఉ.3.9.26) "యత్ర నాన్యత్పశ్యతి" (ఛా.ఉ. 7.24.1) "బ్రహ్మైవేదమమృతం పురస్తాత్" (ము.ఉ. 2.2.11) "ఇదం సర్వం యదయమాత్మా" (బృ.ఉ. 2.4.6) "స వా ఏష మహానజ ఆత్మాఽజరోఽమరోఽమృతోఽభయో బ్రహ్మ" (బృ.ఉ. 4.4.25) "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్" (బృ.ఉ. 4.5.15) ఇత్యాదిశ్రుతిభ్యః. అపి చ విద్యాసాధనం స్వవీర్యవిశేషాత్ స్వఫల ఏవ విద్యాయాం కంచిదతిశయమాసంజయేత్ న విద్యాఫలే ముక్తౌ. తద్ధ్యసాధ్యం నిత్యసిద్ధస్వభావభూతమేవ విద్యయాధిగమ్యత ఇత్యసకృతవాదిష్మ. న చ తస్యామప్యుత్కర్షనికర్షాత్మకోఽతిశయ ఉపపద్యతే, నికృష్టాయా విద్యాత్వాభావాత్. ఉత్కృష్టైవ హి విద్యా భవతి. తస్మాత్తస్యాంచిరాచిరోత్పత్తిరూపోఽతిశయో భవన్ భవేత్. న తు ముక్తౌ కశ్చిదతిశయసంభవోఽస్తి. విద్యాభేదాభావాదపి తత్ఫలభేదనియమాభావః, కర్మఫలవత్. న హి ముక్తిసాధనభూతాయా విద్యాయాః కర్మణామివ భేదోఽస్తి. సగుణాసు తు విద్యాసు - "మనోమయః ప్రాణశరీరః" (ఛా.ఉ. 3.14.2) ఇత్యాద్యాసు గుణావాపోద్వాపవశాద్భేదోపపత్తౌ సత్యాముపపద్యతే యథాస్వం ఫలభేదనియమః, కర్మఫలవత్. తథా చ లిఙ్గదర్శనమ్ - "తం యథా యథోపాసతే తదేవ భవతి" (ము.ఉ. 3.3) ఇతి. నైవం నిర్గుణవిద్యాయామ్, గుణాభావాత్. తథా చ స్మృతి :-

"న హి గతిరధికాస్తి కస్య చిత్ సతి హి గుణే ప్రవదన్త్యతుల్యతామ్" (మ. భా.శా.

194.60) ఇతి. తదవస్థావధృతేస్తదవస్థావధృతేరితి పదాభ్యాసోఽధ్యాయపరిసమాప్తిం ద్యోతయతి. 52

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీగోవిన్దభగవత్పూజ్యపాదశిష్య
శ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌ శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యే
తృతీయాధ్యాయస్య చతుర్థః పాదః. సమాప్తశ్చాధ్యాయః.

బాలానందిని

**ఏవమితి** :- "ఏవమ్= విద్యల విషయంలో వలె, ముక్తి ఫలానియమః= ముక్తి ఫలంలో నియమం లేకపోవడమే, విశేషం లేకపోవడమే. తదవస్థావధృతేః = ముక్తిరూపమైన బ్రహ్మయొక్క అవస్థయొక్క స్వరూపం నిశ్చితమైనది గాన" అని సూత్రార్థం

**యథేతి** :- విద్యాసాధనాలను అవలంబించి ఉన్న ముముక్షువుకు ఆ సాధనాల వీర్యవిశేషాన్ని పట్టి విద్యారూపమైన ఫలం విషయంలో ఐహికఫలం ఇచ్చే దనీ, ఆముష్మికఫలం ఇచ్చే దనీ, ఈ భేదాన్ని పట్టి ఏర్పడిన విశేషప్రతినియమం ఏ విధంగా కనబడుతున్నదో ఆ విధంగా విద్యవల్ల కలిగే ముక్తిరూపమైన ఫలంలో కూడ ఉత్కర్షాపకర్షలను పట్టి ఏర్పడే విశేషప్రతినియమం ఏదైనా ఉండవచ్చును అని ఆశంకించుకొని "ఏవం ముక్తిఫలానియమః" అని చెపుతున్నాడు. ముక్తిరూప మైన ఫలంలో ఈ విధమైన విశేషప్రతినియమం ఏదీ ఆశంకించ దగినది కాదు. ఎందువలన? తదవస్థావధృతివలన. సకల వేదాంతాలలోనూ కూడ ముక్త్యవస్థ ఒకే రూపంలో ఉంటుం దని నిర్ధారణచేయబడచున్నది. ముక్త్యవస్థ అంటే బ్రహ్మయే కదా? బ్రహ్మకు అనేకాకారాలతో సంబంధం లేదు. ఎందుచేత ననగా "అస్థూలమనణు" "స ఏష నేతి నేత్యాత్మా" "యత్ర నాన్యత్పశ్యతి" "బ్రహ్మైవేదమమృతం పురస్తాత్" "ఇదం సర్వం యదయమాత్మా" "స వా ఏష...బ్రహ్మ" "యత్ర ...పశ్యేత్" ఇత్యాదిశ్రుతులవల్ల బ్రహ్మ ఏకరూపమే అని నిర్ధారణ చేయబడింది. మరొక విషయమేమనగా విద్యాసాధనం తన శక్తివిశేషంచేత తన ఫలమైన విద్యలో ఏదైనా విశేషాన్ని సమకూర్చవచ్చు నేమో. విద్యాఫలమైన ముక్తిలో మాత్రం ఏ విశేషాన్ని సమకూర్చజాలదు. అది సాధించబడేది కాదు. నిత్యసిద్ధస్వభావమే అయిన అది విద్యచేత పొందబడుతుంది అని అనేక పర్యాయాలు చెప్పి ఉన్నాం నిజానికి విద్యలో కూడ ఉత్కర్షనికర్షరూప మైన అతిశయం

ఏదీ కుదరదు. ఎందువల్ల ననగా - నికృష్టమైతే అది విద్యయే కాదు. ఉత్కృష్టమైనదే విద్య అవుతుంది. అందుచేత దానిలో (విద్యలో) చాలా కాలానికి పుట్టడం శీఘ్రంగా పుట్టడం వంటి అతిశయం ఏదైనా ఉంటే ఉండవచ్చు. ముక్తిలోనైతే ఏవిధమైన అతిశయానికీ అవకాశం లేదు. విద్యలో భేదం లేకపోవడంవల్ల కూడ దాని ఫలమైన ముక్తిలో, కర్మఫలంలో వలె, భేదనియమం ఉండదు. ముక్తిసాధనమైన విద్యలో, కర్మలలో వలె, భేదం లేదు కదా? అయితే "మనోమయః ప్రాణశరీరః" మొదలైన సగుణవిద్యలలో నైతే గుణాల అవాపోద్వాపాలను పట్టి భేదం కుదురుతుంది గాన, వాటి వాటి స్వరూపాన్ని అనుసరించి, కర్మఫలాలలో వలె ఫలభేదనియమం ఉపపన్నమే. ఈ విషయంలో "**తం యథాయథోపాసతే తదేవ భవతి**" (దానిని ఏ యే విధంగా ఉపాసిస్తారో అదే లభిస్తుంది) అనే (శ్రుతివాక్యం) లింగం కనబడుచున్నది. నిర్గుణవిద్యలో ఇలా కాదు. దానిలో గుణాలు లేవు కదా? ఈ విషయాన్నే "న హి ...**అతుల్యతామ్**" (ఎవరికీ కూడ అధికమైన గతి ఉండదు. గుణం ఉంటేనే కదా అతుల్యత్వాన్ని చెపుతారు. మోక్షావస్థలో కూడ వీని మోక్షం గొప్పది. వీని మోక్షం తక్కువరక మైనది అనే భేదం ఉండదు. గుణా లుంటే కదా ఎక్కువ గుణాలుంటే గొప్ప దనీ, తక్కువగుణా లుంటే తక్కువ దనీ చెప్పేది? అని భావం) అను స్మృతి చెప్పుచున్నది. "**తదవస్థావధృతేః**" "**తదవస్థావధృతేః**" అని పదాన్ని రెండు మార్లు ఆవృత్తి చేయడం అధ్యాయసమాప్తిని సూచిస్తున్నది.

**ముక్తి ఫలాధికరణం సమాప్తం**

**"బాలానందిని" అను శ్రీశారీరకమీమాంసాభాష్యాంధ్రవ్యాఖ్యానంలో తృతీయాధ్యాయంలో చతుర్థపాదం సమాప్తం - తృతీయాధ్యాయం సమాప్తం.**

# అథ చతుర్థోఽధ్యాయః

(అత్రాస్మిన్ ఫలాధ్యాయే ప్రథమపాదే జీవన్ముక్తినిరూపణమ్)

## 1. ఆవృత్త్యధికరణమ్. సూ. 1-2

## సూ. ఆవృత్తిరసకృదుపదేశాత్ 4.1.1

తృతీయాధ్యాయే పరాపరాసు విద్యాసు సాధనాశ్రయో విచారః

ప్రాయేణాత్యగాత్. అథేహ చతుర్థేఽధ్యాయే ఫలాశ్రయ ఆగమిష్యతి. ప్రసంగాగతం చాన్యదపి కించిచ్చిన్తయిష్యతే. ప్రథమం తావత్కతిభిశ్చిదధికరణైః సాధనాశ్రయవిచార శేషమేవానుసరామః "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" (బృ.ఉ. 4.5.6) "తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత" (బృ.ఉ. 4.4.21), "సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః" (ఛా.ఉ.8.7.1) ఇతి చైవమాదిశ్రవణేషు సంశయః- కిం సకృత్ప్రత్యయః కర్తవ్య ఆహోస్విదావృత్త్యేతి. కిం తావత్ప్రాప్తమ్? సకృత్ప్రత్యయః స్యాత్ ప్రయాజాదివత్, తావతా శాస్త్రస్య కృతార్థత్వాత్. అశ్రూయమాణాయాం హ్యావృత్తౌ క్రియమాణాయామశాస్త్రార్థః కృతో భవేత్. నన్వసకృదుపదేశా ఉదాహృతాః "శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" ఇత్యేవమాదయః? ఏవమపి యావచ్ఛబ్దమావర్తయేత్ - సకృచ్ఛ్రవణమ్, సకృన్మననమ్, సకృన్నిదిధ్యాసనం చేతి; నాతిరిక్తమ్. సకృదుపదేశేషు తు వేదోపాసీత ఇత్యేవమాదిషు అనావృత్తిరితి.

బాలానందిని

అవ. వెనుకటి అధ్యాయంలో విద్యాసాధనాలు నిరూపించి ఈ అధ్యాయంలో ఫలం నిరూపించబడుచున్నది. అందుచేత ఈ అధ్యాయాలకు హేతుఫలభావసంగతి. ఫలప్రసంగంచేత ఈ పాదంలో అర్చిరాదిమార్గాలు కూడా విచారించబడతాయి. పూర్వం సాక్షాత్తు శ్రుతిచేత చెప్పబడిన సన్న్యాసాదిసాధనాలు చింతింపబడ్డాయి. ఇక్కడ ఫలార్థాపత్తిచేత సూచించబడిన ఆవృత్తి మొదలైనవి అఘాశ్లేషాదికరణం వరకు చింతింపబడతాయి. (ఆవృత్త్యాదులు లేకపోతే ఫలం లభించదు గాన ఫలాన్ని పట్టి ఆవృత్త్యాదులను ఊహించు కోవాలి గాన ఇవి ఫలార్థాపత్తిగమ్యములు). అఘాశ్లేషాధికరణం మొదలు జీవన్ముక్తి విచారించబడుతుంది. ద్వితీయపాదంలో ఉత్క్రాంతి, తృతీయపాదంలో అర్చిరాదిమార్గాలు, నాల్గవ పాదంలో జ్ఞానోపాసనల ఫలనిర్ణయం.

ఆవృత్తిరితి :- "అసకృత్ = అనేకపర్యాయాలు ఉపదేశించడంవలన, ఆవృత్తిః = ఉపాసనల ఆవృత్తి చెయ్యాలి" అని సూత్రార్థం.

**తృతీయ ఇతి:-** తృతీయాధ్యాయంలో పరాపరవిద్యల సాధనాలకు సంబంధించిన విచారం చాలా వరకు ముగిసింది. ఇంక ఇక్కడ చతుర్థాధ్యాయంలో ఫలానికి సంబంధించిన విచారం వస్తుంది. ప్రసంగవశంచేత వచ్చిన ఇతరవిషయాలేవైనా ఉంటే అవి కూడ చింతించబడతాయి. మొదట్లో మాత్రం కొన్ని అధికరణాలచేత సాధనాలకు సంబంధించిన మిగిలిన విచారాన్నే అనుసరిస్తాం. **"ఆత్మా....నిదిధ్యాసితవ్యః" "తమేవ....కుర్వీత" "సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః"** ఇత్యాదివాక్యాలలో ఒక పర్యాయం మాత్రమే ప్రత్యయం (జ్ఞానం) చెయ్యాలా లేక అనేకపర్యాయాలు ఆవృత్తిచేత చెయ్యాలా అని సంశయం. ఏమి ప్రాప్తించింది? ప్రయాజహోమాదులు ఒకే పర్యాయం చేసి నట్లు ఒకేసారి ప్రత్యయం చెయ్యాలి. తావన్మాత్రంచేతనే శాస్త్రం చరితార్థం అవుతుంది. శ్రుతిలో వినబడని ఆవృత్తి చేసినట్లయితే శాస్త్రంలో చెప్పని పని చేసి నట్లవుతుంది. (ప్రశ్న) "శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" ఇత్యాదులైన అసకృదుపదేశాలు ఉదాహరించబడ్డాయి కదా? (సమాధానం) అలా అయినా కూడ ఎంత వరకు చెప్పబడిందో అంతవరకు ఒక మాటు శ్రవణం, ఒక మాటు మననం, ఒక మాటు నిదిధ్యాసనం చెయ్యాలి కాని అంతకంటె ఎక్కువ చేయగూడదు. "వేద" 'ఉపాసీత' ఇత్యాదివిధంగా ఒకేసారి ఉపదేశం ఉన్న చోట్లలో నయితే ఆవృత్తి ఉండదు.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః- ప్రత్యయావృత్తిః కర్తవ్యా. కుతః? అసకృదుపదేశాత్ "శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" ఇత్యేవంజాతీయకో హ్యసకృదుపదేశః ప్రత్యయావృత్తిం సూచయతి. నన్వుక్తం యావచ్ఛబ్దమేవావర్తయేన్నాధికమితి? న. దర్శనపర్యవసాయిత్వాదేషామ్. దర్శనపర్యవసానాని హి శ్రవణాదీన్యావర్త్యమానాని దృష్టార్థాని భవన్తి, యథావఘాతాదీని తణ్డులాదినిష్పత్తిపర్యవసానాని తద్వత్. అపి చ ఉపాసనం నిదిధ్యాసనం చేత్యన్తర్ణీతావృత్తిగుణైవ క్రియాఽభిధీయతే. తథా హి లోకే గురుముపాస్తే, రాజానముపాస్తే ఇతి చ యస్తాత్పర్యేణ గుర్వాదీననువర్తతే స ఏవముచ్యతే. తథా ధ్యాయతి ప్రోషితనాథా పతిమితి యా నిరన్తరస్మరణా

పతిం ప్రతి సోత్కణ్ఠా సైవమభిధీయతే. విద్యుపాస్త్యోశ్చ వేదాన్తేష్వవ్యతిరేకేణ ప్రయోగో దృశ్యతే. క్వచిద్విదినోపక్రమ్య ఉపాస్తినా ఉపసంహరతి. యథా "యస్తద్వేద యత్స వేద స మయైతదుక్తః"(ఛా.ఉ.5.2.2) "అనుమేతాం భగవోదేవతాం శాధి యాందేవతాముపాస్సే" ఇతి. క్వచిచ్ఛోపాస్తినోపక్రమ్య విదినోపసంహవతిః యథా "మనో బ్రహ్మేత్యుపాసీత" (ఛా. ఉ. 3.18.1) ఇత్యత్ర "భాతి చ తపతి చ కీర్త్యా యశసా బ్రహ్మవర్చసేన య ఏవం వేద" (ఛా.ఉ.3.18.3) ఇతి. తస్మాత్సకృదుపదేశేష్వప్యావృత్తిసిద్ధిః. అసకృదుపదేశస్త్వావృత్తేః సూచకః.

## బాలానందిని

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాం - ప్రత్యయావృత్తి చెయ్యాలి. ఎందువల్ల? అసకృదుపదేశంవల్ల. "శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" ఈ రకమైన అసకృదుపదేశం (అనేక పర్యాయాలు చెప్పడం) ప్రత్యయాల ఆవృత్తిని సూచిస్తున్నది. (ప్రశ్న) ఎన్ని పదాలు ఉపయోగించబడ్డాయో అన్ని సార్లే చెయ్యాలి. అంతకంటె అధికంగా చేయకూడదు అని చెప్పాం కదా? (సమాధానం) అది కాదు. ఈ ప్రత్యయాలు దర్శనంలో పర్యవసానం చెందాలి (సాక్షాత్కారానికి దారి తీయాలి). దర్శనమే పర్యవసానంగా గల ఈ శ్రవణాదులు ఆవృత్తి చేస్తేనే ప్రత్యక్షంగా కనబడే ప్రయోజనం ఉన్నవి అవుతాయి. తండులాదుల నిష్పత్తి పర్యవసానంగా గల అవఘాతాదులు ఎట్లో అట్లే ("వ్రీహీనవహన్తి" అనే వాక్యంచేత ధాన్యం దంచాలి అని చెప్పబడింది. ఇలా దంచడం బియ్యం తీసి పురోడశాదులు తయారు చేయడంకోసం. అందుచేత ఒకటి రెండు దెబ్బలు వేసినంత మాత్రంచేత అవహననం పూర్తి కాదు. బియ్యం వచ్చేవరకు చెయ్యాలి. అట్లే ఇక్కడ కూడా సాక్షాత్కారం కలిగేవరకు ప్రత్యయావృత్తి చెయ్యాలి అని భావం). లోపల ఆవృత్తి అనే గుణం ఉన్న ఒక రకమైన క్రియకే "ఉపాసనం" అనీ, 'నిదిధ్యాసనం' అనీ పేర్లు. (ఉపాసన - నిదిధ్యాసనాలలో ప్రత్యయావృత్తి అంతర్గతంగా ఉంటుంది). అ దెట్లనగా - లోకంలో "గురుముపాస్తే" "రాజానముపాస్తే" ఇత్యాదులలో, ఎవడైతే తదేకాయత్తచిత్తంతో గురువును సేవిస్తాడో, రాజును సేవిస్తాడో అతడే ఇలా చెప్పబడతాడు. అట్లే భర్త ప్రవాసం వెళ్ళిన స్త్రీ భర్తను ధ్యానం చేస్తున్నది అన్నప్పుడు ఏ స్త్రీ భర్తకోసం

పెంగపెట్టుకొని అతని నిరంతరస్మరణం చేస్తుందో ఆమెయే ఇలా చెప్పబడుతుంది. మరొక విషయ మేమనగా విద్, ఉపాస్ ధాతువులను వేదాంతాలలో భేదం లేనివిగానే (పర్యాయపదాలుగానే) ప్రయోగించడం కనబడుతుంది. కొన్ని చోట్ల 'విద్'తో ప్రారంభించి 'ఉపాస్'తో ముగింపబడుతుంది. ఎట్లనగా - "యస్తద్వేద....ఉక్తః" అనేచోట "అను ఉపాస్వే" అని (ప్రయోగింపబడింది).

వి. ఇక్కడ వెనుకటి వాక్యంలో రైక్వుణ్ణి గూర్చి చెప్పబడింది. సః = ఆరైక్వుడు, యద్ వేద = దేనిని ఎరుగునో, తత్ = దానిని, మరియెకడు గూడ ఎరుగును. వాని ధర్మంలో సర్వలోకధర్మాలు ఇమిడిపోతాయి అని పూర్వవాక్యంనుంచి లభిస్తుంది. రైక్వుడు ఇంత మహిమశాలి యని నాచేత చెప్పబడినాడు అని ఒక హంస మరొక హంసతో చెప్పింది. ఇది మొదటి వాక్యం భావం. అప్పుడు రాజు రైక్వుని దగ్గరికి వెళ్ళి నీవు ఏ విద్యను ఉపాసిస్తున్నావో అది నాకు కూడా ఉపదేశించుము అని అడుగుతాడు. ఇది రెండవ వాక్యం భావం. మొదటి వాక్యంలో 'వేద'తో ప్రారంభించి రెండ వవాక్యంలో నువ్వు దేనిని ఉపాసిస్తున్నావో అనడంచేత వేదనము, ఉపాసనమూ ఒకటే అని తెలుస్తూన్నది అని భావం.

క్వచిచ్చేతి :- కొన్ని చోట్ల ఉపాస్ ధాతువుతో ప్రారంభించి విద్ ధాతువుతో ఉపసంహరిస్తున్నాడు. ఎట్లనగా - "మనో బ్రహ్మేత్యుపాసీత" అనే చోట "భాతి చ ... ఏవం వేద" అని. (అనగా మొదటి వాక్యంలో "ఉపాసీత" అని ఉపసంహారవాక్యంలో 'వేద' అని చెప్పడంచేత వేదనం ఉపానం సమానార్థకా లని తెలుస్తూన్నది. అందువల్ల ఒకే మారు చెప్పినా కూడ ఆవృత్తి సిద్ధిస్తుంది. అసకృదుపదేశమైతే ఆవృత్తి చెయ్యా లని సూచిస్తుంది.

### సూ. లిఙ్గాచ్చ. 4.1.2

లిఙ్గమపి ప్రత్యయావృత్తిం ప్రత్యాయయతి. తథా హి - ఉద్గీథవిజ్ఞానం ప్రస్తుత్య "ఆదిత్య ఉద్గీథః" (ఛా. 1.5.1) ఇత్యేతదేకపుత్రతాదోషేణాపోద్య "రశ్మీంస్త్వం పర్యావర్తయతాత్" (ఛా. ఉ. 1.5.2) ఇతి రశ్మిబహుత్వవిజ్ఞానం బహుపుత్రతాయై విదధత్ సిద్ధవత్ ప్రత్యయావృత్తిం దర్శయతి. తస్మాత్ తత్సామాన్యాత్ సర్వప్రత్యయేష్వావృత్తిసిద్ధిః.

## బాలానందిని

**లిఙ్గాదితి** :- "లిఙ్గాచ్చ=లింగంవల్ల కూడ ప్రత్యయావృత్తి తెలుస్తూన్నది" అని సూత్రార్థం.

**లిఙ్గమితి** :- లింగం కూడా పత్యయాల అవృత్తిని తెలుపుచున్నది. అదెట్లనగా ఉద్గీథవిజ్ఞానాన్ని ప్రస్తావించి ఆదిత్య ఉద్గీథః అనేదానిని ఏకపుత్రాదోషం చేత (ఇలా ఉపాసన చేసిన వానికి ఒక్క పుత్రుడు మాత్రమే కలుగుతాడు అనే దోషంచేత) నిరాకరించి "రశ్మీంస్త్వం పర్యావర్తయతాత్" (నువ్వు కిరణాలను వేరుగా ధ్యానించెదవుగాక) అని బహుపుత్రత్వంకొరకు రశ్మిబహుత్వజ్ఞానాన్ని విధిస్తూ ప్రత్యయంయొక్క ఆవృత్తిని సూచిస్తూన్నది. (రశ్ములను చాలా పర్యాయాలు మనస్సులో త్రిప్పుము, అనగా ధ్యానించుము, అనడంచేత ఉద్గీథం విషయంలో కూడా చేసినది ధ్యానమే అని సూచించబడుచున్న దని అర్థం.

## భాష్యమ్

**అత్రాహ** :- భవతు నామ సాధ్యఫలేషు ప్రత్యయేష్వావృత్తిః, తేష్వావృత్తిసాధ్యస్య అతిశయస్య సంభవాత్. యస్తు పరబ్రహ్మవిషయః ప్రత్యయో నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావమేవాత్మభూతం పరం బ్రహ్మ సమర్పయతి తత్ర కిమర్థావృత్తిరితి. సకృచ్ఛ్రుతౌ చ బ్రహ్మాత్మత్వప్రతీత్యనుపపత్తే రావృత్త్యభ్యుపగమ ఇతి చేత్, న. అవృత్తావపి తదనుపపత్తేః. యది హి "తత్త్వమసి" (ఛా. ఉ. 6.8.7) ఇత్యేవంజాతీయకం వాక్యం సకృచ్ఛ్రూయమాణం బ్రహ్మాత్మత్వప్రతీతిం నోత్పాదయేత్తతస్తదేవావర్త్యమానముత్పాదయిష్యతీతి కా ప్రత్యాశా స్యాత్? అథోచ్యేత - న కేవలం వాక్యం కం చిదర్థం సాక్షాత్కర్తుం శక్నోతి, అతో యుక్త్యపేక్షం వాక్యమనుభావయిష్యతి బ్రహ్మాత్మత్వమితి. తథాప్యావృత్త్యానర్థక్యమేవ. సాపి హి యుక్తిః సకృత్ప్రవృత్తైవ స్వమర్థమనుభావయిష్యతి. అథాపి స్యాద్యుక్త్యా వాక్యేన చ సామాన్యవిషయమేవ విజ్ఞానం క్రియతే న విశేషవిషయమ్, యథాస్తి మే హృదయే శూలమిత్యతో

వాక్యాద్గాత్రకమ్పాదిలిఙ్గాచ్చ శూలసద్భావసామాన్యమేవ పరః ప్రతిపద్యతే న విశేషమనుభవతి యథా స ఏవ శూలీ. విశేషానుభవశ్చావిద్యాయా నివర్తకః, తతస్తదర్థావృత్తిరితి చేత్, న. అసకృదపి తావన్మాత్రే క్రియమాణే విశేషవిజ్ఞానోత్పత్త్యసంభవాత్. న హి సకృత్ప్రయుక్తాభ్యాం శాస్త్రయుక్తిభ్యామనవగతో విశేషః శతకృత్వోఽపి ప్రయుజ్యమానాభ్యామవగన్తుం శక్యతే. తస్మాద్యది శాస్త్రయుక్తిభ్యాం విశేషః ప్రతిపాద్యేత, యది వా సామాన్యమేవ, ఉభయథాపి సకృత్ప్రవృత్తే ఏవ తే స్వకార్యం కురుత ఇత్యావృత్త్యనుపయోగః. న చ సకృత్ప్రవృత్తే శాస్త్రయుక్తీ కస్య చిదనుభవం నోత్పాదయత ఇతి శక్యతే నియన్తుమ్, విచిత్రప్రజ్ఞత్వాత్ప్రతిపత్త్ణాణామ్.

**బాలానందిని**

ఇక్కడ (పూర్వపక్షి)ఇలా అంటున్నాడు- సాధ్యములైన ఫలాలు గల ప్రత్యయాలలో, అనగా సగుణోపాసనలలో, ప్రత్యయాల ఆవృత్తి ఉంటే ఉండవచ్చును. అతిశయం ఉండడానికి అవకాశం ఉంది. పరబ్రహ్మకు సంబంధించిన ఏ ప్రత్యయం నిత్యశుద్ధబుద్ధ ముక్తస్వభావమైన, ఆత్మయైన పరబ్రహ్మను అందజేస్తుందో దానిలో ఆవృత్తి ఎందుకు? (సి. ఆశంక) ఒక్కమారు వింటే బ్రహ్మాత్మత్వప్రతీతి కలగదు గాన ఆవృత్తిని అంగీకరించాలి అన్నట్లయితే (పూ. ప. సమాధానం) అది కాదు. ఆవృత్తి చేసినా కూడ ఆ ప్రతీతి కలగదు కదా? "తత్త్వమసి" ఇత్యాదివాక్యం ఒక్కమాటు వినగానే బ్రహ్మాత్మత్వప్రతీతిని కలిగించకపోతే అప్పుడు దానినే ఆవృత్తి చేసినంత మాత్రాన కలిగిస్తుందని నమ్మకం ఏమిటి? (సి.ఆక్షేపం) కేవలం వాక్యం ఏ అర్థాన్నీ సాక్షాత్కరింపచేయడానికి సమర్థం కాదు. అందుచేత యుక్తితో కూడిన వాక్యం బ్రహ్మత్వత్వాన్ని అనుభవింపచేస్తుంది అని అన్నట్లయితే - (పూ.ప. సమాధానం) ఆ యుక్తి కూడా ఒక్కమారు మాత్రమే ప్రవర్తించి తన అర్థాన్ని అనుభవింపచేస్తుంది. (సి. ఆక్షేపం) అలా కాదు; యుక్తిచేత, వాక్యంచేత కూడ సామాన్యరూపంలోనే జ్ఞానం కలుగుతుంది కాని విశేషరూపమైన జ్ఞానం కలగదు. ఎట్లనగా నా గుండెలో నొప్పిగా ఉంది అన్న వాక్యంవల్ల, దేహం వణకడం మొదలైన లింగం వల్లా పైవాడు వానికి శూలం ఉందని మాత్రమే తెలుసుకొనకలుగుతాడు కాని

దాని విశేషాన్ని ఆ శూలంతో బాధపడుతున్నవాడు అనుభవిస్తున్నట్లు అనుభవించజాలడు. అవిద్య తొలగాలంటే వివేషానుభవం కావాలి. అందుచేత దాని అర్థంయొక్క ఆవృత్తి కావాలి అని అంటే (పూ.ప సమాధానం) అది కాదు. అంతమాత్రం ఎన్నిమార్లు ఆవృత్తి చేసినా విశేషవిజ్ఞానం పుట్టడం అసంభవం. ఒకమాటు ప్రయోగించిన శాస్త్రయుక్తుల చేత తెలియని విషయం ఆ శాస్త్రయుక్తులను వందసార్లు ప్రయోగించినా కూడ తెలుసుకొనడానికి శక్యం కాదు కదా? అందుచేత శాస్త్రయుక్తులచేత విశేషం ప్రతిపాదింపబడినా, లేక సామాన్యమే ప్రతిపాదింపబడినా రెండు విధాలా కూడ అవి (శాస్త్రయుక్తలు) ఒక్క మారు ప్రయోగిస్తేనే తమ పని చేస్తాయి గాన ఆవృత్తి ఉపయోగం లేదు. ఒక మారు ప్రయోగించబడిన శాస్త్రయుక్తులు ఎవనికీ కూడా అనుభవాన్ని పుట్టింపజాలవు అని నియమించడానికి శక్యం కాదు. ఎందువల్ల ననగా తెలుసుకొనేవాళ్ళ ప్రజ్ఞ విచిత్రంగా ఉంటుంది.

## భాష్యమ్

అపి చానేకాంశోపేతే లౌకికే పదార్థే సామాన్యవిశేషవతి ఏకేనావధానేనైక మంశమవధారయతి, అపరేణాపరమితి స్యాదప్యభ్యాసోపయోగో, యథా దీర్ఘప్రపాఠకగ్రహణాదిషు, న తు నిర్విశేషే బ్రహ్మణి సామాన్యవిశేషరహితే చైతన్యమాత్రాత్మకే ప్రమోత్పత్తావభ్యాసాపేక్షా యుక్తేతి. అత్రోచ్యతే - భవేదావృత్త్యానర్థక్యం తం ప్రతి యస్తత్త్వమసీతి సకృదుక్తమేవ బ్రహ్మాత్మత్వమనుభవితుం శక్నుయాత్. యస్తు న శక్నోతి తం ప్రత్యుపయుజ్యత ఏవావృత్తిః. తథాహి - ఛాన్దోగ్యే "తత్త్వమసి శ్వేతకేతో" (ఛా.ఉ. 6.8.7) ఇత్యుపదిశ్య "భూయ ఏవ మా భగవాన్ విజ్ఞాపయతు" (ఛా.ఉ. 6.8.7) ఇతి పునః పునః పరిచోద్యమానః, తత్తదాశఙ్కాకారణం నిరాకృత్య తత్త్వమసీత్యేవాసకృదుపదిశతి. తథా చ "శ్రోతవ్యో మన్తవ్యో నిధిధ్యాసితవ్యః" (బృ.ఉ. 4.5.6) ఇత్యాది దర్శితమ్. నన్వుక్తం సకృచ్ఛ్రుతం చేత్తత్త్వమసివాక్యం స్వమర్థమనుభావయితుం న శక్నోతి తత ఆవర్త్యమానమపి నైవ శక్ష్యతీతి? నైష దోషః. న హి దృష్టేఽనుపపన్నం

నామ. దృశ్యన్తే హి సకృచ్ఛ్రుతాద్వాక్యాన్మన్దప్రతీతం వాక్యార్థమావర్తయన్తః తత్తదాభాసవ్యుదాసేన సమ్యక్ప్రతిపద్యమానాః. అపి చ తత్త్వమసీత్యేతద్వాక్యం త్వంపదార్థస్య తత్పదార్థభావమాచష్టే. తత్పదేన చ ప్రకృతం సద్ బ్రహ్మేక్షితృ జగతో జన్మాదికారణమభిధీయతే - "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" (తై. ఉ. 2.1.1) "విజ్ఞానమానన్దం బ్రహ్మ" (బృ.ఉ 3.8.11) "అదృష్టం ద్రష్టృ" "అవిజ్ఞాతం విజ్ఞాతృ" (బృ.ఉ. 3.8.11) "అజరమమరమ్" "అస్థూలమనణ్వహ్రస్వమదీర్ఘమ్" (బృ.ఉ. 7.8.8) ఇత్యాదిశాస్త్రప్రసిద్ధమ్. తత్రాజాదిశబ్దైర్జన్మాదయో భావవికారాః నివర్తితాః. అస్థూలాదిశబ్దైశ్చ స్థౌల్యాదయో ద్రవ్యధర్మాః; విజ్ఞానాదిశబ్దైశ్చ చైతన్యప్రకాశాత్మత్వముక్తమ్.

### బాలానందిని

**అపిచేతి** :- మరియొక విషయ మేమనగా - అనేకమైన అంశాలు కలగి యుండి సామాన్య-విశేషా లున్న లౌకికమైన పదార్థంలో ఒక అవధానంచేత (ఏకాగ్రతచేత) ఒక అంశాన్ని అవధరిస్తాడు, మరియొక అవధానంచేత మరొక అంశాన్ని అవధరిస్తాడు గాన, దీర్ఘప్రపాఠకాదులలో వలె, (వేదంలోని ఒక పెద్ద ప్రపాఠకాన్ని ఒక మాటు కొంత భాగాన్ని, మరొక మారు మరి కొంతభాగాన్ని ఈ విధంగా కొన్ని ప్రయత్నాలు చేసి వివిధభాగాలను స్వాధీనం చేసికొన్నట్లు) అభ్యాసానికి (ఆవృత్తికి) ఉపయోగం ఉంటే ఉండవచ్చును; అంతే కాని సామాన్య-విశేషా లనేవి లేని, చైతన్యమాత్రస్వరూపమైన, నిర్విశేషమైన బ్రహ్మయందు ప్రమ పుట్టడానికి అభ్యాసాపేక్ష యుక్తం కాదు. (పూర్వపక్షానికి సిద్ధాంతి సమాధానం)- ఇక్కడ చెప్పబడుచున్నది- 'తత్త్వమసి' అని ఒకే మారు ఉపదేశించబడిన బ్రహ్మాత్మత్వాన్ని ఎవడు అనుభవించడానికి సమర్థుడుగా ఉంటాడో వాని విషయంలో ఆవృత్తి వ్యర్థమే అవుతుంది. ఎవడైతే సమర్థుడు కాడో వాని విషయంలో ఆవృత్తి తప్పక ఉపయోగిస్తుంది. అందుచేతనే - ఛాందోగ్యంలో "తత్త్వమసి శ్వేతకేతో" అని ఉపదేశించి "భూయ....విజ్ఞాపయతు" (పూజ్యుడవైన నువ్వు మళ్లీ నాకు ఉపదేశించెదవు గాక) అని మాటి మాటికి ప్రేరేపింపబడినవాడై, ఆ యా ఆశంకలకు కారణాలను నిరాకరించి "తత్త్వమసి" అనియే మాటిమాటికి ఉపదేశించాడు. అట్లే "శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసి

తవ్యః" ఇత్యాదికం (చెప్పబడిందని) కూడ పైన చూపబడింది. (ప్రశ్న) ఒక్కమారు వినబడిన 'తత్త్వమసి' వాక్యం తన అర్థాన్ని అనుభవింపచేయజాలకపోతే దానిని ఆవృత్తి చేసినా అనుభవింపచేయజాలదు అని చెప్పాం కదా? (సమాధానం)-ఈ దోషం లేదు. ఎదురుగా కనబడుతూండగా అనుపపన్నం అంటూ ఉండదు కదా? ఒక మారు విన్న వాక్యం ద్వారా కొంచెం తెలిసిన వాక్యార్థాన్ని (మనస్సులో) ఆవృత్తి చేసుకొంటూ ఆ యా ఆభాసలను (అసంగతవిషయాలను) తొలగించుకొని చక్కగా తెలుసుకొంటున్నవాళ్లు కనబడుచున్నారు కదా? మరొక విషయ మేమనగా - "తత్త్వమసి" అనే వాక్యం త్వంపదార్థం తత్పదార్థమే అని చెపుతూన్నది. తత్పదం- చూచేది, జగుత్తుయొక్క జన్మాదులకు కారణము, "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" "విజ్ఞానమానన్దం బ్రహ్మ" "అదృష్టం ద్రష్టృ" "అవిజ్ఞాతం విజ్ఞాతృ" "అజమజరమమరమ్" ఇత్యాది శాస్త్రాలతో ప్రసిద్ధము, ప్రకృతమూ అయిన సద్రూపమైన బ్రహ్మను చెపుతున్నది. ఆ బ్రహ్మయందు - అజాదిశబ్దాలచేత జన్మ మొదలైన భావవికారాలు లేవని సూచించబడింది. అస్థూలాదిశబ్దాలచేత స్థౌల్యాం మొదలైన ద్రవ్యానికి ఉండే ధర్మాలు నిరాకరించబడ్డాయి. విజ్ఞానాదిశబ్దాలచేత (త్వంపదార్థం) చైతన్యప్రకాశస్వరూప మైనది అని చెప్పబడింది.

## భాష్యమ్

ఏష వ్యావృత్తసర్వసంసారధర్మకోఽనుభవాత్మకో బ్రహ్మసంజ్ఞకస్తత్పదార్థో వేదాన్తాభియుక్తానాం ప్రసిద్ధః. తథా త్వంపదార్థోఽపి ప్రత్యగాత్మా శ్రోతా దేహాదారభ్య ప్రత్యగాత్మతయా సంభావ్యమానః చైతన్యపర్యన్తత్వేనావధారిత. తత్ర యేషామేతౌ పదార్థావజ్ఞానసంశయవిపర్యయప్రతిబద్ధౌ తేషాం తత్త్వమసీత్యేతద్వాక్యం స్వార్థే ప్రమాం నోత్పాదయితుం శక్నోతి, పదార్థజ్ఞానపూర్వకత్వాత్ వాక్యార్థజ్ఞానస్యేత్యతః తాన్ ప్రత్యేష్టవ్యః పదార్థవివేకప్రయోజనః శాస్త్రయుక్త్యభ్యాసః. యద్యపి చ ప్రతిపత్తవ్య ఆత్మా నిరంశస్తథాప్యధ్యారోపితం తస్మిన్ బహ్వంశత్వం దేహేన్ద్రియమనోబుద్ధివిషయ వేదనాదిలక్షణమ్. తత్రైకేనావధానేనైకమంశమపోహత్యపరేణాపరమితి యుజ్యతే తత్ర క్రమవతీ ప్రతిపత్తిః. తత్తు పూర్వరూపమేవాత్మప్రతిపత్తేః. యేషాం

పునర్నిపుణమతీనాం నాజ్ఞానసంశయవిపర్యయలక్షణః పదార్థవిషయః ప్రతిబన్ధోఽస్తి తే శక్నువన్తి సకృదుక్తమేవ తత్త్వమసివాక్యార్థమనుభవితుమితి తాన్ ప్రత్యావృత్త్యానర్థక్యమిష్టమేవ.

బాలానందిని

**ఏష ఇతి** :- సమస్తసంసారధర్మాలు తొలగినది, జ్ఞానాత్మకము అయిన బ్రహ్మ అనే ఈ తత్పదార్థం వేదాంతంతో సంబంధం ఉన్నవాళ్ళకు ప్రసిద్ధమే. అట్లే దేహం మొదలు చైతన్యం వరకు ఉన్నట్లు నిర్ధారణ చేయబడి ప్రత్యగాత్మగా ఊహించబడుచున్న శ్రోతయైన త్వంపదార్థమైన ప్రత్యగాత్మ కూడ ప్రసిద్ధమే (తెలిసిదే). అయితే ఎవరికైతే ఈ రెండు పదార్థాలూ అజ్ఞాన- సంశయ-విపర్యయాల (విపరీతజ్ఞానాల) చేత ప్రతిబద్ధము లవుతాయో (సరిగా తెలియకుండా అడ్డుకొనబడతాయో) వాళ్ళకు తత్త్వమసి అనేవాక్యం ప్రమను పుట్టించజాలదు. ఎందువల్ల ననగా - వాక్యార్థజ్ఞానం కలగాలంటే ముందు పదాల అర్థం తెలియాలి. అందుచేత వాళ్ళకొసమై పదార్థవివేకమే ప్రయోజనంగా గల (అనగా పదార్థవివేకాన్ని, తత్పద - త్వంపదాల అర్థంయొక్క వివేకాన్ని కలిగించే) శాస్త్రయుక్త్యభ్యాసం అవసరమని అంగీకరించాలి. తెలియదగిన ఆత్మలో అంశాలేవీ లేకపోయినా ఆ ఆత్మమీద దేహం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, విషయాలు, వేదనలు (జ్ఞానాలు) అనే అనేకమైన అంశాలు ఆరోపించబడ్డాయి. వాటిలో, ఒక అవధానంచేత ఒక అంశాన్నీ, మరొక అవధానంచేత మరొక అంశాన్నీ తొలగిస్తాడు గాన ఆ విషయంలో క్రమంతో కూడిన జ్ఞానం కలగడం యుక్తమే. ఇదంతా ఆత్మజ్ఞానానికి పూర్వరూపమే (ముందు జరిగే వ్యవహారమే). అయితే ఏ మహామేధావులకు పదార్థాల విషయంలో (తత్-త్వం-పదార్థాల విషయంలో)అజ్ఞాన-సంశయ -విపర్యయరూపమైన ప్రతిబంధం లేదో వాళ్లు ఒకే మాటు చెప్పినా కూడ తత్త్వమసివాక్యార్థాన్ని అనుభవించకలుగుతారు గాన వాళ్ల విషయంలో ఆవృత్తి వ్యర్థం అనే మాట మాకూ అంగీకార్యమే.

భాష్యమ్

సకృదుత్పన్నైవ హ్యాత్మప్రతిపత్తిరవిద్యాం నివర్తయతీతి నాత్ర కశ్చిదపి క్రమః అభ్యుపగమ్యతే. సత్యమేవం యుజ్యేత యది కస్య చిదేవం

ప్రతిపత్తిర్భవేత్. బలవతీ హ్యాత్మనో దుఃఖిత్వాదిప్రతిపత్తిః, అతో న దుఃఖిత్వాద్యభావం కశ్చిత్ప్రతిపద్యత ఇత చేత్; న. దేహాద్యభిమానవద్దుఃఖిత్వాద్యభిమానస్య మిథ్యాభిమానత్వోపపత్తేః. ప్రత్యక్షం హి దేహే ఛిద్యమానే దహ్యమానే వా అహం ఛిద్యే, దహ్యే ఇతి చ మిథ్యాభిమానో దృష్టః. తథా బాహ్యతరేష్వపి పుత్రమిత్రాదిషు సంతప్యమానేష్వహమేవ సంతప్య ఇత్యధ్యారోపో దృష్టః, తథా దుఃఖిత్వాద్యభిమానోఽపి స్యాత్. దేహాదివదేవ చైతన్యాద్బహిరుపలభ్యమానత్వాత్ దుఃఖిత్వాదీనామ్, సుషుప్తాదిషు చానువృత్తేః. చైతన్యస్య తు సుషుప్తేఽప్యనువృత్తిమామనన్తి "**యద్వై తన్న పశ్యతి పశ్యన్వై తన్న పశ్యతి**"(బృ.ఉ.4.3.23) ఇత్యాదినా. తస్మాత్సర్వదుఃఖవినిర్ముక్తైకచైతన్యాత్మకోఽహమిత్యేష ఆత్మానుభవః. న చైవమాత్మానమనుభవతః కిం చిదన్యత్కృత్య మవశిష్యతే. తథా చ శ్రుతిః. **"కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయమాత్మాఽయం లోకః"** (బృ.ఉ.4.4.22) ఇత్యాత్మవిదః కర్తవ్యాభావం దర్శయతి. స్మృతిరపి-

యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః

**ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే. (భ.గీ.3.17) ఇతి.**

యస్య తు నైషోఽనుభవో ద్రాగివ జాయతే తం ప్రత్యనుభవార్థ ఏవావృత్త్యభ్యుపగమః. తత్రాపి న తత్త్వమసివాక్యార్థాత్ప్రచ్యావ్య ఆవృత్తౌ ప్రవర్తయేత్. న హి వరఘాతాయ కన్యాముద్వాహయన్తి. నియుక్తస్య చాస్మిన్నియుక్తోఽహం కర్తా, మయేదం కర్తవ్యమ్ ఇత్యవశ్యం బ్రహ్మప్రత్యయాద్విపరీతప్రత్యయ ఉత్పద్యతే. యస్తు స్వయమేవ మన్దమతిరప్రతిభానాత్, తం వాక్యార్థం జిహాసేత్ తస్యైతస్మిన్నేవ వాక్యార్థే స్థిరీకార ఆవృత్త్యాదివాచోయుక్త్యాఽభ్యుపేయతే. తస్మాత్పరబ్రహ్మవిషయేఽపి ప్రత్యయే తదుపాయోపదేశేష్వావృత్తిసిద్ధిః. 2.

## బాలానందిని

సకృదితి :- ఒకే సారి పుట్టిన ఆత్మజ్ఞానం అవిద్యను తొలగిస్తుంది గాన దీని విషయంలో క్రమం ఏదీ అంగీకరించబడదు. (అశంక)-ఎవని కైనా ఈ విధంగా బ్రహ్మప్రతిపత్తి కలిగితే ఇది (క్రమాభావం)నిజమే కావచ్చును. (దేహాదిసంఘాతంతో కలిసి ఉన్న) ఆత్మకు దుఃఖవంతుడను ఇత్యాది జ్ఞానం చాల ప్రబలమైనది కదా? అందుచేత దుఃఖిత్వాద్యభావాన్ని ఎవడూ కూడ తెలుసుకొనడు కదా?(నాకు దుఃఖాదులు లేవు అని ఎవడూ అనుకొనడు కదా?), అన్నట్లయితే- (సమాధానం)-అట్లు కాదు. దేహాద్యభిమానం వలె దుఃఖిత్వాద్యభిమానం కూడ మిథ్యాభిమానమే అనడం యుక్తం కదా? దేహం చేదించబడుతున్నా, దహించబడుతున్నా కూడ నేను ఛేదించబడుచున్నాను. నేను దహించబడుచున్నాను అనే మిథ్యాభిమానం ప్రత్యక్షంగా కనబడుచున్నది. అట్లే ఇంకా బాహ్యులైన పుత్రమిత్రాదులు పీడింపబడుచున్నప్పుడు నేను పీడింపబడుచున్నాను అని ఆరోపం చూడబడుతున్నది. అట్లే దుఃఖిత్వాభిమానం కూడ(మిథ్యాభిమానం) కావచ్చును. ఎందువల్ల ననగా దుఃఖిత్వాదులు దేహాదులవలెనే చైతన్యంకంటె వెలుపలనే కనబడుతున్నాయి; సుషుప్తాదులలో ఇవి అనువర్తించడంలేదు. చైతన్యమైతే సుషుప్తంలో కూడ అనువర్తిస్తూనే ఉంటుం దని "**యద్వై తన్న పశ్యతి పశ్యన్వై తన్న పశ్యతి**" ఇత్యాదులలో చెపుతున్నారు. అందువల్ల ఆత్మానుభవం" నేను సమస్త దుఃఖాలనుండి నిర్ముక్తు డైన ఏకైకచైతన్యస్వరూపుడను"అని కలుగుతుంది. ఈ విధమైన ఆత్మానుభవం కలిగినవానికి ఇక కరతవ్య మేమీ మిగలదు. అందుచేతనే-"కిం ప్రజయా...లోకః" అను శ్రుతి ఆత్మవేత్త చేయవలసిన కర్తవ్య మేదీ లేదని చెపుతూన్నది. "యస్త్వాత్మ...విద్యతే" (ఎవడైతే ఆత్మయందే రమిస్తాడో, ఆత్మయందే తృప్తి చెందుతాడో, ఆత్మయందే సంతోషిస్తాడో వానికి మరొక కర్తవ్యం ఏదీ లేదు)అని స్మృతి కూడ ఈ విషయమే చెపుతూన్నది. ఎవనికైతే ఈ విధమైన ఆత్మానుభవం శీఘ్రంగా కలగదో వానికి అనుభవం కలగడంకోసమే ఆవృత్తిని అంగీకరించాలి.

అవ. ఆవృత్తి అనుభవం కోసమే అని ఎందుకు చెప్పాలి? "ద్రష్టవ్యః శ్రోతవ్యః" ఇత్యాదివాక్యాలచేత 'తత్త్వమసి' వాక్యానికి ఏది విషయమో దాని ఆవృత్తి కాక దానికంటె భిన్నమైన ఏదో ఒక దాని ఆవృత్తి విధింపబడుతుంది అనవచ్చును కదా అని

ఆశంకించుకొని సమాధానం చెవుతున్నారు (భామతి)-తత్రాపీత్యాది. అందులోనూ-తత్త్వమసి వాక్యార్థంనుండి, అనగా ఆ వాక్యంచేత బోధించబడే ఆత్మతత్త్వం నుండి, దూరంచేసి ('తత్త్వమసి' 'తత్త్వమసి' అని అంటూ సంపదాదిరూపంలో తత్త్వమస్యాది వాక్యాల) ఆవృత్తియందు శ్రోతను ప్రవర్తింపచేయకూడదు. (అప్పుడు వాని దృష్టి అంతా ఆ వాక్యంమీద నిలబడుతుంది కాని ఆ వాక్యానికి అర్థమైన బ్రహ్మమీద నిలవదు. అప్పుడు ప్రధానమైన బ్రహ్మను వెనుకకు నెట్టి వాక్యానికి ప్రాధాన్యం ఇచ్చిన సంపదుపాసన వంటి దవుతుంది. ఇలా చేయడం వరుణ్ణి చంపడం కోసం వానికి ముందుగా వివాహం చేయడంవంటి దవుతుంది). వరఘాతంకొరకు కన్య నిచ్చి పెండ్లిచేయరు కదా? ఆ విధంగా నియుక్తు డైనవానికి (బ్రహ్మభిన్నమైన వాక్యాదికావృత్తియందు నియుక్తుడైనవానికి)నేను దీనియందు అధికృతు డను (అధికారం కలవాడను), కర్తను, నేను ఇది చెయ్యాలి అని తప్పక బ్రహ్మజ్ఞానంకంటె విపరీతమైన జ్ఞానం కలుగుతుంది. (అందుచేత శ్రోతను బ్రహ్మాభిముఖుణ్ణిగానే చెయ్యాలి కాని ఇతరావృత్తితత్పరుణ్ణి చేయకూడదు). స్వతః మందమతి యైన ఎవడు, సరిగా అర్థం కాకపోవడంవల్ల ఆ వాక్యార్థాన్ని (వాక్యప్రతిపాద్యబ్రహ్మను) విడిచిపెట్టాలనుకొంటాడో వానిని ఈ వాక్యార్థంలో స్థిరంగా ఉండేటట్లు చేయడమే ఆవృత్త్యాది శబ్దాలచేత చెప్పబడుచున్నది. (ఆవృత్తి అనగా తత్త్వమసీత్యాదివాక్యాలను మాటిమాటికీ చదువుతూ కూర్చొనడం కాదు. దాని అర్థమైన బ్రహ్మయందు చిత్తాన్ని స్థిరంగా నిలపడం అని ఈ వాక్యాలకు భావం). అందువల్ల పరబ్రహ్మ విషయమైన జ్ఞానంలో కూడ దానికి ఉపాయాలైన ఉపదేశాలకు ఆవృత్తి సిద్ధిస్తుంది. 2

ఆవృత్త్యధికరణం సమాప్తం

## 2. ఆత్మత్వోపాసనాధికరణమ్. సూ. 3

### సూ. ఆత్మేతి తూపగచ్ఛన్తి గ్రాహయన్తి చ. 4.1.3.

యః శాస్త్రోక్త విశేషణః పరమాత్మా స కిమహమితి గ్రహీతవ్యః కిం వా మదన్య ఇత్యేతద్విచారయంతి. కథం పునరాత్మశబ్దే ప్రత్యగాత్మవిషయే శ్రూయమాణే సంశయ ఇతి. ఉచ్యతే-అయమాత్మశబ్దో ముఖ్యః

శక్యతేఽభ్యుపగన్తుం సతి జీవేశ్వరయోరభేదసంభవే; ఇతరథా తు గౌణోఽయమభ్యుపగన్తవ్య ఇతి మన్యతే. కిం తావత్ప్రాప్తమ్? నాహమితి గ్రాహ్యః; న హ్యపహతపాప్మత్వాదిగుణో విపరీతగుణత్వేన శక్యతే గ్రహీతుమ్, విపరీతగుణో వాఽపహతపాప్మత్వాదిగుణత్వేన. అపహతపాప్మత్వాదిగుణశ్చ పరమేశ్వరః, తద్విపరీతగుణస్తు శారీరః. ఈశ్వరస్య చ సంసార్యాత్మత్వే ఈశ్వరాభావప్రసంగః, తతః శాస్త్రానర్థక్యమ్. సంసారిణోఽపీశ్వరాత్మత్వేఽధికార్యభావాచ్ఛాస్త్రానర్థక్యమేవ. ప్రత్యక్షాదివిరోధశ్చ. అన్యత్వేఽపి తాదాత్మ్యదర్శనం శాస్త్రాత్ కర్తవ్యం ప్రతిమాదిష్వివ విష్ణ్వాదిదర్శనమితి చేత్, కామమేవం భవతు; న తు సంసారిణో ముఖ్య ఆత్మేశ్వర ఇత్యేతన్నః ప్రాపయితవ్యమితి.

బాలానందిని

**ఆత్మేతి** :-''ఆత్మేతి తు=పరమాత్మను ఆత్మ అనియే ఉపాసించాలి; ఉపగచ్ఛన్తి=కొందరు ఆవిధంగానే పొందుతున్నారు; గ్రాహయన్తి చ=శ్రుతులు కూడ గ్రహింపచేస్తున్నాయి'' అని సూత్రార్థం.

**య ఇతి** :- శాస్త్రంచేత చెప్పబడిన విశేషణాలు గల పరమాత్మను నేనే అని గ్రహించాలా లేక 'నా కంటె అన్యుడు' అని గ్రహించాలా అనే విషయం విచారిస్తున్నాడు. ఆత్మశబ్దం ప్రత్యగాత్మ అనే అర్థంలో వినబడుతున్నప్పుడు ఈ సంశయానికి అవకాశం ఏమిటి? చెప్పబడుచున్నది-జీవేశ్వరులకు అభేదం కుదురుతే ఈ ఆత్మశబ్దం ఈ అర్థంలో ముఖ్యం అని (ఆత్మశబ్దానికి ఇది ముఖ్యార్థం అని)అంగీకరించవచ్చు. కాని అలా కాని పక్షంలో ఇది గౌణమే అని అంగీకరించాలి అని (ఇతడు, పూర్వపక్షి)అనుకొంటున్నాడు. ఏమి ప్రాప్తించింది? పరమాత్మను అహమ్ అని గ్రహించకూడదు. అపహతపాప్మత్వాది గుణాలు గల పరమాత్మను అందుకు విపరీతమైన గుణాలు కలవానినిగా గ్రహించడం శక్యం కాదు కదా? అదే విధంగా విపరీతమైన (సపాపత్వాది) గుణాలు కలవానిని (జీవుణ్ణి)అపహతపాప్మత్వాదిగుణాలు కలవానినిగా కూడ గ్రహించడానికి శక్యం కాదు కదా? ఈశ్వరుడు అపహతపాప్మత్వాదిగుణాలు కలవాడైతే శారీరుడు అందుకు విపరీతమైనవాడు. ఈశ్వరుడు సంసార్యాత్మ అయితే ఈశ్వరుడే లేకుండా పోతాడు;

అప్పుడు (ఈశ్వరుడున్నాడని చెప్పే) శాస్త్రం వ్యర్థం అవుతుంది. సంసారి ఈశ్వరాత్మ్యద్వైత (కర్మాదులయందు) అధికారం కలవాడు లేకపోవడంచేత అప్పుడు కూడ శాస్త్రానికి అనర్థక్యమే కలుగుతుంది. ప్రత్యక్షాదిప్రమాణాలకు విరోధం కూడ. (పరమాత్మశారీరులు) భిన్నులే అయినా కూడ ప్రతిమాదులయందు విష్ణ్వాదిదర్శనం చేసినట్లు శాస్త్రాన్ని పట్టి వాళ్ల మధ్య తాదాత్మ్యదర్శనం చెయ్యాలి అని అంటే; సరే అలాంటి దే దైనా ఉంటే ఉండవచ్చునేమో; సంసారికి పరమేశ్వరుడు ముఖ్యమైన ఆత్మకాదు అనేదే మేం చెప్పదలచిన విషయం.

వి. వెనుకటి అధికరణంలో-బ్రహ్మజ్ఞానానికి సాధనాలైన శ్రవణద్యానాదుల ఆవృత్తి చెయ్యాలి అని చెప్పబడింది. తత్త్వజ్ఞానంకోసం శ్రవణధ్యానాదుల ఆవృత్తి చేసేటప్పుడు 'అహం బ్రహ్మ' అని ధ్యానించాలా లేక "మత్స్వామీ ఈశ్వరః" అని ధ్యానించాలా అని పై అధికరణంతో ఉపజీవ్యోపజీవకభావసంగతి.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః-ఆత్మేత్యేవ పరమేశ్వరః ప్రతిపత్తవ్యః. తథాహి పరమేశ్వరప్రక్రియాయాం జాబాలా ఆత్మత్వేనైతముపగచ్ఛన్తి- 'త్వం వా అహమస్మి భగవో దేవతేఽహం వై త్వమసి భగవో దేవతే'' (వ. ఉ.2.34)ఇతి. తథాన్యేఽపి-"అహం బ్రహ్మాస్మి" ఇత్యేవమాదయ ఆత్మత్వోపగమా ద్రష్టవ్యాః. గ్రాహయన్తి చాత్మత్వేనైవేశ్వరం వేదాన్తవాక్యాని -ఏష త ఆత్మా సర్వాన్తరః" (బృ.ఉ.3.4.1)"ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః" (బృ.ఉ.3.7.3) "తత్సత్యం స ఆత్మా తత్త్వమసి" (ఛా.ఉ.6.8.7) ఇత్యేదమాదీని. యదుక్తమ్-ప్రతీకదర్శనమిదం విష్ణుప్రతిమాన్యాయేన భవిష్యతి ఇతి, తదయుక్తమ్, గౌణత్వప్రసంగాత్, వాక్యవైరూప్యాచ్చ. యత్ర హి ప్రతీకదృష్టిరభిప్రేయతే సకృదేవ తత్ర వచనం భవతి, యథా'మనో బ్రహ్మ' (ఛా.ఉ.3.18.1), ''ఆదిత్యో బ్రహ్మ'' (ఛా.ఉ.3.19.1)ఇత్యాది. ఇహ పునః "త్వమహమస్మి అహం చ త్వమసి" ఇత్యాహ. అతః ప్రతీకశ్రుతివైరూప్యాదభేదప్రతిపత్తిః. భేదదృష్ట్యపవాదాచ్చ. తథాహి- "అథ

యో౽న్యాం దేవతాముపాస్తే౽న్యో౽సావన్యో౽హమస్మీతి న స వేద" (బృ.ఉ.1.4.10) "మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" (బృ.ఉ.4.4.17, క.ఉ.1.10), ''సర్వం తం పరాదాద్యో౽న్యత్రాత్మనః సర్వం వేద'' (బృ.ఉ.4.5.7)ఇత్యేవమాద్యా భూయసీ శ్రుతిర్భేదమపవదతి. యత్తూక్తమ్-న విరుద్ధగుణయోరన్యోన్యాత్మత్వ సంభవ ఇతి. నాయం దోషః. విరుద్ధగుణతాయా మిథ్యాత్వోపపత్తేః.

బాలానందిని

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా చెపుతున్నాం-పరమేశ్వరుణ్ణి ఆత్మగానే తెలుసుకోవాలి. ఎందువల్ల ననగా. పరమేశ్వరుణ్ణి గూర్చి చెప్పే సందర్భంలో జాబాలులు-"త్వం వా...దేవతే" అని పరమేశ్వరుణ్ణి ఆత్మగానే (తమ స్వరూపం గానే) అంగీకరిస్తున్నారు. ఇట్లే "అహం బ్రహ్మాస్మి" మొదలైన ఆత్మత్వాంగీకారవచనాలు కూడ చూచుకోవాలి. "ఏష త ఆత్మా సర్వాన్తరః", "ఏష...అమృతః" "తత్సత్యం స ఆత్మా తత్త్వమసి" (ఛా.ఉ.6 8.7) ఈ మొదలైన వేదాంతవాక్యాలు ఈశ్వరుణ్ణి ఆత్మగా గ్రహింపచేస్తున్నాయి. విష్ణుప్రతిమాన్యాయంచేత ఇది ప్రతీకదృష్టి కావచ్చును అని చెప్పినది యుక్తం కాదు. అలా చెపితే గౌణం అని చెప్పిన ట్లవుతుంది; వాక్యంలో కూడ వైరూప్యం ఉంది (అనగా చెప్పే విధానంలో తేడా ఉంది). 'మనో బ్రహ్మ', "ఆదిత్యో బ్రహ్మ" ఇత్యాదులలో ఎక్కడైతే ప్రతీక దృష్టి అంగీకరించబడుతుందో అక్కడ ఒక్కమారు మాత్రమే నిర్దేశం ఉంటుంది. ఇక్కడైతే నువ్వే నేను నేనే నువ్వు అని అంటున్నాడు. అందుచేత ప్రతీకశ్రుతికంటె ఇది భిన్నంగా ఉండడంచేత అభేదమే గ్రహించాలి. అంతే కాక భేదదృష్టి కూడ నిరాకరించబడుచున్నది. అదెట్లనగా-"అథ యో౽న్యామ్...వేద", "మృత్యోః...పశ్యతి", "సర్వం...వేద" ఇత్యాదిక మైన అత్యధికమైన శ్రుతి భేదదర్శనాన్ని నిరాకరిస్తున్నది. విరుద్ధగుణాలు కలవి పరస్పరస్వరూపాలు(అభేదం కలవి) కావు అని ఏది చెప్పబడిందో ఆ దోషం లేదు. విరుద్ధ గుణా లుండడం మిథ్య అని చెప్పడం ఉపపన్నంగా ఉంటుంది కదా?

## భాష్యమ్

యత్పునరుక్తమ్-ఈశ్వరాభావప్రసంగ ఇతి; తదసత్; శాస్త్రప్రామాణ్యాత్, అనభ్యుపగమాచ్చ. న హీశ్వరస్య సంసార్యాత్మత్వం ప్రతిపాద్యత ఇత్యభ్యుపగచ్ఛామః. కిం తర్హి? సంసారిణః సంసారిత్వాపోహేన ఈశ్వరాత్మత్వం ప్రతిపిపాదయిషితమితి. ఏవం చ సత్యద్వైతేశ్వరస్యాపహత పాప్మత్వాదిగుణతా, విపరీతగుణతా త్వితరస్య మిథ్యేతి వ్యవతిష్ఠతే. యదప్యుక్తమధికార్యభావః ప్రత్యక్షాదివిరోధశ్చేతి, తదప్యసత్. ప్రాక్ ప్రబోధాత్సంసారిత్వాభ్యుపగమాత్. తద్విషయత్వాచ్చ ప్రత్యక్షాదివ్యవహారస్య. "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్" (బృ.ఉ.2.4.14) ఇత్యాదినా ప్రబోధే ప్రత్యక్షాద్యభావం దర్శయతి. ప్రత్యక్షాద్యభావే శ్రుతేరప్యభావప్రసంగ ఇతి చేత్; న. ఇష్టత్వాత్. "అత్ర పితాఽపితా భవతి" (బృ.ఉ.4.3.22) ఇత్యుపక్రమ్య "వేదా అవేదా"(బృ.ఉ.4.3.22) ఇతి వచనాదిష్యత ఏవాస్మాభిః శ్రుతేరప్యభావః ప్రబోధే. కస్య పునరయమప్రబోధ ఇతి చేత్. యస్త్వం పృచ్ఛసి తస్య త ఇతి వదామః. నన్వహమీశ్వర ఏవోక్తః శ్రుత్యా? యద్యేవం ప్రతిబుద్ధోఽసి; నాస్తి కస్యచిదప్రబోధః. యోఽపి దోషశ్చోద్యతే కైశ్చిత్-అవిద్యయా కిలాత్మనః సద్వితీయత్వాదద్వైతానుపపత్తిః ఇతి, సోఽప్యేతేన ప్రత్యుక్తః. తస్మాదాత్మేత్యేవేశ్వరే మనో దధీత. 3.

## బాలానందిని

**యత్పునరితి** :- (ఇలా అంగీకరిస్తే)ఈశ్వరుడే లేకుండా పోతాడు అని ఏది చెప్పబడిందో అది అయుక్తం. ఎందువల్ల ననగా శాస్త్రప్రామాణ్యాన్ని పట్టి, అంగీకరించలేదు గాన కూడ. (అనగా శాస్త్రప్రామాణ్యాన్నిపట్టి ఈశ్వరుడున్నా డని చెప్పాలి. మేం ఈశ్వరుడు సంసారి అని అనడంలేదు కూడ అని భావం). ఈశ్వరునికి సంసారిస్వరూపత్వం ప్రతిపాదించబడుచున్నది అని మేం అంగీకరిచడంలేదు. మరే మనగా- సంసారియొక్క

సంసారిత్వాన్ని తొలగించడం ద్వారా (వానికి) ఈశ్వరస్వరూపత్వం ప్రతిపాదించడానికి ఉద్దేశించబడినది అని అంటున్నాం. ఇలా చెప్పడంవల్ల అద్వైతేశ్వరుడు అపహతపాప్మత్వాదిగుణాలు కలవా డనీ, సంసారి తద్విరుద్ధగుణాలు కలవా డనీ చెప్పడం మిథ్యయే అని నిశ్చితం అవుతుంది. అధికారి లేకుండా పోతాడు,ప్రత్యక్షాదులకు విరోధం అనే మాట కూడ చెడ్డమాటే. జ్ఞానం రావడానికిపూర్వం నంసారిత్వం అంగీకరించబడుతుంది. ప్రత్యక్షాదివ్యవహారం కూడ ప్రబోధం కలగడానికి పూర్వం ఉంటుంది. "యత్ర....పశ్యేత్" ఇత్యాదివాక్యంచేత ప్రబోధం కలిగిన తరవాత ప్రత్యక్షాదులుండవు అని చూపుచున్నాడు. ప్రత్యక్షాదులు లేకపోతే శ్రుతి కూడ లేకుండా పోతుంది అని అంటే అది కాదు. ఎందువల్ల ననగా అది మాకు ఇష్టమే. "**అత్ర పితాఽపితా భవతి**" అని ఉపక్రమించి "**వేదా అవేదాః**" అని చెప్పడంవల్ల ప్రబోధం కలిగిన తరవాత శ్రుతి కూడ లేకుండా పోవడం మాకు సంమతమే. ఈ అప్రబోధం (జ్ఞానం లేకపోవడం) ఎవనికి? అని అంటే అలా అడుగుతూన్న నీకే అని అంటాం. నేను ఈశ్వరుడనే అని శ్రుతి చెపుతున్నది కదా? అయితే నువ్వు ప్రతిబుద్ధుడ వైనావు. జ్ఞానం లేకపోవడం ఎవరికీ కూడ లేదు.

ఏ. అవిద్య అనేది అసలు ఎక్కడ ఉంది? అవిద్యయే లేదు అని పృచ్ఛకుని అభిప్రాయం. ప్రశ్నించడం అజ్ఞానానికి చిహ్నం. నువ్వు ప్రశ్నిస్తున్నావు గాన నీలోనే ఉంది అవిద్య అని సమాధానం. సర్వజ్ఞుడైన ఈశ్వరునికంటె నేను అభిన్నుడ నైనప్పుడు నాకు అవిద్య ఎలా ఉంటుంది అన మళ్లీ ప్రశ్న. అట్లయితే నీకు జ్ఞానం కలిగి నట్లే. అయితే జ్ఞానం కలగడానికి పూర్వం, చిన్మాత్రుడవే అయినా నీలో అవిద్య ఉంది గాన, ప్రత్యక్షంగా కనిపిస్తూన్న అజ్ఞానాన్ని కాదనజాలవు అని సమాధాత భావం.

నిర్విశేషానందమాత్రమైన బ్రహ్మయే జీవస్వరూపం అయితే అప్పుడు స్వప్రకాశుడైన జీవుడు సర్వదా భాసించడంచేత జీవరూపమైన బ్రహ్మకూడ ప్రయత్నం ఏదీ లేకుండా సర్వదా భాసించాలి. బ్రహ్మ జీవస్వరూపమే అయినా అజ్ఞానంచేత ఆవరించబడడంచేత భాసించడం లేదు అని చెప్పడం కుదరదు. స్వప్రకాశానంద స్వరూపమైన బ్రహ్మకంటె అతిరిక్తంగా జీవస్వరూపం లేదు కదా? అతిరిక్తమైన స్వరూపం ఉంది అని అంటే బ్రహ్మభేదం కుదరదు. అందుచేత ఆవరణం ఒకటి ఉంది అని

అంగీకరిస్తే జీవస్వరూపమే భాసించకూడదు. జీవస్వరూపం భాసిస్తుంది అని అంటావా అప్పుడు బ్రహ్మస్వరూపం నిత్యమూ భాసించాలి. అందుచేత బ్రహ్మ భాసించడం లేదనగా జీవబ్రహ్మల భేదాన్ని అంగీకరించే అలా జరుగుతున్నదని చెప్పాలి అని కలిగే శంకకు సమాధానం ఇది-జీవుడు ఆనందరూపంలో భాసిస్తూనే ఉన్నాడు. అయితే వాని మీద అవిద్యాదిదోషాలను ఆరోపించడంవల్ల జీవస్వరూపం నిర్విశేషంగా కాక సవిశేషంగానే భాసిస్తున్నది. నిర్విశేషాత్మతత్త్వమే లేదనే వ్యవహారం ఏర్పడుతున్నది. అందుచేత జీవుని నిర్విశేషస్వరూపం ఆవరించబడింది అని చెప్పాలి. ఇక్కడ ఒక ప్రశ్న ఉదయించవచ్చును- నువ్వు అంగీకరిస్తూన్న అవిద్య బ్రహ్మవిషయక మని బ్రహ్మ తెలియకుండా చేస్తూన్న దనీ) బ్రహ్మమీద ఆరోపించబడిన దనీ చెప్పాలి. అలా చెప్పడం కుదరదు. ప్రకాశించే వస్తువు అవిద్యావిషయం కాదు కదా? అధిష్ఠానమైన బ్రహ్మను ఆవరించకుండా అవిద్యారోపం కూడా కుదరదు కదా? దీనికి సమాధాన మేమనగా-అవిద్యాదోషం అనాదియైనది. అందుచేత అది తనను, అనగా ఆరోపాన్నీ ఇతరమైనదానినీ, అనగా ఆవరణాన్నీ, కూడ అదే సాధించగలదు. అందుచేత బ్రహ్మస్వరూపాన్ని ఆవరించడానికి మరొక వస్తువును దేనినీ ఇది అపేక్షించదు. స్వప్రకాశత్వం అవిద్యకు విరోధి కాదు. స్వప్రకాశమైనా అవిద్యకు విషయం కావచ్చును. అవిద్యకు విరోధి ఐన దల్లా సామగ్రీవిశేషంవల్ల కలిగిన ఆత్మతత్త్వజ్ఞానమే. అది కలిగే వరకు అవిద్య ఆత్మను ఆవరించి దానిమీద ఆరోపించబడి ఉంటుంది. ఈ ఆక్షేపపరిహారాలే "కస్యవునరయమప్రబోధః" ఇత్యాది "నాస్తి కస్య చిదప్రబోధః" అనే భాష్యంలో ప్రతిపాదింపబడిం దని బ్రహ్మవిద్యాభరణంలో వివరించబడింది (రెండవ భాగం. పే 743-744). ఈ విధంగా అవిద్య అనిర్వచనీయం. పరమార్థంలో సంసారమూ లేదు, బద్ధుడూ లేడు, మోక్షమూ లేదు అని సూచింపబడింది అని భామతిలో ప్రతిపాదించబడింది. (పే.938,939)

యో.ప్రీతి:- అవిద్య కూడా ఉన్నప్పుడు బ్రహ్మ సద్వితీయమే అవుతుంది. అందుచేత అద్వైతం కుదరదు అని కొందరు చేసే ఆక్షేపం కూడా దీనిచేత నిరాకరించబడింది. (అనగా అనిర్వచనీయమైన అవిద్యచేత సద్వితీయంత్వం కలగదు. రజ్జుసర్పస్థానంలో రెండు వస్తువులున్నా యని ఎవరైనా అంటారా అని భావం). అందుచేత ఈశ్వరునియందు నా ఆత్మయే అని మనస్సు నిలపాలి, (ధ్యానం చెయ్యాలి). 3.

ఆత్మత్వోపాసనాధికరణం సమాప్తం

## 3. ప్రతీకాధికరణమ్. సూ.4

## సూ. న ప్రతీకేన హి సః. 4.1.4

మనో బ్రహ్మేత్యుపాసీతేత్యధ్యాత్మమథాధిదైవతమాకాశో బ్రహ్మేతి (ఛా.ఉ.3.18.3) ఇతి. తథా "**ఆదిత్యో బ్రహ్మేత్యాదేశః**" (ఛా.ఉ.3.19.1), "స **యో నామ బ్రహ్మేత్యుపాస్తే**"(ఛా.ఉ.7.1.5) ఇత్యేవమాదిషు ప్రతీకోపాసనేషు సంశయః-కిం తేష్వప్యాత్మగ్రహః కర్తవ్యో న వేతి. కిం తావత్ప్రాప్తమ్? తేష్వప్యాత్మగ్రహ ఏవ యుక్తః. కస్మాత్? బ్రహ్మణః శ్రుతిష్వాత్మత్వేన ప్రసిద్ధత్వాత్; ప్రతీకానామపి బ్రహ్మవికారత్వాద్బ్రహ్మత్వే సత్యాత్మత్వోపపత్తేరితి.

### బాలానందిని

**నేతి**:-"ప్రతీకే=ప్రతీకమునందు, న=ఆత్మబుద్ధి చేయకూడదు. సః=ఉపాసకుడు, న హి=ప్రతీకను ఆత్మ అని అనుకొనడు కదా?" అని సూత్రార్థం.

**మన ఇతి** :- "మనో...బ్రహ్మేతి" (అధ్యాత్మమునందు మనస్సును బ్రహ్మగా ఉపాసించాలి. అధిదైవతమునందు ఆకాశాన్ని బ్రహ్మగా ఉపాసించాలి, మరియు, "**ఆదిత్యో** బ్రహ్మేత్యాదేశః," "స యో నామ బ్రహ్మేత్యుపాస్తే" ఇత్యాదిప్రతీకోపాసనలలో కూడ ఆత్మగ్రహం చెయ్యాలా అక్కర లేదా అని సంశయం. ఏమి ప్రాప్తించినది? వాటి యందు కూడ ఆత్మ గ్రహమే యుక్త మైనది. ఎందువలన? శ్రుతులలో బ్రహ్మ ఆత్మయని చెప్పబడింది. ప్రతీకలు కూడ బ్రహ్మవికారాలే గాన బ్రహ్మరూపములే, అందుచేత వాటిని కూడ ఆత్మ అనవచ్చును.

### భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః-న ప్రతీకేష్వాత్మమతిం బధ్నీయాత్. న హి న ఉపాసకః ప్రతీకాని వ్యస్తాన్యాత్మత్వేనాకలయేత్. యత్పునర్బ్రహ్మవికారత్వాత్ ప్రతీకానాం బ్రహ్మత్వం, తతశ్చాత్మత్వమితి; తదసత్. ప్రతీకాభావప్రసంగాత్. వికారస్వరూపోపమర్దేన హి నామాదిజాతస్య బ్రహ్మత్వమేవాశ్రితం భవతి. స్వరూపోపమర్దే చ నామాదీనాం కుతః ప్రతీకత్వమాత్మగ్రహో వా? న చ బ్రహ్మణ

ఆత్మత్వాత్ బ్రహ్మదృష్ట్యుపదేశేష్వాత్మదృష్టిః కల్ప్యః; కర్తృత్వాద్యనిరాకరణాత్. కర్తృత్వాదిసర్వసంసారధర్మనిరాకరణేన హి బ్రహ్మణ ఆత్మత్వోపదేశః, తదనిరాకరణేన చోపాసనావిధానమ్. అతశ్చోపాసకస్య ప్రతీకైః సమత్వాదాత్మగ్రహో నోపపద్యతే. న హి రుచకస్వస్తికయోరితరేతరాత్మత్వమస్తి. సువర్ణాత్మనేవ తు బ్రహ్మాత్మనైకత్వే ప్రతీకాభావప్రసంగమవోచామ. అతో న ప్రతీకేషు ఆత్మదృష్టిః క్రియతే. 4.

### బాలానందిని

**ఏవమితి** :- ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాం-ప్రతీకలయందు ఆత్మబుద్ధిని చేయకూడదు. ఆ ఉపాసకుడు విడి విడిగా ఉన్న ప్రతీకలను ఆత్మనుగా చూడడు కదా? ప్రతీకములు బ్రహ్మకార్యములుగాన అవి బ్రహ్మయే అవడంచేత ఆత్మత్వం కుదురుతుంది అని చెప్పినది అయుక్తం. అప్పుడు ప్రతీకయే లేకుండా పోతుంది. వికారస్వరూపాన్ని మర్దించి (పూర్తిగా అణగద్రొక్కి) నామాదికాన్ని బ్రహ్మగానే స్వీకరించిన ట్లవుతుంది. వాటి స్వరూపమే పోయినప్పుడు నామాదులు ప్రతీకాలు ఎలా అవుతాయి? ఆత్మగా ఎలా గ్రహించబడతతాయి? బ్రహ్మ ఆత్మగాన, వేటియందు బ్రహ్మదృష్టి ఉపదేశించబడుచున్నదో వాటియందు ఆత్మదృష్టిని కల్పించడం కుదరదు; ఎందువల్ల ననగా కర్తృత్వం మొదలైన సంసారధర్మాలు నిరాకరించబడలేదు. కర్తృత్వం మొదలైన సమస్తసంసారధర్మాలను నిరాకరించిన తరువాతనే బ్రహ్మ ఆత్మగా ఉపదేశించబడుతుంది. ఉపాసన లైతే కర్తృత్వాదులను నిరాకరించకుండగానే విధింపబడతాయి. అందుచేత ఉపాసకుడు ప్రతీకలతో సమానుడేగాన (ప్రతీకలు ఏ విధంగా వేరు వేరుగా కనబడుతున్నాయో అలాగే కర్తృత్వాదిధర్మాలతో ఉపాసకుడు కూడ వేరుగా కనబడుతున్నాడు గాన) ఆత్మగ్రహం కుదరదు. రుచక-స్వస్తికాలకు పరస్పరం ఏకస్వరూపత్వం లేదు కదా. (ఆ అలంకారాలు వేరు వేరుగా కనబడినా) సువర్ణరూపంలో అభిన్నములే అయి నట్లు (ఉపాసకునికీ ప్రతీకలకీ) బ్రహ్మస్వరూపంచేత అభేదం అన్నట్లయితే అప్పుడు ప్రతీక లేకుండా పోతుంది అని చెప్పాలి. అందువల్ల ప్రతీకలయందు ఆత్మదృష్టి చేయకూడదు.

వి. బ్రహ్మతో అభేదం ఉండడంవల్ల అహంగ్రహం చెప్పినట్లుగా ప్రతీకలు బ్రహ్మవికారాలే గాన అవి జీవాభిన్నబ్రహ్మాభిన్నాలు గాన, జీవాభేదం ఉంది గాన అహంగ్రహోపాసన చేయవచ్చు అని దృష్టాంత సంగతితో పూర్వపక్షం. ఇది మొదలు మూడు అధికారణాలకు ఈ పాదంలో ప్రాసంగికసంగతి. 4

ప్రతీకాధికరణం సమాప్తం

## 4. బ్రహ్మదృష్ట్యధికరణమ్ సూ.5

## సూ. బ్రహ్మదృష్టిరుత్కర్షాత్. 4.1.5

తేష్వేవోదాహరణేష్వన్యః సంశయః-కిమాదిత్యాదిదృష్టయో బ్రహ్మణ్యధ్యవసితవ్యాః కిం వా బ్రహ్మదృష్టిరాదిత్యాదిష్వితి. కుతః సంశయః? సామానాధికరణ్యే కారణానవధారణాత్. అత్ర హి బ్రహ్మశబ్దస్యాదిత్యాదిశబ్దైః సామానాధికరణ్యముపలభ్యతే-'ఆదిత్యో బ్రహ్మ' 'ప్రాణో బ్రహ్మ', 'విద్యుద్ బ్రహ్మ' ఇత్యాదిసమానవిభక్తినిర్దేశాత్. న చాత్రాఞ్జసం సామానధికరణ్యమవకల్పతే, అర్థాన్తరవచనత్వాత్ బ్రహ్మాదిత్యాదిశబ్దానామ్. న హి భవతి గౌరశ్వ ఇతి సామానాధికరణ్యమ్. నను ప్రకృతివికారభావాద్బ్రహ్మాదిత్యాదీనాం మృచ్ఛరావాదివత్ సామానాధికరణ్యం స్యాత్. నేత్యుచ్యతే. వికారప్రవిలయో హ్యేవం ప్రకృతిసామానాధికణ్యాత్ స్యాత్. తతశ్చ ప్రతీకాభావప్రసంగమవోచామ. పరమాత్మవాక్యం చేదం తదానీం స్యాత్; తతశ్చోపాసనాధికారో బాధ్యేత. పరిమితవికారోపాదానం చ వ్యర్థమ్. తస్మాద్బ్రాహ్మణోఽగ్నిర్వైశ్వానర ఇత్యాదివదన్యత్రాన్యదృష్ట్యధ్యాసే సతి క్వ కిందృష్టిరధ్యస్యతామితి సంశయః. తత్రానియమో నియమకారిణః శాస్త్రస్యాభావాదిత్యేవం ప్రాప్తమ్. అథవాఽఽదిత్యాదిదృష్టయ ఏవ బ్రహ్మణి కర్తవ్యా ఇతి ప్రాప్తమ్. ఏవం హ్యాదిత్యాదిదృష్టిభిర్బ్రహ్మోపాసితం భవతి. బ్రహ్మోపాసనం ఫలవదితి శాస్త్రమర్యాదా. తస్మాన్న బ్రహ్మదృష్టిరాదిత్యాదిష్వితి.

బాలానందిని

**బ్రహ్మేతి** :-"ఉత్కర్షాత్=ఉత్కర్ష ఉండడంవల్ల, బ్రహ్మదృష్టిః=బ్రహ్మదృష్టియే చేయదగినది" అని సూత్రార్థం.

**తేష్వేవేతి**:- ఆ ఉదాహరణల విషయంలోనే - బ్రహ్మయందు ఆదిత్యాది దృష్టుల అధ్యాసం చెయ్యాలా లేక ఆదిత్యాదులయందు బ్రహ్మదృష్టి చెయ్యాలా అని సంశయం. సంశయం. ఎందువల్ల? సామానాధికరణ్యంలో కారణం ఏమిటో నిశ్చయం లేకపోవడంవల్ల. ఇక్కడ 'ఆదిత్యో బ్రహ్మ' 'ప్రాణో బ్రహ్మ' 'విద్యుద్బ్రహ్మ' ఇత్యాదివిధంగా సమానమైన విభక్తులలో నిర్దేశించడంవల్ల బ్రహ్మశబ్దానికి ఆదిత్యాదిశబ్దాలతో సామానాధికరణ్యం కనబడుచున్నది. (రెండు పదాలను విశేషణవిశేష్యాలుగా ఒకే విభక్తిలో, వచనంలో ప్రయోగించడం-'నీలమ్ ఉత్పలమ్' ఇత్యాదుల వలె - సామానాధికరణ్యం). అయితే ఇక్కడ సరియైన సామానాధికరణ్యం కుదరదు; ఎందువల్ల ననగా బ్రహ్మ-ఆదిత్యాదిశబ్దాలు వేరు వేరు అర్థాలను చెపుతున్నాయి కదా? 'గౌః అశ్వః' అని ప్రయోగిస్తే సామానాధికరణ్యం కాదు కదా? (సమానవిభక్తివచనాదులలో ఉపయోగించిన రెండు పదాలు, 'నీలమ్ ఉత్పలమ్' ఇత్యాదులలో వలె ఒకే వస్తువును నిర్దేశిస్తేనే అది సరియైన సామానాధికరణ్యం అవుతుంది. రెండు వ్యక్తులను చెప్పే గౌః అశ్వః అనే పదాలు సమానవిభక్త్యాదులలో ప్రక్క ప్రక్క ప్రయోగింపబడినా అది సామాధికరణ్యం అని చెప్పబడదు). (ప్రశ్న) బ్రహ్మకు ఆదిత్యాదులకూ మధ్య ప్రకృతివికారభావం ఉండడంవల్ల (ప్రకృతియైన)మృత్తుకూ, వికృతులైన శరావాదులకు వలె (ఈ మూకుడు మట్టి ఈ కుండ మట్టి ఇత్యాదులలో వలె) సామానాధికరణ్యం ఉండవచ్చును కదా?(సమాధానం)-ప్రకృతితో సామానాధికరణ్యం చెపితే వికారానికి ప్రవిలయం ఏర్పడుతుంది; (వికారం కనబడకుండా పోతుంది). అప్పుడు ప్రతీకయే లేకుండా పోతుందని చెప్పాం. మరొక విషయ మేమనగా అప్పుడు (ఇక్కడ ప్రకృతివికారభావం ప్రవేశపెడితే) ఇది పరమాత్మను గూర్చి చెప్పే వాక్యం అవుతుంది. అప్పుడు ఉపాసనాధికారం బాధితమవుతుంది. (ఇది ఉపాసనలను చెప్పే ఘట్టం. ఇది పరమాత్మను చెప్పే వాక్యంగా అర్థం చెప్పుకొంటే ప్రస్తుతమైన ఉపాసనాప్రకరణానికి భంగం ఏర్పడుతుంది). మరొక విషయ మేమనగా జగత్తులో ఉన్న అన్ని పదార్థాలూ

బ్రహ్మవికారాలే అయినప్పుడు- కొన్ని వికారాలను మాత్రమే చెప్పడం వ్యర్థం అవుతుంది. అందుచేత "బ్రాహ్మణుడే వైశ్వానరాగ్ని" ఇత్యాదులందు వలె,(సామానాధికరణ్యాన్ని పట్టి) ఒకదానియందు మరొకదాని దృష్టియొక్క అధ్యాస చేయవలసి యుండగా దేనియందు దేని దృష్టి అధ్యసించాలి (బ్రహ్మయందు ఆదిత్యదృష్టియా లేక అదిత్యుని యందు బ్రహ్మదృష్టియా) అని సంశయం. అయితే నియమకారి యైన శాస్త్రం లేకపోవడంచేత నియమం లేదు(ఇట్లు అట్లూ కూడ అధ్యాసచేయవచ్చును)అని ప్రాప్తిస్తుంది. లేదా బ్రహ్మయందే ఆదిత్యాదిదృష్టులు చెయ్యాలి అని ప్రాప్తిస్తుంది. ఇలా అయితే ఆదిత్యాదిదృష్టులచేత బ్రహ్మను ఉపాసించిన ట్లవుతుంది. బ్రహ్మోపాసనకు మంచి ఫలం ఉంటుం దని శాస్త్రమర్యాద; అందువల్ల ఆదిత్యాదులయందు బ్రహ్మదృష్టి కాదు.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః-బ్రహ్మదృష్టిరేవాదిత్యాదిషు స్యాదితి. కస్మాత్? ఉత్కర్షాత్. ఏవముత్కర్షేణాదిత్యాదయో దృష్టా భవన్తి, ఉత్కృష్టదృష్టేస్తేష్వధ్యాసాత్. తథా చ లౌకికో న్యాయోఽనుగతో భవతి. ఉత్కృష్టదృష్టిర్హి నికృష్టేఽధ్యసితవ్యేతి లౌకికో న్యాయః, యథా రాజదృష్టిః క్షత్తరి. స చానుసర్తవ్యః. విపర్యయే ప్రత్యవాయప్రసంగాత్. న హి క్షత్తృదృష్టిపరిగృహీతో రాజా నికర్షం నీయమానః శ్రేయసే స్యాత్. నను శాస్త్రప్రామాణ్యాదనాశఙ్కనీయోఽత్ర ప్రత్యవాయప్రసంగః న చ లౌకికేన న్యాయేన శాస్త్రీయా దృష్టిర్నియన్తుం యుక్తేతి. అత్రోచ్యతే- నిర్ధారితే శాస్త్రార్థే ఏతదేవం స్యాత్. సందిగ్ధే తు తస్మింస్తన్నిర్ణయం ప్రతి లౌకికోఽపి న్యాయ ఆశ్రీయమాణః న విరుధ్యతే. తెన చోత్కృష్టదృష్ట్యధ్యాసే శాస్త్రార్థేఽవధార్యమాణే నికృష్టదృష్టిమధ్యస్యన్ ప్రత్యవేయాదితి శ్లిష్యతే. ప్రాథమ్యాచ్చాదిత్యాదీనాం ముఖ్యార్థత్వమవిరోధాద్గ్రహీతవ్యమ్. తైః స్వార్థవృత్తిభిరవరుద్ధాయాం బుద్ధౌ పశ్చాదవతరతో బ్రహ్మశబ్దస్య ముఖ్యయా వృత్త్యా సామానాధికరణ్యాసంభవాత్ బ్రహ్మదృష్టివిధానార్థతైవావతిష్ఠతే. ఇతిపరత్వాదపి బ్రహ్మశబ్దస్యైష ఏవార్థో న్యాయ్యః. తథాహి- "బ్రహ్మేత్యాదేశః"

"బ్రహ్మేత్యుపాసీత" "బ్రహ్మేత్యుపాస్తే" ఇతి చ సర్వత్రేతిపరం బ్రహ్మశబ్దముచ్చారయతి, శుద్ధాంస్త్వాదిత్యాదిశబ్దాన్. తతశ్చ యథా శుక్తికాం రజతమితి ప్రత్యేతీత్యత్ర శుక్తివచన ఏవ శుక్తికాశబ్దో రజతశబ్దస్తు రజతప్రతీతిలక్షణార్థః, ప్రత్యేత్యేవ హి కేవలం రజతమితి న తు తత్ర రజతమస్తి, ఏవమత్రాప్యాదిత్యాదీన్ బ్రహ్మేతి ప్రతీయాదితి గమ్యతే.

బాలానందిని

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా ఆదిత్యాదులయందు బ్రహ్మదృష్టియే ఉండాలి అంటాం. ఎందువల్ల? ఉత్కర్షవల్ల. ఈ విధంగా చెపితేనే ఆదిత్యాదులు ఉత్కర్షతో చూడబడినవా ళ్ళవుతారు. ఎందువల్ల ననగా వాళ్ళమీద ఉత్కృష్టమైనదాని (బ్రహ్మయొక్క) దృష్టి అధ్యసించబడుచున్నది. ఈ విధంగా నైతే లౌకికన్యాయాన్ని కూడా అనుసరించిన ట్లవుతుంది. తక్కువవానియందు గొప్పవాని దృష్టిని ఆరోపించాలి అని లౌకికన్యాయం. ఉదాహరణాకి క్షత్తయందు రాజదృష్టి. (సారథ్యం మొదలైనవి చేసే ఒక జాతికి చెందినవాడు క్షత్త). ఆ న్యాయం అనుసరించాలి . అందుకు విపర్యయం చేస్తే ప్రత్యవాయం కలగవచ్చును. రాజును క్షత్తనుగా చూచి అతనిని నికృష్టుణ్ణిగా చేసిన ట్లయితే శ్రేయస్సు ఇవ్వడు కదా? (ఆశంక) శాస్త్రప్రామాణ్యాన్ని పట్టి ఈ విషయంలో ప్రత్యవాయం వస్తుందేమో అని ఆశంకించకూడదు. శాస్త్రీయదృష్టిని లౌకికన్యాయంచేత నియమించకూడదు. (సమాధానం) ఈ విషయంలో చెప్పబడుచున్నది. శాస్త్రార్థం ఇది అని నిర్ధారణ చేసిన ట్లయితే ఇది ఇట్లే కావచ్చును (నీవు చెప్పినది నిజమే కావచ్చును). శాస్త్రార్థం సందిగ్ధంగా ఉన్నప్పుడుమాత్రం దాని నిర్ణయాన్ని గూర్చి లౌకికన్యాయాన్ని ఆశ్రయించినా కూడ విరోధం లేదు. దానిచేత (లౌకికన్యాయంచేత) ఉత్కృష్టదృష్ట్యధ్యాసమే శాస్త్రార్థ మని నిశ్చయింపబడుచుండగా నికృష్టదృష్టిని అధ్యసించేవాడు ప్రత్యవాయం పొందుతాడు అని చెప్పడం యుక్తమే. ఆదిత్యాదిశబ్దాలు ముందు ఉన్నాయి గాన, (వాటి ముఖ్యార్థం గ్రహించడంలో) విరోధం లేదు గాన వాటి ముఖ్యార్థమే గ్రహించాలి. స్వార్థాన్ని బోధించే ఆ ఆదిత్యాదిశబ్దాలచేత (శ్రోతయొక్క) బుద్ధి ఆక్రమించబడిన తరవాత (ఆ అర్థాలు బుద్ధిలో ప్రవేశించిన తరువాత) అవతరించే (బుద్ధిగోచర మయ్యే) బ్రహ్మశబ్దానికి ముఖ్యమైన వృత్తిచేత సామానాధికరణ్యం అసంభవం గాన ఇంక బ్రహ్మదృష్టిని విధిస్తున్నది

అనే విషయం మాత్రమే నిలిచిఉంటుంది. మరొక విషయ మేమనగా బ్రహ్మశబ్దానికి తరవాత ఇతి శబ్దం ఉంది గాన ఆ కారణంచేత కూడ ఈ అర్థమే న్యాయ్యమైనది. అ దెట్లనగా "బ్రహ్మ ఇతి ఆదేశః" "బ్రహ్మ ఇతి ఉపాసీత" "బ్రహ్మ ఇతి ఉపాస్తే" అని అంతటా కూడా "ఇతి" అనేది పరంగా గల బ్రహ్మశబ్దాన్ని ఉచ్చరిస్తున్నారు. అదిత్యాదిశబ్దాల నైతే శుద్ధమైనవాటిని (ఇతిపరములు కానివాటిని) ఉచ్చరిస్తున్నారు. అందువల్ల "శుక్తికాం రజతమ్ ఇతి ప్రత్యేతి" (శుక్తికను రజతము అని తెలుసుకొంటున్నాడు) అనే చోట ఏ విధంగా శుక్తికాశబ్దం శుక్తికనే చెప్పుతుందో, రజతశబ్ద మైతే రజతమనే ప్రతీతి మాత్రమే అనే అర్థాన్ని బోధిస్తుందో, ఎందువల్ల నంటే అక్కడ కేవలం రజతం ఉందని అనుకుంటున్నాడు మాత్రమే గాని నిజంగా రజతం లేదు కదా, అలాగే ఇక్కడ కూడ ఆదిత్యాదులను బ్రహ్మ అని అనుకోవాలి అని మాత్రమే తెలుస్తున్నది.

## భాష్యమ్

వాక్యశేషోఽపి చ ద్వితీయానిర్దేశేనాదిత్యాదీనేవోపాస్తిక్రియయా వ్యాప్యమానాన్ దర్శయతి "స య ఏతమేవం విద్వానాదిత్యం బ్రహ్మోపాస్తే" (ఛా.ఉ. 3.19.4) "యో వాచం బ్రహ్మోపాస్తే" (ఛా. ఉ. 7.2.2) "యః సంకల్పం బ్రహ్మోపాస్తే" (ఛా. ఉ. 7.4.3) ఇతి చ. యత్తూక్తం బ్రహ్మోపాసనమేవాత్రాదరణీయం ఫలవత్త్వాయేతి, తదయుక్తమ్. ఉక్తేన న్యాయేన ఆదిత్యాదీనామేవోపాస్యత్వావగమాత్. ఫలం త్వతిథ్యాద్యుపాసన ఇవ ఆదిత్యాద్యుపాసనేఽపి బ్రహ్మైవ దాస్యతి, సర్వాధ్యక్షత్వాత్. వర్ణితం చైతత్ "ఫలమత ఉపపత్తేః" (బ్ర.సూ. 3.2.38) ఇత్యత్ర. ఈదృశం చాత్ర బ్రహ్మణ ఉపాస్యత్వం యత్ప్రతీకేషు తద్దృష్ట్యధ్యారోపణం ప్రతిమాదిష్వివ విష్ణ్వాదీనామ్.5

## బాలానందిని

వాక్యేతి :- సయ......ఉపాస్తే, "యో వాచం బ్రహ్మోపాస్తే" "యః సంకల్పం బ్రహ్మోపాస్తే" ఇత్యాదివాక్యశేషం కూడ ఆదిత్యాదిశబ్దాలను ద్వితీయావిభక్తిలో ప్రయోగించడం ద్వారా ఉపాసనక్రియలో ఆదిత్యాదులను వ్యాపించబడుచున్నవాళ్ళనుగా

(అనగా కర్మగా అన్వయించువాళ్ళనుగా) చూపుతున్నది. ఫలం లభించా లంటే ఇక్కడ బ్రహ్మోపాసనమునే అంగీకరించాలి అని ఏది చెప్పబడిందో అది యుక్తం కాదు. చెప్పిన న్యాయంచేత ఆదిత్యాదులే ఉపాస్యు లని తెలుస్తున్నది కదా. అతిథ్యాదులను ఉపాసించినందుకు ఫలం ఇచ్చినట్లు ఆదిత్యాద్యుపాసనలో కూడా సర్వాధ్యక్షం అవడం చేత, బ్రహ్మమే ఇస్తుంది. ఈ విషయం "ఫలమత ఉపపత్తేః" అనే చోట వర్ణించబడింది. ఇక్కడ బ్రహ్మ ఉపాస్యం అని చెప్పడానికి అర్థం ఏమనగా ప్రతిమాదులయందు విష్ణ్వాదిదృష్టి ఆరోపించి నట్లు ప్రతీకలయందు బ్రహ్మదృష్టిని ఆరోపించడమే. 5

బ్రహ్మదృష్ట్యధికరణం సమాప్తం

## 5. ఆదిత్యాదిమత్యధికరణమ్. సూ. 6

### సూ. ఆదిత్యాదిమతయశ్చాఙ్గ ఉపపత్తేః 4.1.6

"య ఏవాసౌ తపతి తముద్గీథముపాసీత" (ఛా.ఉ. 1.3.1), "లోకేషు పఞ్చవిధం సామోపాసీత" (ఛా.ఉ. 2.2.1), "వాచి సప్తవిధం సామోపాసీత" (ఛా.ఉ. 2.8.1) "ఇయమేవరగ్నిః సామ" (ఛా.ఉ.1.6.1) ఇత్యేవమాదిష్వఙ్గావబద్ధేషూపాసనేషు సంశయః - కిమాదిత్యాది షూద్గీథాదిదృష్టయో విధీయన్తే, కిం వా ఉద్గీథాదిష్వేవ ఆదిత్యాదిదృష్టయ ఇతి. తత్రానియమో నియమకారణాభావాదితి ప్రాప్తమ్. న హ్యత్ర బ్రహ్మణ ఇవ కస్యచిదుత్కర్షవిశేషోఽవధ్యార్యతే, బ్రహ్మ హి సమస్తజగత్కారణత్వాత్ అపహతపాప్మత్వాదిగుణయోగాచ్చ ఆదిత్యాదిభ్యః ఉత్కృష్టమితి శక్యమవధారయితుమ్, న త్వాదిత్యోద్గీథాదీనాం వికారత్వావిశేషాత్ కిం చిదుత్కర్షవిశేషావధారణే కారణమస్తి. అథవా నియమేనైవోద్గీథాదిమతయ ఆదిత్యాదిష్వధ్యస్యేరన్. కస్మాత్? కర్మాత్మకత్వాదుద్గీథాదీనాం, కర్మణశ్చ ఫలప్రాప్తిప్రసిద్ధేః, ఉద్గీథాదిమతిభిరుపాస్యమానా ఆదిత్యాదయః, కర్మాత్మకాః సన్తః ఫలహేతవో భవిష్యన్తి. తథా చ "ఇయమేవర్గగ్నిః సామ" (ఛా.ఉ. 1.6.1) ఇత్యత్ర "తదేతదేతస్యామృచ్యధ్యూఢం సామ" (ఛా.ఉ. 1.6.1) ఇతి ఋక్శబ్దేన పృథివీం నిర్దిశతి, సామశబ్దేనాగ్నిమ్,

తచ్చ పృథివ్యగ్న్యోః ఋక్సామదృష్టిచికీర్షాయామవకల్పతే, న ఋక్సామయోః పృథివ్యగ్నిదృష్టిచికీర్షాయామ్. క్షత్తరి హి రాజదృష్టికరణాత్ రాజశబ్ద ఉపచర్యతే న రాజని క్షత్తృశబ్దః. అపి చ "లోకేషు పఞ్చవిధం సామోపాసీత" (ఛా.ఉ. 2.2.1) ఇత్యధికరణనిర్దేశాల్లోకేషు సామాధ్యాసితమితి ప్రతీయతే. "ఏతద్గాయత్రం ప్రాణేషు ప్రోతమ్" (ఛా.ఉ. 2.11.1) ఇతిచైతదేవం దర్శయతి. ప్రథమనిర్దిష్టేషు చాదిత్యాదిషు చరమనిర్దిష్టం బ్రహ్మాధ్యస్తమ్ "ఆదిత్యో బ్రహ్మేత్యాదేశః" (ఛా.ఉ. 3.19.1) ఇత్యాదిషు. ప్రథమానిర్దిష్టాశ్చ పృథివ్యాదయః చరమనిర్దిష్టా హింకారాదయః "పృథివీ హింకారః" (ఛా.ఉ. 2.2.1) ఇత్యాదిశ్రుతిషు. అతోఽఙ్గేష్వాదిత్యాదిష్వఙ్గమతినిక్షేప ఇతి.

బాలానందిని

**ఆదిత్యాదీతి** :- "అఙ్గే = ఉద్గీథం మొదలైన అంగమునందు, ఆదిత్యాదిమతయః = ఆదిత్యాదిదృష్టులు చేయదగినవి, ఉపపత్తేః = అట్లు చేయడమే ఉపపన్నం గాన" అని సూత్రార్థం.

**య ఏవాసౌ ఇతి**:- "**య ఏవాసౌ....ఉపాసీత**" (ఆ తపిస్తున్నవానిని ఉద్గీథంగా ఉపాసించాలి) "**లోకేషు....ఉపాసీత**" (పృథివీ - అగ్ని - అన్తరిక్ష - ఆదిత్య - ద్యులోకాలనే లోకాలయందు హింకార - ప్రస్తావ - ఉద్గీథ - ప్రతీహార - నిధనా లనే అయిదు అంశాలు గల సామను ఉపాసించాలి), "**వాచి ....ఉపాసీత**" (వాక్కునందు ఆది, ఉపద్రవం అను రెండు భక్తులు చేర్చిన పైనచెప్పిన ఐదు సామలు ఉపాసించాలి) "**ఇయమేవ.....సామ**" (ఈ పృథివియే ఋక్కు, అగ్నియే సామ) ఇత్యాదులైన అంగాలకు సంబంధించిన ఉపాసనలలో ఆదిత్యాదులయందు ఉద్గీథాదిదృష్టులు లేక ఉద్గీథాదులయందు ఆదిత్యాదిదృష్టులు విధించబడుచున్నాయా అని సంశయం. నియమం చెప్పడానికి తగిన కారణం ఏదీ లేకపోవడంచేత నియమం లేదు (ఇటు అటు కూడా చేయవచ్చును) అని ప్రాప్తిస్తున్నది. ఇక్కడ బ్రహ్మ విషయంలో వలె దేనికీ కూడ ఉత్కర్షవిశేషం ఏదీ కనబడడం లేదు కదా? బ్రహ్మ సమస్తజగత్తుకు కారణం అవడంవల్ల అపహతపాప్మత్వాదిగుణాలుండడంవల్ల ఆదిత్యాదులకంటె ఉత్కృష్టమైన దని నిర్ధారణ చేయడం శక్యం అయింది

(వెనుకటి అధికరణంలో). ఆదిత్యోద్గీథాదులు అన్నీ కూడ వికారాలే (బ్రహ్మకార్యాలే గాన) వీటిలో (ఒకటి ఉత్కృష్టమైనది, మరొకటి నికృష్టమైనది అని) ఉత్కర్షవిశేషాన్ని నిర్ధారణ చేయడానికి కారణం ఏదీ లేదు. లేదా - ఆదిత్యాదులందే నిశ్చితంగా ఉద్గీథాదిమతులు అధ్యసింపబడాలి. ఎందువల్ల? ఉద్గీథాదులు కర్మస్వరూపములు; కర్మవల్ల ఫలప్రాప్తి సిద్ధిస్తుంది. (అందుచేత) ఆదిత్యాదులను ఉద్గీథాదిరూపాలలో ఉపాసిస్తే అవి కర్మస్వరూపా లయి ఫలానికి హేతువులు అవుతాయి. అట్లే "ఇయమేవర్గగ్నిః సామ" అనేచోట "తదేతదేతస్యామృచ్యధ్యూఢం సామ" (తదేతత్ సామ = ఈ అగ్ని అనే పేరు గల సామ, ఏతస్యామ్ = పృథివీరూపమైన, ఋచి = ఋక్కునందు, అధ్యూఢమ్ = పైన ఉన్నది) అని ఋక్శబ్దంచేత పృథివిని, సామశబ్దంచేత అగ్నిని నిర్దేశిస్తున్నది. ఇలా చెప్పడం పృథివ్యగ్నులమీద ఋక్ - సామదృష్టి చెయ్యా లన్నప్పుడే కుదురుతుంది కాని ఋక్-సామల మీద పృథివ్యగ్ని దృష్టి చెయ్యా లన్నట్లయితే కుదరదు. క్షత్తయందు రాజదృష్టిని చేయడంవల్ల వాని యందు రాజశబ్దం ఉపచారంచేత (గౌణంగా) ప్రయోగించబడుతుంది కాని రాజునందు క్షత్తృశబ్దం ఉపచరితం కాదు. మరొక విషయ మేమనగా "లోకేషు పఞ్చవిధం సామోపాసీత" అని (లోకాలను) అధికరణంగా నిర్దేశించడంచేత లోకములమీదనే సామ అధ్యసింపదగినది అని తెలుస్తున్నది. "ఏ తద్గాయత్రం ప్రాణేషు ప్రోతమ్" ఈ గాయత్రం ప్రాణాలమీద ఉంచబడింది అనేది కూడ (ప్రాణేషు అని సప్తమీప్రయోగంచేత) ఈ విషయాన్నే (ప్రాణాలమీద గాయత్రదృష్టి అన్నట్లు) చూపుచున్నది. "ఆదిత్యో బ్రహ్మేత్యాదేశః" ఇత్యాదివాక్యాలలో ముందుగా నిర్దేశించబడిన ఆదిత్యాదులపైన తరవాత నిర్దేశించబడిన బ్రహ్మ అధ్యసించబడింది. (పూర్వాధికరణంలో). ఇక్కడ కూడ పృథివ్యాదులు ముందుగా నిర్దేశించబడ్డాయి. హింకారాదులు "పృథివీ హింకారః" ఇత్యాదిశ్రుతులలో, తరవాత నిర్దేశించబడ్డాయి. అందువల్ల అంగములు కాని ఆదిత్యాదులమీద అంగమతి చెయ్యాలి.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః - ఆదిత్యాదిమతయ ఏవ అఙ్గేషూద్గీథాదిషు క్షిప్యేరన్. కుతః? ఉపపత్తేః. ఉపపద్యతే హ్యేవమపూర్వసంనికర్షాదాదిత్యాది మతిభిః సంస్క్రియమాణేషూద్గీథాదిషు కర్మసమృద్ధిః, "యదేవ విద్యయా కరోతి

శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి" (ఛా.ఉ. 1.1.10) ఇతి చ విద్యాయాః కర్మసమృద్ధిహేతుత్వం దర్శయతి. భవతు కర్మసమృద్ధిఫలేష్వేవమ్. స్వతన్త్రఫలేషు తు కథమ్ - "య ఏతదేవం విద్వాన్ లోకేషు పఞ్చవిధం సామోపాస్తే" (ఛా.ఉ. 2.2.3) ఇత్యాదిషు? తేష్వపి అధికృతాధికారాత్ ప్రకృతాపూర్వసంనికర్షేణైవ ఫలకల్పనా యుక్తా గోదోహనాదినియమవత్. ఫలాత్మకత్వాచ్చాదిత్యాదీనాముద్గీథాదిభ్యః కర్మాత్మకేభ్యః ఉత్కర్షోపపత్తిః. ఆదిత్యాదిప్రాప్తిలక్షణం హి కర్మఫలం శిష్యతే శ్రుతిషు. అపి చ "ఓమిత్యేతదక్షర ముద్గీథముపాసీత"(ఛా.ఉ.1.1.1) "ఖల్వేతస్యైవాక్షరస్యోపవ్యాఖ్యానం భవతి" (ఛా.ఉ.1.1.10) ఇతి చోద్గీథమేవోపాస్యత్వేన ఉపక్రమ్య ఆదిత్యాదిమతీర్విదధాతి.

### బాలానందిని

**ఏవమితి** :- ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాం. ఉద్గీథాదులమీద ఆదిత్యాదిమతులే ఉంచబడాలి. ఎందువల్ల? ఉపపత్తివల్ల. ఉపాసనలు ప్రకృతకర్మాపూర్వంతో సంనిహితంగా ఉండడంచేత ఉద్గీథాదులు ఆదిత్యాదిమతులచేత సంస్కరింపబడితే కర్మసమృద్ధి కలుగుతుంది. "యదేవ ....భవతి" అను శ్రుతి విద్య కర్మసమృద్ధికి హేతువు అని చెప్పుచున్నది. (ప్రశ్న) కర్మసమృద్ధి ఫలంగా గల ఉపాసనలలో (కర్మసమృద్ధి అనే ఫలం ఇచ్చే ఉపాసనలలో) ఇట్లవుతే కా వచ్చును. కాని స్వతంత్రఫలాలైన "య ఏతదేవం.... ఉపాస్తే" ఇత్యాద్యుపాసనలయందు ఎట్లు? (సమాధానం) అది కూడా అధికృతాధికారం లోనికే చెందినదవడంవల్ల ప్రకృతమైన అపూర్వంతో సంనికర్షను పట్టియే, గోదోహనాది నియమాలలో వలె ఫలం కన్పించడం యుక్తం.

వి. ఆదిత్యాదులను ఉద్గీథాదిదృష్టితో ఉపాసించాలా ఉద్గీథాదులను ఆదిత్యాదిదృష్టితో ఉపాసించాలా అని సంశయం కలిగి నప్పుడు పూర్వపక్షి చెప్పినది కాదని ఉద్గీథాదులనే ఆదిత్యాదిదృష్టితో ఉపాసించాలి అని చెప్పబడింది. అందుకు ఉపపత్తి ఏమనగా - కర్మాంగాలైన ఉద్గీథాదులు, కర్మకు అంగం కాని ఆదిత్యాదులు సంబంధించి ఉన్న ఉపాసనలను చేయడంవల్ల కలిగే ఫలం కర్మ వీర్యవత్తరం అవడం అని చెప్పబడింది. ఉపాసనలు చేయడంవల్ల కర్మాంగాలైన ఉద్గీథాదులందు ఒక విధమైన

అతిశయం కలుగుతుంది. దాని ద్వారా ప్రధానకర్మ వీర్యవత్తరం అవుతుంది. అందుచేత ఈ ఉపాసనలలో ప్రాధాన్యం అంగాలకే ఇవ్వాలి కాని బాహ్యమైన అదిత్యాదులకు ఇవ్వకూడదు. అంగాలు ప్రధానాపూర్వంతో సంబంధించి ఉంటాయి కాని బాహ్యపదార్థాలు సంబంధించి ఉండవు. అందుచేత ఉద్గీథాద్యంగాలను అదిత్యాదిదృష్టితో సంస్కరిస్తే వాటివల్ల కలిగే అంగాపూర్వంలో ఒక అతిశయం కలుగుతుంది. తద్ద్వారా ప్రధానకర్మ సమృద్ధి కలుగుతుంది. అందుచేత ఉద్గీథాదులయందు ఆదిత్యాధిదృష్టి చెయ్యాలి కాని ఆదిత్యాదులందు ఉద్గీథాదిదృష్టి చేయకూడదు.

ఇక్కడ ఒక ప్రశ్న ఉదయిస్తుంది. - ప్రధానకర్మఫలమే ప్రధానకర్మాంగాలైన ఉద్గీథాదుల ఫలం కూడా అవుతుంది గాన పైన చెప్పిన విషయంలో కుదురుతుంది. కాని "లోకేషు పఞ్చవిధం సామోపాస్తే" ఇత్యాదివాక్యాలచేత ఊర్ధ్వలోకప్రాప్త్యాదులు స్వతంత్రమైన ఫలాలుగా విధింపబడ్డాయి. అక్కడ ఈ "అపూర్వసంనికర్షాత్" అనే మాట కుదరదు కదా? దీనికి సమాధాన మేమనగా - కర్మలయందు అధికారం ఎవని కుంటుందో వానికే కర్మాంగాలకు సంబంధించిన ఉపాసనలయందు కూడా అధికారం. అందుచేత వీటికి లోకాదిస్వతంత్రఫలం చెప్పబడినా కూడ ప్రకృతమైన కర్మాపూర్వసంబంధంచేతనే ఫలకల్పన చెయ్యాలి. అనగా స్వతంత్రమైన ఫలం ఉంటూండగా ఇవి ప్రధానాపూర్వానికి అంగమైన అపూర్వం కలిగించడం ద్వారా కర్మాంగా లవుతాయి. ఉదాహరణకి గోదోహనానికి స్వతంత్రమైన ఫలం చెప్పినా కూడ దానికి ఆ ఫలం కలిగించే శక్తి అంగద్వారాపేక్షచేతనే కలుగుతుం దని చెప్పబడి నట్లే ఇక్కడ కూడ అని భావం.

**అవ.** ఇక్కడ ఏ ఒక్కదానికీ ఉత్కర్షనిమిత్తం ఏదీ కనబడడం లేదు అనేదానికి సమాధానం చెపుతున్నారు. **ఫలాత్మకత్వాదితి** :- ఆదిత్యాదులు ఫలాత్మకములు గాన కర్మరూపాలైన ఉద్గీథాదులకంటె ఉత్కర్ష ఉందని చెప్పడం ఉపపన్నమే. శ్రుతులలో ఆదిత్యాదిప్రాప్తిరూపమైన కర్మఫలమే చెప్పబడుచున్నది కదా. (అందుచేత ఉద్గీథాదులయందు ఆదిత్యాదిదృష్టియే యుక్త మని అర్థం) అంతే కాకుండా "ఓమిత్యేత ....**ఉపాసీత**" "**ఖలు....భవతి**" అని ఉపాసింపదగినది ఉద్గీథమే అని ఉపక్రమించి దానిమీద ఆదిత్యాదిదృష్టులను విధిస్తున్నాడు.

## భాష్యమ్

యత్తూక్తమ్ - ఉద్గీథాదిమతిభిరుపాస్యమానా ఆదిత్యాదయః కర్మభూయం భూత్వా ఫలం కరిష్యన్తీతి, తదయుక్తమ్, స్వయమేవ ఉపాసనస్య కర్మత్వాత్ ఫలవత్త్వోపపత్తేః. ఆదిత్యాదిభావేనాపి దృశ్యమానానాముద్గీథాదీనాం కర్మాత్మకత్వానపాయాత్. "తదేతదేతస్యామృచ్యధ్యూఢం సామ' (ఛా.ఉ. 1.6.1) ఇతి తు లాక్షణిక ఏవ పృథివ్యగ్న్యోః ఋక్సామశబ్దప్రయోగః. లక్షణా చ యథాసంభవం సంనికృష్టేన విప్రకృష్టేన వా స్వార్థసంబన్ధేన ప్రవర్తతే. తత్ర యద్యపి ఋక్సామయోః పృథివ్యగ్నిదృష్టిచికీర్షా తథాపి ప్రసిద్ధయోః ఋక్సామయోః భేదేనానుకీర్తనాత్, పృథివ్యగ్న్యోశ్చ సంనిధానాత్ తయోరేవైష ఋక్సామశబ్దప్రయోగః ఋక్సామసంబన్ధాదితి నిశ్చీయతే. క్షత్తృశబ్దోఽపి కుతశ్చిదత్కారణాద్రాజానముపసర్పన్న నివారయితుం పార్యతే. "ఇయమేవర్క్" (ఛా.ఉ. 1.6.1) ఇతి చ యథాక్షరన్యాసమ్ ఋచ ఏవ పృథివీత్వ మవధారయతి. పృథివ్యా హి ఋక్త్వేఽవధార్యమాణే ఇయమ్ ఋగేవేత్యక్షరన్యాసః స్యాత్. "య ఏవం విద్వాన్ సామ గాయతి" (ఛా.ఉ. 1.7.7) ఇతి చాఙ్గాశ్రయమేవ విజ్ఞానము పసంహరతి న పృథివ్యాద్యాశ్రయమ్.

## బాలానందిని

**యదితి** :- ఉద్గీథాదిమతులచేత ఉపాసించబడిన ఆదిత్యాదులు కర్మలుగా అయి ఫలం ఇస్తా రని చెప్పినది యుక్తం కాదు. ఉపాసన తానే కర్మ అవడంచేత అదే ఫలం ఇస్తుంది అని చెప్పడం కుదురుతుంది కదా? ఉద్గీథాదికర్మలను ఆదిత్యాదిరూపంలో చూచినా కూడ అవి కర్మలు కాకపోవు కదా? "తదేతదేతస్యామృచ్యధ్యూఢం సామ" అనే చోట పృథివి, అగ్ని అనే అర్థాలలో ఋక్ - సామశబ్దాల ప్రయోగం లాక్షణికం. లక్షణ, వీలును బట్టి దగ్గరగా ఉన్నా దూరంగా ఉన్నా తన అర్థంతో (మరొకదానికి ఉన్న) సంబంధాన్ని బట్టి ప్రవర్తిస్తుంది. ఋక్సామలయందు పృథివీ - అగ్నుల దృష్టి చేయదలచినా కూడా, (అనగా ఋక్కును పృథివిగాను, సామాన్ని అగ్నిగాను చూడా లని చెప్పదలచినా

కూడ) ఇక్కడ, ప్రసిద్ధాలైన ఋక్సామలను వేరుగా నిర్దేశించడంవల్ల, పృథివ్యగ్నులు దగ్గరగా ఉండడంవల్లా, ఆ రెండింటియందే (పృథివ్యగ్ను లనే అర్థంలోనే) వాటికి ఋక్సామలతో ఉన్న సంబంధాన్ని పట్టి (లక్షణావృత్తిచేత) ఋక్సామశబ్దప్రయోగం చేయబడిం దని నిశ్చయింపబడుతుంది. ఏదైన నిమిత్తంచేత క్షత్తృశబ్దాన్ని కూడా రాజు అనే అర్థంలో ప్రయోగించినా దానిని నివారించడం శక్యం కాదు. (అందుచేత ఋక్‌శబ్దంచేత పృథివిని, సామశబ్దంచేత అగ్నినీ నిర్దేశించి నంతమాత్రంచేత పృథివ్యగ్నులయందు ఋక్సామదృష్టి చెయ్యాలి అని చెప్పవలసిన పని లేదు. ఇది లాక్షణికప్రయోగ మని చెప్పవచ్చును అని భావం). మరొక విషయ మేమనగా - "ఇయమేవర్క్" (ఈ భూమియే ఋక్కు) అని అక్షరన్యాసాన్ని (పదాల పౌర్వాపర్యాన్ని పట్టి) ఋక్కునందే పృథివీత్వాన్ని (ఋక్కును పృథివి అని భావించాలి) అని నిశ్చయిస్తున్నాడు. పృథివిని ఋక్కుగా భావించాలి అని నిర్ణయించవలసి వస్తే "ఇయమ్ ఋగేవ" ( ఈ భూమి ఋక్కే) అని అక్షరన్యాసం ఉండేది. మరియు "య ఏవం విద్వాన్ సామ గాయతి" (ఈ విధంగా తెలుసుకొని ఎవడు సామనుగానం చేస్తాడో) అని ఈ విజ్ఞానం అంగానికి (సామ అనే అంగానికి) సంబంధించినదే అని (అనగా సామనే అగ్నిగా చూడాలని) ఉపసంహరిస్తూన్నది గాని ఇది పృథివ్యాద్యాశ్రయం అని ఉపసంహరించడం లేదు.

## భాష్యమ్

తథా "లోకేషు పఞ్చవిధం సామోపాసీత" (ఛా.ఉ. 2.2.1) ఇతి యద్యపి సప్తమీనిర్ది ష్టా లోకాస్తథాపి సామ్న్యేవ తేఽధ్యస్యేరన్, ద్వితీయానిర్దేశేన సామ్న ఉపాస్యత్వావగమాత్. సామని హి లోకేష్వధ్యస్యమానేషు సామలోకాత్మనోపాసితవ్యం భవతి, అన్యథా పునః లోకాః సామాత్మనోపాసితాః స్యుః. ఏతేన "ఏతద్గాయత్రం ప్రాణేషు ప్రోతమ్" (ఛా. ఉ. 2.11.1) ఇత్యాది వ్యాఖ్యాతమ్. యత్రాపి తుల్యో ద్వితీయానిర్దేశః - "అథ ఖల్వముమాదిత్యం సప్తవిధం సామోపాసీత" (ఛా.ఉ. 2.9.1) ఇతి, తత్రాపి "సమస్తస్య ఖలు సామ్న ఉపాసనం సాధు" (ఛా.ఉ. 2.8.1) "ఇతి తు పఞ్చవిధస్య" (ఛా.ఉ. 2.7.2) "అథ సప్తవిధస్య" (ఛా.ఉ. 2.8.1) ఇతి చ సామ్న ఉపాస్యత్వావగమాత్. పృథివీ

హింకారః' (ఛా.ఉ. 2.2.1) ఇత్యాదినిర్దేశవిపర్యయేఽపి హింకారాదిష్వేవ పృథివ్యాదిదృష్టిః. తస్మాదనఙ్గాశ్రయా ఆదిత్యాదిమతయోఽ ఙ్గేషూద్గీథాదిషు క్షిప్యేరన్నితి సిద్ధమ్. 6

## బాలనందిని

**తథేతి** :- అట్లే - **"లోకేషు పఞ్చవిధం సామోపాసీత"** (లోకాలయందు ఐదు విధాలైన సామను ఉపాసించాలి) అని లోకాలు సప్తమీవిభక్తిచేత నిర్దేశింపబడినా కూడ, (సామోపాసీత - సామను ఉపాసించాలి అని సామశబ్దాన్ని) ద్వితీయావిభక్తిచేత నిర్దేశించడం వల్ల సామయే ఉపాస్యం అని తెలుస్తున్నది గాన సామయందే లోకాలను అధ్యసించాలి. ఎందువల్లననగా సామమీద లోకాలను అధ్యసిస్తేనే లోకరూపంలో సామ ఉపాసించబడుతుంది. అలా కాకపోతే (లోకాలమీద సామను అధ్యసిస్తే) లోకాలే సామరూపంలో ఉపాసించబడేవి అవుతాయి. దీనిచేత **"ఏతద్గాయత్రం ప్రాణేషు ప్రోతమ్"** అనేదానిని గూర్చి కూడా చెప్పినట్లే. (అనగా ప్రాణేషు అని సప్తమీనిర్దేశం ఉన్నా కూడ లోకవాక్యంలో చెప్పినవిధంగా గాయత్రసామమీద ప్రాణత్వాన్ని అధ్యసించి గాయత్రసామనే ఉపాసించా లని చెప్పాలి అని అర్థం) **"అథ......ఉపాసీత"** ఇత్యాదిస్థానాలలో ఎక్కడైతే ద్వితీయానిర్దేశం సమంగానే ఉంటుందో (రెండూ కూడ ద్వితీయలోనే నిర్దేశింపబడతాయో) అక్కడ కూడ **"సమస్తస్య ఖలు సామ్న ఉపాసనం సాధు"** (సమస్తమైన సామ యొక్క ఉపాసనం మంచిది) **"ఇతి పఞ్చవిధస్య"** ( ఈవిధంగా పంచవిధసామోపాసన చెయ్యాలి) **"అథ సప్తవిధస్య"** (ఇప్పుడు సప్తవిధసామయొక్క ఉపాసనం చెప్పబడుతున్నది) అని సామయే ఉపాసింపదగినది అని ఉపక్రమించడంవల్ల సామయందే ఆదిత్యాధ్యాసం చెయ్యాలి. ఈ విధంగా సామయే ఉపాస్యం అని తెలుస్తూండడంవల్ల "పృథివీ హింకారః" ఇద్యాదులలో నిర్దేశంలో మార్పు ఉన్నా కూడ ("హింకారః పృథివీ" అనకుండా విపరీతక్రమంలో "పృథివీ హింకారః" అని అన్నా కూడ) హింకారాదులయందే పృథివీదృష్టి అని చెప్పాలి. అందువల్ల అంగములు కాని ఆదిత్యాదులు ఆశ్రయంగా గల ఆదిత్యాదిమతులు (ఆదిత్యాదిదృష్టులు) అంగములైన (కర్మాంగాలైన) ఉద్గీథాదులయందు ఉంచబడాలి అని సిద్ధించినది. 6

**ఆదిత్యాదిమత్యధికరణం సమాప్తం**

## 6. ఆసీనాధికరణమ్. సూ. 7.10

## సూ. ఆసీనః సంభవాత్ 4.1.7

కర్మాఙ్గసంబద్ధేషు తావదుపాసనేషు కర్మతన్త్రత్వాన్నాసనాదిచిన్తా, నాపి సమ్యగ్దర్శనే, వస్తుతన్త్రత్వాద్విజ్ఞానస్య. ఇతరేషు తూపాసనేషు కిమనియమేన తిష్ఠన్నాసీనః శయానో వా ప్రవర్తేత ఉత నియమేనాసీన ఏవేతి చిన్తయతి. తత్ర మానసత్వాదుపాసనస్య అనియమః శరీరస్థితేరితి. ఏవం ప్రాప్తే బ్రవీతి - ఆసీనఉపాసీతేతి. కుతః? సంభవాత్. ఉపాసనం సమానప్రత్యయప్రవాహ కరణమ్. న చ తద్గచ్ఛతో ధావతో వా సంభవతి. గత్యాదీనాం చిత్తవిక్షేపకరత్వాత్. తిష్ఠతోఽపి దేహధారణే వ్యాపృతం మనః న సూక్ష్మవస్తునిరీక్షణక్షమం భవతి. శయానస్యాప్యకస్మాదేవ నిద్రయాభిభూయతే. అసీనస్య త్వేవం జాతీయకో భూయాన్ దోషః సుపరిహర ఇతి సంభవతి తస్యోపాసనమ్. 7

బాలానందిని

**ఆసీన ఇతి** :- "**ఆసీనః** = కూర్చున్నవాడై ఉపాసనచెయ్యాలి, **సంభవాత్** = అప్పుడే ఉపాసన సంభవం కదా?" అని సూత్రార్థం.

కర్మేతి :- కర్మాంగాలకు సంబంధించిన ఉపాసనలలో ఉపాసన కర్మమీద ఆధారపడి ఉంటుంది గాన ఆసనాన్ని గూర్చిన చింత అవసరం లేదు. సమ్యగ్దర్శనంవిషయంలో కూడ అది వస్తువుమీద ఆధారపడి ఉంటుంది గాన ఆసనచింత అవసరం లేదు. ఇతరమైన ఉపాసనలలో నైతే నియమం లేకుండా నిలబడి యైనా కూర్చుండి యైనా,శయనించి యైనా (ఉపాసన చేయడానికి) ప్రవర్తించాలా లేక తప్పకుండా కూర్చుండే ప్రవర్తించాలా అని విచారించుచున్నాడు. ఉపాసన అనేది మానసం గాన (మనస్సుతో చేసేది గాన) శరీరస్థితి విషయంలో నియమం లేదు. ఇట్లు ప్రాప్తించగా - కూర్చుండే ఉపాసన చెయ్యాలి అని చెపుతున్నాడు. ఎందువల్ల? సంభవంవల్ల. ఉపాస మనగా సమానమైన జ్ఞానాల ప్రవాహాన్ని నడిపించడం. అది నడచుచున్నవానికి గాని, పరుగెత్తుచున్న వానికి గాని సంభవం కాదు. ఎందువల్ల ననగా

గమనాదులు చిత్తవిక్షేపం కలిగిస్తాయి. నిలబడి ఉన్నప్పుడు కూడా మనస్సు దేహాన్ని నిలబెట్టుకొనడంలో వ్యాపృతమై (వ్యాసక్తమై) ఉంటుంది గాన సూక్ష్మవస్తువును చూడజాలదు. శయనించిన వాని మనస్సు కూడ అకస్మాత్తుగా నిద్రచేత ఆక్రమించ బడుతుంది. కూర్చున్నవాని కైతే ఇలాంటి దోషం చాలావరకు అనాయాసంగా పరిహరించడానికి శక్య మవుతుంది గాన వానికి ఉపాసనం సంభవం అవుతుంది. 7.

## సూ. ధ్యానాచ్చ. 4.1.8

అపి చ ధ్యాయత్యర్థ ఏష యత్సమానప్రత్యయప్రవాహకరణమ్. ధ్యాయతిశ్చ ప్రశిథిలాఙ్గచేష్టేషు ప్రతిష్ఠితదృష్టిషు ఏకవిషయాక్షిప్త చిత్తేషూపచర్యమాణో దృశ్యతే "ధ్యాయతి బకో", "ధ్యాయతి ప్రోషితబన్ధుః" ఇతి. ఆసీనశ్చానాయాసో భవతి. తస్మాదప్యాసీనకర్మోపాసనమ్. 8

### బాలానందిని

**ధ్యానాదితి** :- "ధ్యానాచ్చ = ఇది ధ్యానం అవడంవల్ల కూడ కుర్చుని చెయ్యాలి" అని సూత్రార్థం.

**అపిచేతి** :- మరొక విషయ మేమనగా సమానప్రత్యయప్రవాహకరణం అనేది ధ్యా(ధ్యై)ధాతువునకు అర్థం. ధ్యానం అనేది శిథిలశరీరచేష్ట గలవారై దృష్టిని నిలుపుకొని ఒకే విషయంచేత ఆకర్షింపబడిన వాళ్ళ విషయంలో ఉపచరించబడుచున్నది (ఆరోపించబడుచున్నది). ఉదాహరణకి - కొంగ ధ్యానం చేస్తూన్నది, ప్రవాసం వెళ్ళిన బంధువులుగలది ధ్యానిస్తూన్నది, మొదలైనవాటిలో. కూర్చున్నవానికి ఆయాసం ఉండదు. అందుచేత ఉపాసనం కూర్చున్నవాళ్ళు మాత్రమే చేయవలసిన పని. 8

## సూ. అచలత్వం చాపేక్ష్య. 4.1.9

అపి చ "ధ్యాయతీవ పృథివీ" (ఛా.ఉ. 7.6.1) ఇత్యత్ర పృథివ్యాదిష్వచలత్వమపేక్ష్య ధ్యాయతివాదో భవతి. తచ్చ లిఙ్గముపాసనస్యాసీన కర్మత్వే. 9

బాలానందిని

**అచల త్వమితి** :- "అచలత్వమ్= కదలకుండా ఉండడాన్ని, అపేక్ష్య చ = అపేక్షించి ధ్యానశబ్దం ప్రయోగించబడుతున్నది" అని సూత్రార్థం.

**అపి చేతి** :- మరొక విషయ మేమనగా - "**ధ్యాయతీవ పృథివీ**" (పృథివి ధ్యానిస్తున్న ట్లున్నది) అనేచోట పృథివ్యాదులలో ఉన్న అచలత్వాన్ని పట్టి మాత్రమే 'ధ్యాయతి' అని చెప్పబడుచున్నది. ఉపాసన ఆసీనుని కర్మ అనడానికి ఇది కూడ లింగం. 9

## సూ. స్మరన్తి చ. 4.1.10

స్మరన్త్యపి చ శిష్టా ఉపాసనాఙ్గత్వేనాసనమ్ - "**శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః**" (భ.గీ.6.11) ఇత్యాదినా. అతఏవ పద్మకాదీనామాసన విశేషాణాముపదేశో యోగశాస్త్రే. 10

బాలానందిని

స్మరన్తీతి :- "స్మరన్తి చ = స్మృతికారులు కూడా చెపుతున్నారు" అని సూత్రార్థం.

స్మరన్త్యపీతి :- ఆసనం ఉపాసనకు అంగం అని శిష్టులు - "**శుచౌ....ఆత్మనః**" (తనయొక్క ఆసనాన్ని పవిత్రమైన ప్రదేశంలో స్థిరంగా ఉంచుకొని) ఇత్యాదికంచేత చెప్పుచున్నారు. అందువల్లనే యోగశాస్త్రంలో పద్మకం మొదలైన ఆసనాలు చెప్పబడ్డాయి.

**ఆసీనాధికరణం సమాప్తం**

## 7. ఏకాగ్రతాధికరణం సూ. 11

## సూ. యత్రైకాగ్రతా తత్రావిశేషాత్. 4.1.11

దిగ్దేశకాలేషు సంశయః - కిమస్తి కశ్చిన్నియమః నాస్తి వేతి. ప్రాయేణ వైదికేష్వారమ్భేషు దిగాదినియమదర్శనాత్ స్యాదిహాపి కశ్చిన్నియమ ఇతి యస్య మతిస్తం ప్రత్యాహ-దిగ్దేశకాలేష్వర్థలక్షణ ఏవ నియమః. యత్రైవాస్య దిశి కాలే వా మనసః సౌకర్యేణైకాగ్రతా భవతి తత్రైవోపాసీత, ప్రాచీదిక్పూర్వాహ్ణప్రాచీన

ప్రవణాదివద్విశేషాశ్రవణాత్. ఏకాగ్రతాయా ఇష్టాయాః సర్వత్రావిశేషాత్. నను విశేషమపి కేచిదామనన్తి -

**"సమే శుచౌ శర్కరావహ్నివాలుకావివర్జితే శబ్దజలాశ్రయాభిః**

**మనోనుకూలే నతు చక్షుఃపీడనే గుహానివాతాశ్రయణే ప్రయోజయేత్"**

(శ్వే.ఉ. 2.10)

ఇతి యద్వేతి. ఉచ్యతే - సత్యమస్త్యేవంజాతీయకో నియమః. సతి త్వేతస్మింస్తద్గతేషు విశేషేష్వనియమ ఇతి సుహృద్భూత్వాచార్య ఆచష్టే. "మనోనుకూలే" ఇతి చైషా శ్రుతిః యత్రైకాగ్రతా తత్రైత్యేతదేవ దర్శయతి. 11

బాలానందిని

**యత్రేతి :-** "యత్ర= ఎక్కడ, ఏకాగ్రత = ఏకాగ్రత లభిస్తుందో, తత్ర = అక్కడ కూర్చుండి ఉపాసన చెయ్యాలి. అవిశేషాత్ = విశేషం ఏదీ చెప్పబడలేదు గాన" అని సూత్రార్థం.

**దిగితి :-** దిక్కు, దేశం, కాలం - వీటి విషయంలో ఏదైన నియమం ఉన్నదా లేదా అని సంశయం. సాధారణంగా వైదికకర్మలలో దిగాదుల నియమం కనబడడం వల్ల ఇక్కడ కూడ ఏదైన నియమం ఉండవచ్చును అని అనుకొనేవానిని గూర్చి దిగ్దేశ కాలాలవిషయంలో కేవలం ప్రయోజనం మాత్రాన్నే దృష్టిలో ఉంచుకుని (అనగా ఏకాగ్రత ఏ విధంగా కలుగుతుందో ఆవిధంగా) మాత్రమే నియమం అని చెపుతున్నాడు. తూర్పుదిక్కు, పూర్వాహ్ణం, ప్రాచీనప్రవణం (తూర్పుకు పల్లం) ఇత్యాది విశేషాలేవీ వినబడకపోవడంచేత వీనికి ఏ దిక్కునందు ఏ దేశంలో ఏ కాలంలో మనస్సుకు ఏకాగ్రత కుదురుతుందో అక్కడనే ఉపాసన చెయ్యాలి. కావలసిన ఏకాగ్రత ఎక్కడైనా విశేషం ఏదీ లేకుండా కుదరవచ్చును (ప్రశ్న). కొందరు "సమే.....ప్రయోజయేత్" (మెరకపల్లాలు లేక సమంగా ఉన్నది, పరిశుద్ధము, గులకఱాళ్ళు నిప్పు, ఇసుక లేనిది, శబ్దం, జలాశయాదులు (చలిని కలిగించేవి) లేనిది, మనస్సుకు అనుకూలము, నేత్రానికి మశకాదులచేత పీడ కలిగించనిది, అయిన గుహలో గాని, వాయువు అధికంగా లేని

ప్రదేశంలో కాని ఉపాసన నడిపించాలి) అని విశేషం కూడా చెపుతున్నారు కదా! (సమాధానం) చెప్పబడుచున్నది - ఈ విధమైన నియమం ఉన్నమాట నిజమే. ఇలాంటి నియమం ఉంటూండగా వీటికి సంబంధించిన విశేషాల విషయంలో నియమం లేదని ఆచార్యుడు సుహృద్భావంతో చెపుతున్నాడు. "మనోనుకూలే" అని అంటూ శ్రుతి కూడ ఎక్కడ ఏకాగ్రత కుదురుతుందో అక్కడనే అనే విషయాన్నే చూపుతున్నది.

ఏకాగ్రతాధికరణం సమాప్తం

## 8. అప్రాయణాధికరణమ్. సూ. 12

## సూ. ఆప్రాయణాత్తత్రాపి హి దృష్టమ్ 4.1.12

**ఆవృత్తిః** సర్వోపాసనేష్వాదర్తవ్యేతి స్థితమాద్యేఽధికరణే. తత్ర యాని తావత్సమ్యగ్దర్శనాన్యుపాసనాని తాన్యవఘాతాదివత్కార్యపర్యవసానానీతి జ్ఞాతమేవైషామావృత్తిపరిమాణమ్. న హి సమ్యగ్దర్శనే కార్యే నిష్పన్నే యత్నాన్తరం కించిచ్ఛాసితుం శక్యమ్. అనియోజ్యబ్రహ్మాత్మత్వప్రతిపత్తేః శాస్త్రస్యావిషయత్వాత్. యాని పునరభ్యుదయఫలాని తేష్వేషా చిన్తా - కిం కియన్తం చిత్కాలం ప్రత్యయమావర్త్యోపరమేత్ ఉత యావజ్జీవమావర్తయేదితి. కిం తావత్ప్రాప్తమ్? కియన్తం చిత్కాలం ప్రత్యయమభ్యస్యోత్సృజేత్, ఆవృత్తివిశిష్టస్యోపాసనాశబ్దార్థస్య కృతత్వాదితి.

బాలానందిని

**ఆప్రాయణాదితి** :- "ఆప్రాయణాత్ = మరణం వరకు ఉపాసన చెయ్యాలి. తత్రాపి = మరణసమయంలో కూడ, దృష్టం హి = ధ్యేయప్రత్యయాల అనువర్తనం చూడబడింది కదా" అని సూత్రార్థం.

**ఆవృత్తిరితి** :- అన్ని ఉపాసనలలోను కూడ ఆవృత్తి చెయ్యాలి అని మొదటి అధికరణంలో చెప్పబడింది. వాటిలో సమ్యగ్దర్శనంకోసం చేసే ఉపాసనలు, అవఘాతాదుల వలె (బియ్యం కోసం చేసే ధాన్యావఘాతాదుల వలె) కార్యమునందు పర్యవసిస్తాయి గాన, (అనగా సమ్యగ్దర్శనరూపమైన కార్యంలో పర్యవసానం చెందుతాయి

గాన) వాటి అవృత్తి ఎంతవరకు చెయ్యాలి అనేది తెలుస్తూనే ఉంది. కార్యమైన సమ్యగ్దర్శనం కలిగిన తరవాత మరి యొక ప్రయత్నం ఏదీ శాసించడానికి శక్యం కాదు కదా? నియోజ్యం కాని (విధించడానికి శక్యం కాని) బ్రహ్మాత్మత్వజ్ఞానం కలిగిన తరువాత శాస్త్రం చేయకలిగినది ఏదీ లేదు కదా అని అర్థం). ఇంక అభ్యుదయఫలములైన ఉపాసనల విషయంలోనే - ప్రత్యయాన్ని కొంతకాలం పాటు అవర్తింపచేసి నిలిపివేయాలా లేక జీవితాంతం వరకు ఆవర్తనం చేస్తూనే ఉండాలా అని ఈ విచారం చేయబడుచున్నది. ఏమి ప్రాప్తించింది? ప్రత్యయాన్ని కొంత కాలం అవృత్తి చేసి విడిచివెయ్యాలి. ఎందువల్ల ననగా అవృత్తితో కూడిన ఉపాసన శబ్దార్థం (ఉపాసన) చేయబడింది.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః - ఆ ప్రాయణాదేవావర్తయేత్ప్రత్యయమ్, అన్త్యప్రత్యయవశాదదృష్టఫలప్రాప్తేః. కర్మాణ్యపి హి జన్మాన్తరోపభోగ్యం ఫలమారభమణాని తదనురూపం భావనావిజ్ఞానం ప్రాయణకాలే ఆక్షిపన్తి - "సవిజ్ఞానో భవతి సవిజ్ఞానమేవాన్వవక్రామతి" (బృ.ఉ.4.4.2) "యచ్చిత్తస్తేనైష ప్రాణమాయాతి, ప్రాణస్తేజసా యుక్తః సహాత్మనా యథాసంకల్పితం లోకం నయతి" (ప్ర.ఉ. 3.10) ఇతి చైవమాదిశ్రుతిభ్యః, తృణజలూకానిదర్శనాచ్చ. ప్రత్యయాస్త్వేతే స్వరూపానువృత్తిం ముక్త్వా కిమన్యత్ప్రాయణకాలభావి భావనావిజ్ఞానమపేక్షేరన్? తస్మాద్యే ప్రతిపత్తవ్యఫలభావనాత్మకాః ప్రత్యయాస్తేష్వాప్రాయణాదావృత్తిః. తథా చ శ్రుతిః - "స యావత్క్రతురస్మా ల్లోకాత్ప్రైతి" (శ.బ్రా. 10.6.3.1) ఇతి ప్రాయణకాలేఽపి ప్రత్యయానువృత్తిం దర్శయతి. స్మృతిరపి-

"యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేవరమ్,
తం తమేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః" (భ.గీ. 8.6)

ఇతి, "ప్రయాణకాలే మనసాఽచలేన" (భ.గీ. 8.10) ఇతి చ. "సోఽన్తవేలాయామేతత్త్రయం ప్రతిపద్యేత" (ఛా.ఉ. 3.17.6) ఇతి చ

మరణవేలాయామపి కర్తవ్యశేషం శ్రావయతి. 12

## బాలానందిని

**ఏవమితి** :- ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాం - మరణం వరకూ ప్రత్యయాన్ని అవృత్తి చెయ్యాలి. ఎందువల్ల ననగా చివరి ప్రత్యయాన్ని పట్టి అదృష్టఫలం లభిస్తుంది జన్మాంతరంలో అనుభవింపదగిన ఫలాన్ని ప్రారంభిస్తున్న కర్మలు కూడా, మరణసమయంలో తగిన భావనావిజ్ఞానాన్ని (భావనారూపమైన జ్ఞానాన్ని) ఆక్షేపిస్తాయి. (అనగా అలాంటి భావన ఉంటేనే కాని అవి ఫలప్రారంభం చేయజాలవు గాన అలాంటి భావన ఉన్నట్లు తెలుపుతాయి). "సవిజ్ఞానో...అన్వవక్రామతి" (భావనామయమైన విజ్ఞానంతో ఫలస్ఫురణంతో కూడినవాడై. విజ్ఞానంలో స్ఫురిస్తున్న ఫలంతోనే దేహం విడిచి పెడతాడు) అని, "యచ్చిత్తః...నయతి" (ఏ లోకాన్ని గూర్చి చిత్తం (సంకల్పం) కలవాడై ఉంటాడో ఆ సంకల్పించబడిన లోకంతో కూడ ఫలస్ఫూర్తి కలిగిన తరవాత మనస్సు ప్రాణంలో లీనం అవుతుంది. ప్రాణం తేజస్సుతో (ఉదానంతో) కూడి జీవునితో కూడ సంకల్పించబడిన లోకానికి తీసికొని వెడుతుంది) ఇత్యాదిశ్రుతులు ఈ విషయాన్ని చెపుతున్నాయి. తృణజలూకాన్యాయం కూడ చెప్పబడింది. (గడ్డిమీద సంచరించే ఒక జలగవంటి పురుగు అవతలనున్న గడ్డి పరకను ముంగాళ్ళతో పట్టుకొని తరవాత వెనుక నున్న గడ్డిపరకమీద తన పట్టును వదులుతుంది. అట్లే జీవుడు భావనాద్వారా రాబోయే శరీరాన్ని పట్టుకొని ఈ శరీరాన్ని వదులుతాడు అని శ్రుతివాక్యంలో చెప్పబడింది. దీని విషయం వెనుక కూడా వచ్చింది). ఈ ప్రత్యయాలైతే స్వరూపానువృత్తి కాక (అనగా ఆ ప్రత్యయాలు చివరి దాకా కొనసాగడం తప్ప) మరణకాలంలో జరిగే ఇంక ఏ భావనావిజ్ఞానాన్ని అపేక్షిస్తాయి? (అలా స్వరూపానువృత్తియే ప్రాయణకాలంలో జరిగే భావనావిజ్ఞానం అని అర్థం). అందువల్ల పొంద తగిన ఫలంయొక్క భావనయే స్వరూపంగా గల (తాదృశఫలభావనాస్వరూపాలైన) ఏ ప్రత్యయా లున్నాయో వాటియందు ప్రాయణం వరకూ కూడ అవృత్తి చెయ్యాలి. అందుచేతనే - "స యావత్క్రతురస్మాల్లోకాత్ప్రైతి" (ఆ ఉపాసకుడు ఏ సంకల్పంతో ఈలోకం నుండి వెళ్ళిపోతాడో) అను శ్రుతి ప్రాయణకాలంలో కూడ ప్రత్యయావృత్తి ఉంటుం దని సూచిస్తున్నది. "యం యం...భావితః" (ఏ భావాన్ని స్మరిస్తూ అంతమునందు శరీరాన్ని విడుస్తాడో, ఆ భావంచేతనే

సర్వదా భావితుడై దానినే పొందుతాడు) అను స్మృతివాక్యం, "ప్రయాణకాలే మన సాఽచలేన" (మరణకాలంలో నిశ్చలమైన మనస్సుతో) అను స్మృతివాక్యమూ ప్రత్యయానువృత్తిని చూపుతున్నాయి. "సోఽన్తవేలాయామేతత్త్రయం ప్రతిపద్యేత" (ఉపాసకుడు మరణసమయంలో "అక్షితమసి", "అచ్యుతమసి" "ప్రాణసంశితమసి" అనే మంత్రత్రయాన్ని స్మరించాలి) అను శ్రుతి మరణసమయంలో కూడ ఉపాసకుడు చేయవలసినది ఉంది అని చెప్పుచున్నది. (దీనిని పట్టి ప్రత్యయావృత్తి చివరిదాకా జరగాలి అని సూచించబడుచున్న దని భావం.

ఏకాగ్రతాధికరణం సమాప్తం.

## 9. తదధిగమాధికరణమ్. సూ. 13

### సూ. తదధిగమ ఉత్తరపూర్వాఘయోరశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్. 4.1.13

గతస్తృతీయశేషః. అథేదానీం బ్రహ్మవిద్యాఫలం ప్రతి చిన్తా ప్రతాయతే. బ్రహ్మాధిగమే సతి తద్విపరీతఫలం దురితం క్షీయతే న క్షీయతే వేతి సంశయః. కిం తావత్ప్రాప్తమ్? ఫలార్థత్వాత్కర్మణః ఫలమదత్త్వా న సంభావ్యతే క్షయః. ఫలదాయినీ హ్యస్య శక్తిః శ్రుత్యా సమధిగతా. యది తరన్తరేణైవ ఫలోపభోగమపమృజ్యేత శ్రుతిః కదర్థితా స్యాత్. స్మరన్తి చ "న హి కర్మాణి క్షీయన్తే" "(న హి కర్మ క్షీయతే" గౌ. ధ.సూ. 19.5 ఇతి గౌతమధర్మసూత్రగతః పాఠః బ్రహ్మవిద్యాభరణసహితే భాష్యే ఉద్ధృతః). నన్వేవం సతి ప్రాయశ్చిత్తోపదేశోఽనర్థకః ప్రాప్నోతి. నైష దోషః - ప్రాయశ్చిత్తానాం నైమిత్తికత్వోపపత్తేః, గృహదాహేష్ట్యాదివత్. అపి చ ప్రాయశ్చిత్తానాం దోషసంయోగేన విధానాత్ భవేదపి దోషక్షపణార్థతా, న త్వేవం బ్రహ్మవిద్యాయాం విధానమస్తి. నన్వనభ్యుపగమ్యమానే బ్రహ్మవిదః కర్మక్షయే తత్ఫలస్యావశ్యం భోక్తవ్యత్వాదనిర్మోక్షప్రసంగః. నేత్యుచ్యతే. దేశకాలనిమిత్తాపేక్షో మోక్షః కర్మఫలవద్భవిష్యతి. తస్మాన్న బ్రహ్మవిద్యాధిగమే దురితనివృత్తిరితి.

బాలానందిని

**తదితి** :- "తదధిగమాత్ = బ్రహ్మను పొందడంవలన, ఉత్తరపూర్వాఘయోః = బ్రహ్మజ్ఞానం తరవాత చేసిన, అంతకు ముందు చేసిన పాపాల యొక్క, అశ్లేషవినాశౌ = అంటకపోవడము, నశించడమూ (వరుసగా) జరుగుతాయి. తద్వ్యపదేశాత్ = ఆ విధంగా చెప్పడం వలన" అని సూత్రార్థం.

**గత ఇతి** :- తృతీయాధ్యాయశేషం (దాని శేష మైన సాధనవిచారం) పూర్తియైనది. ఇప్పు డింక బ్రహ్మవిద్యాఫలాన్ని గూర్చి చింత ప్రవర్తింపజేయబడుచున్నది. బ్రహ్మ సాక్షాత్కారం కలిగిన తరవాత దానికి విపరీతమైన పాపం క్షీణిస్తుందా క్షీణించదా అని సంశయం. ఏమి ప్రాప్తించినది? కర్మ ఫలార్థం గాన (ఫలం ఇవ్వడం కోసం చేయబడుతుంది గాన) ఫలం ఇవ్వకుండా దాని క్షయం సంభావ్యం కాదు. దీనికి ఫలం ఇచ్చే శక్తి ఉన్నదని శ్రుతిచేత తెలుస్తూన్నది గదా? అది ఫలభోగం లేకుండానే తుడిచిపెట్టుకొని పోతే శ్రుతి బాధితమవుతుంది. "న హి కర్మ క్షీయతే" (కర్మ క్షీణించదు) అని స్మరిస్తున్నారు (స్మృతికారులు చెపుతున్నారు) కదా? (ప్రశ్న) - అట్లైతే (కర్మ నశించకపోతే) ప్రాయశ్చిత్తం చెప్పడం వ్యర్థ మయిపోతుంది. (సమాధానం) ఈ దోషం లేదు. గృహదాహేష్టి వలె (అహితాగ్ని ఇల్లు దగ్ధమైతే చెప్పబడిన ఇష్టివలె) ప్రాయశ్చిత్తాలు నైమిత్తికా లని (ఏదో నిమిత్తాన్ని పురస్కరించుకొని విధించబడ్డా యని) చెప్పడం కుదురుతుంది. (అనగా ప్రాయశ్చిత్తం చేస్తే పాపం పోతుం దని కాదు. పాపం అనే నిమిత్తం కలిగి నప్పుడు ఫలానా కర్మ చెయ్యాలి అని మాత్రమే, గృహదాహనిమిత్తంచేత ఇష్టి విధించి నట్లు విధించబడుతుంది. దాని ఫలం తరవాత మరొక టేదో ఉండవచ్చును అని భావం)

అవ. పాపం చేసినందుకు ప్రాయశ్చిత్తం విధించబడినప్పుడు ఆ పాపకర్మ నశించడమే ఈ ప్రాయశ్చిత్తానికి ఫలం అని చెప్పడం న్యాయంగాని దాని కేదో మరొక ఫలం కలుగుతుందని చెప్పడం న్యాయం కాదు కదా అని అశంకించుకొని **అపిచేత్యాది** వాక్యంచేత మరొక సమాధానం చెపుతున్నాడు. ప్రాయశ్చిత్తాలు దోషసంయోగంచేత విధించబడ్డాయి గాన అవి దోషాన్ని పోగొట్టేవైతే కావచ్చును. కాని బ్రహ్మవిద్య విధించబడలేదు. (ప్రశ్న) బ్రహ్మవేత్తకు కర్మక్షయం అంగీకరించకపోతే ఆ కర్మల ఫలం

తప్పకుండా అనుభవించాలి గాన మోక్షం రాకుండా పోతుంది. (సమాధానం) - అట్లు కాదంటాం. మోక్షం, కర్మఫలం వలె, దేశ - కాలనిమిత్తాలను పట్టి (ఏ నాటికో) కలుగుతుంది. అందువల్ల బ్రహ్మవిద్య పొందినా కూడ పాపనివృత్తి లేదు.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః -తదధిగమే బ్రహ్మాధిగమే సతి ఉత్తరపూర్వయో రఘయోరశ్లేషవినాశౌ భవతః, ఉత్తరస్యాశ్లేషః, పూర్వస్య వినాశః, కస్మాత్? తద్వ్యపదేశాత్. తథా హి బ్రహ్మవిద్యాప్రక్రియాయాం సంభావ్యమానసంబన్ధ స్యాగామినో దురితస్యానభిసంబన్ధం విదుషో వ్యపదిశతి- **"యథా పుష్కరపలాశ ఆపో న శ్లిష్యన్త ఏవమేవంవిది పాపం కర్మ న శ్లిష్యతే"** (ఛా.ఉ. 4.1.4.2) ఇతి. తథా వినాశమపి పూర్వోపచితస్య దురితస్య వ్యపదిశతి- **"తద్యథేషీకాతూలమగ్నౌ ప్రోతం ప్రదూయేతైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయన్తే"** (ఛా.ఉ. 5.23.3) ఇతి. అయమపరః కర్మక్షయవ్యపదేశో భవతి -

**"భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః,**
**క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే"** (ము. ఉ. 2.2.8)

ఇతి. యదుక్తమనుపభుక్తఫలస్య కర్మణః క్షయకల్పనాయాం శాస్త్రం కదర్థితం స్యాదితి, నైష దోషః. న హి వయం కర్మణః ఫలదాయినీం శక్తిమవజానీమహే, విద్యత ఏవ సా. సా తు విద్యాదినా కారణాన్తరేణ ప్రతిబధ్యత ఇతి వదామః. శక్తిసద్భావే చ శాస్త్రం వ్యాప్రియతే, న ప్రతిబన్ధాప్రతిబన్ధయోరపి. **"న హి కర్మ క్షీయతే"** ఇత్యేతదపి స్మరణమౌత్సర్గికమ్, న హి భోగాదృతే కర్మ క్షీయతే, తదర్థత్వాత్ ఇతి. ఇష్యత ఏవ తు ప్రాయశ్చిత్తాదినా దురితస్య క్షయః - **"సర్వం పాప్మానం తరతి", "తరతి బ్రహ్మహత్యాం యోఽశ్వమేధేన యజతే య ఉ చైనమేవం వేద"** ఇత్యాదిశ్రుతిస్మృతిభ్యః.

బాలానందిని

**ఏవమితి** :- ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాము. తదధిగమే = బ్రహ్మజ్ఞానం కలిగినదగుచుండగా, రాబోయేవి, వెనుకటివి అయిన పాపాల, అశ్లేషవినాశాలు జరుగుతాయి. రాబోయేదాని అశ్లేషం (అంటకపోవడం) పూర్వపాపంయొక్క వినాశం జరుగుతాయి ఎందువల్ల? అట్లు చెప్పడంవల్ల. అదెట్లనగా - బ్రహ్మవిద్యాప్రక్రియలో **"యథా....శ్లిష్యతే"** (తామరాకుమీద నీళ్ళు అంట నట్లు బ్రహ్మవేత్తయందు పాపం అంటదు) అనే వాక్యం దేనితో సంబంధం కలగవచ్చు నని అనుకుంటారో అట్టి రాబోయే పాపం విద్వాంసుణ్ణి అంటదు అని చెప్పుచున్నది. అట్లే అంతవరకు ప్రోగుపడి ఉన్న దురితం నశిస్తుం దని కూడా - **"తద్యథైషీకా...ప్రదూయన్తే"** (అగ్నిలో పడవేసిన ఇషీకయొక్క దూది ఏ విధంగా మాడిపోతుందో అట్లే పాపా లన్నీ మాడిపోతాయి) అనే వాక్యం చెపుతున్నది. **"భిద్యతే....పరావరే"** అని కర్మక్షయాన్ని చెప్పే మరొక వాక్యం కూడా ఉంది. ఫలం అనుభవించకుండానే కర్మ క్షీణిస్తుం దని చెపితే శాస్త్రం బాధితమవుతుంది అని ఏది చెప్పబడిందో ఆ దోషం లేదు. కర్మలో ఉన్న, ఫలాన్ని ఇచ్చే శక్తిని మేం అవమానించడంలేదు (నిరాకరించడం లేదు). దాని కా శక్తి ఉండనే ఉంది. కాని అది విద్య మొదలైన కారణాంతరంచేత ప్రతిబద్ధం అవుతుంది అని మాత్రమే మేం అంటున్నాం. శక్తి ఉంది అని చెప్పడం వరకే శాస్త్రం పని, ఆ శక్తికి ప్రతిబంధకం ఉంటుంది, ఉండదు అని చెప్పడం దాని పని కాదు. కర్మయొక్క ప్రయోజనం ఫలభోగం గాన భోగం లేకుండా కర్మ క్షీణించదు అనే అభిప్రాయంతో చెప్పిన **"న హి కర్మ క్షీయతే"** అనే స్మృతి కూడ సామాన్యశాస్త్రమే. **"తరతి పాప్మానమ్"** (పాపాన్ని దాటతాడు) **"తరతి....వేద"** (ఎవడు అశ్వమేధయాగం చేస్తాడో, దానిని గూర్చి తెలుసుకుంటాడో అతడు బ్రహ్మహత్యాపాపాన్ని దాటతాడు) ఇత్యాది శ్రుతిస్మృతుల ననుసరించి ప్రాయశ్చిత్తాదులచేత దురితక్షయం తప్పక అంగీకరింపబడుతుంది.

భాష్యమ్

యత్తూక్తమ్ - నైమిత్తికాని ప్రాయశ్చిత్తాని భవిష్యన్తీతి, తదసత్. దోషసంయోగేన చోద్యమానానామేషాం దోషనిర్ఘాతఫలసంభవే ఫలాన్తరకల్పనానుపపత్తేః. యత్పున రేతదుక్తం న ప్రాయశ్చిత్తవద్దోషక్షయోద్దేశేన

విద్యావిధానమస్తీతి. అత్ర బ్రూమః- సగుణాసు తావద్విద్యాసు విద్యత ఏవ విధానమ్, తాసు చ వాక్యశేషే ఐశ్వర్యప్రాప్తిః పాపనివృత్తిశ్చ విద్యావత ఉచ్యతే, తయోశ్చావివక్షాకారణం నాస్తీత్యతః పాప్మప్రహాణపూర్వకైశ్వర్యప్రాప్తిస్తాసాం ఫలమితి నిశ్చీయతే. నిర్గుణాయాం తువిద్యాయాం యద్యపి విధానం నాస్తి తథాప్య కర్త్రాత్మత్వబోధాత్కర్మప్రదాహసిద్ధిః. అశ్లేష ఇతి చాగామిషు కర్మసు కర్తృత్వమేవ న ప్రతిపద్యతే బ్రహ్మవిదితి దర్శయతి. అతిక్రాన్తేషు తు యద్యపి మిథ్యాజ్ఞానాత్కర్తృత్వం ప్రతిపేద ఇవ తథాపి విద్యాసామర్థ్యాన్మిథ్యాజ్ఞాననివృత్తే స్తాన్యపి ప్రవిలీయన్త ఇత్యాహ- **వినాశ ఇతి.** పూర్వప్రసిద్ధకర్తృత్వభోక్తృత్వ స్వరూపవిపరీతం హి త్రిష్వపి కాలేష్వకర్తృత్వాభోక్తృత్వస్వరూపం బ్రహ్మాహమస్మి నేతః పూర్వమపి కర్తా భోక్తా వాహమాసం, నేదానీం, నాపి భవిష్యత్కాల ఇతి బ్రహ్మవిదవగచ్ఛతి. ఏవమేవ చ మోక్ష ఉపపద్యతే. అన్యథా హ్యనాదికాల ప్రవృత్తానాం కర్మణాం క్షయాభావః స్యాత్. న చ దేశకాలనిమిత్తాపేక్షో మోక్షః కర్మఫలవద్భవితుమర్హతి, అనిత్యత్వప్రసంగాత్. పరోక్షత్వానుపపత్తేశ్చ జ్ఞానఫలస్య. తస్మాద్బ్రహ్మాధిగమే దురితక్షయ ఇతి స్థితమ్. 13

బాలానందిని

**యత్తూక్తమితి :-** ప్రాయశ్చిత్తాలు నైమిత్తికా లవుతాయి అని చెప్పడం అయుక్తం. దోషంతో సంయోగంచేత (ఈ దోషం జరిగితే ఇది చెయ్యాలి అని) విధించబడిన వీటికి ఆ దోషాన్ని తొలగించడం అనే ఫలం సంభవిస్తూండగా మరొక ఫల మేదో కల్పించడం అనుపపన్నం. దోషక్షయాన్ని ఉద్దేశించి ప్రాయశ్చిత్తాలు విధించి నట్లు దోషక్షయాన్ని ఉద్దేశించి బ్రహ్మవిద్య విధింపబడలేదు అని ఏది చెప్పబడిందో దీని విషయంలో చెపుతున్నాం- సగుణవిద్యలో నైతే (దోషక్షయాన్ని ఉద్దేశించి) విధానం ఉంది. ఎందువల్ల ననగా వాటిలో విద్యావంతునికి ఐశ్వర్యం పాపనివృత్తి కూడ కలుగుతాయని వాక్యశేషంలో ఉంది. ఆ చెప్పిన రెండింటినీ అవివక్షితము లని చెప్పడానికి (ఉద్దిష్టములు కావు అని అనడానికి) కారణం ఏదీ లేకపోవడంవల్ల వాటికి పాపవినాశపూర్వకమైన ఐశ్వర్యప్రాప్తి

ఫలం అని నిశ్చయించబడుతుంది. నిర్గుణవిద్యలో అలాంటి విధి ఏదీ లేకపోయినా అకర్త్రాత్మత్వంయొక్క బోధవల్ల (కర్తృత్వం లేని ఆత్మను నేను అని తెలుసుకొనడంవల్ల) కర్మల దాహం సిద్ధిస్తుంది. 'అశ్లేషః' అని అంటూ (సూత్రకారుడు), బ్రహ్మవేత్త రాబోయే కర్మలలో కర్తృత్వాన్నే చూడడు అని చెపుతున్నాడు. గడచిన కర్మల విషయంలో నైతే అతడు మిథ్యాజ్ఞానం నివర్తించడంవల్ల ఆ కర్మలు కూడా విలీనము లై పోతాయి అని 'వినాశః' అని అంటున్నాడు. బ్రహ్మవేత్త పూర్వం ప్రసిద్ధమైన (ఉన్న) కర్తృత్వభోక్తృత్వస్వరూపానికి విరుద్ధంగా మూడు కాలాలలోనూ కూడ అకర్తృత్వాభోక్తృత్వస్వరూపమైన బ్రహ్మను నేను, నేను ఇంతకు పూర్వం కూడా కర్తగా గాని భోక్తగా గాని ఉండి ఉండలేదు, ఇప్పుడూ నేను, భవిష్యత్తులో కూడ అలా ఉండను అని గ్రహిస్తాడు. ఈ విధంగా చెపితేనే మోక్షం కుదురుతుంది. అలా కాకపోతే అనాదికాలంనుండి ప్రవర్తిస్తూన్న కర్మలకు క్షయం లేకపోతే మోక్షమే లేకుండా పోతుంది. కర్మఫలం వలె మోక్షం దేశ-కాల-నిమిత్తాలను పట్టి కలిగేది కాదు. అప్పుడది అనిత్యం అయిపోతుంది. జ్ఞానఫలం పరోక్షం అనడం కూడా అనుపపన్నం (అనగా జ్ఞానం కలిగిన వెంటనే మోక్షం రావలసిందే. దేశకాలాదులకోసం వేచి యుండే ప్రసక్తి లేదు). అందువల్ల బ్రహ్మజ్ఞానం కలిగినప్పుడు పాపక్షయం కలుగుతుం దనే మాట స్థిరం. 13

తదధిగమాధికరణం సమాప్తం

## 10. ఇతరాసంశ్లేషాధికరణమ్ 14

### సూ. ఇతరస్యాప్యేవమసంశ్లేషః పాతే తు 4.1.14

పూర్వస్మిన్నధికరణే బన్ధహేతోరఘస్య స్వాభావికస్యాశ్లేషవినాశౌ జ్ఞాననిమిత్తౌ శాస్త్రవ్యపదేశాన్నిరూపితౌ. ధర్మస్య పునః శాస్త్రీయత్వాత్ శాస్త్రీయేణ జ్ఞానేన అవిరోధ ఇత్యాశఙ్క్య తన్నిరాకరణాయ పూర్వాధికరణన్యాయాతిదేశః క్రియతే- ఇతరస్యాపి పుణ్యస్య కర్మణ ఏవమఘువదసంశ్లేషో వినాశశ్చ జ్ఞానవతో భవతః. కుతః? తస్యాపి స్వఫలహేతుత్వేన జ్ఞానఫలప్రతిబన్ధిత్వాత్. "ఉభే ఉ హైవైష తరతి" (బృ.ఉ. 4.4.22) ఇత్యాదిశ్రుతిషు చ దుష్కృతవత్ సుకృతస్యాపి ప్రణాశవ్యపదేశాత్. అకర్త్రాత్మత్వనిమిత్తస్య చ కర్మక్షయస్య సుకృతదుష్కృతయోస్తుల్యత్వాత్, "క్షీయన్తే చాస్య కర్మాణి" (ము.ఉ. 2.2.8)

ఇతి చావిశేషశ్రుతేః. యత్రాపి కేవల ఏవ పాప్మశబ్దో దృశ్యతే తత్రాపి తేనైవ పుణ్యమప్యాకలితమితి ద్రష్టవ్యమ్, జ్ఞానఫలాపేక్షయా నికృష్టఫలత్వాత్. అస్తి చ శ్రుతౌ పుణ్యేఽపి పాప్మశబ్దః "నైనం సేతుమహోరాత్రే తరతః" (ఛా.ఉ. 8.4.1) ఇత్యత్ర సహ దుష్కృతేన సుకృతమప్యనుక్రమ్య "సర్వే పాప్మానోఽతో నివర్తన్తే" ఇత్యవిశేషేణైవ ప్రకృతే పుణ్యే పాప్మశబ్దప్రయోగాత్. పాతేత్వితి తుశబ్దోఽవధారణార్థః. ఏవం ధర్మాధర్మయోర్బన్ధహేత్వోర్విద్యాసామర్థ్యాదశ్లేష వినాశసిద్ధేరవశ్యంభావినీ విదుషః శరీరపాతే ముక్తిరిత్యవధారయతి. 14.

### బాలానందిని

**ఇతరస్యేతి :-** "ఇతరస్యాపి = పుణ్యంయొక్క కూడ, ఏవమ్ = ఈ విధంగానే, అసంశ్లేషః = సంశ్లేషం ఉండదు. పాతే = శరీరపాతానంతరం, తు = తప్పకమోక్షం లభిస్తుంది" అని సూత్రార్థం.

**పూర్వస్మిన్నితి :-** జ్ఞానం కలగడంచేత, బంధహేతులైన స్వాభావికమైన పాపం యొక్క సంశ్లేషం ఉండదు, అది నశిస్తుంది అని శాస్త్రోదాహరణపూర్వకంగా వెనుకటి అధికరణంలో చెప్పబడింది. అయితే, ధర్మం శాస్త్రవిహిత మైనది గాన దానికి శాస్త్రవిహితమైన జ్ఞానంతో విరోధం ఉండకూడదు అని ఆశంకించుకొని దానిని నిరాకరించడం కోసం పూర్వాధికరణన్యాయం అదేశించబడుచున్నది. పాపంయొక్క వలె, ఇతరస్యాపి = పుణ్యకర్మయొక్క కూడ జ్ఞానవంతునితో సంబంధం లేకపోవడమూ, వినాశమూ కలుగుతాయి. (పాపం వలెనే పుణ్యం కూడా జ్ఞానికి అంటదు. అది నశించిపోతుంది). ఎందువల్ల? పుణ్యకర్మ కూడా తన ఫలానికి హేతువు గాన జ్ఞానఫలాన్ని ప్రతిబంధింపచేసే అవకాశం ఉంది. "**ఉభే ఉ హైవైష ఏతే తరతి**" ఇత్యాదిశ్రుతులు దుష్కృతం వలె సుకృతం కూడా నశిస్తుం దని చెపుతున్నాయి. "నేను కర్తృత్వం లేని ఆత్మను" అనే బోధవల్ల కలిగే కర్మక్షయం సుకృతదుష్కృతాల రెండింటి విషయంలోనూ తుల్యమే. "**క్షీయన్తే చాస్య కర్మాణి**" అను శ్రుతి కూడ అవిశేషం చెపుతున్నది. (కర్మాణి అని సామాన్యంగానే చెపుతూ అన్ని కర్మలూ నశిస్తా యని అంటున్నది). కేవలం 'పాప్మ' శబ్దం మాత్రమే ఉన్నచోట్ల కూడ, ఆ శబ్దంచేతనే పుణ్యం కూడ గ్రహింపబడి నట్లు చూచుకోవాలి.

జ్ఞానఫలంకంటె పుణ్యఫలం నికృష్టమైనది కదా? "నైనం సేతుమహోరాత్రే తరతః" అనే చోట దుష్కృతంతో సుకృతాన్ని కూడా ప్రస్తావించి "సర్వే పాప్మానోఽతో నివర్తన్తే" (అన్ని పాపాలు (పుణ్యాలు కూడ) వీని నుండి వెనుకకు మరలుతాయి) అని విశేషం ఏదీ లేకుండా ప్రకృతమైన పుణ్యం విషయంలో పాపశబ్దాన్ని ప్రయోగించడంవల్ల పుణ్యం అనే అర్థంలో కూడ పాపశబ్దప్రయోగం శ్రుతిలో ఉంది. "**పాతే తు**" అన్నచోట '**తు**' శబ్దం నిశ్చయార్థకం (తప్పక అనే అర్థాన్ని బోధిస్తుంది). విద్యాసామర్థ్యంవల్ల ఈ విధంగా ధర్మాధర్మాల అశ్లేష- వినాశాలు సిద్ధిస్తాయి గాన విద్వాంసునకు శరీరపాతం కలగగానే ముక్తి తప్పక కలుగుతుంది అని నిర్ధారణ చేస్తున్నాడు. 14

**ఇతరాసంశ్లేషాధికరణం సమాప్తం**

## 11. అనారబ్ధాధికరణమ్. సూ. 15

### సూ. అనారబ్ధకార్యే ఏవ తు పూర్వే తదవధేః. 4.1.15

పూర్వయోరధికరణయోః జ్ఞాననిమిత్తః సుకృతదుష్కృతయోర్వినాశః అవధారితః. స కిమవిశేషేణారబ్ధకార్యయోరనారబ్ధకార్యయోశ్చ భవత్యుత విశేషేణానారబ్ధకార్యయోరేవేతి విచార్యతే. తత్ర "**ఉభే ఉ హైవైష ఏతే తరతి**" (బృ.ఉ. 4.4.22) ఇత్యేవమాదిశ్రుతిష్వవిశేషశ్రవణాత్ అవిశేషేణైవ క్షయ ఇతి. ఏవం ప్రాప్తే ప్రత్యాహ - **అనారబ్ధకార్యే ఏవత్వితి**: అప్రవృత్తఫలే ఏవ పూర్వే జన్మాన్తరసంచితే అస్మిన్నపి చ జన్మని ప్రాగ్ జ్ఞానోత్పత్తేః సంచితే సుకృతదుష్కృతే జ్ఞానాధిగమాత్ క్షీయేతే, న త్వారబ్ధకార్యే సామిభుక్తఫలే యాభ్యామేతద్బ్రహ్మ జ్ఞానాయతనం జన్మ నిర్మితమ్. కుత ఏతత్? "**తస్య తావదేవచిరం యావన్న విమోక్ష్యేఽథ సంపత్స్యే**"(ఛా.ఉ.6.14.2)ఇతి శరీరపాతావధికరణాత్ క్షేమప్రాప్తేః. ఇతరథా హి జ్ఞానాదశేషకర్మక్షయే సతి స్థితిహేత్వభావాత్ జ్ఞానప్రాప్త్యనన్తరమేవ క్షేమమశ్నువీత. తత్ర శరీరపాతప్రతీక్షాం నాచక్షీత. నను వస్తుబలేనైవాయమకర్త్రాత్మావబోధః కర్మాణి క్షపయన్ కథం కాని చిత్ క్షపయేత్

కాని చిచ్చేపేక్షేత? న హి సమానేఽగ్నిబీజసంపర్కే కేషాం చిద్బీజశక్తిః క్షీయతే కేషాంచిన్న క్షీయంత ఇతి శక్యమఙ్గీకర్తుమితి. ఉచ్యతే-న తావదనాశ్రిత్యారబ్ధకార్యం కర్మాశయం జ్ఞానోత్పత్తిరుపపద్యతే. ఆశ్రితే చ తస్మిన్ కులాలచక్రవత్ ప్రవృత్తవేగస్యాన్తరాలే ప్రతిబన్ధానంబవాద్భవతి వేగక్షయప్రతిపాలనమ్. అకర్త్రాత్మబోధోఽపి హి మిథ్యాజ్ఞానబోధనేన కర్మాణ్యుచ్ఛినత్తి, బాధితమపి తు మిథ్యాజ్ఞానం ద్విచన్ద్రజ్ఞానవత్ సంస్కారవశాత్కం చిత్కాలమనువర్తత ఏవ. అపి చ నైవాత్రవివదితవ్యం బ్రహ్మవిదా కం చిత్కాలం శరీరం ధ్రియతే న వా ధ్రియత ఇతి. కథం హ్యేకస్య స్వహృదయప్రత్యయం బ్రహ్మవేదనం దేహధారణం చాపరేణ ప్రతిక్షేప్తుం శక్యేత. శ్రుతిస్మృతిషు చ స్థితప్రజ్ఞలక్షణనిర్దేశేనైతదేవ నిరుచ్యతే. తస్మాదనారబ్ధకార్యయోరేవ సుకృతదుష్కృతయోర్విద్యాసామర్థ్యాత్ క్షయ ఇతి నిర్ణయః. 15

### బాలానందిని

**అనారబ్ధేతి :-** "పూర్వే = పూర్వకర్మలు, అనారబ్ధఫలే ఏవ తు = ఆరంభించబడని ఫలం కలవి మాత్రమే నశిస్తాయి. తదవధేః = శరీరపాతం అవధిగా చెప్పడంవల్ల" అని సూత్రార్థం.

**పూర్వయోరితి :-** జ్ఞానంవల్ల సుకృతదుష్కృతాలు నశిస్తా యని వెనుకటి రెండు అధికరణాలలో నిర్ణయింపబడింది. ఆ వినాశం విశేషం ఏదీ లేకుండా తమ కార్యం ప్రారంభించిన కర్మలకూ, ఆరంభించని కర్మలకూ జరుగుతుందా లేక విశేషించి తమ కార్యం ప్రారంభించని కర్మలకే జరుగుతుందా అని విచారించబడుచున్నది. "ఉభే ఉ హైవైష ఏతే తరతి" ఇత్యాదిశ్రుతులయందు విశేషమేమీ వినబడకపోవడంచేత విశేషం లేకుండానే (రెండు విధాల కర్మలూ) క్షీణిస్తాయి. ఇట్లు ప్రాప్తించగా సమాధానం చెపుతున్నాడు. కార్యం ప్రారంభించని కర్మలు మాత్రమే క్షీణిస్తాయి. జన్మాంతరాలలో సంచిత మైనవి, ఈ జన్మలోనే జ్ఞానోత్పత్తికి పూర్వం సంచితము లైనవి అయిన కర్మలు

ఫలం ఇవ్వడానికి ప్రారంభించకుండా ఉన్నప్పుడే జ్ఞానం పొందడంవల్ల క్షీణిస్తాయి. అంతేనే కాని ఏ కర్మలచేత బ్రహ్మజ్ఞానానికి స్థానమైన ఈ జన్మ నిర్మింపబడిందో అట్టి, కార్యం ప్రారంభించి, సంగం అనుభవించబడిన ఫలం కలవి మాత్రం క్షీణించవు. ఇది ఎందువల్ల? "తస్య...సంపత్స్యే" అని క్షేమప్రాప్తికి (మోక్షప్రాప్తికి) శరీరపాతం అవధి అని చెప్పడంవల్ల. అలా కాకపోతే జ్ఞానంవల్ల అశేషకర్మలు క్షీణించగా దేహం నిలబడడానికి హేతువు లేకపోవడంచేత జ్ఞానం ప్రాప్తించిన వెంటనే మోక్షం పొందాలి. అలాం టప్పుడు (శ్రుతి) శరీరపాతం వరకు నిరీక్షించా లని చెప్పి ఉండేది కాదు. (ప్రశ్న) కర్తృత్వం లేని ఆత్మయొక్క ఈ జ్ఞానం వస్తుబలంచేతనే కర్మలను నశింపచేస్తే, కొన్నింటిని మాత్రమే ఎలా నశింపచేస్తుంది కొన్నింటిని ఎలా ఉపేక్షిస్తుంది? విత్తనా లన్నింటికీ అగ్నిసంపర్కం సమంగా జరిగి నప్పుడు కొన్నింటి బీజశక్తి నశిస్తుంది, కొన్నింటిది నశించదు అని అంగీకరిచడం శక్యం కాదు కదా? (సమాధానం) చెప్పబడుచున్నది - కార్యాన్ని (ఫలం ఇవ్వడాన్ని) ప్రారంభించిన కర్మాశయాన్ని ఆశ్రయించకుండా జ్ఞానోత్పత్తి కుదరదు. (అనగా ఒక కర్మ తన ఫలం ఇవ్వడానికి ప్రారంభిస్తేనే కాని జ్ఞానోత్పత్తి కలగదు) అది (కర్మ) ఆశ్రయించబడిన దగుచుండగా, కుమ్మరి చక్రం వలె ప్రవర్తించిన వేగం గల దానికి మధ్య ప్రతిబంధం సంభవం కాదు గాన దాని వేగం క్షీణించేవరకు నిరీక్షించడం జరుగుతుంది. అకర్త్రాత్మబోధ కూడా మిథ్యాజ్ఞానాన్ని బాధించడంచేత కర్మలను పెకిలించివేస్తుంది. మిథ్యాజ్ఞానం బాధించబడినా కూడ ద్విచంద్రజ్ఞానం వలె సంస్కారవశంచేత, కొంతకాలం అనువర్తిస్తూనే ఉంటుంది. బ్రహ్మవేత్త కొంత కాలం శరీరాన్ని ధరిస్తాడా ధరించడా (జీవన్ముక్తుడుగా ఉంటాడా ఉండడా) అని వివాదం చేయవలసిన పని లేదు. ఒకని హృదయానికి ప్రత్యక్షంగా గోచరిస్తూన్న బ్రహ్మజ్ఞానము, దేహధారణమూ అనే వాటిని ఇతరుడు ఎలా నిరాకరించకలుగుతాడు? (ఈ వాక్యంలో శ్రీశంకరభగవత్పాదులు తమ జీవన్ముక్తస్థితిని సూచిస్తున్నారు). మరొక విషయ మేమనగా - శ్రుతిస్మృతులలో స్థితప్రజ్ఞుని లక్షణాలను నిర్దేశించడంచేత ఇదే నిర్వచింపబడుచున్నది. అందుచేత తమ పని ప్రారంభించని సుకృతదుష్కృతములు మాత్రమే విద్యాసామర్థ్యం చేత క్షీణిస్తాయి అని నిర్ణయం..15

**అనారబ్ధాధికరణం సమాప్తం**

## 12. అగ్నిహోత్రాద్యధికరణమ్. సూ. 16-17

## సూ. అగ్నిహోత్రాది తు తత్కార్యాయైవ తద్దర్శనాత్. 4.1.16

పుణ్యస్యాప్యశ్లేషవినాశయోరఘున్యాయోఽతిదిష్టః. సోఽతిదేశః సర్వపుణ్యవిషయ ఇత్యాశఙ్క్య ప్రతివక్తి - **అగ్నిహోత్రాది త్వితి.** తు శబ్ద ఆశఙ్కామపనుదతి. యన్నిత్యం కర్మ వైదికమగ్నిహోత్రాది తత్తత్కార్యాయైవ భవతి, జ్ఞానస్య యత్కార్యం తదేవాస్యాపి కార్యమిత్యర్థః. కుతః? **"తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన"** (బృ.ఉ. 4.4.22) ఇత్యాదిదర్శనాత్. నను జ్ఞానకర్మణోర్విలక్షణకార్యత్వాత్కార్యైకత్వానుపపత్తిః? నైష దోషః జ్వరమరణకార్యయోరపి దధివిషయోః గుడమన్త్రసంయుక్తయోః తృప్తిపుష్టికార్యదర్శనాత్. తద్వత్కర్మణోఽపి జ్ఞానసంయుక్తస్య మోక్షకార్యోపపత్తేః. నన్వనారభ్యో మోక్షః, కథమస్య కర్మకార్యత్వముచ్యతే? నైష దోషః. ఆరాదుపకారకత్వాత్కర్మణః. జ్ఞానస్యైవ హి ప్రాపకం సత్కర్మ ప్రణాడ్యా మోక్షకారణమిత్యుపచర్యతే. అత ఏవ చాతిక్రాన్తవిషయమేతత్కార్యైకత్వాభిధానమ్. న హి బ్రహ్మవిదః ఆగామ్యగ్నిహోత్రాది సంభవతి. అనియోజ్యబ్రహ్మాత్మత్వప్రతిపత్తేః శాస్త్రస్యావిషయత్వాత్. సగుణాసు తు విద్యాసు కర్తృత్వానివృత్తేః సంభవత్యాగామ్యప్యగ్నిహోత్రాది. తస్యాపి నిరభిసంధినః కార్యాన్తరాభావాత్ విద్యాసంగత్యుపపత్తిః. 16

### బాలానందిని

**అగ్నిహోత్రాదీతి :-** "అగ్నిహోత్రాది తు = అగ్నిహోత్రాదికమైతే, తత్కార్యాయైవ = జ్ఞానమునకు ఏది కార్యమో ఆ కార్యమును పుట్టించడంకొరకే, తద్దర్శనాత్ = ఆ విధంగా (శ్రుతిలో) చూడడంవల్ల" అని సూత్రార్థం.

**పుణ్యస్యేతి :-** పుణ్యంయొక్క అశ్లేషవినాశాల విషయంలో అఘన్యాయం చెప్పబడింది. (అఘం ఎట్లు అంటదో, నశిస్తుందో అట్లే పుణ్యము కూడా అని చెప్పబడింది).

ఆ అతిదేశం సమస్తపుణ్యాల విషయంలో వర్తిస్తుంది అని ఆశంకించి "అగ్నిహోత్రాది తు" అని సమాధానం చెపుతున్నాడు. తు శబ్దం ఆశంకను తొలగిస్తుంది. నిత్యమైన అగ్నిహోత్రాదివైదికకర్మ తత్కార్యంకొరకే అవుతుంది. జ్ఞానానికి ఏది కార్యమో అదే దీనికి కూడా కార్యం అని అర్థం. ఎందువల్ల. "తమేతం....దానేన" ఇత్యాదిశ్రుతులు కనబడడంవల్ల (ప్రశ్న) జ్ఞానకర్మలు విలక్షణమైన కార్యములు కలవి గాన వాటికి ఒకే కార్యం ఉండడం అనుపపన్నం కదా? (సమాధానం) ఈ దోషం లేదు. పెరుగు, విషం ఇవి జ్వరము మరణం అనే కార్యాలను కలిగించే వయినా అవి బెల్లంతోను మంత్రంతోను సంయుక్తములైనప్పుడు తృప్తి, పుష్టి అనే కార్యాలు చేయడం కనబడుతున్నది కదా? అట్లే కర్మ కూడ జ్ఞానంతో సంయుక్తమైనప్పుడు మోక్షం అనే కార్యం ఇవ్వడం ఉపపన్నమే. (ప్రశ్న) మోక్షం అనారభ్యం (పుట్టించదగినది కాదు) కదా? అలాం టప్పుడు ఇది కర్మకార్యం అని ఎలా చెప్పబడుతుంది? (సమాధానం) - ఈ దోషం లేదు. కర్మ ఆరాదుపకారకం (దూరంనుండి ఉపకరిస్తుంది). కర్మ జ్ఞానాన్ని మాత్రమే పుట్టించే దయినా ప్రణాడీచేత (పరంపరచేత) మోక్షకారణం అని ఉపచారంచేత (లాక్షణికంగా) చెప్పబడుచున్నది. అందుచేతనే కర్మకు కార్యైకత్వం ఉంది అని ఈ చెప్పడం గడచిన (అనగా జ్ఞానోదయానికి పూర్వం చేయబడిన) కర్మను గూర్చి మాత్రమే. బ్రహ్మవేత్తకు ఆగామియైన (జ్ఞానోదయానంతరం కూడా చేయదగిన) అగ్నిహోత్రాదికర్మ ఉండదు కదా. అనియోజ్యమైన (విధింప శక్యంకాని) బ్రహ్మాత్మత్వప్రతిపత్తి శాస్త్రానికి విషయం కాదు కదా? (శాస్త్రంచేత కలిగేది కాదు కదా). సగుణవిద్యలలో నైతే కర్తృత్వం నివర్తించదు గాన ఆగామియైన అగ్నిహోత్రాదాదికం కూడ సంభవిస్తుంది. నిరభిసంధియైన (ఫలాపేక్ష లేని) ఆ కర్మకు కూడ మరొక కార్యం ఏదీ లేకపోవడంచేత విద్యతో సంబంధం కుదురుతుంది.16

## భాష్యమ్

కింవిషయం పునరిదమశ్లేషవినాశవచనం, కింవిషయం వాదో వినియోగవచనమేకేషాం శాఖినాం "తస్య పుత్రా దాయముపయన్తి, సుహృదః సాధుకృత్యాం, ద్విషన్తః పాపకృత్యామ్" ఇతి? అత ఉత్తరం పఠతి -

## సూ. అతోఽన్యాపి హ్యేకేషాముభయోః. 4.1-17

అతోగ్నిహోత్రాదేర్నిత్యాత్కర్మణః అన్యాపి హ్యస్తి సాధుకృత్యా యా ఫలమభిసన్ధాయ క్రియతే. తస్యా ఏష వినియోగ ఉక్త ఏకేషాం శాఖినాం - "సుహృదః సాధుకృత్యాముపయన్తి" ఇతి. తస్యా ఏవ చేదమఘవద శ్లేషవినాశనిరూపణమితరస్యాప్యేవమవిశ్లేష ఇతి. ఏవంజాతీయకస్య కామ్యస్య కర్మణో విద్యాం ప్రత్యనుపకారకత్వే సంప్రతిపత్తిరుభయోరపి జైమిని బాదరాయణయోరాచార్యయోః. 17.

### బాలానందిని

**కింవిషయమితి :-** (ఇక్కడ చెప్పిన) ఈ అశ్లేషవినాశవచనం ఏ కర్మలను గూర్చి చెప్పినది? "తస్య పుత్రాః....పాపకృత్యామ్" అని కొందరు శాఖులు చెప్పిన వినియోగవచనం (వాళ్ళ మిత్రులను శత్రువులను చేరుతుంది అనేది) ఏ కర్మల విషయంలో చెప్పబడింది? దీనికి సమాధానం చెపుతున్నాడు.

**అత ఇతి :-** "అతః = ఈ అగ్నిహోత్రాదినిత్యకర్మకంటె, అన్యాపి హి = వేరైన కామ్యకర్మ కూడా ఉంది కదా? అది, ఏకేషామ్ = కొందరి మతం ప్రకారం, ఉభయోః = శత్రుమిత్రులకు సంక్రమిస్తుంది" అని సూత్రార్థం.

**అత ఇతి :-** ఈ అగ్నిహోత్రాదినిత్యకర్మకంటె భిన్నమైన, ఫలాభిసంధితో చేసే సాధుకృత్య (పుణ్యకర్మ) ఉంది కదా? దానికే కొన్ని శాఖలకు చెందినవారు "సుహృదః సాధుకృత్యామ్" అని వినియోగం చెప్పినారు. ఆ సాధుకృత్య కూడ పాపం వలె అంటదు, నశిస్తుంది అని "ఇతరస్యాప్యేవమసంశ్లేషః" అనే సూత్రంలో చెప్పబడింది. ఈ విధమైన కామ్యకర్మ విద్వాంసులకు ఉపకరించదు అనే విషయంలో ఆచార్యులైన జైమినిబాదరాయణులకు ఐకమత్యమే. 17

అగ్నిహోత్రాద్యధికరణం సమాప్తం

## 13. విద్యాజ్ఞానసాధనాధికరణమ్. సూ. 18

## సూ. యదేవ విద్యయేతి హి. 4.1.18

ననమధిగతమేతదనన్తరాధికరణే నిత్యాగ్నిహోత్రాదికం కర్మ ముముక్షుణా మోక్షప్రయోజనోద్దేశేన కృతముపాత్తదురితక్షయహేతుత్వద్వారేణ సత్త్వశుద్ధికారణతాం ప్రతిపద్యమానం మోక్షప్రయోజనబ్రహ్మాధిగమననిమిత్తత్వేన బ్రహ్మవిద్యయా సహైకకార్యం భవతీతి. తత్రాగ్నిహోత్రాది కర్మాఙ్గవ్యపాశ్రయ విద్యాసంయుక్తం కేవలం చాస్తి "య ఏవం విద్వాన్ యజతి" 'య ఏవం విద్వాన్ జుహోతి", "య ఏవం విద్వాన్ శంసతి" "య ఏవం విద్వానుద్గాయతి" "తస్మాదేవంవిదమేవ బ్రహ్మాణం కుర్వీత నానేవంవిదమ్" (ఛా.ఉ. 4.17.10), "తేనోభౌ కురుతో యశ్చైతదేవం వేద యశ్చ న వేద" (ఛా.ఉ. 1.1.10) ఇత్యాదివచనేభ్యో విద్యాసంయుక్తమస్తి, కేవలమప్యస్తి. తత్రేదం విచార్యతే - కిం విద్యాసంయుక్తమేవాగ్నిహోత్రాదికం కర్మ ముముక్షోర్విద్యాహేతుత్వేన తయా సహైకకార్యత్వం ప్రతిపద్యతే, న కేవలమ్, ఉత విద్యాసంయుక్తం కేవలం చావిశేషేణేతి. కుతః సంశయః? "తమేతమాత్మానం యజ్ఞేన వివిదిషన్తి" ఇతి యజ్ఞాదీనామవిశేషేణాత్మవేదనాఙ్గత్వేన శ్రవణాత్. విద్యాసంయుక్తస్య చాగ్నిహోత్రాదేర్విశిష్టత్వావగమాత్. కిం తావత్ప్రాప్తమ్? విద్యాసంయుక్తమేవ కర్మాగ్నిహోత్రాది ఆత్మవిద్యాశేషత్వం ప్రతిపద్యతే న విద్యాహీనమ్, విద్యోపేతస్య విశిష్టత్వావగమాద్విద్యావిహీనాత్. "యదహరేవ జుహోతి తదహః పునర్మృత్యుమపజయత్యేవం విద్వాన్" ఇత్యాదిశ్రుతిభ్యః. "బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబన్ధం ప్రహాస్యసి" (భ.గీ.2.39) "దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ" (భ.గీ.2.49) ఇత్యాదిస్మృతిభ్యశ్చేతి.

### బాలానందిని

**యదేవేతి** :- "యదేవ విద్యయా ఇతి = "యదేవ విద్యయా" ఇత్యాదివాక్యం, హి

= విద్యాసహితమైన కర్మ వీర్యవత్తర మని మాత్రమే చెప్పుచున్నది కదా" అని సూత్రార్థం.

నునమధిగతమితి :- అనంతరాధికరణంలో (దీని వెనుకనే ఉన్న అధికరణంలో) మోక్షం అనే ప్రయోజనాన్ని ఉద్దేశించి ముముక్షువు చేసిన నిత్యాగ్నిహోత్రాదికమైన కర్మ కూడ బెట్టుకొని ఉన్న దురితాల క్షయానికి హేతువు అవడం ద్వారా అంతఃకరణశుద్ధికి కారణమై మోక్షం అనే ప్రయోజనం గల బ్రహ్మవిద్యను పొందడానికి నిమిత్తంగా అయి బ్రహ్మవిద్యతో కూడ ఏకకార్యం అవుతుంది అని స్పష్టంగా తెలియబడింది. అయితే అగ్నిహోత్రాదికర్మ దాని అంగాలకు సంబంధించిన విద్యతో (ఉపాసనతో) సంయుక్త మైనది, కేవలమూ (సంయుక్తం కానిదీ కూడా) ఉంది. "య ఏవం విద్వాన్ యజతి" (ఎవడు ఈ విధంగా తెలుసుకొంటూ - ఉపాసిస్తూ - యాగం చేస్తాడో) "య ఏవం విద్వాన్ జుహోతి", "య ఏవం విద్వాన్ శంసతి" "య ఏవం విద్వానుద్గాయతి", "తస్మాదేవం...అనేవంవిదమ్" (అందువల్ల దీనిని తెలుసుకొన్నవానినే బ్రహ్మగా చెయ్యాలి. అలా ఎరుగనివానిని చేయకూడదు) "తేన... న వేద" ఇత్యాదివచనాలవల్ల విద్యాసంయుక్త మైనదీ ఉంది, కేవలమూ ఉంది. అక్కడ - విద్యాసంయుక్తమైన అగ్నిహోత్రాదికర్మయే ముముక్షువునకు విద్యాహేతు వవడంచేత దానితో ఏకకార్యత్వాన్ని పొందుతుంది కాని కేవలమైనది పొందదు అని చెప్పాలా, లేక విశేషం ఏమీ లేకుండా విద్యాసంయుక్తమూ, కేవలమూ కూడ ఏకకార్యత్వాన్ని పొందుతుందా అని సంశయం. సంశయం ఎందువల్ల? ఎందువల్ల ననగా "తమేతమాత్మానం యజ్ఞేన వివిదిషన్తి" అని విశేషం ఏదీ లేకుండా యజ్ఞాదులు వేదనాంగా లని వినబడడంవల్ల, విద్యాసంయుక్త మైన అగ్నిహోత్రాదికం విశిష్ట మైనది అని వినబడడంవల్ల. ఏమి ప్రాప్తించినది? విద్యాసంయుక్త మైన అగ్నిహోత్రాదికర్మయే ఆత్మవిద్యకు అంగం అవుతుంది గాని విద్యాహీనమైనది కాదు. ఎందువల్ల ననగా విద్యాహీనునికంటె విద్య కలవాడు విశిష్టు డని "యదహరేవ....విద్వాన్" (ఏ విధంగా తెలుసుకొన్నవాడు ఏ రోజునైతే హోమం చేస్తాడో ఆ రోజునందే మృత్యువును జయిస్తాడు) ఇత్యాదిశ్రుతులవల్ల తెలుస్తున్నది. ఈ విషయమే "బుద్ధ్యా...ప్రహాస్యసి" (పార్థా! ఏ బుద్ధితో కూడినవాడవై కర్మబంధాన్ని విడుస్తావో), "దూరేణ....ధనంజయ" (అర్జునా! బుద్ధియోగంకంటె కర్మ చాల తక్కువది) ఇత్యాదిస్మృతివాక్యాలు కూడా చెపుతున్నాయి.

## భాష్యమ్

ఏవం ప్రాప్తేఽభిధీయతే - యదేవ విద్యయేతి హి. సత్యమేతత్ - విద్యాసంయుక్తం కర్మాగ్నిహోత్రాదికం విద్యావిహీనాత్కర్మణోఽగ్నిహోత్రాద్విశిష్టమ్, విద్వానివ బ్రాహ్మణో విద్యావిహీనాద్బ్రాహ్మణాత్. తథాపి నాత్యన్తమనపేక్షం విద్యావిహీనం కర్మాగ్నిహోత్రాదికమ్. కస్మాత్! "తమేతమాత్మానం యజ్ఞేన వివిదిషన్తి" ఇత్యవిశేషేణాగ్నిహోత్రాదేర్విద్యాహేతుత్వేన శ్రుతత్వాత్. నను విద్యాసంయుక్తస్యాగ్నిహోత్రాదేః విద్యావిహీనాద్విశిష్టత్వావగమాద్విద్యావిహీనమగ్నిహోత్రాద్యాత్మవిద్యాహేతుత్వేనానపేక్షమేవేత్యుక్తమ్. నైతదేవమ్. విద్యాసహాయస్యాగ్నిహోత్రాదేర్విద్యానిమిత్తేన సామర్థ్యాతిశయేన యోగాదాత్మజ్ఞానం ప్రతి కశ్చిత్కారణత్వాతిశయో భవిష్యతి న తథా విద్యావిహీనస్యేతి యుక్తం కల్పయితుమ్; న తు "యజ్ఞేన వివిదిషన్తి"ఇత్యత్రావిశేషేణాత్మజ్ఞానాఙ్గత్వేన శ్రుతస్యాగ్నిహోత్రాదేరనఙ్గత్వం శక్యమభ్యుపగన్తుమ్. తథాహి శ్రుతిః - "యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి" (ఛా. ఉ. 1.1.10) ఇతి విద్యాసంయుక్తస్య కర్మణః అగ్నిహోత్రాదేర్వీర్యవత్తరత్వాభిధానేన స్వకార్యం ప్రతి వీర్యవత్త్వం దర్శయతి. కర్మణశ్చ వీర్యవత్త్వం తత్ యత్ స్వప్రయోజనసాధనప్రసహత్వమ్. తస్మాద్విద్యాసంయుక్తం నిత్యమగ్నిహోత్రాది విద్యావిహీనం చోభయమపి ముముక్షుణా మోక్షప్రయోజనోద్దేశేనేహ జన్మని జన్మాన్తరే చ ప్రాగ్ జ్ఞానోత్పత్తేః కృతంయత్తద్యథాసామర్థ్యం బ్రహ్మాధిగమప్రతిబన్ధకారణోపాత్తదురితక్షయ హేతుద్వారేణ బ్రహ్మాధిగమకారణత్వం ప్రతిపద్యమానం శ్రవణమననశ్రద్ధాధ్యానతాత్పర్యాద్యన్తరఙ్గకారణాపేక్షం బ్రహ్మవిద్యయా సహైకకార్యం భవతీతి స్థితమ్. 18

## బాలానందిని

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా - "యదేవ విద్యయేతి హి" అని

ప్రతిపాదించబడుచున్నది. విద్యాసంయుక్త మైన అగ్నిహోత్రాదికర్మ విద్యావిహీన మైన అగ్నిహోత్రాదికర్మకంటె, విద్వాంసుడైన బ్రాహ్మణుడు విద్యావిహీనుడైన బ్రాహ్మణునికంటె విశిష్టు డైనట్లు, విశిష్ట మైనది అనే మాట నిజమే. అయినా కూడ విద్యావిహీనమైన కర్మ పూర్తిగా అనపేక్షం (అవసరం కానిది) కాదు. ఎందువల్ల? "తమేతమ్....వివిదిషన్తి" అని విశేషం ఏమీ లేకుండా అగ్నిహోత్రాదికం విద్యకు హేతు వని వినబడడంవల్ల. (ప్రశ్న) విద్యాసంయుక్త మైన అగ్నిహోత్రాదికం విద్యావిహీనమైనదానికంటె విశిష్టమైన దని తెలియడంచేత విద్యావిహీనమైన అగ్నిహోత్రాదికం ఆత్మవిద్యకు హేతువుగా అపేక్షితం కాదని చెప్పడమే యుక్తం కదా? (సమాధానం) ఇది ఇట్లు కాదు. విద్యాసహితమైన అగ్నిహోత్రాదికం, విద్యవల్ల కలిగిన సామర్థ్యాతిశయంతో కూడి ఉండడంవల్ల ఆత్మజ్ఞానాన్ని గూర్చి దానిలో ఒక విధమైన కారణత్వాతిశయం (విశిష్టమైన కారణత్వం) కలుగుతుంది. విద్యావిహీనమైనదానికి అలాంటి అతిశయం కలగదు అని మాత్రమే కల్పించడానికి శక్యం అవుతుంది కాని, "యజ్ఞేన వివిదిషన్తి" అనే వాక్యంలో ఏ విశేషమూ లేకుండా ఆత్మజ్ఞానానికి అంగం అవుతుం దని వినబడిన అగ్నిహోత్రాదికం అసలు అంగమే కాదు (ఆత్మవిద్యాప్రాప్తికి అంగమే కాదు) అని చెప్పడంశక్యం కాదు. అందుచేతనే - "యదేవ....భవతి" అను శ్రుతి విద్యాసంయుక్త మైన అగ్నిహోత్రాదికర్మ వీర్యవత్తరం అని చెపుతూ దాని కార్యం విషయంలో దాని కొక అతిశయం ఉంటుం దని చెపుతూ విద్యావిహీనమైన అదే ఆ ప్రయోజనం విషయంలో వీర్యవత్ అని చూపుచున్నది. ('తర' ప్రత్యయం చేర్చి విద్యాసహితమైన కర్మ వీర్యవత్తరం - ఎక్కువ వీర్యం కలది - అని చెప్పడంచేత, విద్య లేనిది వీర్యవత్తరం కాదు కాని వీర్యవత్తే, అనగా వీర్యం కలదే అని చెప్పినట్లయింది అని భావం). కర్మ వీర్యవత్ అనగా అర్థం అది తన ప్రయోజనాన్ని సాధించే శక్తి కలది అని. అందువల్ల విద్యాసంయుక్త మైన నిత్యమైన అగ్నిహోత్రాదికము, విద్యావిహీన మైన అగ్నిహోత్రాదికము, ఏదైతే మోక్షం అనే ప్రయోజనాన్ని ఉద్దేశించి ముముక్షువుచేత ఈ జన్మలోనూ, జన్మాంతరంలోనూ ఆచరించబడిందో ఆ ఉభయమూ కూడ, సామర్థ్యానుసారంగా బ్రహ్మజ్ఞానానికి ప్రతిబంధంగా ఉన్న నిల్వ ఉన్న దురితాల క్షయానికి హేతు వయి బ్రహ్మాధిగమానికి కారణం అవుతూ, శ్రవణం, మననం, శ్రద్ధ, ధ్యానం, తాత్పర్యం (తదేకాగ్రచిత్తం) మొదలైన అంతరంగకారణాల సాహాయ్యంతో

బ్రహ్మవిద్యతో కూడ ఏకకార్యం (ఒకే మోక్షరూప ఫలాన్ని సాధించేది) అవుతుంది అని నిర్ణయింపబడినది.

వి. బ్రహ్మవిద్య మోక్షం ఇస్తుంది. అగ్నిహోత్రాదినిత్యకర్మజాతం బ్రహ్మవిద్యను కలిగించడం ద్వారా మోక్షసాధనం అవుతుంది. అయితే బ్రహ్మవిద్యను కలిగించడానికి కూడ ఈ యజ్ఞాదికం బహిరంగసాధనమే. దానికంటె ప్రధానమైన అంతరంగసాధనం (దగ్గరిదైన సాధనం) శ్రవణ - మనన - శ్రద్ధా - ధ్యాన - తాత్పర్యాదికం అని పై వాక్యంలో సూచించబడింది. 18

విద్యాజ్ఞానసాధనాధికరణం సమాప్తం

## 14. ఇతరక్షపణాధికరణమ్. సూ. 19

### సూ. భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే. 4.1.19

అనారబ్ధకార్యయోః పుణ్యపాపయోర్విద్యాసామర్థ్యాత్ క్షయ ఉక్తః. ఇతరే త్వారబ్ధకార్యే పుణ్యపాపే ఉపభోగేన క్షపయిత్వా బ్రహ్మ సంపద్యతే- **"తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ సంపత్స్యే"** (ఛా.ఉ. 6.14.2) ఇతి, **"బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి"** ఇతి చైవమాదిశ్రుతిభ్యః. నను సత్యపి బ్రహ్మదర్శనే యథా ప్రాగ్దేహపాతాద్భేదదర్శనం ద్విచన్ద్రన్యాయేనానువృత్తమ్ ఏవం పశ్చాదప్యనువర్తేత. న. నిమిత్తాభావాత్. ఉపభోగశేషక్షపణం హి తత్రాను వృత్తినిమిత్తం, న చ తాదృశమత్ర కించిదస్తి. నన్వపరః కర్మాశయోఽభినవ ముపభోగమారప్స్యతే? న. తస్య దగ్ధబీజత్వాత్. మిథ్యాజ్ఞానావష్టమ్భం హి కర్మాన్తరం దేహపాతే ఉపభోగాన్తరమారభతే, తచ్చ మిథ్యాజ్ఞానం సమ్యగ్జ్ఞానేన దగ్ధమిత్యతః సాధ్వేతదారబ్ధకర్మక్షయే విదుషః కైవల్యమవశ్యం భవతీతి. 19

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య - శ్రీగోవిన్దభగవత్పూజ్యపాద శిష్యశ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌ శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యే చతుర్థాధ్యాయస్య ప్రథమః పాదః.

బాలానందిని

భోగేనేతి :- "ఇతరే తు = తమ ఫలాన్ని ఇవ్వడానికి ప్రారంభించిన పుణ్యపాపముల నైతే, భోగేన = భోగం చేత, క్షపయిత్వా = నశింపచేసి, సంపద్యతే = బ్రహ్మగా అవుతాడు" అని సూత్రార్థం

అనారబ్ధేతి :- తమ కార్యాన్ని ప్రారంభించని పుణ్యపాపాలు విద్యాసామర్థ్యంచేత క్షీణిస్తాయి అని చెప్పబడింది. ఇతరే తు = కార్యం ప్రారంభించిన పుణ్యపాపాల నైతే భోగంచేత క్షీణింపచేసి - "తస్య ... సంపత్స్యే" "బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" ఇత్యాది శ్రుతులలో చెప్పినట్లు, బ్రహ్మగా అవుతాడు. (ప్రశ్న) - సమ్యగ్దర్శనం కలిగినా కూడ దేహపతనానికి ముందు భేదర్శనం ద్విచంద్రర్శనన్యాయంచేత ఏ విధంగా అనువర్తిస్తుందో అట్లే తరువాత కూడ అనువర్తించవచ్చును కదా? (సమాధానం) అనువర్తించదు. అందుకు నిమిత్తం లేదు. భేదదర్శనం అనువర్తించడానికి నిమిత్తం మిగిలిన భోగాన్ని పూర్తి చేయడమే కదా? ఇక్కడ (దేహపాతానంతరం) అలాంటి నిమిత్తం ఏదీ లేదు. (ప్రశ్న) మరొక కర్మాశయం (కర్మ) క్రొత్త భోగాన్ని ప్రారంభిస్తుంది. (సమాధానం) ప్రారంభించదు. దాని బీజం దగ్ధం అయిపోయింది కదా! దేహపాతానంతరం మరొక కర్మ మిథ్యాజ్ఞానాన్ని ఊతగా తీసికొని మరొక ఉపభోగాన్ని ప్రారంభించాలి. కాని సమ్యగ్జ్ఞానంచేత మిథ్యాజ్ఞానం కాల్చివేయబడింది గాన (ఫలం ఇవ్వడానికి ప్రారంభించిన కర్మచేత) ప్రారంభించబడిన కార్యం క్షీణించగానే విద్వాంసునికి తప్పక కైవల్యం కలుగుతుంది అని చెప్పడం సాధువే (యుక్తమే) . 19

"బాలానందిని" అను శ్రీమచ్ఛారీరకభాష్యాంధ్రవ్యాఖ్యానంలో

చతుర్థాధ్యాయంలో ప్రథమపాదం సమాప్తం.

## అథ చతుర్థాధ్యాయే ద్వితీయః పాదః

(అత్ర పాదే ఉత్క్రాన్తిగతినిరూపణమ్)

## వాగధికరణమ్. సూ. 1-2

### సూ. వాఙ్మనసి దర్శనాచ్ఛబ్దాచ్చ. 4.2.1

అథాపరాసు విద్యాసు ఫలప్రాప్తయే దేవయానం పన్థానమవతారయిష్యన్ ప్రథమం తావద్యథాశాస్త్రముత్క్రాన్తిక్రమమన్వాచష్టే. సమానా హి విద్వదవిదుషోరుత్క్రాన్తిరితి వక్ష్యతి. అస్తి ప్రాయణవిషయా శ్రుతిః - "అస్య సోమ్య పురుషస్య ప్రియతో వాఙ్మనసి సంపద్యతే మనః ప్రాణే ప్రాణస్తేజసి తేజః పరస్యాం దేవతాయామ్" (ఛా.ఉ. 6.8.6) ఇతి. కిమిహ వాచ ఏవ వృత్తిమత్యాః మనసి సంపత్తిరుచ్యతే ఉత వాగ్వృత్తేరితి సంశయః. తత్ర వాగేవ తావన్మనసి సంపద్యతే ఇతి ప్రాప్తమ్. తథా హి శ్రుతిరనుగృహీతా భవతి. ఇతరథా లక్షణా స్యాత్. శ్రుతిలక్షణావిషయే చ శ్రుతిర్న్యాయ్యా న లక్షణా. తస్మాద్వాచ ఏవాయం మనసి ప్రలయ ఇతి.

#### బాలానందిని

**వాగితి :-** "వాక్ = వాక్కు, మనసి = మనస్సునందు లీనమవుతుంది. దర్శనాత్ = అలా చూడడంవల్ల, శబ్దాచ్చ = వృత్తికీ వృత్తిమత్తుకు అభేదోపచారంచేత శబ్దప్రయోగం వల్ల" అని సూత్రార్థం.

**అథేతి :-** ఇప్పుడు అపరవిద్యలలో ఫలప్రాప్తికై దేవయానమార్గాన్ని చెప్పబోతూ ముందుగా, శాస్త్రానుసారం ఉత్క్రాంతిక్రమాన్ని (జీవుడు శరీరం విడచి వెళ్లే క్రమాన్ని) చెప్తున్నాడు. జ్ఞానికి జ్ఞాని కానివానికీ కూడా ఉత్క్రాంతి సమానమే అని చెప్పబోతున్నాడు. ప్రాయణం (మరణం) విషయంలో "అస్య....దేవతాయామ్" (సోమ్యుడా! పురుషుడు శరీరం విడిచే టప్పుడు వాక్కు మనస్సులో కలుస్తుంది. మనస్సు ప్రాణంలో కలుస్తుంది. ప్రాణం తేజస్సులో కలుస్తుంది. తేజస్సు పరదేవతలో కలుస్తుంది) అనే శ్రుతి ఉంది. ఇక్కడ వృత్తి (మాటలాడడం అనే వ్యాపారం) గల వాగింద్రియం మనస్సులో సంపన్నం అవుతుందని చెప్పబడుచున్నదా లేక వాగ్వ్యాపారం మాత్రమే సంపన్నం అవుతుందని చెప్పబడుతున్నదా అని సంశయం. వాక్కే (వాగింద్రియమే) మనస్సులో సంపన్నం అవుతుం

దని ప్రాప్తించినది. అలా చెప్పితేనే శ్రుతి (శబ్దం) అనుగ్రహింపబడినట్లు (దాని కీయవలసిన ప్రాధాన్యం ఇచ్చినట్లు) అవుతుంది. అలా కాకపోతే లక్షణను చేబట్టవలసివస్తుంది. శ్రుతిని (స్పష్టంగా చెప్పిన ముఖ్యార్థాన్ని) గ్రహించాలా లక్షణను గ్రహించాలా అని సంశయం కలిగి నప్పుడు శ్రుతియే న్యాయ్యం కాని లక్షణ న్యాయ్యం కాదు. అందుచేత వాగింద్రియమే మనస్సులో ప్రలయం పొందుతుంది.

వి. జ్ఞానఫలం చెప్పిన తరవాత బ్రహ్మలోకంలో అనుభవింపదగిన ఉపాసనాఫలం చెప్పవలసి ఉంది. బ్రహ్మలోకం అర్చిరాదిమార్గాల ద్వారా చేరాలి. ఆ మార్గంలో ప్రవేశించా లంటే ముందు ఈ శరీరం విడిచి బైటకు రావాలి. అందుచేత ఉపాసనాఫలంచేత ఉత్క్రాంతి ఆక్షిప్తం అవుతుంది గాన ఈ సంక్రాంతిపాదం ఈ అధ్యాయంలో సంగతమవుతుంది.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః - వాగ్వృత్తిర్మనసి సంపద్యత ఇతి. కథం వాగ్వృత్తిరితి వ్యాఖ్యాయతే, యావతా వాఙ్మనసీత్యేవాచార్యః పఠతి. సత్యమేతత్. పఠిష్యతి తు పరస్తాత్ **"అవిభాగో వచనాత్"** (బ్ర.సూ. 4.2.16) ఇతి. తస్మాదత్ర వృత్త్యుపశమమాత్రం వివక్షితమితి గమ్యతే. తత్త్వప్రలయవివక్షాయాం తు సర్వత్రైవావిభాగసామ్యాత్ కిం పరత్రైవ విశింష్యాదవిభాగ ఇతి? తస్మాదత్ర వృత్త్యుపసంహారవివక్షాయాం వాగ్వృత్తిః పూర్వముపసంహ్రియతే మనోవృత్తావవస్థితాయామిత్యర్థః. కస్మాత్? దర్శనాత్. దృశ్యతే హి వాగ్వృత్తేః పూర్వోపసంహారో మనోవృత్తౌ విద్యమానాయామ్. న చ వాచ ఏవ మనస్యుపసంహారః కేన చిదపి ద్రష్టుం శక్యతే. నను శ్రుతిసామర్థ్యాద్వాచ ఏవాయం మనస్యప్యయో యుక్త ఇత్యుక్తమ్? నేత్యాహ - అతత్ప్రకృతిత్వాత్. యస్య హి యత ఉత్పత్తిః తస్య తత్ర ప్రలయో న్యాయ్యః, మృదీవ శరావస్య. న చ మనసో వాగుత్పద్యత ఇతి కిం చన ప్రమాణమస్తి. వృత్త్యుద్భవాభిభవే తు అప్రకృతిసమాశ్రయావపి దృశ్యేతే. పార్థివేభ్యో హీన్ధనేభ్యస్తైజసస్యాగ్నేర్వృత్తి

రుధ్య పతి, అప్పు చ ఉపశామ్యతి. కథం తర్హి అస్మిన్ పక్షే శబ్దో వాఙ్మనసి సంపద్యతే ఇతి? అత ఆహ శబ్దాచ్చేతి. శబ్దోఽప్యస్మిన్ పక్షేఽవకల్పతే వృత్తివృత్తిమతోరభేదోపచారాదిత్యర్థః.

బాలానందిని

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాం - వాగ్వృత్తి మనస్సులో లీనం అవుతుంది. ఆచార్యుడు (సూత్రకారుడు) 'వాఙ్మనసి' అని మాత్రమే పఠిస్తున్నాడు కదా? 'వాక్' అనేది వాగ్వృత్తి అని ఎలా వ్యాఖ్యానించబడుచున్నది? అది నిజమే. తరవాత ఆచార్యుడు "అవిభాగో వచనాత్" అని పఠించ నున్నాడు. (తత్త్వవేత్తయొక్క ఇంద్రియాలు స్వరూపలయం పొందుతాయి, ఇంద్రియాలే లీన మవుతాయి. అని దీని అర్థం). అందుచేత ఇక్కడ వృత్తి ఉపశమించడం మాత్రమే చెప్పడానికి ఉద్దిష్ట మైనదని తెలుస్తూన్నది. (అనగా - సంపద్యతే అనుపదానికి ఘటం మృత్తులో లీనమై నట్లు లీన మైపోతుంది, అని చెప్పాలనుకొన్న పక్షంలో అందరి విషయంలోను (తత్త్వ వేత్తలు కాని వాళ్ళవిషయంలోను, తత్త్వవేత్తల విషయంలోను) అవిభాగం (ఒకటి మరొకదానిలో కలిసిపోవడం) సమానమే అయినప్పుడు 'అవిభాగః' అని తరవాత మాత్రమే విశేషంగా ఎందుకు చెప్పాలి? అందువల్ల ఇక్కడ వృత్త్యుపసంహారమే వివక్షితం గాన - (వాఙ్ మనసి సంపద్యతే అనే దానికి) మనోవృత్తి ఇంకా ఉండగానే వాగ్వృత్తి ముందుగా ఉపసంహృతం అవుతుంది అని అర్థం). ఎందువల్ల? దర్శనంవల్ల. మనోవృత్తి ఇంకా ఉండగానే ముందుగా వాగ్వృత్తి ఉపసంహృతం అవడం (ఆగిపోవడం) చూడబడుచున్నది కదా? అంతే కాని వృత్తిసహితమైన వాగింద్రియం మనస్సులో లీనం అవడం ఎవరూ చూడజాలరు. (ప్రశ్న) శ్రుతి చెపుతూన్నది గాన దాని సామర్థ్యాన్ని పట్టి ఇది మనస్సులో వాగింద్రియంయొక్క విలయమే అని చెప్పడం యుక్త మని చెప్పాం కదా? (సమాధానం) అట్లు కాదంటున్నాడు. ఇది అతత్ప్రకృతికం కదా (మనస్సు ప్రకృతిగా కలది కాదు కదా?) దేనికి ఏది ప్రకృతియో (కారణమో) అది దానియందు, మూకుడు మట్టిలో నిలీనమైనట్లు, నిలీనం అవడం న్యాయ్యం. మనస్సునుండి వాక్కు పుట్టుచున్నది అని చెప్పడానికి ప్రమాణం ఏదీ లేదు. (ఒక వస్తువుయొక్క) వృత్తి (వ్యాపారం) పుట్టడం తిరోహితం అవడం అనేదైతే ప్రకృతి కానిదానిని ఆశ్రయించి కూడ ఉండడం కనబడుతూన్నది.

పార్థివాలైన (పృథివి వికారాలైన) ఇంధనాలనుండి తైజసమైన అగ్నియొక్క వృత్తి (మండడం అనే వ్యాపారం) ఉద్భవిస్తున్నది. ఉదకంలో శాంతిస్తూన్నది. (అనగా కట్టెలు పృథివీవికారాలు, మంట పార్థివం కాని అగ్నియొక్క పని. కట్టెలమీద అగ్ని మండడం కనబడుతుంది. అదే విధంగా తైజసం కాని జలంలో అగ్నియొక్క వృత్తి శాంతిస్తూన్నది ఈ విధంగా ఒక పదార్థంయొక్క వృత్తి ఆవిర్భవించడం తిరోభవించడం అనేవి మరొక పదార్థం సహాయంతో కూడ జరుగుతున్నాయి. దీనికి ప్రకృతివికృతిభావంతో పని లేదు). అయితే ఈ పక్షంలో "వాఙ్మనసి సంపద్యతే" అనే శబ్దం (వాక్యం) ఎలా కుదురుతుంది? దీనికే సమాధానంగా 'శబ్దాచ్చ' అని చెపుతున్నాడు. వృత్తికి వృత్తిమత్తుకు అభేదాన్ని ఆరోపించడంవల్ల శబ్దం కూడా కుదురుతుం దని అర్థం. (వాగింద్రియం వృత్తిమత్తు. వాక్కు. (మాట) దాని వృత్తి, అది చేసే పని. ఈ వృత్తికీ వృత్తిమత్తుకూ అభేదాన్ని ఆరోపించడంవల్ల వాక్కు మనస్సులో లీనమవుతుంది అని చెప్పబడింది. ఇక్కడ 'వాక్' అనగా గ్రహించవలసినది వాగింద్రియం చేసే పని, మాటలాడడమే) 1

## సూ. అత ఏవ చ సర్వాణ్యను 4.2.2

"తస్మాదుపశాన్తతేజాః పునర్భవమిన్ద్రియైర్మనసి సంపద్యమానైః" (ప్ర.ఉ. 3.9) ఇత్యత్రావిశేషేణ సర్వేషామేవేన్ద్రియాణాం మనసి సంపత్తిః శ్రూయతే. తత్రాప్యత ఏవ వాచ ఇవ చక్షురాదీనామపి సవృత్తికే మనస్యవస్థితే వృత్తిలోప దర్శనాత్, తత్త్వప్రలయాసంభవాత్, శబ్దోపపత్తేశ్చ వృత్తిద్వారేణైవ సర్వాణీన్ద్రియాణి మనోఽనువర్తన్తే. సర్వేషాం కరణానాం మనస్యుపసంహారావిశేషే సతి వాచః పృథగ్గ్రహణం "వాఙ్మనసి సంపద్యతే" ఇత్యుదాహరణానురోధేన. 2

### బాలానందిని

**అత ఏవేతి** :- "అత ఏవ = వాక్కు విషయంలో చెప్పినట్లే, సర్వాణి = ఇతరమైన సమస్తేంద్రియాలూ కూడ, అను = మనస్సును అనువర్తిస్తాయి" అని సూత్రార్థం.

**తస్మాదితి** :- "తస్మాదుప....సంపద్యమానైః" (శాంతించిన తేజస్సు, దేహంలోని ఉష్ణత్వం కలవాడై, ఆ దేహంనుండి నిష్క్రమించి మనస్సును చేరిన ఇంద్రియాలతో పునర్జన్మ పొందుతాడు) అనే చోట, విశేషం ఏదీ లేకుండా సమస్తేంద్రియాలు మనస్సులో

సంపన్నా లవుతా యని వినబడుచున్నది. అక్కడ కూడా, అత ఏవ = వాక్కు విషయంలో వలె, వృత్తితో కూడిన మనస్సు ఇంకా ఉంటూండగా (ఇంకా మనస్సు పని చేస్తుండగానే) చక్షురాదుల వృత్తి (వ్యాపారం) లోపించడం కనబడడంవల్ల, తత్త్వమే (చక్షురాదీంద్రియాలే) ప్రలయం పొందడం సంభవం కాకపోవడం వల్ల, శబ్దం ఉపపన్నం అవడంవల్ల సమస్తేంద్రియాలు మనస్సులో ఉపసంహృతా లవడంలో విశేషం లేకపోయినా కూడ "వాఙ్మనసి సంపద్యతే" అను ఉదాహరణను అనుసరించి వాక్కు-వేరుగా (పైసూత్రంలో) చెప్పబడింది. 2

వాగధికరణం సమాప్తం

## 2. మనోధికరణమ్. సూ. 3

## సూ. తన్మనః ప్రాణ ఉత్తరాత్. 4.2.3

సమధిగతమేతత్ - "వాఙ్మనసి సంపద్యతే" (ఛా.ఉ. 6.9.6) ఇత్యత్ర వృత్తిసంపత్తివివక్షేతి. అథ యదుత్తరం వాక్యం "మనః ప్రాణే" (ఛా.ఉ. 6.8.6) ఇతి, కిమత్రాపి వృత్తిసంపత్తిరేవ వివక్షితా ఉత వృత్తిమత్సపత్తిరితి విచికిత్సాయాం వృత్తిమత్సంపత్తిరేవాత్రేతి ప్రాప్తమ్, శ్రుత్యనుగ్రహాత్, ప్రకృతిత్వోపపత్తేశ్చ. తథా హి - "అన్నమయం హి సోమ్య మనః ఆపోమయః ప్రాణః" (ఛా.ఉ. 6.5.4) ఇత్యన్నయోని మనః ఆమనన్తి, అబ్యోనిం చ ప్రాణమ్. "ఆపశ్చాన్నమసృజన్త" ఇతి శ్రుతిః. అతశ్చ యన్మనః ప్రాణే ప్రలీయతేఽన్నమేవ తదప్సు ప్రలీయతే. అన్నం హి మనః, ఆపశ్చ ప్రాణః ప్రకృతివికారాభేదాత్ ఇతి.

బాలానందిని

**తదితి** :- తత్ = బాహ్యేంద్రియాల వృత్తులను తీసికొన్న, మనః = మనస్సు, ప్రాణే (వృత్తులద్వారా) ప్రాణంలో విలీనం అవుతుంది. ఉత్తరాత్ = తరవాత వచ్చే వాక్యాన్ని పట్టి" అని సూత్రార్థం.

సమధిగతమితి :- "వాఙ్మనసి సంపద్యతే" అనే చోట వృత్తిసంపత్తి వివక్షిత మైనది అనే విషయం తెలుసుకొనబడింది. ఇపుడు - "మనః ప్రాణే" అనే తరువాతి వాక్యంలో

కూడ వృత్తిసంపత్తియే వివక్షితమా లేక వృత్తిమత్తైన మనస్సుయొక్క సంపత్తి వివక్షితమా అని సందేహం కలగగా శ్రుత్యనుగ్రహం ఉండడంవల్ల మనస్సుకు ప్రాణం ప్రకృతి అనడం ఉపపన్నం అవడంవల్లా కూడ ఇక్కడ వృత్తిమత్సంపత్తియే అని ప్రాప్తించినది. ఎందువల్ల ననగా "అన్నమయం...ప్రాణః" (సౌమ్యుడా! మనస్సు అన్నవికారం, ప్రాణం ఉదకమయం) అని మనస్సు అన్నంనుండి పుట్టిన దనీ, ప్రాణం ఉదకంనుండి పుట్టిన దనీ చెపుతున్నారు. "ఆపశ్చాన్నమసృజన్త" (ఉదకాలు అన్నాన్ని సృజించాయి) అని శ్రుతి ఉంది. అందుచేత మనస్సు ప్రాణంలో లీన మవుతున్న దనగా (మనస్సు అనగా అన్నమే గాన) అన్నమే ఉదకంలో (ప్రాణం ఉదకమేగాన) నిలీనం అవుతున్న దని అర్థం. ప్రకృతికి వికారానికి (కారణానికి కార్యానికి) భేదం లేకపోవడంచేత మనస్సే అన్నం, ప్రాణమే ఉదకం కదా?

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః - తదప్యాగృహీతబాహ్యేన్ద్రియవృత్తి మనో వృత్తిద్వారేణైవ ప్రాణే ప్రలీయతే ఇత్యుత్తరాద్వాక్యాదవగన్తవ్యమ్. తథాహి సుషుప్సోర్ముమూర్షోశ్చ ప్రాణవృత్తౌ పరిస్పన్దాత్మికాయామవస్థితాయాం మనోవృత్తీనాముపశమో దృశ్యతే. న చ మనసః స్వరూపాప్యయః ప్రాణే సంభవతి, అతత్ప్రకృతిత్వాత్. నను దర్శితం మనసః ప్రాణప్రకృతిత్వమ్? నైతత్సారమ్. న హీదృశేన ప్రాణాడికేన తత్ప్రకృతిత్వేన మనః ప్రాణే సంపత్తుమర్హతి. ఏవమపి హ్యన్నే మనః సంపద్యేతాప్సు చాన్నమప్స్వేవ ప్రాణ. న హ్యేతస్మిన్నపి పక్షే ప్రాణభావపరిణతాభ్యోఽద్భ్యో మనో జాయతే ఇతి కించన ప్రమాణమస్తి. తస్మాన్న మనసః ప్రాణే స్వరూపాప్యయః. వృత్త్యప్యయేఽపి తు శబ్దోఽవకల్పతే, వృత్తివృత్తిమతోరభేదోపచారాదితి దర్శితమ్.

## బాలానందిని

**ఏవమితి** :- ఇట్లు ప్రాప్తించగా చెపుతున్నాం. తత్ = తనలో గ్రహించబడిన బాహ్యేంద్రియవృత్తులు గల, మనః = మనస్సు, వృత్తులద్వారా మాత్రమే ప్రాణంలో లీనం అవుతుంది అని ("మనః ప్రాణే" అనే) తరువాతి వాక్యంవల్ల తెలుసుకోవాలి.

అందుచేతనే నిద్రపోవాలనుకొనేవానియొక్క, మరణానికి సిద్ధంగా ఉన్నవానియొక్క మనోవృత్తులు, చలనాత్మక మైన ప్రాణవృత్తి ఇంకా ఉండగానే, ఉపశమించడం కనబడుతున్నది. మనస్సుయొక్క స్వరూపమే ప్రాణంలో నిలీనం అయిపోవడం కుదరదు ఎందువల్ల ననగా మనస్సుకు ప్రాణం ప్రకృతి కాదు (ప్రశ్న) - మనస్సుకు ప్రాణం ప్రకృతి అని నిరూపించాం కదా? (సమాధానం) - దీనిలో సారం లేదు. ఈ విధంగా ప్రాణాడికమైన (పరంపరచేత ఏర్పడే) తత్ప్రకృతిత్వంచేత మనస్సు ప్రాణంలో సంపన్నం అవడానికి తగదు. ఇలా చెప్పినా కూడ మనస్సు అన్నంలో సంపన్నం కావాలి (అంతేనే కాని మనస్సు ప్రాణంలో సంపన్నం కాకూడదు). ఈ పక్షంలో కూడ ప్రాణంగా మారిన ఉదకంనుండి మనస్సు పుట్టినది అని చెప్పడానికి ప్రమాణం ఏదీ లేదు. అందువల్ల మనస్సుయొక్క స్వరూపం ప్రాణంలో నిలీనం అవడం అనేది లేదు. మనోవృత్తి ప్రాణంలో నిలీన మవుతుంది అని చెప్పినా కూడ శబ్దం (శ్రుతి) కుదురుతుంది. వృత్తివృత్తిమత్తులకు అభేదోపచారంచేత ఆ విధంగా చెప్పవచ్చు నని వెనుక చూపబడింది. 3

మనోధికరణం సమాప్తం

### 3. అధ్యక్షాధికరణమ్. సూ. 4-6

### సూ. సోఽధ్యక్షే తదుపగమాదిభ్యః. 4.2 4

స్థితమేతదస్య యతో నోత్పత్తిస్తస్య తస్మిన్ వృత్తిప్రలయో న స్వరూపప్రలయ ఇతి. ఇదమిదానీం "ప్రాణస్తేజసి" ఇత్యత్ర చిన్త్యతే - కిం యథాశ్రుతి ప్రాణస్య తేజస్యేవ వృత్త్యుపసంహారః కిం వా దేహేన్ద్రియపఞ్జరాధ్యక్షే జీవే ఇతి. తత్ర శ్రుతేరనతిశఙ్క్యత్వాత్ ప్రాణస్య తేజస్యేవ సంపత్తిః స్యాత్, అశ్రుతకల్పనాయా అన్యాయ్యత్వాత్ ఇతి. ఏవం ప్రాప్తే ప్రతిపాద్యతే - సోఽధ్యక్ష ఇతి. సః ప్రకృతః ప్రాణోఽధ్యక్షేఽవిద్యాకర్మపూర్వప్రజ్ఞోపాధికే విజ్ఞానాత్మన్యవతిష్ఠతే. తత్ప్రధానా ప్రాణవృత్తిర్భవతీత్యర్థః.కుతః? తదుపగమాదిభ్యః. "ఏవమేవేమ మాత్మానమన్తకాలే సర్వే ప్రాణా అభిసమాయన్తి యత్రైతదూర్ధ్వోచ్ఛ్వాసీ భవతి" ఇతి హి శ్రుత్యన్తరమధ్యక్షోపగామినః సర్వాన్ ప్రాణానవిశేషేణ దర్శయతి.

విశేషేణ చ "తముత్క్రామన్తం ప్రాణోఽనూత్క్రామతి" (బృ.ఉ. 4.4.2) ఇతి పఞ్చవృత్తేః ప్రాణస్య అధ్యక్షానుగామితాం దర్శయతి, తదనువృత్తితాం చేతరేషామ్ - "ప్రాణమనూత్క్రామన్తం సర్వే ప్రాణా అనూత్క్రామన్తి" (బృ.ఉ. 4.4.2) ఇతి. "సవిజ్ఞానో భవతి" ఇతి చాధ్యక్షస్యాన్తర్విజ్ఞానవత్త్వప్రదర్శనేన తస్మిన్నపీతకరణగ్రామస్య ప్రాణస్యావస్థానం గమయతి. నను "ప్రాణస్తేజసి" ఇతి శ్రూయతే, కథం ప్రాణోఽధ్యక్షే ఇత్యధికావాపః క్రియతే? నైష దోషః. అధ్యక్షప్రధానత్వాదుత్క్రమణాదివ్యవహారస్య, శ్రుత్యన్తరగతస్యాపి చ విశేషస్యాపేక్షణీయత్వాత్. 4

బాలానందిని

**స ఇతి :-** "సః = ఆ ప్రాణం, అధ్యక్షే = శరీరాధ్యక్షుడైన జీవునియందు లీనం అవుతుంది. తదుపగమాదిభ్యః = ప్రాణా లన్నీ అతనికే చేరుతాయి ఇత్యాదివిషయాలను చెప్పే శ్రుతివాక్యాలవల్ల" అని సూత్రార్థం.

**స్థితమితి :-** ఏది దేనినుండి పుట్టలేదో అది దానియందు ప్రలయం పొందదు, దాని వృత్తి మాత్రమే ప్రలయం పొందుతుంది అని నిర్ణయించబడింది. ఇప్పుడు "ప్రాణస్తేజసి" అనేదాని విషయంలో ఈ విచారణ చేయబడుచున్నది. ఏ విధంగా వినబడుచున్నదో ఆ విధంగా ప్రాణానికి తేజస్సునందే వృత్త్యుపసంహారం చెయ్యాలా లేక దేహేంద్రియపంజరానికి అధ్యక్షుడైన జీవునియందు చెయ్యాలా. అయితే శ్రుతిని శంకించగూడదు గాన ప్రాణానికి తేజస్సునందే సంపత్తి కలుగుతుంది. వినబడనిదానిని (చెప్పబడనిదానిని) కల్పించడం అన్యాయ్యం కదా? ఇలా ప్రాప్తించగా 'సోఽధ్యక్షే' అని ప్రతిపాదించబడుచున్నది. సః = ప్రకృతమైన ప్రాణం, అధ్యక్షే = అవిద్య, కర్మలు, పూర్వవాసనలు ఉపాధిగా గల విజ్ఞానాత్మయందే నిలచి ఉంటుంది. అనగా ప్రాణవృత్తి జీవప్రధానంగా ఉంటుంది అని అర్థం. ఎందువల్ల? తదుపగమాదులవల్ల. "ఏవ......భవతి" (పరలోకానికి వెళ్ళ నున్న జీవుణ్ణి, అతడు ఎగ ఊపిరితో ఉన్నప్పుడు అంతకాలంలో సమస్తప్రాణాలూ కూడ చేరుతాయి) అని మరొక శ్రుతి, విశేషం ఏమీ లేకుండా ప్రాణా లన్నీ అధ్యక్షుణ్ణి అనుసరిస్తాయి అని చెపుతున్నది. "తముత్క్రామన్తం ప్రాణోఽనూత్క్రామతి"

అను శ్రుతి విశేషించి పంచవృత్తి యైన ప్రాణం అధ్యక్షుణ్ణి అనుసరించి వెళ్ళుచున్నట్లు చూపుతూన్నది. "ప్రాణమ్....అనూత్క్రామన్తి" అను శ్రుతి ఇతరప్రాణాలు కూడ దానినే అనుసరిస్తూన్నట్లు చూపుతూన్నది. "సవిజ్ఞానో భవతి" (ఆ సమయంలో జీవుడు విజ్ఞానంతో ఉంటాడు) అని జీవుడు లోపల విజ్ఞానవంతుడై ఉంటా డని చెప్పడంచేత ఇంద్రియగ్రామం (సముదాయం) తనలో లీనమై ఉన్న ప్రాణం వానిలో ఉంటుందని చూపుతూన్నది. (ప్రశ్న) "ప్రాణస్తేజసి" అని శ్రుతిలో ఉండగా ప్రాణం అధ్యక్షునిలో చేరుతుంది అని అధికం ఎలా చేరుస్తారు? (సమాధానం) ఈ దోషం లేదు. ఉత్క్రమణాదివ్యవహారంలో అధ్యక్షుడే ప్రధానుడుగా ఉంటాడు గాన శ్రుత్యంతరంలో ఉన్న విశేషం కూడా అపేక్షించదగి ఉంటుంది (గ్రహించాలి). 4

## భాష్యమ్

కథం తర్హి "ప్రాణస్తేజసి" ఇతి శ్రుతిరిత్యాహ -

### సూ. భూతేషు తచ్ఛ్రుతేః. 4.2.5

స ప్రాణసంయుక్తోఽధ్యక్షస్తేజఃసహచరితేషు భూతేషు దేహబీజభూతేషు సూక్ష్మేష్వవతిష్ఠత ఇత్యవగన్తవ్యమ్ - "ప్రాణస్తేజసి" ఇది శ్రుతేః. నను చేయం శ్రుతిః ప్రాణస్య తేజసి స్థితిం దర్శయతి న ప్రాణసంపృక్తస్యాధ్యక్షస్య. నైష దోషః. సోఽధ్యక్ష ఇత్యధ్యక్షస్యాప్యన్తరాలే ఉపసంఖ్యాతత్వాత్. యోఽపి హి స్రుఘ్నాన్మథురాం గత్వా మథురాయాః పాటలిపుత్రం వ్రజతి సోఽపి స్రుఘ్నాత్పాటలిపుత్రం యాతీతి శక్యతే వదితుమ్. తస్మాత్ప్రాణ స్తేజసీతి ప్రాణసంపృక్తస్యాధ్యక్షస్యైవైతత్తేజస్సహచరితేషు భూతేష్వవస్థానమ్. 5

## బాలానందిని

**కథమితి** :- అట్లయితే (ప్రాణం జీవుణ్ణి చేరుతుంది అని చెప్పినట్ల యితే)"ప్రాణస్తేజసి" అనే శ్రుతి ఎట్లు కుదరుతుంది అని అశంకించుకొని చెప్పుచున్నాడు-

**భూతేష్వితి** :- "భూతేషు = జీవుడు తేజఃసహితాలైన భూతాలలో ఉంటాడు. తచ్ఛ్రుతేః = ఆ విధంగా వినబడడంవల్ల" అని సూత్రార్థం.

స ఇతి :- ప్రాణంతో కూడిన అధ్యక్షుడు తేజఃసహితా లైన దేహానికి బీజాలైన సూక్ష్మభూతాలలో ఉంటాడు అని "ప్రాణస్తేజసి" అనే శ్రుతిని పట్టి గ్రహించాలి (ప్రశ్న) ఈ శ్రుతి ప్రాణం తేజస్సులో ఉంటుంది అని చెప్పుచున్నది గాని ప్రాణసహితుడైన జీవుడు తేజస్సులో ఉంటా డని చెప్పడం లేదు కదా? (సమాధానం) ఈ దోషం లేదు. ఎందుచేత ననగా "సోఽధ్యక్షే" అని (అను పై సూత్రంచేత) మధ్యలో అధ్యక్షుడు కూడా చెప్పబడినాడు.

వి. "ప్రాణస్తేజసి" అనే వాక్యం ప్రాణం తేజస్సులో లీనం అవుతుంది అని చెపుతూన్నది. కాని "ఏవమేవేమమాత్మానమ్" ఇత్యాది శ్రుతిప్రామాణ్యాన్ని పట్టి "సోఽధ్యక్షే....." ఇత్యాది సూత్రంలో ప్రాణం అధ్యక్షునిలో లీనం అవుతుంది అని చెప్పబడింది. ప్రాణంతో కూడిన ఈ అధ్యక్షుడు తేజస్సుతోను, దానితో పాటు ఇతరభూతాలతోను సంబధిస్తాడు గాన అధ్యక్షునితో కలిసి ఉన్న ప్రాణం కూడా తేజస్సుతో కలుస్తూన్నది. దానిని పట్టి "ప్రాణస్తేజసి" అనేదానిని సమన్వయం చేసికొనవచ్చు నని భావం. దీనికి యోఽపీత్యాదివాక్యంచేత ఉదాహరణం చూపబడుచున్నది.

**యోఽపీతి** :- స్రుఘ్నంనుండి మథురకువెళ్ళి అక్కడినుండి పాటలిపుత్రం వెళ్ళినవాడు కూడా స్రుఘ్నంనుండి పాటలిపుత్రానికి వెడుతున్నా డని చెప్పవచ్చును కదా? (అట్లే ఇక్కడ ప్రాణం అధ్యక్షుణ్ణి చేరి తత్సహితంగా తేజస్సును చేరుతూన్నది గాన ప్రాణం తేజస్సును చేరుతున్న దని చెప్పవచ్చును). అందువల్ల "ప్రాణస్తేజసి" అనగా ప్రాణంతో కలిసిన అధ్యక్షుడు తేజస్సుతో కూడిన మహాభూతాలలలో ఉండడం అని అర్థం. 5

## భాష్యమ్

కథం తేజఃసహచరితేషు భూతేష్విత్యుచ్యతే? యతః ఏకమేవ తేజః శ్రూయతే "ప్రాణస్తేజసి" ఇతి. అత ఆహ-

## సూ. నైకస్మిన్ దర్శయతో హి 4.2.6

నైకస్మిన్నేవ తేజసి శరీరాన్తరప్రేప్సావేలాయాం జీవోఽవతిష్ఠతే, కార్యస్య శరీరస్యానేకాత్మకత్వదర్శనాత్. దర్శయతశ్చైతమర్థం ప్రశ్నప్రతివచనే "ఆపః పురుషవచసః" (ఛా.ఉ. 5.3.3) ఇతి. తద్వ్యాఖ్యాతమ్ "త్ర్యాత్మకత్వాత్తు

భూయస్త్వాత్" (బ్ర.సూ. 2.1.2) ఇత్యత్ర. శ్రుతిస్మృతీ చైతమర్థం దర్శయతః. శ్రుతిః- "పృథివీమయఆపోమయో వాయుమయ ఆకాశమయస్తేజోమయః" (బృ.ఉ. 4.4.5) ఇత్యాద్యా. స్మృతిరపి -

"అణ్వ్యో మాత్రా వినాశిన్యో దశార్ధానాం తు యాః స్మృతాః.

తాభిః సార్ధమిదం సర్వం సంభవత్యనుపూర్వశః" (మనుస్మృ. 1.27)

ఇత్యాద్యా. నను చోపసంహృతేషు వాగాదిషు కరణేషు శరీరాన్తరప్రేప్సావేలాయాం "క్వాయం తదా పురుషో భవతి" (బృ.ఉ. 3.2.13) ఇత్యుపక్రమ్య శ్రుత్యన్తరం కర్మాశ్రయతాం నిరూపయతి - "తౌ హ యదూచతుః కర్మ హైవ తదూచతురథ హ యత్ప్రశశంసతుః కర్మ హైవ తత్ప్రశశంసతుః" (బృ.ఉ. 3.2.13) ఇతి. తత్రోచ్యతే - తత్ర కర్మప్రయుక్తస్య గ్రహాతిగ్రహసంజ్ఞకస్యేన్ద్రియవిషయాత్మకస్య బన్ధనస్య ప్రవృత్తిరితి కర్మాశ్రయతోక్తా. ఇహ పునర్భూతోపాదానాద్దేహాన్తరోత్పత్తిరితి భూతాశ్రయత్వముక్తమ్. ప్రశంసాశబ్దాదపి తత్ర ప్రాధాన్యమాత్రం కర్మణః ప్రదర్శితం న త్వాశ్రయాన్తరం నివారితమ్. తస్మాదవిరోధః. 6

## బాలానందిని

**నేతి:-** "'ఏకస్మిన్ = ఒక్క తేజస్సునందే, న = జీవు డుండడు. దర్శయతో హి = శ్రుతిస్మృతులు ప్రశ్నప్రతివచనాలు చూపుతున్నాయి కదా?'' అని సూత్రార్థం.

**కథమితి :-** "ప్రాణస్తేజసి" అని ఒక్క తేజస్సుమాత్రమే (ప్రాణం తేజస్సులో మాత్రమే లీనం అవుతుంది అని) వినబడుతూండగా తేజస్సుతో కూడిన భూతాలలో అని ఎలా చెప్పబడుచున్నది అని అశంకించుకొని చెప్పుచున్నాడు-

**నైకస్మిన్నితి :-** శరీరాంతరం పొందదలచుకొన్న సమయంలో జీవుడు ఒక్క తేజస్సులో మాత్రమే ఉండడు. ఎందువల్ల ననగా - కార్యమైన శరీరం అనేకభూతాత్మకమైన దని కనబడుచున్నది. ఈ విషయాన్ని "ఆపః పురుషవచసః" అనే చోట ప్రశ్నప్రతివచనాలు చూపుతున్నాయి. ఈ విషయం "త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్" అనే సూత్రం దగ్గర చూపబడింది. ఈ విషయాన్ని శ్రుతిస్మృతులు కూడా చూపుతున్నాయి. "పృథివీమయ...

**తేజోమయః"** (శరీరం పృథివ్యాదిమయం) అని శ్రుతి చెప్పుచున్నది. **"అణ్వ్యః.... అనుపూర్వశః"** (ఐదు భూతాల సూక్ష్మములు (మోక్షంవరకు) నాశనం లేనివి. అట్టి సూక్ష్మాంశాలతో ఈ శరీరం జనిస్తుంది) అని స్మృతి చెప్పుచున్నది. (ప్రశ్న) శరీరాంతరం పొందాలనుకొన్న సమయంలో వాగాదీంద్రియాలు ఉపసంహృతము లైనప్పుడు **"క్వాయం పురుషో భవతి"** (ఈ పురుషుడు ఎక్క డుంటాడు) అని ఉపక్రమించి మరొక శ్రుతి - **"తౌ హ ....ప్రశశంసతుః"** అని వానికి కర్మయే ఆశ్రయం అని చెపుతున్నది కదా? "(ఆ యాజ్ఞవల్క్య - ఆర్తభాగులు జీవునికి ఆధార మైన దేనిని గూర్చి మాట్లాడారో, అది కర్మను గూర్చియే, దేనిని ప్రశంసించారో అది కర్మనే" అని ఈ వాక్యాని కర్థం). (దీనినిపట్టి ఆ సమయంలో జీవునికి ఆశ్రయం కర్మయే కదా. భూతాలని ఇక్కడ ఎలా చెప్పబడుతున్నది అని ప్రశ్న). ఈ విషయంలో చెప్పబడుచున్నది. కర్మచేత ఏర్పడిన, గ్రహాతిగ్రహము లనే పేర్లు గల ఇంద్రియ విషయము లనే బంధనం ప్రవర్తిస్తుంది గాన జీవునకు కర్మ ఆశ్రయం అని అక్కడ చెప్పబడింది. కర్మవల్ల లభించిన ఇంద్రియాలు గ్రహాలు. విషయాలు అతిగ్రహాలు. ఈ రెండు బంధనం. ఇవి జీవుణ్ణి బంధిస్తాయి. ఈ విధమైన కర్మ శరీరగ్రహణానికి నిమిత్తకారణం. (భూతాలు శరీరానికి ఉపాదానకారణం) ఇక్కడైతే భూతాలను స్వీకరించడంచేత (ఉపాదానకారణంగా చేసికొనడంచేత) మరొక దేహం పుడుతుంది గాన భూతాశ్రయత్వం చెప్పబడింది. అక్కడ ప్రశంసించడం అనడంచేత కూడ కర్మ చాలా ప్రధానమైన దని మాత్రమే చూపబడింది. కాని మరొక ఆశ్రయం లేదని చెప్పబడలేదు. 6

**అధ్యక్షాధికరణం సమాప్తం**

## 4. ఆసృత్యుపక్రమాధికరణమ్. సూ. 7

### సూ. సమానా చాసృత్యుపక్రమాదమృతత్వం చానుపోష్య. 4.2.7

సేయముత్క్రాన్తిః కిం విద్వదవిదుషోః సమానా కిం వా విశేషవతీతి విశయానానాం విశేషవతీతి తావత్ప్రాప్తమ్. భూతాశ్రయవిశిష్టా హ్యేషా. పునర్భవాయ చ భూతాన్యాశ్రీయన్తే. న చ విదుషః పునర్భవః సంభవతి. అమృతత్వం హి విద్వానశ్నుతే ఇతి స్థితిః. తస్మాదవిదుష ఏవైషోత్క్రాన్తిః. నను

విద్యాప్రకరణే సమామ్నానాద్విదుష ఏవైషా భవేత్. న. స్వాపాదివద్యథా ప్రాప్తానుకీర్తనాత్. తథాహి - "యత్రైతత్పురుషః స్వపితి నామ", "అశిశిషతి నామ" "పిపాసతి నామ" (ఛా.ఉ. 6.8.1,3,5) ఇతి చ సర్వప్రాణిసాధారణా ఏవ స్వాపాదయోనుకీర్త్యన్తే, విద్యాప్రకరణేఽపి ప్రతిపాదయిషితవస్తుప్రతిపాదనాను గుణ్యేన; న తు విదుషో విశేషవన్తో విధీయన్తే, ఏవమియమప్యుత్క్రాన్తిర్మహాజన గతైవానుకీర్త్యతే, యస్యాం పరస్యాం దేవతాయాం పురుషస్య ప్రయతస్తేజః సంపద్యతే స ఆత్మా తత్త్వమసీత్యేతత్ప్రతిపాదయితుమ్. ప్రతిషిద్ధా చైషా విదుషః "న తస్య ప్రాణా ఉత్క్రామన్తి" (బృ.ఉ. 4.4.6) ఇతి. తస్మాదవిదుష ఏవైషేతి.

బాలానందిని

సమానేతి :- "ఆసృత్యుపక్రమాత్ = దేవమార్గం ప్రారంభం వరకు, సమానా= ఉత్క్రాంతి విద్వదవిద్వాంసులకు సమానమే. అనుపోష్య = రాగద్వేషాదులను కాల్చకుండా, అమృతత్వమ్ = ఇది ఆపేక్షికమైన అమృతత్వమే" అని సూత్రార్థం.

సేయమితి:- ఈ ఉత్క్రమణం విద్వాంసులకు (అనగా దహరవిద్యాది సగుణో పాసకులకు) అవిద్వాంసులకూ కూడ సమానమా లేక ఏదైన విశేషం ఉన్నదా అని సంశయించే వాళ్ళకు విశేషం ఉన్నది అని ప్రాప్త మైనది. ఉత్క్రాంతి భూతాలను ఆశ్రయించడంతో కూడినది. మళ్ళీ జనించడంకొరకే భూతాలు ఆశ్రయించబడతాయి. విద్వాంసునికి పునర్జన్మ లేదు. విద్వాంసుడు అమృతత్వాన్ని పొందుతా డని కదా నిర్ణయం? అందుచేత ఉత్క్రాంతి కేవలం అవిద్వాంసునికి మాత్రమే. (ప్రశ్న) ఈ ఉత్క్రమణం విద్యాప్రకరణంలో చెప్పబడింది గాన విద్వాంసునికే కలగాలి. (సమాధానం) అది కాదు. ఇక్కడ స్వాపాదులను చెప్పి నట్లు ప్రాప్తించినవాటిని చెప్పడం జరిగింది. అదెట్లనగా - ఇది విద్యాప్రకరణమే అయినా ప్రతిపాదింపదలచిన విషయాన్ని ప్రతిపాదించడానికి అనుగుణంగా "యత్రైతత్ పురుషః స్వపితి నామ" (ఎప్పుడైతే ఈ పురుషుడు నిద్రిస్తాడో, "అశిశిషతి నామ" (తినాలనుకొంటాడో). "పిపాసతి నామ" (త్రాగా లనుకొంటాడో) అంటూ సర్వప్రాణులకు సాధారణములైన) నిద్ర మొదలైనవే చెప్పబడుచున్నాయి. అంతే కాని ఇవి విద్వాంసునికి మాత్రమే చెందిన విశేషాలుగా చెప్పబడడం లేదు. అదే విధంగా ఈ

ఉత్క్రాంతి కూడ మహాజనులకు (జనసామాన్యానికి) చెందినది మాత్రమే చెప్పబడుచున్నది. మరణిస్తూన్న పురుషుని తేజస్సు ఏ పరదేవతయందు లీన మవుతున్నదో అదే ఆత్మ; ఆ ఆత్మయే నువ్వు అని ప్రతిపాదించడమే దీని ప్రయోజనం. "న తస్య ప్రాణా ఉత్క్రామన్తి" అనే వాక్యంచేత విద్వాంసునికి ఉత్క్రాంతి నిషేధింపబడినది కూడ. అందుచేత ఇది అవిద్వాంసునికి మాత్రమే.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః - సమానా చైషోత్క్రాన్తిః వాఙ్మనసీత్యాద్యా విద్వదవిదుషోః ఆసృత్యుపక్రమాద్భవితుమర్హతి, అవిశేషశ్రవణాత్. అవిద్వాన్ దేహబీజభూతాని భూతసూక్ష్మాణ్యాశ్రిత్య కర్మప్రయుక్తో దేహగ్రహణమనుభవితుం సంసరతి, విద్వాంస్తు జ్ఞానప్రకాశితం మోక్షనాడీద్వారమాశ్రయతే. తదేతదాసృత్యుపక్రమాదిత్యుక్తమ్. నన్వమృతత్వం హి విదుషా ప్రాప్తవ్యమ్. న చ తద్దేశాన్తరాయత్తమ్. తత్ర కుతో భూతాశ్రయత్వం సృత్యుపక్రమో వేతి. అత్రోచ్యతే- అనుపోష్య చేదమ్. అదగ్ధ్వాత్యన్తమవిద్యాదీన్ క్లేశానపరవిద్యాసామర్థ్యాదాపేక్షికమమృతత్వం ప్రేప్సతే సంభవతి తత్ర సృత్యుపక్రమో భూతాశ్రయత్వం చ. న హి నిరాశ్రయాణాం ప్రాణానాం గతిరుపపద్యతే. తస్మాదదోషః. 7

## బాలానందిని

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాం - విద్వాంసులకు అవిద్వాంసులకూ కూడ 'వాఙ్మనసి' ఇత్యాదికమైన ఉత్క్రమణం ఉపసృతి ప్రారంభం వరకూ సమానంగానే ఉంటుంది. ఎందువల్ల ననగా విశేషం ఏదీ చెప్పబడలేదు. అవిద్వాంసుడు దేహానికి బీజాలైన భూతసూక్ష్మాలను ఆశ్రయించి, కర్మప్రేరితుడై దేహం గ్రహించడానికి సంసారంలో పడతాడు. విద్వాంసుడైతే జ్ఞానంచేత మోక్షానికి వెళ్ళడానికి ఉపయోగించే మూర్ధన్యనాడీద్వారాన్ని (తలలో ఉన్న నాడి అనే ద్వారాన్ని) ఆశ్రయిస్తాడు. ఈ విషయమే "ఆసృత్యుపక్రమాత్" అనే పదంచేత చెప్పబడింది. (ప్రశ్న) విద్వాంసుడు అమృతత్వం

పొందవలసి ఉంది కదా? అమృతత్వం దేశాంతరంమీద ఆధారపడినది కాదు (అమృతత్వం కొరకు దేశాంతరానికి వెళ్ళవలసిన పని లేదు). అలాంటప్పుడు భూతాలను ఆశ్రయించడం గాని నృత్యుపక్రమం గాని ఎలా ఉంటాయి? (సమాధానం) ఈ విషయంలో చెప్పబడుచున్నది - అవిద్య మొదలైన క్లేశాలను పూర్తిగా దహించకుండా అపరవిద్యాసామర్థ్యంచేత (సగుణవిద్యల సాహాయ్యంచేత) ఆపేక్షికమైన అమృతత్వాన్ని (అనగా విదేహముక్తిని కాక బ్రహ్మలోకనివాసం మొదలైన, మిగిలిన స్థితులకంటె సుదీర్ఘకాలం మరణం లేకుండా ఉండే స్థితిని) పొందదలచేవానికి సృత్యుపక్రమం, భూతాశ్రయత్వం కూడ సంభవం అవుతాయి. (ప్రేప్సతే అనేది చతుర్థ్యేకవచనం). ఆశ్రయరహితాలైన ప్రాణాలకు గమనం ఉండదు కదా? అందువల్ల దోషం కాదు. 7

అసృత్యుపక్రమాధికరణం సమాప్తం

### 5. సంసారవ్యపదేశాధికరణమ్. సూ. 8-11

### సూ. తదాపీతేః సంసారవ్యపదేశాత్ 4.2.8

"తేజః పరస్యాం దేవతాయామ్" (ఛా.ఉ.6.8.6) ఇత్యత్ర ప్రకరణసామర్థ్యాత్తద్యథాప్రకృతం తేజః సాధ్యక్షం, సప్రాణమ్, సకరణగ్రామమ్, భూతాన్తరసహితం ప్రయతః పుంసః పరస్యాం దేవతాయాం సంపద్యతే ఇత్యేతదుక్తం భవతి. కీదృశీ పునరియం సంపత్తిః స్యాదితి చిన్త్యతే. తత్రాత్యన్తిక ఏవ తావత్స్వరూపప్రవిలయ ఇతి ప్రాప్తమ్. తత్ప్రకృతిత్వోపపత్తేః. సర్వస్య హి జనిమతో వస్తుజాతస్య ప్రకృతిః పరా దేవతేతి ప్రతిష్ఠాపితమ్. తస్మాదత్యన్తికీ యమవిభాగాపత్తిరితి.

ఏవం ప్రాప్తే బ్రూమః - తత్తేజఆది భూతసూక్ష్మం శ్రోత్రాదికరణాశ్రయ భూతమాపీతేః ఆసంసారమోక్షాత్ సమ్యగ్జ్ఞాననిమిత్తాదవతిష్ఠతే.

"యోనిమన్యే ప్రపద్యన్తే శరీరత్వాయ దేహినః,
స్థాణుమన్యేనుసంయన్తి యథాకర్మ యథాశ్రుతమ్" (క. ఉ. 5.7)

ఇత్యాది సంసారవ్యపదేశాత్. అన్యథా హి సర్వః ప్రాయణసమయ ఏవోపాధిప్రత్యస్తమయాదత్యన్తం బ్రహ్మ సంపద్యేత; తత్ర విధిశాస్త్రమనర్థకం స్యాద్విద్యాశాస్త్రం చ. మిథ్యాజ్ఞాననిమిత్తశ్చ బన్ధో న సమ్యగ్జ్ఞానాదృతే విస్రంసితుమర్హతి. తస్మాత్తత్ప్రకృతిత్వేఽపి సుషుప్తిప్రలయవద్బీజభావావశేషైవైషా సత్సంపత్తిరితి. 8

## బాలానందిని

**తదితి :-** "తత్ = తేజస్సు మొదలైన భూతాల సూక్ష్మరూపం, అపీతేః = సంసారమోక్షంవరకు ఉంటుంది" అని సూత్రార్థం.

**తేజ ఇతి : - "తేజః పరస్యాం దేవతాయామ్"** అనే చోట పురుషుడు మరణించే టప్పుడు అధ్యక్షునితోను, ప్రాణంతోను, ఇంద్రియసమూహంతోను, ఇతరభూతాలతోను కూడిన ప్రకృతమైన తేజస్సు పరదేవతలో లీన మవుతుంది అని చెప్పి నట్లవుతుంది. ఈ సంపత్తి ఎలాంటిది అని విచారించబడుచున్నది. తత్ప్రకృతిత్వం (తేజస్సుకు పరదేవత ప్రకృతిగా ఉండడం) ఉపపన్నమే గాన ఈ తేజస్సు స్వరూపవిలయాన్నే పొందుతుంది. (పూర్తిగా విలీనమైపోతుంది) అని ప్రాప్తిస్తున్నది. పుట్టిన ప్రతివస్తువుకూ పరదేవత (బ్రహ్మ) ప్రకృతి అని స్థాపించబడింది కదా? అందువల్ల ఇది పూర్తిగా కలిసిపోవడమే. (వెనుకటి అధికరణంలో అమృతత్వం ఆపేక్షికం అని చెప్పబడింది. అది యుక్తం కాదని ఆక్షేపసంగతిచేత పూర్వపక్షం). ఇట్లు ప్రాప్తించగా చెప్పుచున్నాం - శ్రోత్రాదికరణాల ఆశ్రయమైన తేజస్సు మొదలైన భూతాల సూక్ష్మాంశ, అపీతేః = సమ్యగ్జ్ఞానంవల్ల సంసారమోక్షం కలిగే వరకు ఉంటుంది. (బ్రహ్మలో పూర్తిగా కలిసిపోదు) "యోని....యథాశ్రుతమ్" (కొందు జీవులు తమ కర్మలను, శాస్త్రజ్ఞానాదులను, అనుసరించి శరీరంకోసం మరొక జన్మ ఎత్తుతారు, కొందరు వృక్షాదిస్థావరరూపాన్ని పొందుతారు) ఇత్యాదివాక్యాలు సంసారాన్ని చెపుతున్నాయి. (మరణించినవాళ్ళకు తరువాత కూడా సంసారం ఉంటుందని చెపుతున్నాయి). అలా కాని పక్షంలో ప్రతి ఒక్కడూ మరణసమయంలోనే ఉపాధులు నశించడంవల్ల పూర్తిగా బ్రహ్మగా అయిపోతాడు. అప్పుడు ఆ యా కర్మలను విధించేశాస్త్రం, విద్యాశాస్త్రమూ కూడ వ్యర్థం అయిపోతాయి.

మిథ్యాజ్ఞానంవల్ల కలిగిన బంధం సమ్యగ్జ్ఞానం లేకుండా జారిపోవడానికి తగదు. అందువల్ల తత్ప్రకృతిత్వం ఉన్నా కూడ సుషుప్తిలోని ప్రలయంలో వలె ఈ సంపత్తిలో కూడ బీజభావం శేషించి ఉంటుంది. 8.

## సూ. సూక్ష్మం ప్రమాణతశ్చ తథోపలబ్ధేః. 3.2.9

తచ్చేతరభూతసహితం తేజో జీవస్యాస్మాచ్ఛరీరాత్ప్రవసత ఆశ్రయ భూతం స్వరూపతః ప్రమాణతశ్చ సూక్ష్మం భవితుమర్హతి. తథాహి - నాడీ నిష్క్రమణశ్రవణాదిభ్యోఽస్య సౌక్ష్మ్యముపలభ్యతే. తత్ర తనుత్వాత్సంచారోప పత్తిః. స్వచ్ఛత్వాచ్చాప్రతీఘాతోపపత్తిః. అత ఏవ చ దేహాన్నిర్గచ్ఛన్ పార్శ్వస్థైర్నోపలభ్యతే. 9

### బాలానందిని

**సూక్ష్మమితి :-** "ప్రమాణతః = ప్రమాణంచేత, సూక్ష్మమ్ = సూక్ష్మ మైనది, తథా = అట్లు, ఉపలబ్ధేః = తెలియడంవల్ల" అని సూత్రార్థం.

**తచ్చేతి :-** ఈ శరీరంనుండి వెళ్ళిపోతున్న జీవుని ఆశ్రయమైన, ఇతరభూతాలతో కూడిన తేజస్సు స్వరూపంచేత, ప్రమాణంచేత కూడా సూక్ష్మంగా ఉంటుంది. ఎందువల్ల ననగా - నాడులద్వారా బైటకు వెళ్ళడం మొదలైనవాటివల్ల ఇది సూక్ష్మ మని తెలుస్తూన్నది. చాల సూక్ష్మం అవడంచేత నాడులలో సంచరించడం కుదురుతుంది. స్వచ్ఛం అవడం వల్ల దేనిచేతా అడ్డుకొనబడకపోవడం కూడా కుదురుతుంది. అందువల్లనే దేహంనుంచి పైకి వెళ్ళిపోయేటప్పుడు ప్రక్కనున్నవా ళ్ళెవరూ చూడజాలరు. 9.

## సూ. నోపమర్దేనాతః. 4.2.10

అత ఏవ సూక్ష్మత్వాత్ నాస్య స్థూలస్య శరీరస్య ఉపమర్దేన దాహాదినిమిత్తేనైతత్సూక్ష్మం శరీరముపమృద్యతే. 10

### బాలానందిని

**నేతి :-** "అతః = అందువల్లనే, ఉపమర్దః = నలిగి నశించడం, న = ఉండదు" అని సూత్రార్థం.

**అత ఇతి** :- సూక్ష్మంగా ఉండడం వల్లనే, దాహాదులచేత స్థూల శరీరాన్ని పీడించినా కూడ ఈ సూక్ష్మశరీరం పీడింపబడదు. 10

## సూ. అస్యైవ చోపపత్తేరేష ఊష్మా. 4.2.11

అస్యైవ చ సూక్ష్మస్య శరీరస్యైవ ఊష్మా యమేతస్మిన్ శరీరే సంస్పర్శేనోష్మాణం విజానన్తి. తథా హి మృతావస్థాయామవస్థితేఽపి దేహే విద్యమానేష్వపి చ రూపాదిషు దేహగుణేషు నోష్మోపలభ్యతే, జీవదస్థాయామేవ ఉపలభ్యతే ఇత్యత ఉపపద్యతే - ప్రసిద్ధశరీరవ్యతిరిక్తశరీరవ్యపాశ్రయ ఏవైష ఊష్మేతి. తథా చ శ్రుతిః "ఉష్ణ ఏవైష జీవిష్యన్ శీతో మరిష్యన్" ఇతి. 11

### బాలానందిని

**అస్యేతి** :- "ఏషః ఉష్మా = ఈ వేడి, అస్యైవ = ఈ సూక్ష్మశరీరానిదే. ఉపపత్తేః = అట్లవుతేనే ఉపపన్నం అవుతుంది గాన" అని సూత్రార్థం.

**అస్యైవేతి** :- శరీరాన్ని స్పృశించడంచేత ఏ వేడిని తెలుసుకొంటారో అ వేడి ఈ సూక్ష్మశరీరానికి సంబంధించినదే. అందుచేతనే - మరణించిన తరవాత దేహం ఉన్నా కూడ, దేహగుణాలైన రూపాదులు ఉన్నా కూడ వేడి కనబడదు, జీవించి ఉన్నప్పుడే కనబడుతుంది. అందువల్ల ఈ వేడి ప్రసిద్ధమైన (స్థూల) శరీరంకంటె భిన్నమైన శరీరానికి సంబంధించిన దని చెప్పడం ఉపపన్నంగా ఉంది. "ఉష్ణ...మరిష్యన్" (జీవించ నున్నప్పుడు ఇది వేడిగా ఉంటుంది. మరణించే టప్పుడు చల్లగా ఉంటుంది) అను శ్రుతి కూడ ఈ విషయమే చెపుతున్నది. 11

### సంసారవ్యపదేశాధికరణం సమాప్తం

## 6. ప్రతిషేధాధికరణమ్. సూ. 12 - 14

## సూ. ప్రతిషేధాదితి చేన్న శారీరాత్. 4.2.12

"అమృతత్వం చానుపోష్య" ఇత్యతో విశేషణాదాత్యన్తికే మృతత్వే గత్యుత్క్రాన్త్యోరభావోఽభ్యుపగతః. తత్రాపి కేన చిత్కారణేనోత్క్రాన్తిమాశఙ్క్య

ప్రతిషేధతి - "**అథాకామయమానో యోఽకామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామో భవతి న తస్య ప్రాణా ఉత్క్రామన్తి బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి**" (బృ.ఉ. 4.4.6) ఇత్యతః వరవిద్యావిషయాత్ప్రతిషేధాన్న వరబ్రహ్మవిదో దేహాత్ ప్రాణానాముత్క్రాన్తిరస్తీతి చేత్, నేత్యుచ్యతే, యతః శారీరాదాత్మన ఏష ఉత్క్రాన్తిప్రతిషేధః ప్రాణానాం న శరీరాత్. కథమవగమ్యతే? "న తస్మాత్ప్రాణా ఉత్క్రామన్తి" ఇతి శాఖాన్తరే పఞ్చమ్యా సంబన్ధవిశేషే వ్యవస్థాప్యతే. తస్మాదితి చ ప్రాధాన్యాదభ్యుదయనిఃశ్రేయసాధికృతో దేహీ సంబధ్యతే న దేహః. న తస్మాదుచ్చిక్రమిషోర్జీవాత్ప్రాణా అపక్రామన్తి, సహైవ తేన భవన్తీత్యర్థః. 12

బాలానందిని

**ప్రతిషేధాదితి** :- "ప్రతిషేధాదితి చేత్ = నిషేధంవల్ల ప్రాణాలకు మోక్షసమయంలో జ్ఞానియొక్క శరీరంనుండి ఉత్క్రమణం లేదు అన్నట్లయితే, న = కాదు, శారీరాత్ = జీవునినుండి నిషేధింపబడడంవల్ల" అని సూత్రార్థం. (ఇది పూర్వపక్ష సూత్రం).

**అమృతత్వమితి** :- "**అమృతత్వం చానుపోష్య**" అనే విశేషణంవల్ల (విశేషించి చెప్పడంవల్ల) ఆత్యన్తికమైన అమృతత్వంలో (నిర్గుణబ్రహ్మ సాక్షాత్కారం చేసికొన్నవానికి కలిగే పరిపూర్ణమోక్షంలో) గతి, ఉత్క్రమణము ఉండవు అని అంగీకరింపబడింది. వాని విషయంలో కూడ ఏ కారణంచేతనైనా ఉత్క్రమణం ఉండవచ్చును అని ఆశంకించుకొని నిషేధిస్తున్నాడు. "**అథాకామయమానో....అప్యేతి**" ఎవడైతే కోరడో, కోరికలు లేనివాడో వాసనారూపంలో కూడ కామాలు లేనివాడో, పరమానందాన్ని పొందాడో వాని ప్రాణాలు ఉత్క్రమించవు. బ్రహ్మగానే ఉన్న అతడు బ్రహ్మనే పొందుతాడు) అని పరవిద్యకు సంబంధించిన ఉత్క్రమణప్రతిషేధం ఉండడంవల్ల పరబ్రహ్మవేత్తయొక్క దేహంనుండి ప్రాణోత్క్రమణం లేదు అన్నట్లయితే - అది కాదని చెప్పబడుచున్నది. ఎట్లు తెలుస్తున్నది? మరొక శాఖలో "**న తస్మాత్ ప్రాణా ఉత్క్రామన్తి**" (వానినుండి ప్రాణాలు ఉత్క్రమించవు) అని పంచమీప్రయోగంవల్ల సంబంధసామాన్యాన్ని చెప్పే (**అథాకామయమాన** ఇత్యాదివాక్యంలో ఉన్న) షష్ఠి మరొక శాఖలో ఉన్న పంచమిచేత సంబంధవిశేషంలో

నిలుపబడుతుంది. (వాని యొక్క ప్రాణాలు అని సామాన్యరూపంలో చెప్పిన దీనిని అపాదానకారకంగా గ్రహించి, వానినుండి అని అర్థం చెప్పుకోవాలి). తస్మాత్ అన్నపుడు అభ్యుదయనిః శ్రేయసాలలో అధికృతుడైన దేహి (జీవుడు) సంబంధిస్తాడు కాని దేహం కాదు (తచ్ఛబ్దంచేత ప్రధానుడైన జీవుణ్ణి గ్రహించి జీవునినుండి అని అర్థం చెప్పుకోవాలి కాని దేహంనుండి అని అర్థం చెప్పకూడదు). అందువల్ల దేహంనుండి లేచిపోవ నున్న జీవునినుండి ప్రాణాలు ఉత్క్రమించవు, అవి వానితోనే ఉంటా యని అర్థం. 12

## భాష్యమ్

సప్రాణస్య చ ప్రవసతో భవత్యుత్క్రాన్తిర్దేహాదిత్యేవం ప్రాప్తే ప్రత్యుచ్యతే-

## సూ. స్పష్టో హ్యేకేషామ్. 4.2.13

న తదస్తి యదుక్తం పరబ్రహ్మవిదోఽపి దేహాదస్త్యుత్క్రాన్తిః ప్రతిషేధస్య దేహ్యాపాదానత్వాదితి, యతో దేహాపాదాన ఏవోత్క్రాన్తిప్రతిషేధ ఏకేషాం సమామ్నాతౄణాం స్పష్ట ఉపలభ్యతే. తథాహి - ఆర్తభాగప్రశ్నే - "యత్రాయం పురుషో మ్రియతే ఉదస్మాత్ప్రాణాః క్రామన్త్యాహో నేతి" (బృ.ఉ. 3.2.11) ఇత్యత్ర "నేతి హోవాచ యాజ్ఞవల్క్యః" (బృ.ఉ. 3.2.11) ఇత్యనుత్క్రాన్తిపక్షం పరిగృహ్య న తర్హ్యయమనుత్క్రాన్తేషు ప్రాణేషు మ్రియతే ఇత్యస్యామాశఙ్కాయామ్ - "అత్రైవ సమవలీయన్తే" ఇతి ప్రవిలయం ప్రాణానాం ప్రతిజ్ఞాయ తత్సిద్ధయే "స ఉచ్ఛ్వయత్యాధ్మాయత్యాధ్మాతో మృతః శేతే" (బృ.ఉ. 3.2.11) ఇతి సశబ్దపరామృష్టస్య ప్రకృతస్యోత్క్రాన్త్యవధేరుచ్ఛ్వయనాదీని సమామనన్తి. దేహస్య చైతాని స్యుర్న దేహినః. తత్సామాన్యాత్ "న తస్మాత్ప్రాణా ఉత్క్రామన్త్యత్రైవ సమవలీయన్తే" ఇత్యత్రాప్యభేదోపచారేణ దేహాపాదానస్యైవోత్క్రమణస్య ప్రతిషేధః, యద్యపి ప్రాధాన్యం దేహినః ఇతి వ్యాఖ్యేయం యేషాం పఞ్చమీపాఠః. యేషాం తు షష్ఠీపాఠస్తేషాం విద్వత్సంబన్ధిన్యుత్క్రాన్తిః ప్రతిషిధ్యత ఇతి ప్రాప్తోత్క్రాన్తి ప్రతిషేధార్థత్వాదస్య వాక్యస్య దేహాపాదానైవ సా ప్రతిషిద్ధా

భవతి, దేహాదుత్క్రాన్తిః ప్రాప్తా న దేహినః.

బాలానందిని

సప్రాణస్యేతి :- ప్రాణంతో కూడిన జీవుడు మరణసమయంలో దేహంనుండి ఉత్క్రమిస్తాడు అని ప్రాప్తించగా దానికి సమాధానం చెప్పబడుచున్నది.

స్పష్ట ఇతి :- ప్రతిషేధం దేహ్యపాదానకం గాన బ్రహ్మవేత్త కూడ దేహంనుండి అపక్రమిస్తాడు అని ఏది చెప్పబడింది అది లేదు (యుక్తం కాదు). ఎందువల్ల ననగా కొందరు సమామ్నాతల (కొన్ని శాఖలలో పఠించినవాళ్ళ) ప్రకారం ఉత్క్రాంతిప్రతిషేధం దేహాపాదానకమే అని స్పష్టంగా తెలుస్తూన్నది.

వి. బ్రహ్మవేత్తకు దేహం నుండి ఉత్క్రమణం లేదు అని సిద్ధాంతం. అది కాదు - వానికి కూడ ఉత్క్రాంతి ఉంటుం దని పూర్వపక్షి అభిప్రాయం. కాణ్వశాఖలో "న తస్య ప్రాణా ఉత్క్రామన్తి" అని చెప్పబడింది. "తస్య" అనే షష్ఠీవిభక్తి సంబంధసామాన్యాన్ని బోధిస్తుంది గాన వాని దేహంయొక్క ప్రాణాలు ఉత్క్రమించవు అని అర్థం చెప్పడానికి శక్యం అయితే కావచ్చును. కాని మాధ్యందినశాఖలో "న తస్మాత్ ప్రాణా ఉత్క్రమన్తి" అని ఉన్నది. 'తస్మాత్' అనేది పంచమీవిభక్తిలో ప్రయోగింపబడింది. ఇది అపాదానేపంచమి (దేని నుండి మరొకటి విడిపడుతుందో అది అపాదానం). ఇక్కడ తచ్ఛబ్దంచేత జీవుణ్ణి గ్రహించాలి. అందుచేత జీవునినుండి ప్రాణాలు ఉత్క్రమించవు అని ఈ వాక్యానికి అర్థం. దీనిని పట్టి కాణ్వశాఖలో ఉన్న 'తేషామ్' అనే శబ్దంచేత బోధించబడే సంబంధ సామాన్యాన్ని అపాదానరూపసంబంధవిశేషంగా గ్రహించి అక్కడ కూడ జీవునినుండి ప్రాణం ఉత్క్రమించదు అనే అర్థం చెప్పాలి. ఈ విధంగా ఈ వాక్యాలవల్ల జీవునినుండి ప్రాణం దూరం కాదు అని మాత్రమే లభిస్తుంది కాని జీవుడు దేహంనుండి ఉత్క్రమించదు అని లభించదు. ప్రాణసంహితుడైన జీవుడు శరీరంనుండి ఉత్క్రమిస్తా డని అంగీకరించాలి అని పూర్వపక్షి ఆశయం. కాని మరొక చోట ప్రాణం దేహంనుండి ఉత్క్రమించదు అని స్పష్టంగా కనబడుతూన్నది గాన ఇక్కడ (పై రెండు వాక్యాలలోనూ కూడ) ఈ అర్థమే గ్రహించా లని ఈ సిద్ధాంతసూత్రం ప్రతిపాదిస్తూన్నది. (దేహాపాదానకోత్క్రాంతి అనగా దేహంనుండి ఉత్క్రమించడం అని అర్థం)

**తదా హీతి** :- ఎందువల్ల ననగా "యత్రాయం...నేతి" (పురుషుడు మరణించినప్పుడు వానినుండి ప్రాణాలు ఉత్క్రమిస్తాయా ఉత్క్రమించవా) అని ఆర్తభాగుడు ప్రశ్నించగా "నేతి హోవాచ యాజ్ఞవల్క్యః" (ఉత్క్రమించవు అని యాజ్ఞవల్క్యు డన్నాడు) అని అనుత్క్రాంతిపక్షాన్ని (ఉత్క్రమించవు అనే పక్షాన్ని) స్వీకరించి, అట్లైతే, ప్రాణాలు ఉత్క్రమించకపోతే వీడు మరణించడు కదా అని ఆశంక కలగగా, "అత్రైవ సమవలీయన్తే" (ఇక్కడనే విలీనం అవుతాయి) అని ప్రాణాల ప్రవిలయాన్ని చెప్పి, అవి ప్రలీన మవుతాయి అనేదానికి ఉపోద్బలకంగా - "సః ఉచ్ఛ్వయత్యాధ్మాయత్యాధ్మాతో మృతః శేతే" (అది ఉబ్బుతుంది, భేరివలె చప్పుడవుతుంది) అని అంటూ 'సః' అనే శబ్దంచేత నిర్దేశించబడిన, ఉత్క్రాంతికి అవధియైన (దేనినుండి ఉత్క్రాంతి జరుగుతున్నదో అట్టి) ప్రకృతమైనదానికి ఉచ్ఛ్వసనాదులు జరుగుతా యని చెపుతున్నారు. ఇవి దేహానికి కలుగుతాయి కాని దేహికి కలగవు. ఈ వాక్యంతో సాదృశ్యం ఉండడంవల్ల "న తస్మాత్.... సమవలీయన్తే" అనే చోట కూడ అభేదోపచారంచేత (దేహానికి దేహికి అభేదాన్ని ఆరోపించడంచేత) దేహికి ప్రాధాన్యం ఉన్నా, పంచమీపాఠం ఉన్నవాళ్ళచేత కూడ, దేహాపాదానకమైన ఉత్క్రమణాన్నే నిషేధిస్తున్నట్లు వ్యాఖ్యానింపబడాలి. (దేహికి ప్రాధాన్యం ఉన్న మాట నిజమే. కాని శ్రుత్యంతరాన్ని కూడ సమన్వయించుకొని అర్థం చెప్పాలి. దేహంనుంచి ప్రాణాలు నిష్క్రమించవు అని ఆ శ్రుతి చెపుతూన్నది. అందుచేత ప్రాధాన్యం దేహికి ఉన్నా కూడ "తస్మాత్" అనేదానికి దేహంనుండి అనియే అర్థం చెప్పాలి. దేహానికి దేహికి అభేదాన్ని అరోపించి ఇలా చెప్పవచ్చును). ("న తస్య ప్రాణా ఉత్క్రామన్తి" అని) షష్ఠీపాఠం ఉన్నవాళ్ళ పక్షంలోనైతే విద్వాంసునికి సంబంధించిన ఉత్క్రమణం (విద్వాంసుని ఉత్క్రమణం) నిషేధించబడుచున్నది. ఈ విధంగా ఈ వాక్యం ప్రాప్తమైన ఉత్క్రాంతిని (సామాన్యజీవులకు వలె విద్వాంసునికి కలగవచ్చును అనుకొనే ఉత్క్రాంతిని) నిషేధించడంకోసం ఉద్దిష్టమైనది. ఈ వాక్యంచేత దేహాపాదనకమైన ఉత్క్రాంతియే నిషేధించబడుచున్నది, ఉత్క్రమణం దేహంనుండే ప్రాప్తమైనది కాని దేహినుండి కాదు.

## భాష్యమ్

అపి చ - "చక్షుష్టో వా మూర్ధ్నో వాన్యేభ్యో వా శరీరదేశేభ్యస్తముత్క్రామన్తమనూత్క్రామతి, ప్రాణమనూత్క్రామన్తం సర్వే ప్రాణా అనూత్క్రామన్తి" (బృ.ఉ.

4.4.2) ఇత్యేవమవిద్వద్విషయేషు సప్రపఞ్చముత్క్రమణం సంసారగమనం చ దర్శయిత్వా "ఇతి తు కామయమానః" (బృ.ఉ. 4.4.6) ఇతి వ్యపదిశ్య విద్వాంసం యది తద్విషయేఽప్యుత్క్రాన్తిమేవ ప్రాపయేదసమఞ్జస ఏవ వ్యపదేశః స్యాత్. తస్మాదవిద్వద్విషయే ప్రాప్తయోర్గత్యుత్క్రాన్త్యోర్విద్వద్విషయే ప్రతిషేధ ఇత్యేవమేవ వ్యాఖ్యేయం వ్యపదేశసార్థవత్త్వాయ. న చ బ్రహ్మవిదః సర్వగతబ్రహ్మాత్మభూతస్య ప్రక్షీణకామకర్మణ ఉత్క్రాన్తిర్గతిర్వోపపద్యతే, నిమిత్తాభావాత్, "అత్ర బ్రహ్మ సమశ్నుతే" ఇతిచైవంజాతీయకాః శ్రుతయో గత్యుత్క్రాన్త్యోరభావం సూచయన్తి. 13.

బాలానందిని

**అపి చేతి** :- మరొక విషయ మేమనగా - "**చక్షుష్టో....అనూత్క్రామన్తి**" (నేత్రంనుండి గాని, శిరస్సునుండి గాని, ఇతరశరీరభాగాలనుండి గాని ఉత్క్రమిస్తున్న ఆ జీవుణ్ణి అనుసరించి ప్రాణం ఉత్క్రమిస్తుంది. ప్రాణాన్ని అనుసరించి అన్ని ప్రాణాలూ ఉత్క్రమిస్తాయి) ఇత్యాదులైన అవిద్వాంసునకు సంబంధించిన వాక్యాలలో సవిస్తరంగా ఉత్క్రమణాన్ని, సంసారగమనాన్ని చూపి "**ఇతి ను కమాయమానః**" (కోరిక లున్నవాడు ఈ విధంగా నిష్క్రమిస్తాడు) అని అవిద్వాంసునికి సంబంధించిన కథను ఉపసంహరించి "**అథాకామయమానః**" (ఇంక కామాలు లేనివాడు) అని విద్వాంసుణ్ణి నిర్దేశించి, వాని విషయంలో కూడ ఉత్క్రమణాన్నే ప్రాపింపచేస్తే ఈ నిర్దేశం అసమంజసమే అవుతుంది. అందుచేత (వేరుగా విద్వాంసుణ్ణి గూర్చి) ఈ నిర్దేశం సార్థకం కావాలంటే అవిద్వాంసుని విషయంలో ప్రాప్తించే గత్యుత్క్రాంతులు విద్వాంసుని విషయంలో నిషేధించబడుతున్నా యనే వ్యాఖ్యానించాలి. కామములు, కర్మలు క్షీణించి సర్వగతబ్రహ్మస్వరూపుడైన బ్రహ్మవేత్తకు నిమిత్తం లేనప్పుడు ఉత్క్రమణం గాని, గమనం కాని ఉపపన్నం కావు కదా? "**అత్ర బ్రహ్మ సమశ్నుతే**" (బ్రహ్మను ఇక్కడనే పొందుతాడు) ఇత్యాదిశ్రుతులు గత్యుత్క్రాంతులు లేవని సూచిస్తున్నాయి. 13

## సూ. స్మర్యతే చ. 4.2.14

స్మర్యతేఽపి చ మహాభారతే గత్యుత్క్రాన్త్యోరభావః -

**"సర్వభూతాత్మభూతస్య సమ్యగ్భూతాని పశ్యతః**
**దేవా అపి మార్గే ముహ్యన్త్యపదస్య పదైషిణః"** (మ.భ.శాంతి. 239.23)

ఇతి. నను గతిరపి బ్రహ్మవిదః సర్వగతబ్రహ్మాత్మభూతస్య స్మర్యతే - "శుకః కిల వైయాసకిర్ముముక్షురాదిత్యమణ్డలమభిప్రతస్థే. పిత్రా చానుగమ్యాహూతో భో ఇతి ప్రతిశుశ్రావ" ఇతి. న. సశరీరస్యైవాయం యోగబలేన విశిష్టదేశ ప్రాప్తిపూర్వకః శరీరోత్సర్గ ఇతి ద్రష్టవ్యమ్, సర్వభూతదృశ్యత్వా ద్యుపన్యాసాత్. న హ్యశరీరం గచ్ఛన్తం సర్వభూతాని ద్రష్టుం శక్నుయుః. తథా చ తత్రైవోపసంహృతమ్-

**"శుకస్తు మారుతాచ్ఛీఘ్రాం గతిం కృత్వాన్తరిక్షగః,**
**దర్శయిత్వా ప్రభావం స్వం సర్వభూతగతోఽభవత్"** (మ.భా.శాంతి. 333.20)

ఇతి. గతిశ్రుతీనాం తు విషయముపరిష్టాద్వ్యాఖ్యాస్యామః 14

### బాలానందిని

**స్మర్యత ఇతి :-** "స్మర్యతే చ = స్మృతిలో కూడ చెప్పబడుచున్నది" అని సూత్రార్థం

**స్మర్యత ఇతి :-** మహాభారతంలో కూడ (జ్ఞానికి) గత్యుత్క్రాంతులు లేకపోవడం **"సర్వభూతాత్మభూతస్య...పదైషిణః"** అని చెప్పబడుచున్నది. (సర్వభూతాలకు ఆత్మయైనవాడు, భూతాలను బాగుగా (బ్రహ్మరూపంగా) చూస్తున్నవాడు అయిన, గంతవ్యమైన స్థాన మేదీ లేని, జ్ఞానియొక్క మార్గం విషయంలో పదాన్ని కోరే దేవతలు కూడ మోహం చెందుతారు అని దీని అర్థం). (ప్రశ్న) మోక్షం పొంద దలచిన వ్యాసపుత్రుడైన శుకుడు ఆదిత్యమండలాన్ని గూర్చి ప్రయాణం అయ్యాడు. అనుసరించి వెడుతూన్న తండ్రి పిలవగా 'ఓ' అని పలికా డట అని సర్వగతబ్రహ్మాత్మభూతుడైన బ్రహ్మవేత్తకు కూడ గతి ఉన్న దని స్మృతిలో చెప్పబడింది కదా? (సమాధానం) అది కాదు విషయం.

అతడు శరీరంతోనే ఉండి యోగబలంచేత విశిష్టమైన ఒక ప్రదేశం చేరి అక్కడ శరీరం విడిచిపెట్టాడు అని గ్రహించాలి. అందుచేతనే అప్పుడు అతనిని అన్నిభూతాలూ చూచాయి అని చెప్పబడింది. శరీరం లేకుండా వెడుతున్నవానిని అన్ని భూతాలూ చూడజాలవు కదా? ఈ విధంగా అక్కడనే "శుకస్తు...అభవత్"అని ఉపసంహరించబడింది (అంతరిక్షమార్గంలో ఉన్న శుకుడైతే వాయువుకంటె శీఘ్రమైన గమనం చేసి, తన ప్రభావాన్ని చూపి సర్వభూతాలలో లీన మైపోయాడు అని దీని అర్థం.) అందువల్ల పరబ్రహ్మవేత్తకు గత్యుత్క్రాంతులు లేవు. గతిని చెప్పే శ్రుతుల విషయాన్ని మున్ముందు (కార్యం బాదరిః .... " బ్ర. సూ. 4.3.7 అనేచోట) వివరిస్తాం. 14

ప్రతిషేధాధికరణం సమాప్తం

## సూ. వాగాదిలయాధికరణమ్ సూ. 15

## సూ. తాని పరే తథా హ్యాహ. 4.2.15

తాని పునః ప్రాణశబ్దోదితానీన్ద్రియాణి భూతాని చ పరబ్రహ్మవిదస్తస్మిన్నేవ పరస్మిన్నాత్మని ప్రలీయన్తే. కస్మాత్? తథా హ్యాహ శ్రుతిః - "ఏవమేవాస్య పరిద్రష్టురిమాః షోడశ కలాః పురుషాయణాః పురుషం ప్రాప్యాస్తం గచ్ఛన్తి" (ప్ర.ఉ. 6.5) ఇతి. నను "గతాః కలాః పఞ్చదశ ప్రతిష్ఠాః" (ము. ఉ. 3.2.7) ఇతి విద్వద్విషయైవాపరా శ్రుతిః పరస్మాదాత్మనోఽన్యత్రాపి కలానాం ప్రలయమాహ స్మ. న. సా ఖలు వ్యవహారాపేక్షా: పార్థివాద్యాః కలాః పృథివ్యాదీరేవ స్వప్రకృతీరపియన్తీతి. ఇతరా తు విద్వత్ప్రతిపత్త్యపేక్షా కృత్స్నం కలాజాతం పరబ్రహ్మవిదో బ్రహ్మైవ సంపద్యత ఇతి. తస్మాదదోషః 15

### బాలానందిని

**తానీతి** :- "తాని=ఇంద్రియాదులు, పరే = పరబ్రహ్మయందు లీనమవుతాయి. తథా = అట్లు, అహ హి = శ్రుతి చెప్పుచున్నది కదా" అని సూత్రార్థం.

**తానీతి** :- పరబ్రహ్మవేత్తయొక్క ప్రాణాలు అని చెప్పబడే ఇంద్రియాలు, భూతాలు కూడా ఆ పరమాత్మయందే లీన మవుతాయి. ఎందు వల్ల? "**ఏవమేవాస్య...గచ్ఛన్తి**" (ఈ పరిద్రష్టయొక్క, అనగా అంతటా బ్రహ్మనే చూచే జ్ఞానియొక్క, పురుషుడే స్థానంగా గల **ఈ** షోడశకలలు పురుషుణ్ణే పొంది లీన మవుతాయి) అను శ్రుతి ఇట్లు చెప్పుచున్నది. (ప్రశ్న) విద్వాంసునికే సంబంధించిన "గతాః కలాః పఞ్చదశ ప్రతిష్ఠామ్" (పదిహేను కలలు తమ తమ స్థానాలలో (ప్రకృతులలో) లీనమైనవి) అను మరొక శ్రుతి కలలు పరమాత్మకంటె భిన్నమైన మరొకచోట కూడ లీన మగుచున్నట్లు చెప్పుచున్నది కదా? (సమాధానం) అది కాదు. పృథివ్యాదులనుండి పుట్టిన కలలు తమ ప్రకృతులైనపృథివ్యాదులలోనే లీనమవుతాయి అనేది లోకవ్యవహారాన్ని అనుసరించి చెప్పినది. మరొక శ్రుతియైతే (ఏవమేవాస్య ఇత్యాదిశ్రుతి) విద్వాంసుని జ్ఞానాన్ని అపేక్షించినది; అనగా వాని బ్రహ్మజ్ఞానాన్ని దృష్టిలో పెట్టుకొని చెప్పబడినది. అది పరబ్రహ్మవేత్తయొక్క సమస్తకలల సముదాయమూ కూడ బ్రహ్మయే అవుతుం దని చెప్పుచున్నది. అందుచేత దోషం లేదు. (పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు, మనస్సు, పంచభూతతన్మాత్రలు లేదా పంచప్రాణాలు - ఇవి షోడశకలలు. పార్థివాలైన మనోఘ్రాణాలను ఒక్కటిగా గ్రహిస్తే పదిహేను కలలు (బ్రహ్మామృతవర్షిణి) 15.

**వాగాదిలయాధికరణం సమాప్తం**

## 8. అవిభాగాధికరణమ్. సూ. 16

## సూ. అవిభాగో వచనాత్. 3.2.16

న పునర్విదుషః కలాప్రలయః కిమితరేషామివ సావశేషో భవతి అహోస్విన్నిరవశేష ఇతి. తత్ర ప్రలయసామాన్యాత్ శక్త్యవశేషతాప్రాప్తౌ బ్రవీతి - అవిభాగాపత్తిరేవేతి. కుతః? వచనాత్. తథాహి కలాప్రలయముక్త్వా వక్తి - "**భిద్యేతే తాసాం నామరూపే పురుష ఇత్యేవం ప్రోచ్యతే. స ఏషోఽకలోఽమృతో భవతి**" (ప్ర. ఉ. 6.5) ఇతి. అవిద్యానిమిత్తానాం చ కలానాం న విద్యానిమిత్తే ప్రలయే సావశేషత్వోపపత్తిః. తస్మాదవిభాగ ఏవేతి. 16

## బాలానందిని

**అవిభాగ ఇతి :-** "వచనాత్ = శ్రుతివచనంవల్ల, అవిభాగః = బ్రహ్మలో ఇవి పూర్తిగా లీన మవుతాయి" అని సూత్రార్థం.

**న ఇతి :-** విద్వాంసుని కలాప్రలయం ఇతరులది వలె సావశేషంగా ఉంటుందా లేక నిరవశేషంగా జరుగుతుందా? ఇది కూడ అన్ని ప్రలయాల వంటిదే గాన శక్తి శేషిస్తుంది అని ప్రాప్తించగా "అవిభాగాపత్తిరేవ" అని చెపుతున్నాడు. ఎందువల్ల? వచనంవల్ల. ఎందుచేత ననగా కలాప్రలయాన్ని చెప్పి "భిద్యేతే....భవతి" (వాటి నామరూపాలు భిన్నములై పోతాయి. కేవలం పురుషుడు అని మాత్రమే చెప్పబడతాడు. అప్పుడు అకలుడు (కలాశూన్యుడు) అమృతుడు అవుతాడు) అని శ్రుతి (శక్తితో సహా వాటి ప్రలయాన్ని) చెప్పుచున్నది. అవిద్యవల్ల పుట్టిన కలలు విద్యవల్ల ప్రలయం కలిగినప్పుడు ఇంక ఏమీ మిగలడం ఉపపన్నం కాదు కూడ. అందువల్ల అవిభాగమే. 16

**అవిభాగాధికరణం సమాప్తం**

## 9. తదోకోగ్రాధికరణమ్. సూ. 17

### సూ. తదోకోగ్రజ్వలనం తత్ప్రకాశితద్వారో విద్యాసామర్థ్యాత్తచ్ఛేషగత్యను స్మృతియోగాచ్చ హార్దానుగ్రహీతః శతాధికయా. 4.2.17

గతా ప్రాసఙ్గికీ పరవిద్యాగతా చిన్తా. సంప్రతిత్వపరవిద్యావిషయామేవ చిన్తామనువర్తయతి. సమానా చాసృత్యుపక్రమాద్విద్వదవిదుషోరుత్క్రాన్తిరిత్యుక్తమ్. తమిదానీం సృత్యుపక్రమం దర్శయతి. తస్యోపసంహృతవాగాదికలాపస్య, ఉచ్చిక్రమిషతో విజ్ఞానాత్మన ఓక ఆయతనం హృదయమ్, "స ఏతాస్తేజోమాత్రాః సమభ్యాదదానో హృదయమేకాన్వవక్రామతి" ఇతి శ్రుతేః, తదగ్రజ్వలనం తత్పూర్వికా చక్షురాదిస్థానాపాదానా చ ఉత్క్రాన్తిః శ్రూయతే "తస్య హైతస్య హృదయస్యాగ్రం ప్రద్యోతతే, తేన ప్రద్యోతేనైష ఆత్మా నిష్క్రామతి చక్షుషో వా మూర్ధ్నో వాన్యేభ్యో వా శరీరదేశేభ్యః" (బృ.ఉ. 5.4.2) ఇతి. సా కిమనియమేనైవ

విద్వదవిదుషోర్భవతి, అథాస్తి కశ్చిద్విదుషో విశేషనియమ ఇతి విచికిత్సాయాం శ్రుత్యవిశేషాదనియమప్రాప్తా ఆచష్టే-సమానేఽపి హి విద్వదవిదుషోః హృదయాగ్ర ప్రద్యోతనే తత్ప్రకాశితద్వారత్వే చ మూర్ధస్థానాదేవ విద్వాన్నిష్క్రామతి, స్థానాన్తరేభ్యస్త్వితరే. కుతః? విద్యాసామర్థ్యాత్. యది విద్వానపీతరవద్యతః కుతశ్చిద్దేహదేశాదుత్క్రామేత్ నైవోత్కృష్టం లోకం లభేత. తత్రానర్థికైవ విద్యా స్యాత్. తచ్ఛేషగత్యనుస్మృతియోగాచ్చ. విద్యాశేషభూతా చ మూర్ధన్యనాడీసంబద్ధా గతిరనుశీలయితవ్యా విద్యావిశేషేషు విహితా తామభ్యస్యంస్తయైవ ప్రతిష్ఠతే ఇతి యుక్తమ్. తస్మాద్ధృదయాలయేన బ్రహ్మణా సూపాసితేనానుగృహీతః తద్భావం సంపన్నో విద్వాన్ మూర్ధన్యయైవ శతాధికయా, శతాదతిరిక్తయా ఏకశతతయ్యా నాడ్యా నిష్క్రామతి ఇతరాభిరితరే. తథా హి - హార్దవిద్యాం ప్రకృత్య సమామనన్తి -

"శతం చైకా చ హృదయస్య నాడ్యస్తాసాం మూర్ధానమభినిఃసృతైకా,

తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవన్తి" (ఛా.ఉ.8.6.6) ఇతి . 17

బాలానందిని

**తదోక ఇతి** :- తదోకోగ్రజ్వలనమ్=ఉత్క్రమించ నున్న జీవునియొక్క స్థానమైన హృదయముయొక్క అగ్రముయొక్క(నాడీద్వారముఖముయొక్క)జ్వలనం(అనగా పొందదగి యున్న కర్మఫలంయొక్క జ్ఞానం)కలుగుతుంది. తత్ప్రకాశితద్వారః=దానిచేత ప్రకాశింపచేయబడిన ద్వారంకలవా డవుతాడు. విద్యాసామర్థ్యాత్ =దహరాదివిద్యల సామర్థ్యంవల్ల, తచ్ఛేషగత్యనుస్మృతియోగాచ్చ = సగుణవిద్యకు శేషమైన మార్గంయొక్క ధ్యానవిధానంవల్ల, హార్దానుగృహీతః = హృదయంలో ఉన్న బ్రహ్మచేత అనుగ్రహింప బడినవాడై, శతాధికయా = నూటఒకటవదైన బ్రహ్మనాడి ద్వారా ఉత్క్రమణం చేస్తాడు" అని సూత్రార్థం.

సమాప్తేతి :- పరవిద్యకు సంబంధించిన ప్రాసంగికమైన విచారం పూర్తి అయినది. ఇప్పుడు అపరవిద్యకే సంబంధించిన విచారాన్ని కొనసాగిస్తున్నాడు. మార్గం ప్రారంభంవరకు విద్వదవిద్వాంసుల ఉత్క్రమణం సమానమే అని చెప్పబడింది. ఇప్పుడు ఆ మార్గప్రారంభాన్ని గూర్చి చెపుతున్నాడు. వాగాదిసముదాయాన్ని ఉపసంహరించుకొని పైకి లేచిపోవడానికి సిద్ధంగా ఉన్న జీవుని స్థానం "స ఏతాః....అన్వవక్రామతి" (ఆ జీవుడు తేజోమాత్రల నన్నింటినీ (ఇంద్రియా లన్నింటినీ) గ్రహించి..హృదయాన్ని చేరుతాడు) అను శ్రుతి ననుసరించి, హృదయం, ముందుగా దాని అగ్రం, జ్వలిస్తుం దనీ, తరవాత చక్షురాదిస్థానాలనుండి నిష్క్రమణం జరుగుతుం దనీ "తస్య...శరీరదేశేభ్యః" (వాని హృదయం ప్రద్యోతిస్తుంది, అనగా భావిఫలస్ఫురణం కలుగుతుంది. ఆ ప్రద్యోతంతో ఈ ఆత్మ నేత్రంనుండి గాని, శిరస్సునుండి గాని, ఇతర శరీరదేశాలనుండి గాని నిష్క్రమిస్తుంది) అని వినబడుచున్నది. ఆ ఉత్క్రమణం నియమం ఏదీ లేకుండా విద్వాంసునికీ అవిద్వాంసునికీ కూడ సమంగానే జరుగుతుందా లేదా విద్వాంసునికి ఏదైన విశేషనియమం ఉన్నదా అని సందేహం. శ్రుతిలో విశేషం ఏదీ చెప్పబడలేదు గాన నియమం లేదు అని ప్రాప్తించగా చెపుతున్నాడు. హృదయప్రద్యోతనమూ, దానిచేత ద్వారం ప్రకాశింపచేయబడడం అనేవి సమంగానే ఉన్నా కూడ విద్వాంసుడు మూర్ధస్థానంనుంచే నిష్క్రమిస్తాడు, ఇతరులు ఇతర స్థానాలనుండి నిష్క్రమిస్తారు. ఎందువల్ల? విద్యాసామర్థ్యంవల్ల, విద్వాంసుడు కూడా ఇతరులవలె ఏదో ఒక ప్రదేశంనుండి నిర్గమిస్తే ఉత్కృష్టమైన లోకాన్ని పొందడు. అలాంటప్పుడు విద్య నిరర్థకం అవుతుంది. తచ్ఛేషగత్యనుస్మృతియోగంవల్ల కూడ (మూర్ధస్థానంనుండే నిర్గమిస్తాడు). (దహరాదివిద్యోపాసకు డైన విద్వాంసుడు) ఆ యా విద్యలలో చెప్పబడిన విద్యకు శేషమైన, మూర్ధన్యనాడికి సంబంధించిన గతిని పరిశీలించాలి (ధ్యానించాలి) (ఇదే తచ్ఛేషగత్యనుస్మృతియోగం). దానిని అభ్యసిస్తూన్న అతడు ఆ మార్గంచేతనే బయలుదేరుతా డని చెప్పడం యుక్తం. అందువల్ల బాగా ఉపాసించబడిన, హృదయనివాసి యైన బ్రహ్మచేత అనుగ్రహింపబడి తద్భావాన్ని పొందిన (ఆ బ్రహ్మయొక్క నిరంతరధ్యానంచేత బ్రహ్మయే అయినాడా అన్నట్లున్న) ఆ విద్వాంసుడు శిరస్సునందున్న, శతాధికయా = నూరుకంటె అధికమైన, నూటఒకటవదైన, నాడి ద్వారా నిష్క్రమిస్తాడు, ఇతరులు ఇతరనాడుల ద్వారా నిష్క్రమిస్తారు. అందుచేతనే హృదయవిద్యను చెప్పే సందర్భంలో "శతం....భవన్తి" హృదయానికి సంబంధించిన నూట ఒక్క నాడు లున్నాయి. వాటిలో ఒకటి శిరస్సు వైపు వెడుతుంది. దాని ద్వారా పైకి వెళ్ళేవాడు అమృతత్వాన్ని

పొందుతాడు. మిగిలిన నాడులు ఇతరదిశలలో నిష్క్రమించడానికి ఉపయోగిస్తాయి) అని చెపుతున్నారు.

తదోకోధికరణం సమాప్తం

## 10. రశ్మ్యధికరణమ్. సూ. 18 - 19

## సూ. రశ్మ్యనుసారీ. 4.2.18

అస్తి "దహరోఽస్మిన్నన్తరాకాశః" ఇతి హార్దవిద్యా. "అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరం పుణ్డరీకం వేశ్మ" (ఛా.ఉ. 8.1.1) ఇత్యుపక్రమ్య విహితా. తత్ప్రక్రియాయాం "అథయా ఏతా హృదయస్య నాడ్యః" ఇత్యుపక్రమ్య సప్రపఞ్చం నాడీరశ్మిసంబన్ధముక్త్వోక్తమ్ - "అథ యత్రైతస్మాచ్ఛరీరాదుత్క్రామత్యథైతైరేవ రశ్మిభిరూర్ధ్వమాక్రమతే" (ఛా.ఉ. 8.6.5)ఇతి. పునశ్చోక్తమ్ - "తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి" (ఛా.ఉ. 8.6.6) ఇతి. తస్మాచ్ఛతాధికయా నాడ్యా నిష్క్రామన్ రశ్మ్యనుసారీ నిష్క్రామతీతి గమ్యతే. తత్కిమవిశేషేణైవాహని రశ్మ్యనుసారిత్వమ్, అహోస్విదహన్యేవేతి సంశయే సత్యవిశేషశ్రవణాదవిశేషేణైవ తావద్రశ్మ్యనుసారీతి ప్రతిజ్ఞాయతే. 18

బాలానందిని

రశ్మీతి :- "రశ్మ్యనుసారీ = సూర్యరశ్ములను అనుసరించినవాడై (పైకి వెడతాడు)" అని సూత్రార్థం.

అస్తీతి :- "దహరోఽస్మిన్నన్తరాకాశః" అని హార్ద (హృదయసంబంధి) విద్య ఒకటి ఉంది, ఇది "అథ...వేశ్మ" అని ఉపక్రమించి విధించబడింది. ఆ ప్రక్రియలోనే "అథ యా ఏతా హృదయస్య నాడ్యః" అని ఉపక్రమించి, సవిస్తరంగా నాడులకు సూర్యరశ్ములకు ఉన్న సంబంధాన్ని చెప్పి "అథ...ఆక్రమతే" (ఈ శరీరంనుండి ఉత్క్రమించేటప్పుడు రశ్ములద్వారా పైకి వెడతాడు) అని చెప్పబడింది. మళ్ళీ "తయో...ఏతి" అని కూడా చెప్పబడింది. దీనిని పట్టి నూట ఒకటవ నాడి ద్వారా నిష్క్రమించేవాడు రశ్ములను అనుసరించి నిష్క్రమిస్తాడు అని తెలుస్తూన్నది. పగలు మరణించినా రాత్రి మరణించినా

విశేషం ఏదీ లేకుండా రశ్ములను అనుసరిస్తాడా లేక పగలుమాత్రమేనా అని సంశయం కలగగా, విశేషం ఏదీ చెప్పబడలేదు గాన విశేషం లేకుండానే రశ్ములను అనుసరిస్తాడు అని ప్రతిజ్ఞ చేయబడుచున్నది. 18

**సూ. నిశి నేతి చేన్న సంబన్ధస్య యావద్దేహభావిత్వాద్దర్శయతి చ. 4.2.19**

అస్త్యహని నాడీరశ్మిసంబన్ధ ఇత్యహని మృతస్య స్యాద్రశ్మ్యనుసారిత్వమ్, రాత్రౌ తు ప్రేతస్య న స్యాత్, నాడీరశ్మిసంబన్ధవిచ్ఛేదాదితి చేత్, న. నాడీరశ్మిసంబన్ధస్య యావద్దేహభావిత్వాత్. యావద్దేహభావీ హి శిరాకిరణసంపర్కః, దర్శయతి చైతమర్థం శ్రుతిః "**అముష్మాదాదిత్యాత్ప్రతాయన్తే తా ఆసు నాడీషు సృప్తా ఆభ్యో నాడీభ్యః ప్రతాయన్తే తేఽముష్మిన్నాదిత్యే సృప్తాః**" (ఛా.ఉ. 8.6.2) ఇతి. నిదాఘసమయే చ నిశాస్వపి కిరణానువృత్తిరుపలభ్యతే ప్రతాపాదికార్యదర్శనాత్. స్తోకానువృత్తేస్తు దుర్లక్ష్యత్వమృత్వన్తరరజనీషు శైశిర్వేష్వివ దుర్దినేషు. "**అహరేవైతద్రాత్రౌ దధాతి**" ఇతి చైతదేవ దర్శయతి. యది చ రాత్రౌ ప్రేతో వినైవ రశ్మ్యనుసారేణోర్ధ్వమాక్రమేత రశ్మ్యనుసారానర్థక్యం భవేత్. న హ్యేతద్విశిష్యాధీయతే యో దివా ప్రైతి స రశ్మీనపేక్ష్యోర్ధ్వమాక్రమతే యస్తు రాత్రౌ సోఽనపేక్ష్యేతి. అథ తు విద్వానపి రాత్రిప్రాయణాపరాధమాత్రేణ నోర్ధ్వమాక్రమేత పాక్షికఫలా విద్యేత్యప్రవృత్తిరేవ తస్యాం స్యాత్, మృత్యుకాలానియమాత్. అథాపి రాత్రావుపరతోఽహరాగమముదీక్షేత అహరాగమేఽప్యస్య కదాచిదరశ్మిసంబన్ధార్హం శరీరం స్యాత్, పావకాది సంపర్కాత్. "**స యావత్ క్షిప్యేన్మనస్తావదాదిత్యం గచ్ఛతి**" (ఛా. ఉ. 8.6.5) ఇతి చ శ్రుతిరనుదీక్షాం దర్శయతి. తస్మాదవిశేషేణైవేదం రాత్రిందివం రశ్మ్యనుసరణమ్. 19

బాలానందిని

**నిశీతి** :- "నిశి = రాత్రియందు, నేతి చేత్ = రశ్మిసంబంధం ఉండదు అన్నట్లయితే, న = కాదు. సంబన్ధస్య = సంబంధం, యావద్దేహభావిత్వాత్ = దేహం

ఉన్నంతవరకు ఉంటుంది గాన. దర్శయతి చ = శ్రుతి కూడ చూపుచున్నది" అని సూత్రార్థం.

**అస్తీతి** :- పగలు నాడులకు రశ్మలకు సంబంధం ఉంటుంది గాన పగలు మరణించినవాడు రశ్ములను అనుసరించడం జరగవచ్చు. కాని (రాత్రియందు) నాడులకు రశ్ములకు సంబంధం విచ్ఛిన్నం అయిపోవడంవల్ల, రాత్రి మరణించినవానికి రశ్మ్యనుసరణం ఉండడానికి అవకాశం లేదు అని అన్నట్లయితే, అది యుక్తం కాదు నాడీరశ్ముల సంబంధం దేహం ఉన్నంతవరకూ ఉంటుంది. శిరాకిరణసంపర్కం (నాడీరశ్మిసంపర్కం) దేహం ఉన్నంత వరకూ ఉంటుంది కదా? ఈ విషయాన్ని - **"అముష్మాత్...సృప్తాః"** (నాడులు ఆదిత్యునినుండి బయలుదేరి విస్తరిస్తాయి. అవి ఈ నాడులతో సంబంధిస్తాయి. ఈ నాడుల ద్వారా వ్యాపిస్తాయి. ఆ రశ్ములు ఈ ఆదిత్యునితో సంబధిస్తాయి) అను శ్రుతి కూడ చెప్పుతున్నది. గ్రీష్మాదిఋతువులలో (రాత్రి కూడ వేడి కనబడుతుంది గాన) రాత్రులందు కూడ కిరణాలు అనువర్తించడం కనబడుతుంది. ఇతరఋతువుల రాత్రులలో నైతే, శిశిరఋతువునందలి దుర్దినాలలో వలె (పగలంతా సూర్యుడు కనబడకుండా మబ్బు మూసివేసిన దినం దుర్దినం)సూర్యకిరాణాలు కొంచెం అనువర్తించినా గూర్తించడం శక్యం కాదు. **"అహరేవైతద్రాత్రౌ దధాతి"** అను వాక్యం కూడ ఈ విషయాన్నే చూపుతూన్నది. "రాత్రియందు తాపం కనబడుతూన్నదనగా దానిని రాత్రియందు సూర్యుడే ఉంచుతున్నాడు" అని శ్రుతివాక్యనికి భావం. (ఆనందగిరి 2వ భాగం పే. 529). రాత్రి మరణించినవాడు రశ్ములను అనుసరించకుండగానే పైకి వెళ్ళే పక్షంలో రశ్మ్యనుసరణం వ్యర్థం అవుతుంది. పగలు మరణించినవాడు రశ్ముల ఆధారంతో పైకి వెడతాడనీ, రాత్రి మరణించినవాడు వాటి ఆపేక్ష లేకుండా వెడతాడనీ విశేషించి ఏమీ (శ్రుతిలో) చెప్పలేదు కదా? అలా కాక విద్వాంసుడు రాత్రి మరణించిన అపరాధమాత్రానికి పైకి వెళ్ళడు అని అంటే విద్య పాక్షికమైన ఫలాన్నే ఇస్తుం దని (కొందరికి ఇస్తుంది కొందరి కివ్వదు అని) చెప్పవలసివస్తుంది. మృత్యువు ఏ కాలంలో వస్తుందో చెప్పలేం కదా? రాత్రి మరణించనవాడు పగటి రాకకై నిరీక్షిస్తాడు అన్నా కూడ, పగలు వచ్చేటప్పటికి వాని శరీరానికి అగ్న్యాదిసంపర్కంవల్ల (శరీరం దహింపబడడంవల్ల) అది రశ్మిసంబంధానికి అనర్హం కావచ్చును. **"స యావత్ క్షిప్యేన్మనస్తావదాదిత్యం గచ్ఛతి"**

(మనస్సులో ఒక్క ఆలోచన మెదిలే టంత సమయంలో అతడు ఆదిత్యుణ్ణి చేరుతాడు) అను శ్రుతి నిరీక్షించడం అనేది లేదని చూపుతూన్నది. అందుచేత రశ్ములను అనుసరించడం రాత్రీ పగలూ కూడా విశేషం లేకుండా జరుగుతుంది 19

రశ్మ్యధికరణం సమాప్తం

## 11. దక్షిణాయనాధికరణమ్. సూ. 20 - 21

## సూ. అతశ్చాయనేఽపి దక్షిణే 4.2.20

అత ఏవచోదీక్షానుపపత్తేః, అపాక్షికఫలత్వాచ్చ విద్యాయాః, అనియతకాలత్వాచ్చ మృత్యోః దక్షిణాయనేఽపి మ్రియమాణో విద్వాన్ ప్రాప్నోత్యేవ విద్యాఫలమ్. ఉత్తరాయణమరణప్రాశస్త్యప్రసిద్ధేః, భీష్మస్య చ ప్రతీక్షాదర్శనాత్, "ఆపూర్యమాణపక్షాద్యాన్ షడుదఙ్ఙేతి మాసాంస్తాన్" (ఛా.ఉ. 4.15.5) ఇతి చ శ్రుతేః అపేక్షితవ్యముత్తరాయణమితీమామాశఙ్కామనేన సూత్రేణాపనుదతి. ప్రాశస్త్యప్రసిద్ధిరవిద్వద్విషయా. భీష్మస్య తూత్తరాయణ ప్రతిపాలనమాచారపరిపాలనార్థం, పితృప్రసాదలబ్ధస్వచ్ఛన్దమృత్యుతాఖ్యాపనార్థం చ, శ్రుతేస్త్వర్థం వక్ష్యతి "ఆతివాహికస్తల్లిఙ్గాత్" (బ్ర.సూ. 4.3.4)ఇతి. 20.

### బాలానందిని

**అత ఇతి** :- "అతశ్చ = ఆకారణాలవల్లనే, దక్షిణే అయనేఽపి = దక్షిణాయనంలో కూడ, విద్వాంసుడు విద్యాఫలం పొందుతాడు" అని సూత్రార్థం.

**అత ఏవేతి** :- ఇందువల్లనే, అనగా నిరీక్షించడం కుదరకపోవడంవల్ల, విద్య పాక్షికఫలం అవడానికి వీలులేనందువల్ల, మృత్యువుకు కాలనియమం లేకపోవడం వల్లా కూడ విద్వాంసుడు దక్షిణాయనంలో మరణించినా విద్యాఫలం పొందుతాడు. ఉత్తరాయణంలో మరణించడం ప్రశస్తమైనదనే ప్రసిద్ధి ఉండడంవల్ల, భీష్ముడు (ఉత్తరాయణం కోసం) నిరీక్షించి నట్లు కనబడడంవల్ల, "ఆపూర్యమాణ...తాన్" అనే శ్రుతివల్లా ఉత్తరాయణం అపేక్షించదగినది అనే ఆశంకను ఈ సూత్రంచేత తొలగిస్తున్నాడు. ఉత్తరాయణం ప్రశస్తమైన దనే ప్రసిద్ధి అవిద్వాంసులను గూర్చినది. భీష్ముడైతే - ఉత్తరాయణం మంచి దనే ఆచారాన్ని పాలించడంకొరకు, తనకు తండ్రి ద్వారా లభించిన

స్వేచ్ఛామరణం అనే వరాన్ని చాటుకోవడంకొరకు అలా నిరీక్షించాడు. పైన ఉదాహరించిన శ్రుతికి అర్థమేమో "**ఆతివాహికస్తల్లిఙ్గాత్**" అనే చోట విశదీకరిస్తాడు. 20

## భాష్యమ్

నను చ -

**"యత్ర కాలే త్వనావృత్తిమావృత్తిం చైవ యోగినః**
**ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ"** (భ.గీ. 8.23)

ఇతి కాలప్రాధాన్యేనోపక్రమ్య అహరాదికాలవిశేషః స్మృతావపునరావృత్తయే నియమితః. కథం రాత్రౌ దక్షిణాయనే వా మృతః అనావృత్తిం యాయాదితి. అత్రోచ్యతే -

### సూ. యోగినః ప్రతి చ స్మర్యతే స్మార్తే చైతే. 4.2.21

యోగినః ప్రతి చాయమహరాదికాలవినియోగోఽనావృత్తయే స్మర్యతే. స్మార్తే చైతే యోగసాంఖ్యే న శ్రౌతే. అతో విషయభేదాత్, ప్రమాణవిశేషాచ్చ నాస్య స్మార్తస్య కాలవినియోగస్య శ్రౌతేషు విజ్ఞానేష్వవతారః. నను-

**"అగ్నిర్జ్యోతిరహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్,**
**ధూమో రాత్రిస్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్"** (భ. గీ. 8.24,25)

ఇతి చ శ్రౌతావేతౌ దేవయానపితృయాణౌ ప్రత్యభిజ్ఞాయేతే స్మృతావపీతి. ఉచ్యతే - "తం కాలం వక్ష్యామి" (భ.గీ. 8.22) ఇతి స్మృతౌ కాలప్రతిజ్ఞానాత్ విరోధమాశఙ్క్య పరిహార ఉక్తః. యదా పునః స్మృతావప్యగ్న్యాద్యా దేవతా ఆతివాహిక్యః గృహ్యన్తే తదా న కశ్చిద్విరోధ ఇతి. 21

**ఇతి శ్రీమత్పరమహింసపరివ్రాజకాచార్య శ్రీ గోవిన్దభగవత్పూజ్యపాదశిష్య**
**శ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌ శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యే**
**చతుర్థాధ్యాయస్య ద్వితీయః పాదః**

## బాలానందిని

**నన్వితి :-** (ఆక్షేపం) "యత్ర కాలే....భరతర్షభ" (అర్జునా! ఏ కాలమునందు మరణించిన యోగులు అనావృత్తిని, ఆవృత్తినీ పొందుతారో ఆ కాలాన్ని గూర్చి చెపుతాను) అని ప్రధానంగా కాలాన్ని గూర్చియే ఉపక్రమించి, స్మృతిలో (భగవద్గీతలో) తిరిగి రాకుండా ఉండడానికి పగలు మొదలైన కాలవిశేషమే నియమితంగా చెప్పబడింది కదా? అలాంటప్పుడు రాత్రియందు, దక్షిణాయనంలోనూ మరణించినవాడు కూడా అనావృత్తిని ఎలా పొందుతాడు? ఈ విషయంలో చెప్పబడుచున్నది.

**యోగిన ఇతి :-** "యోగినః ప్రతి చ = యోగులను గూర్చి, స్మర్యతే = స్మృతిలో చెప్పబడుచున్నది. ఏతే = ఈ యోగసాంఖ్యాలు, స్మార్తే చ = స్మృతిలో చెప్పబడినవి" అని సూత్రార్థం.

**యోగిన ఇతి :-** అనావృత్తికొరకు ఈ అహరాదికాలంయొక్క వినియోగం యోగులను గూర్చి స్మృతిలో చెప్పబడుచున్నది. ఈ యోగసాంఖ్యాలు స్మృతిప్రతిపాదిత మైనది. (భగవదారాధనబుద్ధితో చేసిన కర్మయోగం. ధారణాపూర్వకంగా పొందిన అకర్తృత్వానుభవం (నాకు కర్తృత్వం లేదు అనే నిర్ధారణ) సాంఖ్యం). ఇవి శ్రౌతములు కావు. అందుచేత విషయంలో భేదం ఉండడంవల్ల ప్రమాణభేదంవల్ల (అక్కడ ప్రమాణం స్మృతి, ఇక్కడ శ్రుతి). స్మృతిలో చెప్పిన కాలవినియోగం శ్రౌతములైన విజ్ఞానాలకు వర్తించదు. (ప్రశ్న) - "అగ్ని...దక్షిణాయనమ్" అని స్మృతిలో కూడ శ్రుతిలో చెప్పిన దేవయానపితృయాణాలే గుర్తించబడుతున్నాయి కదా? (శ్రుతిలో చెప్పినవీ ఇవీ కూడా ఒకటే కదా?) (సమాధానం) చెప్పబడుచున్నది. స్మృతిలో "తం కాలం వక్ష్యామి" అని కాలాన్ని గూర్చి చెప్పడంచేత (శ్రుతిలో చెప్పినదానికీ దీనికీ) విరోధం ఉన్నదని ఆశంకించి దానికి పరిహారం చెప్పబడింది. స్మృతిలో కూడా అగ్ని మొదలైన దేవతలు ఆతివాహికదేవతలుగా చెప్పబడ్డారు, (కాలం కూడా వారిలో ఒకటి) అని గ్రహించే పక్షంలో విరోధం ఏదీ లేదు. 21

దక్షిణాయనాధికరణం సమాప్తం

"బాలానందిని" అను శ్రీమచ్ఛాంకరశారీరకభాష్యాంధ్రవ్యాఖ్యానంలో

చతుర్థాధ్యాయంలో ద్వితీయపాదం సమాప్త.

**అథ చతుర్థాధ్యాయే తృతీయః పాదః**

అత్ర పాదే సగుణవిద్యావతో మృతస్యోత్తరమార్గాభిధానమ్.

**1. అర్చిరాద్యధికరణమ్. సూ. 1**

**సూ. అర్చిరాదినా తత్ప్రథితేః. 4.3.1**

ఆసృత్యుపక్రమాత్సమానా ఉత్క్రాన్తిరిత్యుక్తమ్. సృతిస్తు శ్రుత్యన్తరేష్వనేకధా శ్రూయతే. నాడీరశ్మిసంబన్ధేనైకా "అథైతైరేవ రశ్మిభిరూర్ధ్వ ఆక్రమతే"(ఛా.ఉ.8.6.5)ఇతి. అర్చిరాదికైకా-"తేఽర్చిషమభిసంభవన్త్యర్చిషోఽహః"(బృ.6.6.2.15)ఇతి "స ఏతం దేవయానం పన్థానమాసాద్యాగ్నిలోకమాగచ్ఛతి" (కౌ. 13) ఇత్యన్యా. "యదా వై పురుషోఽస్మాల్లోకాత్ప్రైతి స వాయుమాగచ్ఛతి" (బృ.ఉ. 5.18.1) ఇత్యపరా "సూర్యద్వారేణ తే విరజాః ప్రయాన్తి" (ము.ఉ. 1.2.11) ఇతి చాపరా. తత్ర సంశయః-కిం పరస్పరం భిన్నా ఏతాః సృతయః, కిం వా ఏకైవానేకవిశేషణేతి. తత్ర ప్రాప్తం తావద్భిన్నా ఏతాః సృతయ ఇతి, భిన్నప్రకరణత్వాత్, భిన్నోపాసనాశేషత్వాచ్చ. అపి చ "అథైతైరేవ రశ్మిభిః" (ఛా.ఉ. 8.6.5) ఇత్యవధారణమర్చిరాద్యపేక్షాయాముపరుధ్యేత, త్వరావచనం చ పీడ్యేత - "స యావత్ క్షిప్యేన్మనః తావదాదిత్యం గచ్ఛతి" (ఛా.ఉ. 6.8.5)ఇతి. తస్మాదన్యోన్యభిన్నా ఏవైతే పన్థాన ఇతి.

బాలానందిని

**అర్చిరితి :-** "అర్చిరాదినా= అర్చిరాదిమార్గంచేతనే వెడతాడు. తత్ప్రథితేః = ఆ మార్గం ప్రసిద్ధ మైన దవడంవల్ల" అని సూత్రార్థం.

**ఆసృతీతి :-** మార్గప్రారంభం వరకు ఉత్క్రాంతి విద్వాంసులకు అవిద్వాంసులకూ కూడ సమానమే అని చెప్పబడింది. కాని (వేరు వేరు) శ్రుతులలో మార్గం అనేకవిధాలుగా వినబడుచున్నది. "అథైతైరేవ రశ్మిభిరూర్ధ్వ ఆక్రామతే" అని నాడీరశ్మిసంబంధంచేత ఒకటి చెప్పబడింది. "తేఽర్చిషమభిసంభవన్తి, అర్చిషోఽహః" అని ఒక మార్గం చెప్పబడింది. "స ఏతం ....ఆగచ్ఛతి" అని మరొక మార్గం. "యదా.....ఆగచ్ఛతి" (ఈ లోకంనుండి

బైటకు వెళ్ళినవాడు వాయువును పొందుతాడు) అని ఇంకొంక మార్గం. "సూర్యద్వారేణ తే విరజాః ప్రయాన్తి" (వాళ్ళు పాపరహితులై సూర్యద్వారం గుండా వెడతారు) అని మరొకటి. ఈ మార్గాలన్నీ ఒక దానితో ఒకదానికి సంబంధం లేని వేరు వేరు మార్గాలా లేక అనేక విశేషణాలతో కూడిన ఒకే మార్గం చెప్పబడిందా అని సంశయం. ఇవన్నీ వేరు వేరు ఉపాసనలకు అంగా లవడంవల్ల వేరు వేరు మార్గా లని ప్రాప్తించింది. మరొక విషయ మేమనగా "అథైతైరేవ రశ్మిభిః" (ఈ రశ్ముల ద్వారా మాత్రమే) అను నిర్ధారణ ఈ మార్గానికి అర్చిరాదిమార్గాల అపేక్ష ఉన్నట్లయితే కుదరదు. అట్లే "స యావత్....గచ్ఛతి" అని అతి శీఘ్రంగా వెడతా డని చెప్పడం కూడ (ఇన్ని మార్గాలలో ప్రయాణం చేయవలసివస్తే) కుదరదు. అందువల్ల ఈ మార్గాలు పరస్పరభిన్నాలే.

## భాష్యమ్

ఏవం ప్రాప్తేఽభిధధ్మహే - అర్చిరాదినేతి. సర్వో బ్రహ్మ ప్రేప్సురర్చిరాదినైవాధ్వనా రంహతీతి ప్రతిజానీమహే. కుతః? తత్ప్రథితేః. ప్రథితో హ్యేష మార్గః సర్వేషాం విదుషామ్. తథాహి - "పఞ్చాగ్ని విద్యాప్రకరణే "యే చామీ అరణ్యే శ్రద్ధాం సత్యముపాసతే" (బృ.ఉ. 6.12.15) ఇతి విద్యాన్తరశీలినామప్యర్చిరాదికా సృతిః శ్రావ్యతే. స్యాదేతత్ - యాసు విద్యాసు న కాచిద్గతిరుచ్యతే తాస్వయమర్చిరాదికోపతిష్ఠతామ్. యాసు త్వన్యాన్యా శ్రావ్యతే తాసు కిమిత్యర్చిరాద్యాశ్రయణమితి. అత్రోచ్యతే - భవేదేతదేవం యద్యత్యన్తభిన్నా ఏవైతాః సృతయః స్యుః. ఏకైవ త్వేషా సృతిరనేకవిశేషణా బ్రహ్మలోకప్రపదనీ క్వచిత్కేన చిద్విశేషణేన ఉపలక్షితేతి వదామః. సర్వత్రైకదేశప్రత్యభిజ్ఞానాదితరేతరేతరవిశేషణవిశేష్యభావోపపత్తేః. ప్రకరణభేదేఽపి తు విద్యైకత్వే భవతీతరేతరవిశేషణోపసంహారవద్గతివిశేషణానామప్యుపసంహారః. విద్యాభేదేఽపి తు గత్యేకదేశప్రత్యభిజ్ఞానాద్గన్తవ్యాభేదాచ్చ గత్యభేద ఏవ.

## బాలానందిని

**ఏవమితి** :- ఇట్లు ప్రాప్తించగా "**అర్చిరాదినా**" అని చెపుతున్నాం. బ్రహ్మను (సగుణ

బ్రహ్మను) పొంద దలచిన ప్రతి ఒక్కడూ అర్చిరాదిమార్గంచేతనే వెడతా డని ప్రతిజ్ఞ చేస్తున్నాం. ఎందువల్ల? అది ప్రసిద్ధమైన దవడంవల్ల. ఈ మార్గం విద్వాంసు లందరికీ (ఇది అందరి విద్వాంసుల మార్గంగా) ప్రసిద్ధం కదా? అదెట్లనగా - పంచాగ్నివిద్యాప్రకరణంలో "యే చామీ....ఉపాసతే" అని ఇతరవిద్యోపాసకులకు కూడ అర్చిరాదిమార్గం చెప్పబడుచున్నది. (ప్రశ్న) ఇది ఇలా ఉండనీ. (ఈ క్రింది ఆశంక కలగవచ్చును)- ఏ గతీ చెప్పని విద్యలతో ఈ అర్చిరాదిమార్గం చేరుతే చేరుగాక; కాని ఇతర గతి చెప్పిన విద్యలతో ఈ అర్చిరాదిమార్గాన్ని ఆశ్రయించడం ఎందుకు? (సమాధానం) ఇక్కడ చెప్పబడుతూన్నది. ఈ మార్గాలు పూర్తిగా వేరు మార్గాలైతే నువ్వు చెప్పినది అలాగే కావచ్చును. కాని బ్రహ్మలోకాన్ని చేర్చే అనేక విశేషణాలు గల ఈ మార్గం ఒక్కటే ఒక్కొక్క చోట ఒక్కొక్క విశేషణంతో కూడినట్లుగా చెప్పబడిం దని అంటాం. ఎందువల్ల ననగా అంతటా ఒకే దేశం అని గుర్తించడానికీ, అక్కడ చెప్పినవాటికి పరస్పరం విశేషణవిశేష్యభావం కుదరడానికీ అవకాశం ఉంది. (అనగా మార్గం ఒక్కటే, దానికే సంబంధించిన కొన్ని విశేషాలు ఒక చోటా కొన్ని మరొక చోటా, ఈ విధంగా చెప్పబడ్డా యని అర్థం). ప్రకరణాలు వేరైనా, విద్య మాత్రం ఒక్కటే అయితే పరస్పరం విశేషణాలను (గుణాలను) ఉపసంహరించి నట్లు, గతివిశేషణాల ఉపసంహారం కూడా చేయవచ్చును. విద్యాభేదం ఉన్నా కూడ అది ఒకటే ప్రదేశం (మార్గం) అని గుర్తించడంవల్లా, పొందవలసిన స్థానం కూడ ఒక్కటే అవడంవల్లా. గతిలో కూడ భేదం ఉండదు.

## భాష్యమ్

తథాహి - **"తేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో వసన్తి"** (బృ.ఉ. 6.2.15) **"తస్మిన్ వసతి శాశ్వతీః సమాః"** (బృ.ఉ. 5.1.10), **"సా వా బ్రహ్మణో జితిర్యా వ్యష్టిస్తాం జితిం జయతి తాం వ్యష్టిం వ్యశ్నుతే"** (కౌషీ. 1.4) **"తద్య ఏవైతం బ్రహ్మలోకం బ్రహ్మచర్యేణానువిన్దన్తి"** (ఛా.ఉ. 2.4.3) ఇతి చ తత్ర తత్ర తదేవైకం ఫలం బ్రహ్మలోకప్రాప్తిలక్షణం ప్రదర్శ్యతే. యత్త్వేతైరేవేత్యవధారణమర్చిరాద్యాశ్రయణే న స్యాదితి, నైష దోషః. రశ్మిప్రాప్తిపరత్వాదస్య. న హ్యేక ఏవ శబ్దో రశ్మీంశ్చ ప్రాపయితుమర్హత్యర్చిరాదీంశ్చ వ్యావర్తయితుమ్. తస్మాద్రశ్మిసంబన్ధ ఏవాయమవధార్యత ఇతి ద్రష్టవ్యమ్. త్వరావచనం త్వర్చిరాద్యపేక్షాయామపి

గన్తవ్యాన్తరాపేక్షయా శైఘ్ర్యార్థత్వాన్నోపరుధ్యతే, యథా నిమిషమాత్రేణాత్రా గమ్యత ఇతి. అపి చ "అథైనయోః పథోర్న కతరేణ చ న" (ఛా.ఉ. 5.10.1)ఇతి మార్గద్వయభ్రష్టానాం కష్టం మార్గమాచక్షాణా పితృయాణవ్యతిరిక్తమేకమేవ దేవయానమర్చిరాదిపర్యాయం పన్థానం ప్రథయతి. భూయాంసి చార్చిరాదిశ్రుతౌ మార్గపర్వాణ్యల్పీయాంసి త్వన్యత్ర. భూయసాం చానుగుణ్యేనాల్పీయసాం చ నయనం న్యాయ్యమిత్యతోఽప్యర్చిరాదినా తత్ప్రథితేరిత్యుక్తమ్.

బాలానందిని

**తథాహీతి** : అదెట్లనగా - "తేషు....వసన్తి" (ఆ బ్రహ్మలోకాలలో పరావంతుని యొక్క (దీర్ఘాయుర్దాయవంతుడైన హిరణ్యగర్భునియొక్క) దీర్ఘమైన సంవత్సరాలు నివసిస్తారు) "తస్మిన్...సమాః", "సా యా...వ్యశ్నుతే" (బ్రహ్మయొక్క (కార్యబ్రహ్మయొక్క) ఏ జితి (సర్వత్రా జయం) ఉన్నదో, ఏవ్యష్టి (వ్యాప్తి) ఉన్నదో ఆ జితినీ, వ్యష్టినీ పొందుతాడు), "తద్య....అనువిన్దన్తి" అని అక్క డక్కడ బ్రహ్మలోకప్రాప్తిరూపమైన ఆ ఒక్క ఫలంమాత్రమే చూపబడుచున్నది. (ఈ విధంగా ప్రాప్యస్థానం ఒక్కటే అని అర్థం) "ఏతైరేవ" అని అవధారణం అర్చిరాదులను కూడా అంగీకరిస్తే కుదరదు అని ఏది చెప్పబడింది, ఇది దోషం కాదు. ఈ అవధారణం రశ్ములను పొందడానికి మాత్రమే సంబంధించినది. (అనగా తప్పక రశ్ములను పొందుతాడు అని మాత్రమే దీని కర్థం). ఒకే శబ్దం రశ్మిసంబంధం కలుగుతుం దని చెప్పడానికి, ఇతరమైనవాటితో సంబంధం ఉండ దని చెప్పడానికి సమర్థం కాదు కదా? (అప్పుడు వాక్యభేధదోషం కలుగుతుంది). అందుచేత ఇక్కడ రశ్ములతో సంబంధమాత్రమే నిర్ధారణచేయబడుచున్నది అని చూచుకోవాలి. ఇతరమైన గంతవ్యాలను చేరడంకంటె ఇక్కడికి అతిశీఘ్రుంగా చేరుతాడు అని అభిప్రాయం అవడంచేత అర్చిరాదుల అపేక్ష ఉన్నా కూడ, అతి శీఘ్రుంగా చేరుతాడు అని చెప్పడంలో దోషం లేదు. (లోకంలో కూడ) "ఇదిగో నిమిషంలో వస్తున్నాను" అంటారు కదా? అట్లే ఇక్కడ కూడ. మరొక విషయ మేమనగా - "అథైనయోః పథోర్న కతరేణ చ న" (ఈ రెండు మార్గాలలో ఏ మార్గంచేతా కూడ వెళ్ళనివాడు) అని ఈ మార్గద్వయం చేరలేనివాళ్ళకి కష్టమైన మూడవ మార్గాన్ని చెపుతూన్న శ్రుతి పితృయాణం

కాక మిగిలిన మరొక మార్గం దేవయానమే నని, దీనికి అర్చిరాదులు పర్వాలనీ (విడుదులనీ) స్పష్టీకరిస్తున్నది. అర్చిరాదిశ్రుతిలో చాలా మార్గపర్వాలు చెప్పబడ్డాయి ఇతరశ్రుతులలో స్వల్పంగా చెప్పబడ్డాయి. తక్కువగా ఉన్న వాటిని ఎక్కువగా ఉన్నవాటితో కలపడం న్యాయ్యం అనే అభిప్రాయంతో "అర్చిరాదినా తత్ప్రథితేః" అని చెప్పబడింది.

**అర్చిరాద్యధికరణం సమాప్తం.**

**2. వాయ్వధికరణమ్. సూ. 2**

**సూ. వాయుమబ్దాదవిశేషవిశేషాభ్యామ్. 4.3.2**

కేన పునః సంనివేశవిశేషేణ గతివిశేషాణామితరేతరవిశేషణవిశేష్యభావ ఇతి, తదేతత్సుహృద్భూత్వాఽఽచార్యో గ్రథయతి. "స ఏతం దేవయానం పన్థానమాపద్యాగ్నిలోకమాగచ్ఛతి స వాయులోకం స వరుణలోకం స ఇన్ద్రలోకం స ప్రజాపతిలోకం స బ్రహ్మలోకమ్" (కౌషీ. 1.3) ఇతి కౌషీతకినాం దేవయానః పన్థాః పఠ్యతే. తత్రార్చిరగ్నిలోకశబ్దౌ తావదేకార్థౌ జ్వలనవచనత్వాదితి నాత్ర సంనివేశక్రమః క్వచిదన్వేష్యః. వాయుస్త్వర్చిరాదౌ వర్త్మని అశ్రుతః కథమస్మిన్ స్థానే సంనివేశయితవ్య ఇతి. ఉచ్యతే- "తేర్చిషమేవాభిసంభవన్తి అర్చిషోఽహః, అహ్న ఆపూర్యమాణపక్షమాపూర్యమాణపక్షాద్యాన్ షడుదఙ్ఙేతి మాసాంస్తాన్ మాసేభ్యః సంవత్సరం, సంవత్సరాదాదిత్యమ్" ( ఛా.ఉ. 5.10.1,2) ఇత్యత్ర సంవత్సరాత్ పరాఞ్చమ్, ఆదిత్యాదర్వాఞ్చం వాయుమభిసంభవన్తి. కస్మాత్? అవిశేషవిశేషాభ్యామ్. తథాహి - "స వాయులోకమ్" (కౌషి 1.3) ఇత్యత్రావిశేషోపదిష్టస్య వాయోః శ్రుత్యన్తరే విశేషోపదేశో దృశ్యతే - "యదా వై పురుషోఽస్మాల్లోకాత్ ప్రైతి స వాయుమాగచ్ఛతి, తస్మై స తత్ర విజిహీతే యథా రథచక్రస్య ఖం తేన స ఊర్ధ్వమాక్రమతే స ఆదిత్యమాగచ్ఛతి" (బృ.ఉ. 5.10.1) ఇతి. ఏతస్మాద్వాయోః పూర్వత్వదర్శనాత్ విశేషాదబ్దాదిత్యయోరన్తరాలే వాయుర్నివేశయితవ్యః

## బాలానందిని

**వాయుమితి :-** "వాయుమ్ = వాయువును, అబ్దాత్ = అబ్దంకంటె తరవాత నివేశింపచెయ్యాలి. అవిశేషవిశేషాభ్యామ్ = అవిశేషము, విశేషమూ కూడ ఉండడంవల్ల" అని సూత్రార్థం.

**కేనేతి :-** ఏ విధమైన సంనివేశవిశేషంచేత (కూర్పుచేత) గతివిశేషాలకు పరస్పరం విశేషణవిశేష్యభావం చెప్పాలి? ఈ విషయాన్ని ఆచార్యుడు మిత్రుడుగా మనకు చెపుతున్నాడు. "స ఏతం.....బ్రహ్మలోకమ్" అని కౌషీతకుల దేవయానమార్గం పఠించబడుచున్నది. వీటిలో అర్చిర్లోక - అగ్నిలోకాలకు అర్థం ఒకటే. రెండూ అగ్ని అనే అర్థాన్ని బోధిస్తాయి. అందుచేత వాటి సంనివేశక్రమాన్ని గూర్చి అన్వేషించవలసిన పని లేదు. అయితే - అర్చిరాదిమార్గంలో వినబడుతూన్న వాయువును ఏ క్రమంలో చేర్చాలి? చెప్పబడుచున్నది- **"సోఽర్చిషమ్.....ఆదిత్యమ్"** అనే చోట సంవత్సరానికి తరవాత ఆదిత్యునికి వెనుక (పూర్వం) వాయువును చేరుతారు. ఎందువల్ల? అవిశేషవిశేషాలవల్ల. అదేమనగా - ఏ విశేషమూ చెప్పకుండా (దేని తరవాత దేనికి ముందు అనేది చెప్పకుండా) **"స వాయులోకమ్"** అని వాయువు చెప్పబడ్డాడు. ఆ వాయువు విషయంలోనే - **"యదా...ఆగచ్ఛతి"** (పురుషుడు ఈ లోకంనుండి (దేహంనుండి) బైటకు వెళ్ళినప్పుడు వాయువును చేరుతాడు. అక్కడ వాయువు వానికోసం తనలో రథచక్రరంధ్రం వంటి రంధ్రం చేస్తాడు. దాని ద్వారా పురుషుడు పైకి వెళ్ళి ఆదిత్యుణ్ణి చేరుతాడు) అని మరొక శ్రుతిలో విశేషం కనబడుతున్నది. దీనిని పట్టి వాయువు ఆదిత్యునికంటె పూర్వం ఉన్నట్లు చెప్పడంవల్ల వాయువును అబ్దానికి, ఆదిత్యునికీ మధ్య చేర్చాలి.

## భాష్యమ్

కస్మాత్పునరగ్నేః పరత్వదర్శనాత్ విశేషాదర్చిషోఽనన్తరం వాయుర్న నివేశ్యతే? నైషోఽస్తి విశేష ఇతి వదామః. ననూదాహృతా శ్రుతిః- "స ఏతం దేవయానం పన్థానమాపద్యాగ్నిలోకమాగచ్ఛతి, స వాయులోకం, స వరుణలోకమ్" (కౌషీ 1.3) ఇతి? ఉచ్యతే? కేవలోఽత్ర పాఠః పౌర్వాపర్యేణావస్థితః. నాత్ర క్రమవచనః కశ్చిచ్ఛబ్దోఽస్తి. పదార్థోపదర్శనమాత్రం హ్యత్ర క్రియతే ఏతం చైతం

చ స గచ్ఛతీతి. ఇతరత్ర పునర్వాయుప్రత్తేన రథచక్రమాత్రేణ ఛిద్రేణోర్ధ్వమాక్రమ్యాదిత్య మాగచ్ఛతీత్యవగమ్యతే క్రమః.తస్మాత్సూక్తమవిశేషవిశేషాభ్యామితి.వాజసనేయినస్తు "మాసేభ్యో దేవలోకం దేవలోకాదాదిత్యమ్"(బృ.ఉ. 6.2.15) ఇతి సమామనన్తి. తత్రాదిత్యానన్తర్యాయ దేవలోకాద్వాయుమభిసంభవేయుః వాయుమబ్దాదితి తు ఛాన్దోగ్యశ్రుత్యపేక్షయోక్తమ్. ఛాన్దోగ్యవాజసనేయయోస్తు ఏకత్ర దేవలోకో న విద్యతే, పరత్ర సంవత్సరః. తత్ర శ్రుతిద్వయప్రత్యయాదుభావప్యుభయత్ర ప్రథయితవ్యౌ; తత్రాపి మాససంబన్ధాత్ సంవత్సరః పూర్వః పశ్చిమో దేవలోక ఇతి వివేక్తవ్యమ్. 2

### బాలానందిని

కస్మాదితి :- అగ్నికి తరవాత కనబడడం అనే విశేషంచేత వాయువును అర్చిస్సు తరవాత ఎందుకు చేర్చడంలేదు? ఈ విశేషం లేదని అంటాం. "స ఏతం....వరుణలోకమ్" అను శ్రుతిని (అగ్ని తరవాత వాయువును చెప్పిన శ్రుతిని) ఉదాహరించాం కదా? చెప్పుతున్నాం, విను. ఇక్కడ కేవలం పౌర్వాపర్యంతో పాఠం మాత్రమే (వస్తువుల నామనిర్దేశం మాత్రమే) ఉంది. అంతే, దీని తరువాత దీనిని గ్రహించాలి అని క్రమాన్ని చెప్పే శబ్దం ఏదీ కనబడడం లేదు. అతడు దీనిని పొందుతాడు. దీనిని కూడ పొందుతాడు అని పదార్థాల ఉపదేశం మాత్రమే చేయబడుచున్నది. ఇతరవాక్యంలో నైతే - వాయువు ఇచ్చిన రథచక్రరంధ్రప్రమాణం గల ఛిద్రం ద్వారా పైకి వెళ్లి ఆదిత్యుణ్ణి పొందుతాడు అని క్రమం కనబడుతూన్నది. అందువల్ల "అవిశేషవిశేషాభ్యామ్" అని చెప్పినది యుక్తమే. వాజసనేయు లైతే "మాసేభ్యో దేవలోకం దేవలోకాదాదిత్యమ్" అని పఠిస్తున్నారు. అక్కడ ఆదిత్యునితో అనంతర్యం కుదరడానికి (ఆదిత్యుని వెనువెంటనే వాయువు అని చెప్పడానికి వీలు కలగడానికి) దేవలోకంనుంచి వాయులోకం చేరుతారు (తరవాత ఆదిత్యుణ్ణి) అని చెప్పుకోవాలి. "వాయుమబ్దాత్" అని ఛాందోగ్యశ్రుతిని దృష్టిలో ఉంచుకొని చెప్పబడింది. ఛాందోగ్య - వాజసనేయకాలలో ఒకరికి దేవలోకం లేదు మరొకరికి సంవత్సరం లేదు. శ్రుతిద్వయానికి ప్రామాణ్యం అంగీకరించాలి గాన ఈ రెండింటినీ రెండు చోట్లా చేర్చుకోవాలి. అందులోనూ మాససంబధాన్ని పట్టి పూర్వం సంవత్సరం,

తరవాత దేవలోకం అని గ్రహించాలి. (అనగా మాసం అవయవం సంవత్సరం అవయవి గాన మాసం తరవాత సంవత్సరం చెప్పాలి. దాని తరవాత దేవలోకం, దాని తరవాత వాయువు, దాని తరవాత అదిత్యుడు అని శ్రుతిద్వయంలో క్రమం చెప్పాలి). (సూత్రంలో వాయుపదానికి దేవలోకపూర్వకవాయు వని అర్థంచెప్పుకోవాలి. (రత్నప్రభ).

వాయ్వధికరణం సమాప్తం

### 3. తడిదధికరణమ్. సూ. 3

### సూ. తడితోధి వరుణః సంబన్ధాత్. 4.3.3

"అదిత్యాచ్చన్ద్రమసం చన్ద్రమసో విద్యుతమ్" (ఛా.ఉ. 4.15.5) ఇత్యస్యా విద్యుత ఉపరిష్టాత్ స వరుణలోకమిత్యయం వరుణః సంబధ్యతే. అస్తి హి సంబన్ధో నిద్యుద్వరుణయోః. యదా హి విశాలా విద్యుతః తీవ్రస్తనితనిర్ఘోషా జీమూతోదరేషు ప్రనృత్యన్త్యథాపః ప్రపతన్తి "విద్యోతతే స్తనయతి వర్షిష్యతి వా" (ఛా.ఉ. 7.11.1) ఇతి చ బ్రాహ్మణమ్. అపాం చాధిపతిర్వరుణ ఇతి శ్రుతిస్మృతిప్రసిద్ధిః. వరుణాచ్చాధీన్ద్రప్రజాపతీ, స్థానాన్తరాభావాత్ పాఠసామర్థ్యాచ్చ అగన్తుకత్వాదపి వరుణాదీనామన్త ఏవ నివేశః. వైశేషికస్థానాభావాత్. విద్యుచ్చాన్త్యార్చిరాదౌ వర్త్మని. 3

బాలానందిని

**తడిత ఇతి** :- "తడితః అధి = తడిత్తు తరువాత, వరుణః = వరుణుడు చేరుతాడు, సంబన్ధాత్ = తడిత్తుతో సంబంధం ఉండడంవల్ల" అని సూత్రార్థం.

అదిత్యాదితి :- "అదిత్యాచ్చన్ద్రమసం చన్ద్రమసో విద్యుతమ్" అనే చోట విద్యుత్తుకు తరవాత "స వరుణలోకమ్" అన్న వరుణుడు సంబంధిస్తాడు. విద్యుత్తుకు వరుణునికీ సంబంధం ఉంది కదా? విశాలములైన మెరుపులు తీవ్రమైన ఉరుముల ధ్వనులతో, మేఘాల మధ్య నాట్యం చేసినప్పుడు వర్షం కురుస్తుంది. "విద్యోతతే స్తయతి వర్షిష్యతి వా" (మెరుస్తుంది, ఉరుముతుంది, వర్షిస్తుంది) అని బ్రాహ్మణం చెపుతూన్నది. ఉదకానికి వరుణుడు అధిపతి అని శ్రుతిస్మృతులలో ప్రసిద్ధి. మరొక స్థానం లేకపోవడంచేత

పాఠసామర్థ్యంచేత (అనగా ఏ క్రమంలో పఠించబడ్డారో అదే క్రమంలో) ఇంద్రప్రజాపతులను వరుణుని తరవాత చేర్చాలి. వరుణాదులు అగంతుకులవడంచేత కూడ (మొదటినుండీ లేక ఎక్కడో ఒకచోట చెప్పబడినవాళ్ళవడంచేత) విశేషించి చెప్పిన స్థానం ఏదీ లేకపోవడంచేత వాళ్ళని చివరనే చేర్చాలి. అర్చిరాదిమార్గంలో విద్యుత్తు చివరిది.

ఏ. అర్చిరాద్యధికరణంలో, మార్గం ఒకటే నని స్థాపించి తదనుసారంగా వెనుకటి అధికరణంలో వాయువును ఆదిత్యునికి పూర్వం చేర్చా లని చెప్పబడింది. అది యుక్తం కాదని అక్షేపసంగతితో ఇక్కడ పూర్వపక్షం. కౌషీతకులు చెప్పిన వరుణలోకాదులను ఎక్కడ చేర్చాలో నిశ్చితంగా తెలియడం లేదు కదా అని పూర్వపక్షి అభిప్రాయం. అకాశంలో విద్యుత్తుకు తరవాత మేఘాలు కనబడుచున్నాయి. అందుచేత జలాధిపతియైన వరుణుడు మేఘాలతో ఉండడం యుక్తం. అందుచేత తటిత్తు తరవాత వరుణుడు, వరుణుని తరవాత శ్రుతిలో పఠించిన వరుసలోనే ఇంద్రాదులను చేర్చాలి అని సిద్ధాంతం.

తడిదధికరణం సమాప్తం

## 4. అతివాహికాధికరణమ్ సూ. 4 - 6

## సూ. అతివాహికాస్తల్లిఙ్గాత్. 4.3.4

తేష్వేవార్చిరాదిషు సంశయః - కిమేతాని మార్గచిహ్నాన్యుత భోగభూమయోఽథవాఽతినేతారో గన్తౄణామితి. తత్ర మార్గలక్షణభూతా అర్చిరాదయ ఇతి తావత్ప్రాప్తమ్. తత్స్వరూపత్వాదుపదేశస్య. యథా హి కశ్చిద్ గ్రామం నగరం వా ప్రతిష్ఠాసమానోఽనుశిష్యతే గచ్ఛేతస్త్వమముం గిరిం, తతో న్యగ్రోధం, తతో నదీం, తతో గ్రామం నగరం వా ప్రాప్స్యసీతి, ఏవమిహాప్యర్చిషోఽహరహ్న ఆపూర్యమాణపక్షమిత్యాద్యాహ. అథవా భోగభూమయ ఇతి ప్రాప్తమ్. తథా హి - లోకశబ్దేనాగ్న్యాదీనుపనిబధ్నాతి "అగ్నిలోకమాగచ్ఛతి" (కౌషీ 1.3) ఇత్యాది. లోకశబ్దశ్చ ప్రాణినాం భోగాయతనేషు భాష్యతే - "మనుష్యలోకః పితృలోకో దేవలోకః" (బృ.ఉ.1.5.16) ఇతి. తథా చ బ్రాహ్మణమ్ - "అహోరాత్రేషు

తే లోకేషు సజ్జన్తే" ఇత్యాది. తస్మాన్నాతివాహికా అర్చిరాదయః. అచేతనత్వాదపి చైషామాతివాహికత్వానుపపత్తిః. చేతనా హి లోకే రాజనియుక్తాః పురుషా దుర్గేషు మార్గేష్వతివాహ్యానతివాహయన్తీతి.

బాలానందిని

**అతివాహికా ఇతి** :- "అతివాహికాః = అర్చిరాదులు ఆతివాహికులే (మార్గంలో కూడా ఉండి తీసుకొనివెళ్ళేవారు, ఒక ప్రదేశం దాటించేవారు ఆతివాహికులు), తల్లిఙ్గాత్ = అందుకు లింగం ఉండడంవల్ల" అని సూత్రార్థం.

**తేష్వితి** :- ఆ అర్చిరాదిమార్గాల విషయంలోనే ఇవి మార్గంలో గుర్తులా, భోగభూములా (భోగాలు అనుభవించే లోకాలా) లేక వెళ్ళేవాళ్ళను తీసికొనివెళ్లేవారా అని సంశయం. అర్చిరాదులు మార్గంలో గుర్తులే అని ప్రాప్తిస్తున్నది. ఎందువల్ల ననగా ఉపదేశం ఆ విధంగా ఉంది. గ్రామానికి గాని నగరానికి గాని బయలుదేరినవాడు లోకంలో "నువ్వు ఇక్కడినుండి ఆ పర్వతందగ్గరికి వెళ్ళు, తరవాత మఱ్ఱిచెట్టు దగ్గరకి వెళ్ళు, తరవాత నది దగ్గరకు వెళ్ళు, అక్కడినుంచి గ్రామం గాని నగరంగాని చేరుకొంటావు" అని ఏ విధంగా ఉపదేశించబడతాడో ఇది కూడా అట్లే ఉంది. లేదా ఇవి భోగభూములని ప్రాప్తిస్తున్నది. ఎందువల్ల ననగా అగ్న్యాదులను, "**అగ్నిలోకమాగచ్ఛతి**" ఇత్యాదివాక్యాలలో, లోకశబ్దం చేర్చి చెపుతున్నాడు. "మనుష్యలోకః పితృలోకో దేవలోకః" ఇత్యాదులలో లోకశబ్దం ప్రాణుల భోగస్థానాల విషయంలో ప్రయోగించబడుచున్నది. "**అహోరాత్రేషు తే లోకేషు సజ్జన్తే**" ~~అని~~ అని బ్రాహ్మణం కూడ చెప్పుచున్నది. అందువల్ల అర్చిరాదులు ఆతివాహికులు కారు. ఇవి అచేతనములు గాన ఆ కారణంచేత కూడ వీటికి ఆతివాహికత్వం కుదరదు. లోకంలో రాజుచేత నియమించబడిన చేతనులైన పురుషులే దుర్గములైన మార్గాలలో దాటింపదగినవాళ్ళను దాటిస్తుంటారు కదా?

భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః - ఆతివాహికా ఏవైతే భవితుమర్హన్తి. కుతః? తల్లిఙ్గాత్ తథా హి - "చన్ద్రమసో విద్యుతం తత్పురుషోఽమానవః స ఏతాన్ బ్రహ్మ గమయతి" ఇతి సిద్ధవద్గమయితృత్వం దర్శయతి. యావద్వచనం

వాచనికమితి న్యాయాత్. తద్వచనం తద్విషయ ఏవోపక్షీణమితి చేత్, న. ప్రాప్తమానవత్వనివృత్తిపరత్వాద్విశేషణస్య. యద్యర్చిరాదిషు పురుషా గమయితారః ప్రాప్తాః తే చ మానవాః తతోయుక్తం తన్నివృత్త్యర్థం పురుషవిశేషణమమానవ ఇతి. 4

బాలానందిని

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా చెపుతున్నాం - వీళ్ళు అతివాహికులే అవడం యుక్తంగా ఉంటుంది. ఎందువల్ల? తల్లింగంవల్ల. ఎట్లనగా "చన్ద్రమసో...గమయతి" (చంద్రుని నుండి విద్యుత్తును పొందిస్తారు. (తరువాత) అక్కడినుండి మానవుడు కాని పురుషుడు వీళ్ళను బ్రహ్మదగ్గరకు చేరుస్తాడు) అని సిద్ధంగా ఉన్న (అంతకుముందే తెలిసిన) గమయితృత్వాన్ని చెప్పుచున్నది. "**మాట ఎంతో అర్థం కూడా అంతే**" అని కదా న్యాయం? ఆ విశేషణం దాన్ని గూర్చి చెప్పడంతోనే సరిపోయింది. (మరొక అర్థం బోధించజాలదు) అన్నట్లయితే, అది యుక్తం కాదు. ఈ విశేషణం (అమానవః అనేది) ప్రాప్తమైన మానవత్వాన్ని నిషేధించడంకొరకు ఉద్దిష్ట మైనది. అర్చిరాదులలో కూడ తీసికొనివెళ్ళేవాళ్ళు ప్రాప్తిస్తే, వాళ్ళు మానవులైతే, అప్పుడు వాళ్ళ నివృత్తికొరకై (మానవుల నివృత్తికొరకై, అనగా మానవత్వనివృత్తికొరకై) 'అమానవః' అనేది పురుషవిశేషణంగా ప్రయోగించడం యుక్తంగా ఉంటుంది.

వి. విద్యుత్తు దగ్గరనుంచి అమానవపురుషుడు తీసికొని వెడతాడు అని చెప్పడాన్ని పట్టి అంతకు పూర్వం అర్చిరాదులలో కూడ తీసికొని వెళ్ళడం ఉందనీ, కాని ఆ తీసుకొనివెళ్ళేవాళ్ళు మానవు లనీ, విద్యుత్తు తరవాత తీసికొని వెళ్ళేవాడు మాత్రం అమానవు డనీ తెలుస్తూన్నది. ఇక్కడ కొత్తగా చెప్పబడే విషయం అతివాహికుడు అమానవు డని మాత్రమే కాని ఇక్కడనుంచి మాత్రమే అతివాహకుడు వస్తాడు అని కాదు. 4

భాష్యమ్

నను తల్లిఙ్గమాత్రమగమకమ్, న్యాయాభావాత్. నైష దోషః-

## సూ. ఉభయవ్యామోహాత్తత్సిద్ధేః. 4.3.5

యే తావదర్చిరాదిమార్గాస్తే దేహవియోగాత్సంపిణ్డితకరణగ్రామా ఇత్యస్వతన్త్రాః. అర్చిరాదీనామప్యచేతనత్వాదస్వాతన్త్ర్యమిత్యతోఽర్చిరాద్యభిమానినశ్చేతనా దేవతావిశేషా అతియాత్రాయాం నియుక్తా ఇతి గమ్యతే. లోకేఽపి హి మత్తమూర్ఛితాదయః సంపిణ్డితకరణగ్రామాః పరప్రయుక్తవర్త్మానో భవన్తి. అనవస్థితత్వాదప్యర్చిరాదీనాం న మార్గలక్షణత్వోపపత్తిః. న హి రాత్రౌ సంప్రేతస్య అహఃస్వరూపాభిసంభవ ఉపపద్యతే. న చ ప్రతిపాలనమస్తీత్యుక్తమధస్తాత్. ధ్రువత్వాత్తు దేవతాత్మనాం నాయం దోషో భవతి. అర్చిరాదిశబ్దతా చైషామర్చిరాద్యభిమానాదుపపద్యతే.

### బాలానందిని

నన్వితి :- సమర్థకమైన న్యాయం లేనప్పుడు కేవలం లింగం ఉన్నా అది గమకం కాదు కదా? ఈ దోషం లేదు.

**ఉభయేతి** :- "ఉభయవ్యామోహాత్ = విద్యావంతులు, పంచాగ్న్యాదులు, రెండింటికీ కూడా వ్యామోహం ఉండడంవల్ల, తత్సిద్ధేః = అతివాహికులు సిద్ధిస్తారు కదా?" అని సూత్రార్థం.

**యే ఇతి** :- అర్చిరాదిమార్గంలో ఉన్న విద్వాంసులు దేహం లేకపోవడంచేత ఇంద్రియసముదాయం ముద్దగా అయిపోయి అస్వతంత్రులుగా ఉంటారు. అర్చిరాదులు కూడ అచేతనాలే గాన అవి కూడా అస్వతంత్రాలే. అందుచేత అర్చిరాదుల అభిమానులైన చేతనులైన దేవతావిశేషాలు (ఒక విధమైన దేవతలు) అతియాత్రయందు (విద్వాంసులను నడిపించడంలో) నియమితులై ఉంటా రని తెలుస్తున్నది. లోకంలో కూడ ఇంద్రియాలు ముద్దగా అయిపోయి అవి పనిచేయని స్థితిలో ఉన్న మత్తులో ఉన్నవాళ్ళు, మూర్ఛితులు మొదలైనవాళ్ళు పరులచేత చూపబడిన మార్గంకలవారుగా అవుతారు. ఈ అర్చిరాదులు అనవస్థితాలు (అనగా తప్పక ఉంటా యనే నియమం లేదు). అందువల్ల కూడా ఇవి. మార్గాల లక్షణం (గుర్తులు) అవడానికి వీలు లేదు. రాత్రి మరణించినవాడు అహః

స్వరూపంతో సంబంధించడం కుదరదు కదా? (పగలు వచ్చేవరకు) నిరీక్షించడం కుదర దని క్రింద (వెనుక) చెప్పబడింది. దేవతాత్మ లైతే స్థిరంగా ఉంటారు గాన ఈ దోషం ఉండదు. ఈ దేవతలకు అర్చిరాదిస్వరూపులం అనే అభిమానం ఉండడంచేత వీళ్ళని అర్చారాదిశబ్దాలతో చెప్పడం ఉపపన్నమే.

## భాష్యమ్

**"అర్చిషోఽహః"** (ఛా.ఉ.4.15.5,5-10-1) ఇత్యాదినిర్దేశస్త్వాతివాహికత్వేఽపి న విరుధ్యతే. అర్చిషా హేతునా అహరభిసంభవన్తి, అహ్నా హేతునా అపూర్యమాణపక్షమితి. తథా చ లోకే ప్రసిద్ధేష్వప్యాతివాహికేషు ఏవంజాతీయక ఉపదేశో దృశ్యతే - గచ్ఛ త్వమితో బలవర్మాణమ్, తతో జయసింహమ్, తతః కృష్ణగుప్తమితి. అపి చోపక్రమే **"తేఽర్చిరభిసంభవన్తి"** (బృ.ఉ. 6.2.15) ఇతి సంబన్ధమాత్రముక్తం న సంబన్ధవిశేషః కశ్చిత్. ఉపసంహారే తు **"స ఏతాన్ బ్రహ్మ గమయతి"** (ఛా.ఉ.4.15.6) ఇతి సంబన్ధవిశేషోఽతివాహ్యాతివాహకత్వలక్షణ ఉక్తః, తేన స ఏవోపక్రమేఽపీతి నిర్ధార్యతే. సంపిణ్డితకరణగ్రామత్వాదేవ చ గన్తౄణాం న తత్రోపభోగసంభవః. లోకశబ్దస్త్వనుపభుఞ్జానేష్వపి గన్తృషు గమయితుం శక్యతే, అన్యేషాం తల్లోకవాసినాం భోగభూమిత్వాత్. అతోఽగ్నిస్వామికం లోకం ప్రాప్తోఽగ్నినాతివాహ్యతే, వాయుస్వామికం లోకం ప్రాప్తో వాయునేతి యోజయితవ్యమ్. 5

## బాలానందిని

**అర్చిష ఇతి** :- ఆతివాహికు లని చెప్పినా కూడ **"అర్చిషోఽహః"** ఇత్యాదినిర్దేశాలు విరుద్ధం కావు. అర్చిస్ అనే హేతువుచేత అహస్సును సంబంధిస్తారు, అహస్సనే హేతువుచేత అపూర్యమాణపక్షంతో సంబంధిస్తారు (అనగా దానిని చేరుతారు) అని చెప్పవచ్చును. లోకంలో ప్రసిద్ధులైన ఆతివాహికుల విషయంలో కూడ ఈ విధమైన ఉపదేశం "ఇక్కడినుండి బలవర్మ దగ్గరికి వెళ్ళు, వానినుండి జయసింహుని దగ్గరికి వెళ్ళు, వాని నుండి కృష్ణగుప్తుని దగ్గరికి వెళ్ళు" ఇత్యాదివిధంగా కనబడుతున్నది. మరొక విషయ

మేమనగా - ఉపక్రమంలో "తైర్చిరభింసంభవన్తి" అని సంబంధమాత్రమే చెప్పబడింది కాని అది ఏ విధమైన సంబంధమో చెప్పబడలేదు. ఉపసంహారంలో నైతే - "స ఏతాన్ బ్రహ్మ గమయతి' అని అతివాహ్యాతివాహకత్వరూపమైన (ముందుకు తీసికొని వెళ్ళదగినవాడు, తీసికొని వెళ్ళేవాడు అనే) సంబంధవిశేషం చెప్పబడింది. దీనిని పట్టి ఉపక్రమంలో కూడ అదే సంబంధం అని నిర్ధారించబడతూన్నది. వెళ్ళేవాళ్ళ ఇంద్రియగ్రామం ముద్దగా అయిపోవడంచేత వాళ్ళకి అక్కడ భోగం సంభవం కాదు. వెళ్ళేవాళ్ళు అనుభవించకపోయినా ఆ లోకంలో నివసించే ఇతరులకు అవి భోగభూములే గాన వాటిని లోకం అనడాన్ని సమర్థించవచ్చును. అందువల్ల అగ్నిస్వామిగా ఉన్న లోకానికి వెళ్ళినవానిని అగ్ని ముందుకు నడిపిస్తాడు, వాయువు స్వామిగా ఉన్న లోకానికి వెళ్ళినవానిని వాయువు ముందుకు నడిపిస్తాడు అని భావం చెప్పుకోవాలి.

## భాష్యమ్

కథం పునరాతివాహికత్వపక్షే వరుణాదిషు తత్సంభవః? విద్యుతోహ్యాధి వరుణాదయ ఉపక్షిప్తాః, విద్యుతస్త్వనన్తరమ్ ఆ బ్రహ్మప్రాప్తేరమానవస్యైవ పురుషస్య గమయితృత్వం శ్రుతమితి. అత ఉత్తరం పఠతి-

## సూ. వైద్యుతేనైవ తతస్తచ్ఛ్రుతేః. 4.3.6

తతో విద్యుదభిసంభవాదూర్ధ్వం విద్యుదనన్తరవర్తినైవామానవేన పురుషేణ వరుణలోకాదిష్వతివాహ్యమానా బ్రహ్మలోకం గచ్ఛన్తీత్యవగన్తవ్యమ్ "తాన్ వైద్యుతాత్పురుషోఽమానవః(స)ఏత్య బ్రహ్మలోకం గమయతి" (బృ.ఉ.6.2.15) ఇతి తస్యైవ గమయితృత్వశ్రుతేః. వరుణాదయస్తు తస్యైవాప్రతిబన్ధకరణేన, సాహాయ్యానుష్ఠానేన వా కేన చిదనుగ్రాహకా ఇత్యవగన్తవ్యమ్. తస్మాత్సాధూక్తమాతివాహికా దేవతాత్మానోఽర్చిరాదయ ఇతి. 6

## బాలానందిని

**కథమితి :-** అతివాహకులు అని చెప్పే పక్షంలో వరుణాదులయందు అది (అతివాహికత్వం) ఎలా సంభవం అవుతుంది? వరుణాదులు విద్యుత్తుకు తరవాత

చేర్చబడ్డారు. విద్యుత్తుకు తరవాత అమానవుడైన పురుషుడే బ్రహ్మలోకం వరకు తీసికొని వెడతా డని వినబడు చున్నది. అందుకు సమాధానం పఠిస్తున్నాడు-

**వైద్యుతేనైవేతి** :- "తతః = విద్యుత్తు తరవాత, వైద్యుతేనైవ = విద్యుత్తుకు తరవాత వచ్చిన పురుషుని చేతనే తీసికొని వెళ్ళబడతాడు. తచ్ఛ్రుతేః = అట్లు వినబడడం వల్ల" అని సూత్రార్థం.

**తత ఇతి** :- తతః = విద్యుదభిసంభవనం తరవాత, విద్యుత్తు తరవాత వచ్చిన అమానవపురుషునిచేత వరుణలోకాదులలో వాటిని దాటే టట్లు చేయబడుతూ బ్రహ్మలోకం చేరుతారు అని తెలుసుకోవాలి. ఎందువల్ల ననగా - "**తాన్వైద్యుతాత్.... గమయతి**" అని ఆ పురుషుడే తీసికొనివెళ్ళేవాడు అని వినబడుచున్నది. వరుణాదులైతే వానికి ప్రతిబంధం ఏదీ కలిగించకుండా, లేదా కావలసిన సాహాయ్యం అందజేస్తూ అనుగ్రాహకులుగా ఉంటా రని తెలుసుకోవాలి. అందువల్ల దేవతాస్వరూపులైన అర్చిరాదులు ఆతివాహికులు అని యుక్తంగానే చెప్పబడింది.

**వి.** "**ఆతివాహికాస్తల్లిఙ్గాత్**" అనే సూత్రంలో - యద్యర్చిరాదిషు పురుషా గమయి **తారః** ప్రాప్తాస్తే చ మానవాః....." అర్చిరాదులలో ఆతివాహికులు మానవులనీ తడిత్తు తరవాత మాత్రం అమానవపురుషు డనీ చెప్పబడింది. కాని చివరికి అర్చిరాద్యభిమాని దేవత లని చెప్పడంచేత వీళ్ళు కూడా అమానవులే అని చెప్పిన ట్లవుతున్నది. ఈ విరోధానికి పరిహారం ఏ వ్యాఖ్యానాలలోనూ లభించలేదు. నిజంగా ఇది విరోధమా కాదా అని పరి శీలించవలసి ఉన్నది. 6

**ఆతివాహికాధికరణం సమాప్తం**

## 5. కార్యాధికరణమ్. సూ. 7 - 14

## సూ. కార్యం బాదరిస్య గత్యుపపత్తేః 4.3.7

"స ఏతాన్ బ్రహ్మ గమయతి" (ఛా.ఉ.4.15.5) ఇత్యత్ర విచికిత్స్యతే - కిం కార్యమపరం బ్రహ్మ గమయతి ఆహోస్విత్పరమేవావికృతం ముఖ్యం బ్రహ్మేతి. కుతః సంశయః? బ్రహ్మశబ్దప్రయోగాత్, గతిశ్రుతేశ్చ. తత్ర కార్యమేవ

సగుణమపరం బ్రహ్మైనాన్గమయత్యమానవః పురుష ఇతి బాదరిరాచార్యో మన్యతే. కుతః? అస్య గత్యుపపత్తేః. అస్య హి కార్యబ్రహ్మణో గన్తవ్యత్వ ముపపద్యతే, ప్రదేశవత్త్వాత్. న తు పరస్మిన్ బ్రహ్మణి గన్తృత్వం గన్తవ్యత్వం, గతిర్వావకల్పతే; సర్వగతత్వాత్, ప్రత్యగాత్మత్వాచ్చ గన్తౄణామ్. 7

బాలానందిని

**కార్యమితి :-** "బాదరిః = బాదరి, కార్యమ్ = కార్యమైన అపరబ్రహ్మ అని అంగీకరిస్తున్నాడు. అస్య = ఈ కార్యబ్రహ్మవిషయంలోనే, గత్యుపపత్తేః = గతి కుదురుతుంది గాన" అని సూత్రార్థం.

**స ఇతి :-** "స ఏతాన్ బ్రహ్మ గమయతి" అనే చోట కార్యమైన అపరబ్రహ్మదగ్గరికి తీసికొనివెడతాడా లేక వికారరహితమైన ముఖ్యమైన పరబ్రహ్మ దగ్గరికే తీసికొని వెడతాడా అని సంశయం. సంశయం ఎందువల్ల? బ్రహ్మశబ్దాన్ని ప్రయోగించడంవల్ల, గమనం వినబడడంవల్ల. అమానవుడైన పురుషుడు వీళ్ళను కార్యమైన, సగుణమైన అపరబ్రహ్మనే చేరుస్తాడు అని ఆచార్యుడైన బాదరి చెపుతున్నాడు. ఎందువల్ల? ఈ బ్రహ్మ విషయంలోనే గతి కుదురుతుంది కాబట్టి. ఆ కార్యబ్రహ్మ ఒక్క ప్రదేశంలో ఉంటాడు గాన ఆ బ్రహ్మ విషయంలోనే గతి కుదురుతుంది కాని సర్వగతము, వెళ్ళేవాళ్ళ ప్రత్యగాత్మయే కూడ అయిన పరబ్రహ్మ విషయంలో గన్తృత్వం గాని, గంతవ్యత్వం గాని, గమనం కాని కుదరవు.

## సూ. విశేషితత్వాచ్చ. 4.3.8

"బ్రహ్మలోకాన్ గమయతి తేష్వేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో వసన్తి" (బృ.ఉ. 6.2.15) ఇతి చ శ్రుత్యన్తరే విశేషితత్వాత్కార్యబ్రహ్మవిషయైవ గతిరితి గమ్యతే. న హి బహువచనేన విశేషణం పరస్మిన్ బ్రహ్మణ్యవకల్పతే. కార్యే త్వవస్థాభేదోపపత్తేః సంభవతి బహువచనమ్. లోకశ్రుతిరపి వికారగోచరాయామేవ సంనివేశవిశిష్టాయాం భోగభూమావాఞ్జసీ, గౌణీ త్వన్యత్ర "బ్రహ్మైవ లోక ఏష సమ్రాట్"(బృ.ఉ.4423)ఇత్యాదిషు. అధికరణాధికర్తవ్య నిర్దేశోఽపి పరస్మిన్

బ్రహ్మణి నాఞ్జసః స్యాత్. తస్మాత్కార్యవిషయ మేవేదం నయనమ్. 8

బాలానందిని

**విశేషితత్వాదితి** :- "విశేషితత్వాచ్చ = విశేషింపబడి ఉండడంచేత కూడ కార్యబ్రహ్మనే గ్రహించాలి" అని సూత్రార్థం.

**బ్రహ్మేతి** :- "బ్రహ్మలోకాన్....వసన్తి" అని మరొక శ్రుతిలో బ్రహ్మను గూర్చిన విశేషం చెప్పడంచేత కూడ గమనం కార్యబ్రహ్మను గూర్చియే అని తెలుస్తూన్నది. బహువచనంచేత విశేషించడం పరబ్రహ్మయందు కుదరదు కదా? కార్యబ్రహ్మవిషయంలో నైతే అవస్థాభేదాన్ని (కార్య బ్రహ్మలో ఉండే ఆ యా అవస్థల భేదాన్ని పట్టి) బహువచనం సంభవిస్తుంది. లోకం అనే పేరు కూడ వికారాలకు సంబంధించిన (కార్యమైన), ఒకవిధమైన సంనివేశంతో(నిర్మాణాదికంతో) ఉన్న భోగభూమి విషయంలోనే సమంజసంగా ఉంటుంది. "బ్రహ్మైవ లోక ఏష సమ్రాట్" ఇత్యాదులలో నైతే (పరబ్రహ్మ యందు భోగ్యత్వాన్ని ఆరోపించడంచేత) పరబ్రహ్మ విషయంలో లోకశబ్దప్రయోగం గౌణం అవుతుంది. (అక్కడ నివసిస్తారు అని చెప్పడంతో బ్రహ్మ అధికరణం అని అక్కడికి వెళ్ళినవాళ్ళు అధికర్తవ్యులనీ, ఆధారంమీద ఉండేవారనీ, తెలుస్తూన్నది). ఈ విధమైన అధికరణ - అధికర్తవ్యభావాన్ని చెప్పడం కూడా పరబ్రహ్మ విషయంలో సమంజసం కాదు. అందుచేత ఈ తీసికొని వెళ్ళడం కార్యబ్రహ్మను గూర్చియే. 8

భాష్యమ్

నను కార్యవిషయేఽపి బ్రహ్మశబ్దో నోపపద్యతే. సమన్వయే హి సమస్తస్య జగతో జన్మాదికారణం బ్రహ్మేతి ప్రతిష్ఠాపితమితి. అత్రోచ్యతే -

**సూ. సామీప్యాత్తు తద్వ్యపదేశః. 4.3.9**

తుశబ్ద ఆశఙ్కావ్యావృత్త్యర్థః, పరబ్రహ్మసామీప్యాదపరస్య బ్రహ్మణః తస్మిన్నపి బ్రహ్మశబ్దప్రయోగో న విరుధ్యతే. పరమేవ హి బ్రహ్మ విశుద్ధోపాధిసంబన్ధాత్ క్వచిత్కైశ్చిద్వికారధర్మైర్మనోమయత్వాదిభిరుపాసనాయోప దిశ్యమానమ్ అపరమితి స్థితిః. 9

## బాలానందిని

**నన్వితి** :- బ్రహ్మశబ్దం కార్యబ్రహ్మవిషయంలో కూడ కుదరదు; సమన్వయాధికరణంలో సమస్తజగత్తుయొక్క జన్మాదులకు కారణం బ్రహ్మ అని స్థాపించబడింది కదా? ఈ విషయంలో చెప్పబడుచున్నది.

**సామీప్యాదితి** :- "సామీప్యాత్తు = సామీప్యాన్ని పట్టి యైతే, తద్వ్యపదేశః = కార్యబ్రహ్మ కూడా బ్రహ్మ అని చెప్పబడుచున్నది" అని సూత్రార్థం.

**తుశబ్ద ఇతి** :- తుశబ్దం అశంకను నివర్తింపచేయడంకొరకు. అపరబ్రహ్మ పరబ్రహ్మకు సమీపంగా ఉండడంవల్ల దాని విషయంలో కూడ బ్రహ్మశబ్దప్రయోగం విరుద్ధం కాదు. పరబ్రహ్మయే పరిశుద్ధమైన ఉపాధితో సంబంధంవల్ల, వికారాల (కార్యాల) ధర్మాలైన మనోమయత్వాదులతో కూడినదిగా, ఉపాసనకొరకై కొన్ని చోట్ల చెప్పబడినప్పుడు అపరం (అపరబ్రహ్మ) అవుతుంది. అనేది యథార్థస్థితి. 9

## భాష్యమ్

నను కార్యప్రాప్తావనావృత్తిశ్రవణం న ఘటతే. న హి పర స్మాద్బ్రహ్మణోఽన్యత్ర క్వచిన్నిత్యతా సంభవతి. దర్శయతి చ దేవయానేన పథా ప్రస్థితానామనావృత్తిమ్ - **"ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవమావర్తం నావర్తన్తే"** (ఛా.ఉ. 4.15.6) ఇతి. **"తేషామిహ న పునరావృత్తిరస్తి"** (బృ.ఉ. 6.1.18) ఇతి, **"తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి"** (ఛా. ఉ. 8.6.6. క.ఉ. 6-16) ఇతి చ; ఇతి చేత్; అత్ర బ్రూమః

**సూ. కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పరమభిధానాత్. 4.3.10**

కార్యబ్రహ్మప్రలయప్రత్యుపస్థానే సతి తత్రైవోత్పన్నసమ్యగ్దర్శనాః సన్తస్తదధ్యక్షేణ హిరణ్యగర్భేణ సహాతః పరం విశుద్ధం విష్ణోః పరం పదం ప్రతిపద్యన్త ఇతి. ఇత్థం క్రమముక్తిరనావృత్త్యాదిశబ్దేభ్యోఽభ్యుపగన్తవ్యా. న హ్యఞ్జసైవ గతిపూర్వికా పరప్రాప్తిః సంభవతీత్యుపపాదితమ్. 10

బాలానందిని

నన్వితి :- కార్యబ్రహ్మను పొందితే అనావృత్తి వినబడడం (అక్కడికి వెళ్ళినవాడు తిరిగిరాడు అని చెప్పడం) కుదరదు. పరబ్రహ్మకు తప్ప మరి ఇతరమైనదానియందు దేనియందూ నిత్యత్వం సంభవం కాదు కదా? (శ్రుతియైతే) దేవయానమార్గంలో పయనించినవాళ్ళకి ఆవృత్తి లేదని "ఏతేన...నావర్తన్తే" అని, "తేషామ్....అస్తి" అని "తయా....ఏతి" అనీ చెపుతూన్నది అన్నట్లయితే, ఈ విషయంలో చెపుతున్నాం.

కార్యాత్యయ ఇతి :- "కార్యాత్యయే = కార్యబ్రహ్మలోకం ప్రలయం పొందినప్పుడు, తదధ్యక్షేణ సహ = కార్యబ్రహ్మలోకాధిపతితో కూడ, అతః = ఆ బ్రహ్మకంటె, పరమ్ = పరమైన బ్రహ్మను పొందుతారు. అభిధానాత్ = అట్లు చెప్పడం వల్ల" అని సూత్రార్థం.

కార్యేతి :- కార్యబ్రహ్మలోకానికి ప్రలయం రాగానే, అక్కడనే పుట్టిన సమ్యగ్జ్ఞానం కలవాళ్ళై, ఆ లోకానికి అధ్యక్షుడైన హిరణ్యగర్భునితో కూడ, అతః = హిరణ్యగర్భునికంటె, పరమ్ = పరిశుద్ధమైన విష్ణువుయొక్క పరమపదాన్ని పొందుతారు. అనావృత్త్యాదులను చెప్పే శ్రుతులను పట్టి ఈ విధమైన క్రమముక్తి లభిస్తుం దని అంగీకరించాలి. గతిపూర్వకమైన పరబ్రహ్మప్రాప్తి (ఎక్కడికో వెళ్ళి పరబ్రహ్మను పొందడం) సంభవం కాదు అని వెనుక ప్రతిపాదించబడింది. 10

## సూ. స్మృతేశ్చ. 4.3.11

స్మృతిరప్యేత మర్థమనుజానాతి-

12.16. "బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే,

పరస్యాన్తే కృతాత్మానః ప్రవిశన్తి పదం పదమ్" కూర్మ.పు -1-12-269

ఇతి. తస్మాత్కార్యబ్రహ్మవిషయా గతిః శ్రూయత ఇతి సిద్ధాన్తః.

బాలానందిని

స్మృతేరితి :- "స్మృతేశ్చ = స్మృతివల్ల కూడ కార్యబ్రహ్మనే పొందుతాడు" అని సూత్రార్థం.

స్మృతిరేతి :- "బ్రహ్మణా....పదమ్" (పరిశుద్ధమైన అంతఃకరణ గలవాళ్ళు, ప్రలయం రాగానే హిరణ్యగర్భుడు అంతము పొందగా, ఆ బ్రహ్మతో (హిరణ్యగర్భునితో కూడ) పరమపదాన్ని పొందుతారు) అను స్మృతి కూడ ఈ విషయాన్ని అంగీకరిస్తున్నది. అందువల్ల కార్యబ్రహ్మకు మాత్రమే సంబంధించిన గతి శ్రుతులలో వినబడుచున్నది అని సిద్ధాంతం.

## భాష్యమ్

కం పునః పూర్వపక్షమాశఙ్క్యాయం సిద్ధాన్తః ప్రతిష్ఠాపితః "కార్యం బాదరిః" ఇత్యాదినేతి, స ఇదానీం సూత్రైరేవోపదర్శ్యతే-

## సూ. పరం జైమినిర్ముఖ్యత్వాత్. 4.3.12

జైమినిస్త్వాచార్యః "స ఏతాన్ బ్రహ్మ గమయతి" (ఛా.ఉ. 4.15.6) ఇత్యత్ర పరమేవ బ్రహ్మ ప్రాపయతీతి మన్యతే. కుతః? ముఖ్యత్వాత్. పరం హి బ్రహ్మ బ్రహ్మశబ్దస్య ముఖ్యమాలమ్బనం, గౌణమపరమ్. గౌణముఖ్యయోశ్చ ముఖ్యే సంప్రత్యయో భవతి. 12

### బాలానందిని

కమితి :- ఏ పూర్వపక్షాన్ని ఆశంకించి, "కార్యం బాదరిః" ఇత్యాదిసూత్రాలచేత ఈ సిద్ధాంతం స్థాపించబడింది? ఆ పూర్వపక్షం ఇప్పుడు సూత్రాలచేతనే చూపబడుచున్నది.

పరమితి :- "ముఖ్యత్వాత్ = ముఖ్యమైన దవడంవల్ల. పరమ్ = పరబ్రహ్మను గూర్చియే వెడతాడు అని, జైమినిః = జైమిని అంటున్నాడు" అని సూత్రార్థం.

జైమినిరితి :- ఆచార్యుడైన జైమిని యైతే "స ఏతాన్ బ్రహ్మ గమయతి" అనే చోట పరబ్రహ్మనే పొందిస్తాడు అని అనుకొంటున్నాడు. ఎందువల్ల? ముఖ్యం కాబట్టి. బ్రహ్మశబ్దానికి పరబ్రహ్మ ముఖ్యమైన అర్థం, రెండవది గౌణార్థం. ముఖ్యార్థగౌణార్థాలలో ముఖ్యార్థం విషయంలో నిర్ణయం జరుగుతుంది(అనగా ముఖ్యార్థమే గ్రహించాలి.).12

## సూ. దర్శనాచ్చ 4.3.13

"తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి" (ఛా.ఉ. 8.6.6, క. ఉ. 6-16) ఇతి

చ గతిపూర్వకమమృతత్వం దర్శయతి. అమృతత్వం చ పరస్మిన్ బ్రహ్మణ్యు పపద్యతే న కార్యే. వినాశిత్వాత్ కార్యస్య. "**అథ యత్రాన్యత్పశ్యతి తదల్పం, తన్మర్త్యమ్**" (ఛా.ఉ. 7.24.1) ఇతి వచనాత్. పరవిషయైవ చైషా గతిః కఠవల్లీషు పఠ్యతే, న హి తత్ర విద్యాన్తరప్రక్రమోఽస్తి, "**అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాత్**" (క.ఉ. 2.14) ఇతి పరస్యైవ బ్రహ్మణః ప్రక్రాన్తత్వాత్. 13

బాలానందిని

**దర్శనాదితి** :- "దర్శనాచ్చ = శ్రుతిలో కనబడడంవల్ల కూడ పరబ్రహ్మనే గ్రహించాలి" అని సూత్రార్థం.

**తయేతి** :- "తయోర్ధ్వ...ఏతి" అను శ్రుతి అమృతత్వం గతిపూర్వకమే (ఎక్కడికో వెళ్ళియే మోక్షం పొందుతాడు) అని చూపుచున్నది. అమృతత్వం పరబ్రహ్మయందే ఉపపన్నంగా ఉంటుంది కాని కార్యబ్రహ్మయందు ఉపపన్నం కాదు. "అథ....మర్త్యమ్" అను వచనాన్ని అనుసరించి కార్యం నశించిపోతుంది కదా? కఠవల్లిలో ఈ గతి పరబ్రహ్మకు సంబంధించినది గానే పఠించబడుతున్నది. ఎందువల్ల ననగా"అన్యత్ర ధర్మాద్ధన్యత్రాధర్మాత్" అని పరబ్రహ్మయే ఉపక్రమింపబడినది గాన విద్యాంతరప్రక్రమం (అపరవిద్యోపక్రమం) లేదు. 13

**సూ. న చ కార్యే ప్రతిపత్త్యభిసన్ధిః. 4.3.14**

**అపి చ** "**ప్రజాపతేః సభాం వేశ్మ ప్రపద్యే**" (ఛి.ఉ. 8.14.1) ఇతి నాయం కార్యవిషయః ప్రతిపత్త్యభిసంధిః, "**నామరూపయోర్నిర్వహితా తే యదన్తరా తద్బ్రహ్మ**" (ఛా.ఉ. 8.11.1) ఇతి కార్యవిలక్షణస్య పరస్యైవ బ్రహ్మణః ప్రకృతత్వాత్, "**యశోఽహం భవామి బ్రాహ్మణానామ్**" (ఛా.ఉ. 8.14.1) ఇతి చ సర్వాత్మత్వేనోపక్రమాత్. "**న తస్య ప్రతిమాస్తి యస్య నామ మహద్యశః**" (శ్వే.ఉ. 4.19) ఇతి చ పరస్యైవ బ్రహ్మణో యశోనామత్వప్రసిద్ధేః. సా చేయం వేశ్మ ప్రతిపత్తిర్గతిపూర్వికా హార్దవిద్యాయాముదితా "**తదపరాజితా పూర్బ్రహ్మణః ప్రభువిమితం హిరణ్మయమ్**" (ఛా.ఉ.8.4.3) ఇత్యత్ర. పదేరపి చ గత్యర్థత్వా

న్మార్గాపేక్షావసీయతే. తస్మాత్పరబ్రహ్మవిషయా గతిశ్రుతయ ఇతి పక్షాన్తరమ్.

### బాలానందిని

**నేతి** :- "ప్రతిపత్త్యభిసంధిః = పొందాలనే సంకల్పం, కార్యే = కార్యబ్రహ్మ విషయంలో, న చ = కుదరదు" అని సూత్రార్థం.

**అపిచేతి** :- మరొక విషయ మేమనగా - "ప్రజాపతేః....ప్రపద్యే" (ప్రజాపతియొక్క సభను గృహాన్ని పొందుతాను) అనేది కార్యబ్రహ్మకు సంబంధించిన పొందడానికి (కార్యబ్రహ్మను పొందడానికి) సంకల్పంకాదు, ఎందువల్ల ననగా "నామరూపయో...బ్రహ్మ" అని కార్యబ్రహ్మకంటె విలక్షణమైన పరబ్రహ్మయే ఇక్కడ ప్రకృతమైనది. "యశోఽహం భవామి బ్రాహ్మణానామ్" (నేను బ్రాహ్మణుల యశస్సునుగా, అనగా ఆత్మనుగా అవుతాను) అని సర్వాత్మత్వాన్ని చెపుతూ ఉపక్రమం చేయబడింది. "న తస్య....మహద్యశః" (ఏ పరమాత్మకు యశః అను గొప్ప పేరున్నదో వానిని పోలినది మరొకటి లేదు) అని పరమాత్మకే యశస్సు అనే ప్రసిద్ధి ఉండడంచేత "యద్యశోఽహమ్" ఇత్యాదివాక్యంలో చెప్పిన అర్థమే గ్రహించా లని అర్థం. "తదపరాజితా...హిరణ్మయమ్" (బ్రహ్మలోకంలో విద్యావిహీనులచేత పరాజయింప శక్యం కాని హిరణ్యగర్భునియొక్క నగరం ఉంది, ఆ బ్రహ్మచేతనే నిర్మింపబడిన బంగారుభవనం ఉన్నది) అని హార్ద (దహర) విద్యలో గతిపూర్వకమైన వేశ్మప్రాప్తి (నడచివెళ్ళి గృహాన్ని పొందడం) చెప్పబడింది. (అక్కడ చెప్పినట్లుగానే "ప్రజాపతేః సభాం వేశ్మ ప్రపద్యే" అనే చోట కూడ గతిపూర్వకమైన వేశ్మప్రాప్తిని అంగీకరించవచ్చునని భావం). పథ్ధాతువునకు అర్థం గమనం గాన మార్గంయొక్క అవసరం ఉంటుంది. అందుచేత గతిశ్రుతులు పరమాత్మవిషయకములే (వెళ్ళి పరమాత్మను పొందాలని మాత్రమే బోధిస్తున్నాయి అని అర్థం) అని మరొకపక్షం.

### భాష్యమ్

తావేతౌ ద్వౌ పక్షౌ ఆచార్యేణ సూత్రితౌ గత్యుపపత్త్యాదిభిరేకః, ముఖ్యత్వాదిభిరపరః. తత్ర గత్యుపపత్త్యాదయః ప్రభవన్తి ముఖ్యత్వాదీనాభాసయితుం న తు ముఖ్యత్వాదయో గత్యుపపత్త్యాదీనిత్యాద్య ఏవ సిద్ధాన్తో వ్యాఖ్యాతః, ద్వితీయస్తు పూర్వపక్షః. న హ్యసత్యపి సంభవే ముఖ్యస్యైవ

గ్రహణమితి కశ్చిదాజ్ఞాపయితా విద్యతే . పరవిద్యాప్రకరణేఽపి చ తత్స్తుత్యర్థం విద్యాన్తరాశ్రయగత్యనుకీర్తనముపపద్యతే "విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవన్తి" (ఛా.ఉ. 8.6.6) ఇతి వత్. "ప్రజాపతేః సభాం వేశ్మ ప్రపద్యే" (ఛా.ఉ. 8.14.1) ఇతి తు పూర్వవాక్యవిచ్ఛేదేన కార్యేఽపి ప్రతిపత్త్యభిసంధిర్న విరుధ్యతే. సగుణేఽపి చ బ్రహ్మణి సర్వాత్మత్వసంకీర్తనం "సర్వకర్మా సర్వకామ" ఇత్యాదివదవకల్పతే. తస్మాదపరవిషయా ఏవ గతిశ్రుతయః

బాలానందిని

**తావితి** :- గత్యుపపత్త్యాదులచేత ఒక పక్షం, ముఖ్యత్వాదిహేతువులచేత మరొక పక్షం - ఈ విధంగా రెండు పక్షాలు అచార్యునిచేత సూత్రింపబడ్డాయి. వీటిలో గత్యుపత్త్యాదిహేతువులు ముఖ్యత్వాదిహేతువులను హేత్వాభాసలనుగా చేయడానికి సమర్థము లవుతాయి, కాని ముఖ్యాత్వాదిహేతువులు గత్యుపపత్త్యాదులను అభాసములనుగా చేయజాలవు. (గత్యుపపత్తి మొదలైన హేతువులను పట్టి ముఖ్యత్వాదిహేతువులు సరియైనవి కావని గ్రహించా లని అర్థం). అందుచేత మొదటిదే సిద్ధాంతంగాను, రెండవది పూర్వపక్షంగాను వాఖ్యానించబడింది. కుదరకపోయినా కూడ ముఖ్యార్థాన్నే గ్రహించా లని అజ్ఞాపించేవాడు ఎవడూ లేడు కదా? పరవిద్యాప్రకరణంలో కూడ దానిని స్తుతించడంకొరకై విద్యాంతరానికి సంబంధించిన గతిని గూర్చి చెప్పడం, "విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవన్తి" అని చెప్పి నట్లు ఉపపన్నమైనదే.

**వి. విష్వఙ్ఙన్యాః** :- ఇత్యాదివాక్యంలో విద్యతో సంబంధించిన సుషుమ్నానాడి యొక్క గొప్పతనాన్ని స్తుతించడంకొరకు విద్యతో సంబంధం లేని ఇతరనాడులు కూడా చెప్పబడ్డాయి. అదే విధంగా కఠోపనిషత్తులో - గతి లేకపోయినా కూడ పరవిద్య నిరతిశయమైన ఫలం ఇస్తుంది, గతితో కూడిన అపరవిద్యయొక్క ఫలం దాని అంతర్గతం అవుతుంది అని పరవిద్యను స్తుతించడానికి చెప్పబడింది అని చెప్పవచ్చును.

**ప్రజాపతేరితి** :- "ప్రజాపతేః సభాం వేశ్మ ప్రపద్యే" అనేదైతే పూర్వవాక్యంనుంచి దీనిని వేరుచేసి కార్యబ్రహ్మవిషయంలోనే ప్రాప్తిసంకల్పం అని చెప్పినా విరుద్ధం కాదు సర్వకర్మా, సర్వసంకల్పః ఇత్యాదులను చెప్పి నట్లు సగుణబ్రహ్మతో కూడ సర్వాత్మత్వాన్ని

చెప్పడం కుదురుతుంది. అందుచేత ఈ గతిశ్రుతులు అపరబ్రహ్మవిషయకములే.

ఏ. "ప్రజాపతేః" అనేది "నామరూపయోః" ఇత్యాదిపరబ్రహ్మప్రతిపాదక ప్రకరణంలో ఉన్నా దానిని ఆ ప్రకరణంనుండి వేరుచేసి "ప్రజాపతేః సభాం వేశ్మ" అనే శ్రుతిచేత, వాక్యంచేత, ప్రకరణాన్ని బాధించి, ఇది కార్యబ్రహ్మవిషయకమైన ప్రాప్తిసంకల్పాన్ని చెప్పుచున్న దని చెప్పడంలో అనుపపత్తి ఏదీ లేదు. అట్లే "యశోఽహం బ్రాహ్మణానామ్" ఇత్యాది వాక్యాలచేత సగుణబ్రహ్మకు కూడా ఉపాసనం కోసం సర్వవ్యాప్తత్వం చెప్పడంలో దోషం లేదు. సగుణబ్రహ్మకు సర్వకర్మత్వసర్వకామత్వాదులు చెప్పబడినట్లే ఇది కూడ.

## భాష్యమ్

కేచిత్పునః పూర్వాణి పూర్వపక్షసూత్రాణి భవన్తి ఉత్తరాణి సిద్ధాన్తసూత్రాణీత్యేతాం వ్యవస్థామనురుధ్యమానాః పరవిషయా ఏవ గతిశ్రుతీః ప్రతిష్ఠాపయన్తి. తదనుపపన్నమ్. గన్తవ్యత్వానుపపత్తేర్బ్రహ్మణః. యత్సర్వగతం సర్వాన్తరం సర్వాత్మకం చ పరం బ్రహ్మ "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః", "యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ" (బృ.ఉ. 3.4.1) "య ఆత్మా సర్వాన్తరః" (బృ.ఉ.3.4.1) "ఆత్మైవేదం సర్వమ్" (ఛా.ఉ. 7.25.2) "బ్రహ్మైవేదం విశ్వం వరిష్ఠమ్" (ము.ఉ. 2.2.11) ఇత్యాదిశ్రుతినిర్ధారితవిశేషం, తస్య గన్తవ్యతా న కదాచిదుపపద్యతే. న హి గతమేవ గమ్యేత. అన్యో హ్యన్యద్గచ్ఛతీతి ప్రసిద్ధం లోకే. నను లోకే గతస్యాపి గన్తవ్యతా దేశాన్తరవిశిష్టస్య దృష్టా, యథా పృథివీస్థ ఏవ పృథివీం దేశాన్తరద్వారేణ గచ్ఛతీతి, తథానన్యత్వేఽపి బాలస్య కాలాన్తరవిశిష్టం వార్ధకం స్వాత్మభూతమేవ గన్తవ్యం దృష్టమ్, తద్వద్బ్రహ్మణోఽపి సర్వశక్త్యుపేతత్వాత్ కథంచిద్గన్తవ్యతా స్యాదితి, న. ప్రతిషిద్ధసర్వవిశేషత్వాద్బ్రహ్మణః. "నిష్కలం నిష్క్రియం శాన్తం నిరవద్యం నిరఞ్జనమ్" (శ్వే.ఉ.6.19) "అస్థూలమనణ్వ హ్రస్వమదీర్ఘమ్" (బృ.ఉ. 3.8.8) "స బాహ్యాభ్యన్తరో హ్యజః" (బృ.ఉ.2.1.2) "స వా ఏషమహానజ ఆత్మాజరోఽమృతోఽభయో బ్రహ్మ" (బృ.ఉ.1.4.25) "స ఏష

నేతి నేత్యాత్మా" (బృ.ఉ.2.9.26) ఇత్యాది శ్రుతిస్మృతిన్యాయేభ్యో న దేశకాలాదివిశేషయోగః పరమాత్మని కల్పయితుం శక్యతే, యేన భూప్రదేశవయోవస్థాన్యా యేన అస్య గన్తవ్యతా స్యాత్. భూవయసోస్తు ప్రదేశావస్థాదివిశేషయోగాత్ ఉపపద్యతే దేశకాలవిశిష్టా గన్తవ్యతా. జగదుత్పత్తి స్థితిప్రలయహేతుత్వశ్రుతేః అనేకశక్తిత్వం బ్రహ్మణ ఇతి చేత్; న. విశేషనిరాకరణశ్రుతీనామనన్యార్థత్వాత్. ఉత్పత్త్యాదిశ్రుతీనామపి సమానమనన్యార్థత్వమితి చేత్; న. తాసామేకత్వప్రతిపాదనపరత్వాత్. మృదాదిదృష్టాన్తైర్హి సతో బ్రహ్మణ ఏకస్య సత్యత్వం వికారస్య చానృతత్వం ప్రతిపాదయచ్ఛాస్త్రం నోత్పత్త్యాదిపరం భవితుమర్హతి.

బాలానందిని

కేచిదితి :- కొందరైతే ముందు వచ్చే సూత్రాలు పూర్వపక్షసూత్రాలు, తరవాత వచ్చేవి ఉత్తరపక్షసూత్రాలు అనే వ్యవస్థను అనుసరిస్తూ గతిశ్రుతులు పరబ్రహ్మవిషయకములే అని స్థాపిస్తున్నారు. బ్రహ్మ పొందబడడం అనేది ఉపపన్నం కాదు గాన అలా చెప్పడం యుక్తం కాదు. ఏ పరబ్రహ్మ సర్వగతమో, సర్వాంతరమో, సర్వాత్మకమో, "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః", "యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ", "య ఆత్మా సర్వాన్తరః, "ఆత్మైవేదం సర్వమ్" "బ్రహ్మైవేదం విశ్వం వరిష్ఠమ్" ఇత్యాదిశ్రుతులచేత దేని విశేషం నిర్ధరించబడిందో అది గంతవ్యం అవడం ఏ నాటికీ ఉపపన్నం కాదు. పొందబడినదే మళ్లీ పొందబడదు కదా? ఒకడు మరొకదానిని (తనకంటె భిన్నమైనదానిని) పొందుతాడు అని కదా లోకంలో ప్రసిద్ధం? (ప్రశ్న) వేరైన ప్రదేశం గల పొందబడినదానినే పొందడం లోకంలో కనబడుతున్నది గదా? ఉదాహరణకి - పృథివిని పొందినవాడే (పృథివిమీద ఉన్నవాడే)మరొకప్రదేశం ద్వారా ఆ పృథివిని పొందుతున్నాడు. (పృథివిమీద ఒక చోట ఉన్నవాడే మరొక చోటికి వెడుతున్నాడు. అందుచేత పొందబడినదానినే పొందడం అనేది కుదరదు అని చెప్పకూడదు). అట్లే బేధం లేకపోయినా కూడ బాలుడు కాలాంతరంతో కూడిన స్వస్వరూపమే అయిన వార్ధక్యాన్ని పొందుతున్నాడు అనేది కూడ కనబడుచున్నది. అట్లే బ్రహ్మ కూడ సర్వశక్తులతో కూడిన దవడంచేత ఏదో విధంగా

అది గంతవ్యం కావచ్చును. (సమాధానం)-ఇది యుక్తం కాదు. ఎందువల్ల ననగా- బ్రహ్మలో సమస్తవిశేషాలు నిషేధింపబడ్డాయి. "నిష్కలం....నిరఞ్జనమ్", "అస్థూలమ్....అదీర్ఘమ్" "స..అజః" "స వా....బ్రహ్మ", "స ఏష నేతి నేత్యాత్మా" ఇత్యాదిశ్రుతి-స్మృతి - న్యాయా లుండడంవల్ల పరమాత్మకు దేశకాలాదివిశేషాలతో సంబంధం ఉంటుం దని కల్పించడం శక్యం కాదు. అలా శక్యమైతే భూప్రదేశం, వయోవస్థ అనేవాటి న్యాయంచేత (వాటి విషయంలో వలె) బ్రహ్మకు.గంతవ్యత్వం చెప్పడానికి అవకాశం ఉండేది. భూవయస్సులకైతే ప్రదేశావస్థాదివిశేషం (భూమికి వేరు వేరు ప్రదేశాలు, వయస్సుకు వేరు వేరు అవస్థలు) ఉండడంవల్ల దేశకాలాలతో కూడిన (దేశభేదంచేత కాలభేదంచేత ఏర్పడిన) గంతవ్యత్వం ఉపపన్నం అవుతుంది. (ప్రశ్న) జగత్తుయొక్క ఉత్పత్తిస్థితిలయాలకు హేతు వని శ్రుతులు చెప్పడంచేత బ్రహ్మకూడ అనేకశక్తులు కలది కదా అని అంటే (సమాధానం)అది కాదు; విశేషాన్ని నిరాకరించే (బ్రహ్మలో ఏ విధమైన విశేషాలూ లేవని చెప్పే) శ్రుతులకు మరొక అర్థం ఏదీ చెప్పడానికి వీలు లేదు. (విశేషం లేదని ప్రతిపాదించడమే వాటి ఏకైక ప్రయోజనం). (ప్రశ్న)ఉత్పత్త్యాదిశ్రుతులు కూడ అనన్యార్థము లనే మాట(ఉత్పత్త్యాదులను బోధించడమే వాటి ప్రధానోద్దేశ్యం అనే మాట) సమానమే కదా అన్నట్లయితే (సమాధానం) అది కాదు. వాటి ప్రధానోద్దేశ్యం ఏకత్వాన్ని ప్రతిపాదించడమే. సత్తైన బ్రహ్మ ఒక్కటే సత్య మనీ, వికారం అసత్య మనీ మృదాదిదృష్టాంతాలచేత ఉపదేశించే శాస్త్రం ఉత్పత్త్యాదులను ప్రధానంగా ఉపదేశిస్తుం దని చెప్పడం తగదు.

## భాష్యమ్

కస్మాత్పునరుత్పత్త్యాదిశ్రుతీనాం విశేషనిరాకరణశ్రుతిశేషత్వం, న పునరితరశేషత్వమితరాసామితి. ఉచ్యతే - విశేషనిరాకరణశ్రుతీనాం నిరాకాఙ్క్షార్థత్వాత్. న హ్యాత్మన ఏకత్వనిత్యత్వశుద్ధత్వాద్యవగతౌ సత్యాం భూయః కాచిదాకాఙ్క్షోపజాయతే, పురుషార్థసమాప్తిబుద్ధ్యుపపత్తేః "తత్ర కో మోహః కః శోకః ఏకత్వమనుపశ్యతః" (ఈశా. ఉ. 7) "అభయం వై జనక ప్రాప్తోఽసి" (బృ.ఉ. 4.2.4), "విద్వాన్న బిభేతి కుతశ్చన" "ఏతం హ వావ న తపతి కిమహం సాధు నాకరవమ్,

కిమహం పాపమకరవమ్" (తై.ఉ. 2.9.1) ఇత్యాది శ్రుతిభ్యః, తథైవ చ విదుషాం తుష్ట్యనుభవాదిదర్శనాత్. వికారానృతాభిసంధ్యపవాదాచ్చ - "మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" ఇతి. అతో న విశేషనిరాకరణ శ్రుతీనామన్యశేషత్వమవగన్తుంశక్యతే. నైవముత్పత్త్యాదిశ్రుతీనాం నిరాకాఙ్క్షార్థప్రతిపాదనసామర్థ్యమస్తి. ప్రత్యక్షం తు తాసామన్యార్థత్వం సమనుగమ్యతే. తథాహి - "తత్రైతచ్ఛుఙ్గముత్పతితం సోమ్య విజానీహి నేదమమూలం భవిష్యతి" (ఛా.ఉ. 6.8.3) ఇత్యుపన్యస్య ఉదర్కే సత ఏవైకస్య జగన్మూలస్య విజ్ఞేయత్వం దర్శయతి. "యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభిసంవిశన్తి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి" (తై.ఉ.3.1.1)ఇతి చ. ఏవముత్పత్త్యాదిశ్రుతీనామైకాత్మ్యావగమపరత్వాత్ నానేకశక్తియోగో బ్రహ్మణః. అతశ్చ గన్తవ్యత్వానుపపత్తిః "న తస్య ప్రాణా ఉత్క్రామన్తి. బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" (బృ.ఉ.4.4.6) ఇతి చ పరస్మిన్ బ్రహ్మణి గతిం నివారయతి. త ద్వ్యాఖ్యాతమ్ - "స్పష్టో హ్యేకేషామ్" (బ్ర.సూ.4.2.3) ఇత్యత్ర.

బాలానందిని

**కస్మాదితి** :- ఉత్పత్త్యాదిశ్రుతులే (బ్రహ్మయందు) విశేషాన్ని నిరాకరించే శ్రుతులకు ఎందుకు అంగాలు కావాలి, ఇవే ఉత్పత్త్యాదిశ్రుతులకు అంగాలు ఎందుకు కాకూడదు? (సమాధానం) చెప్పబడుచున్నది. విశేషానిరాకరణశ్రుతులు ఆకాంక్ష లేని అర్థాన్ని బోధిస్తున్నాయి. ఆత్మ ఏకం, నిత్యం, శుద్ధం ఇత్యాది విషయాలు తెలిసిన పిమ్మట పురుషార్థం ఇంతటితో పరిపూర్ణ మైనది అనే అభిప్రాయం కలగడంవల్ల తిరిగి మళ్లీ మరొక ఆకాంక్ష (ఎట్లు, ఎందుకు ఇత్యాదిప్రశ్న) ఉదయించదు. ఈ విషయమే **"తత్ర....అనుపశ్యతః" "అభయం వై జనక ప్రాప్తోఽసి", "విద్వాన్ న బిభేతి కుతశ్చన", 'ఏతం ....... అకరవమ్"** (నేను పుణ్యకర్మ చేశానా అపుణ్యకర్మ చేశానా అని వీనికి (ఆత్మజ్ఞానవంతునకు) మనస్తాపం ఉండదు) ఇత్యాదిశ్రుతులు చెపుతున్నాయి. అదే విధంగా (శ్రుతులలో చెప్పినట్లే) ఆత్మజ్ఞానవంతులకు ఆనందానుభవం ప్రత్యక్షంగా

కనబడుతూన్నది కూడ. "మృత్యోః.....పశ్యతి" అని వికారాల విషయంలో (కార్యాల విషయంలో) ఉన్న మిథ్యాదృష్టి నిరాకరించబడడం కూడ ఇందుకు ఉపోద్బలకం అందువల్ల విశేషనిరాకరణశ్రుతులు ఇతరమైనదానికి దేనికీ అంగం అవడం కుదరదు. ఉత్పత్త్యాదిశ్రుతులకు ఈ విధంగా ఆకాంక్షారహితమైన అర్థాన్ని బోధించే సామర్థ్యం లేదు. ఇవి మరొక విషయం ప్రతిపాదించడంకోసం చెప్పబడినవి అనే విషయం ప్రత్యక్షంగా తెలుస్తూన్నది. అదెట్లనగా - "తత్రైతచ్ఛుఙ్గ .... భవిష్యతి" (ఆ మూలకారణమైన బ్రహ్మయందు జగద్రూపమైన ఈ కార్యం పుట్టినది అని తెలుసుకో. ఇది (శుంగం - కార్యం) మూలం లేకుండా పుట్టదు) అని చెప్పి, తరవాత సత్తైన జగన్మూలం ఒక్కటే తెలియదగినది అని చూపుతున్నాడు. "యద్....బ్రహ్మ" అను శ్రుతి కూడ (జగత్కారణమైన బ్రహ్మను జగదుత్పత్తిప్రతిపాదనం ద్వారా బోధిస్తూన్నది). అందుచేత ఉత్పత్తి శ్రుతులతాత్పర్యం ఏకాత్మత్వాన్ని తెలపడమే గాన బ్రహ్మకు అనేక శక్తిసంబంధం లేదు. అందుచేత బ్రహ్మ గంతవ్యం అనడం కుదరదు. "న తస్య...అప్యేతి" అను శ్రుతి గమనం ద్వారా పరబ్రహ్మను పొందడాన్ని నిషేధిస్తూన్నది. ఈ విషయం "స్పష్టో హ్యేకేషామ్" అనే చోట విశదీకరించబడింది.

## భాష్యమ్

గతికల్పనాయాం చ గన్తా జీవః గన్తవ్యస్య బ్రహ్మణోఽవయవో వికారో వాన్యో వా తతః స్యాత్. అత్యన్తతాదాత్మ్యే గమనానుపపత్తేః. యద్యేవం తతః కిం స్యాత్? ఉచ్యతే - యద్యేకదేశస్తేనైకదేశినో నిత్యప్రాప్తత్వాన్న పునర్బ్రహ్మగమనముపపద్యతే. ఏకదేశిత్వకల్పనా చ బ్రహ్మణ్యనుపపన్నా, నిరవయవత్వప్రసిద్ధేః. వికారపక్షేఽప్యేతత్తుల్యమ్, వికారేణాపి వికారిణో నిత్యప్రాప్తత్వాత్. న హి ఘటో మృదాత్మతాం పరిత్యజ్యావతిష్ఠతే, పరిత్యాగే వాభావప్రాప్తేః. వికారావయవపక్షయోశ్చ తద్వతః స్థిరత్వాద్బ్రహ్మణః సంసారగమనమప్యనవక్లృప్తమ్. అథాన్య ఏవ జీవో బ్రహ్మణః సోఽణుర్వ్యాపీ మధ్యమపరిమాణో వా భవితుమర్హతి. వ్యాపిత్వే గమనానుపపత్తిః. మధ్యమపరిమాణత్వే చానిత్యత్వప్రసంగః. ప్రతిషిద్ధే చాణుత్వమధ్యమ

పరిమాణత్వే విస్తరేణ పురస్తాత్. పరస్మాచ్చాన్యత్వే జీవస్య "తత్త్వమసి" (ఛా.ఉ. 6.8.7) ఇత్యాదిశాస్త్రబాధప్రసగః. వికారావయవపక్షయోరపి సమానోఽయం దోషః. వికారావయవయోస్తద్వతోఽనన్యత్వా దదోష ఇతి చేత్, న. ముఖ్యైకత్వానుపపత్తేః. సర్వేష్వేతేషు పక్షేష్వనిర్మోక్షప్రసంగః, సంసార్యాత్మత్వానివృత్తేః. నివృత్తౌ వా స్వరూపనాశప్రసంగాత్, బ్రహ్మాత్మత్వానభ్యుపగమాత్.

బాలానందిని

**గతీతి :-** గతిని కల్పించిన పక్షంలో కూడ వెళ్ళే జీవుడు పొందదగిన బ్రహ్మయొక్క అవయవ మైనా కావాలి, వికార (కార్య) మైనా కావాలి, లేదా బ్రహ్మకంటె భిన్ను డైనా కావాలి. పూర్తిగా తాదాత్మ్యం (అభేదం) ఉంటే గంతవ్యత్వం (పొందదగి ఉండడం) కుదరదు. ఐతే ఇప్పు డేమౌతుంది? చెపుతున్నాం. ఏకదేశం (అవయవ) మైతే అప్పుడు దానిచేత అవయవి ఎల్లప్పుడూ పొందబడియే ఉంది గాన మళ్ళీ బ్రహ్మను పొందడం అంటూ కుదరదు. బ్రహ్మ నిరవయవం అని ప్రసిద్ధి ఉండడంచేత అది అవయవి అని చెప్పడం కుదరదు. వికారం అనే పక్షంలో కూడ ఈ దోషం సమానమే, ఎందువల్ల ననగా వికారి (కారణం) వికారంచేత నిత్యమూ పొందబడే ఉంటుంది. ఘటం మృదాత్మత్వాన్ని (మట్టిగా ఉండడాన్ని) విడచి ఉండదు కదా? మృదాత్మత్వాన్ని విడిచిపెడితే ఘటమే లేకుండా పోతుంది. (వికారావయవపక్షాలలో బ్రహ్మ ఎల్లప్పుడూ స్థిరంగానే ఉంటుంది గాన (జీవుడు) సంసారాన్ని పొందడం కూడా కుదర వని భావం). జీవుడు బ్రహ్మకంటె భిన్నుడే అన్నట్లయితే అప్పు డతడు అణుపరిమాణం కలవాడైనా కావాలి, సర్వవ్యాపి యైనా కావాలి. మధ్యమపరిమాణం కలవాడైనా కావాలి. సర్వవ్యాపియైన పక్షంలో గమనం కుదరదు. మధ్యమపరిమాణుడైతే అనిత్యు డైపోతాడు. అణువైతే మొత్తం శరీరంలో ఉన్న జ్ఞానం కలగకూడదు. అణుత్వ - మధ్యమపరిమాణత్వాలను వెనుక సవిస్తరంగా నిరాకరించి ఉన్నాం. జీవుడు పరమాత్మకంటె భిన్ను డన్నట్లయితే తత్త్వమసీత్యాదిశాస్త్రం బాధితం అవుతుంది. వికార-అవయవపక్షాలలో కూడ ఈ దోషం (శాస్త్రబాధ) సమానమే. వికారావయవాలు అవి కలదానికంటె (వికారికంటె, అవయవి కంటె) అభిన్నములే కాన దోషం లేదు అన్నట్లయితే - అది కాదు. ఎందువల్ల ననగా

(జీవపరమాత్మలకు) ముఖ్యమైన ఏకత్వం చెప్పినట్లు కాదు కదా? ఈ అన్ని పక్షాలలోనూ కూడ (జీవునిలో సహజంగా ఉందని మీరు చెప్పే) సంసారిత్వం నివర్తించదు గాన, మోక్షం లభించదు. జీవుడు బ్రహ్మస్వరూపుడని మీరు అంగీకరించలేదు గాన, వాని సంసారం నివర్తిస్తుం దని అంగీకరిస్తే వాని సహజమైన సంసారం పోవడంతో జీవుని స్వరూపమే నశించిపోతుం దని అంగీకరించవలసివస్తుంది.

## భాష్యమ్

యత్తు కైశ్చిజ్జల్ప్యతే - నిత్యాని నైమిత్తికాని కర్మాణ్యనుష్ఠీయన్తే ప్రత్యవాయహానయే. కామ్యాని ప్రతిషిద్ధాని చ వర్జ్యన్తే స్వర్గనరకానవాప్తయే. సాంప్రతదేహోపభోగ్యాని చ కర్మాణ్యుపభోగేనైవ క్షప్యన్త ఇత్యతో వర్తమానదేహపాతాదూర్ధ్వం దేహాన్తరప్రతిసంధానకారణాభావాత్ స్వరూపావస్థానలక్షణం కైవల్యం వినాపి బ్రహ్మాత్మతయా ఏవంవృత్తస్య సేత్స్యతి - ఇతి తదసత్. ప్రమాణాభావాత్. న హ్యేతచ్ఛాస్త్రేణ కేన చిత్ ప్రతిపాదితం మోక్షార్థీత్థం సమాచరేదితి. స్వమనీషయాత్వేతత్తర్కితం యస్మాత్కర్మనిమిత్తః సంసారస్తస్మాన్నిమిత్తాభావాన్న భవిష్యతీతి. న చైతత్తర్కయితుమపి శక్యతే, నిమిత్తాభావస్య దుర్జ్ఞానత్వాత్. బహూని హి కర్మాణి జాత్యన్తరసంచితాని ఇష్టానిష్టవిపాకాని ఏకైకస్య జన్తోః సంభావ్యన్తే. తేషాం విరుద్ధఫలానాం యుగపదుపభోగాసంభవాత్ కాని చిల్లబ్ధావసరాణీదం జన్మ నిర్మిమతే కాని చిత్తు దేశకాలనిమిత్తప్రతీక్షాణ్యాసత ఇత్యతస్తేషామవశిష్టానాం సాంప్రతేనోపభోగేన క్షపణాసంభవాన్న యథావర్ణితచరితస్యాపి వర్తమానదేహపాతే దేహాన్తరనిమిత్తాభావః శక్యతే నిశ్చేతుమ్. కర్మశేషసద్భావసిద్ధిశ్చ - "తద్య ఇహ రమణీయచరణాః" (ఛా.ఉ. 5.10.7) "కర్మణః శేషేణ" (గౌ.సు. 11-29) ఇత్యాది శ్రుతిస్మృతిభ్యః. స్యాదేతత్-నిత్యనైమిత్తి కాని తేషాం క్షేపకాణి భవిష్యన్తీతి. తన్న. విరోధాభావాత్. సతి హి విరోధే క్షేప్యక్షేపకభావో భవతి. న చ జన్మాన్తరసంచితానాం సుకృతానాం నిత్యనైమిత్తికైరస్తి విరోధః. శుద్ధిరూపత్వావిశేషాత్. దురితానాం

త్వశుద్ధిరూపత్వాత్సతి విరోధే భవతు క్షపణమ్; న తు తావతా దేహాన్తరనిమిత్తా భావసిద్ధిః. సుకృతనిమిత్తత్వోపపత్తేః. దుశ్చరితస్యాప్యశేషక్షపణానవగమాత్.

బాలానందిని

యత్త్వితి :- కొందరు (మీమాంసకులు) ఇలా ప్రేలుతున్నారు (అర్థరహితంగా మాట్లాడుతున్నారు)-"ప్రత్యవాయం ఏదీ కలగకుండా ఉండడంకోసం నిత్య-నైమిత్తికకర్మలు ఆచరించబడతాయి. (ఆచరించాలి). స్వర్గ - నరకాలు రాకుండా ఉండడంకోసం కామ్యకర్మలు, ప్రతిషిద్ధకర్మలూ పరిహరించబడతాయి. ప్రస్తుతం ఉన్నదేహంచేత అనుభవించవలసిన కర్మలు భోగంచేతనే క్షీణింపచేయబడతాయి. అందుచేత ఇప్పుడున్న దేహం పతిత మైపోయిన తరవాత దేహాంతరం రావడానికి తగిన కారణం ఏదీ లేకపోవడంవల్ల స్వస్వరూపస్థితిరూపమైన కైవల్యం, ఈ విధంగా ప్రవర్తించేవానికి, బ్రహ్మాత్మత్వం లేకుండానే సిద్ధిస్తుంది". ఈ చెప్పిన దంతా అసత్, చెడ్డది ఎందువల్ల ననగా దీనికి ప్రమాణం ఏమీ లేదు. మోక్షం కోరేవాడు ఇలా ప్రవర్తించాలి అని ఏ శాస్త్రమూ చెప్పలేదు.సంసారం కర్మవల్ల కలుగుతుంది గాన నిమిత్తమైన కర్మ లేకపోతే సంసారమూ ఉండ దని ఇదంతా తమ బుద్ధిచేత మాత్రమే కల్పించబడింది. నిమిత్తం లేదు అనే విషయం తెలుసుకొనడానికి శక్యం కాదు. అందుచేత ఇది ఊహించడానికి కూడా శక్యం కాని విషయం. ప్రతి ఒక్క ప్రాణికీ కూడ ఇతరజన్మలలో సంచితములైన (సంపాదించి ఉంచుకొనబడిన), ఇష్ట - అనిష్టఫలాలను ఇచ్చే కర్మలను ఒకే సారి అనుభవించడం కుదరదు. కొన్ని కర్మలకు అవకాశం లభించగా అవి ఈ జన్మను ఇస్తున్నాయి. కొన్ని కర్మ లైతే తగిన దేశంకోసం కాలంకోసం నిరీక్షిస్తూ ఉంటాయి. అందుచేత ఇంకా మిగిలి ఉన్న కర్మలను ఈ జన్మలో కలిగే ఉపబోగంచేత క్షీణింపచేయడం అసంభవం. అందుచేత పైన చెప్పినట్లు ప్రవర్తించేవానికి కూడ ప్రస్తుతం ఉన్న దేహం పోయిన తరువాత మరొక దేహం రావడానికి తగిన నిమిత్తం ఉండ దని నిశ్చయించడానికి శక్యం కాదు. "తద్య ఇహ రమణీచరణాః" "తతః శేషేణ" ఇత్యాది శ్రుతిస్మృతులను పట్టి కర్మ మిగిలి ఉంటుందనే విషయం సిద్ధిస్తూన్నది. అది సరే! నిత్యనైమిత్తికాలు ఆ కర్మలను నశింపచేస్తాయి. అది కాదు. విరోధం లేదు కదా? (ఈ కర్మలకీ ఆ కర్మలకీ) విరోధం ఉంటే క్షేప్యక్షేపకభావం (ఈ కర్మలు నశింపచేసేవి, అవి

నశింపచేయబడేవి అనే మాట) కుదురుతుంది. మరొకవిషయ మేమనగా జన్మాంతరంలో చేసిన పుణ్యాలకు నిత్యనైమిత్తికకర్మలతో విరోధం లేదు. రెండూ పరిశుద్ధరూపములే కదా? పాపా లైతే అశుద్ధిరూపాలు గాన వాటికి (నిత్యనైమిత్తిక కర్మలతో) విరోధం ఉంటే ఇవి వాటిని నశింపచేయవచ్చు నేమో. కాని పూర్వసుకృతాన్ని నిమిత్తంగా చేసుకొని జన్మ రావచ్చును కదా? పాపం కూడా పూర్తిగా నశింపచేయబడుతుందని (ఏ శాస్త్రంవల్లా) తెలియబడడంలేదు.

## భాష్యమ్

న చ నిత్యనైమిత్తికానుష్ఠానాత్ ప్రత్యవాయానుత్పత్తిమాత్రమ్, న పునః ఫలాన్తరోత్ప త్తిరితి ప్రమాణమస్తి; ఫలాన్తరస్యాప్యనునిష్పాదినః సంభవాత్. స్మరతి హ్యాపస్తమ్బః - "తద్యథాఽఽమ్రే ఫలార్థే నిర్మితే ఛాయాగన్ధావనూత్పద్యేతే ఏవం ధర్మం చర్యమాణమర్థా అనూత్పద్యన్తే" ఇతి. న చాసతి సమ్యగ్దర్శనే సర్వాత్మనా కామ్యప్రతిషిద్ధవర్జనం జన్మప్రాయణాన్తరాలే కేన చిత్ ప్రతిజ్ఞాతుం శక్యమ్. సునిపుణానామపి సూక్ష్మాపరాధదర్శనాత్. సంశయితవ్యం తు భవతి. తథాపి నిమిత్తాభావస్య దుర్జ్ఞానత్వమేవ. న చానభ్యుపగమ్యమానే జ్ఞానగమ్యే బ్రహ్మాత్మత్వే కర్తృత్వభోక్తృత్వస్వభావస్యాత్మనః కైవల్యమాకాఙ్క్షితుం శక్యమ్; అగ్నేరౌష్ణ్యవత్ స్వభావస్యాపరిహార్యత్వాత్. స్యాదేతత్ - కర్తృత్వభోక్తృత్వకార్యమనర్థః; న తచ్ఛక్తిః. తేన శక్త్యవస్థానేఽపి కార్యపరిహారాదుపపన్నో మోక్షః ఇతి. తచ్చ న. శక్తిసద్భావే కార్యప్రసరస్య దుర్నివారత్వాత్. అథాపి స్యాత్ - న కేవలా శక్తిః కార్యమారభతేఽనపేక్ష్యాన్యాని నిమిత్తాని, అత ఏకాకినీ సా స్థితాపి నాపరాధ్యతీతి, తచ్చ న. నిమిత్తానామపి శక్తిలక్షణేన సంబన్ధేన నిత్యసంబద్ధత్వాత్. తస్మాత్కర్తృత్వభోక్తృత్వస్వభావే సత్యాత్మన్యసత్యాం విద్యాగమ్యాయాం బ్రహ్మాత్మతాయాం న కథం చన మోక్షం ప్రత్యాశాస్తి. శ్రుతిశ్చ - "నాన్యః పన్థా విద్యతేఽయనాయ" (శ్వే.ఉ.3.8) ఇతి జ్ఞానాదన్యం మోక్షమార్గం వారయతి.

## బాలానందిని

నచేతి :- నిత్యనైమిత్తికకర్మానుష్ఠానంవల్ల ప్రత్యవాయం పుట్టకపోవడం మాత్రమే కాని మరొక ఫలం ఏదీ ఉండదు అని చెప్పడానికి ప్రమాణం ఏమీ లేదు. దానిని (అనుష్ఠానాన్ని) అనుసరించి పుట్టే మరొక ఫలం కూడ ఉండవచ్చును కదా? అందుచేతనే ఆపస్తంబుడు - "తద్యథా....అనూత్పద్యన్తే" (పండ్ల కోసం మామిడి మొక్క నాటగా దాని నుండి నీడ సువాసనా కూడ ఎట్లు కలుగుతాయో అట్లే ధర్మం ఆచరిస్తూంటే మరి కొన్ని ఇతరలాభాలు కూడ కలుగుతాయి) అని అంటున్నాడు. సమ్యగ్దర్శనం లేకపోయిన ట్లయితే పుట్టుకకు మరణానికీ మధ్య సర్వవిధాలా కామ్య - ప్రతిషిద్ధకర్మలను విడిచిపెట్టగల నని ఎవడూ ప్రతిజ్ఞ చేయజాలడు. ఎంత జాగరూకతతో ఉన్నవాళ్ళకైనా ఏవో కొన్ని సూక్ష్మాలైన అపరాధాలు ఉండడం కనబడుతున్నది. ఏమైనా సంశయించవలసియే ఉంటుంది. అయినా కూడ నిమిత్తం ఉండ దనే విషయం తెలియదు. మరొక విషయ మేమనగా - జ్ఞానంచేత పొందవలసిన బ్రహ్మాత్మత్వాన్ని అంగీకరించని పక్షంలో (మీ అభిప్రాయం ప్రకారం) కర్తృత్వం, భోక్తృత్వం అనే స్వభావం గల ఆత్మకు కైవల్యం కాంక్షించడానికి శక్యం కాదు. అగ్ని యొక్క వేడి వలె స్వభావం పరిహరింపశక్యం కాదు కదా? (ప్రశ్న) ఇది ఇలా ఉండనీ. కర్తృత్వభోక్తృత్వాల కార్యమే అనర్థకరం కాని వాటి శక్తి అనర్థకరం కాదు. (అనగా జీవునికి కర్తృత్వభోక్తృత్వాలు స్వభావసిద్ధాలుగా ఉన్నా వాటివల్ల ఏదైన ఫలం కలిగితే అది మాత్రమే అనర్థకరం కాని. శక్తిరూపంలో కర్తృత్వభోక్తృత్వా లున్నా అనర్థకరాలుకావు). అందుచేత శక్తి ఉన్నా కూడ దాని కార్యాన్ని పరిహరించవచ్చును గాన మోక్షం లభించవచ్చు (అని పూర్వపక్షి అనవచ్చును). (సమాధానం) అది కూడ సరి కాదు. శక్తి ఉన్నప్పుడు కార్యం పుట్టడాన్ని నివారించడం శక్యం కాదు. అలా కాదు; ఇతరనిమిత్తాల అపేక్ష లేకుండా కేవలశక్తి కార్యాలను ఆరంభించదు. అందుచేత అది ఒక్కటీ ఉన్నా కూడ ఏమీ బాధ కలిగించదు (అని అంటే) అది కూడ కాదు. నిమిత్తాలు కూడా శక్తి రూపంలో నిత్యమూ (కర్తృత్వభోక్తృత్వశక్తులతో) సంబంధించే ఉంటాయి. అందువల్ల ఆత్మ కర్తృత్వభోక్తృత్వస్వభావంగలది అయినప్పుడు, విద్యచేత లభించే బ్రహ్మాత్మత్వం లేనప్పుడు మోక్షాన్ని గూర్చి ఏ విధంగానూ కూడ ఆశ లేదు. "నాన్యః పన్థా విద్యతేఽయనాయ" అను

శ్రుతి కూడ జ్ఞానం తప్ప మరొక మోక్షంమార్గం ఏదీ లేదని చెపుతూన్నది.

## భాష్యమ్

పరస్మాదనన్యత్వేఽపి జీవస్య సర్వవ్యవహారలోపప్రసంగః, ప్రత్యక్షాది ప్రమాణాప్రవృత్తేరితి చేత్, న. ప్రాక్ ప్రబోధాత్ స్వప్నవ్యవహారవత్తదుపపత్తేః. శాస్త్రం చ "యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి" (బృ.ఉ.2.4.14, 4.5.15) ఇత్యాదినాఽ ప్రబుద్ధవిషయే ప్రత్యక్షాదివ్యవహారముక్త్వా పునః ప్రబుద్ధవిషయేం "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్" (బృ.ఉ.2.4.14;4-5-15) ఇత్యాదినా తదభావం దర్శయతి. తదేవం పరబ్రహ్మవిదో గన్తవ్యాదివిజ్ఞానస్య బాధితత్వాన్న కథం చన గతిరుపపాదయితుం శక్యా. కిం విషయాః పునర్గతిశ్రుతయ ఇతి ఉచ్యతే- సగుణవిద్యావిషయా భవిష్యన్తి. తథాహి - క్వచిత్పఞ్చాగ్నివిద్యాం ప్రకృత్య గతిరుచ్యతే, క్వచిత్పర్యఙ్కవిద్యాం, క్వచిద్వైశ్వానరవిద్యామ్. యత్రాపి బ్రహ్మ ప్రకృత్య గతిరుచ్యతే యథా "ప్రాణో బ్రహ్మ కం బ్రహ్మ ఖం బ్రహ్మ"(ఛా.ఉ. 4.10.5) ఇతి "అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరం పుణ్డరీకం వేశ్మ" (ఛా. ఉ. 8.1.1) ఇతి తత్రాపి చ వామనీత్వాదిభిః సత్యకామత్వాదిభిశ్చ గుణైః సగుణస్యైవ వోపాస్యత్వాత్సంభవతి గతిః. న క్వచిత్పరబ్రహ్మవిషయా గతిః శ్రావ్యతే. తథా గతిప్రతిషేధః శ్రావితః "న తస్య ప్రాణా ఉత్క్రామన్తి" (బృ.ఉ. 4.4.6) ఇతి. "బ్రహ్మవిదాప్నోతి పరమ్" ఇత్యాదిషు తు సత్యప్యాప్నోతేర్గత్యర్థత్వే వర్ణితేన న్యాయేన దేశాన్తరప్రాప్త్యసంభవాత్, స్వరూపప్రతిపత్తిరేవేయమవిద్యాధ్యారోపితనామరూపప్రవిలయాపేక్షయాభిధీయతే "బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" (బృ.ఉ. 4.4.7) ఇత్యాదివదితి ద్రష్టవ్యమ్. అపి చ పరవిషయా గతిర్వ్యాఖ్యాయమానా ప్రరోచనాయ వా స్యాదనుచిన్తనాయ వా. తత్ర ప్రరోచనం తావద్ బ్రహ్మవిదో న గత్యుక్త్యా క్రియతే, స్వసంవేద్యేనైవావ్యవహితేన

విద్యాసమర్పితేన స్వాస్థ్యేన తత్సిద్ధేః. న చ నిత్యసిద్ధనిఃశ్రేయసనివేదనస్యాసాధ్యఫలస్య విజ్ఞానస్య గత్యనుచిన్తనే కాచిదపేక్షోపపద్యతే. తస్మాదపరబ్రహ్మవిషయా గతిః. తత్ర పరాపరబ్రహ్మవివేకానవధారణేన అపరస్మిన్ ప్రవర్తమానాః గతిశ్రుతయః పరస్మిన్నధ్యారోప్యన్తే.

బాలానందిని

పరస్మాదితి :- జీవుడు పరమాత్మకంటె అభిన్నుడైతే ప్రత్యక్షాదిప్రమాణాలేవీ ప్రవర్తించవు గాన సమస్తమైన వ్యవహారాలకీ లోపం కలుగుతుంది అన్నట్లయితే అది యుక్తం కాదు. మెలకువ రావడానికి ముందు స్వప్నవ్యవహారం అంతా నడచినట్లు (జ్ఞానానికి పూర్వం) లోకవ్యవహారం కుదురుతుంది. శాస్త్రం కూడ "యత్రహి....పశ్యతి" అని అజ్ఞానివిషయంలోప్రత్యక్షాదివ్యవహారాన్ని చెప్పి తరవాత జ్ఞాని విషయంలో "యత్ర...పశ్యేత్" ఇత్యాదికంచేత అది (ప్రత్యక్షాదివ్యవహారం) లేదని చెపుతూన్నది. ఈ విధంగా పరబ్రహ్మవేత్తకు గంతవ్యాదివిజ్ఞానం (ఇది పొందదగినది ఇత్యాదిజ్ఞానం) బాధితం అవడంచేత ఏ విధంగానూ కూడ వానికి గతిని సమర్థించడం కుదరదు. అయితే గతిశ్రుతులు ఎవనిని గూర్చి చెప్పబడ్డాయి? చెపుతున్నాం. ఇవి సగుణవిద్యకు సంబంధించినవి అవుతాయి. అందుచేతనే ఒక చోట పంచాగ్ని విద్యను ప్రస్తావించి గతి చెప్పబడుచున్నది, ఒక చోట పర్యంకవిద్యను, ఒకచోట వైశ్వానరవిద్యను ప్రస్తావించి గతి చెప్పబడుచున్నది. "ప్రాణో...బ్రహ్మ", "అథ...వేశ్మ" అని బ్రహ్మను ప్రస్తావించి గతి ఎక్కడ చెప్పబడుచున్నదో అక్కడ కూడ వామనీత్వాదులు, సత్యకామాదులు అయిన గుణాలతో సగుణబ్రహ్మయే ఉపాసింపదగినది గాన గతి సంభవం అవుతుంది. పరబ్రహ్మ విషయ మైన గతి ఎక్కడా కూడ చెప్పబడలేదు. (అంతేకాదు) "న తస్య ప్రాణా ఉత్క్రామన్తి" ఇత్యాదికంచేత గతినిషేధం కూడా చెప్పబడింది. "బ్రహ్మవిదాప్నోతి పరమ్" ఇత్యాదులలో **అప్** ధాతువునకు గతి అనే అర్థం ఉన్నా కూడ ఇంతవరకు చెప్పిన న్యాయాన్ని అనుసరించి దేశాంతరప్రాప్తి కుదరదు గాన అవిద్యచే అరోపించబడిన నామరూపాల ప్రవిలయం ద్వారా స్వరూపాన్ని పొందడమే - "బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" ఇత్యాదులందువలె, ఈ విధంగా చెప్పబడుచున్నది. మరొక విషయ మేమనగా పరబ్రహ్మను గూర్చి గతిని చెప్పడం

ప్రరోచనం కోస మైనా (అసక్తి కలిగించడం కోసమైనా) కావాలి, చింతనం (ధ్యానం) కోస మైనా కావాలి. గతిని చెప్పడం ద్వారా బ్రహ్మవేత్తకు ప్రరోచనం చేయడం ఉండదు. ఎందువల్ల ననగా - తనచేత మాత్రమే అనుభవించదగినది, వ్యవహితం కానిదీ (ఎక్కడికీ వెళ్ళే పని లేనిదీ) విద్యచేత కల్పింపబడినదీ అయిన స్వాస్థ్యంచేతనే (స్వస్వరూపస్థితిచేతనే) వానికి ప్రరోచనం సిద్ధిస్తుంది. నిత్యసిద్ధమైన మోక్షాన్ని అందించేదీ, సాధ్యము కాని ఫలం కలదీ అయిన విజ్ఞానానికి గతిని గూర్చి అనుచింతనం చేయవలసిన ఆపేక్ష ఏదీ లేదు. అందువల్ల గతి అపరబ్రహ్మకు మాత్రమే సంబంధించినది. ఇలా ఉండగా పరాపరబ్రహ్మల వివేకం ద్వారా నిర్ధారణ లేకపోవడంచేత అపరబ్రహ్మవిషయంలో ప్రవర్తించే గతిశ్రుతులు పరబ్రహ్మమీద ఆరోపింపబడుచున్నాయి.

## భాష్యమ్

కిం ద్వే బ్రహ్మణీ పరమపరం చేతి? బాఢం ద్వే "ఏతద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ యదోంకారః" ఇత్యాదిదర్శనాత్. కింపునః పరం బ్రహ్మ కిమపరమితి. ఉచ్యతే- యత్రావిద్యాకృతనామరూపాదివిశేషప్రతిషేధాత్ అస్థూలాదిశబ్దైర్బ్రహ్మోపదిశ్యతే తత్ పరమ్. తదేవ యత్ర నామరూపాదివిశేషేణ కేన చిద్విశిష్టముపాసనాయోపదిశ్యతే - "మనోమయః ప్రాణశరీరో భారూపః" (ఛా.ఉ.3.14.2) ఇత్యాదిశబ్దైః తదపరమ్. నన్వేవం సత్యద్వితీయశ్రుతి రుపరుధ్యేత? న. అవిద్యాకృతనామరూపోపాధికతయా పరిహృతత్వాత్. తస్య చాపరబ్రహ్మోపాసనస్య తత్సంనిధౌ శ్రూయమాణం "స యది పితృలోకకామో భవతి" (ఛా.ఉ. 8.2.1) ఇత్యాది జగదైశ్వర్యలక్షణం సంసారగోచరమేవ ఫలం భవతి. అనివర్తితత్వాదవిద్యాయాః, తస్య చ దేశవిశేషావబద్ధత్వాత్. తత్ప్రాప్త్యర్థం గమనమవిరుద్ధమ్. సర్వగతత్వేఽపి చాత్మన ఆకాశస్యేవ ఘటాదిగమనే బుద్ధ్యాద్యుపాధిగమనే గమనప్రసిద్ధిరిత్యవాదిష్మ "తద్గుణసారత్వాత్" (బ్ర.సూ. 2.3.29) ఇత్యత్ర. తస్మాత్ "కార్యం బాదరిః" (4.3.7) ఇత్యేష ఏవ స్థితః పక్షః.

"పరం జైమినిః" (4.3.12) ఇతి తు పక్షాన్తరప్రతిభానమాత్రదర్శనం ప్రజ్ఞావికాసనాయేతి ద్రష్టవ్యమ్. 14

## బాలానందిని

**కిమితి** :- పరం అపరం అని రెండు బ్రహ్మ లున్నాయా? ఔను నిస్సంశయంగా. "ఏతద్వై ఓంకారః" ఇత్యాదివాక్యాలు కనబడుతున్నాయి కదా? ఏది పరబ్రహ్మ, ఏది అపరబ్రహ్మ? చెపుతున్నాం. అవిద్యచేత కల్పించబడిన నామరూపాదివిశేషాలను నిషేధిస్తూ అస్థూలాదిశబ్దాలచేత బోధింపబడేది పరబ్రహ్మ. నామరూపాదికమైన ఏదో ఒక విశేషంతో కూడినదిగా "మనోమయః ప్రాణశరీరో భారూపః" ఇత్యాదివాక్యాలచేత ఉపాసనకొరకై ఉపదేశింపబడే అదే అపరబ్రహ్మ. (ప్రశ్న) అట్లైతే అద్వితీయశ్రుతికి (బ్రహ్మ ఒక్కటే అనే శ్రుతికి) బాధ కలుగుతుంది కదా? కలగదు. అవిద్యచేత కల్పితములైన నామరూపాదులు ఉపాధిగా ఉండడంచేత భేదం ఏర్పడింది అని ఈ దోషం పరిహరింపబడింది కదా? అలాంటి అపరబ్రహ్మను ఉపాసించినందుకు వాని దగ్గర (అపరబ్రహ్మోపాసన విధించే వాక్యం దగ్గర) వినబడే "స యది పితృలోకకామో భవతి" ఇత్యాదికమైన, సంసారానికే సంబంధించిన జగదైశ్వర్యస్వరూప మైన ఫలం లభిస్తుంది, ఎందువల్ల ననగా అలాంటి ఉపాసనచేత అవిద్య నివర్తించదు. ఈ ఫలం ఆ యా దేశవిశేషాలతో సంబంధించి ఉండడంచేత ఆ దేశాలను పొందడం కోసం గమనం విరుద్ధం కాదు. ఆత్మ సర్వగతమే అయినా కూడ, ఘటాదులు వెడుతూన్నప్పుడు ఆకాశం కూడా వెడుతున్నట్లు, బుద్ధ్యాద్యుపాధులు వెడుతున్నపుడు ఆత్మ కూడా వెడుతున్న దని ప్రసిద్ధి ఏర్పడింది అని "తద్గుణసారత్వాత్తు" అనే సూత్రం దగ్గర చెప్పి ఉన్నాం. అందువల్ల "కార్యం బాదరిః " అనే పక్షమే నిలచి ఉంది. కేవలం బుద్ధిని వికసింపచేయడం కోసం, (ఆలోచనాశక్తిని పెంచడం కోసం మాత్రమే) "పరం జైమినిః" అని పక్షాంతరప్రతిభాన మాత్రమే (ఇక్కడ మరొక పక్షం కూడా తోచవచ్చు) అని మాత్రం చూపబడింది అని గ్రహించాలి.

## కార్యాధికరణం సమాప్తం

## 6. అప్రతీకాలమ్బనాధికరణమ్. 15 - 16

## సూ. అప్రతీకాలమ్బనాన్నయతీతి బాదరాయణ ఉభయథాఽ దోషాత్తత్క్రతుశ్చ. 4.3.15

స్థితమేతత్కార్యవిషయా గతిర్న పరవిషయేతి. ఇదమిదానీం సందిహ్యతే - కిం సర్వాన్ వికారాలబ్బనాన్ అవిశేషేణైవామానవః పురుషః ప్రాపయతి బ్రహ్మలోకమ్, ఉత కాంశ్చిదేవేతి. కిం తావత్ప్రాప్తమ్? సర్వేషామేవైషాం విదుషామన్యత్ర పరస్మాద్బ్రహ్మణో గతిః స్యాత్. తథా హి "అనియమః సర్వాసామ్" (బ్ర.సూ. 3.3.31) ఇత్యత్రావిశేషేణైవైషా విద్యాన్తరేష్వవతారితేతి. ఏవం ప్రాప్తే ప్రత్యాహ - అప్రతీకాలమ్బనానితి. ప్రతీకాలమ్బనాన్వర్జయిత్వా సర్వానన్యాన్వికారాలమ్బనాన్నయతి బ్రహ్మలోకమితి బాదరాయణ ఆచార్యో మన్యతే. న హ్యేవముభయథాభావాభ్యుపగమే గశ్చిద్దోషోఽస్తి అనియమ న్యాయస్య ప్రతీకవ్యతిరిక్తేషూపాసనేషూపపత్తేః. తత్క్రతుశ్చాస్యోభయథాభావస్య సమర్థకో హేతుర్ద్రష్టవ్యః. యో హి బ్రహ్మక్రతుః స బ్రాహ్మమైశ్వర్యమాసీదేదితి శ్లిష్యతే - "తం యథా యథోపాసతే తదేవ భవతి" ఇతి శ్రుతేః. న తు ప్రతీకేషు బ్రహ్మక్రతుత్వమస్తి, ప్రతీకప్రధానత్వాదుపాసనస్య . నన్వబ్రహ్మక్రతురపి బ్రహ్మ గచ్ఛతీతి శ్రూయతే, యథా పఞ్చాగ్నివిద్యాయామ్- "స ఏతాన్ బ్రహ్మ గమయతి" (ఛా.ఉ. 4.15.5) ఇతి? భవతు యత్రైవమాహత్యవాద ఉపలభ్యతే. తదభావే త్వౌత్సర్గికేణ తత్క్రతున్యాయేన బ్రహ్మక్రతూనామేవ తత్ప్రాప్తిర్నేతరేషామితి గమ్యతే. 15

### బాలానందిని

**అప్రతీకేతి :-** "అప్రతీకాలమ్బనాన్ = ప్రతీకోపాసనచేయనివాళ్ళను, నయతి = బ్రహ్మలోకం చేరుస్తాడు అని, బాదరాయణః = బాదరాయణుడు చెప్పుచున్నాడు ఉభయథా = వాళ్ళనే చేరుస్తాడు ఇతరులను చేర్చడు అని రెండు విధాల చెప్పినా

కూడ, అదోషః = దోషం లేదు. తత్క్రతుశ్చ = కార్యబ్రహ్మవిషయక మైన ఉపాసన చేసేవాడే బ్రహ్మలోకం చేరుతాడు" అని సూత్రార్థం.

**స్థితమితి** :- గతి కార్యబ్రహ్మవిషయకమే కాని పరబ్రహ్మవిషయం కాదనేది నిర్ణయించబడింది. కార్యోపాసన చేసేవాళ్ళ నందరినీ, ఏ విశేషమూ లేకుండా అమానవ పురుషుడు బ్రహ్మలోకం పొందిస్తాడా లేక కొంతమందిని మాత్రమే పొందిస్తాడా అని ఇప్పుడు సందేహించబడుచున్నది. ఏమి ప్రాప్తించినది? ఈ ఉపాసకు లకందరికీ, పరబ్రహ్మదగ్గరికి కాక (కార్యబ్రహ్మదగ్గరికి) గతి ఉంటుంది. ఎందువల్ల ననగా "**అనియమః సర్వాసామ్**" అనే సూత్రంలో ఇది (గతి) విశేషం ఏదీ లేకుండా ఇతర విద్యల విషయంలో కూడ ప్రవర్తింపచేయబడినది. ఇట్లు ప్రాప్తించగా '**అప్రతీకాలమ్బనాన్**' అని సమాధానం చెప్తున్నాడు. ప్రతీకోపాసకులను తప్ప మిగిలిన వికారోపాసకుల నందరినీ బ్రహ్మలోకానికి తీసుకొని వెడతాడు అని బాదరాయణాచార్యుడు భావిస్తున్నాడు. ఈ విధంగా రెండు విధాలను అంగీకరించినా దోషం లేదు. అనియమన్యాయం ప్రతీకభిన్నా లైన ఉపాసనలవిషయంలో మాత్రమే ప్రవర్తిస్తుంది. ఇట్లు రెండు విధాలుగా చెప్పడానికి తత్క్రతువు (బ్రహ్మోపాసనం) సమర్థకమైనహేతు వని గ్రహించాలి. "**తం యథా యథోపాసతే తదేవ భవతి**" (దానిని ఏ విధంగా సేవిస్తారో అదే అవుతుంది) అను శ్రుతి ననుసరించి బ్రహ్మక్రతువైనవాడే (బ్రహ్మను ఉపాసించేవాడే) బ్రహ్మకు సంబంధించిన ఐశ్వర్యాన్ని పొందుతాడు అని చెప్పడం యుక్తంగా ఉంటుంది. ప్రతీకలలో నైతే బ్రహ్మక్రతుత్వం లేదు. ("మనో బ్రహ్మేత్యుపాసీత" ఇత్యాద్యుపాసనలో బ్రహ్మదృష్టితో ఉపాసింపబడేది మనస్సే గాన దానికే ప్రాధాన్యం. ఇలాంటి ప్రతీకోపాసనలలో బ్రహ్మ అప్రధానంగా ఉంటుంది). (ప్రశ్న) బ్రహ్మక్రతువుకానివాడు కూడ బ్రహ్మను పొందుతాడు అని చెప్పబడింది కదా? ఉదాహరణకి - పంచాగ్ని విద్యలో "స ఏతాన్ బ్రహ్మ గమయతి" అని చెప్పబడింది. (ఈ విద్య బ్రహ్మక్రతువుకాదు). (సమాధానం) - ఈ విధంగా కలిపి ఎక్కడ చెప్పబడిందో అక్కడ మాత్రం (పంచాగ్నివిద్యాదులలో) అట్లే అయితే కావచ్చును. అలాంటిది (ప్రత్యేకంగా బ్రహ్మక్రతువు కానిదానిని చెప్పని స్థలాలలో) సామాన్యంగా ప్రవర్తించే తత్క్రతున్యాయంచేత (ఎవడు దేనిని ధ్యానిస్తాడో అతడు దానిని పొందుతాడు.

అనేది తత్క్రతున్యాయం) బ్రహ్మక్రతువులకు మాత్రమే బ్రహ్మప్రాప్తి కాని ఇతరప్రతీకోపాసకులకు లేదు అని తెలుస్తూన్నది.

ఏ. "స ఏతాన్ బ్రహ్మ గమయతి" (అమానవపురుషుడు వీళ్ళను బ్రహ్మ దగ్గరికి తీసికొనివెడతాడు) అని చెప్పబడింది. ఈ వాక్యంలోని 'ఏతాన్' (వీళ్ళను) అనే పదం - "తద్య ఇత్థం విదుర్యేచామీ అరణ్యే శ్రద్ధాం సత్యమిత్యుపాసతే తేఽర్చిషమేవాభిసంభవన్తి" అనే వెనుకటి వాక్యంలో చెప్పబడినవాళ్ళను నిర్దేశిస్తుంది. "తద్య ఇత్థం విదుః" అని చెప్పబడినవాళ్ళు పంచాగ్నివేత్తలు. "యే చామీ అరణ్యే శ్రద్ధాం సత్యమిత్యుపాసతే" అని చెప్పినవాళ్ళు ఇతరబ్రహ్మవిదులు. మొదటి వాక్యంలోని "ఏతాన్" అనేది ఇతర బ్రహ్మవిదులతో పాటు పంచాగ్నివిదులను కూడా పరామర్శిస్తుంది గాన, వాళ్ళు బ్రహ్మక్రతువులు కాకపోయినా శ్రుతివాక్యంబలంవల్ల వాళ్ళను కూడా బ్రహ్మదగ్గరికి తీసికొని వెళ్ళవలసినవాళ్ళలో చేర్చాలి. వీళ్ళు తప్ప ఇతర ప్రతీకోపాసకులకు మాత్రం బ్రహ్మగమనం లేదు. 15

## సూ. విశేషం చ దర్శయతి. 4.3.16

నామాదిషు ప్రతీకోపాసనేషు పూర్వస్మాత్పూర్వస్మాత్ ఫలవిశేషమ్ ఉత్తరస్మిన్నుత్తరస్మిన్ ఉపాసనే దర్శయతి - "యావన్నామ్నో గతం తత్రాస్య కామచారో భవతి" (ఛా.ఉ.7.1.5) "వాగ్వావ నామ్నో భూయసీ" (ఛా.ఉ. 7.2.1) "యావద్వాచో గతం తత్రాస్య యథాకామచారో భవతి" (ఛా.ఉ. 7.2.2) "మనోవావవాచోభూయః"(ఛా.ఉ.7.3.1) ఇత్యాదినా. న చాయం ఫలవిశేషః ప్రతీకతన్త్రత్వాదుపాసనానాముపపద్యతే. బ్రహ్మతన్త్రత్వే తు బ్రహ్మణోఽవిశిష్టత్వాత్ కథం ఫలవిశేషః స్యాత్? తస్మాన్న ప్రతీకాలమ్బనానామితరైస్తుల్యఫలత్వమితి.16

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీగోవిన్దభగవత్పూజ్యపాదశిష్య

శ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌ శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యే

చతుర్థాధ్యాయస్య తృతీయః పాదః

బాలానందిని

**విశేషమితి** :- "విశేషం చ = ప్రతీకోపాసనలలో ఫలంలో విశేషాన్ని కూడ, దర్శయతి = చూపుచున్నాడు" అని సూత్రార్థం.

**నామాదిష్వితి** :- నామాదిప్రతీకోపాసనలలో పూర్వపూర్వోపాసనకంటె ఉత్తరోత్తరోపాసనలో "యావన్నామ్నో....భవతి" (నామ ఎంత వరకు వెడితే అంతవరకు స్వేచ్ఛాసంచారం కలవా డవుతాడు), "వాగ్వావ నామ్నో భూయసీ" (నామంకంటె వాక్కు అధిక మైనది), "యావద్వాచో....భవతి" (వాక్కు వెళ్ళినంతదూరమూ కూడ స్వేచ్ఛానుసంచారం కలవా డవుతాడు), "మనో వా వ వాచో భూయః" ఇత్యాదివాక్యాలచేత విశేషఫలం చెపుతున్నాడు. ఈ ఉపాసనలు ప్రతీకంమీద ఆధారపడినవి గాన (ఈ ఉపాసనలలో ప్రతీకాలైన నామాదులకే ప్రాధాన్యం గాన) ఫలంలో విశేషం ఉపపన్నంగా ఉంటుంది. బ్రహ్మతంత్రము లైతే మాత్రం బ్రహ్మలో విశేషం ఏదీ లేదు గాన ఫలవిశేషం ఎలా ఉంటుంది? అందుచేత ప్రతీకోపాసనలు చేసేవాళ్ళకు ఇతరులతో (బ్రహ్మోపాసన చేసేవాళ్ళతో) తుల్యఫలత్వం ఉండదు. 16

అప్రతీకాలంబనాధికరణం సమాప్తం

'బాలానందిని' అను శ్రీమచ్ఛాంకరశారీరకమీమాంసాభాష్యాంధ్రవ్యాఖ్యానంలో చతుర్థాధ్యాయంలో తృతీయపాదం సమాప్తం

## అథ చతుర్థాధ్యాయే చతుర్థః పాదః

(అత్ర పాదే బ్రహ్మప్రాప్తిబ్రహ్మలోకస్థితినిరూపణమ్)

### 1. సంపద్యావిర్భావాధికరణమ్ సూ. 1 - 3

### సూ. సంపద్యావిర్భావః స్వేన శబ్దాత్. 4.4.1

"ఏవమేవైష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే" (ఛా.ఉ. 8.12.3) ఇతి శ్రూయతే. తత్ర సంశయః - కిం దేవలోకాద్యుపభోగస్థానేష్వివ అగన్తుకేన కేన చిద్విశేషేణాభినిష్పద్యతే అహోస్విదాత్మమాత్రేణేతి. కిం తావత్ప్రాప్తమ్? స్థానాన్తరేష్వివాగన్తుకేన కేన

చిద్రూపేణాభినిష్పత్తిః స్యాత్ , మోక్షస్యాపి ఫలత్వప్రసిద్ధేః. అభినిష్పద్యతే ఇతి చ ఉత్పత్తిపర్యాయత్వాత్. స్వరూపమాత్రేణ చేదభినిష్పత్తిః పూర్వాస్వప్యవస్థాసు స్వరూపానపాయాద్విభావ్యేత. తస్మాద్విశేషేణ కేన చిదభినిష్పద్యత ఇతి. ఏవం ప్రాప్తే బ్రూమః- కేవలేనైవాత్మనావిర్భవతి న ధర్మాన్తరేణేతి. కుతః? "స్వేన రూపేణాభినిష్పద్యతే" ఇతి స్వశబ్దాత్. అన్యథా హి స్వేనేతి విశేషణమనవక్లప్తం స్యాత్. నన్వాత్మీయాభిప్రాయః స్వశబ్దో భవిష్యతి? న. తస్య అవచనీయత్వాత్. యేనైవ హి కేన చిద్రూపేణాభినిష్పద్యతే తస్యైవాత్మీయత్వోపపత్తేః స్వేనేతి విశేషణమనర్థకం స్యాత్. ఆత్మవచనతాయాం తు అర్థవత్, కేవలేనైవాత్మ రూపేణాభినిష్పద్యతే నాగన్తుకేనాపరరూపేణాపీతి. 1

**బాలానందిని**

సంపద్యేతి :- "సంపద్య = స్వప్రకాశమైన ఆత్మను సాక్షాత్కరించుకొని, ఆవిర్భావః = ఆత్మమాత్రంగా ఆవిర్భావమే. స్వేనశబ్దాత్ = స్వేన అను శబ్దంవల్ల" అని సూత్రార్థం.

ఏవమితి :- "ఏవమేవ...అభినిష్పద్యతే" అని వినబడుచున్నది. దేవలోకం మొదలైన భోగప్రదేశాలలో వలె ఆగంతుకమైన, క్రొత్తగా వచ్చిన, ఏదో ఒక విశేషంతో సంబధిస్తా డని అర్థమా లేక ఆత్మస్వరూపంతో సంబద్ధుడై (ఆత్మస్వరూపుడై) ఉంటా డని అర్థమా అని సంశయం. ఏమి ప్రాప్తించినది? మోక్షం అనేది కూడా ఒక ఫలమే అని ప్రసిద్ధి ఉండడంవల్ల, 'అభినిష్పద్యతే' అనే పదం ఉత్పత్తిపర్యాయం కాబట్టి కూడ (అభినిష్పద్యతే అనగా పుట్టుచున్నా డనే అర్థం అవడంవల్లా కూడ) ఇతరస్థానాలలో వలె ఆగంతుకమైన ఏదో ఒక రూపంతో సంబంధం కలగడమే అని చెప్పాలి. స్వరూపమాత్రంచేతనే అభినిష్పత్తి (స్వస్వరూపంలో ఉండడం) అని మాత్రమే అర్థ మైతే పూర్వావస్థలలో స్వస్వరూపం ఉండనే ఉంది కాబట్టి అది (అప్పుడు కూడా) అభివ్యక్తం కావలసి ఉంటుంది. అందుచేత ఏదో ఒక విశేషంతో సంబంధించినవా డవుతాడు అని అర్థం చెప్పాలి. ఇలా ప్రాప్తించగా సమాధానం చెపుతున్నాం. కేవలం తన స్వరూపంతో ఆవిర్భవిస్తాడు కాని మరొక ధర్మంతో కాదు. ఎందువల్ల? "స్వేన రూపేణ అభినిష్పద్యతే" అని 'స్వ' శబ్దం ప్రయోగించడంవల్ల. అలా చెప్పకపోతే 'స్వేన' అనే విశేషణం (ప్రత్యేకంగా

చెప్పడం) సరిగా ఉతగదు. (ప్రశ్న) స్వశబ్దానికి తనకు సంబంధించిన అని అర్థం చెప్పవచ్చు కదా? (అప్పుడు స్వరూపంతో అని కాకుండా తనకు సంబంధించిన ఒక ధర్మంతో అని అర్థం వస్తుంది అని భావం). (సమాధానం) అది యుక్తం కాదు. ఆ విషయం ప్రత్యేకంగా చెప్పవలసిన పని లేదు కదా? అతడు ఏ రూపంలో అభినిష్పన్ను డౌతాడో (ఏ రూపం పొందుతాడో) అది ఎలాగా వానిదే అవుతుంది గాన 'స్వేన' అనే విశేషణం వ్యర్థం అవుతుంది. ఆత్మ (తాను) అనే అర్థం చెపితే మాత్రం కేవలమైన స్వస్వరూపంతోనే అభినిష్పన్నుడవుతాడు, ఆగంతుకమైన మరొక రూపంతో కాదు అని చెప్పవచ్చును గాన అప్పుడు 'స్వ'శబ్దం సార్థకం అవుతుంది.

భాష్యమ్

కః పునర్విశేషః పూర్వాస్వవస్థాసు ఇహ చ స్వరూపానపాయసామ్యే సతీత్యత ఆహ -

సూ. ముక్తః ప్రతిజ్ఞానాత్. 4.4.2.

యోఽత్రాభినిష్పద్యత ఇత్యుక్తః స సర్వబన్ధవినిర్ముక్తః శుద్ధేనైవాత్మనా వతిష్ఠతే. పూర్వత్ర తు **"అన్ధో భవతి" "అపి రోదితీవ", "వినాశమేవాపీతో భవతి"** (ఛా.ఉ. 8.9.11) ఇతి చ అవస్థాత్రయకలుషితేనాత్మనా - ఇత్యయం విశేషః. కథం పునరవగమ్యతే ముక్తోఽయమిదానీం భవతీతి? ప్రతిజ్ఞానాదిత్యాహ. తథా హి - **"ఏతం త్వేవ తే భూయోఽనువ్యాఖ్యాస్యామి"** (ఛా. ఉ. 8.9.3, 8.10.4, 8.11.3) ఇత్యవస్థాత్రయదోషరహితమాత్మానం వ్యాఖ్యేయత్వేన ప్రతిజ్ఞాయ **"అశరీరం వా వ సన్తం న ప్రియాప్రియే స్పృశతః"** (ఛా.ఉ. 8.12.1) ఇతి చోపన్యస్య **"స్వేన రూపేణాభినిష్పద్యతే స ఉత్తమః పురుష"** "ఛా.ఉ. 8.12.3) ఇతి చోపసంహరతి. తథాఖ్యాయికోపక్రమేఽపి **"య ఆత్మాపహతపాప్మా"** (ఛా.ఉ. 8.7.1) ఇత్యాది ముక్తాత్మవిషయమేవ ప్రతిజ్ఞానమ్. ఫలత్వసిద్ధిరపి మోక్షస్య బన్ధనివృత్తిమాత్రాపేక్షా నాపూర్వోపజననాపేక్షా. యదప్యభినిష్పద్యతే

ఇత్యుత్పత్తిపర్యాయత్వం తదపి పూర్వావస్థాపేక్షం యథా రోగనివృత్తావరోగో నిష్పద్యతే ఇతి తద్వత్. తస్మాదదోషః. 2

బాలానందిని

క ఇతి:- పూర్వావస్థలలోను, ఇప్పుడూ కూడ స్వరూపం మారనప్పుడు (ఒకటే అయినప్పుడు) విశేషం ఏమిటి అనేదానికి సమాధానం చెపుతున్నాడు -

ముక్త ఇతి:- "ముక్తః = ఇప్పుడు అతడు ముక్తుడు, ప్రతిజ్ఞానాత్ = ఈవిధంగా శ్రుతిలో ప్రతిజ్ఞ చేయడంవల్ల (చెప్పడంవల్ల)" అని సూత్రార్థం.

య ఇతి:- ఇక్కడ అభినిష్పద్యతే అని చెప్పబడినవాడు సర్వబంధాలనుండి విముక్తుడై శుద్ధమైన ఆత్మతో (స్వరూపంతో) ఉంటాడు. పూర్వమైతే, వెనుకటి మూడు అవస్థలలో నైతే, (జాగ్రదవస్థలో) అంధు డవుతాడు (ఇంద్రియాదిధర్మాలను అంధత్వాదులను తనపై ఆరోపించుకొంటాడు). (స్వప్నంలో విత్తబంధ్వాదినాశాదులచేత) ఏడ్చుచున్నట్లుంటాడు, (సుషుప్త్యవస్థలో) వినాశం పొందాడా అన్న ట్లవుతాడు. ఈ విధంగా పూర్వం అవస్థాత్రయకలుషితమైన స్వరూపంతో ఉంటాడు అనేది విశేషం. ఇప్పుడు అతడు ముక్తు డవుతాడు అని తెలుస్తూన్నది? ప్రతిజ్ఞానంవల్ల అని అంటున్నాడు. అదెట్లనగా "ఏతం త్వేవ...అను వ్యాఖ్యాస్యామి" అని అవస్థాత్రయానికి సంబంధించిన దోషాలు లేని ఆత్మను గూర్చి చెపుతా నని ప్రతిజ్ఞ చేసి, "అశరీరం...స్పృశతః" అని కూడ చెప్పి, "స్వేన...పురుషః"అని ఉపసంహరిస్తున్నాడు. అట్లే ఆఖ్యాయికాప్రారంభంలో కూడ "య ఆత్మాపహతపాప్మా" అని ముక్తాత్మను గూర్చిన ప్రతిజ్ఞానమే (కథనమే) ఉంది. బంధనివృత్తిమాత్రంచేత మోక్షానికి ఫలత్వం కాని క్రొత్తగా ఏదో పుట్టడంవల్ల కాదు (అంతవరకూ ఉన్న బంధం తొలగిపోగానే మోక్షం అనే ఫలం లభించిన దని అంటున్నాం కాని వాస్తవంగా క్రొత్తగా ఏదో లభించడంవల్ల కాదు) రోగం పోగానే ఇతడు అరోగుడు అయ్యాడు అని చెప్పడం ఎట్లో అట్లే ఇది కూడ. అందువల్ల దోషం లేదు. 2

## సూ. ఆత్మా ప్రకరణాత్. 4.4.3

కథం పునర్ముక్త ఇత్యుచ్యతే - యావతా "పరం జ్యోతిరుపసంపద్య" (ఛా.ఉ. 8.12.3) ఇతి కార్యగోచరమేవైనం శ్రావయతి. జ్యోతిఃశబ్దస్య భౌతికే

జ్యోతిషి రూఢత్వాత్. న చానతివృత్తో వికారవిషయాన్ కశ్చిన్ముక్తో భవితుమర్హతి. వికారస్యార్తత్వప్రసిద్ధేరితి. నైష దోషః. యత ఆత్మైవాత్ర జ్యోతిఃశబ్దేనావేద్యతే; ప్రకరణాత్ - "**య ఆత్మాపహతపాప్మా విజరో విమృత్యుః**" (ఛా.ఉ. 8.7.1) ఇతి హి ప్రకృతే పరస్మిన్నాత్మని నాకస్మాద్భౌతికం జ్యోతిః శక్యం గ్రహీతుమ్; ప్రకృతహాన్యప్రకృతప్రక్రియప్రసంగాత్. జ్యోతిఃశబ్దస్యాత్మని దృశ్యతే "**తద్దేవా జ్యోతిషాం జ్యోతిః**" (బృ.ఉ. 4.4.16) ఇతి. ప్రపఞ్చితం చైతత్ "**జ్యోతిర్దర్శనాత్**" (బ్ర.సూ. 1.3.40) ఇత్యత్ర.

బాలానందిని

**ఆత్మేతి:-** "ప్రకరణాత్ = ప్రకరణంవల్ల, ఆత్మా = జ్యోతిస్సు ఆత్మయే" అని సూత్రార్థం.

కథమితి:- "పరం జ్యోతిరుపసంపద్య" అని ఈ జీవుడు కార్యమైన జ్యోతిస్సుతోనే సంబంధిస్తూన్నట్లు చెపుతూండగా ఇతడు ముక్తు డని ఎలా అంటావు? జ్యోతిఃశబ్దం రూఢిచేత భౌతికమైన తేజస్సునే (అగ్ని మొదలైనదానినే) బోధిస్తుంది కదా? వికారం (కార్యం) యొక్క పరిధిని దాటనివా డెవడూ ముక్తుడు కాజాలడు. ఎందువల్ల ననగా వికారం (అగ్న్యాదికం) ఆర్త మని (వినాశి) అని ప్రసిద్ధి ఉంది కదా? (అలాంటి అగ్న్యాదికాన్ని చేరినవాడు ముక్తు డెలా అవుతాడు?) (సమాధానం) ఈ దోషం లేదు. ఇక్కడ ప్రకరణాన్ని పట్టి జ్యోతిఃశబ్దంచేత ఆత్మయే బోధించబడుతుంది. "**య ఆత్మా...విమృత్యుః**" అని పరమాత్మ ప్రకృతమై ఉండగా అకస్మాత్తుగా భౌతికమైన తేజస్సును గ్రహించడం శక్యం కాదు. అలా గ్రహిస్తే ప్రకృతహాన్యప్రకృతప్రక్రియ ప్రసక్తం అవుతుంది. (ప్రకృతమైనదానిని విడచివేయడం, ప్రకృతం కానిదానిని గ్రహించడం అనే దోషం కలుగుతుంది) "**తద్దేవా జోతిషాం జ్యోతిః**" ఇత్యాదులలో జ్యోతిఃశబ్దం ఆత్మ అనే అర్థంలో కూడ కనబడుచున్నది. ఈ విషయం "**జ్యోతిర్దర్శనాత్**" అనే సూత్రంలో వివరించబడింది. 3

సంపద్యావిర్భావాధికరణం సమాప్తం

## 2. అవిభాగేన దృష్టత్వాధికరణమ్. సూ. 4

## సూ. అవిభాగేన దృష్టత్వాత్. 4.4.4

పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే యః స కిం పరస్మాదాత్మనః పృథగేవ భవతి ఉత అవిభాగేనైవావతిష్ఠత ఇతి వీక్షాయామ్ - "స తత్ర పర్యేతి" (ఛా.ఉ. 8.12.3) ఇత్యధికరణాధికర్తవ్యనిర్ధేశాత్ "జ్యోతిరుపసంపద్య" (ఛా.ఉ. 8.12.3) ఇతి చ కర్తృకర్మనిర్దేశాత్ భేదేనైవావస్థానమితి యస్య మతిః తం వ్యుత్పాదయతి - అవిభక్త ఏవ పరేణాత్మనా ముక్తోఽవతిష్ఠతే. కుతః? దృష్టత్వాత్. తథా హి - "తత్త్వమసి" (ఛా.ఉ. 6.8.7) "అహం బ్రహ్మాస్మి (బృ.ఉ. 1.4.10) "యత్ర నాన్యత్పశ్యతి" (ఛా.ఉ. 7.24.1) "న తు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యత్పశ్యేత్" (బృ.ఉ. 4.3.23) ఇత్యేవమాదీని వాక్యాన్యవిభాగేనైవ పరమాత్మానం దర్శయన్తి. యథాదర్శనమేవ చ ఫలం యుక్తమ్, తత్క్రతున్యాయాత్. "యథోదకం శుద్ధే శుద్ధమాసిక్తం తాదృగేవ భవతి, తథా మునేర్విజానత ఆత్మా భవతి గౌతమ" (క.ఉ.4.15) ఇతిచైవమాదీని ముక్తస్వరూపనిరూపణపరాణి వాక్యాన్యవిభాగమేవ దర్శయన్తి, నదీసముద్రాదినిదర్శనాని చ. భేదనిర్దేశస్తు భేదేఽప్యుపచర్యతే - "స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్ని" (ఛా.ఉ. 7.24.1) ఇతి,"ఆత్మరతిరాత్మక్రీడః" (ఛా.ఉ.7.25.2) ఇతి చైవమాదిదర్శనాత్. 4

### బాలానందిని

**అవిభాగేనేతి:-** "అవిభాగేన = పరబ్రహ్మతో విభాగం లేకుండా ఉంటాడు, దర్శనాత్ = ఆ విధంగా శ్రుతులలో కనబడడంవల్ల" అని సూత్రార్థం.

పరమితి:- ఎవడు పరజ్యోతిని పొంది స్వస్వరూపంతో నిష్పన్ను డవుతాడో అతడు పరమాత్మకంటె వేరుగానే ఉంటాడా లేక కలిసిపోతాడా అని పరీక్షించగా "స తత్ర పర్యేతి" (అతడు దానిని చేరి ఉంటాడు) అని అధికరణ - అధికర్తవ్యనిర్దేశంవల్ల (పరమాత్మ

అధికరణం అనీ జీవుడు దానియందు ఉండేవాడనీ చెప్పడం వల్ల) "జ్యోతిరుపసంపద్య" (జ్యోతిస్సును చేరి) అని జ్యోతిస్సును కర్మగాను జీవుణ్ణి కర్తగాను నిర్దేశించడంవల్ల వేరుగానే ఉండడం జరుగుతుంది అని అనుకునే వానికి, ముక్తుడు పరమాత్మతో అవిభక్తుడుగానే ఉంటాడు అని బోధిస్తున్నాడు. ఎందువల్ల? అలా కనబడుతున్నందువల్ల. "**తత్త్వమసి**" "**అహం బ్రహ్మాస్మి**", "**యత్ర నాన్యత్పశ్యతి**" "**న తు.....పశ్యేత్**" (వేరుగా చూడడానికి అది తప్ప మరొక వస్తు వేదీ లేదు) ఇత్యాదివాక్యాలు పరమాత్మను అవిభాగంతోనే చూపుతున్నాయి. తత్క్రతున్యాయానుసారం ఏ విధంగా భావన చేస్తే ఆ విధమైన ఫలం లభించడమే యుక్తం. (ఇతడు చివరి వరకు తనకు బ్రహ్మాభేదాన్నే ధ్యానించాడు గాన వానికి ఆ ఫలమే లభించాలి అని అర్థం). "**యథోదకం...గౌతమ**" (ఓ! నచికేతుడా! పరిశుద్ధమైన నీటిలో కలపబడిన పరిశుద్ధమైన నీరు ఏ విధంగా పరిశుద్ధంగానే ఉంటుందో జ్ఞానం గల మునియొక్క ఆత్మ కూడ అలాగే ఉంటుంది). ఇత్యాదులైన, ముక్తస్వరూపాన్ని తెలిపే వాక్యాలు, (శ్రుతులలో చూపబడిన) నదులు సముద్రంలో కలిసిపోయి నట్లు ఇత్యాదినిదర్శనాలూ కూడ అవిభాగాన్నే చూపుతున్నాయి. అభేదమే ఉన్నా కూడ ఉపచారంచేత భేదనిర్దేశం కనబడుచున్నది. "**స భగవః...మహిమ్ని**" (పూజ్యుడా! ఆ పరమాత్మ దేనిమీద నిలచి ఉన్నాడు? తన మహిమమీదనే నిలిచి ఉన్నాడు) అని, "**ఆత్మరతిః ఆత్మక్రీడః**" (ఆత్మయందే రతి కలవాడు, ఆత్మయందే క్రీడించువాడు) ఇత్యాదివాక్యాలు కనబడుతున్నాయి. (వీటిలో అభిన్నమైన ఆత్మయందే భేదం ఆరోపించబడింది.). 4

**అవిభాగేనదృష్టత్వాధికరణం సమాప్తం**

## 3. బ్రాహ్మాధికరణమ్. సూ. 5 - 7

## సూ. బ్రాహ్మేణ జైమినిరుపన్యాసాదిభ్యః 4.4.5

స్థితమేతత్ - "స్వేన రూపేణ" (ఛా.ఉ. 8.3.4) ఇత్యత్ర ఆత్మమాత్రరూపేణాభినిష్పద్యతే నాగన్తుకేనాపరరూపేణేతి. అధునా తు తద్విశేషబుభుత్సాయామభిధీయతే. స్వమస్య రూపం బ్రాహ్మమ్

అపహతపాప్మత్వాది సత్యసంకల్పత్వావసానం, తథా సర్వజ్ఞత్వం, సర్వేశ్వరత్వం చ. తేన స్వరూపేణాభినిష్పద్యత ఇతి జైమినిరాచార్యో మన్యతే? కుతః ఉపన్యాసాదిభ్యస్తథావగమాత్. తథా హి - "**య ఆత్మాపహపాప్మా**" (ఛా.ఉ. 8.7.1) ఇత్యాదినా "**సత్యకామః సత్యసంకల్పః**" (ఛా.ఉ. 8.7.1) ఇత్యేవమన్తేనోపన్యాసేనైవమాత్మకతామాత్మనో బోధయతి. తథా - "**స తత్ర పర్యేతి జక్షన్ క్రీడన్ రమమాణః**" (ఛా.ఉ. 8.12.3) ఇత్యైశ్వర్యరూపమావేదయతి. "**తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి**" (ఛా.ఉ. 7.25.2) ఇతి చ. సర్వజ్ఞః సర్వేశ్వర ఇత్యాదివ్యపదేశాశ్చ ఏవముపపన్నా భవిష్యన్తి. 5

బాలానందిని

**బ్రాహ్మేణేతి:-** "బ్రాహ్మేణ = ముక్తుడు బ్రహ్మసంబంధియైన తన రూపంతో కలుస్తాడు అని, జైమినిః = జైమిని అంటున్నాడు. ఉపన్యాసాదిభ్యః = అట్లు శ్రుతులలో చెప్పడం మొదలైనదానివల్ల" అని సూత్రార్థం.

**స్థితమితి:-** "స్వేన రూపేణ" అన్నప్పుడు(ముక్తుడు) ఆత్మమాత్రరూపంతోనే అభినిష్పన్ను డవుతాడు (కలుస్తాడు) అంతేనే కాని అగంతుక మైన మరొక రూపంతో దేనితోను కాదు అని నిశ్చిత మై ఉన్నది. దానిలోని విశేషాన్ని తెలుసుకోవాలనుకొనగా, ఇప్పుడు చెప్పబడుచున్నది. బ్రాహ్మము (బ్రహ్మకు సంబంధించినది) అపహతపాప్మత్వం మొదలు సత్యసంకల్పం వరకు ఉన్నదీ అయినదే వీని (ముక్తుని) స్వరూపం. ఆ స్వరూపాన్ని, సర్వజ్ఞత్వాన్నీ, తన రూపంతో పొందుతాడు అని అచార్యుడైన జైమిని తలచుచున్నాడు. ఎందువల్ల? ఉపన్యాసాదులనుబట్టి అట్లు తెలియడంవల్ల. అదెట్లనగా - "**య ఆత్మాపహతపాప్మా**" మొదలు "సత్యకామః సత్యసంకల్పః" వరకు ఉన్న ఉపన్యాసంచేత (చెప్పడంచేత) అత్మ ఇలాంటి స్వరూపం గలది అని బోధిస్తున్నాడు. అట్లే "స తత్ర... రమమాణః" అని ఐశ్వర్యరూపాన్ని తెలుపుచున్నాడు. "తస్య సర్వేషు...భవతి" అని కూడా చెప్పుచున్నాడు "సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు" ఇత్యాదినిర్దేశాలు కూడ ఇలా చెపితేనే ఉపపన్నంగా ఉంటాయి. 5

**సూ. చితి తన్మాత్రేణ తదాత్మకత్వాదిత్యౌడులోమిః 4.4.6**

యద్యప్యపహతపాప్మాత్వాదయో భేదేనైవ ధర్మా నిర్దిశ్యన్తే తథాపి శబ్దవికల్పజా ఏవైతే. పాప్మాదినివృత్తిమాత్రం హి తత్ర గమ్యతే. చైతన్యమేవ త్వస్యాత్మనః స్వరూపమితి తన్మాత్రేణ స్వరూపేణాభినిష్పత్తిర్యుక్తా. తథా చ శ్రుతిః - "ఏవం వా అరేఽయమాత్మానన్తరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ" (బృ.ఉ.4.5.13) ఇత్యేవంజాతీయకానుగృహీతా భవిష్యతి. సత్యకామత్వాదయస్తు యద్యపి వస్తుస్వరూపేణైవ ధర్మా ఉచ్యన్తే సత్యాః కామా అస్యేతి, తథాప్యుపాధిసంబన్ధాధీనత్వాత్తేషాం న చైతన్యవత్స్వరూపత్వసంభవః; అనేకాకారత్వప్రతిషేధాత్. ప్రతిషిద్ధం హి బ్రహ్మణోఽనేకాకారత్వం "న స్థానతోఽపి పరస్యోభయలిఙ్గమ్" (బ్ర.సూ. 3.2.11) ఇత్యత్ర. అత ఏవ చ జక్షణాది సంకీర్తనమపి దుఃఖాభావమాత్రాభిప్రాయం స్తుత్యర్థమాత్మరతిరిత్యాదివత్. న హి ముఖ్యాన్యేవ రతిక్రీడామిథునాన్యాత్మని శక్యన్తే వర్ణయితుం, ద్వితీయ విషయత్వాత్తేషామ్. తస్మాన్నిరస్తాశేషప్రపఞ్చేన, ప్రసన్నేన, అవ్యపదేశ్యేన, బోధాత్మనాఽభినిష్పద్యతే ఇత్యౌడులోమిరాచార్యో మన్యతే. 6

**బాలానందిని**

**చితీతి:-** "చితి = చిత్తునందు, తన్మాత్రేణ = చిన్మాత్రరూపంతో ముక్తుడు ఆత్మయందు కలుస్తాడు. తదాత్మకత్వాత్ = చిదాత్మకం గాన అని, ఔడులోమిః= ఔడులోమి అనే ఆచార్యుడంటున్నాడు" అని సూత్రార్థం.

యద్యపీతి:- అపహతపాప్మత్వం మొదలైన ధర్మాలు (బ్రహ్మకంటె) వేరుగా చెప్పబడుచున్నా కూడ ఇవన్నీ మాటలతో ఏర్పడిన కల్పనలే. వాటివల్ల (బ్రహ్మలో) పాప్మాదులు లేవని మాత్రమే కదా చెప్పబడుచున్నది? (పాప్మాదులు లేకపోవడం అంటూ ఒక ధర్మం కాదు కదా?) ఈ ఆత్మయొక్క స్వరూపం చైతన్యం మాత్రమే. అందుచేత ఆ చైతన్యమాత్ర స్వరూపంతోనే అభినిష్పత్తి యుక్తమైనది. అలా చెపితేనే - "ఏవం....ప్రజ్ఞానఘన ఏవ" ఇత్యాదివిధమైన శ్రుతి అనుగ్రహింపబడిన ట్లవుతుంది. (ఆ శ్రుతియొక్క

ప్రామాణ్యాన్ని నిలబెట్టిన ట్లవుతుంది). "సత్యాః కామాః అస్య" (సత్యమైన కామాలు కలవాడు) అనే అర్థా న్ననుసరించి సత్యకామత్వాదులు వస్తుస్వరూపంచేతనే ధర్మాలు అని చెప్పబడినా కూడ అవి ఉపాధిసంబధాన్ని పట్టి ఏర్పడిన వవడంచేత అవి చైతన్యం వలె ఆత్మ స్వరూపా లవడం సంభవం కాదు. అనేకాకారత్వం నిషేధించడంవల్ల "నా స్థానతోఽపి పరస్యోభయలిఙ్గమ్" అనే సూత్రంలో బ్రహ్మకు అనేకాకారాలు లేవు అని ప్రతిపాదించబడింది కదా? అందుచేతనే "ఆత్మరతిః" ఇత్యాదుల వలెనే జక్షణాదులు దుఃఖం లేదు అనే అభిప్రాయంతో మాత్రమే స్తుతికోసం చెప్పబడ్డాయి. రతి, క్రీడ, మిధునం ఇవి ద్వితీయమైన దేదైనా ఉంటేనే కుదురుతాయి. వీటిని ముఖ్యార్థంలో పరిగ్రహించి అద్వితీయమైన ఆత్మవిషయంలో చెప్పడానికి శక్యం కాదు. (అందుచేత అవి స్తుత్యర్థాలు. అట్లే జక్షణాదికం కూడ స్తుత్యర్థమే). అందువల్ల ముక్తుడు నిరస్తమైన సమస్తప్రపంచం కలది, ప్రసన్నము (నిర్మలము) వర్ణనాతీతము, అయిన బోధాత్మతో, చైతన్యంతో అభినిష్పన్నం అవుతాడు. (అభిన్నంగా ఉంటాడు) అని ఆచార్యు డైన ఔడులోమి భావిస్తున్నాడు.

## సూ. ఏవమప్యుపన్యాసాత్పూర్వభావాదవిరోధం బాదరాయణః. 4.4.7

ఏవమపి పారామార్థికచైతన్యమాత్రస్వరూపాభ్యుపగమేఽపి వ్యవహారాపేయా పూర్వస్యాప్యుపన్యాసాదిభ్యోఽవగతస్య బ్రాహ్మస్యైశ్వర్య రూపస్యాప్రత్యాఖ్యానాదవిరోధం బాదరాయణ ఆచార్యో మన్యతే. 7

### బాలానందిని

ఏవమితి:- ఏవమపి = చైతన్యమాత్రస్వరూపాన్ని అంగీకరించినా కూడ, ఉపన్యాసాత్ = ఉపన్యాసంవల్ల, పూర్వభావాత్ = ఐశ్వర్యాదికం ఉండడంవల్ల, అవిరోధమ్ = విరోధాభావాన్ని, బాదరాయణః, బాదరాయణుడు అంగీకరిస్తున్నాడు" అని సూత్రార్థం.

ఏవమితి:- ఏవమపి = పారమార్థికమైన చైతన్యమాత్రస్వరూపాన్ని అంగీకరించినా కూడ వ్యవహారదృష్టితో, ఉపన్యాసాదులవల్ల తెలియబడుచున్న, వెనుకటి, బ్రాహ్మమైన ఐశ్వర్యరూపాన్ని ప్రత్యాఖ్యానం చేయలేదు గాన విరోధం లేదు అని బాదరాయణుడు తలచుచున్నాడు.

ఏ. ముక్తులైన జీవులలో ఉన్న అవిద్య నివర్తించినా కూడ బద్ధజీవుల అవిద్య నశించలేదు గాన వాళ్ళు తమ అవిద్యచేత ఈశ్వరునిలో సర్వజ్ఞత్వాదికాన్ని ఆరోపిస్తున్నారు. ఇతరజీవులలో జక్షణాదికాన్ని ఆరోపిస్తున్నారు. వాళ్ళ ఆరోపణను పట్టి బ్రహ్మాత్మతో ఉన్న ముక్తునిలో కూడా బ్రహ్మమైన అపహతపాప్మత్వం ఉన్నట్లు చెప్పవచ్చును. అట్లే ముక్తుడు సర్వాత్ముడైనాడు గాన బ్రాహ్మలోకంలోని ఇతర జీవులలో ఉన్న జక్షణాదికం కూడ వీనిలో ఉన్నట్లు ఇతరజీవుల ఆరోపణనే ఆధారంగా చేసికొని చెప్పవచ్చు. అందుచేత వ్యావహారికమైన సత్యకామత్వాదికానికి గాని బ్రహ్మలోకగతజీవుల జక్షణాదికానికి గాని నిర్విశేషచిదాత్మతో విరోధంలేదు అని బాదరాయణుని అభిప్రాయం (బ్రహ్మవిద్యాభరణం. రెండవసంపుటం పే. 845)

బ్రాహ్మాధికరణం సమాప్తం

### 4. సంకల్పాధికరణం. సూ. 8 - 9

### సూ. సంకల్పాదేవ తు తచ్ఛ్రుతేః. 4.4.8

హార్దవిద్యాయాం శ్రూయతే - "స యది పితృలోకకామో భవతి సంకల్పాదేవాస్య పితరః సముత్తిష్ఠన్తి" (ఛా.ఉ. 8.2.1) ఇత్యాది. తత్ర సంశయః కిం సంకల్ప ఏవ కేవలః పిత్రాదిసముత్థానే హేతుః ఉత నిమిత్తాన్తరసహితః ఇతి. తత్ర సంకల్పాదేవేతి శ్రవణే లోకవన్నిమిత్తాన్తరాపేక్షా యుక్తా. యథా లోకేఽస్మదాదీనాం సంకల్పాద్గమనాదిభ్యశ్చ హేతుభ్యః పిత్రాదిసంపత్తిర్భవత్యేవం ముక్తస్యాపి స్యాత్. ఏవం దృష్టవిపరీతం న కల్పితం భవిష్యతి. సంకల్పాదేవేతి తు రాజ్ఞ ఇవ సంకల్పితార్థసిద్ధికరీం సాధనాన్తరసామగ్రీం సులభామపేక్ష్యోచ్యతే. న చ సంకల్పమాత్రసముత్థానాః పిత్రాదయః మనోరథవిజృమ్భితవత్ చ ఞ్చలత్వాత్పుష్కలం భోగం సమర్పయితుం పర్యాప్తాః స్యురితి. ఏవం ప్రాప్తే బ్రూమః - సంకల్పాదేవ తు కేవలాత్పిత్రాదిసముత్థానమితి. కుతః? తచ్ఛ్రుతేః "సంకల్పాదేవాస్య పితరః సముత్తిష్ఠన్తి" (ఛా.ఉ. 8.2.1) ఇత్యాదికా హి శ్రుతిః నిమిత్తాన్తరాపేక్షాయాం పీడ్యేత. నిమిత్తాన్తరమపి తు యది సంకల్పాను

విధాయ్యేవ స్యాత్ భవతు, న తు ప్రయత్నాన్తరసంపాద్యం నిమిత్తా న్తరమితీష్యతే. ప్రాక్తత్సంపత్తేః వన్ధ్యసంకల్పత్వప్రసంగాత్, న చ శ్రుత్యవగమ్యేఽర్థే లోకవదితి సామాన్యతోదృష్టం క్రమతే. సంకల్పబలాదేవ చైషాం యావత్ప్ర యోజనం స్థైర్యోపపత్తిః, ప్రాకృతసంకల్పవిలక్షణత్వాన్ముక్తసంకల్పస్య. 8

బాలానందిని

సంకల్పాదితి:- "సంకల్పాదేవ తు = సంకల్పవల్ల మాత్రమే పిత్రాదులు కనబడతారు. తచ్ఛ్రుతేః = అట్లు వినబడడంవల్ల" అని సూత్రార్థం.

హార్దేతి:- దహరవిద్యలో "స యం ... సముత్తిష్ఠన్తి" (అతడు పితృలోకం చూడా లని అనుకొంటే అతని సంకల్పం మాత్రంచేతనే వాని పితరులు లేచి వస్తారు) అని వినబడుచున్నది. కేవలసంకల్పమే పిత్రాదుల సముత్థానానికి హేతువా లేక మరొక నిమిత్తంతో దేనితో నైనా కూడిన సంకల్పం హేతువా అని సంశయం. "సంకల్పాదేవ" అని చెప్పినా కూడ, లోకంలో వలె మరొక నిమిత్తంయొక్క అపేక్ష ఉండడమే యుక్తం. లోకంలో మనవంటివాళ్ళ సంకల్పంవల్లా, తరవాత గమనాదిహేతువులవల్లా (పిత్రాదులు ఉన్న చోటికి వెళ్ళడంవల్ల) పిత్రాదుల సంపత్తి ఎట్లు కలుగుతుందో అట్లే ముక్తునికి కూడ ఉంటుంది. ఇలా చెపితే ప్రత్యక్షంగా కనబడేదానికి విపరీతంగా కల్పించినట్లు కాదు. రాజుకు ఏదైన సంకల్పం కలగగానే సంకల్పితమైన దానిని సాధించడానికి కావలసిన సాధనాంతరసామగ్రి కూడా సులభంగా లభిస్తుంది గాన వాని సంకల్పమాత్రంచేతనే పని జరిగిన దని చెప్పి నట్లు శ్రుతిలో "సంకల్పాదేవ" అని చెప్పబడింది. మరొక విషయ మేమనగా సంకల్పమాత్రంచేత లేచి వచ్చిన పిత్రాదులు మనోరథవిజృంభణంవల్ల (ఊహా కల్పితవస్తువులవలె) చంచలమైనవాళ్ళవడంచేత పుష్కలమైన భోగాన్ని సమర్పించడానికి సమర్థులు కాజాలరు. ఇట్లు ప్రాప్తించగా కేవలం సంకల్పంచేతనే పిత్రాదులు లేస్తారని చెపుతున్నాం. ఎందువల్ల? అట్లు వినడంవల్ల. ఇతరనిమిత్తాలు కూడా ఉండాలి అన్నట్లయితే "సంకల్పాదేవాస్య పితరః సముత్తిష్ఠన్తి" అనే శ్రుతి బాధిత మయిపోతుంది నిమిత్తాంతరం కూడా సంకల్పాన్ని అనుసరించే సిద్ధం అయితే సిద్ధం కావచ్చును, కాని ప్రయత్నాంతరంచేత నిమిత్తాంతరాన్ని సంపాదించవలసి ఉంటుంది అని అంటే మాత్రం

అది అంగీకరింపబడదు. నిమిత్తం రాక పూర్వం సంకల్పం వ్యర్థం అయిపోయిం దని చెప్పవలసివస్తుంది. శ్రుతిద్వారా తెలిసిన విషయంలో లోకంలో వలె అని అంటూ మామూలుగా చూడబడేదానిని తీసికొనిరావడం మంచిది కాదు. ముక్తుని సంకల్పం సామాన్యజనుల సంకల్పంకంటె విలక్షణ మైనది గాన ఆ సంకల్పబలంచేతనే పిత్రాదులు ప్రయోజనం చేకూర్చేవరకు స్థిరంగా ఉండడం కుదురుతుంది. 8

## సూ. అత ఏవ చానన్యాధిపతిః. 4.4.9

అత ఏవ చావన్ధ్యసంకల్పత్వాత్ అనన్యాధిపతిర్విద్వాన్ భవతి, నాస్యాన్యోఽధిపతిర్భవతీత్యర్థః. న హి ప్రాకృతోఽ పి సంకల్పయన్నన్యస్వామికత్వమాత్మనః సత్యాం గతౌ సంకల్పయతి. శ్రుతిశ్చైతద్దర్శయతి - "అథ య ఇహాత్మానమనువిద్య వ్రజన్త్యేతాంశ్చ సత్యాన్ కామాంస్తేషు సర్వేషు లోకేషు కామాచారో భవతి" (ఛా.ఉ. 8.1.6) ఇతి. 9

### బాలానందిని

**అత ఇతి:-** "అతఏవ చ = ఈ కారణంవల్లనే, అనన్యాధిపతిః = మరొక అధిపతి ఎవరూ లేకుండా ఉంటాడు" అని సూత్రార్థం.

**అత ఇతి:-** అత ఏవ చ = వ్యర్థం కాని సంకల్పం కలవాడు కావుననే, విద్వాంసుడు అనన్యాధిపతిగా ఉంటాడు; వీనికి మరొక డెవడూ అధిపతిగా ఉండడని అర్థం. ప్రాకృతమానవుడు కూడ సంకల్పిస్తూ తనకు మరొకడు అధిపతిగా ఉండా లని గతి ఉన్నప్పుడు, (అనగా తప్పని సరి కానప్పుడు) సంకల్పించడు కదా. "అథ....భవతి" (ఇక్కడ ఆత్మను తెలుసుకొని (సగుణోపాసన చేసి) ఎవరు వెడతారో వాళ్ళు సత్యమైన కామాలను పొందుతారు, సకలలోకాలలోను వాళ్ళకు స్వేచ్ఛాసంచారం ఉంటుంది) అను శ్రుతి కూడ ఈ విషయమే చెప్తున్నది. 9

### సంకల్పాదికరణం సమాప్తం

## 5. అభావాధికరణమ్. సూ. 10 - 14

### సూ. అభావం బాదరిరాహ హ్యేవమ్. సూ. 4.4.10

"సంకల్పాదేవాస్య పితరః సముత్తిష్ఠన్తి" (ఛా. ఉ. 7 2.1) ఇత్యాదిశ్రుతేర్మనస్తావత్సంకల్పసాధనం సిద్ధమ్. శరీరేన్ద్రియాణి పునః ప్రాప్తైశ్వర్యస్య విదుషః సన్తి వా న వా సన్తీతి సమీక్ష్యతే. తత్ర బాదరిస్తావదాచార్యః శరీరస్యేన్ద్రియాణాం చాభావం మహీయమానస్య విదుషో మన్యతే. కస్మాత్? ఏవం హ్యామ్నాయః- "మనసైతాన్ కామాన్ పశ్యన్ రమతే య ఏతే బ్రహ్మలోకే" (ఛా.ఉ. 8.12.5) ఇతి. యది మనసా శరీరేన్ద్రియైర్వ్వ విహరేన్మనసేతి విశేషణం న స్యాత్. తస్మాదభావః శరీరేన్ద్రియాణాం మోక్షే. 10

బాలానందిని

**అభావమితి:-** బాదరిః = బాదరి, అభావమ్ = ముక్తులకు శరీరేంద్రియాల అభావాన్ని అంగీకరిస్తున్నాడు. ఏవమ్ = ఈ విధంగా, ఆహ హి = శ్రుతి చెప్పుచున్నది కదా" అని సూత్రార్థం.

**సంకల్పాదితి:-** "సంకల్పాదేవాస్య పితరః సముత్తిష్ఠన్తి" ఇత్యాదిశ్రుతిని పట్టి (ముక్తునికి) సంకల్పసాధన మైన మనస్సు ఉంటుం దనే విషయంమాత్రం నిశ్చితమే. ఐశ్వర్యాన్ని పొందిన విద్వాంసునికి (సగుణబ్రహ్మోపాసకునికి) శరీరేంద్రియాలు కూడా ఉంటాయా ఉండవా అనే విషయం పరీక్షించబడుచున్నది. ఆచార్యుడైన బాదరి యైతే మహీయమానుడైన (పూజ్యుడైన) విద్వాంసునికి శరీరేంద్రియా లుండ వని తలస్తున్నాడు ఎందువల్ల? "మనసైతాన్....బ్రహ్మలోకే" (బ్రహ్మలోకంలో ఉన్న కామాలను - భోగ్యవస్తువులను - మనస్సుతో చూస్తూ రమిస్తాడు) అని కదా శ్రుతి చెప్పుచున్నది? మనస్సుతోనూ, శరీరేంద్రియాలతోనూ కూడా విహరిస్తే "మనసా" అనే విశేషణం ఉండకూడదు. అందుచేత మోక్షంలో శరీరేంద్రియా లుండవు. 10

### సూ. భావం జైమినిర్వికల్పామననాత్ 4.4.11

జైమినిరాచార్యో మనోవచ్ఛరీరస్యాపి సేన్ద్రియస్య భావం ముక్తం ప్రతి

మన్యతే, యతః "స ఏకధా భవతి, త్రిధా భవతి" (ఛా.ఉ. 7.20.2) ఇత్యాదినానేకధాభావవికల్పమామనన్తి. న హ్యనేకవిధతా వినా శరీరభేదేనాఞ్జసీ స్యాత్. యద్యపి నిర్గుణాయాం భూమవిద్యాయామయమనేకధాభావే వికల్పః పఠ్యతే తథాపి విద్యమానమేవేదం సగుణావస్థాయామైశ్వర్యం భూమవిద్యాస్తుతయే సంకీర్త్యత ఇత్యతః సగుణవిద్యాఫలభావేనోపతిష్ఠత ఇత్యుచ్యతే. 11

బాలానందిని

భావమితి:- "వికల్పామననాత్ = శాస్త్రంలో వికల్పాలు చెప్పడంవల్ల, భావమ్ = శరీరేంద్రియాల ఉనికిని, జైమినిః = జైమిని అంగీకరిస్తున్నాడు" అని సూత్రార్థం.

జైమినిరితి:- ఆచార్యుడైన జైమినియైతే ముక్తునికి మనస్సు వలె శరీరేంద్రియాలు కూడ ఉంటా యని భావిస్తున్నాడు. ఎందువల్ల ననగా "స ఏకధా భవతి త్రిధా భవతి" (అతడు ఒక్కడుగా ఉంటాడు (లేదా అవుతాడు) ముగ్గురుగా ఉంటాడు) ఇత్యాధికం చేత (ముక్తుని విషయంలో) అనేక రూపాలలో ఉండడాన్ని వికల్పంగా చెపుతున్నారు. శరీరబేదం లేకుండా అనేక విధాలుగా ఉండడం కుదరదు కదా? అనేకధాభావాన్ని గూర్చిన ఈ వికల్పం నిర్గుణమైన భూమవిద్యలో చెప్పబడినా కూడ సగుణావస్థలో ఉన్న ఈ ఐశ్వర్యాన్నే భూమవిద్యాస్తుతికోసం అక్కడ చెప్పడం జరిగింది గాన అది సగుణవిద్యాఫలంగా ఇక్కడ గ్రహించబడుతుంది అని చెప్పబడింది. 11

సూ. ద్వాదశాహవదుభయవిధం బాదరాయణోఽతః (4.4.12).

బాదరాయణః పునరాచార్యః అత ఏవోభయలిఙ్గశ్రుతిదర్శనాత్ ఉభయవిధత్వం సాధు మన్యతే - యదా సశరీరతాం సంకల్పయతి తదా సశరీరో భవతి, యదా త్వశరీరతాం తదాశరీర ఇతి, సత్యసంకల్పత్వాత్. సంకల్పవైచిత్ర్యాచ్చ. ద్వాదశాహవత్. యథా ద్వాదశాహః సత్రమ్అహీనశ్చ భవతి, ఉభయలిఙ్గదర్శనాత్ ఏవమిదమపీతి. 12

బాలానందిని

ద్వాదశేతి:- "అతః = అందువల్లనే, బాదరాయణః = బాదరాయణుడు.

ద్వాదశాహవత్ = ద్వాదశాహం వలె, ఉభయవిధమ్ = ఉభయవిధత్వాన్ని అంగీకరిస్తున్నాడు" అని సూత్రార్థం.

**బాదరాయణ ఇతి:-** ఇతే, ఆచార్యుడైన బాదరాయణుడు ఈ కారణంవల్లనే, అనగా రెండు విధాలైన శ్రుతి కనబడడంవల్ల, ఉభయవిధత్వం మంచిదని భావిస్తున్నాడు. (ముక్తుడు) శరీరం కావా లనుకొన్నప్పుడు సశరీరు డవుతాడు. శరీరం వలదనుకొన్నప్పుడు అశరీరు డవుతాడు. ఎందువల్ల ననగా వాని సంకల్పానికి అట్టి బలం ఉంది, సంకల్పాలు కూడా విచిత్రంగా ఉండవచ్చును. ద్వాదశాహక్రతువు వలె - రెండు విధాలైన లింగం గల శ్రుతులు కనబడడంచేత ద్వాదశాహం సత్రం అనీ, అహీనం అనీ కూడ ఎట్లు అంగీకరించబడిందో అట్లే ఇక్కడ కూడ.

వి. "ద్వాదశాహమృద్ధికామా ఉపేయుః" అనే వచనం ఉంది. ఈ ద్వాదశాహ ప్రకరణంలోనే "సప్తదశావరాశ్చతుర్వింశతిపరమాః ఆసీరన్" "పదిహేడుగురికి తగ్గకుండా, ఇరవైనలుగురికి మించకుండా ఋత్విక్కులు ఉండాలి" అనే వాక్యం ఉంది. "ద్వాదశాహేన ప్రజాకామం యాజయేత్" అని మరొక వాక్యం ఉంది. "ఉపేయుః" "ఆసీరన్" అనేపదాలున్న వాక్యంచేతవిధించబడినదిసత్రంఅనీ యజధాతువు నుపయోగించినది అహీనక్రతు వనీ నియమం. ఇక్కడ రెండు విధాలైన శ్రుతివాక్యా లున్నాయి గాన ఈ ద్వాదశాహం సత్రమూ, అహీనమూ కూడ అని నిర్ణయించబడింది. అట్లే ఇక్కడ కూడా రెండు విధాలైన శ్రుతు లుండడంచేత ఉభయమూ అంగీకరించవచ్చును నని భావం. 12

## సూ. తన్వభావే సంధ్యవదుపపత్తేః. 4.4.13

యదా తు సేన్ద్రియస్య శరీరస్యాభావః తదా యథా సంధ్యే స్థానే శరీరేన్ద్రియవిషయేష్వవిద్యమానేష్వపి ఉపలబ్ధిమాత్రా ఏవ పిత్రాదికామా భవన్తి ఏవం మోక్షేఽపి స్యుః. ఏవం హ్యేతదుపపద్యతే. 13

### బాలానందిని

**తన్వితి:-** "తన్వభావే = శరీరేంద్రియాలు లేనప్పుడు, సంధ్యవత్ = స్వప్నంలో వలె, ఉపపత్తేః = ఉపపన్నం అవుతుంది గాన" అని సూత్రార్థం.

**యదేది:-** ఇంద్రియసహితమైన శరీరం లేనప్పుడు, స్వప్నావస్థలో శరీరేంద్రియ విషయాలు లేకపోయినా కూడ పిత్రాదికామాలు ఏ విధంగా కేవలం జ్ఞానరూపంలో

మాత్రమే ఉంటాయో అట్లే మోక్షంలో కూడ ఉంటాయి. ఇది ఈ విధంగా ఉపపన్నం అవుతుంది. 13

## సూ. భావే జాగ్రద్వత్. 4.4.14

భావే పునస్తయోః యథా జాగరితే విద్యమానా ఏవ పిత్రాదికామా భవన్త్యేవం ముక్తస్యాప్యుపపద్యతే. 14

### బాలానందిని

**భావ ఇతి:-** "భావే = శరీరేంద్రియా లుంటే, జాగ్రద్వత్ = జాగ్రదవస్థలో వలెనే" అని సూత్రార్థం

**భావే ఇతి:-** శరీరేంద్రియాలు ఉంటే జాగ్రదవస్థలో నిజంగానే ఉన్న పిత్రాదికామాలు ఎలా కనబడతాయో అట్లే ముక్తునికి కూడా కుదురుతుంది. 14

### అభావాధికరణం సమాప్తం

### 6. ప్రదీపాధికరణమ్. సూ. 15 - 16

## సూ. ప్రదీపవదావేశస్తథా హి దర్శయతి 4.4.15

"భావం జైమినిర్వికల్పామననాత్" (బ్ర.సూ. 4.4.11) ఇత్యత్ర సశరీరత్వం ముక్తస్యోక్తమ్. తత్ర త్రిధాభావాదిష్వనేకశరీరసర్గే కిం నిరాత్మకాని శరీరాణి దారుయన్త్రవత్ సృజ్యన్తే కిం వా సాత్మకాన్యస్మదాదిశరీరవదితి భవతి వీక్షా. తత్ర చాత్మమనసోర్భేదానుపపత్తేః ఏకేన శరీరేణ యోగాత్ ఇతరాణి శరీరాణి నిరాత్మకానీతి. ఏవం ప్రాప్తే ప్రతిపాద్యతే - ప్రదీపవదావేశ ఇతి. యథా ప్రదీప ఏకోఽనేకప్రదీపభావమాపద్యతే వికారశక్తియోగాత్, ఏవమేకోఽపి సన్విద్వానైశ్వర్యయోగాదనేకభావమాపద్య సర్వాణి శరీరాణ్యావిశతి. కుతః? తథాహి దర్శయతి శాస్త్రమేకస్యానేకభావమ్ - "**స ఏకధా భవతి త్రిధా భవతి, పఞ్చధా భవతి సప్తధా నవధా**" ఇత్యాది. నైతద్దారుయన్త్రోపమాభ్యుపగమే వకల్పతేఽ నాపి జీవాన్తరప్రవేశే. న చ నిరాత్మకానాం శరీరాణాం ప్రవృత్తిః సంభవతి

యత్త్వాత్మమనసోర్భేదానుపపత్తేరనేకశరీరయోగాసంభవ ఇతి, నైష దోషః. ఏకమనోనువర్తీని సమనస్కాన్యేవాపరాణి శరీరాణి సత్యసంకల్పత్వాత్స్రక్ష్యతి. సృష్టేషు చ తేషూపాధిభేదాదాత్మనోఽపి భేదేనాధిష్ఠాతృత్వం యోక్ష్యతే. ఏషైవ చ యోగశాస్త్రేషు యోగినామనేకశరీరయోగప్రక్రియా. 15

బాలానందిని

ప్రదీపవదితి:- "ప్రదీపవత్ = దీపం వలె, ఆవేశః = దేహాంతరములలోనికి ప్రవేశం ఉంటుంది, తథా = అట్లు, దర్శయతి హి = చూపుతున్నది కదా?" అని సూత్రార్థం.

భావమితి:- "భావం జైమినిర్వికల్పామననాత్" అనే చోట ముక్తునికి కూడా శరీరం ఉంటుంది అని చెప్పబడింది. అప్పుడు త్రిధాభావాదులలో అనేకమైన శరీరాలను (ముక్తుడు) సృష్టించుకొన్నప్పుడు దారుయంత్రాల వలె (కఱ్ఱబొమ్మలవలె) ఆత్మ లేని శరీరాలు సృజింపబడతాయా లేక మనవంటివాళ్ళ శరీరాల వలె ఆత్మతో కూడినవి సృజించబడతాయా అని పరీక్ష (ప్రశ్న) కలుగుతుంది. ఆత్మ, మనస్సు వేరుగా ఉండడం కుదరదు గాన అవి ఒక్క శరీరంలో మాత్రమే సంబంధించి ఉంటాయి గాన, ఇతర శరీరాలు ఆత్మరహితాలుగానే ఉంటాయి (అని పూర్వపక్షం)

వి. బ్రహ్మ (చైతన్యం) సర్వవ్యాపి. అంతఃకరణావచ్ఛిన్నమైన చైతన్యమే జీవాత్మ. ఒక అంతఃకరణం లేదా, అంతఃకరణసహితమైన లింగశరీరం అనాదిగా ఉంటున్నది. తదవచ్ఛిన్నమైన ఆత్మ కూడ అది ఏ శరీరంలో ఉంటుందో దానిలో మాత్రమే ఉంటుంది. మనస్సు ఒక్కటే కదా? ఇతరశరీరాలను సృష్టించినా వాటిలో మనస్సు ఉండదు. మనస్సు లేకపోతే తదవచ్ఛిన్నమైన ఆత్మా ఉండదు. అందుచేత ఆ శరీరా లన్నీ కొయ్యబొమ్మల వలె నిరాత్మకాలుగానే ఉండాలి అని పూర్వపక్షాభిప్రాయం.

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా "ప్రదీపవదావేశః" అని ప్రతిపాదించబడుచున్నది. దీపం ఒక్కటే అయినా వికారశక్తి ఉండడంవల్ల (మరొక దీపం అనే కార్యాన్ని పుట్టించగల శక్తి ఉండడంవల్ల) ఏ విధంగా అనేకమైన దీపాలు అవుతుందో అట్లే విద్వాంసుడు ఒక్కడే అయినా ఐశ్వర్యశక్తి ఉండడంవల్ల అనేకత్వాన్ని పొంది సమస్తశరీరాలలోను ప్రవేశిస్తాడు. ఎందువల్ల? "స ఏకధా...నవధా' ఇత్యాదిశాస్త్రం ఆ విధంగా

అనేకరూపగ్రహణాన్ని చూపుతున్నది గదా? ఇది, దారుయంత్రాలతో ఉపమను అంగీకరించినా, వేరే జీవులు ఆ దేహాలలో ప్రవేశిస్తా రని అంగీకరించినా కుదరదు. ఆత్మ లేని శరీరాలు ప్రవర్తించజాలవు (పని చేయజాలవు). ఆత్మ - మనస్సులకు భేదం కుదరదుగాన అనేకశరీరాలు అసంభవం అని ఏది చెప్పబడిందో ఆ దోషం లేదు. ముక్తుడు ఒక మనస్సును అనువర్తించే (అది చెప్పినట్లు చేసే) మనస్సహితమైన ఇతర శరీరాలలనే, సత్యసంకల్పు డవంచేత సృష్టిస్తాడు. ఆ శరీరాలు సృష్టించిన తరవాత ఉపాదిభేదం వల్ల (ఆ శరీరాలలో ఉన్న క్రొత్త మనస్సు లనే ఉపాధులు వేరు వేరుగా ఉండడంవల్ల) వాటిచేత అవచ్ఛిన్నమైన ఆత్మ కూడ భిన్నం గాన అది అధిష్ఠాతగా ఉండడం కుదరుతుంది. యోగశాస్త్రాలలో చెప్పిన, యోగులు అనేకశరీరాలను ధరించే ప్రక్రియ యిదే.15

## భాష్యమ్

కథం పునర్ముక్తస్యానేకశరీరావేశాదిలక్షణమైశ్వర్యమభ్యుపగమ్యతే, యావతా "తత్కేన కం విజానీయాత్" (బృ.ఉ. 4.5.15), "న తు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యద్విజానీయాత్" (బృ.ఉ.4.3.3), "సలిల ఏకో ద్రష్టాఽద్వైతో భవతి" (బృ.ఉ. 4.3.32) ఇతిచైవంజాతీయకా శ్రుతిర్విశేషజ్ఞానం వారయతి, ఇత్యత ఉత్తరం పఠతి -

**సూ. స్వాప్యయసంపత్త్యోరన్యతరాపేక్షమావిష్కృతం హి. 4.4.16**

స్వాప్యయః సుషుప్తమ్. "స్వమపీతో భవతి తస్మాదేనం స్వపితీత్యాచక్షతే" (ఛా.ఉ. 6.8.1) ఇతి శ్రుతేః. సంపత్తిః కైవల్యమ్. "బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" (బృ.ఉ.4.4.6) ఇతి శ్రుతేః. తయోరన్యతరామవస్థామపేక్ష్యైతద్విశేష సంజ్ఞావచనమ్. క్వచిత్సుషుప్తావస్థామపేక్ష్యోచ్యతే క్వచిత్కైవల్యావస్థామ్. కథమ వగమ్యతే? యతస్తత్రైవ తదధికారవశాదావిష్కృతమ్. "ఏతేభ్యో భూతేభ్యః సముత్థాయ తాన్యేవానువినశ్యతి. న ప్రేత్య సంజ్ఞాస్తి" (బృ.ఉ. 2.4.14) "యత్ర త్వస్య సర్వమాత్మై వాభూత్" (బృ.ఉ. 2.4.14) "యత్ర సుప్తో న కంచన కామం కామయతే న కంచన స్వప్నం పశ్యతి" (బృ.ఉ. 4.3.19;మాండూ. 5)

ఇత్యాదిశ్రుతిభ్యః. సగుణవిద్యావిపాకావస్థానం త్వేతత్స్వర్గాదివదవస్థాన్తరం యత్రైతదైశ్వర్యముపవర్ణ్యతే. తస్మాదదోషః. 16

బాలానందిని

**కథమితి:-** ముక్తునికి అనేకశరీరాలలో ప్రవేశించడం మొదలైన ఐశ్వర్యం ఎలా అంగీకరించబడుతుంది? ఎందువల్ల ననగా - **"తత్కేన కం విజానీయాత్", "న తు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యద్విజానీయాత్", "సలిల ఏకో ద్రష్టాద్వైతో భవతి"** (ఉదకం వలె నిర్మలుడైన ద్రష్ట అద్వితీయుడుగా అవుతాడు) ఇత్యాదిరూపంలో నున్న శ్రుతి విజ్ఞానవిశేషాన్ని నివారిస్తున్నది కదా? (అనగా ముక్తునికి భేదవిజ్ఞానపూర్వకమైన విజ్ఞానవిశేషం ఏదీ ఉండ దని చెపుతున్నది కదా?) అందుకు సమాధానం పఠిస్తున్నాడు.-

**స్వాప్యయేతి:-** "(విశేషజ్ఞానం ఉండ దని చెప్పడం) స్వాప్యయసంపత్త్యోః = సుషుప్త-కైవల్యాలలో, అన్యతరాపేక్షమ్ = ఒకదానిని పట్టి జరిగింది. ఆవిష్కృతం హి = ఈ విధంగా ఆవిష్కరించబడింది కదా?" అని సూత్రార్థం.

**స్వాప్యయ ఇతి:-** స్వాప్యయః అనగా - "స్వమపీతో....అచక్షతే" అను శ్రుతి ననుసరించి సుషుప్తం. "సంపత్తిః" అనగా - "బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" అను శ్రుతి ననుసరించి, కైవల్యం. విశేషసంజ్ఞ (జ్ఞానం) ఉండ దని చెప్పడం ఆ రెండింటిలో ఒక అవస్థను దృష్టిలో నుంచుకొని జరిగింది. కొన్ని చోట్ల సుషుప్తావస్థాపేక్షచేత చెప్పబడుచున్నది. కొన్నిచోట్ల కైవల్యావస్థను అపేక్షించి చెప్పబడుచున్నది. ఎట్లు తెలుస్తూన్నది? ఎందువల్ల ననగా అక్కడనే, వాటి అధికారాన్ని (ప్రకరణాన్ని) పట్టి **"ఏతేభ్యో....అస్తీతి" "యత్ర....అస్తీతి" "యత్ర...పశ్యతి"** ఇత్యాదిశ్రుతులవల్ల ఈ విషయం ఆవిష్కరించబడింది. (**'ఏతేభ్యో భూతేభ్యః"**. ఇత్యాదివాక్యం కైవల్యాపేక్షమైనది. "యత్ర సుప్తః" ఇత్యాదివాక్యం సుషుప్త్యపేక్షమైనది) ఏ స్థితిలో ఈ ఐశ్వర్యం వర్ణించబడుచున్నదో అది, స్వర్గాదిస్థానం వలె, సగుణవిద్యావిపాకంవల్ల (సగుణవిద్య తన ఫలం ఇవ్వడంవల్ల) లభించిన ఒకానొక అవస్థ మాత్రమే. (అనగా ఇది యథార్థమైన ముక్తి కాదు. గౌణమైన ముక్తి మాత్రమే) అందువల్ల దోషం లేదు.16

ప్రదీపాధికరణం సమాప్తం

## 7. జగద్వ్యాపారాధికరణం. సూ. 17 - 22

### సూ. జగద్వ్యాపారవర్జం ప్రకరణాదసంనిహితత్వాచ్చ. 4.4.17

యే సగుణబ్రహ్మోపాసనాత్సహైవ మనసా ఈశ్వరసాయుజ్యం వ్రజన్తి కిం తేషాం నిరవగ్రహమైశ్వర్యం భవతి ఆహో స్విత్సావగ్రహమితి సంశయః. కిం తావత్ ప్రాప్తమ్? నిరవగ్రహమేవైశ్వర్యం భవితుమర్హతి. "ఆప్నోతి స్వారాజ్యమ్" (తై.ఉ. 1.6.2) "సర్వేఽస్మై దేవా బలిమావహన్తి" (తై.ఉ. 1.5.3) "తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి" (ఛా.ఉ. 7.25-2, 8.1.6) ఇత్యాదిశ్రుతిభ్య ఇతి. ఏవం ప్రాప్తే పఠతి - జగద్వ్యాపారవర్జమితి. జగదుత్పత్త్యాది వ్యాపారం వర్జయిత్వాన్యదణిమాద్యాత్మకమైశ్వర్యం ముక్తానాం భవితుమర్హతి. జగద్వ్యాపారస్తు నిత్యసిద్ధస్యేశ్వరస్యైవ. కుతః? తస్య తత్ర ప్రకృతత్వాత్, అసంనిహితత్వాచ్చేతరేషామ్. పర ఏవ హీశ్వరో జగద్వ్యాపారాధికృతః, తమేవ ప్రకృత్యఉత్పత్త్యాద్యుపదేశాత్. నిత్యశబ్దనిబన్ధనత్వాచ్చ. తదన్వేషణవిజిజ్ఞాసన పూర్వకం త్వితరేషామణిమాద్యైశ్వర్యం శ్రూయతే. తేనాసంనిహితాస్తే జగద్వ్యాపారే. సమనస్కత్వాదేవ చైతేషామనైకమత్యే కస్యచిత్ స్థిత్యభిప్రాయః, కస్యచిత్సంహారాభిప్రాయ ఇత్యేవం విరోధోఽపి కదాచిత్ స్యాత్. అథ కస్యచిత్సంకల్పమన్వన్యస్య సంకల్ప ఇత్యవిరోధః సమర్థ్యేత తతః పరమేశ్వరాకూతతన్త్రత్వమేవేతరేషామితి వ్యవతిష్ఠతే. 17

#### బాలానందిని

**జగదితి :** "(ముక్తులకు), జగద్వ్యాపారవర్జమ్ = జగత్సృష్ట్యాదివ్యాపారం తప్ప మిగిలిన ఐశ్వర్యం ఉంటుంది. ప్రకరణాత్ = ప్రకరణంవల్ల; అసంనిహితత్వాచ్చ = మరియు వీళ్ళు సంనిహితులు కాక పోవడంవల్ల" అని సూత్రార్థం.

**యే ఇతి:-** సగుణబ్రహ్మోపాసన చేయడంవల్ల మనస్సుతో కూడ (సమనస్కులై) ఈశ్వరసాయుజ్యం పొందినవాళ్ళకు ఎలాంటి అడ్డులేని ఐశ్వర్యం (ప్రభుత్వం) లభిస్తుందా

లేక కొన్ని అవగ్రహాలు (అడ్డంకులు) ఉన్న ఐశ్వర్యం లభిస్తుందా అని సంశయం. ఏమి ప్రాప్తించినది? "**ఆప్నోతి స్వారాజ్యమ్**", "సర్వేఽస్మై దేవా బలిమావహన్తి" "**తేషాం....భవతి**" ఇత్యాదిశ్రుతుల ననుసరించి నిరంకుశమైన ఐశ్వర్యమే కలగాలి. ఇట్లు ప్రాప్తించగా "**జగద్వ్యాపారవర్జమ్**" అని పఠిస్తున్నాడు. జగత్తును సృష్టించడం మొదలైన పనులు మినహాయించి మిగిలిన అణిమాద్యైశ్వర్యం ముక్తులకు కలగవచ్చును. జగద్వ్యాపారమైతే నిత్యసిద్ధుడైన ఈశ్వరునికి మాత్రమే. ఎందువల్ల? ఆ ఈశ్వరుడే అక్కడ (జగత్సృష్ట్యాదివాక్యాలలో) ప్రకృతుడు, ఇతరులు అక్కడ సంనిహితులు కారు. (జగత్సృష్ట్యాదులను చెప్పే సందర్భంలో ప్రకృతమైనవాడు పరమేశ్వరుడే కాని, ముక్తుల మాట ఏమీ అక్కడ లేదు). కేవలం పరమేశ్వరుడొక్కడే జగద్వ్యాపారం విషయంలో అధికృతుడు (అధికారంకలవాడు, ఆ ప్రసంగాలలో చెప్పబడినవాడు). ఆ పరమేశ్వరుణ్ణే ప్రకృతంగా చేసికొని జగత్కర్తృత్వాదికం చెప్పబడింది. (ఈశ్వరుడే) నిత్యమైన వేదశబ్దంచేత మాత్రమే తెలియబడుచున్నవాడు (లేదా నిత్యుడు;వేదశబ్దవేద్యుడు) మిగిలిన వాళ్ళందరూ (ముక్తులు) ఆ పరమేశ్వరుణ్ణి అన్వేషించి, వాని స్వరూపం తెలుసుకొనడం కోసం ప్రయత్నించి, తద్ద్వారా అణిమాద్యైశ్వర్యాలు పొందినట్లు వినబడుతున్నది. అందుచేత వాళ్ళు జగద్వ్యాపారంలో అసంనిహితులు (సంబంధం లేని వాళ్ళు). వాళ్ళు సమనస్కులు గాన (ఆలోచించేశక్తి ఉన్న వాళ్ళు గాన) వాళ్ళలో అనైకమత్యం ఏర్పడి ప్రపంచాన్ని నిలబెట్టాలి అని ఒక డంటే సంహరించా లని మరొకడు అనవచ్చు. ఈ విరోధం కూడా రావడానికి అవకాశం ఉంది. అలా కాకుండా ఒకని సంకల్పాన్ని అనుసరించే ఇతరుడు సంకల్పిస్తాడు గాన విరోధం లేదని సమర్థిస్తే అప్పుడు ఇతరు లందరూ పరమేశ్వరుని అభిప్రాయాన్నే అనుసరించిఉంటా రనేది సిద్ధం అవుతుంది. (అనగా ఏ ఒక్కని సంకల్పాన్ని అందరూ అంగీకరిస్తారో అతడే నిత్యసిద్ధుడైన ఈశ్వరుడు).

## సూ. ప్రత్యక్షోపదేశాదితి చేన్నాధికారికమణ్డలస్థోక్తేః 4.4.18

అథ యదుక్తమ్ - "**ఆప్నోతి స్వారాజ్యమ్**" (తై. ఉ. 1.6.2) ఇత్యాదిప్రత్యక్షోపదేశాన్నిరవగ్రహమైశ్వర్యం విదుషాం న్యాయ్యమితి తత్పరిహర్తవ్యమ్. అత్రోచ్యతే - నాయం దోషః. అధికారిమణ్డలస్థోక్తేః. ఆధికారికో యః

సవితృమణ్డలాదిషు విశేషాయతనేష్వవస్థితః పర ఈశ్వరస్తదాయత్తైవేయం స్వారాజ్యప్రాప్తిరుచ్యతే. యత్కారణ మనన్తరమ్ - **"ఆప్నోతి మనసస్పతిమ్"** (తై.ఉ. 1.6.2) ఇత్యాహ. యో హి సర్వమనసాం పతిః పూర్వసిద్ధ ఈశ్వరస్తం ప్రాప్నోతీత్యే తదుక్తం భవతి. తదనుసారేణైవ చానన్తరమ్ - **"వాక్పతిశ్చక్షుష్పతిః శ్రోత్రపతిర్వి జ్ఞానపతిశ్చ భవతి"** (తై.ఉ. 1.6.2) ఇత్యాహ. ఏవమన్యత్రాపి యథా సంభవం నిత్యసిద్ధేశ్వరాయత్తమేవేతరేషామైశ్వర్యం యోజయితవ్యమ్. 18

**బాలానందిని**

**ప్రత్యక్షేతి:-** "ప్రత్యక్షోపదేశాదితిచేత్ = శ్రుతిలో ప్రత్యక్షంగా చెప్పడంవల్ల వీళ్ళ ఐశ్వర్యం నిరంకుశ మైనది, అన్నట్లయితే, న = కాదు; అధికారికమణ్డలస్థోక్తేః = ఆధికారికమైన సూర్యమండలంలో ఉన్నవానిని గూర్చి చెప్పడంవల్ల" అని సూత్రార్థం.

**అథేతి:-** **"ఆప్నోతి స్వారాజ్యమ్"** మొదలైన ప్రత్యక్షంగా (ఐశ్వర్యాన్ని గూర్చి) చెప్పు వాక్యాలను బట్టి విద్వాంసుల ఐశ్వర్యం అడ్డు లేనిది అనడమే న్యాయ్యం అని ఏది చెప్పబడిందో దానిని ఇప్పుడు పరిహరించాలి. ఈ విషయంలో చెప్పబడుచున్నది. ఇది దోషం కాదు. ఎందువల్ల ననగా ఇది అధికారికమండలంలో ఉన్నవానిని గూర్చి చెప్పినది. అధికారికుడైన (అనగా సూర్యుడుమొదలైనవాళ్ళను ఆ యా అధికారాలలో నియోగించే) సవితృమండలం మొదలైన విశేషాస్థానాలలో ఉండే పరమేశ్వరునిపై ఆధారపడి ఉన్న స్వారాజ్యప్రాప్తి ఇక్కడ చెప్పబడుచున్నది. కారణం ఏమనగా - దీని తరవాత **"ఆప్నోతి మనసస్పతిమ్"** అని అంటున్నాడు. (మనసస్పతి అనగా **"తత్సవితుర్వరేణ్యమ్, భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్"** అను శ్రుతి ననుసరించి సూర్యమండలంలో ఉన్న పరమాత్మ). అనగా సర్వమనస్సులకు అధిపతి యైన పూర్వసిద్ధు డైన (పూర్వంనుంచీ ఉన్న) ఏ ఈశ్వరు డున్నాడో ఆ ఈశ్వరుణ్ణి పొందుతాడు అని చెప్పి నట్లయినది. (దీనిని పట్టి ముందు చెప్పిన స్వారాజ్యం నిరంకుశమైన ఐశ్వర్యం కాదు. అట్లయితే ఈశ్వరుణ్ణి పొందుతాడు అని తరవాత చెప్పడం కుదరదు. అందుచేత భోగం విషయంలోనే స్వారాజ్యం కాని జగజ్జన్మాదుల విషయంలో లేదు అని భావం). దీనినే అనుసరించి తరవాత కూడా **"వాక్పతిః......భవతి"** అని

అంటున్నాడు. ఇదే విధంగా ఇతరస్థలాలలో కూడ (కామచారాదులలో కూడ) ఇతరుల (ముక్తుల) ఐశ్వర్యం నిత్యసిద్ధుడైన ఈశ్వరునిమీదనే అధారపడి ఉంటుం దని, యథాసంభవంగా అన్వయించుకోవాలి. 18

## సూ. వికారావర్తి చ తథా హి స్థితిమాహ 4.4.19

వికారావర్త్యపి చ నిత్యముక్తం పారమేశ్వరం రూపం న కేవలం వికారమాత్రగోచరం సవితృమణ్డలాద్యధిష్ఠానమ్. తథా హ్యస్య ద్విరూపాం స్థితిమాహామ్నాయః - **"తావానస్య మహిమా తతో జ్యాయాంశ్చ పురుషః, పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి"** (ఛా.ఉ. 3.12.6)ఇత్యేవమాదిః న చ తన్నిర్వికారం రూపమితరాలమ్బనాః ప్రాప్నువన్తీతి శక్యమ్; అతత్క్రతుత్వాత్తేషామ్. అతశ్చ యథైవ ద్విరూపే పరమేశ్వరే నిర్గుణం రూపమనవాప్య సగుణ ఏవావతిష్ఠన్తే ఏవం సగుణేఽపి నిరవగ్రహమైశ్వర్యమనవాప్య సావగ్రహ ఏవావతిష్ఠన్త ఇతి ద్రష్టవ్యమ్. 19

### బాలానందిని

**వికారేతి:-** "వికారావర్తి చ = పరమేశ్వరస్వరూపం వికారంతో (కార్యప్రపంచంతో) మాత్రమే సంబంధించినది కాదు. తథా = అట్లు, స్థితిమ్ = వికారాగోచరస్థితిని, అహహి = శ్రుతి చెపుతున్నది కదా?" అని సూత్రార్థం.

**వికారేతి:-** నిత్యముక్త మైన పరమేశ్వరస్వరూపం కేవలం వికారమాత్రగోచరమే కాదు, అనగా సవితృమండలాదులలో మాత్రమే ఉండేది కాదు, వికారావర్తి కూడ, వికారాలకంటె దూరంగా ఉండేది కూడ. ఎందువల్ల ననగా "**తావానస్య....దివి**" ఇత్యాది శ్రుతి పరమేశ్వరుని రెండు విధాలైన స్థితిని చెపుతున్నది. నిర్వికారమైన ఆ రూపాన్ని ఇతరాలంబనాలు (ఇతరముల ఆలంబనాలను తీసికొని ఆ యా ఉపాసనలు చేసినవాళ్ళు) పొందుతారని చెప్పడానికి శక్యం కాదు. ఎందువల్ల ననగా వాళ్ళు తత్క్రతువులు కారు. (అనగా ఆ నిర్వికారరూపాన్ని ధ్యానించినవాళ్ళు కాదు). అందుచేత (విద్వాంసులు) ద్విరూపుడైన పరమేశ్వరునిలో నిర్గుణరూపాన్ని పొందకుండా సగుణ

రూపంలో మాత్రమే ఎట్లు ఉంటారో, అట్లే సగుణంలో కూడ నిరవగ్రహమైన (నిరంకుశమైన) ఐశ్వర్యాన్ని పొందకుండా సావగ్రహైశ్వరంలోనే ఉంటారు అని గ్రహించాలి. 19.

## సూ. దర్శయతశ్చైవం ప్రత్యక్షానుమానే 4.4.20

దర్శయతశ్చ వికారావర్తిత్వం పరస్య జ్యోతిషః శ్రుతిస్మృతీ - "న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకం నేమా విద్యుతో భాన్తి కుతోఽయమగ్నిః" (క.ఉ. 5.58, శ్వే.ఉ. 6.14, ము.ఉ. 2.2.10) ఇతి. "న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః" (భ.గీ. 15.6) ఇతి చ. తదేవం వికారావర్తిత్వం పరస్య జ్యోతిషః ప్రసిద్ధమిత్యభిప్రాయః .20

### బాలానందిని

దర్శయత ఇతి:- "ప్రత్యక్షానుమానే = శ్రుతిస్మృతులు, ఏవమ్ = ఇట్లు, దర్శయతశ్చ = చూపుతున్నాయి కూడ" అని సూత్రార్థం.

దర్శయత ఇతి:- పరజ్యోతిస్సు (పరమేశ్వరుడు) వికారాలలో (మాత్రమే)లేడు అనే విషయాన్ని "న తత్ర...అగ్నిః" అని, "న తద్భాసయతే....పావకః" అనీ శ్రుతిస్మృతులు చూపుచున్నాయి కూడ. ఈ విధంగా పరజ్యోతిస్సు వికారాతీతంగా ఉండడం ప్రసిద్ధమే అని అభిప్రాయం. 20.

## సూ. భోగమాత్రసామ్యలిఙ్గాచ్చ. 4.4.21

ఇతశ్చ న నిరఙ్కుశం వికారాలమ్బనానామైశ్వర్యం యస్మాత్ భోగమాత్రమేవైషామనాదిసిద్ధేనేశ్వరేణ సమానమితి శ్రూయతే - "తమాహాపో వై ఖలు మీయన్తే లోకోఽసౌ" (కౌషీ. ఉ. 1.6) "యథైతాం దేవతాం సర్వాణి భూతాన్యవన్త్యేవం హైవంవిదం సర్వాణి భూతాన్యవన్తి" (బృ.ఉ. 1.5.20) "తేనో ఏతస్యై దేవతాయై సాయుజ్యం సలోకతాం జయతి" (బృ.ఉ. 1.5.23) ఇత్యాదిభేదవ్యపదేశలిఙ్గేభ్యః. 21

## బాలానందిని

**భోగేతి**:- "భోగమాత్రసామ్యలిఙ్గాచ్చ - భోగంలో మాత్రమే పరమేశ్వరునితో సామ్యం ఉన్న దని చెప్పే లింగం కూడా ఉండడంవల్ల (నిరంకుశైశ్వర్యం లేదు)" అని సూత్రార్థం.

**ఇతశ్చ**:- ఈ కారణంవల్ల కూడ వికారాలంబనుల (కార్యబ్రహ్మాద్యుపాసనచేసిన విద్వాంసుల) ఐశ్వర్యం నిరంకుశం కాదు. ఏ కారణం అనగా - వీళ్ళ భోగం మాత్రమే అనాదిసిద్ధుడైన ఈశ్వరుని భోగంతో సమానంగా ఉంటుంది అని "**తమాహ....అసౌ**", "**యథైతాం....అవన్తి**", "**తేనో...జయతి**" ఇత్యాదులైన భేదాన్ని చెప్పే లింగాలవల్ల తెలుస్తూన్నది.

వి. బ్రహ్మలోకానికి వెళ్ళిన ఉపాసకునితో హిరణ్యగర్భు డంటాడు - "ఈ అమృతరూపాలైన ఉదకాలు నాచేత భుజించబడుతున్నాయి. ఈ లోకం నీకు కూడ" ఇది మొదటి శ్రుతికి అర్థం. "ఈ దేవతను (సగుణబ్రహ్మను) సమస్తభూతాలు ఏ విధంగా సేవిస్తాయో ఆ దేవతోపాసనచేసినవానిని కూడా సేవిస్తాయి" (రెండవ వాక్యం అర్థం). "ఆ దేవతకొరకు (నుండి) సాయుజ్యాన్ని, సమానరూపత్వాన్ని, సలోకత్వాన్నీ కూడ ఉపాసకుడు జయిస్తాయి. (పొందుతాడు)" అని మూడవ వాక్యానికి అర్థం. 21

## భాష్యమ్

నన్వేవం సతి సాతిశయత్వాదన్తవత్త్వమైశ్వర్యస్య స్యాత్తథాచైషామావృత్తిః ప్రసజ్యేతేత్యత ఉత్తరం భగవాన్ బాదరాయణ ఆచార్యః పఠతి -

### సూ. అనావృత్తిః శబ్దాదనావృత్తిః శబ్దాత్. 4.4.22

నాడీరశ్మిసమన్వితేన అర్చిరాదిపర్వణా దేవయానేన పథా యే బ్రహ్మలోకం శాస్త్రోక్తవిశేషణం గచ్ఛన్తి, యస్మిన్ అరశ్చ హ ణ్యశ్చార్ణవౌ బ్రహ్మలోకే తృతీయస్యామితో దివి, యస్మిన్నైరంమదీయం సరో, యస్మిన్నశ్వత్థః సోమసవనో, యస్మిన్నపరాజితా పూః బ్రహ్మణః, యస్మింశ్చ ప్రభువిమితం

హిరణ్మయం వేశ్మ, యశ్చానేకధా మన్త్రార్థవాదాదిప్రదేశేషు ప్రపఞ్చ్యతే తం తే ప్రాప్య న చన్ద్రలోకాదివ భుక్తభోగా ఆవర్తన్తే.కుతః? "తయోర్ధ్వమాయన్నమృతత్వ మేతి" (ఛా.ఉ. 8.6.6, క.ఉ. 6.16) "తేషాం న పునరావృత్తిః" (బృ.ఉ. 6.2.15) "ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవమావర్తం నావర్తన్తే" (ఛా.ఉ. 4.25.1) "బ్రహ్మలోకమభిసంపద్యతే, న చ పునరావర్తతే" (ఛా.ఉ.8.15.1) ఇత్యాదిశబ్దేభ్యః అన్తవత్త్వేఽపి త్వైశ్వర్యస్య యథానావృత్తి స్తథా వర్ణితమ్ - "కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పరమ్" (బ్ర.సూ. 4.3.10) ఇత్యత్ర. సమ్యగ్దర్శనవిధ్వస్తతమసాం తు నిత్యసిద్ధనిర్వాణపరాయణానాం సిద్ధైవానావృత్తిః. తదాశ్రయణేనైవ హి సగుణశరణానామప్యనావృత్తిసిద్ధిరితి. "అనావృత్తిః శబ్దాదనావృత్తిః శబ్దాత్" ఇతి సూత్రాభ్యాసః శాస్త్రపరిసమాప్తిం ద్యోతయతి. 22

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య-శ్రీగోవిన్దభగవత్పూజ్యపాదశిష్య

శ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌ శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యే

చతుర్థాధ్యాయస్య చతుర్థః పాదః.

సమాప్తశ్చాధ్యాయః

సమాప్తమిదం బ్రహ్మసూత్రశాఙ్కరభాష్యమ్

## బాలానందిని

నన్వితి:- ఇట్లైతే ఈ ఐశ్వర్యం సాతిశయం గాన (అనగా దీనికంటె గొప్పదైన ఐశ్వర్యం కూడా ఉన్నట్లు తెలుస్తూన్నది గాన) ఇది అంతం కలదే అవుతుంది (అనగా, అనిత్యమే అవుతుంది). అప్పుడు ఈ విద్వాంసులకు ఆవృత్తి ప్రసక్త మవుతుంది (వీళ్ళు తిరిగి రావలసిన ప్రమాదం ఉంటుంది). కదా? దీనికి పూజ్యుడైన ఆచార్యుడైన బాదరాయణుడు ఉత్తరం పలికిస్తున్నాడు-

**అనావృత్తిరితి:-** "శబ్దాత్ = శబ్దంవల్ల (శ్రుతివల్ల), అనావృత్తిః = ఆవృత్తి ఉండదు" అని సూత్రార్థం.

**నాడీతి** : నాడులతోను రశ్మలతోను సంబంధించినది అర్చిరాదులు పర్వములుగా (మధ్యనివాసస్థానాలుగా) కలది అయిన దేవమార్గంచేత - ఏ బ్రహ్మలోకంలో అరము, ణ్యము అను రెండు సముద్రాలు ఉంటాయో, ఇక్కడనుండి మూడవ ద్యులోకమైన ఏ బ్రహ్మలోకంలో ఐరం (మద్యపూర్ణము), మదీయం (మత్తును కలిగించేది) అయిన సరస్సు ఉన్నదో, దేనియందు సోమాన్ని (అమృతాన్ని) కురిసే అశ్వత్థ వృక్షం ఉన్నదో, దేనియందు బ్రహ్మయొక్క అపరాజిత అనే పట్టణం ఉన్నదో, దేనియందు ప్రభువుచేత నిర్మించబడిన బంగారు గృహం కలదో, దేనిని గూర్చి మంత్రార్థవాదాది ప్రదేశాలలో అనేకవిధాల సవిస్తరంగా వర్ణింపబడిందో, అట్టి, శాస్త్రోక్తవిశేషణాలు గల ఆ బ్రహ్మలోకాన్ని పొంది వాళ్ళు చంద్రలోకంనుండి వలె భోగాలు అనుభవించి తిరిగిరారు. ఎందువల్ల? "తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి" "తేషాం న పునరావృత్తిః", 'ఏతేన.... నావర్తన్తే" "బ్రహ్మలోకమభిసంపద్యతే" "న చ పునరావర్తతే" ఇత్యాదిశ్రుతులవల్ల. ఐశ్వర్యం అంతవత్తైనా కూడ వాళ్ళకు ఆవృత్తి ఉండ దనే విషయం "కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పరమ్" అనే చోట చెప్పబడింది. సమ్యగ్దర్శనంచేత తమస్సు నశించిన, నిత్యసిద్ధనిర్వాణ పరాయణులకైతే, (నిత్యసిద్ధమైన నిర్వాణమునందు ఆసక్తి కలవారికైతే) అనావృత్తి సిద్ధమ్. వాళ్ళు ఆవృత్తి పొందరు అనే మాట నిశ్చితమే. సగుణశరణులకు కూడ (సగుణోపాసన చేసినవాళ్ళకు కూడ) చివరికి సమ్యగ్దర్శనాన్ని ఆశ్రయించడంచేతనే అనావృత్తి సిద్ధిస్తుంది. అలాంటప్పుడు మొదటినుండీ సత్యగ్దర్శనాన్నే ఆశ్రయించినవాళ్ళ మాట చెప్పాలా అని అర్థం. "అనావృత్తిః శబ్దాత్" "అనావృత్తిః శబ్దాత్" అని సూత్రాన్ని ఆవృత్తి చేయడం శాస్త్రపరిసమాప్తిని సూచిస్తుంది.

అధ్యాయసమాప్తి సూచించడానికి సూత్రంలోని ఒక పదం మాత్రమే ఆవృత్తి చేయబడుతుంది. శాస్త్రసమాప్తిసూచకంగా మొత్తం సూత్రమే ఆవృత్తి చేయబడుతుంది.

ఈ విధంగా సమన్వయం చెప్పడం ద్వారా బ్రహ్మాత్మైక్యానికి వేదాంతాలే ప్రమాణం అని నిశ్చయించబడింది. వాక్యార్థజ్ఞానం విషయంలో స్మృతితర్కాదివిరోధం

మొదలైన అన్ని విధాలైన విరోధమూ కూడ పరిహరించబడింది. సాధనసంపత్తి చూపబడింది. అందువల్ల వివేకాదిసాధనసంపత్తి కలిగి ఉండి, శ్రవణాదుల ఆవృత్తిచేత సమస్తప్రతిబంధాలను తొలగించుకొన్నవానికి అఖండాత్మజ్ఞానం కలగడంవల్ల సమూలబంధం నశించగా నిష్కలంకానంతచిదానందస్వరూపస్థితి లభిస్తుం దని సిద్ధం. (రత్నప్రభ).

జగద్వ్యాపారాధికరణం సమాప్తం

"బాలానందిని" అను శ్రీమచ్ఛాంకరశారీరకభాష్యాంధ్రవ్యాఖ్యానంలో

చతుర్థాధ్యాయంలో చతుర్థపాదం సమాప్తం

బ్రహ్మసూత్రశాంకరభాష్యం సమాప్తం

యత్కృపాలేశసంసర్గాద్వ్యాఖ్యేయం రచితా మయా,
తస్యైవ జానకీజానేః పదయోరియమర్ప్యతే.
దేవతానుగ్రహః పిత్రోస్తపశ్చాచార్యసత్కృపా,
కర్త్రాస్మద్గ్రన్థజాతస్య కరణం కేవలం వయమ్.
కల్యాద్యబ్దేషు, వర్షేఽస్మిన్ ఖఖచన్ద్రశరైర్మితే (5100)
ఏకోనయా ద్విసాహస్ర్యా మితే హూణశతాబ్దకే (1999)
ప్రమాథ్యాశ్వయుజే శుక్లసప్తమ్యాం స్థిరవాసరే
కృపా శ్రీజానకీజానేః ప్రాప్నోన్మత్కృతిరూపతామ్.

16.10.1999 పగలు గం. 3.34ని.లకు

శ్రీః శ్రీః శ్రీః శ్రీః శ్రీః